## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## సప్తగిరి వారి వెబ్ సైట్

## https://www.scribd.com/search?query=sapthagiri



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014





కొలని దొపఁరికి గొబ్బిళ్లో యదు-
కులము స్వామికిని గొబ్బిళ్లో

కొండ గొడుగుగా గోవులఁ గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యులకెల్లను తల-
గుండు గండనికి గొబ్బిళ్లో

పాపవిధుల శిశుపాలుని తిట్ల-
కోపగానికిని గొబ్బిళ్లో
యేపునం గంసుని యిడుమలఁ బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో

దండి వైరులను తఱమిన దనుజుల-
గుండె దిగులునకు గొబ్బిళ్లో
వెండిఁబైఁడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో

( అన్నమాచార్యుల గొబ్బిపాట, సంపుటం 12 )

# మీ మాట

సముద్రాలగారి కొత్తశీర్షిక "పామరుడు-పరమాత్మ" సరికొత్త ప్రయోగం. చాల ఉత్సాహంగా వుంది. రాజకీయనాయకులు తిరుపతిని సందర్శించిన సమాచారం వేయటంకంటే ఆ పేజీలో సూక్తులను ప్రచురిస్తే బాగుంటుంది.

కోవల్లె హనుమంతరావు — విశాఖపట్నం.
స్వర్గం వెంకట కోటేశ్వరరావు — కొండవల్లి.

'వాగ్దేవి వైశిష్ట్యం' నేటి సగటు రచయితలకి అర్థమైతే తెలుగు సాహిత్యం కొత్తపుంతలు తొక్కివుండేది. 'పామరుడు-పరమాత్మ' లోని అంశం నచ్చినా, చెప్పే తీరు బాగలేదు. హుందాగరాస్తే బాగుండేది.

బద్వేలి రమేష్ — అనంతపురం.

## మంత్రశాస్త్రం

నవరాత్రులు-బ్రహ్మోత్సవమును పురస్కరించుకొని "మననాత్ త్రాయతే మంత్రః" అంటూ (మంత్రశాస్త్రాన్ని) కుండలో సముద్రాన్ని దించారు. మీ సంపాదకీయాన్ని 90 శాతం పాఠకులు అర్థం చేసుకోలేరు. అందులో నేనొకడిని. మంత్రశాస్త్ర శీర్షికతో మీరు స్వయంగాగాని యోగ్యులైన వారితోగాని మాలాంటి మిడిమిడి జ్ఞానం గలవారల సంశయాలను పటాపంచలు చేయడానికి ప్రచురింప ప్రార్థన.

డి. మల్లేశం — హైదరాబాదు.

## తారుమారు

నవంబరు 83 సంచికలో ప్రచురించిన రెండవ కవరుపేజి మూడవ కవరుపేజిగాను, మూడవపేజి చిత్రం రెండవ కవరుపేజిగాను తారుమారు అయినది.

మద్దుల శివకుమార్ — తెనాలి.

* పొరపాటుకు చింతిస్తున్నాం.

## పోగొట్టుకొన్న ధనం

ఇప్పుడు చాలాకాలం తరువాత మీ ప్రచురణ చూచి పోగొట్టుకొన్న ధనం పొందిన అనుభూతి పొందినాను. భగవద్గీతలాగే ఇది కూడ సర్వకాలాలకు ఉపయోగించే విధముగా వుంది.

ఈమని శ్రీకృష్ణమూర్తి — రాజమండ్రి.

"చట్టం కంటె ధర్మం గొప్పది" అను శీర్షిక శ్రీ మన్నవ గిరిధరరావుగారి రచన చక్కగా చిక్కగా చిత్రించారు.

దొంకాడ సత్యనారాయణ — పెద్దాపురం.

మథనం, దీపావళి, "మహిషాసుర మర్దని ముగింపు" ఈ నవంబరు సంచిక కెంతో వన్నెతెచ్చాయి.

కొండపి వాసుదేవమూర్తి — ఒంగోలు.
కొంకల లక్ష్మి, లత — వాకాడు.

## అచ్చుపొరపాటు

నవంబరు 83 సప్తగిరిలో 'పొడుపు పద్యాలలో భక్తిభావాలు' అనే శీర్షికలో మనసిజుమామ, అను పద్యంలో "సుందరి మేనమామ జంపిన జగజెట్టి పొడిచేసిన" అని వున్నది. ఇది రైటేనా లేక "జగజెట్టి సుతు పొడిచేసిన" అని వుండాలా?

నేదే సీతారామయ్య — సిద్ధిపేట.

* "జెగజెట్టిసూను పొడిచేసిన" అనివుండాలి.

## మాసఫలితాలు

జ్యోతిష శాస్త్రపరంగా మాసఫలితాలు ప్రచురించేవారు. ఇటీవలికాలంలో ఆ శీర్షికను పూర్తిగా ఎత్తివేసినారు. దయచేసి మరల ఆ శీర్షికను ప్రవేశపెట్టవలసిందిగా కోరుతున్నాను.

చిల్లర సాంబశివరావు — గుంటూరు.

## కార్తికమాస విశిష్టత

నవంబరు సంచికలో కార్తికమాసము యొక్క ప్రాశస్త్యము ప్రచురింపబడలేదనందున కొంచము బాధగానేవున్నది. ఆణిముత్యాలు, సంవత్సరంలో స్వాతి చినుకుల ద్వారా ఒకేఒక్కసారి ఉత్పత్తి అయినట్లు, ఈ మాసంలో చేసిన పుణ్యకార్యాలకు విశేషమైన ఫలితాలు లభింపగలవట! ఈ మాసం యొక్క ప్రాధాన్యత వచ్చే కార్తికమాసంలోనైన తెలువగలరని ప్రార్థన.

పి. కామేశ్వరశర్మ — హైదరాబాదు.

---

'ఉపనిషద్వాణి,' 'పామరుడు-పరమాత్మ' శీర్షికలను అనివార్యకారణాలచే ఈసంచికలో ప్రచురింపలేకపోతున్నందులకు విచారిస్తున్నాం. సం॥

---



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

గౌరవసంపాదకులు :
శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :
శ్రీ కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఏ.

*

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00
సం॥ చందా - రు. 12-00

*

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

జనవరి 1984
సంపుటి 14 సంచిక 8



రెండవ కవరుపేజి : శ్రీ గోవిందరాజస్వామివారి తెప్పోత్సవము, తిరుపతి.
మూడవ కవరుపేజి : శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవము, శ్రీనివాసమంగాపురము.
నాల్గవ కవరుపేజి : పుష్పాలతో చిత్రింపబడిన శ్రీ పద్మావతీఅమ్మవారు, తిరుమల.

ముఖచిత్రం : శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఉత్సవమూర్తి, తిరుమల.

# సంపాదకీయం

దేవుడున్నాడా? అనే ప్రశ్న వచ్చింది. ద్రష్టలందరూ ఉన్నాడనే అన్నారు. ఎలా ఉన్నాడనే ప్రశ్నకు తలకొక రకంగా సమాధానం వచ్చింది. ఏదో ఓ చిన్న ప్రార్థనచేసి పరీక్షచేద్దామనుకొన్న గజేంద్రుడికి, కలడు కలండనెడువాడు కలడో లేడో అన్నంతటి అనుమానం వచ్చి భయంవేసి, 'నీవే తప్ప నితః పరం బెరుంగ మన్నింపందగున్ దీనునిన్' అని శరణాగతి చేసుకున్న తర్వాత, ఆ వైకుంఠవాసి, హడావుడిగా వచ్చి మకరిబారి తప్పిస్తే అప్పుడామాట నిజమే! అనుకొన్నట్లు, పిలిచినా పలికినా అది సర్వసామాన్య గోచరవిషయం కాదు కనుక ఇప్పటికి కూడా అవును కాదు అని ఆరాటాలు పోరాటాలు జరుపుకుంటూనే వున్నాం.

మరి గ్రహాలున్నాయా? అది కూడా ఉన్నాయనే మన పూర్వులు చెప్పారు. అంతేకాదు ఏ యే గ్రహం భూమిని ఎంతెంత దూరంలో పరిభ్రమిస్తున్నదీ, వేటివల్ల ఏ యే ఫలాలు కలుగుతున్నదీ కూడా శ్రీ మన్మహాభాగవతం లాంటి గ్రంథాలలో వివరించటం జరిగింది. మనవాళ్లు చెప్పింది కనుక మొదట లేవనుకొన్నాం. దుర్భిణీలకు దొరికిపోయి నందువల్ల, వాటి ఉనికిని ఒప్పేసుకున్నా వాటి వల్ల మనమీద ఏ ప్రభావ ప్రమాదం లేదు అని కొట్టి పారేశాం.

మరి సూర్యచంద్రుల మాటేమటి? వాటిని రాత్రింబవళ్లు ఒకటి మార్చి ఒకటి చూస్తున్నాం కనుక ఇవి కాదంటే మనని ఎక్కడన్నా చేర్పిస్తారేమోనని ఒప్పేసుకున్నాం. ఇందులో కూడా చంద్రుణ్ణి చిన్నచూపు చూశాం. రవికిరణ పరివర్తనం ఆ గ్రహం ద్వారా జరిగి చల్లని తెమ్మెరలు, పున్నమి వెన్నెలలు కలుగుతున్నాయి గనుక స్వయం ప్రకాశక శక్తి దానికి లేదని ఒక మెట్టు దించేశాం.

ఇక మిగిలింది సూర్యుడు. ఇక్కడే వచ్చింది చిక్కు. మనవాళ్ళు చెప్పిందంతా నిజమని విజ్ఞానశాస్త్రం ఋజువు చేస్తున్నది. అతని అస్తిత్వాన్ని గాని అభావంగాని ప్రతిక్షణం మనల్ని ప్రభావితం చేస్తున్నాయి గనుక సర్వశాస్త్రాలు ఏకకంఠంతో అంగీకరించిన సత్యం సూర్యుడున్నాడనేది.

బహుశః మహర్షులుకూడా ఈ సమస్యాసింధువును మథించి, మథించి, దృశ్యమాన నశ్వర విశ్వానికి సూర్యుణ్ణి "ప్రత్యక్ష నారాయణుడు"గా ప్రసాదించి వుంటారు. ఒక విధంగా చూస్తే, ఇది నిజమే ననిపిస్తుంది

వైష్ణవ పురాణాలన్నీ నారాయణుణ్ణి చతుర్భుజుడైన సవితృమండల మధ్యవర్తిగా ఆరాధ్యదైవమని వర్ణిస్తున్నాయి. పురుష సూక్తం సూర్యుణ్ణి విరాట్పురుషుని నేత్రంగా వివరిస్తోంది. ఇక శాక్తంలో చూస్తే దేవీ ఉపాసకులకు సూర్యమండలంలోని గేయ (ఏక) చక్రారూఢయైన దేవ్యుపాసన విహితమని, ఆ సూర్యమండలప్రాప్తే వారి ధ్యేయమని 'లలితా సహస్ర నామ భాష్యం' సూచిస్తోంది. మన మంత్ర శాస్త్రం స్త్రీ పురుష రూపదేవత లందర్నీ చంద్రార్కానల త్రి నేత్రులుగానే రూపించింది. మంత్రశాస్త్రం సూర్యుణ్ణికూడా త్రినేత్రుడుగానే వర్ణించటం విశేషం. అంటే తానొకరికి అంగంగా కాక తనలోనే మూడు ధర్మాలను ఆవహింపజేసుకొన్న శక్తిరూప మన్నమాట. సృష్టికి మూలాధారమైన కారకశక్తి తనదైన తైజసస్వరూపాన్నీ, పరివర్తనం ద్వారా, పోషకశక్తి 'ఓషధీనాం పతి' అనే పూర్ణచంద్రుని – సౌమ్యకాంతిరూపాన్నీ, సర్వచేతనాచేతన నాశంకరమైనది దాహకశక్తి – అగ్నిరూపాన్నీ తనలోనే అమర్చుకొని, కర చాలనంతోనే ప్రపంచాన్ని నడిపించేస్తూ, దేవాసుర నమస్కృతుడైన ఆ అఖండతేజోరూపాన్ని, అగ్నిగర్భుడు, బ్రహ్మ, విష్ణువు, శివుడు అని అన్నా చివరకు సర్వదేవాత్మకుడని సంభావించినా ఆశ్చర్యంలేదు. అతిశయోక్తికాదు. నిజానికి మన దేవతలందరిలోనూ వర్ణితాలైన గుణాలన్నీ ఇక్కడ మూర్తీభవించాయి.

అతడి గమనంవల్లనే మనకు ఋతువులు, సంవత్సరాలు, పక్షాలు, రాత్రింబవళ్లు ఏర్పాటవుతున్నాయి. అన్ని వస్తువుల స్థిరత్వకాలం దీనిని బట్టి నిర్ణయించటం జరుగుతున్నది. వానలు వరదలైనా, వాగులు వట్టిపోయినా, అవి అతని కిరణప్రభావమే. ఒక్కమాటలో చెప్పాలంటే విశ్వరంగంలోకి రాకడ, నిలకడ పోకడలకు అతని దయాధర్మకిరణాలే ఆధారం.

[48 వ పేజీలో]

# సంక్రాంతి శోభ

'వచ్చిపోవమ్మ! మా ఇంటిపజ్జ కీవు
పరమకల్యాణి! మా తల్లి పౌష్యలక్ష్మి!'

మన మాచరించే పండుగల్లో సంక్రాంతి ఒకటి. తెలుగుదనం నిండుగా ఉట్టిపడే పండుగల్లో అతిముఖ్యమైంది సంక్రాంతి.

"కుంకుమంబులు చల్లి గొబ్బిముద్దలువెట్ట
ఏగడాల సొగసును పరిహసింప
పక్షి[వాలిన భంగి పసుపు ముగ్గులు దీర్ప
పుష్యరాగంబులు పొలుపు మీర
రంగార దీర్చిన రంగవల్లిక గుంపు
కన్నెతీగలవోలె వన్నెగుల్క
జడలోని మల్లెలు జాఱియుండిన చోటు
ముత్యాల సొగసుతో ముచ్చటాడ
చీరకుచ్చెళ్లు పదముల చిందులాడ
తెనుగువాకిండ్లఁ దిరిగెడు తీగబోండ్లు
సరససల్లాపములు సేయు సమయమందు
పుట్టినింటికి వచ్చెను పుష్యలక్ష్మి"

అని తెలుగుకవులు సంక్రాంతి శోభను మనోహరంగా వర్ణించారు.

ఖగోళమునందు మేష వృషభాది పన్నెండు రాశులలో ఒక రాశినుండి మరొక రాశికి సూర్యుడు పొందు మార్పునే సంక్రమణ మంటారు. సూర్యభగవానుడు మకర రాశిలో ప్రవేశిస్తున్న శుభదినాన్ని మకర సంక్రాంతి అంటారు. ఈ పండుగ కేవలం సూర్యభగవానుణ్ని బట్టి చేసుకొనేపండుగ. కనుకనే ఈ మకరసంక్రాంతి ప్రతిసౌర సంవత్సరం జనవరి 14వ తేదినే వస్తుంది. చాంద్రమాన సంవత్సరములో ఇది పుష్య మాసములోని ముప్పది తిథులలో దేని యందైనను రావచ్చు. కనుకనే ఈ మకరసంక్రాంతి పండుగను పుష్యమాసపు పండుగ అనికూడా అంటారు. ఈ మకర సంక్రాంతినుండే ఆరుమాసముల ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమవుతుంది

ఈ సంక్రాంతి పండుగ ముచ్చటగ చేసుకొనే మూడురోజుల పండుగ. సంక్రాంతికి ముందురోజు "భోగి", రెండవరోజు "సంక్రాంతి", మూడవరోజు "కనుమ". పండుగ.

భోగిపండుగనాడు పిన్నలు పెద్దలు తెల్లవారు జాముననే లేచి ఇండ్లముంగిట భోగి మంటలువేసి ఆనందింతురు. ఈ మంటల్లో ధనుర్మాసమంతా చేసి వుంచిన భోగిపిడకలను, పనికిరాని పాతవస్తువులను వేస్తారు. అభ్యంగన స్నానాదికములు ముగించి కొత్తబట్టలు ధరింతురు. భోగినాడు ప్రత్యేకముగ పొంగళ్లుచేసి దేవతలకు నివేదింతురు.

రెండవరోజు పండుగే మకరసంక్రాంతి. ప్రతి ఒక్కరు నువ్వులపిండితో శరీరము రుద్దుకొని స్నానము చేయుదురు. నూనె,



# సప్తగిరి విక్రేతలు

## అనంతపురం జిల్లా

శ్రీ కె. ఆర్. భాస్కరచెట్టి,
22/110, మెయిన్‌రోడ్డు,
గుంతకల్లు - 515 803.

శ్రీ సి. ఆర్. రామచంద్రరావు,
అమర్ న్యూస్ ఏజన్సీ,
అమాదగురు - 515 556.

శ్రీ ఎమ్. నాగరాజు,
న్యూస్ ఏజెంటు, వాడియంపేట,
గార్లదిన్నె - 515 731.

శ్రీ కె. నారాయణమూర్తి,
జర్నలిస్టు, పామిడి - 515 775.

శ్రీ పి. వి. జగన్నాథగుప్తా,
జనరల్‌మర్చంటు, అగలి - 515 311.

శ్రీ వి. చంద్రశేఖర్,
ఏజెంటు అండ్ కరస్పాండెంటు,
C/o శ్రీ జె. జాతప్ప, సోడాషాపు-
న్యూబస్‌స్టాండు, తాడిపత్రి-515 411.

శ్రీ జి. నారాయణ,
ఆంధ్రజ్యోతి ఏజెంటు, 14 వ వార్డు,
ఉరవకొండ పోస్టు.

శ్రీ కె. ఎన్. కుమారస్వామి,
(కుమార్ ఏజన్సీస్), ఎ.పి.ఎస్.ఆర్.టి.సి.
బుక్‌స్టాల్, పెనుకొండ - 515 110.

శ్రీ ఎమ్. జాదవప్రకాశ్‌రావు,
C/o శ్రీ ఎమ్. జి. నాగోజీరావు,
దుర్గమ్మ టెంపుల్ స్ట్రీట్, ధర్మవరం పోస్టు.

## ఆదిలాబాద్ జిల్లా

శ్రీ ఎ. క్రిష్టయ్య,
ఆయుర్వేదిక్ డాక్టరు, బాలాజీవాడ,
నిర్మల్ - 504 106.

శ్రీ బి. శ్రీనివాస్,
శ్రీరామా బుక్‌హౌస్, బస్‌స్టాండు,
ఆదిలాబాద్ - 504 001.

శ్రీ వడ్లూరి లక్ష్మినరసయ్య,
డి-641, బి. జోన్, రామకృష్ణాపురం-504 301.

శ్రీ చిట్కుల శంకరగుప్తా,
C/o మంచిర్యాల గూడ్సుట్రాన్సుపోర్టు
బ్రాంచ్, (వయా) మంచిర్యాల,
లక్సెట్టిపేట - 504 215.

## కడప జిల్లా

శ్రీ బి. రామమోహన్‌మూర్తి,
28-88, రామేశ్వర అగ్రహారం,
ప్రొద్దుటూరు-516 360.

శ్రీ పి. సూర్యప్రకాష్‌బాబు,
S/o శ్రీ పి. వి. రామప్ప,
విజయాస్టోర్సు, పులివెందుల - 516 390.

శ్రీ సి. సుబ్బరత్నం,
పద్మావతీ ఏజన్సీస్, 10-277, బెల్లంమండివీధి,
కడప - 516 001.

శ్రీ సి. పి. వరలక్ష్మి,
C/o శ్రీ పి. సుబ్బారావుగుప్తా,
న్యూస్ ఏజెంటు, రాజంపేట-516 115.

శ్రీ సామా వెంకటసుబ్బయ్య,
S/o శ్రీ ఎస్. సుబ్బారాయుడు,
నూకలపెద్దయ్య వీధి, పుల్లంపేట-516 107.

## కర్నూలు జిల్లా

M/s పాణ్యం సిమెంటు కో-ఆపరేటివ్
స్టోర్సు లిమిటెడ్, సిమెంటునగర్ పోస్టు,
బుగ్గన్నపల్లి ఆర్. ఎస్. 518 206.

శ్రీ ఎ. సుబ్రహ్మణ్యం,
25-244, సంజీవనగర్, నంద్యాల 518 501.

శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ,
M/s శ్రీ సాయిరామ్ స్టోర్సు,
ఆదోని - 518 301.

శ్రీ డి. శ్రీనివాసమూర్తి,
రిటైర్డు డిప్యూటీ తాసీల్దారు, 11-49, కృష్ణ
నగర్, ఎంప్లాయిస్ హౌసింగ్ కాలనీ,
బిహైండ్ బిర్లా కంపెనీ, కర్నూలు-518 002.

శ్రీ బి. రఘునాథరెడ్డి,
S/o శ్రీ బి. సి. సుబ్బారెడ్డి,
తిరుమల ఎంపోరియం, కాలేజీరోడ్,
ఆత్మకూరు - 518 422.

శ్రీ పి. చంద్రశేఖర్,
S/o శ్రీ పి. కృష్ణమూర్తిశాస్త్రి,
రిటైర్డు తెలుగు పండిట్, 17-67, కాలేజీరోడ్,
నందికొట్కూరు - 518 401.

శ్రీ తల్లం సుధాకర్, 3/10, క్రొత్తపేట,
ప్రత్తికొండ - 518 380.

## కరీంనగర్ జిల్లా

శ్రీ ఎ. శ్రీనివాసాచార్య,
C/o శ్రీ పైడి మల్లయ్య,
5-5-34, శివాలయం వీధి, కరీంనగర్.

శ్రీ ఎస్. ఓటూరి రాజేశ్వర్,
4-760, లారీ ఓనరు, ఎ. పి. ఆర్. 1482,
అజంతా ట్రాన్స్‌పోర్టు, జగిత్యాల-505 327.

శ్రీ డి. కిష్టయ్య,
న్యూస్‌పేపరు ఏజెంటు, జమ్మికుంట-505122.

శ్రీ వై. రాజలింగం పంతులు,
బద్ధం ఎల్లారెడ్డి నగర్, సిరిసిల్లా - 505 301.

శ్రీ గోవర్ధనగిరి వెంకటాచార్య,
C/o లక్ష్మణాచార్య,
న్యూస్‌పేపరు ఏజెంటు, పెద్దపల్లి-505 172.

శ్రీ వై. తులసీదాసు,
S/o శ్రీ వై. రాజలింగం పంతులు,
C/o శ్రీ ఉమామహేశ్వర కట్‌పీస్ క్లాత్
సెంటరు, టెంపుల్‌రోడ్డు, వేములవాడపోస్టు.



# వేంకటేశ్వర లీలలు

## నిరతాన్నదాత ఎల్లమరాజు

— జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

అనాదిగా ఎందరెందరో తిరుమల శ్రీ వేంకటేశ్వరుని పరమభక్తులు. ఆ భక్తులందరికీ శ్రీ వేంకటేశ్వరుని మహిమలూ, లీలలూ నిత్యమూ తమ అనుభవంలో ఉన్నవే. శ్రీ వేంకటేశ్వరుని లీలలను తెలిపే అలాంటి అద్భుత గాథలలో ఇదొక్కటి.

పదిహేడవశతాబ్దం చివరిరోజులవి. కర్నూలుమండలంలో ఖానుముక్కల అనే గ్రామం ఉండేది. అది శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల దివ్యక్షేత్రమైన శ్రీశైలమునకు దగ్గరలో వుంది. ఆళ్లగడ్డఎల్లమరాజు ఆగ్రామకరణం. ఆ గ్రామ మొక్కటే కాదు. ఆచుట్టు ప్రక్కల రామాపురం పాములపాడు మున్నగు ఊళ్లన్నీ ఆయన అధికారంలోనే ఉండేవి. ఎల్లమరాజు ఎంత సంపన్నుడో అంతత్యాగి. నిరతాన్నదాత. ఎవరు ఏవేళ ఏది అడిగినను ఇవ్వగల సమర్థుడు.

ఆతడు ఎంతటిదాతో అంతటి పరమ భక్తుడుకూడ. ఆతని ధర్మపత్ని లక్ష్మమ్మ సాక్షాత్తు లక్ష్మీదేవి. భర్తతలలో నాలుక. అతిథులు ఎవరు ఏవేళ వచ్చినను వండి వడ్డింపగల అపర అన్నపూర్ణ. వారి ఇల్లు ఎల్లప్పుడు అతిథి అభ్యాగతులతో సందడిగా ఉండేది. వారి ఇలువేలుపు తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు. వారుభయులు నిత్యమూ శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని భక్తియుక్తులతో కొలిచేవారు. శ్రీస్వామి వారి కిష్టమైనశనివారాల్లో ఆదంపతులిద్దరు తెల్లవారుఝాముననే లేచి తలస్నానం చేసేవారు. ధూపదీప నారికేళ నైవేద్యంతో భక్తితో పూజించేవారు. ఇక శ్రావణ శనివారాల్లో సరేసరి. ఇంటికి ఏ అతిథి వచ్చినా ఆ ఎల్లమరాజు దంపతుల దృష్టికి వారిలో శ్రీ వేంకటేశ్వరుడే దర్శనమిచ్చేవాడు. ఆ దంపతులకు తిరుమల వేంకటేశుని వరంతో కల్గిన గారాలబిడ్డ వెంకటప్ప. ఐదేండ్లవాడు. ఆ బిడ్డ భగవంతుని అవతారమని నమ్మేవారు.



పార్వతీదేవి



ఎల్లమరాజు ప్రతిష్ఠించిన శ్రీ కాశీవిశ్వేశ్వరుడు

ఒకానొకరోజు, మండువేసవి. కొందరు యాత్రికులు శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునులను దర్శించి, వేంకటాచలపతి దర్శనార్థమై తిరుపతికి పోతూ దారిలో ఖానుముక్కల గ్రామం చేరుకున్నారు. సుమారు ఉదయం పదకొండు గంటలవేళ. అప్పటికే ఎండతీవ్రత హెచ్చింది. క్రింద కాళ్ళు కాలుతున్నాయి. పైన తల మాడుతున్నది. ఆకలి దప్పుల బాధ ఎక్కువైంది. ఇక ప్రయాణం సాగింపలేక ఆ భక్తబృందం గ్రామస్థులను విచారించారు. ఇది ఏ వూరు నాయనా? ఈ ఊళ్ళో అన్నంపెట్టి ఆకలి బోగొట్టే పుణ్యాత్ము లెవరైనా ఉన్నారా? అని. అయ్యో! నిరతాన్నదాత ఎల్లమరాజు గారిపేరు మీరు వినలేదా? ఆ మహానుభావునిది ఈ ఊరే. మీకు షడ్రసోపేతమైన ఆతిథ్యం లభింపగలదని నేరుగా ఎల్లమరాజు గారింటికి దారి చూపించారు ఆ ఊరి కాపులు.

అతిథులకోసం ఎదురుచూస్తున్న ఆ దంపతులకు మహదానందం కల్గింది. మన భాగ్యం పండిందని వారిని ఆహ్వానించారు. కాళ్లకు నీళ్ళిచ్చి అందరికి చల్లని మజ్జిగ నిచ్చి సేద తీర్చుకొమ్మని ప్రార్థించారు. ఆయాత్రికులకు వారి ఆదరణను చూచి ప్రాణంలేచి వచ్చినట్టయింది. అమ్మయ్య! అని అలసట తీర్చుకొన్నారు. అంతలో ఇల్లాలు లచ్చమ్మ అతిథులకై మంచి రుచికరములైన వంటలు సిద్ధం చేస్తూ వుండినది. అతిథులు స్నానాదికములు ముగించుకొని తలముంగిట ఎల్లమరాజుతో ముచ్చటించుకొనుచుండిరి.

ఇంతలో పెరటిలో ఆడుకొనుచున్న కొడుకును సర్పము కాటువేసింది. ఈ దుర్ఘటన కంటపడిన లక్ష్మమ్మ వెంటనే ఏమీ పాలుపోక భర్తనుమాత్రం లోపలికి పిలి

[41 వ పేజీలో]

# వేంకటేశ్వర లీలలు

## నిరతాన్నదాత ఎల్లమరాజు

— జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

అనాదిగా ఎందరెందరో తిరుమల శ్రీ వేంకటేశ్వరుని పరమభక్తులు. ఆభక్తు లందరికి శ్రీ వేంకటేశ్వరుని మహిమలూ, లీలలూ నిత్యమూ తమ అనుభవంలో ఉన్నవే. శ్రీ వేంకటేశ్వరుని లీలలను తెలిపే అలాంటి అద్భుత గాథలలో ఇదొక్కటి.

పదిహేడవశతాబ్దం చివరిరోజులవి. కర్నూలుమండలంలో ఖానుముక్కల అనే గ్రామం ఉండేది. అది శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల దివ్యక్షేత్రమైన శ్రీశైలమునకు దగ్గరలో వుంది. ఆళ్లగడ్డఎల్లమరాజు ఆగ్రామకరణం. ఆగ్రామ మొక్కటే కాదు. ఆచుట్టు ప్రక్కల రామాపురం పాములపాడు మున్నగు ఊళ్లన్నీ ఆయన అధికారంలోనే ఉండేవి. ఎల్లమరాజు ఎంత సంపన్నుడో అంతత్యాగి. నిరతాన్నదాత. ఎవరు ఏవేళ ఏది అడిగినను ఇవ్వగల సమర్థుడు.

ఆతడు ఎంతటిదాతో అంతటి పరమ భక్తుడుకూడ. ఆతని ధర్మపత్ని లక్ష్మమ్మ సాక్షాత్తు లక్ష్మీదేవి. భర్తతలలో నాలుక. అతిథులు ఎవరు ఏవేళ వచ్చినను వండి వడ్డించగల అపర అన్నపూర్ణ. వారి ఇల్లు ఎల్లప్పుడు అతిథి అభ్యాగతులతో సందడిగా ఉండేది. వారి ఇలువేలుపు తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు. వారుభయులు నిత్యమూ శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని భక్తియుక్తులతో కొలిచేవారు. శ్రీస్వామి వారి కిష్టమైనశనివారాల్లో ఆదంపతులిద్దరు తెల్లవారుఝామున నే లేచి తలస్నానం చేసేవారు. ధూపదీప నారికేళ నైవేద్యంతో భక్తితో పూజించేవారు. ఇక శ్రావణ శనివారాల్లో సరేసరి. ఇంటికి ఏ అతిథి వచ్చినా ఆ ఎల్లమరాజు దంపతుల దృష్టికి వారిలో శ్రీ వేంకటేశ్వరుడే దర్శనమిచ్చేవాడు. ఆ దంపతులకు తిరుమల వేంకటేశుని వరంతో కల్గిన గారాలబిడ్డ వెంకటప్ప. ఐదేండ్లవాడు. ఆ బిడ్డ భగవంతుని అవతారమని నమ్మేవారు.



పార్వతీదేవి



ఎల్లమరాజు ప్రతిష్ఠించిన శ్రీ కాశీవిశ్వేశ్వరుడు

ఒకానొకరోజు, మండువేసవి. కొందరు యాత్రికులు శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునులను దర్శించి, వేంకటాచలపతి దర్శనార్థమై తిరుపతికి పోతూ దారిలో ఖానుముక్కల గ్రామం చేరుకున్నారు. సుమారు ఉదయం పదకొండు గంటలవేళ. అప్పటికే ఎండతీవ్రత హెచ్చింది. క్రింద కాళ్ళు కాలుతున్నాయి. పైన తల మాడుతున్నది. ఆకలి దప్పుల బాధ ఎక్కువైంది. ఇక ప్రయాణం సాగింపలేక ఆభక్తబృందం గ్రామస్థులను విచారించారు. ఇది ఏ వూరు నాయనా? ఈ ఊళ్ళో అన్నంపెట్టి ఆకలి బోగొట్టే పుణ్యాత్ము లెవరైనా ఉన్నారా? అని. అయ్యో! నిరతాన్నదాత ఎల్లమరాజు గారిపేరు మీరు వినలేదా? ఆ మహాను భావునిది ఈ ఊరే. మీకు షడ్రసోపేతమైన ఆతిథ్యం లభింపగలదని నేరుగా ఎల్లమరాజు గారింటికి దారి చూపించారు ఆ ఊరి కాపులు.

అతిథులకోసం ఎదురుచూస్తున్న ఆ దంపతులకు మహదానందం కల్గింది. మన భాగ్యం పండిందని వారిని ఆహ్వానించారు. కాళ్లకు నీళ్ళిచ్చి అందరికి చల్లని మజ్జిగ నిచ్చి సేద తీర్చుకొమ్మని ప్రార్థించారు. ఆయాత్రికులకు వారి ఆదరణను చూచి ప్రాణంలేచి వచ్చినట్టయింది. అమ్మయ్య! అని అలసట తీర్చుకొన్నారు. అంతలో ఇల్లాలు లచ్చమ్మ అతిథులకై మంచి రుచికరములైన వంటలు సిద్ధం చేస్తూ వుండినది. అతిథులు స్నానాదికములు ముగించుకొని తలముంగిట ఎల్లమరాజుతో ముచ్చటించుకొనుచుండిరి.

ఇంతలో పెరటిలో ఆడుకొనుచున్న కొడుకును సర్పము కాటువేసింది. ఈ దుర్ఘటన కంటపడిన లక్ష్మమ్మ వెంటనే ఏమీ పాలుపోక భర్తనుమాత్రం లోపలికి పిలి

[41 వ పేజీలో]

# జానపదసాహిత్యంలో పురాణాలు

చిగిచర్ల కృష్ణారెడ్డి

సాహిత్యంలో శిష్టసాహిత్యమని, జానపదసాహిత్యమని, రెండువిభాగాలున్నాయి. శిష్ట సాహిత్యం వ్యక్తి సృష్టి. జానపద సాహిత్యం సమూహ సృష్టి. పురాణం అన్న సాహిత్య ప్రక్రియ సంస్కృతభాషలో శిష్ట సాహిత్య స్థాయిని పొందింది. దీన్నే "మైథాలజీ" అంటారు. చరిత్రకు పూర్వ దశల్లో మానవసంస్కృతి, సామాజిక విలువలు, మానవుల అవగాహన వీటిని ప్రతిబింబించే రచనలు ప్రపంచంలోని అన్ని భాషల్లోనూ మౌఖిక సాహిత్యంగా ప్రజల నోళ్లలో, పెద్దమ్మలు చెప్పే కథల్లో, పాడిచే చాటువల్లో పాడుకొనే పాటల్లో మిగిలి వుంటాయి. పుక్కిటి పురాణమని, కట్టుకథలని చాలా తేలిగ్గా తీసికొనే ఈ వాఙ్మయింలో మానవుడు సృష్ట్యాది నుంచీ ఎలా ఎలా పరిణమిస్తూ వచ్చాడో ప్రకృతిని ఎలా విశ్లేషించాడో తమ ఉనికిని ఎలా గుర్తించాడో అన్న విషయాలే ఏ భాషలోనైనా పురాణ ఇతిహాసాలపేరిట కర్మకాండలతో ముడిపడి ప్రజల అలవాట్లలో మిళితమై జీవితంలో భాగమై వారి కార్యకలాపాలకు తాత్త్విక ప్రేరణగా మిగిలివుంటాయి.

పురాణంలో వస్తువుకి సంబంధించినంత వరకు శిష్టజానపద వాఙ్మయాలలో భేదం తక్కువే కానీ, రూపంలో మాత్రం జానపద పురాణాలు కొన్ని ప్రత్యేకతల్ని కల్గి వున్నాయి. ఒక్కోసారి దీని ప్రభావం వస్తుస్వరూప అవగాహన మీద కూడా పడుతుంది. ఎప్పటికప్పుడు మానవుడు తన జీవితంలో వస్తున్న పరిణామాన్ని తనచుట్టూవున్న పరిసరాల్ని, వ్యక్తుల్ని, స్వభావాల్నిపురాణ కథలోకి ఎక్కించటంవలనే జానపద పురాణంలో శిష్టుల పురాణంలో లేని ఒక నిత్య పరిచయలక్షణం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది.

సంస్కృతంలో 18 పురాణాలున్నాయి. (అష్టాదశ పురాణాలు) వాటిలో భారత భాగవతాలు జానపదులకు చాలా పరిచయింల వున్న వస్తువులు. ఇతిహాసాల్లో రామాయణం ఎక్కువ ప్రీతిపాత్రమైంది. రామాయణం కథాగమన రీతిలో కావ్యమే అయినా పురాణ ప్రసిద్ధివున్న ఇతివృత్తమైంది. జానపదులు ఎక్కువగా పాడుకొనే పాటలు రామాయణ భారత భాగవతాల్లోనివి.

కానీ నిమ్న జాతుల్లో దేశీయతా ముద్ర వున్న ఇతర పురాణాలు అనేకం వున్నాయి. ఉదాహరణకు ఆసాది వాళ్ళలో ప్రచారంలో వున్న మాతాపురాణం శాక్తేయ మతానికి సంబంధించింది. అతిప్రాచీనమైన మాతృస్వామ్య సమాజాన్ని ప్రతిబింబింపచేసే "శక్తి" పుట్టుపూర్వోత్తరాలకు సంబంధించిన కథలు శిష్టులకంటె భిన్నంగా జానపదుల్లో మాత్రమే వుంది. ఆదిపరాశక్తి ఒక గుడ్డు పెట్టిందని, ఆ గుడ్డులోంచి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పుట్టారని చెప్పే "ముగ్గురమ్మల మూలపుట్టమ్మ" కథ జానపదులకు మాత్రమే తెలుసు. మాతాపురాణం పేరిట తెలంగాణా ప్రాంతంలో బావనీలు(బైండ్లు) పాడేపాట, శాక్తేయం వీరశైవం పడ్డ మత పరమైన సంఘర్షణను సూచించేది. ఆసాది వాండ్లు రాయలసీమలో 'పెద్దమ్మకథ' అనే పేరిట దీన్ని పాడతారు.

ఆదిలాబాద్ ప్రాంతంలో నివసిస్తున్న 'గోండు' జాతిప్రజల్లో ప్రచారంలోవున్న 'కాలికంకలీ' కథకూడా ఈ కోవకు చెందిందే.

'మేరుపర్వతం మీద దేవతలంతా సమావేశమైనారట. 'పాపినరంజనవెన్' అన్న పురుషదేవత నేనే సర్వాధికుణ్ణి అన్నాడట. 'నిరానింజనవెన్' అన్న స్త్రీదేవత నేనే నన్నది. వారి దృష్టులు కలిస్తే ఆమె గర్భవతి అయిందట. ఆమెకొక కూతురు జన్మించిందట [illegible] కలి.' అది నీరు తేవటానిక ఏటికెల్లి 'ఋషి శరత్' అన్నవాడు దంతధావనం చేసుకొని పారవేసిన 'ఆకు' నీటిలో కొట్టుకొనివచ్చిన దాన్ని నమలి తిన్నందువల్ల గర్భం ధరించింది. ఆమె 12 కళ్ళాల గోండుదేవతల్ని, 33 కళ్ళాల తెలుగుదేవతల్ని, 32 కళ్ళాల మరాట దేవతల్ని కన్నదట. ఈ గోండు జాతి వంశపురుషుడు 'పెహందిలింగాల్'. మొహమి అన్నపురాతన గరుడపక్షి గ్రుడ్డు పెడితే అందులోనుండి వీడూ, పాండురాజు పుట్టారట.

పెహందిలింగాల్ అనే గోండుల మూల పురుషుడొకడున్నాడని 33 కళ్ళాల తెలుగు దేవతల్ని 'కలాకంకలి' కన్నదని చెప్పే ఈ కథ, గోండులకు తెలుగులకువున్న చారిత్రక సంబంధానికి గురించి చరిత్ర చెప్పిన ఎన్నో విషయాల్ని అందిస్తోంది. ఇలాగే జానపదుల్లో కుమారస్వామికథ చాలా ప్రచారంలో వుంది.

రత్నభల్లాణుడన్న రాజుకొడుకు వీరరుద్రుడు యోనిజుడై జన్మించటాని కిష్టం లేక గుమ్మడి పండులో నుండి పుట్టినట్లుంది. ఈ గుమ్మడిపండు ఒక దృష్ట్యా ప్రతీక. మరొక దృష్ట్యా చిహ్నం. గుమ్మడితోట తెల్లుతోట ఒకటే. ఇది కుమారస్వామికథలో వుంది. తెల్లుతోటకు సంస్కృత నామం కాశవనం. కాశమూ ఆకాశమూ ఒక్కటే. అనంతత్వానికి అనంత్ర తత్త్వానికి అది ప్రతీక. ఇందుకే ఉపనిషత్తులో ఆకాశం నుండి జీవసృష్టి జరిగిందని చెప్పబడగా బ్రహ్మసూత్రకారుడు ఆకాశమంటే "పరబ్రహ్మ పదార్థ" మని నిర్ధరించాడు. సువర్ణకాశవనానికి బంగారు రంగులోవున్న గుమ్మడిపండ్ల తోట తన అనుభవంలో వున్న దాన్ని తెలుగు జానపదకవి తీసుకొన్నాడు. అలాగే గుమ్మడి

(39 వ పేజీలో)

### రాయ లేలిన రాయదుర్గంలోని

# ప్రసన్న వేంకటేశ్వరస్వామి దేవాలయం

రాయలసీమలో పేరు గాంచిన శిలా దుర్గ మీ రాయ దుర్గం. మహామంత్రి తిమ్మ రుసు తమ్ముడు గోవింద మంత్రిని రాయ దుర్గ పాలకునిగా నియమించి అతనికి తోడుగా పాలెగాంండ్ర అల్లర్లను అణచమని భూపతిరాయని కూడా యీ ప్రాంతానికి పంపాడు కృష్ణదేవరాయలు. కొంతకాలం గడిచాక బలాన్ని పుంజుకున్న భూపతి రాయుడు అల్లరి మూకలను అణచివేసి తానే పాలకుణ్ణని ప్రకటించు కున్నాడు. అందువలననే యీరాయ దుర్గానికి భూపతి రాయుని కొండ అనే నామాంతరము కూడా వున్నది. క్రీ॥ శ॥ 1565 లు జరిగిన తాళి కోట యుద్ధానంతరం యీ దుర్గం కోనేటి నాయకుని కుమారుడు వెంకటపతి నాయ కుని అధీనంలోకి వచ్చింది. ఆ తరువాత కొద్దికాలం టిప్పుసుల్తాన్ పాలన క్రింద వుండి 1800 సం॥ములో బ్రిటీషు పాలకుల హస్త గత మెంది.

పాడు పడిపోయి శిథిలావస్థలో నున్న యీ కోట ద్వారము దాటి లోపలకు ప్రవేశిస్తే పూజా పునస్కారములు లేని అనేక దేవాలయాలు దర్శనమిస్తాయి. కాని వాటిలో నిత్య నైవేద్యములతో విలసిల్లు తున్నది



ఒక్క ప్రసన్న వేంకటేశ్వర స్వామి దేవాలయము మాత్రమే.

దీని కొక యథార్థమైన స్థల పురాణ మున్నది. మొదట అరణ్యముగా వున్న యీ ప్రాంతానికి అనాటి ఏలిక వేంకటపతి నాయకుడు స సైన్యముగా వేటకు వచ్చి ఒక ప్రాంతములో డేరా వేసుకున్నాడట. వేట బడలికతో ఒడలు మరచి నిద్రిస్తున్న వేంకటపతి నాయకుని ఎవరో వీపు తట్టి లేపి యీ ప్రాంతములో వేంకటేశ్వర లక్ష్మీ పద్మావతి తాయారు విగ్రహాలున్నాయి అని చెప్పినట్లు కల వచ్చింది. తెల్లవారిలేచి తనవారి కందరకూ ఆ విషయం తెలిపి, అ పగలెల్లా స్వామివారి ప్రార్థనలతో గడిపి, ఏప్రదేశములో అవిగ్రహాలున్నాయో తెలుప వలసిందిగా ప్రార్థించి రెండవరాత్రి నిద్రించాడు. తిరిగి ఆ రాత్రి స్వామివారు స్వప్నములో దర్శనమిచ్చి నీ డేరా క్రిందనే మేమున్నాము. మమ్మలను వెలికి తీసి ప్రతిష్ఠ జరిపించమని అనుజ్ఞ యిచ్చి స్వామి వారు అదృశ్యమైనారు.

పణితపు వాగేశ్వరరావు

తెల్లవారగనే వేంకటపతి నాయకుడు తన భార్యలతో పూజాదికములను ముగించి బ్రాహ్మణోత్తములు వేదపఠనం గావించుచుండగా, తన డేరా క్రింద త్రవ్వించగా అక్కడ స్వామివారు అమ్మవార్లతో సహా పరుండివున్న విగ్రహాలు లభించాయి. వెంకటపతి నాయకుని ఆనందానికి అవధులు లేవు. వెంటనే రాయదుర్గ ప్రజలను ఆహ్వానించి దేవాలయ నిర్మాణము గావించి, ఒకానొక శుభ ముహూర్తాన వేదఘోషలు మిన్ను ముట్టుచుండగా ఆ విగ్రహాలను సశాస్త్రీయంగా ప్రతిష్ఠ జరిపించాడు.



గాలిగోపుర దృశ్యం

అప్పుడు బళ్ళారి జిల్లాలో వున్న యీ ప్రాంతానికి కలెక్టరు ఆస్తికుడైన "సర్ థామస్ మన్రో" అనే తెల్లదొర. వారి స్వామి వారి మహత్తువిని యథార్థం తెలుసు

కొనేందుకు తాను స్వామి వారిని దర్శించు కోవాలని అర్చక బృందానికి కబురు పంపాడు. ఆ కాలంలో పాశ్చాత్యులకు దేవాలయ ప్రవేశం వుండేది గాదు. అందు వలన అర్చక బృందమంతా కలెక్టరు మన్రోకు, తాము దేవాలయంలో ప్రవేశిస్తే మేము తిరిగి సంప్రోక్షణ జరిపించ వలసి వస్తుందనీ, దానికి చాలా డబ్బు ఖర్చు అవుతుందనీ, సవినయంగా మనవి చేసుకొన్నారు.

కాని పరమ ఆస్తికుడైన ఆ తెల్లదొర కియ్యకొనక, ఏమైనా సరే తను, స్వామిని దర్శించి తీరాల్సిందేనని సంప్రోక్షణకు ఎంత ఖర్చయినా తానే యిస్తాననీ పట్టుబట్టగా అర్చక బృందము తలవంచక తప్పలేదు అధికారం ముందు.

చివరకు ఒక రోజున "కలెక్టరు మన్రో భార్యా సమేతంగా స్వామివారి దర్శన మునకై బయలు దేరి గాలిగోపురద్వారము లోకి రాగానే, దేవాలయ ప్రధాన ద్వారము వద్ద 7-8. సం॥ల అందమైన బాలుడు ఊర్ధ్వ పుండ్రములతోనూ, శరీరమంతా అలంకరణలు మెరసిపోతూ వుండగా చిరునవ్వుతో నిలబడి వుండి కనబడ్డాడు కలెక్టరు గారికి.

నెమ్మదిగా ఆ తెల్లదొర ప్రధాన ద్వారమును సమీపించి ఆ బాలుని తప్పుకొమ్మన్నాడు.

అర్చక బృందమూ, ప్రక్కనున్న గ్రామ పెద్దలూ ద్వారంలో ఎవరూ లేక తప్పుకో మంటాడేమిటి! అని ఆశ్చర్య పోతున్నారు. విచిత్రమేమిటంటే ఆ బాలుడు తెల్లదొరకు తప్ప మరెవ్వరికీ కనుబడుట లేదు. తిరిగి మరలా ఆ తెల్లదొర తప్పుకో వయ్యా లోపలకు వెళ్ళాలి అనగానే ప్రధానార్చకులైన శ్రీనివాసాచార్యులు గ్రహించి, నెమ్మదిగా లోపలకు వెళ్ళి చూడగా అమ్మవార్ల మధ్య మున్న స్వామి వారి విగ్రహము కనబడుట లేదు. వెంటనే వారు వెలుపలకు వచ్చి కలెక్టరు గారితో అయ్యా తమకు ద్వారములో దర్శన మిస్తున్నది స్వామి వారే. లోపల



ఏకశిలా ధ్వజస్తంభము మరియు కళ్యాణమండపము

స్వామి వారి విగ్రహం లేదు. అని తెలుపగానే ద్వారంలోని బాలుడు అంతర్ధానమై పోయాడు.

అప్పుడా తెల్లదొర మన్రోగారు తన అదృష్టానికి పొంగిపోతూ స్వామివారి సంప్రోక్షణకు కావలసిన ధనమిచ్చి, స్వామివారికి ప్రసన్న వేంకటేశ్వరస్వామి అని నామ కరణము జరిపి, ఆనాటి రాయదుర్గం తాలూకా, (యీనాటి కణేకల్లు తాలూకాలో వున్న) కొంత పొలాన్ని స్వామివారి నిత్యనైవేద్యములకు వ్రాసి యిచ్చి తన భక్తిని వ్యక్త పరచు కున్నాడు.

ప్రస్తుతం యీ పొలాన్ని ఎండోమెంటు వారు స్వాధీన పరచుకొని, సంవత్సరమునకు రెండు వేల రూపాయలు దేవాలయానికి చెల్లిస్తున్నారు.

ప్రతి సంవత్సరమూ వైశాఖ బహుళ విదియనాడు ఇక్కడ బ్రహ్మాండమైన తిరునాల జరుగుతూ వుంటుంది. యీ దేవాలయం ముందు సుమారు 70 అడుగుల ఎత్తు గల ఒకే రాతి ధ్వజ స్తంభము సశిల్పముగా నిలబెట్టబడి వున్నది. బహుశః ఆంధ్ర దేశములో యింత పెద్ద రాతి ధ్వజ స్తంభము లేదేమో! అంత బారు రాతిని ఎలా తెచ్చారో ఎలా నిలబెట్టారో అది ఆనాటి మహా శిల్పులకే తెలియాలి.

దీని ప్రక్కనే చక్కని పనితనముతో కట్టబడిన కల్యాణమంటప మున్నది. దీనిని రాయదుర్గ వాస్తవ్యులు పి. నారాయణగారు శేష భట్టరుగారు కలిసి వసూలు చేసిన చందాతో నిర్మింప జేశారట. ఈ దేవాలయం ముందు తిరుమల తిరుపతి దేవస్థానం వారి ద్రవ్య సహాయముతో నిర్మించబడిన విశాల మంటపమున్నది. దీనిలోనే నేటికీ వివాహాది శుభ కార్యములు జరుగుతూనే వున్నాయి.

ఈ దేవాలయమునకు ఎడమవైపుగా కొండ క్రింద వేంకటపతి నాయకుని తాతల కాలములో నిర్మించబడిన పురాతన "జంబుకేశ్వరస్వామి" దేవాలయమున్నది. దీనిలో

# సప్తగిరి విక్రేతలు

## కృష్ణా జిల్లా

శ్రీ కె. వీరేశ్వరరావు,
బుక్‌షాప్, కైకలూరు - 521 333.

శ్రీ కందుకూరు పార్థసారథి,
రామానుజకూటం, బచ్చుపేట,
మచిలీపట్నం - 521 001.

శ్రీ కంచెర్ల వెంకటపిచ్చయ్య,
C/o శ్రీ కె. సుబ్బనారాయణ,
స్వర్ణనాదస్వరవిద్వాన్,
శ్రీనివాసమహల్ దగ్గర,
విజయవాడ - 520 001.

శ్రీ ఆర్. శ్రీనివాసన్,
C/o శ్రీ ఎన్. శ్రీనివాసన్,
16-6-1, గంటువవారివీధి, పూర్ణానందంపేట,
విజయవాడ - 520 016.

శ్రీ వి. రామాచార్యులు,
గాయత్రీ గురుకులం, సాయిమహల్ వద్ద,
ఉయ్యూరు - 521 165.

శ్రీ కపిలవాయి కేశవరావు,
ఏజెంటు, ఆంధ్రపత్రిక, కొండపల్లి పోస్టు.

## ఖమ్మం జిల్లా

శ్రీ సి. హెచ్. నాగేశ్వరరావు,
శ్రీనివాస వస్త్రాలయము అండ్ కట్‌పీస్
సెంటరు, మెయిన్‌రోడ్డు, మధిర - 507 203.

శ్రీ ఎస్. వెంకటాచార్యులు,
తెలుగుపండిట్, వి. పి. ఎస్. ధన్‌బాద్
క్వార్టర్సు, రుద్రంపూర్ - 507 119.

శ్రీ బి.ఎస్.ఆర్.సి.హెచ్. గుప్తా,
న్యూస్ ఏజెంటు, కల్లూరు - 507 209.

శ్రీ ఎన్. జనార్ధనాచార్యులు,
S/o శ్రీ ఎస్. పట్టాభిరామానుజాచార్యులు,
వాటర్‌టాంకువద్ద, రంగనాయకులగుట్ట,
భద్రాచలం.

## గుంటూరు జిల్లా

శ్రీ వి. నరసింహారావు,
సత్యదేవ న్యూస్ ఏజన్సీస్, బాపట్ల.

శ్రీమతి పి. పద్మావతి,
W/o శ్రీ పి. వి. ఆర్. అప్పారావు,
హిందూ ఏజెంటు, పొన్నూరు - 522 124.

శ్రీ జి. గంగాధరరావు,
24-9-1, అగ్రహారం, కోనేటిదగ్గర,
గుంటూరు-522 003.

శ్రీ విద్యాబుక్ హౌస్.
గాంధీచౌక్, ప్రభుత్వ ఆస్పత్రి దగ్గర,
తెనాలి - 522 201.

శ్రీ వి. రామమోహనశర్మ,
న్యూస్ ఏజెంటు, ఆర్. టి. సి. బుక్‌స్టాల్,
రేపల్లె.

శ్రీమతి ఎస్. విజయలక్ష్మి,
విజయలక్ష్మి బుక్‌స్టోర్సు,
చిలకలూరిపేట - 522 616.

శ్రీ అనుమోలు జగన్నాధరావు,
అధ్యక్షులు, కార్యదర్శి,
శ్రీ వేంకటేశ్వర భక్తసంఘం,
నకరికల్లు - 522 615.

శ్రీ పువ్వాడ కోటేశ్వర విరల్‌గుప్తా,
గుప్తా జనరల్ స్టోర్సు, మంగళగిరి.

శ్రీమతి కె. దేవసేన,
న్యూస్ ఏజెంటు, 11-17-19, రామిరెడ్డిపేట,
నరసరావుపేట - 522 601.

శ్రీ వల్లూరి దత్తాత్రేయ ఉమాశంకర్,
S/o శ్రీ వల్లూరి ఆంజనేయులు,
మారుతీ న్యూస్ సర్వీసెస్,
పోస్టుబాక్సు నెం. 203,
6-13-63, 13/1, అరండల్‌పేట.
గుంటూరు - 522 002.

అర్ధ గజము బారు గల దివ్య స్వయం భూ లింగ మున్నది.

మరి కొంత ముందుకు వెళ్తే గణపతి దేవాలయం, ఆంజనేయస్వామి దేవాలయం, వీరభద్రాలయం వుండగా, వీటికి కొద్ది దూరంలో సుమారు 70 అడుగుల ఎత్తుగల సశిల్పముగా - మున్న ఏకశిలా ధ్వజ స్తంభమున్న విశాలమైన వేణుగోపాల స్వామి దేవాలయమున్నది. ఇది ప్రస్తుతం ఆ గ్రామములోని జూదరులకూ పేకాట గాళ్ళకూ పెట్టని కోటలాగా వున్నది.

యివి కాక కొండమీద మరి కొన్ని దేవాలయాలున్నాయి. వాటిలో చెప్పుకో దగ్గవి కోదండరామన్న దేవాలయం, ఎల్లమ్మ దేవాలయము. యీ ఎల్లమ్మ దేవాలయపు బావి నీరు చాలా ఆరోగ్యప్రద మైనదనీ, సర్వరోగ నివారిణి అని అనాటి శాస్త్రకారులు అంగీకరించారు.

ఇన్ని దేవాలయాలలోనూ, ఒక్క ప్రసన్న వేంకటేశ్వరస్వామి వారి దేవాలయగోపురముమీదతప్ప మరెక్కడా శిల్పమే కానరాదు. యీ గోపురశిల్పము కూడా జాగ్రత్తగా పరిశీలిస్తే హిందూ ముస్లిం సంప్రదాయముల కలయికగా గోచరిస్తుంది.

యీ కొండపై నున్న "రససిద్ధుల గుట్ట" మీద లభించిన శాసనమును బట్టి ఒకనాడీ రాయదుర్గం, జైనులకు స్థావరముగా వుండే దని తెలుస్తుంది. యింకా యీ శాసనంలో అనేక జైన శిల్పకారుల, శాస్త్రకారుల పేర్లు కూడా చెక్కబడి వున్నాయి. ఇక్కడే వున్న ఒక గోడమీద అనాటి జైన విద్యాపీఠము, దానిలో బారులుతీరికూర్చున్న విద్యార్థులూ, బోధన సాగిస్తున్న అధ్యాపకులూ వున్న శిల్పము కూడా వున్నది.

సుమారు 26 వేల జనాభా కల యీ రాయదుర్గం, చేనేత వస్త్రాలకు పుట్టినిల్లూ, కృత్రిమ పట్టుకు పట్టుగొమ్మ.

ఒకనాడు పెద్ద విద్యా కేంద్రంగా విలసిల్లిన యీ రాయ దుర్గంలో, ఒక ఉర్దూ, అరబీకళాశాల, ఒకఅరబిక్ గ్రంథాలయమూ, ఒక జూనియర్ కళాశాల, రెండు ఉన్నత పాఠశాలలూ వున్నాయి. తెలుగు కన్నడ ముల సరిహద్దుగా వున్న యీ శిలా దుర్గం ప్రతివారూ తప్పక చూడదగిన దుర్గం. *

# గయాక్షేత్రం

— దర్భా చలమయ్యశాస్త్రి

సంస్కృతములో 'త్రిస్థలీ' అను గ్రంథ రాజము కలదు. దానిని నారాయణభట్టు అను పండితుడు రచించెను. అందు కాశీ, గయా, ప్రయాగ అను మూడు పుణ్యక్షేత్రముల చరిత్ర-మాహాత్మ్యము – చేయవలసిన విధులు చక్కగా వివరింపబడి ఉన్నవి. అదిఆధారముగ గయాక్షేత్రములోని కొన్ని ముఖ్య విషయములు ఆస్తిక మహాశయులకు అందజేయబడుచున్నవి. సం॥

పూర్వకాలమున గయాసురుడను భయంకర రాక్షసుడు కలడు. ధృఢకాయుడు. సుమారు నూరు యోజనముల ఎత్తు, అరువదియోజనముల వెడల్పు కలశరీరి. అతడు కోలాహలపర్వతమందు భయంకర తపస్సు చేయుచుండెను. ఆతపస్సునకు తపన చెందిన దేవతలందరూ బ్రహ్మలోకమునకేగి ఓ సృష్టికర్తా! బ్రహ్మ! గయాసురుడు తీవ్ర తపస్సు చేయుచున్నాడు. ఆ తపస్తాపమునకు మేమందరము పీడింపబడుచున్నాము. నిన్ను శరణు వేడుచుంటిమి. రక్షింపుము అని బ్రహ్మకు విన్నవించిరి.

పిమ్మట లయకారకుడైన శివుని శరణు పొందుదము రండు, అని బ్రహ్మ దేవతలతో కైలాసమున కేగి శివునకు తమ వ్యథను తెలియజేసెను. అంత శివుడు లోకరక్షకుడైన్నవిష్ణువునుప్రార్థింతమనిచెప్పి, బ్రహ్మాది దేవగణములతో క్షీర సముద్రమునకుపోయి, విష్ణువును స్తుతింపగా విష్ణువు ప్రత్యక్షమై ఓ దేవతలారా! మీరు అందరు ఎందులకు ఇట్లు స్తుతించిరి? నా పని ఏమి? అని అడిగెను. ఆ దేవతలందరూ గయాసురుని తీవ్ర తపస్సును, తమ వ్యథనూ తెలియజేసిరి. ఆ మాట లాలకించిన విష్ణువు వెంటనే గరుడారూఢుడై బ్రహ్మాది దేవతలలో గయుని వద్దకు వచ్చెను.

ఓ గయా! ఎందు నిమిత్తము ఇంత తీవ్ర తపస్సు చేయుచుంటివి? నీ కోరిక ఏమి? వివరింపుము అని పృచ్ఛచేసెను. ఓ దేవా! అన్ని తీర్థములకంటె నా శరీరము మిక్కిలిపవిత్రముగ ఉండవలెననెడికోరికతో ఇంత తీవ్రతపస్సు చేయుచున్నాను. అట్టి వరము నాకు ప్రసాదింపుము. అని గయాసురుడు ప్రార్థింపగా "అట్లే అగుగాక" అని అనుగ్రహించి బ్రహ్మాది దేవతలతో విష్ణువు అంతర్ధానమాయెను.

విష్ణువరప్రభావము వలన పవిత్రత చెందిన గయుని దేహదర్శనంచేత కొందరు, శరీరస్పర్శచేత మరికొందరు బ్రహ్మలోకమునే పొందుచుండిరి. ప్రజలకు యమలోకప్రసక్తియే లేకుండెను. అంత యమధర్మరాజు తన పరివారముతో బ్రహ్మలోకమునకు పోయి తమ అధికార శూన్యతను, నిరుద్యోగ సమస్యను బ్రహ్మకు విన్నవించుకొనెను. ఓ పితృపతీ! గయుని శరీరము సర్వతీర్థములకంటె పవిత్రత కలిగి ఉండునట్లుగా విష్ణువు వరమొసంగెను. ఆ కారణంగా ప్రజలకుపితృలోకప్రసక్తిలేకుండెను. అందుచే విష్ణువునే ప్రార్థింతమని పలికి ఆ పితృవర్గముతో బ్రహ్మ విష్ణులోకమునకు ఏగెను.

ఓ దేవాదిదేవా! జనార్దనా! నీ వరప్రభావముచే గయుని దర్శన స్పర్శాదులచే సర్వజనులు బ్రహ్మలోకమునకే పోవుచున్నారు. పితృలోకాధిపతియైన యమునకు పనిపాటలు లేకుండెను. నిరుద్యోగ సమస్య ఏర్పడినది. తగిన ఉపాయము చింతింపుడు అని బ్రహ్మాది దేవతలు విష్ణువుకు విన్నవించిరి. అంత విష్ణువు ఓ విధాతా! యజ్ఞార్థము పవిత్రమైన ఆ గయుని దేహము యాచింపుము. అది దీనికి తగిన ఉపాయమని చెప్పగా బ్రహ్మ గయాసురుని వద్దకు పోయి ఇట్లు పలుకదొడంగెను.

పృథివ్యాం యాని తీర్థాని<br>
దృష్టాని భ్రమతా మయా,<br>
యజ్ఞార్థం తు న తే తాని<br>
పవిత్రాణి శరీరతః.

త్వయా దేహ పవిత్రత్వం<br>
ప్రాప్తం విష్ణు ప్రసాదతః,<br>
అతః పవిత్రం స్వం దేహం<br>
యజ్ఞార్థం దేహి మేఽసుర.

ఓ గయాసురా! భూలోకములోని పుణ్యతీర్థము లన్నిటిని చూచితినికాని యజ్ఞార్థము నీ శరీరముకంటే పవిత్రమైన తీర్థము మరియొకటి కనబడలేదు. విష్ణుదేవుని యనుగ్రహము వలన నీ దేహమునకు పవిత్రత ఏర్పడినది. అందువలన మా యజ్ఞార్థము నీ దేహమును ఇమ్ము అని బ్రహ్మ యాచించెను. యాగార్థము నా దేహము యాచింపబడుట వలన నాజన్మసార్థకమైనది. నేను ధన్యుడనైతిని తప్పక యిచ్చెదను. స్వీకరింపుడు అని గయుడు పలికి నైఋతి దిగ్భాగమందు ఉత్తరదిక్కుగా శిరస్సు, దక్షిణదిక్కుగా పాదములు ఉండునట్లు కోలాహల పర్వతముమీద పరుండెను.

పిమ్మట ఆ గయుని శరీరమందు బ్రహ్మ యాగము కావించెను. కాని అతని శిరస్సు చలించుచుండెను. ఓ యమరాజా! అతని శిరస్సు చలింపకుండునట్లుగా ఒక శిల నుంచుమని పలికెను. యముడు అతని శిరస్సుపై ఒక బండరాతిని ఉంచెను. కాని అతని శిరస్సు కదలుచునే యుండెను. ఓ శివాది దేవతలారా! మీరందరు ఈ శిలయందు నిశ్చలముగా కూర్చుండుడని బ్రహ్మపలికెను. ఆ శివాదులు కూర్చున్నను అతని శిరస్సు చలించుచునే యుండెను. ఆ వెంటనే బ్రహ్మ విష్ణులోకమునకేగి ఓ విష్ణుదేవా! గయుని శిరస్సు చలింపకుండునట్లుగా అనుగ్రహింపుమని ప్రార్థించెను. అంత విష్ణువు తన మూర్తిని యిచ్చి పంపెను. బ్రహ్మ ఆ మూర్తిని ఆ శిలపై స్థాపించెను. అయినను ఆ శిరస్సు చలించుచునే యుండెను.

అంత బ్రహ్మాది దేవతలచే ప్రార్థింపబడిన విష్ణువు, స్వయముగా వచ్చి ఆ శిలయందు జనార్దన – పుండరీకాక్ష – గదాధర రూపములతో నివసించెను. ప్రపితామహ-పితామహ-కేదారేశ్వర – కనకేశ్వర రూపములతో బ్రహ్మయు శివుడును,గజరూపములతో వినాయకుడూ నివసించెను. లక్ష్మి సీతపేరుతోను, గౌరి మంగళా అను పేరుతోను ఉండెను. మరియు గాయత్రి, సావిత్రి. త్రిసంధ్య, సరస్వతి, మొదలగు దేవతలందరు గయాసురుని శిరస్సు స్థిరముగా ఉండుటకు ఆ శిలపై నివసించి యుండిరి. సూర్యదేవుడు కూడా నివసించియుండెను. కాని అతని శిరస్సునకు స్థిరత ఏర్పడలేదు. తుదకు ఓ దేవతలారా! ఏల నా శిరస్సునకు స్థిరత

## అదృశ్య శక్తి

శిథిలాలయములో
చిమ్మచీకటిలోన
వెలిగించి రెవ్వరో
ఈ చిన్ని దివ్వె!

నట్టనడి సంద్రాన
కొట్టు మిట్టాడేటి
నావపై ప్రసరించి
రెవ్వరో కాంతి!

కారుమబ్బులు, యిరులు
కమ్ముకొను వేళలో
వెలిగించి రెవ్వరో
ఈ వింత మెరపు!

నీరంధ్ర నిశిలోన
నింగిలో తారకను
పొదుపుగా అమరించి
ప్రభలు చిలికింపుచును

చీకటి తెరవెనుక
దాగినా రెవ్వరో
నాకు తెలియగరాని
ఏ వింతశక్తియో!

—బి. వి. నరసింహం

ఏర్పడలేదు? ఎందులకు మోసగింపబడితిని సెలవీయుడు. అని పలుకగా దేవతలు వరము లిచ్చెదము కోరుకొనుము అని పలికిరి.

వెంటనే గయాసురుడు తన వరముల నిట్లు తెలియజేసెను. భూమి, పర్వతములు, చంద్రసూర్యులు, నక్షత్రములు ఉండు పర్యంతము బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సర్వదేవతలు ఈ శిలయందు నివసించి యుందురుగాక. నా పేరుతో ఈ క్షేత్రము ప్రసిద్ధి చెందుగాక. ఈ గయాక్షేత్రమందలి నదులు, నదములు, వనములు, సరస్సులు, దేవతలు, తీర్థములు మానవులకు హితమును (మోక్షమును)చేకూర్చుగాక.స్నానాది తర్పణములు చేసి పిండదానాదులు చేసిన వారికి అధికమైన ఫలమువచ్చుగాక. పితృదేవతలకు బ్రహ్మలోకమునకు భుక్తి, ముక్తి ఫలము వచ్చుగాక. త్రిమూర్త్యాత్మకమైన విష్ణువు కీర్తింపబడునంతకాలము భూలోకములో గయాక్షేత్రము ప్రసిద్ధి చెందుగాక. ఈ క్షేత్రమును సేవించు వారికి బ్రహ్మహత్యాది మహాపాపములు నశించుగాక. అని గయాసురుడు వరములను కోరగా దేవతలందరు తథాస్తు అని నుడివిరి.

పిమ్మట గ్రామ, స్వర్ణగ్రహ, కామధేను, కల్పవృక్ష, క్షీరకుల్య (క్షీరములుప్రవహించు కాలువ), దధికుల్య (పెరుగు ప్రవహించు కాలువ), ఘృతకుల్య (నేతికాలువ), అన్న పర్వతము మొదలైన సర్వసౌకర్యములను అచట నివసించు బ్రాహ్మణులకు కలుగజేసి ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా! మీరు ఇతరులను ఏమియు యాచింపరాదు. మీకు సర్వ సౌఖ్యములు కలుగజేసితిని అని చెప్పి బ్రహ్మ దేవాదులతో స్వలోకమున కేగెను.

కాని ఆ బ్రాహ్మణులు శ్రాద్ధాది కార్యములను చేయించి లోభముచే యాత్రికులను యాచించుచుండిరి. అపుడు బ్రహ్మ మరల వచ్చి ఓ విప్రులారా! మీరు లోభముచే నా మాటలను తిరస్కరించి యితరులను యాచించుచుండిరి. మీకు ఆశ అధికమగుగాక. మీరు విద్యాశూన్యులు అగుదురుగాక. మీ గ్రహములు మృణ్మయములు. అన్న పర్వతములు పాషాణమయములు. క్షీరాది కుల్యలు వారివహములు (నీరు ప్రవహించు యేర్లు) అగుగాక అని శపించెను. అనంతరము ఆ బ్రాహ్మణులు తమ తమ జీవనార్థము ఏదేని యనుగ్రహింపుమని కోరగా బ్రహ్మ ఇట్లు అనుగ్రహించెను.

తీర్థోపజీవికాః యూయం
ఆచంద్రార్కం భవిష్యథ,
యే యుష్మాన్ పూజయిష్యంతి
గయాయాం ఆగతాః నరాః.
హవ్య కవ్యైః ధనైః శ్రాద్ధైః
తేషాం కుశలతం వ్రజేత్
నరకాత్ స్వర్గలోకాయ
స్వర్గలోకాత్ పరాం గతిమ్॥

ఆచంద్రార్కముగా తీర్థోపజీవులై యుందురుగాక. గయాక్షేత్రమునకు వచ్చి హవ్యకవ్యముల చేతను, ధనముల చేతను, శ్రాద్ధముల చేతను, మిమ్ము పూజించు యాత్రికులు వంశాభివృద్ధిని పొందుదురు. మరియు మిమ్ము పూజించువారి పితృదేవతలు నరకలోకము నుండి స్వర్గలోకము, స్వర్గలోకమునుండి ఊర్ధ్వగతిని(మోక్షము) పొందుదురు. అని పలికి బ్రహ్మ వెడలి పోయెను. అప్పటినుండియు గయాక్షేత్రము నందలి బ్రాహ్మణులు దరిద్రులు గానే యుందురు. వారెట్లున్నను వారిని తప్పక అర్చింపవలెనని గయాక్షేత్ర మాహాత్మ్యము చెప్పుచున్నది.

### శిలోపాఖ్యానము :

యమధర్మరాజునకు ధర్మవ్రత యను పేరుగల కన్యక కలదు. ఆమె అనురూప వరార్థము తీవ్రమైన తపస్సు చేయుచుండెను. అంత బ్రహ్మమానస పుత్రుడైన మరీచి ఆమెను చూచి మోహించి కులాదికము నడిగెను. ఆమె తన వంశాదికమును తెలియజేసెను. గృహస్థాశ్రమమును స్వీకరించుటకు బ్రహ్మ యనుజ్ఞ పొందితిని. కుల శీలాదులలో నీవు నాకు తగినదానవు. నిన్ను

వివాహమాడెదనని మరీచి పల్కెను. నేను పరాధీనురాలను. నా తండ్రి యనుజ్ఞ గైకొని వివాహమాడవలెనని ఆమె మరీచికి జవాబు చెప్పెను. మరీచి తన వివాహార్థము కన్య నీయవలసినదిగా తండ్రియైన యముని ప్రార్థించెను. అతడు తన కన్యను మరీచి కిచ్చి యథావిధిగా పరిణయము కావించెను. ఆ దంపతులు తమ గార్హస్థ్య జీవితమును సుఖముగా గడుపుచుండిరి.

ఒకనాడు మరీచి వనమునుండి ఫల పుష్పాదులు తెచ్చి మిక్కిలి అలసినవాడై పాదసంవాహనము (పాదములొత్తుట) చేయుమని భార్యతో చెప్పి తాను పరుండెను. ఆమె పాదసంవాహనము చేయు చుండగా, మామగారైన బ్రహ్మ అక్కడకు వచ్చెను. మామగారిని పూజించు నిమిత్తము నిద్రించుచున్న భర్తృపాదసంవాహనమును వీడి, అర్ఘ్యాదులతో బ్రహ్మను పూజించుచుండెను. మరీచి నిద్రనుండి లేచి క్రుద్ధుడై నాసేవను వీడి, లేచివెడలితివి గావున శిలపై పడియుండుమని శపించెను.

పిమ్మట ఆమె తీవ్రమైన తపస్సు చేయ నారంభించెను. ఆ తపస్సునకు సంతప్తులైన దేవతలు హరిని శరణుజొచ్చిరి. విష్ణ్వాది దేవతలందరు ఆమె వద్దకు వచ్చి అమ్మా! వరము కోరుకొనుము. తప్పక ఇచ్చెదము అని పలికిరి. ఆమె మరీచి శాపము తొలగునట్లు వరమీయుమని ప్రార్థించెను. తల్లీ! మహర్షిశాపము తొలగించుటకు మేము అర్హులముకాము. అది అనుభవింపవలసినదే తప్పదు. గావున మరియొక వరము కోరుమని దేవాదులు వచించిరి. ఆమె మరల ఇట్లు దేవాదులను ప్రార్థించెను.

శిలాఽహం తు భవిష్యామి
బ్రహ్మాదేః పావనీ శుభా,
నదీ నదాది తీర్థేభ్యః
దేవాది భ్యోఽ తిపావనీ.
తిష్ఠంతు దేవాః సకలాః
దేవ్యశ్చ మునయః స్థిరాః,
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ
అర్పయిత్వా పదం మయి.

ఓ బ్రహ్మాది దేవతలారా! నేను శిలనగుదును. కాని సర్వతీర్థముల కంటె, సర్వదేవతల కంటె పవిత్రత నాకు నీయవలెను. సర్వదేవతలు, మునులు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నాయందుండవలెను. నన్ను దర్శించిన వారికి సర్వపాపములు నశింపవలెను. మరియు శిలాతీర్థములో స్నానము చేసి తర్పణములు కావించి, శ్రాద్ధకర్మలు చేయువారికి బ్రహ్మలోక ప్రాప్తి కలుగవలెను. నా శిలయందు మరణించిన వారికి విష్ణులోక ప్రాప్తి కలుగవలెను. బ్రహ్మాండ ముండునంతవరకు ఈ శిలా రూపములో ఉందును. దేవతా స్వరూపిణిగా నన్నారాధింపవలెను. ఆమె ప్రార్థనలను విని దేవతలందరు 'తథాస్తు' అని పలికి స్వధామములకు వెడలిపోయిరి. ఆమె క్రోశమాత్రము పరిమితి కల శిలయయ్యెను. దేవ వరప్రదానము వలన జనులందరు ఆ శిలను దర్శించి, స్పృశించి స్వర్గలోకమును పొందుచుండిరి. ఆ శిలయే గయుని శిరస్సునందు యముని చేత స్థాపింపబడినది. గయకు వెళ్లినవారు ఆ శిలను దర్శించి స్పృశించి అక్కడ శ్రాద్ధప్రక్రియలను జరిపివత్తురు.

## గదాలోలోపాఖ్యానము :

గదుడను రాక్షసుడు కలడు. అతడు బ్రహ్మచేత అనేక వరములను పొందెను. ఒకప్పుడు బ్రహ్మ గదాసురుని అస్థులు (ఎముకలు) అడిగి తీసుకొని విశ్వకర్మచేత గదను తయారు చేయించెను. దానిని బ్రహ్మాస్త్రమని కూడ అందురు. అదే సమయములో బ్రహ్మపుత్రుడైన హేతి అను రాక్షసుడు తీవ్రమైన తపస్సు చేయుచుండగ బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. ఓ తండ్రీ! విష్ణు, మహేశ్వర, ఇంద్రాదుల ఆయుధములచే నాకు మరణము లేకుండునట్లు వరమిమ్ము అని హేతి బ్రహ్మను ప్రార్థించెను. 'తథాస్తు' అని బ్రహ్మ పలికెను. వరములు పొందిన హేతి ఇంద్రాదులతో యుద్ధము చేసి వారలను ఓడించి, ఇంద్రపదవి గైకొనెను. ఇంద్రాదులు హరిని శరణువేడి ఆ



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ప్రతి శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది గొడుగుల జత సగం వెల రూ. 600/- అవుతుందికనుక టి. టి. డి. కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమిషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

రాక్షసుని చంపుమనిరి. అతడు మన ఆయుధములచేత అవధ్యుడు. అందుచేత బ్రహ్మనడిగి అతని ఆయుధమును తెండు. దానితో వీనిని చంపుదునని విష్ణువు పలికెను. ఇంద్రాది దేవతలు బ్రహ్మను ప్రార్థించి, ఆ గదను తెచ్చి విష్ణువునకు ఇచ్చిరి. ఆ గదతో విష్ణువు హేతిని చంపి, ఆ గద ఎక్కడ ప్రక్షాళనార్థము లోలితము చేయబడినదో (ఊపబడినదో) దానికి గదాలోల తీర్థమని పేరు కలదు. ఆ గదను ధరించిన కారణముగ హరికి "గదాధరుడు" అను పేరు వచ్చినది. గదాలోల తీర్థముకూడ గయాక్షేత్రములోనిదే. ఈ తీర్థము కూడ మిక్కిలి పవిత్రమైనదిగా చెప్పబడుచున్నది.

## గయాక్షేత్ర మాహాత్మ్యము:

స్నుతాది కర్తృకం యస్యాం
శ్రాద్ధం శ్రద్ధాత్ సమేధితమ్।
పిత్రాద్యుద్దేశ ఫలదం
సా గయా యాగతోఽధికా ॥

కుమారులు గయలో పితృదేవతల నుద్దేశించి శ్రద్ధగా శ్రాద్ధకర్మ జరిపినయెడల యాగఫలముకంటె అధికమైనఫలము సంభవించును.

జీవతోః వాక్యకరణాత్
ప్రత్యబ్దం భూరి భోజనాత్ ।
గయాయాం పిండదానాచ్చ
త్రిభిః పుత్రస్య పుత్రతా ॥

తల్లిదండ్రులు బ్రతికియుండగా వారి మాటలను ఆదరించి పాలించువాడు, అబ్దిక దినమున అన్నదానము చేయువాడు, గయలో పిండదానము చేయువాడు పుత్రశబ్దమునకు అర్హుడు. అనగా పుత్రుడై పుట్టినవాడు ఈ మూడు పనులను తప్పక చేయవలెను.

తస్మాత్ సర్వప్రయత్నేన
బ్రాహ్మణస్తు విశేషతః।
ప్రదద్యాత్ విధివత్ పిండాన్
గయాం గత్వా సమాహితః ॥

అందువలన పుత్రులందరు ప్రయత్నించి గయకువెళ్ళి శాస్త్రప్రకారము గయలో పిండదానము చేయవలెను. విశేషించి బ్రాహ్మణులు తప్పకుండ గయాశ్రాద్ధము చేయవలెను.

గయాభిగమనం కర్తుం
యః శక్తో నాఽభిగచ్ఛతి ।
శోచంతి పితరః తం వై
వృథా తస్య పరిశ్రమః ॥

పితృదేవతలనుద్దేశించి గయకు వెళ్లి గయాశ్రాద్ధము చేయుటకు శక్తి కలిగియు, నాస్తికాదులచే గయాశ్రాద్ధము చేయనివాని పితృదేవతలు దుఃఖింతురు. మరియు అట్టివాడు ఎన్ని సత్కర్మల నాచరించినను అవన్నియు వ్యర్థములగును.

గయాయాం పిండ దానాత్తు
నాన్యద్దానం ప్రశస్యతే ।
ఏకేన పిండదానేన
తృప్తా యే మోక్షగామినః ॥

గయలో ఒక్కసారి పిండప్రదానము చేయుటవలననే పితృదేవతలు తృప్తులై మోక్షమును పొందుదురు. అందుచేత గయలో చేసిన పిండ ప్రదానము కంటె ఏ యితర దానము గొప్పదికాదు. అనగా గయా శ్రాద్ధము అంత గొప్పది.

అసంస్కృతా మృతా యే చ
పశుచోర హతాశ్చ యే ।
సర్పదష్టా గయాశ్రాద్ధాత్
ముక్తాః స్వర్గం వ్రజంతి తే ॥

ఉపనయనాది సంస్కారములు లేకుండగా మరణించినవారు, పశువులచేతగాని, చోరాదులచేతగాని చంపబడినవారు, సర్పదష్టులు గయాశ్రాద్ధము వలన నరకము నుండి ముక్తులై స్వర్గలోకమునకు పోవుదురు. అనగా బలవన్మరణము చెందినవారికి గయలోకూడ కూపశ్రాద్ధము చేసినయెడల వారు నరకము నుండి ముక్తులగుదురు.

గయాయాం పిండదానేన
యత్ఫలం లభతే నరః ।
న తచ్ఛక్యం మయా వక్తుం
కల్పకోటి శతైరపి ॥

గయలో పిండప్రదానము చేసిన నరుడు పొందు ఫలమును చెప్పుటకు ఎన్ని వేల సంవత్సరములైనను చాలవు. అనగా గయలో పిండ ప్రదానము చేసినవారికి అనంత ఫలము సంభవించును.

గయాయాం ప్రాప్యానుషంగేన
యది శ్రాద్ధం సమాచరేత్ ।
తారితాః పితరః తేన
స యాతి పరమాం గతిమ్॥

అనుషంగికము (తలవని తలంపు) గా గయ వెళ్లినను అక్కడ శ్రాద్ధము చేసిన యెడల పితృదేవతలు తరింతురు. మరియు అట్లు శ్రాద్ధకర్మ చేసినవాడును ఉత్తమ గతిని పొందును. బుద్ధిపూర్వకముగా గయ వెళ్లి శ్రాద్ధము చేసిన యెడల అనంత ఫల ప్రాప్తి కలుగునని వేరుగా చెప్పనవసరము లేదు.

గయాం గత్వా తు యః కశ్చిత్
పితౄన్ సుతర్ప యేన్నరః ।
దశాఽవరాన్ పరాన్ వంశ్యాన్
ఆత్మానం చ పునాతి సః ॥

వంశములో ఏ ఒకడైనను గయవెళ్లి శ్రాద్ధకర్మ చేసి పితృదేవలను తృప్తిపరచవలెను. అట్లు గావించిన నరుడు పది తరములు క్రింది వారిని, పది తరములు పై వారిని, తనను పవిత్రము చేసిన వాడగును.

పంచ క్రోశం గయాక్షేత్రం
క్రోశ మేకం గయాశిరః ॥

గయాక్షేత్రము ఐదు క్రోశుల దూరము కలదు. గయుని శిరఃప్రదేశము ఒక క్రోసెడు దూరము మాత్రము కలదు.

గయాక్షేత్రము చాలా పవిత్రమైనది. సర్వదేవతలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అక్కడ నివసించిరి-నివసింతురు. వాయ్వాది పురాణములలో గయాక్షేత్ర మాహాత్మ్యము వర్ణింపబడినది. అనేకమంది మహర్షులు తపస్సుచేసి తరించిన ప్రదేశము. గయాశ్రాద్ధఫలితమును గూర్చి 'త్రిస్థలి' లో విపులముగా చెప్పబడినది. ఆస్తిక మహాశయులారా! పవిత్రమైన భారతదేశంలో జన్మించినందులకు భారతీయులందరు గయాశ్రాద్ధము చేసి పితృదేవతల తరింపచేసి, తాము తరింతురు గాక! •

(గతసంచిక తరువాయి)

## ఎనిమిదవ అధ్యాయం

అక్షరపరబ్రహ్మయోగం

అర్జున ఉవాచ :

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తం అధిదైవం కిముచ్యతే ॥

అర్జునుడు : పురుషోత్తమా ! బ్రహ్మమంటే ఏమిటి ? అధ్యాత్మమంటే ఏమిటి ? కర్మ అంటే ఏమిటి ? అధిభూతమూ, అధిదైవమూ అనేవి ఏవి ?

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥

మధుసూదనా ! ఈ శరీరంలో అధియజ్ఞుడెవ్వడు; ఎలా వుంటాడు ? మనోనిగ్రహం కలవాళ్లు మరణ సమయంలో నిన్నెలా తెలుసుకోగలుగుతారు ?

అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

మరణసమయంలో నన్నే స్మరణచేస్తూ శరీరాన్ని విడిచి పెట్టినవాడు నా స్వరూపాన్నే పొందుతాడు. ఇందులో సందేహమేమీ లేదు.

యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్।
తం తమేవైతి కౌంతేయ ! సదా తద్భావభావితః ॥

కౌంతేయా ! అంత్యకాలంలో ఎవడు ఏ భావాలతో శరీరాన్ని వదులుతాడో, ఆ భావాలకు తగిన స్థితినే పొందుతాడు.

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పిత మనోబుద్ధిః మామేవైష్యస్యసంశయః ॥

అందువల్ల నిరంతరం నన్నే స్మరిస్తూ యుద్ధం చెయ్యి మనస్సునూ, బుద్ధినీ నాకు అర్పిస్తే నీవు నిస్సంశయముగా నన్నే పొందుతావు.



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

శ్రీ భగవానువాచ :

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥

శ్రీ భగవానుడు : సర్వోత్తమం, శాశ్వతమూ అయిన పరమాత్మనే బ్రహ్మమనీ, ఆత్మ పరమాత్మతత్వాన్ని అధ్యాత్మ మనీ చెబుతారు. సమస్త జీవుల ఉత్పత్తికీ, ఉనికికీ కారణమైన త్యాగపూర్వం, యజ్ఞరూపం అయిన కార్యమే కర్మ.

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర ! ॥

అర్జునా ! శరీరంలాంటి నశించే స్వభావం కలిగిన పదార్థాలను అధిభూతమంటారు. పురుషుడే అధిదైవం. ఈ దేహంలో అంతర్యామి రూపంలో వుండే అధియజ్ఞాన్ని నేనే.

అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥

పార్థా ! మనస్సును ఇతర విషయాల మీదకు పోనీయకుండా యోగం అభ్యసిస్తూ పరమపురుషుడైన భగవానుణ్ణి నిరంతరం ధ్యానించేవాడు ఆయననే పొందగలుగుతాడు.

కవిం పురాణ మనుశాసితారం
అణోరణీయాంస మనుస్మరే ద్యః ।
సర్వస్య ధాతార మంచిత్య రూపం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥
ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥

సర్వమూ తెలిసినవాడు, సనాతనుడు, సకల లోకాలనూ శాసించేవాడు, సూక్ష్మాతిసూక్ష్మమైనవాడు, సూర్యుడిలాంటి కాంతి కలిగినవాడు, అఖిల జగత్తుకూ ఆధారమైన వాడు, ఆలోచించడానికి శక్యంకాని రూపంకలిగినవాడు, అజ్ఞానాంధకారానికి అతీతుడు అయిన పరమేశ్వరుణ్ణి మరణకాలంలో మనస్సు నిశ్చలంగా వుంచుకొని భక్తిభావంతో, యోగబలంతో కనుబొమల మధ్య ప్రాణవాయువును బాగా నిలిపి ధ్యానించేవాడు ఆ దివ్యపురుషుణ్ణి పొందుతాడు.

యదక్షరం వేదవిదో వదంతి
విశన్తి యద్యతయో వీత రాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణప్రవక్ష్యే ॥

వేదార్థం తెలిసినవాళ్లు శాశ్వతమని చెప్పేదీ, కామక్రోధాలను జయించిన యోగులు చేరేదీ, బ్రహ్మచర్యాన్ని పాటించేవాళ్లు చేరకోరేదీ అయిన పరమపదాన్ని గురించి నీకు క్లుప్తంగా చెబుతాను విను.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణం ఆస్థితో యోగధారణామ్॥

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥

ఇంద్రియాలన్నిటినీ నిగ్రహించి, మనస్సును హృదయంలో నిలిపి, ప్రాణం శిరస్సులోవుంచి, ఆత్మయోగం అభ్యసిస్తూ బ్రహ్మను ప్రతిపాదించే ఓంకారమనే ఒక్క అక్షరాన్ని ఉచ్చరిస్తూ, నన్నే స్మరిస్తూ శరీరాన్ని విడిచి పెట్టేవాడు మోక్షం పొందుతాడు.

అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః ॥

పార్థా! ఏకాగ్రచిత్తంతో ఎల్లప్పుడూ నన్నే స్మరించే ధ్యానయోగికి నేను అతి సులభంగా లభిస్తాను.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥

మోక్షపదాన్ని పొందిన మహాత్ములు నన్ను, చేరి దుఃఖపూరితం, అశాశ్వతమూ అయిన పునర్జన్మ పొందరు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున! ।
మాముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే ॥

కౌంతేయా! బ్రహ్మలోకంవరకూ వుండే సకల లోకాలూ పునర్జన్మ కలగజేసేవే. నన్ను పొందినవాళ్లకు మాత్రం మరో జన్మ లేదు.

సహస్రయుగపర్యంతం అహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥

బ్రహ్మదేవుడికి వేయియుగాలు పగలనీ, ఇంకో వేయి యుగాల కాలం రాత్రి అనీ తెలుసుకొన్నవాళ్లే రాత్రింబవళ్ల తత్వాన్ని గ్రహిస్తారు.

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవంత్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥

బ్రహ్మదేవుడి పగటి సమయంలో చరాచర వస్తువులన్నీ అవ్యక్త ప్రకృతి నుంచి కలుగుతాయి. మళ్లీ రాత్రి కావడంతోనే అవ్యక్తం అనబడే ఆ ప్రకృతిలోనే కలసిపోతాయి.

భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే ॥

పార్థా! ఈ జీవకోటి పుట్టి పుట్టి బ్రహ్మకు రాత్రి రావడంతోనే ప్రకృతిలో లీనమవుతుంది. పగలు కాగానే మళ్లీ పుడుతుంది.

పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥

ఈ అవ్యక్త ప్రకృతికి అతీతమై, అగోచరం, శాశ్వతమూ అయినపరబ్రహ్మతత్త్వం సమస్తభూతాలునశించినానశించదు.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥

అగోచరుడనీ, శాశ్వతుడనీ చెప్పే ఆ పరమాత్మనే పరమగతిగా భావిస్తారు. నాకు నిలయమైన పరమపదాన్ని పొందినవాళ్లకు మళ్లీ జన్మ లేదు.

పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా ।
యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥

అర్జునా! సమస్తభూతాలనూ తనలో ఇముడ్చుకొని, సకల లోకాలలో వ్యాపించి వున్న పరమాత్మను అచంచలమైన భక్తి వల్లనే పొందవచ్చు.

యత్ర కాలే త్వనావృత్తిం ఆవృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ! ॥

భరతవీరా! యోగులు ఏ సమయంలో మరణిస్తే మళ్లీ జన్మించరో, ఏ వేళ దేహం విడిచిపెడితే పునర్జన్మ పొందుతారో చెబుతాను విను.

అగ్నిర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

( 32వ పేజీలో)

# అన్నమయ్య చెన్నకేశవ శతకము

విద్వాన్ శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యం



(గతసంచిక తరువాయి)

ఒకనాడు తిరుపతిలో మా మిత్రులు తాళ్ళపాక అన్నమాచార్య ప్రాజెక్టు ప్రచురణ విభాగంలో సంకీర్తనల పరిశోధకులుగా పనిచేయుచున్న శ్రీ గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారిని దర్శించి 'చిన్న చెంబుతోనీళ్ళు' అను పద్యం చెప్పి, ఆ పద్యానికేమి భావము? ఏ పద్యరచన అని అడిగాను. వారిలా అన్నారు. "ఒకప్పుడు మా గురువర్యులు శ్రీమాన్ టి. కె. వి. ఎన్. సుదర్శనాచార్యులుగారు తల్లి తన చిన్నబిడ్డను లాలించి నీళ్ళు పోయునపుడు బుజ్జగించు భావమని చెప్పి వారని తెలిపినారు. అదే పద్యపాదమో!" అని సందేహం వెలిబుచ్చారు. మరియు 'ఆరగింతువురారఅన్న కుమార!' అనుపారాంతరము 'అచ్చన్నవరదాళ్ళు బుచ్చికేశవులు' అను దానికున్నదని చెప్పారు.

> "అచ్చన్న వరదాళ్ళు బుచ్చి కేశవులు"
>
> — అసలురూపమేమి తిరుమలేశ?

ఆ పద్యం మా తాళ్ళపాక అన్నమయ్యదన్నచో మీ రూరకుందురా? ఏమనెదరు? అని నే నడిగాను. వారాశ్చర్యపడ్డారు. వారికి నా కడనున్న పాత కాగితముల పుస్తకములు చూపించాను. "వీనిని లోకానికి తెల్పడం మీ ధర్మం. దాచియుంచినందున లాభం లేదు. ఇవి అన్నమయ్య చిన్ననాటి రచన కావచ్చు. విశేషములు పరిశీలించి తెల్పండి అన్నారాయన ఆదరంగా. శ్రీ శర్మగారు చెప్పిన పారాంతరంలో 'అన్న' వున్నాడుగదా! అని ఆ తర్వాత పరిశీలనకు పూనుకొన్నాను.

ఆ పద్యాలలోని అంశాలు విశేషాలు తెలియుటకై తాళ్ళపాక గ్రామానికి 30–12–1979 తేదీ వెళ్లాను. అచ్చటనున్న వయోవృద్ధులును జ్ఞానవృద్ధులునైన పెద్దలను పిన్నలను విచారించాను. ఆ ప్రాంతమంతా తిరిగి తెలుసుకొన్న వివరాలను పద్యాలలోని ముఖ్యాంశములను లోకము దృష్టికి తెచ్చు ప్రయత్నమే నా ఈ వ్యాసరచన. యుక్తాయుక్తములు సత్యాసత్యములు విజ్ఞులే నిర్ణయింప వేడికోలు.

మా పెద్దల వ్రాతపుస్తకాలలోని పద్యముల ఫోటోస్టాట్ ప్రతులు చూడండి. ఆ వ్రాతలు చేయి తిరిగిన వారు వ్రాసినవి కావు. ఆడవారో లేక బాలురో వ్రాసియుండవచ్చు. పెద్దలు చెప్పగా వ్రాసికొన్నవో, తమ జ్ఞాపకమునకై వ్రాసికొన్నవో కావచ్చును. పరిశీలింతురుగాక! ఆ వ్రాతలలో లభించియున్న శతకములు ఇతర పద్యముల వివరము చూడుడు —

1. బుజ్జి చెన్నకేశవశతకము – తాళ్ళపాక అన్నమాచార్య కృతము. 7 పద్యములు.
2. సుదర్శన కృష్ణశతకము–తాళ్ళపా అన్నమాచార్య కృతము.
3. కృష్ణశతకము– చిన్ని కృష్ణశతకము
4. నరసింహశతకము – (?)
5. ఒంటిమిట్ట దశరథరామశతకము.
6. జానకీపతి శతకము –
7. ఏకశిలాపురీశ రఘువీరా! రామచంద్ర ప్రభూ! శతకము
8. ఒంటిమిట్ట శ్రీరాముని కీర్తనలు
9. యాదవేంద్రస్వామి కీర్తనలు
10. వేదాంత విషయములు

మొదలగు వానిని గూర్చినవి యున్న కాగితములు జీర్ణదశలో నున్నవి. బుజ్జి చెన్నకేశవ శతకము సీసపద్యరచన. సుదర్శన కృష్ణశతకము,కృష్ణశతకము రెండును కలిసియున్నవి. సుదర్శనకృష్ణమకుటముతో అయిదు పద్యములున్నవి. కృష్ణమకుటముతో ఎనభైకిపైన పద్యములున్నవి. అన్నియు కందములు. చిన్నకృష్ణ మకుటముతో సీసపద్యములున్నవి ఆరు మాత్రమే. అసంపూర్ణరచన నరసింహశతకము - మూడు పద్యములు భువనగిరి శ్రీ నరసింహా – శిఖినరసింహా (?) అను మకుటము.

ఈ శతక పద్యములలో 'చెన్నకేశవ' 'సుదర్శనకృష్ణ' - 'కృష్ణ' (?) చిన్ని కృష్ణ' - 'శ్రీ నరసింహా' శతకాలుమాత్రమే అన్నమయ్యవిగా తోచును. తక్కినవి ఇతర కవులవి. ఈ వ్యాసమున బుజ్జి చెన్నకేశవ శతకమును గూర్చిన విశేషాంశములు మనవి చేయుదును. సహృదయులు నెమ్మదిని సారాంశము గ్రహింతురుగాక:

### బుజ్జి చెన్నకేశవ శతకము —

లభించిన ఏడు పద్యములలో రెండు సంపూర్ణరచనలు. తక్కినవి అసంపూర్ణములు. ఉన్నదున్నట్లు వ్రాతలోని పద్యము, దానికి సాహసమున నేను చేసిన సవరణము తోడి పద్యము నిందు చూపుచు నాకు తెలిసిన వివరణము, విశేషములు తెల్పినాడను. గుణదోషములను ప్రాజ్ఞులు పరిశీలింపుడు.

1. పద్యము :– వ్రాతలో రచన —

సిన్న శెంబుతోనీళ్ళు సీకయ ఉదకంబు
  అల్లంబు బెల్లంబు అరటిపండు
తేనెతో మాపిన తియ్యమామిడి పండు
  బంగారు పిడికెళ్ళు పనసతొన్లు
సొగసిన ఔగులు సొజ్జలు కజ్జలు
  చక్కెర మండగ ఉక్కెరాళ్ళు
అర్సిలు సిమ్మిలులు దోసలు కల్లొసులు
  పాలకలేలకుల్లు ........ (పాలపొంగు)

పోణి బురడాలు గారెలు బూరె చుట్లు
అప్పాలు నా దప్పాలు పప్పు పాయాసాలు
అమ్మపంపెను అన్ని ఆరగింపన్న బుజ్జి
అన్నయ వరదాల్లుండు బుచ్చిన్న కేశాలు

పై పద్యమున పెక్కు దోషములున్నవని భావించాను. సవరించిన పద్యముచూడుడు.

చిన్న చెంబుతో నీళ్లు-సీకాయ యుదకంబు
  అల్లంబు, బెల్లంబు - అరటిపండు
తేనెతో మాపి (గి)న - తియ్యమామిడిపండు
  బంగారుపిడికిళ్లు - పనస తొనలు
సొగసిన యౌగులు - సొజ్జెలు, కజ్జలు
  చక్కెరమండెగ - ఉక్కెరాళ్ళు,
అర్సెలు, సిమ్మిలు - దోసెలు కల్లొసుల్
  పాల (న) క, లేలకుల్ –....పాలపొంగు

పోణి (ళి), బురడాలు, గారెలు-బూరె, చుట్లు
అప్పదప్పలు≡, పప్పును - పాయసములు
అమ్మపంపెను - ఆరగింపన్న! బుజ్జి
అన్నయ వరదాళ్ళుండు బు-చ్చెన్న కేశ!
(బుజ్జి + చెన్నకేశ)

ఈ పద్యములోని కొన్ని వస్తువులు అన్నమయ్య వేంకటేశ్వర శతకములోని వస్తువులు గమనింపుడు. రెండింటికి సామ్యమున్నది. వేంకటేశ్వర శతకమునలేని బంగారు పిడికెళ్ళు, సొజ్జలు, కజ్జలు, ఉక్కెరాళ్ళు, సిమ్మిలు, దోసెలు, కల్లొసులు, పాలకాయలు లేక ఏలకులు గల పానకము, పోణి, బూరె, చుట్లు, అప్పలు, దప్పలు, ఈ సీసపద్యమున సూచింపబడినవి. మఱియు పిండివంటలతో పాటు చిన్నచెంబు, నీళ్ళు, సీకాయ యుదకము, తేనెపూసిన మామిడి పండు, పనసతొనలు, అల్లము, బెల్లము, అరటిపండు లున్నవి.

వీనిలో కొన్ని నేటికీ తాళ్ళపాక ప్రాంతములో వాడుకలో నున్నవనీ, వాని అర్థములను ఆగ్రామవాస్తవ్యులు వృద్ధులు బ్రహ్మశ్రీ జంగా సుబ్బయ్య శాస్త్రిగారు, శ్రీ గూడూరు రంగరాజు మున్నగు పెద్దలు చెప్పారు. వాని వివరణము పరిశీలింపుడు. కొన్ని — మాపిన (మాగిన)=మాగుదలజేయబడిన- బంగారు పిడికెళ్ళు (?)-సొగసిన = ఇంపైన రుచిగల (వుడికిన) – ఔగులు (?) – కల్లొసులు(?)- బురడాలు = సుగీలు, ఉక్కెరాళ్లు = చక్కెర లేక బెల్లముతో బియ్యపు పిండి నుడికించి చేయునవి. తక్కినవి వారి కవగాహనమునకు రాలేదు. నేనూహించినవి కొన్ని పరిశీలింపుడు —

బంగారు పిడికెళ్ళు = పసిబిడ్డలచేతి పిడికిలి లోని కణగి వారు చప్పరించ గల్గిన భక్ష్యము. ఏదైన వృక్షఫలము కావచ్చు. 'పాలపండ్లు' అని యొకరన్నారు. చక్కెర మండెగలు = గోధుమరవతో చక్కెర కలిపి ముద్దచేసికుండబోర్లించియొత్తి, తట్టిచేసెడు

[29 వ పేజీలో]

యువవాణి

# భగవత్ప్రార్థన-గాంధీమహాత్ముడు

— విద్వాన్ కాశీభట్ల సుబ్బరామశర్మ

గాంధీమహాత్ముడు శాస్త్రపండితుడుగాదు. శాస్త్రప్రవచనములను సంస్కారములను చక్కగా అవగతము చేసుకొని ఆచరించువాడు. భగవంతునియందు భక్తిశ్రద్ధలు గలవాడు. శాస్త్రాదేశములను జీవితానుభూతులలో జోడించెడివాడు.

భగవన్నామ జపము, భగవత్ప్రార్థన ఇవి రెండును ఆధ్యాత్మికానుభూతికి మూలకందములు. గాంధీజీ ఒక దినమైనను భగవంతుని ప్రార్థింపక జీవితమును గడుపలేదు. వాతావరణము ప్రతికూలముగానున్నను దేహబాధలుగలిగినను, అనారోగ్యముతొ బాధపడుచున్నను, కడకెట్టి పరిస్థితులలోను ప్రార్థన మానువాడుగాడు. ప్రయాణము చేయుచున్నపుడు ఒక్కొక్కవేళ 12 లేక 1 గంట వఱకు మేలుకొనవలసియుండును. అప్పుడు బ్రాహ్మముహూర్తమున లేచి దైవప్రార్థన సేయువాడు. భగవంతుని స్మరణతోనే వారి దైనందిన కార్యములారంభమగుచుండును. ఇది వారి దైనిక జీవితనియమము గూడ.

వారి ఆశ్రమమున ప్రాతస్సాయంకాల ప్రార్థనలు తప్పక జరుగుచుండును. గాంధీజీ దానిలో పాల్గొనుచుండును. వారి ప్రాతఃకాలిక ప్రార్థనలో హిందూమతమునందలి భిన్నత్వములోని ఏకత్వము, పలువిధములగు ఈశ్వర సాధనలు గోచరించుచుండును. వానియందు భక్తిజ్ఞాన కర్మలు మూడును మిళితములై యుండును. వీరి ప్రార్థనలందు దేవతలందఱును స్మరింపబడుదురు. ఈ ప్రార్థన అంతస్థమగు బ్రహ్మతత్త్వ ఆత్మతత్త్వ స్మరణతో మిళితమైయున్నది.

ప్రాతః స్మరామి హృది సంస్ఫుర
దాత్మతత్వం
సచ్చిత్సుఖం పరమహంస గతిం
తురీయమ్ ।
యత్స్వప్న జాగర సుషుప్తి మవైతి
నిత్యం
తద్బ్రహ్మ నిష్కళమహం న చ
భూతసంఘః ॥

ప్రాతః స్మరామి తమసః పరమర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్త
మాఖ్యమ్ ।
యస్మిన్నిదం జగదశేష మశేషమూర్తే
రజ్జ్వాం భుజంగమ ఇవ ప్రతిభాసితం వై ॥

ప్రాతర్భజామి మనసో వచసా మగమ్యం
వాచోవిభాంతి నిఖిలాయదనుగ్రహేణ ।
యన్నేతి నేతి వచనై ర్నిగమా అవోచం
స్తం దేవ దేవ మజ మచ్యుత మాహు
రగ్ర్యమ్ ॥

ఈ ప్రార్థన జరిగిన పిమ్మట విరాట్ స్వరూపిణియు సముద్రవస్త్రయు పర్వతస్తనమండలయునగు భూదేవిని స్మరింతురు. అటుపై గణపతిని స్మరించి సరస్వతికి ప్రణమిల్లుదురు. అనంతరము త్రిమూర్తి స్వరూపుడగు గురువుకు వందనముచేసి నారాయణ పరమేశ్వరుల నర్చించి

కరచరణ కృతం వా
కాయజం కర్మజం వా ।
శ్రవణ నయనజం వా
మానసం వాపరాధమ్ ॥
విహిత మవిహితం........

అని క్షమార్పణ యాచరింతురు.

భగవచ్ఛరణాగతి భావనతోనే ప్రార్థనయంతయు మిళితమైయున్నది. కులమత





# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

**సుప్రభాతం** — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

**సహస్రనామార్చన** — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

**నిత్యఅర్చన** — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

**శుద్ధి, మొదటి గంట** — ఉ. 6-00 గం॥ నుండి 6-30 గం॥ వరకు

**సర్వదర్శనం** — ఉ. 6-30 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

**శుద్ధి, రెండవగంట** — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

**సర్వదర్శనం** — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

**శుద్ధి, రాత్రికైంకర్యము** — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

**సర్వదర్శనం** — రా. 7 30 గం॥ నుండి 8-45 గం॥ వరకు

**శుద్ధి** — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

**ఏకాంతసేవ** — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం—ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 11-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్‌సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00

సహస్రనామార్చన: రూ. 6-50

నిత్యఅర్చన: రూ. 150-00 (ఏడాదికి)

అర్చన: రూ. 1-00

హారతి: రూ. 0-50

పూరాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00

ఊంజల్‌సేవ (శుక్రవారాలలో) రూ. 150-00

తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00

గజవాహనం: రూ. 32-00.

భేదముల బాటింపని గాంధీజీకిని వర్ణాశ్రమ వ్యవస్థలో అభిమానమున్నట్లు గోచరించును. సంప్రదాయబద్ధుడగు హిందువువలె గాంధీమహాత్ముడును-

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు॥

అను శ్లోకమును ప్రతినిత్యమును పలుమారు చదువుచుందురు. మొదట గోబ్రాహ్మణుల శుభమును గోరినపిమ్మటనే సమస్త మానవ కల్యాణమును గాంక్షింతురు.

గాంధీగారి సంధ్యాప్రార్థనయు బ్రహ్మ వరుణ రుద్రేంద్ర పవనులచే ప్రస్తుతింపబడువాడును, సామవేదమును గానము చేయు మునిగణముచే బొగడబడువాడును, అనేక రూపములతో అనేక క్షేత్రముల నిండినట్టివాడగు భగవంతుని ప్రణుతితో ప్రారంభమగుచున్నది.

భగవద్గీతలోని ద్వితీయాధ్యాయమందలి 54 నుండి 72 వ శ్లోకము వఱకుగల స్థితప్రజ్ఞ లక్షణముల మానసిక వైజ్ఞానిక దృష్టితో మననము చేయుదురు. వీనిని అర్జునుడడిగిన పిమ్మట శ్రీకృష్ణభగవానుడు వివరించినాడు. ఆశ్లోకములు జదువుట, అర్థమును భావించుట సాయంకాల ప్రార్థనలోని విశేషము. ఈ స్థితప్రజ్ఞతయే గాంధీమహాత్ముని కాదర్శప్రాయమైనది. వారు భగవద్గీతను జీవితసమస్యల పరిష్కరించి జీవితపథమును నిష్కంటకముజేసి ప్రకాశమునిచ్చు దానినిగా భావింతురు. భగవద్గీత నాకు శాశ్వత మార్గదర్శిక. ప్రతి విషయమును నేను గీతయందన్వేషింతును. గీత విజ్ఞానభాండారము అని వారు పలుమారు ప్రవచించినారు. మానవ ధర్మసాధనలో గీత మిక్కిలి సహకరించునని వారి దృఢమైన విశ్వాసము. కావుననే వారు సంధ్యాకాల ప్రార్థనలో గీతా శ్లోకములు జదువుదురు. ప్రార్థించుటయన యాచించుటగాదు. అది ఒక ఆత్మసంరక్షణా భావము. సమస్తమును పరమేశ్వరునిపై నుంచి వారినే విశ్వసించి భావనానుసారము ఫలితమును బొందుటయే ప్రార్థనయని వారి అభిప్రాయము. మన మొక మానవుని కొకవుత్తరమును వ్రాసితిమనుకొనుడు. దానికి ప్రత్యుత్తరము రావచ్చును, రాక పోవచ్చును. కడకు జాబు ఒక కాగితపు ముక్కయేగదా. పరమేశ్వరునికి జాబు వ్రాయుటకు కాగితముగాని కలముగాని ఎట్టిదియు అవసరముండదు. ఈశ్వరునికి వ్రాసిన లేఖకు ప్రత్యుత్తరము రాకపోవుట జరుగదు. దానిని లేఖయనము. అదియే ప్రార్థన. పూజయనబడును. ప్రతిదినమును ఆలయమునకువెళ్ళి పలువురిట్టి పత్రముల వ్రాయుచుందురు. వారి వారి భక్తిశ్రద్ధల బట్టి భగవంతుడు ప్రత్యుత్తర మిచ్చుచుండును. భక్తుడెటువంటివాడైనది అతని శ్రద్ధయే ప్రమాణమగుచున్నది. అతని ప్రార్థనయందే ఉత్తరము చేరియుండును. ప్రార్థన నిశ్చయముగా ఆత్మవ్యాకులతను వ్యక్తముచేయును. ప్రార్థన పశ్చాత్తాపమున కొక చిహ్నముగూడ. అని గాంధీగారు చెప్పుచుందురు.

ప్రార్థనగాని భజనగాని నాలుక నుండి కాక హృదయము నుండి బయలుదేరవలయును. దీనివలనమూగవారు, స్పష్టముగానుచ్చరింపలేనివారు, మూఢులును ప్రార్థింపగలుగుదురు. నాలుకపై అమృతము, హృదయమున హాలాహల ముండిన లాభమేమి? జిహ్వపైనుండు అమృత మెందులకు కొఱయగును? కాగితపు పూవు నుండి సువాసన వెడలునా? అని గాంధీగారొక పత్రికలో వ్రాసిరి.

గాంధీజీ 1927 సెప్టెంబరు తమిళనాడులో పర్యటించునపుడు ఒక లేఖలో ఇట్లు వ్రాసిరి. "శరీరమునకు భోజన మవసరమైనట్లు ఆత్మకును ప్రార్థన అత్యావశ్యకమైయున్నది. మానవుడు భోజనములేక కొన్ని దినములు జీవింపగలడు. కాని పరమాత్మయందు విశ్వాసముగల మానవుడు ప్రార్థన లేక ఒకక్షణమైనను జీవింపజాలడు. చాల మంది ప్రార్థన చేయకయే జీవించుచున్నారుగదా అని మీరు నన్ను ప్రశ్నింపవచ్చును. కాని వారి జీవితము పశుజీవితమే. అంతకంటెను అధమమైనదన వచ్చును."

గాంధీజీ సభలను సమావేశములను భజనతో ప్రారంభించుచుండును. ఈశ్వర ప్రేరణయే దానికి హేతువనెడివారు. వారి జీవితము ప్రజాసేవ భక్తిమయమే.

ఆపదలు చుట్టుముట్టినపుడు గ్రాహగ్రస్త గజేంద్రునివలె (మొసలిచే బట్టుబడిన మదపుటేనుగువలె) భగవంతు నాహ్వానించుచుండును. అతని హృదయమును రోదించుచుండును. బాలకుడు అమ్మను పిలిచినట్లు వారు భగవంతుని పిలుతురు. రామనామమును పలుకుచు భజించుచు పరవశులగుచుందురు.

మామేకం శరణంవ్రజ - అను భగవద్వాణి యుగయుగముల నుండి శ్రవణకుహరముల ఘోషించుచున్నది. అన్నిటిని వదలి నన్ను శరణుబొందుము. ప్రభు ద్వారమును తట్టుము. తప్పక నీకై తెరువబడునురమ్ము! ప్రభువును శరణుబొందుము. అంతయును మఱచి అతనినాహ్వానింపుము. ఏడ్చుము. పిలువుము. నిండుమనసున బిలువుము. అతడు తప్పక వినును. నీ సమస్యల చక్కగా పరిష్కరించును. నీ దుఃఖములు దూరమగును. పరితాపములు తొలగిపోవును. అని గాంధీజీ జీవితమంతయు ఎలుగెత్తిచాటెను.

(మహాత్ముని మహనీయస్మృతిగా చిహ్నంగా ప్రచురింపబడింది. సం॥)

★

## సనాతన మతం

మతము- విజ్ఞాన శాస్త్ర గుంఫనము లేక
గ్రుడ్డిదగును- సమ్యగ్దృష్టి కోలుపోయి
మహిత శాస్త్ర విజ్ఞానమ్ము- మతము లేక
కుంటిదగును. చైతన్యమ్ము కోలుపోయి

—ఐన్‌స్టైన్.

నేడు- హేతువాదానికి మతానికి సహజ వైరుధ్యం ఉన్నట్లు కొందరు భావిస్తున్నారు. విజ్ఞానశాస్త్రం హేతువాదాన్ని అంగీకరిస్తుందనీ మతం తిరస్కరిస్తుందనే భావం అట్టివారిలో కన్పిస్తుంది.

హేతువాదాన్ని అంగీకరించక పోతే- విజ్ఞానశాస్త్రం శాస్త్రమేకాదు. కానీ- మతం హేతువాదాన్ని తిరస్కరిస్తూందనే మాట మాత్రం యథార్థంకాదు. నిజమైన అనుభూతి మనుజప్రకృతిలో హేతువాదాన్ని తిరస్కరించదు. సత్యాన్వేషణమే మతానికి సయితం ధ్యేయం. సత్యాన్వేషణ లేని మతానికి విలువలేదు. సత్యం ఎప్పుడూ హేతువాదాన్ని తిరస్కరించదు.అయితే- హేతువాదం అందుకోలేని సత్యం ఉండవచ్చు. ఆఅనుభూతి హేతువాదానికి అతీతమైనదే కావచ్చునుగాని వ్యతిరేకమైనది మాత్రం కాదు; కారాదు. మతం ప్రతిపాదించే ఆధ్యాత్మికానుభూతి ఈ కోవకు చెందినట్టిది. అది అనుభవైక వేద్యం అంటారు యోగీశ్వరులు.

సత్యాన్వేషణమే విజ్ఞానశాస్త్రానికి ధ్యేయం. మతానికి ఏకైక ధ్యేయం సత్యాన్వేషణమే. ఇంత వరకు ప్రపంచ చరిత్రలో విజ్ఞాన శాస్త్రం సాధించింది ఖండసత్యాలు మాత్రమే. సంపాదించింది జ్ఞాన శకలాలు మాత్రమే. విజ్ఞాన శాస్త్రవేత్తలలో నిరుపమాన శేముషీ ధురంధరుడుగా పేరుగాంచిన న్యూటన్ మహాశయుడు చెప్పిన మాటలు ఉదాహరింప దగినట్టివి.

"విజ్ఞాన సాగర సైకతస్థలాలలో గులకరాళ్లు కొన్ని ఏరుకునే డింభకులలో నేను ఒకణ్ణి అని నాభావన"

—న్యూటన్.

అందుచేత- విజ్ఞాన శాస్త్రం నైసర్గికంగా నిరంతర పరిశోధనలో నిమగ్నమై ఉండ వలసినట్టిదేగాని- ఆ అన్వేషణకు పరిపూర్ణ సిద్ధి అనేది లేదు. విజ్ఞాన శాస్త్రధ్యేయం అందని ఆకాశమే. విజ్ఞాన శాస్త్రం ఎల్లలు సదాఎదుగు నట్టివే. అందుచేత విజ్ఞానశాస్త్రం మనిషివెంట- జీవిత మహా ప్రస్థానంలో తోటి బాటసారిగ కొంతదూరం మాత్రమే రాగలదు. మానవునితోపాటు చిట్టచివరివరకు మరణ సమయం వరకూ మాత్రమేగాక మరణానంతర జీవిత యాత్రలో గూడ సహయాత్ర సాగించేది మతం ఒక్కటే అంటారు అధ్యాత్మవిదులు.

"జాతస్యమరణం ధ్రువం"- "పుట్టినట్టి ప్రాణి గిట్టి తీరు."

# వెలుగుబాట

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

అయితే- "చావటం కోసమేనా యీ బ్రతుకు?"- "పుట్టటం ఎందుకు?? మరి గిట్టటం ఎందుకు??" మరణం అనేసరికి ఇహలోకంలో మనిషి పెంచుకొన్న మమకారబంధాలు అన్నింటినీ తెగతెంపులు చేసుకోటమేగద. అది ఎంతటి దుర్భర కఠోర వృత్తం?

మరణముండు వరకు - మనుజలోకములోన
మతము అవసరమ్ము మానవులకు;
జనన మరణ జన్మ సాఫల్య యోగముల్
మతము చెప్పు గుట్టుమట్టు విప్పి.

"చావు" అనేది ఈ శరీరానికి మాత్రమే గాని- ఆత్మకు కాదనీ, "ఆత్మ" నిత్యము- నిర్వికల్పము- నిరంజనము- నిరవధికము- నిర్వికారము- సనాతనము- శాశ్వతము అనే ఊరట కల్పిస్తుంది- మతం.

"మనిషి, చినిగిపోయిన పాతబట్టలు విడిచిపెట్టి, క్రొత్తబట్టలు కట్టుకునేటట్లె, ఆత్మ సదా నూతన శరీరాలు ధరిస్తుంది అంటుంది భగవద్గీత. ఇక- భీభత్స భయానక మృత్యుదేవత- కోరలు పీకివేసిన త్రాచుపామువలె- ఒక ఆట వస్తువు అవుతుంది. ఆధ్యాత్మికానుభవ సంపన్నులకు మరణం వివృత స్వేచ్ఛా స్వర్గధామమే. మానవ కోటికి మతం చేసే ప్రాథమిక మహోపకారం, మృత్యువేథలోని భీకర భయాందోళనలు ఉపశమింప చేయటమే. సమాజ జీవితంనుండి మతాన్ని బహిష్కరిస్తే మానవుల మరణశయ్యలు దుర్భరం చేయుటమే కావచ్చు. మతరహిత సమాజంలో ప్రతిమానవుని మరణం చివరకు ఉరిశిక్షగా పరిణమించవచ్చు.

మానవులు- జీవితయాత్రలో ఎదుర్కోవలసిన విపత్తు ఒక్క మరణం మాత్రమే కాదు. మనిషి బ్రతుకు ఏటికి ఎదురీత. మానవ జీవితం బహుళ విపత్పరంపరావిలమైంది. అయితే చిచ్చర పిడుగులు కురిసే ఝంఝూ ప్రభంజనాలను చల్లనివెన్నెల వడగళ్లు విరిసే కమ్మతెమ్మెరలుగా మార్చే మహిమ మతానికి మాత్రమే ఉన్నదన్నమాట యుగయుగాంతరాలుగా మానవులందరకూ అనుభవైకమేడితం.

మాటవరసకు- మతం కేవలం సాంఘిక ప్రయోజన సాధనకోసం మనిషి సృష్టించుకున్న ఒకానొక వ్యవస్థ మాత్రమే అనే వాదాన్ని అంగీకరించి నప్పటికీ విశ్వకల్యాణానికి మతాన్ని మించిన మరో ఉత్కృష్ట పరికరం లేదు అని చెప్పవలసి వస్తుంది. బహుశః ఈ అర్థంతోనే కాబోలు హేతువాద సిద్ధాంతానికి తన జీవిత సర్వస్వం అంకితం చేసుకున్న ఫ్రెంచి వేదాంతి వోల్టేరు, "ఒక వేళ భగవంతుడు లేక పోతే జగద్ధితంకోసం- అతనిని సృష్టించ వలసిన ఆవశ్యకత ఉంది" అన్నాడు. "విశ్వశ్రేయః కావ్యమ్" అన్నారు ఆలంకారికులు. కళలు- లలితకళలు- సకలశాస్త్రాలు- సమస్తవిద్యలూ మానవ శ్రేయానికేగదా అంకితమైనాయి. అధ్యాత్మ వేత్తలు, "విశ్వశ్రేయః మతం" అనే అన్వర్థసూత్రం ప్రతిపాదిస్తారు.



# కళావని

# నాదోపాసక చక్రవర్తి స్వాతి తిరునాళ్

శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు

జీవకోటిలో మానవజన్మ విశిష్టమైనది. మానవులలో జ్ఞాని విశిష్టుడు. జ్ఞానం వ్యక్తిని భక్తుడుగాను, త్యాగిగాను, విరాగిగాను సంస్కరించి ముక్తికి అర్హుణ్ణి చేస్తుందని గీత మొదలైన ధర్మశాస్త్రాలు చెబుతవి. ఈ సంస్కారం పరంపరగా జన్మజన్మాంతరాలకు వికసిస్తూ ఒకనాటికి కైవల్యం చేరుస్తుందని సనాతన ధర్మం చెబుతుంది. బాల్యంలోనే మిక్కిలి మేధావులను, పరమభక్తులను, సర్వసంగ పరిత్యాగులను అప్పుడప్పుడు మనంచూస్తూ ఉంటాము. ఆశ్చర్యపడుతూ ఉంటాము. హేతువాదానికందని అద్భుతగుణాలు కొందరు ప్రదర్శించడం, బాల్యంలోనే పరమభక్తులుగా, దైవశరణాగతిపొందడం లోకంలో కనబడుతుంటుంది. ఐశ్వర్యం, అధికారం, వయస్సు — ఈ మూడు ఉన్నచోట వినయవిధేయతలు అరుదుగా కనబడుతూ ఉంటవి. వయసు ముదిరితే దైవభక్తి, తత్త్వచింతనవైరాగ్యభావం — అబ్బదనే అభిప్రాయం లోకంలో బలంగా ఉంది. కాగా, పిన్నవయస్సులోనే అపారమేధా సంపదతోపాటు, దైవభక్తి నిరాడంబర జీవనం, దయార్ద్రహృదయం వీటన్నిటితోపాటు ఏదో ఒక కళారాధన లభ్యం కావడం జన్మాంతర వాసనాఫలితమే నని భగవద్గీత చెబుతుంది.

"పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య
శబ్దబ్రహ్మాతివర్తతే॥ (భ. గీ 6-44)

(పూర్వజన్మలోని అభ్యాసబలంవల్ల వ్యక్తి తాను ప్రారంభించిన యోగసాధన కొనసాగిస్తూ సాధ్యవిషయంపైపు అప్రయత్నంగా ఆకర్షింపబడతాడు. జిజ్ఞాసువు కూడా కర్మబద్ధుడుకాక తత్త్వవివేచనచేత పరమశాంతి పొందడంలో సామాన్య సాధకులను మించుతాడు). ఇందుకు తార్కాణం ఇటీవలనే పందొమ్మిదవ శతాబ్దంలో (1813-1846) తిరువాన్కూరులో ముప్పైమూడేండ్లు మాత్రమే జీవించి ధన్యుడైన ఒక రాజకుమారుడు. బ్రదికింది కేవలం ముప్పైమూడేండ్లే. అందులో పదిహేడు సంవత్సరాలు రాజ్యపాలనచేశాడు. భక్తిమార్గంలో అపరప్రహ్లాదు డనిపించుకున్నాడు. కళాపోషణలో భోజునికి దీటు. సంగీతకళలో త్యాగరాజుసరసన కూర్చోబెట్ట దగినవాడు. ఆయనకు సమకాలికుడే. ఇతని జీవిత విశేషాలు అద్భుతాలు.

రాజరాజవర్మ లక్ష్మీబాయి అనే రాజదంపతులకు 1813 ఏప్రిల్ 16వ తేదీ స్వాతి తిరునాళ్ జన్మించాడు. వీరు తిరువాన్కూర్ పరిపాలిస్తున్న రాజవంశంవారు. జన్మనక్షత్రం స్వాతి కావడంవల్ల వీరికి స్వాతి తిరునాళ్ అని పేరు పెట్టారు. శైశవంలోనే సంగీతంపట్ల సాహిత్యంపట్ల వీరికిగల ఆకర్షణను గుర్తించి పండితులచేత సాహిత్యసంగీతాలలో ఆదర్శ శిక్షణ ఇప్పించారు తల్లిదండ్రులు. బాల్యంలోనే దైవభక్తి జ్ఞానపిపాస కలగటంవల్ల, దానికితోడు కవిత్వబీజాలు హృదయంలో ఉండటంవల్లను గానం, కవనం రెండూ రెండు చేతులుగా వీరి కృషి సాగింది. మళయాళం మాతృభాష అయినా సంస్కృతం పైపే మొగ్గు. తెలుగు, కన్నడ, తమిళ, మరాఠీ, హిందీ భాషల్లో గూడా చక్కని ప్రవేశం కలిగింది, వీరికి. అయినప్పటికీ రచనలు దాదాపు అన్నీ సంస్కృత భాషలోనే జరిగినవి. మరాఠీ, మళయాళంలో ఏకొద్దో ఉన్నవి. సంస్కృత వాగ్గేయకారుడుగానే వీరిని చెప్పడం సముచితం.



'తనయందు నిఖిల భూతములందు ఒక భంగి సమహితత్వంబును సలుపువాడు'

అన్న ప్రహ్లాదుని వంటి మనస్తత్వం గల ఈ స్వాతి పదహారేండ్ల ప్రాయంలో రాజ్యపరిపాలనకు వచ్చి ప్రజాహిత కార్యక్రమాలను చిత్తశుద్ధితో అమలు జరిపి "రాజామాతా పితాచైవ, రాజా హితకరో నృణాం" అన్నట్లు రామరాజ్యం గుర్తుకు తెచ్చాడు. బ్రిటీషువారికే కన్నుకుట్టింది. వారి పర్యవేక్షణలో ఉన్నసంస్థానం కాబట్టి ఆంగ్లేయాధికారులు వీరిని అనేక ఇక్కట్ల పాలుచేసి స్వేచ్ఛను అరికట్టడం జరిగింది. లేకపోతే వీరు త్యాగరాజస్వామిని దర్శించి ఉండేవారని చెప్పుకొంటారు. త్యాగరాజు శిష్యులనేకులు వీరి ఆస్థాన గాయకులుగా ఉండేవారు. తిరువనంతపురంలోని పద్మనాభస్వామి వీరి ఇష్టదైవం. కులదైవం కూడా. బ్రిటీషువారి బాధలు సహించలేక పద్మనాభునిశరణుజొచ్చి పద్మనాభముద్రతోనే తనకృతుల నన్నింటినీ రచించినారు. నాలుగువందలకు పైగా పద్మనాభాంకితమైన కృతులు నేడు ప్రచారంలో ఉన్నాయి. సంగీతంలోని హిందుస్తానీ కర్ణాటక, మరాఠీ బాణీలలోను, వర్ణం, కృతి, పదం, తిల్లానా మొదలైన ప్రక్రియల్లోను వీరి కృతులున్నాయి. శైలి ప్రక్రియా వైవిధ్యంలో వీరుసంగీతమూర్తి

త్రయం చేయని సేవ కూడా చేశారని చెప్పాలి. ఆ ముగ్గురు మూర్తుల సరసన కూర్చుండబెట్టి నలుగురిని గాయకచతుష్టయం అనాలనిపిస్తుంది. భక్తి, రక్తి, శక్తి, మూడు గుణాలు వీరి రచనల్లో సమృద్ధిగా దొరుకుతాయి. వీరు జన్మించేటప్పటికి త్యాగయ్యగారి వయస్సు 46 సంవత్సరాలు. వారు సిద్ధిపొందడానికి పన్నెండురోజులు ముందుగానే వీరు 25-12-1846 నాడు స్వర్గస్థులైనారు. 'సుకృతీగతాయుః' అన్నట్లు ముప్పైమూడేండ్ల వయస్సుకే ముప్పైమూడుకోట్ల దేవతల అంతరంగాలను వశం చేసుకొని నాదోపాసన ద్వారా కైవల్యంచెందారు. వీరి సంగీత సాహిత్య ప్రతిభను గురించి ఒక్క కృతి వివరిస్తే చాలు. తేటతెల్లముగా ఒక్క మాటలోన అన్నట్లు 'భావయామి రఘురామం' అనే కీర్తన స్వాతితిరునాళ్‌దే. రామాయణమంతా ఈ కృతిలో ఉండకట్టివేశారు. ఆ సంస్కృత రచన, దివ్యగంగాప్రవాహమే చదవండి.

### సావేరి – రూపకతాళం

పల్లవి

"భావయామి రఘురామం
భవ్యసుగుణారామం ॥ భావయామి ॥

అనుపల్లవి

భావుకవితరణపర - భాగ్యలీలా లసితం
॥ భావయామి ॥

చ॥ 1. దినకరాన్వయ తిలకం
దివ్యగాధి సుతసవనా
వనమహితసుబాహువధ
మహల్యాశాపవిమోచనం
అనఘమీశచాపభంగం
జనకసుతా ప్రాణేశం
ఘనకుపిత భృగురామ
గర్వహరమిహ సాకేతం ॥ భావయామి ॥

2. విగతాభిషేకమథ-విపినగతమార్యవచ
సహితసీతాసౌమిత్రి-శాంతతను శీలం
గుహనిలయగతంచిత్ర
కూటాగత భరతదత్త
మహితరత్నమయ పాదుకం
మహితసుందరాంగం ॥ భావయామి ॥

3. వితతదండకారణ్యక
గతవిరాధఖననం
సుచరితజటాజటిల
మపరిమితవైష్ణవ వ్యక్తం
ఫలితవరజఘాయునుతం
పంచవటీవిహితవాసం
అతిఘోర శూర్పణఖా
వచనాగత ఖరహరం ॥ భావయామి ॥

4. కనకమృగరూపధర
ఖలమారీచహరణం
జనవినుతం దశాస్యహృత
జనకజాన్వేషణం
అనఘపంపాతీరసంగ
తాంజనేయనభోమణి
తనుజసౌఖ్యకరం వాలి
తనుదళనమీశం ॥ భావయామి ॥

5. వానరోత్తమ సహిత
వాయుసూను కరార్పిత
భానుదీప్తియుత భవ్య
రత్నాంగుళీయం
తేనపునరానీతం దివ్య
చూడామణి దర్శనం
శ్రీనిధిం పదాతిం
దీనాశ్రిత విభీషణం ॥ భావయామి ॥



హైందవ సంస్కృతిలో రంగవల్లులకు ఎంతో ప్రాముఖ్యం వుంది. ముగ్గులు లక్ష్మీ కరములని మనవారి పవిత్రభావం. అందులకే ఇంటిముంగిటా, ఇంట్లో, ధ్యానమందిరాల్లో, దేవాలయాల్లో, భజనమందిరాల్లో మున్నగు ప్రతిచోటా ముగ్గులు చోటుచేసుకున్నాయి. అంటే ముగ్గులు కేవలం అలంకారానికేకాక ఆధ్యాత్మికతకూ ప్రతీక. కనుకనే వ్రతాలు, నోములు, ఉత్సవాలు జరిగే ప్రతిచోటా ఈరంగవల్లులు చోటు చేసుకున్నాయి.

తిరుమల శ్రీవారి ఆలయంలో దేవస్థాన కళాకారులు రంగవల్లులను కన్నుల పండువగా తీర్చిదిద్దారు.

6. కలితపరసేతు బంధం
ఖలనిశిచరగ్భ్యాదదళనం
అతిక్రూరదశకకంఠ విదారం-అతిధీరం
జ్వలనపూత జనకసుతా
సహితమిహసాకేతం
విలసితపట్టాభిషేకం
విశ్వపాలం పద్మనాభం ॥భావయామి॥

ఈ కీర్తన సంక్షేప రామాయణం అని చెప్పవచ్చు. రాగమాలికలో పాడుతూ ఉంటారు దీన్ని. కుచేలోపాఖ్యానం అజామిళో పాఖ్యానం అనే రెండు సంస్కృత యక్షగానాలు కూడా వీరురచించారు. అంతేగాక పై రామాయణ కీర్తనలాగానే భారత కీర్తన, భాగవత కీర్తనలుకూడా రచించారు. అనేక కీర్తనల్లో హరిహరాద్వైత స్వరూపాన్ని గూడా భావించారు. నాట్యానికి అనువైన తిల్లానాలు, పదాలు, జావళీలు, అన్నీ దైవోన్ముఖంగానే ప్రవహించాయి. భారతదేశ చరిత్రలోనే ఇటువంటి ప్రజ్ఞాశాలియైన వాగ్గేయకారుడు లేడనడం అతిశయోక్తి కాజాలదు.

'యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ
తత్కురుష్వ మదర్పణం, (భ.గీ.9-27)

అన్న గీతాచార్యుని వాక్యం శిరసావహించి తాను చేసిన పనులన్నింటినీ పద్మనాభార్పణంగానే సమర్పించి భక్తులకు భక్తి, గాయకులకు సంగీతం, జిజ్ఞాసులకు తత్త్వం, ఆర్తులకు శరణాగతి, — అన్నింటినీ వెదజల్లి చిరంజీవిగా సంగీతలోకంలో ఒక ఉజ్వల తారగా నిలిచిన స్వాతితిరుణాళ్ మహారాజా నిజంగా సంగీత త్రిమూర్తుల సరసన నాలుగవవాడుగా వారికి ముద్దుల తమ్ముడుగా వెలుగొందుతుంటాడు.

జయంతి సుకృతిన స్తే రససిద్ధాః మనీషిణః

# సప్తగిరి విక్రేతలు

## తూర్పుగోదావరి జిల్లా

శ్రీ బాదం ప్రభాకరరావు,
మెయిన్ రోడ్డు, కాకినాడ -533 001.

శ్రీ కె. శ్రీరాములు,
శ్రీ సత్య వీరభద్ర ఏజన్సీ,
న్యూస్ ఏజంటు అండ్ బుక్‌సెల్లర్,
జామ్‌పేట, పెద్దవీధి,
రాజమండ్రి - 3.

శ్రీ ఎన్. ఆర్. బ్రహ్మానంద,
ముక్తిలింగంవారి స్ట్రీట్, తుని- 533 401.

శ్రీ వేలంకణి శ్రీనివాస్,
బాలాజీ స్టూడెంట్సు సెంటర్,
మెయిన్ రోడ్డు, గాడేపల్లి వారి ఇల్లు.
రామచంద్రాపురము - 533 255.

## పశ్చిమగోదావరి జిల్లా

శ్రీ పి. జె. వి. రామానుజాచార్య,
శ్రీ క్రిష్ణా అండ్ కో, బుక్‌సెల్లర్స్ అండ్
బైండర్సు, శ్రీ క్రిష్ణాభవన్,
రైల్వేస్టేషన్ రోడ్డు,
తాడేపల్లిగూడెం - 534 101.

శ్రీ బి. శివరామకుమార్,
కుమార్ న్యూస్ ఏజన్సీ,
రామమహల్ ఎదురుగా, ఏలూరు-534 002.

శ్రీ టి. వెంకటగిరి నరసింహమూర్తి,
మోర్తా - 534 227.

శ్రీ టి. వెంకటరమణ,
దేవునితోట స్ట్రీట్, రాయపేట,
నరసాపూర్ - 534 275.

శ్రీ సి. గోపాలాచార్యులు,
మల్లవరం పోస్టు, (వయా) నరసాపురం.

శ్రీ కర్రి గంగాధరరెడ్డి,
అర్జునుడుపాలెం పోస్టు - 534 217.

శ్రీ కె. వెంకటేశ్వరరావు,
కన్నూరు - 534 329.

శ్రీ బి. వెంకటరత్నం,
న్యూస్ ఏజెంటు, మెయిన్‌రోడ్డు,
పెనుగొండ - 534 320.

శ్రీ బంగారు సీతారామాంజనేయగుప్తా,
S/o శ్రీ బి. రామకృష్ణారావు,
మెయిన్‌రోడ్డు, పాలకొల్లు - 534 260.

## నల్గొండ జిల్లా

శ్రీ వై. దీనదయాళ్,
తిర్మల్‌గిరి - 508 223.

శ్రీ పి. బాబురావు,
S/o శ్రీ డి. శ్రీనివాసులు,
కొబ్బరికాయల దుకాణం,
యాదగిరి దేవస్థానము, యాదగిరిగుట్ట.

## నిజామాబాద్ జిల్లా

శ్రీ కె. వెంకటస్వామి,
6-2-20, సుబాష్‌నగర్,
నిజామాబాద్ - 503 002.

శ్రీ పి. ఛత్రయ్య,
దారావల్లి పోస్టు - 503 165.

శ్రీ ఎన్. రాజేశ్వర్,
న్యూస్‌పేపరు డీలరు, ముప్కాల్-503 222.

శ్రీ వై. రాజలింగం హరిదాస్,
C/o డా॥ గోస్కే రాజయ్య,
స్టేషన్ రోడ్డు, కామారెడ్డి పోస్టు.

## నెల్లూరు జిల్లా

శ్రీ ఎ. సాయిబాబా,
C/o శ్రీ వెంకటకృష్ణయ్య,
న్యూస్ ఏజెంటు, అల్లూరు - 524 315.

## ప్రకాశం జిల్లా

శ్రీ దిట్టకవి వేంకటరామానుజాచార్యులు,
వాసవి కన్యకా పరమేశ్వరి దేవాలయం,
పిడుగురాళ్ళ.

శ్రీ సి. సుబ్బరాయులు,
శ్రీ సత్యనారాయణ ఏజన్సీ,
4-8-96, గిద్దలూరు. - 523 357.

శ్రీ జి. వి. సుబ్బారావు,
రావు అండ్ రావు ఏజన్సీస్,
కొవ్వూరు - 523 105.

శ్రీ కోడూరి వెంకట సుబ్బారావు,
ఎల్. ఐ. సి. ఏజంటు, ఉప్పుగుండూరు.

శ్రీ యస్. వి. రమణయ్య,
సకల బుక్‌షాపు.- మార్కాపురం- 523 316.

(స్థలాభావంవలన ఈ జిల్లాలోని మరికొన్ని చిరునామాలను ప్రచురించలేకపోతున్నాము. సం॥)



# వనమాల

స్వామీ, వేంకటనాథ, త్వచ్చరణ కంజాత ద్వయీ సేవనో
ద్దామోన్నిద్రమతిన్ త్వదీయ గుణగాథా వర్ణయ ద్గీతికా
శ్రీమాధ్వీరస పాన విస్మృత శరీరిన్ నాదు మూర్ధమ్మునన్
ప్రేమాశీర్నవ కుంకుమాక్షతల వర్షింపం గదే ప్రొక్కెదన్.

దేవా, తావక చిత్కళాంశమును వర్తింపంగ నీ వయ్య మ
ద్భావ వ్యోమ తలమ్మునందున జడీభావాంధ తామిస్రముల్
త్రావుల్ దూల ప్రబుద్ధమై హృదయ కల్హారమ్ము చెల్వార నా
నా విజ్ఞాన పరీమళమ్ముల మహానందమ్ము సంధిల్లగన్.

ప్రాతర్భాను మయూఖ హేమ రుచులన్ రాకా నిశావల్లభ
స్ఫిత జ్యోత్స్నా కలన్ హసించు భవదక్షి ద్వంద్వ శోభల్ ప్రభూ!
చేతః ప్రీతిగ మాపయిం బఱపి రక్షింపంగదే నీ పదా
బ్జాతంబుల్ మది నిల్పి కొల్చుకొనుటల్ భావించి
మమ్మెప్పుడున్.

కలవారింటను పుట్టనైతినిగదా కర్పూర నీరాజన
మ్ముల నెత్తంగ సువర్ణ పుష్పముల సంపూజింప నెంతేని ను
వ్విళు లూరించెడి పాయసాన్నముల నైవేద్యమ్ము సల్పంగ కా
ని లసన్మానస పూజ సేయుదు దయన్ నింపంగదే నాపయిన్.

నిను సేవించెడు భక్తు నీకరణి తంద్రీ, తీవ్ర హృత్తాప త
ప్తుని గావింతువె? లేదు లేదు కినియం బోకయ్య! వాగ్దోష మ
త్యనుకంపార్ద్రమతిన్ క్షమింపుము విమూఢాత్ముండబాలుండ నీ
మన సెట్టో మఱి యట్టులే జరుగుతన్ మాకేల దుర్భావనల్.

ఛేదింపంగదె మోహవల్లికల రాశీభూత పాపాగ్నికీ
లాదాహమ్మును రూపుమాపగదె? జాల మ్మేలొకోయింక నీ
వే దిక్కంచు భజించువాఁడ కరుణా దృక్కోణ! నన్నేలుకో
రా! దాసుండ దురంత సంసృతి విషాదాంభోధి నిర్మగ్నుఁడన్.

సజ్జనుల మాత్రమే కా దసజ్జనులను
పావనులజేయు నీ నామ భజన; పరుస
మది అయోవిగ్రహము నేమి వ్యాధుచేతి
కరకు కత్తిని గూడ బంగరుగ మార్చు.

ప్రాకారమ్ములు చుట్టివచ్చు త్రుటి మాత్రన్; నిల్వబో దొక్కచో
నీ కష్టాత్మ, అనుగ్రహింపగదె నాయీచిత్త మేవేళ నీ
శ్రీ కైంకర్యము అందు నిల్చుగతి తండ్రీ! యింతకున్
మించి యే
యాకాంక్షల్ మఱిలేవు నీవెఱుఁగవయ్యా, మన్మనస్తత్త్వమున్:

అమరానంద సుధానిధానమతి! మోదాపాదకమ్మున్ సువ
ర్ణమనోజ్ఞమ్మగు దీని భక్తిరసధారా సంప్లుతాత్ముండనై
తమి నీ కర్పణ సేయుదుం గొనుమ వాత్సల్యమ్ముతో కంఠహా
రముగా పండగ మామకీన కవితా బ్రాహ్మీ తప మ్మంతయున్.

— ముదివర్తి కొండమాచార్యులు

(20 వ పెజీ తరువాయి)

పిండివంటకమట! మండిగె ప్రస్తుత అని కర్నాటకదేశమున ప్రసిద్ధం. అచ్చటి వారి శుభకార్యాల్లో ముఖ్యమైనది. కల్లొసులు = పులిసిన పిండితో చేయు భక్ష్యములు. సిమ్మిలు = నూగులు, కొబ్బెర బెల్లముదంచి చేసినయుండలు. పాలకలు = పాలకాయలంటారు. ఏలకల్లు – ఏలకులు వేసి చేసిన చక్కెర లేక బెల్లము పానకము. ఈ పద్యపాదము కొదువ పడినది. 'పాలును ఏలకుల్ పానకాలు' అని పూరింపవచ్చు కాని 'పాలపొంగు' అనునదొక ప్రాచీనభక్ష్య విశేషమున్నదని పెద్దలన్నారు. ఇది నేటి పాలకోవా కావచ్చు. చుట్లు = వీనికి మురుకులు అని తమిళదేశమున ప్రసిద్ధి. రాజువారిసీమలో (మట్లరాజపాలితప్రాంతము) చుట్లనే పేరు నేటికీ – అప్పలు = అప్పడముల వంటివి. నేతిలో తేల్చిన భక్ష్యవిశేషమని కొందరు. దప్పము = కాయగూరలు, పప్పుపులుసుతోచేర్చిన అన్నముబకాళాబాత్, తమిళుల కదంబం అన్నము, కన్నడిగుల బిసి బేళహొగెబాత్ కావచ్చు. ఔగులు = బెల్లము, చక్కెరపాకంతో అటుకులు పేలాలు చేర్చి చేయువుండలు. సొజ్జె = బియ్యము దోరగా వేయించి విసిరి ఆ పిండితోచేయు భక్ష్యము. గారె = వడ, అరిసెలు = అతిరసములు బూరె = గోధుమపిండితో లేక మైదాతో చేయు 'పూరీ' వంటిదేమో అరిసె అని కొందరు 'సుగి' అని మరికొందరు – బోటి = పోళీ, హోళిగ.

వీనిలో కొన్నింటికి సరస కవయిత్రి శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ గారు (ప్రొద్దుటూరు) అర్థవివరణ మిచ్చారు. ఆమెకు నా కృతజ్ఞతాంజలి.

ఈ శతకము తాళ్ళపాక గ్రామంలో వెలసియున్న చెన్న కేశవ స్వామిపై చెప్పినది. ఆస్వామి చెన్నకేశవులా? బుజ్జిచెన్నకేశవులా? అన్నది పరిశీలనాంశము. తాళ్ళపాకలోని చెన్నకేశవాలయంలోని స్వామి విగ్రహపాదపీఠముఎత్తు 1¼ అడుగు. స్వామి విగ్రహము ఎత్తు 4¼ అడుగులు. 6,7 ఏండ్లబాలునివలెనున్నమూర్తికావునఅన్నమయ్య ఈ శతకంలో చెప్పిన బుజ్జి + చెన్నకేశ (బుచ్చన్నకేశ) అనుట సార్థకమే.

ఈ పద్యంలోని 'అమ్మపంపెను'–'అరగింపన్న' బుజ్జి, అన్నయ్య వరదాళ్ళుండు' అనువాని భావమేమి? బుజ్జి=చిన్ని అను అర్థము రాయలసీమలోని రాజువారిసీమలో ప్రసిద్ధము. బుజ్జిగాడు బుజ్జన్న–బుజ్జయ్య బుజ్జప్ప, బుజ్జోడు, బుజ్జిపిల్ల, బుజ్జిపిట్ట – అనునవి. కావున బుజ్జి అన్నయ్య అనగా చిన్నవాడైన అన్నయ. తనంత ఎత్తు, 6,7 ఏండ్ల వయసు మూర్తి గలస్వామియు తాను బుజ్జివారమని సూచించినాడు అన్నమయ్య. ఇది సత్యము!

'అన్ని ఆరగింపన్న' గణదోషమున్నందున 'అన్ని' తొలగింపబడినది. వరదాళ్లుడైన చెన్నకేశవునికి అమ్మపంపిన పదార్థములు ఆరగింపుమని ప్రార్థించుట గదా! శ్రీశర్మగారు చెప్పిన పాఠాంతరమును ఆరగింతువు రార–' అని యుండుట గమనార్హము. అమ్మ పంపినది. ఆరగింపుమన్నవి వస్తువులు, పదార్థములు నివేదనకవసరమైనవి యున్నవి. మరి అల్లము, బెల్లము, చెంబుతోనీళ్ళు, సీకాయ, యుదకములేల? అల్లము, బెల్లము లారగింపునకే యన్నచో తక్కినవేల? చిన్న చెంబుతో నీళ్లు స్వామి అభిషేకానికి అర్ఘ్యపాద్యాలకు, పానీయమునకుగావలెను. స్వామికినిత్యము అభ్యంగనము చేయుట ఆచారము. ఆ విగ్రహానికి సుగంధ తైల ద్రవ్యములు పూయుటచేనా జిడ్డు తొలగించుటకు సీకాయనీళ్ళు పోసి తుడుచుట తప్పనిసరి.

స్నానానంతరము అల్లము బెల్లము స్వామికి నివేదింపవలెను. చిన్నబిడ్డలకు గాని, పెద్దలకుగాని, బాలెంతలకుగాని తైలాభ్యంగన స్నానానంతరం శైత్యదోషము వల్ల శిరోవేదన, పడిసెము రాకుండుటకై అల్లము బెల్లము (శొంఠి బెల్లము) కలిపి తినిపించుట వైద్యపద్ధతి. అది మన పెద్దల ఆరోగ్యసూత్రము. చిట్కావైద్యము, సంప్రదాయంలో తెలుగునాటనిల్చియేయున్నది.

ఈ పద్యానికి సమన్వయించు కథ యా ప్రాంతమున ప్రచారమున నున్నట్లు తెలియుచున్నది. అది పూర్వము నుండి తాళ్ళపాకలో నివసిస్తూ స్వామి వారికి బ్రాహ్మణుల అర్చకత్వం తర్వాత ఇటీవల చెన్నకేశవుని అర్చకత్వం స్వీకరించిన చాత్తాదవైష్ణవ సంప్రదాయక కుటుంబమొకటి నేటికీ తాళ్ళపాక గ్రామంలో నున్నది. ఆ కుటుంబంలో శ్రీమతి తిరువాయిపాటి ఆండాళమ్మ గారు (ఈమె 1977 సంవత్సరాంతమున బరమపదించినది) అన్నమయ్య చరిత్ర పాటగా (ద్విపద) పాడుకొను చుండెడిదనీ, ఆ పాట అన్నమయ్య బాల్యము, స్వామిసేవ, దాయాదుల బాధ, తిరుపతి ప్రయాణము, వేంకటేశ్వర దర్శనము వరకు పాడెడిదనీ, ఆమె కుమారులు – నేడా గ్రామమున ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పని చేయుచు చెన్నకేశవస్వామి అర్చకత్వం నిర్వహించుచున్న శ్రీ తిరువాయిపాటి నరసింహులుగారు చెప్పారు. ఆమె పాడుచుండగా తాము వినెడివారట: తాము నేర్చుకొనుటకు, వ్రాసికొనుటకు నోచుకోలేదని ఆయన చింతించారు.

ఆ కథ తాళ్ళపాక చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్రలో (చూ: పుటలు 10,11 – అన్నమయ్య బాల్యము – అన్నమయ్య విద్యలు) లేదు. అది లుప్తమయ్యెనేమో! అది అన్నమయ్య బాల్యవృత్తాంతము కావున చిన్నన్న. ఆ చరిత్ర వ్రాయునాటికి అతనికి తెలియలేదేమో! శ్రీశాస్త్రిగారు అన్నమాచార్య చరిత్ర ప్రకటించుటకు మునుపే తాళ్ళపాక గ్రామమును దర్శించి అచ్చటివారి నుండి ఆ చరిత్రాంశము లెన్నో సేకరించి యుండిన బాగుండెడిది. ఆనాటి పెద్దలు నేడు లేరు గదా!



# గ్రంథసమీక్ష

## యోగప్రస్థానమ్

[రచన:— శ్రీ నండూరి విద్యారణ్యస్వామి. డెమ్మీ సైజు, 8+102 పుటలు. వెల. రు.15/ (సాదాప్రతి) ప్రకాశకులు యస్. పి. వి. చక్రవర్తి అండ్ కో, 1—8—76' ప్రెన్‌డర్ ఘాస్ట్‌రోడ్. సికింద్రాబాద్ 500003 ]

శ్రీకృష్ణభగవానుడు "స కాలేనేహ మహతా యోగ నష్టః పరన్తపః" అని గీతలో చెప్పినట్లుగా దీర్ఘకాలము గడుచుటచేత యోగము నమసిపోయెను. అందుచే "స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః" ఆ పురాతన యోగము కృష్ణునిచే అర్జునుని కార్యోన్ముఖుని చేయుటకు తిరిగిచెప్పినట్లుగా చెప్పబడినది. యోగశాస్త్రము కూడ కాలానుగుణంగామార్పులుచెందుటజరుగుచున్నది. గీత, పతంజలి యోగసూత్రములు సంస్కృతములో ఉండి పోవుటవలన సామాన్య ప్రజలకు వీటియోగ విషయం చేరలేదు. ఈ దృష్టితో చూస్తే ఈ గ్రంథముల సందేశము సగటుమనిషికి అందించవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ కోవలో చేరినదే ఈ ప్రస్తుత గ్రంథ విషయం. ఈ గ్రంథములో ఈ క్రింది అంశములు విపులీకరించబడినవి.

యోగము- ఆరోగ్యము, బౌద్ధయోగ ప్రస్థానము యోగాభ్యాస చరిత్ర, యోగ సాధన, భక్తియోగము, విగ్రహారాధన, కబీరు- యోగప్రస్థానము, భక్తి సోపానములు, ఆహార విహారములు, నాదబ్రహ్మోపాసన, స్వార్థత్యాగం, కర్మయోగం భగవద్గీత, జ్ఞానయోగము.

రచయిత విన్నపములో "ఈ యోగ ప్రస్థానమ్ వివిధ యోగ దర్శనాలపై ఒక సంక్షిప్త విజ్ఞాన సర్వస్వం" అన్నారు. దర్శనాలనటంలో రచయిత ఉద్దేశం. నాస్తిక దర్శనాలా? ఆస్తిక దర్శనాలా? బౌద్ధయోగం పేర్కొన్నారు. మరి జ్ఞాన యోగము మాటేమిటి?

ఋగ్వేదంలో అధర్వవేదంలో ఋక్కులు సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే యోగసాధనను ప్రతిఫలించేవి ఉన్నాయి అంటారు (పేజి-12).

వేదములలో యోగ, యోగి శబ్దములు ఉన్నా వాటియర్థము నేటి అర్థములోగాక పరిమితమైన అర్థములో వాడబడినవి. యోగెయోగె తవస్తరం వాజెవాజె। హవామహె. ఋ 1-౩0-6

పైన చెప్పబడిన యోగశబ్దము ఋగ్వేదంలో "సంబంధం" అనేభావనలో వాడబడినది. ఈ క్రింద వేదసూక్తులను బట్టి ధీర అంటే యోగి అనే అర్థంలో వాడబడినట్లు తెలుస్తున్నది.

పునన్తి ధీరా అపసోమనీషా। ఋ-3-7-5
ధీరా సోష్టా కవయో విపశ్చితః ఋ-4-36-6

రచయిత హఠయోగాన్ని మూడుముఖ్య విభాగాలు ఏర్పరచవచ్చు అన్నారు (పే-6) అంతకంటే ముఖ్యమైన 'నాదానుసంధానం' గూర్చి రచయిత చెప్పలేదు. హఠప్రదీపిక- 1-56 పరిశీలిస్తే గోచరమయ్యేది. ఈ గ్రంథంలో రచయిత ఎక్కువగా గీత, పతంజలి యోగ గ్రంథమునుంచే, వివరించారు. అందుకు వారివస్తు దృష్టి ఎన్నిక మెచ్చతగినదే. గీతలోని ప్రాణాయామ పద్ధతులు గురించిగాని, పతంజలిలోని 4 రకములు ప్రాణాయామ పద్ధతులు గురించిగాని వివరించివుంటే ఎంతో బాగుండేవి. అలాగాక హఠయోగ సాధన నుంచి నాడి శోధన గురించి వివరించారు (పే-96) ఇది ప్రాణాయామంకు తొలిమెట్టు, దీనికి "రేచకపూరక' అని సామాన్య పరిభాషలో పిలుస్తారు. రచయిత "ఇది ఒక రోజుతో ఒక నెలతో పూర్తి అయ్యేదికాదు. ఏండ్లు పూండ్లు పడుతుంది." రచయితకు ప్రాణాయామ పద్ధతులపై అవగాహన లేనట్లు పై వాక్యముల వల్ల తెలుస్తున్నది- వాసిష్ఠసంహిత యోగ కాండ (1-8)లో ఈ నాడిశోధన "కృత్వా తు నాడికాశుద్ధిః ప్రాణాయామః తతః కురు" అని చెప్పబడినది. రోజుకు మూడు సార్లు, నాలుగు (4) నెలలు చేస్తె నాడీ శుద్ధిః అగునని సిద్ధాంత శేఖరం (అముద్రితం)లో వివరించబడినది.

రచయిత హఠయోగ సాధన వల్ల ఆయుర్దాయం పెరుగునన్నారు. "మన దేశంలో సుమారు 150 సం॥ల వరకు బ్రతికినవారున్నారు. చీనాలో సుమారు 200 ఏండ్లు జీవించిన వ్యక్తిని గూర్చి చారిత్రిక ఆధారాలు లభిస్తున్నాయి" (పేజి- 93) ఎక్కడో చైనాలో ఎందుకు, మనదేశంలో అంతకంటే ఎక్కువకాలం జీవించిన వారున్నారు. నేటికి కలింగ విజయనగరం దగ్గర శివరాముడుగా పుట్టి, 48వ ఏట సంసారం త్యజించి హిమాలయ పరిసర ప్రాంతంలో యోగసాధన చేసి, వారణాసిలో స్థిరబడిన త్రిలింగస్వామి (క్రీ॥ శ॥ 1607 నుంచి 1887, ఎ. డి. ) 280సం॥ బ్రతికినాడంటే ఆశ్చర్యం కల్గించవచ్చు. తెలుగువాడైనా తెలుగు వాళ్ళకు ఈ మహాయోగి తెలియకపోవడం మనదురదృష్టమనే చెప్పాలి.

అట్టపై పటము ధ్యానముద్రలో ఒక ఆసనంచూపారు. పద్మముపై కూర్చుండుట వలన పద్మాసనం అనుకోవారేగాని, పోలికలుబట్టిగాని, యోగప్రామాణికగ్రంథముల వర్ణనలనుబట్టిగాని పద్మాసనం అనుకోలేము.

విషయసూచిక కూడ చేర్చబడలేదు. రచయిత గ్రంథములో చాలా చోట్ల విషయం చెప్పడంలో పాఠకులకు తెలియడానికి చక్కని ఉపమానములు పేర్కొన్నారు. (పేజి. 26) భక్తియోగం గూర్చి "ఈతనేర్చుకునే వాని మాదిరిగానే కొంత కొంత నీటిలో దిగాలి అభ్యాసం మొదలు పెట్టాలి. కొంతకాలానికి ఈత వచ్చినట్లుగానే భక్తియోగ సాధన అలవడుతుంది." వాడుక భాషలో వ్రాయడం, అంతేగాక తప్పులు లేకుండా ముద్రణలో జాగ్రత్త పడినందుకు రచయితను అభినందించాలి.

ముందుమాటలో డా॥ నండూరి రామకృష్ణమాచార్య గారి సేకరణలు గ్రంథమునకు వన్నెతెచ్చాయి. తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే సహాయం చెయ్యబడిన ఈ గ్రంథం 110 పుటలు, రు 15 లు. అయితే తెలుగు వాడి ఆర్థిక స్తోమతకు కొంత భారం అని చెప్పక తప్పదు.

— మేడపాటి వెంకట రెడ్డి.

## శ్రీమద్భాగవత రహస్యము

### ప్రథమభాగము

మూలం : శ్రీరామచంద్ర కేశవడోంగ్రేమహారాజ్
అనువాదం : శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి
[హిందీ అనువాదం నుండి]
ప్రకాశకులు : శ్రీ మారుతీ సీతారామధ్యాన మందిరము
జయశ్రీ టాకీస్ రోడ్, రాజమండ్రి-4
మూల్యం : రు. 5-00

అష్టాదశ పురాణాల్లోను ఒకటిగా పరిగణింప బడుతూన్న శ్రీమద్ భాగవతం భక్తి వైరాగ్యాలకి సంగమ స్థానమనీ, శ్రీకృష్ణ చరిత్ర సర్వస్వమనీ భక్తజనుల చేత అనూచానంగా ఆదరింప బడుతూన్న గ్రంథం. దీనికి శ్రీధర, వంశీధర, జీవగోస్వామ్యాది మహాపండితులెందరో వ్యాఖ్యానాలు వ్రాశారు ఇంచుమించుగా భారతీయ భాషలన్నింటి లోనికి ఈ గ్రంథం అనూదితమైనది. అయినా సంస్కృతమూలంలోఉన్న సొంపు వేరొకదాంట్లో రావాలంటే కష్టం. అది గాక ఈ గ్రంథం అనేక రహస్యార్థాలతో కూడిన ఆధ్యాత్మిక విషయాలెన్నో నిరూపించి, పాఠకుల్ని భక్తి భావ భరితులుగా చేసే రచన. ఆయా రహస్యాలు పరంపరాగతంగా అనుభవజ్ఞులైన పెద్దల వల్ల తెలుసుకో దగినవి. ఈ సందర్భంలో పూజ్యపాద శ్రీరామచంద్ర కేశవ డోంగ్రే మహారాజ్ గారు, శ్రీమద్భాగవత రహస్యము అనే ఉద్గ్రంథాన్ని గుజరాతీ భాషలో వ్రాసి లోకానికి బహూకరించారు. ఆ గ్రంథం హిందీ లోనికి తర్జుమా అయింది. ఆ హిందీ అనువాదం ఆధారంగా శ్రీ పురాణ పండ రాధాకృష్ణ మూర్తిగారు తెలుగు అనువాదం సాగిస్తూ భాగవతోద్దేశ్య మాహాత్మ్యాలు వెల్లడించే యీ ప్రథమ భాగాన్ని ప్రచురించారు.

ప్రస్తుత గ్రంధ భాగంలో పరమాత్మ స్వరూపం, జీవ లక్షణం, భగవద్దర్శనాకాంక్షులైన వారికి వలసిన సాధన సంపద, భక్తి లక్షణం, భాగవత ధర్మం వగైరా లెన్నో అతి సరళమైన వ్యావహారిక భాషా శైలిలో సుస్పష్టమైనధోరణిలో, వివరింప బడ్డాయి. ఎన్నెన్నో చిన్న ప్రసంగాలు, కథలు జోడించి విషయాన్ని సులభంగా గ్రహింప జేసే పద్ధతిలో గ్రంధ రచన సాగింది.

భాగవతమాహాత్మ్యం పద్మ పురాణాంతర్గతం. అక్కడ విషయమంతా తేలికైన భాషలో ఈ గ్రంథం తెలియ జేస్తుంది. అలాగే భాగవత రచనకు గల పూర్వ కథా పీఠికను కూడా వివరంగా తెలియ జేస్తుంది.

గ్రంథంలో 45 పుటకు ముందు రెండు పుటలతో ప్రారంభించి, (37, 38 గా అచ్చయినాయి) చివరి వరకు "ఆత్మ విశ్వాసము" అనే ప్రకరణం జోడించ బడింది. ఇందులో భాష కొంత గ్రాంధికశైలిలో నడిచింది. అయినా సరళ సుబోధకంగా ఉంది. విషయం భగవద్దర్శనాభిలాషియై, అచంచల విశ్వాసంతో అది సిద్ధింప జేసికొన్న ఒకానొక దొంగను గురించి చెప్పిన కథ. ఆత్మ విశ్వాసంతో భగవంతుననుగ్రహింప జేసికొని తాను తరించుటే కాక యీ దొంగ తన పౌరాణికుణ్ణి కూడా తరింప జేస్తాడు. ఇది "సత్కథా ప్రవంతి", మొదటి భాగము నుండి గ్రహించినట్లు వ్రాయబడింది.

ఉదాత్తమైన సంకల్పంతో, అధ్యాత్మ విషయ ప్రచారోద్దేశ్యంతో ప్రారంభించి ప్రచురింపబడుతున్న యీ గ్రంథానికి కావలసిన ఆర్థిక సహాయాన్ని అందజేసి భక్తులీ కృషికి తోడ్పడవలెనని రచయిత "సవినయముగా" ప్రకటించాడు. సుమారు 1200 పుటలతో అచ్చుకావలసిన గ్రంథం కనుక వదాన్యులైన వారు పోషకులుగా నిలిచి గ్రంథాన్ని సొంతంగా ప్రచురింప బడే విధంగా సాయ పడ వలసినదని వారి అభ్యర్థన.

పుస్తకం అచ్చు కూర్పు వగైరాలు బాగున్నాయి. అచ్చు తప్పులు ఎక్కువగా ఉన్నాయి. ధర సరసంగానే ఉన్నది. కనుక అందరూ గ్రహించి చదివి ఆనందించ గలరని ఆశిస్తాము.

— ముట్నూరి సంగమేశం.

## శ్రీ వేంకటేశ్వర సుప్రభాత

### సంగీత లహరి

వెల: ఆరు రూపాయలు
రచన. విద్వాన్ మాసంద్రం కృష్ణ.
ప్రాప్తిస్థానం: మాసంద్రంకృష్ణ. సీనియర్
తెలుగు పండిట్, జి. జే. కాలేజి, పలమనేరుపోష్టు
చిత్తూరు జిల్లా

సుప్రభాతమును మొట్టమొదట రచించిన వారు వాల్మీకి మహర్షి. ఆది కావ్యమైన రామాయణమున అవతారమూర్తియైన శ్రీ రామునికి విశ్వామిత్ర మహర్షి 'కౌసల్యా సుప్రజారామా' యని మేలుకొలుపు పాడును.

కానీ అర్చావతారమూర్తికి మేలుకొలుపు రచించిన ప్రథమకవి విప్రనారాయణులే. శ్రీ విప్రనారాయణులవారు తిరుప్పళ్లి ఎళుచ్చి (ప్రాబోధకీస్తుతి) యనుపేర శ్రీ రంగ రంగ నాథుని మేల్కొల్పు పాటలు పది రచించారు. ఆతరువాత తమిళంలో తిరుప్పళ్లి ఎళుచ్చి ప్రత్యేక ప్రక్రియగా అభివృద్ధి చెందింది. శివభక్తుడైన మాణిక్యవాచకర్ నాయనారు ఒకతిరుప్పళ్ళి ఎళుచ్చి శివునిపై రచించారు. 15వ శతాబ్దిలో తత్త్వరాయర్ అను అద్వైత జ్ఞాని ఈ ప్రక్రియలో పెక్కు మేలుకొలుపులు రచించారు. శ్రీ చిదంబరస్వామి మురుగన్ తిరుప్పళ్ళి ఎళుచ్చి వ్రాశారు. శ్రీ త్యాగరాజ స్వామి కూడ కొన్ని మేలుకొలుపు పాటలను శ్రీ రామునిపై రచించారు. ఈ 20 వ శతాబ్దపు ప్రథమభాగంలో భారతమాతపై భరతపుత్రునిపై మేలుకొలుపు పాటలు తెలుగు తమిళాది భాషలలో పలువురు కవులు రచించారు. అయితే ఈ మేలుకొలుపు ప్రక్రియా సంప్రదాయానికి మూలభూతులు శ్రీ విప్రనారాయణులే అనునది నిర్వివాదాంశము. ఈ ప్రక్రియకు గ్రహించిన ఛందోభేదమే తరువాత వచ్చిన సుప్రభాత రచనలకు ఒరవడి అయింది. విషయ విన్యాసాదులుకూడ ఇంచుమించు ఒకే రీతిగనే అన్నిట కనిపిస్తున్నవి. భేదము దేవుని యొక్క ఊరు పేరులో మాత్రమే కనిపిస్తున్నది.

ప్రస్తుతము సమీక్షించు అనువాద గ్రంథమునకు మూలమైన శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి మంగళాశాసనములు. సంస్కృతమునరచించినది శ్రీప్రతివాద భయంకర అణ్ణన్‌గారు. వీరిది కాంచీపురము. సంస్కృత విద్యా వైదుష్యభూషితులైన పండితులు. వీరు తిరుమలలో ఆకాశగంగ నుండి తిరుమంజన తీర్థమును స్వామికి తెచ్చెడివారు. ఒకనాడొకవైష్ణవుడు మణవాళమహామునుల ప్రభావమును చెప్పుచుండ వినుచూ తీర్థకుండముతో మెల్లగా నడచుచుండిరట. తిరుమంజనమునకు వేళాయెనని యొకరు ఎదురేగి తీర్థపు పాత్రము కొని పోయిరట. శ్రీ అణ్ణన్ మహామునుల వైభవమును పూర్తిగా విని కోవెలకు చేరునప్పటికి తిరుమంజనముపూర్తి అయినదట. స్వామివారి తిరుమంజనమునకు పరిమళ ద్రవ్యములు కలిపిన తీర్థమును యీ యిక అపచారమొనర్చితినేయని బాధపడినారట. అచ్చటనున్న వారు నాటి తీర్థము విశేషపరిమళముతో నున్నదని వరవరముని గాథవినుటయే కారణమై యుండునని అనినారట. అట్టి మహిమాన్వితులగు మణవాళ మహామునిని చూడవలెనని వీరిలో కోర్కె కలిగినదట. అట మణవాళ మహామునులకు సంస్కృత పండితుడు కావలసివచ్చినదట. ప్రతివాదభయంకరం అణ్ణన్ సంస్కృతమున మహాపండితుడని విని వారిని తమ వద్దకు రమ్మని శ్రీ ముఖమునంపినారట. అణ్ణన్ శ్రీ రంగమునకు వెళ్ళి ఆమహాముని వలన దివ్యప్రబంధ వ్యాఖ్యానము విని వారి శిష్యులైనారట.

శ్రీఅణ్ణన్‌తొండరప్పొడి యాళ్వారుల భావముల రీతిని, వాల్మీకి మహర్షివలె శ్లోకరూపమును, ఒజ్జబంతిని చేసికొని శ్రీ వేంకటేశ్వర సుప్రభాతాలు రచించి యుందురని తోస్తున్నది. వీరి రచననే మేలుబంతిగ చేసికొని ఎందరో కవులు హరిహరదేవీయర్చా మూర్తులకు సుప్రభాతములు రచించినారు. అనువాదములు యితర భాషలలోనికి చేసినారు. తెలుగులో కొందరు పద్యరూపమునను, ఒకరోఇద్దరో గేయరూపమునను అనువదించారు. శ్రీమాసంద్రం కృష్ణగారుకూడ గేయరూపముననే అనువదించారు. ఈకవిగారు సుప్రభాతము పామరులకు సైతము సుబోధకముగ నుండవలెనని పాడుకొనుటకు అనువుగ నుండవలెనని ఆశించి ఈరచనను చేశారనితోస్తున్నది. వీరు, రచనా శిల్పమునకు ప్రాధాన్యమును ఇవ్వలేదు. యతిప్రాసలను గేయములందు పాటించలేదు. చరణములందలి పాదములు సమముగ నుండవలెనను నిబంధనమును లెక్కచేయలేదు.

కావేటి తీరాన శ్రీ రంగ రంగా, అనుపల్లవిని క్రియాశూన్యముగ వ్రాశారు. శ్రీ కవిగారు తాళలక్షణములు, త్యాగరాజాది వాగ్గేయకారుల కీర్తనలు చదివినవారని వీరి రచనలు సాక్ష్యమిస్తున్నవి. కాని సంప్రదాయాలను నిబంధనలను దాటి వీరీవిధంగా అనువదించటానికి కారణము పామరులకు సైతము సుప్రభాతము సంపూర్ణంగా అర్థం కావాలనే ఉద్దేశమే అయివుంటుంది.

కవిగారు కార్యాంతర నిమగ్నులై ముద్రణవిషయమున ఇంచుక అశ్రద్ధ చేసి వుంటారు. అందుచే అచ్చుతప్పులు పెక్కు కనిపిస్తున్నవి.

ఈ గ్రంథమున సుప్రభాతానువాదానికి పూర్వము వారిచే రచింపబడిన స్వంత కీర్తనలు తొమ్మిది "నవరత్న కీర్తన"లను పేర ముద్రింపబడి వున్నాయి. ఇందులో ఈ గ్రంథకర్తకు శ్రీ వేంకటేశ్వరస్వామి పైగల నిర్భరమైన భక్తిభావము పొందుపరుపబడి కనిపిస్తున్నది. సప్తమ అష్టమ కీర్తనలు రత్నముల వలెనే ఉన్నాయి.

— బి. యల్. యన్. ఆచార్య

---

(18 వ పేజి తరువాయి)

అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షం, ఆరుమాసాల ఉత్తరాయణం వీటిలో మరణించే బ్రహ్మోపాసకులకు బ్రహ్మప్రాప్తి కలుగుతుంది.

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ॥

పొగ, రాత్రి, కృష్ణపక్షం, ఆరుమాసాల దక్షిణాయనంలో గతించిన యోగి చంద్రజ్యోతిని పొంది, మళ్లీ మానవలోకంలోకి వస్తాడు.

శుక్లకృష్ణేగతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తిం అన్యయాఽఽవర్తతే పునః ॥

శుక్ల, కృష్ణ అనే రెండింటినీ జగత్తులో శాశ్వతమార్గాలుగా భావిస్తున్నారు. శుక్లమార్గంలో పయనించిన వాడికి జన్మరాహిత్యమూ, కృష్ణమార్గంలో పోయినవాడికి పునర్జన్మమూ కలుగుతాయి.

నైతే సృతీ పార్థ ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ! ॥

పార్థా ! ఈ రెండు మార్గాలూ తెలిసిన యోగి ఎవడూ మోహంలో పడడు. అందువల్ల నీవు నిరంతరం ధ్యానయోగంలో వుండు.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥

దీనినంతా గ్రహించిన యోగి వేదాలు, యజ్ఞాలు. తపస్సులు, దానాలకు చెప్పబడ్డ పుణ్యఫలాలను అధిగమించి, అనాది అయిన పరమపదం పొందుతాడు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "అక్షరపరబ్రహ్మయోగం" అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం.

(సశేషం)

# శక్తి - హరిహరనాథ తత్త్వం

— విష్ఠల సుబ్రహ్మణ్యం

విశ్వసంస్కృతి మతంవల్ల వెల్లివిరుస్తుందని ఆర్షసిద్ధాంతం. వేదాలు, పురాణాలు, ప్రాచీన వాఙ్మయంలోని అతిముఖ్యమైన గ్రంథాలచే, విశ్వసంస్కృతిని ప్రతిపాదించడానికి సంసిద్ధులయ్యారు మహర్షులు. ఏవో కొన్ని కారణాలవలన సర్వదేవతా సమన్వయం జరుగక హరిహరా ద్వైతం సిద్ధించలేదు. మతవైషమ్యాలను రూపుమాపడానికి హరిహరులకు గల అభేదాన్ని గుర్తించాలి. ఇందుకు ప్రాతిపదికగా ఆస్తికత్వం గూర్చి ముందుగా ఆలోచిద్దాం. ప్రపంచ కర్త ఈశ్వరుడేగాని మానవుడుగాడు. ఈశ్వరుడు లేకుండా ప్రపంచం దానంతటదే వచ్చిందనటంలో సామంజస్యంలేదు. అందుకే తార్కికులు ఇలాచెప్పారు. "జగతాం యది నో కర్తా, కులాలేన వినా ఘటః, చిత్రకారం వినా చిత్రం స్వతఏవ భవేత్తదా" అంటే చిత్రకారుడు లేక చిత్రం, కులాలుడు లేక ఘటం రానట్లే, ఈశ్వరుడు లేకుండా ప్రపంచం లేదని భావం. అపోలో చంద్రమండల యాత్రను దిగ్విజయంగా సాధించిన శాస్త్రజ్ఞుడుగూడ సృష్టికర్త ఉనికిని అంగీకరించాడు.

విశ్వం అనంతం అని ప్రాచీనులకు తెలుసు. మనకు కనుపించే సర్వనక్షత్రాలు, భూమండలం ఇవన్నీ కలిపితే గెలాక్సీ అంటారు. ఇట్టివి ఈ విశ్వంలో అసంఖ్యాకంగా ఉన్నాయని శాస్త్రజ్ఞులు అంగీకరించారు. ఈ విషయం లలితాసహస్రంలో కూడ ఉంది. 'అనన్తకోటి బ్రహ్మాండ జననీ' అనేనామం వలన, శక్తి అసంఖ్యాక బ్రహ్మాండాలను సృష్టించిందని తెలుస్తూంది. అనన్త విశ్వాల స్థితివలన కర్తృత్వం భగవంతునికే చెందుతుంది.

జన్మజరావిపత్తిమరణాన్విత మైన ఈ సంసారం నుంచి అమృతరూప మైన మోక్షాన్ని పొందటం మానవుని కర్తవ్యం. ఇందుకు మార్గాన్ని న్యాయశాస్త్రకర్తయైన గౌతమ మహర్షి ఇలా వచించాడు. "దుఃఖ జన్మ ప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనన్తరాపాయాదపవర్గః" మిథ్యాజ్ఞానం వలన దోషం పుడుతుంది. దీనివలన ప్రవృత్తి, ప్రవృత్తివలన జన్మ, జన్మవలన దుఃఖం కలుగుతాయి. క్రమంగా వీనిని నశింపజేసుకుంటే మోక్షం కలుగుతుందని భావం. జీవి శరీరాన్ని విడవడం గూర్చి పెద్దలు ఇలా చెప్పారు. "ప్రయాణస్య కిమాశ్చర్యం చిత్రం తత్ర స్థితేర్మహత్." ప్రాణవాయువు పోవడంలో విశేషం ఏమీ లేదు. రంధ్రాన్వితమైన శరీరంలో ఉండటం ఆశ్చర్యకరం. ఐతేపురాణాలు, శాస్త్రాలు అనంతంగా ఉన్నాయి గదా. ఇవన్నీ చదివితేనేగానీ మోక్షంరాదు. ఇవన్నీ చదివి సాధించడం ఈ జన్మలో సాధ్యంకాదుకదా అనే సంశయం కలుగుతుంది. ఈ సంశయాన్ని ఈ క్రింది శ్లోకం పోగొడుతుంది.

"అనన్తశాస్త్రం బహువేదితవ్యం
స్వల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః,
యత్సారభూతం తదు వేదితవ్యం
హంసో యథా క్షీరమివాంబురాశేః".

శాస్త్రాలు ఎక్కువ. కాలం తక్కువ. హంస పాలను గ్రహించి నీటిని విడిచినట్లే, వివేకి సారాన్ని గ్రహించి నిస్సారాన్ని వదలాలని దీని భావం. జీవియొక్కస్థితి ఇలా వివరించబడింది.

"ధనాని భూమౌ పశవశ్చ గోష్ఠే
నారీ గృహద్వారి జనాః శ్మశానే,



# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్నివర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములోనైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళు పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

దేహశ్చితాయాం పరలోక మార్గే
కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః."

ధనం, పశువులు, భార్య, బంధువులు ఇక్కడే ఉంటారు. కర్మబద్ధుడైన జీవి మాత్రం పరలోకం వెళ్తాడు.

పరాశక్తి ఈ ప్రపంచానికి మూలాధారం. 'చిచ్ఛక్తిః చేతనారూపా జడశక్తిర్జడాత్మికా' అని లలితా సహస్రంలో శక్తిగురించి వివరింపబడింది. చిచ్ఛక్తి, చేతనశక్తి, జడశక్తి అని బహురూపాలలో ఉండే ఈ శక్తి ఒకటే. "త్వంహ్రీస్త్వం బుద్ధిః బోధలక్షణా" అని సప్తశతి చెబుతూంది. బుద్ధి, సిగ్గు, జ్ఞానం మొ॥ గూడా శక్తిరూపాలే. ఈ క్రింది శ్లోకం పై భావాన్నే సూచిస్తూంది.

"యా దేవీ సర్వభూతేషు
లజ్జారూపేణ సంస్థితా,
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమోనమః."

శక్తిగురించి దేవ్యథర్వశీర్షంలో "అహం బ్రహ్మస్వరూపిణీ, మత్తః ప్రకృతి పురుషాత్మకం సర్వం జగత్, శూన్యం చాశూన్యం చ" అని ఉంది. అంటే శక్తి పరబ్రహ్మస్వరూపమే. ఈ శక్తినుండే ప్రకృతిపురుషాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము రెండూ శక్తినుండే వచ్చాయి. "తామగ్నివర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టాం" అనే వాక్యం శక్తితత్త్వాన్ని సూచిస్తూంది. ఈ శక్తి తపోమయమై అగ్నికాంతితో ప్రకాశిస్తూందని భావం. "సైషా సత్త్వరజస్తమాంసి" అని గూడా ఉంది. శక్తే సత్త్వరజస్తమోగుణాలుగా మారుతుందని అర్థం.

ఈ శక్తి సూర్యమండలంలో ఉంటుందని ఈ క్రింది వాక్యం సూచిస్తుంది. "సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం గతాస్తే మంచత్వం ద్రుహిణహరి రుద్రేశ్వరభృతః" అనే శ్లోకపాదం వలన శక్తిచే అధిష్ఠితమైన మంచానికి బ్రహ్మవిష్ణురుద్రేశ్వరులు కోళ్ళుగా మారారని తెలుస్తూంది. "లోకస్య ద్వారమర్చిమత్పవిత్రం" అనే

# నివేదన



ఆనందమ్మది నీటిమూటయి వృధాయాస ప్రయాసమ్ములన్
మానంజాలని ఆశలోగొనిన సామాన్యుండు నీ ధ్యానమే
దేనిన్ సౌఖ్య మొసంగునంచు మదినెంతే సంతసం బందెడిన్
ఆనందావసథాధివాస! కనవో? అర్చల్ నిరాసింతువో???

కలతల్ నిండిన కాపురమ్ములును, రూకల్‌రాని ఉద్యోగముల్
నెలవుల్ తప్పిన రాజకీయములు - అంతేలేని దౌర్జన్యముల్
పలుచీకాకులు చుక్కలంటెడు ధరల్ పైపెచ్చులై పన్నులున్
కలచున్ నిల్వనక్రుంగదీసి జనులన్ కారుణ్యమున్ జూపవే!

ఆకుల్ రాలని పూలువాడని వసంతారామముల్ కూర్పగా
నాకాక్షింపము మీదుమిక్కిలి దురాశాయత్త చిత్తమ్ములన్
మాకష్టమ్ముల నుజ్జగించి కడు సామంజస్య మొప్పన్ సుఖా
నీకావాప్తికి నుత్సహింపుము ప్రజానీకమ్ము హర్షించెడిన్

నకనకలాడు పొట్టకు నింత గంజియు
గతిలేని గాలింపు గంగ కిరవు
మొలకునూలునులేని మొరటుకు గోచియు
వడలుగొంతుకకు గ్రుక్కెడు జలమ్ము
నిట్టూర్పుదీనమానిసికి చేయూతయు
అంగవికలుని కంటహాసరేఖ
అవినీతికాహుతియౌ నీతికిన్ ధృతి
దగ్ధమై చను సత్యధర్మరక్ష

యొనరగాజేసి - సత్ప్రవర్తనము నొలసి
జాతి జవమును జీవమున్ సాధుసజ్జ
సత్యమును సౌహృదముగల్గి నడచునట్లు
చేయవే! శేషశైలేశ! శ్రీనివాస!!

— కె. వి. అప్పలాచార్య

వాక్యం శక్తిలోకంయొక్క ద్వారం, కాంతి యుక్తం అని తెలుపుతూంది. శక్తియొక్క మాహాత్మ్యం శంకరభగవత్పాదులచే ఇలా వివరింపబడింది.

"శివశ్శక్త్యా యుక్తో యది
భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో న ఖలు
కుశలః స్పందితుమపి"

"తనీయాంసం పాంసుం తవ
చరణపంకేరుహభవం
విరించిస్సంచిన్వన్
విరచయతి లోకానవికలమ్"

ఈశ్వరుడు శక్తితో కూడితేనే సమర్థుడు. లేనిచో ఎందుకూ కొఱగాడు. శక్తిపాద రజాన్ని స్వీకరించి బ్రహ్మ విష్ణు రుద్రులు సృష్టిస్థితిలయాల్ని చేస్తున్నారని పైశ్లోకాల భావం. శక్తిధ్యానం వల్ల అన్ని కోరికలు నెరవేరుతాయి. అందుకే సప్తశతిలో 'రూపం దేహి బలం దేహి యశో దేహి ద్విషో జహి' అని ఉంది. రూపబలకీర్తులనిచ్చి, శత్రువులను పోగొట్టమనే భక్తుని కోరిక సూచితమవుతుంది.

ఐతే ఇలా నిరూపితమైన శక్తికీ ఈశ్వరునకు భేదంలేదు. శక్తిలేని ఈశ్వరుడు, శివుడు లేని శక్తి ఉండే అవకాశం లేదు. తత్త్వజ్ఞులు 'చంద్ర చంద్రికయోరివ' అని వారి సంబంధాన్ని నిర్వచించారు. చంద్రునికీ, వెన్నెలకు గల సంబంధం వంటిదే వీరి సంబంధము. బ్రహ్మవిష్ణు రుద్రులు వాణీలక్ష్మీపార్వతులను జిహ్వావక్షశ్శరీరాలలో ధరించారు. అంటే శక్తులు లేని దేవులు లేరని స్ఫుటమవుతుంది.

మనలోని భావాల్నే శక్తులుగా నిర్వచింపవచ్చు. భావంలేని మనిషి కొఱగానట్లే శక్తులు లేని దేవులూ కొఱగారు. వైష్ణవులు విష్ణ్వాధిక్యాన్నీ, శైవులు శివాధిక్యాన్నీ చెప్పినా న్యాయంగా వారిరువురి మధ్య భేదం లేదు. ఒకే మూర్తి ముగ్గురుగా మారినట్లు, "ఏకైవ మూర్తిః బిభిదే త్రిధా సా" అనే కాళిదాసీయశ్లోకపాదం సూచిస్తూంది. హరిహరాద్వైతం వలననే మతవైషమ్యాలు తొలిగి తత్త్వజ్ఞానం ఉదయిస్తుంది. ఈ భావం మనీషులకు సమ్మతమైనదేననడానికి మహాకవి తిక్కనసోమయాజి యొక్క ఈ క్రింది శ్లోకం గమనార్హం

"కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే॥"

"హరిహరనాథా! నీవు పుఱ్ఱెల దండ, కౌస్తుభాలలో దేన్ని అలంకరించుకోవాలనుకుంటున్నావు? నీకు కాలకూటం ఇష్టమా? యశోదాస్తన్యమా? "అని దీని భావం.

శివాయ విష్ణురూపాయ
శివరూపాయ విష్ణవే.
శివస్య హృదయం విష్ణుః
విష్ణోశ్చ హృదయం శివః."

అని సంధ్యావందన సమయంలో గూడ మనం హరిహరాద్వైతాన్నే భావిస్తున్నాం. హరి హరునకు, హరుడు హరికి హృదయం అని దీని భావం.

రుద్రాభిషేకం చేసేటప్పుడు చదివే నమకచమకాలలో "నమో రుద్రాయ విష్ణవే" అని ఉంది. ఈ మన్త్రభాగం హరిహరులకుగల అభేదాన్ని తెలియజేస్తుంది. శివకేశవులకు భేదం చూస్తే నరకం ప్రాప్తిస్తుందని పురాణాలు చెపుతున్నాయి. "యో బ్రహ్మ విష్ణు మహేశానాముత్తమ భావేనభేదం సాధయతి స ఉదరవ్యాధిమాన్ భవతి" అని పురాణాల్లోఉంది. త్రిమూర్తులకు భేదాన్ని కల్పిస్తే ఉదరరోగం వస్తుంది. దీన్ని అందరూ అంగీకరించారు. పురాణాల్లో శివకేశవులు పరస్పరం స్తుతించుకున్నారు. శ్రీ శంకరులు శ్రీవాణీగిరిజలకు అభేదాన్ని కనకధారాస్తవంలో ఇలా చెప్పారు.

"గీర్దేవతేతి గరుడధ్వజసుందరీతి
శాకంభరీతి శశిశేఖర వల్లభేతి,
సృష్టిస్థితి ప్రలయ కేలిషు సంస్థితాయై
తస్యైనమస్త్రి భువనైక గురోస్తరుణ్యై."

పై శ్లోకం వలన లక్ష్మీవాణీపార్వతులు ఒకటి అని తెలుస్తూంది. వీరు ఒకటి అవటం వలన బ్రహ్మవిష్ణురుద్రులకు అభేదం సిద్ధిస్తూంది. హరిహరాద్వైత భావనతో అచ్యుతాశ్రము డనే కవి ఇలా అంటున్నాడు.

"భీమాకృతిం వా రుచిరాకృతిం వా
త్రిలోచనం వా సమలోచనం వా,
ఉమాపతిం వాథ రమాపతిం వా
హరిం హరం వా మునయో భజన్తే."

భీషణాకారంగల శివుడైనా. అందమైన విష్ణువైనా ఒకటే. ముక్కంటి యైనా, ద్వినేత్రుడైనా ఒకటే. ఉమాపతి యైనా రమాపతియైనా మునులకు ఒకటే అని భావం.

"నిలువుబొట్టు పెట్టువాడు రంగడు,
అడ్డబొట్టు పెట్టువాడు లింగడూ.

రంగడికీ లింగడికీ భేదమా" అనే జానపద భక్తిగీతం హరిహరాద్వైత రహస్యాన్ని పామరులకు సైతం బోధిస్తూ మనోరంజకంగా ఉంది. శ్రీ శంకరులు తన తల్లి అవసాన కాలంలో మొదట శివధ్యానాన్ని, పిదప హరిధ్యాన్నాన్ని చేశారు. అంటే హరిహరులకు భేదం లేదని శ్రీ శంకరుల దృఢాభిప్రాయం. కనుక శక్తిసహితుడూ, హరిహరాద్వైతమూర్తి ఐన ఆ సర్వేశ్వరుని ధ్యానించి, అతని అనుగ్రహాన్ని పొందుదాం.






ఏ దిన పత్రికలను తిరగవేసి చూచినా దినదినం యే కోనసీమ లోనో పంట పొలాల్లోనో, అడవుల్లోనో, మానినుల మాన భంగాలు జరగడం-అందు మరొక విశేష మేమిటంటే వరుస వావి లేకుండా బిడ్డలతో,

గోతిలో పూడ్చే ఘాతుక చర్యలు హృదయ విదారకం....ఇంకను

'మూతిమీసమున్న పురుషులు అక్కడా
ఆడదాని డబ్బు అన్న యట్లు
కట్టి బెట్టకున్న కాల్చి చంపుదు రాడ
దాన్ని రాక్షసులయి దయను లేక'

అన్నట్లుగా అనుకున్నంత వరకట్నం చెల్లించక పోయినచో నగ్నంచేసి ఇనుప టైర్లు చుట్టి కిరోసిన్ పోసి అత్త, మామ, మగడు కలిసి దారుణంగా చంపి, ధైర్యంగా తప్పించు కుంటున్నారు. ఇంతకు ఈ అఘాయిత్యాలకు మూలమేమిటి? దీనిని అరికట్టు మార్గమేమిటి? యిది యెవరు చేయాలి?

మూర్తియని స్త్రీని పురుషుడు పూజ్యభావ
మిడిన దేశంబు భాగ్యసంవృద్ధియగును'

అని సకల శాస్త్రాలు యివే ఘోషిస్తాయి. 'కాక కలకంఠి కంట కన్నీరొలికిన సిరులు హరించిపోవు' ననిశాస్త్రజ్ఞులు గుర్తించిచెప్పినారు. ఉత్తమసంతానఫలమును కోరు పురుషుడు స్త్రీవలన ఉత్తమ సేవ ద్వారానే పురుషోత్తమ సంతతిని పొందే అవకాశము లెక్కువ. ఆడదానిని పశుకామంతో అనుభవించ దలచిన దేశంలో, పశుబుద్ధి పరాయణు లుద్భవించి, ఆ దేశాన్ని పాశవిక చర్యలతో పాడు చేస్తారు.

# ధర్మరక్షణే నీకు రక్ష

చెల్లెళ్ళతో, కోడళ్ళతో రకరకాలుగా పురుషుని కామపు కోరల్లో నలిగి పోవడం కాపురాలు కాలిపోవడం. యింకా మరో అఘాయిత్యం వయోప్రాయ భేదంలేకుండా సుమతి కారుడన్నట్లుగా "పసగలుగు యువతు లుండగ పసిబాలల పొందువాడు పశువుర సుమతీ" పదేళ్ల బాలలను మానభంగం చేయడం చదివి చూస్తున్నాం. అందు విచిత్ర వార్తలో పాశ్చాత్య దేశాలందు తొమ్మిదేళ్ళ పిల్లలు తల్లులుగాబోతున్నట్లు వార్తలు చదవటం వంటి ప్రభావం యిక్కడి ఆడ మగ పిల్లలందు లైంగిక సంబంధము నకు ప్రేరణగా అనిపిస్తున్నది! .... అటువంటివి కొన్ని మరుగుపడి సాగిపోతూ, ప్రమాదంలో పడిపోతున్నాయి! దాగిపో

శ్రీ గాధిరాజు

తున్నాయి! యింతకంటే మరీ హీనమేమిటంటే అనుకున్న స్త్రీని అయిదారుగురు కలిసి బలవంతంగా ఎత్తుకు పోయి అనుభవించి "ఆ విషయం బయట వేస్తుం దని, నేరానికి గురిచేస్తుందని సాధ్యమైనంతకు అనుభవించి-గొంతు నులిమి

అనేది యోచించాలి. చర్య వహించాలి. కానిచో నాదేశ భవిష్యత్తు కడు శోచనీయంగా నుండ గలదు.

'ఇంటి దీపము, గృహలక్ష్మి యెన్న భావి
వంశవృద్ధికి దేవతా వసుధ మాతృ

## ఆడవారు అలవాట్లు

'సంయమీంద్రుడైన శాస్త్రవేత్తనయిన
"ప్రకృతి" విషయ మోహవలయమందు
చిక్క వేసి కొంచు కుక్కలా నాడించ
మూఢ మతుల విషయ మాడ నేల'



ప్రకృతి విషయ వికారములు సంయమీంద్రులనయిన శాస్త్ర వేత్తలనయిన పట్టి వానివలయమునందు జిక్కించుకొని ఆటలాడించ, యిక అల్పులమాట చెప్ప రాదు-ప్రకృతి యనగా స్త్రీయని గుర్తించ గలము.....వ్యాస మహర్షిచే జైమిని మహాముని ఒకసందర్భములో ఇట్లంటాడు-"బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాం సమపి కర్షతి". ఎంతటి విద్వాంసు నయిన యింద్రియములు లాగుచుండును. విషయాల దూగుటకును అనుచూనే, వానచే తడిసిన తరుణి శృంగార అంగాలను తిలకించిన జైమిని అందులో ఆత్మజ్ఞాని భంగపడ్డాడు-యిక ఆధ్యాత్మిక జ్ఞానంలేని కేవల నిద్రాహారమైథున విషయలోలుడు భంగపడక పోవడమేమిటి? బలహీనుడై పోతాడు.

ముఖ్యంగా స్త్రీల హృదయాన్ని బలవంతంగా లాగేసి, జీవితాన్ని దెబ్బ తీసేవి సినిమాలు మొదటి మెట్టనాలి .... ప్రకృతం ఆధ్యాత్మిక వికాసం కొదవైనపుడు కేవలం అవధులు లేకుండా విజృంభించేవి అవివేక విషయ వాసనలే. సరే వివేక సుఖానుభవం లేని జీవన మనేది సాధ్య పడదు. వానిని పూర్తిగా వదలడం జీవిత లక్ష్యము కాదు. అయితే వివాహిక విషయ సుఖాలయినా ఆధ్యాత్మికత త్త్వంతో కూడుకొన్నవి అయితే అడుగడుగునా హద్దులేని ప్రమాద జీవనం నుండి విడివడి ఆనందమయ జీవనాన్ని పొందగలుగుతాడు. యిక నేడు స్త్రీలందరు కట్టుకున్న వాడి నయినా వదులుతాను, గాని సినిమా వినోదాలు చూడటం, యాక్టర్ల వేష భాష పాటానుకరణా వదలం. అవసర మయితే ప్రాణాన్ని వదులుతామనేంతవరకు హృదయందిగ జారిపోతూన్న తరుణమిది.

మానవునిలో దృశ్య విషయ ప్రభావం అమోఘ మైంది. ప్రకృతం స్త్రీల అలంకారం దుస్తులు పురుషుని కామ వికారాలకు ప్రేరణగానున్నాయి. నాయక సామ్రాజ్యం లో భోజనం పడక భాజనం అనే విచ్చలవిడిగా మత్తుపానీయాలు, మగువల పొందులు, కలిసి విందులు, అందుకు ఏ డబ్బయినా సరే వెచ్చించి పొందేం సమయం పాలపొంగులా పెరిగిపోతుంది. మరి చెప్పాలంటే....

## ఆహార లోపం

మానవులలో అనుకున్నంతలోనే మానవుని కర్మ జ్ఞానేంద్రియాలు మనసు అనుభవించే వస్తువును ఆక్రమిస్తున్నాయి చమురులేని దీపం పెద్దగా వెలిగి ఆరిపోతున్నట్లు, విషయాల పొందుకు ఇంద్రియాలు కుప్పగా కూలి పోతున్నాయి. ప్రకృతి ధర్మము నుండి విడివడి గీతాకారుడు చెప్పినట్లు అయువు, సత్త్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి వర్ధనము, రసపూర్ణ, సంతోషకరము, స్థిరము, యిష్టమైన దగు ఆహారము వలన ఆధ్యాత్మికవికాసము, దానితో పాటు ఆనందానుభవ విషయము పొందుటకొక పరిమిత జ్ఞానం కలుగుతోంది. అనగా కలిగే ప్రమాదాల నుండి రక్షించబడే దృష్టి ఏర్పడుతుంది. ప్రకృతం ఆ దృష్టిని కప్పివేసేవిషయ మలినం. నల్లని మసిపొగలా మన ఆహార పరిస్థితులు అజ్ఞాన వర్ధకంగా నున్నాయి. ఎట్లన కటువు ఆమ్లము, తీక్షణ, రూక్షము, దహించబడినది, ఉచ్ఛిష్టము, అమేధ్యము, యామము దాటినది, రసము చచ్చినది, మాడినది, కలుషితమైన ఆహారము, రాజస తామస ప్రధానమైన ఆహారమును చేతులారా చేసుకొని తింటున్నాము: పోగా ఉశ్మోవుండిపూటకూళ్ళతిండితింటున్నాము. ధాన్యంపండించడంలో,దానిని మార్కెట్టుకు అందించడంలో, యిక దానిని వంటలవార్పులో తామసాహారంగా గ్రహిస్తున్నాము: కనుకయింద్రియమనోవేగములు పాలపొంగులా పొంగిపోతున్నాయి. యిక వేషాలంకరణలు దానికి ప్రేరణకారిగా నున్నాయి—పరబ్రహ్మ స్వరూప మైన అన్నము-పరమార్థదృష్టికల వేషాలంకరణ (రామ, కృష్ణాది అవతారముల మహానుభావుల) అలంకారాలు చిత్రించు కున్నాం చూడండి-ఏమయినా దృశ్య విషయములు ఆదర్శవంతంగాను-గ్రహించి ఆహారాదులు సాత్త్విక సిద్ధంగాను—పల్లె పల్లెలో పట్టణ పట్టణాల్లో గల మందిర మంటపము లందు ఆధ్యాత్మిక-పురాణ-ఆదర్శ చరిత్ర మనన ప్రబోధ కార్యములు నడచిన మన దేశం సుభిక్షంగా వుండును. ఏడు కొండలవాడి కృపాసిరి నిండుగా నుండును—ఈలా మనం ప్రకృతి ధర్మాన్ని రక్షించిన అది మనలను రక్షించును.

(9వ పేజీ తరువాయి)

వండు సువర్ణాండమే. ఇది వేదంలో సృష్టి విద్యలో విషయం. అక్కడ బంగారు గ్రుడ్డు సృష్టి జన్మస్థానం. ఇక్కడ గుమ్మడివండు. ఇది తాను చూసిన వస్తువు. దీన్ని సువర్ణాండానికి చిహ్నంగా జానపదకవి భావించాడు. ఇలాగే సవరజాతిలోవున్న 'రమ్మ బమ్మ'ల కథ కూడా ఇలాంటిదే.

రాయలసీమ ప్రాంతంలో నేను సేకరించిన "వీపురాజు (పోతలయ్య) కథ కూడా కుమారస్వామి జననాన్ని గురించి జానపదుల భావన చెపుతుంది.

కైలాసంలో పార్వతి ఈశ్వరుడు అన్యోన్యంగా వుండేటపుడు బిడ్డ కావాలని కోరిందట పార్వతి. అతడు ఈ సృష్టిలోని జీవరాశులన్నీ మనబిడ్డలే కాదా అని అన్నాడట. వినలేదు పార్వతి. సరే నీవు భూలోకానికెళ్లి ఏటిగట్టున తోటపెంచి నీళ్లు మోస్తూవుండగా నీ భుజాలు కాయలు కాయాల, చేతులు బొబ్బలెక్కాల. అపుడు నీ కోరిక నెరవేరుతుందన్నాడట. పార్వతి అలాగే చేసింది. సంతు ఇవ్వలేదు ఆ దేవుడు. ఆమె దిగుల్తో ఇసకలో కూసోని వ్రేలితో యల్లేస్తూ వుందట. అపుడు ఆమెకి రెండు పండ్లు దొరికాయట. అవే సంతుఫలమనుకొని ఒకటి తినింది. రెండోది తింటుండగా దేవుడొచ్చి తీసుకొని రెండు పప్పులుచేసి విసిరేశాడు. ఒకటి రక్తంకారి నీటిలోపడి పాతాళానికెల్లి ఏడుగురక్కమ్మగార్లు పుట్టారట. ఇంకొకటి ఏటిగట్టున పడి పాలుకారి ఏడుగురు రాజులు పుట్టారట. పార్వతి నిండు మంచయింది. కనుపొద్దులొచ్చాయి. అపుడు కడుపులో వుండే శిశువు తల్లిని నేను వీపునరావల్నా యోనిలో రావల్నా అని అడిగాడట. తల్లి అందరూ ఎలా వస్తారో అలాగే రమ్మని సెప్పింది. కానీ ఆ శిశువు తల్లి వీపున బయటికొచ్చాడట. అపుడు అతనికి 'వీపురాజు' అని పేరుపెట్టారట. ఈ తన్కి పోతలయ్య అని ఇంకో పేరువుంది. ఏడుగురు అక్కమ్మగార్లు పాతాళం నుంచీ ఈశ్వరుని జడలాధారంగా బయటపడటం. వీరున్న కోటకు వీపురాజు కావలుండక మరూరి మాలోనికి ఇవ్వటంవల్ల కోపంవచ్చి అక్కమ్మగార్లు శాపం పెట్టారు. ఆ శాపంవల్ల ఊరన్నచోటల్లా ఊరకాయలుండటం వీపుకుమాత్రం పూజపెట్టటం, వీరగంధం పూయటం జరుగుతోంది. ప్రతి గ్రామం బయట 'పోతలయ్య' గుడి వుంటోంది.

జానపదుల పురాణాల్లో మరొక తరగతి. పురాణకథల్లో జానపదులు తమ భావనను ప్రకాశింపజేసి కథల్ని వ్యాఖ్యానించుకోవటం ఉదాహరణానికి వరహావతార కథఇలాంటిదే. విష్ణువు శ్రీరామావతారంలో వాలిని చంపాడు. వాలి కొడుకు అంగదుడికి ఆ కోపం అలాగేఉండిపోయింది. ఆ కోపాన్ని తీర్చటానికి విష్ణువు పందిరూపంలో అంగదుడికి అడ్డుపడి వాడిచేత దెబ్బలు తింటాడు. అంగదుడు బోయవాడుగా పుట్టాడట. శైవ వైష్ణవాల్ని కలిపేకథ, ఈ పురాణాల్లో మరొక తెగ. కొన్ని విచిత్ర ప్రశ్నలు వేసుకొని వాటిసమాధానాలు వెతకటం. మొదట అనుములు ఎవరు పండించారు? చారిత్రకంగా ఎవ్వరూ చెప్పలేని ప్రశ్నయిది. దీనికి సమాధానంగా అనుముల బ్రహ్మరెడ్డి కథ పుట్టింది. బ్రహ్మరెడ్డి పాతాళాని కెళ్లి అనుములు, తైదులు (రాగులు) తెచ్చాడట. ఇది కోస్తాజిల్లాల్లో ప్రచారంలో ఉన్న పురాణగేయం. ఇలాగేజాతులపుట్టుపూర్వోత్తరాల్ని గురించి ఇంకా ఎన్నో కథలు ఆయా తెగల్లో ప్రచారంలో ఉన్నాయి. వీటన్నిటా పురాణ లక్షణా లున్నాయి. ఒకో యింటివారికి ఏ ఏ జంతువు, చెట్టు ప్రతీకలవుతాయో (కులదేవతలు) ఒకో జాతి వారికి ఆ కులదేవత పేరిట ఉన్న చెట్లను నరక్కపోవటం, జంతుమాంసాన్ని తినక పోవటం ఇవన్నీ కథల రూపంలో మనకి జానపదుల్లో కన్పిస్తాయి.

మహమ్మదీయుల్లో కనిపించే 'మోహరం పాట'లో కూడా ఈ పౌరాణికలక్షణం కనిపిస్తుంది.

తల్లి పోతిమ తండ్రి మౌలలి
వారికిద్దరు కొడుకులూ
వారికిద్దరు కొడుకులూను
అసే నుసేనన్నదమ్ములూ
అసే నుసేనన్నదమ్ములూ
ఆకాశానికెగిరిరేమో
ఆకాశానికెగిరేమో వారు
యుద్ధము పోయిరీ
వారు యుద్ధము పోయిరీ
గోరయుద్ధము చేసిరీ
గోరయుద్ధము జరిపిరీ
దప్పికలు కొనిరీ
దప్పికలు కొనిరీ
దవుడూలు తీసిరీ
దవుడూలు తీసిరీ
బావిలోకి దుమికిరీ
బావిలోకి దుమికిరీ
యిందువులు వచ్చిరీ
యిందువులూ వచ్చిరీ
బావిచుట్టూ తిరిగిరో
పారిపోరున వచ్చిరీ
బావి చుట్టూ తిరిగిరో
బావిచుట్టూ తిరిగిరీ
యనక్కి మల్లిరో
యనక్కిమల్లిరి
కల్లమింద తొండబక్కి
కల్లమింద తొండబక్కి
మూడుపూపులు పూపెనో
మూడు పూపులు పూపెనో
తలపూపులు చూసిరో
యిందుపూలు చూసిరో
మల్లయనక్కి మల్లిరో
మల్లయనక్కిమల్లిరో
బాయి ముట్టడియేసిరో
బాయి ముట్టడియేసిరి
అసే నుసేనన్నదమ్ములూ
అసే నుసేనన్నదమ్ములూ
తలలుపైకి లేపిరి
తలలుపైకి లేపిరి
వారి తలలు పట్టిరిందువూలూ
వారి తలలు పట్టిరిందువులు
వారి తలలు నరికిరో
వారి తలలు నరికినారు
కట్టెకేమో చెక్కిరో

కట్టెకేమో చెక్కినారు
జావసోను అడిరో
జావసోను అడిరో
తల్లి పొతిమ చూసినాదీ
తల్లి పొతిమ చూసినాది
పారిపొరున బావిదగ్గర కొచ్చెనో
బావిదగ్గర కొచ్చినాది
అసే నుసేనన్నదమ్ములా
అసే నుసేనన్నదమ్ములా
మొండెములుతల్లిపొతిమచూసినాదీ
తల్లి పొతిమ చూసినాది
గోడుగోడున యెడ్చెనో
గోడుగోడున యెడ్చెనో
యాయల్లా యాహుదా యంటూ
యాయల్లా యాహుదా యంటూ
దేవుళ్ళేమో యేడెనో
దేవుళ్ళేమో యేడినాదీ
దేవులేమో వచ్చిరో
అసే నుసేనన్నదమ్ములూ
వారు యిద్దరు నా కొడుకులూ
యీ కొడుకులేమో
గోరయుద్ధము చేసిరీ
గోరయుద్ధము చేసిరి
యిందువులు తలలు నరికిరీ
తల్లి పొతిమ గోడుగోడున
యల్లాహుదాలతో చెప్పెనూ
యల్లాహుదాలప్పుడు
యేడాది కొక్కసారి
నీ కుమారులు బదుకుదూరూ
నీ కుమారులు బదుకుదూరు
పానములు వచ్చునూ
పానములు వచ్చునూ
వారిరత్తము పానకామూ
వారిరత్తము పానకాము
వారి పేవులు పక్కిరిదారాలు
వారి పేవులు పక్కిరిదారాలు
నీవు యేమో గుండామూ
సంతోషాన యిందువూలు
పండగేమో జరిపిరీ
జావసోను అడిరీ
మదిలియేమో తొక్కిరీ ''

(కోయనరసింహులు 35 సం॥ చింతలపల్లి ధర్మవరం తాలూకా)

ఇలాంటి పండుగకు రాయలసీమలో అనంతపురం జిల్లాలోని 'గూగూడు' గ్రామం పేరెన్నికగన్నది.

ఇంతవరకు చర్చించినదాన్ని బట్టి ఒక జాతి ప్రజలు సామాజిక చైతన్యప్రతీకలుగా సూచించుకొన్న పాత్రలన్నీ పౌరాణిక వ్యక్తులే అవుతాయి. ఆ పాత్రల చుట్టూ ఉన్న కథలు పురాణాలవుతాయి.

ఒక చెరువుంది. చెరువుగట్టున గంగమ్మ గుడిఉంటుంది. దానికొక కథ ఉంటుంది. చెరువుకట్ట తెగిపోగా గ్రామంలో ఎవరో ఒకరు బలికావటం. ఆమెపేరు చిరస్థాయిగా నిలిచిపోవటం. ఇలాంటి కథలకు నిదర్శనంగా అనంతపురం చెరువుకట్ట తెగినపుడు బుక్కరాయ సముద్రం గ్రామం కాపుపడుచు అయిన 'ముసలమ్మ' త్యాగం చేయటం. ఆమెనుగూర్చి 'ముసలమ్మ మరణం' అని ప్రచారంలో ఉంది. ఇట్లాగే ధర్మవరం చెరువుకట్ట తెగినపుడు కూడా చిన్నూరు గ్రామం వడ్డెపడుచు 'తిమ్మమ్మ' త్యాగం చేయటం అట్లాంటిదే. ఇలాంటివి దేశంలో మొత్తం ఎన్నో ఉంటాయి. వీటిలో కూడా స్త్రీ త్యాగశీలి అనీ 'సృజనకు ప్రతీక అనీ' వ్యవసాయానికి అధిదేవతనీ జానపదుల దృష్టి. ఈ కథల రూపంలో ప్రతీకరింపబడింది.

ఇక తక్కిన విషయం రామాయణ భారత భాగవతాల్ని జానపదులు ఎలా పాడుకొన్నారో చూడటం. భారత గేయాల్లో ధర్మరాజు జూదం, సుభద్రసారె ప్రసిద్ధమైన జానపదుల పురాణ భావం చెబుతుంది. భాగవత గేయాల్లో భ్రమరగీతాలు, పారిజాతపల్లవి చెప్పుకోదగిన జానపదాంశమున్న గేయాలు. నేను సేకరించినగేయాల్లో చిలిపికృష్ణుని వర్ణన ఇలా ఉంది.

'చీరలన్ని యిడిచి బామా
చిటాపైన పెట్టి
రవికెలన్ని యిడిచి బామా
రెమ్మపైన పెట్టి
సొత్తులన్నీ పీకి బామా
సెట్టుపైన పెట్టి
మునుగుతూ తేలుతూ బామలు
తానమాడబోయిరి
దామిరి చెట్లల్లో కిట్నుడు
దాగిదాగి వచ్చె
నీమిరి చెట్లల్లో కిట్నుడు
నీగినీగి వచ్చె
ముట్టుబట్లనకుండా కిట్నుడు
ముదిరిసంకన బెట్టె
అంటు బట్లనకుండా కిట్నుడు
అదిమి సంకన బెట్టె
వొంటి చేతిదండము కిట్నున
కొప్పగించిరేమో
రెండు చేతుల దండము కిట్నున
కొప్పగించిరేమో
పకపకనగినాడు కిట్నుడు
పైకి పారవేసె
కిలకిలనగినాడు కిట్నుడు
కిందికేసినాడు'

(చిగిచర్ల గంగాధరమ్మ 12 సం॥లు సుబ్బరావుపేట ధర్మవరం తాలూకా)

రామాయణానికి సంబంధించినగేయాల్లో ఊర్మిళాదేవి నిద్ర. లక్ష్మణదేవర నవ్వు, సీత సమర్త, కౌసల్య బైకలు ప్రసిద్ధాలు. వ్యావసాయిక జీవితంలో పాడుకొనే గేయాలు ఇలా ఉన్నాయి.

(సశేషము)

(8వ పేజీ తరువాయి)

చింది. ఆయనవచ్చి, నోటినుండి నురగలు గ్రక్కుచు క్షణంలో విగతజీవుడైనకుమారుని చూచి దుఃఖించినాడు. భార్యను ఓదార్చినాడు. ఈ విషయం బయటకు పొక్కినచో ఆకలితో నున్న అతిథులు భోజనం చేయకుండ వెళ్ళిపోవుదురు. వారు ఆకలితో వెళ్ళినచో ఆ పాపం తమకు చుట్టుకొనును. ఏమిచేసినను పోయినబిడ్డ మళ్ళీరాడు. ఆకలితోనున్న ఈ అతిథులను సంతృప్తి పరచుటయే మనధ్యేయమని, ఈ కార్యక్రమంలో ఎట్టివిఘ్నం రాకుండ వుండుటకై తిరుమల వేంకటేశునికి వేయి మొక్కులు మొక్కుకున్నారు. దుఃఖం దిగమింగినారు. ఆ దంపతులు బాలుని శవాన్ని పెరటిలో ఒక పెద్దగంప క్రింద మూసిపెట్టి 'నీవేదిక్కు' అని ఆపన్నులపాలిదైవమైన ఏడుకొండలవానిని శరణువేడినారు. ఆ ఆలుమగలు ఏమియు జరగనట్లే నిర్వికారంగా అతిథులకు విస్తళ్లు వేసినారు.

వీరి ఆక్రందన తిరుమల ఆనందనిలయంలో ప్రతిధ్వనించింది. వేంకటేశుడు భక్తసులభుడుకదా! క్షణం నిలువలేకపోయాడు. ఆజానుబాహుడు, నేరేడు పండు చాయగలవాడు ఊర్ధ్వపుండ్రములతో పట్టు పంచతో సుమారు డెబ్బది సంవత్సరముల "నామాలతాత"గా వేషం మార్చుకున్నాడు. చేతిలో వెండిపొన్ను కర్రతో ఏడుకొండలు దిగినాడు. అంతే భానుముక్కల గ్రామంలో ఎల్లమరాజు గారింటి అతిథి అభ్యాగతులలో కలిసి పోయినాడు.

విస్తళ్లు వడ్డించబడినవి. ఎల్లమరాజు గారు అందరిని అడిగి అడిగి వారికికావలసిన పదార్థములను తన భార్యచేత వడ్డింపజేస్తూ, తానూ ఒక్కొక్కసారి వడ్డన చేయసాగినాడు. వచ్చిన అతిథులు వారి ఆదరణకు సంతృప్తి చెందారు. భోజనం ముగిసింది. ఆ వచ్చిన అతిథులలో 'నామాలతాత' ఆ దంపతులను పిలిచాడు. "మీ ఇద్దరి వదనంలో ఆందోళన, దుఃఖం కొట్టవస్తున్నట్లు కన్పడుతున్నది, కారణమేమి? దానికి మేమేమైన ఉపశమనం కలిగించ వచ్చుగదా! అంతేకాదు దుఃఖమును దిగమ్రింగిన అది దహించివేయునుతప్ప, మేలు జరుగదు గదా! కనుక మీ పుణ్యదంపతులకు వాటిల్లిన ముప్పు, అది ఎట్టిదైనాకాని సందేహం లేక వక్కాణించుడు" అని ఓదార్పువచనములను ఆప్యాయతతో పలికినాడు. అంతవరకు బలవంతముగా అణచుకొన్న దుఃఖం కట్టలు తెంచుకొనగా ఆ భార్యాభర్తలు బాలుని శవాన్ని తెచ్చి ఆతని పాదములపై వేసి గొల్లుమనిరి. జరిగిన విషయం వినిన అతిథులు గ్రామస్తులు ఆశ్చర్యపడిరి. ఆందోళనతో చింతించిరి.

ఆ నామాలతాత వెంటనే, ఆ ఊళ్ళోనే ఆ పుణ్యదంపతులు ప్రతిష్ఠించిన శివాలయం ఎదురుగా వారే త్రవ్వించిన బావినుండి ఒక పాత్రతో నీటిని, అందులోనిమట్టిని తెప్పించుమనెను. అట్లే ఎవరో తెచ్చి ఇచ్చిరి. నామాలతాత ఆ పాత్రలోని నీటిని మట్టిని కలిపి "ఓం వేంకటేశాయనమః" అను అష్టాక్షరితో మంత్రించి ఆ పిల్లవాని నోటిలో పోసెను. వెంటనే తిరుమల శ్రీనివాసుని వరప్రసాది అయిన వెంకటప్ప నిదురనుండి మేల్కొన్నట్లు లేచెను. ఎల్లమరాజు దంపతులతోసహా అచటచేరిన జనసమూహం ఆనందించారు. ఆ నామాల తాతయ్యకు భక్తితో నమస్కరించారు. మిగిలిన నీటిని మట్టిని కలిపి మంత్రించి ఆ నామాలతాత మరల అదే బావిలో పోయించి "మున్ముందు ఎవ్వరికైనా పాముకరచిన ఎడల ఆ బావిలోని నీరు, బురద కలిపి త్రావించిన పాము కరచిన వ్యక్తికి స్వస్థత చేకూరగలదని" చెప్పి, ఆ భార్యా భర్తలను కుమారునితో తిరుమల యాత్ర చేయవలసినదని ఆజ్ఞాపించెను. తదుపరి నామాలతాత అనుజ్ఞమేరకు వారిరువురు కొడుకుతోకూడ భోజనమునకు కూర్చుండిరి. వారు భోజనం చేసి వచ్చి చూడగా భుక్తాయాసంతో కునుకుతీస్తున్న అతిథులలో నామాలతాత కన్పడలేదు. మిగిలిన అతిథుల నడుగగా వారును ఆశ్చర్యపడిరి. ఆ వచ్చిన నామాలతాత తమ కొరకై వేంచేసిన శ్రీ వేంకటేశ్వరుడే అని భక్తితో స్వామిని ప్రార్థించిరి. ఆయన ఆజ్ఞానుసారం తన ఇంట ఆతిథ్యం తీసుకొన్న యాత్రికులతో కలిసి ఆ పుణ్య దంపతులు తిరుమల యాత్రచేసి, వేంకటేశ్వరునికి అనేక విధముల మ్రొక్కులు చెల్లించిరి.

ఇందుకు నిదర్శనంగా, భానుముక్కల గ్రామంలో ఎల్లమరాజు త్రవ్వించిన బావిలోని నీటిని మట్టిని, పాముకరచినవారు స్వీకరిస్తూ నేటికీ స్వస్థత పొందుతున్నారు.



ఎల్లమరాజు త్రవ్వించిన బావి.

ఒకమారు ఒక అంధబ్రాహ్మణుడు తిరుమల యాత్రకు తోటివారితో వెళ్లాడు. కాలిబాటన కొండ ఎక్కుతూ, ఏడు కొండలను గూర్చి తనతోవచ్చినవారు చెప్పుకుంటూ ఆనందిస్తుండగా తానూ, చూడలేకపోతినే అని కుమిలి పోయినాడు. శ్రీ వేంకటేశ్వరుని వైభవమును, దివ్య మంగళ విగ్రహమును గూర్చి విని కన్నులారా దర్శింప లేకపోతినే అని దుఃఖించాడు. పూలంగి సేవలో వున్న స్వామి రూపాన్ని దర్శించి పులకించ లేకపోతినే అని పరిపరి విధముల పరితపించినాడు. అసలు నీరూప మెలాగ వుంటుందో ఊహించుకోలేక పోతున్న పుట్టు గుడ్డి వాణ్ణి ప్రభూ! పాపిష్టి వాడిని! ఏ జన్మలో ఏ పాపం చేశానో? వెంకటరమణా! సంకట హరణా రక్షించ వలసింది. నాకు కన్నులు దయ చేయ వలసింది, అని అనేక విధముల దీనంగా ప్రార్థించినాడు. అలసి అలసి నిద్రించినాడు.

వేంకటేశుడు నమ్మిన వారిని మోసం చేస్తాడా? ఆ గుడ్డివాని మొరను ఆలకించాడు. స్వప్నంలో సాక్షాత్కరించాడు. "భక్తా కర్నూలు మండలంలో భానుముక్కల యను గ్రామం కలదు. ఆ గ్రామాధికారి ఆళ్ళగడ్డ ఎల్లమరాజు. ఆయన మహాదాత. ఎవరు ఏవేళ ఏది యాచించినను సంకోచం లేక ఇవ్వగల మహాత్యాగి. మీదు మిక్కిలి నా ప్రియ భక్తుడు. నేను ఆదేశించినట్లుగా నీవు ఆయన దగ్గరకు వెళ్ళి అర్థించు. ఆయన ఇంతవరకు సంపాదించిన దాన ఫలాన్ని ధారపోసిన నీకు ఒక కన్ను మాత్రమే వచ్చును. తదుపరి నీవు వేంకటాచల యాత్ర చేయవలసింది. ఆ రెండవ కన్ను నేను అనుగ్రహింప గలను. నీ అభీష్టము నెరవేరగలదని" ఆదేశించెను.

ఆ పుట్టు గుడ్డియైన బ్రాహ్మణుడు మేల్కాంచి ఆశ్చర్యముతో ఈవిషయమును తన వారితో విన్నవించెను. వారును ఆనందించిరి. తదుపరి అతి ప్రయాసల కోర్చి ఆ అంధ విప్రుడు భానుముక్కల గ్రామం చేరు కొన్నాడు. అతిథులకై ఎదురు చూస్తున్న ఎల్లమరాజు వీరిని భక్తి పూర్వకముగా ఆహ్వానించాడు. తనకు స్వప్నములో శ్రీ వేంకటేశ్వరుడు కన్పించి, ఆదేశించిన విషయాన్ని ఎల్లమరాజుతో విన్నవించి, అంత వరకు ఆయన సంపాదించిన దాన ఫలమును తనకు దానముగా నిమ్మని యాచించెను.

ఆ అంధునికి చూపువచ్చినచో తన జన్మ ధన్యమగునని తలచినాడు ఎల్లమరాజు. తానాసంగునట్టి ఈ దానముతో ఆ అంధుని మనోరథము ఈడేరునటుల కోటి విధముల శ్రీ వేంకటేశ్వరుని స్మరించి ప్రార్థించినాడు తన దాన ఫలమును అతనికి ధారపోసినాడు ఆశ్చర్యము! అత్యద్భుతము!! ఆ విప్రునికి ఒక కన్ను వచ్చినది. వెంటనే చూపుసఫలమైనది. ప్రథమ దర్శనంలోనే మహాదాత ఎల్లమరాజును, ఆ ఎల్లమరాజులో చాయగా శ్రీ వేంకటేశుని దర్శించినాడు విప్రుడు. తనకు చూపు ప్రసాదించిన దాత ఎల్లమరాజును వేయివిధముల స్తుతించి, దండప్రణామములాచరించాడు. తదుపరి ఆయన అనుజ్ఞగైకొని వేంకటాచలముచేరి దేవదేవుడైన శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించినాడు అనేకవిధముల కీర్తించి, స్మరించినాడు. స్వామి అనుగ్రహముచే రెండవ కన్నును కూడ పొంది సఫలీకృతుడై వెడలినాడు.



## ధర్మ రక్షణ కార్యక్రమాలు

ఒంగోలు తాలూకా ఉప్పుగుండూరులోని శ్రీ వేంకటేశ్వర భక్తబృందం అక్టోబరు 7 వ తేది తిరుమల తిరుపతి దేవస్థానము హిందూధర్మ రక్షణసంస్థవారి సౌజన్యంతో దేవీనవరాత్రులను ఘనంగా ప్రారంభం చేసుకొన్నారు. స్థానిక ప్రోగ్రాం అసిస్టెంటు శ్రీ ఎ. నాగేశ్వరరావు హిందూధర్మ రక్షణ సంస్థ యొక్క కార్యక్రమాలను వివరిస్తూ అందుకు ప్రజల నుండి కూడా సహకారం కావాలని కోరారు. తదుపరి శ్రీ ఎం. శ్రీరామమూర్తి దేవీతత్త్వాన్ని గూర్చి ఉపన్యసించారు. శ్రీ గురిజేపల్లి వీరనాగాచారి భాగవతార్‌చే 'పార్వతీకల్యాణం' హరికథా కాలక్షేపం చేయబడింది. శ్రీ అమరా కోటేశ్వరరావుగారి వందనసమర్పణతో మొదటి రోజు కార్యక్రమాలు ఘనంగా ముగిశాయి.

### సామూహికపూజ :

ప్రకాశంజిల్లా అద్దంకితాలూకా కుర్రవాని పాలెంలో శ్రీ వేంకటేశ్వర మహిళా భక్త సంఘం వారిచే 6-9-83 మంగళవారం రాత్రి 8 గం॥ నుండి 11 గం॥ వరకు సామూహిక పూజలు నిర్వహింపబడ్డాయి. భక్తులందరిచే శ్లోకాలను పలికించుట - వాటి వివరణను శ్రీ ఎ. నాగేశ్వరరావు, శ్రీ కె. రామకృష్ణలు నిర్వహించారు. ఆ ఊరి చరిత్రలో ఇది మహత్తర ఘట్టం అని అనడం జరిగింది. శ్రీమతి నాదెండ్ల శేషారత్నమ్మ వందన సమర్పణచే నాటి సమావేశాలు ముగిసాయి.

### గీతాకంఠస్థం :

ఒంగోలు తాలూకా త్రోవగుంటగ్రామం శ్రీ వేంకటేశ్వర భక్తసంఘంవారు తి.తి.దే. వారి హిందూధర్మ రక్షణసంస్థ వారి సాయంతో నవంబరునెలలో భక్తియోగాన్ని పూర్తిగా కంఠస్థం చేసినారు. ఆ భక్తులకు ఉపాధ్యాయులుగా శ్రీ పెర్ల వామనరావు శ్రద్ధతీసుకున్నారు. వారికి సంఘం ప్రత్యేక అభినందనలు తెలిపారు.




తలుపు భళ్ళున తెరుచుకుంది. మా అప్పారావు నరసింహావతారంతో లోపలికి దూకినంత పనిచేశాడు. కూర్చోమన్నాను. తెలిసిందేగా వాడి వాలకం! నుంచునే పారాయణ మొదలుపెట్టాడు.

"నీకేమన్నా మతుందా? అసలు మతుందా అని?"

"నాకేమీ అర్థంకాలేదు. అలాగేచూస్తూ ఉండిపోయాను. తిథి ఏమిటా" అని లెక్క కడుతూ!!

"ఆయనతోటి అంతగా పూసుకు తిరుగుతున్నావేమిటీ! నువ్వేమో ముప్పొద్దులా ముక్కుమూసుక్కూచుంటావు! మరి ఆయనో! పచ్చిహేతువాది; పరమనాస్తికుడు. కాస్తమంచీ చెడూ చూసుకోక్కర్లా?" ఇంకా ఏదో చెప్పబోతున్నాడు. ఇది వీడి సొంతబుద్ధికాదు. కనుక బాధేమిటో అర్థమైంది.

ఇంతకీ ఆయన నాస్తికుడా? హేతువాదా? అన్నాను మామిత్రుణ్ణిగురించి అంచనా తెలుసుకుందామని.

ఆ అగ్గికి ఈ గుగ్గిలంకూడా తోడైనట్లుంది చర్రుమన్నాడు. 'ఇదేనీతో వచ్చినచిక్కు! చెప్పింది వినవు, పైగా కుంటిప్రశ్నలూ.

"ఏరాయైతే ఏమిటో..........." ఇంకా ఏమిటో గొణుక్కుంటూ, ఎంతహడావుడిగా వచ్చాడో అలాగే తలుపు మూసివెళ్ళిపోయాడు.

అప్పుడర్థమైంది మనిషిది ఎంతటి మంకుబుద్ధో! తనకు తెలియనిది తెలుసని, తనకు తెలిసిందే తెలివని, మనీషుల బుర్రఖాలోని మనలాంటి (అదేమాఇద్దరి) మామూలు మనుషుల మూలంగా సమాజవాదాలకు ఎంతటి వివాదాలగతి పట్టిందా అనిపిస్తుంది. ఒక సమస్యకు ఇంకొకరూపం కల్పించుకుని, మనంచూసే రంగుటద్దాల చూపు ఇది!

అసలీజాతిజీవనంలో వాదాలు కొత్తవి కావు. మనబుద్ధి వికాసపరిమితులననుసరించి ఈ దేశంలో అనేక వాదాలు తలెత్తుతాయి. హేతువాదంకూడా అంతే. కాకపోతే వేరువేరు పేర్లతో వాడుతున్నాం.

వేదప్రామాణ్యానికి సంబంధించి మనం చెప్పుకునే ప్రత్యక్షఅనుమాన ప్రమాణాలు ఈ కోవకే చెందుతాయి. చరాచర ప్రపంచాన్ని గూర్చి తెలియనిది తెలుసుకోవాలన్న మానవుడి తపన (దీన్నే పెద్దవాళ్ళు జిజ్ఞాస అన్నారు.) ఫలితాలు అంతరాన్ని బట్టి వాదాల పరిధులు మారుతుంటాయి.

ఉపనిషత్కాలంలో కూడా ఈ ప్రపంచం ఏమిటి? ఎందుకు పుట్టున్నది. ఇన్నివస్తువులు ఎక్కడనుంచి ఉద్భవిస్తున్నవి? ఈ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఏవిటి? వీటిగతేవిటి, వాటికి గతేవిటి? ఈలా పదార్థవిజ్ఞానంతో పాటు వస్త్వంతర విజ్ఞానాన్ని సమీక్షించటం జరిగింది. ఈవాద ప్రతివాదసారాలే మనకు వివిధ శాస్త్రాల రూపంలో సాక్షాత్కరించాయి. పదార్థ విజ్ఞానంతో భౌతికవాదం నిలిచిపోగా, ఇంకాకొద్దిగా ముందుకు సాగిన మహర్షులు ఒకానొక మహత్తరజ్యోతి స్వరూపాన్ని భావించి 'కస్మై దేవాయ హవిషా విధేమ' అని తర్కించి తర్కించి, ఆ వాదనలో కూడా ఒక ఆరాటాన్ని ప్రదర్శించారు. ఇలావస్తుతత్త్వ పరిశీలనమే అన్ని వాదాలకు ఆద్యం అయింది.

రామాయణంలో కూడా ఈ భౌతిక లేక హేతువాదం జాబాలిలో కన్పిస్తూంది.

"యథాగ్రామాంతరం గచ్ఛన్నరః కశ్చిత్క్వచిద్వసేత్
ఉత్సృజ్య చ తమావాసం ప్రతిష్ఠేతాపరే ఒహని
ఏవమేవ మనుష్యాణాం పితా మాతా గృహం వసుః
గతప్సన్నృపతిస్తత్ర గంతవ్యం యత్ర తేన వై
ప్రవృత్తిరేషా మర్త్యానాం..........

ఊరుగూరు పోయి ఒకచోట నివసించిన వ్యక్తి, కొంతకాలం తర్వాత ఆ ఊరితో సంబంధం వదులుకొన్నట్లుగానే జీవవ్యాపారంకూడా ఏ పంచభూతాలనుండి వచ్చాడో ఆ పంచభూతాలను చేరిపోవటమే లోకధర్మం. ఇది ప్రత్యక్ష ప్రమాణము.

ఇక భారతం దగ్గరకువస్తే రెండవరకం హేతువాదం కన్పిస్తుంది.

ఈతని వృద్ధని యెఱిగి పూజించితే
వసుదేవు డుండంగ వసుమతీశ!
ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుండుండ ధర్మయుక్తి
నాచార్యుడని వినయమున బూజించితే
కృతమతుల్ ద్రోణుండు కృపుడునుండ
భూనాథుడనియెడుబుద్ధి బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీద
బూజనీయులైన పురుషుల లోపల
నెవ్వడయ్య కృష్ణుడు..........

ఇది కార్యకారణసంబంధంలోనుంచి ఉత్పన్నమైన అంటే అనుమాన ప్రమాణావిర్భూతమైన హేతువాదం.

భౌతికవ్యవహారమంతా సహేతుక పరిశీలనలమీద ఆధారపడిందే. లౌకికశాస్త్రాలన్నీ రెండు రెండు నాలుగులాంటి సార్వత్రిక, సర్వసమ్మత సిద్ధాంతాలమీద ఆధారపడ్డ భౌతికశాస్త్రదృష్టి పరిశీలనాత్మకమై ఒక పరిధివరకే సాగుతుంది గనుక, విజ్ఞాన విశ్లేషణం కూడా ఆ పరిధికే పరిమితం ఔతుంది. ప్రత్యక్ష అనుమాన ప్రమాణాల

వరకే వెళ్ళగలిగిన భౌతికవాదం 'శాస్త్ర యోనిత్వాత్' అనేదాన్ని కూడా తుల్య వాదాలవరకే పోయి, తమ అన్వేషణ ఫలాన్ని సిద్ధాంతీకరిస్తుంది.

ఇంతవరకు ప్రాచీనులు అర్వాచీనులు కూడా చేసింది చేయగలిగింది ఒకటే. అందుకే భౌతికశాస్త్రాలన్నీ భాషాభేదం తప్ప ఇతరులకున్నట్లుగానే బహుశః అంత కంటే ముందుగా మనకే వున్నవి. కేవలం భౌతికవాదాన్ని సిద్ధాంతీకరించే దర్శనాలను మనం నాస్తిక దర్శనాలన్నాం.

అయితే మానవుడిమేధ భౌతికవాదాల సరిహద్దులు దాటి ఆ వాదవిశ్లేషణం చేస్తున్నది. ప్రపంచధర్మం ఇది, వస్తు ధర్మం ఇది, చరాచరధర్మాలు ఇవి అనే భౌతిక విషయాధారితమై శాస్త్రాలు చెప్పిందాన్ని అవి ఆలానే ఎందుకున్నవి వాటి గతులలో ఎందుకు మార్పు రాలేదు? సమధర్మకర్మాశ్రితాలన్నీ సమఫలాన్నివ్వవలసి వుండగా వ్యత్యయం ఎందుకు ఏర్పడుతున్నది? వరదలు భూప్రకంపనాలు అగ్నిద్వీపాలతో అప్పుడప్పుడు లయతప్పినట్లు కన్పించే ఈ సృష్టిలోని ధర్మాలలో విశృంఖలతకు అవకాశం ఉన్నా కూడా ఎప్పుడూ వ్యత్యయం ఎందుకు జరగటం లేదు. ఇలాంటి ప్రశ్నలకు సమాధానం కోసం విశ్లేషణచేసి చేసి, సృష్టి అనేది కాకతాళీయం కాదని అంతర్నిహిత స్వకర్మ ధర్మచోదితం అంతకన్నా కాదని ఆచంద్రతారకమైన ఈ చరాచర విశ్వచాలనకు ఒకానొక మహత్తరశక్తి అనంతనిత్య చైతన్యంవున్నదని, ఆచైతన్య దయాకిరణ ప్రసార ఉపసంహారాత్మకమై సృష్టి ప్రభవ ప్రళయాల మధ్య పరిభ్రమిస్తుందనీ, త్రికాలాతీత నిర్గుణ నిరంజనం నుండి ధర్మకర్మాశ్రితమైన సగుణప్రపంచం ఆవిర్భవిస్తుందనీ, ఆ మహత్తరశక్తే బ్రహ్మ విష్ణువు శివుడని శక్తి అని మన మహర్షులు అనుభూతి పూర్వంగా తెల్పినదే, ఆధ్యాత్మిక సిద్ధాంత స్థూలరూపం.

భౌతిక వాదాలతో ఇది సాధ్యంకాని విషయం కనుక, ఈ రెండూ మానవ జీవితంలో సమానాంతర రేఖలలా నడుస్తుంటాయి. ఈ రెండింటికి సమన్వయం సాధించాలంటే ఆత్మజ్ఞానం ఉన్న భౌతిక విజ్ఞాని అన్నా కావాలి. భౌతిక విజ్ఞానాన్ని తరచిన ఆత్మజ్ఞాని ఐనా కావాలి. అందుకే రెండూకూడా అనాదిగా జనజీవన ప్రవంతికి మకుటాలుగా తయారైనాయి. కనుక ఈ జాతికి ఏ వాదము క్రొత్తగాదు.

అసలింతకూ ముఖ్యమైన విషయం. ఇప్పుడు హేతువాదం పేర ప్రచారమౌతున్నది, మనకు తెలిసిన మనం మరచిపోయిన మానవతావాదమే కాని వేరే ఏమీ లేదు. సమతాధర్మాన్ని మమతను గాలికి వదలి, మతం ముసుగులో సమాజంలో జరుగుతున్న అత్యాచారాలను ఎదుర్కొనటము జరుగుతున్నది. మనిషి బాధలకు పూర్వజన్మకృతపాపమే కారణమని ఔషధాలతో, జపదాన తర్పణలతో శాంతి కలుగుతుందని మన శాస్త్రాలే చెప్తుంటే, దాంట్లో మొదటిదాన్ని వదలి దైవం మానుషరూపేణ అంటున్న మాటను కూడా లెక్క చేయకుండా, మనిషి మాకొద్దు ఆ దైవమే దిగిరావాలని మంకుపట్టుతో మొద్దుబారిన బుద్ధిజీవుల మంకుతనాన్ని తొలగిస్తే సక్రమంగా వుంటుందనే పద్ధతి హేతువాదులే కాదు ఎవరైనా అంగీకరించాల్సిందే. సాంఘిక ప్రయోజనాలకు సంబంధించినవి చాలా వున్నై. వీటిలో ఎన్నిటిని ఎంత త్వరగా మనం మార్చుకో గలిగితే అంత త్వరగా ఈ హేతువాదం బలహీనమౌతుంది.

ఇక మిగిలినదల్లా నాస్తికవాదం ఇది ఒకనాటిది కాదు. ఒక ఏటిదికాదు. మనిషి ఉన్నంత కాలం ఈ అస్తి నాస్తి విచికిత్స జరుగుతూనే వున్నది. దీనికి సంబంధించి పురాణాలలోనే ఎన్నో కథలున్నై. కొన్నిటి అన్వయంలో కొద్ది తేడాలున్నా ఏదైనా భౌతిక వాదులనుకున్నంత తేలికగా కొట్టి వేసుకోతగ్గది కాదు ఆధ్యాత్మికవాదం. చిరంతన తపఃఫలంగా మహర్షులార్జించి ఇచ్చిన విజ్ఞానాన్ని మనం అంగీకరించ గల్గినప్పుడు ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని తోసిపారేయటం సహేతుక మనిపించుకోదు. ప్రతిదానికి కొన్ని ప్రక్రియలున్నై. వాటి మీద చిత్తశుద్ధితో, ఆరోపణ దృష్టితో కాక అన్వేషణ దృష్టితో ప్రయత్నం కొనసాగిస్తే సత్ఫలితం కనబడవచ్చు. పరులుప్రాముఖులైనప్పుడు మనం అంతర్ముఖులం కావాలి. అంతే.

అసలీ వాదాలు వాటి సారాలు సమాజహితం కోసం మేలుకోసమేట. ఆ మాట జాబాలే చెప్పివున్నాడు.

న నాస్తికానాం వచనం బ్రవీమ్యహం
న నాస్తికోఽహం నచ నాస్తి కించన
సమీక్ష్య కాలం పునరాస్తికోఽభవం
భవేయ కాలే పునరేవ నాస్తికః.
సఽచాపి కాలో యముపాగతశ్శనైః
యథా మయా నాస్తికవాగుదీరితా
నివర్తనార్థం తవ రామ కారణాత్
ప్రసాదనార్థం చ మయైతదీరితమ్॥

అయ్యా! ఇదీ మన వాదాల తంతు.

నాగరాజ్

శ్రీ గోవిందరాజస్వామి ఆలయం, తిరుపతి

## తెప్పోత్సవ కార్యక్రమములు

| | | | | |
|---|---|---|---|---|
| 12-2-84 | — | ఆది | — | శ్రీ కోదండరామస్వామివారు |
| 13-2-84 | — | సోమ | — | శ్రీ కృష్ణస్వామివారు, శ్రీ ఆండాళ్‌అమ్మవారు |
| 14-2-84 | — | మంగళ | — | శ్రీ గోవిందరాజస్వామివారు |
| 15-2-84 | — | బుధ | — | ,, |
| 16-2-84 | — | గురు | — | ,, |

# వార్తాలహరి



## శ్రీవారి పుష్పయాగం

'83 నవంబరు 12వ తేదీన తిరుమలలో పుష్పయాగ మండపంలో ఉభయదేవేరులతో వేంచేసివున్న శ్రీ స్వామివారికి అత్యంత వైభవంగా పుష్పయాగం నిర్వహింపబడింది. విశిష్టమైన ఈ ఆర్జితసేవలో 15 మంది గృహస్థులు పాల్గొనడం జరిగింది. సుగంధ పరిమళాలను వెదజల్లుతున్న వివిధ రకాలైన రంగురంగుల పుష్పాలతో శ్రీవారికి అర్చన జరుపబడింది. 108 బిల్వపత్రాలతో శ్రీవారిని అర్చన చేయడం ఈ ఉత్సవంలోని మరొక విశేషం. ఆగమ శాస్త్రోక్త పూర్వకంగా నిర్వహింపబడిన ఈ సేవలో దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి స్వయంగా పాల్గొని పర్యవేక్షించారు. పుష్పయాగమండపాన్ని అలంకరించడం, యాగానికివలసిన పుష్పాలను సమకూర్చడంవంటి పనులను దేవస్థాన ఉద్యానవన విభాగాధికారి శ్రీ తమ్మణ్ణ చక్కగా నిర్వహించారు.

నాటి సాయంత్రం శ్రీ వేంకటేశ్వరస్వామి జన్మనక్షత్ర (శ్రవణం) శుభసందర్భంగా జరిగిన సహస్రదీపాలంకరణ సేవలో ఏడుగురు భక్తులు పాల్గొనడం జరిగింది. దాదాపు 40 వేల మంది భక్తులు ఈ ఉత్సవాలను తిలకించారు. ఆనాటి ఉత్సవాల్లో శ్రీవారి ఆదాయం రు. 5.5 లక్షలు.

## ఆస్థానవిద్వాంసులకు సన్మానం

తి. తి. దేవస్థాన ఆస్థాన విద్వాంసులు పండిత శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులను బ్రహ్మోత్సవాల సందర్భంలో కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి శేషవస్త్రంతో సత్కరించారు.

ఆచార్యులవారు బాపట్లతాలూకాలోని చెందోలు గ్రామంలో 1894 జూన్ 21న జన్మించారు. శ్రీ వేంకటరామాచార్యులు శ్రీమతి రామానుజమ్మ వీరి తల్లిదండ్రులు. ఆగమ, తర్క, న్యాయ, మీమాంసలను ప్రసిద్ధ పండితులవద్ద క్షుణ్ణంగా అభ్యసించారు. అనేక విద్వత్సభలలో గౌరవింపబడ్డారు. 1955లో తి.తి.దే. ఆస్థానవిద్వాంసులుగానియమితులైన నాటినుండి శ్రీవారి సేవలో వీరిపాత్రఅమోఘం. ఉత్సవాదులు, ప్రతిష్ఠలు, ఆగమ, అర్చనాదులు మున్నగు అనేక విషయాల్లో తి. తి. దే. అధికారులు.



[4వ పేజీ తరువాయి]

లౌకికానికే కాదు పారలౌకికాలకుకూడా సూర్యుడే ప్రధానదైవం. పితృదేవతలను మూడుతరాల వారిని వసు, రుద్ర, ఆదిత్య రూపులుగా గౌరవించటం సంప్రదాయం. మరి రవి ఆ మూడు కూడా శ్రాద్ధాది కర్మలలో 'జ్యోక్చ సూర్యం దృశే' అని విధించటంకూడా ఆదిత్య ప్రాధాన్యాన్నే వివరిస్తుంది

ఇంతెందుకు జడచేతన సమ్మిళిత విశాల విశ్వానికి ఆదిత్యుడే కర్త, హర్త, సాక్షి మాత్రమేకాదు. భౌతిక, పారలౌకిక ఫలప్రదాత కూడా. ఋగ్యజుస్సామ పారగుడుగా మతినందిన అద్భుత తేజఃపుంజం క్రమగతులలో దక్షిణాయనంలో లౌకిక ప్రయోజనాలను, ఉత్తరాయణంలో పుణ్యప్రాప్తిని కల్గిస్తున్నది. మరి ఇది మకరసంక్రమణకాలం. ఐహికంగా కూడా అధిక వైభవప్రదం. లక్ష్మీకరం. ఆ ప్రత్యక్షదైవం శక్తి సామర్ధ్యాల సంగతెలావున్నా, ఉన్న అవలక్షణాలతో పాటు కృతఘ్నతా (చేసిన మంచిపని పనిగట్టుకు చెడగొట్టటమనే) మకరం బారినుండి దాటిపోగల శక్తి నిత్య శంకాపూర్ణుడైన మానవ జ్ఞాన భాస్కరరూపికి మాత్రం ఇంకా ఏర్పడలేదు. అందుకే 'కృతఘ్నఘ్నుడు'గా ఏ దేవతకు లేని పేరొందిన ఆ ఆదిత్యరూపి పరదేవతను మన శంకాది సమస్యామకర దళనానికి ప్రార్థిద్దాం.

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః

# సప్తగిరి విక్రేతలు

## వరంగల్ జిల్లా

శ్రీ ఎ. రంగాచార్య,
12-5-5, ఎస్. వి. ఎన్. రోడ్డు,
తెలుగు లైబ్రరీ ఎదుట,
పాపయ్యపేట చేమన్, వరంగల్ - 506 002

శ్రీ బి. యతిరాజులు,
S/o నారాయణ, 1-7-67, గిరునిగడ్డ.
జనగామ - 506 167.

శ్రీ బి. నారాయణ,
మహబూబ్ నగర్, తొర్రూరు - 506 163.

శ్రీ బి. గోవర్ధన్, టీచర్,
జడ్. పి. ఎస్. ఎస్. నేకొండ - 506 122.

శ్రీ జి. నరసింహాచార్య,
S/o శ్రీ జి. కృష్ణమాచార్య,
కత్రపల్లి పోస్టు, (వయా) రాయపర్తి,
వర్ధన్నపేట తాలూకా

శ్రీ ఐతా లక్ష్మీనరసయ్య,
లక్ష్మీ మెడికల్ అండ్ జనరల్ స్టోర్సు,
9-70, నరసంపేట-506 132.

## విజయనగరం జిల్లా

శ్రీ బి. వెంకటరాజు,
శ్రీ వేంకటేశ్వర క్లాత్ ఎంపోరియం,
ఎమ్. జి. రోడ్డు, క్లాక్ టవరుదగ్గర,
విజయనగరం - 531 201

## విశాఖపట్నం జిల్లా

శ్రీ వీరునాయుడు,
శ్రీ సాయివారి బుక్ హౌస్, అనకాపల్లి.

శ్రీ వి. వీరభద్రరావు,
ఆంధ్రప్రభ ఏజెంటు,
ఏటికొప్పాక - 531 082.

శ్రీమతి దొడ్డా పద్మజయంతి,
శ్రీభాస్కర్ మెడికల్స్, పాడేరుపోస్టు.

## శ్రీకాకుళం జిల్లా

శ్రీమతి సరస్వతీదేవి,
C/o శ్రీ సంకా మిన్నారావు
న్యూస్ ఏజెంట్, సోంపేట - 532 284

శ్రీమతి ఉప్పలపాటి కృష్ణమ్మ,
C/o శ్రీనారాయణమూర్తి
తెలుగుపండిట్, వంద్రగి పోస్టు,
పొందూరు - 532 160

శ్రీమతి యం. పద్మావతి,
W/o శ్రీ ఎ. యస్. యన్. స్వామి
హెడ్ మాస్టరు, కళింగపట్నం.
యన్. బి. రామారావు, టీచరు,
మాబగం పోస్టు (వయా) నర్సన్నపేట.

శ్రీ కె. రామప్రసాదరావు.
కిరాణఅంగడి, కొండ్రావీధి.
టెక్కలి - 532 202.

## హైదరాబాద్ జిల్లా

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి,
W/o శ్రీ పి. అనంతరామయ్య.
23-5-577, చాపల్లగల్లీ. లాల్ దర్వాజా,
హైదరాబాదు - 500 002

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి,
C/o శ్రీ పి. ఎ. బి ప్రసాద్ (ఎ. ఎఫ్. బి.)
ఫైన్ అండ్ ప్లాన్ - ప్రాజెక్ట్సువింగ్,
ఎ.పి. సెక్రటేరియట్ హైదరాబాదు 500 004.

శ్రీమతి పి. లక్ష్మీకామేశ్వరి,
C/o శ్రీమతి వై. ప్రమీల,
19/65, గౌతమ్ నగర్ పోస్టాఫీసువద్ద,
హైదరాబాదు.

శ్రీ కె. రాజేంద్రప్రసాద్,
C/o శ్రీ బి. రాజారామ్, 1-25 హబ్సిగూడ,
హైదరాబాద్ - 500 007

శ్రీ ఎ. హరి,
S/o శ్రీ ఎ. శ్రీరాములు,
1-5-118, కాందోజిబజారు,
సికిందరాబాద్ - 500 003

శ్రీ వి. టి. బదరీనాథ్,
C/o శ్రీ వి. రంగాచార్యులు
1-1-710/2, శ్రీవాణి కుటీర్,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 380

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press,
by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.




ఫిబ్రవరి 1984

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక

వెల : 1-00





కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే ।
శివాభ్యామస్తోకత్రిభువనశివాభ్యాం హృది పున-
ర్భవాభ్యామానందస్ఫురదనుభవాభ్యాం నతిరియమ్ ॥

— శివానందలహరి.

శిరమున చంద్రరేఖవెలిగేవారు, పరస్పరము తపస్సులకుఫలమైనవారు, భక్తులకు అనంతఫలములనిచ్చువారు, ముల్లోకములకు క్షేమంకరులైన వారు, హృదయంలో మాటి మాటికీ పొడసూపేవారు, ఆనందమయమైన అనుభవం కలవారు అగుచు రెండుదళములవలె నున్న పార్వతీపరమేశ్వరులకు నమస్కారము.

# మీ మాట

## పామరుడు – పరమాత్మ

పామరుడు - పరమాత్మ శీర్షికలోని "గోపికావస్త్రాపహరణ" చాలాబాగున్నది.

ఎం. సుబ్బయ్య — మహబూబ్‌నగరు.

ఎన్. చిన్నయ్య — పొన్నూరు.

## భగవద్గీత

భగవద్గీతకు వేసిన బొమ్మ చాలా బాగున్నది. 5 వ పుటలో "ధనుర్మాసంవిశేషాలు" 41 వ పేజీలో అనివుండాలి. 47 వ పేజీలో అని అచ్చుపడింది.

టి. సుబ్బలక్ష్మి — అమలాపురము.

* పొరపాటుకు చింతిస్తున్నాం. సం॥

## పెళ్లి మంత్రాలు

మన సంప్రదాయంప్రకారం జరిగే పెళ్లి మంత్రాల అర్థం వివరంగా ప్రచురించవలసిందని కోరుతున్నాను. అలాగే పుట్టపర్తి సాయిబాబా గురించి వివరంగా తెలియజేయండి.

శ్రీమతి జయశ్రీ — కొత్తగూడెం.

## ముఖచిత్రం

డిశంబరు పత్రిగిరి "శ్రీ పద్మావతి అమ్మగారి" ముఖచిత్రాన్ని చూడగానే నమస్కరించాలన్న భక్తిభావం కల్గుతోంది. ధనుర్మాస విశేషాలు, కులం - గుణం, పూదోట గేయాలు, పామరుడు - పరమాత్మ, నల్లని అక్షతలు కథ చాలా బావున్నాయి.

జి హేల్వశ్వర — ఆదోని.

కొండపి వాసుదేవమూర్తి — ఒంగోలు.

స్వర్గం తిరుపతిరావు — కొండపల్లి.

## మరోజన్మ

మన మరోజన్మ ఎలావుంటుంది? అని శ్రీ చిట్టా దామోదరశాస్త్రి బాగా విపులంగా వ్రాశారు. అభినందనలు. నల్లని అక్షతలు కథ బాగున్నది.

టి. ఎస్. కె. ఎస్. చలం — ఖమ్మం.

## తోటఉత్సవం

"తిరుమలలో తోటఉత్సవం" 400 స॥ల తరువాత 1983 లోనే జరగడం మన అదృష్టము. డిశంబరు సంచికలో ఈ ఉత్సవ వివరాలు, "పూదోట" పద్యాలు మురిపించాయి.

పి. ఓబులేశు — కర్నూలు.

## భగవదనుభవం

డిసెంబరునెల సప్తగిరిలో పాలకమండలి ఫోటో ప్రచురించినారు. మే సంచికలో శ్రీమతి నన్నపనేని రాజకుమారిగారి ఆస్తిక పరిచయమును హేతుబద్ధంగా అందించారు. చాలాబాగున్నది. సదరుమండలి, అధ్యక్ష, సభ్యుల ఆస్తికాచారములతో పాటు వారి భగవదనుభవములను సంగ్రహముగా అందించ ప్రార్థన.

వి. సింహాద్రి — అచ్చంపేట.

## రక్తులకుకూడ ఆసక్తి! ఆనందం!!

పత్రికలోని వ్యాసాలు భక్తులకేకాక రక్తులకుగూడ ఆసక్తిని, ఆనందాన్ని కల్గిస్తున్నాయి. యువవాణి, గృహలక్ష్మి, బాల ప్రబోధం శీర్షికలు చాల ఉపయోగకరమైన విజ్ఞానదాయకమైన విషయాలు. ప్రకటించుచున్నందుకు మా ధన్యవాదాలు.

కె. నరహరిరావు — నెల్లూరు.

బొండా శ్రీరామమూర్తి — భీమవరం.

## మథనం

నవంబర్ సంచికలో 'మథనం' శీర్షిక నేటి కోడళ్లపై అత్తల అత్యాచారాలు, అత్తలపై కోడళ్ల చిన్నచూపు చక్కగా వివరించారు.

శ్రీపతి నర్సయ్య — గరికపర్తి.

## వ్యాసరచన పోటీలు

యువకులు పాల్గొనేవిధంగా వారిలో ఆధ్యాత్మిక, ధార్మిక భావములు పెంపొందేందుకు అనువుగా చర్చలను, వ్యాసరచనల పోటీలను ఏర్పాటుచేసిన ఎంతయో సమంజసముగా నుండగలదు.

ఎం. వెంకటరమణ — గుంటూరు

## నల్లని అక్షతలు

డిశంబరు మాసమున ప్రచురితమైన "నల్లని అక్షతలు" అంటరానితనానికిదొక నిదర్శనంగా చాలాబాగుంది. ఇలాంటి కథలు మరెన్నో మాకు అందివ్వగలరని ఆశిస్తూ శ్రీ శంకరగంటి రంగాచార్యులుగారిని కోరుచున్నాను.

ఐక్కంరెడ్డి సురేఖ — తిరుపతి.

---

2 వ కవరుపేజి:

### తి. తి. దేవస్థాన విద్యాసంస్థలు

1. ఎస్. వి. బాలమందిర్
2. శిల్పకళా పాఠశాల
3. మహిళా పాలిటెక్నిక్
4. ఎస్. వి. ఆర్ట్సు కళాశాల
5. మూగబధిరాంధుల పాఠశాల
6. ఎస్. వి. ఉన్నతపాఠశాల
7. ఎస్. వి. సంగీత కళాశాల
8. పద్మావతి స్త్రీల కళాశాల

3 వ కవరుపేజి:

### తి. తి. దేవస్థాన యాత్రికుల వసతిగృహములు–ధార్మిక సంస్థలు

9. కాంటీన్ కాంప్లెక్సు, తిరుమల.
10. ఉచిత ధర్మశాల, తిరుపతి.
11. ఎస్. వి. అనాథశరణాలయం, అక్కారాంపల్లి.
12. అన్నమాచార్య కళామందిరం, తిరుపతి.
13. ఆంధ్రాశ్రమం, ఋషీకేష్.
14. ఉచితవైద్యశాల, తిరుపతి.
15. కల్యాణకట్ట, తిరుమల.
16. ఎస్. వి. అతిథిగృహము, తిరుమల.

4 వ కవరుపేజి:

### తి. తి. దేవస్థాన పాలనలోని ఆలయాలు

1. శ్రీ గోవిందరాజస్వామిఆలయం, తిరుపతి
2. శ్రీ వేంకటేశ్వరస్వామిఆలయం, పిట్సుబర్గు, యు. ఎస్. ఏ.
3. శ్రీ వేదనారాయణస్వామిఆలయం, నాగలాపురం.
4. శ్రీ కోదండరామాలయం, తిరుపతి.
5. శ్రీ పద్మావతిఅమ్మవారిఆలయం, తిరుచానూరు.
6. శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామిఆలయం, శ్రీనివాసమంగాపురం.
7. శ్రీ కపిలేశ్వరస్వామిఆలయం, తిరుపతి.
8. శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామిఆలయం, నారాయణవరం.



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

గౌరవసంపాదకులు :
శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :
కాట్రపాటి సుబ్బారావు, ఎమ్. ఎ

*

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00
సం॥ చందా - రు. 12-00

*

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

ఫిబ్రవరి 1984
సంపుటి 14 సంచిక 9



ముఖచిత్రం : తి. తి. దే. పరిపాలనావ్యవస్థ స్వర్ణోత్సవాలు. చిత్రకారుడు : శ్రీ కె. జగదీష్.

# సంపాదకీయం

వ్యాప్తి అవగానే ముందు జ్ఞప్తికి వచ్చేది వామనావతారకథ. చిన్న బాలకుడుగా దానంపుచ్చుకున్న వామనుడు ముల్లోకాలను పదత్రయంతో ఎలా ఆక్రమించాడో ఈ కథ వివరిస్తుంది. అలాగే శైవవాఙ్మయంలో కూడా జ్వాలాలింగమూర్తికథ తామంటే తాము గొప్పఅని బ్రహ్మవిష్ణువులు తగాదాపడినప్పుడు పరమశివుడు మహాలింగరూపంలో ఎలా సాక్షాత్కరించింది, అనృతదోషానికి గురైనబ్రహ్మ ఎలా ఈశ్వర శాపానికి గురైందికూడా ఈ కథలో వుంది. అంటే దీనివల్ల మనం తెలుసుకోవలసింది; త్రికాలాబాధ్యమైన సత్యం సర్వవ్యాపిగా వుంటుందని, అది ఆద్యంతరహితమని, కొలుచుకోవాలనుకోవటం, మలచుకోవాలనుకోవటం, మన తృప్తికోసం, మనస్తృప్తికోసం అని.

నిజానికి వేంకటేశ్వరదివ్యసామ్రాజ్యంకూడ ఇంతే. స్వయంవ్యక్తుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారు ఎప్పుడు స్వామి-పుష్కరిణీతటాన ఆవిర్భవించారో మనకు తెలియదు. కలియుగారంభంనుండి అన్నట్లు పురాణాలు చెప్తుంటే, ఆధునికభాషలో క్రీస్తుశకం ఆరోశతాబ్దికి ముందు అని మాత్రం లెక్కకట్టి కొంత నిర్ణయించుకొన్నాం. ఋగ్వేదంలో వెదకుతున్నాం. స్వామిని వర్ణించిన ఆళ్వారుల ఆవిర్భావాన్ని అంతంతగానే అంచనా వేసుకోగలిగాం. తమిళసంఘకాలాన్నిగూర్చి ఇంకా సంశయాలు తొలగలేదు. ఇవీ మన ఊహల్లోవున్న అంతరాలు.

అలాగే స్వామివారిఆలయ నిర్వహణముగూర్చి కూడా సమగ్రమైన అంచనాలులేవు. ఇంకా ఎంతో లోతుకు దిగితేకాని తెలియదు మనకు బాగా తెలిసిందిమాత్రం, తెల్లదొరతనంలో సంభవించిన మార్పులు. ప్రత్యేకవ్యవస్థగా రూపొందిన విశేషాలు.

అందువల్లనే చరిత్రకందని అంశాలను అందుకు తగినవారి పరిధులకు వదలి, తిరుమల తిరుపతి దేవస్థానం తాను వ్యవస్థగా రూపొందిననాటినుండి పాలనాయంత్రాంగానికి ఈ ఏటికి ఏభై సంవత్సరాలు నిండగా, స్వర్ణోత్సవం జరుపుకుంటున్నది.

ఈ ఏభైఏళ్ళ చరిత్రలో దేవస్థానం సాధించిందేమిటి? అనేదానికి మూడు విషయాలే చాలు. దాక్షిణాత్యఆలయకళ కేవలం ఋషీకేశ్‌లోని శ్రీ వేంకటేశ్వర, చంద్రమౌళీశ్వరాలయాలకే పరిమితంకాకుండా, అమెరికాలోనూ, ఇంకకొన్ని ఇతర దేశాలలోనూ, వేంకటేశ్వరాలయరూపంలో సాక్షాత్కరిస్తోంది. విదేశములలోనున్న భారతీయులలో ఆర్షధర్మాభిరతిని జాగృతం చేస్తోంది. విదేశీప్రముఖులు చాలమంది తిరుమలేశుని ఆలయశిఖరాలు దూరంనుండైనా దర్శించాలని తపనపడుతున్నారంటే అది శ్రీవారి వైభవప్రాభవాల పట్ల ప్రపంచంలో భక్తిశ్రద్ధలు పెరుగుతున్నవనేందుకు నిదర్శనం. ఈనాడు యాత్రికులలో అన్యమతస్థులు కూడా ఎందరో తమ భక్తిప్రపత్తులు ప్రకటించి దర్శించి తరిస్తున్నారు.

ఇంతటి మహిమాన్వితమైన స్వామివారిసేవలో వ్యవస్థకు జరుగుతున్న స్వర్ణోత్సవాలు వ్యవస్థలో ఆత్మవిశ్వాసాన్ని, ఆలోచనను పెంపొందించి, ముందు ముందు ఆర్షధర్మానికి విశిష్టసేవావ్యవస్థగా రూపొందించాలనే దేవస్థానఆశయం కూడా.

ఈ ఆశయసాధనకు స్వామికరుణ, భక్తులసహకారం ఎంతో అవసరం. సాధించిన ప్రగతికి కారణభూతులైన మహానుభావులు వారెందరో, వారందరికీ వందనాలు.

# శ్రీనగర్ శంకర మఠము

— యం. వి. శంకరరావు

నేను ఇటీవల జమ్ము కాశ్మీరు రాష్ట్ర రాజధాని శ్రీనగర్‌ను దర్శించుట జరిగినది. శ్రీనగర్‌లో శంకరాచార్య మఠమును సందర్శించుట జరిగినది. శ్రీనగర్ అతి సుందరమైన నగరము. ఇది హిమాలయ సానువులపై మనోహర ప్రకృతి దృశ్యముల మధ్య నిర్మింపబడినది. అతిశీతల వాతావరణము కల్గినది. గుల్మార్గ్, కిలనెమార్గ్‌లలో ఆరు ఋతువులలోను మంచు నిలిచి వుంటుంది. చల్లని ప్రశాంత వాతావరణమునకు ప్రసిద్ధమైనది. ఇక్కడి కాశ్మీరులోయలో ఋషులు, మహర్షులు, తపస్సంపన్నులు, సాధువులు హిమాలయ చరియలలో తిరుగుచూ లోక సంబంధమైన సుఖదుఃఖములకు అతీతులై చరించునట్లు మనకు తెలిసియేయున్నది.

యాత్రికులు శ్రీనగర్ వెళ్లు ముందుగా జమ్ము కూడా దర్శించెదరు. జమ్ములో శ్రీ రఘునాధ దేవాలయము కూడా చాల ముఖ్యమైనది. ఇది పురాతనమైనది. చూచుటకు చాల యింపుగానుండును. ఈ దేవాలయములో ముఖ్యవిశేషమేమనగా సహస్ర లింగములతో నిండి యొప్పారుచున్న దేవాలయము.



జమ్ములోని శ్రీ రఘునాథ దేవాలయము

కాశ్మీరు వేసవి విడిది. వేసవికాలములో ఒక్క మనదేశము నుండియే కాక విదేశముల నుండి వచ్చు యాత్రికులు, మంచు లోయలను, మొగలాయిల కాలమునాడు పెంచిన పూతోటలు, డాల్ సరస్సును, జీలమ్ నదీ పరివాహిక ప్రాంతమును సందర్శించి జీవితములో మరువలేని అనుభూతిని పొందుచున్నారు.



ముముక్షువులగు హిందువులకు ఆధ్యాత్మిక నిరతిలో జీవన వ్యాసంగమును జరుపుకొను వృద్ధులకు, మధ్యవయస్కులకు ఇక్కడి శంకరమఠము దర్శనీయ స్థలమై యొప్పుచున్నది. ప్రయాణీకులు శంకర మఠమునకు వెళ్లుటకు ఐదు కిలోమీటర్ల దూరముగల కొండ ఎక్కవలసియున్నది. ఈ కొండ ఎక్కదలచినవారు బస్సులలో గాని, చిన్నకారులలోగాని కొంతదూరము వరకు పోవచ్చును. అక్కడి నుంచి దాదాపుగా 185 మెట్లు ఎక్కినగాని శంకరాచార్యుని దర్శనభాగ్యము లభించదు. ఈ శంకర మఠమునందు పాలరాతితో చెక్కబడిన శ్రీ జగద్గురు శంకరాచార్యులవారి విగ్రహము ప్రతిష్ఠింపబడినది. ఈ విగ్రహము చూచుటకు చాలా యింపుగా వుండును. ఆ ప్రశాంత వాతావరణములో శ్రీ శంకరాచార్యులను చూచిన క్షణమును అది జీవితములో మహోన్నత క్షణముగా భావింపగలరు.



శ్రీనగరలోని శ్రీ శంకరాచార్యులు.

"ఏకస్య బ్రహ్మణః శుద్ధ
సత్త్వోపాధి సమన్వయాత్,
ఈశతా జీవితా వ్యస్య
మనినోపాధి యోగతః."

అని శంకర భగవత్పాదులవారి ప్రవచనము. పరబ్రహ్మము ఒకడై యుండగా శుద్ధ సత్త్వోపాధి రజస్తమో గుణములలో సంపర్కము వినా పరిశుద్ధమగు సత్వగుణ ప్రధానమైన మాయ అను ఉపాధి(ఆవరణ) కూడిక వలన అనగా రజస్తమోగుణ సంయుతమైన సత్వప్రధానముగాగల మాయ యొక్క సంబంధముల మన జీవత్వము సంభవించుచున్నదని భావము. జీవత్వము అనగా జీవుడుగా నుండుట అని, కాని జీవితము గడుపువారును రజస్తమోగుణ బాధితులుగాక ఆత్మసంస్కారమున జీవనము గడుపుట, దాని కనువగు విచారము చేయుట ఆవశ్యకమైయున్నదని ప్రవచనము. శ్రీమచ్ఛంకరాచార్యులు ప్రస్థానత్రయమున నిగూఢమైన యద్వైత సిద్ధాంతమునుపదేశసాహస్రి, సర్వవేదాంత సంగ్రహము వివేకచూడామణి గ్రంథములలో ప్రతిపాదించియున్నారు. శంకరా ద్వైతము అన్ని విచారములలోనుత్కృష్టమై భాసించుచున్నది. ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ యను మహావాక్యముల సారమే వేదాంతము ప్రతిపాదించుచున్నది. శ్రీ శంకరులు బౌద్ధ, జైనమతముల నుండి హిందూమతమును పరిరక్షించుటకు తమ మతప్రచారము చేసియున్నారు.

ఈ శంకరాచార్యుని మఠము ప్రక్కనే శివాలయం ఒకటియున్నది. ఇచ్చటి శివలింగము 3 అడుగుల ఎత్తు వున్నది. నల్లని రాతితో నిర్మింపబడియున్నది. దాదాపుగా 20 సంవత్సరముల క్రితం శంకరమఠమును దర్శించుటకు ప్రజలు అనేక కష్టములకు గురికావలసియున్నది. డా॥ కరన్‌సింగ్ గారు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని కొండపైకి ఐదు కిలోమీటర్ల పొడుగునా తారురోడ్డు వేయించిరి. దీని మూలముగా బస్సులు, చిన్న కార్లు పోవుటకు అనుకూలమేర్పడినది. యాత్రికులు, అభిలాష కలవారు, శరీరశ్రమ కోర్చువారు ఈ 185 మెట్లు ఎక్కి అక్కడి ఆలయమును దర్శించి యాత్రా తృష్ణను ఆధ్యాత్మిక జిజ్ఞాసను తీర్చుకొనుచున్నారు. శ్రీనగరుకు వెళ్లువారు తప్పక అక్కడి శంకరమఠమును దర్శించిన క్షణమును అది జీవితములో మహోన్నత క్షణముగా భావింపగలరు. నాటికీ నేటికీ ఆసేతు హిమాచల పర్యంతము శంకరమఠములు వెలసి శంకరాచార్యులవారి బోధలను ప్రచారము చేస్తున్నవి.



# నందిగామ

**—పరిమి సుబ్రహ్మణ్యశాస్త్రి**

నందిగామ చాలాపురాతనమైన గ్రామం. అది కృష్ణాజిల్లాలో విజయవాడ— హైదరాబాదు జాతీయ రహదారిలో విజయవాడకు 50 కిలోమీటర్ల దూరంలో తాలూకాకు ముఖ్య పట్టణంగా అభివృద్ధినొందుచున్నది. ఊరు ఉనికినిబట్టి లభించుచున్న సాక్ష్యాలను బట్టి పూర్వకాలమున శైవమత వ్యాప్తి ఇక్కడ జరిగినట్లు తెలియుచున్నది. లభించుచున్న క్రీ. శ 9 వ శతాబ్దమునాటి పాముబండ శాసనములో నందిగ్రామములో శ్రీరామేశ్వర స్వామి దేవాలయమున్నట్లు స్పష్టమైన ఆధారాలు కన్పించుచున్నవి.నందిగ్రామమే కాలక్రమేణ నందిగామగా స్థిరనామందాల్చింది. ఇంచుమించు వెయ్యిసంవత్సరాల చరిత్ర నందిగామకువున్నది. శివలింగానికి ఎదురుగా ఈనాడు పెద్ద ఆకృతికల నందినిచూడ గలము.

కాకతీయులు, రెడ్డిరాజుల పరిపాలన చవిచూచిన తరువాత కొంతకాలము దక్కన్ సుబేదార్ల పరిపాలనక్రింద, అటుపిమ్మట నిజాంఅధికారానికిలోనైంది. నిజాంపాలనా యుగంలో నందిగామ పరగణాగ పిలువబడింది. ఈ నందిగామ ఒకప్పుడు 18 పేటలుగ వృద్ధిపొందినట్లు జనశ్రుతి. దీనికి తార్కాణంగా ఊరికి నాల్గుదిక్కుల నాలుగుగ్రామ దేవతలగుడులు వుండుటయేకారణము.



రెడ్డిరాజుల పరిపాలనాకాలంలో రెడ్లవల్ల భూవసతికలిగి స్వామికైంకర్యనిమిత్తము, సంగీతపాఠకులకు, అర్చకులకు, దేవవేశ్యలకు స్థానాచారులకు, విశ్వకర్మలకు, భజంత్రీలకు, వేదపండితులకు సుమారు ఆనాడు 900 ఎకరములు ఏర్పరిచినట్లు తెలియుచున్నది. కాలానుగతికముగ అర్చన, ఆలనా పాలనా లేకపోయింది. ఈదేవాలయము ఈ గ్రామములో వున్నట్లు సర్క్యూట్ కమిటీ రిపోర్టు ఆఫ్ మద్రాసు ఆర్కియాలజికల్ సమాచారముబట్టి తెలియుచున్నది.శ్రీరామలింగేశ్వరస్వామి దేవాలయము ముఖమండపములోని శాసనములు వాసిరెడ్డి ప్రభువుల కాలమునాటివి. ఇంతకంటె దేవాలయ ప్రాచీనతకు సంబంధించిన ప్రాచీనశాసనములు ఆలయంలో కానరావు. నందిగామ పట్టణమునకు తూర్పుదిశగా మునేరు ప్రవహించుచున్నది. ప్రస్తుత ఆర్.టి.సి. బస్సు స్టాండ్‌కు ఎదురుగా మునేరు అవతలి ఒడ్డున తానీషా ప్రభువుల మంత్రులైన అక్కన్న మాదన్నలు నిర్మించిన ధర్మసత్రము మునేరు వరదలవల్ల శిథిలమయినట్లు తెలియుచున్నది.

1670 లో గోల్కొండనవాబు అబ్దుల్ కుతుబ్‌షా 7, 1726–72 సం॥ వరకు జీవించిన వాసిరెడ్డి వీరపనీడుకు దేశ్‌ముఖ్ పదవి యిచ్చినట్లు కృష్ణాజిల్లా మాన్యుయల్ రచయిత వ్రాసారు. ఈయన కొండపల్లి, కొండవీడు ప్రాంతమును నందిగామ రాజధానిగా నొనర్చుకొని పరిపాలించినట్లు తెలియుచున్నది. 1678 లో ఆలనాపాలనాలేని శ్రీరామలింగేశ్వరస్వామి దేవాలయమునకు ఒక ముఖమండపమును వాసిరెడ్డిరామన్న (రామభూపతి) ఏర్పరచి దేవాలయానికి రూపురేఖలుదిద్ది శాసనమొకటి వేయించాడు. తదాదిగ వాసిరెడ్డి ప్రభువులపాలనలో నిత్య ధూపనైవేద్యాలకు లోటులేకుండసాగింది.

రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుని కాలంలో 1783–1816 తమపూర్వులచే పోషింపబడిన రామలింగేశ్వరస్వామి దేవాలయమునకు విశేషములైన భూవసతులు కల్పించి సర్వాంగ సుందరముగా దేవాలయాన్ని పునరుద్ధరించి విశేషఖ్యాతిగడించిరి.

ఈ రామలింగేశ్వరస్వామి శివలింగము స్వయంభువము. పానవట్టము శివలింగము పైనుండి దింపబడుటకూడ ఒకనిదర్శనము. రికార్డులో రామలింగేశ్వరస్వామిగ, ఇతఃపూర్వము రామేశ్వరస్వామిగసేవింపబడ్డారు. నేడు రామలింగేశ్వరస్వామిగ వ్యవహారము. తరువాత వాసిరెడ్డిదాశరథీనాయుడుగారి హయాంలో శుకశ్యామలాంబా అమ్మవారి ప్రతిష్ఠ జరిగినది. ముఖమండపములో శ్రీ దాశరథీనాయుడుగారి చేతవేయించబడిన శాసనమొకటివున్నది. ఇచటకల శుకశ్యామలాంబా సమేత శ్రీరామలింగేశ్వరస్వామి వారిని ఆస్తికులు సేవింపదగిన విశేషమహత్త్వముకలదైవము. భక్తులునిత్యము ముక్తిఫలములను కోరి ఏదో ఒక అర్చన స్వామి వారికి జరిపిస్తూవుంటారు.

ఈ క్షేత్రరాజమున విశాలమైన ప్రాంగణములో రోజు సాయంత్రంవేళ దేవాదాయ శాఖవారి సహకారంతో ధర్మోపన్యాసాలు జరుగుచున్నవి. సౌమ్యనామ సం॥ ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ తత్కాల పాడ్యమి సోమవారం 23-3-70 న నవగ్రహమూర్తుల ప్రతిష్ఠాపన జరిగింది.

మాఘశుద్ధదశమి మొదలుకొని పది రోజులవరకు ఏటా కల్యాణమహోత్సవములు చాలావైభవంగా జరుగుతాయి. పౌర్ణమి నాడు రథోత్సవము కన్నుల పండువుగా వేలాదిభక్తులసమక్షంలో జరుగుతుంది. సుమారు నలభై ఏళ్ళక్రిందట దేవాదాయ శాఖవారి అధీనంలోకి దేవాలయం తీసుకొనబడినది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అజమాయిషిలో, వాసిరెడ్డి వంశీయుల వంశపరంపరధర్మకర్తల ఏలుబడిలో, ఈ దేవాలయం సుమారు దేవాదాయ ధర్మాదాయ శాఖ క్రింద 375 ఎకరముల భూవసతి కలిగి ఏ లోటులేకుండా భక్తులపాలిట కల్పవృక్షంలాగా సుదూర ఆముష్మిక చింతనకల ఆస్తికులచేత ఆకర్షింపబడుతూ అంగరంగ వైభవంతో వర్ధిల్లుచున్నది. •

# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యవారాయణమూర్తి



(గతసంచిక తరువాయి)

## తొమ్మిదవ అధ్యాయం

### రాజవిద్యారాజగుహ్యయోగం

శ్రీ భగవానువాచ :

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞాన సహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్॥

శ్రీ భగవానుడు : అశుభకరమైన సంసారబంధంనుంచి విముక్తి పొందడానికి తెలుసుకోవలసిన అతి రహస్యం, అనుభవ సహితమూ అయిన జ్ఞానాన్ని అసూయలేని నీకు ఉపదేశిస్తున్నాను.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

విద్యలలో ఉత్తమం, పరమరహస్యం, పవిత్రమూ అయిన ఈ బ్రహ్మ జ్ఞానం ప్రత్యక్షానుభవం వల్ల తెలుసుకోదగ్గది. ఇది ధర్మయుతం, శాశ్వతం, సులభసాధ్యం.

అశ్రద్ధధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని॥

అర్జునా ! ఈ ధర్మంపట్ల శ్రద్ధలేని పురుషులు నన్ను పొందకుండా మరణరూపమైన సంసారపథంలో పరిభ్రమిస్తారు.

మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥

ఇంద్రియాలకు కనుపించని నా రూపం ఈ విశ్వమంతా వ్యాపించి వున్నది. సకల జీవులూ నాలో వున్నాయి; నేను మాత్రం వాటిలో లేను.

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥

ఈశ్వరసంబంధమైన నా యోగశక్తిని చూడు. భూతాలు నాలోలేవు. నా ఆత్మ సమస్త భూతాలనూ సృష్టించి, పోషిస్తున్నప్పటికీ వాటిలో వుండదు.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥

సర్వత్రా సంచరించే మహావాయువు ఆకాశంలో నిరంతరం నిలిచి వున్నట్లే సర్వభూతాలూ నాలో వున్నాయని తెలుసుకో.

సర్వభూతాని కౌంతేయ ! ప్రకృతిం యాంతి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥

కౌంతేయా ! ప్రళయకాలంలో ప్రాణికోటులన్నీ నా ప్రకృతిలో ప్రవేశిస్తున్నాయి. సృష్టికాలంలో వాటిని మళ్ళీ నేను సృజిస్తున్నాను.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామ మిమం కృత్స్నం అవశం ప్రకృతే ర్వశాత్ ॥

ప్రకృతికి అధీనమై అస్వతంత్రమైన సకల భూత సంఘాన్ని స్వాధీనంలో వుంచుకున్న నా ప్రకృతితో మళ్ళీ మళ్ళీ సృష్టిస్తుంటాను.

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ !
ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు ॥

అయినప్పటికీ అర్జునా ! వాటిపై ఆసక్తిలేని తటస్థుణ్ణి కావడంవల్ల ఈ కర్మలు నన్ను బంధించలేవు.

మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌంతేయ ! జగద్విపరివర్తతే ॥

కౌంతేయా ! ప్రకృతి నా పర్యవేక్షణలో ఈ చరాచర జగత్తును సృష్టిస్తున్నది. అందువల్లనే అవిచ్ఛిన్నంగా జగన్నాటకం జరుగుతున్నది.

అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్ ।
పరంభావ మజానంతో మమ భూత మహేశ్వరమ్ ॥

సమస్త ప్రాణికోటికీ ప్రభువైన నా పరమాత్మతత్త్వం తెలియని మూఢులు మానవరూపంలోవున్న నన్ను మామూలు మనిషిగా భావించి అవమానిస్తున్నారు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥

అలాంటి మూఢులు పనికిమాలిన కాంక్షలూ, కర్మలూ, జ్ఞానమూ కలిగి వివేకం కోల్పోయి రాక్షసుల స్వభావాన్ని ఆశ్రయిస్తారు.

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతిమాశ్రితాః।
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥

పార్థా! సాత్త్విక స్వభావం కలిగిన మహాత్ములు సర్వ భూతాలకూ ఆదికారణమైనవాడిగా, నాశనంలేని వాడిగా నన్ను తెలుసుకొని ఏకాగ్రచిత్తంతో సేవిస్తారు.

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥

వాళ్లలో కొంతమంది నిరంతరం నన్ను కీర్తిస్తూ, దృఢ వ్రతంతో ప్రయత్నిస్తూ భక్తితో నాకే నమస్కరిస్తూ మనస్సు నా మీదే నిలిపి నన్ను ఉపాసిస్తారు.

జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥

మరికొంతమంది మహాత్ములు విశ్వరూపంలో వున్న నన్ను జ్ఞాన యజ్ఞంతో సేవిస్తారు. అనేక భావాలతో నేను ఒక్కడినే అనీ, వేరే వ్యక్తిననీ, బహురూపాలు కలిగిన వాడిననీ భజిస్తారు.

అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధమ్ ।
మంత్రోఽహ మహమేవాఽజ్యం అహ మగ్ని రహం హుతమ్ ॥

క్రతువూ, యజ్ఞమూ, పితృదేవతలకు అర్పించే అన్నమూ, ఔషధమూ, మంత్రమూ, నేయీ, హోమమూ నేనే.

పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవ చ ॥

ఈ జగత్తుకు తండ్రి, తల్లి, కర్మఫలదాత, తెలుసుకో దగ్గ వస్తువు నేనే. ఓంకారం, ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం కూడా నేనే.

గతి ర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్ ॥

ఈ జగత్తుకు గతి, పతి, ప్రభువు, సాక్షి, నివాసస్థానం, ఆశ్రయం, ఆప్తుడు, సృష్టికర్త, సంహారకుడు, ఆధారం, ప్రళయం, స్థానం, శాశ్వతబీజం నేనే.

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ! ॥

అర్జునా! నేనే వేడి కలుగ జేస్తున్నాను. వర్షాన్ని నిలుపు తున్నాను; కురిపిస్తున్నాను అమృతమూ, మృత్యువూ నేనే. శాశ్వతమైన సత్తూ, అశాశ్వతమైన అసత్తూ నేనే.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం
అశ్నంతి దివ్యాన్దివి దేవభోగాన్ ॥

మూడు వేదాలు చదివినవారు యజ్ఞాలతో నన్ను పూజించి, సోమపానం చేసి, పాపాలు పోగొట్టుకొని స్వర్గం కోరుతారు. అలాంటివాళ్లు పుణ్యఫలమైన దేవేంద్రలోకాన్ని పొంది, దివ్యభోగాలు అనుభవిస్తుంటారు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నాః
గతాగతం కామకామా లభంతే ॥

వాళ్లు విశాలమైన స్వర్గలోకంలో సుఖాలు అనుభవించి పుణ్యం క్షీణించిపోగానే మానవలోకంలో మళ్ళీ ప్రవేశిస్తారు. ఇలా వేదంలోని కర్మ కాండను పాటించే భోగపరాయణులు పొందుతుంటారు.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ ॥

ఏకాగ్రచిత్తంతో నిరంతరం నన్నే స్మరిస్తూ సేవించే వాళ్ళ యోగక్షేమాలు నేనే చూస్తాను.

యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్యవిధిపూర్వకమ్ ॥

కౌంతేయా! ఇతర దేవతలను భక్తి శ్రద్ధలతో భజించే వాళ్లు కూడా నన్నే పూజిస్తున్నారు. అయితే వాళ్ళ ఆరాధన శాస్త్రసమ్మతం కాదు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మా మభిజానంతి తత్త్వేనాఽతశ్చ్యవంతి తే ॥

సర్వయజ్ఞాలలో భోక్త, ప్రభువు నేనే. ఇతర దేవతల భక్తులు ఈ వాస్తవాన్ని గ్రహించలేక మళ్ళీ మళ్ళీ పుడుతుంటారు.

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః।
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్॥

దేవతలను సేవించేవాళ్ళు దేవతలనూ, పితృదేవతలను ఆరాధించే వాళ్లు పితృదేవతలనూ, భూతాలను అర్చించేవాళ్లు భూతాలనూ పొందుతారు. నన్ను పూజించేవాళ్లు నన్నే పొందుతారు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః॥

పరిశుద్ధమైన మనస్సు కలిగినవాడు భక్తితో నాకు ఆకుకాని, పువ్వుకాని, పండుకాని, నీరుకాని సమర్పిస్తే సాదరంగా స్వీకరిస్తాను.

(30 వ పేజీలో)

# మాఘమాస మాహాత్మ్యం

— తేల్కర్ శంకర్ రావ్

మా + అఘ + ము = మాఘము
మా = మానవులు
అఘ = పాపములకు
ము = ముక్తినిచ్చునది.

మానవుని అఘము అనే మేఘమును తొలగించు మారుతమే మాఘము.

సకల దేవతలలో శ్రీమన్నారాయణుడు ముఖ్యుడు. సర్వశాస్త్రములలో వేదము ప్రధానమైనది. అన్ని పర్వతాలలో మేరు పర్వతము గొప్పది. అటులనే అన్ని మాస ములలోను మాఘమాసము శ్రేష్ఠమైనదగు టచే ఆ మాసమునందాచరించు యే స్వల్ప కార్యమైనను గొప్ప ఫలితాన్ని కలుగ జేయును.

ఇతరదినములలో చేయువ్రతములుకాని క్రతువులు కాని యివ్వనంత గొప్పఫలము కేవలం మాఘమాస నదీస్నానం వలన కల్గును. కార్తికమాసంలో దీపారాధన యెంత శ్రేష్ఠమో, మాఘమాసమున నదీ స్నానము అంతశ్రేష్ఠమైనది.

"తులా మాఘస్నాన తుష్టా తుష్టిపుష్టి ప్రదాయినీ" అని గాయత్రీ సహస్ర నామ స్తోత్రములోకూడ మాఘస్నాన ప్రస్తావన వున్నది.

మాఘమాసములో యే నది నీరైనను గంగా జలసదృశము. అందుచేతనే మాఘ మాసనదీస్నానము సర్వపాప హరమైనది. ఈ మాసములో నదీస్నానముతోపాటు విష్ణ్వాలయము విరూపాక్షాలయము మున్నగు పుణ్యక్షేత్రములను దర్శించిన యెడల మహాఫలము కల్గుటయేకాక పునర్జన్మ వుండదు.

అనేక పుణ్యకార్యాలవలన స్వర్గలోక ప్రాప్తి తాత్కాలికముగ కల్గును. కాని మాఘ మాసములో సంపాదించిన ఫలమువలన శాశ్వత స్వర్గలోక ప్రాప్తికల్గును.

పాపము, పేదరికము, దురదృష్టము అను యీ మూడును మనుజుని క్రుంగ దీయును. ఈమూటిని నివృత్తిచేసుకోవా లంటే మాఘమాస స్నానమే పరమౌషధము! అన్ని జాతులవారును ఆచరించవలసిన పరమపావనమైన పథము.

ఎవరైనను తెలిసికాని, తెలియకకాని, మాఘమాసమందు మార్తాండుడు మకరరాశి యందుండగా యేది అందుబాటులో నున్నను అనగా నదికాని, చెరువుకాని, బావికాని, కాలువకాని లేక యితరనీటి సదు పాయములున్న చోటకాని, ప్రాతఃకాలమున స్నానమాచరించి ప్రత్యక్షదైవమైన సూర్య భగవానునికి నమస్కరించి,తనకుతోచిన దాన



ధర్మములుచేసి, శివాలయమున కాని కేశ వాలయమునకాని దీపమువెల్గించి, భక్తిశ్రద్ధ లతో అర్చనచేసిన మానవునకు అశ్వమేధ యాగము చేసినంత ఫలముదక్కును. విష్ణు లోకప్రాప్తియు కల్గును. ఇదే మానవుని మోక్షమునకు దగ్గరిదారి.

చలికిజడిసి ప్రాతఃకాలమున స్నానము చేయని మానవుడు తనకు లభించబోవు పుణ్యమును కాలదన్నినట్లగును. అంతేకాక అట్లుస్నానం చేయువారినిచూచి హేళనగా మాట్లాడినవానికి చండాలజన్మ కల్గును. ఈ మాసమంతయు కడునిష్ఠతో వుండిన కోటి యజ్ఞములు చేసినంత పుణ్యము లభించును.

విధవరాలు మాఘమాస మంతయు నిష్ఠతో ఆచరించిన యెడల ఆమెకు కల్గిన వైధవ్యము మరుజన్మలో మరల కలుగక ఐదవతనముతో చల్లగానుండును.

అటులనే ముత్తైదువలు ఆచరించినచో సకల ధనధాన్య పుత్ర పౌత్రాభివృద్ధి కల్గును. యువజనులు కూడా మాఘమాసమంతయు నదీస్నానమాచరించిన యెడల సకల సల క్షణవతియగు కన్యతో వివాహమగుటయే కాక పెద్దల మన్ననలంది సుఖింతురు.

వ్యాధిగ్రస్తులైనవారు సూర్యోదయము ననే లేచి కాళ్ళు, మొగము కడుగుకొని లోకబాంధవుడైన సూర్యునికి నమస్కరించి నచో వారి రుగ్మత నయమగుటయే కాక పుణ్యవంతులగుదురు.

మాంసాహారులలో అధికశాతం యీ మాసమంతయు శాకాహారులై నదీ స్నానాలుచేస్తూ, పూజలు పునస్కారాలతో, నియమ నిష్ఠలతో వుంటారు.

కల్యాణాలు, కేశఖండనాలు, శ్రేష్ఠమైన ఈ మాఘమాసంలోనే ముమ్మరంగా జరు గుతాయి.

శుభప్రదమైన యీ మాఘమాసము ఉత్తరాయణ పుణ్యకాలంలోనే వస్తుంది. అటువంటి ఉత్తరాయణంకోసం నిరీక్షించిన కురువృద్ధుడు హరివాసరం (ఏకాదశి) నాడు పరమపదించి స్వర్గారోహణం గావిస్తాడు. అందుకే మాఘశుద్ధ ఏకాదశిని భీష్మైకాదశి అనడం పరిపాటి. ఉత్తరాయణ పుణ్యకాలం, అందులో పరమ పవిత్రమైన మాఘమాసం లో పరమపదించడం అన్ని విధాల పుణ్య ప్రదమైనది. ఇటువంటి మరణం యెంతో సుకృతం చేసుకున్నవారికికాని రాదు. ఏకా దశి మరణం, ద్వాదశి దహనం యెంతో వారికికానిరాదు! అని మన పెద్దలు ఊరకే అనలేదు.

ఈ మాఘమాసంలోనే రథసప్తమి, శైవు లకు పరమపవిత్ర ఉపవాస, జాగరణ పుణ్య దినమైన మహాశివరాత్రి రావడం పవిత్ర ములో మరీ పవిత్రమైనది.

మాఘమాసంలో నెలరోజులు స్నానమా చరించలేని స్త్రీ, పురుషులు ఏకాదశినాడు కాని ద్వాదశి లేక పౌర్ణమాసినాడుకాని నదిలో లేక చెరువులో స్నానంచేసి శ్రీహరిని భజించి, పురాణశ్రవణము గావించి, తనశక్తి కొలది దానము చేసిన సత్ఫలితము కల్గును.

# ప్రణవ మహిమ

— ఆకెళ్ల శ్రీనివాసరావు

వేదఘోష ఓంకారోచ్చాటనతో ప్రారంభమౌతుంది. ఈ ప్రణవమంత్రాన్ని ఉపనిషత్తులలో "ఉద్గీధ" అన్నారు. బ్రహ్మం దాన్ని శాసించేశక్తి "బ్రహ్మ" లేక "ఓం" అనబడింది. దాన్ని తెలుసు కోవటమే చరమ ఉపలబ్ధి — "తమేవ విదిత్వాతి మృత్యుమేతి" — పతంజలి దీనినే ఈశ్వర వాచకంగా యిలా అన్నాడు-"తస్య వాచకః ప్రణవః" (పతంజలి యోగసూత్రం) విశ్వంలోని విభిన్న సంస్కృతులలో అంధకారం నుండి వెలుగు, అజ్ఞానంనుండి జ్ఞానం, వీటియొక్క ప్రాప్తి ఎలా కలిగింది- అనే వాటిపై చాలా ఊహగానాలు జరిగాయి. జ్ఞానం, వాక్కు, విద్య మొదలైనవి భగవంతుడు తనకిచ్చిన వరాలు. గ్రీకు సంస్కృతిలో యిదే జ్ఞానం పుట్టుక "లోగోస్" అనే పేరుతో పిలువబడ్డది. మన సనాతన పరంపరలో దీనినే వాక్కు అన్నారు. జ్ఞానం మొదటిసారిగా వాక్కురూపంలో వ్యక్తమైంది. ఆ ప్రప్రథమవాక్కు 'ఓంకారం.' ఈ ఓంకారంలో బ్రహ్మాండపు ప్రాణధారణ శక్తి నిహితమైవుంది — "అవాకస్యేవాత రస్య రసం నాశక్నోదాదాతుమ్ ఓమిత్యే తస్యైవ సేయం వాగభావమ్ ఓమైవ నామైషా తస్య ప్రాణ ఏవ రసః" మొత్తం ప్రకృతి మీదుగా విభజితమైవుంది. పృథ్విని భూలోకమనీ, అంతరిక్షం లేక వాయుమండలం భువర్లోకమనీ, దానిపై "ద్యుః" లేక "సువర్లోకం" వున్నాయి. గాయత్రీ మంత్రంతో బాటుగా ఈ మూడు వ్యాహృతులు చెప్పబడతాయి. వీటికి మొదటిలో ఓంకారోచ్చాటన వుంటుంది — 'ఓం భూర్భువస్సువరోం." ఉపనిషత్తుల ననుసరించి ఈ మూడు వ్యాహృతులు ఓంకారంలో నిబిడీకృతమై వున్నాయి. అక్షర విజ్ఞానాన్ననుసరించి ఓంకారంలో మూడు మాత్ర లున్నాయి. అ+ఉ+మ్. ఈ మూడు పైవ్యాహృతుల వాచకాలే జైమినీయ బ్రాహ్మణోపనిషత్ లో ఇలా వుంది —"తాసామ పీడితానాం రసం ప్రాణేదత్. తదేత దక్షర మభవదో మితి యదేతత్" – ఈ మూడింటి సంపీడనం వలన రసం వుద్భవించి ఓంకార జననం జరిగింది. ఈ విధంగా ఓంకారం సమస్త ప్రపంచానికి బీజమంత్రమైంది. సమస్త చరాచర జగత్తు భగవానుని ప్రతిరూపమే. కావుననే ప్రణవం భగవంతునికి వాచకరూపం — "ఓం క్రతో స్మర కృతం స్మర" అని చెప్పి ఓంకారాన్ని సత్+చిత్+ఆనందం ఈ మూడింటికీ ప్రతీకగా చెప్పారు. మాండూక్యోపనిషత్‌లో ఓంకారం భూత భవిష్యద్వర్తమానాలకు ప్రతిరూపంగా చెప్పబడ్డది. కఠోపనిషత్‌లో యముడు నచికేతునికి బ్రహ్మవిద్య నుపదేశించే సందర్భములో పరబ్రహ్మ, అపరబ్రహ్మ (నిరుపాధికం, సోపాధికం) ఈ రెండింటి వాచక రూపంగా ఓంకారాన్ని గూర్చి తెలియజేస్తాడు.

"సర్వే వేదా యత్ పదమామనన్తి
తపాంసి సర్వాణి చ యద్వదంతి,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి"–
"ఓమిత్యేతత్"

"ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ
ఏతద్ధ్యేవాక్షరం పరమ్
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా
యో యదిచ్ఛతి తస్య తత్"

ఈ విధంగా ఓంకారమే "ఏకాక్షర బ్రహ్మ" అని ఉపనిషత్తులు తెల్పుతున్నాయి. ప్రశ్నోపనిషత్తులో ఓంకారం ఏకమాత్రికం, ద్విమాత్రికం, త్రిమాత్రికంగాచెప్పి మొదటి మాత్ర ఋగ్వేదం, రెండవది యజుర్వేదం, మూడవది సామవేదం, తదనుగుణంగా పర,



అపర, పరాత్పర బ్రహ్మకి వాచకరూపంగా అక్షర పరబ్రహ్మయయిన ఓంకార మాహాత్మ్యం వివరించబడింది. బ్రాహ్మణ గ్రంథాలలో "ఓం" యొక్క వ్యుత్పత్తిమీద కూడా చర్చ జరిగింది. రక్షణార్థకమైన "అవ్" ధాతువు నుండి "ఓం" యొక్క వ్యుత్పత్తి దీర్ఘదీర్ఘతర ఉచ్చారణ ప్లుత మనబడుతుంది. ఓంకారం సర్వదాప్లుతంలోనే ఉచ్చరించబడుతుంది.

"ఓంకార ప్రణవస్తారో వేదాదివర్తులోధ్రువః।
త్రైగుణ్యం త్రిగుణో బ్రహ్మ సత్యోమన్త్రాది
రవ్యయః
బ్రహ్మబీజం త్రితత్వం చ పంచరశ్మిస్త్రి
వేదతః ॥"

ఈ విధంగా ఈ మూడు మాత్రలలోనూ సత్త్వ, రజో, తమోగుణాలు సమాహతమై వున్నవి. పురాణాలలో 'అ' కారం విష్ణువుకి 'ఉ' కారం శివునికీ, 'మ' కారం బ్రహ్మకి సమానార్థకంగా చెప్పబడింది. ఓంకారం త్రివేదాత్మకము. ప్రస్థానత్రయాలైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు మరియు భగవద్గీతలో ఓంకారంయొక్క బ్రహ్మవిద్యాగతమైన వైశిష్ట్యం స్పష్టీకరించబడింది—

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం
స యాతి పరమాం గతిమ్" —

అనగా ఎవరైతే తమ అంతిమ క్షణాలలో ఓంకారాన్ని వుచ్చరిస్తూ నన్ను (భగవంతుడు) స్మరిస్తారో వారికి వుత్తమగతులు ప్రాప్తిస్తాయి. 17 వ అధ్యాయంలో పరతత్త్వ రహస్యోద్ఘాటన యీ విధంగావుంది:

"ఓం తత్సదితి నిర్దేశో
బ్రహ్మణస్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ
యజ్ఞాశ్చవిహితాః పురా॥"

"తస్మాదోమిత్యుదాహృత్య
యజ్ఞదాన తపఃక్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తా
స్సతతం బ్రహ్మవాదినామ్॥"

ఇందులో 'బ్రహ్మ' మూడువిధాలుగా వుంది. ఓం (అక్షరబ్రహ్మ) తత్ (పరబ్రహ్మ) సత్ (అపరబ్రహ్మ). భారతీయ బ్రహ్మవిద్య యొక్క వైశిష్ట్యం భగవంతుని ఆద్యంత రహితుడిగానే కాక సర్వవ్యాపిగా కూడా చెప్పడంలోనే వుంది. "ఓం తత్సత్" అని వుచ్చరించిన పిమ్మటనే బ్రహ్మవిదులు యజ్ఞదాన, తపస్సులనే పవిత్ర కార్యాచరణకి పూనుకొంటారు. భగవద్గీతను బ్రహ్మ విద్య నుపదేశించే పరమప్రమాణ గ్రంథముగా, యోగశాస్త్ర రహస్యాలను యిముడ్చుకొన్న ఆకారముగా చెప్పవచ్చు. యోగశాస్త్రంలో ఓంకారం ఒక అవిభాజ్యమైన అంగం. ఓంకారనాదం నాభినుండి బయలుదేరి, అక్కడవుండే మణిపూరక చక్రం నుండి వెలువడి హృదయ స్థితమైన అనాహత చక్రాన్ని ఝుంకృతం చేస్తూ కంఠంయొక్క విశుద్ధ పేటికలో స్ఫుట మౌతుంది. తీర్థ స్థానాలలోనూ, దైవమందిరాల లోనూ అనేకముల్లైన దైవమూర్తులను ఓంకార స్వరూపమనే చెప్తారు. అందుకే పవిత్ర మందిరాలలో ఓంకారముద్ర వుంటుంది. శివుడి మందిరాలు దేశంలో పలుచోట్ల ఓంకారేశ్వర నామధేయంతో ప్రసిద్ధముల్లైనవి. ఇక యితర సంప్రదాయాలలో బౌద్ధ, వజ్రయాన శాఖ్ఛిహరు ఓంకారోపాసన మాహాత్మ్యాన్ని గుర్తించారు. కుండలినీ యోగ పద్ధతిలో కూడ ఓంకారం నాదస్వరూపమే. టిబెట్టులో నేటికీ "లామా" తెగవారు వుచ్చరించే మంత్రం-"ఓం మణి పద్మే హుం" లో ఓంకారం మొట్టమొదట వస్తుంది. జైనులు, బౌద్ధులు ఓంకారాన్ని ప్రముఖమైన మాతృకగా స్వీకరించారు. కొందరు విద్వజ్జనుల అభిప్రాయం ప్రకారం ఓంకారం భారతదేశంలోనే కాక విదేశాలలో కూడ వినబడుతుంది. Amen లో ఓంకారం నిహితమై వుంది. భాషాశాస్త్రంలో "ఓం" అంటే "స్వీకృతి" అనే అర్థం వుంది. లాటిన్ భాషలో సర్వ వ్యాపకం మొదలగు "సర్వ" వాచక శబ్దం "ఓమ్నిస్ (Omnis) పై ఆధారితమైన శబ్దాలు ఆంగ్లంలో కూడా వున్నవి — Omnipresent అనగా సర్వవ్యాపకుడు — Omniscient అంటే సర్వజ్ఞుడు-యివన్నీ కూడా మూలమైన, వికారరహితమైన ఓంకారంనుండే వెలువడ్డాయని పెద్దలు చెపుతారు. ఓంకార ప్రతిష్ఠ మరియు ఆరాధన భారత దేశంలో అతి ప్రాచీనకాలంనుండి అలౌకిక మైన శక్తినీ, సిద్ధినీ ప్రసాదించేవిగా సర్వ జన మాన్యములయినవి.

## కలియుగ వేంకటపతి



తే.గీ॥ వేదవీధుల విహరించు వేంకటేశ!
ఏడుకొండలపైనుంటి వేమిస్వామి?
విశ్వమోహన సౌందర్య విభవములను
విడిచి శిలగాను మారిన విధ మదేమి?

కఠినశిలలునుకూడ నీ కాలుసోక
శాపబంధాలు విడిపోయి శాశ్వతముగ
అందచందాలసుందరి ముందునిలిచె
మహిమలుండియు శిలవైన మర్మమేమి?

అండపిండాది బ్రహ్మాండ భాండమందు
ఎందుచూచిన నీవుందు వందురుకద!
సప్తగిరివాసమందు నాసక్తియేల?
పక్షపాతివి నివంద్రు పద్మనాభ!

సీ॥ శరణన్న కరిరాజు మొరవిని మకరిబాధలనుండిమాన్పలేదె
నిండుకొల్వున నాడు పాండవకాంతను వస్త్రములిచ్చి కాపాడలేదె
ప్రహ్లాదభక్తుని ప్రాణాల కే హాని కలుగకుండగ నాడు కావలేదె
బాల్యమిత్రుడగు కుచేలుని దారిద్ర్యబాధలు సకలము బాపలేదె

ఆ.వె॥ ఇంతజాలిగుండె నెచట దాచితివయ్యు
భక్త రక్షణంబె పరమధర్మ
మంచు నెంచునట్టి మంచిమనసునెంచ
నీకు సాటియెవరు? నీరజాక్ష!

గీ॥ ఘోరసంసారసాగర పారమేదొ?
జీవితాలకు పరమార్థ సిద్ధియేదొ?
తెలియజాలని జనులకు తేటపరుప
కలియుగంబున దేవర! కదలి రార!

— టి. వరప్రసాద్

★  ★

# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-00 గం॥ నుండి 6-30 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-30 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-45 గం॥ వరకు

శుద్ధి — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15 గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం—ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 11-00 గం॥ నుండి రాత్రి 8-00 గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00
సహస్రనామార్చన : రూ. 6-50
నిత్యఅర్చన : రూ. 150-00 (ఏడాదికి)
అర్చన: రూ. 1-00
హారతి: రూ. 0-50

పూరాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00
ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150-00
తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00
వాహనం: రూ. 32-00.

(గతసంచిక తరువాయి)

### కపిలెపాటల్లో రామాయణం

1. రామ రామ అంటావు సీతా-రాముడేమి కావాలమ్మ
   రాముడు మనదేవుడు - లచ్చునుడు ముద్దుమరది
2. రాముడొచ్చెయాలలాయె - రామబాన మెడుమాయ
   నాసామి వచ్చెయాలలాయె - శోవనాలు వెలుగులాయె
3. సీత బుట్టి లంక చేరె - 'సిన్న' కాపురాలు కూలె
   బాలుడు వనుమన్న పుట్టె - బంగారి వారది కట్టె

దేవేంద్రుని తెల్లటేనుగు
పూలతోటకు మరిగిండా
ఏనుగొచ్చెనాని దశరత రాజు
బాణము సల్లిడిచె
శివశివ యనుచు గురిబత్తునుడు
ధరిని కొరిగినాడు
హరహర నేనెంత పాపము
కట్టుకొంటి నిపుడు
ముసలి వాండ్లది పూదకట్టిని
కూలవేస్తి వౌరా
దేవేంద్రుని తెల్ల టేనుగు
పూలతోటకు మరిగిండా
ఏనుగొచ్చినాని రాజా
నేను బాణము సల్లిడిత్తి
కన్నులు పోయిన తలి దండ్రాదులు
యెవ్వనివిరా నరుడా
యెరిసి సెప్పదునా
యెరువక సెప్పదునా
యెరిసే మీ బయి మేమి
యెరువక సెప్పమా
బుడుగు బుడుగు మాని
కపండ్ల శవదము నా సెవిన బాడె
దేవేంద్రుని తెల్లటేనుగు
పూలతోటకు మరిగిండా
ఏనుగొచ్చెనాని నేను
రాజా బానము సల్లిడిత్తి
బానం పోయి గురి బత్తునుగ
యెదురొమ్మున నాటింది
బానం పీకితే గురి బత్తునుడు
కవిలాసం పొయినాడు

# జానపదసాహిత్యంలో పురాణాలు

### వొట్ల కలువు పాటల్లో రామాయణం

వరెవారె మేదరివాడ కావ డొకటల్లా
నాలుగు మూల్లా మొగ్గలు
తొడిగి సదురు వేరుపంచు
నాలుగు తట్ల మొగ్గలు
నిలిపి సదురు వేరుపలచు
కన్నులు పోయిన తల్లి
తండ్రాదులు కావడిలో నుంచా
డెబ్బైయేడు తిరపతులన్ని
యల్లతిరిగినాడు
అద్దరాతిరి నిద్దర పొద్దున
అయోధ్ది కొచ్చినాడు
పూలతోటలో పూలకొమ్మకు
కావడి తగిలించా
కొడుకా కొడుకా గురిబత్తునుడా
దప్పిక లైతాయి
అద్దరాతిరి నిద్దర పొద్దున
ద్రావమెక్కడిదయ్యా
నిద్దర పొద్దున కపండ్ల మనియెది
సేతబట్టుకొని కొలను కొచ్చినాడు
బుడుగు బుడుగు మాని కపండ్ల
శబదము రాజు సెవన బాడె
కావడిలో వుండ్రి
కపండ్ల మనియెది నీల్లు తీసుకొని
సాతల ముట్టించా
మాటలాడితే రాజా నీకు
శాపము పెడుదురా
శాపమంటెను దశరత రాజు
గడగడ వనికేనూ
బానము పీకు దశరత రాజా
కవిలాసం పొయ్యేనూ
బానము పీకె దశరత రాజు
గురుబత్తునుడు కవిలాశం పొయినాడు
కపండ్లమనియెది నీల్లు తీసుకొని
పూలతోటకు పొయినాడు
పూలతోటలో పూల కొమ్మకు
కావడి వుండా
మాటలాడక పలుకు లాడక
చేతల ముట్టించా
అద్దరాతిరి నిద్దర పొద్దున నీల్లు
అడిగితే కోపమొచ్చెనా కొడుకా
వులుకులాడక పలుకులాడక
వూరకుండెను దశరత రాజు
మాకొడుకైతే మాతో మాట్లాడు
ముసలి వాండ్లది పూద కట్టిని
పూద వేస్తివౌరా
"రామలచ్చున భరత శత్రుగ్నులు
నలుగురు కొడుకులు
పుడుదురు నీకు మాకొడుకు
మొగము మేము చూడక
సచ్చినట్లు నీకొడుకు మొగము
చూడక సత్తువురా"
"లాలి వుయ్యాల లాలి శ్రీహరే
నవరత్నం బేలాలీ
పుత్ర పావనము లేలే దశరాజు
పుత్రీలు అనసులాలు
పదిరెండు నెల్లుమోసా కౌసల్య
పసుపు కాల్వలు దాటెను
సుకముతో ముగ్గురిని కౌసల్య
సుతులు నల్గురు కలిగిరి
అడున్ని దశరాజుగా ఆరాజు
వస్త్ర దానములిచ్చెను
నూరుపుట్ల శెనిగిలు నారాజు
పాలుల్ల పోసెను
వచ్చిన ముత్తైదులకు వా రాజు
తాంబూల మిప్పించెను

వచ్చిన ముత్తైదులకు వా రాజు
వావనాలిప్పించెను
వచ్చినా ముత్తైదులు కొందరు
నిద్రలేకి సాగిరి
కొందరూ ముత్తైదులు యంత
సంబర వడిరో
ముత్యాల రాగిరేకు రాములకు
ముద్దు మొగమునకు రుద్దిరి
పగడాల రాగిరేకు రాములకు
పైయల్ల తరియించిరి
వజ్రాల రాగిరేకు రాములకు
వొళ్లాల తరియించిరి
జిట్టి బొట్టులు పెట్టిరి
రాములకు దీవనా లిచ్చిరి
కన్నుసొగలు దిద్దిరి రాములకు
కలియ మోచ్చా లిచ్చిరి
కునాసి కుశికుడమ్మా ఈ బిడ్డ
కుశరాజు మనమడమ్మ
జానాపి జానుడమ్మ ఈ బిడ్డ
జనకునల్లుడమ్మ
సీరామ చంద్రుడమ్మ ఈ బిడ్డ
సీతమ్మా పురుషుడమ్మ"

### నలుగు పాట :

మా మామ దశరతుడు రతము
తోలేతపుడు రామసిలకనై వుంటిని
అక్కడికారాముడెక్కడో గాని
యిక్కన్నే చెరసిక్కితి
అరటినీ కాయలు అందముగా
వున్నంగ అయోధ్ది నిడనాడితి ॥అను॥
ఆకునూ గందమునూ అలికినట్లున్నంగ
అత్తగారి నిడనాడితి ॥అను॥
చాటలతోగందమును చెదిరినట్లున్నంగ
చెల్లెలి నిడనాడితి ॥అను॥
ఆకులు తోటలు వందముగ వున్నంగ
అనుమంతు నిడనాడితి ॥అను॥

### కోలాట పాట

రామనా బీమనా రామనా బీమనా
రాతిరొక్కకలను గంటినో రామనా
వుత్తకాలాలు గంటి
సక్కని వనుమంతుడయ్యా
ముట్టడేసె మాన లంకానూ ॥రామనా॥
వద్దు వద్దురామనా బుద్ధిగల్ల రామనా
వారితోటి వైరమొద్దురో ॥రామనా॥
పచ్చతిరమని వాడు పదిబార్లతోకవాడు
పైన వచ్చె మా లంకకు ॥రామనా॥
యర్రతిరమనివాడు యెయ్యి బార్ల
తోకవాడు యెగిసివచ్చె మానలంకకు॥రా॥

జానపదులకు నిత్య జీవితం "రామాయణం". నిద్రలేస్తూ 'రామా' అంటారు. 'రామచంద్రా' అంటూ కూర్చుంటారు. ఇంకా 'రామా-తండ్రీ పరమాత్మ' అంటారు ఇంకా 'రామా' అని ఎపుడెపుడనాలో ఒక గేయంలో ఇలా నిర్ణయించుకొన్నారు.

'రామా రామ యనుచూనూ
రామ బజనలు చేసుకొంటూ
ఒకసారి రామా యనరాదా ఓ పాపిమనసా
ఒకసారి రామా యనరాదా
కసువూలు నూకుకుంటూ
సమసారము చేసుకొంటూ
ఒకసారి రామా యనరాదా ఓ పాపిమనసా
ఒకసారి రామా యనరాదా
ఒకస్సారి రామా యంటే
లెక్కలేని పాపం పోవు
కాల్లు మొగము కడుక్కొంటూ
దీవరాజనము సేసుకొంటూ
ఒకసారి రామా యనరాదా ఓ పాపిమనసా
ఒకసారి రామా యనరాదా
లాలి లాలి నువ్వను కొంటూ
లాలి పాటలు పాడుకొంటూ
ఒకసారి రామా యనరాదా ఓ పాపిమనసా
ఒకసారి రామా యనరాదా
తిన్ని చోట వున్న చోట
లాలితో ముద్దాడుకుంటూ
ఒకసారి రామా యనరాదా ఓ పాపిమనసా
ఒకసారి రామా యనరాదా '

కొన్ని సామెతల్లో తెల్లార్లు రామాయణం విని 'రామునికి సీత ఏమి కావాలి' అని

అడిగాడట వకడు. 'నీతో పెద్ద రామాయణ మైపాయనే' అని విసుక్కుంటారు. అందువల్ల ఆడబిడ్డ పుడితే 'సీత' అనీ మగబిడ్డ పుడితేరాముడనీ, లాలిపాటలు, పెళ్ళిపాటలు వడినింపే పాటలు, పూలచెండ్ల పాటలు పాడుకొంటారు.

'చందమామ' అనే మాటలోనే తెలుగువారు తమకున్న పురాణ పరిచయాన్ని వ్యక్తీకరిస్తారు. ఈ లోకానికి విష్ణువు 'తండ్రి,' లక్ష్మి 'తల్లి.' లక్ష్మితో పాటు సముద్రంలో పుట్టిన చంద్రుడు మనకి మేనమామ. అందువల్ల చందమామ.

ఒక పురుషునిగూర్చి 'సత్యహరిశ్చంద్రుడు వీడు' అంటూ ఉంటారు. అలాంటి పురుషులకు ప్రతీక సత్యహరిశ్చంద్రుడు. ఇతడు సత్యం కోసం ఎన్నో త్యాగాలుచేశాడట. అలాంటి పురాణపురుషుణ్ణి గూర్చి జానపదులు ఒక కోలాట గేయంలో ఇలా తెలియజేశారు.

"రాజరాజరాజపొనన్నతా
సామిపొనన్నతా
రాజునేడ యలను
తొలుతుమయ్యా
యక్కటున్నంచో వక్క
రాజు వచ్చె నాసామివచ్చె
పేరపేరవో బ్రాహ్మడయ్యా
వాడితేను తప్పాని రాజును
పలికితేను బొంకాని రాజును
సత్తిమైన అరిచ్చంద్ర రాజును
దానమిమ్మంటా నడిగినారు
యేనిగిపైన వౌదగట్టి వౌదలోన
వక్క బాలునిడిసి
యెక్కితొక్కి గవ్వ మీటినంత
దాన మిమ్మంటా నడిగినాడు."

ఒక గర్భిణీస్త్రీ నొప్పులు పడుతోంది. చుట్టూ ఉన్న ముత్తైదువులు గర్భంలో ఉన్న శిశువును విష్ణువుగా నిరూపిస్తూ ఇలా పాడతారు. తెలుగువారికి పౌరాణిక విద్య వెన్నతో పెట్టిందనటానికి ఇదొక నిదర్శనం.

"తలతాలనొప్పులు కలకాలపిండాము
యెక్కొచ్చె సూరునికి యేక దండముసామి
కాసిగుడ్డలదాననయా నారాయనసామి
కాపాడు పసిబాలనూ ॥ తలతాల ॥

నాలికనచ్చత్రము నాలికనచ్చత్రము
కలవాడె బాలునికి
యెక్కొచ్చె సూరునికి యేక దండముసామి
కాసిగుడ్డల దాననయా నారాయనసామి
కాపాడు పసిబాలనూ ॥ తలతాల ॥

భూజాన భూచక్రాలు భూజానచక్రాలు
కలవాడె బాలునికి
యెక్కొచ్చెసూరునికి యేకదండముసామి
కాసిగుడ్డల దాననయా నారాయనసామి
కాపాడు పసిబాలనూ ॥ తలతాల ॥

చేతిలోచక్రాలు చేతిలోచక్రాలు కలవాడె
బాలునికి
యెక్కొచ్చె సూరునికి యేకదండముసామి
కాసిగుడ్డల దాననయా నారాయనసామీ
కాపాడు పసిబాలనూ ॥ తలతాల ॥

బొడ్డూన చింతామని బొడ్డూన చింతామని
కలవాడె బాలునికి
యెక్కొచ్చె సూరునికి యేకదండముసామి
కాసిగుడ్డలదాననయా నారాయనసామి
కాపాడు పసిబాలనూ ॥ తలతాల ॥

అరికాల దామిరలు అరికాల దామిరలు
కలవాడె బాలునికి
యెక్కొచ్చె సూరునికి యేకదండముసామి
కాసిగుడ్డలదాననయా నారాయనసామి
కాపాడు పసిబాలనూ ॥ తలతాల ॥

నెత్తినా కిరీటము నెత్తినా కిరీటము
కలవాడె బాలునికి
యెక్కొచ్చె బాలునికి యేకదండముసామి
కాసిగుడ్డలదాననయా నారాయనసామి
కాపాడుపసిబాలనూ ॥ తలతాల ॥"



## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

### శ్రీ వేంకటేశ్వర కల్యాణ ప్రదేశం

### నారాయణవనం.

*

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-00 | నుండి | 6-30 |
| విశ్వరూపదర్శనం | 6-30 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్థానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 7-00 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 8-45 | ,, | 9-00 |

### ఆర్జితాదుల వివరాలు

| | | | |
|---|---|---|---|
| అర్చన, అష్టోత్తరం | .... | రు. | 3-00 |
| హారతి | .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు | .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన | .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) | .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | | రు. | 1-00 |




(దేవదేవుని పాదపంకేరుహము కాకుండ, ఆతని హృదయకమలము కావలెనని గోలోకము నుండి భూలోకమునకు వచ్చిన కృష్ణ స్వామిని అణువణువున వెదకికొనుచు (భూలోకమునకు) వచ్చి మురళీగానలోలుని కలియుటకు రాధ పడు ఆవేదనే యీ కృష్ణగీతాలు.)

మధుర రాగాలు వినిపించి మాయమయిన
మురళి నాదంబు చెవులలో మ్రోగుచుండె ॥

వలపు వాకిలి బంధించు తలుపువీడి
ద్వారమందున నిలచిన దాననేను ॥

ప్రీతి గొల్పెడి కన్నుల ప్రేమగాంచి
పిలువ జాలక అధరమ్ము బింబమయ్యె ॥

ప్రేమ సూత్రమ్ము తెంచేదో పిరికివాడ
తెంప జూచిన మరియింత దృఢమె యగును ॥

మురళి నాదంబు వినినంత ముదము తోడ
నాట్యమాడును హృదయమ్ము నాన లేక ॥

వలపు కన్నులగిన్నెల - ఒలుకనీక
రాగ దీపమ్ము వెలిగింప రమ్ము కన్న ॥

ప్రేమ తత్త్వమ్ము పెంచిన ప్రియుడ వీవు
విశ్వప్రేమమ్ము నించిన ప్రియను నేను ॥

విశ్వమంతయు నీలోన వెలుగుచుండ
వెలుగు చుండెడు నాలోని వెలుగు నీది ॥

చెక్కు టద్దాల నారూపు చిక్కుకొనియె
కంటి పాపల నీరూప మంటి కొనియె ॥

కంటిని నికుంజ పుంజాల కలత నిదుర
నిన్ను చెంగున చేరంగ నింగె మిగిలె ॥

వెదకి బృందావనమ్మంత విసిగి కొనక
పాపి ననుకొంటి కాకున్న బాధ గలదె ॥

చిలిపి పనులెన్నొ నిరతమ్ము చేయుచుందు
విదియు చిలిపిపనియె యంచు - ఎంతు నేను ॥

— శ్రీ నడకుదురు రాధాకృష్ణ

# యువ వాణి

## దేవునిపై విశ్వాసం

— కపిరెడ్డి

రాజుగారు పెద్ద ఉద్యోగి. దేవుడనే వాడున్నాడనే విశ్వాసం లేని ఉద్యోగి. అయితే దేవాలయాలు తిరుగుతాడు, తీర్థ యాత్రలు చేస్తాడు. ఇదేంటయ్యా స్వామి అని ప్రశ్నిస్తే దేవాలయ శిల్పం నాకు నచ్చుతుంది అంటాడు. తీర్థయాత్రల వల్ల ప్రకృతి సౌందర్యం తెలుస్తుంది. ఆయా ప్రాంతాల ప్రజల జీవనపరిస్థితులు ఆచార వ్యవహారాలు అర్థమవుతాయి అంటాడు. మరి మీభార్య రోజూ దేవుని పటం ముందు కూర్చొని దాదాపు గంట సేపైనా ధ్యానం చేస్తుందేమిటి అని ప్రశ్నిస్తే ఆమె విశ్వాసాన్ని చెదరగొట్టే హక్కు నాకు లేదంటాడు. పైగా మనోవైజ్ఞానికులు చెప్పే విషయాన్ని ప్రస్తావిస్తాడు. మానసిక ప్రశాంతత కొరకు ఒకవిశ్వాసంతో ప్రశాంతంగా కొంతసేపు తపమో, జపమో, ధ్యానమో, ప్రార్థనో, అర్చనో, చేయాలి. విశ్వాసమనేదే లేని వాళ్ళను వదిలేద్దాం. కాని విశ్వాసం ఉన్న వాళ్ళకు ఏవేవో చెప్పి ఆవిశ్వాసం పోయేట్టుగా చేస్తే వాళ్లు ఉన్మాదులయ్యే అవకాశం ఉంది. కాబట్టి విశ్వాసం నిలుపుతూనే విజ్ఞానం వైపు మనిషి తొంగి చూసేట్టుగా చేయాలి. ఈ విషయాలు చెప్పే రాజుగారు ఓ పరిణతి చెందిన వ్యక్తిగా కనిపిస్తారు. ఆయన మనస్తత్వాన్ని మన్నించని వారెవ రుంటారు. మొత్తంమ్మీద యేదో ఒక విశ్వాసం వల్ల మానసిక ప్రశాంతత యేర్ప డుతుందనేది ఆయన విశ్వాసం.

ఓ అష్టావధానిగారు తనకు వచ్చే ఆదా యాన్ని అందమైన ఓ ప్రశాంత ప్రదేశంలో ఓ దేవాలయ నిర్మాణానికి వినియోగిస్తు న్నారు. అతని శిష్యుడో హేతువాది. ఓ సారి ఈ గురువుగారు బస్సుస్టాండులో ఉన్న ప్పుడు కలిశాడు. గురువుగారూ మందిరం అక్కడ నిర్మించడంలోని మీ ఉద్దేశ్యం ఏంటి అని అడిగాడు. అక్కడ పవిత్రత ప్రశాంతత ఉందని నావిశ్వాసం అన్నాడు గురువు. పవిత్రత ప్రశాంతత అక్కడే ఉందా ఇక్కడ లేదా అడిగాడు శిష్యుడు. "ఈ బస్సు స్టాండులో ఉన్న వేయిమందిలో నన్నే యెందుకు నీవు పలకరించావు. నేను నీకు తెలుసును కాబట్టి. ఈ వేయిమందిలో నీవు ఎవరితో మాటాడడంలేదు. నన్నే విధంగా చూస్తున్నావో మిగతావారిని ఆ విధంగా చూడడంలేదు. కారణం ఏమిటి! మిగతా అందరికన్నా నాలో ఓ ప్రత్యేకతను చూశావు కాబట్టి. నాలో ఆ ప్రత్యేకత నీకెలా తెలిసిందో ఆ ప్రదేశం యొక్క పవిత్రత ప్రశాంతత నాకూ అలాగే తెలిసింది" అని ఆ శిష్యునికి నచ్చచెప్పాడు గురువు. అంటే ఒక విశ్వాసమనేది మానవుణ్ని ఉత్తమ కార్యాచరణకు ప్రేరణ కలిగించేదిగా తోడ్ప డుతుందనేది తెలుస్తుంది కదా! ఆ కారణాన్నే ఆ అవధానిగారు శాశ్వత కాలాల పాటు నిల బడే ఆలయనిర్మాణానికి పూనుకున్నారు. ఇక్కడకూడా విశ్వాసం ప్రాముఖ్యత ఎటు వంటిదో తెలుస్తుంది కదా!

ఓ తెలుగు రచయిత నాస్తికుడు. అతడు పక్కింటి అరవల అమ్మాయిని పెళ్ళిచేసు కున్నాడు. ఆ అమ్మాయి ఉదయమే స్నానంచేసి నొసట విభూతి ధరించి, ఆపైన కుంకుమ పెట్టి అరగంటసేపు అర్చన చేసి భర్తను నిద్రలేపేది. వెంటనే ముఖం కడుక్కొని స్నానంచేసిరమ్మని బలవంతం చేసేది. పులుకడిగిన ముత్యంలా కనిపించే భార్యముఖంచూచి వెంటనే అవన్నీ పూర్తి చేసుకొని వచ్చేవాడు. భర్తకు నొసట విభూతి దిద్ది తీర్థప్రసాదాలు ఇచ్చి తనపనిలో నిమగ్నమయ్యేది ఆ అమ్మాయి. ఏమిటోయ్ నాస్తికబ్రహ్మ రోజురోజుకు ఇలా తయారవు తున్నావు అని నవ్వేవాళ్ళు స్నేహితులు. 'ఏం చేస్తాం మా ఆవిడ తన విశ్వాసాన్ని నామీద రుద్దేస్తుంది' అనేవాడతను. నిజానికి పక్కింట్లోని ఆ అమ్మాయిని నాలుగైదే ళ్ళుగా ఇతడు చూస్తూనే ఉన్నాడు. రోజూ ఉదయమే లేచి స్నానసంధ్యాదులు ముగించి పూలు తెంపి దేవుని పటంముందు పోసి నొసట విభూతి కుంకుమలు ధరించి రోజూ పూజచేస్తుండేది. ఆతర్వాత తల్లికి వంటలో తోడ్పడేది. తొమ్మిది గంటలకు పుస్తకాలు చేతబట్టి వీధిని పడేది. ఆఅమ్మాయి ముఖంలో ఏదో తేజస్సు ఏదో ప్రశాంతత కనిపించేది ఈ రచయితకు. ఆకళ్ళు వినిశ్చ లంగా స్థిరంగా ఉండేవి. ఆకళ్ళు ఆముఖం ఇవన్నీ ఆకర్షిస్తుండేవి. ఈ శక్తి ఆ అమ్మా యికి యెక్కడనుండి వచ్చింది- అనుకునే వాడు. ఆ తర్వాతే ప్రేమ - పెళ్లి అయిపో యింది. కొన్నాళ్ళయ్యాక అతడూ భార్యను అనుసరించడం మొదలెట్టాడు. ఏమిట్రోయ్ ఇదంతా అని అతని మిత్రులు హేళన చేస్తే ఈ విశ్వాసం నాలో ధైర్యాన్ని నింపింది అనేవాడు. అంటే దేవునిపై విశ్వాసం వల్ల మనోధైర్యం కూడా యేర్పడు తుందన్న మాట.

ఓ చోట ఓ ఛోటా మోటా నాయకుడుండే వాడు. ఈ నాయకునికి తాను కమ్యూనిష్టుగా గుర్తింప బడాలని తహతహ ఎక్కువ. సిద్ధాంత పరిచయం, వాదనా పటిమ కొద్దో గొప్పో ఉంది. ఏ వేదిక ఎక్కినా మార్క్స్ మహాశయుణ్ని ఉదహరించకుండా ఊరు కోడు. మతాన్ని తిట్టకుండా ఊరుకోడు. ఓ పర్యాయం ఓ మిత్రుడు ఇతని ఇంటికి వెళ్ళాడు. ఆరోజు వాళ్ళ ఇంట్లో యేదో ప్రత్యేక కార్యక్రమం ఉంది. వచ్చిన మిత్రుడదంతా చూశాడు. వచ్చి వరండాలో కూచున్నాడు. నాయకులవారు విచ్చేసి కూచున్నాడు. ఆయన నొసట గంధం కుంకుమ, నెత్తిన అక్షింతలు. ఆశ్చర్యపడి చూశాడు వచ్చిన మిత్రుడు. "నాభార్య శక్తి ఉపాసన చేస్తుంది. ఆ దేవి ముందు కూచుంటే ఈలోకంలో ఉండమనుకో. నాకు అనిపిస్తుంది మనిషికి శక్తికావాలంటే

( 29 వ పేజీలో )




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

**పథకంలోని ముఖ్యాంశాలు :**

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.

* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)

* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు

* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్య దాత తన వారితోసహా తిలకించవచ్చును.

* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.

* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.

* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.

# శివలింగ ప్రభావము

— నందివెలుగు వేంకటేశ్వరశర్మ



నమస్తే అస్తు భగవన్ విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః ॥ కృష్ణయజుర్వేదం ॥

శివాయ నమః శివునకు నమస్కారము. బ్రహ్మానందస్వరూపుడు, నిర్వికారుఁడు పక్షపాతము లేక సమత్వమును కలిగియుండువాఁడు శివుఁడు. మంగళం కరోతీతి శివః. శివఃస్వయం ప్రకాశయతి వా స్వయం ప్రకాశుఁడు.కాఁబట్టి శివుఁడు. శం అనగా సుఖము. ఇకారము పురుషుని ఉద్దేశించినది. వకారము అమృతశక్తి కలది. 'శివా ఋతవస్సంతు శివా వనస్పతయ స్సంతు. అహోరాత్రే శివే స్యాతాం' శివునిచే అహోరాత్రములు ఋతువులు వృక్షములు పుష్పఫలాదులును కాపాడబడుచున్నవి.శ్వపచుఁడు గానీ, చండాలుఁడు గానీ ఎట్టివాఁడైనను శివనామామృతము వచించుటచే విముక్తుఁడగుచున్నాఁడు. అన్ని లోకములను లయింపఁజేసి సృజించును. సృజించి లయింపఁ జేయును. తానే సృష్టి స్థితి లయకారుఁడు. కాబట్టి మహేశ్వరత్వము ఆయనకే రూఢియైనది. 'అస్య సర్వేశ్వరత్వం శ్రుతిరిత్థం నిర్వక్తి। అథ కస్మాదుచ్యతే మహేశ్వరః। మహాంశ్చాసౌ వీశ్వరశ్చ మహేశ్వరః' ఐశ్వర్య యుక్తుఁడు మహేశ్వరుఁడు.

'సర్వదేవాత్మకో రుద్ర
స్సర్వే దేవా శ్శివాత్మకాః'

రుద్రసంహితలో చెప్పినట్లు సర్వదేవాత్మకుడు రుద్రుఁడు.'రుతిం శబ్దం వేదాత్మానం బ్రహ్మణే దదాతి కల్పాదావితి రుద్రః' కల్పాదియందు బ్రహ్మకు వేదము లిచ్చినవాఁడు రుద్రుఁడు. 'రుతం ద్రావయతీతి రుద్రః' సంసార దుఃఖమును నాశనము చేయువాఁడు రుద్రుఁడు. 'రుత్యా వేదరూపయా ధర్మాదీనవలోకయతి ప్రాపయతీతి వా రుద్రః' వేదరూపములో ధర్మమును పొందింపఁజేయువాఁడు రుద్రుఁడు. 'శివోమహేశ్వరో రుద్రో విష్ణుశ్చైవ పితామహః సంసారవైద్య స్సర్వజ్ఞః పరమాత్మేత్యుదాహృతః' 'అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యో భిషక్' శివుఁడు,మహేశ్వరుఁడు,రుద్రుఁడు, విష్ణువు, పితామహుఁడు, సర్వజ్ఞుఁడు,పరమాత్ముఁడు, ఆదివైద్యుఁడు అను నీ దివ్యనామములు శివవైభవమును చాటుచున్నవి. సాక్షాత్తు శివమూర్తిని లింగాకృతిగా దర్శించి ధ్యానించి పూజించినచో భుక్తి ముక్తులు కలుగునని శివపురాణములో విశ్వేశ్వర సంహితలోను చెప్పబడియున్నది. శివప్రతిమార్చన కన్న లింగార్చనమే ముఖ్యమని ప్రమాణములున్నవి. 'లింగంప్రాధాన్యతః స్థాప్యం తథాబేరం తు గౌణకం లింగభావేన తత్క్షేత్రం సబేరమపి సర్వతః' విగ్రహప్రతిష్ఠకన్న లింగప్రతిష్ఠయే ప్రాధాన్యమని శివలింగమున్న క్షేత్రం సర్వథా శివప్రతిమాయుక్తమని చెప్పబడినది.

సర్వేభ్యః పుణ్యకర్మభ్యః
శ్రేష్ఠం లింగస్య దర్శనమ్।
లింగస్యాభ్యర్చనేనైవ
సర్వపాప క్షయో భవేత్ ॥
లింగార్చనాత్పరో ధర్మో
నాస్తి నాస్తి జగత్త్రయే।
లింగార్చనాత్పరం శ్రేష్ఠం
న భూతం న భవిష్యతి ॥

అన్నింట లింగపూజ ప్రాశస్త్యమని బహుపురాణములు చాటుచున్నవి. పరమశివునకు లింగము చిహ్నమై సృష్టిస్థితి లయకారణమై యొప్పుచున్నవి. అది నిర్గుణ సగుణరూపముల కలయిక.

మహాదేవుఁడు భక్తానుగ్రహార్థమై లింగ రూపముగా అవతరించెను. లింగభేదములు చాల కలవు. అందు జ్యోతిర్లింగములు, సౌరాష్ట్ర దేశమున సోమనాథుఁడు, శ్రీశైలమున మల్లికార్జునుఁడు, ఉజ్జయినియందు మహాకాళుఁడు, ఓంకారమున అమరేశ్వరుఁడు,ప్రజ్వల్యయందు వైద్యనాథుఁడు, ఢాకిని యందు భీమశంకరుఁడు, సేతువు యందు రామలింగేశ్వరుఁడు, దారుకావనమందు నాగేశ్వరుఁడు, వారణాశియందు విశ్వేశ్వరుఁడు, నాశికయందు త్ర్యంబకుడు, హిమాలయమందు కేదారేశ్వరుఁడు, ఘుశ్మేశ్వరమందు ఘుశ్మేశ్వరుఁడు. ఇవికాక పంచభూత మహాలింగములుగ కాంచీపురమందు పృథ్వీలింగముగ ఏకామ్రేశ్వరుఁడు, జంబుకేశ్వరమున జలలింగముగ జంబుకేశ్వరుఁడు, శ్రీకాళహస్తియందు వాయులింగముగ శ్రీకాళహస్తీశ్వరుఁడు, అరుణాచలమందు తేజోలింగముగ అరుణాచలేశ్వరుఁడు, చిదంబరమున ఆకాశలింగముగ చిదంబరేశ్వరుఁడు అవతరించెను.

పూర్వ మొకప్పుడు బ్రహ్మ విష్ణువులు వాగ్వివాదములతో భీకరశస్త్రములు ప్రయోగించు కొనుచుండ, లోకశాంతి నిమిత్తము పరమేశ్వరుఁడు రణరంగమున వారి ఆయుధములను వారిరువురి మధ్య తనయందు లీనమొనర్చుకొని, అనిలస్తంభముగ ఆవిర్భవించెను. వాని ఆద్యంతములరయుగోరి బ్రహ్మహంసరూపమున ఆకసమునకు విష్ణువు



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-3-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది గొడుగుల జత సగం వెల. రూ. 600/- అవుతుందికనుక టి. టి. డి. కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమిషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

వరాహరూపమున పాతాళమునకు వెళ్ళిరి. విసిగి విసిగి తుదకు కనలేక ఉభయులు పరమశివుని భక్తితో స్తుతించిరి. అప్పుడు శివుఁడు ప్రసన్నుండై మీ యిద్దరి మధ్య జ్యోతిర్లింగ స్వరూపమున ప్రాదుర్భవించిన సమయము ఆర్ద్రానక్షత్రమనియు మీరు పూజించిన యీ దినము మహాశివరాత్రి యనియు చెప్పి అంతర్ధానమయ్యె.

'యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే
శివాం గిరిత్ర తాం కురు మాహిగ్ంసీః
పురుషం జగత్'॥

కైలాసమునుండి లోకమునకు శుభములు కల్గించుటకు హస్తములందు బాణములను ధరించి పాపులను సంహరించుటకు వచ్చినాడు పరమశివుఁడని వేదము అందు చెప్పబడియున్నది.

ఇంక లింగములలో సహజలింగము, మానుషలింగములని రెండు విధములు. అందు సహజలింగములు 5 విధములు. 1. స్వయంభువములు. 2. దైవికములు. 3. ఆర్షములు. 4. గాణాపత్యములు. 5. బాణములు. స్వయంభువములన శుద్ధ లింగాకృతితో వెలసిన శిలలు. దైవికములన సహజముగా రూపొంది దేవతలచే ప్రతిష్ఠింపఁబడినవి. ఆర్షములన ఋషి ప్రతిష్ఠితములు. గాణాపత్యములన అండాకృతితో నున్నవి. బాణములన నర్మదానదీ గర్భమున లభించునవి. మానుషలింగము లన మానవనిర్మితమైనది. వీటికి బ్రహ్మసూత్రముగ నొక రేఖయుండును. ఇంకను లింగములలో సమలింగము, వర్ధమానము, శైవాధికము, స్వస్తికము, సర్వతోభద్రము, సార్వదేశికము, ధారాలింగము, ముఖలింగములు అని పెక్కు భేదములు కలవు.

సైకతం తాండులం చాన్నం
నదీమృద్గోమయం తథా।
నవనీతం చ రుద్రాక్షం
భస్మచందన కూర్చజం
పుష్పమాలా గుడం పిష్టం
స్ఫటికా శ్చ చతుర్దశ॥

వేదాగమములు ఉపనిషత్తులు పురాణములును శివారాధన ప్రశస్తి మిక్కుటముగా ఉగ్గడించినవి.

శివోగురుః శివోవేదః శివోదేవః శివః ప్రభుః।
శివోఽస్మ్యహం శివః సర్వం శివాదన్య
న్న కించన॥
భోగావహమిదం లింగం భుక్తిముక్త్యేక
సాధనమ్
దర్శనాత్ స్పర్శనాత్ ధ్యానా జ్జంతూనాం
జన్మమోచనం॥

శివలింగము సమస్తభోగములను భుక్తి ముక్తుల నొసంగునది. లింగ స్పర్శనము దర్శనము ధ్యానము జీవులను పునర్జన్మ రహితులను చేయునది.

లింగం బేరం చ మే తుల్యం
యజతాం లింగముత్తమమ్।
తస్మాల్లింగం పరం పూజ్యం
బేరాదపి ముముక్షుభిః॥

లింగము, ప్రతిమ సమానమైనను, ఉపాసకులకు లింగమే ముఖ్యము. ముముక్షువులకు ప్రతిమా పూజకంటే లింగ పూజయే ఉత్కృష్టమైనది.

తస్మాన్ముముక్షు ర్మాం విష్ణు
మపి త్యక్త్వా మహేశ్వరమ్।
ఆశ్రయేత్సర్వభావేన
ప్రసాదం కురుతే హి సః॥ (బ్రహ్మగీత)

మోక్షాపేక్షకలవారు నన్ను విష్ణువును వదలి శివునినే సేవింపవలయునని బ్రహ్మదేవుఁ డనెను.

లింగరూపముగానున్న స్వామిని సోమసూర్యాగ్నిలోచనుని, జటాజూటుని, నాగాభరణుని, వ్యాఘ్రచర్మాంబరధరుని, వేదయజ్ఞోపవీతుని, వివిధహారకేయూరకనకాది విభూషితుని, అఖిలార్తిహరుని, భక్తాభీష్టప్రదాతను భక్తిమై సేవించినవారు శివానుగ్రహమునకు పాత్రులై శివపదప్రాప్తిని పొందగలరు.

(డిసెంబరు సంచిక తరువాయి)

వేద వేదాంగాలు చదివిన వాళ్ళు చాల మంది ఉన్నారు. "తత్" మీద, "త్వం" మీద, "తత్త్వమసి" మీద కొన్ని గంటలు గంభీరోపన్యాసం చేసేవాళ్ళుకూడవున్నారు. కానీ తత్త్వం ఎందరికి అర్థమైంది. అనుష్ఠానంతో, అనుభూతితో, బ్రహ్మపదార్థాన్ని గుర్తించి, ఆనందించే వారెందరున్నారు? కేవలం జ్ఞానియైనంత మాత్రాన యోగి కాలేదు రాజయ్యా" అంటున్నారు శ్రీవారు ........

పోయింది. ఉన్నప్పుడు రాజయ్య భార్య గూడ ఇలాగే ముఖ్యమైన విషయం ముచ్చటిస్తుండగా, మధ్యలో చెప్పకుండా మాయం కావడం రాజయ్యకి చెడ్డకోపం రావడం, మళ్ళీ వచ్చిన మహాలక్ష్మమ్మ, ఒక మనోహర మందహాసం విసురుతూ పాలన్నీ పొంగి పొయ్యిలో పడిపోయినై మీకువాసన రాలేదా, అంటూ, రాజయ్య మొహానకూడ కాసిని చన్నీళ్ళు చిలకరించడం గుర్తుకొచ్చి తనలో తానే నవ్వుకుని రాజయ్య ముసుగు తన్నాడు —

ములు. అవి శ్రీవారికి వినిపించేది పాంచజన్యము అయిందా అనుకు ఈ ఊహకు లక్ష్యం 'పంచదార' పంచనవుండే దార ఎంత మధురమో అంత మధురమైంది. అని పంచదార వ్యుత్పత్తి అర్థం — రాజయ్య వ్యాకరణం అంతే. అలాగే పాంచజన్యం కూడ.

(2) వార్తలందించి వార్త లందుకునే కమ్యూనికేషన్ సెట్టు లాటిదా (3) కేవలం టెలిఫోన్‌గా మారి శ్రీవారికి, అమ్మవారికి




ఇంతలో శ్రీవారి ఎడమచేతిలో పాంచజన్యం, ఏకాయికి చెవు దగ్గరకు వచ్చింది–

హలా కమలా! మీ భక్తురాలా! .... మేము మా భక్తుడి దగ్గరే ఉన్నాం .... మీ భక్తురాలి ప్రాణాలు .... మీ పరువూ .... అంటే మా పరువూ .... ఊ-అలాగే ....అస్తు అంటూ శ్రీవారు అదృశ్యమయ్యారు —

శ్రీవారు ఇలా వచ్చినట్లే వచ్చి, తటాలున వెళ్ళిపోవడం - రాజయ్యకి అలవాటై

శ్రీవారు పాంచజన్యం పూరిస్తే శత్రువులు పుంజాలు తెంచుకుని పారిపోయేవారని చదివిన రాజయ్యకు, శ్రీవారు శ్రీదేవితో పాంచజన్యం ద్వారా వూసులాడడం కళ్ళార చూసిన తర్వాత, దాన్ని గురించి కొన్ని కొత్త ఊహాలో, అపోహలో పరంపరగా బయలుదేరినై.

(1) దేవరవారి పంచన బ్రతికే జనం, పంచలో జనం, లేక పంచజనం, వాళ్ళ తాలూకు మొరలు, మొత్తుకోళ్ళు పంచజన్య

Direct line గా పని చేస్తుందా? ఇలాటి ఊహలెన్నో వస్తునై. ఇంతలో కుర్చీలో వెయ్యిచందమామలవెలుగు విరిసి వెంకన్న సామిగా మారడం, రాజయ్య చివాలున లేవడం చిటికెలో జరిగిపోయినై.

'పడుకున్నావా'—అన్నారు శ్రీవారు పలకరింపుగా.

'అబ్బే లేదు స్వామి'

[26 వ పేజీలో]




"ఇంతై వటుడింతై..............

..............బ్రహ్మాండాంత సంవర్థియై"

వామనుడుగా ఉన్న మహావిష్ణువుకు మూడడుగుల నేల దానం చేసినప్పుడు, ఏదో ఆ శ్రీసతి కొప్పుపై హంసోత్తరీయంపై పాదాబ్జంబులపై అక్కడా అక్కడా ఆలా ఆలా విహరించే చేయి క్రిందై, మీదై తన కర ముండటం మేల్గాదే. అని బలిచక్రవర్తి అనుకున్నాడేగాని, ఆ వామనుడే విశ్వరూపాన్ని ధరించి, త్రివిక్రముడుగా, మూడోపాదం తన నెత్తిమీదనే వేస్తాడని కలలోకూడా అనుకొనివుండడు. దాతనన్న రాజసం తనతోనే, రసాతలం చేరిందని, తన శక్తియుక్తులకన్న తాతభక్తి తన పుణ్యవిశేషమూ తన రక్షకాలు కాగలవని కూడా అతడు అనుకొనివుండడు. పాత్రతెరిగిచేసిన దానం దాతకు అర్థికీకూడా ఉభయతారకమౌతుంది.

ఒక ఏభైఏళ్ళ క్రిందట వేంకటేశ్వర సంస్థాననిర్వహణ సేవాభారాన్ని ఒకసంస్థకు అప్పగించిన తెల్లదొరతనంకూడా ఆ సంస్థ ఇన్నాళ్లు ఇంతగా మూడు పూవులు ఆరు కాయలుగా పెరుగుతుందని కాని, ఒకవేళ అనుకున్నా ఆ శ్రీనివాస దయాసామ్రాజ్యం మూడుఖండాలు ముప్పయిదేశాలను ప్రభావితం చేస్తుందనికాని కొండకొమ్మునవున్న కోటిమణులదీపం తమ దొరతనాన్ని దిగజార్చి, తెల్లబరచి, తరతమభేదం లేకుండా తన దగ్గరకు లాగుకొనగలదని మాత్రం, కలలోకూడా అనుకొనివుండరు.

అందిపుచ్చుకున్న నాటినుండి ఈనాటికి అర్థశతాబ్దంపాటు పాలనా నిర్వహణ సేవలో పరిఢవిల్లిన ఈ సంస్థ ఈనాటి స్వర్ణోత్సవ సందర్భంలో గతాన్ని అనుగతికంగా పరిశీలిస్తే వామనుడిని విష్ణురూపశక్తి వేంకటేశ్వర సేవారూపంలో ఈ సంస్థ విశ్వరూపి కావటానికి ఎలా తోడ్పడిందో తెలుస్తుంది. జరిగేది మాధవసేవే ఐనా, చేసేది మానవులే కనుక స్వామికరుణాకరప్రసారం చాలా అవసరం. లేకపోతే మఖలోపుట్టి అన్నట్లు తయారైన మామూలు వ్యవస్థలెన్ని లేవు?

నిజానికిది వేంకటేశ్వర దివ్యసామ్రాజ్యమే. అందుకే ప్రభుతలో అవసరమైన అంగాలన్నీ ఈ ధార్మిక ప్రభుత్వానికికూడ వున్నై.

శ్రీనివాసప్రభుదర్శనానికి వచ్చేవారికి కావల్సింది సిరిసంపదలకన్న స్థిమితమైన మనస్సు. ఆకలిదప్పులు, ఆవాసచింత అంతరంగాన్ని బాధిస్తుంటే మనస్సుకు మాధవుడిమీద కుదిరిక ఎక్కడ మరి. అందుకే దేవస్థానం తిరుమల, తిరుపతి, తిరుచానూరు క్షేత్రాలలో ఆరు ధర్మశాలలు, ఆరు అధికావాస సౌకర్యనిలయాలు, అనేకం చిన్నచిన్న గృహాలు నిర్మించింది. దాహశాన్తికి స్నానపానాదులకు గోగర్భం, పాపవినాశం జలాశయాలు నిర్మించింది. తిరుపతిలో కల్యాణి జలాశయ నిర్మాణానికి కాస్తోకూస్తో సహాయం కూడా చేసింది. ఆకలి తీర్చేందుకు శ్రీవారి అన్నప్రసాదాలేకాక, ఉపాహారభోజనశాలలు ఏర్పాటుచేసింది.

మనదెంత ధార్మికోద్యమమైనా, వస్తువిజ్ఞాన విషయపరిజ్ఞాన శిక్షణ చాలాఅవసరం. అందువల్లనే ఈ అరనూరేళ్ల చరిత్రలో దేవస్థానం ఆరు ఆధునిక విద్యాకళాశాలలు, అందులో సగం ఉన్నతపాఠశాలలు నిర్వర్తిస్తున్నది. ఇవికాక శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయస్థాపనలో కీలకపాత్ర దేవస్థా

వందే. ఇటీవల ప్రారంభమైన పద్మావతీ మహిళావిశ్వవిద్యాలయానికి కూడా దేవస్థానం అండదండలున్నవి.

వైదికవిద్య అనగానే మొదట జ్ఞాపకం వచ్చేది సంస్కృతభాష, అది మధ్యమంగాగల వైదికవాఙ్మయం. తిరుపతిలో వేదపాఠశాల, ప్రాచ్యవిద్యాశాలలతోపాటు, హైదరాబాదులోని వేదాంతవర్ధని, సంస్కృత కళాశాలలేకాక, ఒక ప్రాచ్యవిద్యా ఉన్నత పాఠశాలను కూడా, దేవస్థాన నిర్వహణలో ఏర్పాటైనై.

యాత్రికుల ఆరోగ్యరక్షణకుగాను ఈనాడు దేవస్థానం, తిరుపతి, తిరుచానూరులలో మొత్తం మూడు వైద్యశాలలు, తిరుమలలో కేంద్ర వైద్యాలయం (అశ్విని) నిర్వహిస్తున్నది. ఇవికాక ఆయుర్వేద వైద్యశాల, పరిశోధనలకుగాను ఆయుర్వేద కళాశాల, యోగపరిశోధనాకేంద్రం దేవస్థాన నిర్వహణలోనివే. శ్రీ వేంకటేశ్వర రామనారాయణ రూయా వైద్యాలయం కూడా దేవస్థాన సహయోగంతో ఏర్పడిందే.

కేవలం తిరుపతి వచ్చేవారికి మాత్రం వసతులు కల్పిస్తే చాలదనీ, ధార్మిక కేంద్రాలన్నిటివద్ద శైవ వైష్ణవ శాక్తాది భేదాలు లేకుండా అన్ని చోట్ల దేవస్థానం చేయూత అవసరమనే భావనతో శ్రీనివాస మిషన్ క్రింద ప్రారంభమైన విస్తరణ కార్యక్రమాలలో భాగమే దేవస్థానం శ్రీశైలం, మహానంది, భద్రాద్రి ఇంకా పలు పుణ్యక్షేత్రాలలోనూ ముఖ్యనగరాలలోనూ నెలకొల్పిన ధర్మశాలలు, సమాచారకేంద్రాలు, కల్యాణ మండపాలు, అవకాశమూ అవసరమూ కలిసిరాక ఇతరుల ఆధిపత్యానికిచ్చినవి పోగా దాదాపు అన్ని కేంద్రాలు వగైరా ఇప్పుడు దేవస్థానం క్రింద ఏర్పడుతున్న వంటే, అది నాటినుండి నేటివరకు స్వామివారిపట్ల భక్తులకేర్పడుతున్న అచంచల భక్తి విశ్వాసాల ఆధిక్యతే అనాలి. కొన్నాళ్ల క్రిందట వరకు హరిజనవాడలలో రామమందిర నిర్మాణ కార్యక్రమం కూడా దేవస్థాన కార్యక్రమమే. ఆలయాలకు ఛత్రాలు, భక్త సంఘాలకు భజన సామగ్రి సరఫరా కూడా ఇలాంటివే.

జాతికి ఊపిరి వైదిక వాఙ్మయం. సస్వరంగా వేదాలను టేపు రికార్డింగు ద్వారా పదిలపరచే కార్యక్రమంతో పాటు కుమారాధ్యాపనం, ఆలయాల్లో వేదపఠన పథకం ఇంకా ఇతర కార్యక్రమాలు, వేదశాస్త్రాగమ విద్వత్సదస్సు, సన్మానాలు దేవస్థాన కార్యక్రమాలలో కొన్ని.

ధర్మప్రబోధ కార్యక్రమం క్రింద వేసవి శిక్షణశిబిరాలలో ప్రారంభమై ఆర్షసంస్కృతి సదస్సుగా విస్తృతి పొంది, ధర్మప్రతిష్ఠానం ధర్మరక్షణ సంస్థగా రూపొందింది. ఈనాడు పలుప్రాంతాలలో జరిగే ధార్మిక కార్యక్రమాలు దేవస్థానం హిందూధర్మ రక్షణ సంస్థ సంయుక్తంగా నిర్వహిస్తున్నవే.

ద్వితీయ లలితకళారంగంలో కూడ దేవస్థానం వెనుకబడలేదు. శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్యకళాశాల, శిల్పశిక్షణకేంద్రం, నాదస్వర విద్యాలయాలు నెలకొల్పుకోవటమేకాక, శ్రీ వేంకటేశ్వరుని 32,000 కీర్తనలు వ్రాసి తరించిన తాళ్ళపాక అన్నమాచార్యుల, తద్వంశీకుల కీర్తనల ప్రచారానికి అన్నమాచార్య ప్రాజెక్టు నిర్వహిస్తోంది.

ధార్మికగ్రంథముల ప్రచురణల విషయములో కూడా దేవస్థాన ప్రయత్నం ఎన్నో రూపాలు ధరించింది. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయాన్ని నెలకొల్పి వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, కోరాడ రామకృష్ణ, మానవల్లి రామకృష్ణకవి, డి. టి. తాతాచార్య వంటి ఉద్దండ పండితులను పోషించి అనేక ఉత్తమ ఆర్ష ధార్మిక గ్రంథాలను వెలువరించిన దేవస్థానం, ఆ కార్యక్రమాన్నిప్పుడు సామాన్య జనుల కందుబాటులో ఉంచే ధార్మిక గ్రంథ ప్రచురణల వైపు మళ్ళించటం జరిగి సుమారు ఒక కోటి రూపాయలు విలువగల యాంత్రిక విధానాలతో దేవస్థాన ముద్రణాలయాన్ని విస్తరించటం జరిగింది. వేదవాఙ్మయం అందుబాటులోనికి తెచ్చేందుకు వీలుగా ఋగ్వేదం ముద్రించి, యజుర్వేదాథర్వణవేదాల విషయంలో కూడా ముందడుగు వేస్తోంది. ఒకనాడు తన కేంద్రాలకే పరిమితమైన గ్రంథవిక్రయ కార్యక్రమం నేడు మనవూళ్ళ ముంగిళ్ళలోకి వచ్చి సాగుతుంది.

ఇంతెందుకు ఒకనాడు దేవస్థాన సమాచార ప్రసారానికి మాత్రమే పరిమితమై 1949 లో ప్రారంభమైన దేవస్థాన బులిటెన్ కాలవేగంలో దేవస్థాన పత్రికగా సప్తగిరిగా మారి ఈనాడు ఐదు భాషలలో సుమారు 45 వేలప్రతులు విక్రయం సాగుచున్నదంటే మిగిలిన రంగాల దేవస్థాన ప్రగతిని గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.

ఇదంతా బాగున్నవారికి, బాగా ఉన్నవారికి అందుబాటైన విధానాలు. సమాజంలో వీటన్నింటికి దూరంగా నిస్సహాయంగా నీవా, నీవా, అని సహాయంకోసం, కనీసపు చేయూతకోసం ఎదురుచూస్తున్న వాళ్లూ కొందరున్నారు. వారి నాదుకొనేందుకు 'పూర్ హోమ్' తో ప్రారంభమైన సంక్షేమ కార్యక్రమాలు కుష్ఠువైద్యాలయం, అనాథ శిశువులకు బాలమందిర్, అంగవికలుల కోసం కృత్రిమావయవ ఉత్పాదన, సహాయ ఉపాధి శిక్షణాలయాలను నెలకొల్పటం దాకా సాగాయి.

ఇదీ గత అర్ధశతాబ్దంలో దేవస్థాన ప్రగతిగతి. కాని దేహధర్మాలనుబట్టి వ్యక్తులకొక పరిమితి ఉంటుంది. వ్యవస్థలది మాత్రం మితిలేని ప్రగతి. అణువణువు అడుగడుగూ మారే సమాజావసరాలను గమనించి, నిన్నటి అనుభవాన్ని నేటి వాస్తవంతో రంగరించి, స్వీకరించి పలుమాటల లెక్కలేక ముందడుగు వేయటమే కర్తవ్యం.

**నిందంతు నీతి నిపుణాః యది వా స్తువంతు.**

నాగరాజ్

(23వ పేజీ తరువాయి)
ఆంధ్రదేశమంతా గాలివానలు వరదలూ! మీ అమ్మగారి భక్తురాలి, భర్తగారు వరద పాలై పోయారని శ్రీదేవికి విజ్ఞాపన। కాపాడమని ఆవిడగారు మాకు ఆజ్ఞాపన.

'ఈసారి ఏ అవతార మెత్తారు. ....'

'గాలివానకి ఒరిగి వరదలో కొట్టుకుపోయే రాగి చెట్టులావెళ్ళి ఒడ్డునవేసి వచ్చాను'

'చెట్లలో మీరు అశ్వత్థ వృక్షం గదా' ....

'భగవద్గీత బాగానే గుర్తుపెట్టుకున్నావ్' –

అని అరమార్కు వేసినట్టు అరనవ్వు నవ్వారు శ్రీవారు —

"ఈ ఆడవాళ్ళతో ఇదే పేచీ — కాస్త చనువిస్తే వాళ్ళ పనులు గూడా మనమీదే తోసేస్తారు. మరికొంచెం ముద్దుచేస్తే గుండెలమీద ఎక్కేస్తారు. ఆతర్వాత తలమీద తాండవం ...."

"మా అమ్మను అంత మాటనకండి!" కొంపదీసి నువ్వు అమ్మవారి కక్షియా ఏమిటీ? అదేంకాదు లేండి....ఏమైనా అమ్మ ముందు అమ్మచూపించినవాడు నాన్న!

'అమ్మ చెల్లా!! నీలోనూ మంచి హాస్య ముంది సుమా! అంటూ శ్రీవారు నవ్వుతుంటే, లేతగా రాజయ్య కూడ శ్రుతి కలిపాడు.

ఏమైనా ఈ పెళ్ళాలతో వేగడం పెద్ద చికాకు రాజయ్యా! మరి కృష్ణావతారంలో అష్టభార్యలతో ఎలా వేగారు స్వామీ! అన్నాడు రాజయ్య.

"అన్నట్టు మనం భాగవతం గురించే మాట్లాడుతున్నాం కదూ!"

"కుచేలుడిని గురించి చెబుతున్నారు"

"ఏం చెప్పాను"

"చెప్పిన మీకు తెలియదా స్వామీ"

"నువ్వు ఎంత తెలుసుకున్నావో తెలుసుకుందామని"

రాజయ్య విన్నది నెమరు వేసుకుని చెప్పడం ప్రారంభించాడు.

"కుచేలుడు అసలు పేరు సుధాముడు – అంటే మంచి ఇల్లుగలవాడు. ఆత్మకు శరీరం ఇల్లు గనుక, సుధాముడంటే, అందమైన, ఆరోగ్యమైన శరీరం గలవాడు. కుచేలుడు లోకం పెట్టినపేరు — అంటే జీర్ణవస్త్రాల వాడు – వస్త్రం అన్నాకూడ శరీరానికి ఒక సంకేతమే గనుక శమదమాది, నియమాలతో, శుష్కింపచేసి, శరీరాన్ని అదుపులో ఉంచుకున్నవాడు. కర్మయోగి — అంత వరకూ చెప్పారు. వామాక్షిని గురించి చెప్పబోతూ ఉండగా కమలమ్మగారి కబురొచ్చింది" అని పూరుకున్నాడు రాజయ్య–

"వామాక్షి అంటే ఏమిటి?"

'అందమైన కన్ను కలది'

కాదన్నట్టు శ్రీవారు చప్పరించారు —

కాకపోతే మరేమిటి స్వామీ అన్నట్లు చూశాడు రాజయ్య.

'అక్షమంటే ఏమిటో తెలుసా రాజయ్య' పాపం రాజయ్య అంత చదువలేదు—కళ్ళు తేలేశాడు.

"అక్షమంటే పాచిక. వామాక్షి అంటే అందమైన పాచిక కలది. అని అర్థం .... ఈ పేరు ఏ ఆడదానికైనా చెల్లుతుంది. ఆ పాచికే ఆడదానిమాయ. అదే వలపు, అదే కనుపించని విషవలయం! పెద్దవల అందులో పడ్డాడో ఋషిలాటి పురుషుడైనా అంతే సంగతులు ........"

బహుశా ఆ మాయలో పడే కుచేలుడు 27 మంది సంతానాన్ని కని వుంటాడు —

"పొరపాటు" — అన్నారు శ్రీవారు సీరియస్సుగా

'27 మందిని కంటే, ఏ ఆడదైనా ఏం కావాలి పాపం!! బహుశా అతి సంతానం। అయినప్పటికి అందరూ నక్షత్రాల్లాటి పిల్లలు" అంటూ రాజయ్య సర్దుకోబోయాడు —

ఈ వాదాన్ని గూడ శ్రీవారు ఒప్పనట్టు తల ఆడించారు. "చూడు రాజయ్యా! కుచేలుడిమీద భాగవతంలో వున్న ఉపాఖ్యానం కాక, నాటకాలు వగైరాలు కూడ వచ్చినై. కుచేలుడు చేదిరాజ్య నివాసుడని. చేది రాజ్యాన్ని పరిపాలించే శిశుపాలుడు కృష్ణనామస్మరణ చేసేవారిని చెరశాలలో

వేళాదని ఆ పట్టీలో కుచేలుడు గూడ వున్నాడని, శిశుపాలవధ తర్వాత విడుదలైన కుచేలుడు శ్రీకృష్ణ దర్శనానికి వెళ్ళాడని పుస్తకాలు చెబుతై ........ శిశుపాల వధా కాలం, ధర్మరాజ రాజసూయ కాలం! ఆ నాటికి ధర్మరాజు వయస్సు ముప్పైల్లోనే వుండవచ్చు. ధర్మరాజు కన్నా చిన్నవాడు కృష్ణుడు. కృష్ణుడి సహాధ్యాయి సుధాముడు. కనుక వీరి వయస్సు కూడ ముప్పైల్లోనే వుండి వుంటుంది. ఈ ముప్పైల వాడికి 27 మంది సంతానం అంటే ఎలా చెప్పు. "ఎలాగో మీరే చెప్పండి' — అన్నాడు రాజయ్య"

'అయితే లెక్కపెట్టుకో! అష్టప్రకృతులు, పంచ కర్మేంద్రియాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచతన్మాత్రలు — ఇప్పటికెన్ని

ఇరవై మూడు స్వామీ —

త్రిగుణాలు, మనస్సు —

'27 సరిపోయినై స్వామీ!'

'ప్రతి జీవికి ఈ 27 సంతానం. వీటితో సంసారం సాగించాలి। కుచేలుడు జితేంద్రియుడు వీటిని ఎండగట్టేశాడు. కావాల్సిన మేత పడకపోవడమే ఈ పిల్లల పేదరికం। ఏడుస్తూ వెళ్ళి అమ్మకు చెప్పుకున్నారు. అమ్మ అంటే ఎవరు?

"నాకు తెలియదు'' అన్నట్టుగా మొద్దబ్బాయిలా అడ్డంగా తల ఆడించాడు రాజయ్య —

ప్రకృతి పురుషులే అమ్మా నాన్నా!— ఇక్కడ వామాక్షీ, కుచేలుడు. వామాక్షి నా బిడ్డలు మలమలా మాడిపోతున్నారని, మగడిముందు కన్నీరు పెట్టింది — ఈషణ త్రయాన్ని జయించాలనుకుంటూ, దారా పుత్రులకోసం ధనం సంపాదించలేను. ఉన్నదానితో తృప్తిపడండి అన్నాడు కుచేలుడు — వామాక్షి పతివ్రత! అనుకూల పతి, మొగుణ్ణి అనుసరించి పోయే మనిషే గాని, మొండిగా తన మాటే చెల్లాలని వితండవాదానికి దిగదు—దిగినా కుచేలుడి ముందు ఆ పప్పులుడకవు! బహుశా చిన్నప్పటినుంచి భార్యను అలా భయభక్తుల్లో పెట్టి వుంటాడు .... ఎంతైనా ఆడది ఆడదే— ఆఖరి ప్రయత్నం క్రింద 'ఏమండీ మీ బాలసఖుడు గోపాలుడు' ఇప్పుడు భూపాలుడు కదా! ఒకసారి వెళ్ళి చూసి రాకూడదా?' అంది .... వామాక్షి ఎందుకు చెబుతోందో తనకు తెలుసు — తాను చూడబోయేది మోక్షానంద ప్రదాతయైన ముకుందుణ్ణి! అందుకే సరే అన్నాడు. శ్రీకృష్ణుడు మామూలు భూపాలుడు కాదు, చతుర్దశ భువనైక చక్రవర్తి. పెద్దల దగ్గరకు రిక్త హస్తాలతో పోరాదు గనుక ఏదైనా కానుక కావాలి అన్నాడు. వామాక్షి అటుకులు కట్టి ఇచ్చింది — 'దీని భావమేమి' అన్నారు. స్వామి తిరుమలేశులు తామే సెలవివ్వండి అని దణ్ణంపెట్టి పూరుకున్నాడు రాజయ్య —

చిరునవ్వులు చిందుతూ స్వామివారు చెప్పుకుంటూ వెళ్ళారు —

జీవా నువ్వు నన్ను జయించావు. జితేంద్రియుడవైనావు. పరమపురుషుని సాన్నిధ్యం చేరే అర్హత సంపాదించావు— వెళ్ళిరా అంది ప్రకృతి (వామాక్షి). అలా ఒక యోగ్యతాపత్రం కావాలన్నాడు జీవుడు (కుచేలుడు). అదే శ్రీకృష్ణునికి కావాలన్న కానుక. మామూలుగా వడ్లు తడిపి చల్లితే మొలుస్తాయి. కానీ అటుకులు మొలకెత్తవు. అంటే వాటికి పునర్జన్మ లేదు- పునర్జన్మ రహితమైన శాశ్వత కైవల్యానికి అర్హుడు అన్న యోగ్యతాపత్రమే అటుకుల మూట....

ఈ యోగ్యతాపత్రంతో, యోగీశ్వరేశ్వరుడి దగ్గరకు వెళ్ళాడు సుధామయోగి. శ్రీకృష్ణుడే ఎదురొచ్చాడు. సరాసరి పడక గదిలోకే తీసుకెళ్ళాడు - విందులు వీణా వేణుగానాలు, నాట్యాది వినోదాలు, వింజామర వీవెనలు. అన్నీ అష్టభార్యల చేతే చేయించాడు. చిన్నప్పటి కబుర్లు. పిచ్చాపాటి అన్నీ చెప్పుకుని పడుకున్నారు. ప్రొద్దుటే ఒక గంపెడు చీకటి నెత్తిన వేసుకుని కుచేలుడు బయలుదేరాడు. 'వెళ్ళిరా సోదరా' అన్నాడు శ్రీకృష్ణుడు.

నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు కుచేలుడు- రుక్మిణీదేవికే పాపం అనిపించింది.

"పేదరికంతో బాధపడలేక, మీరేదో శ్రీమంతు లని సేవించవచ్చిన చిన్ననాటి స్నేహితునికి క్కూడ. శుష్కప్రియాలూ శూన్యహస్తాలేనా" అంది రుక్మిణి-

'దేవీ! నీవు కూడ అర్థం చేసుకోలేదా! నిన్నటినుంచే మా కుచేలుడు అష్టలక్ష్మీ సంసేవితుడు-అన్నాడు శ్రీకృష్ణుడు. రుక్మిణి విడ్డూరంగా చూసింది.

'అవును దేవి' మీరు అష్టలక్ష్ములుగదా! నిన్నటి నుంచే కుచేలుడు, అష్టైశ్వర్య సంపన్నుడు - ఇక నేనివ్వవలసింది సాయుజ్యం. దరఖాస్తు నేనే అడిగి తీసుకున్నాను — అనుగ్రహించడానికి ఇంకా వ్యవధి వుంది.... అన్నాడు శ్రీకృష్ణుడు.

మూలప్రకృతికి అర్థమైంది.

'మూల ప్రకృతి ఏమిటి స్వామి'అన్నాడు రాజయ్య లింకు దొరకక! —

"శ్రీకృష్ణుని భార్యలు — వారే అష్టలక్ష్ములు, అష్టప్రకృతులు — అష్టప్రకృతులంటే" –

మూల ప్రకృతి, మహత్, అహంకారం, పంచభూతాలు —'

"భార్యలు గూడ ఇదే వరసా"

అవునన్నట్టు తలాడించారు శ్రీవారు, నవ్వుతూ!

అంటే — మూల ప్రకృతి రుక్మిణి, మహత్తు జాంబవతి, అహంకారం సత్యభామ సత్యభామ అహంకారానికి ఆకృతి అన్న మాట! అందుకే అంతగిర, రుక్మిణితో పేచీ, స్వామినే ఎడమకాలితోతన్నుట....రాజయ్య ద్వాపరయుగం నుంచీ కలియుగంలోనికి వచ్చేసరికి, రాజయ్య మెదడుకి మేతవేసిన స్వామివారు, ఎప్పుడో మెల్లగా జారుకున్నారు। 'వెళ్ళి పోయారా' — "నమో వేంకటేశాయ" అనుకుంటూ రాజయ్యగూడ నవారు మంచశాయి అయ్యాడు.

(సశేషము)

(8 వ పేజీ తరువాయి)
ముందుకు వంగి వ్రాలింది. అన్నమయ్య స్వామికి స్నానంచేయించి, తుడిచి పూజించి నాడు. పాత్రలోని పాయసాన్ని అంది చ్చాడు. స్వామి అందుకోబోయి "అదిగో, తలుపు దివ్యరంధ్రం (గుడితలుపులు మూసి యుండగా స్వామి దర్శనానికై వచ్చిన భక్తులు వృథాగా పోకుండా ఈ రంధ్రము నుండి లోపల నున్న స్వామిని లోని దివ్య వెలుగులో దర్శించ వచ్చును.) నుండి చూస్తున్నారు." అని స్వామి అట్లే వంగిన విగ్రహంతో కదలిక లేకుండా నిల్చి పోయాడు. అన్నమయ్య పరుగున పోయి వాకిలి తెరచి చూచాడు. ద్వారం దగ్గర అమ్మ వుంది. "అమ్మా! నిన్ను చూచి స్వామి నివేదన తీసికోలేదు. ఎందుకు వచ్చావు! అన్నాడు. ఆమె విచారంలో "నాయనా! నీ వెంత పుణ్యాత్ముడవు. నీవు స్వామి దర్శనం చేసి కొన్నావు. స్వామితో మాటాడినావు, స్వామికి నివే దించావు. నేను పాపాత్మురాలిని. ఆ స్వామి నాకు కానరాలేదు. నీవు, స్వామి మాటాడిన మాటలు విన్నాను. చాల ధన్యురాలను. నీవుతిరుమల వేంకటేశ్వరునినందకాంశంలో నా కడుపులో పుట్టావు. తిరుమలలో వచ్చిన నా కల ఫలించింది. నా కడుపు బంగారు వంటవు నాయనా! ఈ జన్మలో స్వామిని దర్శించే భాగ్యం నాకులేదు." అని కొడుకు నెత్తుకొని ముద్దాడి వెళ్ళిపోయింది.

అన్నమయ్య వెనుదిరిగిపోయి స్వామి నెంత ప్రార్థించినా పల్కలేదు. ముందుకు వ్రాలిన స్వామి విగ్రహం అట్లే నిలిచి పోయింది. అన్నమయ్య ఏడుస్తూ నిండు పదార్థముల పాత్రలతో నింటికి వచ్చి

"అమ్మా! స్వామి నివేదన తీసుకోలేదు." అన్నాడు. తాను చేసిన పనికి ఆ తల్లి తాను నిందించు కొనుచూ కొడుకును చేరదీసి, ఓదార్చిందట.

ఆనాటి నుండి స్వామి దర్శనానికై అన్న మయ్య పరితపించినాడు. అన్న వదినెలు చెప్పిన పనులు విధిలేక చేసేవాడు. వార్థ కావలెనని ఏవో పనులు కల్పించి చెప్పేవారు. సేద్యపుపనులు, పసుల మేపడం, అన్న మయ్య వంతు. అన్నమయ్య స్వామిని ధ్యానిస్తూ ఒక్కొక్కప్పుడు పొలంలోనే వుండేవాడట. అన్నము నీళ్ళపై ధ్యాసే లేదు. స్వామి అనుగ్రహంతో నతనికి విద్యా యోగ్యతలు సహజంగా లభించినవట— అని చెప్పారు కథ.

ఆడినమాటెల్ల నమృతకావ్యముగ-పాడిన పాటెల్ల పరమ గానముగ పాటలు పద్యాలు ఏవో ఎన్నో పల్కెడి వాడట. చిన్ననాడే స్వామిభక్తి అబ్బిన అన్నమయ్యపై గ్రామంలో గౌరవం ప్రీతి క్రమంగా పెర గడం చూచి అతని అన్నవదినెలకే గాక తక్కిన దాయాదులకు నాగ్రహం కల్గింది. అతనికేదో సేతుబడి దాయాదులు చేయింప బూనగా అమ్మణ్ణి (ఈ లక్ష్మీదేవి విగ్రహం ఇపుడు తాళ్ళపాక గ్రామానికి ఉత్తర దిక్కునగల పాటిదిబ్బకడ నడుము వరకు పాద పీఠంతో కూడా భూమిలో పూడుకొని వుంది. దానిపై భాగం పాటిదిబ్బలో కూరు కొని యున్నదేమా! ఆ పాటి దిబ్బే ఆ అమ్మణ్ణి ఆలయం కావచ్చు. చెన్నకేశవాల యానికది సమీపమే) అనుగ్రహంతో, తన తల్లి ప్రార్థనవల్ల బయటపడినాడు. అన్న మయ్య తాను తన కుటుంబము వారివల్ల బాధలు పడినట్లు అన్నమయ్య - అధ్యా-28 రేకుపాట తెలుపుచున్నది.

ఒకప్పుడు తిరుమలనుండి తాళ్ళపాకకు రాగా ఆ దాయాదులు, ఊరివారు కొందరు అన్నమయ్యఏకనాదం యొక్క తంత్రిని పీకి త్రెంచినట్లు ఆ వూరిలోని వృద్ధులు శ్రీ జంగా సుబ్బయ్యగారు చెప్పిన ఒక ద్విపద వంటి రచన భాగం తెల్పుచున్నది. అది— 'ఏకనాదము తంత్రి త్రెంచిన—ఎదవ గ్రామము తాళ్ళపాక' – అని అన్నమయ్య తన జన్మగ్రామాన్నే నిందించినాడు. ఆ కథ గాని, నిందించిన పదవాక్యముగాని చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్రలో లేదు.

తన దాయాదులు, అన్న వదినెలు పెట్టు బాధలు పడలేక ఒకనాడు తమ పొలంలో పనిచేస్తూ తిరుమలకు పోవు భక్తుల వెంట తిరుపతికి అన్నమయ్య వెళ్ళాడు. ఇక ఆపై చరిత్ర తెలిసినదే. (చూః-అన్నమాచార్య చరిత్ర) అన్నమయ్యకు చిఱుప్రాయమున స్వామి సాక్షాత్కరించినట్లు ఆ కథ తెల్పు చున్నది. అన్నమయ్యకు పదునారవ యేట స్వామి ప్రత్యక్షమైనట్లు ఆయన సంకీర్తనముల తొలి రాగి రేకుమీద చెక్క బడి యున్నదని, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి అన్నమాచార్య పీఠికలో నున్నది.

"నున్నగా సంకీర్తన నా నోరి కిచ్చితి
గనుక
నన్ను రక్షింతువే యనుచు నమ్మితి
నేను"—
"పిన్ననాడే నీవు నన్నుం బేరుకొంటివి
గనుక
ఎన్నంగ నీడేర్తునని యియ్యకొంటి
నేను"—

(అన్న-అధ్యా-సం II పుట 244) అను పాటల్లో "పేరుకొంటివి" అన్నది. దర్శన మిచ్చినట్లు కాదు గదా! అట్లే "సంకీర్తన నా నోరి కిచ్చితి' పేర్కొనుట, కీర్తించుట, పేరు తలంచుట, పల్కుట అని భావము. ఇది అన్నమయ్యకు పిన్ననాడే లభించిన దని పై పదములో అన్నమయ్యే వచించి నాడు. "శ్రీకాంతుడు నీ మూర్తి నా చిత్త ములో నిల్పగాను నాకు నీవు గలవని నమ్మితి నేను" అనుటచే చిన్ననాడే అన్న మయ్యకు చెన్నకేశవునిపై వేంకటేశునిపై భక్తి కల్గినది.

అట్లే అన్నమయ్య మోకాళ్ళ ముడుపు యెక్కునపుడు ఒక బండపై మైమరచి నిద్రింపగా అలమేలు మంగాంబ దర్శన మిచ్చి యూరడించినదట. అప్పుడు అల మేలు మంగకు నాతుమార్గమున సలలి తంబుగ నొక్కశతకంబు సెప్పె" అని పై వేంకటేశ్వర శతకము చెప్పినాడట.

అన్నమయ్యకు చిన్ననాటనే అనగా పది పండ్రెండేండ్ల ప్రాయము లోపలనే చెన్న కేశవులును, పదునారవయేట అలమేలు

[41 వ పేజీలో]

( 19వ పేజీ తరువాయి)

తప్పనిసరిగా శక్తిని ఉపాసించాలి అని" అన్నాడు నాయకుడు. ఇక్కడకూడా బయట వేదికల మీద అతడేవిధంగా మాట్లాడినా అంతరంగంలో ఓ విశ్వాసం అతనికేర్పడిందని తెలుస్తోంది.

హిందూ సాంప్రదాయాల్ని అప్పుడప్పుడు నిరసిస్తుంటాడు ఓ పంతులయ్య. ముఖ్యంగా హిందువుల్లోని కొన్ని వృత్తుల వారిని తిడుతుంటాడు. వారివల్లనే దేశంలో ఇన్నివైషమ్యాలు ఏర్పడ్డాయని అంటాడు. భౌతిక దృక్పథంతో రాహుల్ సాంకృత్యాయన్ రాసిన గ్రంథాల్లోని విషయాలే ఎక్కువగా చెబుతుంటాడు. ఆ విషయాలే అతని నరనరాల్లో జీర్ణించుకపోయి అతడు నాస్తికుడయ్యాడా అనిపిస్తుంది. అయితే పెళ్లీ పేరంటం అన్నీ సంప్రదాయానుగుణంగానే జరిగిపోయాయి. అంతకు ముందు భారతీయ కుటుంబ జీవనవ్యవస్థను కూడా విమర్శించిన మనిషి వైవాహిక కర్మనెంతమాత్రం వ్యతిరేకించలేదు. పైగా బోలెడెంత కట్నం కూడా తీసుకున్నాడు. అతనికి సన్నిహితంగావుండి పరిశీలించే మిత్రునికి అతని మనస్తత్వమేమిటో అంతు పొంతు చిక్కలేదు. అప్పుడే స్నానంచేసి గదిలోకి వస్తున్న ఈ పంతులయ్యను ఓనాడతని మిత్రుడు చూశాడు. మెడలో ధగధగ మెరుస్తున్న ఓంబిళ్ల. ఏమిటిది మెడలో అని పట్టిపట్టి చూశాడు. ఆఁ యేముంది తిరుపతి దేవుని దగ్గరి నుండి తెప్పించిన ఓం బిళ్ల అన్నాడు. ఓంకు వెనుకవైపున వేంకటేశ్వర స్వామి కూడా వున్నాడు. అవాక్కయిపోయాడు మిత్రుడు. అతడే సంజాయిషీ యిచ్చుకున్నట్టుగా అన్నాడు. ఈ మధ్యన తిరుపతి వెళ్లాను. గుండుకొట్టించుకొన్నాను. అప్పటి నుండి ఇది మెడలో ధరిస్తున్నాను. ఇది ధరించినప్పటి నుండి నాలో ఉత్సాహం రెట్టింపయ్యింది. ఎవరో నన్ను అడుగడుగునా వెన్నుతట్టి మంచివైపు పురోగమించేట్టు చేస్తున్నారు. ఇది విని ఆ మిత్రుడు అతనికి దండంపెట్టి వెళ్లిపోయాడు. ఇక్కడ కూడా భౌతికసిద్ధాంత భావాలు అతన్ని యెంతగా వశం చేసుకున్నా అంతరంగం లోని విశ్వాసాన్ని అణచలేకపోయాయి అనేదే స్పష్టమవుతుంది.

తెలుగు సాహిత్యంలో పరిశోధన చేసే ఓ విద్యార్థి వున్నాడు. పరిశోధనారంగంలో కాలుబెట్టకముందు ఈ విద్యార్థి నిత్యం భగవద్గీత చదివేవాడు. భాగవతం చదివేవాడు. రామాయణాన్ని అద్భుత గ్రంథంగా వర్ణించేవాడు. మందిరాలకు వెళ్ళేవాడు. అక్కడక్కడ భగవంతుని విభూతుల్ని గూర్చి ప్రసంగించేవాడు. అయితే పరిశోధన చేపట్టాక ఈ విద్యార్థిలో విపరీతమైన మార్పు వచ్చింది. విశ్వవిద్యాలయంవారు ఇతనికో సూపర్వైజర్ను ఏర్పాటుచేశారు. ఆగైడ్ క్రింద ఇతడు పరిశోధన చేయాలి. ఆ గైడ్‌గారు పరమఛాందసులు. ఆ విద్యార్థి పుట్టుపూర్వోత్తరాలు, తల్లిదండ్రుల వృత్తి తదితరాలు తెలుసుకొని అతన్ని హీనంగా చూడడం, దూరంగా వుంచడం మొదలెట్టాడు. ఈ గైడ్‌గారు ధర్మనిష్ఠ కలిగిన సంప్రదాయవాది అని, ధర్మరక్షకాగ్రేసరుడని పేరున్నవాడు. అలాంటివాడనే మొదట ఈ విద్యార్థి సంతోషించాడు. కాని తననతడు పాయసంలోపడ్డ ఈగలా తీసిపారవేస్తుండడంతో అప్పటినుండి తన విశ్వాసాల్ని సడలించుకున్నాడు. మందిరాలకు పోవడం మానేశాడు. రామాయణ భారత భాగవత భగవద్గీతాది గ్రంథాల్ని దూషించడం మొదలెట్టాడు. ఆ తర్వాత పరమ నాస్తికుడయ్యాడు. రాను రాను నక్సలైట్ల భావాలు నచ్చేవాడయ్యాడు. ఒక వ్యక్తి ప్రవర్తన వల్ల తన పూర్వవిశ్వాసాల్ని సమూలంగా ఎందుకు నాశనం చేసుకోవాల్సి వచ్చిందో ఆలోచించాల్సిన విషయమే యిది మరి.

ఓ గ్రామంలో ఓ బీదరైతున్నాడు. తాను బాగా పండించి ధనవంతుణ్ని కావాలని అతడు నిరంతరం కృషిచేస్తూనేవున్నాడు. అయినా బొటాబొటీగా పంట పండడం నిరాశతో కృంగిపోవడం జరుగుతూనే వుంది. అప్పుడప్పుడే కిరస్తానీ మతం పుచ్చుకున్న ఓ హిందువు అతనికి తారసిల్లి బాగా మతబోధ చేశాడు. ఈ కొత్త దేవుణ్ణి నమ్ముకో నీకు పంట బాగా పండుతుంది. నీవు ధనవంతుడవవుతావు అని పురెక్కించాడు. ఆ రైతు యితని మాటల గారడీలో చిక్కుకొని మతం మార్చుకున్నాడు. ఆ సంవత్సరం చెరకుపంట బాగాపండింది. ఆనందంతో బెల్లంముద్దలు తయారుచేయించి ఇంట్లో నిలువపెట్టాడు రైతు. అంతకుపూర్వం కొన్ని నెల్లయినా నిలువవుండే బెల్లం ముద్దలు ఆ యేడు నెలరోజులకే నీరుగారిపోయాయి. ఆ రైతు భార్యాబిడ్డలు మతం మారినందుకే ఇలా జరిగిందని మన దేవునికి మనమీద కోపం వచ్చిందని భావించి అప్పటినుండి పసుపుకుంకుమలు గాజులు ధరించడం మొదలెట్టారు. రైతుకూడా కొత్తమతాన్ని వదలిపెట్టి మళ్లీ ఎప్పటిలాగానే వ్యవహరించసాగాడు. తన పూర్వవిశ్వాసాల్ని పునరుద్ధరించుకున్నాడు. బెల్లం వండడంలో చేసిన పొరపాటువల్లనో, సరియైన స్థలంలో నిల్వ చేయించనందువల్లనో బెల్లం చెడిపోయి వుంటుంది. అయినా ఆ విధంగా అతని మనస్సు ఆలోచించనేలేదు. తన విశ్వాసం చెదరినందువల్లనే ఇలా జరిగిందని పూర్వ మార్గాన్ని అనుసరించాడు.

సమాజంలోని విభిన్న మనస్తత్వాలు కలిగిన వ్యక్తుల్ని ఈ విధంగా పరిశీలిస్తూ పోతే దేవునిపై విశ్వాసం కలగడానికి గాని తొలగడానికి గాని అనేక రకాల కారణాలు కన్పిస్తాయి. తమకు అత్యంత సన్నిహితులైన వారి ప్రవర్తనల్ని బట్టి దైవంపై విశ్వాసం ఏర్పడుతుందని, కేవలం తన అంతరంగ పరిశోధనల వల్లకూడా విశ్వాసం ఏర్పరచుకుంటాడని, ఆచారంగా మారిన మతచిహ్నాలవల్ల కూడా విశ్వాసం బలపడుతుందని, పైకి కీర్తి ప్రతిష్ఠలకొరకో మరెందుకో దైవాన్ని తూలనాడినా అంతరంగంలో విశ్వసిస్తూనేఉంటారని, ఉన్నత స్థాయిలో ఉండి ధర్మరక్షకు లనబడేవారు తమ క్రింది వారిని హీనంగా చూసిన సందర్భాల్లో వాళ్లు తమ దైవవిశ్వాసాల్ని వదలి వేస్తున్నారని, అర్థానికి ఆకర్షణాలకూ

లోనై కూడా విశ్వాసాల్ని మార్చుకుంటు న్నారని పై పరిశీలనా ఫలితాలు తెలియ జేస్తున్నాయి.

అయితే దైవం అంటే ఎక్కడో ఉన్నా డనే అభిప్రాయంతో ఈ విశ్వాసం ఏర్పరచు కోడంగాక జీవునిలోనే దైవాన్ని దర్శిస్తూ జీవునిమీదనే ఈ విశ్వాసం ఉంచడం ఉత్త మం అని మన ప్రాచీన మహర్షులు తత్త్వ వేత్తలెందరో చెప్పారు. శంకరాచార్యులు, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ జీవ దేవాద్వైతాన్ని సమ్మానించి మానవసేవ చేయడమే మాధవుణ్ని సేవించినట్లవు తుందని గట్టిగా నొక్కి చెప్పారు.

పరమాత్మ - ప్రకృతి - జీవుడు విశ్వంతో పాటే సృష్టించబడ్డారు. ఈ విశ్వంఉన్నన్ని నాళ్లూ ఉంటారు. ఈ విశ్వం ఎప్పుడు పుట్టింది, ఎన్నాళ్లు ఉంటుంది. పరమాత్మ ప్రకృతి - జీవుడు ఎప్పుడుపుట్టారు. ఎన్నాళ్లు ఉంటారు - ఇవి లోతు తెలియని ప్రశ్నలు. ఏవో అతికీ అతకని సమాధానాలు చెప్పు కున్నా, చెప్పిన వారి మదిలో సంతృప్తి కనిపించదు. విన్నవారి మదిలో ప్రశ్నార్థక చిహ్నం మాయం కాదు.

అందుకే అద్వైత సిద్ధాంతాన్ని అనుస రించి "దేవుని మీద విశ్వాసం" అనే అర్థమే చెప్పాలి. ఇలాంటి విశ్వాసంవల్ల వ్యక్తిలో దైవభక్తి- దేశభక్తి బలపడుతవి. ఆ అభి ప్రాయాలు బలపడ్డ కారణాన్నే దేవుడంటే మాతృదేశమే అని, దేవతలంటే ప్రజలే అని మహాకవుల కలాలు అమృతవర్షాన్ని కురి పించాయి.

"దేవుడన మాతృదేశమ,
దేవతలన ప్రజలు, యజ్ఞదీక్ష యనంగా
సేవావ్రతనిష్ఠయు, ఇవి
జీవనసూత్రములుగా ప్రసిద్ధిం గనుమా"

దేవునిపై విశ్వాసం అనే అంశానికి ఇంత మహత్తరార్థాన్ని జోడిస్తే, ఈ జోడించిందే నిత్యజీవితంలో ఆచరిస్తే ప్రతి మానవుని జన్మ ధన్యమైనట్లే కదా! *

(10వ పేజీ తరువాయి)

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ ! తత్కురుష్వ మదర్పణమ్ ॥

కౌంతేయా ! నీవు ఏంచేసినా-భోజనం చేసినా, హోమం చేసినా, దానం చేసినా, తపస్సు చేసినా, నాకు ఆసర్వం సమర్పించు.

శుభాశుభ ఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి ॥

శుభాశుభఫలాలు కలుగజేసే కర్మబంధాలనుంచి నీవు అలా విముక్తి పొందుతావు. సన్యాసయోగం అవలంబిస్తే జీవించి వుండగానే ముక్తిపొంది, మరణానంతరం నన్ను చేరుతావు.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥

సమస్త ప్రాణులపట్ల సమభావం కలిగిన నాకు విరోధి కాని, ఇష్టుడుకాని లేడు. నన్ను భక్తితో భజించేవాళ్లు నాలోనూ, నేను వాళ్ళలోనూ, వుంటాము.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్య గ్వ్యవసితో హి సః ॥

ఎంతటి పాపి అయినప్పటికీ ఏకాగ్రచిత్తంతో నన్ను సేవించేవాణ్ణి సాధువుగానే భావించాలి. ఎందువల్లనంటే అతని సంకల్పం మంచిది.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥

అలాంటివాడు అచిరకాలంలోనే ధర్మాత్ముడై, శాశ్వత శాంతి పొందుతాడు. కౌంతేయా! నా భక్తుడెప్పుడూ చెడిపోడని ఘంటాపథంగా శపథంచేసి మరీచెప్పు.

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః తేఽపి యాంతి పరాం గతిమ్ ॥

పార్థా ! నన్ను ఆశ్రయించినవాళ్ళు ఎవరైనాసరే-పాప జన్ములుకాని, స్త్రీలుకాని, వైశ్యులుకాని, శూద్రులుకాని-పరమ శాంతిపదం పొందుతారు.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయ స్తథా ।
అనిత్యమసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥

ఇక పుణ్యాత్ములైన బ్రాహ్మణులు, భక్తులైన రాజర్షుల గురించి వేరే చెప్పాలా ! సుఖంలేని అశాశ్వతమైన ఈ లోకంలో పుట్టిన నీవు నన్ను సేవించు.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః ॥

నా మీదే మనస్సూ, భక్తి కలిగి నన్నే పూజించు. నాకే నమస్కరించు ఇలా నన్ను ఆశ్రయించి, నా మీదే మనస్సు నిలిపితే నన్నే పొందుతావు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "రాజ విద్యారాజ గుహ్యయోగం" అనే తొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

(సశేషం)

## విశ్వజనీన ప్రార్థన

"అసతో మా సద్గమయః
తమసో మా జ్యోతిర్గమయ;
మృత్యోర్మాఽమృతం గమయ."

"అసత్తునుండి నన్ను సత్తులోనికి
గొనిపొమ్ము;
చిమ్మచీకటి నుండి వెలుగులోనికి
గొనిపొమ్ము;
మృత్యువునుండి అమృతత్వము లోనికి
చేర్చుము."

ఇది విశ్వజనీన మైన ప్రార్థన.

ఏదేశంలోని వారైనా, ఏకాలానికి చెందిన
వారైనా'
ఏమతాన్ని అవలంబించేవారైన సరే
యీ ప్రార్థనలో
నిరభ్యంతరంగా పాల్గోవచ్చు.

మానవచరిత్ర సృష్టి తొలియుషస్సులలో మంత్రద్రష్టలైన మహర్షుల దర్శనం- అనుభూతి

ఈ ప్రార్థనాశ్లోకం.

ఈ శ్లోకం- యుగయుగాంతరాలలో భారతీయ వేదాంతమునకు పూజాపీఠం అయింది. ప్రపంచంలో వెల్లివిరిసిన వేదాంత దర్శనాలు అన్నిటికీ-

సత్తు—అసత్తు
చీకటి—వెలుగు
మృత్యువు—అమృత్వతము

అన్వేషణ శీర్షిక లైనవి.

మానవస్వరూప స్వభావాలకు అనుగుణంగా-భగవంతునికి ఆకారం ముక్కు- చెవులు- కన్నులు- చేతులు అధికంగా కల్పించిన సాకార సగుణ బ్రహ్మోపాసన ఒక యెత్తు. ఈ సృష్టికి ఆధారమైన పరాశక్తిని ఆరాధించటం ఒకయెత్తు. సమన్వయ వేదాంతుల దృష్టిలో సగుణోపాసనకు నిర్గుణోపాసనకు అపరిహార్య మైన వైరుధ్యంగాని విప్రతిపత్తిగాని ఏమీ లేదు. భాగవతంలో తన్నివితీర సాకారపరబ్రహ్మోపాసన చేసిన పోతనమహాకవి- మకరికి చిక్కిన గజేంద్రుని నోటినుండి నిర్గుణోపాసకులు మెచ్చుకునే పద్యం పలికించాడు.

ఎవ్వనిచే జనించుః జగ
మెవ్వనియందున నుండు లీనమై?
ఎవ్వనియందు డిందు? పరమేశ్వరు
డెవ్వడు? మూలకారణం
బెవ్వఃడనాది మధ్యలయుడెవ్వడు?
సర్వము దానయైన వా
డెవ్వడు? వాని నాత్మభవు
నీశ్వరునే శరణంబు వేడెదన్.

పై పద్యం- సమస్త ఆస్తిక దర్శన సార సంగ్రహం అనిచెప్పవచ్చు.

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

ఇక- ప్రార్థన గూర్చిలోకంలో ఎన్నో దురభిప్రాయాలు వ్యాపించియున్నాయి. ప్రార్థన దేనికొరకు? ప్రార్థన- ప్రార్థన కొరకే "ఓ పరమేశ్వరా! నాకోరికలు నీవు ఈడేర్చు; నీకు కొబ్బరికాయ కొట్టి నీకు సహస్రనామార్చన చేస్తాను" అని భగవంతునితో బేరం పెడితే అది భక్తియోగం కాదు; వ్యాపార వర్తకయోగం అవుతుంది.

ప్రార్థనవేరు! యాచనవేరు!

తక్కువమూలధనంతో ఎక్కువలాభాలు ఆర్జించాలనే దురాశా, తహతహ అచ్చమైన ప్రార్థన కాజాలదు.

సహస్రనామార్చన- భగవంతుని అనంత విభూతిని ఆకళించుకొనే ఆధ్యాత్మిక సాధన మేగాని విదూషకుడుచేసే ముఖస్తుతికాదు.

నిజానికి భగవద్ భక్తివలన - త్రిగుణాతీతుడు అవాఙ్మానసగోచరుడు అయిన ఆభగవంతునికి కలిగే లాభం ఏముంటుంది? ప్రార్థనవలన నిస్సందేహంగా భక్తునికే మేలు కలుగుతుంది.

ప్రార్థన- ఆత్మోద్ధరణ సాధన.

ఈ విషయంలో నోబెలు బహుమతి గ్రహీత – సుప్రసిద్ధవిజ్ఞాన శాస్త్రవేత్త వైద్య విద్యాపారంగతుడు డాక్టర్ అలెక్సిస్ కారెల్ చెప్పిన సాక్ష్యం ఇట అనుసంధేయం.

"ప్రార్థన- ప్రజ్వలింపజేసే అంతరశక్తి మహత్తరమైనది. ఆ శక్తిని భూమ్యాకర్షణతో పోల్చవచ్చు.

వైద్యవృత్తిలో చిరంతన స్వానుభవంతో నేనుచెప్పే మాటఇది:- అన్ని చికిత్సలు వృథా అయిపోయినట్లు ఋజువైన పిమ్మట గూడ కేవలం ప్రార్థనా తపస్సు వల్ల మృత్యుంజయులై బ్రతికి బయటపడిన రోగులు కొందరు నాకు ప్రత్యక్షంగా తెలుసు!

కోపతాపప్రకోపాలు మానవ శరీరంలోని వివిధ నాడులనుండి ఏవిధంగా వివిధరసాలు ఆమ్లాలు ఉద్భవింపజేస్తాయో అదేవిధంగా ప్రార్థనగూడ మానవదేహంలోని వివిధ అవయవాలపై అత్యద్భుత ప్రభావాన్ని ప్రసరింప జేస్తుంది!

ప్రార్థన చేసేవ్యక్తి- విశ్వవిశ్వాంతరాళాన్ని నడిపే అవ్యయానంత శక్తికేంద్రంతో అవినాభావ సంబంధం ఏర్పరచుకో గల్గుతాడు. ప్రార్థనచేసే వ్యక్తి- ఆమహాశక్తిని తనలో కొంతకొంత ఆవిష్కరించుకోటం తథ్యం.

నిజానికి- స్త్రీ పురుషులు ఎవ్వరైనాసరే- ఒక్కనిముషం ప్రార్థనచేస్తేచాలు- వారికి ఏదోకొంత ఆత్మోద్ధరణ ఆంతరంగిక వికాసం అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక ఔన్నత్యం కలగటం తథ్యం."

ఇక-

"సర్వే జనాః సుఖినో భవంతు"

అనిచేసే ప్రార్థన ఎంత ఉదాత్తమైనది! ఎంతవిశ్వజనీనమైనది!!





# నవశక్తినిలయం నుండి భక్తులకు విశిష్టకానుక !

జగద్గురువులు శ్రీ కంచికామకోటి శ్రీ జయేంద్రసరస్వతి, శ్రీ శృంగేరి శారదాపీఠ మహాసన్నిధానం, శ్రీ ఆచార్య శ్రీ శరణతీర్థ మహారాజ్ (గోండాల్) మరియు ఇతరసాధువుల ఆశీస్సులు శ్రీముఖాలు గలిగిన దివ్యయంత్రాలు !

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ మహాలక్ష్మి యంత్రం 24 సెం.మీ × 24 సెం.మీ | — | రు. 1000-00 |
| 2. | శ్రీచక్రము, సౌభాగ్యవిజయలక్ష్మి యంత్రం 16 సెం.మీ × 16 సెం.మీ ఒక్కొక్కటి | — | రు. 500-00 |
| 3. | శ్రీ మహామేరు (పంచలోహం) 6 సెం.మీ | — | రు. 500-00 |
| 4. | శ్రీ మహామేరు (పంచలోహం) 4½ సెం.మీ | — | రు. 300-00 |
| 5. | శ్రీచక్రం, ఇతర చక్రాలు ఒక్కొక్కటి 8 సెం.మీ × 8 సెం.మీ | — | రు. 115-00 |
| 6. | దృష్టి నివృత్తి యంత్రం (ఫ్రేముతో) | — | రు. 50-00 |
| 7. | దృష్టి నివృత్తి డాలరు (దృష్టిదోషాల నివారణకు, వాహన ప్రమాదాల నివారణకు, పిశాచాలు పారద్రోలేందుకు, ఇంటిలో, ప్యాక్టరీలో, వ్యాపారంలో ఐశ్వర్యసిద్ధికి) | — | రు. 50-00 |
| 8. | వివాహప్రాప్తి డాలరు (మౌలికమైనది) (శీఘ్రంగా వివాహం జరిగేందుకు) | — | రు. 50-00 |
| 9. | వెండికవచంతో రుద్రాక్షమాల (54 పూసలతో) (పూజజరిపి పంపబడుతుంది) | — | రు. 250-00 |
| 10. | స్ఫటికమాల (మౌలికమైనది, 54 పూసలతో) | — | రు. 250-00 |
| 11. | వెండికవచంతో పద్మమాల (54 పూసలతో) | — | రు. 100-00 |
| 12. | ఎలక్ట్రానిక్ రాగికడియము (12 రాశులకు) ఒక్కొక్కరాశికి | — | రు. 20-00 |

దేవాలయాల్లో ప్రతిష్ఠించేందుకై శిలావిగ్రహాలు లభించును. దేవాలయాల్లో యంత్రస్థాపనకై యంత్రములు లభించును. తంజావూరు ఆర్టుప్లేట్లు ప్రత్యేక పద్ధతుల్లో అనేకరకములుగా తయారుచేయబడినవికూడ వున్నవి. ప్రత్యేక డిజైన్లుకల ఆర్టుప్లేట్లు మీ అభ్యర్థనపై తయారుచేయబడి పెద్దపెద్ద మొత్తాల్లోను, విడిగాను అమ్మకం చేయబడుతవి.

ంగా పంపి ఆర్డరు ఇవ్వండి. వస్తువులు వి. పి. పి. ద్వారా పంపబడుతవి.

విశ్వకర్మజ్ఞ, శ్రీవిద్యోపాసక

స్వామీజి శ్రీ ఎస్. టి. మురుగభూషణం,

నవశక్తినిలయం,

153-లాయడ్స్ రోడ్డు, గోపాలపురం, మద్రాసు-600086, ఫోన్ : 812013.

# శ్రీరామకృష్ణ కథామృతము

[రెండవభాగము]

(ప్రచురణ : శ్రీరామకృష్ణమఠము - మైలాపూర్, మద్రాస్. డెమ్మీ పుటలు 320, వెల : ప్రతి రు. 13/- మేలు ప్రతి రు. 18/-)

తెలుగులో శ్రీరామకృష్ణ పరమహంస వాఙ్మయమంటే కీ. శే. చిరంతనానంద స్వామివారు జ్ఞాపకం వస్తారు. వారు కావించింది అనువాదం కాదు. పునఃసృష్టి.

వారి తరువాత తెనుగులో గ్రంథ ప్రచురణం అంతగా జోరుగా సాగకపోయినా పూర్తిగా మూతపడలేదంటానికి ఈ ప్రస్తుత ప్రచురణమే నిదర్శనం.

ఇందులో అనువాదకుల పేరు ఏ కారణం చేతనోలేదు. దీన్నిబట్టి కర్తృత్వ కీర్తికాంక్ష లేని ఏ మహనియులో ఈ కార్యభారాన్ని వహించారనుకోవచ్చు.

పుస్తకం శీర్షికలో 'వంగమాతృక' 'మహేంద్రనాథగుప్త' అని వుంది. కాని ప్రకాశకుల తొలిపలుకులో జగత్ప్రసిద్ధిగాంచిన ఆంగ్లగ్రంథం The Gospel of Sri Rama Krishna కు అనువాదమని పేర్కొనబడింది. అనువాదానికి అనువాదంపేరు, మాతృకానువాదం పేరుకదా!

ఆర్షధర్మానికి క్రమంగా బాహ్యాడంబరాచారాలు అనే బూజుపట్టింది. అన్యనాగరకత దాన్ని ఇంకా క్రుంగదీసింది. పరానుకరణం వచ్చింది. అనేక విధాలుగా దానికి గ్లాని ఏర్పడ్డ తరుణంలో అవతరించారు-శ్రీరామకృష్ణ పరమహంస. బూజుదులిపి ఆచరణలో దానికి నూతనజీవం పోయడమే గాక కొంగ్రొత్తజవాన్ని చేకూర్చి విదేశీయులకు కూడా దానిమౌలికకాంతిని ప్రకాశింపజేయటంచేత ఆయన అవతార పురుషుడుగా పూజనీయుడైనాడు. గాంధిమహాత్ములే అంజలించారు. ఆయన రూపుదాల్చిన ఆధ్యాత్మికత్వమని.

ఆంగ్లంలో 'బాస్వెల్' అనే వ్యక్తి 'జాన్సన్' అనే పండితకవిని ఛాయగా అనుసరించి ఆయన దినచర్యల్ని, ప్రపంగాల్ని సంభాషణల్ని వ్రాసుకొని 'బాస్వెల్స్ లైఫ్ఆఫ్ జాన్సన్' అనే అపూర్వ జీవితచరిత్ర రచించి జీవిత చరిత్ర రచనా ప్రక్రియకే వినూతనత్వాన్ని కల్పించాడు.

ఈ రీతిగానే మహేంద్రనాథగుప్త (మ) అనే వ్యక్తి శ్రీరామకృష్ణ పరమహంస చరమదశలో వారి అనుగ్రహానికి పాత్రుడై వారితోనే ఉండిపోయినాడు. అయితే ఊరికే కాలక్షేపం చేయకుండా పరమహంస తన్ను సందర్శించటానికి వచ్చే విభిన్న ప్రజానీకంతో ఏ ఏ రీతుల్లో సంభాషించారో ఆ విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లు వ్రాసి ఐదు సంపుటాలుగా ప్రచురించి ఆధ్యాత్మిక సాధక జగత్తుకు మహోపకారం కావించారు.

## గ్రంథసమీక్ష

వీటి ఆంగ్లీకరణం The Gospel of Sri Rama Krishna ప్రపంచ ప్రఖ్యాతి గాంచింది — వినూత్న జీవిత చరిత్రగా. అంతేకాదు. దీన్ని ఆధునిక భాగవతం అనవచ్చు.

ఆంగ్లంరాని తెనుగు సాధకలోకాని కుపకరించాలనే ఆరాటంతో దాన్ని ఇప్పటికైనా తెలుగుచేసి ప్రచురిస్తున్నందుకు శ్రీరామకృష్ణమఠం వారిని అభినందించి తీరాలి. ఈ గ్రంథ ప్రాముఖ్యం ఇంతా అంతా అని నిర్ణయించలేం! మానవుడుగా పుట్టి మనుతున్న ప్రతివ్యక్తీ తన మానవజన్మాన్ని చరితార్థం చేసుకొని మాధవుడు కావాలంటే ఇంతకన్న మార్గదర్శకమైన పుస్తకమింకోటి లేదంటే అది అతిశయోక్తి కాదు. సద్గురువు లభించలేదని బాధపడేవారికి, ఈగ్రంథాన్ని మించిన సద్గురువు ఉండడు. ఎందుకంటే శ్రీరామకృష్ణ పరమహంస మనతోనే మాట్లాడుతున్నట్లు ఉంటుంది. మనకే బోధిస్తున్నట్లు అనుభూతి నందుకొంటాం.

భక్తిజ్ఞానవైరాగ్యాదులలో పరమహంస భక్తికే అధికప్రాముఖ్యం ఇచ్చారు. భక్తి ఉంటే జ్ఞానం, వైరాగ్యం సమస్తం చేకూరుతాయంటారు. భక్తులలో చైతన్య మహాప్రభువు నెప్పుడు ఆయన స్మరిస్తారు. ఆయన్ను ఆదర్శంగా వుంచుకోమని ప్రబోధిస్తారు. జటిల ఆధ్యాత్మికతను వెన్నముద్దలు, గోరుముద్దలు కావించి చిన్నచిన్న కథలుగా అందించారు. అవన్నీ ప్రత్యేకంగా ముద్రిస్తే మంచి బాలసాహిత్యమే కాక బ్రహ్మ సాహిత్యమూ అవుతుంది.

చివరిమాట. రామకృష్ణ కథామృత రచయిత మహేంద్రనాథగుప్త ఒకసారి శ్రీగురుదేవుల్ని ఇలా ప్రశ్నించారు.

**మ:** "భగవంతుని దర్శించటం సాధ్యమేనా? ఏ పరిస్థితులలో భగవంతుని దర్శించగలం!

**గురు:** తీవ్రమైన హృదయ వేదనతో నీవు భగవంతుని కోసం విలపిస్తే ఆయన్ను నీవు సందర్శించి తీరుతావు. భార్యకోసం, బిడ్డలకోసం, ప్రజలు కడవల కొద్దీ కన్నీరు కారుస్తారు. సంపదలకై ఎంతోవిలపిస్తారు. కాని దేవునికై ఎవ్వరు విలపించరు. నిజమైన ఆర్తితో ఆయన కోసం ఆరాటపడే వాళ్ళకు ఆయన దర్శనభాగ్యంతప్పక లభిస్తుంది.

ఇలా అంటూ అమ్మా! శ్యామా!! అని నీ వార్తితో ఆక్రోశించిన ఓ మనసా!! ఆవేదన గని ఆగగల్గునా? అమ్మా! నీ కగపడకుండగ అని బిగ్గరగా పాడుతు కన్నీరు కార్చారట. ఇదీ ఆర్తి అంటే —

ఈ గ్రంథంలో బెంగాలీ గీతాలెన్నో ఉన్నాయి. అనువాదకులు వాటినిగూడ తెనుగు గేయాలుగా వ్రాసి ఉంటే ఎంత బాగుండేదో? అనిపించింది.

— బొడ్డుపల్లి పురుషోత్తం

## కుండలినీ యోగరహస్యము

(వ్యాఖ్యాత: 'భాస్కరానందనాథ:' ప్రతులకు: శ్రీ కలవటపుభాస్కరరావు, కామేశ్వరీ నిలయం, కొర్లగుంటరోడ్, తిరుపతి. వెల: రు.4-00)

అన్నివిధాలా ఆధునిక విజ్ఞానం అభివృద్ధి పొందుతూ, హేతువాదాన్ని యినుమడింప జేస్తున్నా, మన ప్రాచీన విజ్ఞానానికి గాని, దాని వ్యాప్తికిగాని అవరోధాలేవీ లేకపోవడం చాలా ముదావహమైన విషయం. "మారుతూన్న మన భారతదేశ నాగరికతతోపాటు మనలో నిద్రాణమైన ఆధ్యాత్మిక చైతన్యం కొంత కొంత మేలుకొంటున్నది." అలాంటి ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు యోగాభ్యాస కుతూహలులకు చాలా ఉపయోగకరమైన రచన యీ కుండలినీ యోగరహస్యము.

యోగాభ్యాసం చేసి అనేక విధాలైన అలౌకిక శక్తులు సంపాదించి, లోకోపకారం చేసి తరించిన మహనీయుల చరిత్ర లెన్నొ వినిపిస్తాయి. ఎన్నెన్నొ భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక వికృతులను విరుగుడుగా యోగాభ్యాసాన్ని పరమౌషధంగా నిరూపిస్తూ, అందుకువలసిన అభ్యాసాదికాన్ని అందజేసే యోగపాఠశాలలు, యోగకేంద్రాలు నేడు చాలా చోట్ల వెలసి కనిపిస్తున్నాయి. ఎందరెందరో యోగపద్ధతు లెరిగి, ఎరిగించే గురువులు గోచరిస్తున్నారు. భక్తి, జ్ఞాన, కర్మయోగాలకు తోడు ప్రాణాయామపురస్సరంగా సాధించే రాజయోగం కూడ 'భగవద్గీత' లో పరామర్శింప బడింది. పాతంజలియోగశాస్త్రంలో సాధనపదంలో యోగాభ్యాసవిధులు, విభూతిపదంలో దానివల్ల లభించే అణిమాది సిద్ధులు, దివ్యశక్తులు వివరింపబడ్డాయి. గోరక్ ప్రభృతులు నిర్వచించి, వ్యాప్తికి తెచ్చిన హఠయోగం నేటికి తాంత్రిక నిష్ఠమై అభ్యాసంచేసి అనుభవం మీదనే కాని గ్రహింపరాని రహస్యసిద్ధిగానే ఉన్నది. అది తెలుసు కొందామనుకునే వారికి "కుండలినీయోగసిద్ధి మీద ప్రామాణికంగా తంత్రశాస్త్రసమ్మతమైన పద్ధతిలో ఒక చిన్న పుస్తకాన్ని తేలిక తెలుగు భాషలో వ్రాయాలని" సంకల్పించి యీ రచయిత, కుండలినీయోగ రహస్యము అనే యీ చిన్న పుస్తకాన్ని, పాకెట్ సైజులో 56 పేజీలలో ఒక చిన్న వ్యాసరూపంలో రచించారు.

ప్రాణాయామం, గురువు, మంత్రయోగం, దానిస్వరూపం. మనశరీరం, వివిధ చక్రాలు, కుండలినీశక్తి, దాని స్వరూప స్వభావాలు, సాధన, యోగ్యత, సిద్ధివగైరా విషయాలన్నీ వివరించి, చివర కుండలినీ స్తోత్రం మూలపాఠం కూడ జోడించి, పారాయణ చేసే వారికికూడ అనుకూలంగా ఉండేలాగున యీపుస్తకం సంతరించ బడింది.

అచ్చు, కూర్పు వగైరాలు చక్కగా ఉన్నాయి. రచయిత యింకా యీవిధమైన రచనలు వెలయించి మన ప్రాచీన విజ్ఞానాన్ని వీలైనంత ఎక్కువగా తెలుగులోకి తేగలరని ఆశిస్తున్నాను.

—ముట్నూరి సంగమేశం

## భావాతీతం

నేను ఒకప్పటి కానివాణ్ణి యీనాటి నేను
నేను ఒకప్పటి వాణ్ణి యీనాడు కాను
నేను భవిష్యత్తులో కానివాణ్ణి యీనాటి నేను
నేను భవిష్యత్తులోవాణ్ణి యీనాడు కాను
నేనున్నాను.
నేనేదో కాబోతున్నాను.
కాబోవటం అంటే ఉండకపోవటం కాదు
ఉండటంలో నేనున్నాను
కాబోవటంలో యిప్పటి నేను లేను
నేను కానిదే నేను కాబోతున్నాను
ప్రాణంగల ప్రాణిగా పుట్టాను
మానవునిగా పెరిగాను
అతీత మానవునిలో కలుస్తున్నాను
మానవునిలో అతీత మానవుడు లేడు
కాని అతీత మానవునిలో మానవుడున్నాడు
మానవుడు అతీత మానవుడు కాడు
కాని అతీత మానవుడు మానవుడే
అతీత మానవుడు చేసింది మానవుడు చేయలేడు
మానవుడు చేసింది అతీత మానవుడు చేస్తాడు
నేను అతీత మానవుణ్ణి కాబోతున్నాను
నేను కాని కాబోయేవాణ్ణి కావాలనుకొంటున్నాను
ఇప్పటి నేనుగానేను కాబోవాలనుకోవటం లేదు.

ఆంగ్లమూలము: డా॥ సంజీవదేవ్.

తెలుగుసేత; పి. మోహన్.

# వేంకటేశ్వర లీలలు

"కలౌ వేంకటనాయకః"

"ధర్మదేవత ఒంటిపాదంతో సంచరించు చున్న ఈ కలియుగములో తనను నమ్మిన వారికి నేనున్నానంటూ అభయమిస్తూ, తన భక్తులను ఆపత్సమయములలో కాపాడు ప్రియతమ దేవుడు శ్రీ వేంకటరమణుడు."

"శ్రీ వేంకటేశుని నమ్మిన వారికి ఆపదలు సంభవించవు. సంభవించినను అగ్నిని తగిలి ప్రత్తి మాడినటుల మాడి ఆపదలు నిర్మూల మగును.

"శ్రీనివాసుని మహిమనుగురించి ఎంత చెప్పినను తక్కువగానే చెప్పినట్లని పించును!"

ఆకళ్యాణ చక్రవర్తి మహిమలను గురించి ఎంతోరాయా లనిపిస్తూన్నా ప్రధానముగా నామనస్సును కదిలించిన- ఆనందపరచిన- పులకరింపచేసిన ఈ రెండు సంఘటనలను ఇక్కడరాస్తున్నాను.

మా పెద్దమ్మాయి బి. ఏ., ప్యాసైన తరువాత వైశ్యా బ్యాంకు పరీక్షలు రాసింది. బాగానే రాసానన్నది. ఆ రెండు నెలలు గడిచాయి! ఎటువంటి సమాచారము అందలేదు. అందుచేత తను పరీక్షలో పాస్ కాలేదేమో! రాలేదు అనుకున్నాము! తర్వాత తను ఎమ్. ఏ., లో చేరింది.

మాపెద్దమ్మాయి నాస్తికవాది. నాకేమో చాలాభక్తి. శ్రీవేంకటరమణస్వామి నాయిష్ట దైవము. నన్నాయన ఎన్నోసార్లు ఆదుకున్నాడు! నేను తప్పనిసరిగా సంవత్సరాని కొక్కసారైనా (వీలైతే 3, 4 సార్లు కూడా) తిరుపతికి వచ్చి అచ్చట దేవుడికి తలనీలా లర్పించుకుంటాను. నిత్యం ఆయనపూజ మాత్రము మరచిపోకుండా చేస్తూంటాను. నాపూజలు, అభిప్రాయాలు అన్నింటినీ అదోపిచ్చి! అంటు కొట్టిపారేస్తూ నాతో వాదనకు దిగేది మాపెద్దమ్మాయి.

అలావాదిస్తూ ఒకసారిలా అంది. నేను బ్యాంకు పరీక్ష రాసాను. ఇంతవరకు ఏవిషయము తెలియలేదు కాబట్టి ఇకనాకు దాదాపు ఉద్యోగం రానట్లే. ఏదో అద్భుతం జరిగితే కాని రాదు. మరి మీ దేవుడు మహిమగలవాడంటావుకదా! నాకిప్పుడుద్యోగము వస్తే నిజంగా మీ దేవుడు గొప్పవాడేనని నమ్ముతాను!

నేను దేవుడిపైన భారంవేశాను. "కాని అలాజరిగితే ఎంతబావుండు!" అని మనసులో అనుకున్నాను.

పదిరోజులుగడిచాయి! ఆ రోజు మా పెద్దమ్మాయి పేరిట కవరు వచ్చింది! "తను బ్యాంకు టెస్టు పాసయిందట! ఇంటర్వ్యూకి ఫలానా రోజున హాజరు కావలసింది!" ఇదీ ఆ ఉత్తరం సారాంశము.

మేమింటిల్లి పాదీ ఎంతో ఆశ్చర్య పోయాము! మా పెద్దమ్మాయి ఇంటర్వ్యూలో సెలక్టయి ప్రస్తుతము వైశ్యా బ్యాంకులో ఉద్యోగము చేస్తున్నది.

# పిలిచిన పలికేవుస్వామి

— బి. సూర్యనారాయణరావు

అన్నట్టు ఇప్పుడు "తను అపరదైవభక్తురాలు సుమండీ!"

మా స్నేహితుడి కొడుకు దాదాపు 8 ఏండ్ల వయస్సు కలవాడికి తిరుపతి చూడాలని కోర్కెకలిగింది. రైలెక్కేశాడు.

మా మిత్రుడు ఆఫీస్ నుండి వచ్చేసరికి యింట్లోలేడు! ఆడుకోవడానికి వెళ్ళాడేమో అనుకున్నాడు. సమయంగడచిరాత్రయింది ఆఅబ్బాయిరాలేదు. వాళ్లఇంట్లో వాళ్లకు భయంవేసింది ఊరంతా వెదికారు కాని ఆ అబ్బాయి ఆచూకి తేలలేదు. కాని అబ్బాయిలిద్దరు తిరుపతి వెళ్ళాలని మాట్లాడుకొంటుండంగా విన్నామని తెలిసినవాళ్ళెవరో చెప్పారు. మా మిత్రుడు ఉన్నపళాన బస్‌లో తిరుపతికి బయలుదేరాడు;

ఎగువ తిరుపతికి చేరిన వెంటనే ఎన్నో చోట్లవెదికాడు. నిరాశే మిగిలింది. కొండపైన కూడా వెతికాడు! కొడుకు కన్పించలేదు.

చివరికి మాస్నేహితుడు దేవుడినే శరణు వేడినారు. "నేను వెళ్ళేసరికి మా కుమారుడు క్షేమముగా ఇంటివద్ద ఉండునట్లు చేయి తండ్రి! అలా జరిగిన యెడల ఇరువురము మరలకొండకు వచ్చి నీదర్శనం చేసుకుంటాము"

అతని ప్రార్థన విన్నాడు ఆపదమొక్కులవాడు! అతడుఇంటికి చేరుకొనేసరికి క్షేమముగా ఇంట్లో కన్పించాడు కొడుకు! అతనికెంతో ఆనందము కల్గింది! జరిగినవిషయమడిగి తెలుసుకున్నాడు.

"రైలులో ఆ అబ్బాయిలు మాట్లాడుకుంటుండగా ఓ డాక్టరుగారు (మంగళంపల్లె) వీరింట్లో చెప్పకుండా వచ్చారన్న విషయాన్ని గ్రహించాడు. వారిని తనతో పాటు తమ ఊళ్ళోనే దింపుకున్నాడు. ఆ రాత్రి వారికి తనఇంటనే భోజనంపెట్టి పడుకోబెట్టాడు? మరురోజు రైల్వే అధికారులకా పిల్లలవిషయంచెప్పి భద్రముగా వారిని అనంతపురములో దింపవలసినదిగా కోరాడు. అలా ఆపిల్లలుక్షేమముగా ఇంటికిచేరుకున్నారు.

"నేనుసరిగా 11 గంటల సమయములో దేవుడిని ప్రార్థించాను. అదే సమయములో ఆ డాక్టరుగారు మా పిల్లవాడిని (11 గం॥ల ప్రాంతంలోనే) రైలెక్కించాడట." మా మిత్రుడు చెబుతుంటే "నిజంగా ఆపద్బాంధవుడు, భక్తజనవత్సలుడు శ్రీ వేంకటరమణస్వామి" అనిపించినది. పదిపదిహేనురోజుల క్రితము జరిగిన ఈ సంఘటన శ్రీనివాసుడు ఆపద మొక్కులవాడు అనుటకు ప్రబల నిదర్శనముగా నున్నది.

మరీ మరీ చూడాలనిపించే ఇలవైకుంఠమైన తిరుపతి ఇంకా ఇంకా మొక్కాలనిపించే ఆ దేవుడు-ఆయనవైభవము, మహిమలను తనివితీర వర్ణించడానికి నిజముగా భాష చాలదేమో!!"









## గీతాసందేశం

హైదరాబాదు శ్రీ రామకృష్ణమఠం అధ్యక్షులు శ్రీరంగనాథానందస్వామి గత డిశంబరు 5 వ తేదీన తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో ఆంగ్లంలో గీతోపన్యాసం చేశారు. "సామాజిక శ్రేయస్సుకై అవిశ్రామంగా ప్రతివ్యక్తి కృషిచేయాలని" సందేశమిచ్చారు.

తదుపరి తి. తి. దేవస్థానం నిర్వహిస్తున్న వికలాంగుల శిక్షణాలయం, మూగబధిరాంధుల పాఠశాల, బాలమందిరం, కృత్రిమావయవ ఉత్పత్తి కేంద్రాలను సందర్శించిన శ్రీ స్వామీజీకి కార్యనిర్వాహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఆయా సంస్థలను గూర్చి వివరించారు. తి. తి. దేవస్థానం బహువిధములుగా చేయుచున్న .మానవసేవను. గూర్చి శ్రీ స్వామీజీ ప్రశంసించారు.

1. గీతోపన్యాసం చేస్తున్న శ్రీ రంగనాథానందస్వామి.
2, 3, 4, 5, 6 వికలాంగుల శిక్షణాలయం, మూగబధిరాంధ పాఠశాలలను సందర్శించిపరామర్శిస్తున్న స్వామీజీ.







# భగవంతుని చిత్రాలు

ఈ భూమిమీద మానవుల మనుగడ రోజు రోజుకూ విస్తృతం అవుతోంది. పల్లెలు గ్రామాలుగా, గ్రామాలు పట్టణాలుగా, పట్టణాలు నగరాలుగా మార్పుచెందుతున్నాయి. త్వరితగతిన అభివృద్ధి నొందుతున్న ప్రాంతాలలో మానవసంచారం కూడా అధికం అవడంలో పెద్దవిశేషం ఏమీలేదు. కానీ పాదచారుల పాదాల క్రిందపడి నలిగిపోతున్న చిత్తుకాగితాలలో చాలవిశేషం వుంది.

కార్పొరేషన్లవాళ్ళూ, మునిసిపాలిటీల వాళ్ళూ, పంచాయితీలవాళ్ళూ ఎన్ని జాగ్రత్తలు తీసుకొని ఎంతప్రయత్నం చేసినా రోడ్ల మీది చెత్తనూ, చిత్తుకాగితాలనూ సమూలంగా నిర్మూలించలేక పోతున్నారు. అలా రోడ్లమీద నిలిచిపోయే చెత్తలో, చిత్తు కాగితాలలో రకరకాలు కన్పిస్తాయి పరీక్షగా చూస్తే.

శుభకార్యాల ఆహ్వానపత్రికలు, కరపత్రాలు, అగ్గిపెట్టెలు, అగరువత్తులకు చుట్టబడే కాగితాలు, బీడీకట్టలను చుట్టివుండే కాగితాలు పాతక్యాలండర్ల తాలూకు కాగితాలు........ ఇలా ఎన్నోరకాల కాగితాలు మనకు రోడ్ల మీదా, మురుగు కాలవలలోనూ, పెంటకుప్పలమధ్యా మనకు దర్శనం ఇస్తాయి మామూలుగా. ఇందులో మరి బాధ కలిగించే విషయం ఏమిటంటే .. ....ఈ రకపు కాగితాలలో చాలావాటిమీద మనం భక్తితో నిత్యం కొలిచే, ఎంతో ప్రేమతో పూజించే భగవంతుని రూపాలు ముద్రింపబడి వుండడం. అవి పాదాల క్రిందపడి నలిగిపోవడం, అసహ్యకరమైన మురికి ప్రదేశాలలో పడి పాడవడం.

అగ్గిపెట్టెల కంపెనీలు మొదలుకొని ఆటంబాంబుల కంపెనీల వరకూ తొంభయి శాతం కంపెనీల వాళ్ళు తమ కంపెనీలు ఉత్పత్తిచేసే వస్తువుల తొడుగులమీద మహాగణపతి చిత్రం మొదలుకొని వెంకటాచలపతినామాల చిత్రం వరకూ రకరకాల చిత్తరువులను ముద్రించడం పరిపాటి చేసుకునేశారు. (శ్రీవారికృపతో) తమ వ్యాపారాభివృద్ధిని కాంక్షిస్తున్న ఆ ఉత్పత్తిదారులలో ఒక్కరైనా పాదచారుల పాదాల క్రిందా పెంటకుప్పల మధ్యా పడి దొర్లవలసి వచ్చే పరమాత్ముడి చిత్రాలను గూర్చి ఆలోచించినట్లు కనపడదు.

వినియోగదార్లు సైతం తాము వినియోగించి విసిరి వేస్తున్న వస్తువులతాలూకు పెట్టెలమీద, కాగితాలమీదవున్న భగవత్ రూపాలనుగూర్చి అట్టే ఆలోచిస్తున్నట్లు కన్పడదు.

---

**టి. యస్. ఏ. క్రిష్ణమూర్తి**

---

ఎవరైనా సనాతనులు రోడ్డుమీద కన్పించే భగవంతుని చిత్రాలున్న కాగితాలను భక్తితో తీసివేస్తున్నా వారినిచూసి పరిహసించే వాళ్ళే అధికంగా కన్పిస్తున్నారు తప్ప అనుసరించగలిగిన వారు అరుదు.

యుగయుగాల సంస్కృతికి ఆధార భూతం అయిన హిందూజాతీయత ఇలాంటి చిన్నచిన్న లోపాలవల్ల తనపై భవానికి కళంకం ఆపాదించుకుంటోంది. ఆలోచించి చూస్తే ఇది సామాన్యమైన విషయం కానేకాదు.

దీనిని నివారించడానికి కొన్ని మార్గాలు వున్నాయి.

(1) ఉత్పత్తిదారులు తమ ఉత్పాదక వస్తువులమీద ఉపయోగించబడే కవర్లు మొదలైన వాటిమీద భగవంతుని చిత్రాలు ముద్రించకుండా మరేదయినా చిత్రాలను ముద్రించడం.

(2) వినియోగదారులు తాము ఉపయోగించిన వస్తువుల తాలూకు తొడుగుల మీద భగవంతుడి ప్రతిరూపాలు చిత్రింపబడి ఉన్నట్లయితే వాటిని పారవేయడంలో కూడా తగు శ్రద్ధలు గైకొనడం.

(3) ధార్మిక సంస్థలు పాదచారుల పాదాలక్రిందపడి నలిగిపోయే భగవంతుని చిత్రాలనుగూర్చి, దానికి తగిన నివారణోపాయాలను గూర్చి అటుఉత్పత్తిదారులకూ ఇటు ప్రజలకూ కూడా బాగా అర్థం అయేలా ప్రచారాలు చెయ్యడం.

(4) మన ఆచారాల పవిత్రతనుగూర్చి, విలువలను గూర్చి ప్రచారాలు ఉధృతంగా చెయ్యడం.

జైనమతస్తులు తమపాదాలక్రింద అల్ప ప్రాణులుపడి నలిగిపోకుండా తమదారిని శుభ్రపరచుకుంటూ నడవడాన్ని గూర్చి మనకు తెలుసు.

ఎప్పుడో ఒకసారి చదివాను.... జపాన్ లోనో మరేదో దేశంలోనో ఒక పట్టణంలోని ప్రజలు కన్పించిన ప్రతి చిత్తుకాగితాన్ని తీసి ప్రక్కనవుంచి జాగ్రత్త చేసేవారట.... తమదేవుడి నామధేయం ఆ కాగితాలమీద ఉండవచ్చుననే భయంతో.

ప్రయత్నిస్తే పైరెండు పనులకన్నా తేలికే మనం మన పాదాలక్రింద, మురికి ప్రదేశాలలో నలిగి నశించే మనదేవుడి చిత్రాలను అలాకాకుండా కాపాడు కోవడం.

దేనికైనా పట్టుదల కావాలి....అంతే!

ఈ వ్యాసం చదివిన ప్రతి ఒక్కరూ కూడా పాదచారుల పాదాలక్రింద పడి నలిగిపోయే భగవంతుడి చిత్రాలకు చేతనైనంత వరకూ విముక్తిని కలిగిస్తారని ఆశిస్తాను.

ధర్మో రక్షతి రక్షితః



# కళావని

శ్రీకృష్ణ కథ జగద్విదితం. శ్రీకృష్ణుని లీలలు శ్రీమద్భాగవతం మొదలగు ఇతి హాసాలకు కథా వస్తువు. భారతీయ శిల్పం లోను, కుడ్య చిత్రాల పెయింటింగ్ లోను శ్రీకృష్ణుని జీవితంలోని వివిధ ఘట్టాలు మనోహరంగా పొందుపరప బడినాయి. యమునా తీరమందలి మధురలో జననం. గోకులంలోను, బృందావనంలోను బాల్య క్రీడలు, ద్వారక, హస్తినాపురాలలో ఆయన కార్య కలాపాలు, అవతార పరిసమాప్తి వరకు గల ముఖ్య ఘట్టాలు భారతీయ కళలో మనం చూడవచ్చు. శ్రీకృష్ణుని కొరకు నిర్మించబడ్డ ఆలయాలు భారత దేశంలో అసంఖ్యాకంగా ఉన్నాయి. మన్నార్ గుడిలోని రాజగోపాలస్వామి ఆలయం. తిరువళ్ళిక్కేణిలోని పార్థసారథి ఆలయం, కాంచీపురంలోని పాండవ దూత ఆలయం, ఉడిపిలోని శ్రీకృష్ణాలయం. గురువాయూర్‌లోని కృష్ణాలయం, ద్వారక యందలి ద్వారకనాథాలయం, పూరి జగన్నాథాలయం, కృష్ణాజిల్లా మొవ్వ గ్రామంలో వేణుగోపాలస్వామి ఆలయం, హంపీ విజయనగరంలో శిథిలావస్థలో ఉన్న కృష్ణాలయం మొదలగునవి ఉదాహర ణలుగా చెప్పవచ్చు.

క్రీస్తు పూర్వం పెక్కు శతాబ్దాల క్రితమే మధుర భక్తి ఉద్యమానికి కేంద్రంగా పరిఢవిల్లినది. వాసుదేవకృష్ణుడు మానవ జన్మ ఎత్తిన భగవంతునిగా గుర్తించి ఆయనను ఆరాధించుటే ఈ భక్తి ఉద్యమ కారుల ధ్యేయం. అప్పటికే కృష్ణుడు విష్ణువు యొక్క అవతారంగా గుర్తించబడి నాడు. ఋగ్వేదంలో విష్ణు ఆరాధనను గురించి ప్రస్తావించబడింది. వాసుదేవుని భక్తులను వాసుదేవకులని, అర్జునుని భక్తు లను అర్జునుకులని అందులో చెప్పబడింది. ఈ విధంగా శ్రీ కృష్ణారాధన అతి ప్రాచీన మైనదని చెప్పుటకు మన కాధారాలు కలవు.

శ్రీ కృష్ణుని వివిధ రూపాలలో సంతాన గోపాలమూర్తి ఒకటి. ఈ రూపంలో శ్రీ కృష్ణుడు పరుండి ఉన్న పసిపాపడుగా కుడికాలి బొటన వ్రేలిని నోటి వద్ద ఉంచు కొన్నట్లు కనిపిస్తాడు. ఈ రూపాన్నే వట పత్రశాయి అని కూడా అంటారు. తంజా వూరు జిల్లాలోని పలు ఆలయాల్లో ఇటువంటి విగ్రహాలు ఉన్నాయి. విజయనగర కాలా నికి చెందిన లేపాక్షి దేవాలయంలో వట పత్రశాయి కుడ్యచిత్రం ఒకటి ఉన్నది. ఈ చిత్తరువులో వటపత్రం మీద పరుండిన చిన్ని కృష్ణుడు నీలమేఘ వర్ణపు మేని రంగుతో, ఒంటినిండా ముత్యాల సరాలతో

## భారతీయ కళలో శ్రీకృష్ణుడు

డా॥ వేమూరు కామేశ్వరరావు





విరాజిల్లుతున్నాడు. కుడిచేతితో ఎడమకాలి బొటనవ్రేలిని లాగి నోటిలో పెట్టుకొనబోవు చిన్ని కృష్ణుని మోహన రూపం వీక్షించు వారిని పరవశింపచేస్తుంది.

చేతిలో వెన్నముద్దతో దోగాడుతున్న కేశవకృష్ణుని బాల కృష్ణుడంటారు. నవనీత నృత్య కృష్ణ రూపంలో కృష్ణుడు మూడు సంవత్సరాల వయసులో ఉన్న బాలునిగా కుడిచేతిలో వెన్నముద్దతో పద్మంపై నాట్య భంగిమలో సాక్షాత్కరిస్తాడు. కాళీయ మర్దన రూపంలో పద్మంపైగాక కాళీయుని పడగపై నటనమాడుతున్నట్లుగా కృష్ణుని చూస్తాం. ఈ రూపం తిరుపతి గోవిందరాజు ఆలయంలోను, పుష్పగిరి చెన్నకేశవాల యంలోను, ఇంకా పలుచోట్ల కానవస్తుంది అస్సాముకు చెందిన శంకరదేవుడు 15 వ

శతాబ్దం బృందావనంలో శ్రీకృష్ణుని లీలలను 180 అడుగుల పొడవుగల వస్త్రంపై చిత్రించాడు. దానిపై కృష్ణ కాళీయ మర్దన కూడా ఉంది. గోవర్ధన గిరిధారి రూపం విష్ణుకుండినుల కాలానికి చెందిన ఉండవల్లి అనంత శాయి గుహల్లోను, పల్లవుల కాలానికి చెందిన మహాబలిపురంలోని కృష్ణ మండపం అనే గుహలోను అద్భుతంగా చెక్కబడింది.

వేణుగానలీల త్రిలోకసమ్మోహనమయినది. అందుకే లీలాశుకులు "మురళీ నాదము లంతరంగమునకు ఏదో అనిర్వాచ్యమగు సంతుష్టి నిచ్చుచున్నవి" అన్నారు. ఈ వేణుగోపాల రూపమున కొన్ని చోట్ల శ్రీకృష్ణుడు రెండు చేతులుండును. కొన్ని విగ్రహాలలో నాలుగు చేతులుండి వాటిలో రెండు శంఖచక్రములతో అలరారును. మదనగోపాలునకు ఎనిమిది చేతులుండును.



వాటిలో శంఖం, చక్రం, పద్మం, చెరకు గడ, పుష్పబాణము లుండును. వేణుగోపాలునే గాన గోపాలుడంటారు. రాజగోపాల మూర్తి రూపంలో శ్రీకృష్ణుడు గోవులకు పాలకుడుగా ఒక చేతిలో చెలకోల, మరొక దానిలో దండముతో కనిపిస్తాడు. ఇటువంటి కొన్ని శిల్పాలలో ఒక వైపు రుక్మిణి, రెండో వైపు సత్యభామ ఉంటారు.

ఆంధ్రదేశాన్ని క్రీ. పూ. 220 నుండి క్రీ. శ. 220 వరకు పరిపాలించిన ఆంధ్ర శాతవాహనుల కాలంలో కృష్ణుని గూర్చి అనేక గాథలు ప్రచారంలో ఉన్నాయి. రాధాకృష్ణుల ప్రణయగాథలు నాటి జనులను విశేషంగా ఆకర్షించేవని హాలుని గాథాసప్తశతి, నుంచి తెలియవస్తుంది. రాధా కృష్ణుల శిల్పాలు అరుదుగా కనిపించినప్పటికి, వర్ణచిత్రాలు చాలా ఉన్నాయి. రాజపుత్రశైలి వర్ణ చిత్రాలలో రాధాకృష్ణులను సర్వాంగ సుందరంగా చిత్రించారు. పదినేడవ శతాబ్దంలో రస్‌ఖాన్ అనే మహమ్మదీయ కవి శ్రీకృష్ణ గాథను, ప్రేమ్‌వాటిక, అనే గ్రంథంలో చక్కగా వివరించాడు. సూర్‌దాస్ తన "సూర్‌సాగర్" లో రాధాకృష్ణుల ప్రణయాన్ని వర్ణించాడు.

గోపికా వస్త్రాపహరణం దేవాలయ శిల్పాలలో పదేపదే కానవస్తుంది. నెల్లూరు సమీపంలోని కృష్ణాపట్నం శిథిలాలలో కనిపించే గోపికా వస్త్రాపహరణ శిల్పం కడు రమ్యమైంది. శ్రీకృష్ణుని విఠోబా లేక పాండురంగనిగా పండర్‌పూర్‌లో చూస్తాం. ఈ రూపానికే రుక్మిణీ నాథుడని నామాంతరం ఉంది. ఈ రూపంలో కృష్ణునికి రుక్మిణికి రెండు చేతులే ఉంటాయి. విఠలుడు విజయనగర ప్రభువుల ఆరాధ్యదైవమనే విషయం హంపీ విఠలాలయ నిర్మాణంలో వారు చూపిన శ్రద్ధనుబట్టి తెలియనగును.



ఈ ఆలయాన్ని "క్వీన్ ఆఫ్ ది రూయిన్స్" అని పాశ్చాత్య కోవిదులు వర్ణించారు.

పార్థసారథి అనేది శ్రీకృష్ణుని మరొక రూపం. ఇలాంటి విగ్రహాలు తిరుపతి గోవిందరాజాలయంలోను. తిరువళ్ళిక్కేణి పార్థసారథి, కాంచీపురం పాండవదూత ఆలయాల్లోను ఉన్నాయి. పుష్పగిరి చెన్నకేశవాలయ కుడ్యములమీద శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేయుట చెక్కబడింది.

పూరిలో శ్రీకృష్ణుడు జగన్నాథుడుగా వెలసి ఉన్నాడు. ఇవిగాక పూతన సంహారం శకటాసుర సంహారం, బకాసురవధ, కువలయాపీడ "ఏనుగు రూపంలో అసురుడు" వధ, కేశి వధ, ధేనుకాసుర వధ మొదలగు శిల్పాలు చాలా చోట్ల కనిపిస్తాయి. హళేబీడు హొయసలేశ్వరాలయంలో బాదామి గుహలలో పారిజాతమునకై కృష్ణునికి, ఇంద్రునికి జరిగిన సంఘర్షణ మలచబడింది.



# వేంకటేశ్వరా!



శ్రీపతి వంచు నిన్ను దరి
జేఱగవత్తురు భక్తకోటి, నీ
వాపద బోనడంచెడి ద
యా మతి వంచు దలంచి వత్తురే
ఏ పనియైన గాని యస
దే యొనగూడగ నిన్ను గొల్వ, నీ
ప్రాపు లభింప సర్వమును
ప్రాప్తము నౌగద! వేంకటేశ్వరా!

కొందఱు రంగడంచు. మఱి
కొందఱు లింగడటంచు, నింకనుం
గొందఱు కార్తికేయుడని
కోరి భజింపగ నిన్ను వార లం
దండఱునుం గృతార్థులుగ
నాశయ తృప్తులుగా ఘటించుచున్
పొందెద వెన్నియేన్ నుతులు
బొల్పు వహింతువు, వేంకటేశ్వరా!

చిన్నగ నిన్ను నేను నుతి
జేయ దలంచియు గావ్యమందునన్
వెన్నునిగా దలంచెదను,
వేధకు తండ్రినిగా దలంతు, నా
పన్నుల నీవు గాచు నెడ
బాహ్యపు చిహ్నము లేవియైన, సం
పన్నము నై వెలుంగుటను
భావము నందున, వేంకటేశ్వరా!

మా కులదైవమంచు నిను
మన్నన జేసెద, నెట్టివేళలన్
వ్యాకులమే మనస్సునకు
భావమునందున గోచరించి, చీ
కాకు దొలంగ జేసెదవు
కావున నిన్నెద నాశ్రయించెదన్
నీకిదె కావ్యమిచ్చెదను
నింపుము ప్రేముడి, వేంకటేశ్వరా!

ఏడనొ యున్న శేషగిరి
నెక్కుట కష్టమటంచు నీవు, 'మం
టాడ' ను గూడ నీదయిన
రావుగ జేసుక భక్త బృందపుం
బీడల గూలద్రోసి పయి
పెచ్చుగ గూర్చి శుభంబు లెన్నియేన్
బాధము పేరు మోసితివి
వాడలవాడల, వేంకటేశ్వరా!

తిరుమలయందు నీవు వస
తింగని నిల్చితి, కాని, 'ద్వారకా
తిరుమల' యందు నుందువు, ర
తిన్- 'జమలాపుర' మందు, నీవెకా
అరసియు నీదుజాడ జను
'లప్పన పల్లి'కి వత్తు రెందు నెం
దరసిన, నీవెకా, కలిని
నర్చన లందుట, వేంకటేశ్వరా!

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 160 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.

[ 28వ పేజీ తరువాయి ]

మంగాంబా వేంకటేశ్వరుల దర్శనము లభించెనని తలంచవలెను. కానీ అన్నమయ్య పాటల్లో చిన్నతనాననే తనకు దైవ దర్శన మబ్బినట్లే తెలియు చున్నది. యౌవన ప్రారంభములో కాదు.

పై నుదహరించిన అన్నమయ్య బాల్య కథకు 'చిన్న చెంబుతో నీళ్లు'—అను పద్యానికి 'ఊటు కూరున తాత' అను పద్యానికి సమన్వయ మేర్పడు చున్నది. మఱియు నా కథలో చెప్పిన చెన్నకేశవ విగ్రహమును గూర్చి తెలిసినదేమన — పూర్వము అనగా నేటికి ఏబది, అరువదేండ్ల క్రితం వరకు ముందునకు వంగియే స్వామి విగ్రహ ముండినదట. 1928 లో దొంగలు ఆలయమున స్వామి విగ్రహము పెళ్ళగించి పోగా మరలా ఆ గ్రామము వారు దాన్ని చక్కగ నిల్పి ప్రతిష్ఠించారట. అని ఆగ్రామ పెద్దల ఉవాచ. అదియును గాక 1927 లో ఆ ప్రాంతమున వచ్చిన పెను తుపానులో ఆలయ సమీపమున నున్న పెద్ద చింతచెట్టు పడిపోవుట, 1928 లో స్వామిని పెళ్ళగించుట, ఒక విచిత్ర సంఘటనమనీ, నాటి నుండి గ్రామానికి దుర్దశయనీ ఆ గ్రామ వాసు లంటారు. ఏమో దైవ నిర్ణయం!

2. పద్యము—

శ్రీరామ జయరక్ష సీతమ్మ సుభరక్ష
పవమాన సూనుని ప్రాణరక్ష
భరతన్న ప్రభురక్ష వరసుమిత్రజ రక్ష
ధర జటాయుని మహాత్యాగరక్ష
.... .... .... .... .... ....
.... .... .... .... .... ....
బొత్తి బోయెత గాచు బత్తిరక్ష
.... .... .... .... .... ....
సందెరక్ష నీ దివ్వెరక్ష బుమి (చక్ర) రక్ష
అన్ని రక్షలు మాకు బ్రహ్మయు రక్ష
అమ్మ పెట్టెను శ్రీరక్ష లన్ని తలప
కన్నన వరదాళ్ళుండు బుచ్చిన్న కేశాలు

సవరించిన పద్యము—

శ్రీరామ జయరక్ష! సీతమ్మ శుభరక్ష!
పవమానసూనుని ప్రాణరక్ష!
భరతన్న ప్రభురక్ష! వరసుమిత్రజు రక్ష!
ధర జటాయుని మహా త్యాగరక్ష!
.... .... .... .... .... ....
బొత్తిబోయెత గాచు భక్తిరక్ష!
.... .... .... .... .... ....
సంధ్యరక్ష! నీ దీపరక్ష! (భూమి) చక్ర రక్ష!
అన్ని రక్షలు మాకు బ్రహ్మయు రక్ష!
అమ్మ పెట్టెను శ్రీరక్షలన్ని తలప
కన్నన (అన్నన) వరదాళ్ళుండు బుచ్చెన్న కేశ!

ఈ పద్యంలో అమ్మ పెట్టెను శ్రీ రక్షలన్ని తలప అను పాదమున దోషములేకున్నను "అన్ని" అను పదము తొలగించి "అమ్మ" అన్నచోట "తల్లి" అగినచో తాళ్ళపాక 'అన్నన' అని తెలియ వచ్చు - తల్లి పెట్టెను శ్రీ రక్ష తాళ్ళపాక: అన్నన వరదాళ్ళుండు" ఈ మార్పు అవసరము కాకున్నను 'తలపకన్నన' అంటే తాళపాకన్నన అని గ్రహించవచ్చు —

తెలుగునాట సంజవేళ గూటిలో దివ్వె పెట్టినపుడు మన తెలుగు తల్లి తన బిడ్డను ఆ దివ్వెను చూపుచు చేతిలో దీపాన్ని స్పృశించి బిడ్డ కనుదమ్ముల కద్దుట ఒక సంప్రదాయముగ నున్నది. అట్లద్దుచు ఆ తల్లి, సంధ్యరక్ష, దీపరక్ష, బ్రహ్మయురక్ష, శ్రీరామ రక్ష, అని చెప్పుటయు, బిడ్డనికి నీళ్లు పోసినపుడు 'బ్రహ్మయు రక్ష' 'శ్రీ రామ రక్ష' 'సీతమ్మ రక్ష' అని నీళ్లు బిడ్డడికి చుట్టుటయు సదాచారము.

ఆ సదాచారమునే ఈ పద్యంలో అన్నమయ్య సూచించినాడు. తనకు చిన్ననాట చేసిన సదాచారము అతని స్మృతి పథంలో నిల్చి యుండెనేమో!

'దీపంజ్యోతి పరంబ్రహ్మ
దీపస్సర్వ తమోఽపహః।
దీపేన సాధ్యతే సర్వం
సంధ్యా దీప నమోఽస్తుతే॥'

అని అనుదినము సంధ్యావేళ సంధ్యా దీప దర్శనము చేసినపుడు పఠించవలెనని మన పెద్దలన్న మాట.

ఈ మాటలోని పదముల అర్థములు— బొత్తి = బోసినోరు: బొత్తిబోయెత = బోసి నోరుగల స్త్రీ; అనగా ముసలి బోయెత-శబరి. ఈ పద్యంలో "రక్ష" లు రామాయణ కథాంశమును తెల్పుచున్నది. అన్నమయ్య మంచి ప్రాయముననే రామాయణ మెల్ల సంకీర్తనాత్మకముగా వెలయించెను. చూ:—

"ఘనతర సకలభోగంబులు గాగ
మనుచు వాల్మీకి రామాయణ మెల్ల
రాగంబుతో ననురాగంబు తోడ
బాగుగా గంధర్వు బాగుగాఁజదివి
పాటలన్నియుఁదన పాట పెమ్మటను
పాట పాటనె పాట పాడి చూపగను"
(అ. చ. పుట 30)

అన్నమాచార్యుని సంకీర్తనములలో రామాయణ కథా ఘటితములు చాల గలవు. (చూ-అ.చ. పీఠిక వే. ప్ర. శాస్త్రి) కావున నిందులేని పద్యపాదములను రామాయణ కథాంశములనే సూచించునవై యుండునని తలంపవలసి యుండును. చిన్ననాటి నుండి అన్నమయ్యకు రామాయణమన్న నతిశయమైన భక్త్యనురాగము. మానవునికి రామాయణము జీవరక్ష! రామనామము కైవల్య ప్రదము అని యతని భావము! అది నిత్య నూతనము! అందుకే తాను "నవముగా" రామాయణము రచించినాడు ద్విపదలో. ఈ రామాయణమందలి యుద్ధకాండమున్నట్లు 1975 ఏప్రిల్ "సప్తగిరి" సంచికలో 28 పుటలో శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు పేర్కొన్నారు, అని శ్రీ గౌరిపెద్ది రామ సుబ్బశర్మగారు అ. శృ. సం. 12 సంపుటం పీఠికలో 52 పుట యందు సూచించారు.

రాజువారి సీమలో 'బొత్తి' అను పదము వ్యవహారమున నున్న అర్థము పండ్లులేని నోరు. బొత్తిగిత్త = పండ్లులేని ముసలి ఎద్దు. బొత్తిముండ = బోసినోటి ఆడది. బొత్తినోటోడు = బోసినోటివాడు.

(సశేషము)

# దేవాలయాలు దైనందిన యజ్ఞశాలలా?

అగ్నిహోత్రేణ లభేత స్వర్గమిత్యాహుః, స్వర్గకామో యజేత – అని మీమాంసా సూత్రాలు. స్వర్గకామి యజ్ఞం చేయాలి. యజ్ఞము అగ్నిహోత్రము చేతనే, దాని చేతనే స్వర్గము. కనుక ఇది శ్రుతి విహితము. అయితే వేదవేదాంగ తత్త్వజ్ఞులు, తపస్వీలురు మాత్రమే క్రత్వనుష్ఠానుపరులగుచున్నారు. మిగిలిన అస్మదాదుల మాట ఏమిటి? శ్రుత్యనుమతమైన మాట ఒకటి ఉన్నది. గోవుకూడ అగ్నిహోత్రమే. గోసేవనము స్వర్గఫలాన్ని అందిస్తుంది అని. దేవాలయాలుకూడ అంతే. అవి కూడ అగ్నిహోత్ర సమమైనవి. అవి యజ్ఞవాటికలు. కనుక గోసేవచేసినా, దేవాలయాలలో దేవతారాధన చేసినా అగ్నిహోత్రం చేస్తే ఏ ఫలమొస్తుందో అదే ఫలము వస్తుంది. ముందుగా గోవు ఎట్లా అగ్నిహోత్రమైందో తెలిసికొందాము.

'గౌర్వాగ్నిహోత్రమ్' అని శ్రుతి. ప్రజాపతి ముందు అచేతన జగత్తును, అనంతరం చేతన జగత్తును సృజించాడు. అచేతన జగత్తులో గిరినదీసముద్రాలు, చేతన జగత్తులో అగ్నివాయ్వాదిత్యులూ ఉన్నారు. అందుకే మొదటగా సృజింపపడ్డ వీరు మూవురూ మూడువేదాలకూ ప్రతినిధులు. అగ్నే ఋగ్వేదః, వాయోర్యజుర్వేదః అదిత్యాత్సామవేదః అని. అయితే అలా సృజింపబడిన వీరు మూవురూ తాముకూడ ఒక చేతన పదార్థాన్ని వ్యుత్పన్నం చేద్దామని యత్నించి ప్రాణదేవతను అగ్ని, తనూ దేవతను వాయువు, చక్షుర్దేవతను ఆదిత్యుడు ఉపాసించి హోమం చేశారు. వాళ్ల ఉపాసనా ప్రాబల్యంవల్ల, ఆయా దేవతా సామర్థ్యంవల్ల గోవు పుట్టింది. 'తేషాగ్ంహుతాదజాయత గౌరేవ.'అయితే ఇది సమిష్టి వస్తువై ముగ్గురిలో కలతలకు త్రోవతీసింది. ఎవరు ఇందులో పాలు సొంతం చేసుకోవాలన్నదీ వాళ్లకు పరిష్కారం కుదురలా. నామూలానే సృజింపబడింది గనుక ఈ పాలు నాకే దక్కాలి అని ముగ్గురూ తమలోతాము వాదులాడటం ఆరంభించారు. 'తస్యై వయసి

ఇది వింతయైన ప్రశ్న. కాని వివేకవంతమైన ప్రశ్న. దేవాలయాలు దైనందిన యజ్ఞశాలలే అని నిరూపణచేసి చెపితే మరీ ఆశ్చర్యం. భారతంలో విదేశాల్లో నేడు అనేక దేవాలయాలు వెలిశాయి. వెలుస్తున్నాయి. కోటి దేవాలయాల వెలుగు కోనేటిరాయడు. ఆ దేవాలయాలు యజ్ఞవాటికలెట్లా అవుతాయి? ఆ నిరూపణే ఈ వ్యాస పరమార్థం. సం॥

వ్యాయచ్ఛంత మమ హుతాజని మేతి' అయితే తీర్పుకోసం ప్రజాపతిని అడిగారు. ఆయన వీరి ముగ్గురినీ పిల్చి, మీలో ఎవరు ఏ దేవతను గురించి హోమం చేస్తే ఏమేమి ఉత్పన్నం అయ్యాయోచెప్పండి అన్నారు. 'కస్యై కోఽహౌషీదితి ప్రజాపతి రబ్రవీత్.' అప్పుడు అగ్ని మొదట 'ప్రాణానామహ మిత్యగ్నిః' అని చెప్పాడు. వెంటనే వాయువు అందుకొన్నాడు. 'తనువా అహ మితివాయుః' తరువాత ఆదిత్యుడు 'చక్షుషోఽహమిత్యాదిత్యః' అని వారు వారు సృజించిన వాట్లను పేర్కొన్నారు. అప్పుడు ప్రజాపతి ఇలా అంటాడు. శ్రుతిలో 'యయేవ ప్రాణానామహౌషీత్ తస్య హుతా దజనీతి అగ్నిర్హుతా దజనీతి తదగ్నిహోత్ర స్యాగ్నిహోత్రత్వమ్' అని వుంది. ఎవడైతే ప్రాణదేవతను గురించి హోమం చేశాడో, జీవాధారము ప్రాణం కనుక, అగ్ని దానిని చేశాడు కాబట్టి అగ్నికే చెందుతుంది గోవు. అని యిలా తీర్పు యిచ్చాడు. కనుక గోవు అగ్నిహోత్ర సమమే. మిగిలిన యిర్వురకు కూడ పాలవాటా వచ్చిందనుకోండి. అది ఇక్కడ అప్రస్తుతం. గోవు అగ్నిహోత్రమే అని తెలిసికొని ఎవడు అట్లా ఉపాసన చేస్తాడో వాడు వ్యర్థుడుకాడు. వానికి ప్రాణాపాన సమృద్ధికలుగుతుంది అని వేదం చెపుతుంది. 'య ఏవం వేద గౌర్వాగ్నిహోత్రమితి అవ్యర్థుకః ప్రాణాపాన మేవాగ్నిగ్ం సమర్థయతి.'

కనుక శ్రుత్యుక్తమైన అగ్నిహోత్రం చేస్తే స్వర్గము వస్తుంది. లేకపోతే శ్రుత్యను





మతమైన గోవును అగ్నిహోత్రంగా భావించి సేవచేస్తేకూడా స్వర్గం వస్తుంది. అట్లాకూడా కాక దేవాలయాలలో అర్చన చేస్తే, అంటే దేవాలయాలు కూడ అగ్నిహోత్రాలే. వాటి ఫలంకూడ స్వర్గ సాధనమే. గింట్లో మరీచి మహర్షి వాక్యం ఇలా వుంది. 'గ్రామాగ్రహారయో ర్నివాసినాం అనాహితాఽగ్నినాం సామాన్యమగ్నిహోత్ర ఫలదం, ఆహితాఽగ్నినాం సర్వనిష్కృతి హోమార్థం సర్వసమృద్ధ్యర్థంచ భవేత్' ఇది విమానార్చన కల్పంలోని వాక్యం. గ్రామాగ్రహారాదులలో నివసించే అనాహితాగ్నులకు అనగా అగ్నిహోత్రం చేయని అస్మదాదులకు అగ్నిహోత్ర ఫలం స్వామిని సేవిస్తే వస్తుంది. అగ్నిహోత్రం చేసేవాళ్లకు, అంటే ఆహితాగ్నుల కన్నమాట-వాళ్లకు సర్వనిష్కృతి, సర్వసమృద్ధీ కలుగుతాయి. అసలు అగ్నిహోత్రం చేసేవాళ్లకు కూడ కొన్నిఫలాలు చెప్పాయి కల్పసూత్రాలు. 'యోఽగ్నిం చినుతే తస్య సర్వం సుకృతం భవతి, సర్వేమ నిష్కృతిం కరోత్యపి బ్రహ్మహత్యాయాః.... ఏష నారకీ పీడాం న జానాతి। అని వైఖానస కల్పసూత్రం చెపుతున్నది. కనుక దేవాలయాలుకూడ అగ్నిహోత్ర సమమైతే అవి యజ్ఞశాలలే అవుతాయి. అయితే ఈ విషయాన్ని మరింత విస్తరింప చేద్దాము.

శ్రౌతమందు చయనంలో అగ్నిప్రతిష్ఠాపనము. ఆలయ నిర్మాణంలో బింబస్థాపనము. శ్రుతి 'పంచథాగ్నీన్ వ్యక్రామత్' అని ఐదగ్నులను పేర్కొంటోంది. అవి గార్హపత్యాన్వాహార్యాహవనీయ సభ్యావసథ్యములు. వీనిలో ప్రధానమైంది గార్హపత్యాగ్ని. దేవాలయం గార్హపత్యాకృతి. అట్లా గుంటూరుజిల్లాలోని చేజెర్ల గ్రామంలోని దేవాలయం గార్హపత్యాకృతిలో నిర్మాణమయి యుండుట గమనార్హము.

చయనమునకు పూర్వము భూమికర్షణము, బీజావాపము, యజ్ఞవాటికా నిర్మాణ విహితము. దేవాలయనిర్మాణమునకు పూర్వము తత్ప్రదేశమున కర్షణము, బీజావాపము, గోగణనివేదనము, గోవాసము, కూర్మాదుల ప్రక్షేపముకలదు. ఇష్టకానిక్షేపము రెండింటియందును సమానము.

చయనములో జాను, నాభి, ఆస్య, మహాన్త, బృహన్తమ, పరిమితపరిమాణములు స్వర్గకామునకు చెప్పబడినవి. ఆలయవిమాన గోపురాదులకు సయితము ఏకతలాదిద్వాదశ తలపర్యన్తనిర్మాణము ఉత్తరోత్తరోత్కర్షాపాదకముగా ప్రతిపాదనముచేయబడెను.

యజ్ఞములందు పంచాగ్ని కల్పనము, ఆలయమందు పంచబేరమూర్తికల్పనము, ధ్రువకౌతుకోత్సవస్నపన బలిబేరములు, పక్షాంతరమున యజ్ఞమందు త్రేతాగ్నులు, ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులు, ఆలయమున ధ్రువ, ఉత్సవ, బలిబేరములు, అదియులేనిచో ఔపాసనాగ్నివలె దేవాలయమున ధ్రువబేరమొక్కటియే. క్రియాధికార గ్రంథమందు భృగుమహర్షి ఈ విషయమును చక్కగా సమన్వయించినాడు.

యథా కర్మణ ఏకస్య
కల్పితాః పంచవహ్నయః।
తథాచైక విమానస్య
పంచ బేరాణి కల్పయేత్॥
అథవా త్రీణి బేరాణి
యథా త్రేతాగ్నికల్పనమ్।
ధ్రువార్చా బేరమేకం చ
బలిబేర మథోత్సవమ్॥
ధ్రువార్చా బేరమేకం తు
కుర్యాదౌపాసనాగ్నివత్।

ధ్రువార్చాబేరమనగా ఆవాహన విసర్గాభ్యాం వినాఽఽసనాద్యైరర్చయేత్ ఏషవిశేషః అన్యత్సర్వం సమాన మితి అని మరీచి మహర్షుల వివరణము.

ఆచార్యాది ఋత్విక్కుల లక్షణములను గురించి శ్రౌతమునందు 'యుక్తః శ్రద్ధాన్వితో విప్రైరనుజ్ఞాతః, కేశాన్ రోమ నఖాని చ వాపయిత్వా....కూష్మాణ్డహోమాన్ జుహుయాత్' అని యుండగా భగవచ్ఛాస్త్రకర్తలైన భృగు, మరీచి, కశ్యపాదు లేమి నిర్దేశించిరో చూత్తము.

భృగువు— ఋత్విజః ప్రాశయిత్వా పాయసేన ఘృతేన వా'

మరీచి— 'తే సర్వే లుప్తశ్మశ్రుకేశనఖాః.... యద్దేవాద్యైశ్చ కూష్మాండైర్జుహుయాత్రిర్మాత్.

కాశ్యపః- 'నారాయణ పరాయణం, తత్కర్మపరం, వైష్ణవం భక్తిమన్తం, ఏకం గురుం వరయేత్'

ఋత్విజసంఖ్య యజ్ఞమందు పదునారు. అట్లే ప్రతిష్ఠావిధియందును పదునార్గురు, యజ్ఞములందు హౌత్రప్రశంసనము, అట్లే భగవత్ప్రతిష్ఠాదులందును 'ఆశ్రావయ, అస్తు శ్రౌషట్, ఓంయజ, యజామహే, ఔషట్' అని ఆరంభముచేసి ప్రణవ పూర్వకం నమః ప్రవక్ష్య, ఇతివదన్ స్విష్టన్ వైఖానస సూత్రోక్తవిధినా హౌత్రంప్రశంసయేత్, అనివాక్యము. యజ్ఞములందు 'ఆశ్రావిత



# వార్తాలహరి

## గీతాజయంతి

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ రక్షణసంస్థ తిరుపతి అన్నమాచార్యకళా మందిరంలో గతడిశంబరు 12 నుండి 16 వరకు గీతాజయంత్యుత్సవాలను నిర్వహించింది. మొదటిరోజు శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారి స్వాగతోపన్యాసంతో సభ ప్రారంభమైంది. తి. తి. దేవస్థాన పౌర సంబంధశాఖాధికారులు శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి, దేవస్థానం గీతాప్రచారానికై అనేకవిధముల ప్రయత్నిస్తున్నదని తమ అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు. ప్రఖ్యాత పౌరాణికులు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి తమ ప్రారంభోపన్యాసంలో గీత మాతవంటిదని వక్కాణించారు. గీతాజయంతి అందరూచేసేది మార్గశుద్ధ ఏకాదశి అని, కాని మహాభారతం భారతసావిత్రి ఆధారంతో గీతాజయంతి మార్గ శుద్ధత్రయోదశి అని వారు పేర్కొన్నారు. తదుపరి శ్రీ నిర్మలానంద స్వామీజీ గీతాప్రవచనం చేశారు. 12 నుండి 16 వరకు ఈ ఐదు రోజులు శ్రీ స్వామీజీ మహోపన్యాసం గావించి భక్తులను ఆనందింపజేశారు.

15 వతేదీన గీతాజయంతి నాల్గవనాటి ఉత్సవం, తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి అధ్యక్షతన సభ ప్రారంభమైంది. భక్తిగీతాలను, భగవద్గీతను కాసెట్లరూపంలో భజనసంఘాలకు, దేవాలయాలకు, ధార్మికసంస్థలకు పంపిణీచేస్తామని వారు తమ అధ్యక్షోపన్యాసంలో తెలిపారు. హిందూధర్మరక్షణసంస్థ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు తాము నిర్వహించుచున్న కార్యక్రమాల్లో గీతాప్రచారం, పురాణప్రబోధపరీక్షలు అతి ముఖ్యమైనవని పేర్కొన్నారు. 1983 జనవరిలో నిర్వహించిన పురాణప్రబోధ పరీక్షల్లో రాష్ట్రస్థాయిలో అనంతపురంజిల్లా కొళిగెన హళ్ళి రెసిడెన్షియల్ స్కూలు విద్యార్థి చి. మునిరాజులు (9 వ తరగతి) మొదటి స్థానాన్ని, కడపజిల్లా వేపరాల జిల్లాపరిషత్ స్కూలు విద్యార్థిని చి॥ వసుంధర (10 వ తరగతి) ద్వితీయస్థానాన్ని, వరంగల్‌జిల్లా మట్టెవాడ ఆర్యవిద్యార్థినుల పాఠశాల విద్యార్థిని చి॥ శాంత (8 వతరగతి) తృతీయ స్థానాన్ని పొందారు. వీరందరికి కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి రజత పతకాలను బహూకరించారు.



రాష్ట్రస్థాయిలో ప్రథమ, ద్వితీయ, తృతీయశ్రేణి విజేతలకు బహుమతిప్రదానం చేస్తున్న దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి.

ముఖ్యంగా గమనార్హమేమంటే, ఈ హిందూపురాణప్రబోధపరీక్షల్లో హైందవేతరులు పాల్గొనడం, బహుమతులు పొందడం ప్రశంసనీయం. కర్నూలుజిల్లాస్థాయిలో క్రైస్తవుడైన చి॥ నాయకుల రాముడు తృతీయస్థానాన్ని, మెదక్‌జిల్లాస్థాయిలో మహమ్మదీయుడైన చి॥ మొహమద్ రహీముద్దీన్ తృతీయస్థానాన్ని, నల్లగొండజిల్లాస్థాయిలో మహమ్మదీయుడైన చి॥మున్వార్ తృతీయస్థానాన్ని పొందారు. వీరితోపాటు అధికసంఖ్యలో విద్యార్థులను హాజరుపరచిన పాఠశాలకు, ఎక్కువమంది ఉత్తీర్ణులైన పాఠశాలకు షీల్డులను బహూకరించారు. ఈ రెండు షీల్డులు. తిరుమల ఉన్నత పాఠశాలకే దక్కాయి.

16 వ తేదీన గీతాజయంతి 5 వ నాటి ఉత్సవం తి. తి. దేవస్థాన సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయలుగారి అధ్యక్షతన సభజరిగింది. గీతాపోటీలో విజేతలైన విద్యార్థులకు శ్రీ డి. సుబ్బరాయలుగారు బహుమతిప్రదానం చేశారు.

## కావ్యావిష్కరణ

తి. తి. దేవస్థానంవారి ఆర్థిక సహాయంతో ముద్రింపబడిన గ్రంథం "శ్రీ వేంకటేశ సారస్వత వినోదిని". కర్త శ్రీ బయిరెడ్డి సుబ్రహ్మణ్యం. గత డిశంబరు 1 వ తేదీన తిరుమల శ్రీ వేంకటేశ్వర ఉన్నతపాఠశాలలో తి. తి. దేవస్థాన సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీ జి. వెంకటేశ్వర్లు ఈ గ్రంథాన్ని ఆవిష్కరించారు. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గ్రంథవిశిష్టతను వివరించారు. శ్రీ తోట శ్రీనివాసులు రూ 116 లతో దుశ్శాలువతో గ్రంథకర్తను సత్కరించారు.



'శ్రీ వేంకటేశ సారస్వత వినోదిని' కావ్యావిష్కరణ చిత్రం.



తిరుపతి శ్రీ అన్నమాచార్య కళామందిరంలో గీతాజయంతి సందర్భముగా అధ్యక్షోపన్యాసం గావిస్తున్న దేవస్థాన సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయలు. (ఎడమవైపు చివరన) శ్రీశ్రీశ్రీ నిర్మలానందస్వామివారిని చిత్రంలో చూడవచ్చు.

## పదవీ స్వీకారం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ శాఖలో డిప్యూటీ కమీషనరుగా ఉండిన శ్రీ కె. కేశవులును తిరుమల తిరుపతి దేవస్థాన ఉపకార్యనిర్వహణాధికారిగా ప్రభుత్వం నియమించింది. వారుగత డిశంబరు 15 న పదవీస్వీకారంచేశారు.

## శ్రీవారి సేవలో విదేశవిద్యావేత్తలు

అమెరికా సంయుక్తరాష్ట్రాలకు చెందిన ఇద్దరు జెనెటిక్స్ శాస్త్రజ్ఞులు డా॥ ఉతా ఫ్రాన్కెక్, డా॥ హెనిజ్ పరత్మయస్లు (న్యూహావెన్‌లోని ఎలివిశ్వవిద్యాలయం) గత డిశంబరు 25 న తిరుమల సందర్శించడం జరిగింది. ఈ ఇద్దరు విదేశీయులు ఆలయ సంప్రదాయంప్రకారం, తిరుమల శ్రీవారి యందు, ఆస్తికత్వమునందు విశ్వాసం ప్రకటించినతదుపరి వీరిద్దరికి ఆలయ ప్రవేశం అనుమతింపబడింది. స్వామివారి దర్శనం చేసుకొన్న అనంతరం వీరు తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డిని కలిశారు. శ్రీవారి దర్శనం తమకు ఎంతో ఆనందాన్ని, మానసిక ప్రశాంతతను ప్రసాదించిందనీ, అది తమకు చిరస్మరణీయమైన అనుభూతి అని వారు వ్యాఖ్యానించారు.

తిరుమల ఆలయ నిర్వహణ, పరిశుభ్రత పట్ల ప్రొఫెసర్లిద్దరూ హర్షం వ్యక్తంచేశారు. ఈశాస్త్రవేత్తలు ఇటీవల ఢిల్లీలో జరిగిన జెనెటిక్స్ సమావేశంలో పాల్గొనుటకు భారత దేశం వచ్చినట్లు తెలిసింది.

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## గీతాజయంతి

రాజమండ్రిలో తి. తి. దేవస్థాన హిందూ ధర్మ రక్షణ శాఖ, స్థానిక శ్రీ వేణుగోపాల స్వామి ఆలయంలో గత డిశంబరు 12 నుండి 16 వరకు గీతాజయంతి కార్యక్రమాలు నిర్వహించింది. ఈ ఐదురోజులు బ్రహ్మశ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణగారు గీతాప్రవచనం చేశారు. 16 వ తేదీ శ్రీ అద్దంకి శ్రీరామ చంద్రమూర్తిదంపతులచే గీతాపూజ, గోపూజ నిర్వహింపబడింది. 'సమాచారం' పత్రికాసంపాదకులు బ్రహ్మశ్రీగంధం సీతా రామాంజనేయులు భగవద్గీత ప్రాశస్త్యాన్ని వివరించారు. తదుపరి గీతాపోటీ విజేతలకు శ్రీ గ్రంధి సుబ్రహ్మణ్యం తి. తి. దేవస్థాన పుస్తకాలను బహుమతి ప్రదానంచేశారు.

గుంటూరులో తి. తి. దేవస్థాన కల్యాణ మండపంలో డిశంబరు 14, 15, 16 తేదీల్లో గీతాజయంతి నిర్వహింపబడింది. ప్రతిరోజు సామూహికగీతాపారాయణ, విష్ణు సహస్ర నామ పారాయణ, గీతాప్రవచనం గావింప బడింది. శ్రీ యస్. యల్. ప్రసాద్, శ్రీ ఆర్. సూర్యనారాయణశాస్త్రి, శ్రీ శ్రిష్టిలక్ష్మీపార్వతీశం భగవద్గీతాప్రాశస్త్యాన్ని వివరించారు.

గీతాపోటీవిజేతలకు శ్రీ ముదిగొండ వెంకటప్పయ్య బహుమతి ప్రదానం చేశారు.

## సుప్రభాత పోటీలు

గూడూరులోని తి.తి. దేవస్థాన సమాచార కేంద్రంవారు స్థానిక దివ్యజీవన సంఘంవారి సహకారంతో గత డిశంబరు 10వ తేదీన బాలబాలికలకు సుప్రభాత పోటీలు నిర్వహించారు. 12వ తేదీన శ్రీమతి దేవకీ భాస్కరరెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ సభలో డా॥ సి. ఆర్. రెడ్డి, శ్రీ సి. వి. శేషయ్య "వేంకటేశ్వర సుప్రభాతం" విశిష్టతను వివరించారు. శ్రీమతి సి. కృష్ణమాంబ తి. తి. దేవస్థాన పుస్తకాలను విజేతలకు బహుమతిప్రదానం చేశారు.

## అఖండ శివభజన

ప్రకాశంజిల్లా ఈతముక్కల గ్రామంలో తి. తి. దేవస్థాన హిందూ ధర్మరక్షణ సంస్థకు అనుబంధశాఖయైన శ్రీ వేంకటేశ్వర భక్త సంఘంవారు పురజనుల సహకారంతో గత డిశంబరు 3, 4, తేదీల్లో అఖండశివభజన నిర్వహించారు

## పురాణకాలక్షేపం

గత నవంబరు 5 నుండి 29 వరకు గుంటూరుజిల్లా పిడుగురాళ్ళ గ్రామంలో శ్రీ వేంకటేశ్వర భక్తబృందంవారి ఆధ్వర్యంలో శ్రీమాన్ దిట్టకవి రామానుజాచార్యులచే కార్తీకపురాణ ప్రవచనం కావింప బడింది. సంఘసభ్యులు పురప్రజలు భారా టీకుని ఘనంగా సత్కరించారు. కార్తీక శుద్ధద్వాదశిరోజున సామూహికంగా మహిళలు తులసిపూజ చేశారు.




"ఏరోయి రామూ నీవు స్కూలుకు వెళ్లలేదా ఇవాళ" బజారులో ఎదురుగావస్తున్న రంగారావు ప్రశ్నించాడు.

"లేదురా. ఆ దిక్కుమాలిన లెక్కలు నాకు అర్థమయిచావవు. హోమ్‌వర్కుకు యిచ్చిన లెక్కల్లో ఒక్కటీచేయలేదు. స్కూలుకువెళితే మేష్టారు తిడతారని ఎగ్గొట్టాను." కారణం చెప్పాడు రాము.

"సరిగ్గా నా పరిస్థితీ అంతే........ఏంచేయడానికి తోచడంలేదు. సాయంత్రం స్కూలు వదిలేవరకూ బయటనేగడపాలి. ఏమిటి చెయ్యడం?"

"అదే నేనూ ఆలోచిస్తున్నా."

"ఓ మంచి ఆలోచనవచ్చింది. ఒక్క అయిదు రూపాయలు సంపాదించు. మేట్నీ సినిమాకు వెళ్దాం."

"నా దగ్గరెక్కడివిరా. మానాన్న డ్రాయరులో ఉంటాయిగాని తీస్తే తంతాడు."

"అదికాదురా రేపుప్రొద్దుటే నేను నీకు తెచ్చిస్తా. గుట్టుచప్పుడుకాకుండా అందులో పెట్టేద్దువుగాని. నాకుఅప్పుగాయివ్వు చాలు నీఖర్చుకూడా నేనేపెట్టుకుంటా."

తన ఖర్చుకూడా వాడే పెట్టుకుంటాననేసరికి రాము మనస్సు పెరపెరలాడింది. రంగడు ఖర్చుతో తాను ఊరికే సినిమా చూడొచ్చు. ఎలాగూ రేపు ఉదయమేతెచ్చియిస్తానంటున్నాడుగా. తిరిగితీసుకెళ్లి ఎవరూచూడకుండా డ్రాయరులో పడేయొచ్చు.

"అయితే ఉండరా ప్రయత్నించుకొస్తా. నీవిక్కడేవుండు." అని రాము యింటికి వెళ్లాడు.

"ఏమిరా అప్పుడే వచ్చావు" తల్లి ఎదురయి ప్రశ్నించింది.

"ఏం లేదమ్మా. సైన్సు నోట్సు మరచిపోయా" అని అబద్ధంచెప్పి సరాసరి గదిలోకి వెళ్ళాడు. వెళ్ళాడన్నమాటేకాని దొంగతనం చేయవచ్చేసరికి కాళ్లుగడగడ వణకటం ప్రారంభించాయి. భయంతో మరోసారి చుట్టూచూశాడు ఎవరయినా చూస్తున్నారేమోనని. ఎవరూకనబడలేదు. గుండెదిటవు చేసుకున్నాడు. డ్రాయరు సొరుగుతీసేవుంది. ముందుకులాగగానే వచ్చేసింది. ఎదురుగ్గా తండ్రితాలూకు డబ్బులో కొత్త అయిదు రూపాయలనోటు రెపరెపలాడుతూ కనిపించింది.

నింపాదిగాచెయ్యిపోనిచ్చి ఆ కొత్త అయిదు రూపాయల కాగితంతీసి జేబులోపెట్టుకుని డ్రాయరుమూసి రెండడుగులువేశాడు.

ఇంతలో "ఆగు" అంటూపెద్దకేక వినిపించింది. ఉలిక్కిపడ్డాడు రాము. చుట్టూ చూశాడు ఎవరూకనిపించలేదు. ఒకవేళ తన భ్రమేనని మరిరెండడుగులువేశాడు........

"ఏయ్ ఆగమంటుంటేనిన్ను కాదూ." అదే పిలుపు .. అదేగొంతు....

"ఎవరునువ్వు" కంగారుగా అన్నాడు రాము
"నేను నీ జేబులో అయిదు రూపాయల నోటును....ఏమిటి నువ్వుచేస్తున్న పని.దొంగతనమా ? అని నిగ్గతీసి వీపుమీద చరిచినట్లు అడిగింది.

రాము కంగారుపడిపోయాడు. వణికిపోతూ "అవును దొంగతనమే" అన్నాడు........
"పిచ్చివాడా నీవుబాగాచదువుకుని చాలా వృద్ధిలోకివస్తావని నీతల్లితండ్రులు నీమీద ఎన్నో ఆశలుపెట్టుకుచదివిస్తున్నారు. తల్లితండ్రులనూ, దేశాన్ని ఉద్ధరించాల్సింది పోయి, బడి మానేసి అబద్ధాలకోరువై, దొంగతనాలకు పాల్పడుతున్నావా.... సిగ్గేయడం లేదూ." అనిమందలించింది........

"వాడు.... రంగడు.... రంగడు తెమ్మన్నాడు."అన్నాడు చిన్నబోయిన ముఖంతో
"అందుకనే చెడుస్నేహాలు చేయకూడదు. నన్నుచూశయినా గుణపాఠంనేర్చుకో...."
"అవునూ నీకూ నాకూ ఏమిటి సారూప్యం."
"పిచ్చివాడా వినునాకథ.... నేనూనీకుమల్లే వెదురు తల్లిచాటున అల్లారుముద్దుగా పెరిగాను. నేను పెద్దదాన్నయిన తర్వాత నన్ను తీసుకువెళ్లి అనేకరసాయనాల్లో ముంచితెల్లని కాగితంగా తయారుచేశారు.... నేను రసాయనాల్లో మునిగినట్లు, నీవు కూడా అనేక తరగతుల్లోబాగా విద్యనేర్చుకుంటే నాలాగ స్వచ్ఛందంగా, ఒకపరిపూర్ణవ్యక్తిత్వంవచ్చి నీ విధ్యుక్తధర్మం నీవు నెరవేర్చుకునేవాడివయ్యేవాడివి.... నాఎక్స్‌పెరిమెంట్సు, నీ



# ఐదురూపాయలనోటు

*నందూరు సుబ్బారావు*

# ఆత్మపూజ

| | | |
|---|---|---|
| ఓమ్ ! | — | ప్రణవం అక్షరత్రయప్రణయం. |
| తస్య నిశ్చింతనమ్ ధ్యానమ్ ! | — | ధ్యానం చిత్త నిశ్చలత్వం. |
| సర్వకర్మనిరాకరణమ్ ఆవాహనమ్ ! | — | కర్తృత్వనిరాకరణ ఆవాహన. |
| నిశ్చల జ్ఞానమ్ ఆసనం ! | — | ఆసనం చలించని జ్ఞానం. |
| ఉన్మనీ భావః పాద్యమ్ ! | — | భావ భాగీరథీ సముద్ధరణ పాద్యం. |
| సదా మనస్కమ్ అర్ఘ్యమ్ | — | అర్ఘ్యం అమనస్కయోగం. |
| సదా దీప్తిః అపార అమృత వృత్తిస్నానమ్ ! | — | స్నానం అనంత అమృత కాంతి వలయం. |
| సర్వత్ర భావనా గంధః ! | — | అస్తిత్వభావనా సౌరభం గంధం. |
| దృక్ స్వరూపో ఽవస్థానమ్ అక్షతాః ! | — | ఆత్మస్వరూపం వీక్షణాదక్షత అక్షత. |
| చిదాప్తిః పుష్పమ్ ! | — | చైతన్యప్రాప్తి పుష్పం. |
| చిదగ్ని స్వరూపమ్ ధూపః ! | — | ధూపం జ్ఞానాగ్నిరూపం. |
| చిదాదిత్య స్వరూపమ్ దీపః ! | — | దీపం ప్రసన్న ఆత్మ రవితేజం. |
| పరిపూర్ణ చంద్ర అమృతరసైకీకరణమ్ నైవేద్యమ్ ! | — | నైవేద్యం సంపూర్ణ హృదయ చంద్ర అమృత రసాయనం. |
| నిశ్చలత్వమ్ ప్రదక్షిణమ్ ! | — | ప్రదక్షిణ క్షణాలమధ్య నిశ్చల ప్రదర్శన. |
| సోహమ్ భావో నమస్కారః ! | — | అద్వైతయోగసారం నమస్కారం. |
| మౌనమ్ స్తుతిః ! | — | స్తుతి - మౌనస్థితి జ్ఞాననయనద్యుతి. |
| సర్వ సంతోషో విసర్జనమితి స ఏవమ్ వేద ! | — | సంతృప్తి - త్యక్త అనురక్తి కర్మబంధ విమోచనశక్తి. |
| సర్వనిరామయ పరిపూర్ణోఽహమస్మీతి ! | — | సర్వక్లేశ అతిక్రాంత పరిపూర్ణ బ్రహ్మానుభూతి. |
| ముముక్షూణామ్ మోక్షైక సిద్ధిర్భవతి ! ఇత్యుపనిషత్ ! | — | ముముక్షువులకు మోక్షసిద్ధి. ఇది వేదవిదిత ఆత్మపూజావిధి |

మూలం: ఆత్మపూజోపనిషత్తు.

— ఉప్పు రాఘవేంద్రరావు

చదువులూసమానం అన్ని ఎక్స్‌పెరిమెంట్సు పూర్తిచేసుకొని తెల్లనికాగితంలో ఉన్నానాపై అయిదురూపాయలముద్ర, వందరూపాయలముద్ర వేశారు .... నీ చదువు పూర్తి అవగానే నీకు పెద్దఉద్యోగం రావడమో, డాక్టరువో, లాయరువో, శాస్త్రజ్ఞుడువో అయితే నీ స్థాయి బాగా పెరిగి నీకు వ్యక్తిత్వంవచ్చి గౌరవం పెరిగేది. నిన్నందరూ ఎంతో గౌరవంగా చూచేవారు. నీ తల్లితండ్రులకూ, నీ దేశానికి నీకు నీవుగా ఎంతో సాయపడే వాడివి....

నన్ను చూడు.... నామీదరూపాయలముద్ర పడగానే, పేదవాళ్ళకు, పెద్దలకు, పిల్లలకు, అందరికీ ఉపయోగపడుతున్నానుదేశమే... నన్ను గౌరవిస్తుంది. యావత్ ప్రపంచం నన్ను గౌరవిస్తోంది. అనేక పరిశ్రమలు, డాములు, పంటలు అన్నిటికీ మూలకారణం నేనే.

నాలాగాఎంతో అభివృద్ధిలోకి రావాల్సిన నీవు, తల్లిచాటున పెరుగుతున్నప్పుడే అబద్ధాలు, చెడుస్నేహాలూ, బడిఎగగొట్టడాలూ, దొంగతనాలు నేర్చుకుంటే ఇంకనీవేంపనికి వస్తావు. నిన్ను నమ్ముకున్న తల్లితండ్రుల కేంసాయపడతావు. కనీసం ఎన్నోఏళ్ళు బ్రతకవలసిన నీవు నీకన్నాసాయపడగలవా?........ఛీ, పాపిష్టివాడా మాతాపితృద్రోహివి.... దేశద్రోహివి.''

రాము విలవిలలాడిపోయాడు. తన తప్పు తెలుసుకున్నాడు.అయిదురూపాయలనోటు తిడుతుంటే భరించలేకపోయాడు. సిగ్గుతో కుమిలిపోయాడు.

" ఆగు. నన్నిక తిట్టకు.... నేను చేసింది చాలాపొరపాటు. ఇదిగో ఈనోటు మళ్లీ మా నాన్న డ్రాయరులో పెట్టేస్తున్నాను. ఇక చచ్చినా దొంగతనంచెయ్యను. అమ్మతో అబద్ధాలుచెప్పను. చెడుస్నేహాలుచెయ్యను. రోజూ మానకుండా బడికి వెళ్తా." అంటూ ఆ అయిదురూపాయలనోటును డ్రాయరులో పెట్టేశాడు.

అతని మనస్సు ఎంతోతేలికయింది సైన్సునోట్సు తీసుకొని సరాసరి స్కూలుకు వెళ్లిపోయాడు.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press,
by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



దాఁచుకో నీ పాదాలకుఁ దగ నేఁ జేసినపూజ లివి
పూఁచి నీ కీరితిరూపపుష్పము లివి యయ్యా.

వొక్కసంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన దాఁచి వుండనీ
వెక్కసమగు నీ నామము వెలసులభము ఫల మధికము
దిక్కై నన్నేలితి విఁక నవి తీరని నా ధనమయ్యా.

నా నాలికపై నుండి నానాసంకీర్తనలు
పూని నాచే నిన్నుఁ బొగడించితివి
వేనామాల వెన్నుఁడా వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నా కీ పుణ్యము గట్టితి వింతే యయ్యా.

యీ మాఁట గర్వముగాదు నీ మహిమే కొనియాడితిఁగాని
చేముంచి నా స్వాతంత్ర్యము చెప్పినవాఁడఁ గాను
నేమానఁ బాడేవాఁడను నేరము లెంచకుమీ
శ్రీ మాధవ నే నీదాసుఁడ శ్రీవేంకటేశుఁడవయ్యా.

— అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తన.



(మార్చి 29 అన్నమయ్య వర్ధంతి సందర్భంగా)

# మీ మాట

## సంపాదకీయం

"మకర సంక్రమణ పుణ్యకాల సందర్భంగా మీరు ప్రకటించిన సంపాదకీయంలో ఖగోళశాస్త్రవిషయ విపులీకరణ, శ్రీ సూర్య నారాయణుని వైశిష్ట్యాన్ని ప్రకటించినతీరు సంభాషణారీతిలో కొనసాగిన భాషా శైలి పాఠకులను ముగ్ధుల నొనరించ గలదను టలో అతిశయోక్తి ఇసుమంతయులేదు.

విద్వాన్ కొంకల మాలకొండారెడ్డి — వాకాడు.

## యువవాణి

డిశంబరు సప్తగిరి యువవాణిలో శాంతి మంత్రము ప్రతిపదార్థ వివరణముల పద్ధతి "అరటిపండొలిచి"నట్లున్నది. వివరణకర్త కళాప్రపూర్ణ డా॥ కొండవీటి వేంకటకవిగారికి ప్రశంసలు.

బయిరెడ్డి సుబ్రహ్మణ్యం — తిరుపతి.

## ఆధ్యాత్మికతకు దగ్గర

జనవరి సంచికలోని శ్రీ జూలకంటి బాల సుబ్రహ్మణ్యంగారి 'నిరతాన్నదాత ఎల్లమ రాజు,' శ్రీదర్భా చలమయ్యశాస్త్రి గారి గయాక్షేత్రం వివరణలు, శ్రీ ధారా సుబ్ర హ్మణ్యంగారి "సంక్రాంతిశోభ," శ్రీ ఇల పావులూరి కామేశ్వరరావుగారి "స్వాతి తిరు నాళ్" పాఠకలోకాన్ని ఆధ్యాత్మిక జీవనానికి అతి దగ్గరగా తీసికొనిపోగా "అన్నమయ్య చెన్న కేశవశతకము" లోని వివాదాంశ ములు అర్థసహితముగా సహజముగా వున్నవి. చాల బాగుంది.

పి. కామేశ్వరశర్మ — హైదరాబాదు.
కె. వీరభద్రరావు — ఈతముక్కల.

## బాలప్రబోధం

జనవరి 1984 సంచిక చాలా బాగుంది. 'సంక్రాంతిశోభ, ధర్మరక్షణే నీకు రక్ష' బాగున్నాయి. కాని ఈ నెలలో 'బాల ప్రబోధం' ప్రచురించనందులకు బాలలకు కాస్త అసంతృప్తి.

౦. స్వర్ణగౌరీలత — పార్వతీపురం

## వేంకటేశ్వరలీలలు!

జనవరి 84 సంచికలో వేంకటేశ్వరలీలలు 'శీర్షిక క్రింద ప్రచురించిన శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారి "నిరతాన్నదాత ఎల్లమరాజు" చాల ప్రశస్తముగా, భక్తిస్ఫోర కంగావున్నది. ఇలాంటి వేంకటేశ్వరలీలలు ప్రచురించి మాకు ఆనందము నందించ గలరని ప్రార్థన. ముఖచిత్రం చాల బాగున్నది.

రొ్గాపైల సుబ్బరాయప్పశెట్టి — వంకరకుంట.
డి. తిరువేంగళాచార్యులు — దర్శి.
మంచుకొండ నర్సయ్య — నక్రెకల్.

## హరిహరనాథతత్త్వం

'శక్తి - హరిహరనాథతత్త్వం'లో హరి హరాభేదం తెల్పుతూ తిక్కన శ్లోకం, ఇంకా అనేక శ్లోకాలు వివరించారు రచయిత. తిక్కనవలనే పోతనకూడా "చేతులారంగ శివుని పూజింపడేని" అను పద్యం ద్వారా తెలిపాడు. రచయిత ఈ పద్యాన్ని కూడా తెలిపివుంటే బాగుండేది. దీనిని గురించిన నిష్ఠల సుబ్రహ్మణ్యంగారి వ్యాసం బాగుంది.

కొండపి వాసుదేవమూర్తి — ఒంగోలు.

## బంగారు పిడికిళ్లు (?)

జనవరి 84 సప్తగిరి'లో శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యం గారు "అన్నమయ్య చెన్న కేశవశతకము" అను తమ వ్యాసంలో అన్నమయ్య, చెన్న కేశవస్వామికి నివే దించిన వస్తువులను సీసపద్యంలో వున్న వానిని వివరిస్తూ "బంగారు పిడికిళ్లు (?) = పసిబిడ్డలచేతి పిడికిలిలోని కణిగి, వారు చప్పరించగలిగిన భక్ష్యము. ఏదైన వృక్ష ఫలము కావచ్చు. 'పాలపండ్లు అని యొక రన్నారు – అని వివరించారు.

'బంగారు పిడికిళ్లు' లేదా బంగారు పిసికిళ్లు అనే పదం రాయలసీమలో వుంది. నేటికీ జొన్నపంట విరివిగా పండు కర్నూలు ప్రాంతాల్లో ఆ పదం ఇంకా నిలిచి వుంది. జొన్నపంట బాగా కాపుకు వచ్చిన తరువాత ఒక పదిహేను, ఇరవై రోజుల్లో కోత కోస్తా రనుటకు ముందు, జొన్నగింజలు మెత్తగా పాలతోనిండి తీయగా వుంటాయి. రైతులు అలాంటి జొన్నగింజలను తీసి, వాటితో బెల్లము నువ్వులు కలిపి తింటారు. ఇలే రుచిగా వుంటాయి. అలాంటి 'పాలజొన్న గింజలను' పిడికిళ్ళు లేదా 'పిసికిళ్ళు' అంటారు. రాయలసీమ ప్రాంతంవాడైన అన్నమయ్య 'బంగారుపిడికళ్ళ'ను స్వామికి నివేదించడంలో ఆశ్చర్యంలేదు.

జూలకంటి బాలసుబ్రహ్మణ్యం — తిరుపతి.

## చెప్పండి చూద్దాం!

83 డిశంబరు సప్తగిరి ముఖచిత్రం బాగావుంది. బాలప్రబోధం మొదలైన చిన్నపిల్లల కథలు చాల బాగ వున్నాయి. మీరు ప్రతినెలా, లేకున్న రెండు నెల్లకైనా "చెప్పండి చూద్దాం" ప్రచురిస్తే ఎంతో బావుండేది. ఇప్పటికైనా ప్రచురిస్తారని కోరుచున్నాను.

చి॥ జి. మురళీకృష్ణయ్య — కొడిగెనహళ్ళి.

## కులం — గుణం

డిశంబరు పత్రికలో 'కులం-గుణం' అనే సామెత గుణపాఠము చాల మంచిగ యున్నది. ఇకముందు ప్రతిమాస సప్తగిరి పత్రికలో ఒక సామెత గుణపాఠము ప్రచు రింప కోరుచున్నాను.

గెంట్యాల నారాయణ — బొంబాయి.

## నిజమైన దీపావళి!

తెలుగునాట, నేడు నాటకరంగ పరిస్థితి అధ్వాన్నంగావుంది. తెలుగు నాటకరంగం పూర్వవైభవాన్ని సంతరించుకోవాలంటే, మన ప్రభుత్వం, కళాశాలలు, విశ్వవిద్యా లయాలు, తి. తి. దేవస్థానం వంటి ధార్మిక సంస్థలు ముందుకు రావాలి. ఆర్థిక సహాయం చేయాలి. నాటకకళకు సమాజానికి అవినాభావసంబంధం ఉంది. కళలను, కళాకారులను ఇటు ప్రజలు, అటు ధార్మిక సంస్థలూ, ప్రభుత్వమూ ప్రోత్సహించి, చేయూతనిచ్చి తెలుగునాటక కళామతల్లికి కర్పూరనీరాజనాల నర్పించినరోజే తెలుగు నాటకరంగానికి నిజమైన దీపావళి! ఆ శుభదినం త్వరలోనే వస్తుందని ఆశిద్దాం!

ఏ. మునిరామయ్య — తిరుపతి.




గౌరవసంపాదకులు:
శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :
కాట్రపాటి సుబ్బారావు, ఎమ్. ఎ

*

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00
సం॥ చందా - రు. 12-00

*

ప్రతులకు :
వెల్‌ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

మార్చి 1984
సంపుటి 14 సంచిక 10



ముఖచిత్రం: శ్రీవారితో ఉభయదేవేరులు.

2 వ కవరుపేజి: శ్రీ కులశేఖరాళ్వారు. 3 వ కవరుపేజి: శ్రీ వ్యాసరాయలు. 4 వ కవరుకథ 47 వ పేజీలో చూడండి.

# సంపాదకీయం

దేవుడున్నాడా ఉంటే ఎక్కడున్నాడు! అనేది అనాదిగా మానవుణ్ణి వేధించినప్రశ్న. ఉన్నాడని, ఎందెందు వెదకి చూచిన అందందే కలడని, జిజ్ఞాస మీరిన మానవ దానవాగ్రణులకు, ప్రహ్లాదునిలాంటి పరమభక్తశిఖామణులసమాధానం. ప్రతి చోటావుంటే గుడికి ఎందుకు వెళ్లాలి అనేది మరోప్రశ్న. అణువణువునా వ్యాప్తమైవున్న ఆ అంతర్యామిని, ప్రతినరునిలోన వెలిగే నారాయణజ్యోతిని దర్శించటం తేలికైన విషయంకాదు. కనుకనే మన ముక్తి కోసం అర్చావతారం ఆవిర్భవించింది. ఇటు నరసింహావతారంకాని, అటు పరమశివుని లింగోద్భవంకాని దాదాపు ఈ సత్యాన్నే నిరూపిస్తాయి. ఈ అర్చావతారాల ఆరాధనకోసం ఆగమ శాస్త్రాలు, ఆరాధనాలయాలు ఊరూరా వెలిశాయి.

ప్రతి ఊరా ఒక అలయం ఉన్నప్పుడు, ఒక ఊరి అర్చామూర్తికే ఎక్కువ ప్రాచుర్యం ఎందుకు లభించాలి? క్షేత్ర మాహాత్మ్యలు, తీర్థమాహాత్మ్యలు, పరిసర ప్రాకృతిక చారిత్రకవైశిష్ట్యం లాంటివెన్నో ఒక్కొక్క క్షేత్రం మిగిలినవాటికన్న జనాకర్షణలో మిన్నగా ఉండేందుకు కారణాలౌతాయి. ఆ యా క్షేత్రాలకు జరిగే ప్రత్యేకోత్సవాలకు మూలమూలలనుంచి జనం రావటం, తద్వారా అంతర్నిహితంగా ప్రవహిస్తున్న ఆధ్యాత్మికస్రవంతి పెల్లుబికి పరిసరక్షేత్రాలను జీవవంతం చేయటం జరిగి జాతీయ దైవీభావైక్యము ఏర్పడుతుంది.

మరి సంధ్యావందన మంత్రాలలో చెప్పినట్లు,

"ఆకాశజలమంతా ఆ సాగరునకే, ఆ కొలుపు ఆ కొలుపు ఆ మాధవునకే'' అన్న భావన పరివ్యాప్తమైనప్పుడా క్షేత్రం ముక్కోటి దేవతల ముక్తిధామమని అన్నా, కలియుగవైకుంఠమన్నా వింతలేదు.

ఆళ్వారులందరికి కలియుగదైవం కనిపించిన తీరే వేరు. కోదండపాణిగా కొందరు భావిస్తే, ఆదినారాయణుడేనని మరి కొందరన్నారు. ఆండాళ్లుకు- ఆ రంగనికి వేంకటగిరివల్లభునకు వ్యత్యాసమే కన్పించలేదు. శైవులు శక్తి అని ఆరాధిస్తే, శాంకరులు శివుడని అన్నారు. ఇవన్నీకాక దేవదేవుడే దిగివచ్చిన వైకుంఠంగా రామానుజులు రూఢిచేశారు. అనేకభక్తశ్రేష్ఠులు ఈ కలియుగ స్వామి సేవలో చరితార్థులయ్యారు. తమ ముకుందమాలతో ముకుందుని ఆరాధించిన కులశేఖర ప్రభువు కూడా ఈ ముక్తిగిరిలోని రాయిగా రప్పగా చివరకు చీమగా నైనా పుట్టలేదే యని పరితపింపజేసిన పుణ్యప్రదేశం ఇది. శ్రీవారి ఆలయంలో ఈనాటికీ కులశేఖరపడి మండపం వుంది.

ఇక శ్రీపాదరాయల శిష్యులు వ్యాసరాయలు తమ జీవితంలో అత్యధికభాగం గడిపింది తిరుమల ప్రాంతాలలోనే. ఉత్తమ ధార్మికగ్రంథ రచనాచణుడైన ఈ మహామనీషి తన తిరుపతి నివాసకాలాన్ని మధ్వమతస్థాపనకు దేవస్థాన పాలన సంస్కరణాని కుపయోగించి చరితార్థజన్ముడయ్యాడు.

ఇందరు భక్తులు మూలమూలలనుండి శేషాద్రిని చేరవచ్చిన కారణం, అన్ని అవతారాలతో వెలసిన సర్వాంతర్యామే తిరుమల శిఖరాల స్థిరనివాసమేర్పరచుకొన్నాడన్న భావనయే.

శ్రీ వేంకటేశ్వరుని ముప్పైరెండువేల సంకీర్తనప్రసూనాలతో అర్చించి వేదపదకవితా పితామహుడైన అన్నమయ్య అందరి భావనను సమీక్షించాడు.

"ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతము లెంచిచూడ పిండంతె నిప్పటియన్నట్లు''
.... .... .... .... .... ....
అన్నిచోట్ల పరమాత్మ నీవు! ఇన్నిరూపుల భ్రమయింతువుగా
ఈవల నావల నుండి యీ వేంకటాద్రిపై
నీవే నీవే వచ్చినెలకొంటిగా !!

# వసంతహేల

వసంతం వచ్చేస్తోంది అనుకోగానే ప్రతి మనిషిలో మధురమైన భావన మనసంతా పరచుకుంటుంది.

భగవద్గీత విభూతియోగంలో భగవంతుడు అర్జునునకు తనవిభూతులను తెలియజేస్తూ సర్వత్రా తానున్నానని చెపుతూ, ఋతువులలో తాను వసంతఋతువును అని అంటాడు.

అందుకేనేమో ఋతువులలోకెల్లా వసంత ఋతువు అతిఆహ్లాదకరంగా,అమిత సౌందర్య వంతంగా ఉంటుంది, భగవానుని ముగ్ధ మోహనరూపంలా.

దక్షిణదిశనుంచి సాగివస్తూ మలయ పవనం వసంతకన్యరాక తెలియపరచగానే ప్రతితరువు ఆనందోత్సాహంతో అంజలి ఘటించి వసంతకన్యను ఆహ్వానిస్తుంది. సమీరకాంతుని పరిష్వంగంలో పరవశిస్తూ మరుమల్లితీగ కురిపిస్తుంది తీయని పరిమళాలను.

కదిలేఆకుల గలగలలలో, వీచే చిరుగాలులసవ్వడిలో, విరిసిన రంగురంగుల సుమాలలో, గుబురు మావి లేచిగురు కొమ్మలో దాగి మధురంగా పంచమస్వరాన రాగంతీసే కోయిల గానామృతంలో వసంత కన్య స్పష్టంగా కనిపిస్తుంది.

ఆమెరాకలో ప్రకృతి కదలికలో ఎంతో వింత శోభ గోచరిస్తుంది. ఎటుచూసినా కన్నులకింపుగా మనసుకు నిండుగా ఆహ్లాదం.

ఎటుచూసిన నీరూపే ఎటువిన్నను
నీ పిలుపే
వలుకరించేనే మదిని చిలకరించేనే
॥ఎటు॥

ప్రభాతశీతల పవన వీచికలో
దృగంచలానన హసనమాలికలో
విలాస సోయగ ఉషః కాంతిలో
మెరసితివే నవపూలబాలికలో ॥ఎటు॥

ఎలకోయిల మధుగళమున
రసరాగగీతములో
చిరునవ్వుల సంజలలో నిశి
రాజుసరాగములో
చిరుగాజుల సవ్వడిలో
నాచెలి అందెల నాదములో ॥ఎటు॥

ప్రకృతి ప్రతిఅణువులో నిండి మనోజ్ఞంగా, మనోహరంగా కన్పించే ఆ సౌందర్య మూర్తిని కనులారా తిలకించని కళా హృదయం, ఆ వసంత మూర్తిని మనసారా ఆరాధించని కవిహృదయం ప్రపంచంలో ఉంటుందా? ఉండదు.



మనిషిజీవితం కష్టసుఖాల కలయికనీ, కష్టాలు కలకాలం ఉండవనీ, ఋతుచక్రంలోని ఋతువులమార్పులు పదేపదే మనిషికి గుర్తుచేస్తూ ఆశాభావాన్ని, మనోధైర్యాన్ని కలిగిస్తుంటాయి.

మనిషి నాలుగుజీవితదశలలో మరువలేని మధురభావన కలిగించేది యౌవనదశ. అలాగే ఋతువులలో వసంతం. ఐతే మనిషి జీవితంలో యౌవనవసంతం ఒకేసారితొంగి

చూస్తుంది. కానీ వసంతఋతువు ప్రతిసంవత్సరం విరిసి మనసును మురిపిస్తుంది.

రాగదే రాగదే వాసంతకన్యకా
విశ్వవీథుల ఎదలవీణియలు పలికింప
॥ రాగదే ॥

నీ రాగపరిమళము పల్లవించినచోట
ఎండువారిన ఎదలపొదలు చివురించునే
॥ రాగదే ॥

భావసౌగంధికా రాశి మనసున విరియ
మోడువోయిన బ్రతుకు తీవ పులకించునే
॥ రాగదే ॥

నీ గానరవళిలో నినదించి నిదురించు
శాంతిడోలలనూగు నిఖిల జగమంత
॥ రాగదే ॥

మోడువారిన తరులు వసంతకన్యరాకతో చిగురిస్తాయి. బండబారిన గుండెలు పులకిస్తాయి. మదిమదిలో ఎదఎదలో వేయి వెన్నెల వెలుగులు నిండిన వింతఅనుభూతి జగతి ఆమెరాకతో నవచైతన్యం నింపుకుంటుంది.

చైత్రలక్ష్మి వసంతకన్య చెలిమితో అణువణువూ అలంకరించుకుని శోభిస్తుంది. శరత్ చంద్రికాపూర్ణకలశం చల్లగా ప్రపంచాన్ని పునీతంచేస్తుంది. ఆకాశకాంతవెన్నెల వీణపై తారలతీగలు మీటుతూ వసంతగానం ఆలపిస్తుంది. పచ్చని ఆకులమధ్య విచ్చిన సుమాలచిక్కని నవ్వు మనసుల్లో పరిమళాలు నింపుతుంది. ఎటుచూసినా అందమే ఆనందమే.

ఓ వసంతమోహినీ
నవజీవన దాయినీ
నీవులేని ఈ జగము నిర్జీవజలవాహినీ
॥ ఓ వసంత ॥

ప్రచండ సూర్యుని ప్రతాపాగ్నికి
తలలు వాల్చెనే తరుల సమూహము
మూగవోయిన గళములతో
విలవిలలాడెను శుకపికమ్ములే ॥ఓ వసంత॥

చిన్నబోయెనే చల్లని జాబిలి
కారుమబ్బు తన కాంతిని మ్రింగగ
విసరి చీకటిని ముసిరేవానలు
గగన గర్జనకు దిక్కులదరెను ॥ఓ వసంత॥

వడవడ వణకెను వసుధాసదనము
కమలి పోయెనే కమల దళమ్ములు
శిశిర రక్కసికి స్వాగత మిచ్చి
కుమిలిపోయెనే ప్రకృతికలశము
॥ఓ వసంత॥

వసంతకన్య దరహాసజ్యోత్స్నలలో కరిగిపోతూ పరవశిస్తున్న ప్రకృతినుంచి వేరుచేసి కాలవిహంగం వసంతకన్యను తన రెక్కలలో దాచుకుని ఎగిరిపోతుంది. వసంతకన్య వెడలిపోగానే ప్రకృతి మూగబోతుంది. గ్రీష్మం చెలరేగుతుంది. నిప్పులు చెరిగే ఎండలో నిట్టూర్పు విడుస్తుంది ప్రకృతి. మండేగాడ్పులకు కుమిలిపోతూ, ముసిరేవానలకు మునిగిపోతూ, ఆవేదనతో వసంతకన్య విడిచిపోయిన అమృతక్షణాలను మననంచేసుకుంటూ మరల ఆమెరాక కోసం ఎదురుచూస్తుంటుంది ప్రకృతి. శిశిరరాక్షసి కసిగా ఆకులను రాల్చి మోడువారిన తరులను మిగులుస్తుంది.

వసంతకన్య నిరీక్షణలో నిలిచిఉన్న ప్రకృతినిచూసి జాలిపడినకాలం పదిలంగా వసంతకన్యను ప్రకృతి దగ్గర వదలివేస్తుంది.

మరల మరుమల్లెతోట మొగ్గతొడిగి పరిమళిస్తుంది. మూగవోయినకోయిల గళమెత్తి తీయగా పాడుతుంది. వసంతం ప్రపంచాన వెల్లివిరియగానే మరల ప్రతి హృదిలో మధురామృత వర్షం కురుస్తుంది.

ఋతువుమారడం సహజం. అదికాలధర్మం, ధర్మమార్గం తప్పరాదనీ, నియమంవీడరాదనీ, కష్టాలలో సహనం ధరించి ధర్మమార్గం తప్పకుండా సుఖాలతీరాలను చేరగలిగినప్పుడే నిజమైన సుఖసంతోషాలు లభించగలవనే ధర్మాన్ని ఋతుచక్రం తెలియజేస్తుంది.

## ఏకాత్మలో పరమాత్మ

కాశ్మీరమ్ము నుండి కన్యాకుమారి వరకు
కనిపించే భారత ప్రకృతి కమనీయాకృతి
మనసైన సుందర నందన మందిర మధురిమ
ఒకే కులం, ఒకే జాతి, ఒకే మతం, ఒకే రీతి
మన నీతిగ సాగినట్టి నడవడి, మనుగడలు మనవి.
సర్వజనుల సుఖతృప్తులు నర నరాల మన వరాలు
అందుకొరకు మనమంతా అహరహమ్ము శ్రమియిస్తాం
ఏకాత్మలో పరమాత్మను సంధించగ సిద్ధమైంది యాగవేది
సమతామమతల మల్లెలు సర్వులలో సొగసెత్తెడు మానవతా వీథి
వివరీత విజాతీయ అతివాదపు పిడివాదపు ప్రగల్భాల
తరతరాల మన పునీతగంగలో ఋాది చేయ రారండి
కనులముందు తరలివచ్చె పవిత్రసుమదీపంగా మనగంగ
భరతజాతి నవ ప్రగతికి నాందికాగ స్నాతులవుదాం పావం తొలగంగ
శివజటాజూటమ్మున జాలువారినగంగ శివముకలిగించంగ
విష్ణుపాదోదకమ్మయిన గంగ సత్యసుందరము లీయంగ
ఈ యాగయోగ్యులుగ సుందరభవితకు సుధాతలుగ సాగిపోదమురండు.

— సుచంద్ర







# వాసుకి

ఎస్. మయూరి

హిందూధర్మం ప్రకారం భార్య భర్తను దైవసమానంగా ఆరాధించవలె. ఈ ధర్మం అక్షరాలా పాటించినవారు పతివ్రతలని పిలవబడతారు. మన పురాణాల్లో అట్టి స్త్రీలు అడుగడుగునా అగపడతారు. సావిత్రి, అనసూయ, అరుంధతి వారిలో కొందరు. తమిళభాషాసంప్రదాయంలో పతివ్రత అని పేర్కొనదగ్గ స్త్రీ వాసుకి.

వాసుకి 'తిరుక్కురల్' గ్రంథకర్త అయిన తిరువల్లువరు భార్య. తిరువల్లువరు పేరు విననివారుండరు. అతని 'తిరుక్కురల్' జగత్ప్రసిద్ధి చెందిన గ్రంథం. కాని వాసుకి గురించి బహుకొద్దిమందికి మాత్రమే తెలుసు. ఆమె ఒక ధనవంతుడైన రైతుకూతురని ప్రజలు చెప్పుకుంటారు. ఆమెను చిన్నప్పుడే తండ్రి, కవిఅయిన తిరువల్లువరుకిచ్చి వివాహం చేశాడు. మైలాపూరులోవాళ్ళు అత్యంతఅన్యోన్యంగా జీవించేవారు. వారిజీవితం అందరికీ ఆదర్శప్రాయంగా ఉండేది.

తిరువల్లువరు తన పుస్తకంలో వైవాహికజీవితాన్ని ప్రశంసించాడు. సన్యాసాన్ని తిరస్కరించనప్పటికీ అతడు వివాహాన్ని శ్రేష్ఠతరమని తలచాడు. అతడు చెప్పింది ఆచరించేవాడు కాబట్టి, అతని కుటుంబజీవితం ఆదర్శంగా వాడవాడలా ప్రసిద్ధికెక్కింది. తాను గొప్పకవి అయినప్పటికీ నూలువడికి జీవనం చేసేవాడు. సంసారే మిగతా మూడు ఆశ్రమాలకు మూలస్తంభమని నిరూపించాడు తిరువల్లువరు.

ఆ కాలంలోనే తమిళదేశంలో కొంకణుడనే సిద్ధుడుండేవాడు. అతడు తపస్సుచేసి కొన్ని దివ్యశక్తులను సంపాదించాడు. కాని అతడు అహాన్ని జయించలేదు. తన సన్యాసాశ్రమమే ఇతర ఆశ్రమధర్మాల కంటె మిక్కిలి గొప్పదని అతని మూఢనమ్మకం. వాసుకీతిరువల్లువరుల కీర్తి దశదిశల వ్యాపించి అతన్నికూడా చేరింది. తాను స్వయంగా ఆ దంపతులను దర్శించదలచి తన ఆశ్రమాన్ని వదలి మైలాపూరు బయలు దేరాడు.

దారిలో కొంగలగుంపొకటి ఆకాశంలో అతనిమీదుగా వెళ్ళడం తటస్థించింది. కర్మకాలి ఒక కొంగ అతని తలమీద రెట్టవేసింది. కొంకణుడు కోపంగా తలపైకెత్తి 'ఎంత ధైర్యం' అంటూ ఆ తప్పుచేసిన కొంగవైపు చురచురా చూశాడు. అది అక్కడికక్కడే బూడిదయిపోయింది. కొంకణుడు పరమానందం చెందాడు, తన దివ్యశక్తులకు ఇక్కడ మంచి సాక్ష్యం లభించింది కదా అని.

అలాగే ప్రయాణంచేసి చివరకు మైలాపూరు చేరాడు. తిరువల్లువరు ఇంటిగడప చేరుకున్నాడు. 'భిక్షాం దేహి' అని అరచాడు వాళ్ళ ఆతిథ్య గుణాన్ని పరీక్షించడానికి. ఈకేక విన్నవెంటనే ఆ ఇంటి ఇల్లాలు పరుగెత్తివచ్చి పిడికెడుబియ్యం అతని భిక్షాపాత్రలోకి జారవిడవవలె. అది ధర్మము. కాని వాసుకి వెంటనే రాలేదు. కొంచెం ఆలస్యం చేసింది. ఆమె భర్త భోంచేస్తున్నాడు. ఆమె అతని ప్రక్కన ఉండినది. అందువల్ల ఆయనభోజనమైనంతవరకు రాలేకపోయినది. చివరకు ఆమె వచ్చింది. కొంకణుడు కోపాన్ని అణచుకోలేక ఆమె వైపు తీవ్రంగా చూశాడు. "స్వామీ, నన్ను ఇంకొక కొంగ అనుకొంటిరా ఏమి?" అని ఆమె నవ్వుతూ అన్నది.

కొంకణునికి నోటమాట రాలేదు. "ఔరా! అతి మామూలుగా కనపడే ఈమె, నాల్గు గోడలు దాటిరాని ఈమె, ఎన్నో కోసుల దూరంలో జరిగిన సంఘటన ఎలా తెలు



సుకో గలిగింది?" అనుకున్నాడు. ఆమె గొప్పదనం గ్రహించి మెచ్చుకున్నాడు. "తల్లీ, నా అజ్ఞానాన్ని, పనికిమాలిన కోపాన్ని క్షమించు. నేను తిరువల్లువరుయొక్క వైవాహిక జీవితాన్ని గురించి స్వయంగా తెలుసుకుందామని వచ్చాను. నీ మాటలు విన్నతరువాత ఇంకా తెలుసుకునేందు కేమున్నది తల్లీ" అన్నాడు.

తిరువల్లువరు కొంకణున్ని తన ఇంట కొంతకాలం అతిథిగా ఉండమని కోరాడు. అతడు అక్కడ ఉండగా కొన్ని వింతలు చూశాడు. వాసుకి పెరట్లో బావినుండి నీరు తోడుతున్నది. ఆమె భర్త ఇంట్లో నుండి ఆమెను పిలిచాడు. బిందె ఇంకా పైకిరాలేదు. మధ్యలో ఉన్నది. ఆమె ఏ మాత్రం ఆలో చించకుండా ఆ బిందెను మధ్యలో అలాగే వది లేసి భర్తవద్దకు పరుగెత్తింది. ఏ మాశ్చ ర్యము! ఆ బిందె మధ్యలో అలాగే వాసుకి వచ్చేదాకా వేళ్లాడిఉండటం కొంకణుడు విస్తుపోయి చూశాడు.

ఇంకొకరోజు తిరువల్లువరు చద్దన్నం తింటున్నాడు. అతను భార్యను విసనకర్ర తీసుకువచ్చి విసరమని అడిగాడు. వాసుకి అతని మాటను అక్షరాలా పాటించింది. ఆ అన్నంనుండి ఆవిరులు రావడం ఆశ్చ ర్యంగా చూశాడు కొంకణుడు.

తిరువల్లువరు భోజనసమయంలో భార్యను పళ్లెం ప్రక్కన ఒక శంఖులోతీర్థం, ఒకచిన్నసూది ఉంచమనేవాడు. ఆమె రోజూ అలాగే చేసేది. కాని ఎన్నడూ ఆమె 'ఎందుకు?' అని ప్రశ్నించలేదు. చివరకు ఆమె చివరిరోజుల్లో మరణశయ్యమీద ఉన్నది. ఆమె కళ్ళతో ఏదో ప్రశ్నిస్తున్న ట్లనిపించింది భర్తకు. "ఏమిటో తెలుసుకో వాలనుకుంటున్నావు. ఏమిటది?" అని అడిగాడు. "ఎన్నో ఏళ్ళుగా రోజూ నేను మీ పళ్లెం ప్రక్కన శంఖులో నీళ్ళు, సూది పెడుతూ వచ్చానుకదా. మీరు వాటిని ఉపయోగించుకున్నదే నేను చూళ్ళేదు. ఎందుకలా అడిగే వారో చెబితేగాని నా ఆత్మ శరీరాన్ని వదలటంలేదు" అంది ఆవిడ.

తిరువల్లువరు చిరునవ్వు నవ్వాడు. "ప్రియతమా! ఆహారాన్ని వ్యర్థంచేయటం పాపమని మన శాస్త్రాలు చెప్తాయి. అన్నం వడ్డించే సమయంలో మెతుకులు క్రింద పడితే సూదితో వాటిని గ్రుచ్చి తీసుకుని శంఖులోని నీళ్ళతో శుభ్రంచేసుకుని అన్నంలో కలుపుకోవాలని నా ఉద్దేశము. కాని ఇన్ని ఏండ్లుగా నీవు అన్నం వడ్డిస్తున్నా నీవు ఒక్కరోజైనా అన్నం క్రిందికి చల్ల లేదు. కనుకనే నాకు వాటిని ఉపయోగించే అవకాశం రాలేదు!" అన్నాడు.

ఇష్టానుసారం ఆహారపదార్థాలను పార వేసి వ్యర్థం చేయడం మన యువకుల్లో, విద్యార్థులలో నాగరికతై పోయింది. వాసుకి తిరువల్లువరుల జీవనవిధానంనుండి వాళ్ళు నేర్చుకోవలసిందెంతైనా ఉంది.

పై మాటలు విన్న వాసుకి నిశ్చింతగా కన్నుమూసింది. ఆ సందర్భంలో ఆమె గుణగణాలను ఒక పద్యంలో స్తుతించాడు తిరువల్లువరు. వాసుకి స్త్రీ జాతికే తలమా నికము. తిరువల్లువరు కున్నంత ప్రసిద్ధి ఆమెకు లేకపోయినా అతనికి సహధర్మ చారిణిగా ఆమె జీవితం ఆచరణీయము. దేవుడే ఆమెభర్తగా జన్మించాడు. అతని సేవచేసి ఆమె అమరత్వం పొందింది.

ఆంగ్లమూలం :

**ఎమ్. అరుణాచలం**

## పద్మావతీ శ్రీవివాహం



అలమేలుమంగమ్మ!
హరికి ముద్దులగుమ్మ!
అఖిలజగముల కమ్మ!
ఓ కూనలమ్మా!!

అభయ మిచ్చెడితల్లి!
అచ్యుతుని మరుమల్లి!
ఆర్తులకల్పవల్లి!
ఓ కూనలమ్మా!!

వైకుంఠమును విడిచి
వనిత యిటుయేతెంచె
వైరులకు మదమడచె
ఓ కూనలమ్మా!!

తలచె తనమదిలోన
తల్పశాయిని హరిని
తపము జేసెను గిరిని
ఓ కూనలమ్మా!!

పద్మనాభుని పడతి!
పద్మావతీదేవిసతి!
పాదపద్మములె గతి!
ఓ కూనలమ్మా!!

కలలోన వెంకన్న!
కరుణప్రేమల కన్న!
కలదె వేరొకమిన్న!
ఓ కూనలమ్మా!!

ఆకాశ రాజదుగ
అందాల అల్లుడుగ
అలరించె నామంగ!
ఓ కూనలమ్మా!!

సిరులొందు సప్తగిరి
పురిజేరి విష్ణుదరి
యర్చింతు మనసు నిడి
ఓ కూనలమ్మా!!

— శారదావిశ్వం

(గతసంచిక తరువాయి)

## పదవ అధ్యాయం

### విభూతియోగం

శ్రీభగవానువాచ ;

భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥

శ్రీ భగవానుడు: నా మాటలు విని ఆనందిస్తున్నావు. కనుక నీ శ్రేయస్సుకోరి శ్రేష్ఠమైన వాక్యం మళ్ళీ చెబుతున్నాను విను.

న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥

దేవగణాలకుకాని, మహాఋషులకుకాని నా పుట్టు పూర్వోత్తరాలు తెలియవు. దేవతలకూ, మహర్షులకూ అన్నివిధాల ఆదిపురుషుణ్ణి నేనే కావడం దీనికి కారణం.

# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

యో మామజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥

పుట్టుక, ఆది లేనివాడననీ, సమస్త లోకాలకూ ప్రభువుననీ నన్ను తెలుసుకున్నవాడు మనుషులలో వివేకవంతుడై, పాపాలన్నిటినుంచి విముక్తి పొందుతాడు.

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవ చ॥
అహింసా సమతా తుష్టిః తపో దానం యశోఽయశః।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥

బుద్ధి, జ్ఞానం, మోహంలేకపోవడం, సహనం, సత్యం, బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహం, సుఖం, దుఃఖం, జననం, మరణం, భయం, నిర్భయం, అహింస, సమదృష్టి, సంతుష్టి, తపస్సు, దానం, కీర్తి, అపకీర్తివంటి వివిధ భావాలు ప్రాణులకు వాటివాటి కర్మానుసారం నావల్లనే కలుగుతున్నాయి.

మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవ స్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

సప్తమహర్షులూ, సనకసనందనాది నలుగురు ప్రాచీన మునులూ, మనువులూ నా సంకల్పబలంవల్లనే నా మానస పుత్రులుగా పుట్టారు. వాళ్ళనుంచే ప్రపంచంలోని ఈ ప్రజలంతా జన్మించారు.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాఽత్ర సంశయః॥

నా సృష్టి మహిమనూ, యోగిశక్తినీ యథార్థంగా ఎరిగినవాడికి నిశ్చయంగా నిశ్చలమైన యోగసిద్ధి కలుగుతుంది.



అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః॥

సర్వజగత్తుకూ నేనే మూలకారణమనీ, నావల్లనే సమస్తం నడుస్తున్నదనీ గ్రహించే బుద్ధిమంతులు నన్ను భక్తిభావంతో భజిస్తారు.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ॥

అలాంటిభక్తులు మనసులూ, ప్రాణాలూ నాకే అర్పించి నిరంతరం నన్ను గురించి ఒకళ్లకొకళ్లు చెప్పుకుంటూ సంతోషం, పరమానందం పొందుతారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే॥

నామీదే మనసు నిత్యం నిలిపి ప్రేమపూర్వకంగా నన్ను సేవించేవాళ్ళకు బుద్ధియోగం ప్రసాదిస్తాను. ఆ జ్ఞానంతో వాళ్ళు నన్ను చేరగలుగుతారు.

తేషా మేవానుకంపార్థం అహ మజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

ఆ భక్తులను అనుగ్రహించడం కోసమే నేను వాళ్ళ హృదయాలలోవుండి, అజ్ఞానంవల్ల కలిగినఅంధకారాన్ని, ప్రకాశిస్తున్న జ్ఞానమనే దీపంతో రూపుమాపుతాను.

అర్జున ఉవాచ :

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యం ఆదిదేవ మజం విభుమ్ ॥

ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥

అర్జునుడు: నీవు పరబ్రహ్మవనీ, పరంధాముడవనీ, పరమపవిత్రుడవనీ, శాశ్వతుడవనీ, దివ్యపురుషుడవనీ, ఆది దేవుడవనీ, జన్మలేనివాడవనీ, అంతటా వ్యాపించినవాడవని సకలఋషులూ, దేవర్షిఅయిన నారదుడూ, అసితుడూ, దేవలుడూ, వ్యాసుడూ, చెబుతున్నారు. స్వయంగా నీవూ నాకు అలాగే చెబుతున్నావు.

సర్వ మేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ ! వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥

కేశవా ! నీవు నాకు చెప్పిందంతా సత్యమని నా సంపూర్ణ విశ్వాసం. దేవతలూ, దానవులూ కూడా నీ నిజ స్వరూపం ఎరుగరు.

స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ !
భూతభావన ! భూతేశ ! దేవదేవ ! జగత్పతే ! ॥

పురుషోత్తమా ! నీవు సమస్తభూతాలకూ మూలకారణుడవు; అధిపతివి; దేవతలందరకూ దేవుడవు; జగత్తు కంతటికీ నాథుడవు. నిన్నుగురించి నీవే స్వయంగా తెలుసుకుంటున్నావు.

వక్తుమర్హ స్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

ఏ మహిమలవల్ల నీవు సకలలోకాలలో వ్యాపించి వున్నావో ఆ దివ్యమహిమ లన్నిటిగురించీ చెప్పడానికి నీవే తగినవాడవు.

కథం విద్యామహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు చింత్యోసి భగవన్మయా ॥

యోగీశ్వరా ! నిరంతరం స్మరిస్తూ నిన్నెలా నేను తెలుసుకోవాలి ? ప్రభూ ! నిన్ను ఏ యే భావాలతో నేను ధ్యానించాలి ?

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన !
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

జనార్దనా ! నీ యోగమహిమగురించీ, లీలావిభూతి గురించీ వివరంగా నాకు మళ్లీ చెప్పు. నీ అమృతవాక్యాలను వినేకొద్దీ తనివి తీరడంలేదు.

శ్రీ భగవానువాచ :

హంత ! తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! నా స్త్యంతో విస్తరస్య మే ॥

శ్రీ భగవానుడు: అర్జునా ! నా దివ్యవైభవాలను గురించి అలాగే చెబుతాను. నా విభూతులకు అంతంలేనందువల్ల ముఖ్యమైన వాటినే వివరిస్తాను.

అహమాత్మా గుడాకేశ ! సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥

అర్జునా ! సమస్తజీవుల హృదయాలలో వుండే ఆత్మను నేనే. సర్వభూతాల ఉత్పత్తి, స్థితి, ప్రళయకారణమూ నేనే.

ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచి ర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥

నేను ఆదిత్యులలో విష్ణువును ; జ్యోతులలో కిరణాలు కలిగిన సూర్యుణ్ణి; మరుత్తులనే దేవతలలో మరీచిఅనే వాయువును; నక్షత్రాలలో చంద్రుణ్ణి.

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥

వేదాలలో సామవేదాన్ని; దేవతలలో ఇంద్రుణ్ణి. ఇంద్రియాలలో మనస్సును; భూతాలలో చైతన్యాన్ని నేనే.

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణామహమ్ ॥

నేను ఏకాదశరుద్రులలో శంకరుణ్ణి ! యక్షులలో, రాక్షసులలో కుబేరుణ్ణి ! అష్టవసువులలో అగ్నిని ; పర్వతాలలో మేరువును.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ ! బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥

పార్థా ! పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేనని తెలుసుకో. సేనాధిపతులలో కుమారస్వామిని నేను. సరస్సులలో నేను సముద్రుణ్ణి.

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥

మహర్షులలో నేను భృగువును ! మాటలలో ఓంకారాన్ని ! యజ్ఞాలలో జపయజ్ఞాన్ని ! కదలని పదార్థాలలో హిమాలయ పర్వతాన్ని.

అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥

అన్ని వృక్షాలలో అశ్వత్థవృక్షాన్ని; దేవర్షులలో నారదుణ్ణి; గంధర్వులలో చిత్రరథుణ్ణి; సిద్ధులలో కపిలమునిని.

ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥

గుర్రాలలో అమృతంతో పుట్టిన ఉచ్చైశ్శ్రవాన్ననీ, ఏనుగులలో ఐరావతాన్ననీ, మనుషులలో రాజుననీ నన్ను తెలుసుకో.

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః॥

ఆయుధాలలో నేను వజ్రాయుధాన్ని; ఆవులలో కామధేనువును; సంతానకారణమైన మన్మథుణ్ణి; సర్పాలలో వాసుకిని.

అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।
పితౄణామర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్॥

నాగులలో ఆదిశేషుణ్ణి। జలదేవతలలో వరుణుణ్ణి నేను. పితృదేవతలలో అర్యముణ్ణి; శాసించేవాళ్ళలో యముణ్ణి నేను.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥

నేను రాక్షసులలో ప్రహ్లాదుణ్ణి; లెక్కించే వాళ్ళలో కాలాన్ని; మృగాలలో సింహాన్ని; పక్షులలో గరుత్మంతుణ్ణి.

పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥

పవిత్రం చేసేవాటిలో గాలిని నేను; ఆయుధధారులలో రాముణ్ణి; జలచరాలలో మొసలిని; నదులలో గంగా నదిని.

సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్॥

అర్జునా! సమస్త చరాచరసృష్టికి ఉత్పత్తి, ఉనికి, అంతమూ నేనే. విద్యలలో అధ్యాత్మవిద్యను; వాదించేవాళ్ళలోని వాదాన్ని నేను.

అక్షరాణామకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః॥

అక్షరాలలో 'అ' కారాన్ని నేను; సమాసాలలో ద్వంద్వ సమాసాన్ని; నాశనంలేనికాలాన్ని; అన్ని దిక్కులకూ ముఖాలు కలిగిన బ్రహ్మను.

మృత్యు స్సర్వహర శ్చాహం ఉద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥

సర్వాన్నీ సంహరించే మృత్యువును; కలుగబోయే వస్తువులకు మూలాన్ని: స్త్రీలలోని కీర్తి, సంపద, వాక్కు, జ్ఞాపకశక్తి, మేధ, ధైర్యం, ఓర్పు నేనే.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః॥

నేను సామవేదగానాలలో బృహత్సామాన్ని; ఛందస్సులలో గాయత్రిని; మాసాలలో మార్గశిరాన్ని, ఋతువులలో వసంతాన్ని.

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥

మోసగాళ్ళలో జూదాన్ని నేను; తేజోవంతులలో తేజస్సును; విజేతల విజయాన్ని; కృషిసలిపేవాళ్ళ కృషిని; బలవంతుల బలాన్ని నేను.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః॥

యాదవులలో వాసుదేవుణ్ణి; పాండవులలో అర్జునుణ్ణి నేను; మునులలో వ్యాసుణ్ణి; సూక్ష్మబుద్ధి కలిగినవాళ్ళలో శుక్రాచార్యుణ్ణి.

దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥

దండించేవాళ్ళలో దండనీతిని; జయించ కోరేవాళ్ళ రాజనీతిని; రహస్యాలలో మౌనాన్ని; జ్ఞానవంతులలో జ్ఞానాన్ని నేను.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున।
న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరమ్॥

అర్జునా! సకలభూతాలకూ మూలకారణాన్ని నేను. ఈ చరాచర ప్రపంచంలోని వస్తువులలో ఏదీ నేను లేకుండా లేదు.

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా॥

పరంతపా! నా దివ్యవిభూతులకు అంతం లేదు. అయినప్పటికీ క్లుప్తంగా నీకు నా విస్తారమైన విభూతులను వివరించాను.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్॥

ఈ లోకంలో ఐశ్వర్యవంతమూ, శోభాయుతమూ, ఉత్సాహభరితమూ అయిన ప్రతివస్తువూ నా తేజస్సులోని ఒక అంశంనుంచే కలిగిందని గ్రహించు.

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్॥

అర్జునా! అంతేకాకుండా నా విభూతి వివరాలన్నీ తెలుసుకోవడంవల్ల నీకు ప్రయోజనమేమీ లేదు. ఈ సమస్త జగత్తునూ నాలోని ఒక్క అంశంతోనే నిండి నిబిడీకృతమై వున్నానని మాత్రం తెలుసుకో.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "విభూతియోగం" అనే పదవ అధ్యాయం సమాప్తం.



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-00 గం॥ నుండి 6-30 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-30 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-45 గం॥ వరకు

శుద్ధి — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15 గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లుకు అభిషేకం—ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 11-00 గం॥ నుండి రాత్రి 8-00 గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00

సహస్రనామార్చన: రూ. 6-50

నిత్యఅర్చన: రూ. 150-00 (ఏడాదికి)

అర్చన: రూ. 1-00

హారతి: రూ. 0-50

పూరాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00

ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150-00

తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00

గజవాహనం: రూ. 32-00.

హైందవధర్మంలో దేవాలయ నిర్మాణాలు బౌద్ధులకాలంనుండి విశేషవ్యాప్తిలోకి వచ్చాయని చరిత్రకారులమతం. ఆనాడు దేవాలయాలు పంచాయితీతీర్మానాల కేంద్రము, మరియు అధ్యయనాలయాలుగా ఉపయోగపడుతుండేవట. వాటి చరిత్ర విషయ మటుంచి మన పరంపరలో పాతుకుపోయిన ఈ దేవాలయ వ్యవస్థను గూర్చి ఈనాడు దీర్ఘంగా ఆలోచించవలసి ఉంది.

హైందవజీవితంతో ముడి వేసుకొన్న ఈ దేవాలయాలు జాతికి బదులుగా ఉపయోగపడాలి. హైందవధర్మప్రచార కేంద్రాలుగా మారాలి. దేవాలయాలకు ధర్మప్రచార స్వేచ్ఛ ఉండాలి. ఈ ఆవరణలో ధర్మనిరోధక కార్యక్రమాలు సాగనివ్వరాదు. ఈ వ్యవస్థయొక్క నిర్వాహకులైనవారు ధార్మికజిజ్ఞాసువులై ఉండాలి.

సామాన్యముగా వచ్చు యాత్రికులకు భక్తి ప్రపత్తులతో బాటు అత్యంతాభిమానం అనురాగం యేర్పడేట్లు దేవాలయాలుండాలి. కాని వచ్చే యాత్రికులను పీల్చి విసిగించే వాతావరణం ఉండరాదు. దేవాలయాలు, మఠాలు, పీఠాలు, తమ ఆదాయాలను ధర్మప్రచారానికే వినియోగించాలి. ఈమధ్య కొన్ని దేవాలయాలు ధర్మప్రచారంపేర అనేక గ్రంథాలు ప్రచురిస్తున్నవి. సంతోషించతగినదే. కాని ఈ ప్రచురణల క్రింద అడ్డమైన పుస్తకాలు రాకూడదు. దేశకాల పాత్రమునను సరించి ఆధునిక మానవునికి వైజ్ఞానికంగా ధర్మాన్ని అందించాలి. చదువురాని నిమ్నవర్గాల మధ్య ధర్మప్రచారకులను నియమించాలి. నేడు హైందవ సంక్షేమానికి వలయు సాధనాలుగా గుడులుండాలి.

ఎదగలేని మనుష్యులు సమాజంలో నిరర్థకులు. వారికి ఆహారనిద్రామైథునాలే ఆదర్శాలుగా నిలుస్తాయి. అట్టివారే సమాజాన్ని దోచేస్తారు.

మనదేశంలో కొన్ని సామాజిక వర్గాలవారు తమపిల్లలని కాన్వెంట్లకే పంపుతారు. అక్కడ స్వీయధర్మం, స్వీయసంస్కృతి మరిపింపబడతాయి. ఈలాంటి పిల్లలకేదైనా మార్గం చూపే విధంగా దేవాలయాలు ఆలోచించాలి. దేవాలయాలు బాల సంస్కార కేంద్రాలను విధిగా నిర్వహించేటట్లు చూడాలి. ప్రతి ఆలయానికి ఒక పాఠశాల ఒక గోశాల ఉండాలి. సంస్కృత భాషా ప్రచారకేంద్రాలుగా గుళ్ళు మారాలి.

దేవాలయ ట్రస్టీలుగా సాధువులు, సంతులు, సమాజ సేవకులు, ధార్మికు

# దేవాలయాలు వాటి వినియోగము

"చౌడూరి"

దేవాలయాలను రాజకీయ పాచికలుగా ఉపయోగించరాదు. ఒక దేవాలయపు ఆదాయ వినియోగమునందు ధార్మికదృష్టి చాలా అవసరము. ధార్మికపునరుద్ధరణకే అవి ఉపయోగపడాలి. వ్యక్తినిష్ఠను తెలుపుపద్ధతిపై దేవాలయాలు నిర్మింపబడకూడదు. సామాజిక ఉన్నతికై నిర్మించాలి. హైందవధర్మం ప్రతి ఇల్లు దేవాలయం కావాలని కోరుతుంది. మనదురదృష్టవశాత్తు ప్రతిదేవాలయం ఒక ఇల్లుగా మార్చే వ్యవస్థ పాదుకొంటూంది. హైందవులు భక్తితో దేవాలయాలు సందర్శిస్తున్నారే తప్ప తమ జాతికి కేంద్రాలయిన ఆలయవ్యవస్థను గమనించే తీరికలేదు వారికి. క్రొత్త గుళ్ళు నిర్మించటం కన్నా ఉన్న ఆలయవ్యవస్థను చక్కజేయటం అవసరం. మన దేవాలయాలు నేటి నాగరికుల నాకర్షించు కేంద్రాలుగా ఉండాలి.

మనం ధార్మిక క్లిష్టదశలో ఉన్నాం. స్వరాజ్యంలో హైందవధర్మ నిరసన అధికంగా జరుగుతుంది. వాటిని ఆలయాలు తొలగించాలి. గుళ్ళు ధర్మప్రచారానికనే విషయం మరువరాదు. ప్రజలలో ఆదరణ పెంచి ధర్మం తెలియని, అడుగుననున్న బడుగువర్గాలలో హైందవ ధర్మాభిమానం పెంచాలి. అనేక దేశాలు మన దేశంలోని ప్రజల ధార్మిక అజ్ఞానమును ఆధారముగాగొని తమ మతంలోకి మార్చుకుంటున్నారు. అలాంటిది జరుగకుండా ఆలయనిర్వాహకులు చూడాలి. కావలసిన సదుపాయాలు ఆదాయంనుండి కేటాయించాలి.

దేవాలయనిధులు ఆరాధనకు, మరి హైందవసమాజ ధార్మికావసరానికి ఉపయోగపడాలి. మన దేశంలో విద్యార్థికుల పరిస్థితి హృదయవిదారకంగా ఉంది. వారిలో మత, ధర్మరాహిత్యాలు నానాటికీ పెరుగుతున్నాయి. నైతికంగా ధార్మికంగా

లుండాలి. హైందవధర్మమంటే భయపడేవారు మైనారిటీ ఓట్లకై ఆశపడి హైందవ సంక్షేమానికి తోడ్పడకపోగా ధర్మం సంకటస్థితిలో ఉన్నప్పుడుకూడా సరైన న్యాయం చెప్పలేకపోతే వారి చేతుల్లో దేవాలయాలు భక్షింపబడతాయే తప్ప ధర్మప్రచార కేంద్రాలుగా మారలేవు. అందులకే ప్రభుత్వ రాజకీయవ్యవస్థా ప్రయోజనం కొఱకు దేవాలయాలు సాధనం కాగూడదు.

దేవాలయాల నిర్వహణకు ఒక ప్రభుత్వ శాఖకన్నా ధార్మిక పెద్దల ఆధ్వర్యమున నడుచు స్వయం నిర్ణయ ప్రతిపత్తిగల ధార్మిక సంస్థ అజమాయిషీ కావాలి. దేవాలయ ఆదాయ వ్యయాల వినియోగానికి, ఆస్తుల ఉపయోగానికి హైందవులే ఉండాలి. వారైనా చక్కని ఆస్తికులు ధర్మాభిలాషులై ఉండాలి. దీనివల్ల కొంత దురాచారము తగ్గును.




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

**పథకంలోని ముఖ్యాంశాలు :**

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.

* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)

* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు.

* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్యదాత తనవారితో సహా తిలకించవచ్చును.

* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.

* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో, పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.

* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆయా దాతలకు తెలియచేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.

ఒక సమష్టి వ్యవస్థను, నిధిని నెలకొల్పి ఆయా దేవాలయప్రాంతాలు తమ ప్రాంతంలో ధార్మికప్రచారానికి పూను కోవాలి. ప్రభుత్వ 'సెక్యులర్' సూత్రాలు వాటికి వర్తించకూడదు. అధర్మీయులను విధర్మీయులను తయారుచేయు ఏ సంస్థకు కూడా దేవాలయాలసంపద చేర కూడదు. నిధుల వినియోగమునందు జాగ్రత్త అవసరము. హరిజన గిరిజనాది వర్గాలలో ధర్మప్రచారం, ధర్మరహితులౌ తున్న యువకులలో ధర్మానుభూతి పురోహి తుల నిర్మాణము, పూజారుల, పౌరాణికుల, హరికథకుల శిక్షణా కేంద్రాలు వారిలో సామా జికస్పృహను కల్గించి వారికి తగినంత సహ కార మందించాలి. సంస్కృత విద్య, గోశాలలు, ఆయుర్వేద వైద్యసదుపాయాలు కలిగించాలి.

ధార్మికసాహిత్యము, కరపత్రాలు, గ్రంథాలు, ధార్మికపత్రికలు, నడపాలి.

నడుపు సంస్థలకు సహకార మందించవల యును. ఆధునిక ప్రచార సాధనాలన్నీ సమకూర్చుకొనవలెను. వాటిని సక్రమ ముగా ఉపయోగించవలెను. తిరుపతి దేవాలయమువంటి పెద్దసంస్థలు ధార్మిక రేడియో కేంద్రము నిర్వహించిన బాగుం డును. నేడు రేడియోనిండా క్రైస్తవ ధర్మం వ్యాపింప జేయబడుతున్నది. దాన్ని దేవా లయ నిర్వాహకులు గమనించాలి. ధార్మిక ప్రదర్శనలు, చలనచిత్రాలు చూపించాలి. హైందవసమాజపరిరక్షణకు కావలసిన సదు పాయములు దేవాలయాలు అందించ వలెను.

గొప్ప క్షేత్రములు యాత్రాస్థలములుగా రూపొందవలెను. యాత్రికుల ఆదరణ అభి మానమును చూరగొనగల్గు వాతావరణ



మును కాపాడవలెను. వ్యాపారసరళిని మార్చుకొని ధార్మికభావముతో మలచ వలెను. నెలకొక పర్యాయమైనా ధర్మసభలు జరిపించవలెను. దైవదర్శనము ప్రజల అధికారంగా గుర్తించవలెను. శుల్కముల విధింపుద్వారా వారి అనురాగమును పోగొట్టు కొనరాదు.

దేవాలయ ధర్మాదాయ సంస్థలో అక్రమ వినియోగాన్ని ఆపవలయును. ఈశాఖలో సామాన్యప్రజలకన్నా హైందవధర్మ జిజ్ఞాసువులు ఉండటం ప్రధానంగా అవస రము. దురాచారనిర్మూలన కేర్పడ్డ ఈ సంస్థ దురాచార పోషణ చేయుట విచార కరము. అనుభవజ్ఞులు, విజ్ఞులు ఇందు ఉద్యోగులుగా ఉండాలి. ఆరుశాతం తింటున్న ఈశాఖఉద్యోగులు హైందవ ధర్మాభిమానులై ఉండాలి. ఇందలి చట్ట ములు అక్రమాలను నిరోధించు శక్తిలేనివి. ప్రత్యేకచట్టాలు సామాన్యచట్టమునకు లోబడక సామాన్యచట్టము ప్రత్యేక చట్ట మునకు లోబడి యున్నవి. దేవాలయ ఆదాయమును ఈశాఖలే తింటున్నవి. కాని సంస్థయొక్క ముఖ్యోద్దేశము నెరవేరుట లేదు. ధర్మము, శీలము గల్గిన అధికారి కమీషనర్‌గా ఉండి కౌన్సిల్‌గా వ్యవహ రించు ఒక సంస్థ నిర్మించి, హైందవ ధర్మం తెలిసిన వారినే ఉద్యోగాలలో వేసుకొని యెండోమెంటు శాఖ ఉండవలెను.

మఠమనగా అధ్యయనశాల, పీఠమనగా పద్ధతి నేర్పునది, గుడి యనగా ధర్మపు బడిగా మారిననాడు, హైందవ సమాజం ధార్మికభావనతో దేవాలయాలను పోషి స్తుంది. దేవాలయాల ఉపయోగం కూడా నెరవేరుతుంది.

"ఏడుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా! గోవింద" .... అని ఎలుగెత్తి అరవడమేగాని, అసలు ఏడుకొండల వాడంటే ఏమిటో! ఎప్పుడైనా ఆలోచించావా? .... అన్నారు శ్రీవారు.

ఆలోచించడానికేముంది స్వామీ! సుప్రభాతంలో చెప్పేవుంది గదా!

"శ్రీ శేషశైల గరుడాచల, వేంకటాద్రి
నారాయణాద్రి, వృషభాద్రి వృషాద్రి
ముఖ్యాం
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి"

అన్నాడు రాజయ్య.

'ఈ గుట్టలు, గుట్టలమీద గుళ్ళు నా కిష్ట మనుకున్నావా?'

'తమకు కాకపోతే మా తల్లికి కావచ్చు'

నీతో పూర్తిగా ఏకీభవించలేను గానీ, నీ మాటలో కొంత సత్యం లేకపోలేదు. మీ క్షీర సముద్రరాజతనయ, పాలూ, మీగడ, వెన్నే అల్పాహారంగా, ఆహారంగా లాగించేసి ఈ మధ్య మరీవిపరీతంగా ఒళ్ళు చేసిందోయ్. వైకుంఠంలోఅంటే హిమానీశీతల మందిరాలున్నై. కానీ భూలోకంలో ఉండవలసి వచ్చేటప్పటికి, ఎండకు తట్టుకోలేను. ఈ గుళ్ళలో ఒకటేఉక్క. గాలి వచ్చేందుకు కిటికీలు గూడ ఉండవుగదా పాపం! .... అందువల్ల కొండలమీదైతే కొంచెం చల్లగా వుంటుంది. అక్కడ వుందామండీ అంటుంది. మీ గుండుతల్లి (గుండుతల్లి=శూన్యాకృతి=మాయాదేవి) కోసం కొండలమీద ఉండక తప్పడం లేదు.

అప్పటికీ మా చెల్లెమ్మ చూడు. ఒళ్ళు పెరగకుండా, తరగకుండా, ఎంత జాగ్రత్తగా రూపం కాపాడుకుంటుందో .... కాస్త తిండి తగ్గించు అని చెబుతూనే ఉంటా మీ తస్కుతల్లికి (తస్కుతల్లి = జడమూర్తి; ప్రకృతి) .... వింటేనా!"

మీ రిలా గుండూ, తస్కూ అంటూంటేనే మా అమ్మ అలిగి అలమేలుమంగాపురం వెళ్ళిపోయి వుంటుంది-అన్నాడు రాజయ్య.

రాజయ్యా! నువ్వు జోడేనుగుల జెండా వాడివేగాని, మాగ్రద్ద జెండా వాడివి కాదయ్యా తెలిపోయింది ........ అన్నారు శ్రీవారు.

'ఏడుకొండల విషయమే తేలలేదు'

'అయితే తేల్చు మరి –'

'నాకు తెలిసింది చెప్పేశానుగదా స్వామీ'

'కొంచెం ఆధ్యాత్మికంగా ఆలోచించు'

రాజయ్య బుర్ర పనిచేయడంలేదని తేలిపోయింది. వెంకన్నదొరవారే చెప్పుకుంటూ వెళ్లారు –

'నేనుండేది, ఏడో కొండమీద – మిగతా ఆరుకొండ లేమిటి?'

రాజయ్య వింటున్నట్టు తలవంకించాడు.

'జీవి యోగికావాలంటే, ముందు వేటిని జయించాలి!"

"అరిషడ్వర్గాన్ని"

అవే ఆరుకొండలు రాజయ్యా! వీటిని దాటడం అంటే, అరిషడ్వర్గాన్ని జయించడం అన్నమాటే" .... అన్నారు శ్రీవారు –

"ఈ ఆరుకొండలలో, మొదటి కొండే చాలా ఎత్తైనకొండ. ఆ కొండ ఎక్కేసరికి గుండె అవిసిపోతై స్వామీ"

అరిషడ్వర్గంలో మొదటిది కామం. ఆ కామాన్ని జయించామనుకుంటూ, కాలుజారి నడుం విరిగిన మహర్షు లెందరో వున్నారు. పరమయోగియైన పరమేశునికే కాముని దెబ్బకు కన్ను చెదిరి మనసు వికలమైంది. కామం అంటే కేవలం లైంగికమే గాదు. కోరిక ఏదైనా కామమే. కనుకనే కామాన్ని జయించడం కష్టం. మొదటికొండ ఎక్కడం కష్టం. కామం అనేది గుండెకు సంబంధించింది. అందువల్లే ఈ కొండ ఎక్కాలంటే గుండె బరువెక్కుతుంది. కొందరు గుండె పట్టుకొని మధ్యలో కూలబడడం గూడ జరుగుతూ ఉంటుంది అన్నారు శ్రీవారు. "మొదటి కొండ ఎక్కితే తర్వాత మూడు కొండలూ సులభం" అన్నాడు కొండకు నడిచి వెళ్ళి వచ్చిన రాజయ్య —

"అంతేగా మరి – అవతలివాడు నీ వస్తువేదో కాజేశాడు. నీ కన్యాయమో, అవమానమో జరిగింది — అన్నప్పుడు కోపం వస్తుంది, క్రోధం పెరుగుతుంది. కాని మనిషిలో కోరిక నశించినతర్వాత, కొంత శాంతం, సహనం అవే అలవడతై. అప్పుడు క్రోధం దానంతటదే అణగారి పోతూ ఉంటుంది. అలవాటైన కొద్దీ (ముందుకు పోయిన కొద్దీ) ........ అలాగే మనపని గ్రహించడం అలవాటైనకొద్దీ ఒక వస్తువు మీద ప్రలోభంగానీ, వ్యామోహంగానీ, అదే సమసిపోతుంది. కొన్నాళ్ళకు పూర్తిగా మాయమైపోతై. అందువల్లే, క్రోధం, లోభం, మోహం అధిగమించడం కొంత తేలిక అవుతుంది. ముందు కోరికను జయించగలిగితే ........

"ఐదవకొండ, మొదటి కొండంత కష్టం కాకపోయినా, మొత్తానికి కష్టమే" అన్నాడు రాజయ్య —

ఇది మదానికి మారుగా నిలిచిన కొండ-మదాలు ఎనిమిదిరకాలు – అన్నమదం అర్థమదం, స్త్రీమదం, విద్యామదం, కులమదం, రూపమదం, ఉద్యోగమదం, యౌవనమదం-ఈ కొండఎక్కేసరికి మోకాళ్ళ జవసత్వాలు తగ్గిపోతై. స్వామీ ఎక్కడున్నావ్ అంటుంది మనసు ....

"శరీరంలో మదం ఉడిగిపోయి, నా కంటే శ్రీమంతుడు, విద్యావంతుడు వగైరా వగైరా లేడన్న అహంకారం చచ్చిన తర్వాత మాత్సర్యమనే ఆరోకొండను సులభంగా ఎక్కగలుగుతాడు. ఏడోకొండకు, తేలికగా చేరగలుగుతాడు" అన్నారు శ్రీవారు.

"మనసు నిగ్రహించి అహంకారాన్ని జయించినవాడికి బుద్ధి కుదురుకుంటుంది. చిత్తానికి ఏకాగ్రత వస్తుంది. ఆ తర్వాత అంతా తపస్సు-సాధనే.... వేమన చెప్పినట్లు

"తన్నెరింగెనేని నిన్ను తా మరచును
నిన్నెరింగెనేని తన్ను మరచు
నిన్ను తన్నెరింగి, నిఖిలంబు మరచురా
విశ్వదాభిరామ వినురవేమ"

అన్నాడు రాజయ్య –

శ్రీవారు నవ్వుతూ ఏడుకొండలవాడా, వెంకటరమణా తర్వాత, గోవిందా గోవింద" ఎందుకూ అన్నారు ........



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

శ్రీ అన్నమాచార్య ప్రాజెక్టు సమర్పణ

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనలు

(ప్రీరికార్డెడ్ కేసెట్లు - రెండుసెట్లు)

ప్రముఖ గాయకులు శ్రీ పి. బి. శ్రీనివాస్, శ్రీ జి. బాలకృష్ణప్రసాద్, శ్రీమతి ఎస్. జానకి, కుమారి ఎస్. పి. శైలజగార్ల మధురమనోజ్ఞ సంగీత రసధుని

## శ్రీ వేంకటేశ్వర గీతమాలిక (మూడుసెట్లు)

కుమారి ఆర్. జి. శోభారాజు, శ్రీ జి. బాలకృష్ణప్రసాదుల గీతికాగుచ్ఛం.

**శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుగారి భక్తిభావస్ఫోరక వ్యాఖ్యానంతో**

మచ్చుకి ఇదిగో ఈ పాటను చూడండి.

పాపపుణ్యముల పక్వమిదెఱుగను
నాపాలిటి హరి నమో నమో
మానసవాచక మతకర్మంబుల
కానకముగ నీ దాసుడను
పూని త్రిసంధ్యల భోగభాగ్యముల
హానాగతులను నమోనమో
వలనుగా జాగ్రత్స్వప్న సుషుప్తుల
ఇలలో నీకే హితభటుడ
వెలుపల లోపల వేళావేళల
వలివాక్ష నీకె నమోనమో
పుట్టుక తొలితను పుట్టినమీదట
అట్టె నీ శరణాగతుడ
గట్టిగ శ్రీ వేంకటపతి నీ కృప
పట్టపడమైతి నమో నమో.

## వ్యాఖ్యానం

ఏది పాపమో, ఏది పుణ్యమో నాకు తెలియదు. వీని పర్యవసానాన్ని కూడా నేను తెలుసుకోలేను. నాకు బుద్ధి వచ్చినప్పటి నుంచి తెలిసింది ఒక్కటే! నీవు నాపాలిట వేల్పువు.

ఇది సమయం, ఇది అసమయం అనే జ్ఞానం లేదు. నీ దివ్యనామాన్ని స్మరించడమే నాకు తెలుసు. జనన మాదిగా నేను శరణువేడి నీ చరణాల వద్ద పడివున్నవాడిని; నీవాడిని. నన్ను కడదాకా, కాపాడే బాధ్యత నీదే.

అన్నీ ఇలాంటి అలౌకికానుభూతిని కలిగించే పాటలే—

తిరుమల తిరుపతి దేవస్థానం సమాచార కేంద్రాలలో సరసమైన రేట్లకు పై కేసెట్లు దొరుకుతున్నాయి. త్వరపడండి. ఈ అవకాశాన్ని జారవిడుచుకోకండి.

వీనుల విందుగా మీరే వినిపించండి అన్నాడు రాజయ్య.

గోవిందుడు, గోకులానందంగా చేసిన కొన్ని వధలక్కూడ ఇదే అర్థం గనుక అని స్వామి చెబుతుంటే రాజయ్య ఆశ్చర్య పోతున్నాడు —

"బాలకృష్ణుని లీలలో ఆరువధలువస్తై పూతన, శకటాసురుడు, తృణావర్త, వత్స, బకాసురులు, అఘాసురుడు ...."

'ధేనుకాసురుడు, అలంబాసురుడు' —

'వాళ్ళను చంపింది బలరాముడుగదా' అవునని నాలిక కొరుక్కున్నాడు రాజయ్య-

"ఆ ఆరువధలు అరిషడ్వర్గాన్ని జయించ మనడానికి ఆరుపెట్టకథలు" —

'కాస్తవిశదంగా సెలవివ్వండి' అన్నాడు రాజయ్య

మొదటిది కామం - కామానికి స్త్రీ .... అదే పూతన ........ అందమైన ఆడదానిలా వచ్చింది. విషమలదిన చనుమొనలతో పాలిస్తానంది. పైకి చూడటానికి కోరిక మనోహరంగానే ఉంటుంది. దాని ఫలితం విషం — దాని నిజస్వరూపం, భయంకర రాకాసిరూపం. కనుకనే, వాంఛను అంతం చేసి, జయించమన్నాడు బాలకృష్ణుడు —

రెండోది క్రోధం — నువ్వొకటంటే, తానొకటంటే మాటకుమాట, వేటుకు వేటుగా క్రోధం పెరుగుతూనే వుంటుంది- ఒక విషవలయంలాగా బండిచక్రంలాగా, దానిసంకేతమే శకటాసురుడు. ఆ క్రోధాన్ని ఓడించి, తన్ని, దూరం చేసుకోమన్నాడు బాలకృష్ణుడు —

మూడోది లోభం! ఇది ఒక సుడిగాలి లాటిది. దానికి లొంగిపోతే, ఆ గాలిలో కొట్టుకుపోయి, ఎక్కడ తేలుతాడో చెప్పలేము. అందువల్ల దానిగొంతునొక్కి బైటపడ మన్నాడు బాలగోపాలుడు. లోభానికి సంకేతం తృణావర్తుడు. నాలుగోది మోహం! దానికి సంకేతం వత్సాసురుడు- మురిపించే లేగదూడలాగా వచ్చాడు, చిన్ని కృష్ణుని మభ్యపెట్టి అంతం చెయ్యాలను కున్నాడు. మాయాతీతుడైన యశోదాకిశో రుడు, మాయను కనిపెట్టి, వాడినే అంతం చేశాడు - మోహానికి దాసుడివి కాకూడదని మనకు గుణపాఠం చెబుతూ. —

ఐదోది - మదం - మదానికి, కన్నూ మిన్నూ తెలియదు. మంచీ చెడూ కురి పిస్తుంది. బలాబలాలు గ్రహించదు. అందు వల్లే బకాసురుడు కృష్ణునిమింగి, కడుపులో ఇముడ్చుకోలేక కక్కేశాడు. ఆ మదపు తెరలు చీల్చి వెయ్యాలంటూ. బకునినోరు చీల్చివేశాడు చిన్నికన్నయ్య —

ఆరోది - మాత్సర్యం - దానికి గురుతు, అఘాసురుడు. తన అన్న బకాసురుని చంపాడన్న మాత్సర్యంతో వచ్చి కొండ చిలువయై గోపాలబాలురను, గోపాల కృష్ణునికూడా మింగేశాడు. కృష్ణుడు శరీరం పెంచి, అతని గొంతుక్కడ్డంపడి ఊపి రాడనీకుండా చేశాడు. అలా రోషాన్ని ద్వేషాన్ని అంతం చేశాడు గోవిందుడు. గోవిందుడు చేసిన ఈ ఆరువధలు అరిషడ్వ ర్గాన్ని జయించమని, ఆరుపెట్టకథలను, వీటి తర్వాతవచ్చే కాళీయమర్దనలో యోగం ప్రారంభమౌతుంది. గోపికావస్త్రాపహరణం శరణాగతి చెబుతుంది. ఆ తర్వాత వచ్చేది ఆత్మార్పణ చేసిన గోపికల అన్వేషణ. భక్తి యోగంలో, మధురభావన! ఆ పిదపవచ్చే రాసలీల, మోక్షానందప్రాప్తి - సర్వేశ్వరుని సామీప్యం, సాయుజ్యం వగైరా .... ఇలా అమాయకులు, అజ్ఞానులైన ఆభీరులకు భక్తి మార్గం, యోగం ఉపదేశించిన గోవిందుడు అక్రూరునితో మధురానగరానికి వెళ్లాడు. తరువాతిభాగోతం (భాగవతం) నడవ డానికి .... తెలిసిందా అన్నారు శ్రీవారు -

"భాగవతంలో, బాలగోవిందుడు చేసిన కొన్ని వధలకు, శ్రీవారి తిరుమల పాద యాత్రకు అంతరార్థం, పరమార్థం, అరి షడ్వర్గాన్ని జయించడమే అన్నమాట. అందువల్లే, ఏడుకొండలవాడా, వెంకట రమణా గోవిందా, గోవిందా తెలిసింది స్వామీ అంటూ నమస్కరిస్తూ రాజయ్య తలవంచాడు - చాలాకాలంగా ఆతలను ఒక సందేహం తొలుస్తోంది! ఇలా ఏడుకొండల వాడా........గోవిందా! అనుకుంటూ వెళ్ళిన భక్తులు, శ్రీవారి దర్శనంచేసి రావచ్చు గదా! ఏ మొక్కులు, ముడుపులూ లేని వారుకూడా హుండీలో వడ్డీకాసులని, పిడికెడురూకలని, వేస్తుంటారే ఎందుకు? ఈ ప్రశ్న ఒక పెద్దమనిషి నడిగితే అతను చెప్పిందేమిటంటే ........

మనం రష్యాకో, అమెరికాకో వెళ్లాలి అనుకోండి. ముందు 'వీసా' కావాలి. తరవాత టిక్కెట్టు! మనదేశపు డబ్బులు, ఆదేశంలో చెల్లవు గనుక, ఇక్కడ మన డబ్బు కట్టి, ఆ దేశపు డబ్బులు పుచ్చుకోవాలి. అలాగే ఏ భక్తుడికైనా అతని పుణ్యవిశేషం వల్ల వైకుంఠప్రాప్తి లభిస్తే, భక్తుడి పుణ్య ఫలం అయిపోయేవరకూ అక్కడ వుండ డానికి ఇల్లూ, తిళ్లూ తిప్పలూ, నీళ్లూ నిప్పులూ ఎలా?

తిరుమల భూలోకవైకుంఠం అన్నారు. అంటే. "అలవైకుంఠపురంబు" గూడా ఇదే నమూనాలో వుంటుంది. పద్మావతీగెస్టు హౌస్ మొదలు ధర్మసత్రాల వరకూ, వసతి గృహాలుంటై. వారివారి అర్హత, అంతస్తును బట్టి, వసతిగృహం, సాదం, ప్రసాదం, అన్ని సేవలకూ, ఏర్పాట్లు జరుగుతూ ఉంటై అని భావించవచ్చు - అందుకు సాధనం - ధనం అనే వడ్డీ కాసులు.

మనం శ్రీవారి హుండీలో ఒక కాసువేస్తే G. P. F. పద్ధతిలో శ్రీవారు మరోకాసువేసి, కల్పతరు డిపాజిట్ పద్ధతిలో వడ్డీ కడుతూ, వైకుంఠంలో శ్రీనివాసధనాగారంలో ఉంచుతారు. భక్తుడి పాసుపోర్టుసైజు ఫోటోతో సహా ఒకపాసుబుక్కు ఉంటుంది. భక్తుడు వైకుంఠం వెళ్ళగానే, అక్కడికివెళ్ళి ఆ డబ్బు తీసుకొని వాడుకోవచ్చు. వ్యాపారం చేసుకోవచ్చు. శ్రీవారి డబ్బు అక్కడే ఖర్చుపెట్టిరావాలి అనటం వైకుంఠం డబ్బు అక్కడే వదిలేసి రావాలి.

శ్రీవారు వడ్డీవేసి ఇచ్చేకాసులు గనుక, వీటి పేరువడ్డీకాసులు అన్నారట! మనం పిడికిటవేస్తే, శ్రీవారు రెండు పిడికిళ్లతో ఇచ్చేవి పిడికెడురూకలు. ఈ విషయం శ్రీవారినే, నేరుగా అడుగుదామను కున్నాడు రాజయ్య - తలఎత్తి 'స్వామీ' అన్నాడు.

ఇంకా ఎక్కడిస్వామి! ఎప్పుడో వెళ్ళి పోయిన శ్రీవారు ఏడోకొండమీద ఏకాంత సేవ చేయించుకుంటున్నారు.

# వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

## దేశాటనం

"యస్తు పర్యటతే దేశాన్
యస్తు సేవేత పండితాన్
తస్య విస్తారితా బుద్ధిః
తైలబిందురివాంభసి"॥

"ఎవడైతే వివిధదేశాలు పర్యటిస్తాడో, ఎవడు పండితులను సేవిస్తాడో అతని బుద్ధి, నీటిమీది తైలబిందువువలె విస్తరిస్తుంది"– అని పై శ్లోకానికి తాత్పర్యం.

విజ్ఞానవికాసానికీ – దేశాటనకీగల అవినాభావసంబంధం గుర్తించింది ప్రాచీన భారతీయ మేధావులు మాత్రమేగాదు. వివిధ దేశపర్యటన – విద్యాభ్యాసంలో అపరిహార్యమైన, ప్రధానంగా పాశ్చాత్యులు గూడ గ్రహించారు. ఇంగ్లాండులో పట్టభద్రులు స్నాతకోత్సవానికి ముందు యూరోపు పర్యటన చేయాలనే నిబంధన, అచటి విశ్వకళాపరిషత్తులు అన్నీ ప్రాచీన కాలంలో అనుశాసించాయి.

భారతదేశంలో తీర్థయాత్రలకు ప్రాచీనులు కల్పించిన ప్రాముఖ్యం జగద్విదితం. నేటికిగూడ గంగాతీర్థం తీసుకొనివచ్చి కన్యాకుమారివద్ద త్రిసముద్రసంగమంలో కలిపేవారు చాలమంది ఉన్నారు. భారతదేశములో నదీపుష్కరాలు దేశాటనానికి కల్పించే ప్రోత్సాహం పేర్కొనదగింది. ప్రతి సంవత్సరం భారతదేశంలో ఏదో ఒక నదికి "పుష్కరం"తిరునాళ్ల వేడుక జరుగుతుంది ఇది ద్వాదశవత్సరవలయం. జ్యోతిశ్చక్రంలోని మేషాది పంద్రెండు రాశులలో గురుసంచారం బట్టి ఆ యా సంవత్సరాలలో ఆ యా నదులకు పుష్కరాలు నిర్ణయింప బడ్డాయి. శనిచారంబట్టి – కుంభమేళా – అనగా శని కుంభరాశిలోకి వచ్చినప్పుడు కుంభమేళా జరుగుతుంది. అప్పుడు గంగానదిలో లక్షోపలక్షల జనులు స్నానం చేస్తారు! భారతదేశంలో పుణ్యక్షేత్రాలు అటు ఉత్తరాన – బదరీనాథం – మానససరోవర్‌నుండీ ఇటు దక్షిణాన కన్యాకుమారి వరకు – ఉన్నాయి. దివ్యక్షేత్ర సందర్శనంవల్ల పవిత్రతీర్థస్నానాలవల్ల పుణ్యసముపార్జన మాట అటుంచి – అంతర్లీనంగా మరో ప్రయోజనం ఉంది. అదిలోకజ్ఞాన సంపాదన.

లోకజ్ఞాన సముపార్జన పుస్తకాలు చదవటం వల్ల రాదు. ఉన్న ఊరు ఎల్లలు దాటి బయటకు వెళ్లనివాడు కూపస్థమండూకమే. ఎన్ని గ్రంథాలు చదివినా, లోకజ్ఞానం అలవడక పోవచ్చు. అంతేగాదు. గ్రంథైక పరిజ్ఞానం లోకజ్ఞానం అనులోమ నిష్పత్తిలో ఉంటుందని పరిశోధనలు జరిపి తేల్చిన అధునాతన మానసిక వేత్తలు కొంద రున్నారు. ప్రాచీన భారతదేశంలో కూడ వేదవేదాంగ పారంగతులైన పండిత ప్రకాండులను "వేదాభ్యాస జడులు"– అని హేళన చేసినట్టివారు లేకపోలేదు.

దేశాటనం చేసినవాని మానసిక దిగ్లేఖావలయం (Intellectual horizon) విస్తరించటం సహజం.

'A foreign country is a contemporaneous posterity' — విదేశీ పర్యటన అంటే వర్తమానకాలంలోనే భవిష్యత్తుతో పరిచయం పెంపొందించుకోటం అన్నాడు. ఒక ఆంగ్లవిద్వాంసుడు. రవి అస్తమించని సామ్రాజ్యం నిర్మించుకోగల రక్షిత ఆంగ్లేయులకు వివిధ దేశపర్యటనవల్ల సిద్ధించింది అని భావించే మేధావులు పలువురు ఉన్నారు.

చదువువలన వచ్చు జ్ఞానమ్ము సరిపోదు;
వాస్తవాలు చూడవలయు తిరిగి;
తెలివి-అధికమౌను దేశాటనమువల్ల
సానపెట్టబడును మానసమ్ము.

అయితే – దేశాటనం చేసేవారికి రెండు కన్నులు చాలవు. కొందరు ఒడలెల్ల కన్నులు చేసుకొని పరిసరాలను పరికించి పరిశీలించేవారు ఉంటారు. కొందరు–తీర్థయాత్రలు చేసి ఊళ్ళన్నీ తిరిగి జేబులు ఖాళీ చేసుకొని – మెదడు కూడా ఖాళీ చేసుకొని ఇంటికి తిరిగి వస్తారు.

పూర్తి చేయవచ్చు – భూప్రదక్షిణమైన
చుట్టుపట్టు సుంత చూడకుండ
పోయివచ్చుగాక – పోస్టుపార్సిలువోలె!
గానుగెద్దు నయము వానికంటె!!

దేశాటనం చేసేవానికి అవశ్యం ఉండవలసినది విప్పారిన మనోనేత్రం. మేధావి తన మనోనేత్రం విప్పితే – ప్రకృతి అతనికి పారదర్శకంగా కన్పిస్తుంది. ఎదుగుచున్న సృష్టి ఎల్లలు అన్నింటినీ నరుని ఆలోచనాశక్తి అధిగమిస్తుంది.

చీనాభాషలో ఒక అర్థవంతమైన సామెత ఉంది "మీ బిడ్డలపై మీకు నిజమైన అభిమానం ఉంటే – వారిని ఇంటినుండి దూరంగా ఇతర ప్రదేశాలకు యాత్రలు చేసి రమ్మని పంపించండి."

సర్వసాధారణంగా – విదేశాలకు వెళ్ళినప్పుడు – భారతీయులు అచటి స్వదేశీయులు నివసించే ప్రాంతాలలోనే విడిది చేయటం – స్వభాషీయులతోనే కాలం గడపటం చేస్తారు. తెలుగువారు ఋషీకేశం వెడితే ఆంధ్రాశ్రమంలోనే దిగితే – భాషా సౌకర్యం ఉండేమాట నిజమేగాని–నిజంగా దేశాటనంవల్ల సంక్రమించే విజ్ఞానవికాసం అలవడదు అని వేరే చెప్పనక్కరలేదు.

పుష్పాలు – పరపరాగ సంపర్కంవల్ల ఫలప్రదమౌతాయని వృక్షశాస్త్రం చెప్తుతుంది.

వివిధ మానవనాగరకతలు కూడ సాంస్కృతిక పరపరాగ సమ్మేళనం వలన అభ్యుదయం సాధిస్తాయి.

భావుకోత్తమునకు – పరదేశయాత్రలో
కానుపించు – "వర్తమాన భావి"
వెడలి – ఒక త్రికాల వేదియైరావచ్చు
క్రొత్తయెల్ల లెదుగు గుండెతోడ.



# సేరేవజనాః.....

వార్తాపత్రికల్లో రోజూ చూస్తూన్నాము. ఈ సమాజములోని దుమారము. స్త్రీలను చెఱపట్టడం, చోరీలు, కూనీలు, దౌర్జన్యములు నానాటికి మితిమీరిపోవుచున్నవి. సినిమా ప్రదర్శనలోను యీ సన్నివేశాలు తప్పడములేదు. ఎచ్చటనో ఏదో ఒక కారణముచే ఒక అబల బలికావడం పరిపాటి అయిపోయినది. ఈ అధునాతనయుగంలోను మనమెంత పురోగమించినా, నారీలోకమునకు భద్రత, ప్రాధాన్యత, గౌరవము సమాజములో లేనినాడు అది భారతదేశ సంస్కృతి అనిపించుకోదు. సనాతనముగా వచ్చుచున్న పాతివ్రత్యమునకు మనదేశము విశిష స్థానములోవున్నది. అలాంటి దేశములో యిన్ని ఘంఘదురన్యాయములు జరుగుతున్నవి. రావణుడు అంతరించినప్పటికిని రాక్షసగుణములు నశింపకున్నవి. దీనికంతటికి బాధ్యులెవరు ? అన్న ప్రశ్నకు మనము, మన ప్రభుత్వమే. పరిపాలనా యంత్రాంగములో ప్రభుత్వము గురుతర బాధ్యత వహించవలసియున్నది. గొప్పవారు యే కర్మను జేయుదురో తక్కినవారు వాటినే ప్రమాణముగా గైకొందురు. "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః" అను గీతాప్రమాణమున్నది. కారణములనేకములుండవచ్చు. ఆర్థికదుస్థితి, పరిసరప్రభావములు, సహవాసదోషములు, దుర్గుణములచే వచ్చు యలవాట్లు,మితిమీరి జేయుఖర్చులు మానవులను తప్పుడుమార్గములకు దారితీయుచున్నది. "ఈహంతే కామభోగార్థం అన్యాయే నార్థ సంచయాన్." అక్రమమార్గ సంపాదనకు కారణము మన కోరికలే. అవి అదుపులో లేనపుడు మనము వంచన మార్గములకు పాల్పడవలసినదే. అపుడు మనలో నీతి నిజాయితి నశిస్తుంది. చేసేపనులలో స్వాతంత్ర్యమును గోల్పోతాము. స్వార్థ చింతనతో అన్యాయము జేయవలసివచ్చును. ఎవరైనను తన విధి నిర్వహణకు సక్రమముగా జేయనిచో అతను సమాజమునకు చీడపురుగే. ఒకరినుండి అక్రమముగా సొమ్ము పుచ్చుకొనుటలో అనేక అనర్థములకు పాల్పడవలసియున్నది. తెలియక జేసిన పాపపుపనికి శిక్ష అనుభవించవలసి వచ్చినపుడు తెలిసి చేయు తప్పులకు యిక తిరుగులేదు. పసితనంలో తాను తూనీగలు పట్టి వాటి తోకలు త్రుంచి, పొరకపుల్లలు యెక్కించి వదలినందుకు మాండవ్య మహామునికే దండన తప్పలేదు.

తెలియకజేసిన పాపకార్యములకు శిక్ష అనుభవించినపుడు, తెలిసి తప్పుజేసిన పనికి శిక్ష తప్పునా ?

అటు ప్రభుత్వమునకు యిటు ప్రజలకు సేవజేయవలసిన ఉద్యోగి అన్యాయార్జితమునకు పాల్పడిన తను జేయుపనులలో సమగ్రత లేక అసమర్థుడు కాగలడు. తానాశించిన పైకము రాకుండిన దిగాలుగా వుంటాడు. పైసాలకోసం ఆశపడి పనిజేస్తే విధి నిర్వహణలో జాప్యములు, అన్యాయములు, అవకతవకలకు కారణములు కాజాలవు, ఇలాంటి దుర్బుద్ధులవల్ల వివేకము నశించి పైబడి కసరుతారు. పైశాచికముగా దోచుకొనడము, పీడించడము మానవుని శ్రేయస్సుకు భంగము వాటిల్లగలదు. ఎదుటివారి మనస్సు నొప్పించి వారిచ్చు డబ్బుతోబాటు వారి పాపఫలితమును మూటగట్టుకొనవలసినదే. ఇట్టి పాపఫలసముదాయమ్మే మనకు యేదో ఒక రీతిగ కీడు సంభవించును. అందుకే అట్టి అర్థం అనర్థం అంటారు శ్రీ ఆదిశంకరాచార్యులు. ఈ పాపఫలితము తన వరకేగాదు తన పిల్లలకు భార్యకు, కుటుంబసభ్యులందరికి సంక్రమిస్తుంది.

అయినపుడు అడుసుత్రొక్కనేల ? కాలు కడగనేల? నీతినిజాయితిగ బ్రతుకవచ్చును గదా ? అది సాధ్యమా ? అని అనుకొనవచ్చు. పట్టుదలతో సాధించని కార్యము లేదుగదా ? దురభ్యాసములున్నచో క్రమేణ మాన్పుటకు ప్రయత్నించి వాటికి స్వస్తి చెప్పవచ్చును. మానవులకు అట్టి వివేకమున్నది. ఈ నైజము లేనపుడు మానవుడు పశువు ఒకటే. కాని జంతుజాలములో సయితము అట్టి మార్పులు కన్పించినపుడు మనమాశ్చర్యపడవలసినదే. పవిత్రప్రదేశమైన శృంగేరి మఠములో నదిగట్టున ఒక విగ్రహమున్నది. పాము పడగవిప్పి నిండుగర్భిణియైన ఒక కప్పకు ఆశ్రయమిచ్చినటుల యున్నది. కప్ప సహజఆహారమైనప్పటికి, కాపాడు గుణము పాముకు కల్గినపుడు మానవులమై యుండి మన దుర్గుణములు మానలేమా ? నాలో నేను తర్కించుకొంటి ఓ మానవా ! నీవు మారవా ? అని.

శ్రీ పతంజలి యోగసూత్రములో 'అపరిగ్రహము' అనునది మానవుని నియమములలో నుంచుటకు తోడ్పడగలదు. కాని అక్రమ సంపాదనకు అలవాటయి అర్రులు చాచునపుడు ఈ సూత్రము దోషపూరితముగ వుంటుంది. తొలుతలో ఎవరైన యిచ్చినదానితో తృప్తిపడి, బలవంతముగా ఎవరిని పీడించకూడదనుకొంటిని. కాని నిజాయితి నాలో కానరాలేదు. ఇవ్వనివారిని యేమి అడుగకపోయి నప్పటికిని వారిపై యీర్ష్య కలిగేది. ఏదో ఒకవంక బెట్టి వారికి జేయవలసిన కార్యము జేయక యిబ్బంది కలుగజేయవలెనని దుర్బుద్ధి పుట్టుచుండును. అందుకని ఆ పద్ధతికి గూడ స్వస్తి చెప్పి పూర్తిగ డబ్బుతీయడము మాని వేయాలని కృతనిశ్చయమునకు వచ్చితిని. అపుడుగాని నేను నా విధి నిర్వహణలో నీతి నిజాతీగ పనిజేయలేక పోతిని. ఇపుడు అందరు

[47 వ పేజీలో]

# ఆళ్వారులు - నాలాయిర దివ్యప్రబంధము

— డా॥ సి. రమణయ్య

అలపన్నిద్దరు సూరులందును
సముద్యల్లీలగానున్న బె
గ్గలికందావము బాపనా నిజమనః
కంజాత సంజాతపు
ష్కల మాధ్వీకఝురిన్ మురారి
సొగియంగాజొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దరు సూరులం దలతు
మోక్షేచ్ఛామతిం దివ్యులన్
"(ఆము. మాల్య)".

శ్రీ సూర్యనారాయణుడు తన అప్రతిమ ప్రకాశముచే అంధకారము పోగొట్టుటచేతనే లోకవ్యవహారములు నిర్విఘ్నముగ సాగుచున్నవి. అట్టిసూర్యులు పన్నిద్దరు. ద్వాదశ సూర్యుల ఆతావ తీవ్రతను తగ్గించుటకై ఇలపై ఈ దివ్యసూరులు అవతరించిరి. వారే పన్నిద్దరాళ్వారులు. తమ హృదయ పంకజముల నుండి నిసర్గ సుందరముగా వెలువడిన మధుర మధుప్రవాహముచే మురారిని సొక్కించి ధన్యాత్ములైన పరమ భాగవతోత్తములు ఈ ఆళ్వారులు. 'ఆళ్వారు' అనిన 'కాపాడువాడు' అని వ్యుత్పత్తి. వీరుతమపాశురకవితలతో మనలను కాపాడుటకు పూనుకొనిరి. అందుచేతనే వీరికి ఈ పేరు సార్థకము. భగవదనుభవ పరీవాహరూపమైన భక్తి సాగరమున మునకలు వైచి అందలి లోతునుకనుగొన్నవారనికూడ 'ఆళ్వారు' మాటకు అర్థము చెప్పవచ్చును.

'ఆళ్వారు' అనగ ద్రావిడభాషలో 'భగవద్భక్తిపరవశుడని' అర్థము. ఆళ్వారులను నిత్యసూరులని, దివ్యసూరులని అందురు. ఆళ్వారులందరు దేశకాలరీత్యా విభిన్నులైనా భగవదేకాత్ములగుటయే విచిత్రము. ఆళ్వారులు కవిశిరోమణులు వైష్ణవమత వ్యాపకులు. వీరు విశిష్టాద్వైతమతమును విస్తరింపజేయుటయే గాక వేలకొలది పాశురములను వెలయించిరి, తమిళసాహిత్యమును తమ కమ్మని కవితతో పావనము జేసిరి.

## ఆళ్వారులు- అంశములు

పోయ్‌గయ్ ఆళ్వారు విష్ణువుయొక్క పాంచజన్యాంశమునను, భూతత్తాళ్వారు కౌమోదక దివ్యాంశమునను, పేయాళ్వారు నందకాంశమునను, తిరుమళిశై ఆళ్వారు సుదర్శనచక్రాంశమునను, నమ్మాళ్వారు విష్వక్సేనాంశమునను, మధురకవి ఆళ్వారు గణాధిపతి అంశమునను, కులశేఖరఆళ్వారు కౌస్తుభాంశమునను, తిరుప్పాణాళ్వారు శ్రీవత్సాంశమునను, తొండరడిప్పొడి ఆళ్వారు స్వామి వనమాలికాంశమునను, పెరియాళ్వారు పక్షీంద్రునంశమునను, చూడికొడుత్తనాచ్చియార్ (ఆండాళ్) ధారుణీ అంశమునను, తిరుమంగై ఆళ్వారు విష్ణువుకార్ముకాంశమునను భూమిపై అవతరించిరి. ఆండాళ్ స్త్రీ. 'ఆండాళ్' అనగా 'రక్షించునదని' అర్థము. ఆళ్వారులకు సంస్కృతనామములు 1. కాసారయోగి 2. భూతయోగి 3. మహాయోగి. 4. భక్తిసారయోగి 5. శఠగోపయోగి 6. మధురకవియోగి 7. కులశేఖరయోగి 8. కవియోగి 9. విప్రనారాయణ. 10. విష్ణుచిత్తయోగి. 11. గోదాదేవి. 12. పరకాలయోగి.

## వైష్ణవ సంప్రదాయము

అనాదియైన శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు (దీనినే శ్రీభాగవత సంప్రదాయము అనిగూడ అందురు) మూలపురుషులగువారు ఈ ఆళ్వారులే. వీరు విష్ణుభక్తులు.

భగవద్గుణానుభవము నిరర్గళముగా స్వర్గగంగవలే వీరి వాక్కులనుండి ద్రావిడభాషా రూపమున వెలువడినందున వీరికి ఆళ్వారులు అనుపేరు గల్గినది.

వైష్ణవధర్మమును శ్రీమహావిష్ణువు శ్రీదేవికి ఉపదేశింపగ, ఆమె దానిని విష్వక్సేనునకు చెప్పెను. ఈవిధముగా ఇది గురుపరంపరాను గతముగ భగవద్రామానుజాచార్యులకు సంక్రమించి వారివలన చతుస్సప్తతి సింహాసనాధిపతులగు ఆచార్యుల ద్వార ఈలోకమునకు వ్యాపించెను.

భగవంతునకు భాగవతులకును నడుమగల సంబంధమును విశదపరచునది గావున భాగవత సంప్రదాయమనియు, శ్రీదేవి ద్వారా వ్యాపించినది గావున శ్రీసంప్రదాయమనియు వైష్ణవధర్మమునకు నామాంతరములు. రామానుజులు దీనిని విశాలవిశ్వమున విరివిగ వ్యాపింపజేసినందున రామానుజ సంప్రదాయమనియు వైష్ణవ ధర్మమును పిలుతురు. కాని ఈ సంప్రదాయమునకు మూలము ఆళ్వారులసూక్తులే అనుట మరువరాదు.

విశిష్టాద్వైత ప్రాశస్త్యమునకు ఆళ్వారులే ఆద్యులు. దక్షిణభారతదేశమున ద్రావిడకవుల వాణినుండి సహజసుందరముగ వెలువడి.

"అరవిందభవ సపర్యాప్త గోవింద
చరణారవింద నిష్యందమరంద
వారిధారాకార వరవారిపూర
పూరితగంభీర భూరినిర్ఘోష
రంగదభంగ సంభ్రమభరోత్తుంగ
గంగా తరంగ వైఖరులు దీపింప"—

అని చిన్నన్న అన్నట్లు, అప్రయత్నముగ ఉత్తరదిశకు పయనించి పరమపదమున విరాజిల్లు పరతత్త్వము శ్రీమన్నారాయణునియందు ఐక్యమయ్యెను.

ఆళ్వారులు తమజీవిత సర్వస్వమును భగవంతుని సేవకు అంకితము గావించిరి. వైష్ణవమతమునందలి భక్తికి కులము, మతము, ధనము, వయసు మున్నగునవేమియు ప్రతిబంధకములు కాజాల

వనియు, సర్వాత్మ సమర్పణమే జీవునకు శరణ్యమనియు, భగవద్ధ్యానమే మోక్షమునకు సోపానమనియు, గానకైంకర్యము, సంకీర్తనసేవ స్వామికి ఇష్టమనియు ఆళ్వారులు చాటిరి. వైష్ణవులకు పన్నిద్దరాళ్వారులు దైవస్వరూపులు. వీరి సూక్తులు వైష్ణవులకు ఆచరణీయములు.

## నాలాయిర దివ్యప్రబంధం

ఆళ్వారుల శ్రీముఖములనుండి వెలువడిన జ్ఞాన గంగాప్రవాహమే ద్రావిడవేదము. ఇందులో నాలుగువేల పాశురము (పద్యము) లుండును. కావున దీనికి 'నాలాయిర' మని ద్రావిడభాషలో (తమిళభాష) పేరు. సుమారు నాలుగువేలు ఉండునని మాత్రమే భావము. పాశురమనగ శ్రావ్యమైన స్వరమని అర్థము. ఇంపైన కవిత అని భావము. శ్రావ్యసంగీతమాధురిగల పద్యమే పాశురము.

ఆళ్వారుల కవిత్వము భగవత్కటాక్షజన్యవాగ్ధోరణి. కావుననే వీరి కవిత్వమందు నిర్మలభక్తిరసము అన్నిరసములకంటె ఉజ్జ్వలనీలమణియై వింతవెలుగులతో అలరారుచున్నది. పాప మాలిన్యమును దూరముచేసి ప్రాణికోటిని తరింపజేయుటయే ఆళ్వారుల కవితయొక్క ముఖ్యలక్షణము.

దైవీశక్తియుక్తులగు ఆళ్వారులు సృష్టించినదగుటచే వీరి గ్రంథసమూహమునకు దివ్యప్రబంధమని పేరు వచ్చినది. జీవుడు దేవుని చేరుటయే సర్వదుఃఖనివారణోపాయమని ఆళ్వారులు తేల్చి చెప్పిరి. ఈ విషయము అడుగడుగున వీరి పాశురములందు సువ్యక్తమగుచునే యుండును.

ఈ నాలాయిర దివ్యప్రబంధమున "ముదలాయిరము" అనబడు ప్రథమ సహస్రమున వేయి పాశురములుండును. పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) రచించిన మొదటిది మంగళ శాసనము. తిరుప్పల్లాండు- 12 పాశురములు, రెండవది పెరియాళ్వార్ తిరుమొళి- 461 పాశురములు, తర్వాత ఆయన కుమార్తెయగు ఆండాళ్ అని పిలువబడు చూడికొడుత్త నాచ్చియార్ రచించిన తిరుప్పావై- 30 పాశురములు, నాచ్చియార్ తిరుమొళి- 143 పాశురములు గలవు. పిదప తొండరడిప్పొడి ఆళ్వార్ రచించిన (విప్రనారాయణ) శ్రీమాలిక (తిరుమాల)- 45 పాశురములు, ప్రాబోధకీస్తుతి (తిరుప్పళ్లియెళుచ్చి)- 10 పాశురములు గలవు. ఆతర్వాత కులశేఖరాళ్వార్ రచించిన పెరుమాళ్‌తిరుమొళి- 105 పాశురములు గలవు. అపైన తిరుప్పాణాళ్వార్ (కవియోగి) రచించిన అమలనాదిపిరాన్- 10 పాశురములు, మధురకవి ఆళ్వార్ రచించిన కణ్ణినుణ్ శిరుత్తాంబు- 11 పాశురములు, తిరుమళిశై ఆళ్వార్ (భక్తిసారయోగి) రచించిన తిరుచ్ఛందవిరుత్తమ్- 120 పాశురములు గలవు. వీరందరి రచనలు కలిసి "ముదలాయిర" ముగ చెప్పబడుచున్నది.

ద్వితీయ సహస్రమునకు "ఇయఱ్పా" అనిపేరు. ఇందు పొయ్‌గయ్ ఆళ్వారు రచించిన ముదల్ తిరువన్దాది 100 పాశు॥ భూతత్తాళ్వార్ రచించిన ఇరణ్డామ్ తిరువన్దాది- 100 పాశురములు, పేయాళ్వార్ రచించిన- మూన్డామ్ తిరువన్దాది- 100 పాశురములు, తిరుమళిశై యాళ్వార్ రచించిన- నాన్ముకమ్ తిరువన్దాది- 92 పాశురములు, నమ్మాళ్వార్ రచించిన- తిరువిరుత్తమ్- 100 పాశు॥, తిరువాశిరియమ్ 7 పాశు॥, పెరియతిరువన్దాది 87 పాశురములు, తిరుమళిశై ఆళ్వారు రచించిన పెరియతిరుమడల్ 148½ పాశు॥, శిరియతిరుమడల్ 77½ పాశు॥, తిరువెళుక్కూత్తిరుక్కై 1 పాశురము గలవు.

తృతీయ సహస్రమున తిరుమంగై ఆళ్వార్ (పరకాలయోగి) రచించిన, పెరియ తిరుమొళి-1084 పాశు॥ తిరుక్కుందాండకమ్ 30 పాశురములు, తిరునెడుందాండకమ్- 30 పాశురములు గలవు.

చతుర్థ సహస్రమున సహస్రగీతియనబడు నమ్మాళ్వార్ రచించిన తిరువాయ్‌మొళి- 1102 పాశురములు గలవు.

నాలాయిరదివ్య ప్రబంధము నందలి పాశురాలలో నమ్మాళ్వార్ రచనలే అధికముగనున్నవి. అందుచే నమ్మాళ్వారు అవయవి యనియు, తక్కినవారు అవయవభూతములనియు సంప్రదాయజ్ఞులందురు. నమ్మాళ్వార్ రచించిన తిరువాయిమొళి ద్రావిడవేదమున శీర్షస్థానము వహించియున్నది. కావుననే దీనికి చరమప్రబంధమని ప్రసిద్ధిగలదు. ఆళ్వారులు తమ నాల్గు గ్రంథములందు ఋగ్వేదము, యజుర్వేద,

(38 వ పేజీలో)



## కళావని

పురాతన హిందూదేవాలయములు భారతీయ సంస్కృతికి, చరిత్రకు శిలాప్రతిమల వంటివి. మనదేవాలయాలు ప్రాచీనరోమను శిల్ప కట్టడములవలెనే భూగోళములోని మానవుల పురాతనాభివృద్ధిని తెల్పు మూలములు. మరువరాని ఆ శిల్పినైపుణ్యము, చతురత, ఏకాగ్రతను తెలుపును. "పరిశుద్ధమైన చిత్తప్రవృత్తితో ఏకాగ్రతను కలిగి చేయుపనియే పరమార్థము." ప్రపంచ మందలి ఏప్రధానమతమునకైనను ఇదియే మూలము. అందుచేతనే హిందూదేశము, హిందూమతము అన్నిమతములకు సహృదయముతో ఎల్లప్పుడూ స్థాన మొసంగును. ఇట్టి దేవాలయములు మన దేశములో పలుచోట్ల వెలయుటవలననే, చోళరాజుల కాలములో దక్షిణభారతదేశములో కట్టబడిన దేవాలయములకు తప్ప మిగిలిన చాలా దేవాలయములకు చరిత్రాత్మకమైన ఆధారములంతగా కన్పట్టుట లేదు. ఏదో పుక్కిటి పురాణగాథలున్న వాటికి తప్ప ఈ మిగిలిన వాటిలో వేటికి మన దేశములో చరిత్రాత్మక రికార్డులు వ్రాయు పద్ధతి పూర్వము లేక పోబట్టి సరియైన కాల నిర్ణయము చేయలేము.

వేదకాల ప్రారంభములో దేవాలయములు లేవని చరిత్రకారుల అభిప్రాయము. బుద్ధుని ముందుకాలము ఒకవేళ ఏమైనా కట్టబడినా ఇప్పుడవి సంపూర్ణముగా కానరాకున్నవి. అతిప్రాచీనమైన దేవాలయములు బర్మాలో ఇప్పటికినికలవు. కాని ఇవి చెక్కతోచేయబడినవి. అప్పటికింకా రాతి ఉపయోగము శిల్ప శాస్త్రములోనికి రాలేదు. అశోకుని కాలములో పశ్చిమముతో మనకు ఒకటి మటుకు నిశ్చయము. ఇవి క్రీ. శ. నాల్గవ శతాబ్దము పూర్వము వెలసినవే. అదియునుగాక కాశీ దేవాలయము మొదలగునవి దేవతలచే నిర్మించబడినవని పెక్కుమంది పండితుల అభిప్రాయము.

ఆ పురాతన కట్టడములు, సొంపులు ఒంపులుగల ఆ రాతి చెక్కడములు, రాతితో కట్టబడిన ఆ దేవాలయముల గోడలు నిర్మించిన తాపీపనివాడు నిస్సంశయముగా దైవాంశ సంభూతుడే ఈ నిర్మాణములో పాల్గొన్న పనివారందరూ అత్యంత శ్రద్ధాసక్తులను చూపి దేశ క్షేమమునకు తోడ్పడిరనుటలో సందేహములేదు.

రాతి చెక్కలను అతుకులు, రాతికట్టడముల చెక్కుచెదరని గట్టిదనము ముఖ్యముగా గమనింపదగ్గవి. ఎప్పుడో వెయ్యి, పదిహేను వందల సంవత్సరముల పూర్వము కట్టిన ఈ




మనదేశస్థులు ప్రత్యేకముగా హిందూ గ్రంథములను (బైబులు వలెనే) పారాయణ చేయనక్కర లేకుండగనే దైవస్వరూపమును గూర్చిక్షుణ్ణముగా తెలుసుకొనగల్గుచున్నారు దీనికి కారణమేమన మనదేవళముల కట్టడములే ఇంత సుబోధకములుగా నుండి, ప్రధానాంశములను, కాంతికిరణముల వలెనే హృదయములోనికి వెదజల్లుటకై యున్నవి.

దేవాలయమనగా భగవంతుడు నివసించు స్థలమనియే పదప్రకృతిబట్టి కన్పట్టుచున్నది. భగవంతుడు నివసించు స్థలమునకు మనము పోవుట భగత్సాన్నిధ్యము కొఱకే గదా మరి! సరి. ఇక దేవళముల కాలనిర్ణయమును గూర్చి విచారింతము. పాండ్య, రాకపోకలు కలుగ బట్టి రాతియొక్క ఉపయోగములు శిల్పములో ముఖ్యముగా గమనించబడినవి.

పాండ్య, చోళుల కాలములో దక్షిణ భారతములోని ఆలయములు అభివృద్ధి స్థితి లోనికి వచ్చినవని చెప్పవచ్చును. ఆ రాతి కట్టడములు, ఆ శిలాశాసనములు వారి సూక్ష్మబుద్ధిని పనితనమును తెలుపును. శాసనములు సాధారణముగా ఈ దేవళము లందు కన్పట్టుటందేని ఈ శాసనములు ఆ కాలపరిస్థితులు తెలియజేయుటకు సహాయపడును.

అయితే పురాతన దేవాలయముల కాల నిర్ణయము మనము చేయలేము. అయితే కట్టడములు అంతగట్టిగానుండి, పాడవకుండా ఉండుట అసామాన్యమైన విషయమునుగదా! ఎట్టివిధమైన సిమెంటు, ప్లాస్టరును, ఉపయోగించిరో ఇంతవరకు చెప్ప లేకుండా వున్నారు. ప్రపంచమంతటా నాగరికత ఉదయమునన్న ఆ కాలము నందే అంతపనితనము ఇప్పటి వరకు ప్రత్యేక సాక్ష్యముగా కన్పట్టుచున్నప్పుడు భరత ఖండము ప్రాచీనమునుండియు ఉన్నతస్థాయినందు అగ్రతాంబూలము సేవించుచున్నదని వేరే వ్రాయనక్కర లేదు. ఇరువదియవ శతాబ్దములో ఈ రిఇన్ఫోర్సెడు కాంక్రీటు కాలములో కూడా ఇట్టి కట్టడములు నిర్మించలేకున్నారు. హిందూ శిల్పవాస్తు శాస్త్రమునకు రోమనుల శిల్ప

వాస్తు శాస్త్రమునకు సమానాంతరపు పోలి కలు గలవని ఈ ప్రపంచమున మిగిలి పోయిన మచ్చుతునకలను బట్టి తెలియు చున్నది. ప్రాచీన రోమనులకు, గ్రీకులకు కూడా ఇట్టి దేవాలయములు కలవు. రోములో పాంథియన్, మక్కాలోని కాబా జాతీయ పవిత్రతగాంచిన విషయము ఎల్లరకుతెలిసి నదే. దేవాలయమునకు పోయి భగవంతుని తదితర దేవతలను కొలుచు ఆచారము వారికిని కలదు. దీనినిబట్టి గ్రీకు, రోమను, భారతీయ సంస్కృతులు ఒకే మూలము నుండి ఉద్భవించినవని చెప్పుటకు అవకా శము గలదు.

'భువనేశ్వరము' అను వ్యాసములో శ్రీ పట్నాయక్‌గారు శిల్పకళ గురించి వ్రాసిన ఈ క్రింది వాక్యము ప్రతి పురాతన హిందూ దేవాలయము యొక్క ప్రస్తుత స్థితిని తెల్పును:— "భారతీయ శిల్పకళ భావగర్భితము. నేడు చారిత్రకులు ఇతిహా సాలు వ్రాస్తారు. కవులు కల్పనలు చేస్తారు. ఆనాడు శిల్పులు కొందరు రాతిమీద సుత్తి కొట్టి భావభంగిమలు వ్యక్తీకరించారు. మానవకోటి రుచులను అందాలను స్థాపిం చారు. ఈనాడు ఆ సొంపులను కూడా వేయి నోళ్ళచాటలేక పోవుచున్నాము. ఎంత శోచ నీయము.

నేడెన్నోచోట్ల ఇంచుమించుగా భార తీయ శిల్పకళ దాని వైశిష్ట్యాన్ని గోల్పో వడం మనం కళ్ళారా చూచి కన్నీరు రాలు స్తున్నాం గాని ఉత్కళఖండంలో అనగా ఒరిస్సారాష్ట్రంలో అది యింకనూ అంత రించిపోలేదు. ఇక ముందు శ్రద్ధ వహించక పోతే అతివేగంగా అంతరించి పోవడంలో విచిత్రం కూడా లేదు." (1942 మే, భారతి)

దేశ సంక్షేమమునకు మానవుని అభివృద్ధి (పరమార్థము) కి రక్షణ నిచ్చుటకే దేవా లయములు వెలసిల్లినవి. కష్టసుఖములలో కూడా జ్యోతినిచ్చి, మానవునికి ధైర్య సంతో షములు కలుగచేయునవే ఈ ప్రత్యక్ష దైవములయిన దేవాలయములు. పురా తన సాంప్రదాయమును నిలబెట్టు పని ముట్లలో దేవాలయాలదే ప్రథమ స్థానము. మహత్తుకలిగిన తిరుపతి, పళని, కాశి మొదలగు దేవాలయములు మానవుని మాంత్రికుల వలలనుండి కాపాడుచున్నవి. ఇట్టి మాహాత్మ్యము కల్గినవే లేనిచో మాన వుడు క్షణికమైన ఇచ్చల కొరకు మాంత్రికుల వలలో చిక్కుకొని దైవ సాన్నిధ్యమునకు దూరమగునేగాని అట్టి వలనుండి స్వాధీనుడు కాలేడు.

భగవంతుని అస్వాదించునపుడు పూజ చేయుట, పాటపాడుట, నృత్యముచేయుట హిందూ సాంప్రదాయములు. మంత్రోచ్చా రణ, వేదపఠనము నిత్యము సకాలములో ప్రాచీన దేవాలయమునందు జరుగు చుండెను. దేవాలయములొక విధముగా పండితుల ఆశ్రమములు. ఆ పవిత్రత, నియ మబద్ధమైన కాలముగల ప్రదేశము నందు పఠనము అత్యధికయోగ్యత నిచ్చుటకు అను వుగా నుండును. అందుచేతనే దేవళములు ఒకప్పుడు కళలకు లలిత కళలకు కేంద్ర స్థానములుగా నిలిచినవి. తెలుగు సారస్వత ములలో (శ్రీనాథుడు పోతన మొదలగు వారు) ఏదో ఒకసమయమున భగవంతుని నీడను చూచియే ఉత్సాహమును రస ప్రవాహమును (Poetic Inspiration) పొందిరి.

ఇందులో వింత యేమియులేదు. భగ వత్స్వరూప మట్టిది. తర్కము, మతము,



కావ్యము మొదలగు విషయములకు సంబంధించిన వానిపై పోటీలు దేవాలయ సామీప్యములలో జరుపబడుచుండెను. సంస్కృతము ముఖ్య భాషగా నున్న విద్యాలయములు దేవాలయములు కలిసియే యుండెను. ఇప్పటికి కొన్ని సంస్కృత పాఠశాలలందు కొన్ని దేవాలయములు చూడనగును.

బౌద్ధయుగమునందు గూడా ఇట్టి విద్యాలయములు ఏ స్థాపముల నానుకొనియో యుండెను. వారి ఆరామములు విహారములు, ఒక విధముగా ప్రాచీన హిందూ దేవాలయములే. మన దేవాలయములలో ధ్వజస్తంభములు కూడా బౌద్ధ సంస్కృతి నుండి దిగుబడినవే. విద్యావిషయములందు అట్టి పవిత్రత పాటించుట సమంజసమే. అట్టివాతావరణములో విద్యార్థి యొక్క మనస్సును నిర్మలత్వముతో నింపి సచ్చరిత్రుని జేయుటకు చాల అవకాశము గలదు.

ప్రతిమలను కొలుచునట్టి హిందువులు రాతి విగ్రహమును మాత్రమే దైవ స్వరూపముగా నమ్మెదరనుట అవశ్యకముగా ప్రత్యేకార్థము గానేరదు. ఎందుచేతననగా ఒకప్పుడు కొన్ని ప్రతిమలు రాతితో చేయబడినవి. మరొకప్పుడు మరికొన్ని వేరువిధములైన పదార్థములతో (చెక్క, బంగారము, వెండి మొ॥) వానితో చేయబడినవి. అదియును గాక కొన్ని ఆలయములలో లింగములకు, చెట్లకుగల ప్రాముఖ్యము విగ్రహములకే లేదు. మరియు కొన్ని క్షేత్రములందు వృక్షమో లేక నదియో పూజనీయ ముఖ్యములుగా నున్నవి. కామధేనువు, నంది మొదలగు (ప్రాణులుకూడా) గమనించ దగ్గవి. పై వానినిబట్టి ఈ క్రింది నిశ్చయమునకు రావచ్చును.

ఎట్టి పదార్థము, స్వరూపములో కూడియున్నను అభ్యంతరములేదు. ప్రతి దానియందు భగవంతుడు కలడనియే పైవాని నుండి తీర్పు చేయవచ్చు. అర్థము. విద్యుదయస్కాంత సిద్ధాంతపు సర్వతోముఖమైన ఈథరు, Like the all pervading Universel Ether in maxwell's, Electromagnatic theory వలెనె భగవంతుడు సర్వాంతర్యామి అని హిందువులమతమని చెప్పుట ఎంత మాత్రము అతిశయోక్తి కానేరదు. ఒక్క విషయము పాఠకుల దృక్పథమునకుతెచ్చి ముగింతును. ఇట్టి సంస్కృతి విజ్ఞానము దెచ్చిన దేవళములను కాపాడు, అభివృద్ధి పరచు బాధ్యత పురాతన హిందూసంస్కృతి దిగజారిపోతున్న ఈ కాలములో ప్రతివిజ్ఞుని ప్రథమ కర్తవ్యము.

రెబ్బాప్రగడ వెంకట రాజేశ్వరరావు

గోదావరి తీరాన ఎన్నో పుణ్య క్షేత్రాలు ఉన్నాయి. అందులో కరీంనగర్ జిల్లా లోని ధర్మపురిలో శ్రీ లక్ష్మీనరసింహస్వామి క్షేత్రం ప్రముఖమైన వాటిలో ఒకటి. ఈ క్షేత్ర ప్రసక్తి పురాణాల్లో కూడ ఉల్లేఖించ బడింది.

ధర్మపురి క్షేత్రంలో గోదావరినది దక్షిణాభి ముఖంగా ప్రవహించుట వలన ప్రశస్తి పెరిగింది. అందుకే ఈ క్షేత్రాన్ని "దక్షిణ కాశి"అని కూడా వ్యవహరిస్తారు.

ధర్మపురి క్షేత్ర మాహాత్మ్యాన్ని వివరించే తాళపత్ర గ్రంథం నూటయాభై అధ్యాయాల్లో వ్రాయబడింది. ఇంకా కొన్ని శాసనాలు కూడ దీని ప్రాముఖ్యతను తెలుపుతున్నాయి. ఇక్కడ మూల విగ్రహం నిలువెత్తు సాలగ్రామ మూర్తి. యోగాసనాసీనుడు, వామభాగాన లక్ష్మీదేవిసహితుడు, ప్రహ్లాదునికి భక్తిమార్గం బోధిస్తున్నాడు.

ఈ మందిరానికి తూర్పున బ్రహ్మ తపస్సు చేసికొన్న సరోవరం ఉంది. అదే ప్రస్తుతం స్వామివారి పుష్కరిణిగా వ్యవహరింప బడుతోంది. నాలుగు ప్రక్కల చక్కని రాతి కట్టడం మధ్యలో స్వామి వారిని వూయలలో వూపటానికి కట్టడం ఆకర్షణీయంగా ఉన్నాయి. ఈ కోనేటి లోనికి శ్వేత వరాహ తీర్థంలోని చెరువునుండి నీరు వస్తుంది. ఈ కోనేటి నిర్మాణం ఆనాటి వాస్తుశాస్త్ర నిపుణుల ప్రతిభకు నిదర్శనం. నృసింహాలయానికి ఈశాన్య భాగాన విశాలమైన మండపం ఎంతోఆహ్లాదకరంగాఉంది. ఈ ఆలయంలోకల విఘ్నేశ్వరుని విగ్రహం చాలా ఎత్తైనది. సాధారణంగా ఇంత పెద్ద విగ్రహం ఏ దేవాలయాల్లోను లేదని అంటారు.

మహాసాధ్విసత్యవతి భర్తకు యిక్కడే శాప విముక్తి అయినట్లు ధర్మాంగద చరిత్ర తెలుపుతుంది. సర్వతీర్థాలు తిరిగి ఫలితము కానరాక ఇక్కడకు వచ్చి గోదావరిలో స్నానమాచరించి సర్పరూపుడైన తన భర్తకు మానవాకృతి సాధించినట్లు తెలుస్తుంది. ఈమె స్నానమాచరించిన స్థలాన్ని నేడు సత్యవతిగుండంగా వ్యవహరిస్తారు. మానవాకృతి పొందిన ఈమె భర్త, స్థానికులు, ఆమె శీలాన్ని శంకించగా, ఆమె ఇసుకతో స్తంభము చేసి తన పాతివ్రత్యాన్ని నిరూపించుకొన్నదట. కొంతకాలం క్రితం వరకు ఈ స్తంభం నుండి ఇసుకరాలుతూ ఉండేదని చెపుతుంటారు. ఆదర్శదాంపత్యాన్ని కోరుకొనే దంపతులు ఈ స్థలాన్ని దర్శిస్తారు. దీని ప్రక్కనే సత్యవతి ఆలయం నిర్మించ బడింది.

# ధర్మపురి

— టి. భాస్కర్

ఇక్కడ ఇంకా బ్రహ్మగుండం, చక్రగుండం, వసిష్టగుండం, దేవిసరోవరం శివ, తపస్థలి అనే తీర్థాలు ఉన్నాయి. ఇవన్నీ గోదావరి నదిలోనే ఉన్నాయి. ఈ క్షేత్రం ఆనాటి నుండే విద్యాకేంద్రంగా విరాజిల్లుతున్నది. అనేకమంది వేద పండితులకు ఎందరో కవులకు పుట్టినిల్లు.

ఈ ఆలయప్రాకారంలో శ్రీ వేంకటేశ్వర గోపాలకృష్ణమందిరం, ఉగ్రనరసింహాలయం, అష్టదిక్పాలక విగ్రహాలుఉన్నాయి. ఇటీవలే శ్రీవేంకటేశ్వరమందిరానికి నిర్మించిన రాజగోపురం చివరదశలో ఉంది. ఈ ఆలయ పునరుద్ధరణకు దాదాపు 2 లక్షలు ఖర్చు చేశారు.



ఈ క్షేత్రంలో దాదాపు 40 మందిరాలు ఉన్నాయి. గోదావరి తీరంలోని దత్తాత్రేయుని ఆలయంతో సహా ఆలయాల నిర్మాణ కౌశలం యాత్రికులను ఆకర్షిస్తుంది. ఈ క్షేత్రానికి రాష్ట్రం నలుమూలల నుండే కాకుండా పొరుగు రాష్ట్రాలైన కర్ణాటక, మహారాష్ట్రలనుండి కూడా భక్తులు వస్తూంటారు. తిరుపతి దేవస్థానంవారి ధర్మశాల, రాష్ట్ర పర్యాటకశాఖవారి విశ్రాంతిగృహం యాత్రికులకు చక్కని వసతిని కలిగిస్తున్నాయి.

ప్రస్తుతం ఇచ్చట ప్రతి సంవత్సరము ఫాల్గుణ పూర్ణిమకు జరిగే పదిరోజుల కల్యాణోత్సవాల్లో, డోలోత్సవం, తెప్పోత్సవం ముఖ్యమైనది.

శ్రీ లక్ష్మీనృసింహుని యొక్క నివాస భూతమైన ఈ పుణ్యక్షేత్రము ధర్మమునకు వేదశాస్త్రములకు నిలయమై భాగవతోత్తములచే, పౌరాణికులచే మరియు పండితులచే శోభిల్లుచూ "ధర్మపురి" యను సార్థక నామమును నిరూపించుచున్నది.

ఈ ధర్మపురి పుణ్యక్షేత్రము కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూకాలోని గోదావరి నది ఒడ్డున కలదు.

★

(23 వ పేజీ తరువాయి)
సామవేద, అథర్వణవేదముల సారమును ప్రతిపాదించిరని శ్రీ వైష్ణవాచార్యుల విశ్వాసము.

ఈ నాల్గు ద్రావిడవేదముల అర్థమును వివరించుటకు తిరుమంగై ఆళ్వారు వేద వేదాంగములను బోలిన గ్రంథములను ఆరింటిని రచించిరి. వీరు చతుష్కవిశిఖామణిగా ప్రసిద్ధికెక్కిరి. ఆశు మధుర చిత్ర విస్తర కవితలే చతుష్కవితారీతులు. తిరుమంగై ఆళ్వార్ రచించిన పెరియతిరుమొళి భగవత్కావ్యములలో మిగుల ప్రౌఢము, రసవంతము. నాలాయిరమున సంఖ్యలో తిరుమంగై ఆళ్వారు కృతులే అధికము. మొత్తము 1361 పాశురములు.

ఈ ద్రావిడవేదమునకు చివరగ "తిరువరంగత్తు ముదనార్" అనుకవి రచించిన 'ఇరామానుశమాత్తందాది" చేర్చబడినది. దీనికి 'ప్రసన్న గాయత్రి' అని నామాంతరము. ఇది 'ఇయఱ్పా' లో చేర్చబడినది. (చూ॥ దివ్యప్రబంధమాధురి-శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు.)

## ఆళ్వారుల సందేశములు :

పన్నిద్దరాళ్వారుల జీవితములను పరిశీలించిన క్రిందివిధముగ సందేశములను తెలియనగును. యోగిత్రయమైన పొయ్‌గయ్ ఆళ్వార్, భూతత్తాళ్వార్, పేయాళ్వారుల చరితములనుబట్టి, "జీవునకు భగవద్దర్శనానుభూతి నిచ్చునది ప్రపత్తిమార్గమే నని" తెలియుచున్నది. తిరుమళిశై ఆళ్వార్ చరితము "కులము కన్న ను భగవద్భక్తియు, భాగవతభక్తియు పరిగణనీయములని" బోధించుచున్నది. నమ్మాళ్వార్ చరితము, "భాగవతోత్తములలోనే భగవంతుడున్నాడని బోధించుచున్నది." మధురకవి ఆళ్వార్ చరితము, "కులగోత్రములకుగాక భగవద్భక్తికే ప్రాధాన్యము నిచ్చుచున్నది." గురుభక్తికి మధురకవి ఆళ్వార్ జీవితము ఉదాహరణము. కులశేఖరాళ్వార్ చరితము, "భాగవతులు భగవంతులకన్న అధికులనెడి విషయమును నిరూపించుచున్నది", తిరుప్పాణాళ్వార్ జీవితము, "భక్తిలో తన్మయమై జీవించు మనిషియే ధన్యుడని బోధించుచున్నది. భక్తికి కులము, మతము, వయసు, మున్నగున వేమియు ప్రతిబంధకములు కాజాలవని నిరూపించుచున్నది. సర్వాత్మసమర్పణమే జీవునకు శరణ్యమనియు నిరూపించుచున్నది."

తొండరడిప్పొడి ఆళ్వార్ జీవితచరితము "పరమేశ్వరానుగ్రహమునకు పాత్రలగు జీవులకు ప్రకృతులును, భౌతికములగు బంధనములు ప్రతిబంధకములు కాజాలవనియు, అప్రతిబంధకములు స్వామి అనుగ్రహమున, సూర్యోదయమున అంధకారమువిధమునను, గరుడునిముందు నాగపాశములట్లును పటాపంచలై పోవునని నిరూపించుచున్నది.

పెరియాళ్వారు జీవితము, "జిజ్ఞాసువులకు జ్ఞానముకన్న భక్తియే మిన్నయని" నిరూపించుచున్నది.

అండాళ్ (గోదాదేవి) జీవితచరితము భక్తితత్త్వముయొక్క పరమావధిని ప్రవచించుచున్నది. విశిష్టాద్వైతమత సిద్ధాంత ప్రతిపాదమునకు ఈ గోదాదేవికథ వేదమునకు పురాణేతిహాసమువోలె పరిపోషకము.

తిరుమంగై ఆళ్వారు జీవితచరితము, "తదీయారాధన ప్రాముఖ్యమును వెల్లడించుచు, చేష్టకన్న మనశ్శుద్ధి ప్రధానమని బోధించుచున్నది. భాగవతసేవనుమించిన వ్రతవిధానము లేదని ఈతని జీవితచరితము ఉద్ఘోషించుచున్నది. పై విధముగ పన్నిద్దరాళ్వారుల జీవితములు భగవంతుని చేరుటకు తగుపైన విధానములను జెప్పియున్నవి.

"ఉరుభక్తితోడ నియ్యోగీంద్రవరుల
చరితమొక్కొకమారు జనులెవ్వరేని
వినిన వ్రాసిన జదివిన బేరుకొనిన
నెనలేని యిష్టంబు లెసగించునసుచు"
(పర. యో. వి. పుట. 543)

తాళ్లపాకచిన్నన్న తన పరమయోగి విలాసమున ఆళ్వారుల చరితముల కున్న ప్రాముఖ్యమును వివరించియున్నారు.


*Statement about ownership and other particulars about*

**SAPTHAGIRI**
**(MONTHLY)**

**FORM IV**
*(See Rule 8)*

| | | |
|---|---|---|
| 1 | Place of publication | ... TIRUPATI. |
| 2 | Periodicity of its publication | ... Monthly |
| 3 | Honorary Editor | ... Sri G. Kumaraswamy Reddy, I.A.S. Executive Officer, T.T.D. |
| 4 | Printer's Name<br>Whether citizen of India<br>Address | ... Sri M. Vijayakumar Reddy, L.P.T.,<br>... Yes<br>... Manager, T.T.D. Printing Press, Tirupati. |
| 5 | Editor & Publisher's Name<br>Whether citizen of India<br>Address | ... K. Subba Rao, M.A.,<br>... Yes<br>Editor, Sapthagiri, T.T.D. Journal, Tirupati. |
| 6 | Names and addresses of individuals who own the Newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | ... Board of Trustees<br>... represented by the Executive Officer on behalf of T. T. D., Tirupati. |

*I, K. Subba Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

TIRUPATI,
*Date*: 29-2-1984.

*(Sd.)* **K. SUBBA RAO,**
*Signature of the Publisher.*

# ఫణిగిరి శ్రీ ధర్మలింగేశ్వరాలయం

—వొగాభట్ల మార్కండేయశర్మ

అనాదిగా ప్రజాజీవనంలో ఆలయాలు ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించుకొన్నాయి. ఆ నాటి రాజులు ప్రజాపాలనతో బాటు, భగవదారాధనకు ప్రశాంతమైన వాతావరణంలో ఆలయాలను నిర్మించారు. అటువంటి ఆలయ నిర్మాణ కార్యక్రమంలో ఒక భాగంగా మధ్య యుగాల్లో పరిపాలించిన వేంగిచాళుక్యుల వారసులైన ఎలమంచిలి చాళుక్యులు క్రీ. శ. పదమూడవ శతాబ్దంలో ఫణిగిరి నానుకొని శ్రీ ధర్మలింగేశ్వరాలయం నిర్మించారు. పదమూడవశతాబ్దం నుంచి పదహారవ శతాబ్దం వరకు రాజపోషణలో ఉన్న శ్రీ ధర్మలింగేశ్వరాలయ మండపాలలో, ఎలమంచిలి చాళుక్యుల్లో ప్రసిద్ధికెక్కినవిశ్వేశ్వర చక్రవర్తి (క్రీ. శ. 1407) తమ వంశ ప్రశస్తిని సవివరంగా శిలాశాసనాలలో ప్రకటించాడు. తరువాత వేంగీ చాళుక్య సామంతులైన కోన హైహేయులు, 18 వ శతాబ్దంలో పూసపాటి విజయనగర రాజులు యీ ఆలయానికి దానము లిచ్చినట్లు శాసన ప్రమాణాలవల్ల 18 వ శతాబ్ది వరకు శ్రీ ధర్మలింగేశ్వరాలయం గణనీయంగా విరాజిల్లినట్లు తెలుస్తోంది.

విశాఖజిల్లా, ఎలమంచిలి తాలూకా కేంద్రానికి 10 కి. మీ. దూరంలో ఉన్న పంచధార్ల గ్రామంవద్ద ఫణిగిరిపాదమందు శ్రీ ధర్మలింగేశ్వరాలయం ఉంది. అనకాపల్లికి 24 కి. మీ. ఉన్న యీ శైవ క్షేత్రానికి బస్సులలో చేరుకోవచ్చును. ఫణి (పాము) ప్రాకుతున్నట్లు పర్వత శ్రేణి పొడువుగా కొన్ని మైళ్ళు వ్యాపించడం వల్ల దీనికి "ఫణిగిరి" అని, అవిరామంగా ప్రవహించే ఐదు (పంచ) ధారలు కొండ దిగువ నున్న స్నానవాటికకు ఎల్లప్పుడు నీరు ప్రవహించడంవల్ల యీ క్షేత్రానికి "పంచ ధార్ల" అని నామాలు సార్థకం అయ్యాయి.

"పంచధార్ల క్షేత్రంలో ఆలయసముదాయం ఏడువందల సంవత్సరములనాటి తూర్పుచాళుక్యుల వాస్తు, శిల్పకళా వైభవాన్ని చాటి చెప్తున్నాయి. క్షేత్రాధిపతి అయిన ధర్మలింగేశ్వరుడు, క్షేత్రపాలకుడైన మాధవస్వామి ఆలయాలతోపాటు శ్రీ సోమేశ్వరాలయంకూడా అతి పురాతనమై




శిల్ప చాతుర్యాన్ని యీ నాటికి కొని యాడేలా ఉన్నాయి. సోమేశ్వరాలయం గోడల వరకు రాతితోను, గోపురభాగము ఇటుకలతోను నిర్మింపబడింది. ఇది మూడు దేవాలయాల్లో అతి ప్రాచీనమై, ప్రస్తుతం జీర్ణ స్థితిలో ఉంది. ఆలయం చుట్టూ శిథిల శిల్పాలు, పార్వతి, నంది, ఆదిశక్తి మొదలగు విగ్రహాలు వున్నాయి.

నేలను తొలచి నలుచదరంగా శిలావాటిక నడుమ మాధవస్వామి ఆలయ నిర్మాణం జరిగింది. మాధవస్వామి ఆలయ ముందు భాగాన స్నానవాటిక ఉంది. నిత్యము ధారగా ప్రవహించడంవల్ల నీరు శుభ్రంగాను, కొండపై నుండి రావడం వల్ల చల్లగాను ఉంటుంది. వాడిన నీరు ఆలయం బయటకు పోయేటందుకు వీలుగా చక్కటి కాలువ ఏర్పాటు చేసారు. స్నానవాటికకు యిరుపైపుల భూమి ఉపరితలానికి రావడానికి మెట్లు ఉన్నాయి. కుడిపైపు మెట్లు పదహారు స్తంభాల మండపం లోనికి తీసుకొని వెళతాయి.

ధర్మలింగేశ్వరస్వామి ఆలయ నిర్మాణం గురించిన జన శ్రుతిగాథ పూర్వం నుంచి ప్రచారంలో ఉంది. పాండవులు అజ్ఞాత వాసకాలంలో యీ ప్రాంతానికి వచ్చి, బకాసురవధ పాప పరిహారార్థం యాగాన్ని పంచధార్ల యందు జరిపి, ఆ సందర్భంగా

## విజ్ఞాపన

తిరుమల తిరుపతి దేవస్థాన యంత్రాంగానికి 50 సం॥ గడచిన సందర్భముగా తిరుమలతిరుపతిదేవస్థానము భారతదేశములోను, ఇతరదేశాలలోనున్న శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయముల గురించిన వివరములను గ్రంథరూపములో ప్రచురించ సంకల్పించింది. కనుక ఆ యా దేవాలయముల నిర్వాహకులు, ధర్మకర్తలు, ఇతరసన్నిహిత వ్యక్తులు వాటిని గురించిన వివరములు, చరిత్ర, ఛాయాచిత్రాలతోసహా పంపగోరుతున్నాము. వీలైనంతవరకు ఈ వివరములు ఇంగ్లీషులో ఉంటే మంచిది.

పంపవలసిన చిరునామా :

సంపాదకుడు, సప్తగిరి,

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి – 517 501. (ఆంధ్రప్రదేశ్)

ధర్మజుడు శివలింగ ప్రతిష్ఠ చేయడం వల్ల యీ శైవ క్షేత్రానికి "ధర్మలింగేశ్వరాలయం" అని పేరు వచ్చినట్లు యీ గాథ చెప్తుంది. ధర్మరాజు యజ్ఞము చేసిన స్థలము 'యజ్ఞ గరువు" అని యిప్పటికీ పిలవ బడుతోంది.

ధర్మలింగేశ్వరాలయం మిగిలిన రెండు ఆలయాల కన్న విశాలముగా, ఎత్తైన ప్రదేశంలో నిర్మింపబడినది. మాధవస్వామి ఆలయం వైపు వున్న మెట్లపై నుండి ఆలయం లోకి ప్రవేశమున్నది. ఆలయం మూడువైపుల రాతి ప్రహరీ గోడ, ఒకవైపు కొండచరియ హద్దులుగా ఉన్నాయి. ఆలయానికి మూడు వైపుల ప్రవేశ ద్వారాలు గలవు. ఆలయానికి కుడివైపు పదహారు స్తంభాల మండపం చాలా తక్కువ ఎత్తు గలిగిఉంది. ఇదిఆలయకల్యాణ మండపం అయివుండవచ్చు, ఆలయం వెనుకవైపు ఎత్తుగా మండపం గలదు. మండపంలో గల స్తంభాలు ప్రత్యేకమైన శ్రద్ధతో మలచారు. స్తంభం అడుగు భాగం చదరమైన పీఠిక, దానిపై పరివేష్ఠితమై ఉన్న సింహం ఆనాటి శిల్పకళా వైభవంతో ప్రకాశిస్తూ ఉంది.

ధర్మలింగేశ్వరాలయంలో ఒక మూల చిన్నగదిలో పాముపుట్ట ఉంది. అందులో చాలాకాలంనుంచి శ్వేతనాగిని ఉంది. రోజు వేకువజామున పుట్ట బయటకు వచ్చి ధర్మలింగేశ్వరునికి ప్రదక్షిణలు జరిపి మళ్ళీ పుట్టలోనికి వెళ్తుందని అక్కడి అర్చకులుచెప్తారు. ఆ నాగు ఎవరికి హాని తలపెట్టలేదట. యీ శ్వేత నాగిని భక్తులను బాగా ఆకట్టుకొంటోంది. ప్రతి సంవత్సరం ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి నాడు స్వామి వారి కల్యాణ మహోత్సవం జరుగుతుంది. మహాశివరాత్రినాడు కూడా వేలాదిభక్తులు దైవదర్శనానికి చాలా దూర ప్రాంతాల నుంచి వస్తారు. ఆ ఉత్సవాలు, ఆ జనసందోహం చూచు వారికి చూడముచ్చటగా ఉంటుందనటంలో సందేహం లేదు.

మధ్యయుగం నాటి తూర్పు చాళుక్యుల నిర్మాణ చాతుర్యాన్ని, అలనాటి సంస్కృత వైభవాన్ని చూడటానికి యిప్పటికీ చరిత్రకారులను, యిటుభక్తులను ఆకర్షిస్తున్న శ్రీ ధర్మ లింగేశ్వర క్షేత్రం దర్శనీయ యాత్రా స్థలాల్లో ఒకటి.



## పురోహిత సంఘం, తిరుమల

యాత్రికులు తమ శుభకార్యములను పురోహిత సంఘం, తిరుమలలో నిర్ణీత రుసుములను చెల్లించి వారిచే నిర్వహించుకొనవచ్చును. 1–1–84 నుండి నిర్ణయించబడిన రుసుములు క్రింద ఇవ్వబడినవి.

| సంఖ్య<br>1 | కార్యక్రమము<br>2 | ప్రస్తుత రుసుము<br>3<br>రూ. పై. |
|---|---|---|
| 1 | బ్రాహ్మణుల, వైశ్యుల వివాహములు | 50–00 |
| 2 | బ్రాహ్మణుల, వైశ్యుల ఉపనయనములు | 40–00 |
| 3 | ఇతరుల వివాహములు (హోమంలేకుండా) | 50–00 |
| 4 | ఇతరుల వివాహములు (హోమంతో లేదా కన్యాదానం) | 36–00 |
| 5 | సత్యనారాయణవ్రతం | 20–00 |
| 6 | కేశఖండనం మరియు ఇతరపూజలు | 10–00 |
| 7 | పిండప్రదానం | 5–00 |
| 8 | హిరణ్యగోదానం | 6–00 |
| 9 | అన్నదానం | 3–00 |
| 10 | సాలగ్రామదానం | 1–25 |
| 11 | సంకల్పం | 1–00 |
| 12 | షోడశమహాదానం | 16–00 |
| 13 | దశదానం | 10–00 |
| 14 | నవగ్రహదానం | 9–00 |
| 15 | సంకల్పం, పూజ | 1–00 |

# మంగళగిరి పుణ్యక్షేత్రమహిమ

— అన్నె సూర్యనారాయణ

మంగళగిరి అతిప్రాచీనమైన చరిత్రాత్మకమైన పుణ్యక్షేత్రము. శ్రీ రాజ్యలక్ష్మీ నృసింహస్వామి దేవాలయము, చీకటి కోనేరు, కల్యాణిసరస్సు అనే పెద్దకోనేరు, శ్రీ బాలాంబగారి అన్నదానసత్రము, స్వామీజీ శ్రీ వల్లభాచార్యుల వటతీర్థం, మర్రిగుంట, స్వామీజీ శ్రీ చైతన్యప్రభువు పాదపద్మములవేదిక, శ్రీ ఆంజనేయ దేవాలయము, శ్రీ కోదండరామాలయం, శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయము, శ్రీ భ్రమరాంబాసహిత మల్లీశ్వరస్వామివారి దేవాలయము, శ్రీ లక్ష్మీసత్యనారాయణ దేవాలయము మున్నగు ప్రసిద్ధిచెందిన దేవాలయములు ఇచట నెలకొనివున్నవి.

ఇది గిరి (కొండ)క్షేత్రము పుణ్యక్షేత్రము (కొండలు)పైయున్న శ్రీ పానకాల నృసింహస్వామి దేవాలయము తూర్పుకనుమల కొండలో యున్నవి. కేరళరాష్ట్రములో త్రివేంద్ర ప్రాంతములో యేర్పడి, ఉత్తర దిశగా తమిళనాడు, కర్నాటక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములలో మధ్యప్రదేశ్ రాంచి పట్టణముల వరకు వ్యాపించియున్నవి తూర్పు కనుములు. ఈ క్షేత్రము గొప్పవిజ్ఞాన కేంద్రమై విలసిల్లినది. శాతవాహన, ఇక్ష్వాకు, వాకాటక, పల్లవ, కాకతీయ, తూర్పుచాళుక్య, చక్రవర్తుల దుందుభులతో ప్రతిధ్వనించినది. భూలోకములో స్వయంవ్యక్త పుణ్యక్షేత్రస్థలములలో 8 ప్రధానమైనవి. 1. శ్రీ రంగము 2. శ్రీ ముష్ణము 3. నైమిశము 4. పుష్కరము 5. సాలగ్రామాద్రి 6. తోతాద్రి: మంగళగిరి 7. నరనారాయణాశ్రమము 8. వేంకటాద్రి. మంగళగిరి శుభముల నిచ్చుకొండ. మంగళాద్రి, తోతాద్రి, పారియాత్రపర్వతము, ముక్తిపర్వత స్థల పురాణ విశేషాలు బ్రహ్మవైవర్తపురాణములో, ముప్పై అధ్యాయాలలో వివరింపబడినవి. సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడయిన వేదవ్యాసమహర్షి, పదునెనిమిదిమహాపురాణములు రచించారు. అందులో బ్రహ్మవైవర్త పురాణమొకటి. ఈ పురాణములోని విషయము అంతా పరమేశ్వరి పార్వతి, పరమేశ్వరుడైన శివుని, ప్రశ్నింపగా, ఆ పరమశివుడు, చెప్పుతూయుండినది. అందువలన భువనశంకరగీత, అని పేరుయున్నది.

## దిగువ సన్నిధి

శ్రీ రాజ్యలక్ష్మీనృసింహస్వామివారిదేవాలయము, పెద్దప్రాకారములతోను, గాలిగోపురములు, పెద్ద గోపురములతోను ముఖమండపములతోను వస్తువాహనములతోను యుండి, భారతదేశంలో ముఖ్యమైన పుణ్య



క్షేత్రములలో ఇదిఒకటిగా ప్రసిద్ధిపొందింది. జాతీయరహదారి, రైలుమార్గములు, బస్సు మార్గముయున్నకూడలి. పుణ్య క్షేత్రము విజయవాడ, గుంటూరు, తెనాలి పట్టణము లకు మధ్యలో యున్నది. క్షేత్రమునకు కృష్ణానదిదగ్గరలో యున్నది. మూలవిరాట్ లైన స్వామివారి విగ్రహము, శ్రీ రాజ్య లక్ష్మీఅమ్మవారి విగ్రహము పెద్దవిగాను, ఆకర్షణీయముగాను, పూజనీయముగాను, వున్న విగ్రహములు. విగ్రహముల ప్రతిష్ఠ ద్వాపరయుగములో పాండవులలో అగ్రజుడైన ధర్మరాజుల వారిచే చేయబడి నట్లున్నూ, నాటినుండి క్రమముగా శంఖ నృపతి, పురుకుత్సుడు, ఇంద్రద్యుమ్నుడు, మొదలగు రాజులు ఆ యాలయ నిర్మా ణాన్ని నిర్వహించినారు. ఆలయములో ఉత్తరభాగమున, పన్నిద్దరాళ్వార్లు, విష్వ క్సేనాళ్వార్లు, అనంతాళ్వారు. గరుడాళ్వార్లు, విగ్రహములు యున్నవి. మహత్తు కలిగిన సాలగ్రామాలుగల దండస్వామివారికి వేయ బడియున్నది. విజయనగర సామ్రాజ్యాధి పతి శ్రీకృష్ణదేవరాయలు తన పరివారముతో క్రీ. శ. 1515 సం॥ జూన్ 6 వ తేదీన దేవా లయములో స్వామికి పూజలు సల్పి భూరి విరాళములు, యిచ్చినట్లు శాసనము యున్నది. ది. 1558 సం॥ లో ఒరిస్సాదేశపు రాజైన సిద్ధరాజు రాజయ్య దేవరవారు, స్వామిని దర్శించి, సేవించి, భూరి విరాళ ములు మాన్యములు యిచ్చినట్లు శాసనము యున్నది. ది. 1807 సం. ప్రాంతములో శ్రీ రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు మంగళగిరిలో యుండి, తూర్పున (పెద్ద గాలిగోపురము అడుగుల యెత్తుగల 11 అంతస్తులగలది.) భారతదేశములో గాలి గోపురములలోకెల్ల పెద్దదైన గాలిగోపుర మును చెక్కుడు నల్లరాళ్లు, పేరేచర్ల కొండల నుండి తెప్పించి వేజండ్ల క్వారిలోని చింతా మణిరాళ్లను జమీలోని గ్రామాదుల రైతుల ఎడ్లబండ్లద్వారా తెప్పించి ఈ రాజ గాలిగోపురమును నిర్మించినారు. ఈ గాలిగోపురము ఎత్తు 153 అడుగులు వెడల్పు 49 అడుగులు. తక్కువ వెడల్పు ఎక్కువ ఎత్తు గల గాలిగోపురము. చుట్టూ ప్రాకా రము వేజెండ్ల క్వారిలోని చింతామణి రాయి చెక్కించి కట్టించినారు. ఈ ప్రహరీ గోడ క్రింద 6 అడుగులు వెడల్పు పైన 4 అడు గుల వెడల్పు ఎత్తు 30 అడుగులు కల ప్రాకారము. ముఖమండపముచెక్కబడిన స్తంభములతోను పై కప్పునుపేరేచర్ల క్వారీ లోని నల్లరాళ్లను తెప్పించి నిర్మించినారు. తూర్పున యున్న చీకటికోనేరు, పెద్ద రథము రథశాల యేర్పరచి ధన, కనక, వస్తు వాహనములు యిచ్చినారు. శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారి భక్తి విశేషం చేత ఇంతటి మహోన్నత నిర్మా ణము ఇచ్చటజరిగినది. ఈయన మహా భక్తుడు, కవి, పండిత పోషకుడు, అనేక దేవాలయములు ఉద్ధరించి, గొప్ప నిర్మాణ ములను నిర్మింపజేసిన ప్రజ్ఞాశాలి. వీరే చాల కాలము యీ ఆలయ ధర్మ కర్తృత్వాన్ని వహించినారని జి. మెకంజి, ఇలియట్ రిపోర్టులోను తెలియుచున్నది.

1815 సం. డిశంబరు నెల, 1916 జనవరి నెలలో పిండారీలు అనే సాయుధ దోపిడి ముఠావారు కృష్ణానది యిరువ్రక్కల గ్రామాదులను, పట్టణములను దోపిడిచేసి ప్రజలను మిక్కిలి హింసించినారు. వీరి ముఠాలో ఆఫ్ఘనులు, మహారాష్ట్రులు జాట్లు మొదలగువారు యున్నారు. వీరి వద్ద తుపాకులు, పిరంగులు మందుగుండు సామాగ్రి, వేలసంఖ్యలో దోపిడిదార్లు యుండేవారు. పిండారీలను శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారు తమ సిబ్బందితో ఫిరంగులు, మందుగుండు సామాగ్రితో ఎదుర్కొని వారిని ఓడించి తెలుగు జిల్లాల వెలుపలికి తరిమి వేసినారు. తెలుగు ప్రజలకు యిందు వలన ఎంతో మేలు జరిగినది. ఈ విషయము జి. మెకంజి రిపోర్టులోను, కర్నల్ టాడ్ రిపోర్టులోను తెలియుచున్నది.

ది. 1840 సం ప్రాంతములో దక్షిణావృత శంఖము బంగారుతొడుపుతో, తిరువా న్కూరు రాజావారి దివానుగా యున్న శ్రీ వేమూరి కృష్ణారావుగారు స్వామివారికి సమర్పించినారు.

గుంటూరు జిల్లా, తెనాలితాలూకా, తుమ్మపూడు వాస్తవ్యులు బ్రిహ్మశ్రీ మల్లాది సుబ్బదాసుగారు, శిఖరముల, కలశములకు, బంగారురేకు తొడుగులు వేయించి, అధికవ్యయముతో దేవాలయము బాగునకు తోడ్పడినారు. శ్రీ కైవారం సుబ్బన్న వారి భార్య శ్రీ మతి బాలాంబ గారు, స్వామిభక్తుల అభివృద్ధికి అన్న సత్రములు నెలకొల్పి అమోఘమైనసేవచేసి నారు. స్వామివారి ఉత్సవములు ఘన ముగా జరుగుటకు భక్తిజ్ఞాన, మతప్రచా రమునకు యెక్కువ కృషి సల్పినారు.

శ్రీస్వామివారి దేవాలయమునకు వచ్చి, పూజలు సల్పిన మహనీయులలో జగద్గురువు శ్రీశ్రీశ్రీ శంకరాచార్యులు, శ్రీరామానుజా చార్యులు, శ్రీ స్వామి వల్లభాచార్యులుగారు ఇచ్చట వట తీర్థం, మర్రిగుంట లో మర్రి చెట్టు క్రింద తపస్సు చేసి, జ్ఞానోదయం పొంది, దేశములో భక్తి తత్వము బోధించి నారు.

స్వామి వల్లభాచార్యులవారి భక్తి తత్త్వము రాజస్థాన్, గుజరాత్, ఢిల్లీ, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, పంజాబు రాష్ట్రము లలో యున్నది. ఆ రాష్ట్రముల నుండి టూరిస్టుబస్సులలోను, రైల్వేలలోను ఎక్కువ మంది భక్తులు వచ్చి స్వామిని దర్శించి, సేవించి కానుకలు యిచ్చి పోవుదురు. స్వామి శ్రీకృష్ణ చైతన్యప్రభువు వారి భక్తి తత్త్వములోని వారు బెంగాలు, ఒరిస్సా రాష్ట్రముల నుండి వచ్చుదురు. దక్షిణమున కల్యాణి పుష్కరిణి, ప్రసన్న ఆంజనేయ స్వామి దేవాలయము, శాసన స్తంభ ఆంజ నేయస్వామి, దేవాలయములు యున్నవి.

1816 సం. జనవరి నెలలో పిండారీలు, సాయుధదోపిడిముఠా గుంటూరు, వెనిగళ్ల, కాకాని, కంతేరు, యెర్రబాలెము, నవులూరు మంగళగిరి గ్రామాదుల ఇండ్లలోని ధన

( 48వ పేజీలో )

# యువ వాణి

పాశ్చాత్యనాగరికత నాలుకలు చాచుకుంటూ చుట్టు ముట్టాడి దినదినాభివృద్ధి చెందుతూ, భారతీయ సంప్రదాయ సంస్కృతి రోజు రోజుకు కృంగి కృశించి నశించి పోతుంది. దుష్ట భూయిష్ఠమైన కలుషిత వాతావరణము పొర్లిపొంగుచున్న నేటి సమాజము రాను రాను ఇంకెంత విష పూరితమౌతుందో?

ఆలోచించి జూడ ఇందుకు మూడు ముఖ్యకారణాలు కనపడు చున్నవి. మొదటిది పైశాచిక ప్రవృత్తుల పాశ్చాత్య నాగరికత, రెండవది కేళీవిలాసములకై కావలసిన డబ్బు కొరకు మానవుడు మానవత్వము కోల్పోవుటకైనను వెనుదీయకుండుట; మూడవది అందరికన్న మిన్నగా అధికార అహంకార అంతస్థులతో తులతూగాలని శరవేగముతో పరుగెడుతూ ముందు రానున్న ఆపదలను గ్రహించక మూర్ఖత్వముతో నడుచుకొనువారనేకులు.

పెద్దచదువులు చదువుకున్నవారు, గొప్ప గొప్ప హోదాల్లో నున్నవారు సమాజములో పేరున్న పెద్దమనుష్యులు కూడా పైమూడు పాశాలకు గట్టిగ చుట్టుకొని, వారితోపాటు అనేక అమాయక ప్రజలను ఆ పాశములో పాపభూయిష్ఠమైనపనులు జేయిస్తూ అనేక కుటుంబ ప్రజలను సర్వనాశనము జేయుచున్నారు. కాని వారు మాత్రం సమాజములో అంతరికంగా ఎన్ని పాపాలు జేసినా బాహ్యంగ మాత్రం పరువు ప్రతిష్ఠలు గలవారిగ చలామణి అవుతున్నారు.

ఇలా చదువుకొన్నవారేగాక చదువులేని శారీరక బలహీనులు కొందరు వారి వారి బుద్ధి యుక్తులచేతను, మరికొందరు బుద్ధి బలము లేకున్నను కండబలముతో ప్రజలను భయపెట్టి అన్యం పుణ్యం ఎరుగని కుటుంబాలను నాశనము చేయుచున్నారు.

చిత్రవిచిత్ర సంఘటనలు శరవేగంతో పరుగిడుతున్న సమయాన మానవునికై ఈ సమాజం ముందేమి జేసినది, ప్రస్తుతమేమి జేయుచున్నదో కొన్నింటిని పరిశీలించెదము. చాలా ఎత్తైన ఖరీదైన దేవాలయాలు పురాతన సాంప్రదాయవాసులు వారి వారి ఇష్టదేవతలను పూజించుకొనుటకు మానవజీవితము పునీతము జేసుకొనుటకు ఎంతో శ్రమతో శ్రద్ధగా మంచి మనస్సుతో తీర్చిదిద్ది కట్టించారు మన పూర్వులు. అలాంటి పవిత్రస్థలాల్లో నేటి మన వారు ఎంతవరకు జన్మ సార్థక్యము జేసుకొనుచున్నారో కనులారా జూచి చెవులారా విన్నవి. ఇక్కడ ప్రస్తావించుట అసందర్భము కాదని చదువరులు గ్రహించ ప్రార్థన.

## మనిషి మారేదెపుడు?

—డాక్టర్ కె. వి. గౌడు

వజ్ర వైడూర్యాలు మణి మాణిక్యాలు మేలిమిబంగారాభరణాలతో ఖరీదైన వస్త్రాలంకారాలతో, సుగంధ సువాసన విరజిల్లు పూలమాలతో, ధూప దీప నైవేద్యాలతో నున్న స్వామివారిని దర్శించి పూజించి కలుషిత మనస్సును క్షాళితము జేసుకొనుటకు దేవాలయంలో ప్రవేశింతురు మన వారు.

కాని మనవారి మనస్సు, చక్కగ నీటుగ ముస్తాబై రంగురంగుల వస్త్రాభరణాలతో అటు నిటు అందంగ తిరుగాడు మాతృమూర్తులను, మొగవారు క్రీగంటి చూపులతో ఆడువారి దేహసౌష్టవ అలంకారాలను మనస్సులో తలచుకొంటూ, కామతలంపుతో గుటకలు మ్రింగుతూ, పైకి మాత్రం చాలా సాత్త్వికంగా సహృదయులుగ వున్నట్లు తియ్యటి మాటలతో సాటివారిని తమస్వార్థం కోసం మభ్యబెట్టి మోసగించు మనుష్యులెందరో?

దైవదర్శనానికొచ్చిన ఆడవారు కూడా పాపం! చాలాసేపునుండి, బారులు దీరిన వరసలో నున్నారు. ఈ ద్వారం ప్రక్క ప్రదేశాలనుండి యాత్రికులు ఎక్కువగ నున్నారు. ఎంత సేపటికి స్వామి దర్శనము కాక నిరాశతో నున్నారు. ఇంతలో మొదటి వరుసలో నున్న సుజాత, కవితను జూచి, కవిత! ఆ వరసలో ఉన్న మేఘవర్ణంచీర కట్టుకున్నావిడను చూచావా చాలామంచిది. అంతేకాదు మంచి రచయిత్రి. ఆవిడరచనలు నాకు యిష్టము. ఆవిడ భర్త డి. యస్. పి. ఆ వెనకున్నాతడు ఆమెకొడుకు విదేశాలలో చదువుతున్నాడట. అయినా కూతుర్లు లేరు. నాకున్నారు. పంచమశనిలాగా ఐదుగురు కూతుర్లు. ఒక్క కొడుకు కూడా లేడు నా ఖర్మ. ఈ దేవునికి ఎన్నిసార్లు అభిషేకాలు, కుంకుమార్చనలు చేయించామో తెలుసా? అంతేకాదు నవగ్రహ పూజలు కూడా చేశాము.

మూడవ వరసలో నున్న రుక్మిణి రాధ చెవిలో ఏదో చెపుతుంది. ఏమిటో అంత రహస్యం! ఇదంతా గమనిస్తున్న సుహాసిని స్వామి దర్శనానంతరం రాధను అడిగింది. అదా! అంటూ సమీపములో పొన్నచెట్టు క్రింద నిలుచున్నావిడను చూపిస్తూ! రుక్మిణీగారి స్నేహితురాలట. యింతలో 'ఎంత అందంగుంది' అన్నది సుహాసిని. అంతేకాదు ఆమె మెడలో నున్న రాళ్ళ నెక్లెస్సు క్రిందటి నెలలో చేయించారట. అబ్బ! ఆవిడ మెడ కెంతందంగా ఉందో కదూ! అన్నది సుహాసిని. అంతేనా ఆవిడ కట్టుకున్న చీర, రవిక, బొట్టు, గాజులు ఒకే రంగులో ఆవిడకు ఎంత అందం యిస్తున్నాయో చూడు అన్నది రాధ. ఇంతకు ఆవిడగారి భర్త ఏ ఆఫీసులో ఆఫీసరుగా ఉన్నారో అని అడిగింది సుహాసిని రాధను. 'జిల్లా ఔషధాల అధికారి. ప్రభుత్వాధికారికి ఏమితక్కువ. నెలకెంతాదాయమో' అన్నది

"రాధ. మనమున్నాము మన భర్తలున్నారు ఎందుకు? నెలాఖరు వస్తేసరి చేతిలో చిల్లిగవ్వ ఉండదు." అని రాధ సుహాసినీలు నిరాశాజీవులై వారి వారి ఇండ్లకు చేరుకున్నారు. ఇలాంటి వారెందరో నిత్యం నిరాశతో జీవించువారు. ఐన దేవునితో ఏమని మొరపెట్టుకున్నారో?

పవిత్రస్థలాల్లోవాండ్లకున్న స్వల్పకాలంలో మనస్సు క్షాళితము జేసుకొని వాళ్ళ జీవితాలు ప్రశాంతము జేసుకొని సుఖజీవనము గడుపుటకు బదులు ఇక్కడ కూడా పై పై మెరుగుల నాగరికత, డబ్బు, అంతస్తుల చింత మానరుకదా ఈ మానవులు. పైకి జూడ ఎంతో శ్రద్ధాభక్తులతో దేవున్ని దర్శించ వచ్చిన భక్తాదుల్లాగ కనుపడుదురు. ఇది వారి ఆత్మవంచన కాదా?

మనదేశములో అనేక వేదాంతాశ్రమాలున్నాయి. ఈ సమాజమందలి కలుషితం తొలగించుట కెంత కృషి చేస్తున్నవో కొంత ఆలోచించెదము.

ఊరికి దూరాన ప్రశాంత వాతావరణంలో చక్కటి ఆశ్రమాలున్నాయి. రకరకాల పూలమొక్కలతో ఆశ్రమంచుట్టు టెంకాయ, అరటి, మామిడిచెట్లతో చూడముచ్చటగా నున్నవి. మానవజీవిత సాఫల్యం కొరకు తగిన సాధనా సంపత్తు ఇక్కడుండునని ప్రజలు, అక్కడి స్వాములవారికి నూటా పదహారులు, వెయ్యిన్నీ పదహారు లిచ్చి స్వామివారి శిష్యులుగా చేరుదురు.

"అహం బ్రహ్మాస్మి" నేనే భగవంతుడను, కలియుగ అవతారమూర్తినని వెర్రికేకలతో మానవాళిని వెర్రివాళ్ళను జేయుచు, అర్థం గాని ఉపనిషత్తులను వింతవింత మాటలతో చెప్పుచూ, ఇది అనాదిగ వస్తున్న సాంప్రదాయమంటూ, బాగా డబ్బు నార్జించి, బీర్వాల్లో, బ్యాంకుల్లో, మరికొంత పొలాలు కొని, ఏటావచ్చు ఆదాయముతో నాలుగు దిక్కుల నాలుగుమఠములు స్థాపించి వాళ్ళ కీర్తి ఆచంద్రార్కముండు నట్లు "అమాయిక ప్రజలను మోసగించుటకు కారణమేమి?"

అంతేకాకుండా మరొక మోసము కూడా చక్కని నేర్పుతో జరుగుచున్నది. అదేమనగా, పై జెప్పిన ఆశ్రమాలలో నేడు ఎలాంటి ఆధ్యాత్మిక జిజ్ఞాసులున్నారంటే, బాగా డబ్బులున్నవారు పెద్దపెద్ద హోదాలో నున్నవారే ప్రప్రథమ శిష్యులు. ఇలాంటి గురుశిష్యులమధ్య, ప్రత్యేకప్రజ్ఞ మాట చాతుర్యం గల వాండ్లతో ఎంతటి కష్టమైన పనికూడా చాల సులభంగా జరిగిపోతుం[ది]. ఇంకెన్నో స్వదేశీ విదేశీ అక్రమ వ్యవ[హా]రాలున్నావో వ్రాయుటకు ఈ చిన్న క[లము చా]లదు. ఆపాపకార్యాలు వ్రాయుట[కు] నా కలం నుండి కన్నీళ్లు కారుతున్న[వి]. అందుకే నా కలం వ్రాయకున్నది.

ఇక మనదేశనాయకుల యంత్రాంగవ[ర్గం] మనపై ప్రయోగిస్తున్న నేటి పరిపాలన విధాన్ని వ్రాసి విసిగించుట నా ధ్యేయ[ము] కాదు. ఈ చిన్న సమయము చాలద[ని] మనవి చేసుకొంటున్నాను. ఐనన[ు] చివర ఒక్కమాట! అనేక హిందూ క్రైస్త[వ] మహమ్మదీయ మశీదులు, ఆలయాలే కా[క] మరెన్నో మంచి సంస్థలున్నాయి. వా[టి] యొక్క మూలపురుషుల ముఖ్యఉద్దేశాలన[ు] చక్కటి ఆచరణలను గ్రహించుట మాని మనవారు ఈర్ష్యాసూయాలతో, ఒకరి నొ[క]రిని కొట్టుకొని, కాల్చుకొని, మతోన్మాదులై దురహంకారులై వీరవిహారం చేయ[ు]చున్నారు.

అనేక సంవత్సరాలు ఘోర తపస్సుచేసి సత్యాన్ని తెలుసుకొన్న మహాత్ములు, వారు పునీతులై సాటివారిని పునీతులను జేయుటకై సత్‌గ్రంథాలు, సత్యసాధనలు తెలిపిరి. నిస్వార్థులు, నిరాడంబరులు మానవకోటిని జాగృతి పరచిరి. సుజ్ఞానులుగా వినూత్నమైన జీవనములో నడుచుటకు, మహర్షుల జీవితాలను మనకంకితముచేసి చిరంజీవులైరి. అట్టి జ్ఞానులు జన్మించిన మన జన్మభూమిలో అట్టివారు ఇప్పటికీ లేకపోలేదు. ఉన్నారు. అట్టి జ్ఞానులను వివేకముతో గుర్తెరిగి శ్రద్ధాభక్తితో, వారి అడుగు జాడల్లో నడవాలి. ఆధ్యాత్మిక సాధన ఒక్క మొగజాతికని, ఒకే కులానికి అర్హతఉందని తలంచుట అన్యాయం. స్త్రీజాతికిని ఇతర ఏ కులానికైనను అర్హతకలదు. అలా అర్హత కల ప్రతివారు మహనీయులౌతారు. అనాడే మనమంతా ఒక్కటిగ ఒకే కుటుంబముగా సుఖజీవనము చేయగలము. అందుకే మన మంతా మారాలి.

"ఐన మనిషి మారేదెపుడు"!!!! •

# శ్రీ వేంకటేశ్వర లీలలు

— జి. ఉమాప్రియదర్శిని

కలియుగంలో భక్తులపాలిట కరుణా సముద్రుడయిన శ్రీ వేంకటేశ్వరుని మహిమ అనంతమని నిరూపించే సంఘటనలు కోకొల్లలు అటువంటిదే ఒకటి మాకు అనుభవమయినది.

అది 1972వ సంవత్సరం జూన్ నెల మా అక్కయ్య వివాహం జరిపించాలని మా నాన్నగారు ఎంతో ప్రయత్నించి,సంబంధం కుదుర్చుకుని, ముహూర్తం పెట్టించారు. జూన్ 28వ తేదీ ఉదయం పదిగంటలకు ముహూర్తం. అదృష్టవశాత్తూ మాకు అన్ని విధాలా అనుకూలమయిన సంబంధమే కుదిరిందని,అందరూ ఎంతో సంతోషించారు మా ఆర్థికపరిస్థితి అనుకూలంగా లేకున్నా, అందివచ్చిన అవకాశం జారిపోతుందన్న భయంతో, మా నాన్నగారు మాకున్న భూమిలో కొంతభాగం అమ్మివేసి అక్కయ్య వివాహానికి సిద్ధమయ్యారు

పెళ్లిపనులు జోరుగాసాగుతున్నై. మా ఇంట్లో జరుగుతున్న మొదటి శుభకార్యం కాబట్టి, అంతోయింతో మా స్థాయికి తగ్గట్టు ముచ్చటగానే అక్కయ్య పెళ్లి జరిపించాలని నాన్నగారు ఏర్పాట్లు బాగానే చేయిస్తున్నారు

వివాహమింకా నాలుగురోజులుండనగా ఆ సాయంత్రం మంచిరోజని పందిరి వేయిస్తున్నారు. వాకిట్లో - పందిరి దాదాపు అయిపోవచ్చేసరికి, వర్షం మొదలయి, క్రమంగా పెరిగిపోయి కుంభవృష్టిగా మారింది. ఆ వర్షం చివరికి ముసురుగా మారింది

ఆ ముసురు పెళ్లిరేపనగా కూడా వదలలేదు ముసురులోనే ఎలాగోలా పనులు జరిగిపోతున్నై. దూరప్రదేశాల నుండి రావలసిన బంధువులంతా దిగుతున్నారు వరుసగా.

నాలుగయిదురోజులుగా తెంపులేని వర్షం మూలంగా, మా ఇంటిచుట్టూ నీళ్ళునిలబడి, జలాశయం మధ్యన కుటీరంలా కనిపిస్తోంది మా ఇల్లు -

తెల్లవారితే వివాహమనగా ఆ సాయంత్రం కూడా ముసురు తగ్గలేదు ఆ ముసురులో, ఆ జలాశయం మధ్యన ఎలా వివాహం జరపాలో తోచక సతమతమయిపోతున్నారు నాన్నగారు. వచ్చిన బంధువులంతా మా అవస్థ చూచి బాధపడుతున్నారు. గ్రామస్థులుకూడా, "పాపం! ఎలాగోలా తంటాలుపడి పిల్లపెళ్లి పెట్టుకున్నాడాయన ఎలా గట్టెక్కుతాడో ఏమో?" అని జాలిపడుతున్నారు.

మా నాన్నగారికి ఎటూ దిక్కుతోచటం లేదు మా సమీపంలో తెనాలి పట్టణంలోగల ధర్మసత్రాలు, కల్యాణమండపాలు అన్నీ తిరిగేశారు కాని ఎక్కడా ఖాళీలేదు అది ఆ ఏటికి ఆఖరిలగ్నం కావటంవలన, అన్నిచోట్ల ముందేబిగిసిపోయినై

నిరాశతో సాయంత్రం ఏడుగంటలకు తిరిగి తిరిగి ఇల్లుచేరారు నాన్నగారు. రావలసిన బంధువులంతా చాలావరకు వచ్చేశారు. వంటవాళ్ళువగైరాకూడా హాజరయ్యారు. వరుణదేవుడు మాత్రం మమ్మల్నివదలిపెట్టివెళ్ళనని శిక్షవేశాడు

ఎంతోముచ్చటగా అక్కయ్యపెళ్లి జరిపించాలని ఆశించిన అమ్మ, అత్తయ్య అంతా దిగాలుపడిపోయారు ఆ మధుర క్షణాలకోసం - జీవితంలో ఒకేసారి లభించే ఆ అమృతఘడియలకోసం కలలుకంటూ, అందరిలాగే ఎదురుచూస్తున్న అక్కయ్య క్రుంగిపోయి ఓ మూల కూలబడిపోయింది.

ఎవ్వరికీ మనసులో మనసులేదు. అందరూ బరువెక్కినహృదయాలతో, నోటి మాటరాక కూర్చుండిపోయారు అర్ధరాత్రి వరకూ.

మా నాన్నగారు మండుతున్నఅగ్ని పర్వతంలా కనిపిస్తున్నారు. కుర్చీలో కూర్చుని గంభీరంగా శూన్యంలోనికి చూస్తున్నారాయన అయన్ని సమీపించటానికి, పలకరించటానికి ధైర్యం చాలటం లేదెవ్వరికీ

ప్రొద్దుపోయింతర్వాత, మాఇంటికి సమీపంలోనేవున్న మా శ్రేయోభిలాషి ఒకాయన వచ్చాడు నాన్నదగ్గరకు. ఆయనగారిది చాలావిశాలమయిన వరండాగల పెద్దడాబాయిల్లు ఆ కాంపౌండులో పెద్దచావిడికూడా ఉంది పరిస్థితి అంతా తెలిసిన ఆయన నాన్నగారికి ఒక సలహాయిచ్చాడు "ఎంత వర్షంవచ్చినా ఏ ఆటంకంలేకుండా పనులన్నీ జరిగిపోతై మాఇంట్లో వివాహం జరిపించవయ్యా!" అని ఏర్పాట్లన్నీ తనే చేయిస్తాననికూడాచెప్పాడు.

నాన్న రెండు క్షణాలు ఆలోచిస్తూ కూర్చున్నాడలాగే. ఆయనగారి సలహా మావాళ్లందరికీ బాగానేవుంది. అలాచెయ్యటమే మంచిదని అంతాభావించారు.

రెండుక్షణాల తర్వాత నాన్న గట్టిగా శ్వాసలాగివదిలారు. "ఏదిఏమైనా నాబిడ్డ వివాహం ఈ పందిట్లోనే జరిగితీరాలి" అంటూ లోనికివెళ్లిపోయారు. వచ్చినాయన సణుక్కుంటూ వెళ్లిపోయాడు. నాన్నకు ఒకళ్లుసలహాలివ్వటం అలవాటులేదని మాబంధువులంతా గొణుక్కోవటం, గుసగుసలాడటంతప్ప, ఆయనతో వాదించి ఒప్పించే ధైర్యం ఎవ్వరికీలేకపోయింది.

నాన్నకాస్సేపయింతర్వాత అక్కయ్యవున్న గదిలోనికివచ్చి, ఆమె తలనిమిరి ధైర్యంగావుండమన్నట్లు, వీపుచరిచి తిరిగి లోనికివెళ్లిపోయారు

ఆ తర్వాత తెల్లవారేవరకూ, ఆయన అర్ధనిమీలితనేత్రాలతో శూన్యంలో ఎవరినో చూస్తున్నట్లు తదేకంగా దృష్టినిలిపి, పీటమీదనేకూర్చుండిపోయారు.

ఇంట్లో అందరూ క్రమక్రమంగా నిద్ర లోనికి జారిపోతున్నారు. భళ్ళున తెల్ల వారింది.

వర్షం తగ్గుముఖంపట్టింది సన్నగా తుంపరలు మాత్రం పడుతున్నవి యింకా సరిగ్గా ఆరున్నరకు నాన్నగారు రాత్రి కూర్చున్న చోటునుండి లేచారు. ఎదురుగా కిటికీనుండి మబ్బుతునకలను ఛేదించు కుంటూ వస్తున్న సూర్యభగవానుడు కనిపి స్తున్నాడు నాన్నగారి కళ్ళలో వెలుగు కనిపించింది ఆయనకు సమీపంలోనే నిలబడి పరిశీలిస్తున్న నాకు.

నాన్నగారు తన ఎదురుగా పూజామంట పంమీదనున్న, తన ఇష్టదైవమయిన శ్రీ వేంకటేశ్వరునిముందు సాష్టాంగపడిలేచారు. బయటకు వచ్చి కార్యరంగంలోనికి దిగారు.

ఆతర్వాత అంతా, సినిమారీలులా చకచక జరిగిపోయింది.

సరిగ్గా ఏడున్నరకు పెళ్ళివారు బస్సులో తరలివచ్చారు గ్రామంలోని మాఅభి మానులు ఆత్మీయులు అంతా పిలవకుండానే పోగయి,తలోపని, చెప్పకుండానే చేసుకు పోసాగారు పందిరిఅలంకరణ- వియ్యాల వారి మర్యాదలు, వంటలువార్పులు, బాజా భజంత్రీలు అన్నిక్షణాలమీద, చకచకజరిగి పోతూంటే, ఏనాడుమాఇంటికి రానిగ్రామస్థు లంతా,యువకులు,పెద్దమనుష్యులు నిలబడి, తమ స్వంతకార్యంలా జరుపుకుపోతుంటే, ఈగ్రామంలో ఈయనకింత పలుకుబడి, అండదండలువున్నాయా! అని వియ్యాల వారితో పాటు, మేము సైతం విస్తు పోయాము.

అనుకున్నప్రకారం, అన్నిముచ్చట్లతో, సెకండుతేడాలేకుండా సూత్రధారణ జరిపిం చారు నాన్నగారు. మిగిలిన ఏర్పాట్లుకూడా అందరూ మెచ్చుకునేలా జరిగిపోయినై. ఆ పెళ్ళిపీటలమీదకూర్చున్న అక్కయ్య కళ్ళలో వెలుగు, సంతృప్తి మాటల్లో చెప్ప లేను

భోజనాలయింతర్వాత అంపకాల తంతు పగయిరా ముగిసేసరికి మధ్యాహ్నం కాఫీల వేళయింది టిఫిను, కాఫీలు పూర్తిచేసు కొని, అక్కయ్యను వెంటబెట్టుకొని వియ్యా లవారు వెళ్ళిపోయారు.

నాన్న వంటరిగా గదిలో నిలబడివుంటే దగ్గరగావెళ్ళాను ఆయన శ్రీ వేంకటేశ్వరుని ముందునిలబడి చేతులు జోడించి, స్వామితో ఏదో అంటున్నారు

విచిత్రమేమంటే ఆ రాత్రి ఏడున్నర ఎనిమిది గంటలకు మళ్ళీవర్షం మొద లయింది ఆ ముసురుతిరిగి నాలుగురోజుల వరకు వదలలేదు.

అక్కయ్య పెళ్ళి అటూ యిటూ ముసురు మధ్యవదిఘడియల వ్యవధిలో నిర్విఘ్నంగా జరిగిపోయింది ఏలోటులేకుండా

ఆ రాత్రంతా నాన్న పెట్టుకున్న మొర ఆలకించిన శ్రీ శ్రీనివాసుడే తన మహిమను ప్రదర్శించి, మా ఇంటిశుభకార్యం సంతో షంగా జరిపించాడని మా అందరివిశ్వాసం

అప్పటి నుండి మాకుటుంబంలో అందరికీ ఏడుకొండలవాడిపై అంతులేని నమ్మకం. భక్తుల పిలుపులకు పలికేదైవంగా ఆ ఏడు కొండలవాడిలా ఎందరినికాపాడుతున్నాడో!

---

# శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము

**నిత్యకల్యాణోత్సవం .**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12 00 గంటలవరకూ జరుగుతుంది ఈ సేవకు 160 రూ॥లు చెల్లించాలి పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు గృహస్థుకు వస్త్రబహు మానం వుంటుంది

**అభిషేకం**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించే వారు 100 రూ॥లు చెల్లించాలి ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి

# కుబేర వృత్తాంతము

— సి. హెచ్. మహాలక్ష్మి

కలియుగవైకుంఠంగా ప్రసిద్ధికెక్కిన తిరుమలయిందు, అవతరించిన శ్రీనివాసుడు స్వకళ్యాణమునకై అలకాపురాధీశ్వరుడైన కుబేరుని ధనసహాయము కోరుట పురాణ ప్రసిద్ధము వడ్డికాసులవాడు, ఆపద మ్రొక్కుల వాడు, జనవంద్యుడైన శ్రీ వేంకటేశ్వరునకు ఋణమిచ్చిన కుబేరుని పూర్వజన్మ వృత్తాంతము తెలుసుకొందము.

పూర్వము కాంపిల్యపురమునందు యజ్ఞదత్తుడను విప్రుడుకలడు. సకల విద్యా పారంగతుడైన అబ్రాహ్మణోత్తమునకుగుణనిధియను పుత్రుడుండెను అతడుబ్రాహ్మణాచారములైన సంధ్యావందనములు, అగ్నిహోత్రములను పరిహసించుచు నృత్య గీత, వాద్య వినోదముల యందు కాలము గడుపసాగెను. చెడుసహవాసములు చేసి ఓడిన ధనమునకై తల్లి ఆభరణములను అమ్మెడివాడు తల్లి ఎన్నోవిధముల హితవు చెప్పెడిది. యజ్ఞదత్తునకు గృహకార్యములు నిర్వర్తించుటయందే సమయము గడచి పోయెడిది. అందుచే కుమారవర్తనమును పరామర్శింపలేక పోయెడివాడు. తీరిక చిక్కిన తడవుననే కుమారుని స్నానపానాదికములు, సంధ్యావందన, అగ్నిహోత్రాది కార్యములు గురించి భార్యను ప్రశ్నించెడివాడు కన్నబిడ్డమీది మమకారముచే గుణనిధి నడతను తల్లి కప్పిపుచ్చెడిది.

మృగయా వినోదము, మద్యపానము, వేశ్యాగృహప్రవేశము, ద్యూత, చౌర్యములు,పరదారాభిలాషణము అనుదోషములు నవయౌవనారంభమున సంభవించెనేని వానిని మాన్పుట ఎవరికిని శక్యముకాదు. తల్లిబోధనలన్ని గుణనిధికి చెవిటివాని యందు శంఖమూదినట్లు అయ్యెడివి

అది అట్లుండ యజ్ఞదత్తుడొకనాడు నవరత్నమయమైన తన అంగుశీయకమును ఒక జూదరి వ్రేలికినుండుటజూచెను. అది యాతనికి నెట్లువచ్చెనో యథార్థము చెప్పుమనెను. అంతట నాజూదరి జూదమున ఓడిన ధనమునకై గుణనిధియే ఇచ్చెనని తెలిపెను ఇంకను అనేక బంగారు ఆభరణములు కూడతాకట్టు పెట్టెనని చెప్పెను

యజ్ఞదత్తుడు కోపావేశముతో గృహమున కరిగి కుమారుని నడత విషయమై అసత్యములు పలికిన భార్యను దూషించెను 'కుపుత్రత్వంబు కంటె అపుత్రత్వంబు మేలని, కులభ్రష్టుడైన నొక్కని త్యజించి కులంబురక్షించుకొనుటమేలనియు, తలంచి, భార్యాపుత్రుల నిరువురను వదలివైచెను.




గుణనిధియు తండ్రి ఆగ్రహమును తెలిసికొని విద్యయు, ధనమును లేక, భిక్షాటనము చేయ మనసంగీకరింపక, ఆకలిబాధ భరింపరానిదికాగా నొకదినమంతయు పరితపించెను. ఆరాత్రి శివరాత్రియగుటచే శైవుడొకడు తోడివారితోకూడి నొక శివాలయమునందు నృత్య, గీత వాద్యములచే ప్రొద్దుపోవు వరకు శివుని సేవించి ఇంచుకమత్తులో మునిగెను. తగినసమయము కొరకు నిరీక్షించుచుండిన గుణనిధి గర్భాలయమున ప్రవేశించి కాంతిహీనమైన దీపమును కాంతివంతముగ చేయుటకై నేతినివేసి, తనవస్త్రమును వత్తిగావేసెను. శివభక్తులు ప్రసాదమునకై తెచ్చిన పక్వాన్నపాత్రను చేతనుబట్టి వెలుపలికి రాసాగెను. విధివశమున ఆతని కాలివ్రేలు నిదురించుచున్నవారిలో ఒకని శరీరమునకు తగిలెను. తత్తరపాటుతో మేల్కొనిన ఆతని అరపుతో అందరును నిద్రనుంచి లేచిరి గుణనిధి అన్నపాత్రను విడువక భయముతో పరుగిడగా ఆలయమున మేల్కొనిన ప్రజలందరును వెంటబడి బాణములనువేసి ఆతనిని చంపివేసిరి

తదుపరి మరణించిన గుణనిధిని గొనిపోవుటకై యమభటులును, శివభటులును యేతెంచిరి. శివభటులను జూచిన యమభటులు భీతులై మహాత్ములారా! కులాచారహీనుడు, పితృవాక్య పరాఙ్ముఖుడు, సంధ్యాస్నాన వర్జితుడు, శివనిర్మాల్యాపహర్తయైన గుణనిధియందు లేశమాత్రము ధర్మం కన్పింపదు గద! ఈతని గొనిపోవ మీరేల



వచ్చితిరి, తెలుపమని అడిగిరి. శివకింకరులు వారి వచనములను విని

"శివధర్మం బతి సూక్ష్మము
శివధర్మము లేశమైన సిద్ధించినచో
వివిధ మహాపాతోప -
ద్రవములు చేరంగ రావు ధన్యుని నతనిన్"

అనుచు శివధర్మములు తెలియపఱచి ఇంకను

ఆచారం బిది యనంగ న
నాచారం బిది యనంగ నజునకునైనన్
గోచరము కాదు శివధ-
ర్మాచారము సూక్ష్మరూపమైవర్తిల్లున్

అని శివధర్మాచారము యొక్క సూక్ష్మరూపము గుణనిధివర్తనమున ఏ విధముగ నున్నదో చెప్పసాగిరి

'ఆహారము లభింపని కారణముననైన శివరాత్రిప్రొద్దంతయు ఉపవసించెను శివప్రసాదము నపహరించు నిమిత్తమునైనను రాత్రంతయు జాగరణచేసెను. అన్నపాత్రను చూచుటకైనను దీపమును వెలిగించెను. చూచుటకిష్టములేకున్నను ఇతరులు చేసినట్టి శివపూజను చూచెను. శివాలయము ముంగిట మరణించెను సూక్ష్మదృష్టియందు విచారించిన ఇంతకన్నను వేరు శివధర్మములు లేవు' అనిచెప్పి యమదూతలను పంపివేసిరి. దివ్యవిమానమునందు గుణనిధిని కూర్చుండబెట్టి శివలోకమునకు గొనిపోయి శివుని సన్నిధిని పెట్టిరి విధివశముచే మరణసమయమున గుణనిధికి కలిగిన క్షణికపుణ్యఫలముగా పరమేశ్వరుడాతనిని కళింగదేశాధిపతియైన అరిందమునకు తనయుడుగా, దముండనుపేర ఆ దేశమునకు రాజుగా అనుగ్రహించెను.

ఈశ్వరానుగ్రహముచే పట్టాభిషిక్తుండైదముడు తన నగరమున ఇంటింటియందును శివాలయములందును అసంఖ్యాకములైన దీపముల నుండునట్లుచేసెను. అట్లుచేయని వారితలతెగునట్లుగ చాటింపు వేయించెను. దీపికాదానప్రభావముచే కళింగాధిపతియైన ఆ దముడు జన్మాంతరంబున కుబేరనామధేయుడైఈశ్వరున కిష్టుడయ్యెను.అంతియ కాక కలియుగ ఆరాధ్యదైవము అయిన శ్రీవేంకటేశ్వరుని కల్యాణమునకు మూలకారకు డయ్యెను.

*

# నాస్తికుడి భక్తి

— యం. వి. యస్. రంగాచార్యులు

పూర్వము ఒక గ్రామములో రంగయ్య అనేవాడు ఉండేవాడు. అతడు ఒకప్పుడు ఎనలేని దైవభక్తి కలవాడు. కొన్ని అనివార్యకారణాలవల్ల నాస్తికుడుగా మారినాడు. కొన్ని రోజులకు ఆ గ్రామములో జాతర సాగుతుందని, గ్రామములోని ప్రజ అందరు ఒక ప్రసిద్ధ స్వాములవారిని పిలిపించి జాతర ఘనముగా జరిపించాలనే కుతూహలముతో, కార్యక్రమములకు సన్నాహాలు చేయతలంచి అందరి వద్ద చందాలు ఘనముగా వసూలు చేసినారు.

స్వాములవారు ఆధ్యాత్మిక విషయాలపై కొద్దిసేపు చర్చించిన పిదప, గ్రామములో అతిపెద్ద సమావేశమును ఏర్పాటు చేయ సంకల్పించినారు. సమావేశము అతివైభవముగా ముగిసిన పిదప రంగయ్య నెమ్మదిగా స్వాములవారి వద్దకు వెళ్ళి సాదర పూర్వకముగా నమస్కరించి "స్వామీ, మీరు గొప్పగా ఆధ్యాత్మిక చింతనలో అనుభవము కలవారని తలంచి మా గ్రామప్రజ అందరు మిమ్మల్ని ఆహ్వానించి, జాతర కార్యక్రమాన్ని వైభవోపేతముగా జరిపించినారు. కాని నేను దేవుడంటే నమ్మను. ఎందువల్లనంటే దేవుడు మన కంటికి కనిపించడు. కనిపించనిదానిని నమ్మి వృథాగా చెడిపోవడం తప్ప ఫలితమేమీ ఉండదనుకుంటాను. కనపడని దానిని దేవుడని ఎలా నమ్మాలి స్వామీ" అన్నాడు. దానికి స్వామీజీ శాంతముగా "నాయనా! నీవు అశోకచక్రవర్తిని చూశావా" అన్నారు

రంగయ్య ' "చూడలేదుస్వామీ" అన్నాడు.

అప్పుడు స్వామీజీ శాంతంగా నీవు అశోకుడిని చూడలేదు కదా అశోకుడు ప్రజల క్షేమాన్ని కోరి ఎన్నో ఘనకార్యాలను చేశాడు కదా" అన్నారు.

దానికి రంగయ్య "అవును స్వామీ" అన్నాడు.

అప్పుడు స్వామీజీ "ఆ సంఘటనలను గురించి ఎలా నమ్ముతున్నావు" అన్నారు

అవన్నీ మన చరిత్రల ద్వారా తెలుసుకోగలిగాను" అన్నాడు రంగయ్య.

స్వామీజీ "మనకు స్వాతంత్ర్యం ఎలా వచ్చింది" అన్నారు. "గాంధీజీ మొదలైన దేశభక్తుల కృషితో" అన్నాడు రంగయ్య "ఆ విషయాన్ని ఎలా నమ్ముతున్నావు" అన్నారు స్వామీజీ

"పుస్తకాలద్వారా" అన్నాడు.

దానికి స్వామీజీ "రంగయ్యా! దేవుడు ఉన్నాడు. అతడు నీకు కీలుబొమ్మకాదు. కనపడదానికి నీ ఆత్మను గెలిచిఅరిషడ్వర్గాలను జయించిననాడు నీకు దైవసాక్షాత్కారం లభిస్తుంది" అన్నారు

దానికి రంగయ్య పశ్చాత్తాపపడి క్షమించండి స్వామీ అన్నాడు.

అప్పుడు స్వామీజీ "నాయనా, విషయం తెలియకముందు అజ్ఞానంలో మునిగినావు. కాని జ్ఞాని ఐనవాడు దైవభక్తితోనే తరిస్తాడు" అన్నారు.

అనంతరం రంగయ్య ఆస్తికుడిగామారి నాస్తికులందరిని ఆస్తికులుగా మారుస్తూ జీవితాన్ని గడిపినాడు

## విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణము

[గ్రంథకర్త శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ ప్రకాశకులు. శ్రీలక్ష్మీహయగ్రీవ సేవాట్రస్టు, బెంగుళూరు ప్రాప్తిస్థానం: కుంటిమద్ది శేషశర్మ 2-223 4వ అడ్డరోడ్డు, అనంతపురం — 51500 పు 78 వెల రూ 6/-]

ఇది భగవద్రామానుజులు ప్రతిష్ఠించిన మతాన్ని తెలిపేగ్రంథం దీనిలో జీవుడు భగవంతుని పొందటానికి ఉపాయం చెప్పబడింది. ఈ మతసంప్రదాయానికి చెందిన గ్రంథాలు ద్రావిడభాషలో ఎక్కువ కనుక ఆ విషయాలు తెలుగువారు తెలుసుకునేటందుకు ప్రకాశకులు దీన్ని వ్రాయించినట్లు తెలిపినారు. సాధారణంగా మతగ్రంథాలు పరిభాషలతోనిండి దురవగాహంగా ఉంటవి కాని ఈ కృతి ఆ విధంగా లేకపోవటం ఒక విశేషం.

శ్రీమాన్ శేషశర్మగారు గద్యపద్య రచనలో సిద్ధహస్తులు విశిష్టాద్వైతములో పారంగతులు. కనుక ప్రకాశకులు వారిని కృతిరచనకు ఎన్నుకోవటం సముచితం. వారీ చిన్నపుస్తకంలో విషయాన్ని "పురుషార్థాలు" మొదలుకొని 'నిగమనం' వరకు ఇరువదిరెండు శీర్షికలుగా విభజించి వివరించినారు. ప్రతి శీర్షిక సంక్షేపంగాను, సమగ్రంగాను ఉండి, కవిగారికి మతసంప్రదాయ విషయాలపై ఉండే అధికారాన్ని తెలుపుతుంది. వివరణలో వారు అవసరమైన మేరకు భగవద్గీత శ్రీభాష్యం, ఇంకా ఇతర సంస్కృతరచనలనుండేగాక, తమవైన శాంతివిలాసం, కేశవప్రపత్తి, యతిరాజీయము మున్నగువానినుండిగూడ ఉదాహరణ లిచ్చి విషయానికి పుష్టిని చేకూర్చినారు.

దీనిలోని రెండవ శీర్షిక ఆత్మవిచారంలో శర్మగారు మనలో ఉండేవానినేమంటారు? అతనిరూపమేమి? గుణమేమి? ప్రవృత్తియేమి? అని ప్రశ్నలువేసి వానికి సమాధానంగా ఆత్మస్వరూపాన్ని తేటపరచిన తీరు సరళంగాను సుబోధకంగాను ఉండి పాఠకునికి విషయజ్ఞానాన్ని స్పష్టంగా కలుగజేస్తుంది.

అనంతరశీర్షిక మోక్షస్వరూపంలో దాన్ని చార్వాకులు, అద్వైతులు ఏ విధంగా భావిస్తారో చెప్పటం పాఠకునికి ఎంతైనా ప్రయోజనకరం దీనిలో శీర్షికలలోనికెల్ల జీవేశైక్య ప్రభృతి కలహం అన్నిటికంటే పెద్దది దానిలో కవిగారు అద్వైతులకు, విశిష్టాద్వైతులకుగల భేదాన్ని శాస్త్రోపపత్తులతో చక్కగా చూపినారు ఈ సందర్భంలో "విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని" అనే గీతాశ్లోకానికి శాంకరభాష్యం, దానిపై రామానుజుని ఆక్షేపం, ఆయన చూపిన సమన్వయం చెప్పి పాఠకునికి ఆత్మ విషయంలో సిద్ధాంతపరమైన సదవగాహనకు తోడ్పడినారు

# గ్రంథసమీక్ష

విశిష్టాద్వైతంలో అన్నిటికంటే ముఖ్యమయింది ప్రపత్తియోగం కనుక భక్తియోగం తరువాత దాని స్వరూపం, అందులోని భేదాలు, జీవోత్క్రమణానంతరం భక్తునికి ప్రపత్తివలన కలిగే ఫలితం ఈ పుస్తకంలో స్పష్టంగా చెప్పబడినవి.

ప్రపత్తి, ఫలం పిమ్మట ఫలప్రాప్తికి విరోధించే విషయాలు తెలిపి, గ్రంథం, భక్తుడు పంచసంస్కార సంపన్నుడు ఎందుకు కావలెనో బోధిస్తూ ఉపసంహరింపబడింది. అది ఈనాడు మతాచారాలను విమర్శించేవారికి, విసర్జించేవారికి జవాబుదారీగా గూడ ఉంది. ఈ విధంగా పుస్తకం చిన్నదైనా గ్రహించినవస్తువు విశిష్టమయిందిగా విషయ పూర్ణంగా ఉంది. ఇక దీనిలోని రచనాక్రమం పరిశీలించినపుడు శీర్షికా నిర్ణయంలో పురుషార్థములు, ఆత్మవిచారం, మోక్షస్వరూపం, ప్రకృతిస్వరూపం అని వానిలో ఉచితమైన క్రమోన్మీలనం గూడ కనిపిస్తుంది.

శర్మగారు తమ విన్నపంలో "అద్దము గొప్ప విషయములను స్పష్టముగా హృద్యముగా వెల్లడించునుగాని సమగ్రముగా ప్రకటింప జాల"దని చెప్పినారు "కొండ అద్దమందు కొంచెమై యుండుట" లోక సహజమే. అయితే ఈ పుస్తకం పరిమాణంలో చిన్నదైనా వస్తుదృష్టితో మిక్కిలి గొప్పదనియే చెప్పవలె. సారసంగ్రహ రచనఅందరికీసాధ్యమయ్యేపనిగాదు కనుక విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని తెలుసుకొనగోరే వారందరిదీ తప్పక చదువవలసిన గ్రంథం.

ఈనాడు మతవిషయాలపై జనసామాన్యానికి భక్తిలేదు. కనుక ఇపుడిటువంటి రచనలు చేయటం, వాటిని ప్రచురించటం అంటే కాలప్రవాహానికి ఎదురీదే సాహసమే అనవలె. అందుచేత ఈ పుస్తకాన్ని రచించిన శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మగారు, ప్రచురించిన శ్రీలక్ష్మీహయగ్రీవ సేవాట్రస్టువారు, దీనికి అర్థిక సహాయం చేసిన టి. టి. డి సంస్థవారు ఎంతేని అభినందించ దగినవారు.

— కె. లింగమూర్తి.

## వేద విజ్ఞాన దర్శనము

[గ్రంథకర్త వేదాన్తం శ్రీనివాసాచార్యులు, పుటలు-139 + 32, మూల్యము, రు. 16-00 లైబ్రరీ ప్రతి రు. 20-00. ప్రతులకు: వేదాన్తం శ్రీనివాసాచార్యులు, మంచికలపూడి పోస్టు, గుంటూరుజిల్లా పిన్ - 522329 ]

ఈ గ్రంథమున - వేదములు, వేద విభజనము వేదాంగ శాస్త్రములు, కల్పసూత్రములు, స్మార్తసంస్కారములు, యజ్ఞములు, దర్శనశాస్త్రములు, వానప్రస్థ-సన్న్యాసాశ్రమములు, పారమార్థికము (భగవద్విషయము) అనెడి తొమ్మిదిప్రకరణములలో అనేక వైదికవిషయములు చర్చింపబడినవి.

భారతీయులకు వేదము పరమ ప్రమాణమను విషయమును ఎల్లరంగీకరింతురు. ప్రత్యక్షానుమానములచేత తెలియబడని

పరలోకాదులు, పాపపుణ్యములు, జీవుడు, దేవుడు, బంధమోక్షములు – ఇత్యాదులైన అతీంద్రియ విషయముల జ్ఞానము మాన వాళికి వేదమువల్లనే కలుగుచున్నది. కావున దానిని శబ్దప్రమాణమనియు, ఆగమ ప్రమాణమనియు సంప్రదాయజ్ఞులు వచించి నారు. అందుచేతనే అది ఆప్తవాక్యము కూడ. మన తాత, అవ్వ లెవ్వరో మనకు తెలియదు మన తాత అవ్వలు వీరు అని మన తల్లిదండ్రులు చెప్పిననేకాని తద్ జ్ఞానము మనకు కలుగుటలేదు అట్లే అతీం ద్రియ విషయముల జ్ఞానమును కూడ వేదము మనకు కలిగించుచు ఆప్తవాక్య మయినది. ఈ అంశములనే సాయణుడిట్లు వాక్రుచ్చినాడు –

"ప్రత్యక్షేణానుమిత్యా వా
యస్తూపాయో న బుధ్యతే
ఏతం విదన్తి వేదేన
తస్మాద్వేదస్య వేదతా"

ఋగ్యజురాదులగు వేదములు సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు – అని నాలుగు భాగములుగా నున్నవి. ఇందు ఉపనిషత్తులు కడపట నున్నందున, వానిని వేదాంతము లన్నారు ఈ గ్రంథమున 63 పుటలలో సంహితాదుల స్వరూపములు వివ రింపబడినవి. ఉపనిషత్తులను పరిచయము చేయునపుడు-సృష్టి - పరమాత్మ, జీవాత్మ, (వాడు)పరమాత్మనుచేరుట, ఆత్మతత్త్వము, ఓంకారము ఇత్యాదులు మంత్రోదాహరణ పూర్వకముగా నిరూపింపబడినది పిమ్మట వేదాంగములైన శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తి, జ్యోతిషము, కల్పము అను వాని స్వరూపములు నిరూ పింపబడినవి పది పుటలలో కల్పసూత్ర ముల పరిచయము జరిగినది

స్మార్త సంస్కారములలో నిషేక, గర్భా ధాన, పుంసవన, సీమన్త, విష్ణుబలి, జాత కర్మ, నామకరణ, అన్నప్రాశన, ప్రవాసాగ మన, పిండవర్ధన, చౌల ఉపనయన, పారా యణ వ్రతబంధ విసర్గములు, ఉపాకర్మ సమావర్తన పాణిగ్రహములు వివరింపబడి నవి ఈ సంస్కారములు శాఖాభేదమును బట్టి కూడ ఉండును. శిల్పబ్రాహ్మణులకు వేదవ్రతముతో పాటు శిల్పవ్రతము కూడ అధికముగా నుండును. పరిచయము లేనందునగాని, వైష్ణవ ప్రధానత్వముచే గాని గ్రంథకర్త ఇట్టి వానిని తడవలేదు. తరువాత యజ్ఞములనుగూర్చి వ్రాయుచు పంచయజ్ఞములను, పాకయజ్ఞములను, శ్రౌతయజ్ఞములను నిరూపించినారు.

వైశేషికము, నైయాయికము, సాంఖ్యము, యోగము, పూర్వోత్తర మీమాంసలు అనెడి షడ్దర్శనములను చక్కగా పరిచయము చేసినారు. దార్శనిక దృష్టి లోపించుచున్న నేటి వారికి దర్శన పరిచయ మెంతయో మేలు చేకూర్చగలదు తరు వాత వానప్రస్థ సన్న్యాసములను గూర్చి చెప్పినారు. పారమాత్మికమనెడి భగవద్విష యముతో గ్రంథము సమాప్తమగుచున్నది గ్రంథకర్త విశిష్టాద్వైతి యగుటచేత గ్రంథము తత్సంప్రదాయానుగుణముగానే కొనసాగినది అయినను ఎవ్వరిని నిందిం చుటగాని, చిన్నచూపు చూచుటగాని జరుగలేదు.

ఈనాడు వైదికమగు జ్ఞానము తత్సంప్ర దాయములు తెలిసినవారు మిక్కిలి అరు దుగ నున్నారు. అట్టివారికి వేదశాస్త్రము లననేమో, జీవాత్మ, పరమాత్మలననేమో, బంధమోక్షము లననేమో, జీవితసంసిద్ధికేయే సంస్కారముల నాచరింపవలయునో, వివాహ గర్భాధానాదుల అంతర్యము, లక్ష్యము ఏమో తెలిసికొన వలసిన అవసర మెంతయో కలదు. అట్టి జిజ్ఞాసువులకీ గ్రంథము అవశ్య పఠనీయము. గ్రంథకర్త చక్కని వేదశాస్త్ర, వేదాన్త పరిచయము కలవారని ఇందలి ప్రతిపుటయు సాక్ష్య మిచ్చుచున్నది. భాష సరళమై, శైలి మధు రముగా నున్నది ఇట్టి ఉత్తమ గ్రంథ మును తెనుగువారి కందించిన గ్రంథకర్త మిక్కిలి ప్రశంసార్హుడు పాఠకులీ గ్రంథ మును చదివి లబ్ధి నందుదురుగాక।

— డాక్టర్ కొండూరు

## నవోదయం

[రచన డాక్టర్ ఎస్ గంగప్ప, ప్రతులకు శ్రీ ప్రచురణలు, సి-73 శ్రీనివాసనగర్, గుంటూరు-522 006, డెమ్మీసైజు 76 పుటలు వెల రూ 6-00]

సంప్రదాయ విధేయులకు భాషమీద మక్కువ ఎక్కువ అయితే, నవ్యకవితా ప్రియులు భావానికి ప్రాధాన్యమిస్తారు నిజానికి భాషకూ భావానికీ సమప్రాధాన్యం లభించినప్పుడే కవితకు జిగీ బిగీ సమకూరు తాయి. ఈ రెంటిలో ఏ ఒకటి లోపించినా, ఆ వెలితి కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది

నేడు తెలుగు సాహిత్యంలో వచనకవితా సంపుటులు పరశ్శతంగా వెలువడు తున్నాయి ఛందోబద్ధమైన రచనలూ వెలువడుతూనేవున్నాయి కాని వచనకవితకు లభిస్తున్న ప్రచారం పద్యకవితకు లభించడం లేదేమో అనిపిస్తుంది ఒక్కొక్కసారి

పద్యకవితా, వచనకవితా, చోటుచేసు కున్న నవోదయం 28 కవితలసంపుటి. ఇవన్నీ ఒక్క బిగి వ్రాసినవి కావు, ఒక్క విషయం గురించి వ్రాసినవీ కావు విభిన్న సమయాలలో వివిధ విషయాలను గురించి వ్రాసినవి. రచయిత డాక్టర్ ఎస్. గంగప్ప గారు ఒక్క పరిశోధన రంగంలోనేకాక ఇతర ప్రక్రియలలోనూ రచనలు వెలయించి పేరుపెంపులు గడించారు.

బిచ్చగాడు, సగం స్త్రీకింగూ కాదు నాగరికతా కాదు వంటి కవితలు కరుణరస ప్రధానములేకాక వాస్తవజగత్తుకి సంబం ధించినవి కూడా బిచ్చగాడు 'చావరాని నికృష్టపు చావు' చావగా, సగం స్త్రీకింగూ కాదు నాగరికతా కాదులో చిత్రితమైన అనాథ స్త్రీ దయనీయమూ అర్థనగ్నమూ అయిన ఆకారం ఈ కవితలు రెండూ హృదయమున్న మనిషిని కదిల్చేవి. అంతే కాదు. నేటికీ యీకోవకు చెందిన స్త్రీ పురు షులు సమాజంలో కనిపిస్తున్నా సాటి మానవుడు నిర్దయుడై సంచరిస్తున్నాడే మిటి? అని ఆ కవితలు అడుగుతాయి.

విశ్వకవి రవీంద్రుడు, అమరజీవి శాస్త్రి, గాంధీజీ, శ్రీ శ్రీ ప్రభృతుల్ని ప్రశంసిస్తూ గంగప్ప గారు చేసిన రచనలు ఈ సంపుటిలో ఉన్నాయి

"మనుషుల కుపకరించే కవిత మీసొత్తు
ఊహాపథగాములైన కవులంతా చిత్తు
మానవతా వాదానికి ప్రతీక మీ కవిత
విప్లవ వాదానికి విజయపతాక మీ కవిత!

అని శ్రీశ్రీ కవితాత్మను స్పష్టంచేసిన తీరు సరసమూ,సమంజసమూను అత్యుక్తి అణుమాత్రమైనా లేని యీ ప్రశంసకు శ్రీశ్రీ కాకపోతే మరి యింకెవరు అర్హులు? ఆధునికాంధ్రకవుల్లో శ్రీశ్రీ గొంతు వినిపించినంత స్పష్టంగా మరెవరిదీ వినిపించదని చెప్పవచ్చు

గంగప్పగారు తమ కవితలో
"ఒక్కొక్కతరి పండువెన్నెల కాసినా
ఒక్కొక్కతరి ఆనందం చిందినా
నా కవితలోన
ఒక్కొక్కతరి ఉంటాయి మండుటెండలు!
ఒక్కొక్కతరి ఉంటాయి పేదల బాధల
సెగల పొగలు!"

అని చెప్పుకున్నారు ఈ సంపుటిని పరిశీలిస్తే ఇది సత్య సన్నిహితమనే భావం కలుగుతుంది పాఠకుడికి

డా గంగప్పగారి భావాలను అర్థం చేసుకునేందుకు ఉపకరిస్తున్న యీ పుస్తకం కవితాప్రియుల్ని అలరించే కవితా సంపుటి!

—చల్లా రాధాకృష్ణ శర్మ

## శ్రీరామక్షేత్రము

రచయిత శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహరావు, శ్రీ శిల్పగ్రంథమాల, అశోకనగరు 1-10-142.ఎ, హైదరాబాదు-500 020. 1/8 డెమ్మీ, పేజీలు 190. మూల్యము : శ్రద్ధాభక్తులు

"శ్రీరామక్షేత్రము" అనే పేరుగల ఈ పుస్తకం భద్రాచలక్షేత్రచరిత్రను వివరించడానికి సంకల్పింపబడింది. ఇందులో 2 ప్రార్థన ఖండము 3. చరిత్ర ఖండము 4 రహస్య ఖండము అని మూడు ఖండము లున్నాయి మొదటి ఖండానికి పేరుపెట్ట లేదు అందులో అభిప్రాయాలున్నాయి దీని రచయిత శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహా రావుగారు

ప్రార్థనఖండం శ్రీలక్ష్మీగణపతిస్తోత్రంతో మొదలై సద్గురునాథమంగళంతో పూర్తవుతుంది మధ్యలో ఇవి అవి అని అనడానికి వీల్లేకుండా హనుమాన్ స్తోత్రము, భద్రాంబికా దండక పద్యరత్నములు, మహాకాళీయమ్మ స్తోత్రము, జనకమహారాజు స్తోత్రము (?) శ్రీవేంకటేశ్వర ప్రార్థన, శ్రీ సీతారామదండకము, శ్రీ సీతారామకల్యాణ మణిమంజరి, మేలుకొలుపు, శ్రీకల్యాణసుమ మంజరి, శ్రీ వేదగిరి లక్ష్మీనారసింహనక్షత్ర మాల, శ్రీ దత్తాత్రేయాష్టోత్తర శతనామ స్తోత్రము, శ్రీ శిశుకుమారస్వామి అష్టోత్తర శతనామస్తోత్రము ఉన్నాయి

వీటిల్లో గేయాలు, పద్యాలు, గద్యలు, దండకాలు అన్నీ కలిసిమెలిసి కలగాపులంగా ఉన్నాయి ఈ పౌర్వాపర్యానికి కొలబద్ద ఎంత ఆలోచించినా అంతుబట్టదు చదవడం మొదలుపెట్టినవాడు పేజీ తిప్పేటప్పటికి ఎక్కడినుంచి ఎక్కడికి పోతున్నాడో తెలియదు ఈ కూర్పులో ఏదైనా ఒక క్రమాన్ని పాటించిఉంటే ఇంతకంటె ఆకర్షణీయంగా ఉండేది.

చరిత్రఖండంలో 1 శ్రీరామవంశావళి, 2. ప్రార్థన (?) 3. శ్రీరఘుచరితము, 4. శ్రీరామక్షేత్రము- క్షేత్రమాహాత్మ్యము 5 శ్రీభద్రుని చరిత్ర 6 శ్రీశేషేశ్వరస్తోత్రము 7 శ్రీశేషేశ్వరదండకము (నిజానికి ఈ రెండు ప్రార్థనఖండంలోకి పోవలసినవి. కాని ఎందుకో మరి చరిత్రలోకి వచ్చేశాయి) 8. రేకపల్లి చరిత్ర, 9. తమ్మల దమ్మక్క చరిత్రము, 10 అక్కన్న - మాదన్నలు, 11 తానీషాచరిత్ర, 12 పర్ణశాల, 13 శ్రీ అంతర్వేది, 14 శ్రీ భద్రాచలక్షేత్ర ఆలయ నిర్మాతలు, 15 దండకారణ్యము, 16 శ్రీ రావణుని వంశవృక్షము, 17 శ్రీలంకానగర వర్ణన అనే శీర్షికలు సంగ్రహంగా పరిచయం చేయబడ్డాయి.

అసలు "శ్రీరామక్షేత్రము" అనే పేరుకు మూలమైన ప్రధానభాగం ఈ ఖండంలోనే అతిసంక్షిప్తంగా ఉంది. భద్రాచలక్షేత్రానికి సంబంధించిన అనేకమంది మహానుభావుల పరిచయం ఇందులో కనబడుతుంది. 16, 17 శీర్షికలను ఇక్కడ పేర్కొనడంలో ఔచిత్యం మృగ్యం శ్రీరఘుచరితమనే పద్యభాగం చాలా సరళంగా సుబోధంగా ఉంది కాళిదాస రఘువంశపుకథావస్తువుకు కంద పద్యానుసరణ కొంతవరకు ఈ రఘుచరితంలో కనబడుతుంది. సంకాభారతమ్మ వ్రాసిన శ్రీశేషేశ్వరస్తోత్రంకూడా ఇందులో చేర్చారు రావుగారు

రహస్యఖండంలో 1 శ్రీమద్రామాయణము- శ్రీ వాల్మీకిరచన 2 శ్రీమద్రామాయణము-శ్రీరామావతారము శ్రీవాల్మీకి రచన, 3 శ్రీగాయత్రీదేవి - యజ్ఞోపవీత వివరణము, 4 శ్రీరామకాలనిర్ణయము 5 శ్రీ సీతారాముల నామమహిమ 6. శ్రీ సీతారామ కథాసారము - శ్రీ రామాయణగాథాసంగ్రహము 7 శ్రీరామజననమాది పట్టాభిషేక పర్యంత సంక్షేప దివసక్రమసూచిక అనే శీర్షిక లున్నాయి.

పేరుకు తగినట్లు ఇందులోని మొదటి రెండు శీర్షికల్లో శ్రీమద్రామాయణ రామావతారములను గురించి శ్రీరావుగారు చక్కని రహస్యాలను ప్రతిపాదించారు. ఈ పుస్తకం మొత్తంలో పాఠకుణ్ణి బాగా ఆకర్షించగలిగింది ఆఖరుశీర్షిక శ్రీమద్రామాయణం లోని కాండక్రమాన్ననుసరించి శ్రీరాముని జీవితంలోజరిగిన ముఖ్యఘట్టాలను సప్రమాణంగా నిర్ధరించి గ్రంథకర్త ఆంధ్రుల అభినందనలకు పాత్రులైనారు.

శ్రీరావుగారిలో ఎన్నోరకాల ఆలోచన లున్నాయి వాటిని క్రమబద్ధంచేసుకొని పరిధిని నిర్ణయించుకొని, దాన్ని దాటకుండా రచనలు సాగిస్తే చదివేవాళ్లకు బుద్ధివ్యామోహం కలుగకుండా ఉంటుంది. ప్రచురించేటప్పుడు పుస్తకస్వరూపాన్ని చక్కగా తీర్చిదిద్ది, తగిన పేరుతో వ్యవహరిస్తే పాఠకులకు తడబాటు ఉండదు. ముందు ముందు రావుగారు, మతధర్మ క్షేత్రాలలో ఇంకా చక్కని రచనలనుచేసి అందరి అభినందనలకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాను.

— రఘునాథాచార్య

# అన్నమయ్య

# చెన్నకేశవ శతకము

మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం



( గతసంచిక తరువాయి )

3. పద్యము '

గరుడవాహనమెక్కు గరుడవాహనదేవ
అశ్వవాహనమెక్కు అంబుజాక్ష
సింహవాహనమెక్కు శ్రీనివాసప్ప భూ
శేషవాహనమెక్కు శేషశాయి

.

హంసవాహనమెక్కు అదికేశ
గజవాహనమెక్కు కమలలోచన కృష్ణ
చంద్రప్రభలు ఎక్కు సరసిజాక్ష

హనుమవాహనమెక్కు హరి ముకుంద
వాహనములెన్నొ నీకడ నుండు వరుస
అమ్మ చూపెను చూడుము అన్న తలప
కన్నన వరదాళ్ళుండు బుజ్జిన్న కేశాలు

సవరించిన పద్యము :

గరుడవాహనమెక్కు గరుడవాహన! దేవ!
అశ్వవాహనమెక్కు మంబుజాక్ష!
సింహవాహనమెక్కు శ్రీనివాసప్రభూ !
శేషవాహనమెక్కు శేషశాయి !

...

హంసవాహనమెక్కు మాదికేశ !
గజవాహనంబెక్కు కమలలోచన! కృష్ణ!
చంద్రప్రభలనెక్కు సరసిజాక్ష !
హనుమవాహనమెక్కుము, హరి !
ముకుంద !
వాహనములెన్నొనీకడ వరుసనుండు,
అమ్మ (తల్లి) చూపెను చూడుము అన్న,
తలప (తాళ్ళపాక)
కన్నన (అన్నని) వరదాళ్లుండు
బుజ్జిన్న కేశ,

ఈ పద్యమున తాళ్ళపాకలో చెన్నకేశవ స్వామికి నాడున్న వాహనసంపద చెప్పబడి యున్నది వాహనములున్నట్లు, ఉత్సవములు జరుగుచున్నట్లు క్రమంగా వాహనాలతోపాటు ఉత్సవ మర్యాదలు క్షీణించి పోయినట్లు నేడు ఆ గ్రామ పెద్దలు చెప్పుచున్నారు

ఈ వాహనములు చేయువారు జీనిగిరి వారు వారి కుటుంబములు టంగుటూరు, ఓబలి, నందలూరు, రాజంపేట, పెనగలూరు. ప్రాంతములనుండేవట! నేడచ్చటచ్చట నాలుగైదు కుటుంబములవారున్నట్లు తెలియుచున్నది వారు తమ స్వవృత్తిలో నేడాదరణలేనందున మానుకొని అన్యవృత్తి నవలంబించి జీవించుచున్నారు.

తాళ్ళపాకలో చెన్నకేశవాలయమున కెదురుగా రాజవీథికి తూర్పున వాహనాల మండప ముండినదనీ, అది యిటీవల కాలంలో గ్రామచావడిగామార్చి యుపయోగించేవారనీ, ఆ యూరి పెద్దలు చెప్పుచున్నారు దాని పీఠభాగము భూతలము నుండి సుమారు ఎనిమిదడుగుల ఎత్తుండేదట! మధ్యరంగమండపము రెండడుగులెత్తును, దాని చుట్టు వరండావలె స్తంభాంతరభాగముండేదట! ఆ మండపము శిథిలమై దాని శిలలు ఆ గ్రామవాసులిండ్ల పునాదిరాళ్ళుగా నుపయోగింపబడి యుండుట నేడు మనము చూడవచ్చును రూపనామములే మాసిపోయిన యాచోటు ఆ పూరివారైన శ్రీ నూకా చెంచు రెడ్డి, శ్రీ గంగిరెడ్డి గార్ల స్వాధీనమైయుండినది. గ్రామస్థుల కోరిక మన్నించి ఇటీవల వారు 'తిమ్మక్క' (అన్నమయ్య పెద్ద భార్య) పేర 'తిమ్మక్క భవనము' నకై తిరుమల తిరుపతి దేవస్థానమువారికి దఖలు పరచినారు ఇక దేవస్థానము వారచ్చట భవనము నిర్మింపవలసియున్నది

4 పద్యము.

గరుడోల్సవంబును కమలోత్సవంబును
కమలలోచనునకు అమరునుండు
తేరు ఉత్సవంబున్ను తెప్పోత్సవంబును
బరగియుండు

.

.

(ఈ ఎద్యము పూర్తిగలేదు)

సవరించిన ఎద్యము

గరుడోత్సవంబును కమలోత్సవంబును,
కమలలోచనునకు సమరియుండు
. తేరుత్సవంబును తెప్పోత్సవంబును
(బ్రహ్మోత్సవంబును) బరగియుండు

తాళ్ళపాక గ్రామస్థులు చెప్పినదాన్ని బట్టి పైపద్యంలోచెప్పినట్లు పూర్వమన్ని ఉత్సవాలు జరుగుచుండెడివని తమ పెద్దల

వల్ల సాంప్రదాయకంగా వింటిమనీ క్రమంగా నవి నిల్చిపోయినవనీ,తెలిసినంత వరకు అనగా 60, 70 ఏండ్లవరకు కొన్ని ఉత్సవాలు గ్రామస్థులే నిర్వహించువారనీ, దగ్గరున్న చెరువులో తెప్పవదలి ఉత్సవం చేయుచుండిరనీ, బ్రహ్మోత్సవమను పేర చిన్న ఉత్సవం, అందులోనే రథోత్సవం, భాగంగా ఆ గ్రామాన వెలసియున్న శివ కేశవులకొకే రథమును పయోగించే యాచారమనీ, చెప్పారు తాళ్ళపాకలో మహోత్సవాలు పూర్వం జరుగుచుండేవను దానికి నిదర్శనముందని శ్రీ జంగా సుబ్బయ్యగారిలా చెప్పారు

“పూర్వం తాళ్ళపాక చెన్న కేశవ స్వామికి ప్రతిదినము ‘స్వస్తి’ చెప్పే బ్రాహ్మణుడు తాళ్ళపాకలో నుండేవాడు అతనిపేరు బ్రహ్మశ్రీ వెల్లాల నాగేశ్వర కవీంద్రుడు అతడు తాళ్ళపాక శ్రీ చెన్న కేశవస్వామి, శివుని తిరునాళ్ళ ఉత్సవాలను గూర్చి స్వానుభవపూర్వకమైన కొన్ని శ్లోకాలు రచించాడు వానిలో జ్ఞాపకమున్నది “ఒక శ్లోకం” అని చాటువుగా చెప్పాడు

‘ శ్రీ తాళ్ళపాకాఖ్యపురే పురారేః
శ్రీ చెన్న కేశవస్వామి మహోత్సవేషు,
సల్లాపం ఉల్లాసయుతు గొల్లళాల్యా
వెల్లాల నాగేశ్వర సత్కవీంద్రః ’

ఈ శ్లోకరచనమెట్లున్నా, ఇందా కవీంద్రుని స్వానుభవగాథ కలదు. అదేమన ఆ యుత్సవాల్లో యాదవకులానికి చెందిన ‘సాలమ్మ’ అను ఆమెతో నాకవి సరససల్లాపములు సాగించువాడట!

ఏమైననూ మహోత్సవాలు తాళ్ళపాక చెన్న కేశవునికి జరుగుచుండెననుట నిర్వివాదాంశము ఇందు ‘కమలోత్సవము’ అనునదెట్లో? తెలియరాదు విజ్ఞులు సూచింతురుగాక! కమలము వంటి వాహనముపై శ్రీవారి నుంచి చేయు నుత్సవమేమో! లేక మరొకటో!

5వ పద్యము:

ఊటుకూరున తాత ఒనమాలు సెప్పగ
ఓ అని పల్కిన ఒడుపు లేదు
సింత సెట్టు క్రింద సెలికాండ్రతో
చేరి సెర్లాటములు సలిపినాడ
తాళ్ళపాకలో తండ్రి తన్ని దండించిన
తప్పించి నీగుడి చేరినాను
తిరునాళ్ళకని తంగుటూరుకు బోయి
దోవతప్పిన నన్ను బోవరావ

జ్ఞాతులందరు బాధించి సేతుసేయి
తల్లి గారాబమున నీ దరిసెనంబు
అమ్మచూపెను తాలపాకన్న తలప
గన్నన్న వరదాలు బుజ్జిచిన్న కేశాలు

సవరించిన పద్యము.

ఊటుకూరున తాత ఓనమాల్ సెప్పగ
ఓ యని పల్కిన ఒడుపులేదు
చింతచెట్టు క్రింద చెలికాండ్రతో చేరి
చాలచెర్లాటముల్ సలిపినాడ
తాళ్ళపాకను తండ్రి తన్ని దండించిన
తప్పించి నీ గుడి దాగినాను
తిరునాళ్ళకని టం (తం) గుటూరుకు
బోయిన
ద్రోవ తప్పిన నన్ను బ్రోవరావ

జ్ఞాతులందరు బాధించి సేతుసేయ
తల్లి గారాబమున నీదు దరిసెనంబు
అమ్మచూపెను తాళ్ళపాకన్న! తలప
గన్నన వరదాళ్ళుందు బుజ్జిన్న కేశ!

ఈ లభించిన పద్యములలో తెల్లా నీ పద్యము మకుటాయమానము! తాళ్ళపాక అన్నమాచార్యుని చిన్ననాటి చరిత్రాంశము లతని జీవితవిశేషములు తెలపుచున్నది.

తాళ్ళపాక అన్నమయ్యా సంశీయులు తండ్రితాతలకు పూర్వమునుండియు తరువాతను అనగా శాలివాహన శకవర్షములు 1662 (క్రీ శ 1740) వరకుండినట్లు తెలియుచున్నది శ్రీమత్ప్రసిద్ధ తాళ్ళపాక తిమ్మాచార్యులు ఆ గ్రామాననున్న ‘పంజవెంకటరెడ్డి’ కిచ్చినఏడుకొండల రంగనాథరామాయణము చివర 12 పత్రములలో మంజరీ ద్విపదను ‘మైరావణ చరిత్ర’ వ్రాసినట్టు తెలియుచున్నది ద్విపద కావ్యనిర్మాణదక్షులైన తాళ్ళపాకవారే అది ఖర సం॥ ఫాల్గుణ మాసంలో ఊటుకూరికరణం వేంకటాచలము గారికి వ్రాసియిచ్చినది, అని ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక తెల్పుచున్నది

ఊటుకూరు గ్రామమునందు తనతాత దగ్గర అన్నమయ్య విద్యాభ్యాసం ప్రారంభించాడు కాని, తాళ్ళపాకలో నెపుడు చింత చెట్టు క్రింద నాటపాటలతో నేస్తులగూడి చెర్లాడువానికి చదువుమీద ధ్యాస లేదు కాబోలు! తండ్రి విద్వాంసుడు మురిపెము చూపిన తాత (పితామహుడు కావచ్చు అప్పుడు వారూటుకూరున నుండెడివారేమో! ఆనాటికి తాళ్ళపాకవారు స్మార్తబ్రాహ్మణులు నందవరశాఖీయులు దగ్గర చదువునకై చేర్చినాడు కానీ, యచ్చట నొక్క యక్షరమైన రాలేదు తాళ్ళపాకకువచ్చి తనబిడ్డవిద్యాబుద్ధులలో నారాయణసూరి శ్రద్ధ తీసుకొన్నాడు ఉపనయనం చేశాడు. తన్ని చదువుచెప్పేవాడు అప్పుడపుడు తండ్రి కనుమరగించి చింతచెట్టు క్రింద ఆటపాటలతో గడుపుచు, గుడిలో దాగుకొనుచు, చదువుపై శ్రద్ధచూపువాడుకాదు కాబోలు!

ఆనాళ్ళలో తాళ్ళపాక గ్రామం సమీపంలో 5 మైళ్ళ దూరాన దక్షిణంగా ఊటుకూరు, 7 మైళ్ళ దూరాన ఉత్తరంగా టంగుటూరు, ప్రాంతాలు విజయనగర రాజప్రతినిధి పాలనలోనున్నవి ఆనాటిహొత్తపినాడునకు విజయనగరమును పాలించు సంగమ వంశీయుడు ఇమ్మడి ప్రౌఢదేవరాయలు (రెండవ దేవరాయలు) ప్రభువు. ఆ ప్రాంతము క్రీ శ 1423 నుండి క్రీ శ. 1446 వరకు వారి స్వాధీనమందుండెను ఓఢ్ర కళింగాధిపతి కపిలేశ్వరుడు విజయనగరంపై దండెత్తినపుడు హొత్తపినాటి రాజధానియైన టంగుటూరునందు సాళువ నరసింహరాయలు సామంత దండనాథుడుగా నుండెను. అతనికి చంద్రగిరి ప్రధానపాలనాకేంద్రము. ఆ కపిలేశ్వర గజపతిని గూర్చి-



## ప్రకటన

# గొడుగుల పంపిణీ

మైకు సెట్లవలెనే పన్నెండు శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది గొడుగుల జత సగం వెల రూ 600/- అవుతుందికనుక టి టి డి కార్య నిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీష నర్ ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

'ప్రసహ్య కర్ణాట మహీపతేః పురీం
నిరుధ్య విద్యానగరీం నిజైర్భటైః।
సమున్నతం మాన మివోచ్ఛ్రయం కరం
సమాదదే కర్కశ చక్ర విక్రమః॥'

(అ. చ పీఠిక)

టంగుటూరునకు 'తంగుటూ' రని పేరున్నది ఒంగోలు తాలూకాలో టంగుటూరు ప్రాంతమున తంగుటూరు ఇంటిపేరుగల బ్రాహ్మణులున్నారు వారిప్రాంతీయులట! కావున పొత్తపి టంగుటూరు పాలకుల పోషణమున నాప్రాంతంలోని దేవాలయము లన్నియు వైభవముగా నుండుననుటకు సందియంలేదు. రాజధానియైన టంగుటూరునగల దేవుళ్ళకు నేటికీ తిరునాళ్ళు వైభవంగా జరుగుట వింతకాదు పొత్తపి లోని కార్తీనిజాతర చాలగొప్పగా జరిగెడిదట! దానికి ఊడుమూరుప్రాంతంలోని బోయలువెళ్లి ఉపాయనములిచ్చి మ్రొక్కులు తీర్చుకొనువారట! ఆ తిరునాళ్ళ వేడుకలుచూడ నాచుట్టుపట్టుల ప్రజలు పోయెడివారు. బాలుడైన అన్నమయ్య తిరునాళ్ళకు పోవుట, తిరిగివచ్చునపుడో, పోవునపుడో, త్రోవతప్పుట, ప్రార్థింపగా చెన్నకేశవుడే అన్నమయ్యకు తోడువచ్చి యిల్లు చేరుటకు దారిచూపి కాపాడుట, సత్యదూరము కాదు గదా! అది అన్నమయ్యకు స్వానుభవైకవేద్యము!

అన్నమయ్య దైవభక్తి, వివేకము, ప్రజలయెడ నతని వినయవిధేయతలు, అతనిపై ప్రజలకుగల ఆదరాభిమానము మెచ్చుకొనలేక, ఓర్చుకొనలేక, దాయాదులు అన్నమయ్యకు సేతపడి చేసినట్లున్నది. తన ప్రార్థనవల్ల తల్లి (అమ్మణ్ణి, లక్ష్మిదేవి) గారాబంతో (ఆజ్ఞతో) చెన్నకేశవుని దర్శించి ఆతని యనుగ్రహాన ఆ యాపద పోగొట్టుకొనుట ఇందు తెలియుచున్నది. అందుకేనేమో! 'ఏకనాదము తంత్రి త్రెంచిన ఎదవగ్రామము తాళ్ళపాక' అని తనగ్రామాన్నే నిరసించినా డన్నమయ్య ఆ తర్వాత తనే గ్రామాన్ని తాను దర్శించినా, స్వామినిమాత్రం అర్చించి వెళ్ళేవాడేమోగాని, తన దాయాదుల యిండ్లకు (వైష్ణవం స్వీకరించిన తర్వాత) పోవువాడుకాదేమో! అన్నమయ్య తాళ్ళపాక విడిచి తిరుమల, తిరుపతి చేరినంతట తాళ్ళపాక చెన్నకేశవునిపై శ్రద్ధాభక్తులున్నవేగాని గ్రామంపై నపేక్ష యతనికి సన్నగిల్లినట్లున్నది. అతని పెద్దకుమారుడు పెదతిరుమలాచార్యుడు, చినతిరుమలాచార్యుడు కొంత శ్రద్ధవహించుటచే మహారాజులచే లభ్యపడిన భూసంపదలు చెన్నకేశవునికి చేకూరినవట! తాళ్ళపాకవారికి తమగ్రామముపై నిష్టములేకపోవుట దాయాదుల దౌష్ట్యమే కారణముగాక, రాయలాగ్రామాన్ని శ్రీ వ్యాసరాయల కిచ్చుటయు నందుకు కారణముకావచ్చును. వైష్ణవులైన తాళ్ళపాకవారిపై స్మార్తులైన తాళ్ళపాకవారికి సహజద్వేషము

దేవునిభూములు నేడు పరాధీనానుభవమునున్నవని చెప్పా రాగ్రామప్రజలు అవియున్నచో తాళ్ళపాక స్వామి కేకొదువయు లేదట!

ఈ పద్యములో సూచించిన చింతచెట్టు చిన్ననాడు అన్నమయ్య అట్లాడుకొన్న పెద్దచింతచెట్టు అది తాళ్ళపాక ఊరునానుకొని 'పుల్లమరేవు' లో నుండెదనీ, 1927 లో (ప్రభవసంవత్సరం) వచ్చిన పెనుతుపానులో పడిపోయినదనీ, దాని వైశాల్యం క్రింద సుమారు పావుఎకరము నేల యుండు ననీ, తాళ్ళపాకలోని వృద్ధులు నాతో చెప్పారు ఆ చెట్టు నాశ్రయించి నూర్ల కొలది తిత్తిరిపక్షులు (భరద్వాజములు?) ఉండేవట. తాళ్ళపాకవారు భరద్వాజ గోత్రీయులే!

(సశేషము)

# వార్తాలహరి

## కంచి జగద్గురువుల ప్రబోధం

సనాతన హిందూ ధర్మ ప్రచారంలో భాగంగా తమ దక్షిణదేశయాత్రలో శ్రీ కంచికామకోటి జగద్గురువులు తిరుపతికి సమీపంలోని పులిచెర్ల గ్రామంలో విడిది చేశారు

సనాతన వైదికధర్మాన్ని దేశంలోని మారు మూల ప్రాంతాలకు కూడ ప్రచారం చెయ్యవలసిన అవసరం ఎంతోవుందని శ్రీ కంచి కామకోటి జగద్గురువు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీస్వామివారు ఈ జనవరి 24 న తనతో సమావేశమైన తి తి దేవస్థాన పాలకమండలి సభ్యులను ఉద్బోధించారు ధర్మప్రచార రంగంలో సామూహిక ప్రచారం కంటే కూడ వ్యక్తిగతప్రచారం విశిష్టమైనదని వారు సూచించారు



శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతీస్వామివారితో తి తి దే కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, తదితరులు



తి తి దే ధర్మకర్తలమండలి సభ్యులకు సందేశమిస్తున్న శ్రీ కామకోటిపీఠాధిపతి

ప్రజల్లో నైతిక, సాంస్కృతిక ఆధ్యాత్మిక విలువలను పెంపొందించేందుకై సనాతన ధర్మాన్ని ప్రయోగాత్మకంగా ప్రచారం చేసేందుకువీలుగా ఆంధ్రప్రదేశ్‌లోని మూడు సమితులను ఎన్నికచేయవలసిందని శ్రీ స్వామివారు చెప్పారు.

హిందూధర్మ ప్రచారంలో భాగంగా గిరిజన ప్రాంతాల్లో భజనమందిరాలు, ప్రార్థనా మందిరాలు నిర్మించాలని, బలహీనవర్గాలైన గిరిజన, హరిజన విద్యార్థులు నివసిస్తున్న వసతిగృహాలకు గ్రంథాలయాలకు హిందూ ధర్మపరమైన పుస్తకాలను పంపిణీచేయాలని, ఆవిద్యార్థుల్లో ఆస్తికచింతన కలిగించాలని, అందుకు తి తి దేవస్థానం కృషిచేయాలని శ్రీ స్వామివారుకోరారు శ్రీ వేంకటేశ్వర స్వామివారి ప్రసాదాలను జైళ్లలోని ఖైదీలకు ఆస్పత్రులలోని రోగులకుకూడ పంచిపెట్టవలసిందని స్వామీజీ సలహా ఇచ్చారు దేశవ్యాప్తంగా పెద్దఎత్తున దేవాలయ నిర్మాణం, పునరుద్ధరణ చేపట్టవలసిందనికూడా శ్రీ స్వామివారు తమ సందేశంలో పేర్కొన్నారు. స్త్రీలు కూడ ధార్మిక కార్యక్రమాల్లో



చిన్నస్వామి శ్రీశ్రీశ్రీ శంకరానందేంద్రసరస్వతీస్వామివారితో తి తి దే ధర్మకర్తలమండలి సభ్యులు.

ఆసక్తితో పాల్గొనేటట్లు చేయడం, వారిలో దీపపూజ ప్రచారంచేయవలసిన అవసరం కలదన్నారు. దేవస్థాన ఉద్యోగులకు కూడ, హిందూధర్మాన్ని, సంస్కృతిని గూర్చి తెలియజేసే శిక్షణా తరగతులనుకూడ అప్పుడప్పుడు నిర్వహించవలసిందని శ్రీ స్వామివారు తమసందేశంలో పేర్కొన్నారు.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి శ్రీ స్వామివారితో మాట్లాడుతూ, దేశము వలుప్రాంతాల్లో హిందూ ధర్మ ప్రచారానికై తి. తి. దేవస్థానం చేస్తున్న కృషిని వివరిస్తూ, స్వామీజీ ప్రబోధించిన వానిని అమలు పరచేందుకై తాము కృషి చేయగలమని హామీ ఇచ్చారు.

దేవస్థాన ధర్మకర్తలమండలి సభ్యులు శ్రీమతి నన్నపనేని రాజకుమారి, శ్రీ ఎల్. నర్సింగనాయక్, శ్రీ పి. వెంకటేశ్వర్లు, శ్రీ కొల్లా అప్పలనాయుడుగార్లు, తి. తి. దే. హిందూధర్మ రక్షణ సంస్థ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య తదితరులు శ్రీ కంచిస్వామి వారితో జరిగిన ఈ సమావేశంలో పాల్గొన్నారు

## పురాణ ప్రబోధ పరీక్షలు

ధర్మరక్షణసంస్థ, విద్యార్థుల్లోకూడ ఆధ్యాత్మిక చింతన, ఆస్తికతను కలిగించుటకై ఎన్నోవిధాల కృషిచేస్తున్నది. వాటిలో పురాణప్రబోధపరీక్షలు ఒకటి. ధర్మరక్షణ సంస్థ ఐదవసారిగా ఈ పరీక్షలను 84 జనవరి 28 న నిర్వహించింది. ఈ పరీక్షలకు రాష్ట్ర మంతటినుండి 417 పాఠశాలల్లోని 19 వేల మంది విద్యార్థులు హాజరయ్యారు. గతంలో ఇంతవరకు జరిగిన పరీక్షలకు సుమారు 50 వేలమంది బాలబాలికలు హాజరుకావడం జరిగింది. ఈ పరీక్షల్లో రాష్ట్రస్థాయిలో, జిల్లాస్థాయిలో ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులను పొందిన వారికి రజత పతకాలు బహూకరింపబడుతవి



# ధర్మ రక్షణ కార్యక్రమాలు

## వైకుంఠ ఏకాదశి

శ్రీరమాసత్యనారాయణ స్వామివారి దేవస్థానం, గుంటూరులో ఈ జనవరి 14 వ తేది వైకుంఠఏకాదశి ఉత్సవసందర్భంలో వైకుంఠ ద్వారదర్శనం- శ్రీవారికి గరుడోత్సవం అత్యంతశోభాయమానంగా నిర్వహింపబడినాయి. 15 వ తేది సంక్రాంతి పర్వదినాన స్థానిక శ్రీనాథ పీఠమువారి ఆధ్వర్యంలో ప్రసిద్ధపండితులచే కవిసమ్మేళనం నిర్వహింపబడింది. 16 వ తేదీ సాయంత్రం శ్రీవారిసన్నిధిలో గోదాదేవి కల్యాణం నిర్వహింపబడింది. కల్యాణానంతరం భక్తులకు తీర్థప్రసాదాల వినియోగం చేయబడినాయి

## సంక్రాంతి

సంక్రాంతి పర్వదిన సందర్భంగా పెంటపాడు గ్రామంలో శ్రీ బాలవేంకటేశ్వర స్వామి దేవస్థానంలో ఆధ్యాత్మికోపన్యాసాలు నిర్వహింపబడ్డాయి "శ్రీవేంకటేశ్వరుని ప్రాశస్త్యము-తాత్త్వికత, కల్యాణవైభవము ముక్కోటి విశిష్టత, మకరసంక్రాంతి-సమీక్ష, భగవత్ శబ్దరహస్యము" మున్నగు విషయాలను ఆధునిక విజ్ఞానంతో అన్వయిస్తూ శ్రీ తిరుమల వాసుదేవగారు ఉపన్యసించారు. స్థానికప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ నిత్యానందం, శ్రీ పసల సూర్యచంద్రరావు, శ్రీ ఎస్. టి. వి. రాజగోపాలాచార్యుల అభినందనలతో, దేవస్థాన కార్యనిర్వాహక సభ్యులు శ్రీ నక్కా సత్యంగారి సౌజన్యంతో ఈ సభలు ఘనంగా జరిగాయి.

## గీతాజయంతి

గత డిశంబరు 14 నుండి 16 వరకు తి. తి. దేవస్థాన హిందూధర్మ రక్షణసంస్థ ఆధ్వర్యంలో ప్రొద్దుటూరు టి. టి. డి. కల్యాణ మండపమునందు గీతాజయంత్యుత్సవాలు నిర్వహింపబడ్డాయి. ప్రతి దినం ఉదయం భక్తులు గీతాపారాయణ చేశారు. 14 వతేది సాయంత్రం ఓరియంటల్ కళాశాల ఉపాధ్యాయుడు శ్రీ నరసింహనాయుడు, 15 వ తేదీ సాయంత్రం కాకతీయ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ వీరారెడ్డిగారు ఉపన్యసించారు, 16 వ తేది శ్రీకృష్ణ- గీతా మాతలపూజ, సామూహిక గీతాప్రార్థన నిర్వహింపబడింది అదే రోజు శ్రీ జె. వేమయ్యగారి అధ్యక్షతలో శ్రీ ఎ. దక్షిణామూర్తి గారిచే ఉపన్యాసం జరిగింది తదుపరి గీతాపోటీ విజేతలకు బహుమతి ప్రదానం, శ్రీమతి లక్ష్మీదేవి భాగవతారిణిచే హరికథాకాలక్షేపం చేయబడినది. శ్రీ కృష్ణాజీ వందనసమర్పణతో ఆ ఉత్సవాలు ఘనంగా ముగిశాయి

గత డిశంబరు 14 నుండి 16 వరకు హిందూధర్మ రక్షణసంస్థ అనంతపురంజిల్లా శాఖ ఆధ్వర్యంలో అనంతపురం గీతామందిరంలో గీతాజయంత్యుత్సవాలు ఘనంగా నిర్వహింపబడ్డాయి.

అలాగే గత డిశంబరు 16 నుండి 20 వరకు ఉండిలోని గీతామందిరంలో 28 వ వార్షిక గీతాజయంతి నిర్వహింపబడింది ఈ కార్యక్రమాల్లో పెద్దలచేత ఉపన్యాసాలు చేయబడ్డాయి. నృత్యప్రదర్శన, సాంస్కృతిక కార్యక్రమాలు కూడ నిర్వహించడం జరిగింది.

బొబ్బిలిలోకూడ తి తి దే. హిందూధర్మ రక్షణసంస్థ, స్థానిక శ్రీ వేంకటేశ్వర భక్తసంఘం ఆధ్వర్యంలో స్థానిక ఆంజనేయ స్వామి దేవస్థానంలో గీతాజయంతి నాలుగు రోజులు జరిగింది. శ్రీమాన్ కృష్ణమాచార్యులు, బ్రహ్మశ్రీ టి వి రమణశాస్త్రి గార్లు గీతామాహాత్మ్యాన్ని వివరించారు. తదుపరి కోమటిపల్లి బాలానంద సంఘం వారిచే 'లవకుశ' కథాగానం నిర్వహింపబడింది

### ప్రకటన

తి. తి. దేవస్థాన ప్రచురణలు, మాసపత్రిక (సప్తగిరి) కావలసినవారు వాటికి సంబంధించిన మొత్తములను "వెల్‌ఫేర్ ఆఫీసరు, ఇన్‌ఛార్జి ఆఫ్ సేల్ ఆఫ్ పబ్లికేషన్సు తి. తి దేవస్థానములు, తిరుపతి." వారి పేరుతో మాత్రమే పంపవలెను

( 21 వ పేజి తరువాయి )
సమానమే పేద ధనిక వర్గ విభేదములు లేవు. స్వార్థరహితమైన సేవజేయుటకు ఆస్కారమేర్పడినది ఒకరికి భయపడక స్వేచ్ఛగ జీవించుటలోని మాధుర్యమును త్వరలో అనుభూతిని పొందగలిగితి.

కాని యిది సమాజము సమాజములో అందఱు నీతిగ వుండగలిగిన నాడే సుమంగళము కాగలదు. నిజాయితీగ ఒకడున్నంత మాత్రాన సరిపోదు. కలుషిత వాతావరణములో సువాసనయు దుర్గంధములలోనే కలిసి నశించుచున్నది. కాబట్టి సమాజములో నివసించు మానవులందరు నిజాయితీగ వున్నపుడే ఆదేశము సౌభాగ్యవంతము కాగలదు. కేవలం చట్టములతో శిక్షలతో యీ మార్పులు తీసికొనిరాలేము. ప్రతిపనికి వితర్కభావము అనగా తనకు అలా జరిగినపుడు ఎలా ప్రవర్తించగలమో ఒకసారి ఆలోచించిన యీ సాంఘిక దుర్న్యాయములను రూపుమాప గలము ఈ మార్పు మనలోనే రావాలి. అపుడే మనము మనలను ఉద్ధరించుకొనుటయే గాక మన సమాజమును రక్షించగలము మన రోగమునకు మనమే ఔషధము తీసికోవాలి గదా! చిత్తశుద్ధితో ఆలోచించిన యీ గురుతర బాధ్యత మన యందరిపై వున్నది

"సమాజములో మానవుని వైఖరి ఎలా వుండాలి ఏదైనా సంబంధముండనిదే ఒకరు యింకొకరి వద్దకుపోరు నిర్దాక్షిణ్యముగా వచ్చిన వారిని తరిమివేయుకు, దాహముగల వారికి నీరు, ఆకలిగొన్న వారికి అన్నము, దిగంబరులకు వస్త్రములు, నివసారా యితరుల విశ్రాంతికి వినియోగించినచో నిశ్చయముగా భగవంతుడు ప్రీతిజెందునని పెద్దలమాట

ప్రతిఫలము అపేక్షింపక జేయు కర్మలచే మనుజుడు ఉత్తమగతిని పొందగలరను భగవంతుని వాక్యము ప్రతిఉద్యోగి సూత్రప్రాయముగ ఆచరణలో నుంచిన లోక కళ్యాణము కాగలదు.

ఒరులేయవి యొనరించిన
నరవరయప్రియము తన మనంబునకగుదా,
నొరులకు నవి చేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్.

మహాభారతములోని సారాంశము అదియే. ఒకరి సుఖము మరియొకరికి దుఃఖహేతువు కారాదు. ఒకరి యిష్టము మరియొకరికి కష్టమును కలిగింపక యుండునపుడే 'సర్వేజనా స్సుఖినో భవంతు' అను సామెత సార్థకము గాగలదు

— జి. రామయ్యపిళ్లె

---

## 4 వ తవరు పేజి

ఈ చిత్రంలో ఎడకవితాపితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యులు, పద్మసాలీయులు తాళ్ళపాక చిన్నన్నకు వ్రాయించి యిచ్చిన 'పాదకానిక' తామ్రశాసనమూ ఉన్నాయి ఈ రెండు చిత్రాలు పరస్పరం వేర్వేరైనా, ఒకే భావాన్ని స్ఫురింప జేస్తున్న ప్రధానప్రతీకలుగా తీసికొని ఒకే చోట చిత్రీకరించబడ్డాయి

'తిరువేంకటగిరిరాయని సంతర్పణమే మా సంధ్య' అని చాటుకున్న అన్నమయ్య తిరుమల శ్రీ వేంకటేశుని సన్నిధి సంకీర్తనాచార్యుడుగా, అంతరంగిక భక్తునిగా విలసిల్లాడు ఆ ఆనందనిలయుని కరుణా కటాక్ష వీక్షణాలను పరిపూర్ణంగా పొంది అనుభవించాడు తానొక్కడు మాత్రమే కాదు తన తరువాతి సంతతికి ఆ దేవదేవుని కరుణాభాగ్యం కలిగేటట్లు చేశాడు అన్నమయ్య ఒక్క వేంకటేశుని అనుగ్రహం మాత్రమేకాదు తాళ్ళపాక కవులకు అలమేలుమంగమ్మ అనుగ్రహం కూడా అపారంగా కలదనటానికి సాక్ష్యాధారాలెన్నో వున్నాయి ప్రధానంగా రెండు ఘట్టాల్లో తొలిసారి అన్నమయ్య విషయంలో, మరుసారి అన్నమయ్య మనుమడు చిన్నన్న విషయంలో

చిన్ననాటనే తొలుదొల్త తిరుమలకు పోతున్న అన్నమయ్య మోకాళ్ళ ముడుపు దగ్గర మూర్ఛపడిపోగా, జగన్మాత అలమేలుమంగ బాలఅన్నమయ్యను మూర్ఛదేర్చి

"శౌరియుఁ దాను నిచ్చలు పొత్తుగలిసి
యారగించిన ప్రసాదాన్నముల్ దెచ్చి
పరిపరిరుచుల నేర్పడ సేదదీర
పెరిమతో భుజియింపఁబెట్టి యూదార్చి"

తిరుమల శ్రీవారిసన్నిధికి దారి చూపించినదట!

అలాగే రెండవమారు పద్మసాలీలకు, జాంద్రవారికి వచ్చిన వివాదాన్ని తీర్చవలసిందని, అన్నమయ్యచిన్నిమనుమడైన చిన్నన్న ప్రార్థింపగా, అలమేలుమంగమ్మ, తాను పద్మసాలీల అడవడచునని అందరూ వింటుండగా సాక్ష్యమిచ్చిందట! అలమేలుమంగచే సాక్ష్యమిప్పించి, తమ కులగౌరవాన్నుద్ధరించినందువల్లపద్మసాలీయులు, కులగురువైన తాళ్లపాక చిన్నన్నకు అత్యంత భక్తిపూర్వకంగా పాదకానుక రూపంలో పదివేల వరహాలను సంతోషంతో ఇస్తూ, పైవిధంగా తామ్రశాసనాన్ని వ్రాయించి ఇచ్చారు ఆ పదివేల వరహాలకు మరి పదివేల వరహాలను తాను వేసికొని చిన్నన్న చంద్రగిరి సమీపంలోని అల్లగట్టులో (శ్రీనివాసమంగాపురం కావచ్చు) కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని కట్టించినాడు

బాలఅన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిని (తిరుమల) చేరుటకును, అలాగే తాళ్లపాక చిన్నన్న శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిని (శ్రీనివాసమంగాపురంలోని ఆలయం) ఏర్పరచుటకును, దారికల్పించి, పై రెండు ఘట్టాల్లో శ్రీ వేంకటేశ్వరునకు తనకు అభేదాన్ని స్పష్టపరచి చూపించింది జగన్మాత అలమేలుమంగ

తాళ్లపాక కవులవంశంలో, అలమేలుమంగ సాక్షాత్తుగా అనుగ్రహించిన పై ప్రధాన ఘట్టాల్లో, మొదటిదానికి చిన్నన్న వ్రాసిన 'అన్నమయ్య చరిత్ర' ఆధారం కాగా, రెండవదానికి చిన్నన్న 'పాదకానిక' శాసనం ఆధారం

పై రెండు ప్రధాన ఘట్టాలను సూచించడానికై అన్నమయ్య బాల్యసంఘటనకు బదులు అన్నమయ్యను, రెండవ సంఘటనకు ఆధారమయిన పాదకానిక శాసనపు రేకు, పైచిత్రంలో ఒకేచోట చూపబడ్డాయి పై రెండింటికీ ప్రధాన ఆధారం తాళ్లపాక చిన్నన్నే కావడం మరో విశేషం

(మార్చి 29, అన్నమయ్య వర్ధంతి సందర్భంగా)

[ 32వ పేజి తరువాయి ]

మును బంగారు వస్తువులను దోచుకొని శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారి దేవాలయము లోని ధన, కనక, వస్తువులను అపహరించు తలంపులో ప్రవేశించిరి. ప్రవేశించిన పిండారీల దేహాలు మంటలతోను, కాళ్ళు, చేతులు, అశక్తత యేర్పడి క్రిందపడిపోయి నారు. అందుపై వారు దేవాలయమునకు అపకారము చేయకపోగా శ్రీ లక్ష్మీనృసింహ స్వామికి, శ్రీరాజ్యలక్ష్మీఅమ్మవారికి పూజలు చేసి వారి దోపిడి వస్తువులలో కొన్నిటిని స్వామివారికి అమ్మవారికి సమర్పించిపోయి నట్లు గాథ యున్నది.

## ఎగువ సన్నిధి

మంగళగిరి శుభములు యిచ్చుకొండ. ఈ కొండపైన, పానకాల నృసింహస్వామి దేవాలయము రాజ్యలక్ష్మీ అమ్మవారి దేవాలయములు యున్నవి. దేవాలయములో ఉదయము 8 గం. నుండి 12 గం. వరకే అర్చనాదులు జరుగును. స్వామి వారికి నివేదన పానకము. భక్తులు అర్పించు పానకము సగము స్వీకరించి, సగము బయటకు వదులుదురు. చీమలు గాని ఈగలు గాని దేవాలయములో కానరావు.

శ్రీ పానకాల నృసింహస్వామి దేవాలయము నాల్గు యుగముల ముందునుండి కొండపై యున్నట్లు చరిత్ర ఆధారములు యున్నవి. దేవాలయములోని మూలవిరాట్ స్వయం వ్యక్తులు. కృతయుగమునందు అమృతము త్రేతాయుగము నందు ఆవునెయ్యి ద్వాపర యుగమున ఆవుపాలు, కలియుగమున పానకమును నివేదించునట్లు స్థలపురాణ ములో యున్నది. దేశములో పానకాల రాయుడు, పానకాలరావు, పానకాలు, పానయ్య, నరసింహము, నరసయ్య, నర సింహమూర్తి, పానకాలమ్మ, నరసమ్మ, నరసింహమ్మ అను పేర్లు వాడుకలో యున్నవి. దేవాలయపు ప్రక్కన పెద్ద గుహ (బిలము) ఉత్తర దిక్కుగా కొండలో యున్నది. కొంతదూరము పోయి చూడ వచ్చును. యిచ్చుటకు 8 కిలోమీటర్లు దూర ములో యున్న ఉండవల్లి గుహల వరకు యీ గుహయున్నట్లు వాడుక. దేవాల యము ప్రక్కన స్వామి శ్రీవల్లభాచార్యులు స్వామి శ్రీ రామానుజాచార్యులు. శ్రీమతి కైవారం బాలాంబగార్లు తపస్సు చేసిన మందిరములు యున్నవి. ఈ స్వామి వారిని పరశురాముడు శ్రీరామచంద్ర ప్రభువు, పాండవులు దర్శించి పూజలుసల్పి నటుల స్థలపురాణములో యున్నది.

## గండదీపము

గజాకారముగా యున్న కొండ పైభాగ మున మధ్యలో యున్నది. 11 అడుగుల ఎత్తు 8 గజముల వెడల్పు గల్గియున్నగుడి గూడు పడమర, ఉత్తరము. తూర్పు దిశలు మూయబడి, దక్షిణము అనగా మంగళగిరి పట్టణమునకు, శ్రీ లక్ష్మీ నృసింహస్వామి గుడిలోని వారికి దీపపు కాంతి కన్పడునటుల యుండును. ఆపద లలో యున్నవారు కోర్కెలు యున్నవారు గండదీపము వెలిగించునటుల మ్రొక్కు కుందురు. కోర్కెలు తీరిన తదుపరి తాము గాని తమ మనుష్యులు గాని 4 కిలోల ఆవు నెయ్యిగాని, నువ్వులనూనెగాని, తీసుకొని క్రొత్తనూలు వత్తితో కొండపైకిపోయి గండదీపము వెలిగింతురు. దీపపుకాంతి కొండచుట్టు 10 కిలోమీటరులు కన్పడును. ఈ గుడిని గండాలరాయుని గుడి అందురు.

ప్రతి సంవత్సరము శ్రీ లక్ష్మీ నృసింహ స్వామి వారి బ్రహ్మోత్సవాలు ఆస్థానోత్సవ ములు మహోన్నతముగా జరుపబడును.





Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao M.A., and Printed at T.T.D. Press by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



**రామచంద్రుఁ డితఁడు రఘువీరుఁడు**
**కామితఫలములియ్యఁగలిగె నిందరికి.**

గౌతముభార్యపాలిటి కామధేను వితఁడు
ఘాతలఁ గౌశికుపాలి కల్పవృక్షము
సీతాదేవి పాలిటి చింతామ ణీతఁడు
యీతఁడు దాసులపాలి యిహపరదైవము.

పరగ సుగ్రీవుపాలి పరమబంధుఁ డితఁడు
సరి హనుమంతుపాలి సామ్రాజ్యము
నిరతి విభీషణునిపాలి నిధానము
గరిమ జనకుపాలి ఘనపారిజాతము.

తలఁప శబరిపాలి తత్వపురహస్యము
అలరి గుహునిపాలి ఆదిమూలము
కలఁడన్నవారిపాలి కన్నులెదుటి మూరితి
వెలయ శ్రీ వేంకటాద్రి విభుఁడితఁడు.

— అన్నమాచార్య అధ్యాత్మకీర్తన.



(ఏప్రిల్ 10, శ్రీరామనవమి సందర్భంగా)

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...



గౌరవసంపాదకులు :

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :

కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ

*

ముద్రాపకుడు :

ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00

సం॥ చందా - రు. 12-00

*

వ్రతులకు :

వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.


## ఈ సంచికలో....


ఏప్రిల్ 1984

సంపుటి 14 సంచిక 11




ముఖచిత్రం : శ్రీ సీతారామలక్ష్మణులు.

**2 వ కవరుపేజి : తిరుపతి శ్రీ కోదండరామస్వామి రథోత్సవం. 3 వ కవరుపేజి : నాగలాపురం శ్రీ వేదనారాయణస్వామి గరుడోత్సవం.**

**4 వ కవరుపేజి : ఉగాదిశోభ, చిత్రకారుడు : శ్రీ ఎస్. సత్యనారాయణ, తిరుపతి.**

# సంపాదకీయం

## సుదతి మెచ్చుల యిల్లు — సురలకు పుట్టిల్లు

ఈ మాటను ఏ బాటలో చెప్పినా తరతరాలుగా మనం విన్నాం, వింటున్నాం. బహుశః వింటాం కూడా. మమతా మానవత్వాలకు రోజు రోజు దూరమౌతున్న నవమానవలోకంలో ఏ సూత్రాలెన్ని చెప్పినా ఎవరికి లెక్క? గతాన్ని తరచి చూస్తే మనమెంత దిగజారామో అవగతమౌతుంది. గతమంతా మన మారేవిలువలకు ముంజేతి కంకణం. ఒక్కొక్క ఇతిహాసం ఒక మహత్తర సత్యాన్ని చాటుతుంది.

ఆదికావ్యం రామాయణం. 'సీతాయాశ్చరితం' అని చెప్పినా, రామాయణం అన్నపేరు సార్వకాలికంగా వినూత్నార్థాలను సంతరించుకొంటున్నది. 'రామాయాః అయనం' రామాయణం అంటే స్త్రీ పోకడ అర్థం. స్త్రీ ఎక్కడకు పోతున్నది, ఎంతవరకు పోతున్నది. లేదా 'మూర్ధానం పత్యురారోహ' అని దీవనలు పొందే కులకాంతను ఎంతటి క్షోభకు గురిచేస్తున్నాం. స్త్రీ నింద, నిరాదరణ సమాజానికెంతటి ప్రమాదానికి గురిచేయగలవన్న దానికి సాక్ష్యాలు ఇక్కడ ప్రారంభమై భారతంలో పరాకాష్ఠ నందుకున్నవి. అందుకే దానికి మొదట 'జయం' (అంటే ప్రతీకారవిజయంగా) అన్నపేరు సార్థకమై వుంటుంది.

నిజానికి రామాయణ మహాభారత నాయికలకు చాలా పోలికలున్నై. నాయికలు సీతా ద్రౌపదు లిరువురూ ఉన్నతవంశ సంజాతలు, అయోనిజలు, స్వయంవరవిజితలు, అంతఃపుర రాజకీయాల కారణంగా అడవులపాలైన వాళ్లు. ఇద్దరూ అడవుల్లో ఆపదలకు గురైనవాళ్లు. దీర్ఘ వనవాసానంతరం దారుణ మారణం జరిగిన తరువాత తమ తమ కోర్కెలకు, తమ అవమానాలకు పరిహారం పొందినవాళ్ళు.

కాని రామాయణం నాటి సమాజంలో స్త్రీ పూజ్యత చాలా ఎక్కువ. అందుకనే బాధితయైన మైథిలి కాకాసురుని చూచిన కారుణ్యదృష్టితోనే, తనను అపహరించిన రావణుని కూడా చూడగలిగింది. రాముడంతటి కరుణా సముద్రుడులేడని, అమల్లంఘ్యమైన రామరూపమృత్యువును తప్పించుకోవాలంటే, తనను రామున కప్పగించి, శరణనటమే మార్గమని పలుసారులు బోధించింది. పౌలస్త్యుడైన రావణుడిలా దుష్పథంలో ఉంటే, ఆ ఒక్కడివల్ల రాక్షసవంశమే నిర్మూలం కాక తప్పదేయని తపన నమభవించిన దయాస్వరూపిణి. యుద్ధానంతరం రాముడు పెట్టిన అగ్నిపరీక్షకు కూడా అంగీకరించిన సహనశీల సాధ్వి. నిజానికి రామాయణయుద్ధానికి అనాలోచితంగా దురాలోచనరహితంగా జరిగిన శూర్పణఖా పరాభవం కారణం అంటే ఆశ్చర్యం కాదేమో.

కాని, భారత నాయికకు జరిగిన పరాభవం ఆనాటి రాజ కోటికే అపూర్వమైంది. అంతా అమానుషమైంది. నిండు కొలువుతో నిస్సహాయులైన భర్తల యెదుట రగిలిన పరాభవానలం సెగలు కమ్మి దారుణ మారణ హోమానికి దారి తీసింది. రావణాపహృతయైన సీతాదేవి ఆత్మహత్యకు పూనుకోగా కురుసభావమానితయైన ద్రౌపది తన సూటిపోటు మాటలతో భర్తలలో ప్రతీకారాన్ని ప్రజ్వరిల్లజేసి కురుకాంతార దావానలంగా తానే సర్వమూలశక్తిగా అనేక రాజవంశాలను బలితీసుకుంది. వాస్తవానికి ద్రౌపది అంతటి కఠినహృదయా అంటే కాదని చెప్పేందుకు తన ఐదుగురు పుత్రుల్ని అర్ధరాత్రి సంహరించిన బాలఘాతి అశ్వత్థామకు ప్రాణదానం చేసిన సన్నివేశమే చాలు. నారీ ప్రతీకారజ్వాలలు రగిలిన సన్నివేశాలెన్నో విశ్వచరిత్రలో వున్నవి. కరుణాకఠోరతలు కలబోసుకొని, కనువిప్పు కలిగించే సందేశమిచ్చేది ఈ కర్మభూమి మాత్రమే.

సంతతావమాన పరంపరా పదఘట్టనలో నవనీతహృదయం కూడా పాషాణంగా మారుతుందనీ, అభిమానం దెబ్బతిన్న స్త్రీ ప్రాణత్యాగానికైనా సిద్ధమౌతుంది గాని ప్రతిఘటనాశక్తిని పోగొట్టుకోదని, అవకాశం దొరికినప్పుడు సమాజ దౌష్ట్యంమీద ఎదురుదెబ్బ తప్పక తీసుకుంటూందని, అప్పుడు పురుష పరుషాహంకారులు కాలిన చేతులలో ఆకుల్లాగ అలమటించక తప్పదనీ రామాయణ

[48 వ పేజీలో]

# ఉగాది వైశిష్ట్యము

"ఉగస్య ఆదిః ఉగాదిః" అనగా నక్షత్ర గమనము. నక్షత్రగమనము ఆరంభమైన దినము అంటే సృష్టి ఆరంభమైనదినమే ఉగాది. ఉగాది పండుగ తొలిరూపము యుగాది. 'యుగాది' అనగా సంవత్సరాది యకారాది, పదముల యుచ్చారణము తెలుగువారిసంప్రదాయమునకు విరుద్ధము, కనుక 'ఉగాది' యని రూఢమైపోయినది.

"తత్ర చైత్ర శుక్ల ప్రతిపది వత్సరారంభః" అని నిర్ణయసింధుకారుడు పేర్కొని యుండుటనుబట్టి ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ పాడ్యమినాడు ఉగాదిపండుగ ఆచరణలోనికివచ్చినది. ఉగాదిపర్వాచరణ విధానాన్ని 'ధర్మసింధు' కారుడు ఇట్లు నుడివి యున్నాడు:-

తైలాభ్యంగం సంకల్పాదవునూతనవత్సర
నామకీర్తనాద్యారంభం........
ప్రతిగృహం ధ్వజారోహణం, నింబ
పత్రాశనం వత్సరాది ఫలశ్రవణం ...

ఉగాదినాడు (1) తైలాభ్యంగనం (2) నూతనసంవత్సరాదిస్తోత్రం (3) నింబకుసుమభక్షణం (4) పంచాంగ శ్రవణం (5) ధ్వజారోహణం మున్నగు పంచకృత్యాలు నిర్వర్తించవలెనని పైవాక్య భావం.

## తైలాభ్యంగనం

ఉగాదిరోజు అరుణోదయానికి పూర్వమే లేచి తైలాభ్యంగనం అనగా నూనెతో తలంటిపోసుకొనుట ప్రథమవిధి. ఉగాది వంటి ప్రముఖ పర్వదినాలలో శ్రీమహాలక్ష్మి తైలములోనూ, గంగాదేవి నీటిలోను అవతరించి వుందురని పురాణప్రతీతి. కావున నూనెతో తలంటుకొని స్నానమొనరించుట చేసిన లక్ష్మీ, గంగాదేవుల అనుగ్రహానికి పాత్రము కాగలరు. అదియునుగాక తైలాభ్యంగన అవశ్యకతను గూర్చి 'ఆయుర్వేదం' ఇలా నుడివియున్నది.

"అభ్యంగం కార యేన్నిత్యం
సర్వేష్వంగేషు పుష్టిదం"

అభ్యంగస్నానము చేయుటవలన అన్ని అవయవాలకు పుష్టిచేకూరగలదని భావము. ఆరోగ్యరీత్యా, ఆధ్యాత్మికరీత్యా కూడ ప్రాముఖ్యము నొందియున్న ఈ తైలాభ్యంగమును ఆచారరూపేణ పొందుపరచిన మన ప్రాచీనుల దూరదృష్టి శ్లాఘనీయం.

## నూతనసంవత్సర స్తోత్రం

ఉగాదినాడు వీధులలో రెండవది నవవత్సర స్తోత్రకార్యక్రమం. స్నానానంతరం ప్రతి గృహమున మామిడిఆకుల తోరణాలు అలంకరించి దేవునిగదిలో వివిధ పుష్పాలంకారయుతమైన మంటపాన్ని నిర్మించి అందు నూతనవత్సర పంచాంగాన్ని, ఆ సంవత్సరాది దేవతను, భక్తిశ్రద్ధలతో అర్చించి ఉగాది ప్రత్యేక రసాయనాన్ని దేవతకు నివేదించవలెనని వ్రతగ్రంథము నిర్దేశించియున్నది.

## 'ఉగాదిపచ్చడి' సేవనం

ఉగాదిపచ్చడినే 'ఉగాదిగుజ్జు' లేక 'ఉగాదిరసాయనం' అంటారు.

'అబ్దాదౌ నింబకుసుమం
శర్కరామ్ల ఘృతైర్యుతమ్,
భక్షితం పూర్వయామే తు
తద్వర్షే సౌఖ్యదాయకమ్.'

అని ఆర్యోక్తి. వేపపూత, పంచదార, చింతపండు, నేయి, మిరియాలు, లవణము కలిపిన దానిని 'ఉగాదిపచ్చడి' అంటారు. ఈ పచ్చడి కష్టసుఖ సమ్మిశ్రితమైన మానవ జీవితమునకు ఉపలక్ష్యముగా పేర్కొనబడినది. చేదెక్కిన బ్రతుకులలో చెఱకుతీపి పండాలనే 'ఉగాది ఉపదేశం' ఈ ఉగాది పచ్చడి సేవనమనెడి ఆచారంలో అంతర్గతంగా స్ఫురించటం గమనార్హం. అంతే కాదు ఈ పచ్చడి సేవనఫలంగా రోగశాంతి, వాతపిత్తదోషాలు హరించబడునని వైద్యశాస్త్రం చెప్పుచున్నది కూడా.

## పంచాంగశ్రవణం

ఉగాదినాడు దేవాలయములలోగాని లేక రచ్చబండలమీదగాని పండితుల,

[45 వ పేజీలో]



# అన్నమయ్య
# చెన్నకేశవ శతకము
## మైనంపాటి వెంకట సుబ్రహ్మణ్యం



(గతసంచిక తరువాయి)

తాళ్ళపాక అన్నమయ్యకు చింతచెట్టుకు అవినాభావసంబంధమేదో చిన్ననాటి నుండి యున్నది. తాళ్ళపాకలోని చింతచెట్టు, తిరుమలలోని చింతచెట్టు అన్నమయ్య యను రాగానికి నోచుకొన్నవి! వానిదెంతటి భాగ్యమో! 'చింత'ను గూర్చిన కీర్తన: (అన్న-అధ్యా-307 రేకు)

గుండక్రియ

కోటికిఁబడగ యెత్తి కొంకనేల?
యీటులేని పదమెక్కి ఇఁకనేల చింత ॥పల్లవి॥

అన్నమయ్య స్మార్తుడై తాళ్ళపాకలో నేచింతలులేక చిదానందమూర్తియై బాల్యమున నాడుకొన్న చింత! వైష్ణవుడై తిరుమలలో చిదానందానుభవమున స్వామితో మాట్లాడుకొన్న చింత! రెండుచింతల కెంత భేదము!

చింతచెట్టు అన్నమయ్య భగవద్భక్తి ప్రేరణమునకునైన చింతనమునకు సంకేతమేమో! శ్రీ కైవల్యపదంబు చేరుటకునై 'చింతించెదన్' అని బమ్మెర పోతనామాత్యుడు. అన్నమయ్య, పోతన యించుమించుగా సమకాలికులే! ఆ యిరువురికి నీ

## "అచ్చన్న వరదాళ్ళు బంచ్చి కేశవులు"
### — అసలురూపమేమి తిరుమలేశ?

పెట్టినది నొసలను పెద్దపెద్ద తిరుమణి
కట్టినది మొలఁ జిన్న కౌపీనము
పట్టినది శ్రీహరి పాదపద్మమూలము
యెట్టయినా మాకు మేలే యింక నేల
చింత ॥కో॥

చిక్కినాలో నైనది శ్రీవైష్ణవధర్మము
తొక్కినది భవముల తుదిపదము
యెక్కినది హరిభక్తి యిది పట్టపేనుఁగ
యెక్కువ కెక్కువేకాక యింకనేల
చింత ॥కో॥

చిత్తములో నిండినది శ్రీపతి రూపము
హత్తినది వైరాగ్యమాత్మధనము
యెత్తలఁ జూచిన మాకు నిదివో
శ్రీవేంకటేశుఁ
డెత్తి మముఁగావఁగాను యింక నేల
చింత ॥కో॥

చింతనమే దైవభక్త్యుపాసనకు అవలంబము. ఆత్మజ్ఞానప్రాప్తికై 'శ్రోతవ్యో' మంతవ్యో నిదిధ్యాసితవ్యః, అను శ్రుతిచేత శ్రవణ, మనన, నిదిధ్యాసములనెడు త్రివిధసాధనములు విధింపబడియున్నవి. నిదిధ్యాసయన చింతించుటయని బృహదారణ్యకశ్రుతి. చింతించెదన్ అనగా ధ్యానించెదన్ అని భావము. ఇది బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని మూడు విధాలు- బాహ్యభక్తి పరజ్ఞానము కల్గించును. అనగా తన కంటే యధికుడు పరమేశ్వరుడున్నాడను జ్ఞానము. అనన్యభక్తి అపరోక్షజ్ఞానమునకు మూలం. అనగా తనకు ఈశ్వరునకు భేదము లేదనుజ్ఞానము. ఏకాంతభక్తి పరమానందానుభవము కల్గించును. ఇదే దివ్యజ్ఞానం.

పోతన్నగారిది ఏకాంతభక్తి శ్రీకృష్ణ పరబ్రహ్మమును గూర్చి విచారించుట సూచింపబడినది. మహాభాగవత పఠన పాఠనములు బ్రహ్మజిజ్ఞాసచేయుట వంటిదని. ధ్వని బ్రహ్మసూత్ర జిజ్ఞాసాధికరణము 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' (కర్తవ్యా) అను బ్రహ్మసూత్రమిచ్చట నర్థాక్షిప్తము. ఈ విధముగ బ్రహ్మజ్ఞానంకొరకు విచారము చేయుటయే పోతన్నగారు "చింతించుట" లోని పరమార్థము. శ్రవణ, మనన, నిదిధ్యాసములు చేయబడిన పిమ్మట ఆత్మదర్శనము కలుగునని భావము. అది 'చింత' వలననే సాధ్యము.

కావున పోతన్నగారివలెనే బ్రహ్మజ్ఞానమునకై 'చింత' నముచేయుట అన్నమయ్యకు సహజముగా లభించినది చిన్ననాటనే. అందుకే చింతచెట్టును తాను దర్శించినపుడెల్లను చింతనమును హెచ్చరించి అన్నమయ్యను బ్రహ్మజిజ్ఞాసోన్ముఖు నొనర్చి ఆత్మదర్శనము చేయించి శ్రీకైవల్యసాధనకు శ్రీనివాస చరణారవింద సంకీర్తనాభిరతునిగావించినదనుటలో సందియములేదు. అందువల్ల అన్నమయ్య తొల్త ఆధ్యాత్మిక చింతనమున వరవశించి యా యనుభవమును మేళవించి ఆధ్యాత్మిక సంకీర్తనములను శ్రీవారికి నివేదించి



చక్రతీర్థము (చక్రాలమడుగు)

నాడనుట సత్యమని తోచును. ఆతర్వాతనే వైష్ణవభక్తిమార్గమునకు ముఖ్యసోపానములగు

'శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనం।
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మనివేదనమ్ ॥

లను అధిరోహించి శృంగార రసాకృష్టచేతస్కుడై నిసర్గాదిభక్త్యుపాయములలో సమారోపభక్తిని బొంది తాను నాయికయై స్వామియందు నాయకత్వమారోపించుకొని శృంగార సంకీర్తనాంబుధి నోలలాడిన మహానుభావుడు.

ఈ పద్యమున కడపటి రెండు పాదములతో 'తాలపాకన్న' తాలపాక+అన్న చెన్నకేశవుడు "తలపగన్నన" తలపగ+అన్నన=తలంపగా అన్నన అని యర్థము గ్రహింపవచ్చును.

6. పద్యము :—

చక్రతీర్థమునందు శంఖుతీర్థమునందు
జలకాలు చేసిన తొలగు అఘము



పక్షితీర్థము (పాదికాల్వ)

ఇంద్రతీర్థంబున చంద్రతీర్థంబున
మునిగిలేచిన జీవముక్తి కలుగు
బ్రహ్మతీర్థంబున పక్షితీర్థంబున
తానమాడిన పోవు తాపమెల్ల
లక్షితీర్థంబున పక్షితీర్థంబున
గుంకగా శుభములుకోటిసేయు

కొలచియున్నవి తీర్థములుకూడివుండు
దైవమునీవంచు కోరికలు దీర్తువంచు
అమ్మచెప్పెను తాలపాకన్న తలవ
గన్నన్నవరదాలు బుచ్చి చిన్న కేశాలు.

సవరించిన పద్యము:-

చక్రతీర్థమునందు శంఖు తీర్థమునందు
జలకాలు చేసిన తొలగు నఘము
ఇంద్రతీర్థంబున చంద్రతీర్థంబున
మునిగిలేచిన జీవముక్తి కలుగు



చంద్రతీర్థము (అగస్త్యేశ్వరాలయం)

బ్రహ్మతీర్థంబున పక్షితీర్థంబున
తానమాడిన పోవు తాపమెల్ల
లక్ష్మీతీర్థంబున పక్షితీర్థంబున
గ్రుంకగా శుభములు కోటిసేయు
కొలచియున్నవి తీర్థముల్ కూడియుండు
దేవుండై నీవె కోర్కెలు తీర్తువంచు
అమ్మచెప్పెను తాలపాకన్న : తలవ
గన్నన వరదాళ్ళుండు బుజ్జిన్న కేశ !

ఈ పద్యమునందలి తీర్థములు, వానిని గూర్చి నేడు వ్యవహారమున నుండు పేర్లు, వాని వివరాలు :

1. చక్రతీర్థము :—

ఇదిరాజంపేట సమీపంలో "చక్రాలమడుగు" అను పేర పిలువబడుచున్నది.



శంఖుతీర్థము (అదుపూరుగుహ)

2. శంఖుతీర్థము :—

ఇది నందలూరు సమీపంలో ఆడుపూరు గుహక్రింద నేడు చెయ్యేటిలోని మడుగుగా చెప్పబడుచున్నది. ఇచ్చట శంఖలిఖితులను మునికుమారులకు శాపవిమోచనమై హస్తప్రాప్తి కల్గినదట. అందువల్లనే ఆ నదికి బాహుద, చెయ్యేరు అను పేర్లు కల్గినవి.

3. ఇంద్రతీర్థము :—

ఇదిరాజంపేట తాలూకాలో ఆకేపాడు గ్రామానికి పోవుదారిలో హస్తవరం గ్రామం (కాపువారున్నది) ఉత్తరదిక్కున ఆలయముంది. ఆ దేవుడు తిరుపాలకస్వామి (త్రిపాలకస్వామి- ఇంద్రుడట; త్రిలోక పాలకుడు విష్ణువు) ఈనాడీ దేవుని పెరు మాళ్ళస్వామి అంటున్నారు. ఆలయం చోళ వాస్తుశిల్పాన్ని బోలినది. గర్భాలయం సగముపైగ పడిపోయినది. విగ్రహంలేదు. దాన్నిదొంగలు త్రవ్వి పడద్రోసిపోగా 1982 జనవరిలో దానిని రాజంపేట తహసీలుదారు కడప మ్యూజియంకు చేర్చినారని స్థానికులు చెప్పారు. ఆలయసమీపంలో నేడెట్టి తీర్థములేదు. కాని, పూర్వమొక



లక్ష్మీతీర్థము (పాటదిబ్బ-అగస్త్య)

కోనేటి బావి యుండినదట. నేడచట కన్న డునది పంటపొలము. ఆ వూరికి తూర్పున శివాలయముంది. చిన్నగుడి. ప్రాచీనం.

4. చంద్రతీర్థము :—

ఇది రాజంపేట నందలూరు నడుమ రహదారిలోనున్న గుండ్లూరునకు తూర్పుగా చెయ్యేటి యొడ్డున నున్నది. ఆలయం అన్నపూర్ణాసహిత అగస్త్యేశ్వరస్వామిది. ఊరికి దక్షిణాన లక్ష్మీనారాయణస్వామి ఆలయం. రెండును ప్రాచీనములు. అగస్త్యేశ్వరాలయంలో ప్రతి కార్తికమాసమునందు మూడవసోమవారమునగాని, పూర్ణిమకుగాని, ఆ శివలింగముపై చంద్రరేఖనుండి (లింగాగ్రంనుండి) నీరు చెమ్మగిల్లిజాలువారును ! గర్భాలయంలో సుమారు రెండడుగులలోతు నీరూరును. ఆనీరంతర్ముఖంగా ప్రవహించి చెయ్యేటిలోని మడుగునకు

లోని త్రేతేశ్వరుని సన్నిధితో నున్న ఇది పురాణప్రసిద్ధి కలది.

6. పక్షితీర్థం :—

ఇది నెల్లూరుజిల్లా రాపూరుతాలూకలోనిది. పెంచలకోన నరసింహస్వామి క్షేత్రానికి తాళ్ళపాకనుండి పోవుమార్గాన కొండమీద "తొట్లు" అనుచోటునకు సమీపంలో నాల్గు నీటి గుండములున్నవట ! వానికడకు పోవుట కష్టము. వానిపైనెప్పుడు పక్షులు తిరుగాడుచుండునట ! ఆ క్షేత్రమునకు పోయివచ్చు యాత్రికులు దూరమునుండి చూచిమ్రొక్కుదురట ! ఇటువంటిది చెంగల్పట్టు జిల్లాలో మహాబలిపురము సమీపమందు "తిరుక్కళిగుండ్రం"లో కలదు. అచ్చట పక్షులువచ్చి దైవప్రసాదము స్వీకరించి పోవుట జగత్ప్రసిద్ధము.

లోకి గారతో కట్టిన కాలువ గుండ్రని సొరంగమున్నట్టు ఇటీవల ఆచూపుచాయలో త్రవ్విన బావులవలన తెలియుచున్నది. ఆ బావులు తాళ్ళపాకలోని శ్రీ రంపాటి చెన్నయ్య, శ్రీ ఆళ్ళగడ్డ రంగరాజుగార్లవి.

ఇటువంటి కాల్వలు చెయ్యేటినుండి నీటి పారుదలకు ప్రజోపయోగమువకు క్రీ. శ. 1268 నాటికే యచ్చటి పాలక ప్రభువులు కట్టించినట్లు పొత్తపి శాసనములనుండి తెలియనగును. ఈక్రింది వ్రాతనుపరిశీలింపుడు; Lakshmi Theertham-river channels from Cheyyeru (Bahuda). This matter is taken from బమ్మెరపోతరాజ విజయము.

"From this date (1268) The Pottapi Country as was already the case with all the tract corresponding to the Taluks of Jammalamadugu, Proddutur, Cuddapah, Kamalapuram and probably, Pulivendla, fell into the hands of Ambadeva who had temporarily usurped the Kakatiya crown. He ruled this part of the territory from Vallur, some ten mills west of Cuddapah and the Administrative Divisions were the Gandikota sima, the Mulikinadu, Renadu, and in the east of the District, the Sakili, Yeruva and Pottapi Divisions. During the time of Ambadeva, a land survey of Pottapinadu was carried out under the direction of his subordinate Peddinayaka and a river channel was constructed at Lebaka. A flood bank was also thrown up to prevent the waters of the Cheyyer inundating a temple at Attirala. Prataparudra was the Kaka-



చెన్నకేశవాలయం (తాళ్ళపాక)



చెన్నకేశవాలయం (టంగుటూరు)



శ్రీ లక్ష్మీనారాయణ ఆలయం (గుండ్లూరు)

చేరునట ! నేడామడుగుచెయ్యేటిలోలేదు. పూడిపోయినది. ఆ నీరు యేటియిసుకలో నింకి పోవుచున్నది. గుండ్లూరు చుట్టుగ్రామవాసులకెల్లర కావృత్తాంతము ప్రతివత్సరము దర్శనీయమట. ఈ వృత్తాంతమెల్ల ఆ స్వామి అర్చకులు శ్రీ చేపాటి తంబళ్ళ వీరయ్యగారు చెప్పి స్టేటుమెంటు వ్రాయించిఇచ్చినారు.

5. బ్రహ్మతీర్థం :—

పరశురాముని బ్రహ్మహత్యాదోషము పోగొట్టిన "హత్యరాలమడుగు" చెయ్యేటిలోని మడుగే. పరశురామక్షేత్రము

7. లక్ష్మీతీర్థం :—

ఇది తాళ్ళపాకలోని చెన్నకేశవాలయానికి ఉత్తరదిక్కున, శివాలయానికి పశ్చిమమున "పాటిగడ్డ"కు ఉత్తరమున అగడ్త వుంది. దాని కీశాన్యముగా నొకకొలనుండేదట. నేడా అగడ్తపూడిపోయింది. అంతా పొలము. పాటిగడ్డపైనడుమువరకు విరిగినది, పద్మాసనముతో లక్ష్మీదేవి శిలావిగ్రహము పూడుకొనియున్నది. ఆమూర్తి శిల దోరవిరుపురంగు. అచటనే బోయమూర్తులున్న నిలువుబండల్నువి. ఆపాటిగడ్డయే పూర్వపు లక్ష్మీఆలయమేమో; పరిశీలింపవలెను. సమీపంలోని చెయ్యేరునుండి అగడ్త

tiya king who succeeded to the throne at Warangal after the death or downfall of the usurper Ambadeva."

8. పక్షితీర్థము:—

ఇది మరియొకటి. నడిగడ్డఅగ్రహారం సమీపంలో నుండివచ్చు నీటిపాయ చెయ్యేటిలో కలయుచోట మడుగున్నది. దీన్ని నేడు పాచికాల్వ అంటున్నారు. పక్షితీర్థం పాచికాల్వయైందేమో! దీని యొడ్డున పురాతనమైన వినాయకుని గుడి యున్నది.

ఈ చెప్పిన తీర్థాలన్నింటిలో నొక్క పక్షితీర్థము పెంచలకోనకు పోవుదారిలోనిది. తక్క తక్కినతీర్థములన్నీ తాళ్ళపాకకు సమీపంగా సుమారు మూడు, నాలుగు మైళ్ల లోపున నున్నవే. వీనిని మనము దర్శింపవచ్చును.

7. పద్యము–

శంఖచక్రగదా శార్ఙ్గకోదండ హస్త
అఖిల దీన జనావాభయహస్త
దివ్యమణి కిరీటదీప్తి గులక .......
.................................
.................................
(ఈ పద్య మసంపూర్ణము)

సవరించిన పద్యము–

శంఖచక్రగదాసి శార్ఙ్గకోదండాప్త!
అఖిలదీనావనా! అభయహస్త!
దివ్యమణి కిరీట దీప్తి గులక........
.................................
... .................................

ఈ పద్యమున విష్ణుమూర్తిని వర్ణించినట్లునది. చెన్నకేశవుడు చతుర్భుజుడు. రెండుచేతుల శంఖచక్రములు, కుడిచేయి అభయహస్తము, ఎడమచేత, గద కల్గినవాడు. విష్ణువుయొక్క పంచాయుధములు వర్ణించిన దీ పద్యం. చెన్న కేశవ, వేంకటేశ్వర విష్ణుమూర్తుల యభేదాత్మకమైన వర్ణన మీ పద్యము సూచించునని తలంతును. ఏమో! ఈ శతక పద్యములం దేయే విశేషాంశములు అన్నమయ్య చెప్పియుండెనో! మరొకచో తక్కినవి లభింపవా? మన సాహిత్యసరస్వతి కాయ దృష్టమున్నదా? కాలమే దానికి సమాధాన మీయ వలెను. సాహిత్యపరిశీలకులందులకు పరిశ్రమింతురుగాక. ఈ శతకపద్యాలలోని కథాంశములు, విశేషములు చిన్నన్నగారి 'అన్నమాచార్య చరిత్ర' లోలేవు.

లభించిన ఈశతకపద్యములందలి కొన్ని విశేషములు నేనూహించినవి తెల్పుచున్నాను.

అన్నమయ్యకు అమ్మమాటవేదవాక్కు. అమ్మయే లక్ష్మిదేవి. అమ్మణ్ణి, అలిమేలుమంగ. 'అమ్మపంపెను' 'అమ్మచెప్పెను' అమ్మచూపెను, "అమ్మ పెట్టెను" అని ప్రతి పద్యమునందు "అమ్మ" ప్రసక్తి ప్రశంస నీయముగనున్నది. వేంకటేశ్వర శతకంలో అలమేలుమంగమ ప్రసక్తియున్నదిగదా! అట్లే యీ చెన్న కేశవశతక మందలి పద్యములన్నియు "అమ్మ" ప్రసక్తితో నుండియేయుండును. "అమ్మ" అన్నమయ్య జనని లక్కమాంబ ప్రసక్తియన్నను తప్పుకాదు. ఏలయన తన చిన్ననాడు శ్రీ చెన్నకేశవుని మహిమావిశేషములను, అనాడు జరుగుచున్న మహోత్సవ విశేషాలను తల్లి చంకకెత్తుకొని తనకు చూపి, చెప్పినదగుటచేతను, వానిని అన్నమయ్య బాల్యమున చూచిన వాడగుటచేతను, ఆ దృశ్యము లట్లే తన హృదయపీఠముపై నెలకొనియున్నందున వానినిపద్యాలలోచెప్పినాడు. ఆ చిన్ననాటి భావాలీ శతకపద్యాలలో బొదువుకొన్నవి. ఈ పద్యములు అన్నమయ్య సహజపాండితికి ప్రారంభదశలోనివి. అందువలన నీ పద్యములు బాలుని తొక్కుపల్కులలో (బాలభాష) పల్కినట్లున్నవి. ఆనాటి అన్నమయ్య బాలుడే! అన్నమయ్య తిరుమల చేరి వేంకటేశ్వర శతకము చెప్పెడునాటికి కొంతవఱకు భాషా వధూటి వశమైనది కావున నా పద్యరచన పటిమ నందుకొన్నది. అహోబిలము చేరి శాస్త్రవిజ్ఞానపథమున నడుగిడిన నాటికి వాణి పూర్తిగా అన్నమయ్యకు వశంవదయై, ద్విపదరామాయణాది పద రచనములందు ప్రతిభావ్యుత్పత్తులను చేకూర్చినది. భక్తితత్త్వమహిమాతిశయమున బల్కినదెల్ల నమృత కావ్యమై విలసిల్లినది. అన్నమయ్య రచనమేదియైనను 'చక్కెర బొమ్మ'. అలతి యలతి పదముల నడుగుల నడయాడు జానుతెలుగుపలుకుల బాల. టెంకణాదిత్యుడన్న జానుతెలుగుపలుకుల కాణాచి మా అన్నమయ్య నడయాడిన రాజువారిసీమ.

అన్నమయ్యకు శతక రచన బాల్యంలోనే యలవడినందునను, సీసపద్యలక్షణము సులువుగా నబ్బినందున తర్వాత నాతని పద రచనమునకెంతయో తోడ్పడినది. సీస పద్యలక్షణములు అన్నమయ్య పద రచనమున స్పష్టముగా మనము దర్శింపవచ్చును.

---

ఈ వ్యాసమునందలి తీర్థములు వానిని గూర్చి నేడు వ్యవహారములో నుండుపేర్లు, అవి ఎచ్చట గలవో సూచించిన తాళ్ళపాక లోని వృద్ధులు శ్రీ జంగా సుబ్బయ్య, శ్రీ గూడూరు రంగరాజుగార్లు, మరికొందరు పెద్దలు. వీరందరికి కృతజ్ఞతలు.

---



## పదకొండవ అధ్యాయం

## విశ్వరూపసందర్శనయోగం

అర్జున ఉవాచ:

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

అర్జునుడు: నా మీద దయతలచి అతి రహస్యమూ, ఆత్మజ్ఞాన సంబంధమూ అయిన విషయాలన్నిటినీ ఉపదేశించావు. దానితో నా అజ్ఞానమంతా అంతరించింది.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్॥

కృష్ణా! సమస్త భూతాల చావుపుట్టుకల గురించి అఖండమైన నీ మాహాత్మ్యం గురించి నీ నుంచి వివరంగా విన్నాను.

ఏవమేతద్యథాఽఽత్థ త్వం ఆత్మానం పరమేశ్వర।
ద్రష్టుమిచ్ఛామి తే రూపం ఐశ్వరం పురుషోత్తమ॥

పరమేశ్వరా! నిన్ను గురించి నీవు చెప్పిందంతా నిజమే. పురుషోత్తమా! ఈశ్వర సంబంధమైన నీ విశ్వరూపాన్ని సందర్శించాలని నా అభిలాష.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥

అర్జునా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ దేవతలను, మరుత్తులను చూడు. అలాగే ఇదివరకు ఎప్పుడూ కనీ వినీ ఎరుగని వింతలను వీక్షించు.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥

అర్జునా! నా శరీరంలో ఒకే భాగంలోవున్న చరాచరాత్మకమైన సకల ప్రపంచాన్నీ సందర్శించు. నీవింకా చూడ దలచినదంతా ఈ దేహంలోనే అవలోకించు.

న తు మాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్॥

నీ కళ్ళతో నన్ను నీవు చూడలేవు. నీకు దివ్యదృష్టి నిస్తున్నాను; దానితో నా విశ్వరూపం చూడు.



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత:

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో!
యోగీశ్వర! తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్॥

ప్రభూ! యోగీశ్వరా! నీ విశ్వరూపాన్ని సందర్శించడం నాకు సాధ్యమని నీవు భావిస్తే నిత్యమైన నీ స్వరూపం నాకు చూపించు.

శ్రీ భగవానువాచ:

పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥

శ్రీ భగవానుడు: పార్థా! అనేక రంగులతో అనేక ఆకారాలతో ఎన్నో విధాలుగా వందలకొద్ది, వేలకొద్ది వున్న నా దివ్యరూపాలను చూడు.

సంజయ ఉవాచ:

ఏవ ముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥

సంజయుడు: ధృతరాష్ట్రమహారాజా! మహాయోగీశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు అలా చెప్పి అర్జునుడికి శ్రేష్ఠమైన తన విశ్వరూపం చూపించాడు.

అనేకవక్త్రనయనం అనేకాద్భుత దర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥

దివ్యమాల్యామ్బరధరం దివ్యగంధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవం అనన్తం విశ్వతోముఖమ్॥

ఆ రూపం అనేకముఖాలతో, నేత్రాలతో, అద్భుతదృశ్యాలతో, దివ్యాభరణాలతో, ఎక్కుపెట్టిన పెక్కుదివ్యాయుధాలతో,

దివ్యపుష్పమాలలతో, దివ్యవస్త్రాలతో, దివ్యగంధాలతో, మహాశ్చర్యకరం, దేదీప్యమానం, అనంతం, విశ్వతోముఖమూ అయి విరాజిల్లుతున్నది.

దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భాస్సదృశీ సా స్యాత్ భాస స్తస్య మహాత్మనః॥

ఏకకాలంలో ఆకాశంలో వేయిమంది సూర్యులు వెలువడితే కలిగే కాంతి ఆ మహాత్ముడి విశ్వరూప తేజస్సుకు సాటి కావచ్చు.

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తథా॥

అప్పుడు అర్జునుడు దేవదేవుడి దేహంలో ఒకేచోట, ఎన్నో విధాలుగా విభజింపబడివున్న సమస్త ప్రపంచాన్నీ సందర్శించాడు.

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం! కృతాఞ్జలిరభాషత॥

అనంతరం అర్జునుడు ఆశ్చర్యచకితుడై శరీరం పులకరింపగా భగవంతుడికి తలవంచి నమస్కరించి చేతులు జోడించి ఇలా అన్నాడు.

అర్జున ఉవాచ:
పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూత విశేషసంఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥

అర్జునుడు: దేవా! నీ దేహంలో సమస్త దేవతలనూ చరాచర జగత్తునూ, కమలాసనంలో వున్న బ్రహ్మనూ, సర్వ ఋషులనూ దివ్యసర్పాలనూ, చూస్తున్నాను.

అనేక బాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంత రూపమ్।
నాంతం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప॥

విశ్వేశ్వరా! విశ్వరూపా! ఎన్నో భుజాలు, కడుపులు, ముఖాలు, కళ్ళు కలిగిన నీ అనంతరూపాన్ని అంతటా చూస్తున్నాను. నీ తుదీ, మొదలూ, మధ్యా మాత్రం నాకు కనరావడం లేదు.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్।
పశ్యామి త్వాం దుర్ని రీక్ష్యం సమంతాత్
దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥

కిరీటం, గద, చక్రం, ధరించి దశదిశలా కాంతిపుంజం లాగ వెలుగొందుతూ, చూడడానికి సాధ్యపడకుండా సూర్యాగ్ని కాంతికి సమానంగా ప్రజ్వలిస్తున్న అంతూ దరీలేని నిన్ను అంతటా చూస్తున్నాను.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే॥

నీవు తెలుసుకోదగ్గ పరబ్రహ్మవనీ, సమస్త జగత్తుకి ముఖ్యాధారమైన వాడవనీ, నాశనంలేనివాడవనీ, సనాతన ధర్మసంరక్షకుడవనీ, పురాణపురుషుడవనీ నేను భావిస్తున్నాను.

అనాదిమధ్యాంత మనంతవీర్యం
అనంతబాహుం శశిసూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్॥

ఆదిమధ్యాంతాలు లేనివాడవు, అపరిమితమైన సామర్థ్యం కలవాడవు, ఎన్నో చేతులు కలిగినవాడవు, చంద్రసూర్యులు కన్నులుగా కలవాడవు, ప్రజ్వలిస్తున్న అగ్నిలాంటి ముఖం కలవాడవు, నీ తేజస్సుతో ఈ జగత్తునంతటిని తపింపజేస్తున్నవాడవు అయిన నీవు నాకు సాక్షాత్కరిస్తున్నావు.

ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః।
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

మహాత్మా! భూమికీ ఆకాశానికీ మధ్యవున్న ఈ ప్రదేశమూ, దశదిశలూ నీతో నిండివున్నాయి. అద్భుతం, అతి భయంకరం అయిన నీ ఈ విశ్వరూపంచూసి మూడులోకాలూ గడగడ వణకుతున్నాయి.

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతా ప్రాంజలయో గృణంతి।
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥

ఈ దేవతాసమూహాలు నీలో ప్రవేశిస్తున్నాయి. కొంతమంది భీతితో చేతులు జోడించి నిన్ను స్తుతిస్తున్నారు. మహర్షుల, సిద్ధుల సమూహాలు మంగళవాక్యాలు పలికి సంపూర్ణ స్తోత్రాలతో నిన్ను పొగడుతున్నారు.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీదేవతలు, మరుత్తులు, పితృదేవతలు, గంధర్వ

యక్షసిద్ధ అసురసంఘాలు— వీళ్లంతా నిన్ను విస్మయంతో వీక్షిస్తున్నారు.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్॥

మహాబాహో! ఎన్నో ముఖాలు, కళ్లు, చేతులు, తొడలు పాదాలు, కడుపులు, కోరలతో భయంకరంగావున్న నీ రూపం చూసి లోకులంతా ఎంతో భయపడుతున్నారు; అలాగే నేనూ భయపడుతున్నాను.

నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో॥

ఆకాశాన్ని అంటుతూ, అనేకరంగులతో ప్రకాశిస్తూ నోళ్లు విప్పి, ఉజ్జ్వల విశాలనేత్రాలతో వున్న నిన్ను చూసి ఎంతో భయపడిపోయిన నేను ధైర్యం, శాంతిపొందలేకపోతున్నాను.

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస!॥

కోరలతో భయంకరంగా ప్రళయకాలంలోని అగ్నిలాగ కానవస్తున్న నీ ముఖాలు నాకు దిక్కుతోచకుండా చేశాయి. దేవేశా! జగన్నివాసా! దిగులు పడివున్న నన్ను అనుగ్రహించు.

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః।
భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥

వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాలాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై
రుత్తమాంగైః॥

ఎంతోమంది రాజులతోపాటు ఈ ధృతరాష్ట్రుడి పుత్రులు, భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అలాగే మనపక్షానికి చెందిన ప్రముఖయోధులూ వాడి కోరలతో భయంకరాలైన నీ నోళ్ళలోకి వడివడిగా ప్రవేశిస్తున్నారు. వాళ్ళలో కొంతమంది నీ పళ్ళసందులో ఇరుక్కుపోయి పొడి అయిపోతున్న తలలతో కనిపిస్తున్నారు.

యథా నదీనాం బహవోఽంబువేగాః సముద్రమే వాభిముఖా ద్రవంతి।
తథా తవామీ నరలోకవీరాః విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి॥

అనేక నదీ ప్రవాహాలు సముద్రంవైపు వేగంగా పరుగెత్తుతున్నట్లే ఈ నరలోక వీరులంతా ప్రజ్వలిస్తున్న నీ ముఖంలో ప్రవేశిస్తున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః
విశంతి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశంతి లోకాః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

చావుకోసం మిడతలు మిక్కిలి వేగంగా మండుతున్న అగ్నిలో ప్రవేశించినట్లే, నశించడం కోసం మహావేగంగా నీ నోళ్ళలో ఈ ప్రజలంతా ప్రవేశిస్తున్నారు.

లేలిహ్యసే గ్రసమాన స్సమంతాత్
లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో!॥

విష్ణుమూర్తీ! మండుతున్న నీ నోళ్ళతో ఈ సర్వలోకాలనూ మింగుతూ రుచి చూస్తున్నావు. జగత్తునంతటినీ నీ తేజస్సుతో నింపి, తీవ్రమైన కాంతితో దాన్ని తపింపచేస్తున్నావు.

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర! ప్రసీద।
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

దేవదేవా! ఉగ్రరూపంలో వున్న నీ వెవరవో చెప్పు. నీకు నమస్కారం. నన్ను అనుగ్రహించు. ఆదిపురుషుడవైన నిన్ను గురించి తెలుసుకోదలచాను. నీ ప్రవృత్తి నాకు అర్థం కావడంలేదు.

శ్రీ భగవానువాచ:

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

శ్రీ భగవానుడు: లోకసంహారానికి విజృంభించిన కాలస్వరూపుణ్ణి నేను. ప్రస్తుతం ఈ ప్రపంచంలో ప్రజలను సంహరించడమే నా సంకల్పం. నీవు యుద్ధం చేయకపోయినా శత్రుసైన్యంలోని వీరులంతా వినాశం పొందడం ఖాయం.

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వ మేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

సవ్యసాచీ! అందువల్ల నీవు యుద్ధానికి సిద్ధమై పేరు ప్రఖ్యాతులుపొందు. శత్రువులను జయించి సమృద్ధమైన

రాజ్యాన్ని అనుభవించు. వీళ్ళందరినీముందే నేనుచంపేశాను. నీవు నిమిత్తమాత్రంగా నిలబడు.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్ ॥

ఇదివరకే నేను సంహరించిన ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు వంటి వీరులందరినీ నీవు వధించు. భయపడకు. యుద్ధం చెయ్యి. శత్రువులను జయిస్తావు.

సంజయ ఉవాచ:

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥

సంజయుడు: శ్రీకృష్ణుడిమాటలు విని అర్జునుడు వణకుతూ చేతులు జోడించి నమస్కరించి, బాగా భయపడిపోయి మళ్ళీ నమస్కారంచేసి గద్గదస్వరంతో ఇలా అన్నాడు.

అర్జున ఉవాచ:

స్థానే హృషీకేశ ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యను రజ్యతేచ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః ॥

అర్జునుడు: హృషికేశా ! నీ మహిమను పొగడుతూ జగత్తంతా ఆనందం, అనురాగం పొందుతున్నది. రాక్షసులు భయపడి అన్నివైపులా పారిపోతున్నారు. సిద్ధులసంఘాలన్నీ నీకు నమస్కరిస్తున్నాయి. నీ విషయంలో ఇదంతా సమంజసమే.

కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణో ఽప్యాదికర్త్రే ।
అనంతదేవేశ ! జగన్నివాస !
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥

మహాత్మా ! నీవు అంతంలేనివాడవు; దేవతలకు దేవుడవు; జగత్తుకంతటికీ ఆధారుడవు; శాశ్వతుడవు; సత్తు అసత్తుల స్వరూపుడవే కాకుండా వాటికి అతీతమైన అక్షరుడవు. అందరికంటే గొప్పవాడవు, బ్రహ్మదేవుడికికూడా ఆదికారణుడవు అయిన నీకు వాళ్ళెందుకు నమస్కరింపరు ?

త్వ మాదిదేవః పురుషః పురాణః
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప ! ॥

నీవు ఆదిశేషుడవు; పురాణపురుషుడవు; ఈ సమస్త జగత్తుకే ఆధారుడవు; సర్వమూ తెలిసినవాడవు; తెలుసుకోదగ్గవాడవు; అనంతరూపా ! ఈ విశ్వమంతా పరంధాముడవైన నీతో నిండివున్నది.

వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ ।
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పున శ్చ భూయోఽపి నమో నమ స్తే ॥

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, బ్రహ్మదేవుడు, అతని తండ్రి నీవే. నీకు అనేకవేల నమస్కారాలు మళ్ళీమళ్ళీ నమస్కారాలు.

నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి
తతోఽసి సర్వః ॥

నీకు ముందు, వెనుక అన్నివైపులా నా నమస్కారాలు. సర్వ స్వరూపా ! అపరిమిత సామర్థ్యమూ అమితపరాక్రమమూ కలిగిన నీవు సర్వత్రావ్యాపించివున్నావు. అందువల్ల సర్వమూ నీవే.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ ! హే యాదవ ! హే సఖేతి !
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥

యచ్చాఽవహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు ।
ఏకోఽథవాఽప్యచ్యుత ! తత్సమక్షం
తత్క్షామయే త్వామహ మప్రమేయమ్ ॥

అచ్యుతా ! నీమహిమ తెలుసుకోలేక స్నేహితుడవనే ఉద్దేశంతో పొరపాటునో, చనువువల్లనో, కృష్ణా ! యాదవా ! సఖా అని నిన్ను నిర్లక్ష్యంగా పిలిచినందుకూ, కలిసిమెలసి తిరిగేటప్పుడు, పడుకున్నప్పుడు, కూర్చున్నప్పుడు, భోజనం చేసేటప్పుడు ఒంటరిగా వున్నప్పుడు, ఇతరులతో వున్నప్పుడు వేళాకోళంగా నిన్ను అవమానించినందుకు అప్రమేయుడవైన నీవు నాతప్పులన్నిటినీ మన్నించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
స త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ !

సాటిలేని ప్రభావం కలిగినవాడా ! ఈ చరాచర ప్రపంచమంతటికి నీవు తండ్రివి; పూజ్యుడవు; గురుడవు; గురువులకు గురుడవు. మూడులోకాలలో నీతో సమానమైనవాడే లేనప్పుడు నిన్ను మించినవాడెలా వుంటాడు.

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ ! సోఢుమ్ ॥

(37 వ పేజీలో)

# శ్రీవేంకటేశోదాహరణము

— శింగనమల్ల రాధాకృష్ణయ్య



శ్రీమద్దివ్య మునీంద్ర వందితుఁడిలన్
శ్రేయంబు నిత్యంబునై
భూమిన్ గల్గెడు ఈతిబాధ తతులన్
బోఁగొట్టుఁ వాఁడై సదా
నీమంబున్ మదినిల్పి కొల్చుజనులన్
నీమంబుగాఁ బ్రోచుచున్
కామార్థంబుల వేంకటాధిపుఁడు స
త్కారుణ్యుఁడై యిచ్చుతన్ 1

ప్రథమా విభక్తి (చంపకమాల)

జలమునఁ బుట్టి విశ్వమును చక్కగఁదాల్చిన వాఁడు భక్తులన్
అలయకఁబ్రోచు వాఁడు జగదాద్యుఁడు శ్రీపతి వేంకటాద్రిపై
వెలసిన కామధేనువు కవీంద్రుల భావ బలంబు ప్రోవుగా
నిలచిన వేంకటేశ్వరుఁడు నిచ్చలుఁబ్రోచుత జీవులెల్లరన్ 2

(సీసము)

కల్యాణ కారిణీ కమలాక్షినెడదపై,
కామితంబులు తీర్పఁ, గలుగువాఁడు
పాపౌఘములఁబాపి పాలించువేడ్కతో
అభయ హస్తమునిచ్చి యలరువాఁడు
అజ్ఞాన తిమిరమ్మునణచు చక్రమ్మును
వేడ్కతోడుతఁదాల్చి వెలయువాఁడు
ప్రణవనాదమునిచ్చి ప్రభలతో వెలుగొందు
వెండి శంఖముఁదాల్చి వెలయువాఁడు

పాదయుగమును మదినమ్మి భజనసేయు
భక్తకోటిని కాపాడు పరమ పదము
శేషశైలమ్ము పైనున్న శేషశయను
వేగసేవింప రారండు వేడ్కతోడ. 3

కళిక (తురగ వల్గన రగడ)

అలరు వేంకటాద్రిపైననాదిదేవుఁడైన వాఁడు
వెలసినాఁడు కలినిఁగల్గు వెతలఁబాపు వేడ్కతోడ
తొలియుగంబులందు వేద దూరుండైన వానింద్రుంచ
దలఁచి మీనరూపుఁబొంది ధరణి శ్రుతులఁగాచెనాఁడు

వెలసెనేడు భూమిపైన వేంకటాద్రి విభుఁడనంగ
తలపులన్ని నిలిపి వానిఁదలఁచరండు భక్తులార
నలువ భక్తితోడఁగొలిచి నడిపినాఁడు ఉత్సవముల
నిలచి భక్తకోటిఁబ్రోచు నిత్యుఁగొలువ వేగరండు. 4

(ఉత్కళిక)

వేంకటాద్రి సన్నిభుండు
సంకటాళిఁదీర్చుచుండు
అంకపీఠినలరుచుండు
పంకజాక్షి ప్రియతముండు

కోరికూర్మరూపుఁదాల్చి
దూరిసంద్రమందునిల్చి
కొండ బరువు నెల్లఁదాల్చె
అండయనెడు సురలమెచ్చి. 5

ద్వితీయా విభక్తి (పంచ చామరము)

శివాది దేవకోటి కొల్చు సేవ్యమాన రూపమున్
భవాబ్ధి దాటఁగోరు వారి భవ్యమైన రూపమున్
దివాకరాబ్ధి జాతనేత్రు దివ్యమైన తేజమున్
భువిన్వృషాచలంబుపైన పూజసేయ రండహో 6

(ఉత్పలమాల)

నేరనివాఁడుకాఁడు భువి నెల్లెడలందలి జీవకోటికిన్
వేరగువాఁడు, మన వేంకటనాథుని నమ్మికొన్నచో
ధారుణిఁగల్గు,కష్టములు తప్పును,తప్పదు ముక్తియేటికిన్
వేరుపథంబు లేదనుచు వేడరె విష్ణుని సర్వజిష్ణునిన్ 7

(మధ్యాక్కర)

ఘన దుర్మతులతో మెలఁగన్ నేర్పున కమలాప్తనేత్రు
నెనరున నిల్పి సతతము ధ్యానియై నీమముతోడ
ఇనకులసోముని భూతనాథుని ఇంచుకఁదల్చి
కనకాక్షవైరిని ఘనునిఁబొందరె కారుణ్యమయుని 8

( మత్తకోకిల )

దేవభామిను లొక్కపై పున దివ్యపూరుషులొక్కచో
హావభావములొప్పునట్లుగఁ నార్తివేడుచుకీర్తనల్
దేవదేవుని పైనఁబాడుచుఁ దీర్చినారట సన్నిధిన్
పావకాత్మ స్వరూపునిన్‌గని భవ్యలోకము నందరే! 9

కళిక ( విజయభద్రము )

భూత సంఘములన్ని పూజించుశ్రీకరుని
పూతనా సంహర భూమిజాధీశుని
భూతాత్ముఁడౌహరిని భూతభావనాయుని
పురహారి సన్నుతుని పుణ్యసంచారుఁడని
క్షీరసాగరశయన చిన్మయుండగువాని
చిద్రూపధారియై చేతుఁడౌ నరహరిని
సారుఁడై సారమై సంసారుఁడగువాని
సంసారజీవులకు సంతాపహరుఁడని
ప్రణవాత్మకుండైన పరమాత్ముఁడీతఁడని
ప్రళయంబునందైన పవళింప గలవాని
అణిమాది సిద్ధులకు అధినాథుఁడగువాని
ఆదిమూలంబైన ఆనందమగువాని
సర్వలోకంబులకు శరణంబునగువాని
చక్కగా లోకాల చక్కదిద్దెడువాని
శర్వుడై లోకముల సంహరించెడువాని
శరణనుచు వేడరే సర్వాత్ముఁడగువాని 10

( ఉత్కళిక )

ఒడలెల్ల వడకంగ రోమములు పులకెత్త
అడుగులును తడబడగ నదరుచును తనువెత్తి
శ్రీధరుని శ్రీపద ద్వయముపై పడవైచి
వేదాంత వేదియౌ విష్ణుపదములఁజూచి
శరణాగత త్రాణ బిరుదాంక! యనివేడి
అరివర్గములతోడి నెయ్యంబు మఱివీడి
నరసఖుని, హరనుతుని శరణంబు శరణమని
మురహరుని శరణనవె జీవాత్మ! శ్రీహరిని 11

తృతీయావిభక్తి ( ఉత్పలమాల )

నేతయు యోగవిద్యకధినేతయు, ధాతయునైనవానిచే
ధాతనుతాంఘ్రిచే ప్రముఖ దాతశిరంబు నడంచువానిచే
సూతకులాబ్ధిసోమనుత సూర్యశశాంక కులాబ్ధి జాతుచే
పూతచరిత్రయై భరత భూమి వెలుంగుత శ్రీనివాసుచే 12

( స్రగ్విణి )

భానుకోటి ప్రభా భాసతేజంబుచే
దానవేంద్రాప్త సంతాప సంతృప్తుచే
జ్ఞానముద్రాంక శృంగార శ్రీనాథుచే
దీనసంతాపముల్దీరు శ్రీకృష్ణుచే 13

( తరువోజ )

మధురకంఠంబుతో మహతిమీటుచును
మాధవు కీర్తించు మహనీయుచేత
విధివిధాయకముగ విష్ణునామముల
వేనోళ్ళఁగీర్తించు వేల్పులచేత
మధుసూదనునిపైన మనసెల్లనిలిపి
మాటిమాటికిఁజూచు మాధవిచేత
నిధియైనశ్రీకరు నిర్మలభక్తి
నిశ్చయంబుగఁనమ్ముఁనెల్ల వారలకు 14

( అల్పాక్కర )

కరిరాజుఁబ్రోచిన కాంతుచేత
వరభోగ శాయియౌ వరదుచేత
ధరణిజా రమణుండౌ ధర్ముచేత
నిరవధిక సుఖుఁడైన నిత్యుచేత 15

( కర్నాట చతుష్పద )

కరమందు వెలుగొందు ఖడ్గంబుచేత
సరస సద్గుణపూర్ణ చక్రంబుచేత
శరదిందు ధవళంపు శంఖంబుచేత
దురిత సంఘములెల్ల దూరమైపోవు 16

కళిక ( విజయమంగళము )

మునికులంబునందుఁబుట్టి మునుపు రాచపొగరు నడఁచి
మూర్ఖకార్తవీర్యుఁద్రుంచి ముదముచెందువానిచేత
ఘనవిరాగయోగివినుత కమలసంభవార్చితపద
కరుణకళిత హృదయుచేత కామజనక కరుణచేత
రావణాదిదనుజవైరి, రావణానుజాప్తుచేత
రాముచేత భానువంశధాముచేత భీముచేత
భావజారిసేవ్యుచేత భారతీశనుతునిచేత
భవ్యమైనరూపుచేత భవ్యలోకదాతచేత
క్షేత్రమైవానిచేత క్షేత్రుఁడైన విభునిచేత
క్షేత్రనాథ నాథుచేత క్షేమమింక కలుగుగాత!
క్షేత్రమైన సమస్తలోకక్షీణ కారణంబుచేత
క్షితిజప్రేమధాముచేత క్షీణపాపమౌనుగాత!
గర్వహరణ ప్రభావుచేత కామవైరిసఖునిచేత
కర్తచేత భర్తచేత కామితార్థమొప్పుగాత!
సర్వలోకనాథుచేత శర్వుచేత సాంబుచేత
సర్వుచేత స్థాణుచేత సర్వలోక శుభములౌత! 17

(సశేషము)

# గృహలక్ష్మి

# రామకథలో తార వ్యక్తిత్వము

ఆకుమాటున ఉన్నంతమాత్రాన పువ్వుకు వాసన లేకపోతుందా? రేకుల్లే కపోతాయా? కాకుంటే అది మాటిమాటికి మనకు కన్పించకపోవచ్చు. చెట్టుకు అల్లుకొన్నంత మాత్రాన తీవకు జీవశక్తి లోపిస్తుందా! అది పెరగకుండా ఆగిపోతుందా? కాకుంటే అది చెట్టునుండి విడివడి తన పొడవును ప్రదర్శింపకపోవచ్చు. అలాగే మాటాడనంత మాత్రాన బొమ్మకు అందం లేకపోతుందా! దాని ఆకారం వికారమౌతుందా? కాకుంటే అది తన్ను గూర్చి తాను చెప్పుకోకపోవచ్చు. లోకంలో చాలమంది స్త్రీలు ఆకుచాటు పువ్వుల్లా, చెట్టుకు అల్లుకొన్న తీవల్లా, అందమైన మూగబొమ్మల్లా వంటయిళ్ళల్లోనో, అంతఃపురాల్లోనో ఒదిగి ఉంటారు. కట్టుకొన్న భర్తను అనుసరించి జీవిస్తుంటారు. ఆ ఒదిగి ఉండటంలోనే వారికొక తృప్తి. అలా అనుసరించి జీవించటంలోనే వారికొక ఆనందం. అట్లని వారికి వ్యక్తిత్వం లేదని గాదు. ప్రజ్ఞాపాటవాలు తక్కువనీగాదు. అవి బాహ్యలోకానికి అట్టే అగుపించవు. అంతే.

అయితే కొంతమంది స్త్రీలు అలా ఉంటూనే అవసరమైనపుడు ఒక అడుగు ముందుకువేస్తారు. దూరదృష్టితో పరిస్థితులను అర్థం చేసుకొంటారు. ఎంతో ధైర్యంతో వాటిని ఎదుర్కొంటారు. భర్తకు హితబోధ చేస్తారు. కర్తవ్యాన్ని ఉపదేశిస్తారు. గొప్పగా ప్రకాశిస్తారు. అందరిని ఆశ్చర్య చకితుల్ని చేస్తారు.

రామాయణంలో తార ఈ కోవకు చెందిన స్త్రీమూర్తి. ఆమె ఆకుచాటు పువ్వులా, చెట్టుకు అల్లుకొన్నతీవలా, అందమైన మూగబొమ్మలా ఎంతకాలమో కిష్కింధా రాజ్యాంతఃపురంలో జీవితం గడిపింది. కాని అటు భర్త జీవితంలో, ఇటు తన జీవితంలో కొన్ని విషమపరిస్థితులేర్పడేసరికి ఆమె ప్రదర్శించిన దూరదృష్టి, చొరవ, ప్రజ్ఞాపాటవాలు, ధైర్యస్థైర్యాలు అనుపమానాలు. సుగ్రీవునిమీదికి రెండోసారి యుద్ధానికి వెళ్ళే వాలికి ఆమె చేసిన హితబోధ, వాలిని వధించిన రామునితో ఆమె మాటాడిన తీరు, మహోగ్రుడై సుగ్రీవుణ్ణి చంపవచ్చిన లక్ష్మణునితో ఆమె వ్యవహరించిన విధం మహోదాత్తమైన ఆ స్త్రీమూర్తివ్యక్తిత్వానికి ముకుటాయమానాలు.

అది తార అంతఃపురం. అందంగా అలంకరింపబడిన శయ్యామందిరం. మధ్య హంసతూలికాతల్పం. ఆ తల్పంమీద వాలి కౌగిట్లో ఒయ్యారంగా ఒదిగిఉన్న తార. వాలి, ముందురోజు తాను తమ్ముడుసుగ్రీవుణ్ణి తన్నితరిమిన వైనం ఆమెకు వివరిస్తున్నాడు. తార అతని చెక్కిళ్ళు నిమురుతూ, స్వేదబిందువులు తుడుస్తూ, మగని బలపరాక్రమాలకు మురిసిపోతూ, ముసిముసినవ్వులు నవ్వుతూ ఉంది.

ఆ సమయంలో దిక్కులు పిక్కటిల్లే సింహనాదం. అనుమానంలేదు- అది సుగ్రీవునిదే.

సుగ్రీవుడు మరలా కయ్యానికి కాలు దువ్వటమా? అందులోను తిన్నదెబ్బల సెత్తురుతడి ఆరకముందే తిరిగిరావటమా! ఎంత పొగరు! ఎంత సాహసం!' అని వాలి పటపట పళ్ళుకొరికాడు. తటాలున తల్పం దిగాడు. దట్టీ బిగించాడు. ఒక్క ఊపున నిప్పులు గ్రక్కుతూ యుద్ధానికి బయలుదేరాడు.

తార సుగ్రీవుని సింహనాదంలోని ఊపును, దాని వెనుకవున్న ప్రాపును గ్రహించింది. ఆమె తటాలునలేచి భర్తను ఒడిసి కౌగిలించుకొంది. 'వాలీ నీ కోపాన్ని వాడిన పూలమాలవలె విసర్జించు. నిదానంగా ఆలోచించు. నీచేత అంతదెబ్బతిని పారిపోయిన సుగ్రీవుడు ఏ ఆపులేకుంటే ఇంతగా గర్జిస్తూ ఇప్పుడే వస్తాడా? అయితే నాకేమి అంటావేమో. సుగ్రీవుడు సహజంగా సమర్థుడు. పైగా బుద్ధిసంపన్నుడు. అలాంటి వాడు స్వబలాన్ని, పరబలాన్ని తూకం వేసుకోకుండ అప్పుడే రాడు. మన అంగద కుమారుడు- మహావీరులు, దుర్నిరీక్ష్య తేజులు, యశస్సంపన్నులు అయిన ఇక్ష్వాకు రాకుమారులు రామలక్ష్మణుల సాయం సుగ్రీవునికి లభించినట్లు వేగులవారి వలన విన్నాడట. ఆ రాముడు ఇదివరకే విరాధుణ్ణి వధించాడట. ఖరదూషణాదుల్ని ఖండించాడట. సకల సద్గుణశోభితుడట. సాధుజన సంరక్షకుడట. శత్రుజన భయంకరుడట. అలాంటి మహాత్మునితో వైరం అనర్థదాయకం.

ఆ సంగతి అలా ఉంచు. సుగ్రీవుడు మాత్రం నీకు పరాయివాడా? నీ తమ్ముడు, పైగా సమర్థుడు. అలాంటి బంధువు నీ కింకొకడు దొరుకుతాడా? నీ తమ్ముణ్ణి నీవే ప్రియమార పిలిపించు. యౌవరాజ్యాభిషేకం జరిపించు. నీ ప్రక్కన ఉంచు. అది మీ యిద్దరికీ మంచిది.

స్వామీ! నా కంటె నీకు హితులెవరు? లోకంలో భార్యను మించిన హితవరి భర్తకెవరైనా ఉంటారా? నా ప్రార్థన మన్నించు, నీ యుద్ధప్రయత్నం విరమించు. సుగ్రీవునితో సఖ్యం సాధించు. జీవితంలో సర్వసుఖాలు అనుభవించు-' అని చొరవ తీసుకొని, పరిస్థితులను సూక్ష్మంగా పరిశీలించి,




ప్రమాదాలను దూరదృష్టితో గ్రహించి, ప్రతివిషయాన్నీ తార్కికంగా వివేచించి, మృదుమధురంగా మగనికి హితబోధ చేసింది.

తార హితబోధ ఆ వాలి సుగ్రీవులకేగాదు- లోకంలో కలహశీలురైన అన్నదమ్ములంద రికి అది తారకమంత్రమే.

కాని ఏం లాభం. వినాశకాలం హిత బోధను విననీయదు.

వాలి ఆమె హితబోధను అభినందించాడే గాని ఆచరించలేదు. అతడు ఒక్క ఊపున యుద్ధానికి వెళ్ళాడు. ఆమె ఒక్క ఊగ్పు విడిచి వెనుదిరిగింది.

కొంతసేపటికి వార్తాహరులు వచ్చారు. వాలి పడినవార్త చెప్పారు. గుండెలు బాదుకొంటూ, కళ్ళనీళ్ళు కారుస్తూ పతిదేవుని దగ్గరకు తార పరుగుపరుగున వెళ్ళింది.

ఎదురుగా పెద్ద నెత్తుటిమడుగు. అందులో రామబాణం దిగబడి కొనఊపిరితో కాళ్ళు చేతులు గిలగిలకొట్టుకొంటూ వాలి. ప్రక్కనే వెక్కివెక్కి ఏడుస్తూ అంగదుడు. ఒకవైపు తలవంచుకొని కంట తడిపెడుతూ సుగ్రీ వుడు. మరోవైపు సాలవృక్షంలాంటి ధనుస్సు చేత ధరించి మౌనంగా శ్రీరాముడు. ప్రక్కనే దిక్కులుచూస్తూ లక్ష్మణుడు. ఇది తార చూచిన దృశ్యం.

వాలిని చూడగానే తార బావురుమంది. తీవ్రదుఃఖంతో స్పృహతప్పి పడిపోయింది. అంగదుడు అమ్మా! అని అరిచాడు. సుగ్రీ వుడు బొటబొట కన్నీటి బొట్లు రాల్చాడు. రాముడు నిట్టూర్పు విడిచాడు.

తార నెమ్మదిగా తేరుకొన్నది. ముందుకు సాగి వాలిని కౌగిలించుకొన్నది. అతని తలను ఒడిలోకి తీసుకొన్నది. ముఖంలోకి చూస్తూ పరిపరి విధాల శోకించింది. పతితో పాటు తానూ ప్రాణత్యాగం చెయ్యాలను కొన్నది.

భర్తృమరణం తరువాత స్త్రీకి బ్రతుకు మీద ఆశకలిగించేది కొడుకు భవిష్యత్తును గూర్చిన భావన. మతిమంతుడైన హను మంతుడు అప్పుడామెకు అంగదుని యౌవ రాజ్యాభిషేక విషయం గుర్తుచేశాడు. తార హనుమవైపు చూచింది. వెఱ్ఱిగా పెదవి విరిచి, 'ఆ విషయం చూడవలసింది సుగ్రీ వుడు' అంది.

అంతలో వాలి అటు ఇటు కదిలాడు. జీవశక్తినంతా చిక్కబట్టి సుగ్రీవుణ్ణి చేర పిలిచి, అంగదుని, తారను, తన మెడలోని కాంచనమాలను అతనికి అప్పగించి, అన్ని విషయాలు చెప్పి కన్నుమూశాడు. అంగ దుడు, తార, వానరులు ఒక్కసారిగా బావురుమన్నారు.

తార మెల్లగా తలమలిపి అలా రాముని వైపు చూచింది. ఆమె చూపులో నీటి బిందువులున్నాయి. నిప్పురవ్వలున్నాయి. నెత్తుటిచుక్కలున్నాయి.

గద్గదకంఠంతో 'రామా! నీవు అప్రమే యుడవు. ధార్మికుడవు. సర్వసమర్థుడవు. ఏ బాణంతో నా భర్తను వధించావో, ఆ బాణంతోనే నన్నూ వధించు. నా ప్రియు నితో నన్ను కలుపు. రమింపచెసేవాడవన్న నీ రామనామం సార్థకం చేసుకో. సీతావిర హంతో ఋశ్యమూకం మీద నీ వెంత బాధ పడుతున్నావో నీకు తెలుసు. నా విరహంతో వాలి గూడ స్వర్గలోకంలో అంతే బాధపడ తాడు. ఆలస్యం చెయ్యక నన్నాతనితో కలుపు. స్త్రీహత్య మహాపాతకమని సంకో చిస్తావేమో. వాలి ఆత్మే తార. అందువల్ల నీకా అనుమానం అక్కరలేదు. నన్ను వధించి స్వర్గానికి పంపి వానికి భార్యా దానం చెయ్యి. అన్ని దానాల్లోకి అది గొప్పది గదా. ఆ పుణ్యంతో వాలి వధవల్ల వచ్చిన వీరహత్యాపాతకం బాపుకో' అని అన్నది.

అంత విషాదస్థితిలో గూడ తార అందరు స్త్రీలవలె చతికిలబడలేదు. అట్లని నిందు దనాన్ని గోల్పోయి అటు సుగ్రీవుని, ఇటు శ్రీరాముని నీచంగా మాట్లాడలేదు. ఆమె మాటల్లో ఆవేశం ఉందిగాని అవివేకం లేదు. ఆవేదన ఉందిగాని అల్పత్వంలేదు. అట్లని ఆమె మాటలు దూదిఏకులుగావు. అవి వాడిములుకులు. పదునులో అవి రామ బాణాలకు ఏ మాత్రం తీసిపోవు.

తార మాటనేర్పు అమోఘం.

అంతటి రామునికి ఆమెవైపు చూడటం గాని, సూటిగా సమాధానం చెప్పటంగాని సులభసాధ్యంగాలేదు. ఏదో అంతా విధి విలాసమన్నాడు. ఎలాగో ఆమెను ఓదా ర్చాడు.

వాలికి అంత్యక్రియలు జరిగాయి. సుగ్రీవుడు రాజ్యాభిషిక్తుడయ్యాడు. అంగ

(33 వ పేజీలో)

# గుహుని పాత్ర చిత్రణా వైవిధ్యము

రామాయణములో గుహుడు, రామాదులు అడవులకు వెళ్ళునపుడు గంగానదీ తీరమున విడిచియుండగా వారివద్దకువచ్చును. అతనినా ప్రాంతమునందలి కిరాతులకు రాజుగను - శ్రీరాముని ప్రాణస్నేహితునిగను, బలవంతునిగను వాల్మీకి వర్ణించును. రాముడడవికివచ్చి, తనరాజ్యములో విడచియున్నాడని తెలియగనే, వెంటనే, పాదచారియై అనుచరులు అనుసరించగా, రామాదులకుగాను తినుబండారములు తీసుకొని రాముని కడకు వచ్చును.

తత్ర రాజా గుహో నామ
రామస్యాత్మసమ స్సఖా,
నిషాదజాత్యో బలవాన్
స్థపతిశ్చేతి విశ్రుతః ॥

ఆ గుహునిచూచి, రాముడు వెంటనే లక్ష్మణునితో ఎదురేగును. రాముని నారవస్త్రములలోచూచి గుహుడు, దీనావస్థకై పరితపించును. రాముని కౌగలించుకొని (ఇటవారి స్నేహగరిమ సూచితము) 'రామా! నీవు చింతించవలసినపనిలేదు. నాయీ రాజ్యమంతయు నీదే. మేము మీపరిజనులమే. మేమొసగు మా ఆతిథ్యము స్వీకరించవలసినది. నీవంటి అతిథి మాకు దొరకునా' అని ఆప్యాయతతో పల్కును. వాని ఆదరణకు సంతసించి, రాముడువానిని మిత్రమా! నీవు పాదచారివై వచ్చుట చేతనే సంప్రీతినొందితిని. వీటిని అరణ్యవాస నియమములోనున్న మేము స్వీకరింపరాదు. వన్యపదార్థములనే స్వీకరింపవలెను. నేను వచ్చిన ఈ రథాశ్వములు, రాజుగారివి కనుక వాటికి మేతనిడిన నేను సంతోషించగలనని చెప్పును. మరియు వాని ప్రేమకు పరవశుడై బిగియార కౌగలించుకొనును.

ఇట గుహుని అపారస్నేహము,సర్వము రామార్పణము గావించుటచే, వానిభక్తిప్రపత్తులు, రామునిపరిస్థితికి బాధజెందుటచేవాని సరళ స్వభావము విదితములగు చున్నవి. దీనివలన రామునికి గుహునితో పూర్వమే స్నేహమున్నటుల తెలియుచున్నది. రాముడు యువరాజుగా నున్నపుడు తన రాజ్యములోనే కాక, పరిసర ప్రాంతములకు కూడ వెళ్ళి, అచ్చట వారియోగక్షేమములను విచారించేటివాడనియు అందుచేతనే, జనుల కంత ప్రీతి పాత్రుడయ్యెననియు తెలియుచున్నది. పూర్వ స్నేహమును పురస్కరించుకొని గుహుడు చూపిన ఆదరణకు, రాముడు పరవశించి, అనితరసాధ్యమైన తన కౌగిలినే వానికి ప్రసాదించెను. ఇది గుహుని భాగ్యము.

"భుజాభ్యాం సాధుపీనాభ్యాం
పీడయన్ వాక్యమబ్రవీత్"
"అర్చితాశ్చైవ హృష్టాశ్చ
భవతా సర్వథా వయమ్,
పద్భ్యామభిగమాచ్చైవ
స్నేహసందర్శనేన చ ॥
"యద్విదం భవతా కించిత్
ప్రీత్యా సమభికల్పితమ్,
సర్వం తదనుజానామి,
న హి వర్తే ప్రతిగ్రహే ॥"

ఇష్టాగోష్ఠి పిదప, సీతారాములు శయనించియుండగా, లక్ష్మణుడు ధనుర్బాణములు ధరించినవాడై కావలా కాయు చుండగా, వానినిచూచి, తాను, తన అనుచరులు రామునికి కాపుందెదమని, లక్ష్మణుని నిద్రింపుమని అనును. కానీ సకలరాజోపచారములతో నిద్రింపవలసిన సీతారాములు కటికనేలపై పండుకొని యుండగా తనకు నిద్రకాదుగదా, రెప్పలు కూడ పడవని తన



బాధను వ్యక్తముచేయును. వాని భ్రాతృప్రేమకు గుహుడు పరవశించిపోయెను.

"కథం దాశరథౌ భూమౌ
శయానే సహ సీతయా,
శక్యా నిద్రా మయా లబ్ధుం
జీవితం వా సుఖానివా."

రామునికంటె నాకు ప్రేమపాత్రుడులేడు. నేను నా పరివారముతో రాముని కాపాడుచుండగలనని చెప్పిన గుహుని మాటలకు లక్ష్మణుడు అమితముగా సంతసించును.

"న హి రామా త్ప్రియతమో
మమాస్తి భువి కశ్చన,
బ్రవీమ్యేతదహం సత్యం
సత్యేనైవ చ తే శపే.
సోఽహంప్రియసఖం రామం
శయానం సహ సీతయా,
రక్షిష్యామి ధనుష్పాణి
స్సర్వతో జ్ఞాతిభిస్సహ."

నీకు అయోధ్యఎట్లో అట్లే నారాజ్యమును కూడభావించి, ఇదికూడ అడవియేకనుక నీ అరణ్యవాసమంతయు, ఇచ్చటనే మాకు ఏలికగనుండి గడుపవలసినదని గుహుడు రాముని ప్రార్థించును. వాని ఆప్యాయతకు సంతసించి, తనకేర్పరుపబడిన నియమములను– జానపదములలో నుండరాదని, వానప్రస్థునివలె నుండవలెనన్న నియమమును వానికి తెలియజేసి, వారించును.

"యథాయోధ్యా తథేయం
తే రామ కిం కరవాణి తే,
ఈదృశం హి మహా బాహో కః
ప్రాప్స్యత్యతిథిం ప్రియమ్."
"స్వాగతం తే మహాబాహో
తవేయమఖిలా మహీ,
వయం ప్రేష్యా భవాన్ భర్తా
సాధురాజ్యం ప్రశాధి నః."
నేదానీం గుహ యోగ్యోఽయం
వాసో మే సజనే వనే,
అవశ్యం హ్యాశ్రమే వాసః
కర్తవ్య స్తద్గతో విధిః ॥"

రామాదులు జడలుధరించి, గుహుడు ఏర్పాటుచేసిన నావలో గంగను దాటెదరు. వీడ్కోలుచెప్పుచు, రాముడు గుహునితో– చతురంగబలములోను, ధనములోను, దుర్గ సంరక్షణలోను, దేశములోను సావధానుడవై యుండుము. రాజ్యసంరక్షణ సులభము కాదని హితవొనరించును.

"అప్రమత్తోబలే కోశే
దుర్గే జనపదే తథా,
భవేథా గుహ రాజ్యం హి
దురారక్షతమం మతమ్."

పిదప సుమంత్రునకు గుహునకు అనుజ్ఞనొసగి నావపై బయలుదేరును.

ఇంతవరకు మాత్రమే వాల్మీకి రామాయణములో గుహుని పాత్ర కనుపించును. ఇచ్చట గుహుడు రాముని ప్రాణస్నేహితునిగా, ఆత్మ సమర్పణచేయు సేవకునిగా ఆరాధకునిగా కనుబడును.

తులసీ రామాయణములో గుహుడు రాముని– పరమాత్మ తత్త్వము గుర్తెరిగిన భక్తునిగా గోచరించును. ఏదో ఒకసేవముతో రామునిసేవ యొనరించి తరించ ప్రయత్నించును. దొరకిన అవకాశమును సార్థకమొనరించుకొను వివేకవంతునివలె నగబడును.దాస-ప్రపత్తి భావమే గోచరించును.

తెలుగు రంగనాథ రామాయణంలో గుహుని గురించి కొద్ది ప్రస్తావన మాత్రమే కలదు. శృంగిబేరపురమునకు వచ్చి, సీతారామ లక్ష్మణులు గంగాతీరమున విశ్రమించియున్నారన్న వార్త తెలిసి చిర పుణ్యశాలియైన గుహుడు తన పరివారముతో వన్యఫలములను, వస్తువులను, దుకూలములను కొనివచ్చి నమ్రతతో శ్రీరామునకు కాన్కగా నొసగి, రాముడు మునివేషధారియై యుండుట కెంతయు నాశ్చర్యముచెంది, వానికట్టిస్థితి కల్పించిన వానికి తగినశాస్తిని చేయుదునని పల్క, రాముడు వాని సద్భక్తి, శక్తికి, వీరాలాపములకు సంతసించి, వానిని కౌగలించి తన వృత్తాంతము తెలుపగా కైకేయి దుశ్చర్యకు చింతించును. వాని కూరట కల్గించి రాముడు గంగోదకము త్రావి నిద్రించును. గుహుడు లక్ష్మణ సుమంత్రులతో కూడి రాముని సేవించును. మరుదినము సూర్యోదయము కాగానే, గుహు డేర్పరచిన నావలో గంగను దాటి, గుహుడు చేసిన దానికి రాముడు వానిని సంభావించి పంపును. రామునకు దారి తెలియగలందులకై గుహుడు తన వారిని నియోగించి వెళ్ళెను. రంగనాథ రామాయణములోని గుహుని గురించిన ప్రసక్తి ఈ మాత్రమే కలదు.

"నలినాప్త కులనాథ నా యట్టి బంటు,
కలుగ నీ వేషంబు గలిగెనే మీకు
చెనటియై, మిమ్మిట్లు చేసిన నీచు,
ననిఁబట్టి చంపెదననిన రాఘవుండు
నతని సద్భక్తికి నతని శక్తికిని
నతని ధీరోక్తుల కానందమొంది
యతని గౌఁగిట జేర్చి యాదరం బెసఁగ,
నతనితో, దనదు వృత్తాంతంబు దెలుప
నంతయు విని గుహుఁ డాత్మలో బెద్ద
చింతించి కైకేయి సీతకు వగచి,
దశరథునేరమి తలపోసి పోసి
దశరథాత్మజుల దుర్దశకు శోకించి"
"గుహుడు పెట్టిన యోడ కొమరొప్పనెక్కి,
యహిమాంశుకులు లంత నాగంగదాట–"
"గుహుని సంభావించి గుహు వీడుకొలిపి,
గుహుడు మార్గజ్ఞుల గొందఱ గూర్ప —"

ఇచ్చట గుహుడు, రాముని బంటుగా, హితాభిలాషిగా, సహృదయుడుగా, రామునకై ప్రాణములు సహితము ధారపోయు త్యాగశీలిగా రాముని కృపకు, వాని పరిరంభణనకు నోచుకున్న అదృష్టశాలిగా వర్ణింపబడెను. రాముని పడవతో నదిని దాటించి, వానికి మార్గము తెలియజెప్పుటకై తన పరిజనులనుంచి తోడ్పడినట్లు

కూడ వర్ణింపబడినది. సూక్ష్మములో వాని సౌశీల్యము విశదీకరింపబడెను.

ఇక భాస్కర రామాయణములో గుహుని గురించి రంగనాథ రామాయణమునందు వలెనే కలదు. శృంగిబేరపురమునకు వచ్చి గంగాతీరమున విడిసిన రామాదుల రాక యెరింగి, నిషాదనాథుండగు గుహుడు, మంచి వస్త్రములు, రత్నములు పొదిగిన ఆభరణములు, తినుబండారములతో వచ్చి రాముని వేషము చూచి ఆశ్చర్యముచెంది రామునిబంటు తానుండగా వానికా యవస్థ తెచ్చిన ద్రోహిని తన బాణములతో పరి మార్చెదనని పలుక వానిని వారించి రాముడు జరిగిన సంగతి చెప్పగా, గుహుడు కైక చేసిన చెడుపనికి, దశరథుని అవివేక మునకు, సీతారాముల దురవస్థకు చింతిం చెను. రామాదులు గుహుడుతెచ్చిన వాటిలో కందమూలముల నారగించి నిద్రించిరి. గుహుడు కూడ లక్ష్మణునితో జాగారము చేసెను. సుమంత్రుని రథములో అయో ధ్యకు పంపిన పిదప, వ్రతమారంభించి, గుహుడు పడవ నడపగా, వారు గంగానదిని దాటిరి. గుహుడు త్రోవ చూపించిన పిదప వానికి వీడ్కోలు చెప్పి ముందు కేగిరి." ఇంత మాత్రమే భాస్కర రామాయణములో కలదు.

వ॥ — గంగాతీరమున శృంగిబేరపురము
నందు రాముడా చారుల చేత విని

కం॥ గుహుడను నిషాదనాథుండు,
మహితాంబర రత్నఖచితమండనసుమన
స్సహితోపాయ నములతో
విహితంబుగ రామవిభుని
వేడుకఁ గనియెన్"

సీ॥ కని మ్రొక్కియట్లున్నఁ గనుఁగొని వెఱ
గంది, యేమియోదేవ నీవీ తపస్వి,
వేషంబు ధరియించి విగత సైన్యుండవై
కానకు విచ్చేయు కారణంబు?
మీబంటనేనుండ మిమ్మింత సేసిన,
ద్రోహి వాడెవ్వడు తులువ వాడు
బాణాసనార్చుల పాలు కావించెద,
ననిన నవ్వుచు రాముడంత తెఱగు

తే॥ నోలి దెలియంగజెప్పి వీరోత్తములుడువ,
శబరపతి యప్పుగ్గైక దోషంబునకును
రాజు నవివేకమునకు నా రాఘవులకు,
నయిన దురవస్థకును దుఃఖితాత్ముడయ్యె

వ॥ తదనంతరంబ గుహుండు కర్ణధారుండు
గా నావనెక్కి సీతా లక్ష్మణ సమేతం
బుగా నక్కుమార నిధానంబులు

తే॥ .... .... .... .... ....
గుహునిచే ద్రోవజూపించుకొని ప్రియమ్ము
తోడ నక్కిరాత్రాగ్రణి వీడుకొలిపి,
యయ్యరణ్యపథంబున నరుగు నపుడు

ఇచ్చటకూడ గుహుడు, రాముని బంటుగా రామునిపై అపారానురాగము కలవాడుగ రామునకు ప్రీతిపాత్రుడుగ వర్ణింపబడెను. నిషాదపతిగా తన తాహతుకు తగినట్లుగా, మంచివస్త్రాభరణములు, తినుబండారము లతో వచ్చి రామునకు సమర్పించి, తన భక్తిని ప్రదర్శించినవాడుగా చిత్రింపఁ బడెను.

ఈ రచనల వలన రామునకు గుహునితో పూర్వమే పరిచయ మున్నట్లును, రాముని సామ్రాజ్యములో శృంగిబేరపురము చేరి యుండుటచే, వాని బంటుగా గుహుడు పేర్కొనుట జరిగినట్లును రామునకు గుహుని యందు స్నేహ మధికమై యుండినందు వలన, రాముడు గుహుని తన ప్రక్కన కూర్చొనబెట్టుకొనుటయు, ఆలింగన మొన ర్చుటయు చేసినట్లు తెలియుచున్నది. ఈనాడువలె, ఆకాలములో అంటరానితనము ప్రబలమై యున్నట్లు కనబడుటలేదు. లేనిచో సూర్యవంశీయుడు, సుక్షత్రియుడు నైన శ్రీరాముడు శబరుడైన గుహునకట్టి గౌరవమర్యాదలు కల్గించియుండడు.

వాల్మీకి (సంస్కృత) రామాయణమున రామ-గుహులకు స్నేహభావమును ప్రేమ వాత్సల్యములును, తెలుగున రంగనాథ, భాస్కరరామాయణములలో సేవ్య-సేవక భావము, ఆప్యాయతలు గోచరించు చుండగా, తులసీ (హిందీ) రామాయణ ములో భక్తిభావము, దాస ప్రపత్తి భావ ములు గోచరించుచున్నవి. రాముని పాద ములు కడుగుటకు, గుహుడుచేసిన యుక్తి భక్తిభావనలో పరాకాష్ఠను సూచించు చున్నది. వీరందరి రచనలలోను, రామ-గుహులలో గొప్ప తక్కువన్న భేదభావ స్ఫురణ స్ఫురణయే లేదు. భక్తునకు భగవంతుని యందున్న అనురాగము భక్తునందు భగవంతునకు గల వాత్సల్యా దులు గోచరమగుచున్నవి. తులసీదాసు సూచించిన అపరిగ్రహము, నిష్కామసేవ (సీత ఇచ్చిన ఉంగరమును గుహుడు స్వీకరించక, రామునకు చేసిన కొద్దిపాటి సేవయే, తనకు పాపవినాశకరమని, అనేక కర్మల పుణ్యఫలముగా భగవంతుడు చూపిన అనుగ్రహమని, గుహుడుచూపిన భావము) భక్తులందరకు శిరోధార్యమై గుహునిఆదర్శ భక్తశిఖామణిగా రూపొందించినది. భగ వంతునికి భేదభావనలేదని, భగవంతునిసేవ కందరు అర్హులే, యనియు తెలియు చున్నది. ఇచ్చట భగవద్గీతలోని కృష్ణుడు చెప్పిన దనుసంధేయము.

సమోఽహం సర్వ భూతేషు,
న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్.

అర్జునా! నేను సర్వభూతములందును సమదృష్టి కల్గియుందును. నాకు ఇష్టుడు గాని, ద్వేషింపతగినవాడుగాని ప్రత్యేక ముగాలేదు. కానీ ఎవరైతే నన్ను భక్తితో సేవింతురో వారు నా యందును నేను వారి యందును (అనురక్తులమై) యుందుము.

— ఆర్. వి. ఎస్. సుబ్బారావు



# గ్రంథసమీక్ష

## ఆంజనేయచరిత్ర

పేజీలు: 46. వెల: రు. 4-00. ప్రతులకు "దిట్టకవి ఎం ఏ.." వాసవీ కన్యకాపరమేశ్వరి దేవాలయం, పిడుగురాళ్ళ- 522413

జీవితాధ్యాత్మిక విజ్ఞాన, వికాస, చరిత్రలో ఒకవిశిష్టమైన స్థానమున్నదని, మంత్ర ద్రష్టలైన వేదఋషివాక్కులలో గర్భితము లైన పరమరహస్యమే ఒక్కసారి రామ నామ ముచ్చరించుటవలన కలుగుచున్న దని సప్తకోటి మహామంత్రాధిదేవత వేద మాతస్వరూపమైన శ్రీమద్రామాయణము చాటుచున్నది. దానిసారము వర్ణనాతీతము. అందలి ప్రధానపాత్రధారులలో అగ్ర గణ్యుడు సర్వలక్షణ సంపన్నుడైన వాయు నందనుడు. వానరుడుగా జన్మించినప్పటికి పృథ్వీతలముపై జన్మించిన ప్రతిమానవుడు అంజనాసుతుని జీవిత పరమ రహస్యము తెలుసుకొనక తప్పదు.

ఆంజనేయుని జననమునుంచి జీవిత పరమావధివరకు అతడవలంబించిన కార్య దీక్ష, దక్షత, ప్రగాఢవిశ్వాసము, స్వామిభక్తి లోకమునకే ఆదర్శవంతమైనది. నైష్ఠిక బ్రహ్మచారియై, అఖండమైనతేజస్సుతో వెలుగుచు నిరంతరము రామకార్యధురం ధరుడై సాక్షాద్రామపరబ్రహ్మమే తానుగా మూర్తీభవించి, కాలచక్రగతిలో రామున్న కల్పమందు ఆర్తత్రాణపరాయణుడుగా, భవిష్యద్బ్రహ్మస్థానమును అధిష్ఠించబోవు హనుమంతుడు తనను శరణువేడినవారినే గాక తన స్వామియైన రామసేవకులకు సైతము నిరంతరము రక్షగాయుండి, వారి సమస్తేచ్ఛలను ఈడేర్చుచున్నాడనుట నిస్సంశయము.

స్వామిచరిత్ర శ్రీమద్రామాయణము, పరాశరసంహిత, ఉమాసంహిత, సుదర్శన సంహితాది గ్రంథములలో మహోన్నత ముగా చెప్పబడిన విషయాన్ని సంక్షిప్త ముగా శ్రీమాన్ దిట్టకవి వేంకటరామానుజా చార్యులుగారు రచించిన ఆంజనేయచరిత్ర తెలుపుచున్నది. ప్రతిపాఠకుడు ముందుగా శ్రీహనుమంతుని గురించి ఈసంక్షిప్త ఆంజ నేయ చరిత్ర చదివి తెలుసుకొనవలసినదే.

ఆంజనేయచరిత్రలో ఎన్నో అసంఖ్యా కములైన ఘట్టములున్నప్పటికి అందు కొన్నిమాత్రమే వారు ప్రచురించుటవలన ఈ చరిత్రచదివిన పాఠకులందరూ మనః పరివర్తన కల్గి హనుమద్భక్తులుగామారి, స్వామివిషయసర్వస్వము తెలుసుకొనుటకు తమజీవిత సర్వస్వమును సర్వార్పణ బుద్ధితో స్వామికి సమర్పించి శ్రీ ఆంజ నేయుని పరిపూర్ణానుగ్రహపాత్రులగుదురు గాక!

సంక్షిప్తముగా స్వామి చరిత్రనందించిన శ్రీమాన్ "దిట్టకవి" వారిని హృదయ పూర్వకముగా అభినందించుచున్నాను.

-ఎస్. ఎస్. లక్ష్మణరావు

## శ్రీరామ మంత్రానుష్ఠానము

రచయిత: శ్రీరామశరణ్, బుద్ధాం కుందుర్తి వెంకట నరసయ్య,

శ్రీ శ్రీరామశరణ్‌గారు శ్రీరామమంత్రా నుష్ఠానమున సిద్ధినొందిన మహానుభావులు. వారు శ్రీరామ మంత్రమును ఉపాసించి ఎందరో పెద్దలవలన పొందిన అనుష్ఠాన రహస్యములను శ్రీరామ మంత్రమును జపించువారి ఉపయోగమునకై గ్రంథ రూపమున ప్రకటించిరి.

శ్రీరామ మంత్రము సర్వాధికారికము సకల ఫలప్రదము. పరమసాత్త్వికము. ఈ మంత్రమును జపించువారెందరోయుం దురు.కాని అందరకు ఆమంత్ర జపవిధానము తెలియదు. క్రమము తెలిసిచేసిననాడు ఫలము శీఘ్రముగ సిద్ధించును. ఆంధ్ర దేశమున శ్రీరామశరణ్‌గారి శ్రీచరణ సంబం ధముగల వారెందరోయున్నారు. వారికే కాదు, ఇతరులకుకూడ తెలియచేయవలెనని రహస్యములైన విషయముల నిందు ప్రకా శిత మొనర్చినారు.

మన భారతీయ సంప్రదాయమున మంత్రము, దానిజపము ప్రత్యేక స్థానము నాక్రమిమించుకొనినవి. ఇది సరియైన విధా నము తెలిసిచేసిననాడు ఫలము తప్పక సిద్ధిం చును. మన శరీరములో నిక్షిప్తమైన చైతన్యశక్తిని విజృంభింపచేసి దానిచే పర మాత్మనుచేరి దర్శించవచ్చును. విరాడ్రూప మునయున్న పరబ్రహ్మము శబ్దరూపము శరీరమునందును, దానినే ఏ స్థానములలో ఏయే అంగములలో ఏయే క్రమమున ఉచ్చరించవలెనను విషయము నెరింగి శ్రద్ధాభక్తులతో ధ్యానించినవాడు సర్వము తన రూపముగా గలిగిన పరబ్రహ్మము తనదేయగు దివ్యమంగళ విగ్రహముతో హృదయదేశమున ప్రత్యక్షమగును. మాటా డును, కోరినకోరిక లీడేర్చును.

అట్లు మంత్రానుష్ఠానమునకు 16 అంగ ములు ఉండవలెను. భక్తి, శుద్ధి, ఆసనము, పంచాంగసేవనము, ఆచారము, ధారణము, దివ్యదేశసేవనము, ప్రాణక్రియ, ముద్ర, తర్పణము, హవనము, బలి, యాగము, జపము, ధ్యానము, సమాధి. ఈ 16 అంగ ములు ప్రతి మంత్రమును జపించువారును ఎరుంగవలెను.

1. భక్తిలేని అనుష్ఠానము నిష్ఫలము. భక్తియనగా ప్రేమ - దేవతయందు, మంత్రమునందు, మంత్రోపదేశము చేసిన గురువునందు అచంచలమగు భక్తియున్న నాడే మంత్రము ఫలించును.

"త్రిషు భక్తిః సదా కార్యా
సా హి ప్రథమసాధనమ్"

అని పెద్దలు చెప్పిరి.

2. జపముచేయువారు ముందు శుద్ధిని పాటించవలెను. అది శారీరక, మానసికముగ ద్వివిధము. అదిలేనినాడు చాంచల్యము కలుగును.

3. ఆసనము - కూర్చుండునపుడు ఎట్లు కూర్చుండిన తన మనస్సు ఏకాగ్రత భంగపడదో అట్లు కూర్చుండి జపము చేయ వలెను. అందు పద్మాసనము శ్రేష్ఠము. దానిని అభ్యసింపవలెను.

4. జపముచేయువారు శ్రీరామ మంత్ర రాజస్తవము, శ్రీరామగీత, శ్రీరామ సహస్ర నామ స్తోత్రము, శ్రీరామ హృదయము,

[29 వ పేజీలో]




# భద్రాచల రామాలయం



ఆలయ ప్రవేశద్వారము

ఆంధ్రదేశము నందలి పుణ్యక్షేత్రములందు తిరుమల, శ్రీశైలం తర్వాత ప్రముఖంగా పేర్కొనతగినది భద్రాచల ఆలయము. ఇది ఖమ్మం జిల్లాలో గోదావరీ తీరమున నిర్మించబడినది. ఆ ప్రదేశమునకు భద్రాచలం అనే పేరు ఎట్లు వచ్చినదో బ్రహ్మాండపురాణమీ క్రింది విధంగా తెలియజేస్తూ వున్నది. పూర్వము మేరువు అను పర్వతము, అతడి భార్య మేరుదేవి పుత్ర సంతానమునకై ఘోర తపస్సు చేయగా బ్రహ్మ వారికి ప్రత్యక్షమై వారికోరిక మేరకు వరమివ్వగా, కొన్ని మాసములకా దంపతులకు 'భద్రు'డను కుమారుడు జన్మించి పెరిగి పెద్దవాడై గోదావరి తీరాన పెద్ద పర్వత రూపముదాల్చి తపస్సు చేసుకొనుచుండెను. శ్రీరాముడు, సీత, లక్ష్మణ సమేతుడై ఆ ప్రదేశమున కేతెంచి పర్వతమందలి ఒకరాతిపై కూర్చుండగా భద్రుడు మునిరూపము దాల్చి రామచంద్రునికి అంజలి ఘటించగా రాముడు భద్రుని నీ అభీష్టమేమనగా 'స్వామీ నీవు శాశ్వతముగా నాపై నిల్చి భక్తులకు దర్శనమివ్వమనగా స్వామి అతడి కోరిక నంగీకరించి ఆ ప్రదేశమందు శిలారూపము దాల్చినారు. భద్రుడు కొండ రూపమున నుండుటచేత భద్రాద్రియనుపేరు సార్థకమైనది. వందల కొద్ది సంవత్సరాలీ పుణ్యక్షేత్రాన్ని ఋషులు, యోగులు మాత్రమే సేవించుచుండిరి.



శ్రీరామ, సీత, లక్ష్మణులు

## ఆలయ నిర్మాణము

భద్రాచలమునకు సమీపంలో భద్రారెడ్డిపాళెం అను గ్రామంలో కొన్ని శతాబ్దాలకు ముందు పోకల దమ్మక్క అను భక్తురాలుండెను. శ్రీరాము డొకరోజు ఆమెకు కలలో కనపడి తాను భద్రాద్రిపై శిలారూపమున యున్నానని తెలియజేయగా తెల్లవారగనే దమ్మక్క ఆవృత్తాంతమును గ్రామవాసులందరికి తెలియజేసి వారివెంట వెళ్ళి వెదుకగా, సీతా లక్ష్మణులజాడ తెలియలేదు. గ్రామస్థులామెకు మతి చలించినదని భావించి తిరిగి వెళ్ళగా అవమానముతో దమ్మక్క విచారించుచుండ మరురోజు యథావిధి ఆమె కలలో రామచంద్రుడు కనపడి తాను ఒక తాటిచెట్టుచాటున వున్నానని ఆ ప్రదేశమునందలి గుర్తులు తెలియజేయగా, ఆమె తిరిగి తెల్లవారి గ్రామస్థులను ప్రాధేయపడి వారిని వెంట పెట్టుకొని రాముడు చెప్పిన గుర్తులున్నచోట వెదుకగా, దివ్యమంగళకరమైన రామ, సీత, లక్ష్మణుల విగ్రహములు కనబడినవి. ఆనాటి దమ్మక్క తనశాయశక్తులా స్వామికి పూజా నైవేద్యములు జరిపించుచుండెడిది.



రామదాసుని బంధించిన గోలుకొండ కోట

క్రీ. శ. 17 శతాబ్దమందు గోల్కొండ తానీషా అబుల్‌హసన్ తన మంత్రి వర్యులైన అక్కన్న మాదన్నల మేనల్లుడైన కంచర్ల గోపన్నను ఖమ్మంమెట్టు పిర్కాకు పేష్కారుగా నియమించి ఆపై కొన్నిరోజులకు భద్రాచలం తహసీల్‌దారుడుగా కూడా నియమించినాడు. గోపన్న చిన్ననాటి నుండి రామభక్తుడు. ఆంధ్ర, సంస్కృత పారశీక, ఉర్దూ భాషలందు పాండిత్యము కలదు. ఇతడి నివాసమెల్లప్పుడు శ్రీరామ సంకీర్తనలతో అలరారుచుండెడిది. గోపన్న గురించి విన్న దమ్మక్క ఆతడివద్దకువెళ్ళి భద్రాద్రిపై నున్న శ్రీరాముని విషయము విన్నవించుకొన్నది. విషయము తెలిపి స్వామికి ఏదైన నీడఏర్పాటు చేయమన్నది.

గోపన్న దమ్మక్క చెప్పిన విగ్రహముల చెంతకెళ్ళి అవి తను రోజూ ధ్యానించే స్వాములవారివని భ్రమించి 'దాశరథీ కరుణాపయోనిధీ! అను మకుటముతో స్వామిపై తన భక్తిని పద్యరూపమున వెలువరించినాడు. ఆనాటినుండి శ్రీరాముని భక్తితో పూజించుటే గాక, వారికి కావలసిన పూజాదికపు ఏర్పాట్లు చేసినాడు. ఉన్నట్లుండి తన స్వామికి ఆలయం నిర్మిస్తే బావుండునను తలంపుకలిగినది. అయినా పైకములేదు. ఖజానాలో సర్కారు పైకము 6 లక్షలున్నవి. ఆ డబ్బు ఎవరిదైతే నేమిలే అను తాత్సారముతో ఆలయ నిర్మాణము ప్రారంభించి, ప్రధానాలయము, ప్రహరి, కళ్యాణమండపము, వాహనములు, స్వాములవారికి కావలసిన ఆభరణములు చేయించు చుండెను. ప్రభుత్వధనమును తనఅనుమతిలేక విచ్చలవిడిగా ఖర్చుపెట్టుచున్నాడని తెలిసి తానీషా గోపన్నను సంకెళ్ళు తగిలించి గోలుకొండకు తీసుకొని రమ్మన్నాడు. గోలుకొండజైలులో అతడిని 12సం॥ బంధించి అనేక విధములుగా చిత్రహింసచేసిరి. ఈనాటికి రామదాసు జైలు అను పేరున కోటలోని దర్బారు (బాలాహిజార్) సమీపంలో ఒక చీకటి గది యున్నది. ఆ గదిగోడలపై రామ, లక్ష్మణ సీతలయొక్క రేఖాచిత్రములున్నవి. వాటిని గోపన్న గోటితో గీసినాడట!

నవాబు సైనికులు గోపన్నకు సరైన భోజనముకూడ పెట్టకయుండిరి. ఆ విషయము "తినగలనే ఈ అన్నము ముదిమినే మార్గము నాకిక రామా!" అని పలవరించినాడు. తాను పడెడి బాధలు ఎప్పటికప్పుడు పద్యరూపమున రామునికి విన్నవించినాడు. కావలివాండ్లు గోపన్నను ముండ్లబాటపైన నడిపించినారు. మెడపై పెద్ద బండరాతి నుంచి రాజవీథులందు త్రిప్పినారు. దెబ్బ లొకవంక, మరొకవంకబావివద్దకునీటికెళ్ళగా తేలు కుట్టినది. కంటనీరు ఆగలేదు. దుఃఖముతో బాధ మేళవించగా 'అబ్బబ్బ దెబ్బలకు తాళలేక రామప్ప గొబ్బున నన్నేలు కోరా!' అనగా బాధతగ్గినది.

స్వామివారికి, ఆలయమందలి తక్కిన విగ్రహములకు చేయించిన ఆభరణములను గోపన్న తెలుపుకొన్నాడు. అప్పుడప్పుడు తన హీనస్థితిని రామునికి "— స్వామి అధములకన్నను అన్యాయమైపోయితి రామచంద్రా" అని తెలుపడమేగాక 'ఏమిరా రామ నావల్ల నేరమేమిరా రామ! అని వాపోయినాడు. అయినా దెబ్బలుతప్పలేదు. విచ్చుకత్తుల పారా తొలగిపోలేదు. రాముడా రాలేదు. శరణాగతత్రాణబిరుదాంకుడవు గావ, శరధి బంధించిన శౌర్యమేమాయరా! అని ఘోషించాడు. జవాబు రాలేదు గోపన్నకు కోపం వచ్చింది.

"— చుట్టు ప్రాకారములు సొంపుతో కట్టితి రామచంద్రా ఆ ప్రాకారమునకు బట్టె పదివేలు వరహాలు రామచంద్రా! అంతేగాక భరతునికి పచ్చలపతకము శతృఘ్నునకు మొలతాడు లక్ష్మణునికి ముత్యాల పతకము సీతమ్మకు చింతాకుపతకము పదేసి వేల వరహాలు పెట్టి చేయించినా, ఇక నీకు "కలికితురాయిని పొలుపుగ చేయిస్తి రామచంద్రా! నీవు కులుకుచు తిరిగెద వెవరబ్బ సొమ్మని రామచంద్రా!"

అని నిలదీసినాడు. అంతలోనే స్వామికి కోపమొచ్చినచో తనకు దిక్కెవ్వరని "అబ్బ తిట్టితినని ఆయాసపడబోకు రామచంద్రా!

ఈ దెబ్బలకోర్వలేక అబ్బ తిట్టితినయ్యా రామచంద్రా! అని చింతించినాడు. అయినా ఆ బండరాతి నల్లరాముడు ఉలకలా, పలకలా. గోపన్నకు ఓర్పు నశించినదేమో!

"అడుగు దాటనివ్వను నా కథయ మివ్వక నిన్ను విడువను" ఇది నీయబ్బ సొమ్మా-తాతసొమ్మా! కుదురుగ కూర్చుండ నివ్వను నీకు కోపమొచ్చినా భయపడను. అనిగర్జించినాడు. ప్రయోజనము శూన్యము ఈ సమయంలోనే శూలనొప్పి వచ్చినది. ఆ బాధ కోర్వలేక

"పాహి మాం రామయంటే పలుకవైతివి నీ స్నేహ మెట్టిదని చెప్పనా హా హా —
'అనగా బాధ తొలగి పోయినది. ఎలా

గైనా స్వామిని మచ్చిక చేసుకో నెంచి తుదకు వంటింట మంత్రముపదేశింప చేయ నెంచి సీతమ్మతో

'రామచంద్రులు నాపై చలము చేసినారు, సీతమ్మ చెప్పవమ్మ' అని బ్రతిమలాడినాడు. పాచికవారినది. సీతమ్మ మంత్రోపదేశము పని చేసినది. రామలక్ష్మణులు భక్తుని చెరవిడిపింప దలంచి, నడిరాత్రి ఆలయ భటులవేషములతో తానీషా వద్దకెళ్ళి గోపన్న కట్టవలసిన 6 లక్షలు పైకము చెల్లించి రసీదు పుచ్చుకొని గోపన్న తల క్రింద వుంచి వెళ్ళినారు. తానీషా జరిగినది కలకాదని, వచ్చిన వారు సాక్షాత్తు శ్రీరామ లక్ష్మణులని పరుగున వెళ్ళి గోపన్న పాదములపైబడి, మన్నించమని వేడి, డబ్బు వాపసు తీసుకోమని కోరగా, అందులకు గోపన్న అంగీకరించక, రెండు నాణెములను మాత్రమే స్వీకరించి, వాటిని స్వామి వారి మెడలో అలంకరించినాడు. ఈనాడు కూడ వాటిని చూడవచ్చు. వాటిని రామ టెంక అంటారు. వాటిపైని లిపి ఏ భాషదో?

చెఱసాలనుండి విడిపింపబడ్డ గోపన్నను ప్రజలు రామదాసని భక్తితో పిలిచినారు. రామదాసు తిరిగి భద్రాచల మెళ్ళి, కొన్నాళ్లు తన స్వామిని సేవించి ఆతడిలో లీనమైనాడు.

రామదాసు, తానీషాలు పూర్వజన్మలో గొప్ప శివభక్తులు. వారెంతకాలం తపస్సు చేసినా, శివుడు ప్రత్యక్షము కాకపోవుటచే శివలింగముపైకి చెంతనున్న కుండను విసరినాడట! అంత ఈశుడు ప్రత్యక్షమై మరుజన్మమందు నీవు రాజువుగా జన్మించి, నీ తమ్ముడైన రామదాసుని శిక్షించు కాలమున దర్శనమిచ్చెద నన్నాడట!

గోపన్న ఒక చిలుకను తెచ్చి పంజరంలో వుంచి, దానికి పాటలు నేర్పి పాడించి ఆనందించుటచే, ఆ పాపఫలితంగా జైలులో బంధించబడినాడట! గోపన్న చిన్ననాటి నుండి మహాభక్తుడు. ఇతడికి భక్తకబీర్ తారకమంత్ర ముపదేశించినాడు. ఆనాటి నుండే ఆతడు రామకీర్తనలుపాడటం నేర్చుకొన్నాడు. ఇతడు యుక్తవయస్సులో నున్నపుడే ఇతడి కుమారు డొకనాడు వేడి గంజిలో పడి మరణించగా!

"— ఏ బుద్ధివీడు ఎఱుగనివాడు పాపడు వీడు బడలియున్నాడు. .... బ్రతికించ" మనగా పిల్లాడు లేచి పరుగెత్తినాడు.

తానీషా రామచంద్రుని దర్శనమైన నాటి నుండి ఏటా భద్రాచలం తాలూకా నుండి వచ్చెడిశిస్తు ఆలయ ఖర్చునకు సమర్పించినాడు. అయితే 1769–1775 సం॥ గోల్కొండ రాజ్యంలో అలజడిరేగి మహమ్మదీయులు హిందూ ఆలయాలను ధ్వంసము చేయ సాగగా పూజారులు భద్రాచలంలోని విగ్రహాలను పోలవరం తీసికెళ్ళి కాపాడి అలజడి తగ్గిన తర్వాత తిరిగి భద్రాచలమందు ప్రతిష్ఠించినారు. తానీషా తర్వాత నిజాం ప్రభువులు ప్రతిఏటా శ్రీరామనవమిరోజున స్వామి కళ్యాణమునకు తలంబ్రాలుకై మంచి ముత్యములు పంపెడివారు.

భద్రాచల రామాలయాన్ని ఇటీవలె ప్రభుత్వంవారు కొన్ని లక్షల రూపాయల వ్యయంతో పునరుద్ధరించినారు. 4 లక్షల ఖర్చుతో కళ్యాణమండపము అంతే ఖర్చుతో రామదాసు ధ్యానమందిరము వైకుంఠ ద్వారము, అయోధ్యద్వారము, 9 లక్షల రూపాయలు ఖర్చుతో గర్భాలయము, కొండపైనచంద్రమౌళి సదన్ అను విశ్రాంతి భవనము నిర్మించినారు.

ప్రతిఏడు ఆలయంలో శ్రీరామనవమి రోజున సీతారామ కళ్యాణము, 10 రోజులు వైకుంఠ ఏకాదశి ఉత్సవము, ఆలయంలో జరిగే ముఖ్యమైన సంవత్సరాది వేడుకలు. ఆలయమందు స్వామి పద్మాసీనుడై చతుర్భుజములను కలిగి క్రింది ఎడమ చేతిలో ధనుస్సు, కుడిచేతిలోవిల్లు, పై ఎడమచేతిలో చక్రము కుడిచేతిలోశంఖము ధరించి ఎడమ తొడపై సీతాదేవిని కూర్చుండ బెట్టుకొన్నాడు. వారికి ఎడమవైపున ద్విభుజుడైన లక్ష్మణుడు నిలబడి కుడిచేతిలో విల్లును ఎడమచేత అంబును కలిగియున్నాడు. భద్రాచల రామచంద్రుని సాక్షాత్తు ఆది శంకరులు దర్శించుకొన్నారు. ఆలయానికి సమీపంలో గోదావరి గట్టున అరణ్యవాస కాలంలో రామ, లక్ష్మణ, సీతమ్మలు నివసించిన పర్ణశాలయున్నది. దీనికి సమీపంలో పసుపు, కుంకుమ రంగులుగల చిన్న చిన్న రాళ్ళు కలవు. పర్ణశాలకు భద్రాచలమునకు మధ్యన యేటపాక (జటాయుపాక) యున్నది. భద్రాచలానికి రెండు మైళ్ళ దూరాన గోదావరినదిలో ఉష్ణజలకుండము లున్నవట! వీటిలో ఎప్పుడు నీరు వేడిగా వుండునట! సీతారాములు అరణ్యవాస కాలంలో ఈ వేడినీటిలో స్నానమాచరించెడి వారట!

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, రామదాసు కీర్తనలను ప్రచారము జేయుటకు తిరుపతి తిరుమల దేవస్థానములు అన్నమాచార్య కీర్తనలు ప్రచారము చేయు పద్ధతిలో అన్నమాచార్య ప్రాజెక్టువలె రామరస వాహినీ పేరున ఒక ప్రాజెక్టు ఏర్పాటు చేసి, ప్రసిద్ధ కళాకారులచేత రామదాసు కీర్తనలను ఆంధ్రదేశంలోని ఆబాల గోపాలానికి వినిపించడానికి ప్రయత్నించడము ఎంతైనా ప్రస్తుతింపదగ్గ అంశము.

— పి. కృష్ణమూర్తి



# శ్రీరామ తీర్థం

ఆంధ్రదేశం ఎన్నో గుళ్ళు గోపురాలకు పుట్టి నిల్లు. అందులో విజయనగర మహారాజులు పరమ ధార్మికులు. వారు నూట మూడు గుళ్ళు కట్టించారు. అందులో పేరు పొందినది 'శ్రీరామ తీర్థం గుడి'. ఇచ్చట 'కోదండరాముడు' ఆరాధ్యదైవం. ఇతడు వనవాసరాముడు. సీతా లక్ష్మణ సమేతమై కోదండపాణియైన రాముని విగ్రహం ఎంతో అంద మైంది. భక్తుల పాలిట కల్పకం. వాడుకలో ఈ పుణ్యక్షేత్రాన్ని 'రామగుళ్ళు' (రాంగుళ్ళు) అంటారు.

### ఉనికి

విజయ నగరానికి తూర్పున 12 కి. మీ. దూరంలోగల ఈ క్షేత్రం "నెల్లిమర్ల-రణస్థలం" రహదారి మధ్యలో ఉంది. ప్రస్తుతం శ్రీరామతీర్థంమీదుగా శ్రీకూర్మం, శ్రీకాకుళం, అలుగోలు, చీపురుపల్లి పోయేబస్సులు ప్రతి గంటకు ఉన్నాయి.

### నిర్మాణ కాలం

క్రీ. శ. 17 వ శతాబ్దంలో 'కుంభిళాపురి' (కుమిలి) రాజ్యాన్ని పాలించిన శ్రీపూసపాటి సీతారామ చంద్రులవారి ఏల్బడిలో ఈ దేవాలయ నిర్మాణ, ప్రతిష్ఠలు జరిగాయి.

### మతాలు

క్రీ. శ. 5 వ శతాబ్దం నుండి జైనతీర్థంకరులకు, బౌద్ధసన్యాసులకు యీ ప్రదేశం ఆరామమైఉండేది. ఇక్కడ "జైనమత మహాసభ" జరిగిందట. ఇప్పటికీ యీ ప్రాంతంలోగల కొండపై యీ ఆరామ శిధిలావశేషాలున్నాయి.

వైష్ణవులకు, శైవులకు ఇది నిలయం. శివకేశవులకభేదాన్ని సూచిస్తున్నట్లు ఇక్కడ రామాలయం, శివాలయం ప్రక్కప్రక్కనే ఉన్నాయి. రాముడు కోదండరాముడు: శివుడు సదాశివుడు. శ్రీమన్నారాయణ త్రిదండి జియ్యరు స్వామిగారు ఇక్కడ శ్రీరామక్రతువుగావించి క్రతుస్తంభాన్ని కట్టించారు.

### సొబగులు

ఒక నల్లనిరాతి బోడికొండ పాదాన రామాలయం కట్టారు. చుట్టూ ఎత్తైన రాతి ప్రహరీ, ముఖద్వారం గోపురం, దాటితే ధ్వజస్తంభం, కుడిపైపున క్రతుస్తంభం, దక్షిణాన కల్యాణమంటపం; వెనుక మహలక్ష్మిఅమ్మవారి గుడి. వాయవ్యంలో శ్రీ త్రణుకు సత్తెయ్యగారు కట్టించిన మరో కళ్యాణ మంటపం. గర్భగుడిముందు ఉత్సవ విగ్రహాలు, సాలగ్రామాలుగల 'వవళింపుగది'. గర్భగుడిలో అందమైన జడధారులైన 'సీతారామలక్ష్మణుల' విగ్రహాలున్నాయి. వాటికెదురుగా "గుహ్యాన్ని మూసికొని ఉన్న ఆంజనేయస్వామి విగ్రహం బహిర్ద్వార పార్శ్వానగల గోడనంటి పెట్టుకొని ఉంది. ఉత్తరాన వరాహస్వామి, నరసింహస్వామి వార్ల ఆలయాలున్నాయి.

గుడికి దక్షిణంగా పుష్కరిణి ఉంది. దీన్ని "రామచెరువు" అంటారు. దీని మధ్య "గాలిమంటపం" ఉంది. దీని ప్రక్కనే 'చావరాయి' ఉంది. దేవాలయాన్కి పూలతోట, పండ్లతోట ఉన్నాయి. ఉత్తరంగా రెండు కొండలున్నాయి. 1. శ్వేతాచలం, 2. నీలాచలం. మదగజంలా ఉన్న నీలాచలంపై కోవెల ఉంది. ఇందులో కోదండరాములవారున్నారు. దాని ప్రక్కనే జలాశయం ఉంది. దానిలోతుతెలియదు. నీరు కొబ్బరి నీరే! ఎప్పుడూ నీరు యింకదు. వైష్ణవాచార్యులు నేటికీ అనుదినం యీ కొండపై తళియారాధనాది కైంకర్యం చేస్తారు. ఈ కొండపైనుండి ప్రకృతికన్య నగ్నసౌందర్యం కన్నులపండుగ చేస్తుంది.

కొండమీద 'పాండవ పంచ', 'భీముని పొయ్యి', 'భీముని బుర్ర', "సీతమ్మ వారి పురిటిమంచం" "శ్రీరామ పాద చిహ్నాలు", 'రామగుండం", 'సీతగుండం' 'ఇరుకురాయి' "పలుకురాయి" ఉన్నాయి. ప్రక్కకొండపై బౌద్ధజైన ఆరామ శిథిలావశేషాలున్నాయి. కొండపైకి



ఆలయ ముఖద్వారం

వెళ్లేందుకు ఓ వైపు పిట్టగోడ ఉంది. అన్నీ జీర్ణావస్థలోనే ఉన్నాయి.

### మహిమ

పూర్వం ఇదో కొండపల్లె. రాముని వన వాసంలో ఓ మజిలీ. 'ఓ శూద్రస్త్రీ పుట్టు మూగది. రాముని దర్శించింది. మాటలు వచ్చాయి.' అని జనశ్రుతి. ఈ మూగమ్మ పూర్వజన్మలో 'మంజీర' అనే 'తాంబూల చేటిక' అనీ, నారదశాపంవలన భూలో కంలో ఓ శూద్రునింట పుట్టుమూగదిగా పుట్టిం దనీ, రామదర్శనంతో మాటలు వచ్చాయనీ ప్రతీతి. అప్పటి నుండే యిది యాత్రాస్థల మైందట.

### పుణ్యతిథులు

చైత్రంలో 'శ్రీరామజయంతి,' వైశాఖ శుద్ధ ఏకాదశికి 'గోపాలస్వామి కళ్యాణం,' జ్యేష్ఠశుద్ధ పూర్ణిమకు 'సహస్రఘటాభిషేకం,' కార్తీకశుద్ధ ద్వాదశికి 'తెప్పోత్సవం,' కార్తీక శుద్ధ పూర్ణిమకు 'గోపురోత్సవం,' ధనుర్మాసాన 'గోదా కళ్యాణం,' మాఘ శుద్ధ పూర్ణిమకు 'రథోత్సవం,' మాఘశుద్ధ చతుర్దశికి 'దొంగదోపు,' (తిరుమంగయా ళ్వారు) "రథోత్సవం" జరుపుతారు. ఈ రథం చాల ఎత్తైంది. అందమైంది.

మహాశివరాత్రికి తండోపతండాలుగా భక్తులువచ్చి కోదండరామునీ, సదాశివునీ దర్శించుకొని జాగరం చేస్తారు. విశాఖ, శ్రీకాకుళం తీరప్రాంతానగల "మీలలు" భక్తిపారవశ్యంతో కోలలు పట్టుకొని భజ నలు చేస్తారు.

### సాహిత్యం

ఇక్కడ మహాకవులు, గాయకులు, పండితులు ఉన్నారు. శ్రీరామచంద్రునిపై చక్కని రచనలు చేశారు. శ్రీ పూసపాటి వేంకటమహీపతి "ఉషాభ్యుదయం" శ్రీ పూసపాటి విజయరామరాజు "విష్ణుభక్తి సుధాకరం," శ్రీ అడిదం రామకవి "శుద్ధాంధ్రరామాయణం," శ్రీ చక్రాతి లక్ష్మీ నరసింహ కవి 'భండనారాతి భీమ కోదండరామ శతకం', శ్రీ చేపూరి కొండ రావు 'కోదండరామ శతకం' శ్రీగురువు గారి కృష్ణమూర్తి "శ్రీరామతీర్థ పర్వత ధామ శతకం' రచించారు.

శ్రీరామతీర్థ క్షేత్రంపై నాటకాలు రచింప బడ్డాయి. శ్రీరామతీర్థ శ్రీకోదండరామ సుప్రభాతం రచింపబడింది.

### ప్రాంత వైభవం

రామతీర్థం ప్రక్కనే సీతారామునిపేట, గొర్లిపేట అనే గ్రామాలున్నాయి. ఇక్కడ తూర్పుకాపులున్నారు. మొదటి పేటలో 'కళ్యాణం' వారున్నారు. పూర్వం ఆ కుటుంబంలోని దంపతులను కర్తలుగా ఉంచి రామగుడిలో సీతారామ కళ్యాణం చేసేవారట. అందుకే దానికి "సీతారాముని పేట" అనీ; ఆ కుటుంబాన్కి "కళ్యాణం" వారని పేరు వచ్చిందట.

ఇక్కడకు దగ్గరోగల 'కుమిలి' గ్రామం నుండి పుట్టుమూగ వంశంలోని ఒక కుటుం బీకులు దేవుని పెండ్లినాడు పసుపు కుంకు మలు, మట్టెలు, మంగళసూత్రాలు, తీసికొని రావడం వారికి మేళతాళాలతో ఎదురు సన్నాహం వెళ్ళడం జరుగుతుంది.

ఇక గొర్లిపేటలో శ్రీ విజయనగర మహా రాజుల యిలువేల్పు "శ్రీ దుర్గా భవానీ అమ్మవారి" గుడి ఉంది. ఈ గుడిని "దుర్గి పంచ" అంటారు. ఇక్కడి రాతిపలకపై ఒక శాసనం ఉంది. యాత్రికులు అమ్మ వారిని దర్శించి పసుపు కుంకుమలతో పూజిస్తారు.

ఈ దేవాలయ భూములుగల తంగుడు బిల్లి గ్రామం విద్యా విషయికంగా "పట్ట భద్రుల గ్రామంగా" ప్రసిద్ధి కెక్కింది. జీవితాంతం అనలాదర్శంతో వేలాది పేద విద్యార్థులకు పూర్వగురుకులాశ్రమ పద్ధతిలో ఉచిత విద్యాదానం చేసిన 'కులపతి,' ఆదర్శోపాధ్యాయులు, రాష్ట్రపతి బహుమతి గ్రహీతలు కీ. శే. శ్రీ నరసింహంగారు ఈ ప్రాంతంలో "విద్యాజ్యోతి"ని వెల్గిం చారు. దానికి కారణం 'కోదండరాముని చలవే!' అని వారు అంటూండే వారు.

రామతీర్థం అనేసరికి రెండుమూడు పేర్లు గుర్తుకొస్తాయి. కీ. శే. అయ్యవార్లుం గారు క్షేత్రాచార్యులు, రాజగురువులు శ్రీ మత్తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంక టాచార్య అయ్యవార్లుంగారు. వారికిక్కడ మూడంతస్తుల సంపత్కుమారభవనం (ప్రస్తుతం శిథిలావస్థలో) ఉంది. అందులో 'ఆండాళ సహిత రంగనాథస్వామిని ప్రతి ష్ఠించారు. బహువదాన్యులు.

ఆయుర్వేద మహాభిషగ్వరులుగా దేశ ఖ్యాతినార్జించిన శ్రీ. కీ. శే. రామస్వామి గారు; కీ. శే. చినప్పగారు, రామతీర్థ వాసులే! తిరుపతిలో కథాకాలక్షేపం చేసిన హరికథకులు కీ. శే. కర్రినారాయణా చార్యులుగారు, మహాప్రస్థానాటకకర్త శ్రీ కన్నస్వామిగారు; తెలుగుమాటలకు సంస్కృత అర్థాలుగల నిఘంటువువ్రాసిన కీ. శే. సామవేదుల సీతారామశాస్త్రిగారు; సాహిత్యఅకాడమీ సభ్యులు, రాష్ట్రబహుమతి గ్రహీత శ్రీరామగోపాల శాస్త్రిగారు, సహజ కవులు "శ్రీకూర్మాచార్యులుగారు", సింహా చలం ఆగమపాఠశాల అధ్యక్షులు "శ్రీ భాష్యకారాచార్యులుగారు; అపరదుర్యోధన పాత్రధారి 'శ్రీ వీరం' గారు ఇచ్చోటివారే!

— పి. మోహన్





# బాలప్రబోధం

శ్రీ మహావిష్ణువు శ్రీరామావతారుడై, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, చేస్తూ, ఆ కార్యక్రమంలో భాగంగానే అహల్యాశాపవిమోచచనం, శివధనుర్భంగనుు, సీతాపరిణయం, అరణ్యవాసం, సీతఎడబాటు మొదలైన మానవ సంబంధిత అవస్థలన్నీ అనుభవిస్తూ సముద్రానికి సేతువునిర్మించి, లంకలో ప్రవేశించాడు. రావణాసురుని చంపి చెరలో నున్న సీతాదేవిని విడిపించి, లంకకు విభీషణుని రాజునుచేసి, పుష్పక విమానంలో సీతా, లక్ష్మణ, ఆంజనేయ, సుగ్రీవ, జాంబవంతాది ప్రముఖులతో అయోధ్యా నగరానికి బయలుదేరేడు.

మహాసాధ్వి సీతాదేవి శ్రీరాముడి ముఖారవిందాన్నే మననంచేసుకుంటూ–అవమాన దావాగ్నిలోంచి, అనిల సంస్కారయై పైకొచ్చి, ధైర్యంగా, ఋజువర్తనిగా, శ్రీ రాముని ధర్మపత్నిగా, పరమసాధ్విగా, సగర్వంగా, ఆయన ప్రక్కన కూర్చుని నేత్రద్వయం నుంచి హిమ బిందువుల్లాంటి, వెన్నెల తరకల్లాంటి మంచుసోనల వంటి దయార్ద్ర దృక్కుల్ని, అవిమానంలో ఉన్న అందరిపైనా, ప్రసరిస్తోంది.

ఓ ప్రక్క అంజనేయుడు యివన్నీవట్టనట్లుగా పుష్పక విమానంలోంచి క్రిందికి చూస్తూ, అప్పటికప్పుడు కనిపిస్తూ, మరల మాయమైపోయే లతానికుంజాలవైపూ గల గలపారే సెలయేర్ల వైపూ చూస్తూ, ఆనందంతో కేరింతలు కొడుతున్నాడు....

కొంతసమయం గడిచింది....

పుష్పకవిమానం పవిత్రగంగానది ఒడ్డున రామాజ్ఞతోదిగింది. అక్కడికి అయోధ్యా నగరం ఎంతోదూరం లేదు. ఆ విమానందిగి అందరూ గంగా నదిలో స్నానాలు చేసేరు. విమానాన్ని తిరిగి కుబేరుడి వద్దకు పంపించేశాక, అంతాకలిసి అక్కడకు దగ్గర్లోనేగల భరద్వాజాశ్రమం వేపు బయలుదేరి ఆశ్రమంలో ప్రవేశించేరు.



## పరీక్ష

దశరథుని ముగ్గురు భార్యల్లో కైకేయి మూడవదీ, ముద్దుల భార్యకూడా. ఆమె కోరికప్రకారంగా శ్రీరాముడి పద్నాలుగేళ్ళ అరణ్యవాసం పూర్తయింది. ఇక అయోధ్యలో ప్రవేశించుట జరగాలి. ఇన్ని సంవత్సరాలూ అయోధ్యను పరిపాలిస్తున్నవాడు భరతుడు. ఆతని మనస్సు తెలుసు కోకుండ నగర ప్రవేశం చేయడం శ్రీరాముని కిష్టం లేదు. తమను గురించి భరతుడి అభిప్రాయం యిప్పుడెలాగున్నదో- తెలుసుకోవాలనిపించింది శ్రీరామచంద్రుడికి.

భరతుని ఒద్దకుపోయి, అతడి మనస్సు తెలుసుకు రాగలిగిన వాడు ఆంజనేయుడొక్కడే. శ్రీరాముడి దృష్టి ఆంజనేయుడిపై ప్రసరించింది.

తన శక్తి, తనగొప్పదనం, తనపాండిత్యం ఒకరు చెప్తేనేతప్ప, తనకే తెలీని వాడు మారుతి.



శ్రీమద్రామాయణ మహాకావ్యానికి మూలకర్త ఆంజనేయుడు. వినయంగా చేతులు జోడించుకొని శ్రీరాముని సమీపించాడు.

"మహావీరా!! కనిపిస్తున్న అయోధ్యా నగరానికి వెళ్ళు, ఆ నగరాన్ని పరిపాలిస్తున్నది నాసోదరుడు భరతుడు........ మనందరి క్షేమసమాచారములు చెప్పి, ఆతని సమాచారములు తెలుసుకొనిరా!!

అంతే....అన్నాడు శ్రీరాముడు.

ఆ ఆజ్ఞలోని మర్మాన్ని గ్రహించాడు ఆంజనేయుడు. చిన్నగా చిర్నవ్వు నవ్వుతూ తలవూపి, అయోధ్యానగరం వైపుగా అడుగులువేస్తూ కదిలేడు............

"కపి"రూపంతో అయోధ్యానగరాన్ని ప్రవేశించి భరతుడిని పరామర్శించడానికి మనస్కరించలేదు ఆంజనేయుడికి.

శుద్ధశ్రోత్రియబ్రాహ్మణవృద్ధుడిరూపాన్ని ధరించాడు. సూర్యసమానంగా వెలుగుతున్న ముఖారవిందము....

చెవులకు కర్ణాభరణాలు........

నుదుట నామాలు........

బ్రహ్మతేజస్సుతో సమానంగా మోము ప్రకాశిస్తోంది.

అయోధ్యానగర ప్రవేశం గావించేడు.

కుడికాలును ముందుచాచి అంతఃపురప్రవేశంగావించేడు. సూర్యసమకాంతితో ప్రకాశిస్తున్న ఆవృద్ధబ్రాహ్మణ మూర్తిని చూసి అంతా ఆశ్చర్యపోయారు.

ఆయన కన్నుల్లో కనిపించే వెలుగు కిరణాలు, శరీరంనుంచి వెలువడే దివ్య తేజస్సుతో కలిసి, ఆయన చుట్టూ ఓ వింతయిన ప్రకాశాన్ని ప్రసరింపచేస్తున్నాయి.

వడివడిగా భరతుని మందిరానికి చేరిపోయాడతడు. శ్రీరామ నామాంకితమై, ఆయన పవిత్ర పాదుకలనే ముందుంచుకుని నిత్యం ఆయన పవిత్ర నామస్మరణే చేస్తున్న భరతుడు, ఆంజనేయుడు లోనప్రవేశించేసరిక్కూడా అలాగే ఉన్నాడు.

ఆ వృద్ధ బ్రాహ్మణున్ని సగౌరవంగా ఆహ్వానించాడు భరతుడు. ఉచితాసనంపై ఆసీనుడినిగావించాక పరామర్శచేశాడు.

అతనిమనస్సు తెలుసుకొనుటకదే అదనుగా భావించాడు ఆంజనేయుడు.

"రాజా!! మాదిక్కడకు దగ్గరే.... ... గంగాతీరంలోగల అగ్రహారం.... ఉత్తమమైన రీతిలో ప్రజాపాలన చేస్తూ, నీపూర్వీకులైన మహారాజులందర్నీ మరిపిస్తున్నావు. ప్రజలందరూ నిరంతరం నీ పాలనలో సర్వసుఖాలూ అనుభవిస్తున్నారు........ కాని, ఒకే ఒక్క విచారం నాకు!!!

అంటూ ఆగిపోయాడు.

భరతుడి మోములో ప్రశ్నార్థకం పొడసూపింది.

"మహాత్మా!! మీవిచారం ఏమిటో తెలియజేయండి. నాశాయశక్తులా కృషిసల్పి, దానిని రూపుమాపేందుకు ప్రయత్నిస్తాను." వినయంగ అన్నాడు భరతుడు. "అది నాగురించే అయితే యింత దూరం రావలసిన పనేలేదు రాజా! నా విచారం కేవలం నీ గురించే...."

ఈ మాటలలో ఉలిక్కిపడ్డాడు భరతుడు "నీ అన్నగారైన శ్రీరాముడు సతీసమేతంగా, లక్ష్మణుడు వెంటరాగా, పద్నాలుగు సంవత్సరాలు అడవుల్లో గడపడంకోసం వెళ్ళాడు. ఆ గడువు సమయము పూర్తవుతోంది. నేటితో ఆ గడవు అయిపోతుంది. గడవుదాటినాక ఒస్తే అతనికి సింహాసనార్హత లేదు. ఒకవేళ యిప్పుడే వచ్చేసేడనుకో??" ఆగేడు మారుతి.

భరతుని ముఖం దివ్యకాంతితో ప్రకాశించిందొక్కమారుగా.

"నాఅన్న వచ్చేశాడా?! .... ఏరి?.... ఎక్కడ ??.... ఇప్పుడే ఈసర్వ సింహాసనాధికారాలు ఆయన పాదాల ముందు ధారపోస్తాను.

ఉద్వేగంతో పలికేడు భరతుడు.

"ఎంత వెర్రివాడవయ్యా భరతా!!.... శ్రీరాముడొస్తున్నాడని ఎగిరి గంతులేస్తున్నావుగాని, నిపాట్లు ఎలా మారనున్నవో గ్రహించడంలేదు. నీతల్లి కైకేయి నీకు ఈ అయోధ్యా రాజ్యాన్నీ, నీ అన్నకు అరణ్యాన్ని కట్టిపెట్టడానికి ఎన్నెన్ని అవస్థలు పడిందో, ఎన్నెన్ని నీచమైన మాటల్ని విని భరించిందో నీకు తెలీదు........ ఆగిపోయాడొకింతసేపు.

భరతుడిలో ఏదో మార్పు కలుగుతోంది క్రమంగా మళ్ళీ చెప్పసాగేడు ఆంజనేయుడు.

"అసలు ఆ శ్రీరాముడు నిన్నిప్పుడు వదలిపెడతాడని అనుకోను. నీ తల్లి చేసిన అన్యాయానికిప్పుడు నీతల్లిపై, నీపై పగదీర్చుకోవచ్చును. ఆమెనూ, నిన్నూ, నీ భార్యనూ కారాగారంలో పెట్టించవచ్చును. అందుచేత నామాటవిను. పెద్దవాణ్ణి. నీ తండ్రి సమవయస్కుణ్ణి. ఋణశేషమూ-శత్రుశేషమూ ఉండరాదు. వెంటనే బయలుదేరు ఆ రాముడిప్పుడు గంగానది ఒడ్డున భరద్వాజాశ్రమంలో ఉన్నాడు. నీ సర్వసైన్యంతో కదిలివెళ్ళు. నీ కే అడ్డంకులు లేకుండా చేసుకో పది కాలాలపాటు, ఆచంద్రతారార్కంగా నీ సామ్రాజ్యాధిపత్యాన్ని కాపాడుకో... ....

ఆమాటలు ఆంజనేయుడి నోటివెంబడి పూర్తయినావో లేవో.... దిగ్గున కూర్చున్న చోటునుంచి లేచేడు భరతుడు. అతని కన్నుల వెంబడి నిప్పులు కురుస్తున్నాయి.

"విప్రాధమా!! ... పెద్దవాడివని, పండితమ్మన్యుడవని తప్పుగా అంచనా వేసేను. అందుకే యింతసేపూ నిన్ను ఉపేక్షించాను. నా అన్న శ్రీరామచంద్రుడి పైకే నన్ను పురిగొల్పుతున్న నువ్వు ప్రాణాలతో బ్రతికి ఉండరాదు........

ఆనాడు మంథర. ఈనాడు నువ్వు. మా రఘువంశనాశనంకోసం ప్రతినబూనినట్లుగా కనిపిస్తున్నారు. ఆరోజు మంథర స్త్రీ అయిపోయింది. నాకరవాలానికెరగాలేదు. కాని నిన్ను మాత్రం విడిచిపెట్టను.

ఎవడి పాదపద్మముల పరిచర్యలకోసం ఇన్ని సంవత్సరాలూ ఓపిగ్గా, నిరీక్షిస్తున్నానో ఆ పరంధాముడి దర్శనంకోసం వేయి కళ్ళతో ఎదురుచూస్తున్న నన్ను

నీచాతి నీచమైన నీబోధనలతో మార్చాలని చూస్తావా ??.... ఆ శ్రీరామాజ్ఞ లేకుండా నిన్ను నాకరవాలానికి ఎరచేస్తున్నందుకు విచారిస్తున్నాను. అయినా మరికొన్ని క్షణాలపాటు నిన్నింకా బ్రతకనిస్తే ఈ భూమ్మీద, ధర్మం, న్యాయం, ప్రభుపరాయణత నశించిపోయే ప్రమాదంఉంది..... అంటూ కత్తిని ఝళిపిస్తూ ఆ విప్రవృద్ధుడి పైకి వచ్చిన భరతుడికి ఒక్కసారిగా కన్నులు మిరుమిట్లుగొలిపే దివ్యకాంతి కనిపించింది. ఆ కాంతి మధ్య ........

సుందరాకారుడూ .... సుందర రామాయణ భర్తా.... శ్రీరామభక్తాగ్రగణ్యుడూ.... అయిన పవనతనయుడు ఆంజనేయుడు. చిరునవ్వులుచిందిస్తూ, దివ్యశరీరకాంతులతో కనిపించాడు ............ నివ్వెరపోయాడు భరతుడు.

"నాయినా !! భరతా !! .... నీసోదర ప్రేమకూ,....ప్రభు భక్తికీ.... చిన్న పరీక్ష పెట్టాను ............ నీ మనస్సు తెలుసుకునే ప్రయత్నంలో నా అంచనా తప్పయి, నువ్వే గెలిచావు. ఈ భూమీ, సూర్యుడూ, చంద్రుడూ, గాలీ, నీరు అన్నీ ఉండునంత వరకూ నీ చరిత్రా, నీ ప్రభుపరాయణత శాశ్వతంగా వుంటుంది............ బయలుదేరు. శ్రీరామచంద్రుడు భరద్వాజాశ్రమంలోవేంచేసిఉన్నారు. ఆయనకుమంగళ స్వాగతాలు ఏర్పాటుచెయ్ !!

అంటున్న ఆ మారుతికి వినమ్రంగా తలవంచి.... భక్తిగా నమస్కరించాడు భరతుడు పట్టరాని ఆనందంతో....

మరునిముషంలో ఈ వార్త అయోధ్యా నగరంలో వ్యాపించింది. వేకువ సూర్యుడి వెలుగు కిరణాలు కోసం ఆగలేదెవ్వరూ ....

శ్రీరామచంద్రుడి కృపారసకిరణాల వెల్లువలో ప్రతిమునిగిలీ వెలుగులు చిమ్మాలనీ =

ఆ రఘురాముని దివ్య సందర్శనంతో నిఖిల జగత్తు నిండి పోవాలనీ తలపోస్తూ-

ఆ అయోధ్యానగర జనప్రవాహం భరద్వాజాశ్రమం వేపుగా పరుగులు తీసింది. •

— బి. ఉమామహేశ్వరరావు

## తెలుంగు వెలుంగుల ఉగాది

శ్రీనివాసుని దయాశ్రీలు దీనులపైన
చిందిపడెనేని అది అందమైనఉగాది!

రక్తాక్షి ప్రేమాను రక్తాక్షియై ప్రజల
రక్షించుకొన్న అది రమ్యమైనఉగాది!

కోటీశ్వరులు కోటగుమ్మాలు తెరచి క్షు
ధార్తుల వ్యథమాన్ప నదియె మేటిఉగాది!

మానభంగాల్ సేయు మహిషాసురుల తలల్
చితుకగొట్టిన అదే చింతలేనిఉగాది!

రామరాజ్యము ప్రజాక్షేమ రాజ్యంబుగా
నిలువ గల్గిననాడె విలువగలుగుఉగాది!

ఒళ్లుమైకము వదలి ఫైళ్లు ముందుకు కదలి
ముళ్లు విప్పిన అదే ముచ్చటైనఉగాది!

దొంగనక్కల దొంగ తోడేళ్ళ తోకలు
కత్తిరించిన నాడె ఘనతగలుగుఉగాది!

కులమతవర్గాల కుళ్లు కంపు తొలంగి
పరిమళించిననాడె భవ్యమైనఉగాది!

"నేను, నాది" అటన్న నీచభావము పోయి
"మనము" "మన" దను బుద్ధిగనుట మేలిఉగాది!

విద్వాంసులన్ గౌరవించి కళాలక్ష్మి
నాట్యమాడిననాడె నవ్యమైనఉగాది!

బడిలోన గుడిలోన మడిలోన కన్నమ్మ
ఒడిలోన ఆనందపడుటే పసిడిఉగాది!

భావిపౌరులు బాలబాలికలేకమై
ముందుకడుగిడునాడె ముద్దులొలుకుఉగాది!

ఐకమత్యముతోడ లోకమంతా కలిసి
ఏకకుటుంబమౌటే కమ్మనిఉగాది!

మానవత్వము రూపుమాపు పాశవిక వృత్తి
అంతమగునాడె ప్రశాంతమైనఉగాది!

అన్నిజాతులవారు అన్నదమ్ములమంచు
నడుచుటేముందునకు నవయుగాదిఉగాది!

అదియె తెలుగుఉగాది! అదియె వెలుగు పునాది!
అచ్చమైన యుగాది మచ్చలేని ఉగాది!!

'కరుణ శ్రీ'

[ 20వ పేజి తరువాయి ]

శ్రీరామ కవచము అను అయిదు అంగములనెరింగి చదువవలెను. జపమునకు ముందు శ్రీరామ హృదయమును, జపము చివర శ్రీరామ కవచమును చదువవలెను.

ఇవన్నియు ఈ గ్రంథమున ప్రకటింప బడినవి.

5. నడవడిలేనివానికి మంత్రము సిద్ధం పదు. నిద్రనుండి లేచినది మొదలు ఏ విధముగ ప్రవర్తించిన రాజసతామస చిత్తవృత్తులు తగ్గి సాత్త్విక చిత్తవృత్తి ఏర్పడునో ఆ యాచారము నెరింగి ప్రవర్తింప వలెను.

6. ధ్యానము చేయుటకు ముందు ప్రత్యాహారము ధారణ ఆవశ్యకము. తాను మంత్రముచే ధ్యానించు దేవతయొక్క విగ్రహమునందు లేదా చిత్రమునందుగాని మనసు కదలక నిలచియుండుట ధారణ. బయటపటమునందు విగ్రహమునందేకాక తన లోపలనే ఆ స్వామిని దర్శించుచుండుట అలవాటుచేసికొనవలెను. మనసు దేవతా మూర్తియందు నిలచి ఇతర విషయములు భాసింపకుండుట ధారణచే సిద్ధించును.

7. తాను ధ్యానించు శ్రీరామచంద్ర ప్రభువు దివ్యమూర్తిని అగ్నియందుగాని, జలమునందుగాని, సాలగ్రామమునందు గాని, యంత్రమునందుగాని, పటమునందు గాని, విగ్రహమునందుగాని ఏదో యొక దానియందు ఆవహింపచేసి భావించుట చేయవలెను.

8. ప్రాణాయామము చేయనిదే మనసున నిశ్చలత్వము కలుగదు. ఆహార విహారములలో నియమముతో పూరక, కుంభక రేచకములను రామమంత్రము నుచ్చరించుచూ చేయవలెను. ఎట్లు చేయవలెనో ఇందు స్పష్టముగ వివరింపబడినది.

9. జపము చేయునపుడు, పూజ చేయునపుడు ముద్రలను ప్రదర్శించ వలెను. దీనిచే భగవంతుడు ద్రవించి మన కనుకూలించును.

10. నిత్యము దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణము చేయవలెను. వానిచే వారి అనుగ్రహము కలిగి మన మంత్రానుష్ఠానమునవిఘ్నములుతొలగును.

11. ఏ దేవతల నారాధించినను అగ్ని ద్వారా ఆరాధించ వలెను. శ్రీరామ మంత్రముతో అగ్నిలో సమిధలు, చరువు, నేతితో హోమము చేయ వలెను.

12. మనము చేయు ఆరాధనమునకు సహకారులుగా నుండు వారికి, విరోధులుగా నుండు వారికి కూడ సంతృప్తిని కలిగించి వారి వలన సహకారమును పొందుటకు దైవ పరివారమునకు, ఆసుర వర్గమునకు బలి సమర్పించ వలెను. బలి యనగా పూజ యని యర్థము

13. తరువాత పూజ చేయ వలెను. అది మానసికముగ, బాహ్యమున కూడ చేయ వలెను. ఎట్లు చేయవలెనో ఏ యే ఉపచారములు చేయవలెనో ఈ గ్రంథమున వివరింపబడినవి.

14. తరువాత జపము చేయవలెను. ఈ సందర్భమున గురు శిష్య లక్షణములు వివరింపబడినవి. ఏ మంత్రము ఏ సాధకునకు పొందదగినదో తెలిసికొనుటకు, కులాకుల చక్రము మొదలగు చక్రములను వివరించినారు. రాశిమేళనము, నక్షత్ర మేళనము వివరింపబడినవి. జపమునకు చూచుకోవలసిన శుద్ధులు వివరింపబడినవి.

మంత్రోపదేశము పొందునపుడుపాటించు పద్ధతులు ఇందు వివరింపబడినవి. దీక్షలలో అనేక విధముల వివరింపబడినవి శ్రీరామ మంత్రభేదములు ప్రకటింపబడినవి.

జప విధానము, బీజాక్షర విశ్వాసము మంత్ర దోషములు, మంత్రాంగములు, అంగన్యాస, కరన్యాసములు వివరింప బడినవి. జపము చేయునపుడు జపమాల మూడు రకములుగా నుండును. కరమాల వర్ణమాల, మణిమాలఅనువాని నెట్లుపయోగింప వలెనో వివరింపబడెను.

15, 16 ధ్యానము సమాధి కూడ జప వివరణముననే వివరింపబడినవి.

పురశ్చరణరూపముల గూర్చి వివరించిరి. ఇట్లే గ్రంథము మంత్రశాస్త్ర రహస్యములను సామాన్యులకు తెలియునట్లు వివరించినది శ్రీరామ మంత్రోపాసకులకు ఈ గ్రంథము పెన్నిధి. శ్రీరామ శరణ్ గారుతప్ప వేరొకరెవరు ఇట్టిమహాగ్రంథము నందింప జాలరు. వారి కాంధ్రజాతి ఋణపడి యున్నది. ఆ సిద్ధ పురుషుల కారుణ్య పూర్ణమగు అనుగ్రహమే శ్రీరామానుగ్రహమై పాఠకులను రక్షించుగాక.

— శ్రీ భాష్యం అప్పలాచార్యులు.

## రామకృష్ణ పూజ

రచయిత: శ్రీ శ్రీ శ్రీ అనుభవానందస్వాముల వారు, పుటలు: 180 క్రౌన్, ప్రాప్తిస్థానం: అనుభవానంద గ్రంథమాల, బాపట్ల, 522101 [గుంటూరు జిల్లా] లేదా భీముని పట్టణం: 531163 [విశాఖ జిల్లా] వెల రు 6-

ఎవరెష్టు శిఖరాన్ని ఎక్కిన వారిద్దరో ముగ్గురో! అట్లే ఆధ్యాత్మిక శిఖరాన్ని అధిరోహించిన వారు కూడా అంతే! నేటి కాలంలో ఒక రామకృష్ణ పరమహంస, ఒక రామతీర్థ, ఒక రమణ మహర్షి మాత్రమే మనకు గోచరిస్తారు. పరమహంస గారిని పరిచయం చేయడం కమ్మరి వీథిలో సూదులు అమ్మడం వంటిది. అయినా రెండు మాటలు.

హిమాలయం, సముద్రం, వజ్రం, నవనీతం, దక్షిణావర్త శంఖం, ఏకముఖి రుద్రాక్ష, అన్నీ ఒక చోట ఉంటే, లేదా అన్నీ ఒకటైతే ఎట్లా ఉంటుందో చూడాలనుకుంటే పరమహంసగారి గాథను తిలకించాలి.

తంత్ర, మంత్ర యోగ సాధనలే కాక మాతృభాషలతో భావించడం, కాళీమాతను కన్నులార వీక్షించడం, వివేకానందాది శిష్యులను లోకానికి అందించడం మొదలైనవి సామాన్య జీవితాలకు సుదూరంగా ఉన్నాయి. కనుకనే సంప్రదాయ వాదులు రామకృష్ణుని పరమేశ్వరునిఅంశావతారంగా భావిస్తే ఇకవారి భక్తులు అవతారవరిష్ఠునిగా ఆరాధిస్తున్నారు. సాధనావతారంగా సాగిలబడి మొక్కుతున్నారు.

పరమహంసగారిని షోడశోపచారపద్ధతిలో పూజించే విధానం ఈ పుస్తకం యొక్క ప్రత్యేకత. సర్వసిద్ధాంత సారబాది అనేక గ్రంథాలను రచించి రామకృష్ణాశ్రమాలు స్థాపించి తుదకు బ్రహ్మీభూతులైన అనుభవానంద స్వాములవారే ఈ పుస్తక రచయితలు. అనుభూతితో రామకృష్ణులను ఆరాధించిన ధన్యులు. పరమహంస గారి జీవిత గాథను సహస్ర, అష్టోత్తర శత నామాలనే మాలలతో అలంకరించారు.

ఆ నామాల వల్ల శ్రీవారి జీవితగాథ మనకు కన్నులకు కట్టినట్లుంది.

శారదాదేవి అష్టోత్తరశతం, శ్రీ వివేకానందస్వామి అష్టోత్తర శతం వ్రాసి వాటిని జోడించి, శ్రీ స్వామివారు వ్రాసిన నామాలకు విపులంగా, సరళ గ్రాంథిక భాషలో వ్యాఖ్యానం చేసిన భాగ్యం మాతాజీ త్యాగీశానందులకు దక్కింది. నామ వజ్రాలకు సానబెట్టిన వారు శ్రీ మాతాజీయే.

తరుణోపాయం (తరణోపాయం) తత్సవితుః (తత్సవితుః) స్మశానం (శ్మశానం) ఉత్కృష్ఠ (ఉత్కృష్ట) ఉచ్ఛిష్ఠ (ఉచ్ఛిష్ట) ఢమరుకము (డమరుకము) ప్రాధాన్యత (ప్రాధాన్యము) శక్తివంతుడు (శక్తిమంతుడు) సామ్రాట్ (సమ్రాట్టు) వరివేష్ఠితాయ (పరివేష్టితాయ) వంటి అచ్చు తప్పులు లేకుండా ఉంటే ఇంకా బాగుండేది.

ఈ పుస్తకం తప్పక చదువ తగినదే కాదు, పూజింప దగ్గ పుస్తకం.

—దేవరకొండ శేషగిరిరావు

## శ్రీ సీతారామాంజనేయ సంవాద కావ్యము

ఒక సమాలోచనాత్మక పరిశీలనము. రాజయోగి దర్శనము (మూలసహితము)

పరిశీలకులు-డా॥ రత్నాకర బాలరాజు M.A , Ph.D.

ఆంధ్రోపన్యాసకులు. ప్రభుత్వకళాశాల. అనంతపురము (ఆం. ప్ర)

అధ్యాత్మవిద్యా గ్రంథమాలా ప్రచురణ

పుటలు 684. మూల్యము రు 75/-

ప్రతులకు – శ్రీమతి రత్నాకరం జయలక్ష్మీదేవి, 21- S. B. I కాలని అనంతపురము పిన్ 515001 (రాయలసీమ)

ఈ గ్రంథము శ్రీ బాలరాజుగారి విమర్శ వ్యాసరూపము. వరబరామపంతుల లింగమూర్తి గురుమూర్తికృత శ్రీ సీతారామాంజనేయ సంవాద కావ్యముపై ఈ విమర్శ వ్యాసము (Thesis) శ్రీ బాలరాజుగారిచే వ్రాయబడినది. దీనికి అనుబంధముగా మూలముగూడ (శ్రీ సీతారామాంజనేయ సంవాదము) కూర్చబడినది.

శ్రీ సీతారామాంజనేయ కావ్యము శాంతరస ప్రధానమైన వేదాంతకావ్యము ఆంధ్రులలో సంస్కృత భాషానభిజ్ఞులగు తత్త్వజిజ్ఞాసువులు ఈ కావ్యమును అతి శ్రద్ధతో చదువుచుండుటచే ఇది ఆంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇందు తారక యోగము, సాంఖ్యయోగము, అమనస్కయోగము, అను మూడాశ్వాసములు గలవు. విభిన్న ప్రకరణములు గల భగవద్గీత ఎట్లు కృష్ణార్జున సంవాదరూప యోగశాస్త్రమని ప్రసిద్ధి గాంచినదో అట్లే యిది గూడ సీతారామాంజనేయ సంవాద రూపమగు యోగశాస్త్రమని శ్రీ లింగమూర్తి గురుమూర్తి కవిభావనం.

ఉత్తమ పురుషార్థము భావింపబడు మోక్షము జ్ఞానము వలననే కలుగునని "జ్ఞానాదేవ తు కైవల్యం," తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ" మున్నగు శ్రుతులు తెల్పుచున్నవి. గీతాచార్యుడు గూడ —

"అజ్ఞానేనావృతం జ్ఞానం
తేన ముహ్యన్తి జంతవః।
జ్ఞానేన తు తదజ్ఞానం
యేషాం నాశిత మాత్మనః।
తేషామాదిత్యవద్ జ్ఞానం
ప్రకాశయతి తత్పరమ్॥"
(భ. గీ. 5-15.,16)

"దదామి బుద్ధియోగం తం
యేన మాముప యాన్తి తే॥"
(భగీ. 10-10)

మున్నగు సూక్తులచేతు రీయ పురుషార్థము జ్ఞానైకసాధ్యమే అని తెల్పినాడు. అయినను యోగులు యోగైక సాధ్యమనియు, భక్తులు భక్త్యైక సాధ్యమనియు మోక్షమును పేర్కొందురు. పరినిష్ఠితుడగుయోగి జీవబ్రహ్మైకతా జ్ఞానమును అనుభవ పూర్వకముగ గల్గియుండును. గావున అతడు ముక్తుడే యగును. అట్లే చతుర్విధ జ్ఞానులలో తురీయుడు జ్ఞానియే. అతడును ముక్తుడే యగును. మిగిలిన యోగుల యోగము, భక్తుల భక్తియు అనవరతమగు నభ్యాసముచే జ్ఞానమునకు సాధనములగును. దీనినే పెద్దలు "జ్ఞానాదేవ తు మోక్షః స్యాత్, భక్తిః జ్ఞానాయ కల్పతే" అని చెప్పుచున్నారు. కాని యోగమును ప్రధానముగా బోధించు యోగచూడామణి, యోగశిఖా, యోగతత్త్వోపనిషత్తులు యోగమునకు జ్ఞానమునకును తుల్యప్రాధాన్యము నిచ్చి ఇట్లు తెల్పినవి —

"జ్ఞానం కేచిద్వద న్త్యత్ర
కేవలం తన్న సిద్ధయే।
యోగహీనం కథం జ్ఞానం
మోక్షదం భవతీహ భోః।
యోగోఽపిజ్ఞాన హీనస్తు
నక్షమో మోక్ష కర్మణి।
తస్మాద్ జ్ఞానం చ మోక్షం చ
ముముక్షుః దృఢమభ్యసేత్॥

అని అధ్యాత్మ రామాయణము నందలి బాలకాండము ప్రథమాధ్యాయము ఈ సీతారామాంజనేయ సంవాదమునకు మూలము. అందుసీత ఆంజనేయునికి రామస్వరూపము స్వస్వరూపమును రామాజ్ఞచే నుపదేశించి

"రామస్సీతామువాచేదం
బ్రూహితత్త్వం హనూమతే"
"తథేతి జానకీ ప్రాహ
తత్త్వం రామస్య నిశ్చితమ్।
రామం విద్ధి పరంబ్రహ్మ
సచ్చిదానంద మద్వయమ్"
మాం విద్ధి మూలప్రకృతిం
సర్గస్థిత్యంత కారిణీం
తస్య సంనిధిమాత్రేణ
సృజామీద మతంద్రితా"

అని చెప్పబడినది. అందు దీని ప్రయోజనం గూడ —

"సీతారామ మరుత్సూను సంవాదం మోక్షసాధన"మ్మని తెల్పబడినది.

ఇట్టి యుత్తమ గ్రంథముపై విమర్శ వ్యాసమును వ్రాయుట గ్రంథకర్తకే గాక సకల ముముక్షూపయోగ హేతువగును. ఈ విమర్శవ్యాసమును శ్రీ బాలరాజుగారు పదునెనిమిది ప్రకరణములుగా విభజించిరి. వానికి ముందుగానే "నమ్రనివేదన" మను పేర కొన్ని విషయములను వ్రాసిరి. అవ్వానినిగూడ గ్రంథమును జదువుటకు ముందు తప్పక చదువవలసి యుండును. వారు వ్రాసిన పదునెనిమిది ప్రకరణములలో, పదమూడు, పదునాలుగు, పదునైదు ప్రకరణములు మూడును గ్రంథగతములగు మూడాశ్వాసములయందలి తారక-సాంఖ్య-అమనస్కయోగముల గూర్చిన విషయవిమర్శము అందు తారక యోగానుభవమును పదుమూడవ ప్రకరణమున - మంత్రయో

గము, హఠయోగము, ప్రాణాయామము, ఆసనము ఖేచర్యాది పంచముద్రలు, ఆధారాదిచక్రము, అజపావిద్య కుండలిని అంతర్యాగము మున్నగు గ్రంథగత విషయము సప్రమాణముగ నిరూపించబడినది.

అట్లే సాంఖ్యయోగా సాంఖ్యయోగానుభవమను పదునాల్గవ ప్రకరణమున బ్రహ్మస్వరూపము, సజాతీయాది భేదత్రయము, మాయాస్వరూపము, వివర్తవాదము, మాయాఽవిద్యల వ్యవస్థ, జీవుడు విశ్వసృష్టి, దృగ్దృశ్యవివేకము, అద్వైతమే శ్రుతిసమ్మతము అను విషయములు. సుబోధములుగా చర్చింపబడినవి.

ఇక పదునేనవదగు అమనస్కయోగానుభవమున - మనస్సు స్వరూపము, సమాధిగతమనస్సు, నిర్వికల్పసమాధి, మాయాతరణము, బ్రహ్మజ్ఞలక్షణము, అద్వైతతత్త్వము, శ్రీరామమంత్రార్థము, జ్ఞానిప్రారబ్ధము, అధ్యాత్మవిద్యకు గుర్వావశ్యకత, జీవన్ముక్తచర్య, పంచదశ యోగాంగములు ఆధికారికపురుషులు, విదేహకైవల్యము మున్నగు విషయము సోపపత్తికముగ విచారింపబడినవి. మూలగతములగు ప్రతి విషయమునకు విమర్శకర్త శ్రుతిస్మృతిపురాణాదులలోని వాక్యములను ప్రమాణములుగా నిచ్చుట అభినందింప దగినది.

ఇంతకు ముందుగల పంద్రెండు ప్రకరణములు గ్రంథమునకు సాక్షాత్సంబంధము లేకపోయినను విషయమును దెలిసికొనుటకు కొన్ని ప్రకరణములు, సందేహనివృత్తికి కొన్ని ప్రకరణములు, మూలగ్రంథకర్త తిశయ నిరూపణమునకు కొన్ని ప్రకరణములు నుపయోగించును. అందు తొలి ప్రకరణము అధ్యాత్మవిద్యకు ఆకరములగు ఉపనిషత్తులను గూర్చియు, ద్వితీయప్రకరణము గురుమూర్తి కవిని, పూర్వము తెలుగు వాఙ్మయమున అధ్యాత్మ విద్యను ప్రత్యక్షముగాను పరోక్షముగాను వ్యాపింపజేసినట్లు తెలియబడు తిక్కన పోతనాది కవుల విషయము తెలుపబడినది. తృతీయమున కవి దేశకాలాదులు చతుర్థమున ఆత్మవిద్యలో అత్యావశ్యకమగు గురుసంప్రదాయము సవిమర్శముగ చూపబడినవి. పంచమమున 'యోగజిజ్ఞాస' అను పేరిట యోగశబ్దార్థము తదతిశయము తెల్పబడినది.

ఇక షష్ఠ, సప్తమ, అష్టమ ప్రకరణములు అవశ్యము అందఱును చదువదగినవి. ఏల యనగా వేదములందును, వేదానుసారులగు స్మృతుల యందును, భగవద్గీత యందును ప్రకృత గ్రంథమునందును సాంఖ్యయోగశబ్దములు వినబడుచున్నవి. వీనియందు దెల్పబడిన సాంఖ్య-యోగములు కాపిలసాంఖ్యముకంటెను, పాతంజల యోగము కంటెను వేఱయినవా? లేక తద్రూపములే నా అనుసందేహము సామాన్యులకు గల్గును. కాపిలసాంఖ్య, పాతంజలి యోగములుగూడ శ్రౌతములే అయినచో వెదమార్గప్రవర్తకులగు బాదరాయణ మహర్షియు శ్రీశంకర భగత్పాదులును తమ సూత్ర-భాష్యములందు (ఈక్షతేర్నాశబ్దమ్ బా.సూ. 1-1-5, ఏతేన యోగః ప్రత్యుక్తః బా. సూ. 2-1-3) వానిని నిరాకరించుట తగునా? అనియు సందేహములు గల్గును. అట్టి సందేహములను అపనయించుట కొఱకే శ్రీ బాలరాజుగారు షష్ఠ, సప్తములలో ఆ యా సాంఖ్యయోగదర్శనముల మూలసూత్రములతో గూడ స్పష్టముగా నిరూపించి, అష్టమప్రకరణమున దర్శన సాంఖ్యయోగములకు, శ్రౌతసాంఖ్య యోగములకునుగల భేదములను స్పష్టపఱచినారు.

ఇక తొమ్మిదవ యధ్యాయమున శాస్త్రమునందు అత్యావశ్యకములుగా విధింపబడిన విషయ-ప్రయోజన-అధికారి-సంబంధములనెడి అనుబంధ చతుష్టయమునుగూర్చి తెల్పబడినది. పదవప్రకరణము అధ్యాత్మతత్త్వము ప్రవక్తలగు శివ-దక్షిణా మూర్తులయొక్కయు, ప్రకృత ప్రవక్తలగు సీతారాముల యొక్కయు స్వరూపము, శ్రోతలగు హనుమదాదుల యొక్క స్వరూపవైలక్షణ్యము నిరూపింపబడినవి.

పదునొకండవ ప్రకరణము భక్తి యోగస్వరూపబోధకము. భక్తి యనగా ఉపాసనముగానే నిరూపింపబడినది. గీతయందు గూడ భక్తి యోగ పకరణమున - "నిత్యయుక్తా ఉపాసతే" 'అవ్యక్తం పర్యుపాసతే' అని భక్తిని ఉపాసనముగానే భగవానుడు పేర్కొనెను. నామమనగా ఉపాసన దేవతామంత్రము. ఇదియే దేవతానామముగా జపయజ్ఞములోని భావనము. దీని ఫలితమును గూర్చి ప్రాచీనార్వాచీనుల సిద్ధాన్త వాక్యములు ప్రమాణములుగా ఇందు పేర్కొనబడినవి. కాని యిప్పుడు జనులు గుమికూడి మేళతాళములతో గావించు నామసంకీర్తనమునకే ఈ పదము సంకుచితమగుట చింత్యము.

ఇక పండ్రెండవ ప్రకరణమున 'తత్త్వమస్యాది' మహావాక్యములు బోధించు జీవపరమాత్మైక్యమే శ్రీరామహృదయముగా పేర్కొనబడినది.

గురుమూర్తి కవి వశీకృత వాక్కు గలవాడు. అతడు ఎట్టి గహనమగు విషయమునైనను సులభంగా గ్రహించునట్లు ఎట్టి ఛందములోనైనను చెప్పగలరు. ఇట్టి యాతని సామర్థ్యము అన్ని కోణముల నుండియు పరిశీలించి పదునాఱవ ప్రకరణమున సువిపులముగ నిరూపించబడినది. పదునేడవ ప్రకరణమున వాస్తవమగు రాజయోగ మనగా యవివేకుల దలచు రాజయోగ మెంత మాత్రము కాదనియు అది అద్వైతామనస్కములకు పర్యాయమనియు దెల్పి, వేదోక్తరసమునకు సంబంధము వేదమనియు, శృంగారాది లౌకిక కావ్యానందమున బ్రహ్మానందసబ్రహ్మచారి యని వర్ణించుటె కేవలము అర్థవాదము మాత్రమే యని నిరూపింపబడినది. ఇయ్యది కావ్యరసజ్ఞులకు కొంత కష్టము కలిగించును.

ఇక తుదిది యగు శాన్తమే రసరాజమని చెప్పుటను పెక్కురు ఆలంకారికులు భోజప్రభృతులు అంగీకరింపక పోయినను అభినవగుప్తాదుల హృదయ మదియే యని చెప్పవచ్చును. భవభూతి "ఏకో రసః కరుణ ఏవ" అనియు, భోజుడు "శృంగార ఏవ వరః ప్రహ్లాద నోరసః" అని చెప్పినను ఆరసములన్నియు చిత్తోద్రేకమును గల్గించి మనోవిక్షేపహేతువుకే యగునుగాని వాస్తవానందము కలుగజేయలేక పోవుట వాస్తవమగు విషయము. సౌఖ్యము అనగా ఆనందమును కలుగుజేయునది శాంతము మాత్రమే. ఎన్ని సుఖ స్వప్నములు అనుభవించినను శాంతరూపమగు సుషుప్తి లేనిచో మనుజుడు తృప్తినొందలేడుగదా! ఈ విషయము శ్రీ బాలరాజు తమ గ్రంథములోని తుది ప్రకరణమున లెస్సగా నిరూపించిరి.

— పీలకంఠశాస్త్రి




'నా నృషిః కురుతే కావ్యం', ఋషికాని వారు కావ్యం వ్రాయలేరని ఆర్యోక్తి. భారతీయ విజ్ఞానఖనిలో వెలువడిన ఆది కావ్యం రామాయణం. కృతికర్త ఆదికవి వాల్మీకి. రామకథ ఛాయా మాత్రముగ అపౌరుషేయములగు వేదములలో గలదని వేదవిదుల అభిభాషణ. రామావతారమునకు పూర్వమే లభించబడిన గాథయిది. వ్యాస, అగస్త్య, భరద్వాజాది ఆర్యఋషులు భారతీయభాషలలో వ్రాసిన రామాయణాలు వేనకువేలు. రామకథా ప్రశస్తి అతిప్రాచీన కాలమునుండి పలుదేశాలలో విస్తరించినది.

క్రీ. శ. 251 లో కింగ్ సెంగ్‌హుయే రామాయణమును "హిసియుచి" యను పేర చైనాభాషలోకి అనువదించిరి. క్రీ. శ. 517-552 మధ్యకాలంలో కావ్యముగ "జానకీ హరణ" మనుపేర సిడాన్ బాస్టియన్, నాటకముగ జాన్ డి సిల్వా సింహళములోనికి; క్రీ. శ. 1400-1500 లలో నాటకముగ 'ది మలేషియన్ హికాయత్ సెరిరామా" యను పేర మలేషియాభాషలోకి అనువదించిరి. లావోస్‌భాషలోనికి రాజుసావంగ్‌వత్తానా దీని ననువదించిరి. ఈ నాటకమిచట సంవత్సరములో 200-300 పర్యాయములు ప్రదర్శింపబడుచున్నది. రామాయణమును రష్యన్ ఇత్యాది పాశ్చాత్య భాషలలోనికి అనువదించిరి. రామకథలో నిక్షిప్తమైన ధర్మాచరణము, కథాగమనము, పాత్రోచితదైవగుణ సంపత్తి, తాత్త్విక చింతన, కవితా మాధుర్యములే దీని విస్తృతికిగల ప్రాతిపదికలు.

మూలగాథ యొకటియైనను వేర్వేరు యుగాలలో వ్రాయబడినందువల్ల; ప్రాంతీయ, సాంఘిక, సామాజికభేదాలవల్ల; కొన్ని కల్పనలు చోటుచేసికొనుట సహజమే. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" యను సూక్తితో సమన్వయించినను కథామూల మొక్కటే- మలచబడిన రీతులు వేరని తెలియును. రామాయణకల్పవృక్షాలకు ఆలవాలమైన ఆంధ్రోద్యాన తులసి వనములో గంజాయి మొక్కవలె విషవృక్షము చోటుచేసికొనుట అసహజముకాదు.

ఆయా రామాయణాలలోని అవాల్మీకములైన విభిన్నకల్పనలను తెలిసికొనుటయే ప్రస్తుతాంశము.

ఆనంద రామాయణంలో గౌతమునిచే శాపగ్రస్తయైన అహల్య నదిగా రూపొందినది. కాని శిలగాకాదు. ఇందులోని శివకృత శ్రీరామస్తవరాజంలో రాముడు కారణజన్ముడుగ, ప్రజ్ఞానబ్రహ్మగా చిత్రించబడినాడు. దక్షిణాపథానగల సమస్తపుణ్యక్షేత్రములను రాముడు దర్శించినట్లుగలదు. విరావణ, మైరావణ కథా ఘట్టాలును పేర్కొనబడినవి. శపించబడిన అహల్య శిలారూపముగ నున్నదని ఇందులోనే మరొకచోట చెప్పబడింది. రామునాజ్ఞమేరకు సులోచన భర్తయగు ఇంద్రజిత్తు శిరస్సుతో సహగమనము చేసింది.

అధ్యాత్మరామాయణంలో రాముడు సాక్షాద్విష్ణురూపుడుగ వర్ణింపబడినాడు. ఇందు భక్తి, వేదాంతములు ప్రతిబింబితములు. సీతను రావణుడు భూభాగముతో సహా పెకలించుకొని రథముపై నిడుకొని పోయినట్లుగలదు. రాముడే సీతను అగ్నిప్రవేశము చేయించి, మాయాసీతనే పర్ణశాలయందు ఉంచుకొనినట్లిందు మలచబడినది.

సరయూ నదిలో పడవకు మునకప్రమాదం శంకించినపుడు రామబాణ ప్రహారముచే నీరు ఘనీభవించి, మునకప్రమాదం తప్పినట్లు; శివునివల్ల తనకు లభించిన శస్త్రాస్త్రవిద్యలను రామలక్ష్మణులకు నేర్పెదనని విశ్వామిత్రుడనినట్లు; సేతు నిర్మాణ సందర్భంలో ఉడుత సేవాభావంతో తన భక్తి తత్పరతను నిరూపించినట్లు; విభీషణ ప్రేరణతో అంగదుడు మండోదరిని శిగబట్టి యీడ్చితెచ్చుటను చూచిన రావణుడు పాతాళహోమమును నిర్విఘ్నముగ పరిసమాప్తి చేయజాలక పోయినట్లు వర్ణితములైన విషయములు శ్రీరామభాగవతములో గలవు.

భారద్వాజ, అద్భుత రామాయణాలలో రాముడు కౌసల్యకు విశ్వరూప సందర్శనం గావించిన విషయము, రావణుపనుపున రామునిచంప మొసలి రూపమున వచ్చిన రాక్షసుని పరిమార్చిన విషయములుగలవు. సీతసహస్రకంఠరావణ సంహారం జేసిన ఘట్టము; పరశురామునకు, హనుమంతునకు విశ్వరూప సందర్శనం గావించిన ఘట్టములు అద్భుత రామాయణంలో గలవు.

భారత పురాణంలో దేవతలే వానరులుగ జన్మించిరని; దుందుభియను గంధర్వస్త్రీ కుబ్జరూపములో అయోధ్యలో కైకతో సహోద్య నెరపినదని; కైక రోషానల జ్వలితకాక, చీనిచీనాంబర ధారిణియై, దశరథుని మురిపించి తాను కోరిన వరముల పొందినదని; పరశురాముడు రాముని అయోధ్యలోనే సందర్శించి, తన ధనువు నెక్కుబెట్టుమని తూలనాడుచు పలికిన కారణముగా, రాముడు ధనువును విరిచి విశ్వరూప సందర్శన భాగ్యమిడి, మహేంద్ర పర్వతమునకు తపమాచరించ బోవునట్లు చేసెనని మనకు కనిపించును.

(సశేషము)

( 16 వ పేజి తరువాయి )
దుడు యువరాజయ్యాడు. వానర సంప్రదాయానుసారం కాబోలు తార సుగ్రీవుని ప్రియురాలైంది.

తార జీవితంలో ఇది పెద్దమలుపు. క్రొత్త మలుపు. వర్షాకాలం గడిచింది. అది ఎలా గడిచిందో తారాసుగ్రీవులకు తెలీదు. శరత్కాలం వచ్చింది. అది ఎప్పుడు వచ్చిందో వాళ్ళకు అసలే తెలీదు. ఆ ఇద్దరిది మరొక జగత్తు - రసమయజగత్తు.

ఒకనాడు హఠాత్తుగా వారి అంతఃపురంలో ధనుష్టంకారం వినిపించింది. పెద్ద పిడుగు పడ్డట్లుంది. మహాపర్వతం బ్రద్దలైనట్లుంది. పునాదులతోగూడ అంతఃపురం పగుళ్ళు వారుతున్నట్లుంది.

అది లక్ష్మణుని ధనుష్టంకారం.

సుగ్రీవుని గుండెలదిరాయి. కాళ్ళువణికాయి. పెదవులెండాయి. 'తారా! నీవే దిక్క'ని ఆమె చాటున అతడు తలదాచుకొన్నాడు.

తార లక్ష్మణుని ఆగ్రహావేశాన్ని అర్థం చేసుకొన్నది. సుగ్రీవుని భయతీవ్రతను భావించుకొన్నది. తక్కిన అంతఃపుర కాంతల దీనతను తెలుసుకొన్నది. కాని తనది బయటికి వెళ్ళదగిన స్థితిగాదు. అయినా వెళ్ళక తప్పదు.

శయ్యదిగి, జారిపొయ్యే చీరను ఒకచేత సవరించుకొంటూ, ఊడిపడే వడ్డాణాన్ని మరోచేత ఒత్తిపట్టుకొంటూ, చెదరినజుట్టుతో, సంభోగ చిహ్నాలతో, స్తనభారవినమ్రశరీరంతో ఆ సమున్నత గంభీరస్త్రీమూర్తి మెల్ల మెల్లగా అడుగులు వేసుకొంటూ సరాసరి నడిచివచ్చి లక్ష్మణుని ఎదుట నిలిచింది. వ్రాలిపోయే కనురెప్పలను ఒకింతపైకెత్తి, సూటిగా అతని ముఖంలోకి చూచింది. అంతటి లక్ష్మణుడు పాపం! తలవంచుకొన్నాడు. తార మరొక అడుగు ముందుకు వేసింది. లక్ష్మణుడు ఒక అడుగు వెనకకు వేశాడు.

అప్పుడన్నది తార 'లక్ష్మణా! నీ కోపం ఎందుకు? ఎవరిమీద?' అని. అతని సమాధానం కొరకు చూడకుండానే 'ఎవరైనా నీ ఆజ్ఞ అతిక్రమించారా- అయినా దావానలం మీద ఎవరు దూకుతారు' అంది.

తార నిలబడిన తీరు, ఆమెస్వరము, మాటవైఖరి చూచేసరికి లక్ష్మణుడు సగం చల్లబడిపోయాడు. కొంతకుకొంత తగ్గిపోయాడు. గొంతు సవరించుకొని, ఎక్కడో మీదికి చూస్తూ- 'సుగ్రీవుడు రామకార్యం మరచాడు. శరత్కాలం వచ్చింది. సీతాన్వేషణ సాగించలేదు. కామలోలుడయ్యాడు. కాలం గడుపుతున్నాడు-' అని గ్రుక్క త్రిప్పుకోకుండా పంతులమ్మ యెదుట వసిబాలుడు పాఠాలు వల్లించినట్లు చెప్పాడు.

తార అల్లన నవ్వింది. ఆమె నవ్వులో కొంత ఆశ్చర్యం ఉంది. కొంత అవగాహన ఉంది. కొంత ఆవేదన ఉంది. అంతో ఇంతో అపహాస్యంగూడా ఉంది.

ఆప్యాయంగా ఆమె లక్ష్మణునివైపు చూస్తూ, సుగ్రీవుని మిత్రహృదయాన్ని గూర్చి చెప్పింది. అతని కృతజ్ఞతాభావాన్ని గూర్చి చెప్పింది. సీతాన్వేషణకు అతడు వానరసైన్యాన్ని సమీకరిస్తున్నాడని గూడ చెప్పింది. సుగ్రీవుని ప్రస్తుత మన్మథాదీనస్థితిని మనవి చేసింది. మన్మథాధీనుడైన ఆ మిత్రునిమీద నీ కోపం చూస్తే నీకు మన్మథవ్యాపార పరిజ్ఞానమే లేనట్లుందే' అని పరిహాసమాడింది. 'మహర్షులే మన్మథాధీనులై కాలగమనాన్ని మరచిపోయారుగదా- మాబోటి వానరుల సంగతి చెప్పాలా' అని సమర్థించింది. 'అయినా మేము రామకార్యం మరువలేదు. ఆ సంగతి సుగ్రీవుణ్ణి అడుగు. లోనికిరా స్త్రీలున్నారని సంకోచించకు. మేమంతా మీ మిత్రుని పత్నులమే కదా' అని సూటిగా లక్ష్మణుని కళ్ళల్లోకి చూచింది. తాను ముందు నడిచింది.

ప్రియకాంతాపరివృతుడు, కామకేళీపరవశుడు అయిన సుగ్రీవుణ్ణి చూచి, పటపట పళ్ళుగొరికి 'నీ అన్నకు పట్టినగతే నీకూ పట్టుతుంది- రామకార్యం మరచావు' అని మరల లక్ష్మణుడు మండిపడేసరికి అంతఃపురం అంతఃపురమంతాకంపించిపోయింది. అక్కడి స్త్రీలంతా గడగడలాడారు. ఇక సుగ్రీవుని సంగతి చెప్పనే అక్కరలేదు.

ఎటు చూచినా భయం. నిశ్శబ్దం. నిశ్చేష్టత. అప్పుడు తారముందు కడుగు వేసింది.



అభయాన్ని, నిశ్శబ్దాన్ని, నిశ్చేష్టతను నిలువునా చీల్చి 'లక్ష్మణా! ఇది నీకు తగ' దని గద్దించి పలికింది. 'సుగ్రీవుడు కృతఘ్నుడుగాదు. క్రూరుడుగాదు. కుటిలుడుగాదు. అసత్యవాది అంతకంటెకాదు. అతడు మీ మిత్రుడు. రామకార్యాచరణాసక్తుడు. మహాతపస్సంపన్నుడైన విశ్వామిత్రుడే మేనకతో గూడి కాలగతిని మరువలేదా. పదివత్సరాలను ఒక్కపూటగా గడుపలేదా. బహుకాలం సుగ్రీవుడు స్త్రీ సుఖానికి దూరమయ్యాడు. కొండలు గుట్టలు పట్టితిరిగాడు. అనేక కష్టాలు అనుభవించాడు. ఇప్పుడు తృప్తిదీర స్త్రీ సుఖాలు అనుభవిస్తున్నాడు. ఇది పెద్దతప్పా? పరిస్థితులను అర్థంచేసుకోకుండ, యుక్తాయుక్త విచక్షణలేకుండ, సమయసందర్భాలు గమనించకుండ ఎదుటివారిమీద ఎగిరెగిరిపడటం ఏ మాత్రం మంచిదిగాదు. అందులోను నీ అంతటివానికి అసలే మంచిదిగాదు. రావణుడు మహబలసంపన్నుడు. అందుకుదోడు అతనిది అపార రాక్షససైన్యం. ఈ సంగతి ఇదివరకు వాలి చెప్పగా విన్నాను. వానరసైన్యం లేకుంటే అతనిని జయించటం ఎలా సాధ్యమౌతుందోచెప్పు. అందుకే సుగ్రీవుడు వానరసైన్యాన్ని సమీకరిస్తున్నాడు. అన్ని దిక్కుల్లోవున్న వానరులందరిని పక్షం రోజుల్లో రమ్మన్నాడు. రాకుంటే శిక్ష ఏమిటో తెలుసా. శిరశ్ఛేదం. అది సుగ్రీవాజ్ఞ! దానికి తిరుగులేదు. అపవాదం అంతకంటెలేదు. ఇదంతా మీ కొరకుగాదా? ఆలోచించు, నీ కన్నెఱ్ఱ చూచి మా అంతఃపుర కాంతలంతా ఎలా అదరిపడుతున్నారో చూడు. ఇది ఉచితమా? నీ కోపాన్ని ఉపసంహరించుకో. మంచి మిత్రుడుగా మసలుకో. ముందున్న మహాకార్యాన్ని ఆలోచించుకో' అని ఆవేశంతో అనేసరికి లక్ష్మణునికి ఊపిడిరాడలేదు. అగ్నిపర్వతంలా వచ్చిన ఆ వ్యక్తి మంచుగడ్డలా మారిపోయాడు. ప్రసన్నంగా సుగ్రీవుని వైపు చూచాడు.




కళ్ళు లేని వాళ్ళను
చూస్తున్నాం....
కాళ్ళు లేని వాళ్ళను
చూస్తున్నాం....
ఇళ్ళు లేని వాళ్ళను
చూస్తున్నాం....
తిళ్ళు లేని వాళ్ళను
చూస్తున్నాం!
ఎవళ్ళపాపం ఏమిటనే
భీతిలేని మూర్ఖజనం
కుళ్ళు పనులు చూస్తున్నాం!

కష్టాలలో క్రుళ్ళి క్రుళ్ళి
ఏడ్చుకొనే అందరికి
దేవుని కాళ్ళ శరణమనే
సత్యాన్ని చూస్తున్నాం!
ముళ్ళదారి విడిచిపెట్టి
దేవుళ్ళను కొలుచుమంటే
మానవాళి కంతటికి
వెతలు తొలగి వెలుగు కలుగు.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణ మూర్తి

అప్పుడు సుగ్రీవుడు బ్రదుకుజీవుడా అని ముందుకువచ్చాడు. మెడలోని పూలమాల త్రెంపి ఆవలపారవేసి, పరిస్థితులను వివరించి, క్షమించమని లక్ష్మణుని ప్రార్థించాడు. లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి ఆప్యాయంగా పలుకరించాడు. అనునయించాడు.

కిష్కింధకథ సుఖాంతమైంది.

అందుకు కారణం తార వ్యక్తిత్వం. ఆమె లేకుంటే - ఆ చొరవ చూపకుంటే - అంతటి నేర్పు ప్రదర్శించకుంటే కథ ఏమయ్యేదో! అందుకే వాల్మీకిమహర్షి ఆమె పాత్రనంతగా తీర్చిదిద్దాడు.

మగువల దూరదృష్టికి, మాటనేర్పుకు, ధైర్యానికి, దక్షతకు తార మారుపేరు. తారను, తమ్మునికి అప్పగిస్తూ వాలి చెప్పిన వాక్యాలు ఆమె వ్యక్తిత్వానికి నిలువుటద్దాలు.

సుషేణ దుహితా చేయ
మర్థసూక్ష్మ వినిశ్చయే
ఔత్పాతికే చ వివిధే
సర్వతః పరి నిష్ఠితా।
యదేషా సాధ్వితి బ్రూయా
త్కార్యం తన్ముక్త సంశయమ్
నహి తారా మతం కించి
దన్యథా పరివర్తతే॥

(4-22-13, 14)

రామాయణంలో ఒక మరపురాని స్త్రీపాత్ర తార.

—డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

# లక్ష్మణుని మనోనిగ్రహము

అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను విడిచిపెట్టిన వాడు మహాత్ముడు. యోగి. కామాన్ని జయించి, తన ఇంద్రియాలను తనుచెప్పినట్లు వినేలా నిగ్రహించుకునేవాడు జితేంద్రియుడు! దానికి విభిన్నంగా, ఆకలిగొన్న వానికి రుచితెలియనట్లు, నిద్రవచ్చిన వాడికి మంచమైనా, కటికినేలయినా, మిట్టపల్లాలున్నా కరుకుభూమయినా సుఖం తెలియనట్లు, కామాతురుడికి పిన్న పెద్దల తారతమ్యం తెలియదు. వానికి భయంలేదు. సిగ్గుఉండదు- అభిమానంఉండదు. అటువంటి ఇంద్రియలోలునకు తనజన్మసార్థకత చేసుకునే ఆలోచనఉండదు. కాని, నిగ్రహము కలవాడే ధన్యుడు! ఆ నిగ్రహం పూర్వజన్మ సుకృతముచేత వస్తుంది. పుట్టిన ప్రతిజీవునకూ కోరికలు సహజం. మానవుడు ఒకస్త్రీనుండిపుట్టి వేరొక స్త్రీ కోసం వెంపర్లాడతాడు. చెడుమార్గాలకోసం అన్వేషిస్తాడు దానివలన ఆమానవునిజన్మకు విలువ ఉండదు.

అన్ని జన్మలలోనూ ఉత్కృష్టమైనది మానవజన్మ! అట్టిమానవజన్మను వ్యర్థ ప్రసంగములతో వృథాచేయరాదు. హేయమైనకోరికలతో, కామవాంఛతో బ్రతుకు పతనం చేసుకోరాదు.

ఇంద్రియనిగ్రహమువల్లనే ప్రవరాఖ్యుడు వరూధినిప్రణయంలో చిక్కుకోలేదు. నేనే నిత్యాగ్ని హోత్ర పరతంత్రుడనేని నా పాదముల కంటిన పసరుపోయినపోవుగాక! నా అనుష్ఠానానికి భంగంకల్గకుండా నాయిల్లునన్ను చేర్చు! అని భగవంతుని ప్రార్థించాడు. శ్రీరామచంద్రుడు కూడ నిగ్రహవంతుడు కాబట్టే ఒకేమాట, ఒకే బాణం, ఒకే పత్నిగా సువర్ణాక్షరాలలో లిఖింపబడినాడు. లక్ష్మణస్వామి మనోనిగ్రహుడు కావునసే శూర్పణఖ ముక్కు చెవులు కోసి పంపించాడు.

ఆయన నిగ్రహం కలవారిలో అద్వితీయుడు. అజేయుడు. మొదటివాడు. ఆయన నిగ్రహాన్ని పరీక్షించాలని అన్నగారైన శ్రీరాములవారికి వనవాస కాలంలో ఓ బ్రహ్మాండమైన సంకల్పంకల్గింది. లక్ష్మణస్వామి నిగ్రహాన్ని యీ ప్రపంచానికి చాటి లోకోద్ధరణకు సూత్రధారుడైనాడు. అట్టి మహాత్మునిగురించి తెలుసుకోవడం మన ధర్మం! మానవధర్మం!

అరణ్యవాసానికి సీతాలక్ష్మణ సమేతుడై శ్రీరామచంద్రుడు ఎన్నోనదీనదములు, పుట్టలు, గుట్టలు, కొండలు, కోనేళ్ళు, అడవులు దాటుకుంటూ పద్నాలుగేండ్లు కాలం గడపడానికి తగిన స్థలాన్వేషణతో ఎంతో దూరంసాగారు. రాత్రిళ్ళు చెట్ల క్రిందపడుకుంటూ, ఆకలితీర్చుకోడానికి కందమూల ఫలములు తింటూ వెళ్తున్నారు.

అప్పటికే చాలారోజులు గడిచాయి. ఒక నాడు సీతామహాసాధ్వి నడిచి నడిచి అలసిపోయినది. ఒక పున్నాగచెట్టుకింద భర్త ఒడిలో గాఢ నిద్రపోయింది. లక్ష్మణుడు ఆయన చెంతనే కూర్చున్నాడు. ఆ సమయములో శ్రీరామునకు ఓ సందేహంవచ్చింది. భార్యను విడిచి ఇంతకాలం లక్ష్మణుడు ఎట్లు నిగ్రహంగాఉండగలుగుతున్నాడు?ఏమైనా సరే ఈతని మనోనిగ్రహాన్ని తెలుసుకోవాలనుకున్నాడు. ఆతనికి చిత్తచాంచల్యం ఉందోలేదోకూడా తెలుసుకోవాలనుకున్నాడు.

"నాయనా! లక్ష్మణా! మీవదిన గాఢ నిద్రలోనున్నది. నాకు లఘుశంక అగుచున్నది. ఆమెకు నిద్రాభంగము కలుగకుండా నీతొడపై ఆమె శిరస్సును పెట్టుకొని నేను వచ్చువరకు కూర్చో!" అని చెప్పాడు.

లక్ష్మణుడు సరే నన్నాడు. సీతా మహాసాధ్విని తనతొడపై పడుకోపెట్టుకున్నాడు. శ్రీ రాముడు బయటకు వెళ్లినాడు. ఒక చిలుక రూపముదాల్చి, సీతమ్మ నిద్రించుచున్న చెట్టుమీద వ్రాలి లక్ష్మణుని ప్రశ్నించాడు.



పుష్పందృష్ట్వా ఫలందృష్ట్వా
దృష్ట్వాస్త్రీ ముఖపంకజం
త్రీణి రత్నానిదృష్ట్వైవ
కస్య నోచ్చలతే మనః

అరముగ్గినపండు, అందమైనపువ్వు, సుందరమైన స్త్రీ తారసిల్లినప్పుడు మనిషి మనస్సు చలించదా ?

లక్ష్మణుని జవాబు :

పితాయస్య శుచిర్భూతః
మాతాయస్యపతివ్రతా
ఉభయోర్యస్సముద్భూత
స్తస్యనోచ్చలతేమనః

ఎవని తండ్రి శుచిర్భూతుడో, ఎవని తల్లి పతివ్రతాతిలకమగునో, అట్టి పునీతుల గర్భవాసమున జనించిన ఉత్తమపురుషుని మనస్సు చలనము చెందదు.

శ్రీ రాముని ప్రశ్న :

అగ్నికుండసమానారీ
ఘృతకుంభ సమఃపుమాన్
ఊరుస్థితా పరస్త్రీ శ్చేత్
కస్యనోచ్చలతే మనః ?

అగ్నికి ఆజ్యం తోడైనట్లు అందమైన అతివ పురుషునకు తారసిల్లినప్పుడు ఆ పురుషుని మనస్సు చలింపదా ?

లక్ష్మణఉవాచ :

మనోధావతి సర్వత్ర
మదోన్మత్తగజోయథా ।
జ్ఞానాంకుశేన విద్ధశ్చేత్
తస్య నోచ్చలతేమనః ॥

మదించిన ఏనుగు మదమెక్కి ఘీంకరించి యిటూ, అటూ పరుగు పెడుతుంది. దానినిమావటి అంకుశంతో పొడిచిన చెప్పిన మాటవినును. అలాగే కామాన్ని జయించలేని పురుషుని మనస్సును జ్ఞానమనే అంకుశంతో మదించిన ఆనరునిమనస్సు చలించదు.

తమ్ముని సత్సమాధానములకు, ఆయన లోని నిగ్రహితేంద్రియ శక్తికి.... అమితానంద భరితుడయాడు. చిలక రూపంనుంచి స్వస్వరూపుడై

తమ్ముడా ! లక్ష్మణా ! నీవు లోకైక వీరుడవు ! నిత్యసత్యవాదివి ! బ్రహ్మచారివి ఇక్ష్వాకకులానికి మణిభూషణం వంటివాడవు. నీవు చిన్నవాడివైనా నీలోని జితేంద్రియ శక్తికి, మనోనిగ్రహానికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను అని తమ్మునికి నమస్కారం చేశాడు శ్రీరాముడు.

హా ! లక్ష్మణ ! మహాబాహో !
సత్యవాదిన్ । మమానుజ !
ఇక్ష్వాకుకుల సంభూత ।
బ్రహ్మచారిన్ ! నమోస్తుతే !

మన ధర్మశాస్త్రంలో చిన్నవాడికి పెద్దవాడు నమస్కరిస్తే ఆయుక్షీణం అంటారు. అన్నీ తెలుసున్న శ్రీరాముడు అలా ఎందుకుచేశాడు ? అని సందేహం కల్గవచ్చు. కాని శ్రీరాముని నమస్కారం తమ్మునికి కాదు. అతనిలోని నిగ్రహశక్తికి.

అందుచేత ఉత్కృష్టమైన మానవజన్మ మెత్తిన ప్రతిమనుజుడూ మనోనిగ్రహము కల్గి ఉండాలి ! అనాడే అమనిషి జన్మకు సార్థకత ! చిన్నవాడైనా మంచిమార్గం చూపితే గౌరవించాలి !

— తాతపూడి బ్రహ్మానందశాస్త్రి



(12 వ పేజీ తరువాయి)

అందువల్ల ప్రభుడవు, పూజ్యుడవు అయిన నీకు సాష్టాంగ నమస్కారం చేసి నన్ను అనుగ్రహించ వలసిందిగా వేడు కుంటున్నాను. దేవా! తండ్రి కొడుకునీ, స్నేహితుడు స్నేహితుణ్ణీ, ప్రియుడు ప్రియురాలినీ క్షమించినట్లు నీవు నన్ను మన్నించాలి.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస!

దేవా! ఎప్పుడూ చూడని ఈ విశ్వరూపాన్ని చూసి ఆనందించాను. అయితే నా మనసు భయంతో ఎంతో బాధ పడుతున్నది. దేవదేవా! జగన్నివాసా! దయవుంచి నీ పూర్వ రూపాన్నే చూపించు, అనుగ్రహించు.

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే॥

మునుపటిలాగే కిరీటం, గద, చక్రం ధరించిన నిన్ను చూడదలచాను. వేయిచేతులు కలిగిన విశ్వమూర్తీ! నాలుగు భుజాలతో పూర్వ రూపంలోనే నాకు సాక్షాత్కరించు.

శ్రీ భగవానువాచ:

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥

శ్రీ భగవానుడు: అర్జునా! నీ మీద దయతలచి నా యోగమహిమతో తేజోమయమూ, సర్వోత్తమమూ, సనాతనమూ, అనంతమూ అయిన నా విశ్వరూపం నీకు చూపించాను. నీవు తప్ప, ఎవడూ ఎప్పుడూ ఈ రూపాన్ని చూడలేదు.

న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః
న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః।
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥

కురువీరా! నీవు తప్ప ఈ లోకంలో ఇంకెవ్వరూ కూడా వేదాలు చదవడంవల్లకాని, యజ్ఞాలు, దానాలు, కర్మలు, ఘోరతపస్సులు చేయడంవల్లకాని ఈ విశ్వరూపాన్ని సందర్శించడం సాధ్యపడదు.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥

ఘోరమైన నా యీ విశ్వరూపం చూసి భయపడకు; భ్రాంతి చెందకు. నీవు నిర్భయంగా, సంతోషంగా నా పూర్వ రూపాన్ని మళ్ళీచూడు.

సంజయ ఉవాచ:

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయా మాస భూయః।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా॥

సంజయుడు: అలా అర్జునునితో చెప్పి శ్రీకృష్ణుడు మళ్ళీ తన పూర్వరూపం చూపించాడు. ఆ మహాత్ముడు తన శాంతమైన శరీరం ధరించి భయభీతుడైన అర్జునుణ్ణి ఓదార్చాడు.

అర్జున ఉవాచ:

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః॥

అర్జునుడు: జనార్దనా! ప్రశాంతమైన నీ మానవరూపం చూశాక నా మనసు కుదుటపడింది; నాకు స్వస్థత ఏర్పడింది.

శ్రీ భగవానువాచ:

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః॥

శ్రీ భగవానుడు: నీవు వీక్షించిన నా విశ్వరూపాన్ని ఇతరులు చూడడం అతిదుర్లభం. దేవతలుకూడా ఈ రూపాన్ని దర్శించాలని నిత్యమూ కోరుతుంటారు.

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥

నీకు ప్రాప్తించిన ఈ విశ్వరూపసందర్శనం వేదాలవల్లకాని, తపస్సులవల్లకాని, దానాలవల్లకాని, యజ్ఞాలవల్లకాని లభించదు.

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

పరంతపా! విశ్వరూపుడనైన నన్ను నిజంగా తెలుసుకోవడానికి చూడడానికి, చేరడానికి సాటిలేని భక్తితోనే సాధ్యపడుతుంది.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ॥

అర్జునా! నా కోసమే కర్మలుచేస్తూ, నన్నే పరమగతిగా భావించి, నా మీదే భక్తికలిగి, దేనిమీదా ఆసక్తి లేకుండా సమస్త ప్రాణులపట్ల శత్రుభావంలేనివాడు నన్ను పొందుతాడు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "విశ్వరూప సందర్శనయోగం" అనే పదకొండవ అధ్యాయం సమాప్తం.




సంస్కృతములో ప్రతిమాలక్షణములను తెలియచేయు గ్రంథములు అనేకములు కలవు. వానిలో అత్రేయతిలకము, అను గ్రంథమొకటి కలదు. అది అత్రిమహర్షిచే రచింపబడినది. వాస్తుశాస్త్రములో అత్రి మహర్షి గొప్పవాడు. అతడు అనేకములైన వాస్తువిషయములను తెలియచేసెను. ప్రతిమాలక్షణములు తెలియచేయు చూ "జీర్ణోద్ధరణ" మను ప్రకరణములో శిథిల విగ్రహములను గూర్చి యిట్లు తెలియ చేసియుండెను.

దగ్ధా జీర్ణా చ భగ్నా చ
స్ఫుటితా చాపి దేవతా,
స్థితా వా స్థాప్యమానా వా
సదా దోషకరా భవేత్ ॥

దేవతావిగ్రహములను స్థాపించునపుడు సరిగానున్నవి లేనివి చూచుకొని స్థాపించ వలెను. కాలినవి - జీర్ణించినవి - పగిలినవి-విడిపోయినవి, చెడువిగ్రహములు గావున అవి స్థాపించిననూ, స్థాపింపబడిననూ, ప్రమాదకరములేయగును. చెడువిగ్రహములను స్థాపించరాదు-ఉంచరాదు.

దగ్ధా మర్చాం అనావృష్టిం
జీర్ణా మర్చాం ధనక్షయమ్
భగ్నా మర్చాం కులే నాశం
స్ఫుటితాం యుద్ధమాదిశేత్ ॥

కాలిన విగ్రహములను పూజించిన అనావృష్టి, శిథిల విగ్రహములను అర్చించిన ధననాశనము, విరిగిన విగ్రహములను పూజించిన వంశనాశనము, పగిలిన విగ్రహములను అర్చించిన యుద్ధభయము కలుగును.

అర్చాం వా యది వా లింగం
దేవీం మాతృగణాం స్తథా.
శీఘ్ర ముద్వాసయే దేతాన్
విధి దృష్టేన కర్మణా.

చెడిపోయిన విగ్రహములనుగాని, లింగములుగాని, దేవీవిగ్రహములుగాని, మాతృగణములకు సంబంధించినవిగాని ఏవైననూ వేదమంత్రములతో పూజించి యథావిధిగా వానిని ఉద్వాసన చెప్పవలెను. అనగా అట్టి విగ్రహములను శీఘ్రముగా తీసివేయవలెను.లేనిచో పై దోషములు సంభవించును.

వాలరజ్జుః తథా మౌంజీ
దుకూలం క్షౌమకం తథా॥
విధిరేష సముద్దిష్టః
రాజ్ఞశ్చాత్ర విధీయతే।
వృషస్య కకుదే బద్ధ్వా
ఆకర్షేత్ జీర్ణ దేవతాః॥

శిథిలవిగ్రహములను పూజించి, తలవెంట్రుకలతోగాని, ముంజగడ్డితోగాని, పట్టుతోగాని, నారతోగాని త్రాడుగాపేని, ఆత్రాటితో విగ్రహమును ఎద్దుమూపురమునకు కట్టి ఎద్దుచే లాగించి పారవేయవలెను.

శిలామయీ భవేదర్చా
తీర్థే బహూదకేషు చ
నదీ సంగమ సంస్థానే
తస్మిం శ్చైవ తు నిక్షిపేత్ ॥

రాతివిగ్రహములైనచొ నదీతీరమునకుగాని, నదీసంగమస్థలమునకుగాని, తీసికొని వెళ్ళి లోతైన ప్రదేశములో పడవేయవలెను.

సౌవర్ణీం రాజతీం చైవ
తామ్రీం చ పైత్తలీ మపి।
ద్రావయే దగ్నినా సర్వాం
యదీచ్ఛే చ్ఛ్రేయమాత్మని ॥

బంగారు-వెండి-రాగి-ఇత్తడి, విగ్రహములు చెడినయెడల వానిని వెంటనే కరిగించుట శ్రేయోదాయకము.

దారుమయీ భవేదర్చా
నవవస్త్రేణ వేష్టయేత్।
ఘృతేన మధునా స్నిగ్ధాం
దీప్తాం అగ్నౌ ప్రదాపయేత్॥

కఱ్ఱతో చేయబడిన విగ్రహములు శిథిలములైనచో నూతనవస్త్రములను చుట్టబెట్టి నేతిలోను-తేనెలోను ముంచి అగ్నిలోవేసి ఆహుతి చేయవలెను.

జీర్ణోద్ధరణ మర్చానాం
కృతం యేన మహాత్మనా।
యుగకోటి సహస్రాణి
దేవలోకే మహీయతే॥
జీర్ణోద్ధారణం కర్మ
కరణీయం మహాత్మభిః।
కర్తవ్యా వర్జనే శక్తిః
దేవలోకే మహీయతే॥

మహాత్ములు జీర్ణవిగ్రహములను పై విధముగా చేసినయెడల అనగా ఉద్ధరించిన యెడల స్వర్గలోకమును పొందుదురు.

'మద్య చాండాల స్పృష్టా వహ్నిదగ్ధా విప్రరక్త దూషితా శవపాపి స్పృష్టాశ్చ ప్రతి మా పునః సంస్కార్యాః .'

మద్యముచేత, చండాలురచేత స్పృశింపబడిన అనగా తాకబడిన, అగ్నిచే దగ్ధమైన, బ్రాహ్మణ రక్తముచే దూషితమైన, శవస్పర్శ పాపస్పర్శకల ప్రతిమలు (విగ్రహములు) మరల సంస్కరింపతగినవి.

ఖండితే స్ఫుటితే స్థాన
భ్రంశే పూజనాభావే
అశ్వ గర్దభాది స్పర్శే
పతిత రజస్వలా చోరైః
స్పర్శే చ పునః ప్రతిష్ఠా
ఖండితాం భగ్నాం విధినా
ఉద్ధృత్య అన్యాం స్థాపయేత్.

ఖండింపబడిన, బద్ధలైన, స్థానభ్రంశము చెందిన, పూజలు జరుగనప్పుడు, గుఱ్ఱములు - గాడిదలు తాకినపుడు, పతితుల యొక్క, రజస్వలా స్త్రీలయొక్క, చోరుల యొక్క స్పర్శకలిగినపుడునూ, ఛేదింప

బడిన, విరిగిపోయిన ప్రతిమను శాస్త్రవిధి ననుసరించి పెళ్లగించి నూతనమైన ప్రతిమను స్థాపించి పునఃప్రతిష్ఠ కావింపవలెను.

తామ్రాది ధాతు మూర్తీనాం
చోర చాండాలాది
స్పర్శే తామ్రాది ధాతూక్త
శుద్ధిం కృత్వా పునః ప్రతిష్ఠా.

రాగి మొదలగు లోహములతో చేయబడిన విగ్రహములను చోరులు - చండాలురు, మొదలగువారు స్పృశించిన యెడల తామ్రాది లోహములకు చెప్పబడిన శుద్ధిని చేసి మరల ప్రతిష్ఠింపవలెను.

బుద్ధిపూర్వం పూజన
విచ్ఛేదన శూద్ర స్పర్శాదౌ చ
పునఃప్రతిష్ఠయైవ శుద్ధిః.
మాసా దూర్ధ్వం పూజా విహతౌ పునః
ప్రతిష్ఠా ప్రోక్షణవిధి ర్వా కార్యః.

బుద్ధిపూర్వకముగా పూజ మానేసినను, శూద్రస్పర్శ కలిగినను మరల ప్రతిష్ఠించుటయే శుద్ధి. ఒకమాసము పూజలేకపోయిన యెడల పునఃప్రతిష్ఠగాని, ప్రోక్షణవిధిగాని, జరుపవలెను.

న చ లింగా దౌ భగ్నే దగ్ధే
వా కార్యః అయం చ అనాది
సిద్ధ ప్రతిష్ఠిత లింగాదౌ
భంగాది దోషేఽపి న కార్యః
తత్ర తు మహాభిషేకః కార్యః.

లింగములు భగ్నములైనను, దగ్ధములైనను, పునఃప్రతిష్ఠ చేయనవసరములేదు. అనాది సిద్ధముగా ప్రతిష్ఠింపబడిన లింగముల విషయమై భంగాది దోషమున్నను జీర్ణోద్ధరణము చేయనవసరములేదు. ఆ లింగములపై మహాభిషేకము చేయవలెను.

అగ్నిదగ్ధాశ్చ భగ్నాశ్చ
న పూజ్యాః ప్రతిమా గృహే,
భగ్నా వా స్ఫుటితా వాపి
సాలగ్రామ శిలా శుభా.

గృహమందు అగ్నిదగ్ధములైన, విరిగిపోయిన ప్రతిమలను పూజింపరాదు. భగ్నములైనను, స్ఫుటితములైనను (పగిలిపోయినను) సాలగ్రామములు పూజార్హములు.

దేవ భగ్న మిదం చైవ
సర్వ దోషావహం నృణామ్।
అస్యో ద్ధారే కృతే శాంతిం
శాస్త్రేఽ స్మిన్ కథితాత్వయా॥

ఓ దేవా! భగ్నమైన ఇది (విగ్రహము) మానవులకు సర్వదోషములను కలిగించును. దీనిని ఉద్ధరించినయెడల శాంతికలుగునని శాస్త్రమందు నీచే చెప్పబడినది.

జీర్ణోద్ధార విధానం చ
నృప రాష్ట్ర హితావహమ్॥

శిథిల విగ్రహములను ఉద్ధరించుట వలన ప్రభువులకు, రాష్ట్రప్రజలకు శుభము చేకూరును.

— చలమయ్యశాస్త్రి



## నివేదనము

కలియుగమందు భక్తజన కాంక్షితముల్ సఫలీకృతమ్ముగా
పిలిచిన పల్కు దైవమవు; వేంకటనాయక! దీనబాంధవా!
అలజడి వాపి ప్రోచు కరుణాబ్ధి! ననున్ కడగంటి చూపుతో
నిలువరఁజేసి నీచరణ నీరజసేవ ననుగ్రహింపుమా!

ప్రాంజలిఁబూని నీయెదుట భక్తివినమ్రుఁడనౌచు నిల్చితిన్
నెంజిలిఁబాపి నాయెడల నేరములన్నియు విస్మరించి, న
న్నుంజరితార్థుఁజేయుము మనోరథముల్ సుమనోహరమ్ములై
క్రొంజిగురుల్ వెలార్పఁబరిగొంచుఁగృపారస మొల్కఁబోయుచున్

డుల్లంజేయుముపాపసంచయము నాటుంబోటులన్మాన్పి, సం
ధిల్లంజేయుము సాదుభావముల సాధిష్ఠంబుగా నిచ్చలున్
కల్లోలమ్ములు జీవితాంబునిధిపీఁగంజేసి వాసింపగా
కొల్లల్కొల్లలు శోభనమ్ములను నాకుంగూర్చి రక్షింపుమా!

తిరుమలవాస! నాయెదగదింపుము నీపదపంకజమ్ములన్
వెరపునలగ్నమై సుగమవేద్యముగాఁబరమార్థచింతనన్
బరగువిధాన- మాన్యపథవర్తనొనర్పుము- ధన్యుఁజేయుమా!
పరిపరివేఁడెదన్ పరమపావన! దైవమ! వేంకటేశ్వరా!

స్థిరచిత్తమ్మును, గల్పనాపటిమయున్, ధీశక్తియున్, రక్తియున్
పరమోదారత, సత్యదర్శనము, భావస్ఫూర్తియున్, సారతా
స్ఫురణమ్మున్, సదసద్వివేచనము, నాభోగమ్ము, నానందమున్
కరుణాసాగర! నీప్రసాదమునఁగల్గన్ నేను కాంక్షించెదన్

— కరుటూరి సత్యనారాయణ

# దోషారోపణ

— శైవ. మహానందయ్య

ఇతరులతప్పులను ఎత్తిచూపుట రజోగుణ చిహ్నము. పరులదోషములనే ఎన్నుటకు అలవాటుపడినవాడు శ్రేష్ఠమగు సత్వగుణమును కోలుపోవును. ఇట్టివాడు మంచిలో కూడా చెడునే చూచును. తన తప్పులను దిద్దుకొనుటకు యత్నించడు. అతనిమనస్సు మలినమైపోవును. కాలక్రమమున ఆ దోషమే అతనియందు నెలకొని కరడుకట్టుకొని దీర్ఘకాలముండుటవలన, ఆ దోషమే ఉజ్జీవితమై అధికబలసమన్వితమై క్రొంగ్రొత్త పోకడల పోవును.

మనకు ఇతరులలో దోషాన్వేషణదృష్టి ప్రబలమైనకొలది నిజమైన దోషములను గుర్తించుశక్తి సన్నగిల్లును. ఆ పిమ్మట మనదోషములు మనకు వ్యథాకరంబులుకాక హితంబులగుచుండును. ఇతరులయందు దోషారోపణ చేయుటకు అలవాటుపడిన వానికి లోకమంతయు దోషపూరితముగనే గోచరించును.

" తప్పులెన్నువారు తండోపతండమ్ము
ఉర్విజనులకెల్లనుండు తప్పు
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు."

ఇందుసత్యము ఎంతయేనికలదు. ఇతరులు మనదోషములు వెల్లడిచేయుటకు ఇష్టపడని వారిని మనశత్రువులుగా భావించి, ఆగ్రహించి వారికి కీడుచేయుటకుయత్నింతుము. మనము మనదోషములను వెల్లడించువారికి భయపడుచుందుము. మన దోషకార్యముల విమర్శించు వారిమధ్య చరించితిమేని, భావిని అట్టిపనులను చేయుటమాని రాణింపగలుగుదుము.

# యువవాణి

సూర్య చంద్రనక్షత్రాదుల ప్రకాశము మొదలు పెంజీకటి వరకును చూచిగ్రహించుటకు నేత్రమునకు నేర్పరితనమున్నది. కాని అది తనకంటిలోని నలకనుతాను చూచుటలేదు. ఆరీతిగనే కొందఱు యితరుల దోషములనుచూచి విమర్శింతురుకాని తమ దోషములనుచూచి దిద్దుకొనజాలకున్నారు. నిర్మలమగు అద్దములో తనకంటిలోని నలకను చూచి తీయవచ్చును. అట్లే నిర్మలమగు హృదయముద్వారా తనలోని తప్పులను గ్రహించి దిద్దుకొన్నయెడల తన నిజస్వభావమునుగాంచి శాంతినొందవచ్చును. మనహృదయములందు దాగియున్న పెక్కుదోషాలనుముందు నిర్మూలించుకొనిన చాలును. తనతప్పుతాను తెలుసుకొన్నవాడే ధన్యుడు. ఇతరుల దోషములను లెక్కింపపనిలేదు. దానివలన ప్రయోజనము ఇసుమంతయులేదు.

గీ॥ దర్పణమునందువలె తన తప్పులెల్ల
నాత్మగోచరమగుచుండనరుడుసతము
బరులలోపంబులెత్తిడఁబాటుపడును
యాత్మవంచన మది యంచునరయు
మనస !

" Never talk about the faults of others; no matter how bad they may be. Nothing is gained by that. You never help one by telling about his faults, but you do him an injury and injure yourself as well."

Swami Vivekananda.

చ॥ ఇతరుల దోషమెంచి తమ హేయగుణంబుల బూతవేయుప
ద్ధతి ధర యంతటన్ సహజధర్మము దీనినెయాశ్రయింప నీ
గతి యది దుర్గతింగనుటగా మది నెంచియు సుంతయోచనా
రతి స్వ పరత్వమున్ దుడువ రంజిలగల్గదె ముక్తి చిత్తమా !

## మతత్రయం

"దేహబుద్ధ్యాస్మి దాసోఽహం;
జీవబుద్ధ్యా త్వదంశకః;
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం;
ఇతి మే నిశ్చితా మతిః॥"

"దేహబుద్ధితో ఆలోచిస్తే నేను నీకు సేవకుణ్ణి; జీవబుద్ధితో యోజిస్తే నేను నీ అంశను పంచుకొని పుట్టినట్టి వ్యక్తిని. ఆత్మబుద్ధితో అనుశీలిస్తే - నీవే నేను."

ఈ మాటలు ఆంజనేయుడు శ్రీరామునితో అన్నట్లు పై సుప్రసిద్ధ శ్లోకప్రోక్తం.

వేదాంతజగత్తులో శ్రీరామాంజనేయ సంవాదంగా ప్రసిద్ధికెక్కిన పై శ్లోకంలో మతత్రయ తత్త్వచింతన మనోహరంగా ప్రస్తరింపబడింది.

భారతీయ దార్శనిక ప్రపంచంలో, శంకరాచార్యులవారు ప్రతిపాదించిన- "అద్వైతం," రామానుజాచార్య ప్రోక్తమైన- "విశిష్టాద్వైతం," మధ్వాచార్య నిగదితమైన- "ద్వైతం" మతత్రయంగా పేరుకెక్కాయి. "వేదాంతం" అనే మాట పై మూడు సిద్ధాంతాలకు సమష్టిగా వర్తిస్తుంది. పై మూడు మతాలు

- ప్రస్థానత్రయాన్ని -

ఉపనిషత్తులు - భగవద్గీత - బ్రహ్మసూత్రాలు ప్రామాణికంగా అంగీకరిస్తాయి. మూడూ వైదిక మతాలే.

హైందవులలో వివాహాది శుభకార్యాలు జరిగినప్పుడు, ఉత్సవ సమయాలలో "మతత్రయ తాంబూలం" సమర్పించటం ప్రాచీనాచారం. ఈ సంప్రదాయం పలు చోట్ల ఇప్పటికీ అమలులో ఉంది. అనగా, స్థూల దృష్టికి, మతత్రయం-

అద్వైత - విశిష్టాద్వైత - ద్వైతాలు విభిన్నంగా కన్పించినప్పటికీ - సూక్ష్మ దృష్టికి - మతత్రయంలో అంతర్వాహినిగా ప్రవహించే ఐకమత్యం సమన్వయ వేదాంతులకు సుగమం.

ఆధునిక యుగంలో సర్వమత సమన్వయ సంధాతగా పేరుకెక్కిన రామకృష్ణ పరమహంస-మతత్రయతత్త్వం ప్రతిబింబించే హృదయంగమమైన ఉదాహరణకథ- పలుసారులు చెప్పేవారు. ఆ కథ శీర్షిక "సముద్రము - ఉప్పుబొమ్మ". మాట వరుసకు సముద్రం - ఉప్పుబొమ్మ దూరంగా ఉన్నాయనుకుందాము. సముద్రము వేరు. ఉప్పుబొమ్మ వేరు. ఇది ద్వైతం. ఆ ఉప్పుబొమ్మ - సముద్రతరంగాల దగ్గరగా చేరిందనుకుందాము. సముద్రజలం - ఆవిరియైనప్పుడు మిగిలేది ఉప్పే. అట్టి ఉప్పుతో తయారయినది ఉప్పుబొమ్మ.

ఇది విశిష్టాద్వైతం. విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రకారం-పరమాత్మ సమస్తకల్యాణ గుణ సంపన్నుడు. జీవాత్మకూడ - పరమాత్మ యొక్క కల్యాణగుణాలను సంతరించుకొని తత్తుల్యుడు అవుతాడు. అందుచే - జీవాత్మ పరమాత్మ అంశమే.

# వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

ఇక - ఆ ఉప్పుబొమ్మ సముద్రంలో పడితే ఏమవుతుంది? ఆ ఉప్పునీటిలో కరగిపోతుంది. ఇక సముద్రానికి-ఉప్పుబొమ్మకూ అభేదాధ్యవసాయం సిద్ధిస్తుంది.

అది అద్వైతం.

"ఏకం సత్ - విప్రాః బహుధా వదంతి"

ఉన్న సత్యం ఒక్కటే.

అయితే విజ్ఞానులు దానిని అనేక రీతులలో అభివర్ణిస్తారు-" అని ఉపనిషత్తులు చెప్పే తీర్పు.

"ఏకం జ్యోతి ర్బహుధా విభాతి"

అని అథర్వవేద సూక్తి.

అయితే - మూడు విభిన్నపథాలుగా భాసించే మతత్రయంలో ఏది సత్యం? అనే ప్రశ్న - సమన్వయం అవగాహన చేసుకోలేని సామాన్యులు వేయుటం సహజం.

సనాతన భారతీయ సంస్కృతిలో సుప్రసిద్ధమైన ఒక చిన్నగాథ, విప్రతిపన్నాలుగా పైకి గోచరించే వ్యాఖ్యానాలు అన్యోన్యవైరుధ్యంలోనే సత్యం ఇమిడి ఉండవచ్చునని ప్రతిపాదిస్తోంది. ఒకసారి, దేవతలు - దానవులు - మానవులు ప్రజాపతి దగ్గరకూ వెళ్లారట! వారి అందరకు ప్రజాపతి చేసిన తారకబోధ ఒకటే! అది-"ద"- అనే అక్షరం.

దేవతలు "ద"కు చేసిన వ్యాఖ్యానం ఇవి: "మనం దేవతలం. నిత్యభోగులం. విషయ వ్యామోహవిలోలులం. నిత్యయౌవనులం. సదా కాముకులం. అందుకే ప్రజాపతి మనకు ద = "దమం" ఆవశ్యకం అని ప్రబోధించాడు."

ఇక దానవులు చేసిన వ్యాఖ్యానం! "మనం రాక్షసులం. తీవ్రకోపనులం. దయాదాక్షిణ్య విరహితులం. హింసా దౌర్జన్య ప్రవృత్తి మనలో ప్రకోపించి ఉంటుంది. ప్రజాపతి మనకు "ద" అంటే "దయ" ఉండాలి అని ప్రబోధించాడు." ఇక మానవులు చేసిన వ్యాఖ్యానం: "మనం మానవులం. మనలో కామక్రోధ మోహ మద మాత్సర్యాలు కరడుకట్టాయి. ఈ సృష్టిని ఈషణత్రయం నడుపుతోంది. పక్షులలో దారేషణ - పశువులలో పుత్త్రైషణ, మానవులలో ధనేషణ ప్రబలాలు. మానవునికి ధనార్జన చేయుటమే పరమావధి. అందుచే మనం స్వార్థపరాయణులం అయ్యాము. "ద"అంటే దానం. ప్రజాపతి మానవులకు తరణోపాయం "దానం" అన్నాడు."

ఆ వాదోపవాదాలలో ఏది సత్యం? సుదీర్ఘచర్చల అనంతరం దానవులు - దేవతలు - మానవులు ప్రజాపతి దగ్గరకే వెళ్లి, పై మూడు వ్యాఖ్యానాలలో ఏది నిజమో తేల్చి చెప్పమన్నారు.

ప్రజాపతి మూడు వ్యాఖ్యానాలు సత్యమే అని తీర్పుచెప్పారు!

మానవులలోని అవస్థా తారతమ్యాలను బట్టి - ఆధ్యాత్మిక పరిణామ వికాసం బట్టి, మతత్రయ ప్రబోధాలు, మూడూ సమాన సత్యాలు అని సమన్వయించవచ్చు. ఆ సమన్వయమే ఆంజనేయుడు పై శ్లోకంలో శ్రీరామునకు నివేదించాడు. ఆ శ్లోకానికి తెలుగులో స్వేచ్ఛానువాదం.

దేహబుద్ధితోడ తెలియ దాసుడ నీకు;
తావకాంశ నేను జీవబుద్ధి;
ఆత్మబుద్ధితోడ అరయ నీవే నేను;
నిజము పలుకువాడ నిశ్చయించి.



# ఇహం - పరం

- డి. గోపాలకృష్ణమూర్తి.

ఇహం అంటే ఏమిటి? ఈ లోకంలో అంటే భూలోకంలో బ్రతకటం. బ్రతకటం అంటే తిండి, గుడ్డ, ఇల్లు కావాలి. అంతేకాదు స్నేహం, ప్రేమ, తోడు, సలహాలు ఈ విధంగా మానవ జీవితానికి చాలా కావాలి. మనతోటి వారితో ఎలా మెలగాలి అనేది మొదటి ప్రశ్న? లోకో భిన్నరుచిః అని ఎవరి సుఖాన్ని వారు కోరుకుంటారు. సుఖం కోసం (కోరికలు) స్వార్థం. దీన్నే కామ, క్రోధ, మద, మాత్సర్యాలు అన్నారు. సరే జనాలు పుడుతున్నారు, పెరుగుతున్నారు. సుఖాలు అనుభవిస్తున్నారు. ఇక్కడ మన మనుభవించే సుఖాలకు, స్వార్థానికి ముగింపు కలుగుతున్నది. చనిపోయిన తరువాత ఏ మవుతారు. మన డబ్బు, ఇల్లు, బంధువులు మనవెంట రావటం లేదు. ఆదిమానవుల కాలంలో కూడా దేవుడున్నాడను కుంటే వారి వారి కష్టాలను తలచుకొంటే వారికి దేవుడు ఏమి సహాయం చేసినట్టు కనపడదు. జడ, చేతనకలయికతో ఏర్పడిన ప్రకృతి, సృష్టి వలయము తన పనిని తాను చేసుకొంటూ పోతుంది గాని, మానవజాతికి సహాయకులుగా కనబడుట లేదు. ఎందుకంటే ప్రకృతికి మానవజాతి ఎంతో రాయి, రప్పా కూడా అంతే, మంచి ఎంతో-చెడూ అంతే. ఇంకా లోతుగా ఆలోచిస్తే మనిషి కూడా ప్రకృతే గనుక ఈ నీరు; నిప్పు, గాలి ఎట్లా, జడచేతనాల కలయికో అట్లాగే మనిషి కూడా ప్రకృతే గనుక జడ రూపమయిన శరీరానికి దృశ్య రూపమైన ప్రకృతి గోచరిస్తున్నది. గాని ఆత్మకు గాదు. అంటే విశ్వమంతా ఒకటే. ఇక సహాయం చేసిందేమిటి. ప్రకృతి పరిణామం అంటే జీవపదార్థ మార్పులే (దేవుడు) మనకు కూడా వర్తిస్తుంది. నీరు గాని, నిప్పు గాని శరీరాన్ని నశింపచేస్తాయేగాని-ఆత్మను గాదు. ఈ ఆత్మకు తాను చైతన్య రూపమైన పరమేశ్వర రూపమని తెలియదు. జడ రూపమైన శరీరంలో వుండి, శరీరాన్ని ప్రేమిస్తు ప్రకృతిలోని జడత్వాన్ని చూస్తున్నాడు గాని, చైతన్యాన్ని చూడటం లేదు. దీన్నే పరం అంటాం మనం. అసలు బౌద్ధులు జడ, చైతన్యాలే గాని దేవుడు లేడంటారు. చైతన్యమే దేవుడు. సృష్ట్యాదిలో ఏర్పడిన జీవ పదార్థమే మార్పులు, చేర్పులు పొందుతున్నవి. అదే జీవుల పుట్టుక, సృష్టిచక్రం, పరిణామం. ఈ జీవరూపాన్ని వర్ణించటానికి వేదాలు, పురాణాలు, మత గ్రంథాలు, మంత్రాలు, మనం గూడా సృష్టి రూపమే గదా. మరి మనలో దేవుడెక్కడున్నాడు అంటే గుణాలలో మంచి గుణాలు దేవునివి, చెడ్డ గుణాలు రాక్షసులవి. మానవుల రూపం ఒకటయినా గుణాలు వేరువేరుగావున్నాయి. అన్నం నుంచి గుణాలు, గుణాల నుండి సమాజం నడుస్తున్నది. అద్వైతులంటారు అసలు ఏమి లేదని. ఒక చెట్టును తీసుకొందాం. చెట్టు ఎండిపోయి కట్టె అవుతుంది. తరువాత బొగ్గు, తరువాత వాయువు, ఇట్లా విశ్వంలోని అన్ని వస్తువుల ప్రథమ రూపం వాయువు. కాని ఇట్లా ఆలోచించుకుంటూ పోతే జీవించాలనే కోరికే వుండదు. కారణం గుణాల వల్లనే గదా మనం నడుస్తున్నది. దానికై జీవన పరిమితిలో చట్టాలు, విద్యా, జ్ఞానం పరిపాలన మొదలయినవి ఏర్పరచుకోవాలి. ఇవి ఇహానికి అవసరం. ఇక పరానికివస్తే, మనం దేవునిరూపమే అంటున్నాము అద్వైతంలో. దేవుడంటే శుద్ధుడు. ధర్మము లోను, సత్యం లోను మిగిలిన ఉత్తమగుణాల లోను వుంటాడు. అంటే మంచి దేవుడు, చెడు రాక్షసుడు. అంటే మనకు దేవునకు కూడా గుణాలలోనే కనిపిస్తున్నవి. కనుక మనం ఇహంలో పరంకొరకు మంచిని పెంచుకోవాలి. దాన్నే పుణ్యం అంటున్నాము. చెడునే ప్రారబ్ధం అంటున్నాము. భూతదయ, ధర్మపాలన, మృదు భాషణ ఇత్యాది ఉత్తమగుణాలు మనల్ని దేవునికి దగ్గరగా చేరుస్తాయి.

రావణుడు మహాజ్ఞాని, దేవుని స్వరూపం తెలుసు. ప్రకృతి లోని జడ ప్రేరేపణ వల్ల కోరిక లుత్పన్నమవుతున్నాయని తెలుసుకొని చెడును వరించి రాక్షసుడై పతనమయ్యాడు. కనుక ఈ విశ్వమంతా ఏక పదార్థము. దానిలోని చెడు అంతా జడరూపం పొందింది. చైతన్యము పరమేశ్వరరూపమై నిలిచింది. పరమేశ్వరరూపం మంచి గుణాలు. ఈ మంచిని పెంపొందించుకోడానికే భజనలు, ప్రార్థనలు, దేవాలయాలు. ఇహంలో మరణం వరకు జీవించాలి. పరం కొరకు మంచిగా జీవించడానికి ప్రయత్నించాలి.

ధర్మం శనైః సంచిను యా
ద్వల్మీక మివ పుత్తికాః।
పరలోక సహాయార్థం
సర్వ భూతాన్య పీడయన్॥

ఏ ప్రాణికి పీడ కలిగించరాదని వేద వాక్యం. మనం సమాజంలో మంచిగా బ్రతకాలంటే ఉత్తమమైన సమాజం కావాలి. ఉత్తమమైన సమాజం మనమే ఏర్పరచుకోవాలి. దేవుడనే పదార్థంలోకి మనం గూడా వస్తాము గనుక.

అమాయయైవ వర్తేత
కథంచన హి మాయయా।
బుధ్యేతారి ప్రయుక్తాంచ
మాయాం నిత్యం సుసంవృతః॥

నిష్కల్మషంగా వుండాలని ఆర్య ఉవాచ. మనం తెలుసుకోవాలసినది ఏమి లేదు. అంతా మన పూర్వులే గ్రంథ రూపాలలో మన కందించారు. అది తెలుసుకుంటే చాలు మనం.

ఇంతకూ మంచి సమాజానికి దుష్టశిక్షణ అవసరం. దానికై సాక్షాత్తు విష్ణువు శ్రీనివాసునిగా తిరుమల కొండపై వెలసియున్నాడు. *

# హిందూ సంస్కృతికి మూలాధారములు

ఆర్యజాతికి ధర్మమే ప్రాణము. ఆర్యులకు ప్రాణస్వరూపమైనది హిందూధర్మము. పూజ్యపాదులగు మహర్షులు సనాతన హిందూ ధర్మమును పదునారు ప్రధానాంగములుగ విభజించినారు. ఈ అంగములే హిందూ సంస్కృతికి మూలాధారములు.

మొదటి యంగము : ధర్మానుకూలమగు శారీరక వ్యాపార రూపమగు సదాచారము.

రెండవ యంగము : ఆత్మ వైపు తీసికొని వెళ్లెడు ఆలోచనలన్నీ సద్విచారము అని చెప్పబడును. ఆర్యజాతి శిఖా సూత్రములను ధరించును. శిఖ యున్నప్పుడు శరీరము దేవమందిర మగును. శిఖా బంధన సమయమున బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ధ్యానింప బడుదురు. సూత్రములో నున్న మూడు ముడులు అధ్యాత్మశుద్ధిని, అధిదైవశుద్ధిని, అధి భూతశుద్ధిని తెలియజేయును.

మూడవ యంగము : సనాతన ధర్మమునకు వర్ణ ధర్మము ముఖ్యము. జాతి శుద్ధి రజోవీర్యశుద్ధి పైననే ఆధారపడియుండును.

నాల్గవ యంగము : జాతి యొక్క ఈ శుద్ధి తల్లులసతీత్వధర్మ పాలనముపై పూర్తిగా ఆధారపడి యుండును. అందుచేతనేఆర్యస్త్రీలలో సతీత్వమునకు ప్రాధాన్యమీయబడినది.

ఐదవ యంగము : ఆశ్రమధర్మములు హిందూ జాతికే సంబంధించి యుండును. బ్రహ్మచర్యమున ప్రవర్తింపవలసిన శిక్షణ యీయబడును. గార్హస్థ్యమున ధర్మానుకూలమైన ప్రవృత్తి కల్గించబడును. వానప్రస్థమున నివృత్తిమార్గము నేర్పబడును. సన్యాసమున నివృత్తిమార్గము ఆచరింప చేయబడును. వీని వలననే మనుష్య జీవితము సార్థకత చెందును.

ఆరవ యంగము : మానవుడు దైవ జగత్తుపై విశ్వాసము కల్గి యుండ వలెను. అనంతకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీ భగవానుడు ప్రతినిధిగా నుండి సృష్టి కార్యమున బ్రహ్మను, రక్షణ కార్యమున విష్ణువును ప్రళయ (సంహార) కార్యమున శివుని నియోగించెను. మఱియు అష్ట వసువులను, ఏకాదశ రుద్రులను, ద్వాదశ ఆదిత్యులను వారి వారి పదములయందు నియోగించెను. మరొకవైపు ఋషిగణము జ్ఞానరాజ్యమును, 'అర్యమా' మొదలగు పితృగణము స్థూల రాజ్యమును నడుపు చుందురు. పూర్వజన్మార్జిత కర్మలననుసరించి సుందర శరీరము, వికృత శరీరము, అంధత్వము, బధిరత్వము మొదలగు వానిని పితృగణమే మాతృగర్భమున సృజియించును. ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజ మొదలగు భూతసృష్టిని దేవగణము చేయును.

ఏడవ యంగము : దైవీ శక్తిపై స్థిర విశ్వాసముంచి భగవానుని అవతారములపై విశ్వాసము కలిగి యుండవలెను.

ఎనిమిదవ యంగము: హిందువుల ఉపాసనా పద్ధతి యోగ మూలకము భక్తి మూలకమునై యున్నది. యోగమార్గము స్థూల ధ్యాన మూలకమగు మంత్రయోగము, జ్యోతిర్ధ్యాన మూలకమగు హఠయోగము, బిందుధ్యానమూలకమగు లయయోగము అను నాల్గు విధములుగ నున్నది. ఇందే హిందువుల ఉపాసనా ప్రణాళిక చాల విస్తారముగనున్నది.

తొమ్మిదవ యంగము : మూర్తి మొదలగు పదునారు విధములైన దివ్య దేశములందు పీఠ స్థాపన చేసి, సర్వ వ్యాపకుడగు భగవానుని సత్తు నుపాసించుట హిందూ ధర్మములోని ముఖ్యవిషయము.

పదవ యంగము : ఇందు శుద్ధాశుద్ధ వివేకము, స్పర్శా స్పర్శ వివేకము వివరింప బడినది. జీవాత్మ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ అను పంచకోశములతో ఆచ్ఛాదితుడై యుండును. శుద్ధి, అశుద్ధి, స్పర్శ, అస్పర్శ అను విచారముల ద్వారా పంచకోశ పవిత్రతను సంపాదించుచు చివరకు ఉన్నత సాధకుడై ముక్తుడగును.

పదునొకండవ యంగము : హిందువులు యజ్ఞములందు, మహాయజ్ఞములయందును విశ్వాసము కలిగి యుండవలెను. సాధకుడు తన ఐహిక పారలౌకిక కళ్యాణమునకు చేయు

## ఉన్నాడు దేవుడు

దైవాన్ని దూషించడం
ఆత్మవంచన కంటే ఘోరం!
దేముడు లేడనడం
పచ్చి అవకాశ వాదం!
వేడి, వెలుగూ, గాలీ, నీరూ
ఎవరెక్కడినుండి తెచ్చిపెట్టారు?
పాంచ భౌతిక శరీరం
పటాపంచలు కాదా
అవి లేకుంటే!

కోటాను కోట్ల గ్రహాలు,
ఉల్కలూ, తోకచుక్కలూ,
అనంతమైన విశ్వాంతరాళం,
అందులో ఒకటైన ఈ భూమి,
వీటన్నిటి నిత్య పరిభ్రమణాలూ,
అంతా చిత్ర విచిత్రం!
ఆ దయామయుని చిద్విలాసం!!

— కొండ్రాజు. వి. రామారావు

ధర్మ కార్యమును 'యజ్ఞము' అందురు. లోక కళ్యాణమునకు చేయబడు ధర్మ కార్యమును 'మహా యజ్ఞము' అందురు. ఇది ఐదు విధములు. ఋషుల తృప్తికై చేయబడునది బ్రహ్మ యజ్ఞము. దేవతల తృప్తికై చేయబడునది దేవ యజ్ఞము. పితృ దేవతల తృప్తికై చేయబడునది పితృ యజ్ఞము. భూత తృప్తికై చేయబడునది భూత యజ్ఞము. మానవజాతి తృప్తికై చేయబడునది నృయజ్ఞము. ఈ పంచ మహా యజ్ఞములు ఆర్యజాతికి నిత్య కర్మలు.

పంద్రెండవ యంగము : ప్రతి మానవుడు వేదములయందు, వేద సమ్మతములైన స్మృతి, పురాణ, తంత్రాది శాస్త్రములయందు స్థిర విశ్వాసము కల్గి యుండుట అవసరమై యున్నది.

పదమూడవ యంగము: కర్మ, కర్మ బీజము,—వాని క్రియలు, ప్రతి క్రియలు— అను వాని పట్ల దృఢ విశ్వాసము నొంది యుండ వలెను.

పదు నాల్గవ యంగము : మనుష్యులు జన్మాంతర వాదముపై విశ్వాసముంచ వలయును. మనుష్యుడు మానవలోకమునకు వచ్చి జాతి, ఆయు, భోగ, ప్రవృత్తి, శక్తి, సంస్కారముల ననుసరించి తన కర్మఫలము ననుభవించును. తర్వాత ప్రేతాది లోకముల లోనికి పోయి మరల మరల ఈ మర్త్యలోకమునకు వచ్చును. అట్టి జీవునకు సహాయము చేయుటకై బహువిధ శ్రాద్ధ, తర్పణ, దాయ, భాగవిధులను స్మృతి కర్తలు విధించి యున్నారు.

పదునైదవ యంగము : నిర్గుణ సగుణ ఉపాసనలకు సంబంధించిన విధులు హైందవ శాస్త్రములందు అధికముగా చెప్ప బడి యున్నవి.

పదునారవ యంగము : జీవుడు కైవల్య ప్రాప్తి నొందు విధమే యిది.

మానవులందరును హిందూసంస్కృతిని బాగుగా గ్రహించి, హిందూ ధర్మాచరణము నందుఆసక్తులై యుండుటఅత్యావశ్యకము.

—ఆర్. వేంకటేశ్వర్లు.





# ధర్మ రక్షణ కార్యక్రమాలు

## బ్రహ్మోత్సవములు

15-2-84 నుండి గుంటూరులోని శ్రీరమా సత్యనారాయణస్వామి దేవాలయంలో బ్రహ్మోత్సవాలు ప్రారంభమయ్యాయి. ఆరోజు సాయంత్రం శ్రీమాన్ పరాశరం వీరరాఘవాచార్యులుగారు వశిష్ఠులుగా వుండి విష్వక్సేన పూజాది కార్యక్రమాలను నిర్వహించారు. శ్రీమాన్ అగ్నిహోత్రం శోభనాచలం నరసింహాచార్యులు దంపతులు త్రయాహ్నిక దీక్షను జరిపించారు. హిందూధర్మ రక్షణసంస్థ, గుంటూరు కేంద్రం కార్యక్రమ నిర్వాహకులు శ్రీ బొడ్డపాటి దుర్గాప్రసాద్‌గారు హిందూధర్మాన్ని గురించి, అందుకోసం తి. తి. దేవస్థానం వారు చేస్తున్న విశేషప్రచారాన్ని గురించి సంగ్రహంగా భక్తులకు తెలియజేశారు. తదనంతరం శ్రీ యాళ్లభండి తాతారావు భాగవతార్‌గారు 'భక్తమీరాబాయి' హరికథా కాలక్షేపం చేశారు.

16-2-84 సాయంత్రం వేదపాఠశాల విద్యార్థులు వేదప్రవచనం చేస్తుండగా మరోప్రక్క స్వామివారి కల్యాణమహోత్సవం ఘనంగా జరిగింది. 17-2-84 ఉదయం గరుడవాహనంపై నగరంలో శ్రీవారి ఊరేగింపు జరిగింది. ఆరోజు రాత్రి శ్రీ ఎస్.కె. సైదులు బుఱ్ఱకథా దళముచే వీరాభిమన్యు కథాగానం జరిగింది.

18-2-84న అంజనేయస్వామికి అభిషేకం, భక్తుల సామూహిక చాలీసా పారాయణం జరిగాయి. ఆ రోజు సాయంత్రం యజ్ఞవాటికలో ద్వాదశ ప్రదక్షిణలు నిర్వహింపబడ్డాయి. ఆ వేదికపై పౌరాణిక శిరోమణి శ్రీ నోమాసి బాలగంగాధరశాస్త్రి (తి. తి. దే. పౌరాణికులు) పురాణప్రవచనం చేశారు.

ఈ విధంగా ఆ నెల 25వ తేదీ వరకు ఈ కార్యక్రమాలు నిర్విరామంగా కొనసాగాయి. ఈ కార్యక్రమాల నన్నింటిని స్వయంగా పర్యవేక్షించిన దేవాలయ ప్రధాన ధర్మకర్త శ్రీ దశిక రామారావు, తి. తి. దే. వేదపారాయణంసంస్థవారు, శ్రీ అన్నదానం అన్నేశ్వర సోమయాజులు ఈ మహోత్సవాలు జయప్రదంగా ముగియడానికి దోహదం చేశారు.

## ధర్మరక్షణసంస్థ, నెల్లూరు

ఫిబ్రవరి 7వ తేదీ తి. తి. దే. కల్యాణ మండపం నెల్లూరులో ధర్మరక్షణసంస్థ ఆధ్వర్యంలో నిర్వహించబడిన శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి "వాల్మీకి - కంబరామాయణముల పోలిక" అను ధార్మికోపన్యాసం పలువురి ప్రశంసలనందినది.

ఫిబ్రవరి 20న నెల్లూరుజిల్లా వరకవిపూడి "ఓంకార ఆశ్రమం"లో మాతా కె. నారాయణమ్మ ఆధ్వర్యంలో ధార్మికకార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. ఈ సందర్భంగా 22వ తేదీన సంగీత, హరికథ మున్నగు సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటుచేయబడ్డాయి.

( 47వ పేజీలో )

[ 4వ పేజి తరువాయి ]

సిద్ధాంతుల సమక్షంలో నూతన సంవత్సర శుభాశుభములు, గ్రహముల తీరుతెన్నులు, వారివారి కందాయఫలములు స్థూలముగా తెలుసుకొని తదనుగుణముగా నడచుకొనుటకు నాడే అంకురార్పణము గావించవలెనని చెప్పబడినది.

ఉగాదినాటి పంచాంగ శ్రవణఫలము గంగాస్నానముచేసినంత పుణ్యప్రదమని వ్రతగ్రంథములు తెలుపుచున్నవి.

"సూర్యశ్శౌర్య మధేందు రింద్రపదవీం."

అనే శ్లోకములో ఉగాదినాడు పంచాంగ శ్రవణం చేసినవారికి సూర్యుడు శౌర్యాన్ని, చంద్రుడు ఇంద్రసమానవిభవాన్ని, కుజుడు శుభాన్ని, శని ఐశ్వర్యాన్ని, రాహువు బాహుబలాన్ని, కేతువు కులాధిక్యతను, కలుగజేస్తారని చెప్పబడినది.

## ధ్వజారోహణం

ధ్వజారోహణమునే 'పతాకప్రతిష్ఠాపన' అనికూడ అంటారు. ఈ ఆచారము ఆంధ్రప్రదేశ్‌లో అంతగా వాడుకలోలేకున్నా మహారాష్ట్రీయులలో అధికప్రాధాన్యము వహించియున్నది. కొన్ని చోట్ల ఇంద్రధ్వజ ప్రతిష్ఠాపన బ్రహ్మధ్వజ ప్రతిష్ఠాపన జరుపబడును.

ఒక పట్టువస్త్రాన్ని, ఒక వెదురుగడకు పతాకమువలెకట్టి దానిపై నారికేళముంచబడిన కలశాన్ని ఉంచుతారు. ఆ కర్రకు మామిడి ఆకులు, నింబపత్రాలు, పూరతోరణాలు కట్టుతారు. ఈ ఆచారము శాలివాహన కాలం నుండి ప్రభువుకు కృతజ్ఞతా సూచకంగా ప్రజలు జరుపుకొనే ఆచారంగా ఆచరణలోనున్నట్లు తేటతెల్లమగుచున్నది.

## ఉగాది పుట్టుపూర్వోత్తరగాథలు

ఉగాది పుట్టుకకు కారణమేమిటి? ఇందుకు సమాధానంగా అనేక పౌరాణిక, చారిత్రక ఆధారాలు కొననగును.

వేదములను దొంగిలించిన సోమకుని వధించి మత్స్యావతార ధారియైన విష్ణువు వేదాలను బ్రహ్మకప్పగించిన శుభతరుణ పురస్సరముగా విష్ణుప్రీత్యర్థం ఉగాది పర్వము ఆచరణలోకి వచ్చినదని పురాణ విదితం.

బ్రహ్మదేవుడు చైత్ర శుక్లపాడ్యమినాడే ప్రపంచాన్ని సృష్టించెను కనుక సృష్టి మొదలైన దినసంకేతంగా ఉగాదిపండుగ జరుపబడుచున్నదని మరొక పురాణ ప్రతీతి.

శాలివాహనచక్రవర్తి చైత్ర శుక్లపాడ్యమి నాడే పట్టాభిషిక్తుడై, తన తేజోపరాక్రమాలతో శాలివాహన యుగకర్తగా భాసిల్లెనని చరిత్రసాక్ష్యాలున్న కారణంగా ఆ ప్రభువు స్మృత్యర్థం 'ఉగాది' వాడుకలోనికి వచ్చెనని చారిత్రకవాదమున్నది.

నిన్నటికన్న, నేటికన్న, రేపును, శుభప్రదం ఆనందప్రదం అయిన ప్రగతిపథ ప్రస్థానానికి దివిటీగా ఊహించుకొని మనుగడసాగించే మానవునిలోని ఆశకూ, ఆశయానికి పచ్చతోరణంకట్టే సత్యశివసుందరాత్మక క్షణం ఉగాది!

— జి. లక్ష్మీకాంతం

# వార్తాలహరి



శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామివారి రథోత్సవం.

## శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు

ఫిబ్రవరి 21 నుండి 29 వరకు శ్రీనివాస మంగాపురం శ్రీ కల్యాణవేంకటేశ్వర స్వామివారికి బ్రహ్మోత్సవాలు వైభవంగా జరిగాయి. శ్రీ వేంకటేశ్వరస్వామికి 25వ తేదీన గరుడోత్సవం, 28వ తేదీన రథోత్సవం అత్యంతవైభవంగా నిర్వహించడం జరిగింది. ఈ సందర్భంగా, అచ్చట దేవస్థానంవారిచే హరికథలు మున్నగు సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరిగింది. భక్తాదుల సౌకర్యార్థమై ప్రత్యేక బస్సులను ఏర్పాటుచేశారు. ఈ ఉత్సవాలను అనేక వేలమంది భక్తులు తిలకించారు.

---

## శ్రీ గోవిందరాజస్వామి తెప్పోత్సవం

ఫిబ్రవరి 12 నుండి 16 వరకు తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారికి తెప్పోత్సవాలు ఘనంగా నిర్వహింపబడ్డాయి. అందుకుగాను చేసిన విద్యుద్దీపాలంకరణ అత్యంత శోభాయమానంగా వుండింది. అనేక వేలమంది ఈ తెప్పోత్సవాలను దర్శించారు.

## శ్రీ వేదనారాయణస్వామి బ్రహ్మోత్సవాలు

ఏప్రిల్ 16 నుండి 24 వరకు నాగలాపురం శ్రీ వేదనారాయణస్వామికి వార్షిక బ్రహ్మోత్సవాలు నిర్వహింపబడుతవి. శ్రీవారికి 20 తేదీన గరుడోత్సవం, 23 తేదీన రథోత్సవం జరుగుతాయి. వైభవంగా నిర్వహింపబడే ఈ ఉత్సవాలను భక్తాదులు దర్శించి, దైవానుగ్రహమునుపొందగలరు.

## పదవీకాలం పొడగింపు

తి. తి. దేవస్థానంలో సంయుక్త కార్య నిర్వహణాధికారిగా పదవీబాధ్యతలను నిర్వహిస్తున్న శ్రీ డి.సుబ్బరాయులు,ఐ.ఏ.ఎస్., పదవీకాలాన్ని మరొక్క సంవత్సరంపాటు పొడిగిస్తూ ఆంధ్రప్రదేశ్ప్రభుత్వం ఉత్తర్వులను జారీచేసింది.

## ఉద్యోగవిరమణ

తి. తి. దేవస్థానం ముద్రణాలయంలో ఇంపోజర్ శ్రీ టి. మదనగోపాల్ ఫిబ్రవరి 28న ఉద్యోగవిరమణ చేశారు. ఈ సందర్భంగా నిర్వహించిన వీడ్కోలు సభలో దేవస్థాన పౌరసంబంధశాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి, సమర్థవంతమైన అతని కార్యదక్షతను ప్రశంసించారు. ఆ సభలో సహోద్యోగులందరు శ్రీ మదనగోపాల్‌కు ఘనంగా వీడ్కోలిచ్చారు.



## అన్నమయ్య ఆరాధనమహోత్సవము

ఈ జనవరి 31వ తేదీన శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం కూచిపూడిలో అఖిలభారత కూచిపూడి నాట్యమండలివారి ఆధ్వర్యంలో శ్రీ తాళ్ళపాక అన్నమాచార్య ఆరాధన మహోత్సవం కన్నులపండువుగా జరిగింది. శ్రీ డి. ఎస్. ఆర్. ఆంజనేయులు ఆనాటి సభకు అధ్యక్షతవహించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ ఉపాధ్యక్షులు పద్మశ్రీ వేదాంతం

సత్యనారాయణశర్మ నాట్యకళా మండలి కార్యక్రమాలను, వారి కృషిని కొనియాడారు. విద్వాన్ శ్రీ చింతలపాటి పూర్ణచంద్రరావు అన్నమయ్యపదాలలోని సంగీత, సాహిత్య సౌరభాలను విశదీకరించారు. తదుపరి అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారుడు శ్రీ పి. ఎస్. రంగనాథ్ అన్నమాచార్య కీర్తనలను గానంచేసి శ్రోత లను రసానందంలో ముంచెత్తారు. శ్రీ దుర్గా ప్రసాద్, శ్రీ రాజగోపాల్, శ్రీ దేవదాసులు ప్రక్కవాద్యాలతో సహకరించారు. శ్రీ పసుమర్తి వేంకటేశ్వరశర్మ శిష్యులు శ్రీనివాస్, లలితలు తమ నాట్యంతో సభను అలరించారు. శ్రీ రత్తయ్యశర్మ రంగాలంకరణను నిర్వహించారు. డా॥ శ్రీమతి మొవ్వ జయలక్ష్మి మెమొంటోలు బహూకరించారు. శ్రీ వై. కె. డి. ప్రసాద్ వందన సమర్పణతో ఆనాటి కార్యక్రమాలు ముగిశాయి. *





1. జ్యోతిని వెలిగిస్తున్న పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మ.
2. అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారుల బృందంచే సంగీతకచ్చేరి.

( 45 వ పేజి తరువాయి )

కల్యాణమండపం నెల్లూరులోను, గండి పాళెం సిద్ధేశ్వరస్వామి దేవస్థానంలోను, రెడ్డిపాళెం శివాలయంలోను, వెంకటరెడ్డి పాళెంలోను మహాశివరాత్రిపర్వదిన సందర్భంగా హరికథా కార్యక్రమాలు ఘనంగా నిర్వహించబడినాయి.

### అఖండ శివభజన

3-12-83 న ప్రకాశంజిల్లా ఊతముక్కల గ్రామంలోని శ్రీ భద్రావతీ సమేత భావనా ఋషి దేవస్థానంలో శ్రీ వేంకటేశ్వరభక్త సంఘంవారు కార్తీక మాసాంతంలో అఖండ శివభజన ప్రారంభించారు. 4-12-83 న ఉదయం పదిగంటలకు ఏకాత్మతా యజ్ఞ రథంలో సంఘకార్యదర్శి శ్రీ కె. వీరభద్ర రావుచే కలశపూజ గావించబడింది. ఆ రోజు నుండి 8-12-83 వరకు నాలుగు రోజులపాటు శ్రీ పఠాన్‌బికారిఖాన్, శ్రీ మునగాల వేంకటేశ్వర్లు, శ్రీ రామనాథం వేంకటేశ్వర్లు, శ్రీ బండారు వసంతరావుగార్ల సహకారంతో కలశపూజ, భజన కార్యక్రమాలు కొనసాగాయి.

8-12-83 మధ్యాహ్నం 3 గంటలకు పై సంఘకార్యకర్తలు బ్రహ్మాండమైన ఊరేగింపుతో ఒంగోలుకు వెళ్ళి అక్కడి నుండి ఏకాత్మతా యజ్ఞరథంలో గంగాజలాలు తెచ్చారు. 9-12-83 ఉదయం నుండి రాత్రి 8 గంటల వరకు ఆదిగోపులరంగ నాయకులుగారి సహకారంతో పూజాకార్యక్రమాలు, గంగాజల తీర్థప్రసాదాలు భక్తులకు పంచిపెట్టారు. ఆ రోజు రాత్రి 10 గంటలకు సంఘకార్యదర్శి వందన సమర్పణతో కార్యక్రమాలు నిర్విఘ్నంగా ముగిశాయి.





## శ్రీ శ్రద్ధానంద ఆశ్రమం, రాజపూర్

1983 అక్టోబరు 2 వ తేది నుండి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని డెహ్రాడూన్ జిల్లా రాజపూర్‌లోని శ్రీ శ్రద్ధానంద ఆశ్రమమును తిరుమల తిరుపతి దేవస్థానం విరాళంగా స్వీకరించడం జరిగింది. దీనికి దేవస్థాన కార్యనిర్వాహకమండలి తీర్మానం 433 తేదీ 31-10-83 ప్రకారం ఆమోదం తెలియజేయడం జరిగింది. పై ఆశ్రమంలో తి. తి. దేవస్థాన కార్యక్రమాలు ప్రచారం చెయ్యడం జరుగుతుంది.

కార్యనిర్వహణాధికారి.
తి. తి. దేవస్థానములు, తిరుపతి.

### శారదాజయంతి

గత జనవరి 29 న మదనపల్లె శ్రీరామ కృష్ణ ఆశ్రమంలో మాతృశ్రీ శారదాజయంతి కార్యక్రమం జరుపబడింది. ఈ కార్యక్రమంలో చాలమంది మహిళా సభ్యులు పాల్గొనడం జరిగింది. ప్రాతస్స్మరణీయులైన శ్రీ రామకృష్ణ, మాతృశ్రీ శారదాదేవి శ్రీ వివేకానంద మున్నగువారిని గూర్చి పలువురు చక్కగా ఉపన్యసించారు.



# మీమాట

## ఏభై ఏళ్ళ ప్రగతి

ఫిబ్రవరి సంచికలో తి. తి. దేవస్థానాల ఏభై ఏళ్ళ ప్రగతిని వివరంగా తెలియ జేసిన శ్రీ నాగరాజ్‌గారికి మా ప్రత్యేక అభినందనలు. తి. తి. దే. ప్రగతి నిజంగా వామనుని త్రివిక్రమ స్వరూపమే నని తలంచవచ్చు. ముఖచిత్రమూ, సంపాద కీయమూ అన్నీ తి.తి.దే. ఏభై ఏళ్ళ ప్రగ తిని చక్కగా వివరిస్తున్నాయి.

పరమానందం సాయిప్రసాదు — నందికొట్కూరు.
శైవ రాధాకృష్ణమూర్తి — అనంతపురం.
వి. లక్ష్మీరాణి. కె. నాగఉమశ్రీ — కారంపూడి

## భగవద్గీత

సప్తగిరిలో 'భగవద్గీత' సీరియల్‌గా ప్రచురింపబడుతున్నది. చాలా బాగున్నది. అభినందనలు. కానీ వీటితోపాటు గీతాధ్యాన శ్లోకం; గీతామాహాత్మ్యశ్లోకం ఉంటే బావుంటుంది. అలాగే శ్రీ మహాభారతం, శ్రీమద్రామాయణం ప్రచురిస్తారని ఆశిస్తాను.

డి. ఎస్. ఆనందపట్నాయక్ — వమరపెల్లి.
గన్నెపూడి శ్రీరాములు — మార్టూరు.

## బాలప్రబోధం

ఫిబ్రవరి సంచికలోని 'ఐదురూపాయల నోటు' కథ చాలా బాగున్నది. నేటి బాల బాలికలకు ఎంతో కనువిప్పు కలుగజేయును. రచయితకు అభినందనలు. ముఖచిత్రం బాగుంది. అన్ని వ్యాసాలు బాగున్నాయి.

ఓ. ఆనందం — భువనగిరి.
ఆరవేటి ఆదినారాయణ — ప్రొద్దుటూరు.
సిలంరాజు వేంకటసుబ్బారావు — ఒంగోలు.
భీమా ప్రభాకర్‌శెట్టి — కనిపెట్ట.

## అచ్చుపొరపాటు

ఫిబ్రవరి సంచిక 'వార్తాలహరి' లో శ్రీ వేంకటేశ సారస్వత వినోదిని గ్రంథకర్త శ్రీ బైరెడ్డి సుబ్రహ్మణ్యంకు శ్రీ తోట శ్రీని వాసులు రూ. 1116/- (వెయ్యిన్నీ నూట పదార్లు) తో సత్కరించారని సవరించి చదువుకోగలరు. ఈ అచ్చుపొరపాటుకు చింతిస్తున్నాం. సం॥

## యువవాణి

ఫిబ్రవరి సంచికలోని "దేవునిపై విశ్వాసం" కసిరెడ్డి రచన అద్భుతంగా ఉంది. అట్లే "భగవంతుని చిత్రాలు" వ్యాసం ఆస్తికతను పెంపొందించేదిగా ఉంది.

ఆర్ ఎస్. చలపతిరావు — గుంటూరు.
కె. ఉమేష్‌రెడ్డి — ఆదిలాబాద్.

## వేంకటేశ్వరలీలలు

ఫిబ్రవరి సంచికలోని "పిలిచిన పలికే స్వామి" కథ బాగుంది. ఇలాంటి భక్తి స్ఫోరకమైన శ్రీ వేంకటేశ్వర లీలలను ప్రతి నెలా ప్రచురించగలరని ప్రార్థన. మాఘ మాసమాహాత్మ్యము వ్యాసంలో మాఘమాస విశేషాలు అద్భుతంగావున్నాయి. "ఓంకార ప్రణవ మహిమ" వ్యాసం చాలా బాగుంది. రచయితలకు అభినందనలు.

కొలపర్తి శ్రీరాములు — వింజమూరు.

---

(3వ పేజి తరువాయి)

మహాభారతాలు ఉత్తరోత్తరోత్కర్షతో చాటిన సత్యాలు అగ్నిపరీక్ష పొందిన తనను జనాపవాద భయంతో రాముడు వదలివేయగా సీతాదేవి చేసింది మొదటిదైతే, తన పంతం ఆసాంతం కొనసాగించి అనంతప్రతీకారశక్తికి ప్రతీకగా నిల్చింది ద్రౌపది అంతరార్థాలు నానార్థాల సంగతి ఎలావున్నా, మనుష్యుల, మానవత్వపు విలువల మార్పుల నడుమ మానవతులెలా నలిగిపోయారనేది ఈ రెండుకావ్యాలూ ఎత్తి చూపించాయి.

తరువాత కాలంలో ఎంతో చరిత్ర జరిగింది. ఐనా మనం మారలేదు, ఇంటికొక కీచకుడుగా వీధికొక సైంధవుడుగా మనం మనగలమని అనుకుంటున్నామేగాని, మన ప్రతి ఒకరిచేత స్త్రీ జాతికే 'చేతబడిగా' మారి, సమాజానికే రుధిరోద్గారం కల్గిస్తున్నదని మన కళ్ళముందు మనవారే దారుణమారణాలకు సమిధలౌతున్నారని తెలిసికోలేక పోతున్నాం. ఈ రాక్షస దుందుభి సమాజానికి కల్గించిన రుధిరోద్గారం ఇలా సాగితే జాతి ప్రగతి ఆగుతుంది. విరక్తాత్ముల శాపాలు మనకు శాపాలు కాక తప్పదు. కనుక తర తమ భేదాలను మరచి మనకు కర్తవ్యనిష్ఠ కలగాలని రాగల రక్తాక్షి పర్వమానవ పమాదరణాను, రక్తాక్షి కావాలని క్రోధన అక్రోధనగా మారి, క్షయ అక్షయగా సర్వశుభాలను కలిగించాలని ఆశిస్తూ వేంకటేశ్వరుని వేడుకొందాం.

శం నో మిత్రశ్శం వరుణః। శం నో భవత్వర్యమా।
శం న ఇంద్రో బృహస్పతిః। శం నో విష్ణు రురుక్రమః।
నమో బ్రహ్మణే। నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షంబ్రహ్మాసి।
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి।
ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తన్మామవతు।
తద్వక్తార మవతు। అవతు మామ్। అవతు వక్తారమ్।

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



**నరులార నేఁడువో నారసింహజయంతి**
**సురలకు నానందమై శుభము లొసఁగెను.**

సందించి వైశాఖ శుద్ధ చతుర్దశి శనివార
మందు సంధ్యాకాలమున నౌభలేశుడు
పొందుగాఁ గంభములోనఁ బొడమి కడపమీఁద
కందువ గోళ్లఁ జించెఁ గనక కశిపుని.

నర మృగరూపము నానాహస్తముల
అరిది శంఖ చక్రాది ఆయుధాలతో
గరిమఁ బ్రహ్లాదునిఁ గాచి రక్షించి నిలిచె
గురుతర బ్రహ్మాండ గుహలోనను.

కాంచనపు గద్దెమీఁద గక్కనఁ గొలువై యుండి
మించుగ నిందిరఁదొడ మీఁదఁ బెట్టుక
అంచె శ్రీ వేంకటగిరి నాదిమపురుషుండై
వంచన సేయక మంచివరాలిచ్చీ నదివో.

— అన్నమాచార్య అధ్యాత్మసంకీర్తన.

**(మే 14, శ్రీ నృసింహ జయంతి పందర్భంగా)**

# మీ మాట

## ధన్యవాదాలు

ఏప్రిల్ సప్తగిరి ఒక విశిష్టస్థానం ఆక్రమించుకుంది. శ్రీయుతులు మైనంపాటి వారి 'చెన్నకేశవశతకం' శ్రీ రావుల తాత్పర్యసహిత 'భగవద్గీత'; రామాయణంలో తారవ్యక్తిత్వము; గుహుని భక్తి ప్రపత్తులు, లక్ష్మణుని మనోనిగ్రహము; ఉదాత్తమైన రచనలు. గ్రంథసమీక్షలు ఎంతోబాగున్నాయి. రచయితలందరికి ధన్యవాదాలు. ఈవిధమైన భక్తిజ్ఞానప్రభోధములకు ఆస్పదంగా ఉండు మీ సప్తగిరి అభ్యుదయ పరంపరాభివృద్ధి నొందుగాక

వెల్లాం మఖ్బయ్య — మోచంపేట.
గార్ల ఆనంద్ — హైద్రాబాద్.

## శ్రీ వేంకటేశ్వర లీలలు

మార్చినెల సంచికలో శ్రీ వేంకటేశ్వర లీలలు చాలబాగుంది. ఇటువంటి సంఘటనలు చదవడంవలన మనస్సుకు ప్రశాంతత లభిస్తుంది. ముఖచిత్రం చాలబాగున్నది.

కె. వి. రమణ — కళింగపట్నం.
పీలంరాజు వేంకట సుబ్బారావు ... ఒంగోలు.

## బాలప్రబోధం

ఏప్రిల్ సంచికలో "పరీక్ష" చాల బాగుంది. 'లక్ష్మణునిమనోనిగ్రహము' అను శీర్షికలో మానవజన్మమెత్తిన ప్రతిమనుజుడూ మనోనిగ్రహం కల్గివుండాలి. అప్పుడే మనిషిజన్మకు సార్థకత అని కథారూపంలో మనసుకు హత్తుకపోయేటట్లు ప్రచురించారు. రచయితలకు అభినందనలు. మార్చి సంచికలోని కుబేరవృత్తాంతం చాలబాగుంది.

చావా వేంకట చక్రపాణి — ఒంగోలు.
ఏ. రాంబాబు — హన్మకొండ.
పోలిశెట్టి బాలకృష్ణయ్య — వనపర్తి.

## సంపాదకీయం

'సుదతి మెచ్చుల ఇల్లు సురలకు పుట్టిల్లు' ఏప్రిల్ సంచిక సంపాదకీయం సమస్త పురుషలోకానికే కనువిప్పు. శ్రీ సీతారామ లక్ష్మణుల ముఖచిత్రం మనోజ్ఞంగావుంది. 'తెలుగు వెలుగుల ఉగాది' హర్షదాయకము. సంపాదకులకు కృతజ్ఞతాంజలి.

జ్వాలా గోపినాథ్ — కడప.

## గృహలక్ష్మి

"రామకథలో తారవ్యక్తిత్వము" చక్కగా వివరించారు రచయిత. అట్లే "భద్రాచలం రామాలయం" "పరీక్ష" ఉగాది వైశిష్ట్యము వ్యాసాల రచయితలకు ధన్యవాదాలు.

భీమా ప్రభాకర్ శెట్టి — కనిమెట్ట.

## అచ్చుపొరపాటు

ఏప్రిల్ 84 సంచికలో ముద్రితమైన "పరీక్ష" కథా రచయిత శ్రీ యం. ఉమా మహేశ్వరరావు. కాని బి. ఉమామహేశ్వర రావుగా ముద్రణమైన అచ్చుపొరపాటును పాఠకులు సవరించి చదువుకోగలరు. ఈ పొరపాటుకు చింతిస్తున్నాం సం॥

## గ్రంథసమీక్ష

ఏప్రిల్ సంచికలో "శ్రీరామమంత్రానుష్ఠానము" గ్రంథం సమీక్షింపబడింది. గ్రంథరచయిత: శ్రీ రామశరణ్, నామప్రయాగ్, బుద్దాం(పోస్టు), గుంటూరు జిల్లా. వెల: రు. 15/-.

## రైళ్ళ విజ్ఞాపన!

అయ్యా!

కొండనాలుకకు మందువేస్తే ఉన్న నాలుక ఊడిందట. అలావుంది. గుంటూరు ప్రాంతంవారి పరిస్థితి. లోగడ 'సప్తగిరి'లో ప్రయాణీకుల సౌకర్యాలను గూర్చి ఓ పెద్ద ఉత్తరం రాయటం జరిగింది. అందులో సర్కార్ ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతి–వాల్తేరు ఎక్స్‌ప్రెస్‌గా మార్చమని తిరుమల – గోల్కొండ కలిపి తిరుపతి హైదరాబాద్ నడుమ ఏర్పాటు చేయవలసిందిగాను విన్నపాలు చేయటం జరిగింది. అవి జరగటం ఎలావున్నా ఇన్నాళ్ళుగా తిరుపతి-గుంటూరు మధ్య సౌకర్యం కలిగిస్తున్న కాకినాడ తిరుపతి పెట్టెలను విజయవాడలో సర్కారుకు తిరుమలకు తగిలించటంవల్ల గుంటూరు నుండి వినుకొండ అంటె సుమారు 100 కి. మీ ప్రాంతాలవారికి చాలా నేరుగా ప్రయాణము చేసే సౌకర్యం తగ్గింది. కృష్ణా ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతి వరకు నడుపుతున్నందున అది గుంటూరువాళ్ళకు దాదాపు రద్దయినట్లే. అందుకే క్షణక్షణముల్ అధికార్ల చిత్తముల్ అని ఎవరో అన్నమాట ఇప్పుడు జ్ఞాపకానికి వస్తుంది.

అసలు మంచైనా చెడైనా మొఖాన చెప్పుకోవాలి మరి. రైల్వేశాఖవారు ఈ 'సప్తగిరి' లో సూచించిన వాటిలో కొన్ని అమలు జరిపి మంచిపనే చేశారు.

కృష్ణా ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతి దాకా నడపటం, ఢిల్లీకి వెళ్ళేందుకు ఒక పెట్టె పూరీ ఎక్స్‌ప్రెస్‌కు జోడించటం, ఒంగోలు తిరుపతి ప్యాసింజరును పేరుమార్చకుండా విజయవాడదాకా పొడిగించటం, మద్రాసు చీరాల ప్యాసింజరును విజయవాడదాకా పొడిగించటం లాంటివి నిజానికి అభినందనీయమైన మార్పులే. యాత్రికులకు ఉపయోగకరమైనవి కూడా కాని కాలానుగుణంగా పెరిగే యాత్రికుల సంఖ్య దృష్ట్యా అవసరాలు కూడా పెరుగుతూనే వున్నాయి. కనుక సూచనలుగా కొన్ని మార్పులు కూర్పులు అవసరమనిపిస్తున్నాయి.

లోగడనే విన్నవించినట్లు సర్కార్ ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతి వాల్తేరుల మధ్య ఇప్పటి మార్గంలోనే నడపవచ్చు. తిరుపతికి ఎక్కువ సౌకర్యాలు కలుగుతున్నవి కనుక పెట్టెల సంఖ్యను తగ్గించవచ్చు. ఇది చుట్టు తిరిగి రావాలనుకుంటే గుంటూరు ప్రాంతంవారిని తెనాలిలో జోడించే విధంగా రెండు మూడు పెట్టెలు వేయవచ్చు.

తిరుమల ఎక్స్‌ప్రెస్‌ను కూడా విజయవాడలో గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌తో హైదరాబాద్ దాకా నడపవచ్చు. కృష్ణా ఎక్స్‌ప్రెస్ వల్ల కొంత రద్దీతగ్గే అవకాశం వుంది గనుక కొన్ని పెట్టెలను మాత్రమే హైదరాబాద్ దాకా నడపవచ్చు. వేళ వేగం పెంచవచ్చు.

పై రెండు పద్ధతులలోను మిగులు పెట్టెలతో ఎక్కడికైనా ఇంకొక బండివేసే అవకాశం కలుగుతుంది.

ఇక పాసింజర్ల విషయంలో కొద్ది మార్పులు అవసరమౌతున్నై. తిరుపతి – విజయవాడల మధ్య కాకినాడ పాసింజరు 13 గం॥ ప్రయాణంచేస్తే మద్రాసు విజయవాడల మధ్య పాసింజరు 18 గంటలు ప్రయాణం చేస్తుంది. ఇది మధ్యతరగతి ప్రయాణికులకు మామూలు శిక్ష. పొగబండ్లున్న రోజుల్లోనే సాయంత్రం నాలుగు గంటలకు విజయవాడలో బయల్దేరి తెల్ల

[ 46వ పేజీలో]




గౌరవసంపాదకులు :

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :

కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఏ.

*

ముద్రాపకుడు :

ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00
సం॥ చందా - రు. 12-00

*

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

మే 1984
సంపుటి 14 సంచిక 12



ముఖచిత్రం మరియు 2, 3, 4 కవరుపేజీలు: స్వర్ణోత్సవ వైభవము.

# సంపాదకీయం

నాల్గువేదాలు తెలిసినవాడు, తర్కవ్యాకరణ శాస్త్రాలు అధ్యయనం చేసినవాడు తప్ప ఇలా మృదుమధురంగా మాట్లాడ లేడు. ఇవి శ్రీరాముడు లక్ష్మణునితో అన్నమాటలు. కాని, శ్రీరాముడు రాజవంశములోనివాడు గనుక, మైత్రి కోరివచ్చిన సుగ్రీవ మంత్రి ఆంజనేయుణ్ణి గూర్చి ఇలా అనుకోవడంలో ఆశ్చర్యం లేదు.

'అహో! ఏమి అతని తేజం. ఇతడు నాపై విరోధంతో వచ్చిన శ్రీహరి, లేదా నన్ను శపించిన నందీశ్వరుడే ఈ రూపంలో వచ్చివుండవచ్చు'. ఇవి తన సభలోకి ఇంద్రజిత్తు బంధించి తీసుకొచ్చిన ఆంజనేయుణ్ణి గురించి రావణుడు అన్న మాటలు. తన ఉద్యానవనాల్ని ధ్వంసంచేసి, గారాలపుత్రుడు అక్షకుమారుణ్ణి కనికరం లేకుండా చంపివేసిన వ్యక్తి తన ముందున్నప్పుడు కలుగ వలసిన రోషక్రోధాలకు బదులు ఆంజనేయునిలోని దైవీశక్తి, భగవదంశ, తేజస్సు, అంతేకాదు భగవదవతారమే అన్న నమ్మకం, విభ్రాంతి రావణునికి కలిగాయి. రావణుడు కూడా ఆధ్యాత్మిక విదుడు గనుక, శివభక్తుడు గనుక ఆంజనేయునిలోని దైవీతత్వాన్ని సందర్శించగలిగాడు. ఈ రెండూ రాయబారఘట్టాలు కావటం విశేషం. ఒక ఘట్టంలో రాముని ప్రాపుకోరే సుగ్రీవుని మంత్రిగా మిత్ర లాభం చేకూర్చాడు. రెండవదాంట్లో రావణునకు హితవు బోధించినా, ఎదిరిపక్షం విషయంలో రావణునిహృదయంలో భయం కల్గించి, విభీషణునిలో మానసికంగా రావణునిపట్ల వైముఖ్యపునారు పోసి మిత్రభేదతంత్రాన్ని సఫలం చేశాడు. భారతంలో కౌరవ సభలో శ్రీకృష్ణపరమాత్మ కూడా తన అనంతశక్తి యుక్తులను ప్రదర్శించాడు, అయితే అటు రావణుడు, ఇటు దుర్యోధనుడు కూడా రాయబారాలను, రాయబారులను అవమానించి తమకు తామే ముప్పు తెచ్చుకున్నారు.

స్వామిభక్తి విషయంలో రామాయణంలో విలక్షణత కన్పిస్తుంది. లక్ష్మణుడు, ఇంద్రజిత్తు ఒక విధమైన మనస్తత్వం కలవారు. శస్త్రధారణ ప్రభుసేవకోసమే అన్నది వీరి వాదన. స్వామిపట్ల అచంచలవిశ్వాసం కర్తవ్యనిష్ఠరత వీరి ప్రధానధ్యేయాలు. రెండవకోవ భరత విభీషణులు. అకార్యకారకులెంతటి పూజ్యస్థానీయులైనా త్యాజ్యులే అని వీరి నమ్మకం. అందుకే అకార్యాచరణద్వారా తనకు రాజ్యాన్ని కట్టబెట్టి సంకల్పించిన మాతృశ్రీ కైకేయిని భరతుడు, సీతాపహరణం ద్వారా రాక్షసలోక వినాశనానికి నాంది పలికిన రావణుని వదిలేసిన విభీషణుడు ఈ కోవకు చెందినవారు. ప్రభువుకు హితాన్ని నిష్పాక్షికంగా బోధించినా వినక ఆత్మనాశాన్ని కొని తెచ్చుకొన్నప్పుడు కూడా, త్యజించక, వీరస్వర్గం అలంకరించిన కుంభకర్ణుడు స్వామిభక్తికి మరొక క్రొత్తసాక్షి.

కాని, ఆంజనేయుని స్వామిభక్తి అతివిచిత్రమైనది. వినూత్నమైనది. విశిష్టమైనదీకూడా. నిజానికి వాలికి మంత్రి హనుమంతుడు. అన్న వెడల గొట్టగా ఋష్యమూకం చేరిన సుగ్రీవునితోపాటు. విడవకుండ సుగ్రీవుని సేవించాడు. స్వామిభక్తి ప్రబోధితుడై రామమైత్రితో వాలివధకూడా సాధించినా వాలికిగాని, తారకుగాని హనుమంతునిమీది గౌరవభావం తగ్గకపోవడం రామాయణంలో కన్పిస్తుంది. దాసోఽహం కోసలేంద్రస్య అని చెప్పుకొన్నా సుగ్రీవానుచరుడుగానే పనిచేసినట్లు కన్పిస్తుంది. ఆ అసిధారావ్రతాన్ని రామాయణం కడదాకా నిర్వహించాడు. ప్రతి కష్టతర కార్యసాధనకు మారుతి ప్రధానపాత్ర వహించాడంటే అది అతని ధైర్య, స్థైర్య సమయజ్ఞతలకు నిదర్శనాలు. అందువల్లనే హనుమద్దౌత్యం కల సుందరకాండ నూతనమైన ఆధ్యాత్మికనిర్వచనాలను పొంది, ఆంజనేయుని ఆచార్యపీఠాన నిలబెట్టింది.

హనుమంతుడు ఎంతటి రణపండితుడో, అంతటి సహృదయుడు కూడా. బాలుడు రణప్రచండుడైన అక్షకుమారుని సంహారంపట్ల అతని తాపం, కొలువుదీరిన రావణునిచూచి అధర్మ లేశం బలవత్తరం కాకపోతే; దేవేంద్రునితో కలిసి ముల్లోకా లేలకలవాడని మెచ్చుకోవటం, యుద్ధకాండలో నా చేతిదెబ్బలకి నీ వింకా బ్రతికి ఉండటం నా బలానికే మచ్చ అని రావణుని రణసహిష్ణుతను ప్రశంసించటం మానవులమైన మనకు అబ్బవలసిన, ఆంజనేయస్వామికి అబ్బిన విద్య.

[48 వ పేజీలో]

# సర్వజ్ఞుడు

ఒకసారి రావణుడు విశ్రాంతి మందిరంలో కూర్చున్నాడు. "నారాయణ, నారాయణ" అని హరినామస్మరణ చేస్తూ నారదుడు అక్కడకు వచ్చాడు. రావణుడు నారదుని పలుకరించాడు. "తాతయ్యా! నేను నవవ్యాకరణ పండితుడిని. నాకు తెలియని శాస్త్రం లేదు. నేనెరుగని క్రొత్త విషయం కూడా ఉండదని అనుకుంటున్నాను. ఏమంటావు?" గర్వంగా అన్నాడు రావణుడు. రావణుని అహంకారాన్ని గమనించి నారదుడు, "మనుమడా! నీవు సర్వజ్ఞుడివి" అన్నాడు.

"తాతయ్యా, నీవు త్రిలోక సంచారివి కదా, ఏదైనా క్రొత్త విషయం చెప్పగలవా?" అని రావణుడు ప్రశ్నించాడు. నారదుడు నవ్వుతూ, "రావణా, సర్వజ్ఞుడవైన నీకు నేను ఏమి చెప్పగలను" అన్నాడు.

"నారదా, ఎందుకు నీకు ఈ త్రిలోక సంచారం, నాలాంటి సర్వజ్ఞుడికి ఏదో క్రొత్త విషయం. లేదా ఏదో వింత చెప్పాలి. లేకుంటే ఎందుకు ప్రయాసపడుతూ తిరగడం" అంటూ తేలికగా మాట్లాడడం ప్రారంభించాడు రావణుడు. సరేనంటూ, నారదుడు మొలనుండి ఒక తాళపత్రం తీసి రావణునికి అందించాడు. "రావణా, ఈ తాళపత్రం తీసికో. నేను లంకాపట్టణం దాటేవరకు, దీనిని చదువ ప్రయత్నించకు, కాదని చదివినా నీకు ఏమీ కనిపించదు. మరో గంటలో ఈ లంకాపట్టణాన్ని విడువగలను. నేను రేపు ఇదే సమయానికి వస్తాను. నేను వచ్చే లోపల పత్రం చదివితే విషయం కనిపిస్తుంది. అది చదివి గ్రహించు. లేదని రేపు నేను వచ్చిన తరువాత చదువ ప్రయత్నించినా ఫలితం దక్కదు. ఇందులో ఏమీ కనిపించదు. గుర్తుంచుకో" అని హెచ్చరిస్తూ కదిలాడు నారదుడు.



రావణుడు గర్వపడుతూ ఆ తాళపత్రం ప్రక్కన పెట్టాడు.

మరుసటి రోజు మాటప్రకారం, నారదుడు రావణుని మందిరానికి వచ్చాడు. రావణుడు నారదుని చూసి తాళపత్రం గుర్తుకు తెచ్చుకున్నాడు. గాభరాపడుతు ప్రక్కనే ఉన్న తాళపత్రం తీసి చూసాడు. అందులో ఏమీ కనిపించలేదు. సిగ్గుతో తలదించుకుని, "నారదా, రాజకార్యాలలో పడి, తాళపత్రం చదవడం మరచాను. అందులో విషయం చెప్పు" అంటూ నారదుని అడిగాడు. ఆమాటలు వింటూనే నారదుడు పకాలుననవ్వి ఊరుకున్నాడు.




రావణుడు, "నారదా, ఆ తాళపత్రంలో గల విషయం చెప్పు" అంటూ ప్రాధేయపడ్డాడు. అపుడు నారదుడు "రావణా! ఈ ఒక్క తాళపత్రం చదవడానికి నీకు తీరిక చిక్కలేదు కదా! ఎందరో శాస్త్రజ్ఞులు, ఎన్నో క్రొత్త విషయాలు, విజ్ఞానం, తాళపత్రాలలో పొందు పరుస్తున్నారు. అనుక్షణం విజ్ఞాన విషయాలు, వింతలు, విశ్వంలో పెంపొందుతున్నాయి. అన్నీ తెలుసునని గర్వపడడం ఎవరికిని తగదు. మరి నీకు, నీవే సర్వజ్ఞుడివని స్తుతించుకున్నావు. ఇకనైనా సర్వజ్ఞుడిననే గర్వం విడిచిపెట్టు" అన్నాడు. తన తప్పును తెలుసుకున్న రావణుడు ఎంతో సిగ్గుపడ్డాడు.

బాలలూ, ఎంతటి వారికైనా, అన్నీ నాకే తెలుసును అన్న అహంకారం తగదు. మనం నేర్చుకోవలసిన విషయాలు ఎప్పుడు ప్రపంచంలో ఉంటూనే ఉంటాయి. తెలిసింది కదా, మరి.

— బెహరా ఉమామహేశ్వరరావు

# నవనారసింహక్షేత్రం - అహోబిలం

శ్రీకి నిరంతరంబు కడుచెన్ను సలారెడు రాగలీల ను
త్సేకము బొంది యొప్పు తనచిత్తము జూపెడు మాడ్కి నిత్య ర
మ్యాకృతియైన కౌస్తుభము, నక్కువయించరించు నుత్తమ
శ్లోకుడహోబలేశు దతిలోకుడు లోకముగాచు గావుతన్

క్రీ. శ. 14 వ శతాబ్దానికి చెందిన ఎఱ్ఱా ప్రెగ్గడ తాను రచించిన 'నృసింహ పురాణము'లో అహోబిల నరసింహుని పై విధముగా స్తుతించెను. నవనారసింహస్వామి దేవాలయములు ఆంధ్రప్రదేశ్‌లో కర్నూలు జిల్లా; ఆళ్ళగడ్డ తాలూకాలో నున్నవి. అహోబిలం చేరుటకు మద్రాసు బొంబాయి రైలు మార్గంలో కడపవద్ద దిగి, అచ్చటనుండి 65 కి. మీ. దూరంలో ఉన్న ఆళ్ళగడ్డకు బస్సులలో చేరుకోవచ్చును. ఆళ్ళగడ్డనుండి అహోబిలానికి బస్సు సదుపాయము కలదు.

దశావతారాలలో నాల్గవదైన నరసింహ స్వామిని ప్రధానదైవంగా పూజించే ఆలయాలు చాలగలవు. శ్రీ వరాహ లక్ష్మీ నరసింహస్వామి యాదగిరి యందు ఉండగా నవనారసింహులకు ఆలయాలు ఒకే చోట ఉండటంచేత, అహోబిలం ప్రత్యేకతను సంతరించుకొన్నవి. అహోబిలం సముద్ర మట్టానికి 2,800 అడుగుల ఎత్తున గలదు. కొన్ని ఆలయాలు దిగువ అహోబిలంలోను, కొన్ని కొండకు వెళ్లే మార్గమధ్యంలోను మరి కొన్ని కొండ ఎగువ భాగంలో నున్నవి. అందుచే దిగువ అహోబిలం ఎగువ అహోబిలం అనిఅంటారు. ఈ తొమ్మిది నరసింహ ఆలయాలు ఐదు క్రోసుల విస్తీర్ణంలో ఉండుట వలన యీ క్షేత్రం 'పంచతీర్థ' మని కూడ పిలువబడుచున్నది. ఈ క్షేత్రానికి 'అహోబిలం' అను నామ మేర్పడుటకు పురాణగాథ యీ విధంగా ఉంది. ఉగ్ర రూపుడైన నరసింహుడు హిరణ్యకశిపుని సంహరించు సమయమున దేవతలు, నరసింహుని ఉగ్రరూపాన్ని "నరసింహః పరం దైవం. అహోబల మహోబల" మని స్తుతించుటవల్ల ఈ క్షేత్రానికి "అహోబలం" అను నామ మేర్పడెను. మూలవిరాట్టు ఒక పెద్ద గుహలో నుండుట కూడ 'అహోబిల' నామ కరణమునకు మూలమైనది.

భారతావనిలో నవనారసింహస్వామి ఆలయాలు అహోబిలంవద్ద ఉండడం విశేషం. ఆ ఆలయాలు యివి. 1. ఛత్రవట నరసింహస్వామి 2. కారంజ నరసింహస్వామి. 3. యోగానంద నరసింహస్వామి 4. భార్గవ నరసింహస్వామి 5. అహోబల నరసింహ స్వామి 6. మాలోల(లక్ష్మీ)నరసింహస్వామి 7. క్రోడ నరసింహస్వామి 8. జ్వాలా నరసింహస్వామి 9. పావన నరసింహస్వామి.

కొండదిగువ ప్రహ్లాదవరదనరసింహ స్వామి ఆలయము గలదు. ఈ ఆలయశిల్ప సంపద, మండపములు విజయనగర శిల్ప సౌందర్యాన్ని గుర్తుకుతెస్తాయి. ఈ ఆలయమునకు 4 కి. మీ. దూరంలో ఛత్రవట నరసింహస్వామి ఆలయముకలదు. ఈ మూర్తి పద్మాసనుడై శంఖ చక్రధారుడై దక్షిణ హస్తము అభయ ముద్రను సూచించగా, వామహస్తము కటి భాగమందుంచబడినది. కొండపైకివెళ్ళే మార్గం సుందరమైన ప్రకృతి దృశ్యాలలో, దట్టమైన వృక్షసంపదతో, జలపాతములతో మనస్సుకు అహ్లాదమును ఆధ్యాత్మికచింతనను కలుగజేయును. ఈ మార్గమధ్యంలో కారంజ నరసింహస్వామి ఆలయము గలదు. ఈ మూర్తి యోగ ముద్రలో ఆసీనుడై, హస్తమున విల్లును ధరించినట్లు మలచబడెను. స్వామిశిరస్సుపై పడగ విప్పిన నాగు కలదు. ఈ ఆలయమునకు చేరువగా యోగానంద నరసింహ స్వామి ఆలయము గలదు. ఈ విగ్రహము శంఖచక్రధారుడైన చతుర్భుజమూర్తి క్రింది రెండు హస్తములు యోగపట్టముపై నున్నవి. ఇచ్చటనే హిరణ్యకశిపుని సంహరించిన పిదప నరసింహస్వామి ప్రహ్లాదునకు యోగాసనములు నేర్పినట్లు పురాణకథనము గలదు. ఈ ప్రాంతముననే గోభిల, భరద్వాజ మహర్షులు తమ పాపములు పోగొట్టుకొనుటకు తపస్సు చేసిరి. ఈ ఆలయమునకు కొద్దిదూరములో భార్గవ నరసింహస్వామి ఆలయముగలదు. ఈ విగ్రహము చతుర్భుజమూర్తి శంఖచక్రధారియై హిరణ్యకశిపుని సంహరించునట్లుగా మలచబడినది. అంజలి ఘటించు ప్రహ్లాద విగ్రహము గలదు. భార్గవ నరసింహస్వామి తోరణమున దశావతార విగ్రహములు చెక్కబడినవి.



యోగానంద నరసింహస్వామి ఆలయము నుండి వేదాద్రి, గరుడాద్రి శిఖరములు కనబడుచుండును. భవనాశినది యీ శిఖరముల మధ్యనుండి ప్రవహిస్తోంది. నది రెండుపాయలై ఒకటి కుముదవతి, రెండవది పెన్నా నదులలో కలియుచున్నది. స్వయంభువయిన అహోబలనరసింహ స్వామి గరుడాద్రిపై వెలసియున్నాడు. ఎగువ అహోబిలమున సహజ సిద్ధముగ ఏర్పడిన గుహయందు మూలవిరాట్టు దర్శన

మిచ్చును. ఈ విగ్రహము సాలగ్రామశిలతో చేయబడెను. సుఖాసనమూర్తియైన ఉగ్ర నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించుచున్నట్లుగా విగ్రహము మలచబడినది. ఇచ్చటనే గరుడునకు స్వామి సాక్షాత్కరించెను. ఈ ఆలయమువద్ద పెద్ద స్తంభము నుండే ఉగ్రనరసింహుడు వెలువడి హిరణ్యకశిపుని చంపెనని భక్తులు విశ్వసింతురు. తిరుమంగైఆళ్వారు, శ్రీరామానుజాచార్యులవారు, తాళ్ళపాక అన్నమాచార్యులవారు నరసింహస్వామిని తమ గానామృతముతో అర్చించారు.

ఉగ్రనరసింహస్వామి ఆలయమునకు ఒక మైలు దూరంలో మాలోల (లక్ష్మీ) నరసింహస్వామి ఆలయం ఉంది. చతుర్భుజుడై, శంఖచక్రధారుడై, శాంత మూర్తియైయున్న స్వామి అభయ ముద్రతో, వామహస్తముతో తన అంకముపై నున్న శ్రీదేవిని కౌగలించుకొనియున్నాడు. వేదాద్రి శిఖరముపైయున్న యీ ఆలయ ప్రాంతాన్ని లక్ష్మీక్షేత్రం అని కూడా పిలుస్తారు. అహోబల నరసింహస్వామి ఆలయానికి 3 కి. మీ. దూరంలో క్రోడ నరసింహస్వామి ఆలయముకలదు. ఈ ప్రదేశమందు మూడు రోజులు శతాక్షరి మంత్రము పారాయణ చేసిన ముక్తిని పొందెదరు. క్రోడ (వరాహ) నరసింహమూర్తి స్థానిక మూర్తిగా యున్నాడు. వామభుజముపై నున్న భూదేవి వరాహముఖమును కౌగలించుకొనియున్నది. విజయనగర శిల్పకళా వైభవం ఉట్టిపడుతున్న 16 స్తంభముల మండపము యిచ్చట గలదు. పై భాగాన జ్వాలా నరసింహస్వామి ఆలయమున్నది. ఉగ్రనరసింహస్వామి కోపము పరాకాష్ఠను చేరుకొన్న రూపమే యీ జ్వాలా నరసింహస్వామి విగ్రహ స్వరూపము. గరుడ పీఠముపై దశహస్తములు గలిగి హిరణ్యకశిపుని సంహరించునట్లుగా విగ్రహము మలచబడెను. హస్తములలో శంఖము చక్రము, అంకుశము, గద ఉన్నవి. చెంతలో అంజలి ఘటించియున్న ప్రహ్లాద విగ్రహము కలదు. గరుడాద్రికి 4 కి.మీ. దూరమున పావననదీతీరమున పావన నరసింహస్వామి ఆలయమున్నది. సుఖాసీనుడైన లక్ష్మీనరసింహస్వామి శంఖ చక్రధారుడై, దక్షిణ హస్తముతో అభయ ముద్రను సూచించుచూ వామ హస్తమున లక్ష్మీదేవిని సమాదరించుచున్నాడు. వెనుక సప్తశిరస్సులుగల సర్పము గొడుగైయున్నది.

అహోబలపుణ్యక్షేత్రము చారిత్రాత్మకముగా ప్రాముఖ్యతను పొందింది. అహోబలదేవాలయములలో లభించే శాసనాధారములబట్టి రెడ్డిరాజుల కాలమున యీ ఆలయములు ప్రసిద్ధికెక్కినవిగా తెలియుచున్నది. కొండవీటిప్రభువైన ప్రోలయ వేమారెడ్డి (క్రీ. శ. 1325-1353) అహోబిలమునకు సోపాన మార్గమును కట్టించినట్లు తెలియుచున్నది. శా. శ. 1317 (క్రీ. శ. 1385-86) లో విజయనగర ప్రభువైన హరిహరరాయలు ఎగువ అహోబలమందు మండపము కట్టించెను. హంపీ విజయనగర ప్రభువైన శ్రీకృష్ణదేవరాయలు కళింగ దిగ్విజయానంతరము (శా.శ 1438-క్రీ.శ. 1516) అహోబల నరసింహస్వామిని దర్శించి, స్వామికి వజ్రమాణిక్యాల పతకం మాణిక్యాలతో పొదిగిన మణికట్టు, బంగారు పళ్ళెం, వెయ్యిబంగారు వరహాలు సమర్పించెనని శాసనముల ద్వారా తెలియుచున్నది. సదాశివరాయని రాజ్యకాలముతో కూడ అహోబలానికి ఆదరణ లభించెను. కాకతీయ రాజైన ప్రతాపరుద్రమహాదేవుడు యీ ఆలయమును పునరుద్ధరించెను. శాసనాధారములు లేకపోయినప్పటికి, కాకతీయశిల్ప కళా నైపుణ్యము అహోబలముఖమండప స్తంభములలో కానవచ్చుచున్నది. మొదటి అహోబలమఠాధిపతికి ప్రతాపరుద్రుడు బంగారునరసింహవిగ్రహమును బహూకరించెనని అనుశ్రుతముగా తెలియుచున్నది. ప్రస్తుతము నరసింహస్వామి స్వర్ణప్రతిమకు అహోబల మఠాధిపతులు ధూప, దీప, నైవేద్యములు జరిపించుచున్నారు. వైష్ణవభక్తుడు, గాయకుడైన శ్రీతాళ్ళపాక అన్నమాచార్యులవారు అహోబలాన్ని సందర్శించి యీ విధంగా కీర్తించారు. సప్తగిరివాసియైన శ్రీనివాసునే నృసింహస్వామిగా కొనియాడెను.

ఈవల నహోబిలాన నిరవై యున్నవాడు
శ్రీవేంకటాద్రిమీద సిద్ధమూర్తి యీతడు

నల్లమల కొండలు కర్నూలు జిల్లాలో ప్రారంభమై, చిత్తూరుజిల్లా వరకు వ్యాపించి ఉన్నవి. వీనిని ఆది శేషుని ప్రతిరూపముగా పురాణములలో అభివర్ణించి ఉన్నారు. ఆది శేషుని శిరము తిరుపతిగా, అహోబిలము నడుముగా, శ్రీశైలము సర్పవాలముగా నలరారుచున్నవి. *

— వొగాభట్ల మార్కండేయశర్మ

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## శంకరజయంతి

ఈ మే నెల 6 నుండి 10 వ తేదీ వరకు గల 5 రోజులు కావలిలోని శ్రీ శంకర మఠంలో శ్రీ శంకర భగవత్పాదుల జయంత్యుత్సవాలు ఘనంగా నిర్వహించబడినాయి. ప్రతిరోజు ఉదయం శ్రీ గొట్టిముక్కల రామకృష్ణగారిచే శంకరభాష్య ప్రవచనం జరుపబడింది. శ్రీ అక్కపెద్ది శ్రీరామశర్మ భాగవతార్‌గారి హరికథ, శ్రీ కోలూరు హనుమజ్జానకీరామశర్మ, శ్రీ ములుకుట్ల బ్రహ్మానందశాస్త్రి, డా॥ ధారా రామనాథశాస్త్రి మున్నగు వక్తలు ఉపన్యసించారు. ఈ ఉత్సవాలన్నీ శ్రీ ధారా నరసింహశాస్త్రిగారి పర్యవేక్షణలో నిర్వహింపబడ్డాయి.

## శివరాత్రి–ఉగాది ఉత్సవాలు

హిందూ ధర్మరక్షణ సంస్థ మెదకు జిల్లా శాఖ, సంగారెడ్డిలో ఈ శివరాత్రి మొదలు ఉగాదివరకు 4 భజనకార్యక్రమాలు, 4 ధార్మికోపన్యాసాలు, రెండు చక్రభజనలు, 2హరికథలు జయప్రదంగా నిర్వహించారు. హరిజనవాడల్లో కొన్నికార్యక్రమాలు నిర్వహించారు. ఈ కార్యక్రమాలన్నీ జిల్లాశాఖ కార్యదర్శి ముడుంబై రంగకృష్ణమాచార్యులు నిర్వహించారు.

## గీతాయజ్ఞం

శ్రీ రమా సత్యనారాయణస్వామి దేవస్థానం గుంటూరులో గత జనవరి 17 నుండి ఫిబ్రవరి 3 వరకు గల 18 దినాలు భగవద్గీతా జ్ఞానయజ్ఞం నిర్వహింపబడింది. యజ్ఞకర్త శ్రీమాన్ దిట్టకవి రామానుజాచార్యులు. ఈ యజ్ఞ ప్రారంభకులు డా॥ ప్రసాదరాయ కులపతి. చివరిరోజు ముగింపు సభలో శ్రీ జంధ్యాల జయకృష్ణ బాపూజీ, భగవద్గీతా శ్రోతలు ఎంతో పుణ్యాత్ములని వివరించగా, దేవాలయ ధర్మకర్త శ్రీ దశిక రామారావు పై వారిని ఘనంగా సన్మానించారు.

## బ్రహ్మోత్సవాలు

ఈ మే నెల 10 నుండి 20 వరకు గల 11 రోజులు ప్రకాశంజిల్లా లింగసముద్రంలో వెంచేసివున్న శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు నిర్వహింపబడుతున్నవి. 16 వ తేదీ శ్రీవారికి గరుడవాహనం, 17వ తేదీ కల్యాణం, 18 వ తేదీ రథోత్సవం.

## ఉగాది

హిందూ ధర్మరక్షణ సంస్థ నెల్లూరుశాఖ అధ్వర్యంలో, స్థానిక తి. తి. దే. కల్యాణ మండపంలో ఉగాది ఉత్సవాలు నిర్వహింపబడ్డాయి. శ్రీ చింతలపాటి పూర్ణానంద శాస్త్రిగారు పంచాంగ శ్రవణం చేయగా, శ్రీ కె. యస్. రామానుజాచార్యులు, శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి, శ్రీ యస్. శ్రీనివాసులు, రామాయణ ఉపన్యాసాలిచ్చారు. కు॥ఆర్.అనూరాధ, అన్నమయ్య పాటలను, శ్రీ వై. దుర్గాప్రసాద్ హరికథను గానం చేశారు.

కల్యాణమండపంలో, శ్రీ రామనవమి సందర్భంగా శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవం స్థానిక వేంకటేశ్వర భక్తసంఘం వారిచే నిర్వహింపబడింది.

## గుంటూరు

అలాగే, గుంటూరు హిందూధర్మరక్షణ సంస్థశాఖ స్థానిక సంజీవయ్య నగరు, హరిజనవాడలో రామాలయంలో ఉగాది కార్యక్రమాలు నిర్వహించారు. పురాణ పండితులు శ్రీ సోమాశి బాలగంగాధరశర్మగారు పంచాంగ శ్రవణము చేయగా, శ్రీ యం. వి. యల్. నరసింహారావు ఉగాది ప్రాశస్త్యాన్ని వివరించారు. శ్రీ రాధాకృష్ణ భజన సంఘం వారిచే భజనలు నిర్వహింపబడ్డాయి. ఈ కార్యక్రమాలను జిల్లా ఆర్గనైజరు శ్రీ దుర్గా ప్రసాద్‌గారు పర్యవేక్షించారు. గుంటూరు తి. తి. దే. కల్యాణ మండపంలో నిత్యమూ సాయంత్రం శ్రీ సోమాశి బాలగంగాధరశర్మగారిచే పురాణ శ్రవణం నిర్వహింపబడుతున్నది.

## హరిజనవాడలో

గత ఏప్రిల్ 7వ తేదీ ప్రొద్దుటూరు మోడంపల్లి హరిజనవాడలో ధార్మిక కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. ఏర్పేడు వ్యాసాశ్రమ పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ విద్యానందగిరి స్వాములు సందేశమిచ్చారు. ప్రతి హరిజన కుటుంబంవారు శ్రీ స్వామికి పాదపూజచేశారు. స్థానిక శ్రీకృష్ణగీతాశ్రమస్థాపకులు శ్రీనామాఎరుకలయ్య ప్రతి హరిజన కుటుంబానికి తీర్థప్రసాదాలు, వంటపాత్రలు పంచారు. హిందూధర్మరక్షణ శాఖ ఆర్గనైజరు శ్రీ కె. కృష్ణాజి, ఆధ్వర్యంలో ఈ కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి.

## శ్రీరామనవమి

ఉగాది సందర్భంగా ప్రకాశంజిల్లా వీరన్నపాలెం గ్రామంలో ధార్మిక కార్యక్రమాలు జరిగాయి. స్థానిక వేంకటేశ్వర భక్తబృందం సహకారంతో, ప్రకాశంజిల్లా ధర్మరక్షణశాఖ ఈ కార్యక్రమాలను జయప్రదంగా నిర్వహించింది.

ప్రకాశంజిల్లా సంతమాగులూరుగ్రామం హరిజన, యానాదికాలనీల్లో స్థానిక వేంకటేశ్వర భక్తబృందంచే శ్రీరామనవమి ఉత్సవాలు నిర్వహింపబడ్డాయి. అచ్చట ప్రకాశంజిల్లా హిందూధర్మరక్షణశాఖ వారిచే శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవం నిర్వహింపబడింది. తదనంతరం శ్రీ ఎం. వి. ఎల్. నరసింహారావు శ్రీరామతత్త్వాన్ని వివరించారు. పలువురువక్తలు ఉపన్యసించారు. జిల్లా ఆర్గనైజరు శ్రీ నాగేశ్వరరావుగారి ముగింపు ఉపన్యాసంతో ఉత్సవాలు ఘనంగా ముగిశాయి.

## పన్నెండవ అధ్యాయం

### భక్తియోగం

అర్జున ఉవాచ:

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

అర్జునుడు: ఇలా నిరంతరం మనసు నీమీదే నిలిపి నిన్ను భజించే భక్తులు ఉత్తములా? ఇంద్రియాలకు గోచరించని ఆత్మస్వరూపాన్ని ఆరాధించే వాళ్లు ఉత్తములా?

శ్రీ భగవానువాచ:

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః॥

శ్రీ భగవానుడు: నా మీదే మనసు నిలిపి నిత్యనిష్ఠతో, పరమ శ్రద్ధతో, నన్ను ఉపాసించేవాళ్లే ఉత్తమయోగులని నా వుద్దేశం.

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్॥

పార్థా! సమస్త కర్మలూ నాకే సమర్పించి, నన్నే పరమగతిగా భావించి, ఏకాగ్రతతో నన్ను ధ్యానిస్తూ సేవించే నా భక్తులను – మనసు నామీదే నిలిపే వాళ్ళను – మృత్యుముఖమైన సంసార సాగరం నుంచి అచిరకాలంలోనే నేను ఉద్ధరిస్తాను.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥

నా మీదే మనసునూ, బుద్ధినీ నిలుపు. ఆ తర్వాత తప్పకుండా నీవు నాలోనే నివసిస్తావు.



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)


వ్యాఖ్యాత:

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి


యే త్వక్షరమనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్॥
సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః॥

ఇంద్రియాలన్నిటినీ బాగా వశపరచుకొని సర్వత్ర సమభావం కలిగి, సమస్త భూతాలకూ మేలు చేయడంలోనే సంతోషం పొందుతూ, నాశరహితమూ, అనిర్వచనీయమూ, అవ్యక్తమూ, సర్వవ్యాప్తమూ, ఊహాతీతమూ, నిర్వికారమూ, నిశ్చలమూ, నిత్యమూ అయిన ఆత్మస్వరూపాన్ని ఉపాసించే వాళ్లు నన్నే పొందుతారు.

క్లేశోఽధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥

అవ్యక్తమైన ఆత్మస్వరూపాన్ని ఆరాధించేవాళ్ల శ్రమ ఎంతో ఎక్కువ. ఎందువల్లనంటే శరీరంమీద అభిమానం కల వాళ్ళకు అవ్యక్తబ్రహ్మం మీద నిష్ఠ కుదరడం కష్టసాధ్యం.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥

ధనంజయా! అలా మనసు నామీద నిశ్చలంగా నీవు నిలపలేకపోతే అభ్యాసయోగంలో నన్ను పొందడానికి ప్రయత్నించు.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥

అభ్యాసం చేయడంలోనూ అసమర్థుడవైతే నా కోసం కర్మలు ఆచరించు. నాకు ప్రీతి కలిగించే కర్మలు చేయడం వల్ల కూడా నీవు మోక్షం పొందగలుగుతావు.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥

ఇక అదీ చేయలేకపోతే నన్ను ఆశ్రయించి, మనోనిగ్రహంతో నీవు చేసే సమస్త కర్మల ఫలాలను త్యాగం చెయ్యి.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్॥

అవివేకంతో కూడిన అభ్యాసంకంటే జ్ఞానం మేలు; జ్ఞానంకంటే ధ్యానం ఉత్తమం; ధ్యానంకంటే కర్మఫలత్యాగం మంచిది. ఆ త్యాగంవల్ల మనశ్శాంతి కలుగుతుంది.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః॥

సమస్త ప్రాణులపట్ల ద్వేషం లేకుండా స్నేహభావం, దయకలిగి, అహంకార మమకారాలు విడిచిపెట్టి సుఖదుఃఖాలను సమానంగాచూస్తూ, ఓర్పుతో వ్యవహరిస్తూ నిత్యం సంతృప్తితో యోగసాధనతో, ఆత్మనిగ్రహంతో, దృఢసంకల్పంతో మనసూ, బుద్ధీ, నాకు అర్పించిన నా భక్తుడు నాకు ఇష్టుడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగైః ముక్తో యస్స చ మే ప్రియః॥

తనవల్ల లోకమూ, లోకంవల్ల తానూ భయపడకుండా సంతోషం, కోపం, భయం, ఆవేశాలకు వశంకాకుండా వుండే వాడు నాకు ఇష్టుడు.

అనపేక్షశ్శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్సమే ప్రియః॥

దేనిమీదా కోరికలు లేనివాడు, పవిత్రుడు, కార్యదక్షుడు, పక్షపాతం లేనివాడు, చీకూ చింతా లేనివాడు, ఆడంబర కర్మలన్నిటినీ విడిచిపెట్టినవాడు అయిన నా భక్తుడు నాకు ఇష్టుడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః॥

సంతోషం, ద్వేషం లేకుండా దుఃఖం, కోరికలూ, శుభాశుభాలు వదలిపెట్టిన నా భక్తుడంటే నాకు ఇష్టం.

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్।
అనికేతస్థ్సిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః॥

శత్రువులపట్ల, మిత్రులపట్ల, అలాగే మానావమానాలు, శీతోష్ణాలు, సుఖదుఃఖాలు దూషణభూషణలపట్ల సమభావం కలిగినవాడు, దేనిమీదా ఆసక్తిలేనివాడు, మౌనంగా వుండేవాడు, ఏ కొద్దిపాటి దొరికినా సంతృప్తిచెందేవాడు, స్థిరనివాసం లేనివాడు అయిన నా భక్తుడు నాకు ఇష్టుడు.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమాః భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥

శ్రద్ధతో నన్నే పరమ గతిగా నమ్మి అమృతంలాంటి ఈ ధర్మాన్ని నేను చెప్పినట్లు పాటించే నా భక్తులు నాకు చాలా ఇష్టులు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం శ్రీ కృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'భక్తి యోగం' అనే పన్నెండవ అధ్యాయం సమాప్తం.



# తరిగొండ వెంగమాంబ

— కుమారి మునిగోటి రాధిక




ఆంధ్ర కవితామతల్లిని కృతికుసుమాలతో అలంకరించి అర్చించిన కవయిత్రులలో మొల్ల, మధురవాణి, రంగాజమ్మ, తరిగొండ వెంగమాంబ మొదలగువారు పేరెన్నిక గన్నవారు. ప్రముఖ వాగ్గేయకారుడు సారంగపాణి, భక్తకవి దూర్జటి, కన్నడకవిరత్నము పంపడు మున్నగు మహనీయుల జననముచే పునీతమైన ప్రదేశం చిత్తూరు మండలం. అట్టి ఈ మండలంలో జన్మించి, మూఢాచారాల నెదిరించి, తన కవితా శక్తిచే భగవన్నామ పారాయణ మొనరించుచు తెలుగు సాహితీ క్షేత్రాన్ని సుసంపన్నము గావించిన భక్త కవయిత్రీమతల్లి తరిగొండ వెంగమాంబ!

వెంగమాంబ జన్మస్థలం చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకాలోని తరిగొండ. ఈ గ్రామం భక్తవత్సలుడగు శ్రీ లక్ష్మి నరసింహ స్వామి వారికి ప్రీతి పాత్రమైన పవిత్రభూమి. రాయలసీమప్రాంతాన్ని పురాణకాలంలో ప్రహ్లాదుడు పరిపాలించిన దేశం అని అంటారు. బహుశ అందుకే కాబోలు ఈ ప్రాంతంలో నృసింహ స్వామి వారి ఆలయాలు అధికంగా వెలసి ఉన్నాయి.

పూర్వమీ ప్రాంత మంతా చెట్టుచేమలతో నిండి పచ్చని పచ్చిక బయళ్ళతో కనుల పండువుగా కళ కళ లాడుతూ వుండేది. సంపదలో కెల్ల శ్రేష్ఠమైనది పశుసంపద. అట్టి పశుసంపద సమృద్ధిగా గలిగిన "చిట్టి చెర్ల" నాయని వారైన రామనాయుడు తమప్రాంతములో కఱవు కాటకాదుల వల్ల బాధలుపడి, పశుగ్రాసంకోసమై తిరుగాడుతూ తన పరివారంతో తరిగొండ ప్రాంతానికి తరలివచ్చి శోభాయమానమైన అచ్చటి ప్రకృతి సౌందర్యాన్నిచూచి, ఆనందించి, అచ్చట కొన్నాళ్లు ఉండదలచి, గుడారాలు వేసికొన్నారు.

ఒకనాడు ప్రభాత వేళ రామానాయని వారి సతీమణి చల్ల చిలుకుతూ వుండగా ఉన్నట్టుండి కుండలో ఒక రాయి కవ్వానికి అడ్డు తగిలింది. ఆరాతిని రెండు మూడు పర్యాయాలు తీసివేసినా మరల మరల ఆ రాయిఅదే విధముగానే అడ్డురాసాగింది. అందుకు ఆమె ఆశ్చర్యపడి ఆ వింతను తన పతికి తెలియజేసింది. అతడును అందుకు కారణం నిశ్చయింప జాలక ఆలోచనా పరవశుడయ్యాడు. వారి ఇలవేల్పైన శ్రీ లక్ష్మీనరసింహస్వామి నాటి రాత్రి స్వప్నంలో సాక్షాత్కరించి తాను వాళ్లను వీడక ఇంత దూరం వచ్చినాననియు, ఇక ఈ తపోభూమి యందే నెలకొని భక్తుల అభీష్టాదులుతీరుస్తూవుంటానని పల్కినాడట. శ్రీ స్వామి వారి ఆనతి మేరకు ఆ రామానాయుడు ఆ నల్లని రాతిని స్వామితో బాటు ఒక పవిత్ర ప్రదేశంలో ప్రతిష్ఠగావించాడు. ఆ స్థలంలో అంతకు పూర్వం ఎన్నో యేళ్ల క్రితం దూర్వాస మహర్షి లక్ష్మీనృసింహ స్వామిని ప్రతిష్ఠించి వుండినారట! అంతే గాక ఆ మహర్షి మరింత మహిమ సంతరింపజేసే ఉద్దేశంతో ఆ ఆలయంలో అసత్య మాడితే అట్టివారు అన్నివిధాల అడుగంటి పోతారని నిర్దేశించాడట! ఆ మహనీయుని దివ్యవాక్కు ప్రత్యక్షర సత్యం అనటానికి నేటికీ అనేక తార్కాణాలు అగపడుతూనే వున్నాయి.

మజ్జిగ కుండ (తరికుండ) లో స్వామి ఉద్భవం కావడంచేత "తరికుండ" అను పేరుతో ఈ గ్రామం ప్రసిద్ధమై, రానురాను ప్రజల ఉచ్చారణలో "తరిగొండ" గా



స్థిరపడింది. నాడు కుండలో అగుపించిన నల్లని రాయి నేటికీ స్వామివారి సన్నిధిలో పూజలందుకొంటూ సాక్షిభూతంగా విల సిల్లుతూ వున్నది.

అట్టి మహాపుణ్య క్షేత్రంలో జన్మించడం వల్లనే ఈ కవయిత్రీమతల్లి తరిగొండ వెంగమాంబగా ప్రశస్తిగాంచింది. ఈమె పదు నెనిమిదవ శతాబ్దపు ఉత్తరార్ధంలో జీవించి వుండినట్లు పరిశోధకుల అభిప్రాయం. వీరిది పండిత వంశం. ఇందుకు నిదర్శనంగా వీరి తాతగారైన శ్రీకానాల నరసింహ కవిగారు (క్రీ. శ. 1750 ప్రాంతం) "శేషధర్మములు" అనే గ్రంథం రచించి తరిగొండ లక్ష్మీనృ సింహునికి అంకితంచేసి వుండడమే. పుణ్య దంపతులైన మంగమాంబా, కృష్ణయ్యల పూజాఫలమీమె! "పువ్వుపుట్టగానే పరిమళి స్తుంది" అనే సామెతగా ఈమె బాల్యం నుండీ భగవంతునికి సంబంధించిన ఆట పాటల్లో అమితాసక్తి చూపుతూ, పార మార్థిక చింతనతో నిత్యం కాలక్షేపం చేస్తూ వుండింది. ఎనిమిదేళ్ల యీడున నిజగురు వైన సుబ్రహ్మణ్య యోగిచే తారకోపదేశం పొందింది. పంద్రెండేండ్ల ప్రాయంలో లోకరీతిని అనుసరించి వివాహ మాడవలసి వచ్చినప్పటికీ, రమానాథుడే తన మనో నాథుడన్న భక్తమీరావలె, సాంసారికచింతన విడిచి తపస్విని వలె మెలగుతూ వుండింది.

అనతికాలంలోనే వైధవ్యం సంప్రా ప్తింపగా కుల మర్యాదల ప్రకారంగా వైధ వ్యరీతిని అంగీకరింపకుండింది. వేంకట నాథుడే తన నాథుడనే విశ్వాసంతో తనకు వైధవ్యం రాలేదనీ శిరోముండనం వంటి మూఢాచారాలను ససేమిరా అంగీకరింపక ఎదురు నిలిచింది. ఈ విప్లవాత్మక భావన విప్రకులంలో కలకలం రేపింది. వారెట్లైనా ఆమె చేత వైధవ్య లక్షణాలను ఆచరింప జేయవలెననే పట్టుదలతో శతధా ప్రయ త్నింపసాగారు.

ఈ విధంగా బ్రాహ్మణ సంఘానికీ వెంగ మాంబకూ నడుమ వైరుధ్యం కొనసాగుతూ వుండగా ఒక పర్యాయం పుష్పగిరి పీఠాధి పతి సపరివారంగా తరిగొండకేతెంచారు. బ్రాహ్మణులంతా కలసి కట్టుగా స్వాముల వారికి వెంగమాంబ వృత్తాంతాన్ని నివే దించారు, ఆమె కారణ జన్మురాలని తమ దివ్య దృష్టితో తెలిసికొన్న స్వాములవారు ఆమె మహిమను అందరూ గ్రహించేటట్లు చేయదలచిన వారై ఆమెతో పలు విధాల వాదోపవాదాలను కొనసాగించినారు. చిట్ట చివరకు ఆమె శిరోజాలు తొలగించి నట్లైతే అటుపిమ్మట వాటిని మొలవకుండా చేయ గల్గితే తానందుకు సిద్ధమే అని పలికింది. స్వాములవారు చిఱునవ్వుతో చూస్తూవుండి నారు. శిరోముండనం యథావిధిగా ముగిసిన పిదప ఆమె కోనేట్లో మునిగి లేచింది. చూపరులందరు దిగ్భ్రాంతి చెందగా ఆమె శిరోజాలు ఎప్పటి రీతిని శిరస్సుపై గోచరించాయి. బ్రాహ్మణులు ఆమె మహిమను గుర్తించిన వారై వెనకకు మరలినారు, వెంగమాంబ నరహరిని కీర్తిస్తూ స్వామి దర్శనానికి సాగిపోయింది.

> "చేరి తరిగొండపురి నారసింహ దేవుఁ
> డాన తిచ్చిన రీతిగ నే నిమిత్త
> మాత్రమునఁ బల్కుదును స్వసామర్థ్య
> మిప్ప
> డరయ నించుక యేని నాయందు లేదు"

అని నుడివిన

వెంగమాంబ మురాషావలీ- అను మహమ్మదీయునకు శ్రీకృష్ణమాచార్యుడను జిజ్ఞాసువుకూ, తన తలి దండ్రులకూ తత్త్వోప దేశంకావించి తానిక ఆ గ్రామంలో నిలవక తనమనోనాథుడైన జగన్నాథుని చేరదల చినదై సారంగమార్గం గుండా పుణ్యక్షేత్ర మైన తిరుమల చేరుకొన్నది.

తిరుమలలో శ్రీవారిని సేవిస్తూ కొంత కాలం వుండిన అనంతరం ఆ మహనీయు రాలు తుంబురుకోనచేరి అచ్చట ఒక గుహలో కొన్ని సంవత్సరాలు తీవ్రంగా తపస్సాధన గావించి మహాయోగిని అయింది. అటుపిమ్మట భక్తుల కోరికపై తిరుమలకు మరలివచ్చి, తాళ్లపాక వారి యింటి ప్రక్కనున్న తన మఠంలో నివ సిస్తూ గ్రంథరచన కొనసాగించింది. ఈ రీతిగా శ్రీనివాసుని దివ్యలీలలను అభి వర్ణించుకొంటూ జీవిత పర్యంతం ఆ దేవుని పదసన్నిధిగా గడిపి మోక్షాన్ని చూఱ గొన్నది ఈ పరమ భాగవతోత్తమురాలు!

---



## రాగలహరి



సప్తగిరి ప్రారంభించిన గ్రంథసమీక్ష బహుళ జనాదరణ పొందిన విషయము అందరకూ తెలిసినదే. కాని ఈ సమీక్షాకార్యక్రమము నిజానికి ఏ ఒక్క కళకిపరిమితము కాదు. అయితే కళలు తరచినకొద్దీ అమృత స్పందిని అవుతుంది. సప్తగిరి జన్మ సంచిక నుండి 'రాగలహరి' శీర్షికన భక్తిప్రబోధకమైన క్యాసెట్ల సమీక్ష కార్యక్రమము ప్రారంభించబోతున్నాము. దీనివలన మహాకవుల లలిత భావతరంగాలు దేశమంతటా వ్యాప్తికలిగించే అవకాశం ఏర్పడుతుందని ఒక భావన.

తమ క్యాసెట్లను సమీక్ష చేయించదలచుకొన్నవారు రెండు క్యాసెట్లు ఈ క్రింది చిరునామాకు పంపవలసివుంటుంది.

చిరునామా :

'రాగలహరి' శీర్షికకు,
సంపాదకుడు,
సప్తగిరి, తిరుపతి.

మహనీయుల చరితము నర్థము చేసి కొనజాలని లోకులు కాకులు గదా! తిరుమల యందును ఈమె తిరస్కారముల సహింప వలసి వచ్చింది. రామకృష్ణుని వలె నీమెయు పిచ్చిదిగా పరిగణింపబడి, బావాజీవలె బాధలనందినది. ఈమె మహిమలెన్నింటినో దెల్పు దృష్టాంతములు గలవు. శ్రీ వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవ సమయమున స్వామి వారి రథము ఈమె బసచేసిన ఇంటి ముంగిటి వరకు వచ్చి ఆగి పోయినదట! ఇదమిత్థంగా కారణమేమో గ్రహించలేని గుడి పూజారులు, తదితరులు ఏనుగులతో లాగించినా ఒక్క అంగుళమైనా కదల్లేదు. ఏమీ చేయడానికి తోచని పూజారులు తమలోతాము తర్జన భర్జనలు చేయసాగారు. అప్పుడు అచ్చట చేరియున్న భక్తాదులలో ఒకడు "ఇది వెంగమాంబ గారిని నిర్లక్ష్య మొనరించి నందుకు శ్రీస్వామివారికి ఆగ్రహము వచ్చియుండవచ్చు" అని పల్కాడు. అది నిజమే ఐ యుంటుందని వాళ్లామెను సమీపించారు. "వెంగమ్మ తల్లీ! మా తప్పిదాన్ని మన్నించి మా యెడ ప్రసన్నురాలవు" కమ్మని ప్రాధేయ పడినారు. దయామయురాలైన ఆమె మఠంలో నుండి రథంవద్దకు వచ్చి శ్రీస్వామి వారికి కర్పూర హారతి ఇచ్చింది. వెంటనే జగన్నాథుని రథచక్రాలు కదలినాయి. వేంగమాంబ కీర్తి కర్పూర పరిమళం వలె వ్యాపించింది!

ఇట్టి మహిమ లెన్నో కనబఱచిన దివ్య శక్తి సంపన్నురాలగు మహనీయురాలు మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. ఇట్లు శ్రీస్వామివారి కృపకు పాత్రురాలై, స్వామి కైంకర్యంలోనే తన బ్రతుకును చరితార్థం చేసికొని ఆ స్వామిలోనే ఆమె లీనమైంది, నేటికీ శ్రీవేంకటేశ్వరుని అనుదిన ఆరాధనలో పవళింపుసేవ వేళలో ఆమె పేరిట 'ముత్యాలహారతి' ఇవ్వబడుతూ వుండడమే ఆమె నిర్మల భక్తికొక నిదర్శనం!

ఈ కవితా తపస్విని శ్రీవేంకటాచల మాహాత్మ్యము, ద్విపద భాగవతము (పన్నెండుస్కంధములు), రాజయోగ సారము, ముక్తికాంతావిలాసము, విష్ణు పారిజాతము, శివవిలాసము, వాసిష్ఠ రామాయణము, శ్రీకృష్ణమంజరి మొదలగు అనేక రచనలను గావించింది. తన కావ్యాలన్నింటినీ నరాంకితం కాకుండ నరహరికి అంకితమొనరించింది! భాగవతము, శివ విలాసము తప్ప తక్కిన వన్నియు ముద్రితాలు. ఈమె రచనల్లో ప్రక్రియా వైవిధ్యమేగాక, శివకేశవాభేదభావనకూడా గమనింప దగ్గది.

అట్టి జగన్మాన్య యొక్క దివ్యచరిత్ర ఎందరోకవులను అలరింప జేసి అనేక రచనల్లో అక్షరాకృతితో సాక్షాత్కరిస్తూ వుంది. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు కూడ ఈమెపై రచించిన సిద్ధాంత వ్యాసానికి ఇటీవలే డాక్టరేటు పట్టాన్ని ప్రసాదించారు. దేవస్థానంవారి ఆర్థిక సహాయముతో ఈ గ్రంథము ప్రచురింపబడింది. వివిధ తరగతుల పాఠ్య గ్రంథాల్లోనూ సాక్షాత్కరిస్తూవున్న ఈమె కవితా వైశిష్ట్యాన్ని బట్టి "ముదితల్ నేర్వగ రాని విద్యగలదె ముద్దార నేర్పింపగన్" అను లోకోక్తి ప్రత్యక్షర సత్యంగా సార్థక మౌతున్నది.

ఈమె వలెనే ఇదే నామధేయంకల ఇంకో భక్తురాలు సద్గురు మాణిక్యప్రభువులవారి శిష్యురాలై కర్ణాటక రాష్ట్రంలోని బీజాపూర్ గుల్బర్గా ప్రాంతములందు ప్రసిద్ధురాలైంది. ఈ విధంగా వెంగమాంబ జీవితం పోతన, మీరాబాయి, బావాజీ, త్యాగయ్య, రామకృష్ణపరమహంస మొదలైన మహనీయుల ధన్యజీవితాలను పోలి పవిత్ర చరిత్రగా భాసిల్లుతున్నది. శ్రీ వేంకటేశ్వర భక్తులకు ఆదర్శమూర్తియై మహిళాలోకంలో మణి పూసయై ఆంధ్ర కవయిత్రీ లోకంలో శిఖరాయమాణంగా ప్రకాశిస్తూవున్న తరిగొండ వెంగమాంబ ప్రాతస్స్మరణీయురాలు. ఆమె రచనలు ఆంధ్రజాతికి ప్రతిదిన పారాయణార్హాలు.

## ఎవడం వైష్ణవు డనగ?

తన నైజ ధర్మమ్ము
నెవడు విడనాడడో!
శత్రు మిత్రాదులన్
సమదృష్టి యుతు డెవడో!!
ఒకరి సొత్తు హరింప
ఎవ డుద్యమింపడో!
అన్యహింసాయత్త
చిత్త మెవనికి లేదో!!
ఎవని మానస ముచ్చ
గతి నుద్గమించునో!
అతడె పో వైష్ణవుడు
అతి గౌరవార్హుండు!!
మాత్సర్య రహితుండు
అతి శాంత చిత్తుండు
అకలంక చరితుండు
సకల భూత ప్రియుండు॥
నిష్కపట వర్తనుడు
ప్రియ సత్య హిత వాగ్మి:
అతని హృదయము వాసు
దేవుని నివాసమ్ము॥

భూసార చిహ్నమౌ
సాలవృక్షము వగిది
హృదయగత పరమాత్మ
సూచితోజ్జ్వల మూర్తి॥
యమ నియమ విధి నిషే
ధానుగత శీలుండు:
మద లోభ మాత్సర్య
విదళి విదూరుండు॥
అట్టి వైష్ణవుగాంచి
అతి దూర మేగుడని
యముడు తన భటుల కా
దేశించె తీవ్రముగ॥
ఏవం విధానేక
వైష్ణవ విలక్షణుని
సేవింప చేకూరు
శ్రీ వైష్ణవత్వమ్ము॥

(శ్రీ విష్ణు పురాణ మాధారంగా)

— బొడ్డుపల్లి పురుషోత్తం

# యువ వాణి

"శాస్త్రిగారూ ! కాపాడాలి ! మీరే మా సుగుణని కాపాడాలి ! ఒక్కసారి మీరు రావాలి శాస్త్రిగారూ"

శాస్త్రిగారి ముఖంలో అహంభావ పూరిత మైన దరహాస రేఖ విరిసింది. "ఊఁ—" గంభీరమైనశబ్దం వెలువడింది ఆయన స్వరం నుంచి. ప్రెసిడెంటుగారు కళ్ళలో ఆత్రుత, ఆవేదన కనబరస్తూ ఎదురుగా నుంచున్నారు. ఆయనను శాస్త్రిగారు కనీసం కూర్చోమనైనా అనకపోవడం ఆయ నకు ఇబ్బందిగానే తోచింది, కాని అవసరాన్ని బట్టి ఆ బాధని లోపలే అణచుకున్నారు. ఆయన వెనకే వెంకడు చేతులు కట్టుకొని శాస్త్రిగారి కేసి చూస్తున్నాడు ఆదుర్దాగా !

"లక్షణాలేవిటో చెప్పారుగాదు ! శాస్త్రిగా రడిగారు, ఏం చెప్ప మంటారు. ఒక్కగా నొక్క ఆడపిల్ల. పెళ్ళీడుకెదిగిన మా సుగుణ గురించి ఆలోచిస్తే నాకడుపు తరుక్కు పోతుంది. వారం రోజులనుంచి పట్టెడన్నం కూడా తినడం లేదు. పచ్చి మంచినీళ్ళు ముట్టుటలేదు. అర్థరాత్రివేళ లేచి ఏడుపులు పిచ్చి కేకలు, నన్ను వాళ్ళమ్మని, ఇంట్లో వాళ్ళని కొట్టడం, రక్కడం, సామాన్లు అందిందల్లా విసిరైెడం ఏమిటి ! ? ఒకటి కాదు ! నానా హడావిడి చేసేస్తోంది. ఇదేదో గ్రహ సంబంధమేనని మాకు రూఢిగా అని పిస్తోంది. తమరు దయ చెయ్యాలి !"

వస్తాను ! కాని—స్వామి పూజ జరిపి రావాలి ! ఖర్చుకాస్తఎక్కువ ! — ఎంతవు తుందో సెలవివ్వండి !

"ఆ ఎంతోనా ! ఐదువందలైతే సరిపెడ తాను !"

"ఊ పంపుతాను మా వెంకడిచేత ! మా సుగుణని మాత్రం తిరిగి మామూలు మనిషిని చెయ్యాలి శాస్త్రిగారూ ! అదే నే కోరేది !"

"అలాగే త్వరగా లెక్క పంపించండి ; పూజ ప్రారంభించాలి ! ఆ గ్రహచేష్టలు అర్థరాత్రినుంచి కదూ ప్రారంభమౌతూంట. సరే ! అదే వేళకి వస్తాను. తలుపులు తీసి వుంచండి."

"అలాగే ! మరి సెలవిప్పించండి ! లెక్క వెంటనే పంపిస్తాను. నమస్తే ! ప్రెసి డెంట్ గారు వెళ్ళిపోయారు ! వెంకడు వెనుకనే అనుసరించాడు. శాస్త్రిగారు లోనికి వెళ్ళారు. అంతా విన్న శాస్త్రిగారి భార్య పద్మకి యిదంతా ఏవగింపుగా వుంది. ఆమె ఆలోచనలు వేరు ! నిజానికి శాస్త్రికి వచ్చిన లోటేమి లేదు. ఆయన ప్రభుత్వోద్యోగి. ఇద్దరే పిల్లలు ! ముచ్చటైన సంసారం ! కాని శాస్త్రిగారికి తృప్తి అనేది కనబడదు. పద్మకదే బాధ ! ఆంజనేయస్వామిని ఉపా సిస్తారు శాస్త్రిగారు. దక్షిణ పుచ్చుకుంటే ఆ భక్తికి సత్ఫలితం వుండదంటుంది పద్మ ! అవేమీలెక్కపెట్టక ధనార్జనేముఖ్యమంటారు శాస్త్రిగారు. నిజంగా ఆంజనేయస్వామినే సర్వస్వంగా నమ్ముకొంటే ఈ తాపత్రయం దేనికి ! తృప్తి అనేది ఉంటే చాలదా ? కోరికలు కొల్లలుగా వుంటే వాటిని అదుపులో

# ఉపదేశం

పెట్టలేని భక్తి దేనికి ? నిజమైన భక్తుడు ఆడంబరాలకు, కోరికలకు దాసుడుకాగలడా ? ఇవన్నీ పద్మ మస్తిష్కాన్ని మథించే ఆలో చనలు ! వాటికి పరిష్కారం ఎప్పుడు దేవా అని ఆ స్వామి మందిరం ముందు నిలబడి ప్రార్థించింది పద్మ ; సమయం రావాలి తల్లీ ! అన్నట్లున్నాయి పటంలోని భక్తాంజ నేయుని చూపులు !

శాస్త్రిగారు బయల్దేరారు బయటికి ! ఆయన అడుగులు ముందుకి, ఆలోచనలు వెనక్కి నడుస్తున్నాయి. ఈనాడు ఈ గ్రామంలో తన మాట వేదం ! ఆంజనేయుడు భక్తుడుగా, ఉపాసకుడుగా తన పేరు దశదిశలా వరిధ విల్లుతోంది. ఇదంతా తన గురువు చలవ ! తన ఇరవయ్యో ఏట తనకు ఆంజనేయ ఉపదేశం చేశారాయన ! "భక్తికి నీతినీ,



న్యాయాన్నీ, ధర్మాన్నీ జోడించి నీ జీవితం పదిమందికీ ఉపయోగపడేలా జీవించు నాయనా! అన్నారు ఆరోజు! అదే తనకు ఎబ్బెట్టుగా తోచింది. ధన సంపాదన భక్తి పేరుతో చేస్తే పాపం అనే వారు మూర్ఖు లనీ శాస్త్రిగారి ఉద్దేశం! మళ్ళీ ఆ గురువు గారి దర్శనం కోసం ప్రయత్నించ లేదు శాస్త్రిగారు. ఆయనే అప్పుడప్పుడు తన శిష్యుని చూడడానికి వచ్చి పోతుంటారు. ధర్మోపదేశం చెయ్యడం, శాస్త్రిగారు "ఊ" అనడం మామూలే! ఇన్ని తెలిసిన తన గురువు గారికి "ధనమూల మిదం జగత్" అని తెలియక పోవడం ఆశ్చర్యమే! ఆలో చిస్తూనే శాస్త్రిగారు ప్రెసిడెంటుగారిల్లు చేరు కున్నారు. సాదరంగా వినయంతో ఆహ్వా నించారు ప్రెసిడెంటుగారు, అక్కడున్న పెద్దలు "ఆమె ఎక్కడ?" గంభీరంగా అడిగారు శాస్త్రి! ఆ గది చూపించారు ప్రెసిడెంటుగారు. ఘోషా పాటించే ఆడ వాళ్ళు చాటునుంచి ఆత్రంగా చూస్తూ, చేతులు జోడించారు శాస్త్రిగారి నుద్దేశించి. శాస్త్రిగారు గదిలోకిచేరి తలుపులు మూసారు. సుగుణ జుట్టు విరబోసుకుంది. ఆశ్చర్యం! వారం నుంచీ ఆహారం తీసుకోకున్న ఆమె ఏ మాత్రం నీరస పడలేదు! నిగారింపుతో ఆమె పాతికేళ్ళ పరువం క్షణం పాటు శాస్త్రి గారి చూపుల్ని నిలేసింది! "ఏమే దుష్ట గ్రహ పిశాచీ! నేనెవరను కున్నావ్! నా ఎదుట నిలబడే ధైర్యమే నీకు? ఛో! తక్షణం పో!" అరిచారు శాస్త్రి! సుగుణ ప్రవర్తన మితి మీరింది. పిచ్చి గంతులు వేస్తోంది.! జాకెట్ చింపేసుకుంది. ఒళ్ళు విరుచుకుంటూ ముందుకీ వెనక్కి ఊగు తోంది. శాస్త్రి కళ్ళు ఒక్కసారి ఆమె అనా చ్ఛాదితపీన వక్షస్థలంమీదనిలచిపోయాయి. పాలపొంగుల వక్షోకుంభాలు ఆయన నాలుకను స్తంభింపచేశాయి. మంత్రం మరి చారు మత్తులో పడ్డ శాస్త్రిగారు! అదే అద నులో సుగుణ ఆయనకు దగ్గరగా వచ్చింది. మతిపోయిన శాస్త్రిగారు ఆమెను దగ్గరగా తీసుకోవాలని ప్రయత్నించారు! అంతే సుగుణ రెండు చేతులూ శాస్త్రిగారి శరీరం



మీద స్వైర విహారం చేశాయి. ఆ బలిష్ఠ మైన శరీరం సుగుణముందు మత్తులో ఎదురు తిరగలేక పోయింది. దెబ్బమీద దెబ్బగా శాస్త్రిగారి శరీరం అలసిపోయింది. మంచానికి గోడకు మధ్యగా ఆయన శరీరం వాలిపోయింది! వికటాట్టహాసం చేసు కుంటూ సుగుణ తలుపులు తెరచుకొని బయ టికి వచ్చింది. బయటి వారు లోపలి కెళ్ళి ఆ దృశ్యాన్ని చూసి స్తంభించి పోయారు. ప్రెసిడెంటు గారికి మతిపోయినంత పన యింది!

"బాబూ! ప్రసాదూ! ఈ వార్త విన్నావా! శాస్త్రిగారుకూడా సుగుణకి పట్టిన గ్రహాన్ని వదిలించలేక పోయారట!"

"అమ్మా! నన్ను ప్రయత్నించమంటా వామ్మా!"

"అంత పెద్ద నిష్ఠావరుడు! ఆయన వల్లే కాలేదు. మనవల్లేమౌతుందిరా!"

"అమ్మా! ఏమిటమ్మా నీ పిచ్చి! భక్తి అనేది మనస్సుని బట్టి వుంటుంది! అచంచల మైన భక్తి నమ్మకానికి నాందిపలుకుతుంది. కోరికలకు దూరంగా, భక్తికి విశ్వాసానికి దగ్గరగా వుంటే భగవంతునికి దగ్గరగా వున్నట్లే! ఒక మేలును ప్రతిఫలాపేక్ష రహి తంగా కోరాలి! అప్పుడే దైవం సహక రిస్తాడు. మనకున్నదానితో తృప్తి పడక దైవం పేరు చెప్పుకుని ధనార్జన చెయ్యాలను కుంటే అది భక్తి అనిపించుకుంటుందా!" సుభద్రమ్మ తనకొడుక్కేసి హర్షదాయకంగా చూసింది. ఎంత ఎదిగిపోయాడు తనబిడ్డ!

బాధ్యత లేని భర్తకు తాను భార్య అని పించుకుంది పాతికేళ్ళనాడు! బిడ్డ పుట్టిన ఐదో సంవత్సరం అతను తామిద్దరినీ వదలి దేశాలు పట్టి పోయాడు. కష్టాలకోర్చి బిడ్డను పెంచుకుంటూ వచ్చింది సుభద్రమ్మ. అన్ని టికీ ఆంజనేయస్వామినే నమ్ముకుంటూ కాలం గడిపింది. పిల్లవాడికి ఆంజనేయ వరప్రసాదని తానే పేరు పెట్టుకుంది. చిన్న తనం నుంచీ ఆంజనేయనామాలు, చాలీసా నేర్పింది. భక్తి కలిగించింది. నీతి, న్యాయం ధర్మం, ఈ భక్తికి తోడుగా ఎప్పుడూ జీవి తంలో నిలబెట్టుకోవాలని నేర్పింది. ఈ రోజు ఆ స్వామే తల్లీకొడుకుల సర్వస్వం! ఆయన దయవల్ల ప్రభుత్వోద్యోగం కూడా వచ్చింది ప్రసాదుకి! లేదన్నవారికి తమకు తోచి నంతలో సహాయం చెయ్యడం వారికితృప్తి.

ప్రయిత్నించు బాబూ! నువ్వు గెలిస్తె ఆంజనేయ స్వామి భక్తిని గురించి ప్రచారం చేసిన వాడవౌతావు. కామ క్రోధాలను జయించిన వారికి స్వామి సులభ సాధ్యుడు బాబూ!"

"నన్ను దీవించమ్మా!"

"ఆంజనేయ కటాక్ష ప్రాప్తిరస్తు!" మండలదీక్ష పూర్తి గావించిన తాలూకు సిందూరాన్ని పొట్లం గట్టి తీసు కెళ్ళాడు ప్రసాదు.

"బాబూ! నువ్వు మనిషివి కాదు బాబూ సాక్షాత్తూ ఆ ఆంజనేయస్వామివే బాబూ! నా బిడ్డను నాకు దక్కించావు!" ప్రసాద్ చేతులు పట్టుకుంటూ ఆనందబాష్పాలతో అన్నారు ప్రెసిడెంటు గారు!

"నా దేముంది ప్రెసిడెంటు గారూ! అంతా ఆ స్వామి దయ!"

"చెప్పు బాబూ! ఎంత డబ్బు కావాలి! పూజకి ఎంతయింది!"

"ఎంత అమాయకులండీ మీరు! డబ్బు పుచ్చుకోవడం భక్తికి, నమ్మకానికితగదండీ! అదీగాక డబ్బుతో భక్తిని ఖర్చు పెట్టే ఉద్దేశం నాకు లేదు. ఏ ఆధారం లేనప్పు డైతే చాలినంత తీసుకున్నా తప్పులేదేమో! కాని నేను ఉద్యోగం చేస్తున్న వాడినే! నా రెక్కల కష్టం నాకు చాలు! నా ఆంజనేయ పూజని, పదిమంది ఉపయోగం కోసం నిస్వార్థంగా వినియోగించాలన్నదే నా ఉద్దేశ్యం! వస్తానండి! నమస్కారం!" అంటూ ముందుకి నడిచాడు ప్రసాద్! శాస్త్రి భక్తి ఎలాంటిదో, అతను ఎందుకు నెగ్గలేక పోయాడో ప్రసాదు దారిలో నడుస్తూ ఆలో చించాడు. సుగుణ నగ్న వక్షస్థలాన్ని చూసిన శాస్త్రి కోరికతో బుసకొట్టి వుంటాడు. అందుకే స్వామి ఆగ్రహించాడు. శాస్త్రి పరా జయం పొందాడు. కాని తనకు మాత్రం ఆ వక్ష స్థలాన్ని చూసినపుడు తన తల్లి వక్ష స్థలమే కనులముందు గోచరించింది. ఏ తల్లి ప్రేమ క్షీరాన్ని గ్రోలి తానంతటి వాడయాడో ఆ తల్లివక్షమే సుగుణనగ్న హృదయంలో తనకు సాక్షాత్కరించింది. మాతృభావంతో ఆమెను స్పర్శించి కూర్చో బెట్టి, బెదరని భక్తి విశ్వాసాలతో, స్వార్థ రహిత హృదయంతో, ఆంజనేయ నామా లను, కవచాన్ని, చాలీసాను, రాత్రంతా పద్మాసనంమీదే వుండి, పదే పదే పఠించాడు. గ్రహ పీడ వదిలించాడు. స్వామి అనుగ్రహా నికి పాత్రు డయ్యాడు. కటాక్షం లభించింది. స్త్రీ మూర్తి మీద గౌరవం, స్త్రీ శక్తి మీద నమ్మకం తనకున్నాయి. తన ఆదిగురువు తన తల్లి, ఆమెమాట తనకు వేదం! ఆంజ నేయుని కన్న తల్లి అంజన! ఆమె వాక్కు అతనికి శిరోధార్యమై, చిరంజీవిగా, శ్రీరామ దాసునిగా నిలబెట్టింది. ఆలోచిస్తూ ఇంటికి చేరాడు.

"శాస్త్రీ!," శాస్త్రి కళ్ళు తెరిచాడు. ఒళ్ళు నొప్పులు తగ్గలేదు. నాలుగు రోజుల్నుంచి లేవటంలేదు. పద్మ నిద్రాహారాలు మాని అతని సేవలోనే గడుపుతోంది. గురువు గారు వచ్చారు. విషయం గ్రహించి బాధపడ్డారు. గంభీర కంఠంతో జీవనోపదేశం చేశారు! "శాస్త్రీ! ఇప్పటికైనా నీవిధానం మార్చుకో నాయనా! భక్తి, విశ్వాసం ఉచ్ఛ్వాసనిశ్వా సాల వంటివి. ఒకటి లేకుంటే మరొకటి నిలవదు. నీకు లోటులేని సందర్భములో కూడా ఒకరి ధనాన్ని ఆశించడం పాపం! దైవంపేరు చెప్పి నీవు వ్యాపారం నిర్వ ర్తించావంటే ఎంతగా దిగజారిపోయావో అర్థమైంది. కామ క్రోధాలను జయించిన వాడే భక్తిమార్గాన నిలువ గలడు. సుగుణ నగ్న వక్షాన్నిచూసే నీవుచలించి పోయావే! ఆనాడు లంకలో సీతాన్వేషణార్థం అంతః పురాన్ని పరిశీలిస్తున్న ఆంజనేయుడు విశృంఖలంగా, నగ్నాతినగ్నంగా, నిద్రి స్తున్న స్త్రీల నెందరినో చూశాడు గదా! ఆయన అణుమాత్రమైనా చలించాడా! తన కార్యదీక్షకు భంగం కలిగించు కున్నాడా! మనం తలపెట్టిన పనిని పక్కకి నెట్టి కామా నికి దాసులు కావటం నైచ్యం కాదా! అస్ఖలిత బ్రహ్మచారి, కార్య దీక్షా తత్పరుడు అయిన ఆంజనేయుని భక్తుడి నంటూ నీవు చేసే పని ఎంత అసహ్యకరమైనదో ఆలో చించావా! లేదు! ఆలోచిస్తే ఈ దశకి దిగజారే వాడివే కాదు. స్త్రీ పట్ల పవిత్ర భక్తి భావన, స్త్రీ శక్తిపట్ల ఆరాధన ముఖ్యం నాయనా! ఇంట్లో నిన్నే దైవంగా భావించి పూజించే నీ భార్యను ఏనాడైనా అర్థం చేసుకున్నావా! ఆమెను అనురాగంతో చూశావా! స్వామిని పూజించడమంటే అట్ట హాసంతోనూ, ఆడంబరంతోనూ కాదు నాయనా! మన ప్రార్థన, పూజ, మన వారిని పైవారిని కూడా రక్షించ గలగాలి. మన ప్రవర్తన పదిమందికి ఆదర్శవంతము కాగలగాలి! అప్పుడే స్వామి అనుగ్రహం నీకు లభిస్తుంది! అహంకారం, అహంభావం స్వామి భక్తులకు పనికి రావు! నిర్మల భక్తి అచంచలవిశ్వాసం వాంఛనీయం నాయనా!" గురువుగారు శాస్త్రి జుట్టు నిము రుతూ అన్నారు. శాస్త్రి కళ్ళలో నీటితో గురువుగారిని చూస్తూ చేతులు జోడించాడు పశ్చాత్తాపంతో! *

— శ్రీ ద్వివేది ఉమామహేశ్వరరావు




## శ్రీ శ్రద్ధానంద ఆశ్రమం, రాజపూర్

1983 అక్టోబరు 2 వ తేది నుండి ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని డెహ్రాడూన్ జిల్లా రాజపూర్‌లోని శ్రీ శ్రద్ధానంద ఆశ్రమమును తిరుమల తిరుపతి దేవస్థానం విరాళంగా స్వీకరించడం జరిగింది. దీనికి దేవస్థాన కార్యనిర్వాహకమండలి తీర్మానం 433 తేదీ 31-10-83 ప్రకారం ఆమోదం తెలియజేయడం జరిగింది. పై ఆశ్రమంలో తి. తి. దేవస్థాన కార్యక్రమాలు ప్రచారం చెయ్యడం జరుగుతుంది.

కార్యనిర్వహణాధికారి,
తి. తి. దేవస్థానములు, తిరుపతి.

## వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

### అతివినయం

"ముఖం పద్మదళాకారం;
వచశ్చందన శీతలం;
హృత్కర్తరీ సమం భాతి
వినయం ధూర్తలక్షణమ్॥"

"విద్య యొసగును వినయంబు"- అనేది సుప్రసిద్ధమైన సుభాషితం.

వినయమే విశ్వసంస్కృతికి విషయ సూచిక. ప్రాచీన గ్రీకుదేశంలో జంగమ విజ్ఞాన సర్వస్వంగా కీర్తికెక్కిన సోక్రటీసు ప్రవచనం.

(I know I know not)

"నాకు తెలియదు అని నాకు తెలుసు"-

భర్తృహరి మహాకవి, విద్యతోపాటు వినయం ఏ విధంగా విస్తరిస్తుందో మనోహరంగా వివరించాడు.

"తెలివి యొకింత లేనియెడ
దృప్తుడనై కరిభంగి సర్వమున్
తెలిసితినంచు గర్వితమతిన్
విహరించితి తొల్లి; ఇప్పుడు-
జ్జ్వల మతులైన పండితుల సన్నిధి
ఇంచుక బోధశాలినై
తెలియనివాడనై మెలగితిన్
గతమయ్యె నితాంత గర్వమున్."

తిక్కనమహాకవి, తొలుత నిర్వచనోత్తర రామాయణం వ్రాసినప్పుడు-తననుగూర్చి, "అమలోదాత్తమనీష, ఏ నుభయ కావ్య ప్రౌఢి పాటించు శిల్పమునన్ పారగుడన్....కళావిదుడ .... తిక్కాఖ్యుండ సన్మాన్యుడన్" అని గర్వస్ఫూర్తితో చాటుకున్నాడు. అయితే - యజ్ఞంచేసి సోమయాజియై మహాభారతం ఆంధ్రీకరించినప్పుడు మాత్రం - వినయంతో,

"నా నేర్చిన భంగి చెప్పి వరణీయుడనయ్యెద భక్తకోటికిన్" అని సహృదయులకు నివేదన చేశాడు. తిక్కన మహాకవి వ్యక్తిత్వంలో, ఉన్నత విద్య తెచ్చిన వినయం పేర్కొనదగింది.

ఖగోళ విజ్ఞానంలో విప్లవాత్మకమైన పరిశోధనలు ప్రపంచానికి అందించిన న్యూటను మనీషి, సవినయంగా చెప్పినమాట-"నేను విజ్ఞాన సముద్రతీరంలో గులకరాళ్లను ఏరుకొనే అర్భకుడను మాత్రమే."

అయితే - కొందరు కుహనా వినయం అభినయిస్తారు. అట్టివారిని గూర్చియే పై సంస్కృత శ్లోకం నిశితదృష్టితో విమర్శ చేస్తోంది. "వినయం అభినయించే వారి ముఖం వికసించిన పద్మదళాలవలె ఉంటుంది! వారి మాటలా తేనెవాకలు. అట్టివారు చల్లగా తియ్యగా మాటాడగలరు. వారి మాటలు చందన సౌరభం-సువాసనలు చిమ్ముతాయి. అయితే వారి గుండె మాత్రం పదసైన కత్తెరవంటిది.

"అతివినయం ధూర్తుల లక్షణం"- అని పై శ్లోక తాత్పర్యం.

వినయం అభినయించేవాడు "తేనెపూసిన కత్తి" - "గోముఖవ్యాఘ్రం."

వినయం వేరు! అతివినయం వేరు!

ఇక ఏది వినయం? ఏది అతివినయం? స్థూల దృష్టితో ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం.

శ్రీ వైష్ణవ విశిష్టాద్వైతులు వినయాన్ని ఒక "లలితకళ" గా అభ్యసించారు. భగవద్రామానుజాచార్యులు, "వినయాన్ని" ప్రబోధించారు. వినయం వ్యష్టి నిష్ఠం. అయితే - ఆ వినయాన్ని వ్యవస్థానిష్ఠంచేసినప్పుడు - చిత్తశుద్ధి స్థానాన్ని అభినయాడంబరాలు ఆక్రమించే ప్రమాదం ఉంది. శ్రీ వైష్ణవుడు దాసానుదాస ప్రవృత్తిని అవలంబించుకోవాలని శ్రీమద్రామానుజాచార్యులవారి ఆదేశం. వేదవేదాంగ పారంగతుడైన శిష్యుని, రామానుజాచార్యులవారు-మరియొక శిష్యుని కూతురి అత్తవారింటిలో వంటవానిగ సేవచేయుటకు వినియోగించారు. ఆ పండితోత్తముడు అహంభావం చంపుకొని - వినయంతో గరిటె కైంకర్యం చేసి తరించాడు! అట్టి వినయాను సంధానం విధించిన వారు రామానుజులు. యథార్థమైన శ్రీ వైష్ణవ వినయాను సంధానం తమ జీవితాలలో అనువదించిన మహానుభావులు - విశిష్టాద్వైత వేదాంతులు వేనకువేలు యుగయుగాంతరాలుగా దక్షిణాపథంలో వర్ధిల్లారు.

ఇక - ఈ చర్చకు ముగింపుగా చెప్పదగినమాట "వినయం" మంచిది. "అతి వినయం" చెడ్డది. అయితే - వినయాన్ని అసమర్థతగా కొందరు భావించే ప్రమాదం ఉంది. అంతేగాక, ఏ మనిషి వ్యక్తిత్వంలో అయినా, వినయంతోపాటుఆత్మప్రత్యయం కూడ మెచ్చుకోదగిన గుణమే.

కాళిదాస మహాకవి-"మందుడు కవియశస్సును కాంక్షించటం ఆజానుబాహువునకు అందే చెట్టుపండును వామనుడు (మరుగుజ్జు) కోరుకున్నట్లు అపహాస్యం పాలవుతాడు. ఆ విధంగా ఉన్నది నా కావ్య రచన" అని వినయంగా విన్నవించాడు. అయితే ఆ వినయంలోనే కాళిదాస మహాకవి ఆత్మప్రత్యయం అంతర్లీనంగా ఇమిడి ఉంది. తాను ప్రస్తుతం మరగుజ్జు కవిగా కన్పించుచున్నప్పటికీ, కాలక్రమంలో వామనునివలె త్రివిక్రమావతారం ధరించ గలననే ధ్వని అందులో ఉంది.

నిజమైన వినయం ఆత్మ ప్రత్యయం ధరించే సూక్ష్మరూపమే.





3

# శ్రీ వేంకటేశోదాహరణము

— శింగనమల్ల రాధాకృష్ణయ్య



(గతసంచిక తరువాయి)

(ఉత్కళిక)

భృగుమహర్షి గర్వమడచి భృతినొసంగువానిచేత
నిగమసంఘమెల్లఁగొల్చు నిర్వికారగుణముచేత
సిరినివీడి పురినివీడి సిరినిపొందు ఘనునిచేత
ధరను వేంకటాద్రిపైన దయను కురియువానిచేత
పవన సుతుని పూజలందు భక్తకల్ప తరువుచేత
సవన మంత్ర రూపియైన సరసిజాక్షు కరుణచేత
శ్రుతుల మంత్ర బీజమైన శ్రితజనార్తి హరునిచేత
వెతలు దూరమౌనుగాత! విష్ణుచేత జిష్ణుచేత

చతుర్థీ విభక్తి (తరళము)

పలువిధంబుల పూజలందు పరాత్పరుం డగువానికై
జలధి క్రుంగిన భూమినెత్తి జగంబు నిల్పినవానికై
బలినిఁ ద్రుంచఁగ దానమెత్తి బలంబుఁ జూపిన వానికై
తలపు లెల్లను నిల్పి కొల్తు తమోఘ్నుఁడౌ పరమాత్మకై

(ఉత్సాహ)

రాగ రహిత భోగ సహిత రాజమౌళి సఖునికై
నాగరాజ నుత పదాబ్జ జ్ఞానరూప మూర్తికై
యోగమార్గ ఘనవిచార యోగి బృంద వంద్యుకై
యాగవహ్ని కీలరూప యాగ రక్షణార్తికై

కళిక (ద్విరదగతిరగడ)

అరి వర్గములఁజెండు ఆనందరాముకై
గురువుగా బోధించు గోపాల బాలుకై
కరమిచ్చి కాపాడు కమలాధినాథుకై
వరమిచ్చి పరమిచ్చు వరదవేంకన్నకై
కరుణలొల్కెడు సుధాకాంతి వీక్షణునకై
కరువైన వైకుంఠ కమనీయ సుఖముకై
సురలోక ధనమైన సురనాథు తమ్ముకై
స్థిరముగా మదిఁగొల్తు తిరువేంకటేశుకై

(ఉత్కళిక)

సప్తాద్రి కేతెంచి
తృప్తిగా పూజించి
ఆనందమున మంచి
గానంబుఁ గావించి
నిలువెల్లఁ నర్పించి
జలజాక్షుఁ నాశించి
కొలిచేను ఈశుకై
ఇల వేంకటేశుకై

పంచమీ విభక్తి (ఉత్పలమాల)

ఎవ్వనివల్లఁ నీ జగము లింతలు పెంపును పొందుచున్నవో
ఎవ్వనివల్ల మేఘములు ఎంతయు నీటిని పొందుచున్నవో
ఎవ్వనివల్ల జీవతతికెల్ల శుభంబులు కల్గుచున్నవో
చివ్వనఁజేరుఁనా ఘనుఁడు శ్రీపతి వల్లనె సర్వసంపదల్

(కందము)

ధర్మము జ్ఞానము దయయును
నిర్మల తేజంబుఁ గల్గు నిత్యుని వలనన్
కర్మము లెల్లను తీరును
మర్మపు మోక్షంబుఁ నబ్బు మాధవు వల్లన్

కళిక (తురగవల్గనము)

నమ్ముకొన్న వారికెల్ల జ్ఞానమిచ్చు వానివలన
అమ్మకన్న మిన్నగాను ఆదరించు వానివలన

తమ్మిచూలి చేయుపనికిఁ దలప మూలభూతువలన
సమ్మతిని సుషుమ్నయందు సంచరించువానివలన
భక్తితోడఁ గొల్చినట్టి వకుళ నోము ఫలము వలన
రక్తితోడఁ గొల్చినట్టి రమకుఁ గూర్చువాని వలన
ముక్తసంగ వందనీయ మోహనంపు రూపు వలన
ముక్తులౌదురెల్ల జనులు మోక్షదాత ప్రీతి వలన

(ఉత్కళిక)

అన్నమయ్య పాడినట్టి
మిన్నుఁ గాలఁ దన్నినట్టి
బలిని నేల ముంచినట్టి
కలిని జనులఁ బ్రోచునట్టి
దురితహరుని కరుణ వలన
ఖరునివైరి శరణు వలన
ధరణిజాధినాథు వలన
పరము కల్గు శ్రీశు వలన

షష్ఠీవిభక్తి (ఉత్పలమాల)

శ్రీసతి ప్రేమతోఁ గొలుచు శ్రీగిరినాథుని దివ్యమూర్తికిన్
చేసిన పాపసంఘముల చీఁకటిఁ ద్రుంచెడు చక్రధారికిన్
వేసములై దురెండులుగ వేసిన వానికి భక్తరక్షకున్
దాసుఁడ దాసదాసుఁడను దానవ భంజను శ్రీపదాంఘ్రికిన్.

(మత్తకోకిల)

శ్రీరమా భువి నీళసేవిత శ్రీగిరీంద్ర విహారికిన్
శౌరికిన్ సకలౌఘ నాశన శాలికిన్ శ్రితపాలకున్
సూరివంశ సుధాంశుకున్ సుర శోకనాశనకారకున్
కోరుకోర్కెలఁదీర్చ ద్రిమ్మెక్కెద కోటిమన్మథ రూపకున్

కళిక (తురగవల్గనము)

పాలకడలిఁ నిల్లు చేసి పవ్వళించి యున్న హరికి
పాలనివ్వ వనితచేర ప్రాణములను గొన్న హరికి
వెన్న తిన్న నోటిలోన విశ్వరూపుఁ గల్గు హరికి
చిన్ననాటఁ నాలఁబ్రోవ చెలఁగి కొండనెత్తు హరికి
ఘోరసర్ప బాధఁ బాప కోరి యమునఁ జొచ్చు హరికి
చేరి పాము గర్వమడఁచి చెలుల మెప్పులందు హరికి
గొల్లభామ ప్రేమఁ జూప చల్లకుండ దోచుహరికి
అల్లయమున నీటమునిఁగి నల్లదనము నిచ్చు హరికి

(ఉత్కళిక)

ముజ్జగంబు నిండు నీకు
ఒజ్జయైన బాల నీకు
భక్తిచేతఁ జిక్కు నీకు
ముక్తినిచ్చు హరికి నీకు
జీవకోటియానమునకు
నావయైన దైవమునకు
వందిభక్త వినుత నీకు
వందనములు కృష్ణ నీకు

సప్తమీవిభక్తి (ఉపేంద్రవజ్ర)

ధరాతలంబందుఁ సధర్మ శక్తిన్
బిరానఁద్రుంచే రఘువీరస్వామీ !
నిరామయంబైన వినిర్మలాత్మా !
మురారి నీయందు సుమోహ భక్తిన్

(చంపకమాల)

కలిగిన వాఁడనయ్యు తొలి కర్మల చక్రము నందుఁజిక్కినే
ఖలమతినైతినయ్యో ! హరిఁ గాదనివేడను వేరుదైవమున్
తలఁచెదఁనెల్ల లోకములఁ దాల్చిన వేంకటనాథునందు నా
వలపుల భక్తి నిల్పెదను వైష్ణవ భక్తుల మార్గ గామినై

కళిక (ద్విరదగతి రగడ)

కరుణతో వెలుఁగొందు కమల కాంతుని యందు
ధరలోని శేషాద్రి ధాముఁడౌ విభునందు
నిరవధిక సుఖుఁడైన నిత్యోత్సవుని యందు
దురితములఁ నెడఁబాపు దొర శ్రీధరుని యందు
మది నిల్పి కొలుతు నే మధుసూదనుని యందు
ఎద పొంగు భక్తితో వేంకటేశ్వరునందు
భావంపు కవితచే భావించి నే పొందు
కావించఁ నాశించి కామింతు పతియందు

(ఉత్కళిక)

మునివెంట తనుకదలి
ఘన బాణముల వదలి
పెనురక్కసులఁద్రుంచి
ముని యజ్ఞమును పెంచి
చని యహల్యను బ్రోచి
మన జానకినిఁ జూచి
వలచు రామునియందు
వలపు నాకనియందు

సంబోధన ప్రథమావిభక్తి (ఉత్పలమాల)

నీరద నీలవర్ణ ! ఇల నేరక చేసిన పాపసంఘముల్
దూరము లౌటఁ జూతురొకొ దూర్తుల స్నేహము వీడకుండగన్

తిరుగ నీదు భక్తులను తేకువఁ గొల్వక యుండు వారలన్
నారద గానలోల! ఎటు నాకసుఖంబు వరించు శ్రీహరీ!

(ఉత్పలమాల)

ఓ రఘువీర! రార! యని ఓర్వని బాధలఁ నేను పిల్చినన్
జేరవు ప్రేమతోడ నిను జీవితనాధుగ నమ్ముకొన్ననన్
చేరవదేమి కర్మమొకొ? శేషగిరీశ్వర! వేంకటేశ్వరా!
భీరుఁడనై తినింక మది భీతిలి సోలితి రార! శ్రీధరా!

కళిక (ద్విరదగతిరగడ)

ఓ దీనమందార! ఓ సుందరాకార!
ఓ దయామృతసార! ఓ భక్తసంచార!
ఓ ధీర! రణవీర! ఓంకారసాకార!
శ్రీధామశృంగార! శ్రీ రాధికాచోర!
ఓ సప్తగిరినాధ! ఓ భూమిజానాథ!
ఓ సర్వభూతాత్మ! ఓ భూతభావాత్మ!
నీవే జగద్రక్ష! నీవే ప్రభూరక్ష!
ఓ వేంకటాద్రీశ! ఓ రమా హృదయేశ!

(ఉత్కళిక)

వెలుగు నీవేయంటి
తలచి నిన్నేకంటి
బ్రతుకు నీవేయంటి
వెతలు బాపెదవంటి
నమ్మబోవ రావేల
కనలేను నీ లీల
నీవాడనేగాన
శ్రీ వేంకటరమణా!

(సార్వవిభక్తికము)

రాముడ నీవె కృష్ణయని ప్రార్థనఁజేసెద నిన్ను నమ్మి శ్రీ
ధాముని చేతనే కలుగు ధారుణి సంపదలంచు శ్రీలకై
నీమము కల్గఁగొల్చెదను నీవలనం పరమంద నీకునై
నామది యందు పీరమిడి నాడను వీడను వేంకటేశ్వరా!

అంకితాంకము (ఉత్పలమాల)

వేంకటశైలవాస! నిను వేరుగఁ దల్చక నాదు భర్తగా
ఇంకను నమ్మిప్రాణసఖ! ఎంతయు మేటి మగండవంచు నీ
కంకిత మీయుదాహరణ హారముఁజేసితి దీనిఁదాల్చి నా
వంకనుఁజేరి కౌగిలిడి వాంఛిత మొప్పగఁ దీర్చు శ్రీహరీ!



## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం. అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది

**అభిషేకం**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సర కాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచిన వారు 42రూ॥లు చెల్లించాలి.



కల కనటం ఒక అవకాశం. అది నిజంకావటం ఒక అదృష్టం. ఎన్నో సంస్థలు ఎంతో ఉదాత్తమైన ఆశయాలతో ప్రారంభమౌతాయి. కొంతవరకు ఆ ఆదర్శాల పరిధిలోనే పయనిస్తాయి. కాని నిర్విరామంగా నిరంతరం దూరమౌతూ ఉండే లక్ష్యంవైపు పయనిస్తూ తరతరాల వారికి ఆ సంప్రదాయాన్ని అందిస్తూ, ఒకస్థాయిలో సింహావలోకనంచేస్తే, ఇన్ని మంచి పనులకు అంకితం కాగలిగామన్న తృప్తి కలిగే అదృష్టంమాత్రం ఏకొద్ది సంస్థలకో దక్కుతుంది. శ్రీ వేంకటాచలాధీశ్వరుని ఆలయవ్యవహారాలు, ఆస్తిపాస్తులు చూచే పరిపాలన వ్యవస్థ ఆ కొన్నిటి కోవలోకే వస్తుంది.

అనాదిగా రాజాధిరాజ ప్రాభవార్చితమై, నిరంతరవేద గానసుధాసంప్లావితమై, కవి గాయక సరసపదబంధురగీతికా సుమహారవాసనాపరిమళితమైన శేషగిరీశ సంస్థాన నిర్వహణ, దేశీయ,వైదేశిక పాలన నుండి, బాలాజీ భక్తులు మహంతుల నుండి, ఒక ప్రత్యేకపాలనావ్యవస్థకు మారి, ఆ వ్యవస్థ అర్ధశతాబ్దంపాటు అవిచ్ఛిన్నంగా శ్రీనివాస భక్తులకు యథాశక్తి సేవచేసి, స్వర్ణోత్సవాలు జరుపుకున్నదంటే, భక్తులకు వ్యవస్థపట్ల ఉన్న అచంచల ప్రగాఢవిశ్వాసము, ఇన్నేళ్ళుగా ఎన్నోవిధాల, యథాశక్తి, యథాభక్తి జనసేవ, జనార్దనసేవలో పాలుపంచుకొన్న ఉద్యోగుల అకుంఠిత కార్యదీక్ష, అన్నిటికిమించి శ్రీనివాసునికరుణాకటాక్షాలకు నిదర్శనమనే అనాలి. అందువల్లనే దేవస్థానవ్యవస్థ జరుపుకున్న స్వర్ణోత్సవాలు, కేవలం సంస్థకుమాత్రమే పరిమితం కాక, అఖిల ఆర్షధర్మావలంబకులకు, అశేష శ్రీనివాస భక్తకోటికి సంబంధించిన ఉత్సవాలుగా కనిపించాయి. ఈ స్వర్ణోత్సవాలతో వ్యవస్థప్రగతి భావిబంగారుబాటవైపుమలుపు తిరిగినట్లనిపించింది. ఈఉత్సవాలలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు తన ఆరాధ్య దైవం శ్రీనివాసుని సేవకుగాను, తీసుకున్న నిర్ణయాలు తిరుమల తిరుపతిక్షేత్రాన్ని పుంజీభూతాధ్యాత్మిక తేజఃకేంద్రముగా, ఖండఖండాంతరాలలోకి ఆర్షధర్మావలంబకులకు ప్రబోధం కలిగించే ఆధ్యాత్మిక రోచిస్సుగా తీర్చాలనే ఆయన దృఢదీక్షను ప్రతిబింబించాయి. అందువల్లనే త్రయాహ్నికమైన ఈ స్వర్ణోత్సవము ఒక అద్భుత సంఘటన, చారిత్రక సన్నివేశముకూడ.



నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విరాజిల్లే తిరుమలతోపాటు సాంస్కృతిక విద్యాకేంద్రం తిరుపతికూడా, మిరుమిట్లుగొలిపే వివిధవర్ణ విద్యుద్దీపాలంకరణలతో, వేద ఘోషతో, హరికీర్తనసమాజకార్యక్రమాలతో, పుణ్యకథావిశేషాలతో, ధార్మికప్రవచనాలతో, మానవతాప్రబోధక సూక్తితోరణ ద్వారాలతో, సర్వతః, భక్తిరసామృత ప్లావితమై ఇలలోని వైకుంఠం ఇదే ఇదే! ఇదే అనిపించింది.



ఉత్సవ సమారంభానికి తగినట్లు సువిశాలమైన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ క్రీడామైదానాన్ని (స్టేడియం) సభాస్థలిగా ఎన్నుకొని, చలువ పందిళ్ళు, కాంతిపుంజాలు, దూరదర్శన, శ్రవణయంత్రాలు, ఇతర అత్యవసర సౌకర్యాలు ఏర్పాటుచేయటం ప్రేక్షకులందరికి ఆనందం కలిగించింది. ఆహ్వానపత్రాలు ఇంటింటికి పంపటం, పట్టణంలోని వివిధకీలక ప్రాంతాలనుండి ఉచితంగా బస్సులు ఏర్పాటు చేయటంతో అశక్తులుకూడ చాలా ఆసక్తితో రావటం కనిపించింది. అనుకోటానికి కూడా అవకాశంలేని భద్రతాచర్యల వల్ల ఈ త్రయాహ్నిక యజ్ఞములో అన్ని కార్యక్రమాలు అతి క్రమశిక్షణాయుతములూ, శోభాయమానమూ అయ్యాయి. దైవకార్యక్రమ సంకేతముగా, శ్రీనివాస దయాప్రాప్తికి, అనిష్ట నివారణద్వారా జగత్కల్యాణానికి వరుసగా మొదటి రెండురోజులు మహాశాంతి హోమం, మూడవరోజున మహారుద్రయాగం, ఉత్సవ స్థలములో దేవేరీసహితులైన శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండ రామస్వామి, శ్రీ కపిలేశ్వరస్వామి వారి సన్నిధిన, వేద విహితంగా జరగటం, ఉత్సవాలకు ఉదాత్తతనేగాక, అధిక పావిత్ర్యాన్ని కూడా కలిగించాయి. సామాన్యుల కరుదనిపించే వేదనాదం మూడురోజులపాటువిని మురియని భక్తుడులేడన్నా ఆశ్చర్యంలేదు.

శ్రీ రక్తాక్షి సంవత్సర చైత్రబహుళ సప్తమి (22-4-84) ఆదివారం ఉదయారుణరాగ స్పర్శ పులకింతలలో స్వర్ణోత్సవ శుభోదయం అయింది. సభాప్రారంభానికి ముందే, సభాంగణం ఆహూతులతో క్రిక్కిరిసిపోయింది. ఉత్సవ ప్రారంభకులు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, దేవాదాయమంత్రి శ్రీ యన్. టి. రామారావు రాకకోసం, వేదనాద నాదస్వర వాద్య లహరులనడుమ సుసజ్జిత, సుందరవేదిక ఎదురుచూస్తూ ఉంటే అద్వొకరకమైన అనుభూతి, ఆత్రుత వ్యక్తమయ్యాయి. శ్రీవారి శంఖచక్రా లిరుప్రక్కన, నడుమ స్వర్ణోత్సవ సంకేతం 50 సంవత్సరాలు కలిగిన ఆనంద నిలయ విమానంతో వేదిక వెనుక భాగాన్ని అలంకరించటం జరిగింది.

ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావుకు ఉత్సవ ప్రాంగణం ముంగిట వేదాశీర్వచన యుక్త పూర్ణ కుంభముతో దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ వి. కె. డి. వి. సత్యనారాయణరాజు, మండలిలోని ఇతరసభ్యులు,



కార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామిరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ బి. యన్. జయసింహ ఇతర ఉద్యోగి బృందం స్వాగతం చెప్పారు.

దేవేరీసహితులైన శ్రీ గోవిందరాజస్వామి ఉత్సవ మూర్తులను దర్శించి ముఖ్యమంత్రి, తమ శ్రీమతి బసవతారకమ్మతో యజ్ఞవేదికను చేరి, పూర్ణాహుతిగా వివిధఫలాలు, నారికేళాలు, వనమూలికలు పట్టు వస్త్రములు, నేతితో నిండిన రజతపాత్ర యాగాగ్నిలో సమర్పించారు. తరువాత ముఖ్య మంత్రి స్వర్ణోత్సవ నిర్వహణ సూచక ఫలకాన్ని ఆవిష్క



రించారు. పిదప ముఖ్యమంత్రి వేదికమీదకు విచ్చేసినపుడు అశేషసభాసదులు కరతాళ ధ్వనులతో అభినందించారు. దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ వి. కె. డి. వి. సత్య నారాయణరాజు అధ్యక్షత వహించారు.



దేవస్థాన బాలమందిర బాలబాలికల గీతావరణం ఆ తరువాత వైదిక ప్రార్థనతో సభాప్రారంభం అయింది.

దేవస్థాన ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ పి. వేంక టేశ్వర్లు తమ సభాస్వాగతంలో, ఈ చారిత్రక సన్నివేశ ప్రాధాన్యాన్ని, ఈ స్వర్ణోత్సవ కార్యక్రమాలకు ముఖ్యమంత్రి గానేకాక దేవాదాయమంత్రిగా కూడా శ్రీ యన్.టి. రామారావు ప్రారంభోత్సవం జరపటంలో గల ఔచిత్యాన్ని వివరించి స్వాగతం చెప్పారు.

సభాధ్యక్షులు శ్రీ సత్యనారాయణరాజు తమ ప్రసం గంలో, ఉత్సవ ప్రాధాన్యాన్ని వివరించి, ఈ చరిత్రాత్మక సందర్భంలో పాలుపంచుకున్న ముఖ్యమంత్రికి కృతజ్ఞతలు చెప్పారు.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి తమ నివేదికలో, గత అర్ధశతాబ్దకాలములో యాత్రికులకు భోజన వసతి, రవాణా, దర్శనాది విషయాలలో దేవస్థానం చేసిన కృషిలోని ప్రధాన అంశాలను, మిగులు నిధులను దేవ స్థానం ఆర్ష-ఆధునిక-సాంకేతిక విద్య, వైద్య, సంక్షేమకార్య క్రమాలకు ఎలా వినియోగిస్తున్నదీ వివరించారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ బి. యన్. జయసింహ తమ ప్రసంగంలో, అనేకదేశాలు తమ తమ ప్రాంతాల్లో జరిగే హిందూదేవాలయ నిర్మాణానికి కావలసిన విగ్రహాదుల సరఫరాలాంటి విషయాలలో తిరుమల తిరుపతి దేవస్థానం వైపు ఆశగా చూస్తున్నారని అన్నారు.

ఈస్వర్ణోత్సవ సందర్భంగా దేవస్థానం, ఆంగ్ల, తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషావ్యాసాలతో, దేవస్థాన సంబంధం విషయాలతో వెలువరించిన 560 పేజీల స్వర్ణోత్సవ సంచికను ముఖ్యమంత్రి అర్ధాంగి శ్రీమతి బసవతారకమ్మ ఆవిష్క రించారు.



ఏబది సంవత్సరాలకు చిహ్నంగా, దేవస్థానం వివిధ భాషలలో ఆర్షధర్మంలోని వివిధవిషయాల మీద ప్రచురించిన 50 గ్రంథాలను ముఖ్యమంత్రి ఆవిష్కరించి, సభకు విచ్చేసిన ఆ యా రచయితలకు తమ అభినందనలు తెలిపారు. దేవస్థాన ప్రజాసంబంధాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి ఆ యా గ్రంథకర్తలను ముఖ్యమంత్రికి పరిచయం చేశారు.



గ్రంథావిష్కరణ సందర్భంలో ఆ యా రచయితలను అభినందిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ నందమూరి తారక రామారావు (కుడినుంచి ఎడమవైపుకు) డా॥ దూళిపాళ అర్కసోమయాజి, డా॥ విద్వాన్ విశ్వం, శ్రీ స్వామి కృష్ణదాస్, డా॥ కరుణశ్రీ, శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి, డా॥ ఇలపావులూరి పాండురంగారావు, డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, డా॥ ముట్నూరి సంగమేశం, శ్రీమతి ఆర్. ఇందిరాదేవి, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య, శ్రీ కె. అప్పణ్ణాచార్య, డా॥ ఎస్. బి. రఘునాథాచార్య.



'మతము–విజ్ఞానము' అన్న విషయంపై పోస్టుగ్రాడ్యుయేట్ తరగతి వారికి దేవస్థానం నిర్వహించిన అంతర్ విశ్వవిద్యాలయ వక్తృత్వపోటీవిజేతలు సర్వశ్రీ సుశీల్‌సేత్– ప్రథమ(జాదవపూర్ విశ్వవిద్యాలయం), కుమారి రాధారామచంద్రన్– ద్వితీయ (ఉస్మానియా విశ్వవిద్యాలయం), కుమారి జ్యోతికలబాగ్– తృతీయ (కర్ణాటక విశ్వవిద్యాలయం, ధార్వార్), కుమారి లతా. వి. పండిట్– ప్రోత్సాహక బహుమతి (గుల్బర్గా విశ్వవిద్యాలయం), ఆర్. విజయనందన్‌రెడ్డి– ప్రోత్సాహక బహుమతి (ఉస్మానియా విశ్వవిద్యాలయం) లకు స్వర్ణరజతపతకాల బహుమతులను ముఖ్యమంత్రి అందజేశారు.



స్వర్ణోత్సవ సభలను ప్రారంభిస్తూ ముఖ్యమంత్రి తమ ప్రసంగంలో, అనాదినుండి శ్రీ వేంకటేశ్వరస్వామి వరకు వివిధావతారతత్త్వాలను సోదాహరణముగా ప్రస్తుతించారు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తులకు దేవస్థానంచేస్తున్న సేవను అభినందించి, క్రైస్తవమతానికి వాటికన్‌వలె, తిరుమల తిరుపతి కూడా హిందూ ఆధ్యాత్మిక రోచిస్సులకు కేంద్రంగా రూపొందాలని, అందుకు తగిన కార్యక్రమం చేపడతామని ప్రకటించారు. క్షతగాత్రులైన, ఇతర అవశ్యకత కలిగిన యాత్రికుల సౌకర్యార్థం దేవస్థానం ఆధ్వర్యంలో రక్తనిధి ఏర్పాటు, తిరుపతిలో వాహనాల రద్దీ తద్వారా జరిగే ప్రమాదాల నిరోధానికిగాను, తిరుపతికి చుట్టు 'రింగురోడ్డు' నిర్మాణం, అత్యాధునిక విధానాలుగల ఆస్పత్రి, వికలాంగులకు, మూగ, బధిరాంధులకు సంక్షేమకేంద్రం ఏర్పాటు, దేవస్థానపు ముఖ్యప్రణాళికలుగా ముఖ్యమంత్రి వెల్లడి చేశారు.



ఈ శుభసందర్భాన్ని పురస్కరించుకొని, ప్రోత్సాహకంగా అప్పర్ డివిజన్ గుమస్తా వరకు రెండునెలల మూలజీతాన్ని, అపైవారికి రు. 1000/–, పింఛనుదారులకు రు. 500/–ల నగదు బహుమతులను ప్రకటించారు.

దేవస్థాన ధర్మకర్తలమండలి సభ్యులు మరియు శాసనసభ్యులు శ్రీ తలారిరుద్రయ్య వందన సమర్పణానంతరం శ్రీ ఎన్. టి. రామారావు దేవస్థాన ఉద్యానవిభాగం తమ పేరిట ఏర్పాటు చేసిన క్రోటను మొక్కను ఆవిష్కరించారు.

ఈ కార్యక్రమం తరువాత ముఖ్యమంత్రి, తదితర ప్రముఖులు, దేవస్థానంలోని ఉద్యానం, పురావస్తు (మ్యూజియం), దాససాహిత్యం, సప్తగిరి పత్రికావిభాగాలు ఏర్పాటు చేసిన ప్రదర్శన శాలలను సందర్శించారు. సప్తగిరివిభాగంలో ముఖ్యమంత్రి తామ్రపత్రాలను శుద్ధిచేసే కార్యక్రమాన్ని ఆసక్తితో తిలకించారు. దేవస్థాన ప్రచురణల విక్రయవిభాగంలో ముఖ్యమంత్రికి భగవద్గీత ప్రతులు, శ్రీవారి హుండీ పెట్టెలు బహూకరించటం జరిగింది.

దేవస్థాన అధికారులు చేసిన ఏర్పాట్లపట్ల ముఖ్యమంత్రి తమసంతృప్తిని వ్యక్తంచేశారు.

సాయం కార్యక్రమం దేశం వివిధప్రాంతాలనుండి వచ్చిన భజన సంఘాల కోలాటం, చెక్కభజన, పండరిభజన నామసంకీర్తనలతో ప్రారంభమైంది.

శ్రీమతి ఆర్. జి. శోభారాజు, అన్నమాచార్య ప్రాజక్టు వాద్యవిద్వాంసులసహకారంతో అన్నమాచార్య కీర్తనలు గానంచేసి ప్రేక్షకుల ప్రశంసలను పొందారు.



ధార్మికప్రబోధప్రారంభంగా, కుర్తాళం సిద్ధేశ్వర పీఠాధిపతులు శ్రీ త్రివిక్రమరామానంద భారతీస్వామివారు తమ ఉపన్యాసములో భక్తిప్రాధాన్యాన్ని వివరించారు.



శ్రీరామకృష్ణానందస్వామి (గండిక్షేత్రం) నైతిక మూల్యాల పరిరక్షణ, ఆధ్యాత్మికక్రమశిక్షణల ఆవశ్యకతను గూర్చి ప్రసంగించారు.

డాక్టరు ప్రసాదరాయ కులపతి (గుంటూరు) భాగవతంలోని గజేంద్రమోక్షణ ఘట్టప్రాశస్త్యాన్ని సరళమైనభాషలో వివరించారు.

డాక్టరు బోయి భీమన్న తమ సునిశిత ప్రసంగంలో, హిందూధార్మిక ప్రవంతిలో, వెనుకబడిన వారినికూడా భాగస్వాములుగా చేర్చవలసిన అవసరాన్ని విడమరచి తెలియచేశారు.

డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య, ధర్మస్వరూపాన్ని గూర్చి, మహాభారతంలోని విషయములు ఆధారంగా వ్యాఖ్యానించారు.

శ్రీమతి ఆర్. దుర్గాంబ భాగవతారిణి హరికథతో మొదటి రోజు కార్యక్రమాలు ముగిశాయి.

రెండవరోజు కార్యక్రమాలు (23-4-84) శ్రీకోదండ రామాలయ ఉత్సవమూర్తులు లక్ష్మణ, మారుతీసహిత సీతారాములు సభాస్థలికి వేంచేయటంతో ప్రారంభమైనవి. ఋత్విక్కులుమహాశాంతి హోమాన్ని నిర్వహించారు.



గీతా పారాయణం తరువాత, 'సుందరదాసు' శ్రీ యం. యస్. రామారావు తాము రచించిగానంచేసే 'సుందర కాండ' గానపారాయణాన్ని ప్రారంభించారు.



పుష్పగిరి పీఠాధిపతులు తమ ప్రసంగంలో తిరుపతి క్షేత్రానికి ఆధ్యాత్మిక, విజ్ఞానఖనిగా దేశాలలోప్రశస్తి ఏర్పడిందని, "తిరు" అంటే "శ్రీ" అని- "మల" అంటే గిరి అని, తిరుమల అనగా "శ్రీగిరి" అనీ, ఇక్కడనే ఆధ్యాత్మికశక్తి పుంజీభూతమై ఉందని, ఈసత్యం సాధారణంగా వివరించగల విషయంకాదన్నారు. ఈ 'శ్రీగిరి' కి ఒకప్రక్క హరి మరొక వంక హరుడు ఉన్నాడని కూడా అన్నారు. అంతేగాక "శ్రీ" అనగా వేదమాతరూపమని, ఈవేదాచలంపైన సర్వనియంతృకమైన దైవీశక్తిరూపొందిందని, అదే శ్రీవేంకటేశ్వరుడనీ అన్నారు. తిరుమలపై కొలువున్న ప్రభువే పరమాత్మ, పరబ్రహ్మ అనీ స్పష్టంచేశారు.

డాక్టరు ధూళిపాళ అర్కసోమయాజి తమ ప్రసంగంలో మానవుణ్ణి ధర్మమొక్కటే కాపాడగలదని పేర్కొన్నారు. శంకర భగవత్పాదులు తమ భజగోవిందంలో పేర్కొన్నట్లు జీవనకాలాన్ని గోవిందుని కొలుస్తూ సద్వినియోగం చేసుకోవాలని ప్రబోధించారు.

అఖిలాంధ్ర సాధుపరిషదధ్యక్షులు శ్రీ సర్వేశ్వరానంద స్వామి శ్రీ వేంకటేశ్వరుడు అర్థిజన కల్పకమని, ఆపన్న ప్రసన్నుడని వివరించారు. తిరుపతిని హిందూధర్మ ప్రచార కేంద్రంగా రూపొందించటం దేవస్థాన ఆశయమైనప్పటికీ, సాధువులు తమ సాధుపరిషత్తులద్వారాకూడా చేయవలసినది ఎంతోవున్నదని అన్నారు.

శ్రీ చిన్మయానందస్వామి (షాద్‌నగర్) కొన్నియుగా లుగా వేలాదిభక్తులు తిరుమల సందర్శిస్తున్నారనీ, ఇటీవల కాలంలో తరిగొండ వెంగమాంబ, మళయాళస్వామి వంటి తేజోనిధులు తిరుమలలోని తుంబురుకోన, గోగర్భంవంటి స్థలాలలో తపస్సుచేసి సిద్ధిని పొందారని, ఇది నిజంగా సిద్ధి క్షేత్రమని అన్నారు. విశ్వవ్యాప్తంగా హిందూధర్మసారాన్ని ప్రబోధిస్తూ తిరుపతి హిందూభావనకు ప్రతీకగా నెలకొనగల దన్న ఆశాభావాన్ని వ్యక్తంచేశారు.



డాక్టరు దాశరథి తమ ప్రసంగంలో శ్రీవేంకటేశ్వర స్వామి కేవలం హిందూజనతకేగాక ఖండఖండాంతర సమైక్యభావానికే ప్రతిరూపమని, తిరుమల ఆధారంగా అనేక కవిశేఖరులు తమ కావ్యాలను, సంకీర్తనామృతాలను వెలువ రించారనీ, కనుక తిరుమల ధార్మికసాహిత్యకేంద్రంకూడా నని అన్నారు. భద్రాద్రి రామదాసుకు, అయోధ్య తులసీ దాసుకు ఉత్తేజాన్ని కలిగించినట్లుగానే తిరుమల వల్ల ఉత్తేజితుడై అన్నమాచార్యులు 32000 కీర్తనలను వేంకటే శ్వరస్వామివారిపై వ్రాశారని, సంకీర్తనసాహిత్యంలో పల్ల విని ప్రవేశపెట్టిన ఘనత అన్నమాచార్యునిదే అని అన్నారు. స్వర్గీయ వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ వంటి ఉద్దండ పండితుల తరువాత, దేవస్థాన పక్షాన శ్రీ గౌరి పెద్ది రామసుబ్బశర్మ చేస్తున్న సంకీర్తన ప్రచురణ కార్య క్రమాన్ని వివరించారు.

డాక్టరు రత్నాకరబాలరాజు, ఆధ్యాత్మిక సంపన్నతకు మనశ్శాంతికి బ్రహ్మవిద్యమూలమని, దీన్నిసాధించటంలో భగవద్భక్తికి, పరమేశ్వరానురక్తికి గల ప్రాధాన్యాన్ని వివ రించారు. అవిచ్ఛిన్నమైన భగవదనురక్తి నిజమైనభక్తిఅనీ, వాల్మీకి రామాయణం వ్రాసినా, వ్యాసుడు భాగవతం వ్రాసినా అది శ్రీమన్నారాయణ భక్తశ్రేష్ఠుడైన నారదప్రబోధన వల్లనే సాధ్యమైందని అన్నారు. ప్రతి భగవత్కైంకర్యమూ కూడా కర్తకు అధికశుభాలను సమకూరుస్తుందనీ, ప్రారబ్ధకర్మ దుష్ఫలాలు భక్తివల్ల నాశనమౌతా యని, అందరికీ సులభ మైంది భక్తిమార్గమే ననీ అన్నారు.

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు తమ ప్రసంగంలో కలియుగంలోని జనులకు భగవన్నామస్మరణే సులభ తరుణో పాయం అన్నారు. భారతాంతర్భాగాలైన భగవద్గీత, విష్ణు సహస్రనామం నిత్యపారాయణ యోగ్యాలని, భగవద్గీతసాక్షాత్ భగవత్ప్రోక్తంకాగా,విష్ణుసహస్రనామం శ్రీకృష్ణభక్తాగ్రేసరుడైన భీష్మాచార్యులవారు పఠించిందని అన్నారు. ఈ రెండు ఆధ్యా త్మిక గ్రంథాల పారాయణవల్ల కలిగే బహుముఖ ప్రయోజనా లను శ్రీ ఆచార్య సోదాహరణంగా వివరించారు. శ్రీ సము ద్రాల లక్ష్మణయ్య వందనసమర్పణతో, ఉదయం కార్య క్రమాలు ముగిశాయి.

సాయం కార్యక్రమాలు, వివిధ భజన బృందాల భజన కార్యక్రమాలతో ప్రారంభమయ్యాయి. తరువాత శ్రీ పి. ఎస్. రంగనాథ్, శ్రీ నాగేశ్వరనాయుడు, శ్రీమతి జానకిరమణల, అన్నమయ్య భక్తిగీత కార్యక్రమం జరిగింది.



సాయం సదస్సును ప్రారంభిస్తూ మాతృశ్రీ చింతల యోగినీమాత, మానవులు స్వార్థరహితంగా, నిష్కామమైన భక్తి సాధనకు కృషి చేయాలని, భగవదనుగ్రహంపట్ల సహజ మైన తాపం ఉండాలనీ, రామదాసు, అన్నమాచార్య, తులసీ దాస్‌లవంటి మహనీయులు భగవద్దర్శనం కోసం పరితపించా రనీ, వారిఅనురక్తికి తృప్తిచెందిన పరమాత్మ దర్శనం ఇచ్చా డనీ అన్నారు. నిష్కామంగా పనులు చేస్తే అవి భగవత్స న్నిధికి చేరుస్తాయని, స్వర్ణోత్సవాలలో పాల్గొనటం కూడా

పూర్వజన్మ సుకృతం అని పేర్కొంటూ, ధర్మప్రచారానికి దేవస్థానం తమ అఖిలాంధ్ర సాధు పరిషత్తును కూడా వినియోగించుకోవలసిందిగా సూచించారు.

శ్రీ దయానందస్వామి (గాగిళ్ళపురం), భగవంతుని స్మరించగలదినమే సుదినమని, ఈ మూడురోజుల కార్యక్రమాలలో ఇది చేకూరుతున్నదనీ, శ్రీ వేంకటాచలపతి సన్నిధిన ధనం, ధర్మం, భక్తితోపాటు త్యాగంకూడా ఉండటం మన అదృష్టమని, ఆ స్వామికి శరణనటమే సర్వసంపదసిద్ధి అని అన్నారు. భక్తిజ్ఞానం, విషయత్యాగం మానవప్రయత్న సాధ్యాలని, ప్రాపంచిక సుఖాలన్నీ ప్రారబ్ధకర్మలవల్లనే కలుగుతున్నాయని, భక్తి జ్ఞాన వైరాగ్యాలపట్ల తపన బదులు విషయ తృష్ణ పెంచుకుని జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నారని, ఏకాగ్రబుద్ధితో వేంకటేశ్వరుని సేవించినవారికి విజయం తప్పక సిద్ధిస్తుందని ఆయన తెలిపారు.

శ్రీ నిర్మలానంద స్వామి తమ ప్రసంగంలో సనాతన ధర్మం చాలా గొప్పదని, కాని మనం ధర్మాన్ని విస్మరిస్తున్నామని, దైవాన్ని మరవటం మరణంతో సమానమని, పంచభూతాలను యథాశక్తి వినియోగించుకునే వీలు కల్గించిన పరమేశ్వరునికి మనం సర్వదా కృతజ్ఞతతో ఉండాలనీ అన్నారు. బంధువులు నిజంగా బంధాలేనని, ధర్మం తప్ప మరేదీ మన వెంటరాదని బోధించారు.

శ్రీప్రసన్నానందస్వామి, మహాపురుషులనేకులు జన్మించిన మన దేశం చాలా పవిత్రమైందనీ, సనాతన ధర్మాన్ని ప్రవచించిన మతం మనదొక్కటే అనీ, సర్వే జనా సుఖినో భవంతు అనేది మనధర్మంలోని మూలసూత్రమనీ మన పెద్దలు మంచిపనులు చేయవలసిందిగా మనకు బోధించారని, అప్పుడే మన పిల్లలు మననుండి మంచి పనులు చేయటం నేర్చుకుంటారని, యువకులకు సదాచారం నేర్పాలనీ, ఆత్మనియమం ఆహారనియమం పాటించాలని, వృథా ప్రసంగాలు పనికిరావని స్వామీజీ సోదాహరణంగా వివరించారు.

శ్రీ భూమానందస్వామి కలియుగంలో భక్తిమాత్రమే మనకు రక్ష అని అన్నారు. దేవస్థాన ధర్మకర్తల మండలి సభ్యురాలు శ్రీమతి నన్నపనేని రాజకుమారి తమప్రసంగంలో, దేవస్థాననిధులు, వైద్య, విద్య, ధర్మశాలల నిర్మాణాది కార్యక్రమాలకు ఎలా వినియోగమౌతున్నదీ వివరించి ముఖ్యమంత్రి ప్రకటించిన అధునాతన వైద్యశాల, రక్తనిధి నిర్వహణ లాంటి పథకాలను వివరించారు.

మహిళలు రామాయణ, మహాభారత, భాగవతాలు, భగవద్గీత లాంటివి చదివి నేర్చుకోవలసినవి ఎన్నో వున్నా



యని, సమాజంలో స్త్రీలే తమ ఇక్కట్లకు కొంతవరకు కారణమనిపిస్తుందని పేర్కొంటు, సీత రామునివెంట అడవులకు రావటం, లక్ష్మణునిమాట వినకుండా నిందించటం, అలాగే మయసభలో ద్రౌపది అనాలోచితంగా నవ్వటం- వాటివల్ల ఎలాంటి అనర్థాలు కల్గాయో వివరించి, స్త్రీలుకూడా తమ ప్రవర్తనలో చాలాజాగ్రత్తగాఉండాలని హెచ్చరించారు. మానవుడికిస్వార్థత్యాగం అవసరమని ఈ సందర్భంలో త్యాగరాజస్వామివారి 'రూకలుపదివేలున్నా' అన్న కీర్తనను వివరణాత్మకంగా పేర్కొన్నారు.

శ్రీ కొండవీటి వేంకటకవి ప్రసంగిస్తూ యుగధర్మాన్ననుసరించి నిర్వచనం కూడా మారుతుందని, ఒకకాలంలో ధర్మంగాను, అధర్మంగాను అనిపించుకున్నవి తరువాతి కాలంలో వ్యత్యయం కావచ్చునని, అలాగే ఆచారాలు అలవాట్లు కూడా మారుతూ వుంటాయని పేర్కొన్నారు. కాలానుగుణంగా దేవస్థానం తన నిధులను సత్కార్యక్రమాలకు వినియోగించటం సరైన పద్ధతిగా ప్రశంసించారు.

శ్రీ మధునాపంతులసత్యనారాయణశాస్త్రి భగవన్నామోచ్చారణ మహిమను ప్రస్తావించి, భగవన్నామ సంకీర్తన వల్ల ఎన్నో సత్ఫలితాలు కలుగుతాయని, డబ్బుఖర్చు, విధి నిషేధాలు లేకుండా సర్వకాల సర్వావస్థలలోను నామజపంచేయవచ్చునీ అన్నారు. గడచిన 5000 కలియుగ సంవత్సరాలలో దేవాలయం చరిత్ర 50 సంవత్సరాలు చాల శక్తిమంతమైనవని, ఇప్పుడు స్వామి కృపతో జరుగుతున్నంత ధార్మిక గ్రంథ ప్రచురణ కార్యక్రమం ఎప్పుడూ ఎక్కడా జరుగలేదని ప్రశంసించారు.

శ్రీ నరాల రామిరెడ్డి, మనం చేసే ప్రతి పనిలోను, ఏకాగ్రత, ఏకలక్ష్యం చాలా అవసరమని అన్నారు.

ఆనాటి కార్యక్రమాలు శ్రీ వంగల పట్టాభిభాగవతార్‌గారి 'శ్రీనివాసకల్యాణం' హరికథాకాలక్షేపంతో పూర్తయ్యాయి.



మూడవనాటి కార్యక్రమాలు (24-4-84) శ్రీ కామాక్ష్యంబాసమేత శ్రీ కపిలేశ్వరస్వామివారు సభాస్థలికి విచ్చేయటంతో ప్రారంభమయ్యాయి. ఈ రోజున మహారుద్రయాగం జరిగింది.

గీతాపారాయణం తరువాత 'సుందరదాసు' శ్రీ ఎం. ఎస్. రామారావు సుందరకాండ పారాయణం జరిగింది. (తరువాత ఐదురోజులపాటు అన్నమాచార్య కళామందిరంలో జరిగింది.) ఆనాటి కార్యక్రమం సీతాదర్శనంతో పూర్తయింది. ఈ రోజు మంగళవారం అని, ఆంజనేయ స్వామివారు లంకలో సీతాదర్శనం చేసుకొన్న రోజుగూడ మంగళవారమేననీ, ఇది చాలా విశేషమనీ వారు పేర్కొన్నారు.

మాతా దయాబాయమ్మ (సాధుస్త్రీల మఠం, రాజమండ్రి) ప్రార్థనతో తుదినాటి ధార్మిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి.



శ్రీ జ్ఞానానందస్వామి (కైలాసకోన) తమ ప్రసంగంలో దేవుడు ధర్మస్వరూపమని, అందువల్ల ధర్మానికి ముఖ్య లక్షణాలైన సహనం, సానుభూతి లాంటి లక్షణాలను అలవర్చుకోవాలని, ఆగ్రహాన్ని నిగ్రహించాలని అన్నారు. గీతా పఠనంవల్ల మానవుని జీవనం మారిపోతుందని, దేవస్థానం ఇంటింటి కొక గీతా ప్రతి అందేలా చూడాలని అన్నారు.

స్వామిని శాంతిబాయమ్మ, భగవంతుడు సర్వవ్యాపి అని, నవవిధపద్ధతులు భగవద్దర్శనకు పేర్కొనబడ్డాయని అన్నారు. రోజుకొక్కటైనా గీతా శ్లోకం చదివితే మానవుడి జీవితం నిర్మలమౌతుందని, నిర్మలచిత్తంతో మాత్రమే దైవత్వాన్ని సాధించగలమని అన్నారు. హిందూధర్మరక్షణకు గాను తమ సేవలను ఉపయోగించుకోవలసిందిగా దేవస్థానాన్ని కోరారు.

'కరుణశ్రీ' డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు 'సాహిత్యంలో భక్తి' అన్న విషయంపై ప్రసంగిస్తూ కవి అన్నవాడు లేకుంటే రాముడు, కృష్ణుడు, రామాయణ భారతాలు ఉండేవి కావని అన్నారు. సత్యాన్ని సుందరంగా చెప్పగల్గినవాడే కవి అంటూ, లీలాశుకుడు, పోతన, తులసీదాస్, సూరదాస్, పురందరదాస్ రచనలను సోదాహరణంగా వివరించారు.



డాక్టరు మరుపూరు కోదండరామరెడ్డి, ఆంధ్రులకు రామచంద్రుడికి వీడని అనుబంధంవుందని, తెలుగులో చాలా రామాయణాలు వచ్చాయని, శ్రీరాముడు ఉత్తరభారత వాసి ఐనా, దక్షిణాదికే చెందిపోయాడని, అందులోనూ ఆంధ్ర ప్రదేశ్‌లో రామమందిరంలేని ఊరుగాని, పల్లెగాని లేవని అన్నారు. భగవంతుని చేరటానికి పూర్ణశరణాగతికి మించిన మార్గంలేదని ఆయన అన్నారు. ధార్మిక గ్రంథప్రచురణల ద్వారా, విస్తృతంగా భక్తిప్రచారం చేస్తున్నందుకు దేవస్థానాన్ని అభినందించారు.

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య వందనసమర్పణతో ఉదయం కార్యక్రమం సమాప్తమైంది.

సాయంకాల కార్యక్రమం వివిధ భజనలతో ప్రారంభమైంది. శ్రీ సోము ఉమాపతి, శ్రీమతి రత్నకుమారి, భక్తిగాన కార్యక్రమాన్ని నిర్వహించారు.

(43 వ పేజీలో)




(గతసంచిక తరువాయి)

విభీషణుడు మాయారూపమున రావణసైన్య నివహమును దునిమెనని; యుద్ధరంగములో పలువురు రావణులు, పలువురు రామలక్ష్మణులు స్వశరీరముల నుండియే సృష్టించుకొనిరని; ఇంద్రుడంపిన రథమును రాముడు స్వీకరించుటకు నిరాకరించగా విభీషణుడు అది మాయా కల్పితమైనదిగాదని చెప్పెనని అభివర్ణింపబడినవి. సీత పాతివ్రత్యమును బ్రహ్మ, అగ్ని, వాయువు, వరుణుడు. దశరథుడు ప్రత్యక్షమై వివరించుట మూలమున; నలకూబరుని శాపకారణముగ రావణుడు సీతను స్పృశించలేదని బ్రహ్మ చెప్పుట మూలమున రాముడు సీతను స్వీకరించినట్లిందులో గలదు.

వాయుపురాణంలో రావణునకు నాలుగు పాదములు, ఇరువది భుజములున్నట్లు లిఖించబడినది.

సీత పాతివ్రత్యమే రావణ వధకు హేతుభూతమని; మాయారావణుడు పర్ణశాలను సమీపించినపుడు సీత తన దివ్యశక్తిచే అగ్ని ద్వారా మాయా సీతను సృజింపజేసి పర్ణశాలలోనుంచి, స్వరక్షణ గావించుకొనినదని; రావణ వధానంతరము మాయా సీత అగ్ని ప్రవేశముజేయ, నిజసీతను రామునకు అగ్నిహోత్రుడు సమర్పించినట్లు చెప్పబడుఘట్టములు కూర్మపురాణములో గలవు.

అగ్ని బ్రాహ్మణరూపములో వచ్చి మాయా సీతను సృష్టించి, సీతను రావణుబారినుండి తప్పించినాడు, మాయా సీతయే మరుజన్మలో ద్రౌపది. అహల్య సౌందర్యము నపేక్షించిన దేవేంద్రుడు, ఆమె పుష్కరిణిలో స్నానమాడువేళ తన మనోగతాభిప్రాయమును వెల్లడించి నిరాశపడగా, గౌతము డింటలేని వేళ గౌతమ రూపధారియై వచ్చి తన కామ తృష్ణను తీర్చుకొనెను. ఇది గ్రహించిన గౌతముడు, భంగాంగుడగునట్లింద్రుని, శిలయగునట్లహల్యను శపించెను. హనుమంతుడు శివాంశ సంభూతుడు. అవాల్మీకములైన ఈ విషయములు బ్రహ్మవైవర్తపురాణంలోనివి.

సీతాన్వేషణా కాలములో శివపార్వతులు రామునకు ప్రత్యక్షమయినపుడు, శివుడు రామునకు నమస్కరించుట గాంచి, కినుకవహించిన పార్వతికి రాముని నిజవృత్తాంతమును శివుడెరుకపరచెను. రాముని ధర్మనిరతిని ప్రత్యక్షముగ చూడనెంచి, యామె సీత యాకృతిలో దండకారణ్యములో రామునకు కనిపించినది. ఆమెతో రాముడు "తల్లీ మహేశ్వరీ! నీ విట్లొంటరిగ నేల సంచరించుచుంటివి? యనెను. ధర్మ తత్పరత తెలిసికొన్న పార్వతి నిజరూపున అగపడి, ఆశీర్వదించి, అంతర్థానమైనది. శివపురాణములో ఈ కల్పనలు గలవు.

స్కాంద పురాణాంతర్గత బ్రహ్మఖండం లోని విషయములు. రాముడు బ్రహ్మహత్యా పాతక నివృత్తికొరకు లింగ ప్రతిష్ఠచేయనెంచి, లింగమునుతెచ్చుటకు హనుమంతుని కైలాసగిరికంపెను. ఆయన రాకలోగల యాలస్యము నూహించి, సీత ఇసుకలింగమునుచేయ, రాముడాలింగమును ప్రతిష్ఠించెను. ఇంతలో తిరిగివచ్చిన హనుమంతుడు కనలి, తన తోకతో నా యిసుక లింగమును పెకలింప యత్నించి విఫలుడాయెను. రాముడాయనను అనునయించి, ఆయన దెచ్చిన లింగమునుగూడ ప్రతిష్ఠించి, ఆ లింగమునకు హనుమల్లింగమని, ఆప్రదేశమునకు హనుమత్కుండమని పేరిడెను. గోదావరీ తీరంలో లింగ ప్రతిష్ఠజేసి పూజ సలిపిన రామునకు శివుడు ప్రత్యక్షమై, తుంగభద్రా తీరమున కిష్కింధ కలదని, అచటగల వాలి సుగ్రీవులలో, సుగ్రీవుని సహాయమున సీతను గాంచ గలవని రామునకు ఎరుక పరచెను.

బ్రహ్మహత్యా పాతకము నివృత్తియగు మార్గముదెలుపుమని రాము డగస్త్యుని వేడినట్లు, ఆయన సలహా మేరకు అశ్వమేధ యాగంచేసి దోష రహితుడైనట్లు పద్మపురాణములో నున్నది. వివాహాత్పూర్వము రామకథను గానం చేయుచున్న రెండు చిలుకలను సీత పట్టి తెప్పించుకొనినది. "ఈ కథ వాల్మీకి మహామున్యాశ్రమ పక్షులమగుటచే, వారిద్వారామాకుతెలిసిన" దనిరి. వానిలో ఆడు చిలుకనుంచుకొని, మగచిలుకను వదలివేసెను. భర్త వియోగము సహించలేని చూలాలుగనున్న యా చిలుక "నీవును గర్భవతివిగ నున్నపుడు భర్తచే విడువబడెదవు" గాక యని శపించి ప్రాణత్యాగం చేసెను. ఆ మగ చిలుకయే మరుజన్మలో రజకుడై, గర్భవతి యగు సీతపై నిందమోపి, రాముడు సీతను వదలుటకు హేతువైనది. పాతాళఖండము ననుసరించి దశరథునకు కౌసల్య, సుమిత్ర, సురూప, సువేషలను నల్వురు భార్యలని, వారికి క్రమముగా రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులు పుత్రకామేష్టి యాగానంతరము ఉదయించిరని తెలియుచున్నది. మాయా గౌతమరూపంలో తన వాంఛను తీర్చుకొని ఆశ్రమము నుండి మార్జాలరూపమున బయటబడిన ఇంద్రుని, గౌతముడు దూరదృష్టిని జూచి గద్దింపగా నిజరూపు బహిర్గతమైనది. అతని శరీరము భంగాంగ మగునట్లు, అండములు ఖండములగునట్లు శపించెను. అహల్యను "మాంసము నఖములు లేక కేవలం చర్మముచే కప్పబడిన

అస్థిపంజరము వలెనుండు" మని శపించెను. ఇంద్రుడు ఇంద్రాక్షీదేవిని గురించి తప మాచరించగా, ఆమె యాతని శరీరముపై గల సహస్ర యోనులు సహస్రాక్షులు. అగునట్లు వరమిచ్చినది. మేషాండము లండములగునట్లు గూడ అనుగ్రహించి వెళ్ళెను.

ఈ పురాణంలోని సృష్టిఖండములో సంతు నాశించిన దశరథుడు వైష్ణవీ యజ్ఞం చేయగా, సంప్రీతి జెందిన విష్ణువే పాయసపాత్ర ననుగ్రహించ, అందులోని పాయసమును సమముగా దశరథుడు భార్యలకు పంచెను. విష్ణువే కౌసల్య గర్భమున రాముడై జన్మించెను.

ఒకనాడు కౌసల్య పొత్తిళ్ళలోని బాల రాముని శరీరమునుండి విశ్వరూపమును గాంచి భయకంపితయై, ముకుళిత హస్త ములతో, "నా కండ్లకు బాలకుడవుగనే కనిపించు"మని వేడ, రాముడు అట్లే బాలుడుగ కనిపించెను. ఇదియును పద్మ పురాణ కల్పనయే.

సీతాపహరణానంతరం దుఃఖితుడైన రామునకు నారదుడు దుఃఖోపశమనార్థం దేవీనవరాత్ర పూజ నారంభించుమనిచెప్పు చు తాను జానకిని చూచివచ్చితినని, ఆమెకు ఇంద్రుడు కామధేను క్షీరమునాహారముగ నిచ్చుచున్నాడని పలికెను. ఇది దేవీభాగ వత కథనము.

భాగవత పురాణంలో రాముడు రావణ వధానంతరం అశోకవనములో నున్న సీతను దర్శించ వెళ్ళినాడని; అయోధ్యచేరిన తరు వాత సీతను గూర్చిన అపనిందను, గూఢచారిగ అర్ధరాత్రివరకు రాముడే విని నాడని యున్నది.

జానకీహరణమను నాటకమును సింహళ రాజు కుమారదాస క్రీ॥ శ॥ 7 వ శతాబ్దంలో వ్రాసెను. ఇందులో రామలక్ష్మణులువసిష్ఠుని వెంటబోయిరని యున్నది. సీత నపహరించి తీసుక వెళ్ళుచున్న రావణునకు జటాయువు గాక గరుడుడు కనిపించినట్లు, యుద్ధంచేసి గరుడుడే మరణించినట్లు కల్పించబడి యున్నది.

భాసకృత ప్రతిమా నాటకంలో స్వయ ముగ కైకయే సీతా రామలక్ష్మణులకు నార చీరలిచ్చినట్లున్నది. అయోధ్యలో ప్రవే శించిన భరతునకు తన రాకకు ముందు జరిగిన వేవియును తెలియవు. ప్రతిమా గృహంలో గల దశరథుని ప్రతిమను చూచిన తరువాతనే రామ వనవాస గమ నాదులు తెలిసినవి.

విశ్వామిత్ర మహర్షి యాహ్వానమును మన్నించి జనకుడు తన తమ్ముడగు కుశధ్వజుని వెంట సీతా ఊర్మిళలను సిద్ధా శ్రమమునకు పంపెను. ఆ యాశ్రమంలోనే అహల్యా శాపవిమోచనం జరిగినది. రావణు నాదేశానుసారము సర్వమాయుడను రాక్ష సుడే సిద్ధాశ్రమంచేరి జానకీ రాములతో, రావణునిగుణగణాలను ప్రస్తుతించి, ఆయన సీతను వివాహమాడ గోరినాడను విషయము వివరించెను. మాల్యవంతుడను రాక్షసుడు శూర్పణఖ సహాయ మర్థించగా, ఆమె దశరథుని యంతఃపురానికి వెళ్ళి మంథరను ఆవహించి, మందర దుర్బోధకు కైక చెవియొగ్గునట్లుచేసి, తాను కోరిన రెండు వరాల నిచ్చుటకు దశరథుడంగీక రించినట్లు లేఖ వ్రాయించి, ఆ లేఖను శూర్పణఖయే మిథిలా నగరములోనున్న రామునకు అందజేసినది. ఈ వ్యూహప్రేర కుడు రావణుడు. వాలి వధకు ముందే విభీషణుడు సుగ్రీవుని యొద్దకు వచ్చెను. మాల్యవంతుని ప్రోద్బలముతో వాలి రాముని అస్త్రవిద్యా పటిమను పరీక్షించ ప్రయత్నించిన ఫలితంగా మరణించెను. వాలి సత్య సంధత, నిర్దోషిత్వములు శ్లాఘ నీయములు. ఇవి మహావీరచరితంలోని కల్పనలు.

ఉత్తరరామ చరితము ఆధారముగ దిఙ్నాగుడను కవి కుందమాల నాటకమును రచించినాడు. సీతావియోగము ననుభ వించు రామునకు గోమతీనది తీరాన కుంద మాల దొరకెను. అది సీతహస్తనైపుణ్యం వల్ల కట్టబడినదని విశ్వసించిన రాముడామె పాదముద్రలను అనుసరించి వెళ్ళి చివరకు వాల్మీకి ఆశ్రమము చేరి సీతను చూడ గలిగెను. ఈ నాటక ఇతివృత్తమిది.

అనర్ఘ రాఘవకృతికర్త, మురారి. శ్రవణ. యను నామె మంథర దేహంలో ప్రవేశించి, ఒక లేఖ వ్రాసి దశరథునకు అందజేసినది. తదుపరి సన్నివేశములు వాల్మీకి రామా యణంలో వలెనే యున్నవి. వాలియే రాముని యుద్ధమునకు ఆహ్వానించినాడు. రాముడు సప్తతాళ వృక్షముల భేదించి, వాలిని హతమార్చినాడు.

ఋషులచే నొసగబడిన చూడామణిని సీతకు, అంగుళీయకమును రామునకు లక్ష్మణుడిచ్చెను. భరతునకు సహాయము చేయు మిషతో మాయా రాముని రూపమున వచ్చిన రావణుడు, లక్ష్మణ రూపములో రథమును సిద్ధముచేసిన సూతుడు, సీతను రథమును అధిరోహింపు మనగా ఆమె రథము నెక్కినది. అది వియన్మార్గమున పయనించునపుడు రావణుడు తన కామాం ధతను వెల్లడించుటకు సీతను సమీపించెను. చూడామణి సహాయముతో ఆమె నిజస్థితిని అవగతం చేసికొనినది. సీత రూపములో నున్న శూర్పణఖ రాముని వంచింప యత్నించినది. రాముని వేషములో మారీచుడు లక్ష్మణుని మోసగించ యత్నించి నాడు. అంగుళీయం ప్రభావముతో వారి యత్నములు భగ్నమైనవి. ఈ కల్పనలు ఆశ్చర్యచూడామణిలో గలవు. కవి శక్తిభద్రుడు.

ప్రసన్నరాఘవ కావ్యకర్త జయదేవుడు. సీతను రాముడు అన్వేషించుచు; ఆమె జాడను గురించి చెట్టు, పుట్టను అడుగు సమయమున లంకలోని సీత వృత్తాంత మును మాయావియగు రత్నశేఖరుడు ప్రదర్శించగా రాముడు చూచెను. రావణుని తిరస్కరించు సీత నాతడు చంప యత్నిం చినట్లు, రక్తము పట్టుటకు కపాలమును తేబోయినపుడు ఆయన చేతిలో ఎవరో అక్షయకుమారుని శిరము నుంచినట్లు, లంకలో ప్రవేశించిన హనుమంతుని దుశ్చ ర్యయే యిది యని భావించి రావణుడు అతని జంపు ప్రయత్నములో అశోకవన మును విడచి వచ్చినట్లుండినది యా ప్రదర్శన.

సీత రాముని మిథిలాపురవీథులలోచూచు టవలన, అంతఃపుర పైభాగముననున్న సీతను రాముడు తిలకించుటవలన, వివాహా త్పూర్వమే వారి మనసులు సంగమించి నవి. శివధనుర్భంగానంతరము వివాహం

మాత్రమే జరిగినది. వాలి చనిపోయిన పిదప తార నియమబద్ధ జీవితము గడపినది. సుగ్రీవునకుమాతృమూర్తిగమాత్రమే యుండినది. నలకూబర శాపగ్రస్తుడగు రావణుడు సీతనుస్పృశించలేదు. శూర్పణఖ పేరిందులో కామవల్లి. వికృతాకారిణియగు శూర్పణఖ మాయచే అందాల రాశిగ మారి రామునివశంవదునిగావించుకొనయత్నించి విఫలమనోరథయైనది. కుంభకర్ణుని జంపి ప్రయోజనము లేదనినాడు రాముడు. రాము నాజ్ఞచేవిభీషణుడుఅగ్రజునకెదురేగిసాష్టాంగ దండప్రణామము లాచరించి, తనతో గూడ వచ్చి రాము నాశ్రయము పొందుమనినాడు. రాజనీతిని బోధించి, ధర్మప్రబోధము గావించి, రణోద్యోగాను రక్తియే తన కర్తవ్యమని తెలిపి, అశ్రుపూరిత నయనాలతో తమ్ముని ఆశీర్వదించి పంపినాడు కుంభకర్ణుడు. ఈ శిల్పచాతురీ కల్పనలు తమిళములోగల కంబరామాయణములోనివి.

కన్నడములో గుణభద్రుని ఉత్తరపురాణమునకు సంబంధించిన చౌందరామాయణములో మండోదరి కూతురే సీతయని, మాయలేడిని రాముడు వెంబడించిన పిదప రావణుడు రాముని వేషములో వచ్చి సీతను అపహరించినాడని, లక్ష్మణునిచక్రాయుధముతో రావణుడు చంపబడెనని కలవు.

పంపరామాయణ కల్పన ప్రకారము వానరులు సేతువు మీదినుండిగాక ఆకాశ మార్గమున లంకనుచేరిరి. రావణుడు పుట్టుకతో ఏకకంఠుడే, కాని జన్మించిన మందిరములోగల దశముఖ వజ్ర దర్పణములో ఆ ముఖమే పది ముఖములుగ ప్రతిబింబితమైనది. అందుచేతనే దశముఖుడైనాడు. లక్ష్మణుడు రావణుని చక్రాయుధముతో చంపెను. రాముని తల్లిపేరు అపరాజిత. రావణుడొకనాడు పుష్పకముపైనుండి చూచి సీత సౌందర్యమునకు ముగ్ధుడై చివరకు ఆహుతి యయ్యెను.

పుట్టప్ప రామాయణదర్శనంలో వాలి అనంతరము తార సహగమనము చేసినట్లు హనుమంతుడు లంకాదహనము చేయనట్లు, రావణుడు రాక్షసుడు కానట్లు, పాతివ్రత్య నిరూపణకు సీత అగ్నిప్రవేశం చేయగా, ఏకపత్నీవ్రతా ధర్మ నిరూపణకు రాముడు అగ్నిప్రవేశము చేసినట్లును గలవు.

విశ్వామిత్రుని వెంట మిథిలకు వచ్చిన రామలక్ష్మణులు పూజా కుసుమముల కొరకు వనమునకు వెళ్ళుట, అదే సమయమునకు గౌరిపూజకై సీత యటకు వచ్చుట, రామలక్ష్మణులను చెలికత్తెలు వర్ణించుట, ఆమెను రామునకు సన్నిహితము చేసినవి. పరస్పరం మానసిక సామీప్యం యేర్పడినది. రామ పట్టాభిషేకము రావణవధకు ఆటంకమని భావించి, దేవతలు శారదాదేవిని వేడ నామె మంథర బుద్ధిని మార్చి కైక ద్వారా రాముని కానలకంపునట్లు చేయును. శూర్పణఖా పరాభవము కంటెను, ఖరదూషణాదుల సంహారమే రావణుని కలచి వేసినది. వారి సంహర్త మహత్తర పురుషుడు, సాక్షాద్భగవత్స్వరూపుడేయని రావణుడు భావించెను. ఇవి తులసీదాస కృత రామచరిత మానస లోని కల్పనామణులు.

కృత్తివాస పండితుని కృత్తివాస రామాయణము (బెంగాలీ) లోని కల్పనలు: వసిష్ఠ విశ్వామిత్రాదులు నిర్ణయించిన ముహూర్తమునకే కల్యాణము జరుగుచో, రావణవధయసంభవమని తలచినఇంద్రుడు, చంద్రుని ప్రేరేపించ నాతడప్సరోంగనయై కల్యాణ మంటపము నందలి వారలను నాట్య, గాన సమ్మోహితముజేయ, అంతలో ముహూర్త పుష్కరాంశ దాటినది. తత్పర్యవసానమే రామ కాననవాసము. నిద్రాహార వర్జితయైన సీతకు ఇంద్రుడు నిత్యము ఒకఫలము చొప్పున ఇచ్చెను. సుగ్రీవుని భార్య నపహరించిన వాలిని వధించ రాముడు ప్రతిన బూనెను. భ్రాతృహంతకుడనుపేరు తనకు వచ్చునని సుగ్రీవు డిందులకు సమ్మతింపడు. రాజధర్మానువర్తిగా రాముడు వాలిని చంపెను. రాముని అంగుళీయకమును సీత కన్నుల కద్దుకొని "దీనిని చూచినచో రాక్షసస్త్రీలు దొంగిలించెదరు. హృదయమున దాచుకొందునేని ఎల్లప్పుడును రాముని చూడ వీలుపడలేదే?" యని చింతించునంతలో, చంద్రదర్శన స్పర్శనలచే అంగుళీయకములోని చంద్రకాంతశిలలు ద్రవించినట్లగుపించెను. సీత, "ఓ యంగుళీయకమా! నీవును దుఃఖించుచుంటివా? రాముడు చేపట్టిన వారికి కష్ట పరంపరతీరునా? ఇన్ని కష్టాలకు సీతయను పేరే కారణము ఇక మీద ఏ స్త్రీకీ సీతయను పేరుండరా"దనెను

పరిత్యక్తయగు సీతను భూదేవి పాతాళమునకు తీసుకు వెళ్ళినట్లు; ఆమె కోరిక ననుసరించి వాసుకి లవకుశులను మాయారూపుడై తెచ్చి చూపినట్లు, హనుమంతుడు వాసుకిని నిర్జించి కుమారులను, సీతను రామున కప్పగించినట్లు; అయోధ్య యందుండ నొల్లని సీత దినమున కొక పర్యాయము వచ్చి భర్తను, కుమారులను, హనుమంతుని చూచి పోవుచుందునని చెప్పి అంతర్ధానమైనట్లు "శత్రుంజయము" అను అస్సామీ కావ్యమునగలదు. దీని కృతికర్త రఘునాథ మహంత్.

పూర్వజన్మలో అప్సరసయైన మండోదరి దేవతల విన్నపము నాలించి, ఈ జన్మలో రావణుని భార్యయగుటకు అంగీకరించినది. ఆయన దేవతలపై దండయాత్ర చేయబోవు నాటికి గర్భిణిగనున్న మండోదరి ఆయన తిరిగివచ్చు లోపలనే ప్రసవించుట, ప్రసవకాలము దోషాస్పదమైనదని, లంకా వినాశకారియని జ్యోతిష్కులు చెప్పగావిని యా పసికందును పేటిక యందుంచి నదిలో విడిచెను. ఆ పేటిక నుండి జనకునకు లభించిన పాపయే సీత. రావణుని అవసాన దశలో సీత జన్మ వృత్తాంతమును మండోదరి వెల్లడించగా నీరు గార్చిన నయనాలు నిలిచిపోయినవి. శూర్పణఖ నిద్రించువేళ రాముడు బలాత్కరించినట్లు, తాను ప్రతిఘటించినట్లు రావణునకు విన్నవించినది. వినిన రావణుడు సీతనుగూడ బలాత్కరించెదనని శపథము జేసెను. ఈ కల్పనలన్నియు కాశ్మీరపు రాజు సుఖజీవన సింహుని ఆస్థానకవి దివాకర పరాశరభట్టు వ్రాసిన రామాయణములో గలవు.

ఎప్పుడైతే ధర్మానికి విఘాతము శంకింపబడునో, అప్పుడు ప్రతియుగములోను, ధర్మరక్షణ కొరకు తనను తానే సృష్టించుకొనెదనని, శ్రీకృష్ణపరమాత్మ గీతలో ప్రవచించియున్నాడు. ఆ మేరకు త్రేతాయుగములో ఏర్పడిన అధర్మమును రూపుమాపి, ధర్మమును పునరుత్థానము చేయుటకే భగవంతుడు రామావతారమును ఎత్తియున్నాడు. దైవము మనుష్యరూపమున జనించి, మానవ సహజమైన కష్టనష్టాలను ధర్మబద్ధముగ అనుభవించి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, గావించి మానవ నైతికోన్నతిని, భక్తితత్త్వమునుద్యోగుణీకృతము చేసెను. ఆయా కావ్యములలో దొర్లిన కల్పనలు మూలమునకు వన్నెదెచ్చినవేగాని, అది కావ్యముతో భేదించలేదనుట సత్యదూరము కాదు.

# మథనం





గుడినుంచి బైటకి వస్తున్నా. నెత్తిమీద ఏదో టప్పున పడినట్లనిపించి తలపైకెత్తి చూశా. ఆ పడిందేదో కంట్లోకూడా పడింది. కళ్లు నులుముకోవాల్సి వచ్చింది.

"అయింది! బాగా అయింది! లేకపోతే ఏవిటాచూపులూ! అదేమన్న పుణ్యమా పురుషార్థమా? ఆ బొమ్మల వేపు అలా చూడకపోతే యేం, అట్లా కళ్లు కుట్టుకోక పోతేయేం! ఏళ్లొస్తే సరా!"........ఇలా సాగుతూ వుంది ఒక గొంతుక.

ఎవరా, ఇంతసిసలైన తెలుగులో తిడ్తున్నారని అటుచూశా! మా అప్పారావు! వాళ్ళావిడా, ఇద్దరు పిల్లలు. తిట్లు అయిపోయినట్లుంది. ఆపేశాడు, పకపక నవ్వుతూన్నాడు. పాపం వాళ్ళావిడ సంగతి చెప్ప తరంగాదు. పొరబాటున వచ్చాననుకొని ఉంటుంది వీడి ధోరణికి. తిట్టున్నది మాత్రం నన్నే అని ఆవిడకి తెలిసి పోయింది.

వాడు నాకు కొత్తకాదుకాని, నిమ్మకాయ వైద్యందాటి పెద్దాసుపత్రి కెళ్ళిన అప్పారావు ఇప్పుడిలా ప్రత్యక్షమై విరుచుకు పడటమే నా బుర్రకు అర్థంకాని విషయం! ఎప్పుడు వచ్చార్రా అని అడుగుదామనుకొంటున్నా. "ఉరే ఉరే! మేమున్న చోట ముఖ్యమైంది మర్చిపోయివచ్చాం! ఇక్కడే....ఇప్పుడే వచ్చేస్తా! కాస్త వీళ్ళిద్దర్నీ చూస్తుండు. రా! రా! త్వరగా వెళ్లొద్దాం. ఆ అన్నట్లు ఆ బొమ్మలకేసి చూస్తూ కూచోకు పిల్లలు జాగ్రత్త" అని, తన భామామణితో కూడా రిక్షా ఎక్కి వెళ్ళి పోయాడు. అప్పుడర్థమైంది వీడు ఇక్కడ కాదు ఎక్కడో దిగి వుంటాడని. ఏం చేద్దాం పిల్లలిద్దరేగాదు చిన్న చెంబుకూడా వుందాయె. మర్యాదకోసం, కాఫీ పట్టించి మెట్లమీద చతికిలబడ్డాం.

అసలు వీడికింత కోపం కల్గించిన విషయం ఏమిటాని గోపురమంతా పరీక్షగా చూచాను. గోపురమంతా దైవికమైన సింగారంతోపాటు పామర శృంగార చిత్రాలు కలబోతగా కన్పిస్తున్నాయి. అప్పుడర్థమైంది, వీడు, వీడిలాంటి వాళ్ళు ఎందుకిలా పొగలు, సెగలు కక్కుతున్నారో. ఇవి సమాజాన్ని పాడుచేశాయని, కనుక వాటిని పొడిచెయ్యాలని వీళ్ళవాదం. నాకూ అనిపించింది.

ఏకాంతంలో కూడా ఎబ్బెట్టుగావుండే విషయాలు ఇలా గోపురాలెక్కి గోల చేయటం ఏమిటా అని.

కాని తీరుబడి, వేరుశెనక్కాయలుకూడా తెచ్చుకున్నాం కూర్చున్నామేమో, మామూలుగా మథనం మొదలైంది............

*　　*　　*

ఇలా గుట్టురట్టు కెక్కడం ఈ గుడిలోనే ప్రారంభం కాలేదు. ఈ దేశంలో ప్రతి దేవాలయంకూడా ఈ అవస్థకు గురైందే. కొన్ని కొన్ని దేవాలయాల మీద కొత్త కొత్త గ్రంథాలు కూడా వస్తున్నాయి.

పోనీ ఇవన్నీ ఒకతరం దేవాలయాలా అంటే అవీకావు. కనీసం గుడి కట్టడం తెలిసినప్పటి నుండి గూడు కట్టుకొన్నవే కదా!

ఈ ఆలయాలన్నిటికిదాతలు, పోషకులు, ఆర్షధర్మ రక్షైక దీక్షా పరతంత్రులుగా పేరు పొందిన రాజన్య వరేణ్యులకు, ధర్మాచార్య పురుషులకు, ఇలాంటి చర్యలవల్ల సమాజంలో విచ్చలవిడితనం పెచ్చు పెరుగుతుందనీ, సమాజ వ్యవస్థకే సమాధి అవుతుందనీ తెలియలేదా మరి! లేక తెలిసే ఆమోదించటం జరిగిందా! చిన్నచిన్న నేరాలకు కూడా కొరతవేయండి, తలతరగండి అనే రాచరికం, శిల్పాచార్యుల 'తులువతనాన్ని' ఎందుకు, ఎలా సహించినట్లు?

పోనీ, 'మనిషి కొక తిక్కమహిలో' అన్నట్లు వైయక్తిక రసపైత్యప్రకోప ఫలితమని అనుకొందామా అంటే అదికూడా పొసగటం లేదు. రట్టుకెక్కిన రసలీలలన్నీ పరమశివపదపీఠవర్తి నందికేశ్వరుడు మొదలు ఔద్దాలకి శ్వేతకేతు బాభ్రవ్య, మల్లనాగ వాత్స్యాయన, గోణార్ధ్య, పద్మశ్రీ, యశోధర, జ్యోతీశ్వర, జయదేవ, ప్రౌఢదేవరాజ, కల్యాణమల్ల, వేమూల వీరభద్ర, నాగార్జునాది మడిగట్టుకొన్న మహనీయులు, రసరాజులు కలివిడిగా తమ కలాలను కదను త్రొక్కించి నిగ్గుతేల్చి నిరూపించిన ఒక శృంగార శాస్త్రగ్రంథా

[41 వ పేజీలో]

## గ్రంథసమీక్ష

## శ్రీ రాఘవేంద్ర కల్పవృక్షము

రచయిత : శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

పేజీలు : 216

ప్రాప్తిస్థానము : శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త
మట్టుపల్లివారివీధి, కొత్తపేట, గుంటూరు 1.

వెల : రు. 15/–

ఈ గ్రంథానికి శ్రీ రాఘవేంద్ర కల్పవృక్షమని పేరు పెట్టారు. ముఖపత్రంలో వీణపట్టుకొని కూర్చున్న శ్రీ రాఘవేంద్రస్వామివారు; వారి వెనుక బృందావనం, కామధేనువు, ధర్మార్థ కామ మోక్షాలు, శ్రీహరి ధామం అనే ఫలాలున్న కల్పవృక్షముగల త్రివర్ణ చిత్రం చాలా అందంగా ఉంది. పూజ్యాయ రాఘవేంద్రాయ, సత్య ధర్మ రతాయ చ, భజతాంకల్పవృక్షాయ, నమతాం కామధేనవే అనే శ్లోకం ఈ వర్ణచిత్రానికి ఊపిరి.

ఈ గ్రంథంలో మరి మూడు వర్ణచిత్రాలున్నాయి. ఈ గ్రంథాన్ని శ్రీ గుప్తగారు శ్రీ ఆంజనేయస్వామివారికి అంకితమిచ్చారు. ఆ కారణంగా కృతిభర్త (మంత్రాలయ సమీపంలోని) శ్రీ పంచముఖాంజనేయస్వామివారి చిత్రాన్ని ప్రచురించారు. పూర్వజన్మలో శ్రీ రాఘవేంద్రస్వామివారు ప్రహ్లాదుడు, విష్ణుపార్షదుడైన శంఖుకర్ణుడే బ్రహ్మశాపంచేత ప్రహ్లాదుడై జన్మించాడు. ఇదంతా శ్రీహరి భక్తిని ప్రచారం చేయడానికి, భూభారం తగ్గించడానికిన్నీ, కథలోని ఈ అంశాన్ని పురస్కరించుకొని ప్రహ్లాదసహిత శ్రీ లక్ష్మీనృసింహస్వామి వర్ణచిత్రాన్ని ఈ గ్రంథంలో చేర్చారు. చివరగా ఈ జీవిత చరిత్రకు నాయకుడైన శ్రీరాఘవేంద్రస్వామివారి చిత్రం నిల్చున్న భంగిమ ప్రచురించారు. ఈ మూడు చిత్రాలు ఈ గ్రంథానికి వెలలేని భూషణాలు.

ఈ గ్రంథం జీవితచరిత్రల కోవకు చెందింది. కల్పనైతే ఏమివ్రాసినా చెల్లుతుంది. చరిత్ర అట్లాకాదు. ఉన్నది ఉన్నట్లు వ్రాయాలి. దానికి ఆధారాలుండాలి. శ్రీ గుప్తాగారు చాల శ్రమించి శ్రీ రాఘవేంద్ర స్వామివారి జీవితానికి సంబంధించిన అనేకాంశాలను గ్రంథాలను చదివి పెద్దలవలన విని సమకూర్చుకొన్నారు. ఆ కృషిఫలితమే ఈ గ్రంథం.

శ్రీవారి సన్న్యాసాశ్రమ స్వీకార మహోత్సవం చరిత్రప్రకారం తంజావూరు రాజాస్థానంలోనే రచయిత దానిని రాజులే చూడ వచ్చినట్లు మార్చటం ఔచిత్య శోభితమే. ఐనా శ్రీవారి మహత్తు దీనివలన ఏమీ పెరగదు. కాగా ఈలాగున ఇంకా ఏమి కల్పించారో అనే అనుమానానికితావిస్తుంది.

మన సనాతన ధర్మానికి ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత మూలాలు. శ్రీ కృష్ణద్వైపాయనులవారు వేద విభాగం చేశారు. ఆ వేదాలలో ఉపనిషత్తులలో పరస్పరవిరోధంగా కనిపించేవాని అన్వయం కోసం బ్రహ్మసూత్రాలు చేశారు. భారతాన్ని పంచమ వేదంగా తీర్చి అందులో శ్రీ కృష్ణుడు అర్జునునకు కర్తవ్యబోధగా ఉపదేశించిన భగవద్గీతను నిక్షేపించారు. ఇంత వరకు ఒకటిగా సాగిన మన ధర్మం ఆది శంకరులు, రామానుజులు, మధ్వాచార్యుల వల్ల మూడుశాఖలుగా చీలింది. (త్రోవలు తొక్కింది)

శ్రీ మధ్వాచార్యులు ప్రతిపాదించిన ద్వైత సిద్ధాంతాన్ని మూడు పూవులు ఆరు కాయలుగా ప్రచారం చేసినవారు శ్రీ రాఘవేంద్రస్వామివారు, శ్రీవారి జీవిత చరిత్రే ఇది. ద్వైత సిద్ధాంత ప్రచారానికి శ్రీవారు వ్రాసిన గ్రంథాలు వ్యాఖ్యానాలు టిప్పణులు అమూల్యాలు. ఈ గ్రంథంలో శ్రీవారి రచనలు గురించి సూచించారేగాని వివరిస్తే ఇంకా బృహద్గ్రంథం అయ్యేది.

శ్రీవారి పూర్వ పూర్వ జన్మల గూర్చి వ్రాయటం శ్రీవారి హరి భక్తి హరాజ్జనితం కాదన డానికే, ప్రహ్లాదుడై తండ్రిని, విభీషణుడై అన్నను చంపించినవాడు, బాహ్లికుడై ఏంచేశాడో అంత వివరంగాలేదు. కాని వ్యాసరాయలుగా జన్మించి నాటి రాజైన శ్రీ కృష్ణదేవరాయల్ని కుహూయోగ సంధికాలంలో రక్షించారు. ఇది చారిత్రకాంశం.

శ్రీ వ్యాసరాయలువారు తిరుమలలో 12 సంll లు ఉండి స్వామివారి నిత్యారాధనలను క్రమబద్ధం చేశారు, దక్షిణభారతంలో 734 ఆంజనేయ ప్రతిష్ఠలు జరిపించారట.

చివరగా శ్రీ రాఘవేంద్ర స్వామిగా జన్మించి శ్రీవారు చదివిన చదువులు రచించిన గ్రంథాలు, భక్తులను రక్షించిన అద్భుత సందర్భాలు ఈ గ్రంథంలో చాలా చక్కగా వర్ణించారు.

దివినుండి భువికి, భక్తునిపాట భగవంతుని ఆట, మూకం కరోతి వాచాలం, రెండు రెండు రెండు అనే శీర్షికలు బాగున్నాయి.

ఈ గ్రంథానికి కిరీటం లాంటిది సర్ థామస్ మన్రో వృత్తాంతం. ఆరోజుల్లో దేశం ఈస్టిండియా వారి చేతుల్లో పడింది. వారి దృష్టి దేవళాల మరాల ఆస్తులమీదపడింది. దేవాలయ ధర్మాదాయ శాఖకు సంబంధించిన ఆస్తులన్నీ ప్రభుత్వానికి సంక్రమించేలాగు ఒక కఠోర శాసనంచేశారు. ఈనాముగ పొందిన వ్యక్తి సజీవుడై ఉన్న అవి ప్రభుత్వానికి చెందజాలవు.

ఈ శాసనంవల్ల మంత్రాలయం (నాటి మంచాల) లోని శ్రీవారి జాగీరు ప్రభుత్వవశం కావాలి. నాటి బళ్లారి కలెక్టరు మన్రో స్వయంగా బయలుదేరాడు. సిరస్తాదారు శ్రీరాఘవేంద్ర స్వామివారు బృందావనమందు సజీవులై యున్నారని మన్రోకు నివేదించాడు. మన్రో మంచాలలోని బృందావనం ఎదుట పాదరక్షలు వదలి 'ఇదేనా శ్రీ రాఘవేంద్రుల జీవసమాధి?' అని అడిగాడు. ఆ క్షణంలో శ్రీ స్వామివారు స్వయంగా బృందావనం నుండి బయలు వెడలి మన్రోతో ఇంగ్లీషులో సంభాషించారు. మన్రో ఆయనకు నమస్కారం చేశాడు.

శ్రీవారు మంచాలగ్రామం తనదని పలికి మాయమయ్యారు.

చిత్రమేమంటే ఇదంతా మన్రోకే పరిమితం, చుట్టూ ఉన్న వేల భక్తులకు వినిపించలేదు. కనిపించలేదు. మన్రో శ్రీ రాఘవేంద్రస్వామివారు సజీవులేకావున మంచాల జాగీరు వారికే చెందాలని నివేదిక తయారు చేసి గవర్నరుకు పంపాడు.

కథ ఎక్కడ మలుపు తిరిగిందంటే ఆ గవర్నరు భార్య గర్భవతికాగా, సెలవుపెట్టి భార్యతో ఆయన స్వదేశం వెళ్లాడు. ఆ పదవి బళ్లారి కలెక్టరుగా ఉన్న మన్రోను వరించింది. ఆయన గవర్నరుగా వేసిన మొదటి ఆర్డరు తాను కలెక్టరుగా పంపిన నివేదిక మీదే. ఆ విషయం నాటి రాజపత్రంలో ముద్రితమైంది. దాని అనువాదం పాఠకుల సౌకర్యం కోసం రచయిత అందించారు. ఆ అనువాదం చివరన గల షరాలో తిరుపతి వేంకటేశ్వర స్వామికి మన్రో భూదానం గురించి ఉన్నది. మంత్రాలయ వృత్తాంతానికి సంబంధంలేని దీనిని రాజపత్రం చివర ఎందుకు చేర్చారో?

ఇది నవలల కాలం 300 పేజీల నవలకు రు. 15 వెల ఎక్కువకాదు. కాని ధర్మప్రచారం కోసం ఏర్పడిన నిధి నుండి ధనసాయం పొందికూడా రు. 15 వెల నిర్ణయించటం ఎక్కువేమో అనిపిస్తుంది.

ఇంత పెద్దగ్రంథానికి తప్పులే లేవన్నట్లు తప్పొప్పుల పట్టిక చేర్చకపోవటం నిర్లక్ష్యం అనక తప్పదు.

శ్రీవారి జన్మలకు మూలమైన మూల రామచరిత్రలో విభీషణుని కోసం రాముడే 'ఆత్మశక్తిచే తననుండి శ్రీ మూల రామ విగ్రహమును ప్రాదుర్భవింపజేసెను' అని ఉంది. కాని బ్రహ్మ తాను పూజించే మూల రామ విగ్రహాన్ని విభీషణున కిచ్చినట్లు ప్రసిద్ధం.

కొంచెం చేదైనా దోషపరికరణం తప్పని సరి. గౌరవవాచకమైన బహువచనం కర్తకే కాదు. క్రియకున్నూ తగిలించాలి. కాని రచయిత ఈ అల్పనియమాన్ని పాటించనే లేదని చెప్పాలి. 279 వ పేజి చివరి రెండు వాక్యాలు చూడండి "కలెక్టరుతో నీ మంచాల గ్రామము తనదని పల్కి శ్రీ రాఘవేంద్ర స్వామి అంతర్థాన మొందిరి. శ్రీవారు ఒక్కమన్రోకే దర్శనమును ప్రసాదించెను.' అక్షరదోషాలు, శ్లోకాలలో గణభంగాలైన తావులు సరేసరి. సరిగా వ్యతిరేకభావం వచ్చిన చోటు 208 పుట చివరి పేరాలోని స్థాపింపబడని బృందావనము, ఉపోద్ఘాతం 10 వ పేజీలో ముఖ్యముగా చిదరహళ్లి శ్రీనివాసతీర్థులు. శ్రీ రాఘవేంద్రస్వామి పూజారులు "మొదలగునవి" అనేది మరొకచోటు.

— చిట్టా దామోదరశాస్త్రి

## శ్రీ వేంకటేశ్వర చిత్రరత్నాకరము

రచయిత : శ్రీ విక్రాల శేషాచార్యులు
పేజీలు : 83
ప్రాప్తిస్థానము : శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ,
(సబ్‌కోర్టు శిరస్తదారు) నరసరావుపేట.
వెల : తెలియదు.

ధూర్జటి మహాకవి

"ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమో
త్ప్రేక్షాధ్వని వ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన
నీరూపముం
జాలుంజాలు కవిత్వమున్నిలుచునే
సత్యంబు వర్ణించుచో
ఛీ లజ్జింపరుగాక మాదృశకవుల్
శ్రీకాళహస్తీశ్వరా!"

అని అంటాడు. దీనినిబట్టి హృదయనిష్ఠమైన భక్తి వాగ్రూపము నందుకొనజాలదని, ద్వైతీయసత్యము కవిత్వమున కతీతమని తెలియుచున్నది. కాగా భక్తిసాహిత్యము కీర్తన శ్రవణముల నాధారముగా, చింతన మాధేయముగా నిర్మింపబడినచో అది మెండుగా గుబాళించుననుటకు పోతన భాగవతము ప్రత్యక్ష సాక్ష్యము. ఏమైనను భక్తిగ్రంథరూపమెత్తి లోకుల ప్రశంస నందుకొనును. అసలు భక్తిదైవమెరుగును.

శ్రీ విక్రాలశేషాచార్య సాహితీజగత్తున ఉభయ భాషాపోశనము పట్టిన అగస్త్యులుగా ప్రసిద్ధిగన్నవారు. అద్యతనకాలమున చిత్రగర్భబంధ కవిత్వాదుల నాదరించువారు లేరని తెలిసియు 'కవితా యద్యస్తి రాజ్యేన కిమ్' అను పవిత్ర తృప్తితో శ్రీ వేంకటేశ్వర చిత్రరత్నాకరము రచించినారు.

మడికిసింగన

"పలుకుల తీపును, సరసము
చెలువగు నడబెడగు బంధ చిత్రము
సొబగున్
గలకలన చూపవలదే
కలకంఠియు బోలె కవిత కందన
మంత్రీ"

అని అన్నాడు. కవితా సల్లక్షణములలో బంధచిత్రముకూడ ఒకటైనట్లు దీనినిబట్టి తెలియుచున్నది. ఇట్టి కవిత్వము బుద్ధికుశలతతో నెరవేర్పదగినదగుటచే, ఇందలి నిబంధనలమధ్య భావము మరుగుపడునని కొందరు చిత్రకవితను నిరసింతురు. ఏమైనను పూర్వకాలపు శిల్పసైపుణ్యాది నిర్మాణములను మిక్కిలి జాగరూకతతో కాపాడుచు, ఓపికతో పరిశీలించుచున్నట్లే ఇట్టి కవితలను కూడ ఆదరించుట సాహితీమర్మజ్ఞుల కర్తవ్యము.

ఈనాడు తెలుగు పొలముపై చిత్రకవితా కృషీవలురై సఫలీకృతులైన అల్పసంఖ్యాకులలో శ్రీ విక్రాల శేషాచార్య, రాప్తాటి ఓబిరెడ్డి ప్రభుతులనెన్నవచ్చును. శ్రీ శేషాచార్యులవారు, నన్నెచోడ, ముక్కుతిమ్మన, కంకంటి పాపరాజు, కనుపర్తి అబ్బయామాత్యుడు, గణపవరపు వేంకటకవి, వేంకటాధ్వరి- మున్నగు ప్రాచీన చిత్రకవుల రీతులెల్ల తనవిగా చేసికొనుటేగాక, వారికంటె అభినందనీయమైన మెలకువలను ప్రదర్శించినారు.

వీరి కృతిలో ప్రథమ ప్రకరణము గర్భకవిత్వము. ఇందలి పద్యాలు ప్రధానముగా పదిమాత్రమే అయినా, ప్రతిపద్యమునందు

మూడు, నాలుగు పద్యాల నిమిడించినారు. ద్వితీయ ప్రకరణములో చిత్రకవిత్వ మున్నది. ఏబదికిపైగా కవితాచిత్రాలు ప్రదర్శించారు. పూర్వులు పరిహరించిన ఋకారాన్ని గైకొని 'కొమ్ములపద్యా'న్ని వ్రాశారు. అవధానాలలో నిషేధాక్షరి పృచ్ఛకుని బారినుండి తప్పించుకొని, అర్థవంతంగా అల్లిన పద్యమువలె 'అపశబ్దాభాస'మున్నది. 'కుమారాభ్యుదయము,' 'సీతారామాంజనేయ సంవాదము' లలోని ఏకాక్షరి పద్యాలకంటెకూడ, ఇందు 'ఏకాక్షరి' సులభగమ్యంగా వ్రాశారు. కాగా ఒక్కొక్క పాదము ఒక్కొక్క అక్షరంతోనే అల్లిన ఆటవెలది పద్యంలో తృతీయ పాదం 'రార రార రురురు రారురారేరురో' అని మరీ జటిలం చేశారు. గుణితక్రమాన్ని గూర్చి లక్షణసారసంగ్రహములో

'తలకట్టు గుడుసు కొమ్మును
అలదీర్ఘములేత్వమైత్వమలనోత్వౌత్వం
బులు బొట్టుగిలుకయిన్నియు
వలనుగ పండ్రెండు పద్యగుణితం
బయ్యెన్'

అని చెప్పగా ఇందలి వలవలగిలుక పరిహరించి, చెప్పబడని 'ఋ, ౠ' లు వాడారు. అట్లే 'పాదగోపనము' లో సాధారణముగా కనిపించే లాక్షణిక నిర్ణీతక్రమత పాటించ లేదు. ఇట్లు శ్రీ విక్రాల కవి నిరంకుశత్వాన్ని నిరూపించుకొన్నారు. తృతీయ ప్రకరణములో దాదాపు పదుసైదు బంధ కవిత్వ పద్యాలున్నాయి. వీనిలో కొన్నింటికి చిత్రములు గీయబడలేదు. అందువలన వాని నిర్మాణములోని క్లిష్టత, దాని నధిగమించుటలో కవిచూపిన నైపుణ్యము పరిత గుర్తించుటకు వీలులేకపోయినది. సీస పద్యము రథబంధమున నిముడునని వినుటయేగాని చూడవీల్పడలేదు. వీరీ సాహస కార్యమును అతిచతురతతో నెరవేర్చినారు. నడిగడులలో 'కవిచతురాననశేషశర్మ' అని, చక్రములలో గడులప్రక్కన 'విద్యారణ్య పంచానన కవి రామచంద్రాచార్య' అని, వాని నడుమనిలువుగీరలలో 'సూను' అని ఇమిడించుటయే దీనికి తార్కాణము.

ఒకవైపు నామరూప గుణాత్మకమైన దైవభక్తిని నెలకొల్పుటేగాక, మరొకవైపు రచనల నచ్చొత్తించుకొనుటకు భాషాజీవులకు ధనసహాయము చేయుచు అక్షర పరబ్రహ్మము నారాధించు మహాశయమునకు కూడ కంకణము గట్టుకొనుచున్నది- తిరుమల తిరుపతి దేవస్థానము. ఈ గ్రంథ మాక్రియారూప ఫలము. ఆంధ్రదేశమున అతివేలముగా తయారగుచున్న అవధానులకిది అధ్యయన గ్రంథముగానే గాక, అపత్కాలరక్షగా కూడ ఉపయుక్తమగు ననుట అత్యుక్తికాదు.

— ఆశావాది ప్రకాశరావు

## శ్రీ వేంకటేశ్వరస్వామి

[రచయితలు: శ్రీమతి పి. రమాదేవి సీతాపతి, శ్రీ పి. సీతాపతి, ఐ. ఎ. యస్. క్రౌన్ 219 పుటలు మొదటి కూర్పు 1982: వెల 8: రూ. ప్రకాశకులు : వ్యాస ప్రచుర(ర) ణాలయం. హైదరాబాదు-500044]

శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించడానికి తిరుపతి-తిరుమలకు పోయే జిజ్ఞాసువైన ప్రతి ఆస్తికుని చేతిలో తప్పక ఉండవలసిన "హస్తభూషణం" మంచి పుస్తకం, పుణ్యదంపతులయిన శ్రీమతి పి. రమాదేవి సీతాపతి, శ్రీ పి. సీతాపతి, ఐ. ఎ. యస్. గారలు రచించిన "శ్రీ వేంకటేశ్వరస్వామి'. ఈ పుస్తక పఠనం వలన ఇంతకుముందు చాలమంది ఎరుకలో లేని, సామాన్యంగా తిరుపతి వెళ్ళే భక్తుల దృష్టికి రాని, శ్రీ బాలాజీ శ్రీనివాస - వేంకటేశ్వరుని యథార్థ స్వరూపం సాక్షాత్కరిస్తుంది. సీతాపతి దంపతులు చరిత్రజ్ఞానము, భక్తి సంపద, కళాభిరుచి మేళవించి త్రివేణీ సంగమంగా ఈ గ్రంథాన్ని రూపొందించారు.

మొదట ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులో శ్రీ సీతాపతి వ్రాసినారనిన్నీ, అది ఇప్పుడు సీతాపతి, వారి సతీమణి తెలుగుచేసినారని 'తొలిపలుకు'లో చెప్పివున్నారు. తెలుగులో వ్రాసేటప్పుడు ఇంగ్లీషు పుస్తకంలో ఇవ్వని శాసనాలు, శ్లోకాలు, ఇతర మౌలిక వాఙ్మయ ఆధారాలు ఉటంకించడం జరిగి, తెలుగు పుస్తకం, ఇంగ్లీషు గ్రంథానికన్నా మెరుగులు దిద్దుకొని, ఇతోధిక ఉపయోగాన్ని సమకూరుస్తున్నది.

ఈ గ్రంథంలో పదకొండు అధ్యాయాలు ఉన్నాయి; ఒక అనుబంధం ఉంది. అనుబంధంలో మట్ల కుమార అనంతరాజు, క్రీ.శ. 1628 ప్రాంతంలో శ్రీ వేంకటేశ్వరస్వామికి చేయించిన కైంకర్యాలు తెలిపే శాసన మొకటి శ్రీ కృష్ణదేవరాయలు వేంకటేశ్వర స్వామికి సమర్పించిన తిరు ఆభరణాల, చేసిన కైంకర్యాల వివరాలను తెలిపే రెండు శాసనాలు ఇవ్వబడినాయి. విషయ సూచికలో 'అనుబంధము' క్రింద "అర్జితాల షెడ్యూలు - పుట 220" అని చూపివున్నారు. కాని పుట 220 లేదు, అర్జితాల షెడ్యూలు లేదు. అనుబంధం తర్వాత పుస్తకంలో చేర్చిన వేంకటేశ్వరస్వామి దేవాలయ ప్లాను చక్కగా ఉండి, పుస్తకంలో వర్ణింపబడిన దేవాలయ ప్రాకార మంటపాది కట్టడాలను సులభంగా గుర్తించడానికి సహాయపడుతుంది.

మొదట అధ్యాయం 'తిరుపతి-తిరుమల.' దీనిలో తిరుపతి-తిరుమల ఉనికి, ప్రాచీన తమిళ సాహిత్య గ్రంథాలలో దాని ప్రసక్తి, క్రీ. శ. 1628 ప్రాంతంలో స్వామివారిని చేరుటకు సోపానమార్గం కట్టించిన మట్ల అనంతకుమారరాజు ప్రశస్తి, తిరుమలకు ఈ సోపాన పంక్తి ననుసరించి పోయే నడకదారిలోని మంటప, విగ్రహ ప్రతిష్ఠాది విశేషాలు వివరంగా, ఆసక్తికరంగా తెలుపుతూ, ఈ గ్రంథకర్తలు యాత్రికుల అలసటను మరపించి, ఏడు కొండలు దాటించి శ్రీనివాసుని సాన్నిధ్యానికి చేరుస్తారు.

రెండవ అధ్యాయం 'ఆలయంలో శ్రీస్వామివారు' - ఈ అధ్యాయంలో ఆగమ శాస్త్రాలలో, శిల్ప శాస్త్రాలలో గల విష్ణుమూర్తి ప్రతిమా లక్షణాలను కొంత విపులంగా చర్చించారు. ఈ చర్చ అంతా

వేంకటేశ్వరస్వామిని దర్శింపబోయే సామాన్య యాత్రికునికి అనవసరమైనది, అతని అవగాహనకు అందుబాటులో లేనిది. శ్రీ వేంకటేశ్వర విగ్రహశిల్ప సౌందర్యాన్ని భారతదేశంలోని కొన్ని ప్రసిద్ధ విష్ణు మూర్తి శిల్పాల సౌందర్యంతో పోల్చి, 'నిజానికి ఈ మూర్తి భారతదేశంలోని అతి సుందరమైన విష్ణుమూర్తి అని నొక్కి చెప్పవచ్చును'' అన్నారు. స్వామివారి సౌందర్యాన్ని అలతి అలతి మాటలలో చక్కగా వర్ణించారు, వారి ప్రత్యంగ సౌందర్యాన్ని అన్నమాచార్యుల వారి కీర్తనలు, తరిగొండ వెంగమాంబ శ్రీ రమాపరిణయం మొదలగు గ్రంథాల నుండి పాటలు, పద్యాలు సందర్భోచితంగా ఉటంకిస్తూ వర్ణించారు. స్వామివారు విశ్వ రూప దర్శనం వేళలో ఎలా కనబడుతారో, ఈ అధ్యాయంలోనే చూచాయగా తెలిపి, తరువాతి అధ్యాయంలో చర్చించే విషయానికి ప్రాతిపదిక ఏర్పరచారు.

మూడవ అధ్యాయం 'శ్రీస్వామివారి ప్రతిమను గురించి వాదోపవాదములు'. దీనిలో, శ్రీస్వామివారు మహావిష్ణు స్వరూపులా, లేక ఈశ్వరులా లేక మాతా స్వరూపమైన "బాలా' మూర్తియా అనే విషయాన్ని విపులంగా, సందర్భ సహితమైన ఆధారాలతో, మిక్కిలి నిష్పక్షపాత చారిత్రక దృష్టితో చర్చించారు. మతచరిత్రలో, మన దేవతా మూర్తుల వివిధ దశా పరిణామంలో ఆసక్తిగల ప్రతి వ్యక్తి తెలుసుకో దగ్గ విషయాలతో కూడింది ఈ అధ్యాయం. ఈ చర్చలో సీతాపతులు మిక్కిలి హేతువాద దృష్టిని కనపరచారు.

గర్భాలయంలోని ధ్రువబేరం (మూల విరాట్టు) గాక, శ్రీస్వామివారి వివిధ సేవలకు సంబంధించి ధ్రువబేరానికి ప్రత్యామ్నాయంగా పూజోత్సవాలందుకొనే వివిధ ఉత్సవమూర్తులనుగూర్చి, వాని ఏర్పాటును గూర్చి, శాసనాధారమైన కాల నిర్ణయంలో, 'గర్భాలయంలోని దేవతా మూర్తు'లనే నాల్గవ అధ్యాయంలో మనకు చక్కగా తెలియపరచారు.

అయిదవ అధ్యాయం, 'దేవాలయము, దేవాలయములోని శిల్పములు' అత్యంత ఆసక్తికరమైనది. దేవాలయ ప్రాకార కుడ్యాల లోపలగల గోపురాలు, మంటపాలు, ప్రదక్షిణా పథాలు, వివిధ దేవతా మూర్తుల దేవళాలు, కుడ్యశిల్పాలు, స్వామి వారికి మనసు కరగిన మరోభక్తులైన శ్రీ కృష్ణదేవరాయాది విజయనగర చక్రవర్తుల ప్రతిబింబ శిల్పాల వివరాలు-వీటన్నిటినీ, దేవాలయ ముఖద్వార గోపురంనుండి మనలను చేయిపట్టి నడపించుకొనిపోయి 'టూరిస్టుగైడ్లు' అయి, తెలియచేశారు.

ఆరవ అధ్యాయం, 'వేంగడము - శ్రీస్వామివారి ఆలయము' లో 'వేంకట' శబ్దార్థ విచారం చేశారు. వెంకట శబ్దానికి ఒక కొత్త అర్థం, సంస్కృతంలో, ఇటీవలి పండితులు కల్పించారు. 'వేం: కటతీతి' అని 'వేం' అంటే పాపాలట ఎక్కడి ధాతువో, ఏమో. కాని వేంకట శబ్దము సంస్కృత శబ్దం కాదు. ఇది 'వెంగడం' అనే అరవపదం నుండి ఏర్పడింది. ఈ వెంగడానికి 'వెంగళ' పర్యాయపదం. ఈ అధ్యాయంలోనే, శ్రీస్వామిని వస్తువుగా తీసుకొని, వివిధ భాషలలో భక్తకవులు ప్రాచీనకాలం నుండి నేటివరకు వెలయించిన వాఙ్మయ విశేషాలు వివరించారు.

'ఆనందనిలయ విమాన' మనే ఏడవ అధ్యాయంలో, ఈ ఆనందనిలయ విమాన నిర్మాణము, ఎడనెడదానికి జీర్ణోద్ధరణము, పసిడిపూత చేయించినవారి వివరాలు, వీని కాలనిర్ణయము, శాసనాధారాలతో ఎరుకపరచారు. ఆనందనిలయ విమానంమీద కనిపించే విగ్రహాదులను వివరించారు.

'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము' అనే ఎనిమిదవ అధ్యాయంలో, ఈ సుప్రభాత స్తోత్రానికి విమర్శనాత్మకమైన వివరణ, 'అందరికినచ్చే సహజ సామాన్యపు అర్థాన్ననుసరించి తాత్పర్యం ఇవ్వడం జరిగింది'. ఈ సుప్రభాత శ్లోకాలను రచయితలు చక్కగా ఇట్లా విమర్శించారు. "కొన్ని శ్లోకాలలో శివుని గురించి తదితర దేవతల గురించి ఉన్న వర్ణనలను బట్టి, ఈ శ్లోకాల రచయితకు వైష్ణవేతర దైవముల మీద ఉన్న విలువలతో సహా, ఆ కాలంలో వైష్ణవ శైవమతాల కున్న విరోధము మనకు సూచనామాత్రంగా తెలుస్తుంది." సుప్రభాత రచనా కాలాన్ని, చారిత్రక విమర్శనా దృష్టితో, పదునాల్గవ శతాబ్దంగా ఊహించారు.

'శ్రీ వేంకటేశ్వరస్వామి-పురాణగాథలు' అనే తొమ్మిదో అధ్యాయంలో, శ్రీస్వామి వారి చరిత్రను, మాహాత్మ్యాన్ని తెలిపే పురాణ కథలను సంగ్రహంగా క్రోడీకరించారు.

పదవ అధ్యాయం, 'దేవాలయములోని ఉత్సవములు, నిత్యపూజా కార్యక్రమములు.' దీనిలో స్వామివారికి జరిగే బ్రహ్మోత్సవము, పవిత్రోత్సవము మొదలైన ఉత్సవాల పుట్టు పూర్వోత్తరాల వివరాలను, శాసనాధారాలతో అవి ఎప్పుడు మొదలయింది తెలిపారు. దేవాలయంలో కొన్ని ఆచారాలను, నిత్యపూజాకార్యక్రమాన్ని చక్కని క్రమంలో చెప్పారు.

క్రీస్తుశకం తొమ్మిదవ శతాబ్దంలో పల్లవుల పరిపాలన మొదలు పందొమ్మిదివందల అరవై ఆరులో ఆంధ్రప్రదేశ్ ఛారిటబుల్ అండ్ హిందూరెలిజియస్ ఇన్‌స్టిట్యూషన్స్ అండ్ ఎండోమెంట్స్ చట్టము వరకుగల దేవాలయ పరిపాలనను గరుడదృష్టితో వీక్షించి, దానిలోని మార్పులను, చేర్పులను, శాసన, వాఙ్మయాధారలతో నిరూపించారు. నిధుల వినియోగాన్ని, దేవాలయ పాలకుల విధులను, పరిపాలనలో సాధించిన అభివృద్ధిని వరుసక్రమంలో అందించారు. ఈ అధ్యాయంలో దేవస్థానమువారి ఆదర్శములు అనే ఉపశీర్షిక క్రింద దేవస్థానమువారు శ్రీస్వామివారి భక్తులకు తృప్తికరమైన సేవచేయుటకు, ఇతోధికమైన సేవచేయుటకు కొన్ని చక్కని సూచనలను అందించారు. దేవస్థానంవారు వీనిలో కొన్నిటిని అమలు పరచినట్లున్నారు.

మిగిలిన వాటినికూడ యథోచితంగా స్వీక రిస్తారని ఆశిద్దాం.

అందరికీ అర్థమయ్యే సరళమైన, అక్లిష్టమైన శిష్టమైన భాషలో, ఎట్టి అన్వయకాఠిన్యం లేక, రచన సాగింది. అచ్చు తప్పులు లేవనే చెప్పాలి. తెలుగు పుస్తకంలో ఇది ఆశ్చర్యకరమయిన విషయం.

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి 'పరిచయము' గ్రంథంలోని విషయాలను చక్కగా సమీక్షించి గ్రంథంయొక్క వాసిని, రాసిని విలువకట్టింది. అవధానిగారు అన్నట్లు, ఈ గ్రంథము 'శ్రీ వేంకటశైల శ్రీ వేంకటేశ్వర స్వాములకు సంబంధించిన సమగ్ర విజ్ఞాన కోశ'మని చెప్పదగియున్నది.

పుస్తకంలోని ఆలయమంటపాదుల, విజయనగర చక్రవర్తుల ఫోటోలు స్పష్టంగా సందర్భోచితంగా ఉన్నాయి.

భక్తిసంపదను, చారిత్రక దృష్టిని, కళాభిరుచిని సమన్వయించి, మన దేవాలయాలను గూర్చి చెప్పిన పుస్తకాలు చాలా అరుదు; అట్టివాటిలో 'శ్రీ వేంకటేశ్వరస్వామి' అగ్రస్థానమాక్రమిస్తుంది. అందరి అందుబాటులోని వెలగల, ఈ వెల లేని పుస్తకాన్ని శ్రీస్వామివారి భక్తులందరు చదివి, స్వామివారి అనుగ్రహానికి పాత్రులు కావాలని ఆకాంక్ష.

—డా॥ సి. వి. రామచంద్రరావు

## కృష్ణలహరి

రచయిత: డాక్టర్ ధారా రామనాథశాస్త్రి. క్రౌన్ ఫుల్స్‌కేప్ సైజులో 20 పుటలు. వెల: 2-00. ప్రతులకు: మధుమతి పబ్లికేషన్స్, లాయర్‌పేట, ఒంగోలు-523002.

'కృష్ణలహరి' పేరుతో శ్రీకృష్ణుడి లీలా విలాసాలను బాలకృష్ణ, శృంగారకృష్ణ, క్షాత్రకృష్ణ, దయాకృష్ణ, గీతాకృష్ణ అని ఐదు విభాగాలుచేసి వాటిని కొంత వచనంగా, కొంత గేయంగా వ్రాయసంకల్పించారు డాక్టరు ధారా రామనాథశాస్త్రిగారు. ఆ ప్రయత్నంలో వారిప్పుడు బాలకృష్ణను వెలువరించారు.

ఇందులో వున్నట్లుగానే కడమ భాగాలలో కూడ కథకుని కథాకథనం, మధ్యమధ్య పాత్రల గేయాలాపనం వుంటుంది.

ద్వాపరయుగంలో భూదేవి, దేవబృందం బ్రహ్మదేవుణ్ణి దర్శించి ధర్మభ్రష్టులైన రాజుల దుశ్చర్యలు విన్నవించుకుంటారు. బ్రహ్మ మనసు ద్రవిస్తుంది. ఆయన వీరినంతా వెంటబెట్టుకొని క్షీరసాగరం చేరుతాడు. అక్కడ అందరూ శ్రీమన్నారాయణుని స్తుతిస్తారు. స్వామి కరుణిస్తాడు.

అశరీరవాణి పలుకులునమ్మి కంసుడు కల్యాణదంపతులైన దేవకీవసుదేవులను చెరలోనుంచడం, వారక్కడ ఆరుమంది పిల్లలను కనడం, నారదప్రేరణతో కంసుడు వారిని చంపడం - భగవంతుని ఆదేశంతో దేవకి సప్తమ గర్భాన్ని యోగమాయ రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టడం, శ్రావణ బహుళాష్టమినాడు దేవకికి ఎనిమిదవ చూలుగా విష్ణువవతరించి తన్ను యశోద పొత్తిళ్ళలోనుంచి ఆమెకు జన్మించిన యోగమాయను కంసుని కత్తికి ఎరవేయమని వసుదేవునికి కర్తవ్యం బోధించడం, ప్రసూతివార్త తెలియగనే కంసభూపతి కారాగారానికి వచ్చి శిశువును బలాత్కారంగా ఎగురవేసి చంపబోగా ఆమె శైలపుత్రిగా దర్శనమిచ్చి తనతోపాటు పుట్టిపెరుగుతున్న వీరుడు నీ పాలిటికి మృత్యువని చెప్పి అదృశ్యం కావడం, బాలకృష్ణుని లీలలు- కంసవధ- ఉపనీతులై గురుసేవార్థం వెళుతున్న వేళలో రామకృష్ణులకు మధురానగర ప్రజల వీడ్కోలు- ఈ ఇరవై పొరటల చిరుపొత్తంలో సంగ్రహంగా సరసంగా వర్ణించడం జరిగింది. ఇది ఒక చిన్న గోష్ఠీ రూపకం.

తనకు జన్మించిన ఆ విశ్వమోహన బాలకుని హృదయానికి హత్తుకొని దేవకి విలపించిన తీరు ఎంతో హృద్యంగా శాస్త్రిగారు రచించారు.

'ఎన్ని జన్మల నోములో ఫలియించి
నిన్ను కన్నాను తండ్రీ
నిన్ను మాత్రము కంసుడూ నాకెట్లు
దక్కనిచ్చును నాయనా
ఏడుమారులు వరుసగా నాతండ్రి
ఏడుపునె కంటిరన్నా
కడుపు పండిన గడియలే దేవకికి
కడుపు మండిన గడియలూ'

చివరి రెండు బంతులలో కవిత్వం గుప్పుమని గుబాళిస్తున్నది. మాతృసహజ వాత్సల్యంతో కుమారుణ్ణి దేవకి లాలించిన వైనం శ్రీరామనాథశాస్త్రి చక్కగా వర్ణించారు.

'ఎల్లలోకాలనేలే నాస్వామి
పొత్తిళ్ల పాపవైతీ
ఎల్లకాలము నిట్టులే నాయింట
ఆడిపాడంగవలయూ
లాలపోసేను తండ్రీ నీకిపుడు
పాలుపోసేను తండ్రీ
కురులు దువ్వేను తండ్రీ నీ నుదుట
తిలకమద్దేను తండ్రీ
రార దేవకి నందనా రావయ్య
వసుదేవరాజతనయా'

పదిమంది పాడుకోడానికి అనువుగా అంత సహజమైన, సుందరమైన జానపదశైలిలో నడిచింది పుస్తకమంతా. వెల సులభం కాకపోయినా ఫల మధికం.

— శ్రీవత్స

## శ్రీహరినామ మహిమశతకం

రచయిత: శ్రీ బండినాగరాజు

ప్రాప్తిస్థానము: లెక్చరరు, గవర్నమెంటు జూనియర్ కాలేజి, వింజమూరు (నెల్లూరుజిల్లా)

వెల: తెలియదు.

ఆధ్యాత్మికసాధనలో భక్తిమార్గానికున్న ప్రాముఖ్యం సాటిలేనిది. గీతలో భగవానుడు అనన్యభక్తికిగల ప్రాధాన్యాన్ని వర్ణిస్తూ-

భక్త్యా త్వనన్యయా శక్య
అహమేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరంతప!

అని చెప్పాడు. భగవత్ప్రాప్తికి అనన్యభక్తి ఒక్కటే తగిన సాధనమని దీని భావం.

శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం అని నవవిధ భక్తి మార్గాలను శాస్త్రాలు నిర్దేశిస్తున్నాయి. కలికాలంలో భగవన్నామ సంకీర్తన సుల భాతిసులభమైన తరణోపాయంగా పేర్కొన బడింది.

నారదుడు ద్వాపరయుగాంతంలో బ్రహ్మ చెంతకు వెళ్లి కలిని తరించే ఉపాయం బోధించమని ప్రార్థించాడు. అప్పుడు చతుర్ముఖుడు నారాయణుని నామోచ్చారణమే కలిసంతరణానికి తగిన ఉపాయమని చెప్పాడు. ఆ నామమేదో సెలవిండని మళ్లీ నారదుడు ప్రశ్నిస్తే- బ్రహ్మదేవుడు-

హరే! రామ! హరే! రామ!
రామ! రామ! హరే! హరే!
హరే! కృష్ణ! హరే! కృష్ణ!
కృష్ణ! కృష్ణ! హరే! హరే!

ఇతి షోడశకం నామ్నాం
కలికల్మషనాశనమ్।
నాతః పరతరోపాయః
సర్వవేదేషు దృశ్యతే॥

అని చెప్పాడు. హరినామ సంకీర్తనం కంటె మేలైన కలికల్మషాన్ని తొలగించే ఉపాయం వేదాలన్నిటా ఎక్కడాలేదని బ్రహ్మ అభిప్రాయం. ఈ సంగతి అష్టోత్తర శతోపనిషత్తులలో ఒక్కటైన కలిసంతరణో పనిషత్తులో ఉంది.

'ఏతావతాఒల మఘనిర్హరణాయపుంసాం
యత్కీర్తనం భగవతో గుణకర్మ
నామ్నామ్।'

అని భాగవతంలో వ్యాసుని మాట. అంటే భగవంతుని గుణకర్మనామాలను కీర్తించడం వల్ల పాపాలన్నీ పటాపంచలవుతాయని తాత్పర్యం.

ఈ విధంగా శ్రుతులూ, స్మృతులూ, పురాణాలూ ముక్తకంఠంతో నామసంకీర్తన మహిమను వర్ణిస్తున్నాయి.

క్రీ. శ. 16వ శతాబ్దిలో అవతరించిన శ్రీకృష్ణచైతన్యస్వామీజీ నామసంకీర్తనాత్మకమైన ఈ భక్తిమార్గానికి అనన్య సామాన్యమైన ప్రచారం కలిగించారు. అందుకే వక్రృతశతకంలో-

శ్రీచైతన్యః కృపాసింధు
ర్భగవాన్ భక్తవత్సలః।
కృపయా దత్తవానేత
ద్ధరే ర్నామైవ కేవలమ్॥ (91)

అని శ్రీచైతన్యులు భక్తులకు హరి నామాన్ని దయతో ప్రసాదించినట్లు చెప్ప బడింది.

శ్రీ చైతన్యుల తర్వాత ఆయన అనుయాయులు ఈ మార్గాన్ని అనుసరిస్తూ వచ్చారు. ఇటీవలి కాలంలో శ్రీ ప్రభుపాద స్వామి స్వదేశంలోనేకాక విదేశాలలోకూడా 'హరేకృష్ణ' ఉద్యమం ద్వారా ఈ మార్గానికి చక్కని వ్యాప్తి కలిగించారు.

శ్రీ చైతన్య సంప్రదాయానికి చెందిన శ్రీ నీలకంఠ గోస్వామీజీ 100 శ్లోకాలలో హరినామ మహిమను అత్యద్భుతంగా వర్ణించారు. వారి కృతి 'శ్రీ హరినామ మహిమ శతక' మనే పేరుతో ప్రసిద్ధి గాంచింది. చివరిశ్లోకం లోని 'నీలకాంతత మోనుదమ్' అన్న పదంలో రచయిత స్వనామనిర్దేశం చేశారు. ఈ శతకం భక్తి మార్గానుయాయుల్లో బహుళప్రచారం పొందింది.

విద్వత్ప్రముఖులు, విమర్శకాగ్రేసరులు, కవివర్యులు శ్రీ బండినాగరాజుగారు శ్రీ హరినామ మహిమ శతకాన్ని తేటగీత లలో చక్కగా అనువదించారు. విద్యార్థి దశలోనే వీరి శతకానువాదం పూర్తిచేశారు. రచనానంతరం ఇంచుమించు 25 సంవత్స రాల తర్వాత ఈ కృతిని వెలుగులోకి తేవా లన్న సత్సంకల్పం వారికి కలిగింది. పారకలోకం తరపున వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇందలి అనువాదమెంత రుచిరంగా సాగిందో ఒకటి రెండు ఉదాహరణలు చూపి విరమిస్తాను.

రంజనం సర్వచిత్తానాం
భంజనం పాపభూభృతామ్।
గంజనం చిత్తభోగానాం
హరేర్నామైవ కేవలమ్॥

చిత్తములనెల్ల రంజింపఁజేయునదియు
పాపభూధరముల భంగపరచునదియు
మదిని భోగవాసనలను మాడ్చునదియు
పావనము హరినామమ్ము కేవలమ్ము.

* * * *

ఆత్మనా వంచితో హ్యాత్మా
తేన పుంసా దురాత్మనా।
న నీతం హేలయా యేన
హరే ర్నామైవ కేవలమ్॥

పుడమిని దురాత్ముడైనట్టి పురుషుఁడరయ
తన్ను వంచించుకొనుచుండు తానె యకట।
హేళనమునకునైన రానీడు నాల్క
పావనము హరినామమ్ము కేవలమ్ము.

పరమపావనమైన ఈ శతకానికి సరళ సుందరమైన అనువాదం కావించి భక్త జనుల కృతజ్ఞతకు పాత్రులయిన శ్రీ బండి నాగరాజుగారిని మనసారా అభినంది స్తున్నాను.

—సముద్రాల లక్ష్మణయ్య



# ఆగ్నేయ ఆసియాలో హైందవీకరణ

ఆగ్నేయ ఆసియా ' అనే పదం రెండవ ప్రపంచ సంగ్రామ సమయంలో ఐరోపా వాసులచే మొదటిసారి వాడబడింది. దీన్ని ప్రాచీనకాలంలో సువర్ణభూమి అని (బర్మా థాయిలాండ్, కంపూచియా, లావోస్, మలేషియా, వియత్నామ్) సువర్ణ ద్వీప మని (ఇండోనేషియా) పిలిచారు. భారత ఆగ్నేయఆసియాసంబంధాలు చరిత్ర పూర్వ యుగం నుండి ప్రారంభ మైనాయి. మొదట భారతీయవ్యాపారులు ఆగ్నేయ ఆసియారేవులో వ్యాపార స్థావరాలను నెల కొల్పారు. అదేవిధంగా ఇండోనేషియా వ్యాపార స్థావరాలలో మలబార్ తీరంలో, ఉన్నట్లు పేర్కొన బడింది. కాబట్టి రెండు ప్రాంతాల్లో వ్యాపార సంబంధాలు ఏర్పడిన పిదప భారతీయ సంస్కృతి విస్తరణ జరిగింది.

రాజ్యాలు భారత, మత, ఆచార అలవాట్లను పాటించారు. సంస్కృతాన్ని పవిత్రభాషగా పరిగణించారు. వ్యాపారుల తరువాత మత బోధకులు, అర్చకులు, దేశములకు ప్రవాసం వెళ్ళారు. వీరి రాకతో సంస్కృతి విజృంభణ ప్రారంభ మయింది. ఈ విస్తృతిని కొన్ని అంశాలుగా పరిగణింప వచ్చును. హిందూ, బౌద్ధం పాటించడం సంస్కృతభాష ద్వారా సారస్వతప్రసంగాలు, ఇతిహాసాలు, పురాణాల నుండి కర్మ సిద్ధాంతాన్ని గ్రహించడం పవిత్ర హైందవ న్యాయ శాస్త్రమైన మను ధర్మశాస్త్రాన్ని ఆచరించడం మొదలైనవి. మొదటి సారిగా ఆర్యసంస్కృతి విస్తరింప బడింది. కాని ఈ సంస్కృతికి సువర్ణ ద్వీప భూమి ప్రజలు క్రొత్తవారు కాదు. అందువల్ల వారు త్వరగా హిందూ ఆచారాలకు

చైనీయుల రచనలవల్ల ఆగ్నేయ ఆసియాలోని మొదటి హిందూరాజ్యం ఫ్యూనాన్ అని చెప్పవచ్చు. ఇది క్రీ. శ. మొదటి శతాబ్దంలో హైందవబ్రాహ్మణుడైన కౌండిన్యుని చేత స్థాపించ బడింది. చైనాలోని వోయి రేవుపట్టణం ఆ నాటి ముఖ్య రేవు. ఫ్యూనాన్‌లో లభ్యమైన శాసనాల ద్వారా చైనావారితో కూడ తొలి సంబంధాలు ఉండేవని తెలుస్తున్నది. చైనీయుల రచనల ఆధారంగా మలయాద్వీప కల్పంలో హిందూరాజ్యాలు వెలసినాయని చెప్పవచ్చు. మీనామ్ నదీప్రాంతంలో (థాయిల్యాండ్స్) లభ్యమైన గుప్తశైలిలో ఉన్న బౌద్ధ విగ్రహాలు, క్రీ. శ. 2 నుండి 5వ శతాబ్దానికి చెందినవి.

క్రీ. శ. 5వ శతాబ్దికి పూర్వమే బర్మాకు, భారత దేశానికి సంబంధాలున్నాయి. అశో

ఈ సంస్కృతి విస్తరణను హైందవి కరణ అంటారు. కాని ఆగ్నేయ ఆసియాలో థేరవాద (హీనయాన) బౌద్ధమతం ముఖ్యంగా ప్రభావితం చేసింది. హీనయాన బౌద్ధం బర్మా, థాయిలాండ్, కంపూచియా దేశాలలో ముఖ్యమతం. మధ్యయుగంలో ఇండోనేషియాలో, మలేషియాలో ఇస్లాంమత విజృంభణతో హిందూమతం మరుగున పడింది. కానీ బౌద్ధమతం చిరస్థాయిగా నిలిచి పోయింది. హిందూ మతము నుండి ఆవిర్భవించిన ఉపశాఖయే బౌద్ధమతం అని వక్కాణించినమాక్సుమ్యులర్‌తోను, 'యూదు మతము నుండి క్రైస్తవ మతము ఆవిర్భవించింది.' అని చెప్పిన ఆచార్య కీనే అభిప్రాయంతో ఏకీభవించిన భారత సంస్కృతివిస్తరణను హైందవీకరణ అనడంలో తప్పులేదు.

వ్యాపార సంబంధాల కారణంగా సువర్ణ ద్వీపంలోను సువర్ణభూమిలో వెలసిన అలవాటుపడి హైందవ సంస్కృతివ్యాప్తికి కృషి చేసారు.

"ఆగ్నేయ ఆసియా" నాగరికతపై భారతీయ సంస్కృతి ప్రభావాన్ని తెలుసుకోడానికి తగిన ఆధారాలు మనకు లభ్యం కావు. కౌటిల్యుని అర్థశాస్త్రం ప్రకారం ఈ వ్యాప్తి క్రీస్తు పూర్వము నుండి ప్రారంభమైనదని తెలుసుకొన వచ్చు. క్రీ. పూ. 300 సంగ‖ములో మౌర్య చంద్రగుప్తుడు ఉత్తర దేశాన్ని జయించినపుడు అనేకమంది సువర్ణ భూమికి ప్రవాసం వచ్చినారని, వారితో పాటు హైందవమతం కూడా ప్రవాసం వెళ్ళిందని అర్థశాస్త్రంవల్ల తెలుస్తున్నది.

రామాయణంలో సుమిత్ర, జావాదీవులు పేర్కొన బడినాయి. కాని రామాయణ మెప్పుడు, ఎవరిచేత క్రోడీకరించినది మనకు తెలియదు.

కుడు, సోన, ఉత్తర అను బౌద్ధమతాచార్యులను సువర్ణభూమికి పంపినట్లు శాసనాల వల్ల తెలుస్తున్నది. సువర్ణ ద్వీపంతో కూడా క్రీ. శ. 5వ శతాబ్దం నాటికి సంబంధాలు ఉన్నాయని, ఈ ప్రాంతంలో లభ్యమైన ఆధారాలద్వారా తెలుస్తున్నది. వాయు పురాణంలో పేర్కొన్న బరిహికి ద్వీపమే బోర్నియో. బోర్నియో పాలించిన మూలవర్మ వేయించిన మౌరాకామన్ శాసనాల ద్వారా హిందూమత సంప్రదాయాల ప్రభావము విశదమగు చున్నది. కెడై సెలబీన్, ప్యాలమ్‌బాగ్‌లో లభ్యమైన అమరావతి శైలిలో ఉన్న బౌద్ధవిగ్రహాలు, సార్విక్ దీవిలో లభ్యమైన శివలింగాలు, గుప్త శైలిలో ఉన్న బౌద్ధవిగ్రహాల ద్వారా క్రీ. శ. 5వ శతాబ్ది నాటికి సువర్ణ ద్వీపానికి భారత దేశమునకు సంబంధాలున్నాయని తెలుస్తున్నది.

సంస్కృతి ప్రవాసాన్ని పరిశీలిస్తే ఇది సంస్కృతి సమ్మేళనము అని చెప్పవచ్చు. హైందవసంస్కృతి శాంతియుతంగా ప్రవేశ పెట్టితే, శీఘ్రగతిన స్వీకరించడం జరిగింది. ఇది రాజకీయ వ్యాప్తి చేయ లేదు. పర మత సహనమే హైందవజాతికి ఆణిముత్యం.

ఆగ్నేయ ఆసియాలో జరిగిన హైందవ సంస్కృతి వ్యాప్తికి అనేక జాతక కథలు ఉన్నాయి. విదేహయువరాజు తన తండ్రి పోగొట్టిన రాజ్యాన్ని తిరిగి సాధించడానికి తల్లి అనుమతితో సువర్ణభూమికి వెళ్ళి ధనాన్ని సంపాదించి స్వదేశానికి వచ్చి పూర్వ రాజ్యాన్ని సంపాదించాడని కథనం.

వారణాసికిసమీపంలో నివసిస్తున్న వేయి వడ్రంగి కుటుంబాలు ఒక నావను నిర్మించి అందు సువర్ణభూమికి తరలిపోయి అచ్చట వారు స్థిర పడ్డారట. ఈ విధమైన జాతక కథలు, బౌద్ధమత గ్రంథాలలో ఉన్నాయి. సువర్ణభూమికి హిందూ దేశస్థులు సముద్ర యానం చేసినట్లు చెప్పడానికి అనేక ఆధా రాలు ఉన్నాయి. బెంగాలులోని తామ్ర లిప్తి అనే రేవుపట్టణం, ఒరిస్సాలో గంజాం దగ్గర ఉన్న పాలూరా రేవు, ఆంధ్రలో మచిలీపట్టణం రేవులు ఈ ప్రవాసానికి తోడ్పడ్డాయి. సముద్ర మార్గాలే కాక భూ మార్గాలు కూడా ఆనాడు ఉండేవి. తూర్పు బెంగాలు, మణిపూర్, అస్సాం గుండా సువర్ణభూమికి వెళ్ళారు. భారత దేశానికి చైనాకు, బర్మా, టోన్‌కిన్‌ల మీదుగా వ్యాపారం జరిగెడిది.

యున్నాన్ స్థావరాన్ని గాంధార అని వ్యవహరించారు. ఎగువ బర్మాలో హిందువులు ప్రామ్ శ్రీక్షేత్ర, పెగు మొదలగు రాజ్యాలు స్థాపించబడ్డాయి. ॥ ఉదా ॥ శ్రీ విజయ, శైలేంద్ర, మజాపహిత్, పై రాజ్య స్థాపనలకు సంబంధించిన బౌద్ధ జాతక కథలు అనేకం ఉన్నాయి.

ప్రపంచ దేశాలలో ప్రాచీన నాగరికత కల్గిన దేశాలలో భారతదేశం ఒకటి. అదే విధంగా మొదటిగా విదేశాల్లో స్థావర మేర్ప రచు కొన్నది భారతదేశం. కాని మిగతా దేశాల స్థావరాలు వ్యాపారార్థంకాగా భారత దేశ స్థావరం సాంస్కృతిక పరమైంది. ఆగ్నేయ ఆసియాకు హైందవ సంస్కృతి భారతదేశమునుండి ఎట్లువ్యాప్తి చెందిందో, ఇస్లాంమతం కూడా భారతదేశం నుండే వ్యాపించింది. ఇది భారతదేశపు గొప్పతనం. ఇస్లాంమత వ్యాప్తితో ఆగ్నేయ ఆసియాలో హైందవ సంస్కృతి స్థానంలో ఇస్లాం చోటు చేసుకుంది. కాని బౌద్ధమతం తన స్థానాన్ని కాపాడుకొంది. *

— శ్రీ కొమ్మూరి శివప్రసాద్

[ 32 పేజీ తరువాయి ]
నికి లక్ష్యభూతాలుగా ఆ సేతుహిమాచలం ఆక్రమించివున్నాయిగదా! ఇవన్నీ ముది మది తప్పిన చేష్టలనుకోవాలా? మదంకదను త్రొక్కగా తేలిన రూపాలనుకోవాలా?

ఇటువంటి ఆలయశిల్పాలు కేవలం హిందూదేవాలయాలకే పరిమితం కాలేదు. మగ కచ్చ బిగ్గ కట్టుకొన్నామనుకున్న జైన బౌద్ధ దేవాలయాలు కూడా దీనికి లోనుగాక తప్పలేదు.

ఇవన్నీ అనుకూల ధర్మాలా? నెగ్గిన ప్రతికూల పవనాలా?

సరే ఇంతవరకు కన్పించినవి లౌకిక తత్త్వాలకు సంబంధించిన సామాజిక పరిణామ విశేషాలనుకొందాం.

దేవాలయాలన్నిటికీ ఆగమాలు ఆధారభూతాలు. సురసుందరుల ప్రతిమల, శృంగారశిల్పాల నిర్మాణం అవశ్యాచరణీయంగా అవి విధించాయిగదా! కనుక ఇటు లౌకికంగాను, అటు పారమార్థిక, పారమాత్మిక ప్రయోజనకరంగాను మహత్తర సందేశాన్ని సమాజానికందిస్తూ ఇలా పొందుపరచారనే అనుకోవాలి...........

నిర్గుణుడు, నిరంజనుడు, నిశ్చల జ్యోతిస్వరూపము ఐన పరబ్రహ్మం నుండి స్వసంకల్పంవల్ల సర్వమోహకమైన మాయ వెలువడి సత్త్వరజస్తమో గుణాత్మకమైన ప్రకృతిగా విహరించి, ఆ పరమపురుషుని హృదయాన్ని హరించి, తిరిగి మూలస్వరూపంలో లయమైపోయింది. ఆ లయమప్పుడు కల్గిన ఆనందం త్రిగుణాతీతమైంది. అనిర్వచనీయమైనది. మాయ లయంకాగా మిగిలిందేదీలేదు, కనుక ఆ స్థితినే ప్రళయం అన్నాం. ఆ ప్రళయానంతరం, పారమాత్మిక పునస్సంకల్పంవల్ల ఆ ప్రకృతి రూపమైన సృష్టి యథారూపం జరిగింది.

మరి మానవుడు ఆ పరమపురుషుని స్థూలరూపం. సర్వాంతరాత్మ ఐన ఆ పరమాత్మ ఆడించినట్లు ఆడితేనేగాని ఈ సృష్టి సాగదు. స్త్రీ పురుష సంయోగ సంలీన తాదాత్మ్యం వల్లనే సృష్టి జరుగుతున్నది. అందువల్లనే దీన్ని మహత్తర యజ్ఞంగా పవిత్రకార్యంగా భావించటం జరిగి, దానికి గృహమేధం అనే పేరు కూడా ఏర్పడింది. రఘువు మొదలు రాఘవులదాకా 'ప్రజాయై గృహమేధినాం' సంతానం కోసమే గృహయజ్ఞం చేసినట్లు మహాకవి కాళిదాసు అన్నారు. చతుర్విధ పురుషార్థాలలో 'కామాన్ని' చేర్చి ధర్మబద్ధంగా సేవించవలసిందిగా సెలవిచ్చారు ప్రాజ్ఞులు! ఇవన్నీ ఇలా ఉంచి అటు పది, ఇటు పది తరాలవారు శాశ్వత బ్రహ్మలోకాన్ని చేరేందుకని, కన్యాదాత వరుని మహావిష్ణు స్వరూపంగా భావిస్తూ కన్యాదానం చేయటం మన మెరుగుదుము. అంటే ఆ పూర్వ సృష్టికి ఇది ప్రతిరూపముగా భావిస్తూ పరమపురుషుడని అర్చించుకోవటం అన్నమాట.

సత్సంతానమువల్ల తరతరాలవారికి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయని మన వాఙ్మయం చెపుతుంది.

ఇలా జగన్నాటక రంగంలో అన్ని హంగులు సింగారించుకున్న జీవుడు తనలోని దేవుణ్ణి తానెటూ చూచుకోలేడు కనుక గుడికట్టి తనవన్నవాటిని తనవిగావని సర్వసమర్పణ భావంతో అందరిలో వుంటూ ఆ గర్భగృహంలోవుండే పరమాత్మ పాదాల కర్పిస్తున్నాడు. అహంకార మమకార త్యాగంగా నీలాలు, నిలువుదోపు సమర్పిస్తున్నాడు. శరణాగతుడనని సాగిలబడి మ్రొక్కి సాష్టాంగప్రదక్షిణం చెల్లిస్తున్నాడు. జగన్నాటక రంగంలో తనపాత్ర సింగారానికి గాను నేర్చుకున్న విద్యలన్నీ యథాశక్తి యథాభక్తి సమర్పిస్తున్నాడు. తనకు తెలిసినవనుకొన్నవి తెలియ చెప్పాలన్న తపన కూడా లేకపోలేదు. ఐతే అర్చనకు అర్పణకు అందనిదీ అనాదిగా వస్తూ అతిస్వల్పమే ఐనా, అలౌకికానందాన్ని ప్రసాదించేదీ, శృంగారప్రక్రియ ఒకటి ఉంది.

మానవుడు,'శృంగార ఏవ ఏకోరసః' అని భోజుడు చెప్పినట్లు దానికి సంబంధించిన ఆనంద విధానాలను జీవితానుభవాలకు జోడించి ఆలయ ప్రాంగణాలను అలంకరించాడు.

జాయపసేనాని నృత్తరత్నాకరానికి రామప్పగుడి ఆకరమైందన్నా ధర్మావిరుద్ధ కామకళ కళకళలాడిందన్నా ఇదే కారణం.

పైగా తంత్రశాస్త్రం ఏకలక్ష్యరూపకమైన స్త్రీ పురుషతాదాత్మ్యం పరతత్త్వావహగాహనకు రాచబాటగాకూడా వర్ధిల్లోంది. సమాజ క్షేమానికి భంగం రాకుండా సుప్రజార్థం గృహమేధంలోని భాగస్వాములు పారమాత్మికానంద బిందుసంసేవనలో పాల్గొనే విధానాలను గుడిగోడలపైన గుర్తుపెట్టారు.

అందులోను తమ ప్రవృత్తుల కనుగుణముగా కాక తరతరాలుగా ఋషితుల్యులనేకులు నిగ్గుదేల్చిన శాస్త్రానికి లక్ష్యభూతాలుగా చెక్కటం, చిత్రించటం ఆసేతుహిమాచలం సాగింది, ఆనాటి సమాజాలు హర్షించటం జరిగింది. సమాజ సంక్షేమానికిది అవరోధం, అనుకొనిఉంటే జైన బౌద్ధారామాల మాదిరిగానే మంగళగీతం పాడేవారు.

అంటే అనాదిగా జీవ,జీవన లోకధర్మాన్ని, అనుష్ఠించిన విధానాన్ని పరిశీలించి, శాస్త్రంగా రూపొందించి దాన్ని రసాస్వాదైక దృక్కులకు రసనమంచితంగా అందజేశారని అనుకోవాలి.

అయితే అన్నీ లక్ష్యలక్షణ సంబద్ధంగా వున్నాయనేందుకు వీలులేదు. 'బ్రహ్మకైనను బుట్టురిమ్మతెగులు' అన్నట్లు ఊహావికారభూతాలు కొన్ని వుండవచ్చు. అంతమాత్రాన పరమార్థాన్ని శంకించాల్సిన అవసరంలేదేమో!

సరే, వాటినలా తగలడనీ. మనం పాము కొనేదేమిటి అనేది ప్రశ్న? మన తరతరాల జీవన విధానాన్ని తాత్త్విక ఆదర్శాలను పరిశీలిస్తే పలుకోణాలలో సమాధానాలు మనను పలుకరిస్తూ వస్తై.

అన్నిటికి మూలం సంగం. దానివలన కామం, క్రోధం, సమ్మోహం, బుద్ధినాశం. ఇదీ- వివేకభ్రష్ట సంపాత పరంపర. విషయ

లోలుపమైన కామం ఎంతో బలీయమైనదనీ, అది అడుగడుగునా అవస్థా, ఆశ్రమ, ఆకార భేదాలు లేకుండా వెన్నాడుతూనేవుంటుందని, ఆధ్యాత్మికంగా పురోగతి సాధించుకోదల్చుకున్నవారు కామజితులు కాకుండా జితకాములయ్యేందుకు ప్రయత్నించాలని, మన ప్రయత్నాలలో మొదటగా ఎదురయ్యేది, కడదాకా వెంటవుండేదీ, మనం కడతేర్చవలసిందీ ఈ కామమేనని తస్మాత్ జాగ్రత! జాగ్రత! అని హెచ్చరిస్తూవుంటాయి ఈ శిల్పాలు.

ఇక దేవాలయాలు సర్వకళానిలయాలు. ఆ యా సమయాల సమాజాల వృత్తులు, ప్రవృత్తులు, అభిరుచులను కంటికి కన్పించింది కన్పించినట్లు పరిపూర్ణ నిష్పాక్షిక దృష్టితో పదిలపరచటం జరిగింది. తరతరాల చరిత్రను సంతరించుకొన్న ఇవి, మనం పదిలపరచుకోవలసిన అక్షరభాండారాలు. ఈ దృష్టితో చూస్తే వివిధాలయాలలో శృంగారశిల్పభావనలోను, బంధనలోను క్రమక్రమాగత వ్యత్యాసాలు వాటి వాటి వికృతులతో సహా మనకు అధ్యయనీయాంశాలౌతాయి.

'ధర్మావిరోధేనకామంసేవేత' అన్నారు పెద్దలు. అంతేకాదు, వ్యాయామనాట్య శాస్త్రాలు కూడా ఇందులో ఇమిడి వున్నాయని మరికొందరంటున్నారు. ఒకనాటి సమాజంలో స్త్రీలు కేవలం పాచన గృహబద్ధ జీవులుగా కాక సర్వకళా విశారదలుగా ఉండాలని, గృహమేధంలో గృహిణీపాత్ర చాలా గొప్పదని 'కార్యేషు దాసీ....షట్కర్మ యుక్తా కులధర్మపత్నీ' అనటంలో శృంగార శాస్త్రపరిజ్ఞానం కూడ చేర్చబడిందేమోనని పిస్తుంది. అలాంటి సందర్భంలో ఈ ఆలయ శిల్పాలు సమారాధనకు సింగారించిన సాల భంజికలై రచ్చకెక్కి నిల్చి గుట్టుగా బోధిస్తున్నాయి. వర్తమాన సమాజంలో ఒక ప్రక్క తీసి కావాలంటున్నాం, తెచ్చి పెట్టిన దాన్ని ఇదికాదు పొమ్మంటున్నాం.

ఇవన్నీ ఇలావుంచి, మన ఆలయదేవతా చరిత్రలో ముఖ్యమైనవి రెండు జంటలే. క్షీర సాగరంలో శేషశయనంపై, ప్రపంచాన్ని చిత్తగిస్తున్న లక్ష్మీనారాయణులు, చలిమల కొనలో రసఝరితటిని బిగికౌగిలి లేతే కామేశ్వరీనటరాజులు.

అపార సంసార సాగరంలో సంతతానంత సమస్యానంతశయనుడై మంగళదేవత లాంటి తన అర్ధాంగితో జగన్నాటకంలో తనపాత్రను నిర్వహిస్తూ నరుడు నారాయణుడుకావాలని, తలిస్తే గడగడవణకించి గడ్డకట్టించే భవసానువుల నడుమ నడయాడుతూ, ఇంద్రియోన్మాదహాలాహలాన్ని కంఠగతంచేసుకొనికూడా, అర్ధాంగికి ఆనందానుభూతి కలిగించి పరమశివ పర్యంక ప్రణయినీ పరతత్త్వావగాహనలో అభవత్వం (జన్మరాహిత్యం) పొందాలనికోరే స్త్రీ పురుష రూప జీవుల ఏకాత్మతారాధనా ప్రతిరూపాలే మనకు దర్శనమిచ్చే ఆలయసాలభంజికలు.

ఆ పరతత్త్వాన్ని అందుకోమనే అందరూ చెప్పేది. పురుషరూప పరతత్త్వారాధనకు మంత్రశాస్త్రం, మహామాయారూప పరతత్త్వారాధనకు వివిధ తంత్రాలు ఏర్పడ్డాయి. సమాజానికి ప్రమాదం కల్గించని ఏప్రక్రియ ఐనా ప్రమోదమే ఔతుంది. లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రం వ్రాసిన శంకరభగవత్పాదులే ఇలా అంటారు................

సుధాసిన్ధోర్మధ్యే సురవిటపివాటీ పరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణిగృహే
శివాకారే మఞ్చే పరమశివ పర్యఙ్క నిలయాం
భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానన్ద
లహరీమ్.

ఇంతటి ఆలోచనను కల్గిస్తున్న వాటిని పనికిమాలినవనటం ఏమంతసమంజసం? మన కిష్టం లేదు కనుక వాటి చావు వాటిని చావనిస్తే మన అభిరుచులకు తగ్గట్టు మనం కట్టుకోవచ్చు. ఎలకలున్నాయని ఇంటికి నిప్పు పెడితే............

చురుక్కుమంది. ఎప్పుడు వచ్చాడో అప్పారావు, దెప్పిపొడుస్తూన్నాడు, వేలితో పొడుస్తూ. "ఇదా నువుచేసే నిర్వాహకం. పిల్లల్ని చూస్తుండరా అంటె బొమ్మల్ని చూస్తున్నావా? అయినా నిన్నని ఏంలాభం? ఇంకానయం ఎవరన్నా ఎత్తుకు పోయారు కాదు!"- వాళ్ళావిడ రాలేనందిట. తానే ఇద్దరుపిల్లల్ని చెరొకప్రక్క ఎత్తుకొని, వెనక్కి తిరిగి చూడకుండా నడిచి వెళ్తున్నాడు అప్పారావు కాకపోతే కాస్తతూలుతూ. *

"నాగరాజ్"

## కీర్తన

కొండంత దేవుడవు కొండపై నీవుండ
అండ కోర కన్యలను అర్థింపనేల ॥ కొం ॥

దండిగా సంపదల దయచేయు శ్రీమాత
నిండుగా నీహృదిని నివసించియుండ ॥ ॥ కొం ॥

ఆదిశక్తివి నీవె హరిహరాదులు నీవె
ఆద్యంతములులేక అలరుస్వామివి నీవె
మమ్ములను పాలించు మహితాత్ముడవు నీవె
ఓంకార రూపుడవు ఓ! తిరుమలేశా ॥ ॥ కొం ॥

— పొన్నలూరి లక్ష్మీనరసింహం

( 28 వ పేజీ తరువాయి )

తరువాత సినీ నేపథ్య గాయకుడు శ్రీ ఆనంద్, కుమారి మండపాక శారద తమ ఆర్కెస్ట్రా సహాయముతో అన్నమయ్య కీర్తనలూ; దిగిరారా; దిగిరారా; రావాలనిఉన్నది కొండకు అన్న పాటలు తన్మయతతో పాడి శ్రోతలను పరవశింప చేశారు.



ముగింపురోజున అనేక వేలమంది ప్రజలు ఉత్సవాలను చూడరావటం ఒక విశేషం.

దేవస్థాన బాలమందిర్ బాలబాలికలచే శ్రీ ముదివర్తి కొండమాచార్య ఆధ్వర్యంలో గీత 15వ అధ్యాయ పఠనం జరిగింది.

పుష్పాలంకరణలలో గెలుపొందిన వారి పేర్లు ఉద్యాన విభాగాధికారి శ్రీ తమ్మణ్ణ చదవగా, శ్రీమతి కుమారస్వామి రెడ్డి బహుమతులు అందజేశారు.

కంచికామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరా చార్య స్వామివారి నుండి వచ్చిన వేదపండితులు ఆశీఃపురస్సర



వస్త్ర బహుమానం శ్రీ కుమారస్వామిరెడ్డికి, ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణరాజుకు అందజేశారు. కార్య నిర్వహణాధికారి శ్రీ కుమారస్వామిరెడ్డి కామకోటిపీఠ ప్రతినిధు లకు శ్రీవారి ప్రసాదం అందజేశారు.

శ్రీ కుమారస్వామిరెడ్డి ప్రసంగిస్తూ ఈ స్వర్ణోత్సవాలు 1984 సంవత్సరాంతం వరకు ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి జిల్లా



లోనూ, ఇతర రాష్ట్రాలలోనూ మూడురోజులపాటు జరుగు తాయని అన్నారు. ప్రత్యేక సంచిక వెల: రు. 50/- నుండి 25/- కు తగ్గిస్తూ ప్రకటించారు.

హిందూధర్మ రక్షణసంస్థ నిర్వహించే పురాణప్రబోధ పరీక్షలను వివరిస్తూ గత నాల్గేళ్ళలో 72 వేల మంది విద్యా ర్థులు పాల్గొన్నారని, ఇక ముందు ఈ పరీక్షలలో సర్వప్రథ ముడుగావచ్చిన 'విద్యార్థి' విద్యాభ్యాసానికయ్యే పూర్తి ఖర్చును దేవస్థానం భరిస్తుందని ప్రకటించారు.

ఈ స్వర్ణోత్సవ సన్నాహాలను పేర్కొని, 40 వేల ఆహ్వా నాలద్వారా, 20 వేల కరపత్రాలద్వారా ఇంటింటిని ఆహ్వానించా మని అన్నారు.



శ్రీ విద్యానందగిరిస్వామి (ఏర్పేడు) తమ భాషణంలో బ్రహ్మవిద్య పొందేందుకు తగిన గురువు అవసరమని, సద్గు రువుల లక్షణాలను వివరించారు. సద్గురువుల ద్వారా బ్రహ్మ జ్ఞానాన్ని పొంది సంసారాన్ని దాటవచ్చని అన్నారు.

శుకబ్రహ్మాశ్రమాధిపతులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి, ఆధ్యాత్మికశక్తి సంపాదించటం కష్టమే ఐనా సాధన ద్వారా సులభతరంచేసుకోవచ్చని అలసత అనర్థహేతువని

అన్నారు. క్రోధవశుడై నందువల్లనే మానవుడు నిషిద్ధకర్మలను చేస్తున్నాడనీ నరుడు కనీసం నరుడుగా వుండాలనీ, లేదా నారాయణుడయ్యేందుకు ప్రయత్నించాలనీ అన్నారు. మోక్ష మనేది ఎక్కడోలేదని గ్రహించ గలిగితే అదిమనలోనే వుందని అన్నారు.

డా॥ దివాకర్ల వేంకటావధాని తమ ప్రసంగంలో, భక్తి అనేది అయిదు విధాలని, అందులో దాస్యభక్తి ఒకటని, భక్తరామదాస్, భక్తశబరి, దీని ద్వారా ముక్తి పొందారని అన్నారు.

డా॥ బిరుదురాజు రామరాజు ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని కాపాడుతుందని వేదమహర్షి ప్రోక్తమైన మనధర్మం అనాది అని, అట్టిమతం దురదృష్టవశాత్తు ఆపదల పాలౌతున్న దనీ, ధర్మసంరక్షణ కార్యక్రమంలో దేవస్థానం విశ్వహిందూ పరిషత్తు సహాయాన్ని పొంది, తన నిధులను ధర్మప్రచారానికి వినియోగించాలనికోరారు.

శ్రీమల్లాది చంద్రశేఖరశాస్త్రి మోక్షాన్ని పొందాలంటే ధర్మము, భక్తిచాలా అవసరమని, భక్తిలేని ధర్మంవల్లకూడా ప్రయోజనంలేదని, ధర్మమూ, భక్తివల్లనే సత్ఫలితాలు పొందవచ్చని, ద్రౌపది, విదుర, భీష్ముల చరిత్రలు నిరూపిం చాయని అన్నారు. ధర్మం అంటే ఆయావర్గాల వారికి ఏర్పడ్డకర్తవ్యాలు నిర్వహించటమని, అంటే గృహిణి గృహిణి బాధ్యతలను, శిష్యుడు తన కర్తవ్యాన్ని నిర్వహించాలని అన్నారు. ధర్మం ఉన్నచోట కృష్ణభగవానుడు కూడాఉంటా డని, ఆ మహాపురుషుల బోధలను ప్రచారం చేయటంలో హిందూధర్మరక్షణసంస్థ పాంచజన్యపాత్ర నిర్వహిస్తున్నదని అన్నారు.

దేవస్థాన ప్రజాసంబంధాధికారి శ్రీ రావుల సూర్యనారా యణమూర్తి, ఈ త్రయాహ్నిక క్రతుసమాప్తిగా వందనసమ



ర్పణచేస్తూ, ఈ కార్యక్రమాలకు చేయూతనిచ్చిన సంస్థలకు, వ్యక్తులకు, పేరుపేరునా వందన సమర్పణచేశారు.

శ్రీ దూసి బెనర్జీభాగవతార్ 'పార్వతీ కల్యాణ' హరి కథాకాలక్షేపంతో త్రయాహ్నిక స్వర్ణోత్సవ కార్యక్రమాలు మంగళప్రదంగా పూర్తయ్యాయి.

ఒకప్రక్క భక్తులనాకర్షిస్తూ మరొకచేత భక్తులకు వరదానంచేస్తున్నట్లు శ్రీవేంకటేశ్వరస్వామి విగ్రహంతీరు, మహిమ, ఈ త్రయాహ్నిక స్వర్ణోత్సవం దర్శించిన వేలాది భక్తులకు శాశ్వతసత్య మనిపించింది.

పలువురు పీఠాధిపతుల, మఠాధిపతుల ఆశీర్భాగ్యము, భక్తులనుండి ఉవ్వెత్తుగా వచ్చిన సహకారసంపదతో ఉత్తేజిత మైన తిరుమల తిరుపతి దేవస్థానం, సనాతనధర్మ ప్రబోధన పరిరక్షణలకు మరొకసారి తనను తాను అంకితంచేసుకున్నది ఈ స్వర్ణోత్సవ శుభసందర్భంలో.

'నాగరాజ్'



# వైశాఖమాస వైశిష్ట్యము

ద్వాదశమాసములలోను కార్తిక, మాఘ వైశాఖమాసములు మిక్కిలి ప్రశస్తమైనవి.

వైశాఖమాసములో సూర్యుడు మేషరాశి యందుండగా నదికాని, వాపి, కూప తటాకములందుకాని, స్నానమాడి జలదానము చేసిన మిక్కిలి ఫలప్రదమగును. అందుచేత వైశాఖమాసమందు చలివేంద్రములు కట్టించి దాహముగొన్నవారికి మంచినీరు, మజ్జిగయిచ్చుట మొ॥గు కార్యములచే తన కున్న దురితములు తొలగించుకొనుటయే కాక, తనవంశస్థులను కిల్బిషములనుండి కూడ విముక్తిపరచినవాడగును.

వైశాఖమాసమున తృష్ణతీరుటకు జలము కాని, ఎండకుగొడుగు పాదాలకు పాదరక్షలు శరీరతాపము తగ్గుటకు వీవనలిచ్చుటకాని చేసినచో అట్టివారికి సమస్తపాపములు నశించుటయేకాక బ్రహ్మాది ముక్కోటి దేవతలు సంతృప్తిచెంది, సర్వసుఖములతో పాటు జన్మాంతరమున వైకుంఠప్రాప్తి కలుగజేతురు. విసనకఱ్ఱవిలువ బహు స్వల్పమే. ఐననేమి? విసనకఱ్ఱ ఏ మనుజుడు ఇవ్వనిరాకరించునో అట్టివానికి వాయురోగము సంప్రాప్తమగును. విసన కఱ్ఱ నిచ్చుటకు శక్తిలేనివారు మార్గాయాస ముతో అలసిన వారికి కనీసం తనపై నున్న వలువతోనైన విసరి ఆ వ్యక్తి తాపము తీర్చవలెను.

దూది రేణువులు గాలికి యెటుల దూర మగునో అటులనే వైశాఖ మాసంలో శయ్యను, తలగడను దానముచేసిన అతని పాపాలు పటాపంచలగును. శయ్యా దానము చేయుటకశక్తుడైనచో తాటాకుల చాపనైన దానమిచ్చిన శేషశయనుడు స్వయంగావచ్చి ఆసీనుడై శయనించునని ప్రతీతి.

'వైశాఖం- పొయ్యిశాకం' అన్నారు. వైశాఖమాసమున ఎండ తీక్షణముగావుండి వేడిగాడ్పులు వీచును. కాన తాపోపశమన నిమిత్తం ఫలములు, పానకము, బెల్లంకలిపిన దోసపండు, చెఱకుముక్కలు, చక్కెర కలిపిన మామిడి పండ్లరసము, వడపప్పు, పనసతొనలు దానమిచ్చిన, గొప్ప పుణ్యవంతులై రాజతుల్య భోగము లనుభవించును.

వైశాఖమాసమున నది తదితర జలా శయములలో స్నానం చేయవలెను కాని, యింటివద్ద ఘటములోని నీటితో చేయరాదు. అటుల మొండివైఖరితో చేయువారు మరు జన్మలో కుక్కలైతిరుగుదురు అని శాస్త్రం.

జీవితం బుద్బుదప్రాయం. ఏ నిమిషా నికేమి జరుగునో తెలియదు. కాళ్ళు సేతులు సరియైన స్థితిలో వున్నపుడే తీర్థయాత్రలు సేవించి శ్రీహరిని నమస్కరించగలం. నాలుకతో స్తోత్రంచేయగలం. భగవన్మూ ర్తిని కనులార చూడగలము. వృద్ధాప్య ములో చేయవచ్చునులే అని వుపేక్షించినచో హఠాత్తుగా వాత, పిత్త, శ్లేష్మములు అడ్డు పడి నోటమాటరాక కాళ్ళు, కరములాడక పోవచ్చును. కాన ఆరోగ్యవంతునిగా వున్నపుడే వ్రతములాచరించినచో నష్టమే మియు కలుగదు.

ఏ మానవుడు వైశాఖ మాసవ్రతమును నిర్లక్ష్యభావముతో చూచునో, ఎవడు రేపు, మాపుయని కాలయాపన చేయునో, ఏనరుడు లోభత్వముచే దాన ధర్మములకు వెనుకంజవేయునో, అట్టివారు కాకి, కిరి, కుక్క మున్నగు నీచ జన్మలెత్తి నరక కూప ములనుండి బయటపడజాలరు.

శ్రీమన్నారాయణుని పూజలు సలుపుటకు ఏయే ఋతువులు, కాలములు మంచివో నిర్ణయింపబడివున్నవి. వర్షాకాలమున వరద, బురదలుండుటచే జనులకు పూజాపునస్కార ములు సల్పుటకు ఆటంకములు కల్గును. దానితర్వాతిది చలికాలము. చన్నీటిస్నాన మన్న ప్రజలు ఉత్సాహము చూపరు. స్నాన దానములుచేయరు. ఇక ఎండాకాలము అనగా వైశాఖమాసము. ఈనెల అన్ని విధాల శ్రేయస్కరమైనది. కనుక వైశాఖ మాసమన్న శ్రీహరికి ప్రీతి పాత్రమైనది. ఈ మాసములో సమస్తఫలములు, వస్తు వులు లభించును. దానధర్మములకు అను వైనకాలము.

వైశాఖ మాసమున సూర్యుడు మేషరాశి యందు చేరినతోడనే పుణ్యకాలమారంభ మగును. అత్తఱి శ్రీమన్నారాయణుడు లక్ష్మీ దేవితోడను, దేవగణంతోడను దివినుండి భువికి దిగి ప్రతియిల్లు శోధించును. ఎవడు వైశాఖమాసములో స్నానసంధ్యాదికములు చేసి పండ్లు, భోజనము, ఛత్రము, పాదరక్షలు, శయ్య, తలగడ, విసనకఱ్ఱ, జలపానము, గుడము, పరిమళ ద్రవ్యము మొ॥ నవి దానముచేయునో వానికి పరం ధాముడు సకలైశ్వర్యములు, వంశాభివృద్ధి కలుగజేసి జన్మాంతరమున తన సన్నిధిని చేర్చుకొనును.

ఎవరైతే వైశాఖమాసములో విష్ణు మూర్తికి దధ్యోజనము నైవేద్యముగా పెట్టుటకాని, బ్రాహ్మణునకు అన్నదానము కాని చేయడో అతడు పిశాచ రూపమున పీడింపబడును.

వైశాఖ శుద్ధతదియను అక్షయతదియ అందురు. ఆనాడు చేసిన పితృదేవతల శ్రాద్ధ కర్మలకు విష్ణుమూర్తి సంతసించి విశేషఫలము నిచ్చును. అంతేకాక ఆనాటి దానములకు అనంతఫలములు కల్గును.

వైశాఖమాసములో అనుదినము ఉద యముననే లేచి, నదీస్నానముచేసి, హరి హరాదులను ధ్యానించి, శక్తికొలది ఐదు తమలపాకులు ఒక పోకచెక్క, లవంగపట్ట, పూలతో సద్బ్రాహ్మణునకు యిచ్చి నమస్క రించినచో నిస్సంతులకు సంతానమూ, దీర్ఘాయురారోగ్యములు చేకూరును. అంతియకాక సకల సౌభాగ్యములు కల్గి సంతానవృద్ధి గోసంపద, భూసంపద లున్ను కల్గును. అవివాహితులు నిత్యం తాంబూలం దానం చేసినచో సుగుణవతి

సౌభాగ్యవతియగు స్త్రీ భార్యగా లభించును. ఆ స్తిని వ్యాజ్యములో కోల్పోయినవారు తాంబూలదానము చేసినచో నష్టపోయిన ధనము తిరిగి పొందుదురు.

వైశాఖ, కార్తిక, మాఘ, ఏ మాస మందైనను నూలువస్త్రము, పట్టువస్త్రము, ఉన్ని, శాలువ మొ॥ నవి దానమిచ్చినచో ఆ జన్మమందేకాక, జన్మజన్మలకు ఆ దాన ఫలము వలన శుభములుకల్గి అన్నవస్త్రము లకు లోటుండదు. వెనుక జన్మలో ద్రౌపది వస్త్రదానము చేసిన ఫలితంగా వస్త్రాపహరణ సమయమున శ్రీకృష్ణుడు వలువలనిచ్చి తులువల బారినుండి పాంచా లిని కాపాడినాడు.

కలియుగ వైకుంఠమని వాసిగాంచిన శ్రీ తిరుమల తిరుపతి క్షేత్రమందు శ్రీ వేంక టేశ్వరస్వామి సన్నిధి యందును, శ్రీ జగ న్నాథమందును వైశాఖమంతయు భక్తితో విష్ణుమూర్తిని సేవించి విధివిధాయకముగా వ్రతమాచరించి సద్బ్రాహ్మణునకు గో, భూ, హిరణ్య, సాలగ్రామ, ఫల, పుష్ప, అన్న, వస్త్ర తాంబూలాది దానధర్మములు చేసినచో సకల కామితార్థ మనోవాంఛలు యీడేరును.

వైశాఖమాసము యొక్క 30 రోజులలో యే ఒక్కదినము నైనను నదీ స్నానము చేసి, విష్ణుమూర్తిని తులసీ దళములతో పూజించి, విష్ణుపురాణము ఆలకించినయెడల బ్రహ్మహత్య, గోహత్య, శిశుహత్య, పర ధనాపహరణ, మాంసభక్షణ, సురాపానము మొ॥లగు అత్యాచారము లన్నియు నశించును.

మాఘమాసమువలె వైశాఖమాసము లోను వివాహములు ముమ్మరముగా జరు గును.

వైశాఖమాస శుక్లపక్షమందలి త్రయో దశి, చతుర్దశి, పౌర్ణమాసి-అను యీమూడు తిథులు అతి ప్రధానమైన పుణ్యదినములు. మానవునికున్న సమస్త దుష్కృతములు నశింపజేయుటలో యీ మూడు తిథులకు ప్రత్యేకత కలదు వైశాఖశుద్ధ పౌర్ణమినాడు స్నానం చేయుటకు సామర్థ్యం లేని మను జుడీ మూడు తిథులలో యే తిథి యందైనను నదీస్నాన మాచరించిన యెడల సంపూర్ణమాస ఫలము పొందగలరు.

పూర్వము దేవదానవులు పాలసంద్ర మును మథించినప్పుడు అందుండి అమృ తము వైశాఖశుద్ధ ఏకాదశినాడు వచ్చెనట. దానిని విష్ణుమూర్తి భద్రపరచి వైశాఖ శుద్ధ త్రయోదశినాడు దేవతలచేత త్రాగిం చెను. జగత్కర్తయైన ఆ మహా విష్ణువు దేవతల విరోధులును, క్రూరులును అగు అసురులను వైశాఖ శుద్ధ చతుర్దశినాడు సంహరించెను. రాక్షసుల సంహారానంత రం దేవతలు తిరిగి వైశాఖ శుద్ధ పూర్ణిమ నాడు స్వర్గాధిపత్యమును పొందిరి. దేవతలు యీమూడు తిథులలోనే ఘన విజయములు పొందుటచేత - త్రయోదశి, చతుర్దశి, పౌర్ణ మాసి దినములను గొప్ప ఫలదాయక దిన ములుగా నిర్ణయించి వున్నారు.

వైశాఖశుద్ధపూర్ణిమనాడు ఒక సద్బ్రాహ్మ ణునకు పప్పు, పరమాన్నములతో భోజన మిడిన కీర్తివంతుడగు పుత్రుని బడయ గలడు. త్రయోదశి, చతుర్దశి, పౌర్ణమాసి తిథులందు గీతా పారాయణము చేసినచో వేయి అశ్వమేధ యాగములు చేసినంత ఫలముకల్గును. పుణ్యప్రదమైన యీమూడు దినములలోను విష్ణుసహస్ర నామ స్తోత్ర పారాయణం వలన వచ్చుఫలమును వర్ణింప బ్రహ్మకైనను శక్యముకాదు. *

(వైశాఖపురాణము ఆధారంగా)

**— తేల్కర్ శంకర రావ్**

---

(2వ పేజి తరువాయి)

వారి 5 గంటలకల్లా మద్రాసు చేరేవారు. మరి కరెంటుతో బళ్ళు నడిచే రోజుల్లో ఈ 18 గంటల ప్రయాణం అన్యాయమనే చెప్పాలి. కనుక ఈ బండిప్రయాణకాలాన్ని మార్చటంతప్పనిసరి. పాసింజరు అన్నంత మాత్రాన ప్రతిస్టేషన్‌లోను గంటలకొద్దీ పడి వుండాలనీ నియమం లేదుకదా! అవసర మైతే దీన్ని ఫాస్టు పాసింజరుగా మార్చి ప్రయాణకాలాన్ని 13 గంటలకు పరిమితం చేస్తే మంచిది.

తిరుపతి ఒంగోలు పాసింజరును విజయ వాడ వరకు పొడిగిస్తే మంచిదని లోగడ సూచించటం జరిగింది. అధికారికంగా ఈ మార్పు జరిగినట్లు కన్పడదు. ఒంగోలులో ఒక గంటకుమించి ఆగని విధంగా సుమారు 5 గంటలలోపల విజయవాడ చేరే విధంగా మారిస్తే ప్రయాణీకులకు పాలుపోసినంత.

ప్రస్తుతం విజయవాడ బిట్రగుంటల నడుమ ఒక పాసింజరు నడుస్తున్నది. దాన్ని గూడూరువరకు పొడిగిస్తే గూడూరు విజయవాడల నడుమ మరొకబండి ఏర్పడి నట్లవుతుంది. వేగం పెంచితే మరీ మంచిది.

ఇక మీటరు గేజిలో తిరుపతి రామేశ్వ రంల నడుమ ఎక్స్‌ప్రెస్‌గా నడుపగలిగితే చాల ఉత్తమంగా వుంటుంది. శివకేశవ క్షేత్రాలకు ప్రత్యేక సంధానం ఏర్పాటు చేసి నట్లౌతుంది.

పూరీ ఎక్స్‌ప్రెస్‌గా రాకముందు తిరుపతి మచిలీపట్నంల మధ్య ఒక పాసింజర్ ఉండేది. ఇప్పుడు ఇన్నిరైళ్ళున్నా మచిలీ పట్నం వైపు ఇబ్బంది అలాగే వుండి పోయింది. అందువల్ల కాకినాడ తిరుపతి పాసింజర్లకు విజయవాడలో కలిపే విధంగా మచిలీపట్నం నుండి ఒకటి రెండు పెట్టెలు వేయగలిగితే చాలా సౌకర్యంగా వుంటుంది.

ఇప్పుడు తిరుపతి హైదరాబాద్‌ల నడుమ ఉదయం బండి ఒకటున్నది కనుక తిరుపతి నుండి హౌరాకు ఒకపెట్టె తగిలించి విజయ వాడలో ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్‌కు కలిపే ఏర్పాటు జరిగితే తిరుపతినుండి కలకత్తా వరకు నేరుగా ప్రయాణసౌకర్యం ఏర్పడు తుంది.

ఇంతకంఠశోషకు కారణం. అన్నీ పెరుగు తున్న ఈ రోజుల్లో యాత్రికుడు ఎక్కిదిగే ప్రయాణాలు చేయలేడు. కనుక వీలైనంత వరకు సరాసరి సౌకర్యాలు ఏర్పాటు చేయ గలిగితే మనుష్యుల తృప్తిలోనే మాధవుణ్ణి చూచుకోవచ్చు. అదీ సంగతి.

నాగరాజ్ — తిరుపతి.

# వార్తాలహరి

## వసంతోత్సవం

గత ఏప్రిల్ 13, 14, 15 తేదీల్లో తిరుమల శ్రీవారికి వసంతోత్సవాలు ఘనంగా నిర్వహింపబడ్డాయి. ఈ ఉత్సవాలలో చివరిరోజైన చైత్రశుద్ధపౌర్ణమి (ఏప్రిల్ 15) నాడు శ్రీ మలయప్పస్వామిని శ్రీదేవి, భూదేవులతో బంగారు తిరుచ్చిలో వసంత మండపానికి వేంచేపు చేశారు. శ్రీ స్వామితో పాటు శ్రీకృష్ణ, రుక్మిణి సీతారామలక్ష్మణ, ఆంజనేయస్వామి ఉత్సవమూర్తులను కూడ వసంతమండపానికి తీసుకొచ్చారు. తదనంతరం స్నపన తిరుమంజనం, విశేష సమర్పణ కార్యక్రమాలు జరిగాయి. ఆ సాయంత్రం పురవీధులలో శ్రీవారిని ఊరేగించారు. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి తదితరులు పాల్గొని పర్యవేక్షించారు. ఈ మూడు రోజుల ఉత్సవాల్లో వేలాది భక్తులు పాల్గొన్నారు.



## డాక్టరేటు బిరుదం

పసిపాపలు చేతులు చాచినట్లుగా కలువలు పూచినట్లుగా కవిత్వం చెప్పగల సహజ కవి శ్రీ కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, తి. తి. దేవస్థానంలో పోతనభాగవతమును శిష్టవ్యవహారభాషలో ముద్రించుటకుగాను సంపాదకులుగా వుంటున్న వీరికి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు డాక్టరేటు గౌరవ బిరుదాన్నిచ్చి సన్మానించడం ఎంతో ముదావహం!



## అన్నమాచార్య వర్ధంతి

కరీంనగరుజిల్లా కాశ్మీరిగడ్డలో మార్చి 29 న "శ్రీ ఘంటసాల సంగీత కళాసమితి" ఆధ్వర్యంలో స్థానిక యంకమ్మ తోటలోని శ్రీవేంకటేశ్వర ఆలయంలో అన్నమాచార్య వర్ధంతి చేశారు. పలువురు వ్యక్తులు ఉపన్యసించారు. గాయనిగాయకులు అన్నమయ్య కీర్తనలు పాడారు. కార్యదర్శి పి. వి. ఎస్. ఎన్. శర్మ వందన సమర్పణతో పై కార్యక్రమాలు జయప్రదంగా ముగిశాయి.



## అన్నమాచార్య వర్ధంతి

తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో గత మార్చి 29, 30, 31 తేదీలలో తి. తి. దేవస్థానాల ఆధ్వర్యంలో తాళ్ళపాక అన్నమాచార్యుల వర్ధంత్యుత్సవాలు నిర్వహింపబడ్డాయి. మొదటిరోజు ఉదయం స్థానిక శ్రీ కోదండరామస్వామి ఉత్సవర్లు, రెండవరోజు ఉదయం స్థానిక శ్రీ గోవింద రాజస్వామి ఉత్సవర్లు సభాస్థలికి వేంచేయడం ఈ ఉత్సవాల్లో ఒక ప్రత్యేకత.

అన్నమాచార్య వాఙ్మయ ప్రాజెక్టు ప్రత్యేకాధికారి శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ వార్షిక నివేదికను సమర్పించారు. ఈ మూడు రోజులలో ప్రముఖుల ఉపన్యాసాలు, సంగీత కచ్చేరీలు నిర్వహించారు.



(4 వ పేజి తరువాయి)

చెప్పదలచుకొన్న మాటను ఉత్తరోత్తర ఆలోచనకుపకరించే ధ్వనితో చెప్పటం ఒక విశిష్ట విద్య. అందులో కూడా ఆంజనేయుడు అఖండపండితుడు. లంకంతటా చాటిన– ''దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః'' అన్న శ్లోకం ఒక ఉత్తమ ధ్వనే అని చెప్పాలి. నేను రాముని సేవకుడను అన్నందువల్ల ప్రయోజనం సిద్ధించదు కనుక, రావణుని తోకతో బంధించి నాల్గుసముద్రాలు త్రిప్పిన వాలి (అంతటి బలసంపన్నుడు) తమ్ముడు సుగ్రీవుని మంత్రినైన నేను రాముని సేవకుడను. అంటే నరుడైన రాముడు ఎంతటి బలపరాక్రమసంపన్నుడో ఊహిస్తే అర్థమయ్యే విషయం.

ఇలా ఎంతైనా చెప్పవచ్చు. ఎన్నైనా చెప్పవచ్చు. ఏమి నేర్చుకుంటామన్న ప్రశ్న? రావణాంతఃపుర స్త్రీలను వివిధావస్థలలో చూచినా మనస్సు చలించకపోవటం ఆంజనేయస్వామికే చెల్లింది. మరి మనం వాటినుండి నేటి వరకు రాక్షసత్వమే నేర్చుకున్నాం. కాని రక్షకత్వం నేర్చుకోలేదు. మనలోని రాక్షసులు మాయమయ్యే వరకు మనకిదే శరణ్యం.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్।
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి॥

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press
by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



# సప్తగిరి

జూన్ 198[illegible]

వెల: రు. 1/-

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక



కొలువున్నాఁ డదివో గోవిందరాజు
కొలఁదిలేని సొమ్ముల గోవిందరాజు

గారవానఁ బాదములు కాంతలపైఁ బారఁజాఁచి
కూరిములు వెదచల్లి గోవిందరాజు
ధీరత సంకుఁజక్రాల తెల్లని కన్నులతోడ
కోరిన వరములిచ్చీ గోవిందరాజు

దట్టపుంగరాల వేళ్ల దాపలిచెయి వారఁజాఁచి
గుట్టుతో నూరకున్నాఁడు గోవిందరాజు
వొట్టుకొనె పలకేలు వున్నతి శిరసుకింద
కొట్టఁగొన నవ్వులతో గోవిందరాజు

చిప్పిలుతా నొత్తగిలె శేషునిపడగ నీడ
గొప్ప కిరీటముతోడ గోవిందరాజు
అప్పుడే బొడ్డునఁగనె నజుని శ్రీ వేంకటాద్రి
కుప్పె కటారము తోడ గోవిందరాజు.

—అన్నమాచార్య శృంగారకీర్తన.

( జూన్ 4 నుండి 12 వరకు జరిగే తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి
బ్రహ్మోత్సవ సందర్భంగా )

# మీమాట

### ముఖచిత్రం

ఏప్రిల్ సంచిక ఆలస్యమైనా, ముఖ చిత్రం ఆనందాన్నిచ్చింది. తారవ్యక్తిత్వం, పరీక్ష వ్యాసాలు చాలాబాగ మంచివిషయ మును పాఠకులకు అందించినందులకు కృతజ్ఞులము.

చామర్తి సత్యనారాయణ మూర్తి.

### వేంకటేశోదాహరణ

ఏప్రిల్ నెలలో ప్రచురింపబడ్డ శ్రీ శింగన మల్ల రాధాకృష్ణయ్యగారి "శ్రీ వేంకటేశో దాహరణము" చదువు భాగ్యము కలిగినందు లకు మిక్కిలి సంతసించుచున్నాను. ఇదొక్కటేకాదు, ఈ సంచికంతా ఎంత చది వినా తనివితీరదనుట అతిశయోక్తి ఎంత మాత్రం కాదు.

మండ వెంకటరమణమూర్తి — ముద్దాడ
డి. చెన్నకేశవస్వామి — విజయనగరము

### బాలప్రబోధం

ఏప్రిల్ సంచికలోని "పరీక్ష" కథ చాల బాగున్నది. బాలప్రబోధం శీర్షికన ఇట్టి కథలు అందిస్తున్నందుకు చాలసంతోషం.

వి. హరికిషన్ — కరీంనగర్
ఏ. మురళి — జగిత్యాల
వి. అశోక్ — కరీంనగర్

### మహాభారతం

'సప్తగిరి' సంచికలో మీరు ప్రచు రిస్తున్న భగవద్గీత వ్యాఖ్యానము చాల బాగున్నది. అలాగే "విష్ణుసహస్రనామ" వ్యాఖ్యానము, "మహాభారతము" సీరి యల్‌గా ప్రచురిస్తారని ప్రార్థన.

క్రైస్తవ మత ప్రచారమువలె తి. తి. దేవస్థానమువారు రేడియోద్వారా హిందూ మతప్రచారం చేస్తేబాగుంటుంది.

కేతవరపు శ్రీరామకృష్ణ — విశాఖ

### జాప్యమెందుకు

ఆధ్యాత్మిక చింతన పెంచే పత్రికల్లో "సప్తగిరి" అతిముఖ్యమైంది. దాన్ని సకాలంలో విడుదల చెయ్యాలి. పెద్ద యంత్రాంగము గల టి. టి. డి. 'సప్తగిరి' జాప్యాన్ని తప్పక నివారించ గలదని ప్రార్థన.

కొంపల్లి వీరభద్రరావు — ఈతముక్కల

* అనివార్య కారణాలవల్ల జరిగిన ఆలస్యానికి చింతిస్తున్నాం. సం॥

---

# దాససాహిత్య ప్రాజెక్టు ప్రదర్శన, బెంగుళూరు



ఈ జూన్ 10 నుండి 14 వ తేదీ వరకు బెంగుళూరు చామరాజుపేటలో తి. తి. దే. దాసప్రాజెక్టు, తిరుపతివారి ఆధ్వర్యంలో ప్రదర్శన ఏర్పాటు చెయ్యడం జరిగింది. ఈ సందర్భంలో కర్ణాటకరాష్ట్ర సమాచార శాఖామంత్రి శ్రీ రఘుపతి "కేశవాది రూప ములు" అను పుస్తకాన్ని ఆవిష్కరించగా, శ్రీ వి. ఎస్. ఆచార్యగారు కర్ణాటక హరి దాసులు అను గ్రంథాన్ని ఆవిష్కరించారు. తరువాత శ్రీ జి. వి. అయ్యర్, శ్రీ కె. అప్పణ్ణాచార్య, శ్రీ బి. గోవిందాచార్య ప్రభృ తులు ప్రసంగించారు.



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

జూన్ 1984

సంపుటి 15 సంచిక 1



విడిప్రతి - రు. 1-00

సం॥ చందా - రు. 12-00

ప్రతులకు:

వెల్ ఫేర్ ఆఫీసర్,

టి. టి. డి., తిరుపతి.

కొత్తశీర్షిక రాగలహరి (24 వ పుటలో)

## ఈ సంచికలో....



ముఖచిత్రం: శ్రీ గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవం, తిరుపతి.

2 వ కవరుపేజి: విజయవాడలో దేవస్థాన స్వర్ణోత్సవ విశేషాలు. 3 వ కవరుపేజి: గణపవరంలో దేవస్థాన స్వర్ణోత్సవ విశేషాలు.

4 వ కవరుపేజి: శ్రీ పద్మావతీఅమ్మవారి తెప్పోత్సవం, తిరుచానూరు.

# సంపాదకీయం

ఈ సంచికతో సప్తగిరి కొత్త సంవత్సరంలో అడుగుపెడుతున్నది. దేవస్థానం బులిటెన్‌గా 1949 లో ప్రారంభమై, 1962లో దేవస్థానం పత్రికగా రూపుదాల్చి, 1970 లో నాల్గుభాషలలో సప్తగిరిగా ప్రారంభమైన నాటినుండి ఈనాటికి సప్తగిరి జీవితంలో 14 వసంతాలు గడిచి 15 వ సంవత్సరంలో అడుగుపెట్టింది. 1975 లో ఐదు భాషలలో సప్తగిరి వెలువడటం, పత్రికద్వారా బహుభాషా ప్రదేశాలలో, ఆర్షధర్మ ప్రచారం కోసం దేవస్థానం చేస్తున్న ప్రయత్నాలకు ప్రతీక అని చెప్పవచ్చు.

ఇదేవిధంగా పత్రిక ఆకృతిలో 1949 నుండి 1975 వరకు జరిగిన మార్పులు, తక్కువపుటలలో ఎక్కువ విషయాలను అందించాలనే ఆరాటానికి అద్దం పట్టాయి.

పత్రిక, ప్రారంభమైన నాటినుండి, ఏ రూపంలో, ఏ పేరుతో ఉన్నా శ్రీనివాస వైభవాన్ని, దేవస్థాన సమాచార ప్రసారం, ఆర్ష ధర్మ ప్రబోధనల విషయంలో నిరంతరం సేవ చేస్తూనే వున్నది. ఇదిగాక శేషాచలాధీశ్వరుని దర్శించవచ్చే అశేష భక్తజనులకు వివిధ సౌకర్యాల విషయంలో కలిగే అసౌకర్యాలను ఆ యా పరిధుల వారి దృష్టికి తీసుకువచ్చి వాటి నివారణకు తోడ్పడ గలిగామన్న సంతృప్తిని, మెప్పును సంపాదించుకొన్నది. సప్తగిరిని శ్రద్ధగా గమనిస్తున్న వారందరికీ యీ విషయం అనుభవంలోదే.

కాని నేటి జీవనవిధానం పరిశీలిస్తే సప్తగిరి లాంటి ధార్మిక పత్రికలు చేసిందానికన్న చేయవలసిందే ఎక్కువ వున్నదని పిస్తుంది. మానవుడు సాధిస్తున్న వైజ్ఞానిక విజయగర్వాంధకారం ఆధ్యాత్మిక జ్ఞాన భాస్కరుణ్ణి ఆక్రమించు కోవాలని ప్రయత్నిస్తున్నది. మనిషి మనీషి కావటానికి బదులు, ఒక్కొక్క మెట్టు దిగుతూ, దానవతకు దగ్గరౌతున్నాడు. దీనిని నిరోధించాలంటే సాత్త్విక చింతన, మానవతాదృక్పథం మాత్రమే శరణ్యాలు. అవి బహుజన సుఖజీవనానికి పునాదులు కావాలంటే అతి తక్కువధరలో అందుబాటయ్యే ప్రచారసాధనం పత్రికలు మాత్రమే. తరతరాల మహామనీషుల తపఃఫలాలను, యథాయోగ్యంగా ఏకకాలంలో పంచి బహుజన ప్రయోజన కారులుగా మార్చగల శక్తి పత్రికా విధానానికే ఉంది.

అందువల్లనే ఆర్షధర్మ ప్రబోధానికి, మాతృజీవనానికి, ఆధ్యాత్మిక పత్రికలు వారధిలాంటివి. సప్తగిరి కూడా ఆ బాటలోనే మరింత దృఢదీక్షతో ముందుకు సాగుతూ ఆత్మీయతకు అందరు పాఠకులను, స్థైర్యధైర్యాలకు సప్తగిరీశుని వేడుకొంటూ మరొక్క మజిలీవైపు సాగుతున్నది.

సహ నావవతు
సహ నౌ భునక్తు
సహ వీర్యం కరవావహై
తేజస్వినావధీత మస్తు
మా విద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః




దక్షిణ భారతదేశమందే గాక, మధ్య ఆసియా ఖండమందే ప్రముఖ వైద్యకేంద్రమైన రాయవేలూరు నేటి మద్రాసు రాష్ట్రమందు ఉత్తర ఆర్కాడ్ జిల్లా కేంద్రము. నేడీ పట్టణము తమిళనాడులో ఉన్నను పూర్వము ఆంధ్రదేశ రాజకీయాలలో ఎంతగానో ముడిపడి యున్నది.

వేలూరు పట్టణమందు కడపటి విజయనగరరాజుల కాలమునాటి కోట యున్నది. బహుశా మధ్యయుగము నాటి రాజులు నిర్మించిన కోటలలో ఇది కట్టకడపటి దేమో! ఈ అందమైనకోటను విజయనగర రాజులైన సదాశివరాయలు మరియు శ్రీరంగరాయల (1572-85) సర్దారుడైన వేలూరి బొమ్మనాయకుడు క్రీ. శ 1566-80 ప్రాంతమున నిర్మించినారు. క్రీ. శ. 1604 సం॥రమందు బొమ్మనాయకుని కుమారుడులింగమ నాయకుడు ప్రభువులపై తిరుగుబాటు చేయగా, వేంకటపతిరాయలు అతనిని ఓడించి క్రీ. శ. 1606లో చంద్రగిరి ప్రధాన రాజధానిగా, వేలూరు రెండవ రాజధానిగా చేసుకొన్నాడు. విజయనగరరాజుల పతనానంతరం ఈ కోట బీజపూర్ సుల్తాన్ ఆదిల్‌షా (కి. శ. 1946) పశమైంది. ఆపై క్రీ. శ. 1677-78 సం॥లో ఛత్రపతి శివాజీ వశమైంది. మహారాష్ట్రుల పతనానంతర మీ కోట ఆర్కాడు నవాబులు, తర్వాత మైసూరు సుల్తానులు హైదరాలి అతడి కుమారుడు టిప్పుసుల్తాన్ అధీనమైనది. ఆంగ్లేయులు 3 వ మైసూరు యుద్ధం తర్వాత టిప్పును ఓడించి కోటను స్వాధీన పరచుకొన్నారు. నాల్గవ మైసూరు యుద్ధంలో టిప్పుసుల్తాన్ మరణించగా ఆతడికుమారులను ఆంగ్లేయులి కోట యందే బంధించినారు. క్రీ. శ. 1806 జూలై 10 వ తేదీన ఆంగ్లేయులు వేలూరు కోటలోని సైనికులను జుట్టు తీయించుకొని క్రాపుచేయించుకోమని ఆజ్ఞలు జారీచేయగా సైనికులు తిరుగుబాటు చేసినారు. హిందూదేశంలో ఆంగ్లేయులపై మొట్టమొదటి తిరుగుబాటు ఇదియే.

క్రీ. శ. 1911 వ సం॥ వరకు వేలూరు చిత్తూరు పట్టణము కేంద్రముగా ఉత్తర ఆర్కాడు జిల్లాయందు వుండినది. ఆ సంవత్సరమందు ఈ జిల్లాను చిత్తూరు, ఉత్తర ఆర్కాడు జిల్లాలుగా విభజించి ఉత్తర ఆర్కాడు జిల్లాకు వేలూరును ముఖ్యపట్టణము చేశారు. నేటికి వేలూరు కోట చెక్కు చెదరక నిలచియుండి చూపరుల కండ్లకు విందు చేస్తుంది. ముఖ్యంగా కోట ముంగిట నీటితో నిండి, వెడల్పు, లోతు, కలిగినటువంటి అగడ్త ఉంది. పూర్వమీ అగడ్తలో శత్రువులను ఛేదించుటకై మొసళ్ళను పెంచేవారు. ఈ అగడ్త నానుకొనే కోట మొదటి ప్రహరి, దానికి అవల కొన్ని గజాలదూరంలో బురుజులతో నిండిన రెండవ ప్రహరీగోడ యున్నది. కోట గోడలు నల్లటి బలిష్ఠమైన 'గ్రానైట్' శిలలు పొందికగా చెక్కినట్లు ఒకదానిపై ఒకటి పేర్చి నిర్మించారు. కోటకు తూర్పువైపున ముఖద్వారమున్నది. పూర్వము కోటచుట్టు వున్న అగడ్తకు వేలూరు సమీపములోని 'సూర్యగుంట' అనే చెరువునుండి నీరు సరఫరా చేసేవారు.



## ఆలయనిర్మాణం

కోట లోపలికి ప్రవేశించగానే ఉత్తర దిశలో చతురస్రాకారముగా నిర్మితమైన జలకంఠేశ్వరస్వామి ఆలయమ్ముంది. ఆలయ ప్రవేశమునకు ముంగిట కొంత ఎత్తున దాదాపు 10 అ॥ ఎత్తు వున్న ద్వార

పాలక విగ్రహములున్నవి. వీరు నోటిలో రెండు కోరలుగల్గి, సర్వాలంకృతమైన గదా యుధములను చేతబట్టి ఒక కాలును పైకి మడచి గదపై యుంచినారు. వారి పై కుడి చేతియందు త్రిశూలము, ఎడమచేతిలో పాశము, క్రింది రెండుచేతులు అభయవరద ముద్రలోయున్నవి. ఈ విగ్రహముల మధ్యనే ఆలయప్రవేశమునకు 10 అ॥ దిగువగా దారి యున్నది. విచిత్రమేమి టనగా ఆలయము భూమట్టమునకు 15 అ॥ లోతున వున్నది. ఆలయప్రవేశ ద్వారముపై 7 అంతస్తుల రాయగోపురమున్నది. గోపుర అధిష్ఠానముపైన వివిధమైన శిల్పములు, ప్రవేశద్వారము లోపల సాలభంజికలు, పై భాగమున ఒకపై పుసూర్యుని, మరొకపై పు చంద్రుని మ్రింగుట కేతెంచు చున్నట్లున్న సర్పముల శిల్పములు అద్భుతముగా నున్నవి. ఈ రాజగోపురపు ఇరువైపులా సాగుతూ ఆలయముచుట్టూ ఎత్తైన ప్రహరీ గోడ యున్నది. గోడ పై భాగమున అచ్చు టచ్చుట గూళ్ళయందు, శివ, నటరాజ, వినా యక, శిల్పములతో బాటు ప్రహరీగోడ నాల్గువైపులా నందిశిల్పము లున్నవి. ఈ ఆలయ నిర్మాణము కోటను నిర్మించిన బొమ్మనాయకుని చేత ప్రారంభింపబడి, ఆతడి కుమారుడు లింగమనాయకుని కాల మందు పూర్తి అయినది.

## స్వామిఆలయం

ఆలయంలోని రెండవ ప్రాంగణమధ్య భాగమున తూర్పు నకభిముఖంగా ప్రధానదైవమైన జలకంఠేశ్వరస్వామి ఆలయమున్నది. ఇందులో గర్భగృహము, అంతరాళము, ముఖమండపము, మహా మండపము లున్నవి. గర్భగృహమందు జల కంఠేశ్వరస్వామి పేరున శివలింగమున్నది. దాదాపు రెండువందల సంవత్సరాలకు పూర్వం, ఈ స్వామి విగ్రహం మహమ్మ దీయులచేతులలోపడి నాశనమైపోకుండు టకై ఆలయ పూజారులు లింగమును తీసుక వెళ్ళి పాలారునదిగట్టున 'సత్వాచేరి' అనే గ్రామంలో దాచియుంచారు. అలాగే మిగతవిగ్రహములను ఆలయ ప్రాంగణ మందే భూస్థాపితముచేశారు. అవన్నియు నేడు వందల సంఖ్యలో లభ్యమగు చున్నాయి.

ప్రధానాలయంలో గర్భగుడి చతురస్రా కారములోను, అంతరాళము దీర్ఘచతురస్ర ముగాను, వాటిముందు ముఖమండపము విశాలంగాను ఉన్నవి. ముఖ మండపముయొక్కగోడలు నునుపుగానగిషీ చెక్కినట్లు నేటి సిమెంటు గోడలకు తీసి పోము అన్నట్లు ఎంతో నునుపుగా వున్న పెద్ద పెద్ద రాతిదిమ్మెలతో నిర్మించారు. ప్రస్తుత మీ మండపమందే నంది విగ్రహ మును ప్రతిష్ఠించి, స్వామివారి ఉత్సవర్లకు అభిషేకముకూడా జరుపుతున్నారు. ఈ మండపము ఎడమగోడయందు ప్రదక్షిణా పథములోనికి మార్గముకలదు. ప్రదక్షిణా పథముచుట్టూ దేవి ఆలయమందు వలనే చోళ స్తంభము లున్నవి. గర్భాలయ గోడల యందు మూడువైపుల కోష్టములు, శాల, పంజర కూటములున్నవి. ప్రదక్షిణాపథము యొక్కవెలుపలిగోడనానుకొని చిన్న వేదిక యున్నది. నేడు వేదికపై నూతనంగా రాతితో తయారుచేసిన నాయనార్లు, శక్తి గణపతి, దేవీసహితకార్తికేయ, విష్వక్సేనుల లోహపు విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి. ముఖమండపములోనుండి బయలుదేరిన ప్రదక్షిణ మహామండపములోనికివెళ్లుతుంది. ఈ మహామండపము విశాలముగా అనేక స్తంభముల సాయంతో నిర్మింపబడి యున్నది.



శ్రీ జలకంఠేశ్వరస్వామి, అఖిలాండేశ్వరీదేవి

మహామండపముయొక్క ఉత్తరదిశలో చిన్న అర యున్నది. ఈ అరనుండి శ్రీరంగ పట్టణమువరకు సొరంగమార్గమున్నదట! కొద్దిమాసముల క్రిందటివరకు ఆలయానికి వెళ్ళిన యాత్రికులు ఒక రాతిని ఈ అరలో నికి విసరెడివారు. ఆ రాయి మెట్లమీద దొర్లుతూ పోయెడి శబ్దముకొన్నినిమిషముల వరకు వినిపించెడిది. ఇలాకొంతకాలము జరిగితే, ఆ దారిపూడిపోయే ప్రమాద మున్నదని ఆదారిపై బల్లనుపరచి, దానిపై నేడుగంభీరమైన లోహపునటరాజ విగ్రహ మును ప్రతిష్ఠించినారు. ఈ మండపము వెలుపల నూతనంగా ప్రతిష్ఠించిన గరుడ స్తంభము, నందివిగ్రహము లున్నవి. ఆలయంలో లభ్యమయ్యేడి శాసనముల వలన, పూర్వ మీ దేవాలయానికి 7 గ్రామ

ములు మాన్యముగా వుండినట్లు, స్వామికి ఆనాడు 'జ్వరకంఠేశ్వరు'డని మరియు 'జ్వరహరేశ్వరు' డని నామమున్నట్లు తెలియును.

స్వాతంత్ర్యము వచ్చిన నాటినుండి రాయవేలూరు ప్రజలు ఆలయ పునరుద్ధరణకు, స్వామి ప్రతిష్ఠాపనకు, ప్రభుత్వమునకు ఎన్నో విన్నపములు చేయగా, అటు ప్రభుత్వము, మరియు పురావస్తుశాఖవారు ఆక్షేపణలు తెలుపుతూ వుండగా, విసుగు చెందిన పట్టణ ప్రజలు వేల సంఖ్యలో వెళ్ళి పాలారు నదిగట్టుపై ప్రవాస జీవితమును గడుపుచున్న స్వామిని జూలై 8, 1983 నాడు అతడి స్వనివాసమున చేర్చి వారికి అంగ రంగ వైభవముగా నిత్య పూజలు జరుపుతూ ఆలయానికి పూర్వపు ఔన్నత్యమును చేకూర్చినారు.

ఈ పట్టణంలో తిరుమల తిరుపతి దేవస్థానమువారు 1885 సం॥ మందు హిందూమత రక్షణార్థమై స్థాపించిన వున్నత పాఠశాల (హిందూహైస్కూల్) యున్నది. దాదాపు 1/3 వంతు తెలుగువారున్న వేలూరు పట్టణ మందు తెలుగు బోధనా భాషగా నున్న పాఠశాల ఇదొక్కటే.

## మొదటి ప్రాంగణము

రాజగోపురము దాటగానే కొద్ది గజాల దూరంలో చిన్న కోనేరు గలదు. ఇటీవల త్రవ్వకాలలో ఈ కోనేరు బయటపడినది. ఆనాడు మహమ్మదీయుల తాకిడినుండి కాపాడుటకై పూజారులు ఆలయంలోని విగ్రహము లన్నింటిని ఈ కోనేరులో పడవైచి పూడ్చిపెట్టినారు. కోనేరుకు ముందు భాగమున రాతితో మలచిన రెండు పెద్ద నీటితొట్లు, వాటి మధ్యన నందివిగ్రహము వున్నవి. ఆలయం దక్షిణ పార్శ్వమున కళ్యాణమండ పమున్నది. ఈ మండపము రెండు అంతస్తులుగా విభజింపబడి క్రింది భాగమున 24 స్తంభములు పైన 20 స్తంభములను కల్గియున్నది. పై అంతస్తు మధ్య భాగమున వేదిక యున్నది. ఈ కళ్యాణ మండపము సైజులో చిన్నదైనను దక్షిణభారతదేశంలోని కళ్యాణ మండపాలన్నింటిలో మణిపూసవంటిది. ఇందులోని ప్రతి అణువు శిల్పాంకితమే. మండపప్రవేశద్వారమున కిరువైపులవున్న స్తంభములు అపురూపమైనవి. కుడివైపు స్తంభముపై, ఒకరాజు గుఱ్ఱముపై కూర్చుండి కత్తిదూసివేటాడుచుండగా రాజు వెనుకనున్న భటు డొకడు రాజు పై కెగసెడి పులినోటిలో ఎడమ చేతినిపెట్టి, కుడిచేతిలోని బాకుతో పులికడుపును పొడచుచున్నాడు. పులి శరీరంపై మచ్చలు, నోటిలోని కోరలు దూరమునుండి చూస్తే నిజంగా పులే అనిపిస్తుంది. ఎడమవైపు స్తంభముపై రాజు యుద్ధభూమికి వెళ్ళుచుండగా, రాజభటులు విల్లు,అంబులు, కత్తులు, డాలు ధరించిఆతడి వెంట పరిగెడుతున్నారు. మండపంపై కప్పులో అష్టదళ పద్మములు చుట్టూ నాట్య కత్తెల శిల్పాలు ఓహో! చూడవలసిందే కాని మాటలతో వర్ణించజాలము. ఇందలి స్తంభాలు శిల్పిచేతిలో వెన్నముద్దలవలె కరిగి అపురూపమైన రూపురేఖలు సంతరించుకొన్నాయి. స్థానికులకథనము ప్రకారము ఈ కళ్యాణమండపాన్ని ఆంగ్లేయులు తమ దేశానికి తరలించుకొని వెళ్ళవలయునని తలంచి, ఆ దేశంనుండి పడవను రప్పించు చుండగా ఆ పడవ సముద్రంలో మునిగి పోవుటచే ఆంగ్లేయులా వుద్దేశాన్ని విరమించుకొన్నారట!

కళ్యాణ మండపాన్ని ఆనుకొని ఆలయం చుట్టూ 12 అ॥ వెడల్పున విజయనగర పద్ధతిలో మలచిన ఒక స్తంభమందు వుపస్తంభమున్న స్తంభముల సాయంతో వరండా (మండపము) నిర్మితమైనది. ఈ వరండాయొక్క మూలలందు కళ్యాణ మండపమును పోలినటువంటి మూడు చిన్న మండపము లున్నవి. ఉత్తరపు వైపున వున్న ఒక మండపమందు క్రింద సింహపు ప్రతిమ దాని తలపై గుండ్రటి స్తూపమును పోలినటువంటి రెండు వైవిధ్యముకల్గిన స్తంభము లున్నవి. తూర్పు వైపున వున్న మండపము నేడు యాగశాలగా యున్నది. వరండా యందు అచ్చటచ్చట, ఆలయ త్రవ్వకాలలో లభ్యమైన అనేక శిల్పము లున్నవి.

## రెండవ ప్రాంగణము

రాజ గోపురమున కెదుట కొన్ని గజాల దూరంలో ప్రధానాలయ ప్రాంగణము లోనికి 4 అంతస్తుల గోపురముతో అలంకరించబడిన ద్వారమున్నది. ద్వారముదాటగనే మొదటి ప్రాంగణములో వున్నట్లే గోపురము నానుకొని ఆలయం చుట్టూ ప్రహరిగోడ యున్నది. ఈ ప్రహరిగోడ చుట్టూ స్తంభముల సాయంతో నిర్మించబడ్డ వరండాయున్నది. ఈ వరండా (మండపం) యందు పడమటివైపు చిన్న చిన్న గుళ్ళు ఉన్నవి. వాటిలో మొదటి దానియందు మహాగణపతి, రెండవదాని యందు దేవీ సహిత కార్తికేయ, మూడవ గుడియందు వేంకటేశ్వర విగ్రహములు ప్రతిష్ఠింపబడి యున్నవి. ఈ దేవేరులను దాటగనే ఆలయం వుత్తర దిక్కున దేవి 'అఖిలాండేశ్వరి 'ఆలయ మున్నది. ఆలయ మందు గర్భగుడి, పైన ద్రవిడ పద్ధతిలో నిర్మించిన గుండ్రని శిఖరము, ముంగిట ముఖమండపము మాత్రమే యున్నవి. ముఖమండపంలో చోళ శిల్ప సాంప్రదాయమునకు చెందిన గుండ్రని స్తంభము లున్నవి. గర్భగృహమందు 4అ॥ఎత్తున కన్నుల పండుగచేసెడి అఖిలాండేశ్వరీ దేవి దివ్యమంగళకరమైన విగ్రహ మున్నది. దేవి ఆలయమున కెదురుగా భూమిమట్టము వరకూ నీరు కలిగిన బావి యున్నది. బావిపై 4' ఎత్తున గోడ యుండి పైన జల్లెడ లాంటి ఇనుప మూత వుంచినారు బావిలోని నీటి పై భాగమున 2 అ॥ పొడవు 1½ అ॥ వెడల్పు కల్గిన రాతి నమర్చినారు. భక్తులు తమ కోరికలను మనస్సులో తలచుకొని ఒక నాణెమును బావిలోని రాతిపైకి విసరితే ఆ నాణెము రాతిపై నిలచినచో వారి కోర్కెలు నెరవేరుతాయట, లేనిచో లేదు. ఈ బావిని 'అభీష్టవరసిద్ధి' బావి అని వ్యవహరిస్తారు. ఇందలి నీటితోనే స్వామికి అభిషేకము చేస్తారు. •

— శ్రీ పి. కృష్ణమూర్తి

# వేసవి ధార్మిక పాఠశాల

శిక్షణ శిబిరంలో ప్రారంభోపన్యాసం
చేస్తున్న డా॥ ఎమ్. డి. బాలసుబ్రహ్మణ్యం.




శిక్షణ శిబిరం ముగింపురోజున ప్రసం
గిస్తున్న దేవస్థాన సంయుక్త కార్యనిర్వహ
ణాధికారి శ్రీ డి. సుబ్బరాయులు.



శిక్షణ పొందిన విద్యార్థులకు దేవస్థాన
ప్రచురణల బహుమతి ప్రదానం.



# భక్తాగ్రణి పావని

"రామభక్తుడైన హనుమంతుడు ఆర్యుల రాజైన రాముని చేతికి దొరకిన, చిత్తమునకు బానిసయైన అనార్యదాసుడు" అను వికృతవిమర్శ చేయువారు కొందరు కలరు. కాని రామాయణమున ఆర్య - అనార్య శబ్దములు కేవలం వ్యక్తిగుణవాచకములే కాని వంశసంస్కృతులను సూచించునవి కావు. ఒకటే వైదిక సంస్కృతి వర్ణనను ఈ ఇతిహాస మనదగిన కావ్యమున మనము కనవచ్చును. వాస్తవముగా శ్రీరామ - అంజనేయులు ఒక 'విడదీయరానిజంట'గా పరిగణింపబడి, అకళంకభక్తికి ఆదర్శమూర్తిగా మారుతిని అఖిలభారతమునందును, హైందవసంస్కృతి ప్రభావపరివేషము వ్యాపించిన తదితర దేశములందును పూజించుట జరుగుచున్నది. శ్రీరామచంద్రునికి ప్రాప్తమైన దేవత్వము అతని పరివారమున కేవలము హనుమంతునికి మాత్రము ప్రాప్తమగుట ఒక విశేషమనియే చెప్పవలెను. ఆంజనేయుని రుద్రుని అవతారమని అందురు.

శ్రీరామచంద్ర హనుమంతుల ప్రత్యక్ష సంబంధము కిష్కింధాకాండము నుండి కాననగును. అది ఉత్తరోత్తరం అధిక మైత్రీ మధురమై అభివృద్ధి చెందును. భారత దేశమున దేవత్వమును సంపాదించిన హనుమపట్ల రాముని హృదయమున నుండిన భావమేమి? అగస్త్యునితో శ్రీరాముడు మారుతిని గుఱించి చేసిన ఈ వర్ణనవల్ల దానిని తెలియవచ్చును. "శౌర్యము, దక్షత, బలము, ధైర్యము, ప్రాజ్ఞత, రాజనీతిజ్ఞత, పరాక్రమము, ప్రభావము- హనుమంతుని శరీరమందే నెలకొనిఉన్నట్లగుపించును. కాలుడు, మహేంద్రుడు,విష్ణువు,కుబేరుడు- మొదలగు వారు కూడ సమరమున సలుపనటువంటి సాహసకార్యములను సైతము హనుమ ప్రదర్శించినాడు. ఇతని భుజబలమువల్లనే లంక, సీత, లక్ష్మణుడు, జయము, రాజ్యము, బంధువులు నాకు లభించిరి."

పావని తనకు చేసిన సాయమునకు ప్రతిఫలముగా ఏమైనను ఇచ్చి కృతజ్ఞత తెలుపవలెనను ఊహ శ్రీరాముని మనస్సున అంకురించినంతనే, అతడు తన భక్తుని కౌగిలించుకొని చెప్పుమాటల వలన రాముని మనోభావము వ్యక్తమగును. "నీవు చేసిన ఒక్కొక్క ఉపకారమునకు బదులుగా నా ఒక్కొక్క ప్రాణమును అర్పించినను కూడ ఆ ఉపకారములను తీర్చుటకు వీలుకాదు. ఎందుకన్న, ప్రాణములు కేవలము ఐదే ఉన్నవి; ఉపకారములు మాత్రమనంతములు! నీవు చేసిన ఉపకృతులన్నియు నా తనువునందే జీర్ణమగునుగాక. ప్రత్యుపకారమును చేయవలెనన్న భావనలో-ఎవరికి ఆ రీతిగా ఉపకారము చేయవలెనో, వారు ఆపదలకు గురికావలెనను భావమును అభిప్రేతమగుచున్నది. "నీ విషయమున మాత్రము, ఈ రీతిగా ఊహించుట కూడ నాకు అసాధ్యము."



ఇట్లు చెప్పుచు రాముడు అత్యుత్తమమైన, అమృతాంశునివలె అత్యంత తేజోమయమైన, అమోఘమైన హారమును గాలిచూలి గళమున వైచును.

సీత ఆచూకీ తెలిసికొనివచ్చిన హనుమపట్ల తన కృతజ్ఞతను వ్యక్తపరచుచు రాముడు,"అత్యంత దుష్కరమైన కార్యము నొనరించుటకు నియమింపబడియును, రాజు మీది అతిప్రేమతో ఆ కార్యమును జయప్రదముగా సాధించువానిని పురుషోత్తము డందురు. సమర్థుడును, బుద్ధిమంతుడును అయిన భృత్యుడు రాజు చెప్పిన కార్యమును నిర్వర్తించుచు, దానికి తగినట్లు రాజును ప్రేమింపక పోయినచో, వానిని మధ్యము డందురు. చెప్పిన పనిని సరిగా, జాగ్రత్తగా చేయకుండు వానిని పురుషాధము డందురు. తన గౌరవమును ఏ విధముగను తక్కువపరచుకొనక, సుగ్రీవునికిని సంతోషము కలుగునటువంటి రీతిగా, మారుతి తనకు ఇచ్చిన పనిని విజయవంతముగా చేసెను. సీతను ప్రత్యక్షముగా దర్శించి వచ్చిన హనుమ నాయొక్కయు, రఘువంశముయొక్కయు, లక్ష్మణుని యొక్కయు పరిరక్షణచేసినాడు. ఇప్పటికే దీనమైయున్న నా చిత్తమునకు మారుతి యొక్క యోగ్యత కనురూపముగ ఆతనిని ప్రేమింప నేనేమియు చేయలేనను విషయము మరింత దుఃఖమును కలిగించుచున్నది. నా సమస్త ప్రగాఢ భావములను ప్రకటింపగల నా ఆలింగనమును మాత్రమే నే నాతని కిత్తును" అని చెప్పును.

పావనిపట్ల రామునకున్న భావములే జనకసుతకును మనసున ఉండెను. పట్టాభిషేకానంతరము ప్రసన్నుడైన రాముడు సీతకు ఒక ఉజ్జ్వలమగు ఉత్తమ హారము నొసంగెను. అపుడు దానిని హనుమంతుని కీయవలెనను వాంఛ ఆమెలో అంకురించును. ఈ సన్నివేశమును వాల్మీకి మార్మికముగ ఇట్లు చెప్పును:

"సీత తన కంఠమునన్న హారమును తీసి మాటిమాటికి వానరయోధుల వైపును, రామచంద్రుని వైపును చూచుచునే ఉండెను. ఆమె మనోభావముల నెఱిగిన రాముడు, 'హే, సుభగే, ఎవరిపట్ల నీవు ప్రసన్నురాలైనావో, అతనికి హారమునవశ్యముగా ఇమ్ము' అని చెప్పెను. ఎవని యందు తేజము, ధైర్యము, యశము, దక్షత, సామర్థ్యము, వినయము, బుద్ధి, పరాక్రమము- సదా ఉన్నవో, ఆ హనుమకే సీత హారము నొసగెను. ఆ హారము చేత మారుతి తేజ మినుమడించెను."

### వరప్రసాదము :

ఆంజనేయుడు అంజనాదేవి కుమారుడు- వాయుదేవుని ప్రసాదము లేదా అవతారము అని రామాయణమున చెప్పబడినది. పుట్టిన వెంటనే హనుమంతుడు సూర్యబింబమునే ఫలమనుకొని, దానిని గ్రహించు ప్రయత్నము చేసెను. ఆ సమయమున రాహువు సూర్యుని కబళించుచుండెను. అపుడు ఒక దానికి బదులుగా రెండు పండ్లు దొరికినవని తలచి, సంతోషమున హనుమంతుడు రాహువుమీదకూడ తన దృష్టిని ప్రసరించెను. ఇది తెలిసి భయపడిన రాహువు ఇంద్రుని సాయము వేడెను. ఇంద్రుడు హనుమ మీద వజ్రాయుధమును ప్రయోగించి, వానిని క్రిందపడవేసెను. ఇంద్రుని ఈ వజ్రాయుధపు దెబ్బకు కూడ నాశ మొందక ఆంజనేయుడు కేవలము మూర్ఛ నొందెను. ఇందువలన ఉద్విగ్నుడైన వాయుదేవుడు ఆంజనేయు నెత్తుకొని ఒక గుహలోనికి నడచెను. చివరకు సకల దేవతలును ఇంద్రుని ఆ కార్యమునకు వాయుదేవుని క్షమాభిక్ష యాచించిరి. వాయుదేవుని ప్రసన్నుని చేయుటకు మారుతికి అందరును వరములను ప్రసాదించిరి.

"నా వజ్రాయుధముచేత ఇతని హనువు (దవడ) దెబ్బతినినందువలన జను లితనిని హనుమంతు డందురు. నా వజ్రాయుధ మితనిని ఎప్పుడును నాశ మొనరింప జాలదు" అని ఇంద్రుడు పలికెను. సూర్యుడు తన తేజములోని శతాంశమును, సర్వ శాస్త్రము అధ్యయనము చేయగల బుద్ధిని ప్రసాదించి, ఇతడు శాస్త్రజ్ఞులలో అతిశ్రేష్ఠుడును, అత్యుత్తమ వాగ్మియును అగునంచు దీవించెను. జలముయొక్కయు, తన పాశముయొక్కయు భయ మితని కుండదని వరుణుడు వచించెను. సదా రోగ రహితుడైయుండి, యుద్ధశ్రమచేత ఖిన్నుడు కాకుండనుండుగాక అని యముడు వక్కాణించెను. తన గదాభీతి ఇతని కుండదని కుబేరుడు వాక్రుచ్చెను. అఖిలాస్త్రముల చేతను ఇత డవధ్యుడగుగాక అని శివుడాశీర్వదించెను. తన సమస్త శస్త్రాస్త్రముల చేతను ఇతడు చంపబడజాలడని విశ్వకర్మ చెప్పెను. బ్రహ్మదండభీతిలేని ఇతడు శత్రు హృదయ కంపనకారి, మిత్రజనాభయదాత, సకలయుద్ధవిజేత అగుగాక అని కడపట బ్రహ్మ ఘోషించెను. కామరూపమును ధరించగల, సమస్త ప్రదేశము లందును అడ్డుమాకలేక సంచరించగల, సర్వ వేళలయందును జయశీలుడై యుండగల- మూడు వరములను బ్రహ్మదేవు డతనికి ప్రసాదించెను.

ఈ విధముగా ప్రబలవరములను సంపాదించిన హనుమంతుడు తన బాల్యగుణగణముల కనుగుణముగా ఋష్యాశ్రమము లందు నిత్యమును తంటాలు చేయనారంభించెను. ఇందువలన విసిగిపోయిన ఋషులు, "ఇతడు తన్ను దుర్బలుడని ఎఱుగునుగాక; ఇతరులు ప్రశంసించిన తప్ప ఇతనికి తన శక్తిని గుఱించిన ఎఱుక కలుగకుండుగాక" అని శాపము నొసంగిరి!

### గుణరాశి :

ఉత్తరకాండమున మహర్షి వాల్మీకి హనుమంతుని గుణగణములను వర్ణించును: "పరాక్రమము, ఉత్సాహము, అతిబలము, సౌశీల్యము, మాధుర్యము, రాజనీతిజ్ఞత, గాంభీర్యము, చాతుర్యము, ధైర్యము- వీనిలో హనుమను మీఱువారెవరున్నారు? ప్రత్యక్ష భగవంతుడగు సూర్యుని వద్ద అతడు వ్యాకరణమును, శాస్త్రములను అధ్యయన మొనరించెను. తపశ్చర్యలో అతడు బృహస్పతితో పోటీపడగలడు. ఇతడు తొమ్మిది వ్యాకరణములలో పండితుడు. సాగరునివలె క్షుబ్ధుడై, అగ్నివలె అత్యుగ్రుడై ఇతడు సమరాంగణమున శత్రు సంహారమును చేయుటకు మొదలుపెట్టినపుడు, అంతకునికివలె ఇతని ఎదుట ఎవరును నిలువజాలరు" అని చెప్పినాడు.

### అద్భుతవాగ్మి

ఆంజనేయుడు ఉత్తమస్థాయికి చెందిన అద్భుత వాగ్మి. ఋష్యమూక పర్వతసానువులలో ప్రప్రథమముగా శ్రీరామచంద్ర ఆంజనేయుల పరస్పర సందర్శనము జరిగినది. ఈ ప్రథమ సమాగమమందే శ్రీరామునిమీద హనుమంతుని ప్రభావము ఎంతగా పడినదనుటను రాముడు లక్ష్మణునికి ఈ విషయమై చెప్పిన మాటల వలన తెలిసికొనవచ్చును. "ఋగ్యజుస్సామవేదములలో స్నాతుడు కాని వా డీ రీతిగా మాటాడలేడు. ఇతడు వ్యాకరణమున ప్రగాఢపాండిత్యము కలిగినవానివలె ఉన్నాడు. ఇంత దీర్ఘ కాలము మాట్లాడినను ఇతడు ఒక అపశబ్దమునుకూడ ఉపయోగించలేదు. ఇతని ముఖ నేత్ర ఫాల భ్రువులలో ఏ వికారమును కలుగలేదు. అసందిగ్ధములై, సంక్షిప్తములై, అవిలంబితములై, స్వాభావికములై యున్న ఇతని వాక్యములు సర్వమును, మధ్యమస్వరమున ఉచ్చరింపబడుచున్నవి. ఇతడు సంస్కారక్రమమున సుసంపన్నములైన, హృదయంగమములైన వాక్కుల పలుకును. హృదయ కంఠముఖములనుండి వెలువడు ఇతని ప్రతిశబ్దమును ఎవరి హృదయమునైనను గెలుచుకొన గలుగు నట్లున్నది. ఇతని మనోహరవాణి కరమున కరాసిని ధరించి నిలుచున్న అరాతి రాతి గుండెను సైతము కరగించగలదు!"

### హనుమంతుని స్థానవిశేషము

హనుమంతుడు బాల్యము నుండియు సుగ్రీవుని మిత్రుడుగ నుండెను. చిన్నతనము నుండియే ఆ నిలమునకు అనలముతో నుండు సంబంధమువలె – హనుమత్సుగ్రీవుల మధ్య మైత్రి యుండెను. అందులో ఎప్పుడును భేదమునకు కాని, వాదమునకు కాని తావుండలేదు. సుగ్రీవుని అతికష్టకాలమునందును హనుమ అతనిని విడక అతని జతలోనే విజనవాసము ననుభవించెను. సుగ్రీవుడు సింహాసనాసీనుడైన పిదప హనుమ అతని ప్రధాని అయ్యెను. చివరవరకును ఆ మంత్రి పదవి స్థిరముగ నుండెను. రామచంద్రునితో సంబంధ మేర్పడిన అనంతరము మారుతి నిరంతరముగా అతనియొద్దనే ఉండెను అనిచెప్పుట

కలదు. కాని రామాయణమున ఈ భావము స్ఫురించు వాక్యములు లేవు. కార్యకరణమున అతనితో రామున కవసరమున్నపుడు పవనసుతుడు శ్రీరామునితో ఉండినప్పటికి, వానర రాజ్యప్రభువైన సుగ్రీవుని ఆజ్ఞానుసారముగ అచట నుండుచుండెననుట గమనించుట అగత్యము. రాముని పట్టాభిషేకము తరువాత సుగ్రీవునితో కూడి కిష్కింధకు పోయిన మారుతి, రామచంద్రుడుసరయూ ప్రవేశము చేయు సందర్భమున వెనుదిరిగి వచ్చెను.

ప్రధాన పదవిని నిర్వహించుచున్నపుడు హనుమ వానర రాజ్యమున స్వచారిత్రము వలన విశేషమగు స్థానమును సంపాదించి యుండెను. పవనసుతుని ఈ స్థాన గౌరవము ఎంతటి ఉన్నతస్థాయి కెక్కి ఉండిన దన్న ప్రసంగసందర్భమున సుగ్రీవునితో కూడ అతడు కేవలము వినోదమునకై "తుదకు నీవును కపివే అయితివి" అని నుడువునట్టి చనవును కలిగి ఉండెను. వాలి సంహారము పిదప మహారాజ్ఞి తారను సాంత్వనపరచు అతిసుకుమార కార్యమును అతి సమర్థవంతముగా నిర్వహించుటను గమనించిన, హనుమంతుని ఔన్నత్యము అవగాహన అగును. యువరాజు అంగదుని మనస్సున తన తండ్రిని చంపిన సుగ్రీవుని పట్ల ప్రతీకారవాంఛ కలిగి ఒక ప్రత్యేక స్వతంత్ర రాజ్యమును స్థాపించు ఊహ కలిగినంతనే, యుక్తియుక్తముగ వాదమును ప్రతిపాదించిన హనుమంతుడువానర రాజ్యము రెండు ముక్కలుగా అగుటను తప్పించి కీర్తికి పాత్రుడయ్యెను. అతని మాటను అందరును గౌరవించు చుండిరి. అతని పరాక్రమముపట్ల అందరికిని విశ్వాసముండెను. లక్ష్మణుని క్రోధాగ్నిలో దగ్ధము కానున్న వానర రాజ్యము ఆంజనేయుని దూరదృష్టి దక్షతల వలన రక్షింపబడెను. రాజ్యభోగముల మోహమున మునిగి సీతాన్వేషణ కర్తవ్యమును విస్మరించి, కాలహరణము చేయుచున్న సుగ్రీవునికి హనుమంతుడే జాగరూకుడుగ నుండెవలెనను సూచననిచ్చి కార్యప్రవృత్తునిగ చేసెననుట కిష్కింధాకాండమున చెప్పబడినది.

## దూరదృష్టి గల హితైషి

రామచంద్రునికి మారుతి సలహాలు, పరామర్శలు మిక్కిలి అవసరముగ నుండెను. అతని ధీవిశేషముపట్ల రామునికి అపారమైన విశ్వాసముండెను. విభీషణునికి ఆశ్రయమిచ్చు ప్రశ్న తలయెత్తి నపుడు ఇది స్పష్టముగా తెలియవచ్చెను. ఈ విషయమై సుగ్రీవునితో పాటు సకలవానర ప్రముఖులును రామచంద్రుని అభిప్రాయమునకు వ్యతిరేకులుగా నుండిరి. కాని తన అభిప్రాయమును వెల్లడిచేయక ఇతరుల అభిప్రాయమును, వాని వెనుకగల వారి కారణములను, వాదములను చక్కగా ఆకళించుకొన్న అనంతరము రాముడు తుదకు మారుతి వైపు చూపుసారించి, అతని అభిప్రాయమును తెలుపుమనెను. అపుడు పావని, "గూఢచారులచేత విభీషణుని పరీక్షించుట అతని గురించి విషయము సంగ్రహించుట అపాయకరమైనదని సూచించెను. విభీషణుని ముఖప్రసన్నత, అతనిమృదుస్వరము అతని సౌమ్యాకారము అతడు నిష్కపటుడని చెప్పక చెప్పుచున్నవని చెప్పి, కేవలము రావణు దౌష్ట్యమునకు విసుగుచెంది, మీ అజేయ పరాక్రమమునందు నమ్మకముంచి, అతడు ఇచటికి వచ్చియుండుటవలన మీరు వెంటనే అతని కాశ్రయమీయవలెను అని ప్రతిపాదించెను. తుదకు మారుతి అభిప్రాయమే రామునికి సర్వశ్రేష్ఠమని తోచెను. తదనుసారముగ నిస్సంశయ మనస్కుడై విభీషణున కత డాశ్రయ మిచ్చెను.

## శ్రీరాముని విశ్వాసము

సీతాన్వేషణ సమయమున కూడ రామునికి అందరికన్న ఎక్కువగా హనుమ కర్తవ్యనిష్ఠయందే మిక్కిలి నమ్మకముండెను. వానరరాజు సుగ్రీవుడు కూడ సీతాన్వేషణ సంబంధముగా ప్రయత్న మొనరించుచున్న అందరు వానరుల కన్న హనుమంతునిపట్ల తనకున్న అధిక విశ్వాసమును వెల్లడించియుండెను.

స్వనామాంకితాంగుళీయకమును రాముడు హనుమ కిచ్చి, "ఈ ఉంగరమును నీవు సీతకిచ్చిన, ఆమెకు నీమీద నమ్మకము పుట్టును. ఉద్విగ్నురాలు కాకుండ ఆమె నీతో సంభాషించును. నీ పరిశ్రమము, నీ సత్యధీరపరాక్రమము, నీయందు సుగ్రీవునకు గల ప్రగాఢ విశ్వాసము- ఇవి నా అభిప్రాయమున భావికార్యసిద్ధి ప్రసాద చిహ్నములే అయి ఉన్నవి" అని చెప్పుటను చూచిన హనుమంతుని కార్యదీక్షపట్ల రామునికెంతటి విశ్వాసముండెననుట స్పష్టమగును.

రామునికి తనయెడగల విశ్వాసమావంతయును తగ్గనట్లు మారుతి మహత్కార్యములను సాధించి, ఆ విశ్వాసపాత్రతను ప్రదర్శించెను. సుందరకాండమున మారుతి గుణవిశేషముల వర్ణన కలదు. భక్తప్రియుడగు శ్రీరామునికి అది అతిసుందర మనిపించెనట. అందువలననే దానిని 'సుందరకాండము' అని పేర్కొందురు. సముద్రము దాటి లంకకు పోవునపుడు మార్గమధ్యమున బుద్ధివివేకము, ప్రలోభము, భీతి – వీనిని గురించిన మూడు పరీక్షలలో హనుమ ఉత్తీర్ణుడై యుండుట సుందరకాండాంతర్గత వర్ణనల వలన వెల్లడియగును.

## పరీక్షాత్రయము

దారిలో నాగమాత సురస హనుమ నడ్డగించి, "నీవు నా భక్ష్యమైతివి" అని బెదరించును. అతడామెలో స్పర్ధాభావమును రెచ్చగొట్టి, నానావిధములగు స్పర్ధలతో ఆమెను బడలిక చెందించును. కడకు అంగుష్ఠమాత్ర రూపమును ధరించి, ఆమె వక్త్రబిలము ప్రవేశించి, వెలికి వచ్చి, ఆమె కసహ్యవేదన కలుగునట్లుచేసి, పరాభవించును. లంకాప్రయాణమున హనుమకు మైనాకపర్వతము మీద విశ్రాంతి పొందుటకు పిలుపు వచ్చును. కాని కార్యనిష్ఠుడైన అతడు ఈ ప్రలోభమునకు విముఖుడై, ఆహ్వానమును ధన్యవాదములతో సవినయముగా తిరస్కరించి, ముందుకు సాగును. తుదకు సింహికను వధించి, లంకానగర దేవతనుకూడ జయించిన హనుమ తన సాహస కృత్యములయొక్కయు, నిర్భీతియొక్కయు మహత్త్వమును ప్రకటించును. ఏకాకియైన పావని ఆ రాత్రియందే రాక్షసుల రాజధానిని ప్రవేశించును. రహస్యముగా రావణుని యావదంతఃపురమును గాలించి, సీత ఆచూకీ తెలిసికొనుటకు ప్రయత్నించెను. ఎచ్చటను జానకి అతని కంట పడలేదు.

ఇటువంటి నిరాశామయ వాతావరణమున కూడ అన్వేషణకార్యమును కొనసాగించుచు, అశోకవనమునకు వచ్చినవేళ అతడు శింశు పావృక్షపు నీడలో కూర్చున్న శోకమూర్తి యగు సీతను కనుగొనెను.

అంజనేయుడు సీతను వెదకుచు అశోక వనమున కరుదెంచినపుడు, అటకు సీతను హింసించుటకై రావణుడు వచ్చియుండెను. ఇందువలన సీత ఏ స్థితిలో ఉన్నదన్న వాస్తవచిత్రము అతనిముందు ప్రత్యక్షమై నట్లయ్యెను. రావణు డచటినుండి వెడలిన తరువాత మైథిలి ఉరిపోసికొని మరణించు టకు ప్రయత్నించెను. అపుడు పవన తన యుని మనస్సున ఒక్కుమ్మడిగా ఆలోచనా తరంగములులేచి ఈ ఆపదను ఎట్లు తప్పిం చుట అన్న చింత కలిగెను. నిజము చెప్పవలెనన్న - సీత లంకలో ఉండుటను కనుగొన్నంతనే అతనికి అప్పగించిన పని ముగిసియుండెను. కాని చెప్పి నంత మాత్రమే చేయునటువంటి సంకుచితకార్య క్షేత్ర స్వరూపము నత డెప్పుడును గౌర వించినవాడు కాడు. సీతను కనుగొనుటతో పాటు అమెను బ్రదికించు కర్తవ్యమును, దానికన్న ముందుగా పోయి ఆమె సందేశ మును గ్రహించి శ్రీరామునికి చేరవేయు కర్తవ్యమును తనవే అయి యున్నవని అతనికి తెలియును. సీతయే అప్పుడు నశించినచో, మిగిలినదంతయును నశించి నట్లే! కాని ఆమెను ఆ స్థితిలో ఓదార్చుట యైనను ఎట్లు?

## హనుమ సమస్య

ఇట్టి విచిత్ర సన్నివేశమున హనుమ అంతరంగమున లేచిన ఆలోచనావీచికలను వాల్మీకి ఈ రీతిగా చిత్రించును. —"ఒక వేళ నేనిపుడే సీతకు ధైర్యవచనములను వచింపకపోయినచో, ఇచటికి నేను వచ్చు టయ దండుగ యగును. ఆమె ఎంతటి దుఃఖితురాలైనదన్న తన్ను రక్షించువారు ఎవరునులేరని ఊహించి ఈ రేయి తెల్లవారు లోపునసే తన ప్రాణమును త్యజించును. నే నిట్లే వెనుదిరిగి వెడలిన, శ్రీరాముడు, "సీత ఏమిచెప్పెను" అని ప్రశ్నించినపుడు ఏమని చెప్పగలను? నేను సీతతో మాటాడ కనే నేరుగా ఇచటికి వచ్చితిని అని చెప్పిన దుఃఖతప్తుడైన రామునికి, అతని మనస్సు నకు సమాధానమును కలిగించు ఉత్తరము నిచ్చినట్లగునా? ఈమెతో నేను మంచి భాషలో మాటాడినచో, ఈమె నేను రావణుడే అయి ఉండవచ్చునని ఊహించి, కష్టముల చిక్కితినని పెడబొబ్బలు పెట్టవచ్చును. వానిని విన్నంతనే రాక్షసులు ఆయుధము లను ధరించి పరుగెత్తివత్తురు. అపుడు వారిని పారద్రోలుటకై నేను భయంకర రూపమును ధరింపవలసి వచ్చును. అపుడు నేను వారిని చంపిన ఈ సంగ్రామమున ప్రఖ్యాతయోధులు ప్రాణములు విడుతురు. యుద్ధమువలన యావద్వాతావరణమును సంశయగ్రస్తమగును. అనంతరము నేను రాముడున్న చోటికి పోవచ్చును లేదా పోవుటకు వీలులేక ఇచటనే ఉండవచ్చును. ఇపుడేమి చేయుట? మాటాడకుండిన ఒక చిక్కు, మాటాడిన ఇంకొక చిక్కు, ముందు నూయి, వెనుక గోయి! సీత కుద్వేగము కలుగకూడదు. కాని మెల్లగా ఆమెలో కుతూహలమును మేలుకొలిపి, నేను చెప్ప వలసినదంతయును చెప్పి ముగించు వరకు మౌనముగ ఆమె వినునట్లు చేయు టకు ఇపుడేమి చేయవలెను?

## అసాధ్యయుక్తి

ఈ విధముగా హనుమ మనసునందు ఒకటి తరువాత ఒకటి ఆలోచనల, ప్రశ్నల పరంపరలు లేచినవి. తుదకతడు పన్నిన యుక్తిమూలమున పరేంగిత పరిజ్ఞానము గల అతనియొక్క అపార బుద్ధిశక్తియొక్క అద్భుతరూపము మన మనస్సుకు గోచరిం చును. రావణునికి తెలియని దశరథమహా రాజుయొక్క వర్ణనము మెల్లగా ప్రారం భించి, చెట్టువెనుక నిలువబడియే మృదు మధురస్వరమున సీతకు రామకథ చెప్పెను. అత్యంత నిరాశామయస్థితి యందున్న సీతకు అనపేక్షితముగా అతిమధురస్వర మున

> రాజాదశరథోనామరథకుంజరవాజిమాన్,
> పుణ్యశీలో మహాకీర్తి, ఇక్ష్వాకూణాం
> మహాయశాః॥ (సుం. కాం.)

అను శబ్దములు చెవుల పడినంతనే ఆమె కుతూహల విపంచిక తంత్రి తనంత తానే మ్రోగ మొదలిడెను. ఒడలంతయును చెవి చేసికొని, కేవల మయోధ్యాంతఃపురము నందున్నవారికి మాత్రమే- అంతియేకాక, అచటిప్రముఖవ్యక్తులతో ప్రగాఢ సంబంధ మున్నవారికి మాత్రమే- తెలిసిన ఈ విష యమును ఇచ్చట ఎవరు చెప్పుచున్నారని అతికుతూహలమున ఆమె ఆలింప నారం భించెను! హనుమంతుని మనోరథము సిద్ధించెను! సీతాదేవి కుతూహలమనోవృత్తి యొక్క పరిపూర్ణలాభమును పొంది, తాను చెప్పదలచుకొన్న సమస్తవృత్తాంతమును హనుమంతుడు సీతామాతకు చెప్పెను. రాముని ఉంగరము నామె కొసగెను. ఆమె హృదయమున తన యెడల నమ్మకమును కలిగించెను.

## రాక్షసుల తేజోవధ

ఇంతటితో తన పని ముగిసిన దని హను మంతు డనుకొనలేదు. అశోకవనమును ధ్వంసము చేసెను. రావణుని బెదిరించి, అతనియందు పెనుభీతిని జనింపచేసి, అతనిని సాహసహీనునిగ చేసెను. లంకా దహన మొనరించి రాక్షసులలో సమర మొనర్చు ఆలోచనలే సమసిపోవునట్లు చేసెను. తమ వినాశము తప్పదను భయా వహ భావమును కలిగించి, రాక్షసకుల తేజోభంగమహత్కార్యమును సాధించిన తరువాతనే హనుమంతుడు శ్రీరాముడున్న చోటికి తిరిగి వెడలెను. పావనియొక్క ఈ కార్యము వలననే రక్కసులలో సాహసము మరల శిరమెత్తుటకు చైతన్యము లేని దయ్యెను.

ఇట్లు బుద్ధిమతాం వరిష్ఠుడును,కార్యనిష్ఠు డును, సాహసోపేతుడును, ప్రమాణభూతు డును అగు అంజనేయుడు ఆజన్మబ్రహ్మ చారి; అతిపవిత్రమూర్తి. ఇటువంటి అత్యు న్నత, అత్యుదాత్త, అతిశ్రేష్ఠవ్యక్తియెడల రామునికి ప్రేమవిశ్వాసము లపరిమితముగా ఉండుట అత్యంత స్వాభావికము.

రామచంద్రుడు, హనుమంతుడు తనకు చేసిన ఉపకారములను తనకు తానే అతి వినయముతో స్మరించు కొనుచుండెను. అయినను అతని పట్ల హనుమకు అంతరంగ మున భక్తి అప్రతిమముగా నుండెను. రాముని వరమిమ్మనివేడుచుహనుమంతుడు,

( 36వ పేజీలో )

## పదమూడవ అధ్యాయం

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం

అర్జున ఉవాచ:

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ।
ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥

అర్జునుడు: కేశవా! ప్రకృతి, పురుషుడు, క్షేత్రం, క్షేత్రజ్ఞుడు, జ్ఞానం, జ్ఞేయం వీటన్నిటి గురించీ తెలుసుకోవాలని నా అభిలాష.

శ్రీ భగవానువాచ:

ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

శ్రీ భగవానుడు: కౌంతేయా! ఈ శరీరమే క్షేత్రమనీ, దీనిని తెలిసికొంటున్నవాడే క్షేత్రజ్ఞుడని తత్త్వం తెలిసినవాళ్ళు చెబుతారు.

ఋషులు ఎన్నో విధాలుగా ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల తత్వాన్ని చాటి చెప్పారు. వేరువేరుగా వేదాలూ, సహేతుకంగా, సందేహరహితంగా, సవివరంగా బ్రహ్మసూత్రాలూ ఈ స్వరూపాన్ని నిరూపించాయి.

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ।
ఇన్ద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః॥
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥

పంచభూతాలు, అహంకారం, బుద్ధి, మూలప్రకృతి, పది ఇంద్రియాలు. మనస్సు, ఐదు ఇంద్రియ విషయాలు, కోరిక, ద్వేషం, సుఖం, దుఃఖం, దేహేంద్రియాల సమూహం, తెలివి, ధైర్యం – వికారాలతోపాటు వీటి సముదాయాన్ని సంగ్రహంగా క్షేత్రమని చెబుతారు.

అమానిత్వ మదంభిత్వం అహింసా క్షాంతి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ॥

అర్జునా! క్షేత్రాలన్నిటిలోనూ వున్న క్షేత్రజ్ఞుణ్ణి నేనే అని తెలుసుకో. క్షేత్రానికి క్షేత్రజ్ఞుడికి సంబంధించిన జ్ఞానమే సరైన జ్ఞానమని నా వుద్దేశం.

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శ్రుణు॥

ఆ క్షేత్రం ఆకారవికారాలు, పుట్టుపూర్వోత్తరాల గురించీ క్షేత్రజ్ఞుడి స్వరూప స్వభావ ప్రభావాలను క్లుప్తంగా చెబుతాను విను.

ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥

ఇంద్రియార్థేషు వైరాగ్యం అనహంకార ఏవ చ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్।
అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు॥
నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోపపత్తిషు।
మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్త దేశసేవిత్వం అరతిర్జనసంసది॥
అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా॥

తనని తాను పొగడుకోక పోవడం, కపటంలేకపోవడం, అహింస, సహనం, సరళత్వం, సద్గురుసేవ, శరీరాన్నీ మనసునూ పరిశుద్ధంగా వుంచుకోవడం, స్థిరత్వం, ఆత్మనిగ్రహం, ఇంద్రియ విషయాలపట్ల విరక్తికలిగి వుండడం, అహంకారం లేకపోవడం, పుట్టుక, చావు, ముసలితనం, రోగం అనే వాటి

వల్ల కలిగే దుఃఖాన్ని గమనించడం, దేనిమీదా అసక్తి లేక పోవడం, ఆలుబిడ్డలూ, ఇళ్లూ వాకిళ్ళపట్ల వ్యామోహం లేక పోవడం, శుభాశుభాలలో సమభావం కలిగివుండడం, నా మీద అనన్యమూ, అచంచలమూ, అయిన భక్తి కలిగివుండడం, ఏకాంత ప్రదేశాన్ని ఆశ్రయించడం, జనసమూహం మీద ఇష్టం లేకపోవడం, ఆత్మధ్యానంలో నిరంతరం నిమగ్నమై వుండడం. తత్త్వజ్ఞానంవల్ల కలిగే ప్రయోజనాన్ని గ్రహించడం – ఇదంతా జ్ఞానమని చెప్పబడింది. దీనికి విరుద్ధమయింది అజ్ఞానమే.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥

ఏది తెలుసుకోదగ్గదో, దేనిని తెలుసుకుంటే మానవుడు మోక్షం పొందుతాడో, అనాదిఅయిన ఆ పరబ్రహ్మాన్ని గురించి చెబుతాను. దానిని సత్తనికాని, అసత్తనికాని వివరించడానికి వీలులేదు.

సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥

అది అంతటా చేతులూ, కాళ్లూ, తలలూ, ముఖాలూ, చెవులూ కలిగి సమస్త జగత్తునీ ఆవరించి వున్నది.

సర్వేంద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

ఆ బ్రహ్మం అన్ని ఇంద్రియాల గుణాలనూ ప్రకాశింపచేస్తున్నా సర్వేంద్రియాలూ లేనిది; దేనినీ అంటకపోయినా అన్నిటికీ ఆధారం; గుణాలు లేనిదైనా గుణాలను అనుభవిస్తుంది.

బహిరంతశ్చ భూతానాం అచరం చర మేవ చ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్॥

అది సర్వభూతాల వెలుపల, లోపలకూడా వున్నది: కదలదు, కదులుతుంది. అతిసూక్ష్మస్వరూపం కావడంవల్ల తెలుసుకోవడానికి శక్యంకాదు. అది ఎంతో దూరంలోనూ బాగా దగ్గరలోనూ వున్నది.

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

ఆ బ్రహ్మం ఆకారమంతా ఒకటే అయినప్పటికీ సర్వప్రాణులలోనూ ఆకారభేదం కలిగిన దానిలాగా కనపడుతుంది. అది భూతాలన్నిటినీ పోషిస్తుంది, భుజిస్తుంది, సృజిస్తుంది.

జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

అది జ్యోతులన్నిటినీ ప్రకాశింపచేస్తుంది. అజ్ఞానాంధకారానికి అతీతమూ, జ్ఞానస్వరూపమూ, జ్ఞానంతో తెలుసుకోదగ్గదీ అయి అందరి హృదయాలలో అధిష్ఠించి వున్నది.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥

ఇలా క్షేత్రం, జ్ఞానం, జ్ఞేయం గురించి క్లుప్తంగా చెప్పడం జరిగింది. నా భక్తుడు ఈ తత్త్వాన్ని తెలుసుకొని మోక్షం పొందడానికి అర్హుడవుతున్నాడు.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥

ప్రకృతి, పురుషుడు – ఈ ఉభయులకీ అంతులేదని తెలుసుకో. వికారాలూ, గుణాలూ ప్రకృతినుంచి పుడుతున్నాయని గ్రహించు.

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥

శరీరం, ఇంద్రియాల ఉత్పత్తికి ప్రకృతే హేతువని, సుఖదుఃఖాలను అనుభవించేది పురుషుడనీ చెబుతారు.

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్।
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు॥

ప్రకృతిలో ఉండే పురుషుడు ప్రకృతివల్ల కలిగే గుణాలను అనుభవిస్తాడు. ఆ గుణాలపట్ల కల అసక్తినిబట్టి పురుషుడు ఉచ్చనీచజన్మలు పొందుతాడు.

ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః॥

ఈ శరీరంలో అంటీ అంటనట్లుగా వుండే పరమ పురుషుణ్ణి, సాక్షి, అనుమతించేవాడు, ధరించేవాడు, అనుభవించేవాడు, మహేశ్వరుడు, పరమాత్మ అని చెబుతారు.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥

ఇలా పురుషుణ్ణి గురించీ, గుణాలతో వున్న ప్రకృతిని గురించీ తెలుసుకున్నవాడు ఎలా జీవించినాపునర్జన్మపొందడు.

ధ్యానేనాఽఽత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥

ధ్యానయోగం ద్వారా కొంతమంది, జ్ఞానయోగంవల్ల మరికొంతమంది, కర్మయోగంతో ఇంకొంతమంది పరమాత్మను తమలో దర్శిస్తున్నారు.

(35 వ పేజీలో)

# వేదశాస్త్రములు

" వేదో ధర్మ మూలమ్ " అనగా సకల ధర్మములకు వేదమే మూలమైనది. మన భారతదేశ సంస్కృతిని తెలియ చేయునది వేద వాఙ్మయమే. మనదేశ సంస్కృతితో ఏ యితర దేశ సంస్కృతియు సమానము కాజాలదు. కారణమేమనగా వేదములు అపౌరుషేయము లగుటయే ముఖ్య కారణము.

" వేదము " అని అనగానే దానికంగము లగుశాస్త్రములను తప్పక గ్రహింప వలసినదే. వేదము అంగి-శాస్త్రములుఅంగములు. అంగములు కలది కావున అంగి యను పేరు కల్గినది. లోకమున వట్టి మొండెమునకు ప్రాధాన్యముండదు. ఉపయోగించెడు కరచరణాద్యవయవము లున్నప్పుడే శరీరమునకు శోభ, ఉపయోగము. చేతులు, కాళ్లు మొదలగు నవయవములు అక్కర లేదనుకొనెడి మానవుడుండడు కదా! కావున వేదమని యనగానే అవినాభావ సంబంధము గల శాస్త్రములను కూడ తప్పక గ్రహింప వలసినదే. ఇందు సందేహించుటమౌఢ్యము.

ఇట్టి వేదమునకు 1. శిక్ష 2. వ్యాకరణము 3. ఛందస్సు 4. నిరుక్తము 5. జ్యోతిషము 6. కల్పము అని ఆరు శాస్త్రములు అంగములుగా చెప్పబడినవి. ఒక్కవేదము నభ్యసించవలెనన్ననూ సుమారు 10 సంవత్సరముల కాలము పట్టును. ఇట్టి వేదమునకు అర్థము తెలిసికొనవలెనన్న వ్యాకరణ శాస్త్రము, పూర్వోత్తరమీమాంసా శాస్త్రములు, అటుమీద విద్యారణ్యభాష్యమును చదివిన వారే సంపూర్ణ వేదమునకు సంపూర్ణముగా అర్థము చెప్ప గల్గి యుందురు. గాన వేదాధ్యయనము చేసిన ప్రతి పండితుడు, అర్థము చెప్పవలెనన్న సాధ్యము కాదు.

యదధీత మవిజ్ఞాతం
నిగదే నైవ శబ్ద్యతే ।
అనగ్నా వివ శుష్కేంధో
న తజ్జ్వలతి కర్హిచిత్ ॥

అనగా వంటచెరకు ఎంత శ్రేష్ఠమైన దైనను అగ్ని సంపర్కము లేనిచో మండని విధముగా ఎంతటి సుశబ్దమైనను అర్థము తెలియనిచో అది శబ్దాడంబరమే యని భావించి వేదము నభ్యసించుట మానరాదు. ఎందుచేతననగా "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" వేదాధ్యయనము చేయ వలెను. "శ్రుతం తపః", వేదాధ్యయనము చేయుటయే తపస్సు అని శ్రుతి చాటుచున్నది.

ఇట్టి వేదమునకు అర్థమును కూడా తెలిసికొనుట బంగారమునకు పరిమళము అబ్బినట్లుండును. అది వేద పండితుల కెల్లరకును సాధ్యము కాదని మనవి చేసితిని.

ఇక శాస్త్ర ప్రయోజన మేమనగా వేదములలో చెప్పబడిన విషయము శాస్త్ర పరిజ్ఞానము చేతనే తెలిసికొనుటకు వీలుపడును. వేదమందలి లౌకిక సంస్కృత పదముల కర్థము, వేద మందలి ఈ పదములో ఏది నామవాచకమో, ఏది అవ్యయమో, ఏది క్రియా పదమో అను విషయము శాస్త్ర పండితులకు మాత్రమే తెలియును కాని శాస్త్రవాసనలేని వేదపండితులకు తెలియదు. ఆ శాస్త్రములలో కూడ

ప్రథమం ఛందసామంగమా
హుర్వ్యాకరణం బుధాః ॥

అనగా వేదములలో వ్యాకరణమునకే ప్రథమ స్థానమని భావము. కావున వ్యాకరణ శాస్త్ర పండితులకు తదితర శాస్త్ర పండితులకు, వేద వాఙ్మయ మందలి భాషా భాగ, పరిజ్ఞానము, సాహిత్య పరిజ్ఞానముచే వేదమందలి లౌకిక సంస్కృత పదముల కర్థజ్ఞానము కల్గును. కావున మూలజ్ఞాతల కంటె పదార్థ విభాగజ్ఞాతలు తక్కువ వారు కాదు కదా!

ఇక నేటి కాలమున అన్నవరము, రాజమండ్రి, కాకినాడ మొదలగు ఊళ్లలో వేద శాస్త్ర పండిత సభలలో ఏ సభలోనైనను శాస్త్ర పండితులను ఘనపాఠులతో సమానముగా పరిగణించి సత్కరించుటకు బదులుగా క్రమ పాఠులతో సమానముగా పరిగణించి తక్కువగా సత్కరించుట ప్రతి సభలోను జరుగు చున్నది. ఇది చాలా శోచనీయమగు విషయము. ఘనపాఠి శబ్దములో ఘనశబ్ద ముండుటచే ఘనముగా వారిని సత్కరించి నట్లే శాస్త్ర పండితులను కూడ సత్కరింపవలెనని చెప్పి సత్కరింప చేసెడి వారికిని సత్కరించెడి వారికిని ఎంతో ఆవశ్యకత ఉన్నది. ఈ సందర్భమున "ఘన" యనగా వివరింతుము.

1. మూలమగు వేదమును సంహిత యని అందురు.

2. మూలమందలి పదములను విభాగించుటకు పదమని పేరు.

3. వరుసగ రెండు పదములను చెప్పి రెండవ పదమును మరల చెప్పి మూడవ పదమును, మూడవ పదమును మరల చెప్పి నాల్గవ పదమును ఇట్లే ఋక్కు పూర్తి చేయుట క్రమమని అందురు.

4. జట 5. ఘనలనగా పైన దెల్పిన క్రమ మందలి పదములను అల్లుట. ఆ యల్లిక ఎట్లనగా—

జటా లక్షణం

పదద్వయంక్రమాదుక్త్వా
ద్వితీయం ప్రథమం పునః
పునశ్చ క్రమవద్బ్రూయా
త్సంధితశ్చ జటా స్మృతా ॥

అనగా మొదట రెండు పదములను వరుసగ చెప్పి రెండవపదమును మొదటిపదమును మరియొకసారి ఉచ్చరించి సంధి విశేషములున్నచో వ్యాకరణయుక్తముగ సంధి చేయుచు యథాప్రకార క్రమవద్ధతిని చెప్పుటకు జట యని పేరు.

ఉదాహరణ ;—

హగ్ంసః శుచిషత్ మూలపదములు- వీని యర్థము పరమాత్మ ఆదిత్య స్వరూపుడు, జ్యోతిర్మండలస్వరూపు డని యర్థము.

పై పదములకు జట ;—

హగ్ంసశ్శుచిషచ్ఛుచిషద్ధగ్ంసో
హగ్ంసశ్శుచిషత్- ఇది జటయల్లిక

ఘనలక్షణం ;—

జటాముచ్చార్యవిధివత్తృతీయం
ప్రథమం పునః
విలోమేనానులోమేన సంధితస్స
ఘనస్స్మృతః ॥

అనగా ముందుజటాక్రమములోచెప్పి 3 వ పదమును రెండుమార్లుచెప్పి తలక్రిందుగా మొదటిపదమువరకు ఉచ్చరించిమరలమా మూలక్రమములో సంధిచేయుచు 3 వ పదమువరకు చెప్పుటకు ఘన యని పేరు.

ఉదా:—

హగ్ంసశ్శుచిషచ్ఛుషద్ధగ్ంసోహగ్ంస శ్శుచిష
ద్వసుర్వసుశ్శుచిషద్ధగ్ంసోహగ్ంసశ్శు చిషద్వసుః

ఇట్లు మూలమంత్రమందలి పదములను విచిత్రగతిని తారుమారుచేయుటకే ఘన యనిపేరు. ఘనమందలి క్రమముననుసరించి అర్థముచెప్పినచోహాస్యాస్పదముగ నుండును. కావున ఘనకు అర్థములేదని తేలినది. వేదశాస్త్రపురాణేతిహాసాది వాఙ్మయములలో అర్థములేని ప్రక్రియగలది ఘనయే. ఇట్లు అర్థరహితమైన ఘనకు ఘన సత్కారము చేయునప్పుడు అర్థవంతమగు శాస్త్రములకు ఘనసత్కారముచేయకుండుట అధిక్షేపముకాదా ? కావునశాస్త్రపండితులకు ఘనపాఠులతో సమానసత్కారము తప్పక జరుగవలసియున్నది. కేవలశాస్త్రసహాయముతో సంపూర్ణవేదమునకు అర్థబోధకులై వేదార్థసమ్రాట్ బిరుదాంకితులగు శ్రీ మదుప్పులూరి గణపతిశాస్త్రిగారు శ్రీ మద్దేమళ్ళ సూర్యప్రకాశ శాస్త్రిగారు మొదలగు మహనీయులు శాస్త్రపండితులకు జరుగుచున్నట్టి ఈ అన్యాయమును అరికట్టుటకు తప్పక పూనుకొనవలసియున్నది. అయితే అర్థరహితమైన ఘనకు ప్రయోజనములేదని భావించి ఘనపాఠులను ఘనముగ సత్కరించుట మానరాదు. ఏలయనగా వేదమందలి పదములను ఒకసారి ఉచ్చరించనంతమాత్రముననే మహాఫలము గల్గును. అట్టి పదములను అనేకమార్లు ఉచ్చరించినచో లభించునట్టి ఫలము చెప్పనలవికాదు. కావున ఘన పాఠులకు విశేషముగ ఆముష్మిక ఫలమును ఘనవినెడివారికి శ్రావ్యతను చేకూర్చుటకై "ఘన" యనుప్రక్రియ ఏర్పరుపబడినది.

ఇక శాస్త్రములలోకూడ ఇట్టి శ్రావ్యతను, శబ్దవైచిత్ర్యము చేకూర్చునట్టి ప్రక్రియా విశేషముకలదు.

అంగములలో ప్రథమస్థాన మాక్రమించిన వ్యాకరణశాస్త్రములో తిఙన్తప్రకరణమందలి యఙ్లుక్ ధాతువులను (క్రియలను) 10 లకారములలోను (10 కాలములలోను) శ్రావ్యముగాచెప్పినచో ఘనవలె శ్రావ్యతను కూర్చుటలో సందేహింప నవసరములేదు. యఙ్లుక్ధాతువులు- డుకృఞ్ కరణే, వృఞ్ వరణే గృహూగ్రహణే మొదలగు క్రియల, లట్ లిట్, లుట్, లృట్, లోట్, లఙ్, లిఙ్, ఆశీర్లిఙ్, లుఙ్, లృఙ్ లలోని రూపభేదములు వినువారి కుల్లాసము కలిగింపకమానవు. ఇక అలంకార శాస్త్రమందలి శబ్దవైచిత్ర్యముగల శ్లోకప్రక్రియ కూడ వినువారికి శ్రుతిపేయముగ నుండును. కావున సారాంశమేమనగా ఘనపాఠులతో శాస్త్రపండితులను సమానముగా సత్కరింపవలసియున్నది. *

— చిలుకూరి రామభద్రశాస్త్రి

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం. అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సర కాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి

# భామాకలాపంలో భరతశాస్త్రం

## కళావని

భామాకలాప సృష్టి ప్రతిష్ఠా మహిమాన్వితుడు శ్రీ సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్ర యోగి కూచిపూడి కులపతులలో అగ్రపీఠం అధిష్ఠించిన వ్యక్తి. అసలు కూచిపూడివారికి నాట్యకళను ప్రసాదించినదీ సిద్ధేంద్రయోగి యని కొంద రందురు. కాని సిద్ధేంద్రునకు పూర్వమే కూచిపూడిలో నాట్యసరస్వతి తిష్ఠ వేసింది. కూచిపూడివారికి సిద్ధేంద్రయోగితో నాట్యం రాలేదు. కాని కలాపవిద్య అనగా "భామాకలాపం" వచ్చింది. శ్రీ సిద్ధేంద్రుని భామాకలాపం ఆంధ్ర యక్షగాన వాఙ్మయానికి మౌళిక, కూచిపూడి నాట్య సరస్వతి కొక మణిమాలిక.

ఇక సిద్ధేంద్రుని ఉనికి గురించి, జీవిత చరిత్ర గురించి ఎందరో విద్యాధికులు ఎన్నెన్నో ఊహించారు. కాని ఇదమిత్థమని నిర్ణయించుట కాధారములు అలభ్యమగుట మనదురదృష్టం. అయితే సిద్ధేంద్ర యోగి కూచిపూడి వాస్తవ్యుడని మాత్రం నొక్కి చెప్పవచ్చును.

ప్రకృత విషయం 'భామాకలాపం-భరతశాస్త్రం' గురించినది. 'భామాకలాపం' కన్న భరతముని ప్రోక్తమైన భరతశాస్త్రం ప్రాచీనమైనదని అందరికీ తెలిసిన విషయమే. అయితే భామాకలాపంలో భరతశాస్త్రం ఎంతవరకూ ఉన్నదనే విషయం గురించి ముచ్చటించటం యీ వ్యాసోద్దేశం. మహాకవి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలానికి సంస్కృత రూపక లక్షణాలు చాలావరకు పట్టినట్లు, సిద్ధేంద్రయోగి భామాకలాపానికి చాలా వరకు భరతశాస్త్రం పట్టింది. భరతుని నాట్యశాస్త్రమే భరత శాస్త్రం. నాట్యశాస్త్రంలో నృత్త, నృత్య, గీత వాద్యాదులతోపాటు ఛందోవ్యాకరణ అలంకారాది సాహిత్య విషయాలూ ప్రవచించాడు భరతుడు. భామాకలాపం ఆపాత మధురమైన సంగీతం, ఆలోచనామృతమైన సాహిత్యం, నయనానందకరమైన నాట్యముల కలయిక. అందుకే అది యొక త్రివేణీ సంగమం. అందు వలననే "భామా కలాపం వడగట్టిన అలంకార భరతశాస్త్రమని శ్రీ విశ్వనాథవారు తమ ఏకవీరలో వక్కాణించగా ఆచార్య శ్రీ యస్వీ జోగారావు గారు "ఈ భామాకలాపము శృంగార రసపేశల సుధాకలశ" మని తమ ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రలో సంభావించారు.

భామాకలాప ఇతివృత్తం చాలా స్వల్పం. ఒకనాడు శ్రీకృష్ణుడు సత్యభామని భామా! నీవే అందగత్తెవా? లేక నేనే అందగాడనా? అని ప్రశ్నింప, సహజ సౌందర్య గర్విత యైన సత్య పరమాత్మని ప్రశ్నలోని పరమార్థ మెరుగక నేనే అందగత్తెనని సమాధాన మిస్తుంది. అంత శ్రీకృష్ణుడు అలుకతో సత్యాసదనం వీడి పోతాడు.

ఇక సత్య కృష్ణు నన్వేషించుటకు తన చెలియైన మాధవి సాయం అర్థిస్తుంది. కడకు మాధవి కొక లేఖ యిచ్చి ఆమె అడిగిన ముక్కు ముంగెర నిచ్చి పరమాత్మని కడకు పంపుతుంది. సత్యాకృష్ణుల పునస్సంధాన కర్త యీ మాధవి. ఇదీ ఇతివృత్తం.

### భామాకలాపం-రసం-విప్రలంభ శృంగారం

"విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అని భరతుని రస సిద్ధాంతం. ఈ విభావానుభావ వ్యభిచారి భావాలకు కాణాచి భామాకలాపం. ఇక ఈ కలాపంలో అంగిరసం శృంగారం. సర్వ ప్రాణికోటికి అనుభవైక వేద్యమైంది. రస రాజమైంది, సురుచిరమైంది, శృంగారం. ఇది రెండు రకాలు. ఒకటి సంభోగ శృంగారం. రెండు విప్రలంభ శృంగారం. ప్రస్తుత భామాకలాపంలో విప్రలంభ శృంగారలహరి అనేక విధాల ప్రవిస్తుంది.



భామాకలాపంలో భామకు శ్రీకృష్ణునితో ఎడబాటు సంభవించిన దాదిగా విప్రలంభ శృంగారం ఆరంభమౌతుంది. ఇక భామ విరహంలో శృంగార నాయికగ అనేక వాలకాలు వేస్తుంది. శ్రీకృష్ణుని అన్వేషిస్తుంది. ఈ విరహాన్ని అదనుగ మదనుడు సత్యను బాధించటం, భామ మన్మథబాధను సైపక మన్మథదూషణ, చంద్రదూషణ, కడకు నాయకుని వంశదూషణ గూడ చేస్తుంది. ఈ విరహోద్వేగంలో సత్యభామ అష్టవిధ శృంగార నాయికలలో స్వాధీన పతిక, విరహోత్కంఠిత, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారికల వాలకాలు వేసింది. దశావస్థల ననుభవించింది. సంచారీభావ పరంపరలకు లోనైంది.

పైన తెల్పినవానిలో భామాకలాపంలో భామ-

మదనా మ....ద....నా యనుచు
మదనగోపాలా మరవదేలర సామీ
మారుని శరములబారి కోర్వగలేక
॥ మదన ॥

అని ఆనందభైరవి రాగం ఆదితాళంలో మన్మథబాధ ననుభవిస్తుంది. ఈ మన్మథ శరాఘాతానికి తాళలేక-

"పతాణీ రౌతు తీకునన్ మితారియైన
క్రొన్ననల్
కతారిగా నమర్చి బల్ గటాయితంబుగా
జనుల్
తుటాల్తుటాలు సేయ బూనె త్రోవబాసి
రాగనే
యిటో యెటోయెటోగదమ్మ, యేమి
సేతు, మారుడే........
మెరుంగువాడి తూపులన్ కురంగలోచ
నాళిపై
తురంగమెక్కి బంతులుల్ మెరుంగు
చోకులన్ పెతల్
దొరంగ చేయుచున్ బళిం మరంగు
లందు లంతకంతకున్
శరంబుతోట వచ్చెనంత పాపజాతి
మారుడే!"

అని మన్మథ దూషణ చేస్తుంది. అంతేగాక,

రాచవారికి బుట్టి రమణుల నేచేవు
అందమా యిది నీకు చందమామ!
రాత్రించరా నిన్ను రా జనంగను సిగ్గు
సందులో దొంగ వో చందమామ!
పరవడి దినముల పాము నిన్నంటగా
సగమాయ నీ రూపు చందమామ!
గురుని యిల్లాలితో గూడినా వను తొంటి
నింద నీకును జాలు చందమామ!

అమరసంఘంబు నీ కళ లారగించ
నెగ్గు సిగ్గును లేని నీ కేమి చింత
కమలవైతివి నీ కళల్ గరగిపోను
చలము మామీద నేలనో చందమామ!



అని చంద్రుని, మన్మథుని అబల సత్య దూషిస్తే వా రూరకుందురా? వా రామెను మూర్ఛను బడద్రోసిరి.

## సత్యభామ వేసిన శృంగార నాయిక వాలకాలు

స్వాధీన పతిక:

నాయకునిచే నెల్లప్పుడూ సంతోషపరుపబడెడిది.

దర్వు - భైరవిరాగం - మిశ్రచాపు.
భామనే సత్యభామనే-
వయ్యారి ముద్దుల సత్య ॥ భామనే ॥
భామనే పదియారువేల-
కోమలు లందరిలోన
రామరో గోపాల మూర్తికి-
ప్రేమదానైన ॥ సత్య ॥
అట్టహాసము చేసి సురుల-
నట్టె గెలిచి పారిజాతపు
చెట్టుదెచ్చి నాదు పెరటను-
గట్టిగ నాటించుకొన్న ॥ భామనే ॥

వారిజాక్షి ద్వారకా-
నివాసుని కౌగిలిలోన
కూరిమి బెనగొని-
రతులదేలిన యొయ్యారి సత్య ॥ భామనే ॥

ఇందు సత్యభామ ద్వారకా నివాసుని విశిష్టప్రేమ పాత్రురాలై అతనిచే ఎల్లప్పుడు ఏదో ఒక విధముగా సంతోషపరుపబడుచున్నది. అంతే కాదు పారిజాతవనమున విహరిస్తోంది. అందుచే 'స్వాధీనపతిక' యైనది.

విరహోత్కంఠిత:

నిరపరాధియగు ప్రియుడు రాక జాగు చేయగా నా విలంబము నోర్వలేక నెదురు చూచు నాయిక. నిరపరాధియయిన శ్రీకృష్ణుడెంత కాలమునకు రాక జాగుచేయ

"నే తాళలేనే ఓ యమ్మలారా
తాళలేనే భామలారా
ఇందరిలోను యీ సొమ్ము లేతే
నా నాథు డేడే వేగింపలేనే"

అనుచు సత్య విరహోత్కంఠితయైనది.

ఖండిత:

సంకేత సమయము నతిక్రమించి అన్యోపభోగపు గురుతులతో ప్రాతఃకాలమందు వచ్చెడి నాయకుని గలది.

శ్రీకృష్ణుడు సత్యను సమీపింప ఆమె మాధవితో "ఈతని ముఖము పాలిపోయిన దేమే! కనులెర్రగా నున్న వేమే! అధరమటులున్న దేమే!"

అనుచు అన్యోపభోగపు గురుతులను కాంచి సఖి మాధవి నడుగుచు ఖండితయైనది.

కలహాంతరిత:

సఖుల ఎదుట చరణ పతితుడగు నాయకుని నిరాకరించి పిదప పరితాపపడునది.
దర్వు: 'భామనా సత్యభామనా'

కక్షగట్టిన లక్షణకు తాకట్టుగాని గూర్చి
కసితో
లేమ లెల్లరు చూడ జడతో వేమరు నిను
కొట్టకున్న ॥ భామనా ॥

అని తనను సమీపించిన శ్రీకృష్ణుని నిరాకరించే పరితాపము నొంది మాధవి సమక్షమున "బంగరు పూవుల నిన్ను పూజ సేయుదునా" అని కలహాంతరితయైనది సత్య.

ప్రోషితభర్తృక:

నాయకుడు దేశాంతరమున కేగియున్నపుడు ఖేదపడునది.

సత్యసదనము వీడినాడు శ్రీకృష్ణుడు. సత్యభామ శ్రీకృష్ణుడు ద్వారక కేగెనని ఖేదపడుచు ప్రోషితభర్తృకయై నిదుర కాచినది.

అభిసారిక:

మదనానుసంతప్తయై తన స్థలమునకు నాయకుని వచ్చునట్లు చేయునదిగాని, తనే నాయకుని స్థలమునకు బోవుచున్నది గాని, అభిసారిక.

దర్వు: ముఖారి - ఆది.

"ఎందు బోతివి? ఎందు బోతివి? రారా నందనందనా!" అనుచు సత్య మదన సంతప్తయై నాయకుని వెదకుచు నాతని స్థలమునకు బోవుచు అభిసారిక యైనది. ఈ విధముగ సత్యభామ అనేక విప్రలంభ శృంగార నాయిక వాలకాలు వేసినది.

ఇక దశావస్థలైన చక్షుఃప్రీతి, చింత ఇత్యాది పది అవస్థలను పొందినది. అంతే కాదు సంచారి భావములైన నిర్వేదము, గ్లాని, అసూయ, మదము, అపకృష్టము, మోహము, స్మృతి, చపలత, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, ఇత్యాదులను అనుభవించినది.

నిర్వేదము:

తత్త్వజ్ఞానము, పేదరికము, సంకటము, వియోగము, దుఃఖము మొదలైన వానిచే కలుగు ఫలాభావమతి నిర్వేదము అనబడును. ఉ:- "నీవే అందగత్తెవా? లేక నేనే అందగాడనా!" అని కృష్ణుడు సత్య నడుగగా ఆడబుద్ధి అపరబుద్ధి గనుక నేనే అందగత్తె ననగా, స్వామి అలిగి దిగ్గున లేచిపోవును. నాయకుని వియోగముచే నాయికకు నిర్వేదము ప్రాప్తించినది.

భామాకలాపం - సంగీతం:

ఇక భామాకలాపమున నాట, మోహన, సౌరాష్ట్ర, ఆరభి, ఆనందభైరవి, ముఖారి, ఖమాస్, శంకరాభరణము, మధ్యమావతి, తోడి, కాంభోజి, భైరవి, పంతువరాళి, హంసధ్వని, కేదారము, దేవగాంధారి, ఇత్యాది సుప్రసిద్ధ, కర్ణాటక రాగము లువయుక్తములైనవి.

భామాకలాపము దృశ్యప్రబంధమగుటచే భావము ప్రౌఢమైనను ఉపయుక్తమైన భాష చక్కని సరళశైలియందున్నది. కొన్ని తావులందు ప్రౌఢముగ నుగలదు. సత్యభామ మాధవిచే శ్రీకృష్ణునికి వ్రాసి పంపిన లేఖ యిట్లుండును -

"శ్రీమద్రత్నాకరపుత్రిక ముఖారవింద మరందపాన వినివేశిత మిళిందాయమాన నందనందన ముచికుంద వరద మందరోద్ధర పరిహసిత రాకాసుధాకర సుందర వదనార విందులగు శ్రీ రాజగోపాల స్వామివారి చరణారవిందంబులకు సత్యభామ నిటలతట ఘటిత కరకమలయై అనేక సాష్టాంగ దండప్రణామంబు లాచరించి చేయంగల విన్నపములు. "సుజ్జనకుండగు సత్రాజిత్తు నన్ను మీకిచ్చి వివాహం బొనరించిన ప్రభృతి వజ్ర, వైడూర్య, నీల, గోమేధిక, పుష్యరాగ స్థగిత పద్మరాగ, మరకత సకల వికల్పిత నానావిధ చిత్ర విచిత్ర, జాంబూనద రత్న నిర్మితంబగు హంసతూలికాతల్పంబున దివ్యమంగళ విగ్రహాకారులై గాఢాలింగనం బొనర్చి...." ఈ విధముగ ప్రౌఢాతిప్రౌఢముగ సాగింది. ప్రౌఢయైనసత్య లేఖ గదా!

ఇట్లు భామాకలాపంలో భరతశాస్త్రం ఎక్కడ చూస్తే అక్కడ దర్శన మిస్తుంది. కాబట్టే అది పడగట్టిన అలంకార భరత శాస్త్రంగా కన్పట్టుతుంది. రసరాజమగు శృంగార సురుచిరత్వంలో అలంకారశాస్త్ర మర్యాదలతో సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దుపూనికలో సిద్ధేంద్రయోగి సిద్ధసంకల్పుడైనట్లు భామాకలాపం ఋజువు చేస్తుంది.

సిద్ధేంద్రయోగి తన భామకే శుభ ముహూర్తాన రూపుసంతరింపచేసి, కాలికి గజ్జె కట్టనోగాని ఆ చరణకింకిణులు నాటి నుండి నేటివరకు సద్యోహృద్యమై సహృదయ నైవేద్యమై పండిత పామర జన రంజకమై అటు కోటలోనివారిని, ఇటు పేట లోనివారిని చైతన్య చకచ్చకితుల నొనర్చుచూ సామాజిక హృదయారవిందాలకు విందొనగూర్చుచునేయున్నవి.

మన ప్రాచీన వేదశాస్త్ర పురాణేతిహాస ములలో ఎక్కడ "హిందూ" అనే పదానికి సరియైన అర్థం లభించనప్పటికి, మన చరిత్రవల్ల మాత్రం, సింధు నదీ ప్రాంత ములో నివసించడమే గాకుండ, 'సింధూ' నాగరికతను అలవరచుకోవడం వల్ల వారి నందరిని 'హిందువులు' అని పిలిచినారని తెలుస్తున్నది. కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు, ఆసేతుహిమాచలం వ్యాపించిన సువిశాలమైన మన భారతదేశంలో వివిధ కులములు, వివిధ మతములు ఉన్నాయి. అయితే ప్రధానంగా దేశంలో హిందూ, ముస్లిం, క్రైస్తవ మతములు మాత్రమే ప్రజలచే ఆదరింపబడుచున్నవి.

దేశీయ విదేశీయ అభిమానముతో ఇతర మతములు ప్రబలవ్యాప్తి చెందు చేయడమే గాకుండ, వాల్ పోస్టర్లు, స్టిక్కర్లు మొదలగు వివిధ ప్రచార సాధనముల ద్వారా హిందూ మత వ్యాప్తికి అవిరళ కృషి చేస్తోంది. ప్రాచీన పండితులచే వివిధ ప్రాంతములలో ఉపన్యాసములు ఇప్పించడం ద్వారా, చర్చా వేదికలు, సభలు, సమావేశములు నిర్వహించడం ద్వారా మన ప్రాచీన హిందూమత వైశిష్ట్యాన్ని ప్రజలకు తెలుపుతూంది. "శ్రీ వేంకటేశ్వర భజన సంఘం" మొదలగు సంఘములను స్థాపించి ప్రజలకు టి. టి. డి. ప్రచార సామగ్రిని, కావలసిన సాహిత్యాన్ని అందిస్తూ హిందూ మత వ్యాప్తికి ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నది.

హిందూ ధర్మరక్షణకు మరియు ప్రచారమునకు విశేషంగా కృషిచేస్తున్న శ్రీ శంక ప్రజలు ముఖ్యంగా హరిజనులు ఏ ప్రలోభములకు లొంగి ఇతర మతములను స్వీకరించకుండా సకల చర్యలు తీసుకొని, అనేక విశిష్టకార్యక్రమాలు నిర్వహించింది. ఈ విధంగా "హిందూమత" రక్షణలో టి. టి. డి. ఒక ప్రముఖ పాత్రవహించింది.

'కృష్ణా' నది పుష్కరముల సమయంలో విజయవాడ లోను, 'గోదావరి' నది పుష్కరముల సమయంలో రాజమండ్రి లోను "హిందూమత ప్రచారం-రక్షణ" అనే పేరుతో ఒక ప్రత్యేక ప్రదర్శనశాలను, సమాచార కేంద్రాన్ని నిర్వహించింది. దీనివల్ల అసంఖ్యాక ప్రజలకు తమ "హిందూమతం" గురించి తెలుసుకొనే అవకాశం లభించింది. ప్రజలందరికీ అందు

## తిరుమల తిరుపతి దేవస్థానములు

# హిందూ ధర్మ రక్షణ



శ్రీ పి. యాదగిరి
దేవస్థాన బోర్డు సభ్యులు.

తుండగా, ప్రజలచే ఆదరింపబడుచుండగా 'హిందూ' మతం మాత్రం ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అన్నట్టుగా ఉంది. అటువంటి పరిస్థితిలో హిందూమత ప్రచారానికి, హిందూమత రక్షణకు సకలచర్యలు తీసుకోవాలని తిరుమల-తిరుపతి దేవస్థానములు నిర్ణయించడమే గాకుండ 'హిందూ ధర్మ రక్షణ సంస్థ' అనే ప్రత్యేక సంస్థను ప్రారంభించింది.

దేశములోని గ్రామీణ-పట్టణ ప్రాంతములలో టి. టి. డి. కి అనుబంధంగా "హిందూ ధర్మ రక్షణ సంస్థ" శాఖలను ప్రారంభించి హిందూ ధర్మం ప్రచారం చేయాలని, హిందూ ధర్మాన్ని రక్షించుకోవాలని, అందుకు ఉత్సాహవంతులైన ప్రజలను ముందుకువచ్చి సంస్థను స్థాపించమని టి.టి.డి. కోరింది. టి.టి.డి.మాసపత్రిక 'సప్తగిరి' ద్వారా హిందూమత ప్రచారాన్ని రాచార్య (శృంగేరిపీఠం, కంచికామకోటి పీఠం, పూరీపీఠం, కాశీపీఠం) గారలకు తమ పూర్తి సహకారాన్ని అందించడమే గాకుండ, 'హిందూమతం' గురించి వారి సలహాలను, అభిప్రాయాలనుకూడ టి. టి.డి. తెలుసుకుంటున్నది. తమిళనాడు - కేరళ రాష్ట్రములలోని కొన్ని ప్రాంతముల ప్రజలు ముఖ్యంగా హరిజనులు ప్రలోభమునకు లొంగిగాని, బలవంతముగా గాని ఇతర మతం స్వీకరిస్తుండగ, తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ప్రాంతములకు సుశిక్షితులైన కొందరు కార్యకర్తలను పంపించి, అక్కడ ఒక శిబిరాన్ని నిర్వహించింది.

అక్కడి ప్రజలకు హిందూమతం-దాని గొప్పతనం గురించి సినిమాలద్వారా, ఛాయాచిత్రముల, స్లైడ్స్ ద్వారా చూపించడమే గాకుండ సభలు, సమావేశములు నిర్వహించింది. హిందూమతస్థులైన బాటులో ఉండే విధంగా సరసమైన ధరలలో, సరళమైన భాషలో ఎన్నో పుస్తకములను టి. టి. డి. విడుదల చేస్తున్నది.

"పుష్కరం అంటే ఏమిటి?" 'భగవద్గీత ఉపయోగాలు,' మొదలగు గ్రంథములనే గాకుండ దేవుడి పూజ చేసుకునే పూజావిధానం గల పుస్తకములను ప్రజలకు అందించడమే గాకుండ, భాగవతం, భారతం, రామాయణం లాంటి ప్రసిద్ధ గ్రంథాలను తెలుగు లోనికి అనువదించి, వచనరూపంలో స్వల్ప వెలతో అందిస్తున్నది. 'బాలభారతి' పేరుతో పిల్లలకు ఉపయోగపడే పుస్తకములను కూడ అందిస్తున్నది.

వేసవిలో ఉపాధ్యాయులకు ప్రత్యేకంగా హిందూధర్మ రక్షణ - ప్రచార విషయంలో శిక్షణ ఇవ్వడం ద్వారా టి. టి. డి. తన లక్ష్యాన్ని సాధించుకున్నప్పటికీ ఇతర మతముల ప్రచారముతో పోల్చిచూచినప్పుడు మాత్రం టి. టి. డి. హిందూ ధర్మ రక్షణ ప్రచారవిషయములో చేయవలసింది ఇంకా

ఎంతో ఉంది అనిపిస్తుంది. అందుకు టి. టి. డి. ఈ క్రింద పేర్కొన్న విధంగా కృషిచేయాలని భావిస్తున్నాను.

1. గ్రామీణ- పట్టణప్రాంత ప్రజలందరికి "హిందూమతం" గురించి, దానిగొప్పతనాన్ని గురించి తెలిపే పుస్తకములను ఉచితంగా పంపిణీచేయాలి.

2. ఇతర మతములలోని కొందరు 'హిందూ' మతం స్వీకరించి, హిందూమత వ్యాప్తికి కృషిచేశారు. వారి చరిత్రలను ప్రజలందరికి తెలియబరచాలి.

3. ప్రాణాయామం చేయడంవల్ల కలిగే లాభములను, ఏకాగ్రతతో కొద్ది సమయం చేసుకునే జపం- పూజాదులవల్ల కలిగే ప్రయోజనములు ఫోటోలద్వారా, స్లైడ్స్ ద్వారా, వీడియోలద్వారా తెలియపరచాలి.

4. మన ప్రాచీనులు ఈ నియమాలు కట్టుబాట్లు ఎందుకు చేయమని చెప్పారు? వాటివల్ల మనం ఏం పొందగలుగుతున్నామో తెలపాలి.

5. అమెరికా మొదలగు దేశములలోని ప్రజలు "హిందూ" మతం స్వీకరించి, "హరే రామ హరే కృష్ణ" అనే భజన సంఘములు స్థాపించి, "హిందూ" మత ప్రచారం కొరకు చేస్తున్న కృషిని, మన దేశప్రజల్లో చైతన్యం కలిగించేలా సినిమాలా చూపించాలి.

6. "ధర్మాన్ని కాపాడండి- అది మిమ్మల్ని కాపాడుతుంది", "ఓం" అను ఈ స్టిక్కర్లను ప్రజలందరికి ఉచితంగా అందించే ఏర్పాట్లుచేసి. హిందూమత- ప్రచారానికి, రక్షణకు బలమైన పునాదులు వేసుకోవాలి.

7. అన్ని ప్రాంతములలో కార్యక్రమములను నిర్వహించడానికిగాను టి. టి. డి. 'హిందూ ధర్మరక్షణ సంస్థలో' సుశిక్షితులైన కార్యకర్తలను నియమించాలి.

8. హిందూధర్మరక్షణ సంస్థ, అనుబంధ సంస్థలకు స్వయంగా కొన్ని కార్యక్రమాలు నిర్వహించేందుకుగాను, టి. టి. డి. కొంత డబ్బు గ్రాంటుగా అందించి, 'హిందూ లైబ్రరీ' నిర్వహణకు కావలసిన పుస్తకములను ఉచితంగా అందించాలి. ఆనాడు టి. టి. డి. కృషి సఫలమవుతుందని చెప్పవచ్చు. *

# మహాపురుషుల మాతృభక్తి

తల్లి ఋణాన్ని తీర్చుకోడానికి యీ ప్రపంచంలో ఎవరికి సాధ్యమవుతుంది? తండ్రికి కోపంవస్తే కొట్టడానికి తయారవుతాడు. కాని తల్లిమాత్రం యశోదామూర్తి. ఎవరెన్ని చాడీలు చెప్పినా ఆమె నమ్మదు. మనలను కొట్టదు: తిట్టదు. ఇరుగింటి, పొరుగింటి అమ్మలు ఎన్ని చెప్పినా, మనం ఆమె వెనకాల వెళ్ళి దాక్కుంటే ఆమె వారి మాటలను చెవిని బెట్టదు. ఒకసారి ఆమె ఒడిలో చేరి కంటతడి బెడితే, మనమీద యితరులు చెప్పిన నేరాలన్నీ సహించి వూరుకుంటుంది. మాతృప్రేమ అగాధం; నిర్వ్యాజం. ఫీజు లేకుండా పనిచేసే ప్లీడరు లాగా ఆమె మనసమస్యలన్నిటిని పరిష్కరిస్తుంది. ఆమె ఎదుట మనం ఎప్పుడూ నిర్దోషులమే. అమాయకపు పిల్లలమే. ఆమె నిస్స్వార్థసేవ మన జన్మకు ముందే ప్రారంభమై మన జీవిత పర్యంతం అలాగే నిలిచి వుంటుంది.

ఈ కారణంవల్లనే ఆదిశంకరులలాంటి విరక్త సన్యాసి, అలెగ్జాండరు లాంటి ప్రముఖ సేనాని, నెపోలియన్ లాంటి యుద్ధవీరుడు, గాంధీలాంటి కర్మయోగి తమజీవిత పర్యంతం తమమాతృమూర్తులకు అంజలిఘటిస్తూ వచ్చారు.

ఆదిశంకరులు అద్వైత వేదాంతి, విరాగి, సన్యాసి. తల్లి అంతిమ గడియల్లో ఆయన ఉత్తరభారతంలోని బదరికాశ్రమంలో తపోనిష్ఠలో ఉండిపోయారు. తల్లికి అంతిమ గడియలు సమీపించాయని తెలియగానే, ఆకాశగమనంతో ఆయన తల్లి చెంతకు చేరాడు. చివరిఘడియల్లో ఆమెకు సపర్యలు చేసి శాంతిని ప్రసాదించి, మరణానంతరం ఆమెకు స్వయంగా దహన సంస్కారాదులు కూడా జరిపాడు. సన్యాసి అయివుండికూడా ఆశ్రమవిధులు కొంతకాలం పాటించక ఆయన తల్లికి నచ్చచెపాడు. ఒకసారి జబ్బుచేసి స్నానం చేయడానికి ఆమె నదికి వెళ్ళలేకపోయింది. శంకరులు ఆమెను ఓదార్చి యిలా పలికాడు — 'తల్లీ! ఎందుకు చింతిస్తావు? నది దగ్గరకు నీవు స్నానానికి వెళ్ళలేకపోతే నదినే యింటిదగ్గరకు రప్పిస్తాను'. వెంటనే నది దగ్గర నుండి యింటివరకు కాలువత్రవ్వి, ఆయన మాతృమూర్తికి సేవ చేశాడు.



ఆదిశంకరులకు బాల్యంలోనే సన్యాసం తీసుకుందామనే కోరిక కలిగిందికాని తల్లి వెంటనే అంగీకరించలేదు. శంకరులు నిరాశ చెందారు. నదిలో స్నానంచేస్తుంటే మొసలి ఆయన్ను పట్టుకొని నీటిలోకి లాక్కొని వెళ్ళింది. దాని పట్టు విడిపించుకోటానికి




శంకరునికి సాధ్యం కాలేదు. తల్లి బిగ్గరగా విలపిస్తూ, గుండెలు బాదుకుంటూ నదీతీరానికి చేరింది. తల్లీ! నేను సన్యాసం తీసుకోడానికి నీవు అనుమతిస్తే, నాకు యీ మొసలి బాధ తప్పుతుంది అని శంకరులు బిగ్గరగా అరవసాగాడు. తల్లికి ఏమీ ఉపాయం తోచలేదు. వెంటనే తల్లి అలాగే అని అనుమతిచ్చింది. మొసలి శంకరుణ్ణి వదలి వెళ్ళిపోయింది. మాతృభక్తి పరాయణుడయిన శంకరుడు తల్లికి అభయమిచ్చి వెళ్ళాడు. నీ అంతిమ ఘడియల్లో నన్ను స్మరించగానే, నేనువచ్చి నీకు సేవచేసి నీకు దహన సంస్కారాది ఉత్తరక్రియలు జరిపి వెళ్తాను అని వాగ్దానం చేసి వెళ్ళాడు. ఆ ప్రకారం ఆదిశంకరులు తన ప్రతిజ్ఞ నెరవేర్చి మాతృఋణాన్ని తీర్చుకున్నాడు.

గాంధీజీ కూడా ఉత్తమ శ్రేణికి చెందిన మాతృభక్తుడు. విదేశాలకు వెళ్ళేటపుడు ఆయన తల్లికి యిలా వాగ్దానం చేసి వెళ్లాడు.

'నేను విదేశాల్లో మాంసాన్ని ముట్టను; మదిర సేవించను.' కాని లండను చేరిన తర్వాత అక్కడి వాతావరణానికి తన ప్రతిజ్ఞనెర వేర్చు కోవడం చాలా కష్టమని ఆయనకు తోచింది. ఆ మహానగరంలో శాకాహార భోజ నాలయాల కోసం వెదకడం ఉప్పునీటి సముద్రంలో మంచినీటి కోసం వెదకడమే ననిపించింది. కాని తల్లికి యిచ్చిన వాగ్దా నం ఎలాగయినా నిలుపుకోవాలి.

శరీరం గడ్డకట్టుకపోయే చలిని కూడా భరించి, మాంసం తినకుండా మత్తు పానీయాలు సేవించకుండా తల్లి కట్టి యిచ్చిన పిండి, పేలాలు, కూరగాయల తోనే ఆయన కాలం గడిపాడు. శాకాహారం కోసం ఆయన రాత్రింబగళ్లు లండను నగర మంతా తిరిగేవాడు. ఎంతో శ్రమించిన తర్వాత, ఆయనకు ఒక చిన్న హోటలు కనబడింది. మునిగే నౌకకు గడ్డి పరకచిక్కి నట్లయింది. కాని మద్యనిషేధం మరొక కఠిన సమస్యగా తయారైంది. ఇంగ్లండు లాంటి చలిదేశంలో ఎప్పుడూ చలిగాలులు వీస్తుంటాయి. నీరు కూడ గడ్డ కడుతూ వుంటుంది. చల్లనీరు వంటిమీద పడగానే శరీరం కొయ్యబారిపోతుంది. ఆ పరిస్థితుల్లో తాగడం ఆరోగ్యానికి మంచిదని, దానివల్ల శరీరం వెచ్చగా ఉండి, చలిబాధ తట్టుకో వచ్చునని మిత్రులు చాలామంది సలహా యిస్తుండేవారు. కాని ఆయన దృష్టిలో తల్లికి యిచ్చిన వాగ్దానాన్ని త్రోసిపుచ్చి మాంసభక్షణం మదిరాసేవనం చేయడమంటే మృత్యువును కొనితెచ్చుకోవడమే. అప్పటికి గాంధీజీ యువకుడే. ఒకటి రెండు సారులు తప్పటడుగులు వేయబోయాడు కూడా. కాని వెంటనే తల్లికి తాను చేసిన వాగ్దానం తల పునకు రాగానే వాటివంక కన్నెత్తి కూడా చూడలేదు. ఎన్ని కష్టాలు ఎదుర్కోవలసి వచ్చినా ఆయన తల్లిమాట జవదాటలేదు.

అలెగ్జాండరు ఇతరుల దృష్టిలో కఠోర సైనికుడుగా, చండశాస నుడుగా కనబడినా తల్లిదగ్గర మెత్తబడి మైనంలా కరిగిపోయే వాడు. విదేశాలపై దండయాత్రలకు వెళ్ళే ముందు ఆయన తన రాజ్య మయిన మెసి డోనియాను విశ్వాస పాత్రుడయిన సేనా నికి అప్పగించి వెళ్ళాడు. కాని అలెగ్జాండరు తల్లి ప్రతివిషయంలోనూ తల దూర్చేది. పాలన సాఫీగా సాగనీయకుండా సేనానికి ఎన్నో చిక్కులు కల్పిస్తూ వచ్చింది. వీటికి తట్టుకోలేక ఆ సేనాని అలెగ్జాండరుకు రోజు కొక ఉత్తరం వ్రాస్తుండేవాడు. ఆ ఉత్తరా లను చదువుకొని అలెగ్జాండరు నవ్వుకొనే వాడు. సేనానికి యిలాజవాబు వ్రాసేవాడు.

మిత్రమా! బహుశా నీకు తెలియదేమో? నా మాతృమూర్తి రాల్చే ఒక్క కన్నీటి బిందువే నిందాపూరిత మయిన నీ ఉత్త రాల కట్టనంతా తడిపి వేస్తున్నది.'

ప్రపంచవీరుడు నెపోలియన్ కూడా తల్లినిఎక్కువగా ప్రేమించి గౌరవించేవాడు. యుద్ధతంత్రంలో మునిగి, రాత్రింబగళ్లు ప్రపంచ విజయంకోసం భీకర పోరాటాలు సాగిస్తున్నా వృద్ధురాలయిన తన మాతృ మూర్తి ఆరోగ్యాన్ని గురించి ఆయనబాధ పడేవాడు. ఆరోగ్యం క్షీణించి విషమ ఘడి యల్లో ఉన్న తరుణంలో ఆయన తల్లికి యిలా ఉత్తరం వ్రాశాడు - 'ప్రియమైన మాతృమూర్తీ! నీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకో. నీకు మరణించడం తటస్థిస్తే నన్ను శాసించేవారు ఎవరూ ఉండరు.' నెపోలియన్ దండయాత్రల్లో యూరపు ఖండమంతా భయభ్రాంత మయింది. ఆయన్ను శాసించాలంటే ఆయన తల్లికి ఒక్కర్తికే అధికారముండేది. 'నేనుగా ఉన్నది, ఉంటున్నది నా మాతృమూర్తి చలవవల్లనే' అని నెపోలియన్ తరచు చెబుతుండేవాడు —

మాతృభక్తికి సంబంధించిన యిలాంటి ఉదాహరణలు ఎన్నో మనకు గోచరిస్తాయి. భగవాన్ రమణమహర్షి తనతల్లి అళగమ్మా ళ్‌కు మోక్షం ప్రసాదించిన ఉదంతం మనకు ఆయన జీవిత చరిత్రలో గోచరిస్తుంది. ఛత్రపతి శివాజీకూడా తనను మాతృమూర్తి ప్రసాదించిన వరంగా భావించుకొనేవాడు. ఆయన దృష్టిలో తల్లి అంటే భవానీ స్వరూ పమే. జహంగీరు తన తల్లి జోధ్‌బాయి శవం చితిపై కాలిపోతుంటే ఆ దృశ్యాన్ని చూచి సహించలేక దుఃఖాన్ని భరించలేక అందులో దూకి చావడానికి ఉద్యుక్తుడై నాడు. తల్లి తన్ను బాల్యంలో విసర్జించినదని ఎంత కోపమున్నా మాతృభక్తి పరాయణు డయిన కర్ణుడు — ఒక్క అర్జునుని తప్ప మిగతా పాండవులు తనచేతికి చిక్కినా చంపనని — తల్లి కుంతికి అభయమిచ్చి, వాగ్దానం నిలుపుకొన్నాడు. అధార్మికుడు విశ్వాసఘాతుకుడు అనే నిందలకు గురికాగల ననే భయంతో ఆయన మాతృవచనాలను సైతం లెక్కజేయక కౌరవపక్షంలోనే ఉండి పోయాడు.తల్లి, తనయుల సమాగమాన్ని, అప్పటి కర్ణుని మనోవేదనను ఎంతో హృద్యంగా, కరుణాభరితంగా మహాకవి దినకర్ హిందీ సాహిత్యంలో యిలా వర్ణిం చాడు —

హోచుకా ధర్మకే ఊపర్‌న్యోఛావర్ హూఁ।
మై చఢా హూఁ నైవేద్య దేవతాపరహూఁ॥
ఇన్‌సేవడలూహూఁపాఁవ్‌జననీ!హఠ త్యాగో।
హోకర్ కఠోర్ ముఝుసే, ముఝుకో మత్
మాంగో॥

'తల్లీ! నేను ధర్మానికి కట్టుబడిపోయాను. దేవతలకు సమర్పించబడే నైవేద్యాన్ని నేను. అంచేత నీ పాదాలకు ప్రణమిల్లి నిన్ను అర్థిస్తున్నాను. నీ పంతాన్ని వదు లుకో. కఠినాత్మురాలవై యీ తరుణంలో పాండవపక్షంలో చేరమని నీవు నన్ను కోర వద్దు.

ఈ మహాపురుషుల మాతృభక్తి వీరి జీవి తాల్లో సంపాదించిన ఎంతో విలువయిన సంపద. ఈ సంపదవల్లనే వీరు ఎంతో భక్తి సంపాదించారు. మాతృభక్తి మహిమ అనంతం; వర్ణనాతీతం.

— డా॥ యల్లంరాజు
చెంచు సుబ్బారావు



## ప్రియం వేంకటేశం

[ప్రా ప్తిస్థానము: మానవతా ఆర్ట్స్, మనోజ్ఞాఫిల్మ్స్.
17-1-207/22 Istfloor I.S sadan Complex,
సంతోషనగర్, హైదరాబాద్ – 500659.

వెల : రూ. 30 లు (స్థానికపన్నులతో సహా)]

సంగీత చరిత్ర ప్రారంభమైన నాటి నుండీ తెలిసిన విషయం భారతదేశంలో దైవతాన్ని ఆశ్రయించని సంగీతమూ, సంగీతబద్ధ సాహిత్యమూ అతిస్వల్పం.

తెలుగుభాషకు దివ్యపదమును సమర్పించి ఆ భాషకే ఒక భవ్యపదమును కల్పించి, పదకవితా పితామహుడనిపించుకొని, రాశిలో వాసిలో ఆద్యుడూ, అద్వితీయుడూ అయిన అన్నమయ్య అన్ని వేల పాటలలోనూ రాగతాళాలు కృష్ణుడూ, వేంకటేశుడు; స్వరభావాలు దైవచింతన, సద్ధర్మ బోధన.

ఆ తరువాతి వారందరూ, మల్లాదినుంచి మామూలు రచయిత వరకూ, ఆ ఒరవడిలో నడచినవారే.

ఈ కలియుగంలో కలియుగ దైవమని పేరుగాంచిన వేంకటేశ్వరుడిని సంగీత, నృత్య, చైత్ర కళలాశ్రయించడం సమంజసమే.

"ప్రియం వేంకటేశం" ఒక చిత్రమో కాదో తెలియదుకాని ఆ పేరిట విడుదలైన కేసెట్‌లో భక్తిభావ బంధురమైన మధుర సంగీతమే కలియుగ కల్యాణకారునికల్యాణ కథ చెప్పుతూ గంటసేపు సాగుతుంది. కథనం మహర్షులయాగంతో ప్రారంభమై పద్మావతీ పరిణయంతో, మంగళాశాసనంతో ముగుస్తుంది.

దీనికి కారకులు రచయిత ఎం. ఆర్. రాజాజీ. సంగీతకర్త డా॥ భరద్వాజ. గాత్రదాతలు స్వయంప్రభ, సుధాభరద్వాజ, గోపి, షహీద్‌బాబు, అమరేంద్ర.

కేసెట్ యిన్‌లే కార్డూ, కేసెట్‌పై అతికించిన లేబిల్ ముక్కలూ కళాభాస్కర్ చక్కగా రూపొందించారనే చెప్పాలి, పద్మావతి దోసిట ముత్యాల తలంబ్రాలు మునివ్రేళ్ళ మీదుగా జారక వెనుకకు రాలుతున్నట్లున్నా!

## రాగల పాలి



నిశిత పరిక్షకు సంగీత సాహిత్యాలెలా నిలుస్తున్నవీ అంటే ఒక మాటలో చెప్పడం కష్టం. 'వైకుంఠవాసుడే' అన్న పాట వలజి రాగంలో,'అంతవిభుని' అన్నది శహనలో, పద్మావతీ వనవిహారగీతం అమీర్కల్యాణిలో ఆహ్లాదకరంగా వున్నా మరికొన్ని పట్టుల పరసలలో సందర్భశుద్ధి లేదు. ముఖ్యంగా 'నీకు భూలోకంలో పూజలుండవుగాక' అని బ్రహ్మ శపించబడి నపుడూ, వల్మీకముపై నిత్యం క్షీరాన్ని వర్షిస్తూ వచ్చిన గోవు గొడ్డలితో కొట్టబడినపుడూ పాటా,పాడటమూ హాయిగా వుండటం అనుచితం.

రచనలో కొత్త రంగులకన్న పాత హంగులే పర్వాలేదనిపిస్తాయి. 'కనుపించునదే సప్తశైలములు, వినిపించునదే వేదగానములు' అన్న చోట 'కనిపించునవే, వినిపించునవే' అని బహువచనానికి తగినట్లు వుంటే మరికొంత అందగించేది.

పాడిన వారు చక్కగా పాడిన మాట నిజం. కాని బృందగానంగా సాగిన కొన్ని చోట్ల కొంతస్పష్టత లోపించడమూ నిజమే. ఇది వినా రికార్డింగ్ బాగానే వుంది. వాద్య గోష్ఠి అమరికలో యెదురుచూడని కుదుపులు లేక సాఫీగా సాధారణంగా వుంది. కేసెట్ సాంకేతిక పటిష్ఠత అంతంతమాత్రం.

మంచిప్రయత్నం. గంటసేపు సత్కాలక్షేపం. ఈ కల్యాణసాహిత్యం చిన్ని పొత్తముగా వెలువరచి యీ కేసెట్‌తోపాటు యిస్తే యింకొంచెం వుపయోగం! అంతా కలిసికట్టుగా ఎల్. పి. రికార్డుగా వస్తే భద్రయోగం!!

—శ్రీ వే. ఆ కృ. రంగారావు

## శ్రీమామిళ్ళపల్లి నృసింహ సుప్రభాతమ్

[ స్తోత్ర- మంగళశాసన- ప్రపత్తిసహితమ్)
రచయిత: అభినవ కాళిదాస బిరుదాంకితః
తెల్కపల్లి రామచంద్రశాస్త్రి
వెల రు. 2-59
ప్రకాశకు:— దేవస్థానం ధర్మకర్తృమండలి.
మామిళ్లపల్లి (తెల్కపల్లి-509365)]

సంస్కృతము మృతభాషయని, ఈ మధ్యకాలమున కొందరు సారహీనవాదములు చేయుచున్నను, ఎడనెడ కొందరు పండితకవులు గీర్వాణభాషలో గ్రంథములు విరచించి, వీతద్వాఙ్మయమును పెంపొందించుచు, దాని కజరామరత్వమును కలిగించుచునేయున్నారు. ఆ కోవలో సంస్కృత భాషలో కమనీయముగా, భక్తిరసస్ఫోరకముగా గానముచేయబడిన స్తోత్రరత్నమే "శ్రీమామిళ్ళపల్లి నృసింహసుప్రభాతమ్."

శ్రీశాస్త్రిగారి శ్లోకరచన గంగాప్రవాహ సదృశము. శైలీవిన్యాసమున వీరి బిరుద మన్వర్థమే.

"ఓంకార భర్మమయమందిర రత్నదీపః
వేదాంతవారినిధి మధ్యకృతావగాహః
విష్వాగమోక్తవిధి సంచిత నిత్యపూజః
మామిళ్లపల్లి నృహరేః తవ సుప్రభాతమ్॥"

వీరి శ్లోకరచనా సారళ్యమున కీ శ్లోకము ఉదహరింపబడినది. గ్రంథములోని ప్రతి శ్లోకమును, ఇంత మృదుపద శోభితముగనే సాగినది.

ఆదికావ్యమగు రామాయణము నందే ఈ సుప్రభాత స్తోత్రరచనకు బీజము నాటబడినది. రాము డవతారమూర్తి. యజ్ఞసంరక్షణార్థమై కౌశికుడు, తనవెంట రాముని కొని పోవుచున్నాడు. మార్గమధ్యమున నొకరేయి శయనించిరి. వెలుగురేకలు తొంగిచూచినవి. రాముని ప్రబోధించుటకై విశ్వామిత్రుడు

"కౌసల్యాసుప్రజారామ
పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల
కర్తవ్యం దైవమాహ్నికమ్॥

అని పఠించెను. తదుపరి సుప్రభాతములు కన్నిటికి, ఈ శ్లోకమే యొరవడియైనది. రాముడు నరశార్దూలుడు- ఈయన నరకేసరి- అభిన్నత్వమే యిందు ప్రతిపాదితము.

భగవంతుడు నిద్రించునా? మానవునకువలె దైవమునకు క్షుత్తృడాశా నిద్రాది దేహలక్షణములున్నవా? మనము లేవకపోయినచో మేల్కనలేనివాడు దైవమెట్లగును? సుప్రభాతము పేరిట పడకటింటి శృంగారమునకు రెక్కలదుకుచున్నారను విమర్శలు ఒకవంక ఎక్కువగా ఉద్భవించుచున్నను, మరొకవంక తామరతంపరగా భక్తిరస పూరిత సుప్రభాత స్తోత్రము లభివృద్ధి చెందుచునేయున్నవి. భక్తిరసమొక జీవనది. దాని నాపగలవాడు లేడను సత్యమెంత తొందరగా నర్థము చేసికొన్నచో, పైజెప్పిన వ్యర్థవాదుల కంత మంచిది.

## గ్రంథసమీక్ష

ఒకవేళ పశుపక్ష్యాదులు దైవమును పూజింపవలసివచ్చినచో తమ, తమ రూపములనే దైవమున కాపాదించునను మహనీయుల సూక్తిని స్మరింపుడు. మానవుడు తన లక్షణములలో శ్రేష్ఠమైన వానిని దైవమున కాపాదించి అర్చించుట సహజము. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది ఉపనిషద్వాక్యాను సారము సత్యస్వరూపము- జ్ఞానస్వరూపమే దైవము. అట్టిదైవమునకు మనుజు లొసంగిన ఆకృతులే దేవాలయము లందలి అర్చామూర్తులు. కావున ఆ మూర్తులకడ ఆలపించు సుప్రభాతాదులు మానవజాతికే మేలుకొలుపులు. ఇవియే నిద్రాణమైన జాతిని చైతన్యవంతముగా చేయునవి. ఇవి మన సంస్కృతి- సంప్రదాయములను వేనోళ్ళప్రకటించును. ఇవి మన ఆధ్యాత్మిక తత్త్వప్రతీకలు.

శ్రీశాస్త్రిగారు అల్పాక్షరములలో అనల్పార్థ రచన కావింపగలదక్షులు.

"శ్రీశంకరాద్య గురువర్యచితాగ్నిలిప్త
వర్ష్మామృతాయిత త్వదీయ నుతి ప్రతుష్ట"

అను రెండు పాదములలో, శంకరాచార్యుల వారు, "లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం" అను మకుటముతో స్తోత్రరచన కావించుటకుగల హేతువు (తత్కథ) నెల్ల సూచ్యము గావించినారు.

"శ్రీవర్ధమాన పురపాలన చోళభీమ
గోకర్ణభూపతి కృతావిరతార్చః విష్ణో॥
"శ్రీమన్విభో సురభివంశజ సర్పరాయ
భూపప్రదత్తధరణీఫల లబ్ధభోగ"

అను శ్లోకములలో శ్రీమామిళ్ళపల్లినృసింహస్వామి దేవాలయముతో సంబంధముగల రాజుల విశేషములను సూచించి, చారిత్రకాంశములకు సుప్రభాతమునప్రాధాన్యము నొసంగుట స్తవనీయము.

ప్రపత్తియందు వీరు కావించిన దశావతార వర్ణనము, ప్రబంధ ధోరణిని తలపించుచున్నది.

వీరు శ్రీ దక్షిణామూర్తిదేవదివ్యకరుణా కటాక్షసంజాత సరసకవితావిలాసులు. అట్టివారు—

"ఆపన్నిమగ్న జగతః పరిరక్షణాయ
త్వామేవయాన్తి శరణం విధిశంకరాద్యాః"

అని రచించుట, వీరికిగల అద్వైతసిద్ధిని పట్టియిచ్చుచున్నది.

"దుష్టేషు పావక శిఖాయిత దృష్టిపాతం
శిష్టేషు చందనరసాయిత సత్కటాక్షం"

నెరపు శ్రీ నృసింహు డీ కవిగారిపై చల్లని కరుణాకటాక్షములను ప్రసరించి, వీరి కలము నుండి, ఇకముం దుత్తమ సంస్కృత సాహిత్యగ్రంథములు వెలువరింపజేయుగాక.

— మొవ్వ వృషాద్రిపతి

## కూచిపూడి భాగవతులు.

[రచయిత:- 'విద్వాన్ చింతలపాటి లక్ష్మీనరసింహ శాస్త్రి రిటైర్డు గ్రేడ్ I తెలుగుపండితులు
ప్రాప్తిస్థానం- విద్వాన్ చింతలపాటి పూర్ణచంద్రరావు గ్రేడ్ I తెలుగుపండితుడు, పరిషత్ హైస్కూలు, పెదన గల్లు పోష్టు, మొవ్వతాలూకా. కృష్ణాజిల్లా.
వెల:- తెలియదు]

ఇది కూచిపూడి భాగవతులు వారి నాట్యము, సిద్ధేంద్రకళాక్షేత్రముల గూర్చి దాదాపు సమగ్రమైన రచన. డాక్టరేటునకు సమర్పించు పరిశోధన వ్యాసరచనా పద్ధతిని రచింపబడినది. రచయిత కూచిపూడిలో కావ్య పాఠములు చదువుకొనుటవలన కూచిపూడి భాగవతులతో ఏర్పడిన పరిచయము, ఇట్టి వ్యాసమును వ్రాయవలెనను కోరికతో ఓపికగా చేసినకృషి ఈ చక్కనిరచన చేయుటకు దోహదమైనవని తోచుచున్నది.

పరిశోధనవ్యాసమును రచించువారు తాముగ్రహించిన విషయమును ఏ గ్రంథ మునుండియో తెలుపుటకు ఆ పుటలోని అథోజ్ఞాపికలో గ్రంథము పేరును, పుటల సంఖ్యను తెలుపుచుందురు. కానీ ఈ రచయిత ఆ విషయమునకు సంబంధించిన పూర్తి పాఠమునే తన రచనకు జోడించిరి. ఉదాహరణమునకు కూచిపూడి భాగవతులు ప్రజాశ్రేయమునే దృష్టినుంచుకొని నాటి సామంతప్రభువులలో ప్రబలిన అన్యాయాలను, అక్రమాలను, అత్యాచారాలను, ప్రజానీకానికి, ప్రభుత్వానికి తమ ప్రదర్శనల ద్వారా తెలియజేసెడివా రను విషయమును దెలిపి, ఆ యభిప్రాయమును నిర్ధారించు మాచుపల్లి కైఫీయత్తుపూర్తిపాఠమును పుస్తకమున చేర్చారు. భాగవతులమధ్య నేర్పడిన తగవును వారుచేసుకొన్నరాజీని తెలిపి నాడు కూచిపూడి భాగవతులు వ్రాసు కొన్న పూర్తి పాఠమును తమ రచనకు జోడించారు.

ఇట్టి పరిశోధనావ్యాసమును రచించు వారిలో కొందరు, చర్చనీయాంశమును గూర్చి పలువురి యభిప్రాయములను పొందుపరచి తమ యభిప్రాయమును తెలుపకయేముందుకు సాగిపోతూవుంటారు. కాని ఈ రచయిత పలువురి అభిప్రాయముల నెత్తిచూపుటతో నూరకొనక తన అభిప్రాయ మును నిర్ధారించి చూపిరి. ఇదియే సరియైన పద్ధతి. ఇదికూచిపూడికిగల పేర్లను చెప్పుటలో కన నగును.

కృష్ణానదికి దక్షిణతీరమునగల ప్రసిద్ధ 'నాడు' లలో "వెలనాడు" ఒకటి. వెలనాడు ఆరువేలగ్రామపరిమితి యని యొక శాసనము, "త్రిశతోత్తరషట్సహస్రావని" యనగా ఆరువేలమూడువందల గ్రామపరిమితిగలదని మరియొక శాసనము తెలుపుచున్నది. బాపట్ల తాలూకాలోని 'మోదుకూరు', 'నిడుబ్రోలు' తెనాలితాలూకాలోని 'పెనుకుద్రు, దావులూరు, రేపల్లె తాలూకాలోని ఎలవర్రు, దివితాలూకాలోని 'పెదదేవపురం' ఈ వెలనాడులో చేరినవేనట. ఈ వెలనాటి వైదిక బ్రాహ్మణులు శిష్టాచారసంపన్నులు, మంత్రశాస్త్రప్రవీణులు, నిత్యానుష్ఠాన నిరతులు, కర్మిష్ఠులు నట. అట్టివెలనాటి వైదికులే ఈ కూచిపూడి భాగవతులు. కాని వీరు శిష్టులచే అపాంక్తేయులుగా చేయబడు నటవృత్తిని, నాట్యశాస్త్రాధ్యయనమును అభ్యాసమును తమ విధిగా భావించి అనుసరించారు. ధనసంపాదనకై పగటివేషములు ధరించుటతో ప్రారంభించి కేళికాదినృత్యములు చేయుచు సిద్ధేంద్రయోగివలన భాగవతులు అయినట్లు రచయిత కారణమును జూపినారు.

కానీ నేటి ప్రసిద్ధ కూచిపూడి నాట్య విద్వాంసులు తమ పూర్వులు పగటివేషములు ధరించి రనుటను అంగీకరించుట లేదు. మాచుపల్లి కైఫీయత్తునుబట్టి కూచిపూడి భాగవతులు క్రీ॥శ 1505 నాటికే కేళికను ప్రదర్శించుచు దేశసంచారముచేయుచుండినట్లు తెలియుచున్నది. రచయిత సిద్ధేంద్రయోగి 16-17 వ శతాబ్దివాడని సకారణముగా ఈ గ్రంథమున నిర్ధారించి యున్నారు. కాబట్టి అట్టి శిష్టాచారపరులు నాట్యవృత్తిని చేపట్టుటకు కారణమైన నాటిపరిస్థితులు, వారి మొదటి గురువులగూర్చి పరిశోధించకున్న ఈ రచన సమగ్రముకానేరదు కాన శ్రీ శాస్త్రి గారు పరిశోధించి మలి ప్రచురణమునచేర్చె దరని యెంచెదను.

ఈ గ్రంథమున తెలుగుదేశమున ఏ రాజ వంశములచే నాట్యము ఎట్లు పోషింపబడినది, నాట్యకళాప్రాచీనత, ఉత్పత్తి, నాట్య భేదములు, దేవదాసీల పుట్టుక, వారు చేయుచుండిన నాట్యములు, భారతదేశమునగల వివిధనాట్యపద్ధతులు, భామాకలాప, గొల్లకలాపము లను రచనల అంతరార్థములు, పగటివేషములు, వానిలోని భేదములు, వానిని ధరించుచుండిన సిద్ధహస్తులు, తెలుగు వాగ్గేయకారకులు మొదలగు ఎన్నో విషయములు వివరింపబడియున్నవి. అంతేగాక సిద్ధేంద్రయోగినిగూర్చిన వివిధగాథలు, క్షేత్రయ్య, శివనారాయణతీర్థులగూర్చి, తెలుగువారు రచించిన అభినయదర్పణము, నృత్తరత్నావళులగూర్చి తెలుపబడినది.

కూచిపూడి నాట్యసంప్రదాయము శాస్త్రబద్ధమైనదని నిర్ధారించు పలువురు ప్రముఖుల వ్యాసములు, కూచిపూడి నాట్యసంప్రదాయము ననుసరించుచున్న ప్రదర్శకుల వంశములగూర్చి, వారి అభినయకౌశలము గూర్చి వారి మంత్రశాస్త్రప్రజ్ఞా విశిష్టతల గూర్చి విశదపరచుటేగాక సిద్ధేంద్రకళాక్షేత్రపుచరిత్రమును, దాని యావిర్భావమునకై జరిగినకృషిని, కూచిపూడి యగ్రహార చరిత్రను సాధికారికంగా విశదపరిచారు గ్రంథములో.

పుస్తకమున చాలాకొద్ది అచ్చు తప్పులే ఉన్నను, అవి సంవత్సరములకు సంబంధించిన వగుట తప్పొప్పుల పట్టికను కోరుతున్నవి.

ఇట్టిపరిశోధన గ్రంథమును రచించిన శ్రీ శాస్త్రిగారు అభినందనీయులు; అభివందనీయులు. తెలుగువారినాట్యమునుగూర్చి తెలిసికొనదలచిన వారెల్లరు చదువదగినదే కాదు దాచుకోదగిన గ్రంథమిది.

—బి. యల్. యన్. ఆచార్య

# అనుభూతితరంగాలు

అది సెలయేరు.... ఆ ఏటి గలగలల్లో నీ నామం ధ్వనిస్తుంది-మధురమధురంగా.... ఆ పొంగే పొంగులో నీ దయాసముద్రాలు నిండిఉంటాయి - నిజంగా ........ స్వచ్ఛమైన నీటి నురుగు.... నీ పెదాలపై సదా చెరగని చిరునవ్వల్లే ..............
ఎంతబాగుంటుంది ప్రభూ........

అజ్ఞానాన్ని తరిమేస్తున్న వాడిలాసూర్యుడు.. ఎర్రమందారాల్లా ఆ భగవానుడి కిరణాలు.... అవి అలల్ని ముద్దెట్టుకుంటుంటే నువ్వు నన్ను దగ్గరకు తీసుకున్నట్టుంటుంది.

నేను నిన్నే చూస్తుంటాను.... ప్రకృతిలోని ప్రతి అణువునీ నీలా భావించి పూజించి తరిస్తుంటాను.

ఆకాశపు ఆవలి తీరంలో ఉన్నావో-సముద్రపు ఆఖరి బొట్టుమీద వెలిశావో....పాతాళాన్ని పాలిస్తున్నావో.... ప్రపంచపు ఏ అంచుమీద కూర్చున్నావో నని ఒకప్పుడు నీకోసం తడుముకునే వాణ్ణి ........

ఆ అంధత్వం అంతరించాకా-నువ్వు నాలోనే ఉన్నావని-ఉండి వెలుగు తున్నావని-ఆ వెలుగంతా నాదే నని తెలుసుకున్నాను. నా తప్పు నేను ఒప్పుకున్నాను.

నా నరాలతో నేశాను. ఇది నీ కుటీరం. కుటీరం నిండా రకరకాల భంగిమల్లో నా తృప్తి కోసం నే గీసుకున్న నీచిత్రాలు........ బంగారపు పళ్ళేరాల్లో పంచభక్ష్యపరమాన్నాలు వడ్డించి కొసరికొసరి తినిపించ గలిగిన భాగ్యవంతుణ్ణి కాదు ప్రభూ——ఒకపేదపువ్వుని— బట్టకు పేదవాణ్ణయినా భక్తికి పేదవాణ్ణి కాదులే.

నా హృదయాన్ని శాలువాగానేసి నీ గుండెల మీద కప్పుతాను. అమృత హస్తంతో నువ్విచ్చే ఆశీస్సు కోసం, నా అహోరాత్రాల తపనను అర్థం చేసుకో ప్రభూ....

ప్రపంచం నన్ను వెక్కిరిస్తోంది. వెలివేస్తుంది. 'ఒరేపిచ్చీ' అని తరిమి తరిమి బాధిస్తోంది. ఆలు బిడ్డలు బయటికి తోసి తలుపేశారు. వాళ్ళిచ్చిన కత్తుల్ని కరకరా నమలలేదని స్నేహితులూ కినుక వహించారు. బంధుజనులట ........ బంధాల్ని త్రాడుగా పేని ఎక్కడ పడితే అక్కడ ఉరి తీస్తా మంటున్నారు. ఎన్నాళ్ళు నా కీ చెరసాల........??

రాధకి తెలుస్తుంది మాధవుడి లోతెంతో — మాధవుడికే తెలుస్తుంది రాధాదేవి ప్రేమ రహస్యం.

నన్నొక రాధను చెయ్యి ప్రభూ..........
చేసి నీ వేణువుతో నన్ను ఆదేశించు........
ఏ ఆట కావాలో- ఏ పాట పాడాలో- ఎలా నీలో లీనం కావాలో-

నే నేమై పోవాలో........

నీకోసం నేదంచిన అటుకులు నేనే తినేశాను. నువ్వు చేసే ఆలస్యంతో అన్నీ కరిగిపోతున్నాయి. నువ్వు వచ్చే సమయానికి నన్నంటూ మిగుల్చుతావా? కోపం రానీ కయ్యా! వస్తే నీ పాదాలమీద నాతలవగిలి పోతుంది.

ఎన్నిసార్లు పాడుకున్నా మనసుకి పట్టని పాటలాగా,

ఎన్నిసార్లు ఆడినా యాంత్రికమైన ఓ దొంగాటలా........

ఓ వెర్రి అడుగులా.... ఓ పిచ్చి వరుగులా.... సాగిపోయే ఈ ప్రపంచం నానుంచి ఎప్పుడూ విడిపోతూనే ఉంటుంది. పోనీ........ అదో అశాశ్వతమైనఆటబొమ్మ. అదంతే-

నీ జ్ఞానంవల్ల మండుటెండల్లో సైతం మంచుపువ్వుల్ని ఏరుకుంటున్నాను. అర్ధరాత్రి చీకటిలో సైతం కాంతిరేఖను కనుక్కుంటున్నాను. నేను నీవైపు ఎదుగుతున్నాను.

నీలో ఉన్న నాకూ - నాలో ఉన్న నీకూ భేదా లేవీ లేవని

నా మనసుకి తెలిసే ఉంది. ఎన్ని తెలిసినా మానలేని కొన్ని బలహీనతల్ని-క్షమించవా నా తండ్రీ...........

## యువ వాణి

ఒక తల్లివై నన్నొక పాపను చేసి ఆడించు నిన్ను అమ్మా అని పిలిచి నీ ఒడిలో ఒదిగి పోతాను. నీ మాతృత్వంలో కరిగిపోయి వెయ్యిజన్మల అనుభూతిని సొంతంచేసుకుంటాను.

ప్రతి ఉదయంలోనూ తొంగిచూస్తుంటాను. సూర్యుడితోపాటు నువ్వూ ఉదయించా వేమో నని........ ప్రతిచంద్రుణ్ణీ పలకరిస్తాను .... నావెన్నెల రేడువైన నీ ఆగమనాన్నిగురించి....

గమ్యం చేరే దాకా నా పడవ సాగుతూనే ఉంటుంది. నీ విశ్వాసమే దానికి చుక్కాని. నీ పిలుపునన్ను తాకే దాకా నీ రూపంనన్ను ఆక్రమించే దాకా ఇక్కడే ఈ కుటీరం లోపల ఒక సీతాకోకచిలుకలా తిరుగుతూనే ఉంటాను.

*

## అంతర్జాతీయ ప్రార్థనలు

"సర్వే హి సుఖినః సంతు
సర్వే సంతు నిరామయాః,
సర్వే భద్రాణి పశ్యంతు
మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్ ॥"

అందరు సుఖంగా ఉందురు గాక. ఎవ్వరూ రోగగ్రస్తులు కాకుండా, అందరు ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలి. అందరు భద్రత కలిగియుందురు గాక. ఎవ్వడూ దుఃఖభాజనుడు కాకుండుగాత!"- ఇది భారతీయుల నిత్యప్రార్థన. సంతత మంగళాశాసనం.

సనాతన భారతీయ సంస్కృతికి-అంతరాత్మగా చెప్పదగిన వాక్యం-

"సర్వే జనాః సుఖినో భవంతు"

"ప్రజలందరు సుఖానుభూతిలో తులతూగుదురుగాక"- అనే ఆకాంక్ష భారత దేశంలో యుగయుగాంతరాల నుండి నిత్యానుసంధానం అయింది. విశ్వకల్యాణాకాంక్ష ప్రాచీన భారతీయ సంస్కృతికి జీవనాడి. నిత్యప్రార్థన.

నిజమైన ప్రార్థన-స్వార్థపూరితం కాలేదు. "ఓ భగవానుడా! నాకు ప్రతిరోజు ఆహారముగా రొట్టెముక్కలు సమకూర్చు" అనేది ప్రాథమిక ప్రార్థన, కావచ్చు. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అన్నమాట. అయితే- పిందె యెదిగి పండు అయ్యేటట్లు, సంకుచిత స్వార్థప్రార్థన విశ్వకల్యాణాకాంక్షగా పరిణమిస్తుంది ఆధ్యాత్మిక పురోగతి సిద్ధించినప్పుడు. ఈ దృష్టిలో అశ్వమేధయాగం గాని పుత్రకామేష్టిగాని పరిణత ప్రార్థనలుగావు. భగవద్గీతలోని యజ్ఞయాగాది నిరసన, ఈ దృష్టితో చూస్తే అవగాహన అవుతుంది.

విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు గీతాంజలిలో సుప్రసిద్ధమైన ప్రార్థన - తనకోసం తన స్వార్థంకోసం చేసింది గాదు. అది, తన దేశాన్ని ఉద్ధరించమని ఆ మహాకవి భగవంతునికే పెట్టుకున్న మొర.

"ఎచట మెదడు సర్వతంత్ర
స్వతంత్రంగా వికసిస్తుందో;
ఎచట మనుజులు నిర్భయంగా తల
యెత్తుకొని తిరుగాడవచ్చునో;
ఎచట విశ్వజనీన విజ్ఞానం ఎల్లవారికి
ఉచితంగా లభిస్తుందో;
ఎచట కుల కుటుంబ వివక్షతలు అనే
అడ్డుగోడలతో ప్రపంచం ముక్క
చెక్కలై మురికికొండలతో
క్రిక్కిరిసి మూల్గదో;
ఎచట వాక్కులు చిత్తశుద్ధితో నిండిన
సత్యహృదయ కుహరం నుండి
వెల్లివిరుస్తాయో;

# వెలుగుబాట

## డా॥ నండూరి రామకృష్ణమాచార్య

ఎచట హేతువాద జీవనది - మృత
ప్రాయమైన సంప్రదాయ
సైకత మయమైన ఊషర క్షేత్రాలలో
దారిదప్పి ఇంకి పోలేదో;
ఎచట సంతత కృషి పరిపూర్ణతకోసం
అఙ్జులు సాచుచూ, పురోగమిస్తుందో;

అట్టి - స్వాతంత్ర్య స్వర్గసీమగా -
తండ్రీ- నా దేశాన్ని తీర్చిదిద్దు."

రవీంద్రుని ప్రార్థన విశ్వజనీనమైనది. పాశ్చాత్యచరిత్రలో-విశ్వజనీనమైన ప్రార్థనను సంతరించిన మహానుభావుడు అసిసీ పుర వాస్తవ్యుడైన ఫ్రాన్సిస్ యోగి. సెయింట్ ఫ్రాన్సిసుయోగి ప్రార్థన విశ్వవిఖ్యాతిని ఆర్జించింది.

"ప్రభూ!

నీ దివ్యశాంతి కాంతి ప్రవాహం జాలువారే కాలువగా నన్ను తీర్చిదిద్దు.

ఎచట అన్యోన్య వైషమ్యం ప్రబలుతుందో అచటనే నేను ప్రేమసుధను పంచిపెట్టాలని నా సంకల్పం.

ఎచట అన్యాయం జరిగిందో అచటనే క్షమాసహనం వర్ధిల్లేటట్లు కృషి సల్పాలని నా తహతహ.

ఎచట సంఘర్షణ యేర్పడుతుందో అచటనే సామరస్యం అనుసంధించాలని నా కోరిక.

ఎచట పాపం ప్రబలిపోతుందో అచటనే సత్యం ప్రతిష్ఠించాలని నా ఆరాటం.

ఎచట సంశయ ప్రవృత్తి విస్తరిస్తుందో అచటనే విశ్వాసం అంకురింపజేయాలని నా ఉబలాటం.

ఎచట నిర్వేదం వికటాట్టహాసం చేస్తుందో అచటనే ఆశాజ్యోతిని వెలిగించాలని నా ఆకాంక్ష.

ఎచట నిడలు - చిమ్మచీకట్లు క్రమ్ముకొంటాయో అచటనే వెలుగు వెల్లువ విస్తరింపజేయాలని నా ఆవేదన.

ఎచట దుఃఖం చుట్టుముట్టుతుందో అచటనే సంతోషం సమకూర్చాలని నా ఉద్దేశం.

స్వసౌఖ్యం అపేక్షించకుండా సర్వతోముఖ సాంఘికాభ్యుదయం కోసం నా సర్వస్వం సమర్పించి జీవించేటట్లు; స్వార్థం విస్మరించి ఇతరులయెడ సానుభూతితో సహృదయతతో ప్రవర్తించేటట్లుగా,

నా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దు; ప్రభూ!"

కార్డినల్ న్యూమన్ ప్రార్థన - వైదిక ప్రార్థన "తమసో మా జ్యోతిర్గమయ" సూక్తాన్ని తలపింపచేస్తుంది.

"ఓ దివ్య పరంజ్యోతీ! దయచేసి నీవే నాకు మార్గదర్శకత్వం వహించు;
నా అడుగులు తడబడకుండా చూడు;
ఒకేసారి దూరదూరాలకు పరుగెత్తాలనే కోరిక నాకు లేదు.
నెమ్మదిగా నేను ఒక్కొక్క అడుగు ముందుకు వేయగలుగుతే చాలు."

నిజమైన ప్రార్థన, స్వార్థవిరహితమైన విశ్వకల్యాణాకాంక్షయే.

"సర్వే జనా స్సుఖినో భవంతు."

*

# ఆపదమొక్కులవాడా!

ఒకసారి మా అత్తగారికి చాలా చికాకు చేసింది. ఒక బాధకి మందిస్తే మరో క్రొత్తబాధ తోడయ్యేది. అసలు అనారోగ్యం ఏమిటో అంతుబట్టక మందులు మార్చి, మార్చి విసిగి పోయారు మావూరి డాక్టర్‌గారు. మా అత్తగారు మంచం దిగలేని పరిస్థితేర్పడడంతో పెద్ద హాస్పిటల్‌కి తీసుకెళ్ళమని డాక్టర్‌గారే సలహా ఇచ్చారు. మా అత్తగారు మాత్రం మరెక్కడకీ వద్దంటూ మొండికేసారు. ఆరోగ్యం బాగుంటే తిరుపతి వేంకటేశ్వరస్వామికి నిలువు దోపిడీ ఇస్తానని మ్రొక్కుకున్నారు. అప్పట్నుంచీ మందులూ, ఇంజక్షన్స్‌కూడా తీసుకోలేదు. ఎంతచెప్పినా ఆవిడ పట్టుదల విడవకపోవడంతో మేం చేసేదేం లేక టైము ప్రకారం ఆహారపానీయాల్నిచ్చేవాళ్ళం. అలా పదిరోజులు గడిచేసరికి, లేచి తిరగ గలిగారంటే అతిశయోక్తి కాదు. నెల రోజులు పైగా మందులు వాడుతూ మంచం మీదున్నామె, మ్రొక్కుకున్న పదిరోజుల్లో లేచి తిరిగారంటే అదంతా ఆ శ్రీ వేంకటేశ్వర లీలా విలాసమే!

మా అత్తగారు మ్రొక్కుకున్నట్లుగా ఆవిడ వంటిమీదున్న నగల్ని వేంకటేశ్వర స్వామి హుండీలో వేసేసినా, ఆవిడ చెవి దుద్దులు మాత్రం ఉంచేయాలన్న అభిప్రాయం కలిగింది నాకు. ఏమంటే ఆ దుద్దులు ఏభై ఏళ్ళనాటివి. వజ్రాలదుద్దుల్లా మెరుస్తున్న ఏడుపొళ్ళ దుద్దులు. పైగా వాటి పనితనం కూడా చాలా బాగుంది. అంతకు ముందే అలాంటి వోజత కొనుక్కోవాలని బంగారం షాపులలో ప్రయత్నిస్తే అసలారకం పొళ్ళు, పనితనం ఉన్నవే కనబడలేదు. పోనీ కంసాలికి చెప్పి చేయించాలనుకుంటే అలాంటి మంచి రాళ్ళు ఇప్పుడు దొరకవంటూ ఆ పనితనం కూడా ఇప్పుడెవ్వరికీ పట్టుపడదంటూ చెప్పేశాడు. అయినా ఆ దుద్దుల మీద ఆశపోలేదు. మరలా యిప్పుడు ఆ దుద్దులు ఇంట్లో లేకుండా హుండీలో వేసెయ్యాలంటే మన సొప్పలేదు. అదే మాటన్నాను శ్రీవారితో అందుకాయన ససేమిరా! వీల్లేదంటూ

"వేంకటేశ్వరస్వామితో వేళాకోళంకాదు. ఎలా మ్రొక్కుకుంటే తు. చ. తప్ప కలా చెయ్యాల్సిందే! లేకపోతే వడ్డీతో సహా వసూలు చేస్తా''డన్నారు. కాని పట్టు విడవని విక్రమార్కుడిలా నా మనసుని మాత్రం ఆ దుద్దుల నుంచి మళ్ళించలేక పోయాను.

''నేనేం వజ్రాలూ, వైడూర్యాల్ని అడగ లేదుగా! అయినా! నేనేం అడిగినా మీ రౌనన్న దెప్పుడు లెండి. అనుకున్నట్టుగా అన్నీ వేసేస్తున్నాం. ఒక్క దుద్దులేగా! అంతగా అయితే వాటి ధర కట్టి హుండీలో వెయ్యకూడదాయేం?'' ఓ ప్రక్క అంతరంగంలో భయం అన్నది కలుగుతూన్నా, వస్తువు మీద అపేక్షపోక అన్నాను. మరింకేం మాట్లాడక మౌనం అంగీకారంగా తెలిపారు శ్రీవారు. ఆ మర్నాడే దుద్దులకి ధర కట్టించాలని ఇద్దరం అనుకున్నాం.

ఈ విషయాలేం తెలియని మా అత్తగారు కొంచెం ఆరోగ్యం చేకూరడంతో ఆదమరచి నిద్రపోయారు. ఉన్నట్టుండి మా అత్తగారు నిద్రపోతూన్న గదిలోంచి అరుపులు వినరావడంతో అదురుతూన్న మనసుల్తో అత్తగారి గదిలో కెళ్ళాం. మంచం మీద కూర్చున్నారు బాసింపట్టు వేసుకుని. ఆమె మొహంలో ఏదో ఆరాటం ప్రస్ఫుటమవుతూంది. అర్థం కాకుండా ఉన్నాయి ఆవిడ అరుపులు. అందులో అస్పష్టంగా వినిపించింది. "పట్టుకో" అన్న పదం ఒక్కటే.

మా ఉనికి కూడా ఆమె గ్రహించలేదు. రెండు చెవుల్నీ గట్టిగా పట్టుకుని, కిటికీ వంక భయంగా చూస్తూ అరుస్తున్నారు. అయోమయంగా ఓ రెండు నిమిషాలలాగే నిలబడ్డాం. తెప్పరిల్లి కూజాలో నీళ్ళు తెచ్చి ఆవిడ ముఖం తుడిచాను. అత్తగార్ని భుజంమీద తడుతూ "ఏమయిందమ్మా! ఎందుకలా అరుస్తున్నావు" అడిగా రాయన. కొంచెం తెప్పరిల్లిన మా




అత్తగారు ఓ క్షణం మా వంక తేరి పారచూసి ఏదో చెప్పాలని తెరచిన నోట మాట రాక, గొంతుక సవరించుకు, మాట్లాడాలని శతవిధాల ప్రయత్నించారు. నోట శబ్దం అన్నది రాలేదు. మొదట మాకు వింతనిపించినా, తరువాత భయం వేసింది. ఏం చెయ్యాలో పాలుపోలేదు. అంతలో మా అత్తగారు నుదుట నామాల్ని, ఎత్తు, లావుల్ని సంజ్ఞలు, అభినయంగా తెలియచేసి, చెవి దుద్దులు పట్టుకు పోయాడన్నట్టు కిటికీ వేపు చేతులు చూపిస్తూ కళ్ళు తుడుచుకున్నారు. అనుమానంగా కిటికీ వంక చూస్తే తలుపులు వేసే ఉన్నాయి. దుద్దులు ఆమె చెవుల్నీ మెరుస్తున్నాయి.

(32వ పేజీలో)

# కర్మసిద్ధాంతం-రోగహేతుపరిశీలన

వీరసింహావలోకం అనే గ్రంథంలో కర్మలు వాని ఫలాలు విపులంగా చర్చింప బడ్డాయి. పురాణాలలో రోగకారణాలను వ్యాసమహర్షి చర్చించాడు ముందుగా జ్వరాలను గూర్చి ఆలోచిద్దాం. ఎవరైతే గతజన్మలో లోభులై క్రూరులై పరులను బాధిస్తారో వారి జన్మలో జ్వర పీడితులవు తారు. మంచిపనులకై వెనుకాడేవానికిఉష్ణ జ్వరాలు వస్తాయి అగ్ని ప్రమాదాలకు కారణభూతులైన వారికి గూడ జ్వరాలు వస్తాయి. పై వాటికి

"యే పునః క్రూరకర్మాణః
పాపాః పిశునచేతసః,
తే భవేయు స్సదా శీత
జ్వరవ న్తశ్చ తత్పరాః"

అనే పురాణశ్లోకం ప్రమాణం

అతిసారీ చ భవతి య స్త్రేతాగ్ని వినాశకః.

అనే ప్రమాణం వలన త్రేతాగ్నులను ఆర్పితే అతిసారరోగం వస్తుందని తెలు స్తుంది. చెరువులను పడగొట్టినా ఆ రోగం రావొచ్చు పతివ్రతయైన భార్యను పరి త్యజించిన వానికి గ్రహణీరోగం వస్తుంది.

"సాధ్వీం భార్యాం చ యో మర్త్యః
పరిత్యజతి కామతః,
గ్రహణీరోగసంయుక్తః
సదా భవతి మానవః"

అనే శ్లోకంలో పై భావం ఇమిడియుంది. ధనంతీసుకుని విద్యనుబోధించడం, జపహో మాదులను చేయడం అర్శోరోగానికి(పైల్స్) కారణం. దీనికి గోవధ మరియొక కారణం. అజీర్ణరోగానికి శాస్త్రాలలో ఈక్రింది కారణా లున్నాయి 1. అన్నాన్ని అపహరించడం 2 నియమరహితుడు, పాపియైనవానినుండి ఆహారం గ్రహించడం, 3 గోమాంసాన్ని తినడం 4 విషాహారం ద్వారాప్రమాదాన్ని కలిగించడం 5 త్రేతాగ్నులను నశింప జేయడం

ఆవులను, ఏనుగులను, గుర్రాలను హింసించడంవలన క్రిమిరోగా లొస్తాయి పూజ్యులు, గుణవంతులు, దేవతల ద్రవ్యాన్ని అపహరించడంవలన రక్తహీనత కలుగుతుంది. ఆహారాన్ని అపహరించడం వలన కామిలా రోగం వస్తుంది. ఈ విషయం "కామలీ భక్తచోరస్స్యాత్"అనే ప్రమాణంలో ఉంది. వైద్యశాస్త్రం చదివి గర్వంతో మందులను విరుద్ధంగా ప్రయోగించడం వలన రక్తపిత్తరోగం వస్తుంది. వైద్యవిష యంలో ఏవిధమైన దుర్భావం వల్లనైనా ఈ రోగం రావచ్చు

క్షయరోగానికి పురాణాలలో ఈ క్రింది కారణాలు చెప్పబడ్డాయి 1 హత్యచేయడం 2. ఇతరుల వస్తువులను అపహరించడం 3 ఇతరుల భాగ్యానికి అసూయపడడం 4. పొలాలను అపహరించడం 5 గర్వంతో శాస్త్రం చదవకుండగనే ప్రాయశ్చిత్తాదులను తెలుపుట వీటివలన క్షయ మాత్రమే కాక రొమ్ములోనొప్పి, స్వరభేదం కూడారావొచ్చు వీటిలో నాల్గవకారణం "క్షయీ స్యాత్ క్షేత్ర హరణాత్" అని పద్మపురాణంలో చెప్ప బడింది. ఐదవకారణానికి ప్రమాణంబ్రహ్మాండ పురాణంలో ఇలాఉంది.

"ధర్మశాస్త్రానభిజ్ఞో యః
ప్రాయశ్చిత్తం దదాతి వై,
రాజయక్ష్మా భవేత్తస్య
రోగపీడాతిదారుణా."

ప్రత్యుపకారం చెయ్యకపోవడం, అప కారంచేయడంవలన కాసరోగం కఫశ్వాస, వాతపైత్యజ్వరాలు వస్తాయి.

"కృతఘ్నో జాయతే మర్త్యః
కఫవాన్ శ్వాసకాసవాన్,
ఉష్ణజ్వరీ చ నిత్యం హి
పిత్తరోగసమన్వితః"

అనే శ్లోకం పై భావాన్ని తెలియజేస్తుంది కురుక్షేత్రాది పుణ్యస్థలాలలో గ్రహణకాలంలో అపాత్రులనుండి దానాలు గ్రహించేవాడు అపాత్రుడై పై రోగాలను పొందుతాడని శాస్త్రంలో ఉంది గురువుతో వాదించడం వలన కంఠంబొంగురుపోతుంది అని వాయుపురాణం చెబుతూంది.

హోమం చెయ్యడానికి సంకల్పించి స్నానం చేసి హోమం చెయ్యకపోవడం, హోమం చెయ్యకనే భుజించడం వలన ఎక్కిళ్ళు వస్తాయి. అశ్రద్ధ, అహంకారాలతో దానం చెయ్యడంవలన రుచిలేకపోవుట, కడుపునొప్పి వస్తాయి కేశాలు, పురుగులతో కూడిన అన్నంపెట్టడం, జంతువులు తాకిన ఆహారం ఇవ్వడంవలన, విశ్వాస ఘాతు కత్వంవలన, ఛర్దిరోగం వస్తుందని శాస్త్రా లలో ఉంది

'పాంథమధ్వపరిశ్రాంతం
బ్రాహ్మణం గామథాపి వా,
న పాయయేజ్జలం యస్తు
స తృష్ణామూర్ఛితో భవేత్'

అనే శ్లోకం, దప్పికగొన్న గోవుకు, మానవులకు నీరివ్వక పోవడంవలన దప్పిక, మూర్ఛ కలుగుతాయని చెబుతూంది

ఉన్మాదానికి కారణాలు ఇవి. 1. దొంగతనం 2 నిషిద్ధవస్తువులను అనుభవించడం 3. ఇతరులను వంచించి వృద్ధులను గురువులను పరిహసించడం 4. శాస్త్రం తెలిసీ తెలియదనడం 5. మంత్రాలను ఎగతాళి చెయ్యడం అగ్నిలో ఉమియడంవలన శరీరతాపము, మంటలూ కలుగుతాయి ప్రభువులను, గురువులను సంహరించడం, హింసించడం వలన అపస్మారం కలుగుతుంది.

వాతం శరీరంలో చేరడంవలన వాత సంబంధరోగాలొస్తాయి. ఈ రోగాలకూ అనేక కారణాలున్నాయి 1. గురువుకు శత్రువుగా మారడం 2 దేవతల, పూజ్యుల ధనాన్ని అపహరించడం 3. స్వామిద్రోహం 4 విష ప్రయోగం చెయ్యడం, అనురాగంలేని స్త్రీని అనుభవించడంవలన ధనుర్వాతం వస్తుంది. బోధాయనమహర్షి సిద్ధాంతం ప్రకారం చోరత్వమే వాతవ్యాధికి కారణం పరస్త్రీ గమనంవలన వాతరక్తం శరీరంలో చేరి బాధిస్తుంది

హోమానంతరం అగ్నులను ఆర్పడం వలన ఆమవాతం లేక ఊరుస్తంభం గానీ వస్తుంది బీదవాడు, వేదాధ్యయనం చేసినవాడు అయిన ఉత్తముడిని ఆహ్వానించి తిరస్కరించిన వానికి కడుపునొప్పి వస్తుంది సంధ్యావందనాది రహితునకుకూడ ఈ రోగం వస్తుంది తలిదండ్రుల సరసభాషణం విన్నవానికి కర్ణశూల, చెవుడు వస్తాయి హింసా ప్రవృత్తిగలవానికి శూలరోగం వస్తుందనడంలో 'శూలేన శూలీ భవతి మనుష్యాణాం చ హింసకః' అనేది ప్రమాణం. ఉదావర్త రోగానికి, పాదాలమంటకు దేవాలయాలు, కొలాలు, చెరువులు, బావులను పడగొట్టడమే కారణం.

గురువుతో శత్రుత్వాన్ని సాధించడం వలన వాతగుల్మరోగం వస్తుంది. అగమ్యాగమనంవలన కూడా పైరోగంవస్తుందని పద్మపురాణం చెబుతూంది ఇతరుల మనస్సును బాధించేవానికి హృద్రోగం వస్తుంది గురువుపై అసూయచెందేవానికి, పగలు స్త్రీ సౌఖ్యంపొందేవానికి మూత్రకృచ్ఛ్రం వస్తుంది. "సురాపో మూత్రకృచ్ఛ్రీ స్యాత్" అనే బోధాయన సిద్ధాంతం ప్రకారం మద్యపానం పైరోగానికి కారణం అని చెప్పవచ్చు

పరస్త్రీని పరాభవించడం అశ్మరీ బాధకు హేతువు కన్యాగమనం వలన వాతం చేరి ప్రమేహరోగం వస్తుందని శాస్త్రవచనం. సోదరీజనసమాగమనంవలన మధుమేహం వస్తుంది "దధిచౌర్యేణ పురుషో జాయతే మేద సాయుతః" అనే ప్రమాణం పరిశీలిస్తే పెరుగును దొంగిలించడమే మేదోరోగానికి కారణం. ఉదరరోగం రావడానికి గల కారణాలు ఇవి,-

1. త్రిమూర్తులలో భేదాన్ని చూడడం. 2 న్యాయ నిర్ణేతగానుండి ప్రభువు నుండి ధనం పొంది దుర్వ్యయం చెయ్యడం 3. గురుతుల్యస్త్రీని అనుభవించడం 'ఉదర వ్యాధి యుక్తస్తు, భవేద్గుర్వంగనాగమే' అనే ప్రమాణం పై దానికి వర్తిస్తుంది.

మార్గమధ్యం, ఇసుకనేల, పర్వతము, వెలగచెట్టునీడలలో మలవిసర్జనం చేయడం వలన శ్వయధురోగం (ఉబ్బుట) వస్తుందనడంలో సందేహం లేదు అండాలకు చెందిన అన్ని రోగాలకు కారణాలు ఇవి– 1. సోదరీపుత్రికాతుల్య జనులను మోహించడం 2 తప్పులేకుండానే సేవకుల హస్త పాదాదులను ఛేదించడం 3 యజ్ఞంలో విఘ్నాన్ని కలిగించడం వలన ఆన్త్రవృద్ధి వస్తుంది గురుద్వేషం, హింస గండమాలకు కారణాలు. ఇది మనుసిద్ధాంతం. అభక్ష్య భక్షణం గూడా కారణమే.

విధవాగమనంవల్ల రక్తార్బుద రోగం కలుగుతుంది స్వగోత్రకాంతాభిగమనం వలనశ్లీపదరోగంవస్తుంది 'విద్రధీఫలహర్తా స్యాత్' అనే ప్రమాణాన్ని పరిశీలించడం వలన ఫలాపహరణం విద్రధికి హేతువు. గర్వ క్రోధ స్నేహభయాల వలన ధర్మాన్ని మార్చి చెప్పడంవలన వ్రణాలు కలుగుతాయి

'అతిమానాదతిక్రోధా
దతిస్నేహాత్ భయాదపి,
యో ధర్మ నిశ్చయం జానన్
అన్యథా కురుతే తు యః'
స పూయశోణితవహ
వ్రణీ భవతి మానవః.'

అనేది పైదానికి ప్రమాణం. ధర్మనిర్ణయం చెయ్యడానికి ప్రభువునుండిధనాన్ని పొంది, అధర్మం చెప్పేవానికి భగందర వ్యాధి వస్తుందని శాస్త్రవచనం.

'యో గృహీత్వా ద్విజో మోహాత్
నియుక్తో ధర్మనిశ్చయే,
భగందరో భవేత్తస్య
హ్యధర్మం వదతోముఖాత్'

అనేది భగందరానికి మూలమైన శ్లోకం. మాతృతుల్య స్త్రీ పరాభవంవల్ల జంతువులు కాటువేస్తాయి జంతువులను చంపడంవలన కుష్ఠరోగం వస్తుంది. వస్త్రచౌర్యం వలన బొల్లివస్తుంది. ఈ విషయంలో 'యో నరో హన్తి జంతూన్ కుష్ఠరోగీ భవేత్తు సః' అనే ప్రమాణం ఉంది. 'కుష్ఠీ స్తేయీ నరో భవేత్' అనే వాయు పురాణవచనం వలన దొంగతనం కూడా కుష్ఠరోగానికి కారణ మని భావింపవచ్చు ఇతరులసుఖాలపై అసూయ పడడం దురదలకు కారణం స్వర్ణచౌర్యం దద్రువులకు (దురదగల బొబ్బలు) కారణం. గడ్డిమోపులను తగులబెట్టడం వలన తామర వస్తుంది.

'సర్పైస్తు యః ఖాదయతి స విసర్పీ భవేన్నరః' అనే దానివలన, సర్పాలచే కరిపించడం గజ్జికి కారణమని తెలుస్తుంది. వ్రతదీక్షను చెడగొట్టడం వలన చర్మరోగాలు వస్తాయి. అనారోగ్యంతో ఉన్న గోవు పాలు త్రాగడంవలన స్ఫోటకం వస్తుంది కాకి, గాడిదల మాంసాలు తినడం వలన ప్రక్కలలో స్ఫోటకం వస్తుంది. దేవునికై నిర్ణయింపబడిన వస్త్రాలను అమ్మి ధనం పొందేవానికి వల్మీకరోగం (కాళ్లపై పుట్ట

ఆకారంలోకురుపులురావడం) కలుగుతుంది ఇతరుల నియమాలను చెడగొట్టే వానికి రహస్య ప్రాంతాలలో పుండ్లు వస్తాయి.

మలవిసర్జనానంతరం ప్రక్షాళనలేకుండా భుజించేవానికి మలాశయరోగం వస్తుంది విషం, ఉరి, మొ॥ ప్రయత్నాలవలన ఆత్మ హత్య చేసుకున్నవానికి పై జన్మలో తెలియబడని వ్యాధి వస్తుంది ధర్మం స్వీకరించి వదలి వేయడం, లేని దోషాలను చెప్పడం వలన ముఖం నుండి దుర్గంధం వస్తుంది ఇతరుల మాటలను క్రూరంగా ఖండించడం వలన ముఖరోగంవస్తుంది అసత్యభాషణం, పరజిహ్వాచ్ఛేదం, కారణం లేకుండా పక్షపాతాన్ని చూపడంవలన ముఖంలో కురుపు వస్తుంది. అసత్యసాక్ష్యం వలన గూడా ముఖరోగం వస్తుంది.

తల్లిదండ్రుల శృంగారవచనాలను వినడంవలన చెవుడు, క్రమంగా తలలో నాదు కలుగుతాయి దేవతలు, పూజ్యులు గురువుల గూర్చి నిందలను వినడం వలన చెవిపోటు, చీము కలుగుతాయి. మంచి అలవాట్లు లేకపోవడం వలన చెవిలో పురుగులు రావచ్చు ఇతరులలో ఉన్న దోషాలను, లేని దోషాలను ప్రచారం చెయ్యడం వలన ముక్కుకుగల రోగాలు వస్తాయి ముక్కు నుండి దుర్గంధం కూడా వస్తుంది. సత్కర్మల నాచరించే సమయంలో కోళ్ళు, గాదిదలను లోలుపత్వంతోచూసేవానికి ముక్కుపై వ్రణాలు కలుగుతాయి. ఇతరులకు అంధత్వం కలిగించడం, వైద్యుడై రోగాలు పెంచడం, పరస్త్రీలను కామంతో చూడడం వలన నేత్రరోగాలు వస్తాయి దంపతుల శృంగార చేష్టలను చూడడంవలన కండ్లనుండినీరు, పుసులువస్తాయి. ఉదయించే సూర్యుని అపవిత్ర జలాలలో చూడడం, మధ్యాహ్నకాలంలో సూర్యుని, నక్షత్రాలనుచూడడంవలన కంటిచూపు తగ్గుతుంది

గుళ్లలో దీపాలను ఆర్పడంవలనకంటిలో పొరలు, రేచీకటి వస్తాయి. ఈ విషయంలో 'దీపకం భంజయిత్వా తు తిమిరవ్యాధిమాన్ భవేత్' అనే ప్రమాణం ఉంది గురువులను అడ్డగించడంవలన తలపోటు వస్తుంది. వ్రతాన్ని మధ్యలో విడవడం వలన కూడా పై రోగం వస్తుంది "బ్రహ్మచారీ యదా శ్నీయాత్ భిన్నపాత్రే విశేషతః, ఏకదేశ శిరోరోగీ భవతీత్యాహ నారదః" అనే నారదుని వాక్యం ఇక్కడ ప్రమాణం. బ్రహ్మచర్యం పాటిస్తూ పగిలిన కంచుపాత్రలో భోజనం చెయ్యడం వలన పార్శ్వపు తలనొప్పి వస్తుందని నారదమహర్షి స్ఫుటంగా చెబుతున్నాడు.

బాలుని హింసించడంవలన ప్రదరరోగం వస్తుంది గురువులు మాతర పితరులతో కలహించడం కూడా ఇందుకు కారణమే బ్రహ్మచర్యం లేకపోవడం వలన స్త్రీల రోగాలు వస్తాయి పరపురుషచింతన వల్ల స్తనరోగాలొస్తాయి శ్రాద్ధాలను చెడగొట్టడం, చౌర్యం వలన మృతశిశు జననాలు కలుగుతాయి చేయరాని పనులను చేయడంవలన చిన్నతనంలో అనారోగ్యం కలుగుతుంది విషప్రయోగం, సర్పాలచే బాధ కలిగించడంవలన విషబాధ కలుగుతుందని శాస్త్రం నొక్కి వక్కాణిస్తుంది.

చేసిన మంచిపనులను చెప్పుకోవడం వలన జుట్టుత్వరగా తెల్లబడుతుంది స్త్రీలను అమ్మి జీవించడం, కన్యలను దూషించడం, అధములతోకలసి వ్రతభంగాన్ని పొందడం మొ॥ కర్మల వలన నపుంసకత్వం ప్రాప్తిస్తుంది

ఇలా ప్రాచీనగ్రంథాలలో హేతుహేతుమద్భావాలతో సర్వరోగాలకు కారణాలను ప్రాచీనులు స్పష్టంగా నిర్ణయించారు రోగ కారణాలను ఋషులవలన తెలుసుకుని సత్కర్మాచరణంవలన రోగరహితులం, జితేంద్రియులం, శతాయుష్కులం కావడానికి ప్రయత్నించడం మన కర్తవ్యం

— నిష్ఠల సుబ్రహ్మణ్యం

---

(20 వ పేజీ తరువాయి)

పోనీ మంచం కిందేవరన్నా ఉన్నారేమో నని చూశాం ఎవ్వరూ లేరు.

ఒక్కసారిగా నా ఆలోచనలు చురుగ్గా పనిచేశాయి. అంతేకాదు వళ్ళంతా ముచ్చెమటలూ పోశాయి పిచ్చి పిచ్చిగా చూస్తూ సంజ్ఞలు చేస్తున్న అత్తగార్ని చూస్తు "ఏమండీ! అత్తగారి దుద్దులు ధర కట్టించొద్దు. తిరుపతిలో హుండీలో వేసేద్దాం" అన్నాను వణుకుతూన్న కంఠంతో. ఆ సమయంలో అంతకన్నా అధికంగా మాట్లాడానికి కూడా గొంతుక పెగల్లేదు. నామూర్ఖత్వపు ఆలోచనకు క్షమించమని స్వామిని వేడుకుంటూ దుద్దులతోసహా వడ్డీగా ఐదురూపాయలువేస్తానిమనసారా స్వామికి మ్రొక్కుకున్నాను.

మరో పావుగంటకల్లా మగతనుంచి తేరుకున్నట్లుగా అయింది మా అత్తగారి పరిస్థితి. అప్పుడు చెప్పారు! నల్లగా, పొడవుగా, లావుగాఉన్నాడని, నామాలు పెట్టుకు, శరీరం అంతా వింతకాంతితో మెరుస్తున్నాడు. వద్దంటున్నా వినకుండా చెవుల దుద్దులు పట్టుకు కిటికీలోంచి పారిపోతున్నాడని పట్టుకుందామంటే చేతులూ, కాళ్ళు పని చెయ్యలేదంటూ ఆమె కలవచ్చిందని చెప్పినా, నాకు మాత్రం ఆ సంఘటన యథార్థంగా జరిగిందన్న భావనే కలిగింది ఇప్పటికీ ఆ విషయం తల్చుకుంటే అనిర్వచనీయమైన భయం, భక్తి, పారవశ్యాను భూతులకు లోనవుతుంటాను.

చూశారా! అపద మ్రొక్కులవాడి మహిమలు ఎంత మహిమాన్వితాలో! అంతేకాదు అతడి లీలలు అనంతాలు, అనిర్వచనీయాలు ఆపదల్లో ఏడుకొండలవాడా అని ఎలుగెత్తి పిలిస్తే 'ఓయని' పలుకుతూఅభయాన్నిచ్చి ఆదుకుంటాడు. అయితే! ఆపదమ్రొక్కుల్ని అలక్ష్యంచేసినా, అపహాస్యం చేసినాదండించి మరీ వడ్డీతో వసూలు చేస్తాడన్నది నిజం. అందుకే వడ్డీకాసుల వాడయ్యాడు అతడికి కావలసింది పరిపూర్ణమైన భక్తిభావం మాత్రమే. మనసారానమ్మి నమస్కరించినా ఆనందంగా అందుకుంటాడు కొబ్బరికాయ అయినా, కొండంత సంపదఅయినా అతడి దృష్టిలో సమానమే. అందుకే అతడు ప్రేమైక స్వరూపుడనేది

— శ్రీమతి

గొంగాళ ప్రభావతిబోగారావు

ప్రపంచం అంతా ప్రవిమల ప్రేమ తత్త్వం మీదనే ఆధారపడివుంది. తల్లితన మాతృప్రేమాఽమృతంతో రంగరించిన తన పాలిచ్చి తన సంతానమును అల్లారు ముద్దుగా లాలించి పాలించి పెంచి పెద్ద చేస్తుంది. ఈ "తల్లి మన స్తత్త్వం" అన్ని జీవులలో అనాదినుండీ అవిచ్ఛిన్నంగా వస్తూన్నదే. మొదటినుండీ ఇట్టి ప్రేమాఽ మృతంతో పెరిగిన సంతానంలో "సహజ ప్రేమ" అనేది అంకురించి క్రమంగా అదే "సర్వభూతప్రేమ" గాను ఆ ప్రేమే పరిణామంలో "విశ్వప్రేమ" గాను వికసించి విరాజిల్లుతుంది.

ఇట్టి మాతృప్రేమాఽమృతాఽస్వాదనకు నోచుకోని సంతానంలో "సహజప్రేమ" అనేది సన్నగిలి క్రూరస్వభావాదులు జనించడం ద్వారా అవి వారిజీవితాన్ని అశాంతిమయం చేస్తాయి.

## ప్రేమశబ్దార్థం :—

'ప్రీఞ్ తర్పణే' అనే ధాతువు నుండి ప్రేమశబ్దం పుట్టింది. తర్పణం అనగా సంతృప్తి పర్చడం అని అర్థం. అంటే, మానవుల మానసంతోపాటు వారి సర్వేంద్రియాలను సమధిక సంతోషంతో సంతృప్తి పరచేదే "నిజమైన ప్రేమ" అనిపించుకొంటుందని మీది ధాత్వర్థం తెలుపుతుంది.

## ప్రేమస్వరూప స్వభావాలు :—

ఈ ప్రేమకు ఫలరూపమైన ప్రేయసీ ప్రియులయొక్క రమ్య 'రతి' వారికి సర్వేంద్రియ సంతర్పణం చేస్తూ తద్ద్వారా అది వారికి బ్రహ్మానందదాయకమౌతుందని అల్లసాని పెద్దన కవీంద్రుడు తన 'మను చరిత్ర'లోని ప్రవరాఖ్యునికి వరూధిని ముఖతః ఇలా చెప్పిస్తాడు.

'ఎందేడెందము కందళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిం
జెందున్ కుంభగత ప్రదీపకళికా
శ్రీ దోప నెందెందుఁ బో
కెందెనింద్రియముల్ సుఖంబుగనునా
యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మయటన్నఁ బ్రాఁజదువునం
తర్బుద్ధినూహింపుమా॥

మీది పద్యంలోని పలుకులు భౌతికంగా భోగలాలస ఐన ఒక గంధర్వకాంతకు చెందినవే ఐనా, వీనిలో గమనింపదగిన పరమార్థం (Inner meaning) ఎంతో ఉంది. ఎట్లనగా – పరబ్రహ్మ వాచకమైన 'ఎందున్' అనే సర్వనామశబ్దం మీది పద్యపాదత్రయంలో ప్రయోగింపబడడం చేత, సర్వ సాధారణమైన లౌకికరతి ఇట, అలౌకిక బ్రహ్మాఽనందంగా పరిణమించింది. కారణం – లోకంలో ప్రేయసీ ప్రియుల సంగమసమయంలో వారి మానసిక వృత్తులు "ఒకే ఒక సుఖప్రాప్తి" అనే ఏకలక్ష్యప్రాప్తికి అభిముఖాలై 'ఏకాగ్రత'తో ఒకే ఆనందకేంద్రంలో సంగమించడం చేత పరబ్రహ్మస్థానం చేరుకొన్న ఆ యింద్రియాలు బ్రహ్మాఽనందాన్ని అందుకొంటాయి. ఈ విశిష్టవిషయాన్ని సూచించడానికే పెద్దన కవి తన పద్యంలో —



"ఆ యింపే పరబ్రహ్మము" అదే. 'ఆనందో బ్రహ్మ' (బ్రహ్మానందం) అన్నాడు. ఈ 'సమాధిస్థితి' అటు పరమయోగులకు, ఇటు ప్రేమయోగులకు సమానమే. కనుకనే ఇందలి 'ఎందేన్' అనే సర్వనామ ప్రయోగం = ఎందేన్ = ఏ రతియందు, అనీ, ఇట్లే ఎందెన్ = ఏ పరబ్రహ్మ ధ్యానమందు, అనీ ఉభయసాధారణంగా సమన్వయించింది.

## ఆధ్యాత్మికప్రేమ :—

"ప్రేమ" భౌతికం, ఆధ్యాత్మికం అని 2 రకాలుగా మారుతుంది. ఆత్మకు సంబంధించినదే 'ఆధ్యాత్మికం'. అనగా ఆత్మస్వరూపుడైన పరమేశ్వరునియందు సహజంగా జనించిన భక్తిమయ 'ప్రేమ' యే "ఆధ్యాత్మికప్రేమ" అనిపించుకొంటుందని భావం. ఉదాహరణంగా–శ్రీకృష్ణసాన్నిధ్య ప్రాప్తియే పరమ ధ్యేయంగాగల "గోపికల ప్రేమ" పరిణామంలో 'ఆధ్యాత్మికప్రేమ'గా పరిణమించిన విశిష్ట విషయాన్ని 'భక్త పోతన కవి మనచేతికి ఇలా అందించినాడు.

"— అంత శ్రీకృష్ణపరమాత్మ — అమలినంబైన పులినంబు (ఇసుకతిన్నె) ప్రవేశించె. గోపికలును, జ్ఞానకాండంబున నీశ్వరుంగని శ్రుతులు ప్రమోదంబునన్ కామాఽను బంధంబులు విడిచిన విధంబున శ్రీహరింగని గోపికలు విరహవేదనలు విడిచి పరిపూర్ణమనోరథలైరి" (భాగవతం 10 స్కం పూర్వభా. 1069) ఈ గోపికలప్రేమ మొదట కామమూలకమైనా, ఆ కామం శ్రీకృష్ణ సాయుజ్యప్రాప్తియే పరమలక్ష్యంగా కలది కనుకను, ఉత్తమ ధ్యేయంకల అట్టికామం "మోక్షానికి సంబంధించిన కామమే" అగునని భరతుడు తన నాట్యశాస్త్రంలో పేర్కొనుట చేతను, గోపికలకామం వారి ముక్తికే సాధనమయింది. ఇట్లు వీరికామం క్రమంగా "భక్తి భూమికలు" దాటి 'మధురభక్తి'గా మారడం, ఆ భక్తికి శ్రీహరి వశుడు కావడం ఆ పరమేశ్వరానుగ్రహసిద్ధితో వారు సర్వబంధ విముక్తలై ముక్తలు కావడం జరిగింది.

ఇక ఇట్లే, ముల్లోకాలలో 'ఏకైక సౌందర్యవతి' అనిపించుకొన్న పార్వతీదేవి యొక్క మొదటి భౌతికసౌందర్యం మహేశ్వరుణ్ణి వశం చేసుకోలేకపోగా – అంటే ఆమె భౌతికప్రేమకు పరమేశ్వరుడు వశుడు కాకపోగా – ఆమె కఠోర తపస్సుచేసి తన భౌతికప్రేమను 'ఆధ్యాత్మికప్రేమ'గా తీర్చిదిద్దుకొన్న పిమ్మట ఆ ఆధ్యాత్మికమూర్తి ఆమెకు అధీనుడవడం జరిగింది. ఇంతకూ ఆధ్యాత్మికశక్తిముందర భౌతికశక్తి, శక్తి-రహితమైనదనీ, మానవమండలికి బ్రహ్మానంద ప్రదమైనది ఒక్క ఆధ్యాత్మిక ప్రేమ మాత్రమే సనీ తెలిసింది.

ఇట్టి ప్రేమను ప్రేరేపించే పవిత్ర సహజ సౌందర్యంకూడా మానవులకు నిత్య సంతోష సంధాయక మౌతుందని —

'A thing of beauty is a joy for ever అనే 'కీట్సు' పండితుని మహితసూక్తి స్పష్టం చేస్తూంది.

## ప్రేమలో రకాలు :—

ఈ 'ప్రేమ' వేర్వేరు సన్నివేశాలలో, వేర్వేరు భావాలతో కూడినపుడు అది రక



## ప్రకటన
# గొడుగుల పంపిణీ

మైకు సెట్లువలెనే ఏళ్ళై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల రూ. 600/- అవుతుందికనుక టి. టి. డి. కార్య నిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

రకాల ఆనందాలను అందిస్తూంటుంది. ఉదా: మాతృప్రేమ, పితృప్రేమ, పతిప్రేమ, ప్రేయసీప్రేమ, బంధుప్రేమ, దైవప్రేమ, దేశప్రేమ, కాముకప్రేమ వంటివి రకరకాల ప్రేమలు.

### భౌతికప్రేమ :-

మనం ప్రస్తుతంలో 99¾% భౌతికప్రేమ లోనే మన జీవితయాత్ర సాగిస్తున్నాం. ఈ ప్రేమ ప్రారంభంలో భౌతిక భోగాభిలాష కల వానికి ఆకర్షణీయంగా అగపడినా, పరిణామంలో మాత్రమిది(ధర్మరహితమైనచో) దుఃఖఫలితమే ఔతుందని, కనుక జ్ఞానులు ఆ భౌతిక భోగానుభవాలకై ప్రాకులాడరనీ ఈ గీతాసూక్తి ప్రపంచానికి ఇలా ప్రబోధ గావించింది.

'యే హి సంస్పర్శజా భోగాః దుఃఖ
యోనయ ఏవ తే।
అద్యంతవంతః కౌంతేయ న తేషు
రమతే బుధః॥'

ఈ ప్రబోధాన్ని ఋజువు పరచే లౌకిక నిదర్శనమిది.

మొదటి ప్రవరాఖ్యుడు, తనను సర్వవిధ శృంగార చేష్టా ప్రదర్శనంతో లోబరచు కొనుటకు ప్రయత్నిస్తూన్న వరూధినిని నిలువరిస్తూ ఆ కుమారసోమయాజి ఆ గంధర్వ కాంతతో ఇలా అంటాడు.

"........ చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్
మీసాలపై తేనియల్"

మీది వాక్యాలను బట్టి ధార్మికదృష్టి కల వానికి, పరకాంతయొక్క భౌతికప్రేమ ఏవగింపునే కలిగిస్తుందని స్పష్టమౌతూంది. ప్రస్తుతంలో వరూధిని ప్రథమ ప్రవరాఖ్యుని యెడ ప్రదర్శించిన సమ్మోహనకర శృంగార సామగ్రి అంతా ఒక ధార్మికయువకుణ్ణి కొంచెమైనా చలింపజేయలేక పోవడమనే సన్నివేశం, మీది గీతాసూక్తిలోని సత్యాన్ని ఋజువుచేస్తుంది.

### కామమూలకప్రేమ :—

ఇక, ధర్మాన్ని "త్రోసి" వేసి దాని అద్యస్థానాన్ని ఆక్రమించి ప్రాబల్యం వహించిన కామమూలకప్రేమ, ఆ ప్రేమికుని నాశానికే దారితీస్తుంది. దీనికి ముఖ్యలక్షణం కులస్త్రీని బలాత్కరించడం, ఇట్టి పాశవిక ప్రేమ వలలో చిక్కి కృశించి నశించిన వారిలో ముఖ్యులు, రావణాసురుడు, కీచకుడు. రావణుడు శివపూజా ధురంధరుడై ఇంద్రియలోలుడు కానంత వరకు ముల్లోకవాసులను గజగజలాడించి నాడు. అంతటి చక్రవర్తికి సీతామాతయెడ కామవాంఛ ఏ క్షణంలో పొడసూపినదో ఆ క్షణం చక్రవర్తి వినాశనానికి నాంది వాక్యం పలికింది. ఈ సత్యాన్నే స్పష్టం చేస్తూ మండోదరి స్వపతి మరణానంతరం ఇలా విలపిస్తుంది.

'ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం
త్వయా।
స్మరద్భిరివ తద్వైర మింద్రియైరేవ
నిర్జితః।
(రామాయణం యుద్ధకాండ)

ఓ ప్రాణేశ్వరా ! నీవు నీ ఇంద్రియాలను నీ స్వాధీనంలో ఉంచుకొన్నంత కాలమూ నీవు ముల్లోకాలను జయింప కలిగినావు. అప్పుడు నిన్ను వివేకభ్రష్టుణ్ణి చేయలేని నీ ఇంద్రియాలు నీ మీద వైరంవహించినవై నీవు ఇంద్రియ లోలుడవయే తరుణం కోసం వేచి ఉన్నాయి. నీవు సీతామాతను అపహరించినక్షణం, ఆ ఇంద్రియాలకు మంచి తరుణంగా మారుటచేత నిన్నవి కసితీరా కబళించేశాయి."

విశ్వశ్రేయ స్సంపాదన ధ్యేయంతో వాల్మీకి మహర్షి చేసిన విశ్వసందేశ మిది. ఇది సర్వులకూ సర్వదా సర్వాఽభ్యుదయ సంధాయక మగుటచేత అది ప్రపంచమంతటికీ ప్రాతస్స్మరణీయము. ఈ మహా సందేశాన్నే గీతామాత ఇలా అనువదించింది.

'త్రివిధం నరకస్యేదం ద్వారం
నాశనమాత్మనః।
కామఃక్రోధ స్తథా లోభః తస్మాదే
తత్త్రియం త్యజేత్॥
(గీ. అధ్యా. 16-శ్లో-21)

మానవుణ్ణి సులభంగా నరకంలో ప్రవేశ పెట్టుటకు, కామక్రోధ లోభాలనే మూడూ,

మూడు రకాల ముఖద్వారాలు. మానవుని వినాశానికి కూడా ఇది దగ్గర మార్గం. కనుక ఇట్టి ఈ మూడింటినీ తన శ్రేయస్సును కోరినవాడు తప్పక విడువవలసిఉంది. ఈ గీతాసందేశం ప్రతిఒక్కని జీవితరక్షణకు 'శ్రీరామరక్ష'గా ఉపకరించగలదు. కనుక సర్వానర్థమూలమైన ఈ కాముక ప్రేమను ప్రతిఒక్కడూ దరిజేరనీయరాదని స్పష్టమయింది. ఇది నరకద్వారం కదా!

**ఆదర్శదంపతీప్రేమ :—**

"ధర్మాఽర్థకామాలు" అనే మూడు పురుషార్థాలను, ఒకదాని వలన మరొకదానికి విఘాతంలేని రీతిలో మూడింటినీ, సమాన గౌరవ ప్రాధాన్యాలతో (శ్రేయస్కామి) సేవించవలెను' అని మనుస్మృతి, 'ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా' అనే ఉపనిషత్సూక్తిని బట్టి, జీవకోటియొక్క సర్వవిధాభ్యుదయసిద్ధికి ధర్మం మూలమైనది. ఇట్లే మానవులదైనందిన జీవనయాత్రలో అర్థం అడుగడుగునా అవసరమే. మూడవదైన కామం మానవుల నిత్యజీవిత కార్యక్రమాలతో పెనవేసుకుంది. ఇంతటి ముఖ్యపాత్ర వహించిన కామం ప్రబలకామ రూపంలో ధర్మ రహితంగా సేవించిననాడు నాభివలె జీవితానికే అదినాశనకరమౌతుంది. ఇక ధర్మపురుషార్థం అడుగుజాడల్లో నడచిన కామం సత్సంతానప్రదమై సంఘశ్రేయస్సునకు కారణమౌతుంది. కనుకనే మన వివాహ సంస్కారంలో కన్యాదాత మాత్ము వరునకు 'నీవీమెతోకూడి ధర్మార్థకామాలను సమాన గౌరవంతోనే సేవించవలెను అని షరతు పెట్టి మరీ కన్యాదానం చేస్తాడు. ఈ సంప్రదాయం కారణంగా కామం ధర్మం అడుగుజాడలలో ధర్మసహకారిగా ఉండి దంపతులకు ధర్మపూతమైన పవిత్రప్రేమను ప్రసాదిస్తుంది. ఉదాహరణకు:= శ్రీ సీతారాముల కామపురుషార్థం, పాతివ్రత్యం, ప్రజానురంజనం అనే వారి ధర్మపురుషార్థంలో లీనమై అది ఆ ఇద్దరి ధర్మ పురుషార్థానికి అడ్డురాలేదు. కనుకనే ఇద్దరు అడవులపాలైనా, రామునిచే సీత అడవిలో దిగపెట్టబడినా, అనగా ఎంతటి విషమ సన్నివేశాలు ఎంత ప్రాప్తించినా పరస్పరం వారి దంపతి ప్రేమ చెక్కుచెదరలేదు. యుగయుగాలు గడచినా ఈ ఆదర్శదంపతుల ప్రేమాఽమృతమును "జానక్యాః కమలాఽమలాంజలి పుటే యాః పద్మరాగాయితాః ——" అనే శ్లోక కుసుమం నుండి మనం ఆస్వాదించి బ్రహ్మానంద భరితుల మౌతున్నాం. ఆధ్యాత్మిక ప్రేమ అట్టిది కాదు! ధర్మసంసర్గం ప్రపంచ జీవితానికే మంగళజ్యోతికదా!

**ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి**

---

( 14వ పేజీ తరువాయి )

అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥

అలా తెలుసుకోలేని మరికొంతమంది, గురువుల ఉపదేశం పొంది ఉపాసిస్తారు. వినడంలో శ్రద్ధ కలిగినవాళ్లు కూడా సంసారరూపమైన మృత్యువునుంచి ముక్తిపొందుతారు.

యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్, తద్విద్ధి భరతర్షభ॥

అర్జునా! ఈ ప్రపంచంలో పుడుతున్న చరాచరాత్మకమైన ప్రతివస్తువూ ప్రకృతి పురుషుల కలయికవల్లనే కలుగుతున్నదని తెలుసుకో.

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి॥

శరీరాలు నశిస్తున్నా తాను నశించకుండా సమస్త ప్రాణులలోనూ సమానంగా వుండే పరమాత్మను చూసేవాడే సరైన జ్ఞాని.

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్॥

పరమాత్మను సర్వత్రా సమానంగా వీక్షించేవాడు తన్ను తాను హింసించుకోడు. అందువల్ల అతను మోక్షం పొందుతాడు.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మానం అకర్తారం స పశ్యతి॥

ప్రకృతివల్లనే సమస్తకర్మలూ సాగుతున్నాయని, తానేమీ చేయడం లేదనీ తెలుసుకున్నవాడే నిజమైన జ్ఞాని.

యదా భూతపృథగ్భావం ఏకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా॥

వేరువేరుగా కనిపించే సర్వభూతాలు ఒకే ఆత్మలో వున్నాయనీ, అక్కడనుంచే విస్తరిస్తున్నాయనీ గ్రహించినప్పుడు మానవుడు బ్రహ్మపదం పొందుతాడు.

అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాఽయమవ్యయః।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥

అర్జునా! శాశ్వతుడైన పరమాత్మ పుట్టుకలేనివాడూ, గుణరహితుడూ కావడంవల్ల దేహంలో వున్నా దేనికీ కర్త కాడు. కనుక కర్మఫలమేదీ అతనిని అంటదు.

యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే॥

అంతటా వ్యాపించివున్నా, సూక్ష్మమైన ఆకాశం దేనినీ అంటనట్లు శరీరమంతటా వున్నా ఆత్మ కలుషితం కాదు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥

అర్జునా! సూర్యుడొక్కడే ఈ సమస్త లోకాన్ని ప్రకాశింప చేస్తున్నట్లే; క్షేత్రజ్ఞుడైన పరమాత్మ క్షేత్రమంతటినీ ప్రకాశింపచేస్తున్నాడు.

క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం అంతరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్॥

ఇలా క్షేత్రక్షేత్రజ్ఞుల భేదాన్ని ప్రకృతి గుణాలనుంచి ప్రాణులు మోక్షం పొందే విధానాన్ని జ్ఞానదృష్టితో తెలుసుకున్నవాళ్లు పరమపదం పొందుతారు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం" అనే పదమూడవ అధ్యాయం సమాప్తం.

( 42వ పేజీ తరువాయి )

"నా ప్రేమ, భక్తులు సదా మీయందే ఉండునుగాక. ఎప్పుడును నాఅంతరంగము వేరువై పునకుతిరుగకుండునుగాక. రామకథ జగత్తున వినిపించునంతవరకును నా తనువు జీవించుగాత. నేను బ్రతికినన్ని నాళ్ళును అప్సరలుమీచరిత్రమును గానముచేయుచు నాకు చెప్పుచుందురుగాక, యావజ్జీవిత మును ఇటులనే జరుగవలెనని నా కోరిక" అని మనవి యొనరించును. ఈ మాటలు విన్నంతనే రాముడు అతనిని గాఢముగా ఆలింగించు కొని, "నీవు కోరినట్లే అగును." అని పలుకును. ఈ ఉద్దేశముచేతనే రాముడు సరయూప్రవేశవేళ ఆంజనేయుని తనతో కూడ రానీయలేదు, అపుడు హనుమంతుని వీడ్కొనుచు శ్రీరాముడిట్లు చెప్పెను:- ఎప్పటి వరకు భూలోకమున నా కథ ఉండునో అప్పటివరకును జీవించుటకు నీ విష్టపడినావు కాన నీవు నాతో వచ్చుటకు వీలు లేదు. నాకథ వినవచ్చువరకును నీవు భూలో కముననే ఉందువు."

రామాయణ ముండువరకును ఆంజనేయుడు భూలోకమున నుండును. హనుమంతుడు లేక రామాయణ ముండుట ఎట్లు పొసగును ?

గోష్పదీకృతవారాశిం
మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలా
రత్నం వందేఽనిలాత్మజమ్ ॥

— ఎస్. వరదరాజాచార్

[ ఈ వ్యాసరచనకు తోడ్పడిన 'శ్రీరామన కథెయల్లి ఆదర్శగళు' అను కన్నడ గ్రంథకర్తకు కృతజ్ఞతలు ]

# దివ్యమంత్ర పంచకము

— టి. రాఘవయ్య

శ్రుతి స్మృతుల ఆధారముగ చేసికొని, హిందూమతమున పాటింపబడు పవిత్ర మంత్రములు అయిదు. వీని ప్రాధాన్యత, ఉపయోగములను గూర్చి తెలిసికొనుట మానవ సంస్కృతికెంతయో ఉపకరించును.

"తిరుప్పావై ప్రబంధము దైవకైంకర్యమును ప్రేరేపించునదియై, ప్రణవ మంత్రము, పంచాక్షరీమంత్రము, అష్టాక్షరీ మంత్రము, ద్వయమంత్రము, గీతాచరమ శ్లోకము మున్నగు దివ్యమంత్రార్థశోభితమై అలరారుచున్నది."

ఇప్పుడిచట ఆ విషయము వివరింపబడుచున్నది. ఈ వివరణము సర్వులకును అతి ముఖ్యమును, అవసరమునై యున్నది. మంచివిషయములను పొందుట యొకటి; వాని భావమును పూర్తిగా గ్రహింపగలుగుట మరి యొకటి. అర్థరహితముగా పలికిన మాటయు, చేసిన పనియు, వ్యర్థము. జ్ఞానార్జనయందును, జ్ఞానప్రబోధమునందును రహస్యమనునది లేదు. ఏలననగా జ్ఞానముయొక్క ఉద్దేశము మానవాభ్యుదయము గదా!

(1) "ఓం" ను ప్రణవనాదము, ఓం-కారము, ప్రణవమంత్రము, ఏకాక్షరీ మంత్రము అని వివిధనామముల భక్తులు పాటించుచున్నారు. ఇది వేదోపనిషత్తుల యందు ప్రతిపాదింపబడినది.

"గిరామస్మ్యేకమక్షరమ్" (పలుకులలో ఏకాక్షరమైన ప్రణవమును నేను") అని గీతా ప్రమాణముగదా! (గీతా. 10-25).

ఓం=అ+ఉ+మ. "అ" దైవశక్తిని, "మ" జీవకోటిని, "ఉ" అచిత్ పదార్థమును (లేక సర్వసంపదను, లక్ష్మిని) సూచించును. కావున "ఓం" అనునది తత్త్వత్రయ జ్ఞానమును వెల్లడించుచున్నది. విశ్వము యీ తత్త్వత్రయముతో, అనగా చిత్, అచిత్, ఈశ్వర, అను మూడింటితో గూడినదియై యున్నదనియు, వీనినిమించి యిక విశ్వములో అన్యము లేదనియు, శ్రీరామానుజుడు తన విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదనకు మూలమయిన తత్త్వత్రయ జ్ఞాన విషయమున తెలిపి యున్నారు. తత్త్వత్రయజ్ఞానము శాస్త్రీయము, వాస్తవము, సత్యమును అయివున్నది.

ఇట్టి తత్త్వత్రయ విజ్ఞానమునకు సాంకేతికమయిన "ఓం" ఏకాక్షరీ మంత్రమయినది. ఇది ఒక సూత్రము. మంత్రమనగా సూత్రము, జ్ఞానము, సలహా అని వివిధార్థముల భావింపబడుచున్నది. కావున "ఓం" అనునది యెట్టి విశిష్ట మంత్రమో గమనింపదగియున్నది.

"ఓం" కారము స్వరరూపము. ఇది సృష్టియందు ఆది ప్రణవ స్వరము. పంచభూతములలో నొకటయిన ఆకాశము (శూన్యప్రదేశము) స్వరపూరితము గదా! ఇది "ఓం" కార స్వరము.

"ఓం" కార ప్రణవ నాద స్వరూపము భగవచ్ఛక్తి అని చెప్పబడినది గదా! అనగా సర్వాంతర్యామి యగుశక్తి "విశ్వాంతరాళ వివిధ గోళ భ్రమణ జనితనాద గాన శ్రవణ వినోదియైన ఆ యేకైకనాథుడని" ఆంగ్ల కవి శిఖామణి విలియం షేక్స్పియర్ అలంకార యుతముగా భగవచ్ఛక్తిని అభివర్ణిస్తాడు.

"ఓం" కారమును కారణయుక్తముగా మననము చేయుట అనగా తత్త్వత్రయ జ్ఞానమును స్మరణకు దెచ్చుకొని, తత్త్వత్రయజ్ఞానము ప్రకారము తన స్థితిని, ఉనికిని, ప్రభావమును గమనింపగలుగుట యగును. దీనినే ఆత్మజ్ఞానమంటారు. విశ్వము తత్త్వత్రయములతో కూడినదని భావింపబడినట్లు, తానుకూడా తత్వత్రయములతో కూడిన దానినిగా చేతనుడు గమనింప వలసియున్నది.

అంతియేగాని "ఓం" కారమును జపించుట అనగా కేవలము నోటితో అనంతముగా ఉచ్చరించుటగాదు. తత్త్వత్రయజ్ఞానమును మనస్సునకు దెచ్చుకొని, వినమ్రము



డయి, శరణాగతి భావమున నుండుట, ఇదియే భగవచ్ఛక్తిని పొందుటయగును. ఓంకారస్వరూపజ్ఞానము వ్యక్తికిని, సంఘమునకును శాంతిని చేకూర్చును-అర్థయుక్తమయిన శాంతిని, తృప్తిని చేకూర్చును. విశ్వమానవ సౌభ్రాత్రమును నెరపును. కావున ఏకాక్షరీ మంత్రము ఒక దివ్య మంత్రము. ఎంతటి విజ్ఞానము ఒక్క అక్షరమున కూర్చబడి యున్నదో గదా!

(౭) "నమశ్శివాయ" అనునది పంచాక్షరీ మంత్రము. సర్వాంతర్యామియగు భగవచ్ఛక్తి (వైష్ణవశక్తి, లేక ఈశ్వరశక్తి) రెండువిధములుగా, ద్వంద్వముగా, అనగా శివముగాను (మంగళకరముగాను) రౌద్రముగాను (భయంకరముగాను) ఉండును. ఇందు అల్పజ్ఞానియు, పరిమిత శక్తియుతుడును అగు సంసారియయిన మానవుడు భగవచ్ఛక్తియొక్క శివతత్త్వమునే (శుభస్కరమయిన తత్త్వమునే) గ్రహించి ఆనందింపగలడు. రౌద్రతత్త్వమును అతడు సుస్వాగతింపగలడా! శివ, రౌద్ర శక్తులను రెంటిని సమానముగా స్వాగతించి, గ్రహించి, సంశ్లేషింపగల శక్తి భగవానులకే, ఆళ్వారులకే, యొప్పును. కావున సంసారియయిన చేతనుడు పంచాక్షరీమంత్రమును సేవ్యముగా భావించును. ఇది సహజముకూడాను. అనిర్వచనీయమును, అనంతమును, గంభీరమును అయిన విశ్వమునంతటిని మానవుడు ఒక్కసారిగా అవగాహన చేసికొనగలడా! శివాంశమును, అనగా తనకు సుఖకరమయిన అంశమునే స్వీకరింప కాంక్షించును. విశ్వరూపమును గాంచిన అర్జునుడు అందులోని రౌద్రభాగమును చూడ నశక్తుడాయెను. అందువలన శ్రీకృష్ణుని వ్యక్తిగత శివ స్వరూపమునే (మంగళస్వరూపమునే) చూడ నర్జునుడు కాంక్షించెను.

అందువలననే విశిష్టాద్వైతసిద్ధాంతము అనంతకల్యాణ గుణప్రపూర్ణమయిన సాకార వైష్ణవశక్తి సేవ్యము, ఆనందకరము అని భక్తులకు సూచించును. అందువలన పంచాక్షరీ మంత్రము శైవమును, వైష్ణవమును అగుచున్నది - కావున శైవము, వైష్ణవము పరస్పర వ్యతిరేకములుకావు. తొక్క, కండ కలిసి కదళీఫలమగుచున్నది. తొక్క ఒక్కటియే కదళీఫలమనిపించుకొనునా? అట్లే కండ ఒక్కటియే కదళీఫలమనిపించుకొనునా? కాని తొక్క ఒక్కటికంటెను, కండ ఒక్కటికంటెను సంపూర్ణమయినదిగదా కదళీఫలము? తొక్క కదళీఫలమునకు అసంబంధమయినది కాదు కదా! సత్యమిట్టిది.

భగవచ్ఛక్తి (సర్వాంతర్యామిశక్తి) శివము, శంకరము, రౌద్రము, శాంతము అని విష్ణుసహస్రనామ స్తోత్రమున గలదు గదా! ఇది వ్యాసప్రోక్తముగదా! అందువలన భాగవతమున కృష్ణుని, రామాయణమున రాముని పురుషోత్తములుగా వర్ణించుతరి, వారిని సత్యసౌందర్య సుగుణరాసులని వర్ణించునపుడు, ఆ గ్రంథములు రెండును పంచాక్షరీ మంత్ర సౌరభమును గదా వెదజల్లుచున్నయవి? మంగళకర దీప్తులను గదా ప్రసరింపజేయుచున్నవి?

"పంచాక్షరీ మంత్రస్మరణ" అనగా అర్థరహితముగా, అర్థము మనసునకు దెచ్చుకొనక, "పంచాక్షరి" ని జపించుట కాదు. ఆ మంత్రార్థమును మననముచేసికొని దానిని ఆనందించి, సంఘమున, ప్రపంచమున సర్వము శుభస్కరముగా నుండుగాక అని మంగళాశాసనము చేయుట అగును, భగవద్గుణములగు మంగళకర గుణములకు పల్లాండుచెప్పుటయగును.

"శివ శివ అనరాదా, భవభయ బాధల నణచుకోరాదా" అను శ్రీత్యాగ రాజస్వామి కీర్తనప్రకారము," "మనము సర్వుల శుభమును కోరుచు, ద్వేషరహితులముగా నున్నయెడల, మనకు భవ భయ బాధలు ఉండవు" అని భావము. అంతియేకాని కేవలముశివ, శివ,అనునామోచ్చారణగాదు, నామ జపము గాదు. ఈ పంచాక్షరీమంత్ర స్మరణ మానవుని ద్వేషరహితునిగాను, అజాతశత్రునిగాను, సానుభూతిపరునిగాను, కరుణామయునిగాను, అఖిలమానవ సౌభ్రాతృత్వముగల వానినిగాను, శాంతికామునిగాను, పరమానందభరితునిగాను చేయును. ఈ ఉద్దేశముతోనే లోకహితులగు ఋషులు పూర్వము ఈ పంచాక్షరీ మంత్రము నల్లిమానవ లోకమున కొసంగిరి. పంచాక్షరీమంత్ర దివ్య ప్రభావము వలన చేతనుడు తన ఉత్కృష్టతను తెలిసికొనును: ఇదియే భగవచ్ఛక్తిని తెలిసికొనుట యగును; ఆ శక్తియేగదా యే ఘటము నందలి జీవమునకు కారణమయియున్నది! కావున పంచాక్షరీమంత్రము మానవుని ఉత్తేజపరచు దివ్యమంత్రము.

"నమశ్శివాయ" అను పంచాక్షరీ మంత్ర జపమెందులకు? శివుడనుదైవ మూర్తిని చూచుటకా? లేక ప్రకృతిలోని శివంకరమయిన మంగళకరసౌందర్యదృశ్యములనుచూచి ఆనందించి, సంశ్లేషించుటకా, సంఘ సంక్షేమ, సౌభాగ్య, ఆనంతక్షేమములనుకోరి, పొంది, ఆనందించుటకా?

(౩) "ఓం నమో నారాయణాయ" అనునది అష్టాక్షరీమంత్రము. దీనిని వైష్ణవాచార్యులు తిరుమంత్ర మందురు. మంత్రరాజమిది.

ఓం + నమో + నారాయణాయ అను మూడు పదములతో గూడిన ఎనిమిది అక్షరముల మంత్రమిది.

"ఓం" నుగూర్చి యింతకు ముందే తెలిసికొన్నాముగదా!

"నారాయణాయ" అనుశబ్దము సర్వాంతర్యామి యగు వైష్ణవశక్తిని సూచించును.

కావున అష్టాక్షరీమంత్రము యొక్క భావము, "తత్త్వత్రయ జ్ఞానముతో నేను సర్వాంతర్యామి యగు వైష్ణవశక్తికి శరణాగతుడనగుచున్నాను" అని. ఇది వైష్ణవ మంత్రము. అనగా సర్వాంతర్యామి శక్తిని గురించిన మంత్రము, పంచాక్షరి "శివ మంత్రము" అని పిలువబడుచున్నదిగదా! ఈ వైష్ణవ, శైవ, మంత్రములకు గల

సంబంధమును మనము తెలిసికొని, ఆనందింపవలసియున్నది, ఇవి పరస్పర విరోధములయినట్టివిగావు.

"శివ మంత్రమునకు "మ" జీవము- మాధవమంత్రమునకు "రా" జీవము- అని త్యాగరాజస్వామి తన "ఎవరని నిర్ణయించెదిరా" అను కీర్తనయందు భగవచ్ఛక్తిని నిర్ణయించి, నిర్వచించు సందర్భమున అంటాడు. ఈ వైష్ణవ, శివమంత్రములయొక్క (ఈ అష్టాక్షరీ, పంచాక్షరీ మంత్రములయొక్క) బీజాక్షరములను, లేక, జీవాక్షరములను కలిపిన, "రామ" అను శబ్దము ఏర్పడునుగదా! "రాముడు" అనగా సర్వులను రంజింపచేయువాడని భావము. సక్రమమయిన జీవితమును గడపుచూ, పరోపకారార్థ కార్యములనెరవేర్చుచూ, సర్వులను రంజింపజేయు విధమున చేతనుడు జీవయాత్రగడుపవలయును. అందువలన "రామ" మంత్రముయొక్క ప్రాధాన్యతను ఇట్లు గమనింపవలయును, "ఈ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి సజ్జనుడై యుండుట భద్రమంచు దలతున్" అని ప్రహ్లాదు డంటాడు. "సజ్జన జీవితము" ఎంతటి ప్రధానమో గమనింప దగియున్నది. "రామ" శబ్దమునకు "సజ్జన" శబ్దమునకు ఇట్టి సామ్యమున్నది. "రాముడనబడువాడే సజ్జనుడు- సజ్జనుడన బడువాడే రాముడు."

(బీజాక్షరము, జీవాక్షరము అనగానేమో యిత్తరిగ్రహించుట అవసరము. "నమశ్శివాయ" నుండి "మ" అక్షరమును తీసివేసిన "నశివాయ" అగును. భగవచ్ఛక్తి శుభస్కరమైనదని మొదటి శబ్దము తెలుపుచుండగా, భగవచ్ఛక్తి శుభస్కరముకానిది అని రెండవ శబ్దము తెలుపుచున్నది. కావున "మ" కారములోపింపగా మొదటి పదము రెండవ పదము పరస్పర వ్యతిరేకములగుచున్నవి, "నమశ్శివాయ" లో 'మ' కారము యొక్కబలమిట్టిది, అందువలన "మ" బీ జాక్షరము, లేక జీ వాక్షరమయినది. అదేవిధముగా "నారాయణ" శబ్దము సర్వాంతర్యామి అని అర్థమునిచ్చును- "ర" కారమును తీసివేసిన 'నాఅయన' అగును- దానిభావము 'సర్వాంతర్యామి కాదు" అని కావున "రా" అను అక్షరము వైష్ణవ మంత్రమున బీజాక్షరమగుచున్నది. సంస్కృత పదమునందు ప్రతి అక్షరము బీజాక్షరము, బీజాక్షరముకాదు. ఏ యక్షర లోపమున అర్థము తారుమారై పోవునో, ఆ యక్షరమునే జీవాక్షరమంటారు.)

శివ, వైష్ణవ మంత్ర జపములు, మనన ములు తన్నుతాను "రాము"నిగా మార్చుకొనుటకే- సంఘమున ప్రతివాడు "రాము"డయితే, యిక ప్రపంచము స్వర్గమేకదా- సు వర్గమే కదా! "రామరాజ్య" మనగా రాజ్యములోని ప్రతియొక్కడు "రాముడు" గానుండుట, సజ్జనుడుగానుండుట, అని భావము. అంతేగాని రాము డేలిన రాజ్యమవుతుందా? ఫలితార్థమును గమనించి, విశ్వమంతటికి, సర్వకాలములకు "రామ" శబ్దమును "సజ్జన" శబ్దమును అన్వయింపజేసికొన వలయును. మతము అనునది సంఘమును సజ్జనత్వముగా మార్చుటకు, కాని భేదముల సృష్టించుటకు కాదు.

కావున "రామ" మంత్ర జపము "రాముని" మరలా చూచుటకా లేక సంఘమును రామరాజ్యముగా మార్చుటకా?

ఈ సందర్భమున నా వ్యక్తిగత అనుభవమునొకదానిని యిచట పొందు పరచెదగాక. నాచే రచింపబడిన ఒక గ్రంథమును చూచుచూ, ఒక విద్యావంతుడు "ఇది వైష్ణవ గ్రంథముగా నున్నదే" అని అన్నాడు. నా కేమియు గోచరము కాలేదు. "అయ్యగారు! తమరి మాట నాకు అర్థము కాలేదే" అని అన్నాను, వారు మౌనము వహించినారు, ఎలనోకో! నేను తరువాత యిట్లన్నాను, "వైష్ణవము-అని అన్నారే తమరు. వైష్ణవముకానిది, లేక వైష్ణవమునకు వ్యతిరేకమయినది యేదో ఉన్నట్లు మీ అభిప్రాయముగా నున్నట్లున్నదే! సరే, నా మనవి నాలకింపుడు-"వైష్ణవము" కానిది లేక వైష్ణవమునకు వ్యతిరేకమయినది "స్మార్తమని" మీ భావన యేమో-అట్లయిన అవధరింపుడు- దైవశక్తి సర్వాంతర్యామి శక్తి అని యెల్లరి భావముకదా! భగవచ్ఛక్తి సర్వాంతర్యామి లేక వైష్ణవశక్తి అనుటకు ఆధారము "స్మృతి" కదా! కాబట్టి వైష్ణవము స్మార్తము: స్మృతి భగవచ్ఛక్తి సర్వాంతర్యామి, వైష్ణవము అని చెప్పుచున్నది. కావున స్మార్తము వైష్ణవము అగుచున్నది. స్మృతిననుసరించినది స్మార్తము. నాకుస్మార్తమునకును వైష్ణవమునకు భేదము కన్పడ లేదే!" అని అన్నాను. దీనికిని ఆ విద్యావంతుడు ఒకవిధమయిన మౌనమును వహించినాడు. మొదటి మౌనము కలవరముతో కూడినదైన, రెండవ మౌనము సత్యమును గ్రహించియు తనపొరపాటును వ్యక్తముచేయుటకు సంసిద్ధతను వెల్లడింప నిచ్చగించని దేమో!

పంచాక్షరీ, అష్టాక్షరీ మంత్రముల మనము సంఘక్షేమ, సౌఖ్య ఆనంద శాంతులకా? లేక శివుడను దైవమూర్తిని, విష్ణువు అను దైవమూర్తిని చూచుటకా? సర్వంతర్యామినిచూచే దెందో! విద్యుచ్ఛక్తి ప్రభావమును చూడగలవుగాని, విద్యుచ్ఛక్తిని చూడగలవా? ఇందులకు స్మార్తులనబడువారేమంటారు? వైష్ణవులనబడువారే మంటారు? ఏమతస్థుడైనను ఏమంటాడు? వాస్తవవాది యేమంటాడు? ఋషివాక్యమును పెడత్రోవ పట్టించి, అజ్ఞానమును సృష్టించు కొనుచున్నాము!

(4) ఇపుడు ద్వయమంత్రమునుగూర్చి విచారింతము:-

"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే।
శ్రీమతే నారాయణాయ నమః॥

అనునది ద్వయమంత్రము అని అనబడు చున్నది.

"లక్ష్మీసమేత నారాయణుని చరణములను శరణముగా పొందుచున్నాను. లక్ష్మీ సహితుడగు నారాయణునకు నమస్కారము" అని ద్వయమంత్రముయొక్క అర్థము.

భగవచ్ఛక్తి సర్వసంపద్యుతము; అట్టి శక్తియొక్క (మూర్తిభావమున) పాదము అను శరణముగా పొందుచున్నాను అనుటలో సత్యమును గమనింపదగియున్నది. "చరణములు" సేవకు సాంకేతికము. "నేను సర్వసంపద్యుతమయిన భగవచ్ఛక్తికి ప్రణమిల్లుచున్నాను. ఈ జ్ఞానముతో వినమ్రుడనై దాసునిగా మెలగెదను" అని ద్వయమంత్రము యొక్క భావము-అనగా దైవధ్యానము, దైవకైంకర్యము. ఈ ద్వయమంత్రము తిరుమంత్రమునకు సమమయినది, అష్టాక్షరి అనబడు తిరుమంత్రము వేదోపనిషత్తులలో తెలుపబడినను, ఆళ్వారులు వారి దివ్యపాశుర కీర్తనములతో గానముచేసినను, ప్రథమ వైష్ణవాచార్యుడయిన శ్రీనాధమునులు (10 వ శతాబ్దము) ఈ తిరుమంత్రమును శిష్యులకు రహస్యముగా ఉపదేశించు ఆచారమును ప్రారంభించినట్లున్నారు. ఈ మంత్రమును గుప్తముగా నుంచి, ఆచార్యుడు తన ప్రధాన శిష్యునకే ఉపదేశించు ఆచారము పాటింపబడు చుండెను. ఆచార్యుడు అన్యులెరుగకుండా, తన శిష్యునకే రహస్యముగా ఈ మంత్రమును చెవిలో వేయు ఆచారము ఉండినది. "తిరుమంత్ర"మనగా దివ్యమంత్రము, పవిత్రమయిన మంత్రము, శ్రేష్ఠమయినమంత్రము అని అర్థముకాగా, రానురాను తిరుమంత్రము అనగా "రహస్యమంత్రము" గా వ్యవహరింపబడుచుండినది. "ఏదో రహస్యమును చెప్పి వస్తున్నాడే" అను దానికి బదులు "తిరుమంత్రమును చెవిలో ఊది వస్తున్నాడే" అని ఒక లోకోక్తిగా, సామెతగా అనుట సంఘమున అలవాటయినది. ప్రతి మంత్రముయొక్క విషయం ఇట్లుగానే ఉండెడిది. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవక్త శ్రీమద్రామానుజాచార్యులవారే (1017-1137 ఎ. డి.) మొట్టమొదటిసారిగా ఎల్లరకు బహిర్గతము చేసినాడు. ఈ తిరుమంత్రార్థమయినట్టియు, కొలది విశేషముతో, శ్రీరామానుజుడు "ద్వయమంత్రమును" కల్పించి, శిష్యులకు బోధించినట్లయినది. ద్వయ మంత్రమునందు తిరువధ్యానము, తిరువారాధన రెండును సూచింపబడియున్నవి-అనగా శరణాగతిభావము, సేవాభావము సూచింపబడియున్నవి, అనగా జ్ఞాన, పరోపకార జీవితమును అదిసూచించుచున్నది. ఇదియే, దాని ప్రత్యేకత. ఈ ద్వయ మంత్రార్థము రామానుజుని గద్యత్రయమున వివరింపబడి యున్నది. ఈ ద్వయమంత్రార్థ సహితమయిన "ఆండాళ్ తిరుప్పావై" ప్రబంధము శ్రీరామానుజునకు ఆరాధ్యగ్రంధమయినది.

కావున ద్వయమంత్రమనునది యేదో వైష్ణవులనబడు తెగకు సంబంధించినది అని భావించుట పొరపాటు అగును. జ్ఞానార్జనము, (సత్యమునెరుంగుట) పరోపకారము యీ రెండు, మానవుని నిజమైన మానవునిగా తయారుచేస్తవి. మొదటి దానితో నిజమైన మేధావియయి, రెండవదానితో తన జీవితమును సార్థకము చేసికొంటాడు, అనగా పురుషార్థప్రాప్తిని పొందుతాడు. "మానవ ఫలప్రద జీవితమునకు జ్ఞానార్జన, పరోపకార జీవితము అను ద్వయము ముఖ్యావసరము" అన్న సూత్రమును (మంత్రము) కాదను వారెవరైనను గలరా?

ఏ మత సంబంధముగాగాని జరిగేది ఈ వైపరీత్యమే! అర్థరహితముగా సూత్రముల (మత సూత్రముల తీక మంత్రముల) జపించడము, అట్లు ఆ మంత్రముల పదిలపరచు కోవడము, లేక, అవేమి మంత్రాలు బోవోయ్ అని వాని ముఖము చూడకనే, వాని అర్థమును గ్రహించకనే వానిని తిరస్కరించడము, వానిని తగులబెట్టమని వాదించడము జరుగుచున్నది. రెండవ వారి పద్ధతిని వాస్తవికులు అనబడు వారు పాటింపరాదు. వాస్తవికులు మంత్రముల ప్రయోజనము "జపమేకాదు-పరోపకారార్థము, లోకసంగ్రహము" అని అనగలిగితే, వీరిని మూఢులగు ఆస్తికులనబడు వారు నాస్తికులని ముద్రవేస్తారు. వాస్తవికులనబడువారు మూఢాచారముల ప్రగ్గుట వ్యతిరేకించవలసినదే! బాధ్యతారహితముగా సర్వమును తృణీకరింపచూచు వర్గమును వ్యతిరేకించవలసినదే! సత్యమునెరుగుట వాస్తవికుల లక్షణమైయుండాలి!

అది శంకరాచార్యుని తల్లి (అద్వైత సిద్ధాంత ప్రవక్త శంకరుడు) తన జీవితమున పంచాక్షరీ, అష్టాక్షరీమంత్రముల సతతము మననము చేసికొనువారట. కడపటి ఘడియలలో కూడా తాను స్పృహలో నుండవలయుననియు, తాను ఆ మంత్రార్థముల మననము చేసికొనుచూ శాంతచిత్తులుగా నుండవలయునని ఆమె కోరికయేమో. ఇక కొలది నిముసములలో ఆమెకు స్పృహ తప్పునేమో నని గ్రహించిన కుమారుడు శంకరుడు, "అమ్మా నేను నీ చెవిలో యే మంత్రమును ఉచ్చరించెదనమ్మా" అని అడుగగా ఆమె కన్నులు మూయుచూ, "అష్టాక్షరీ మంత్రము" అని అన్నారట. "జీవితమున భగవచ్ఛక్తి యొక్క మంగళకరమైన, శివమైన, శుభస్కరమయిన విభూతులను తలంచుకొని, చూచి, ఆనందమయము చేసికొన్నాను నా జీవితమును. ఇక యీ పాంచభౌతిక శరీరమును వదలుచున్నాను గాన, యిక స్మరింప తగినది శివ రౌద్ర ద్వంద్వాతీతమయిన సర్వాంతర్యామి వైష్ణవశక్తియే కదా" అని భావించినారేమో ఆ పవిత్ర మాత!

విషయమిట్లుండ శివ, వైష్ణవ భేదము లన బడునవి అర్థరహితములు, అజ్ఞాన సూచకములు. వాస్తవవాదులు దీనిని గ్రహింపరా? ఆమోదింపరా?

(5) ఇక కడపటి విషయమగు "చరమ శ్లోకమును" గమనించెదముగాక :-

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః.

(సశేషము)

# గజేంద్ర మోక్షణ ఘట్టం

ఆధ్యాత్మిక విద్యాసంపన్నమైన భారతీయ వాఙ్మయంలో భగవద్భక్తి ప్రతిపాదకమై భక్తిరస సిద్ధాంతానికి ఆలంబనమైనది శ్రీమద్భాగవతం. ఇది భారతీయుల దైనందిన జీవితంలో పెనవేసుకుపోయిన మహాకావ్యం. పోతన భాగవతం యావదాంధ్ర హృదయాలనూ ఆకర్షించింది. భగవద్భక్తి ప్రతిపాదకమైన ఇతివృత్తం కారణంగానే భాగవతానికి సార్వజనీనత్వమూ సార్వకాలికతా, సార్వదేశికత్వమూ సిద్ధించాయి.

భాగవతంలో ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షం, రుక్మిణీకల్యాణం, గోపికాగీతాలు మొదలైన ఘట్టాలు ప్రతినిత్యం పారాయణ చేసే వా రున్నారు. భాగవతంలో జీవుని ఆర్తి, బంధమోక్షణం ప్రధాన ఇతివృత్తంగా గల 'గజేంద్రమోక్షణ ఘట్టం' ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది.

ఇందులోని ఇతివృత్తం ఇది. ఇంద్రద్యుమ్న మహారాజు మలయపర్వతం మీద ఆశ్రమం ఏర్పరుచుకొని తపోనిష్ఠ పూని ఏకాగ్రచిత్తంతో భజించుచుండటం వల్ల అగస్త్యమహర్షి రాక మహారాజు గుర్తించలేదు. కదలకుండా కూర్చుని తనకు గౌరవం చేయలేదని ఆమహర్షికి కోపం వచ్చింది. "ఏనుగు జన్మ ఎత్తి తమోగుణ ఫలమనుభవించెదవుగాక" అని అగస్త్యుడు ఇంద్రద్యుమ్నుణ్ణి శపించి తన దారిన తాను పోయాడు.

హూ హూ నామ గంధర్వుడు తన రాణులతో మాలినీ నదిలో జలక్రీడలాడు తుండగా దేవలుడను మహర్షి స్నానం చేయటానికి ఆ నదిలో దిగాడు. అతని రాక ఆ గంధర్వుడి శృంగార క్రీడకు ఆటంకం అయినందువల్ల ఆ ఋషికి తెలియకుండా నీటిలో దాగి, అతని పాదాలు పట్టి లోపలికి ఈడ్చాడు. ఈ దుశ్చర్యకు మునీంద్రుడు కోపించి మొసలివై పుట్టుమని గంధర్వుణ్ణి శపించాడు. గంధర్వుడు భయపడి ఋషిని ప్రార్థింపగా శ్రీహరి చక్రం నిన్ను స్పృశించినప్పుడు నీకు నిజరూపం ప్రాప్తిస్తుందని శాపవిమోచనం అనుగ్రహించాడు. ఈ విధంగా రాజు, గంధర్వుడూ కరి, మకరి రూపాలు ధరించారు.



నీళ్ళు త్రాగటానికి సరస్సులో దిగిన కరిరాజును మకరం పట్టుకొంది. కరి మకరుల మధ్య వేయేండ్లు ఘోర సంగ్రామం జరిగింది. తుదకు నిశ్చల భక్తితో గజరాజు తన భారం అంతటినీ శ్రీహరిపై వేసి 'తన మనస్సులో ఈశ్వర సన్నిధానం కల్పించుకొని,

లావొక్కింతయు లేదు ధైర్యము
విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్‌దప్పెను మూర్ఛవచ్చెఁ
దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ
మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద!
సంరక్షింపు భద్రాత్మకా!

ఓ కమలాక్ష! యో వరద! యో
ప్రతిపక్ష విపక్ష దూర! కు
య్యో! కవియోగి వంద్య సుగుణోత్తమ!
యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర!
యో విమల ప్రభావ! రా
వే! కరుణింపవే! తలఁపవే!
శరణార్థిని నన్నుఁ గావవే!

అంటూ ప్రార్థించాడు.

గజేంద్రుని మొర శ్రీహరి విన్నాడు. వరుగు వరుగున విచ్చేశాడు. చక్రాన్ని ప్రయోగించి నక్రాన్ని సంహరించి గజేంద్రుణ్ణి రక్షించాడు. దైవకృపచే గజేంద్రుడు బంధవిముక్తుడై విష్ణురూపాన్ని ధరించి సారూప్యమోక్షం అందుకున్నాడు. విష్ణుచక్ర స్పర్శచే గంధర్వునికి కూడా శాపవిముక్తి ప్రాప్తించింది. ఇది ఈ ఘట్టం ఇతివృత్తం.

ప్రతిమానవునికి జీవిత పరమావధి మోక్షాన్ని పొందటం. ఆ మోక్షాన్ని పొందటానికి పెద్దలు కర్మ, జ్ఞాన, యోగ, భక్తి మార్గాలను సూచించారు. సామాన్య జనులకు సులభసాధ్యమైంది భక్తిమార్గం. ఈ భక్తి తొమ్మిది విధాలుగా ఉంటుంది.

శ్రీ తిరుమల, తిరుపతి దేవస్థానాలలోని శాసనాలు ఆలయ చరిత్ర నిర్మాణానికి, నాటి సంస్కృతికి దర్పణాలు. ఈ ఆలయాల కుడ్యాలపై మలచబడిన శాసనాలన్నిటినీ దేవస్థానం సంపుటాలుగా ప్రచురించింది. గోవిందరాజస్వామి ఆలయంలో 1539 ఎ.డి లో వేయబడిన శాసనం ఆధారంగా ఆనాళ్ళలో జరుపబడే "గజేంద్రమోక్షణ మహోత్సవ" స్వరూపం ఈ వ్యాసంలో అభివర్ణింపబడింది. సం॥

"శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం
సఖ్య మాత్మనివేదనమ్."

భగవంతుని పవిత్రనామగుణ చరిత్రాదులను ఆలకించుట, కీర్తించుట, స్మరించుట, భగవంతుని పాదసేవనం చేసుకొనుట మొదలైన మార్గాలతో మోక్షాన్ని సులభంగా అందుకోవచ్చు.

"భక్తిమార్గం ద్వారా భక్తులు మోక్షాన్ని అందుకోవాలి" అనే ఉద్దేశముతో కాబోలు శ్రీమద్భాగవతంలోని "గజేంద్ర మోక్షణ ఘట్టం" పేరున తిరుపతి గోవిందరాజస్వామి ఆలయంలో 16వ శతాబ్దంలో 'గజేంద్రమోక్షణ మహోత్సవం' జరుపబడినట్లు తెలుస్తూన్నది.

గోవిందరాజస్వామి ఆలయం పడికావలి గోపురం రెండవ అంతస్తులో లోపలిప్రక్క దక్షిణం, పడమర గోడలపై క్రీ. శ. 1539 లో వేయబడిన శాసనాధారంగా ఆ నాళ్ళలో ఈ మహోత్సవం జరుపుటకు గాను తిరువన్తాళ్వారు కుప్పయ్యన్ అను వైష్ణవ భక్తుడు 1500 నర్పణముల ధనాన్ని ఆలయ ఖజానాకు జమచేసినట్లు తెలుస్తున్నది. ఈ ధనం ఆలయానికి చెందిన గ్రామాలలో చెరువులు, కాలువలు అభివృద్ధి పరచటం ద్వారా వ్యవసాయోత్పత్తులు పెంచి వాటి ద్వారా వచ్చే ఆదాయంతో ఆలయ ఖజానా ఆ మహోత్సవానికి కావలసిన వస్తుసంభారాలను శాసనంలో పేర్కొనబడిన విధంగా అందజేస్తుండేది.

పర్వ దినాలలో ఉత్సవాలు జరుపుట భారతీయుల సంప్రదాయం. ఈ "గజేంద్ర మోక్షణ మహోత్సవం" దక్షిణాయన పుణ్యకాలంలో జరిగేది. అంకురార్పణం జరవటానికి ధాన్యం, బియ్యం, కొబ్బరికాయలు, తములపాకులు, వక్కలు, చక్కెర మొదలైనవి సమర్పింపబడేవి. హోమాది కార్యక్రమం యథావిధిగా జరగటానికి కావలసిన నెయ్యి వగైరా హోమద్రవ్యాలు శాసన వివరాల ప్రకారం దేవస్థానం ఖజానా సమకూర్చి పెట్టేది. దాత కట్టించిన మండపంలోనే గోవిందరాజస్వామి వారికి తిరుమంజనం జరిగేది. ఈ మండపం పూవులతో చక్కగా అలంకరించేవారు. తిరుమంజనానంతరం 200 లేత కొబ్బరికాయలు, 50 కొబ్బరికాయలు, 200 చెరకు గడలు, 200 అరటి పండ్లు, 200 మామిడిపండ్లు, 5 పనస పండ్లు, అటుకులు, బొరుగులు స్వామివారి కైంకర్యానికి ఏర్పాటు చేయవలెనని దాత శాసనములో స్పష్టముగా పేర్కొన్నాడు.

గజేంద్రుని స్వామివారు అనుగ్రహించడం, అనంతరం గరుడవాహనంపై వేంచేయడం, తిరుపతి ఎనిమిది వీథుల లోనూ ఊరేగటం జరుగుతూ ఉండేది. ఈ ఊరేగింపు రాత్రి జరిగేది కాబోలు దివిటాలకు కావలసిన నూనెకు తగు ఏర్పాట్లు కూడా చేయబడ్డాయి. స్వామి ప్రసాదాలు భక్తులకు ప్రసాదింపబడేవి.

గజేంద్రమోక్షణ శ్లోకాలను పఠించటం ఈ మహోత్సవంలో ఒక ప్రత్యేకత. మహోత్సవంలో పాల్గొనే భక్తులకు గజేంద్రుని ఆత్మ నివేదన ద్వారా మోక్షాన్ని పొందటం గుర్తు చేయటమేకాక భగవంతుని స్మరించుకోటం, కీర్తించటం, అర్చించటం ద్వారా మోక్షానికి దారి చూపటం జరిగేది. ఉత్సవాలు జరుపటంలోని పరమోద్దేశం అదే.

ఈ మహోత్సవ కార్యక్రమాలలో పూజాది కార్యక్రమాలను నిర్వర్తించే అర్చక వర్గంతో పాటు అధికారులూ, పరిచారక వర్గం కూడ బాధ్యత వహించేది. వీరందరికీ తగు విధమైన పారితోషికాలు ఇవ్వాలని శాసనంలోనే నిర్ణయింపబడి ఉన్నది.

శాసనదాత తమ వంశపారంపర్యం సూర్యచంద్రులున్నంత వరకూ ఈ ఉత్సవం జరుగుతుండాలని శాసనం వేయించాడు. అయినా ఈ ఉత్సవాలు ఎన్నాళ్లు కొనసాగాయి అనే విషయం తెలుసుకోటానికి తగిన ఆధారాలు కానరావు.

— శ్రీ కోరాడ రామకృష్ణ



బాలప్రబోధం

# మహీదాసు

ఈ కథ కొన్ని వేల యేండ్ల క్రితం జరిగింది. సింధూ సరస్వతీ నదులమధ్య ఒక దట్టమైన కీకారణ్యముండేది. ఆ అరణ్యం అసంఖ్యాకమైన పవిత్ర ఋష్యాశ్రమాలకు ఆలవాలంగా వుండేది. గొప్పజ్ఞానీ, ధర్మనిష్ఠాగరిష్ఠుడూ అని పేరుగాంచిన ఉద్దాలకుడు వాటిలో ఒక ఆశ్రమానికి యజమాని.

ఉద్దాలకునిది చిన్న కుటుంబం. తన భార్య, కుమారుడు శ్వేతకేతువూ కాకుండ అతని రెండవ కుమారుని తల్లి అయిన ఒక దాసి అతని కుటుంబ సభ్యులు.



ఆ దాసికి ఒక ప్రత్యేకమైన పేరులేదు. ఆమెను "ఇతర" అని పిలిచేవారు. ఆమె కొడుకు ఐతరేయుడని పిలువబడేవాడు. అతనికి 'మహీదాసు' అనేపేరు తరువాత వచ్చింది.

ఒకానొక శుభదినం ఆశ్రమమంతా హడావిడిగావుంది. అసంఖ్యాకంగా ఋషులూ బ్రాహ్మణులూ అక్కడ సమావేశమైనారు ఉత్సాహంగా, శాస్త్రోక్తంగా యజ్ఞం చేయడానికి సన్నాహాలు జరుపుతున్నారు. యజ్ఞానికి సమిధలు సేకరించడానికి శ్వేతకేతువు ఇతర శిష్యులతో కూడి అడవికి బయలుదేరాడు. అలవాటు ప్రకారం ఐతరేయుడు వారిని అనుసరించాడు. కాని శ్వేతకేతువు. తదితరులు ఇంతకు ఇష్టపడలేదు. వాళ్ళు ఐతరేయుణ్ణి చీవాట్లు పెట్టి వెంట రావద్దన్నారు.

శుభముహూర్తం సమీపించింది. సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయి. ఉద్దాలకుడూ, శ్వేతకేతువూ అవసరాలను సమకూర్చడంలో మునిగివున్నారు. సరిగ్గా ఆ సమయానికి ఐతరేయుడు అక్కడ ప్రత్యక్షమైనాడు. ఉద్దాలకుడు అతణ్ణిచూసి "కుమారా! మీ అమ్మ దగ్గరికిపో!" అన్నాడు.

ఐతరేయుడు అందుకు నిరాకరించాడు. "తండ్రీ! నేనుకూడా ఈ యాగాన్ని చూడగోరుతున్నాను" అన్నాడు.

ఉద్దాలకుడు, ఐతరేయుడు యాగాన్ని ఎందులకు చూడకూడదో వివరించాడు. కానీ ఐతరేయుడు తండ్రి మాటలను అర్థం చేసుకోలేక పోయాడు. "తండ్రీ! సాందీపని మొదలగు వారున్నప్పుడు నేనెందుకు ఇక్కడ ఉండకూడదు?" అని ప్రశ్నించాడు. ఈమాటలతో ఉద్దాలకుడు ఉగ్రుడై ఐతరేయుణ్ణి కాలితో తన్ని బయటికి గెంటివేశాడు.

ఐతరేయుడు దుఃఖంతో గద్గదమైన గొంతుతో ఏడుస్తూ బయటికి నడిచాడు. ఒక చెట్టుక్రింద కూర్చుని గుండెపగిలేటట్లు ఏడ్వసాగాడు. ఆవులకు గడ్డి కోయడానికి బయటికి వెళ్ళిన అతని తల్లి 'ఇతర' తిరిగి వస్తూ ఏడుస్తూవున్న ఐతరేయుణ్ణి చూసింది.

"నీ దుఃఖానికి కారకు లెవ్వరు నాయనా?" అని అడిగింది.

వెక్కివెక్కి యేడుస్తూ ఉద్దాలకుడు ఇలా బదు లిచ్చాడు. "శ్వేతకేతువు సమిధలు తేవడానికి నన్ను వెంటతీసుకొనిపోలేదు. తండ్రినన్ను కాలితోతన్ని మండపంనుండి గెంటేశాడు.

ఐతరేయుని తల్లి "కుమారా! యజ్ఞ యాగాదులూ, పూజా పునస్కారాలూ, జందెములూ జపాలూ మనకోసంకావని నీ కెన్నిమార్లు చెప్పాను?" అని మంద లించింది. కాని ఐతరేయునికి తల్లి మాటలు అర్థం కాలేదు.

అతడు తల్లితో ఇలా అన్నాడు. "అమ్మా! మనంమాత్రం మనుష్యులం కామా? మనం యజ్ఞాదికర్మకాండలు ఎందుకు ఆచరించ కూడదు? ఈరోజే మనం యజ్ఞం చేద్దాం. నాతండ్రి యజ్ఞం చేయ గలిగినప్పుడు నేనుమాత్రం చేయలేనా? అమ్మా! రా? సన్నాహాలు చేసుకుందాం. తండ్రి అగ్నిని ఆవాహిస్తే మనం భూమాతను ఆవాహన చేద్దాం."

ఐతరేయుడూ, అతని తల్లీ కలిసి బంక మట్టితో వేదికను సిద్ధంచేశారు. పూలు మొదలైన పూజాసామగ్రి సిద్ధంచేసుకుని పూజ ప్రారంభించారు. హోమంలో ఐతరే యుడు ఎండుకట్టెలు వేశాడు. ఇద్దరూ భూమాతను ప్రార్థించారు. మరుక్షణం భూమాతప్రత్యక్షమై ఐతరేయుని తల్లితో "నీ కుమారుని కోసం ఎన్నో ఏండ్లుగా నేను ఎదురు చూస్తూగడిపాను. ఇతడొక్కడే నన్ను గుర్తించినవాడు. నా ఆత్మను అర్థం చేసుకున్నవాడు. ఇతడు పెద్దయైన తరువాత సృష్టిరహస్యాలను ప్రపంచానికి వెల్లడి చేస్తాడు. ఈరోజు నుండి ఇతణ్ణి "మహీదాసు" అని పిలువు" అని చెప్పి అంతర్ధానమైంది.

ఇప్పుడు ఐతరేయునికి బ్రహ్మాన్ని గురించి, బాగా అవగతమైంది. అసూయా పరులైన బ్రాహ్మణులు అతణ్ణి విమర్శించినా అతని భక్తినీ, జ్ఞానాన్నీ ప్రతిఒక్కరూ ప్రశంసించారు.

ఆ తరువాత కొంత కాలానికే ఆరాజ్యానికి క్షామం సంభవించింది. ప్రజలు దానివల్ల భరింపరాని బాధలు పడసాగారు. క్షామవార్త విన్నంతనే రాజు త్రివిక్రముడు మంత్రుల, బ్రాహ్మణుల సలహాలు పొందాడు. తగిన యాగాలు చేశాడు. వారాలు గడిచాయి. యాగాలు జరుగుతూనే వున్నాయి. కాని ఒక చిన్న మబ్బుతునుక కూడా ఆకాశంలో కనిపించలేదు. త్రివిక్రముని ఉత్సాహము చల్లారిపోయింది. మునులు ఎంత ప్రార్థించి నా వినకుండా యాగాలను ఆపేశాడు.

ఇంతలో మహీదాసు త్రివిక్రమ మహారాజు చేస్తున్నయాగాల సంగతి విని తనశిష్యునితో కూడి రాజధానికి విచ్చేశాడు.

మునులూ బ్రాహ్మణులూ కథంతా పూస గ్రుచ్చినట్లు మహీదాసుతో చెప్పారు. రాజుకు తనరాక తెలియజేయ వలసిందిగా మహీదాసు వారిని కోరాడు.

రాజు అతణ్ణి తన మందిరానికి ఆహ్వా నించి విషయమంతా వివరంగా విన్న వించాడు. తనను వెన్నాడుతున్న భయాలు అనుమానాలు వెల్లడిచేశాడు.

అంతా విన్న తరువాత మహీదాసు రాజుతో ఇలా అన్నాడు. "మహారాజా! నీవు అవసరమైన యజ్ఞాలు చేసినమాట నిజమే. కానీ నీవు వాటిని కేవలం బ్రాహ్మ ణుల సలహా మేరకు చేశావు. వాళ్ళ కార్యంలో నీకటూ స్వయంగా ఇష్టముగాని, గాఢ మైన నమ్మకముగాని లేదు. పరిపూర్ణవిశ్వాస మున్నపుడే యజ్ఞాలు ఫలవంత మవుతాయి.

యజ్ఞయాగాదులతో విసిగివున్న ఆ రాజు "మునీంద్రా! నా నమ్మకంతో పని లేదు. దేవతలు నాయందు దయగలిగి ఉన్నారా? లేదా? అన్నదికాదు ఇక్కడ ప్రశ్న. నా ప్రజలను ఆకలిబాధ నుండి కాపాడుకోడానికి నాకు ధాన్యం కావాలి. నా ధాన్యాగారాలన్నీ శూన్యంగా వున్నాయి. నాకేమీ దిక్కు తోచటంలేదు" అని వాపో యాడు.

అందులకు మహీదాసు "మహారాజా! నీ మనస్సులోని ఈ గజిబిజిని పోగొట్టుకో. ఆహారానికి, యజ్ఞాలకు, పరమాత్మకు తేడా ఏమీలేదు. నేను కూడా ఈ అపనమ్మకాలకు ఒకప్పుడు బానిసనే. మేముండే ప్రదేశము కూడా ఒకసారి క్షామపీడితమైనది. ఆ సమ యంలో నాకొక అద్భుతదర్శనం కలిగింది. విశాలంగా విస్తరించిన ఆద్యంత రహిత మైన సముద్రాన్ని చూచాను. సృష్టికర్త యొక్క రూపం లీలగా నాకు కనిపించింది. అతనిచుట్టూ కళ్ళు మిఱుమిట్లు గొలిపే వెలుగు. ఇంతలో అతనిసృష్టి సర్వమూ నా కళ్ళ ఎదుట నిలిచింది. కొన్ని కోట్ల మంది ఆకలని ఏడుస్తూ కనిపించారు. మరు క్షణం సృష్టికర్త తానే ఆహారంగా మారి ప్రజలందరి క్షుద్బాధను చల్లార్చాడు.

"వేరేమాటల్లో చెప్పాలంటే పరబ్రహ్మ నికి మరోరూపమే అన్నము. అందులకే మనము ఎటువంటి పరిస్థితులలోను ఆహా రాన్ని నిందించకూడదంటారు. అందులకే ఆహారం అత్యవసరమైనపుడు దేవుణ్ణి విస్మ రించకూడ దంటారు. ఇది మనసులో పెట్టు కుని అవసరమైన యజ్ఞాలను చేయి. తప్పక నీ ప్రజల బాధలు గట్టెక్కుతాయి" అని బోధించాడు.

రాజుకు విషయమంతా విశదమైంది. యజ్ఞం సక్రమంగా సమాప్తమైంది. కుండ పోతగా వర్షాలు కురిశాయి. సమృద్ధిగా పంటలు పండాయి. ప్రజలు చాలా సంతో షించారు.

మహీదాసు కీర్తి భూమండలం దశదిశలా వ్యాపించింది. అతని బోధ పుస్తకరూపం దాల్చింది. అదే ఐతరేయోపనిషత్తు. •

— శ్రీమతి ఎస్. మయూరి

# వార్తాలహరి

## దేవస్థాన స్వర్ణోత్సవాలు

శ్రీ వేంకటేశ్వరుని ఆలయ వ్యవహార నిర్వహణకుగాను తిరుమల తిరుపతి దేవస్థానం పేర ఏర్పడిన పాలక వ్యవస్థ 50 సంవత్సరాల చరిత్రానంతరం ఇటీవలనే స్వర్ణోత్సవాలు జరుపుకొని శ్రీవారిభక్తుల ఆశీస్సులు పొందిన విషయం తెలిసిందే.

దేవస్థాన కార్యనిర్వాహకమండలి నిర్ణయం ప్రకారం ఈ ఉత్సవ కార్యక్రమాలు ఆంధ్రప్రదేశ్‌లోని వివిధజిల్లాల కేంద్రాలకు, వివిధ రాష్ట్రాల ముఖ్య (రాజధాని) నగరాలకు ఇప్పుడు విస్తరిస్తున్నవి. ఈ సంవత్సరాంతం వరకు, ఆర్షధర్మాభినివేశంతో జరిగే ఈ ఉత్సవాలు రెండు రెండు రోజులపాటు జరగగలవు. బొంబాయినగరంలో మాత్రం ఇంకా ఎక్కువరోజులు జరుగుతవి.

### విజయవాడ

ఈ స్వర్ణోత్సవ సమారోహాలకు మే 27, 28 తేదీలలో విజయవాడలో జరిగిన కార్యక్రమాలతో అంకురార్పణ జరిగింది. గీతా పారాయణంతో కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. జిల్లా కలెక్టరు 28 తేదీ కార్యక్రమాలకు ముఖ్య అతిథిగా విచ్చేశారు. విజయవాడ శివరామకృష్ణ క్షేత్రంలో జరిగిన ఈ సభకు దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి అధ్యక్షత వహించి దేవస్థాన కార్యక్రమాలను వివరించారు.

చింతలపూడి యోగినిమాతచే ధార్మిక సందేశ మివ్వబడింది.

ప్రముఖ విద్వాంసులు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి, శ్రీ ముదివర్తి కొండమాచార్య ప్రభృతులు ఉత్తేజకర ప్రసంగాలు చేశారు.

అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులుగా శ్రీయుత పి. యస్. రంగనాథ్, నాగేశ్వర నాయుడు అన్నమాచార్య కీర్తనల కచ్చేరి జరిపారు.

అనంతరం శ్రీ ఇ. కరుణాకరన్ నిర్వహణలో ఏడుకొండలస్వామి దర్శనం అనే గేయ రూపకం ప్రదర్శన జరిగింది.

శ్రీ వంగల పట్టాభి భాగవతార్ హరికథా కాలక్షేపంతో ఆనాటి కార్యక్రమం ముగిసింది.

రెండవరోజు (28-5-84) కార్యక్రమం గీతాపారాయణంతో ప్రారంభమైంది.

పలువురు పండితుల ధార్మిక ప్రసంగాల అనంతరం అన్నమాచార్య సంకీర్తన కార్యక్రమం, తదుపరి శ్రీమతి ఆర్. దుర్గాంబ భాగవతారిణి హరికథా కాలక్షేపంతో సభ ముగిసింది.

### గణపవరం

స్వర్ణోత్సవ కార్యక్రమాలు మే 29, 30 తేదీలలో పశ్చిమ గోదావరి జిల్లా గణపవరములో జరిగాయి.

శ్రీ పి. ఏసుబాబుగారి రైసుమిల్లు ఆవరణలో జరిగినవి. ఈ రెండు రోజుల కార్యక్రమంలో 29 వ తేదీ సభకు గణపవరం పంచాయతీసమితి అధ్యక్షులు శ్రీ పి. ఏసు బాబు అధ్యక్షత వహించారు.

దేవస్థాన ధర్మకర్తలమండలి పూర్వాధ్యక్షులు శ్రీ గోకరాజు రంగరాజు సభను ప్రారంభించారు. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామిరెడ్డి దేవస్థాన కార్యక్రమాలు వివరించారు.

కారంచేడు ప్రణవానందస్వామిచే ధార్మిక ప్రబోధం జరిగింది.

దేవస్థాన ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీయుతులు యల్. నరసింగనాయక్, శ్రీమతి నన్నపనేని రాజకుమారి (యం. ఎల్. ఎ.), శ్రీ పి. వేంకటేశ్వర్లు ప్రసంగించారు.

అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారుల కచ్చేరి అనంతరం, శ్రీ వంగల పట్టాభి భాగవతార్ హరికథతో ఆనాటి కార్యక్రమం పూర్తయింది.

30-5-84 తేదీన జరిగిన సమావేశానికి దేవస్థానధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ వి.కె.డి.వి. సత్యనారాయణరాజు, (యం. ఎల్. ఏ.) అధ్యక్షతవహించగా, పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ యస్. లక్ష్మి నారాయణ (ఐ.ఏ.ఎస్.) ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు.

అన్నమాచార్య సంకీర్తనల కార్యక్రమం అనంతరం శ్రీ ఇ. కరుణాకరన్ నిర్వహణలో "ఏడుకొండలస్వామి దర్శనం" గేయరూపకం ప్రదర్శన జరిగింది.

శ్రీమతి ఆర్. దుర్గాంబ భాగవతారిణి హరికథతో ఇక్కడ స్వర్ణోత్సవ కార్యక్రమాలు జయప్రదంగా ముగిశాయి.

(చిత్రాలు 2, 3 కవరు పేజీలలో)

నెల్లూరు కార్యక్రమ విశేషాలు
వచ్చే సంచికలో

### కర్ణాటక కల్యాణమండపం

తిరుమలలో కర్ణాటక ఛారిటీస్ సంస్థ వారిచే నిర్మింపబడ్డ నూతన కల్యాణ మండపమునకు ఈ జూన్ 4 వ తేదీన కర్ణాటక రాష్ట్రదేవాదాయ శాఖామాత్యులు శ్రీ బి. ఎల్. పాటిల్ ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో నిర్వహింపబడిన సభకు కర్ణాటక సమాచారశాఖామంత్రి శ్రీ ఎం. రఘుపతి అధ్యక్షతవహించి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. తరువాత కర్ణాటక ప్రభుత్వ కార్యదర్శి శ్రీ వేంకటేశ్‌గారు ఆవరణలో ఏర్పాటు చేయబడ్డ గ్రంథాలయాన్ని ప్రారంభించారు. ఈ శుభసమయంలో తిరుమల తిరుపతి దేవస్థానం ఉద్యాన విభాగాధికారి శ్రీ తమ్మణ్ణను, శ్రీ పి. రామాచార్యులను సన్మానించడం జరిగింది.

### ప్రథమ బహుమతి

వెంకటగిరిలో ఈ జూన్ 6 వ తేదీ రాష్ట్రస్థాయిలో నిర్వహింపబడ్డ నాటక కళోత్సవంలో తి. తి. దేవస్థానశాఖ సూపరింటెండెంటు శ్రీ ఎం. రామచంద్రారెడ్డి, బి.ఏ., ప్రథమబహుమతి పొందారు.

---



# 576 వ అన్నమాచార్య జయంతి

[అన్నమాచార్య కళామందిరం, తిరుపతిలో
15-5-84 నుండి 17-5-84 వరకు)





దేవస్థాన పరిపాలనాభవనము నుండి మందిరానికి ఊరేగింపు.



సాహిత్యసభలో శ్రీ ఎం. కొండమాచార్యులను సన్మానిస్తున్న దేవస్థాన సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయలు.

సాహిత్యసభలో ప్రసంగిస్తున్న శ్రీ డి. సుబ్బరాయలు. (కుడివైపుకు) శ్రీ ఎం. కొండమాచార్యులు, శ్రీ జి. రామసుబ్బశర్మ, శ్రీ ఎస్. లక్ష్మణయ్య.



సాహిత్యసభలో డా॥ ఎం. సంగమేశంను సన్మానిస్తున్న శ్రీ డి. పశుపతి.

శ్రీమతి జయా పశుపతి సంగీత గాత్రకచ్చేరి.







అన్నమాచార్య కథాగానం చేస్తున్న
శ్రీ సుదర్శన భట్టాచార్య.

సాహిత్యసభలో ప్రసంగిస్తున్న డా॥ కరుణశ్రీ, దేవస్థాన
కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
శ్రీ సముద్రాల లక్ష్మణయ్య.





శ్రీ రామనాథం బృందంచే సంగీత కచ్చేరి.

శ్రీ నూకల చినసత్యనారాయణ
బృందంచే గాత్ర సంగీత కచ్చేరి.





సంగీత-సాహిత్య-చిత్రలేఖనం రూపకం
వ్యాఖ్యాత: శ్రీ ఇ. కరుణాకరన్,
చిత్రకారుడు: శ్రీ కె. ఎం. డి. హెన్రీ,
గాత్రసంగీతం: శ్రీ నాగేశ్వరనాయుడు.

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## శ్రీ మహాగణపతి ఆలయం

నెల్లూరు జిల్లా ఊటుకూరులో శ్రావణ శనివారము (11-8-84) నాడు ఉదయం శ్రీ మహాగణపతి ఆలయ శంకుస్థాపన జరుగును. భక్తాదులు ఈ కార్యక్రమంలో పాల్గొని దైవానుగ్రహమునకు పాత్రులగుదురు గాక.

## శ్రీ కోదండరామస్వామి ప్రతిష్ఠ

నెల్లూరుజిల్లా లక్ష్మీనృసింహపురంలో శ్రీ కోదండరామాలయంలో శ్రీ కోదండ రాముని విగ్రహప్రతిష్ఠ కావింపబడింది. ఆ సందర్భంగా, అచట మే 11 నుండి 14వ తేది వరకు అనేక ధార్మిక కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. తిరుపతి అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారుల సంకీర్తనల కచ్చేరి, శ్రీ ఎ. శేషకుమార్‌గారి ఉపన్యాసము, శ్రీమతి జె. అన్నపూర్ణ, కుమారి కె. మీనాకుమారిగారి 'అన్నమయ్య పాటలు' శ్రీమతి జె. వెంకటసుబ్బాంబ భాగవతారిణిగారి "శ్రీనివాసకల్యాణము" హరికథ భక్తజనాన్ని ఆనందింపజేశాయి. పై ధార్మిక కార్యక్రమాలన్నీ హిందూధర్మ రక్షణ సంస్థ నెల్లూరిశాఖవారి ఆధ్వర్యంలో నిర్వహింపబడ్డాయి.

## నరసింహ జయంతి

హిందూ ధర్మ రక్షణ సంస్థ, మెదకుజిల్లా శాఖ ఆధ్వర్యంలో, సంగారెడ్డిలో గత మే 5వ తేదీ శ్రీశ్రీశ్రీ జగద్గురువు ఆది శంకరుల, భగవద్రామానుజుల జయంత్యుత్సవాలు నిర్వహింపబడ్డాయి. మే 13, 14 తేదీల్లో శ్రీ నరసింహ జయంత్యుత్సవాలు వైభవంగా జరుపబడ్డాయి. శ్రీ జి. రామిరెడ్డి భాగవతార్ గారిచే "శ్రీ కృష్ణరాయబారము" హరికథాగానం చేయబడింది. ఈ మే మాసంలో 4 భజనలు, 4 ధార్మికోపన్యాసములు, 2 చక్కభజనలు, 2 హరికథా కార్యక్రమాలు ఆయా చోట్ల నిర్వహింపబడ్డాయి. భక్తులకు తి. తి. దే. వారి విష్ణు సహస్రనామ పుస్తకాలు ఉచితంగా పంచబడ్డాయి.

## హరికథా కాలక్షేపం

తెనాలి తాలూకా పినపాడులోని శ్రీ సీతా రామస్వామి దేవస్థానంలో గత ఏప్రిల్ 24న మే 25న శ్రీ యాళ్ళభండి తాతారావు భాగవతార్‌గారిచే హరికథా కాలక్షేపములు జయప్రదంగా నిర్వహింపబడ్డాయి. "శ్రీవేంకటేశ్వర వైభవము" చలనచిత్రము మున్నగు ఈ కార్యక్రమాలు హిందూధర్మ రక్షణ సంస్థ తిరుపతివారి ఆధ్వర్యంలో నిర్వహింపబడ్డాయి.

## హనుమజ్జయంతి

తూర్పుగోదావరిజిల్లా తునిలోని శ్రీ కోదండ సీతారామాంజనేయస్వామివారి కోవెలలో గత మే 24 నుండి 30వ తేది వరకు శ్రీరామ నామ సప్తాహ మహోత్సవము, శ్రీ హనుమజ్జయంతి కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. సమారాధన, భజనలు నిర్వహింపబడ్డాయి. ఈ కార్యక్రమాలన్నీ శ్రీ నల్లాన్ చక్రవర్తుల వేంకటరామానుజాచార్యుల ఆధ్వర్యంలో నిర్వహింపబడ్డాయి.

ప్రకాశంజిల్లా ఈతముక్కల గ్రామంలో స్థానిక వేంకటేశ్వర భక్త బృందంవారిచే మే 25న హనుమజ్జయంతి శ్రీ అనంత కోదండరామాలయంలో నిర్వహింపబడింది. సామూహిక గోపూజకూడా నిర్వహింపబడింది ఆ రాత్రి 9-30 గంటలకు శ్రీమతి జిల్లెలమూడి శారదాదేవి బృందం వారిచే "బుఱ్ఱ కథ" కాలక్షేపం జరిగింది. హిందూధర్మ రక్షణ సంస్థ ఈతముక్కల శాఖ కార్యదర్శి శ్రీ కె. వీరభద్రరావు గారి వందన సమర్పణతో ఉత్సవం జయప్రదంగా ముగిసింది.

## పురాణ ప్రవచనం

తి. తి. దే. హిందూధర్మ రక్షణ సంస్థ గుంటూరుశాఖ ఆధ్వర్యంలో స్థానిక శ్రీరమా సత్యనారాయణస్వామివారి దేవస్థానంలో గత ఏప్రిల్ 14 నుండి 26 వరకు బ్రహ్మశ్రీ సోమాశి బాలగంగాధర శర్మగారిచే సుందర కాండ పురాణ ప్రవచనం చెయ్యబడింది.

## భారత ఉత్సవములు

చిత్తూరుజిల్లా చిన్నగొట్టిగల్లు సమితి యడంవారి పల్లెవద్ద ఈ జూన్ 1 నుండి 18వ తేది వరకు శ్రీ మహాభారత ఉత్సవాలు 18 రోజులపాటు దిగ్విజయంగా జరిగాయి. ఈ సందర్భంగా అనేక ధార్మిక కార్యక్రమాలు ఏర్పాటు చేయబడ్డాయి. తిరుపతి వాస్తవ్యురాలు కుమారి స్వర్ణలత గారిచే భరతనాట్యం ప్రదర్శింపబడింది.

లక్ష్మీదేవి ఎలక్ట్రికల్స్, పులిచెర్ల వారిచే విద్యుద్దీపాలంకరణ చేయబడింది. వేలాది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొనడం జరిగింది. ఈ కార్యక్రమాలు తిప్పిరెడ్డిగారిపల్లె, చిన్నగొట్టిగల్లు, కొమ్మిశెట్టిగారిపల్లె, తదితర గ్రామ ప్రజల ఆధ్వర్యంలో నిర్వహింపబడ్డాయి.

---

## పురాణప్రబోధ పరీక్షలు

తి. తి. దే. హిందూధర్మ రక్షణ సంస్థ ఆధ్వర్యంలో పాఠశాల విద్యార్థులకు పురాణ ప్రబోధ పరీక్షలు గత జనవరిలో నిర్వహింపబడ్డాయి. ఐదవసారిగా నిర్వహింపబడ్డ ఈ పరీక్షకు రాష్ట్రంలోని 385 పాఠశాలల్లోని 15,888 మంది విద్యార్థులు పాల్గొన్నారు. వీరిలో 10,694 మంది విద్యార్థులు ఉత్తీర్ణులైనారు. రాష్ట్రస్థాయిలో మహబూబ్‌నగర్ జిల్లా తాండ్రగ్రామం విద్యార్థిని కె. ప్రభావతి ప్రథమస్థానాన్నీ, చిత్తూరుజిల్లా గంగాధర నెల్లూరుబాలిక పి. రాధిక ద్వితీయస్థానాన్నీ, తూర్పుగోదావరి జిల్లా పొడగట్లపల్లి గ్రామ విద్యార్థిని గాదిరాజు పద్మజ తృతీయ స్థానాన్ని పొందారు. రాష్ట్రం మొత్తం ప్రథమశ్రేణిలో 693మంది, ద్వితీయశ్రేణిలో 2,773మందివిద్యార్థులు ఉత్తీర్ణులయ్యారు

---

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



పొడగంటిమయ్య మిమ్ము పురుషోత్తమా, మమ్ము
నెడయకవయ్య కోనేటిరాయఁడా ॥

కోరి మమ్ము నేలినట్టి కులదైవమా, చాల
నేరిచి పెద్దలిచ్చిన నిధానమా
గారవించి దప్పిదీర్చు కాలమేఘమా, మాకు
చేరువఁ జిత్తములోని శ్రీనివాసుఁడా ॥

భావింపఁ గైవసమైన పారిజాతమా, మమ్ము
చేవదేరఁ గాచినట్టి చింతామణీ
కావించి కోరికలిచ్చే కామధేనువా, మమ్ము
తావై రక్షించేటి ధరణీధర ॥

చెడనీక బ్రదికించే సిద్ధమంత్రమా, రోగా-
లడఁచి రక్షించే దివ్యౌషధమా,
బడిఁబాయక తిరిగే ప్రాణబంధుఁడా, మమ్ము
గడియించినట్టి శ్రీ వేంకటనాథుఁడా ॥

— అన్నమయ్య అధ్యాత్మకీర్తన.

( ప్రతి జూలై 16న జరిగే శ్రీవారి ఆణివార ఆస్థాన ఉత్సవ సందర్భంగా )

### స్వర్ణోత్సవ సంచిక

తి. తి. దేవస్థాన స్వర్ణోత్సవ సంచిక ఒక ఆధ్యాత్మిక కళాఖండము. అందలి వ్యాస రచయితలకు నా ప్రణామములు. తి. తి. దే. స్వర్ణోత్సవ వివరములు కల మే సంచికలోని నాగరాజ్ గారి వ్యాసం ఆ ఉత్సవములలో పాల్గొనలేని మాబోటివారికి ఆ వివరములు చదువుతుంటే ఆ ఉత్సవాలు ప్రత్యక్షంగా దర్శించినట్లు అనుభూతి ఆనందము కల్గించినది. ఆ వ్యాసకర్త నాగరాజ్ గారికి, సంపాదకులకు ధన్యవాదములు.

డా॥ బాబుహరినాథ్ — నంద్యాల

యం. జనార్దనాచార్యులు — నల్గొండ

పి. ఆదిలక్ష్మి — నెల్లూరు




### ఆధ్యాత్మిక చింతన

నాస్తికవాదం ప్రబలుతున్న ఈ కాలంలో ఆస్తికభావాలను రేకెత్తిస్తూ. ఆధ్యాత్మిక చింతన కలిగిస్తున్న 'సప్తగిరి' మాసపత్రికకు మా ధన్యవాదములు. దేవస్థాన అధికారులకు వందనములు.

బూరెల నాగయ్య — సూర్యాపేట

### రాశిఫలం

"సప్తగిరి" లో 'మీరాశిఫలం' శీర్షికను పునరుద్ధరించి పంచాంగము, జ్యోతిష ప్రాముఖ్యమును పటిష్ఠము చేయగలరని ప్రార్థన.

దూశ్య మల్లేశం — హైదరాబాదు

### మథనం

సప్తగిరిలో ప్రచురించే వ్యాసములు, కథలు చాల రసవంతముగాను, ఉత్తేజకరముగా నుండుటయేకాక పామరులమయిన మాబోంట్లకు తెలియని అనేక విషయములును, భక్తిమార్గములను తెలియుచున్నవి.

మే నెలలోని 'మథనం" వలన మన సంప్రదాయములోని ముఖ్యమైన సంగతులు తెలిసినవి. నాగరాజ్ గారికి ధన్యవాదములు.

నండూరి గున్నేశ్వరరావు — భీమవరం

### యువవాణి

మే నెల సప్తగిరి లోని 'ఉపదేశం' చాల బాగుంది. ఇటువంటి కథలవల్ల పాఠకులు ప్రభావితులవుతారు. సంపాదకులకు రచయితకు కృతజ్ఞతలు.

నందం చంద్రశేఖర్ — జడ్చర్ల

### కర్తవ్యం ఇంకా ఎంతోవుంది!

"సప్తగిరి" గడచిన 14 ఏండ్లుగా మన ప్రజాజీవనాన్ని ధార్మిక దృక్పథాలలో జాగృతంచేస్తూ నడిపించింది. మాలో ఎంతో సంతృప్తి వ్యక్తమవుతుంది. కాని ఇప్పుడిప్పుడే జనమంతా ధార్మికముగా అభివృద్ధి చెందుతున్న ఈ సమయంలో "సప్తగిరి" పత్రికను నెలాఖరుకు, లేదా, తరువాత నెలకు పంపించడం చాల శోచనీయంగా వున్నది. ఇంతవరకు జనతను ధార్మికంగా తీర్చిదిద్దిన ప్రగతికన్నా సాగించవలసిన కర్తవ్యం ఇంకా ఎంతో వున్నదన్న విషయాన్ని గ్రహించి "సప్తగిరి" పత్రికను ప్రతినెలా మొదటివారంలో పంపించే ఏర్పాట్లు కట్టుదిట్టంగా చేస్తారని ప్రార్థన.

కె. నరసింహాజీరావు — కంచనపల్లి

కె. ఇందిరాబాయి — కంచనపల్లి

స్వర్గం వెంకట కోటేశ్వరరావు — కొండపల్లి

### ఉపదేశం

శ్రీ ద్వివేది ఉమామహేశ్వరరావుగారిచే విరచితమయిన సామాజికస్పృహతో కూడిన 'ఉపదేశం' కథ - శాస్త్రివంటి అహంకార పూరితనై జంగల కామాంధులకు చక్కని కనువిప్పు.

యం. శాష — పిడుగురాళ్ళ

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

జూలై 1984

సంపుటి 15 సంచిక 2



## ఈ సంచికలో....



ముఖచిత్రం: సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు. చిత్రకారుడు : శ్రీ ఎస్. సత్యనారాయణ, తిరుపతి.

2 వ కవరుపేజి : నెల్లూరులో స్వర్ణోత్సవాలు. 3 వ కవరుపేజి : తిరుపతిలో ఆభరణాల వేలం. 4 వ కవరుపేజి : తిరుమలలో పవిత్రోత్సవం.

# సంపాదకీయం

దేవుడున్నాడా అనే ప్రశ్న వచ్చింది, 'సందేహము వలదు' అన్నారు. ఎక్కడున్నాడు అని మరో ప్రశ్న. 'ఎందెందు వెదకి చూచినా అందందే' అనే దానికి జవాబు. అనుమానం తీరక ఒకాయన స్తంభాన్ని బ్రద్దలు కొట్టాడు. అనుమానించటానికింకేమీ మిగల్లేదు !

మరి మామూలు మనుషులకూ అదే అనుమానం వచ్చింది. మనిషికైతే ఒకరు కాదు నల్గురు దేవుళ్ళనీ, దేవులాడుకొనే అవసరం లేకుండా లెక్కకూడ చెప్పేశారు. తల్లి, దండ్రి, గురువు, అతిథి.. ఈ మాట వినంగానే సహజంగానే అనుమానం వస్తుంది.... తల్లి, తండ్రి అంటే ఏదో సర్దుకుపోవచ్చు. మిగిలిన అడ్డమైన వాళ్ళనూ ఆ లెక్కలో చేర్చటమేమిటని ! నిజానికి మనకేదో అడ్డమౌతుండబట్టే గురువు గొప్పతనాన్ని గుర్తించలేకపోతున్నాం.

అసలు గురువంటే త్రిమూర్తి స్వరూపమని మనవాళ్ళ భావన. భేదరహిత పశు శిశు స్థితిమంది మానవ జీవనానికి అలంబనమైన స్వరూప విజ్ఞానాన్ని కల్గించే బ్రహ్మగా, లోక వ్యవహార నిర్వహణ దక్షతను, అస్తిత్వాన్ని నిరూపించే వ్యాపక తత్త్వ ప్రతీక విష్ణుతత్త్వంగా, లౌకికాతీతమైన పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోక ప్రబోధకమైన ఆధ్యాత్మిక తత్త్వ బోధన ద్వారా సంసార సంహారకమైన రుద్రరూపంగా — ఇలా త్రిమూర్త్యాత్మక శక్తిగా భావించి సంభావించారు.

దీనికి తగ్గట్టు గురువులు కూడా తమ అమల ప్రవృత్తితో తమ గురుత్వాన్ని నిలబెట్టుకొన్నారు.

వాచామగోచరుడు, వేదవిశ్వాసకుడు ఐన ఆ పరబ్రహ్మను వదిలితే తక్కిన వాఙ్మయ ప్రపంచానికి కారణభూతుడు వాల్మీకి, ఆదిగురువు, రామకీర్తి చంద్రికలు దిగ్దిగంతాల వ్యాపింపజేసి అజరామరస్థానాన్ని కల్పించి చరితార్థుడయ్యాడు.

వేద వాఙ్మయాన్ని వింగడించి, మానవప్రవృత్తులను వాటి వికృతులతో సహా, యథాతథంగా చిత్రించి 18 పర్వాలసార్వకాలిక మానవ విజ్ఞాన సర్వస్వాన్ని అందించిన కృష్ణ ద్వైపాయన వ్యాసుడు ఏకైక గురుశబ్ద వాచ్యుడయ్యాడు.

ఆధ్యాత్మికంగా ఆత్మపరమాత్మల సంపుటీకరించి అద్వైతాన్ని రూపించిన శంకర భగవత్పాదులు, అద్వైతాన్ని సగుణారాధనతో విశిష్టం చేయటమేకాక లౌకిక వ్యవస్థా సంస్కారిగా ఆచార్య రామానుజులు, జీవదేవ భేదాన్ని ప్రతిపాదించి పరమాత్మతో సంయోగానికి, జీవప్రయత్నానికి దోహదంచేసే ద్వైతాన్ని ప్రతిపాదించిన మధ్వాచార్యులు, జీవదేవైక్యతను, సర్వజన గ్రాహ్యమైన స్త్రీ పురుషోపమానాలతో రూపించిన మధురభక్తిని ప్రబోధించిన చైతన్యులు, నింబార్కులు, వల్లభాచార్యులు, పీఠాలను స్థాపించి ఆసేతు హిమాచలం దివ్యభవ్య స్థానాన్ని పొందారు.

దైవచింతన కన్న జనసేవ ముఖ్యంగా భావించి మహావీరుడు; గౌతముడు, గురునానక్ లాంటి మహనీయులు సమాజంలో సమతా ధర్మాన్ని సత్ప్రవర్తన ప్రవచించి ప్రబోధించారు.

ఇంతేకాదు, సమాజధర్మాలకు, మానవత మనుగడకు ముప్పు తెచ్చేతత్త్వం పెచ్చు పెరిగినప్పుడు స్వామి విద్యారణ్యులు సమర్థ రామదాస్, గురు అర్జునసింగ్, తేజ్ బహదూర్‌సింగ్, గురుగోవింద్ తమ మాటలద్వారా, బాటలద్వారా సమాజాన్ని ఉత్తేజితంచేసి,

[48 వ పేజీలో]

# తత్త్వగేయాలు

జగద్రహస్య సమస్యల నర్థము చేసికొను టకై చేయు మానవ ప్రయత్నమే తత్త్వ శాస్త్ర కర్తవ్యము గాన అది జాతి, సంస్కృ తుల సంస్కారమునకు లోనై యుండునని భారతీయ తత్త్వశాస్త్రం చెపుతోంది. అంతే గాక మనవారు తత్త్వచింతనలో మునిగి "అహంబ్రహ్మాస్మి", "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంటున్నారు. ఇదే విషయాన్ని- జ్ఞానము నకు తెలివికి తూర్పుసీమలకు యాత్ర అవ సరమనేది గ్రీసులో సామాన్య విశ్వాసమని ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్రచరిత్రఅంటోంది.

ఈ తత్త్వాన్ని వేదాంత మన్నారు. అంతే గాక జీవాత్మ పరమాత్మల సంబంధము అని కూడా అన్నారు. ఈ అన్వేషణలో భారతదేశం ముందంజ వేసింది.

తత్త్వమనగా- ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర ప్రకారం- జీవప్రకృతుల స్వభావ మెట్టిదో తెలిసికొనుటకై చేయు సమాలోచన 'తత్త్వము'. సత్యమును గూర్చిన చింతన రెండు మార్గముల సాగినది. ఒకటి దివ్యాను భవము – సంప్రదాయములో ఆరంభించి అటనే ఆగిపోవును. అదియే మతము. రెండ వది తార్కికుల యుక్తులపై ఆధారపడి యున్నది. అదియే తత్త్వ మని తెలియ జేస్తోంది.

ఇలాంటి తత్త్వాలపై జానపదుడు నిరంత రం ఆ భగవంతుణ్ణి ఎలా ధ్యానిస్తున్నాడో, ఆతడల్లు కున్న, అమాయకంగా కనిపించే గేయాల్లో ఎంతో స్ఫుటంగా కన్పిస్తుంది.

జానపదుడు స్ఫురణ ప్రధానమైన ఆలో చన ఉన్నపుడు తనకంటూ ఒక ధ్యేయం, దాన్నందుకోడానికి ఒక సాధనం రెంటిని వెతుక్కుంటాడు. జానపదుడు తనకు తెలియని రహస్యాన్ని అది (తత్) అన్నాడు. అది తానుగా మారాడు కాబట్టి (సోఽహమ్) అన్నాడు. అదే నీవు అనే అర్థంలో "తత్ త్వం" అన్నాడు. అదే తత్త్వం(ము).

శ్రీ శంకరుల అద్వైతమార్గమే భారత దేశంలో పల్లెపల్లెలో నాటుకుపోయినా జీవిత విధానం ప్రకృతిని మార్మికంగా ఋతుగా చూస్తూనే అనంతమైన నీతిని విలక్షణమైన రీతిలో చెప్పటం తత్త్వగేయాల ప్రత్యేకత. రాయలసీమలో పాపులమ్మ, లింగయ్య, ఈరయ్య, బ్రహ్మంగారి తత్త్వాలున్నాయి. వారు ఎపుడో చెప్పారని తెలుస్తోంది.

నేను సేకరించిన తత్త్వగేయాల్లో విలక్షణ మైన మార్మికగేయం ఇది. అర్థం అస్ప ష్టంగా వున్నా భావం మాత్రం తెలుస్తోంది. బట్టను పరవటం ఎక్కడో ఈశావాస్యములో "ఈశావాస్య మిదం సర్వం" అనే తత్త్వాన్ని తాకుతోంది. ఈ జగత్తుకు ఈశ్వరుడు 'బట్ట'. అతడే లోకంలోకి అవతరించి ప్రకృతి అవు తున్నాడు. ఆ ప్రకృతి పాడిన పాట —

యంతమందికి బట్ట పరతూనూ
యీ ప్రపంచమునా
యంతమందికి బట్టపరతూనూ
యంతమందికి బట్టపరతూ
యవ్వరూ ననుకానలేరూ
బ్రహ్మకే బిడ్డనైతి
బ్రహ్మకేనే భార్యనైతిని
ఐదో వరసనత్తనైతి
ఆరో వరసన తల్లినైతి
ముగ్గురాకు మాట యిచ్చితి
ఆరవాని యింట నిలిచితి
యేడోవానికి యాగటయితి
బాగుగా భూమిరెడ్డిపల్లి పాపులమ్మ
చెప్పినట్టి తత్త్వమిది చదివినా వక్కటే
యింటిలో చదివినా వక్కటే
మూల చదివినా వక్కటే దీని
మూల మేమో తెలుసుకొండి.

ఇపుడు మానవుడు ఏమి చేస్తున్నాడో, ఆతని మనస్తత్త్వ మే విధంగా ఉందో అన్నింటిని అద్దం పట్టినట్లు ఎపుడో తెలియ జేశారు, జానపదులు. అలాంటి గేయం ఇది-

"శంభో మహదేవా దండామయా
అండ దండగ నీవుండాలయా ॥శం॥

పైకి ఎంతో మంచివారిగా నటిస్తూ
చీకట్లో పాపాలు సలిపేరయా
మాటి మాటికి నీతి మాటలను వల్లిస్తూ
చాటుగా కులటలై పోయేరయా ॥శం॥

ధనంకోసం దైవధ్యానాలు బోనాలు
కోటి పన్నాగాలు పన్నేరయా
భూమి సూర్యుని చుట్టు ప్రజలు
డబ్బు చుట్టు
గిరగిరా గిర తిరుగు తుంటారయా॥శం॥

ముసుగులో మోసాలు దోషాలు కడుచేసి
అసలు రూపును దాచి పెడతారయా
యితరు లెరుగకయున్న యీశ్వరుం
డెరుగడా
తగిన ఫలితము అనుభవిస్తారయా ॥శం॥

రంగ లింగా యంచు దొంగపూజలు చేసి
పంగనామము ప్రజకు పెడతారయా
స్వార్థానికై కీర్తి కండూతి ధూర్త
కార్యాలు మెండుగా చేస్తారయా ॥శం॥

తత్త్వగేయాలు మానవులకు తెలివి తేటల్ని తెలియపరచేటందుకు, వాటి మూలాన్ని తెలుసుకొంటూ వాటిని విని నంతసేపూ మనసు మార్చుకొంటారు. తర్వాత వాటిని మరచిపోతున్నారు. అస

లెందుకు మానవజన్మం, ఈ జన్మ మరీ మరీ రాదు. ఈ జన్మలో సాధించాల్సిన వాటిని భక్తిశ్రద్ధలతో సాధించాలి అందుకు భగవంతునిపై భారం వేయాలి. ఆతనినే నమ్ముకోవాలి. అంటే ఏమి చేయాలో ఈ క్రింది గేయం తెలియజేస్తోంది. మనకు కన్నులు చేతులు, కాళ్ళు, నోరు, చెవులు, తెలివి, బ్రతుకు అనేవి ఎందుకో తెలియజేస్తోంది ఇది —

"మానవజన్మం మహావరం ఇది
మళ్లీ మళ్లీ రాదురా॥
ఇది మళ్లీ మళ్లీ రాదురా మళ్లీరాదురా
॥మానవ॥

కన్నులనిచ్చిన దెందుకో తెలుసా
అన్నియు చూసేటందుకా
కాదు కాదు దేవాదిదేవుడగు
కైలాసుని చూసేందుకు కాదా ॥మానవ॥

చేతులనిచ్చిన దెందుకో తెలుసా
మూతికి ముద్దను వంపుటకా
పతితావనుడౌ శివుని పూజలను
చేతులారా చేసేందుకు రా ॥మానవ॥

పొందుగా కాళ్లను యిచ్చిన
దెందుకు సందుగొందు తిరిగేందుకా
అందుకు కాదు నందివాహనుని
మందిరాని కేగేందుకు రా ॥మానవ॥

నోటిని యిచ్చిన దెందుకో తెలుసా
మాటలు పలికేటందుకా
ఆర్తత్రాణుడు పరమాత్మునిపై
కీర్తన పాడేటందుకు రా ॥మానవ॥

చెవులను యిచ్చిన దెందుకో తెలుసా
శబ్దములన్ని వినేందుకా
కానే కాదు భగవానునిలీల
వీనులవిందుగ వినేందుకు ॥మానవ॥

తెలివిని యిచ్చిన దెందుకో తెలుసా
కలిమిని సంపాదించుటకా
నాలుగురోజుల నాటక మిది
నగ్నసత్య మెరిగేందుకు రా ॥మానవ॥

బ్రతుకు బ్రతుకునది యెందుకో తెలుసా
మెతుకులు గతికేటందుకా
వెతలను తీర్చేటి లోకాతీతుని
వునికిని వెతికేటందుకు రా ॥మానవ॥

కొన్ని గేయాల్లో మనిషి ఎందుకోసం జీవించాలి, ఇల్లు ఎందుకు? భార్య, పిల్లలు అన్నదమ్ములు, అంటూ కొద్దిమంది ఆరాటపడుతూ ఆస్తిని సంపాదించటం, వారి కోసం తనజీవిత సర్వస్వాన్ని ధారపోస్తారు. చివరిక్షణంలో వారు నీతో రారు అని తెలియజేసేవి కొన్ని ఉన్నాయి. చివరికి ఆ దేవాదిదేవునిపై భారంవేయాలని, నారు పోసిన వాడే నీరు పోస్తాడని గట్టి నమ్మకంతో వుండమంటూ హెచ్చరిక చేస్తాయి. అలాంటి గేయమొకటి చూడండి —

"యిల్లు యిల్లంటావు వుల్లాస
పడతావు నీ యిల్లెక్కడే చిలుకా
అల్లంతదూరాన వల్లకాటిలోన
నీ యిల్లు వున్నదే చిలుకా

వచ్చునాడు నీవు వెంటేమి
తెచ్చావు పోవునాడు అంతే చిలుకా
మూన్నాళ్ళ ముచ్చటకు మురిసేవు
భ్రమిసేవు ముందుగతికానక చిలుకా

ఆలుపిల్లాలంచు అన్నదమ్ములంచు
ఆరాటపడబోకే చిలుకా
నీవు నీవే గాని నీ కెవ్వరూలేరూ
నా మాట నమ్మవే చిలుకా

ఆస్తిపాస్తుల కొరకు అస్తమానము
నీవు కుస్తీలు పట్టేవు చిలుకా
అస్థిరమ్ములపైన గస్తీలు నీకేల
కాస్త యోచింపుమా చిలుకా

ఊపిరున్నన్నాళ్లు వూరిలో నీ
వారు మావారు అంతే చిలుకా
ఊపిరి పోగానే భార్యబిడ్డలు
కూడ నిన్ను చూడ జంకుదురు చిలుకా

పేరు తెచ్చానంటూ పైకి వచ్చా
నంటూ విర్రవీగకె వెర్రిచిలుకా
విశ్వాన నీవెంత పేరు యెంతా
యికనైన మేలుకో చిలుకా

డబ్బుడబ్బంటావు యిబ్బంది పడి
మురికిదిబ్బలో దిగబోకె చిలుకా
జబ్బుపుచ్చుక యముడు దబ్బు
దబ్బున లాగ తబ్బిబ్బు కానేల చిలుకా

ఇపుడు చచ్చినవాని చూసి బావురు
మంచు వాపోవ నేలనే చిలుకా
రేపు నీ చావుంది తప్పించు కోలేవు
ముందే జాగ్రత్తపడు చిలుకా

నీ దన్న దేహమే నిన్ను కాదని పోవు
నీదనే దిక యేదె చిలుకా
యెవరి దేదీ లేదు యేదీ నీతో రాదు
కాదు శాశ్వతమేది చిలుకా

సారమేలేనట్టి సంసార వలయాన
చిక్కి పొక్కగ నేల చిలుకా
నారు పోసినవాడు దేవుడున్నా
డంచు నోరార చాటవే చిలుకా."

ఇలాంటి గేయాలు రాయలసీమలో రతనాల్లాగా ఉన్నవి. ఆ రత్నాల్ని ఏరుకోవటం మనవిధి. ఈ వ్యాసంలోని ప్రతి గేయం ఒక్కొక్క రత్నంలాగా మనం అనుకొంటే, వాటిలోని ఇతివృత్తాన్ని పరిశీలించుకొని, ఒక్కసారి తత్త్వచింతనలో మునిగితే, అపుడు ఆ గేయకర్త రచనానైపుణ్యం తెలుస్తుంది. ఇలాంటి అజ్ఞాతకర్తలైన జానపదుల హృదయాంతరాళం నుండి పొంగి పొరలినవే ఈ గేయాలు. వీటిని ఒకచోట కుప్పవేయటం అందరి విధి. ఇలాంటి గేయాలు సుమారు ఈ వ్యాసకర్త యాభై దాకా సేకరించాడు. కొన్నింటిని మాత్రమే ఈ వ్యాసంతో పొందుపరచటం జరిగింది.

ఇలాంటి గేయప్రపంచంలో జీవితాన్ని సాగిస్తున్న జానపద సమాజంలో మంచి (సత్) అనే మాటకు గిరాకీ ఇంకా పోలేదు.

— శ్రీ చిగిచర్ల కృష్ణారెడ్డి



ఆగమశాస్త్రములో దేవాయతనమున కనేక నామములున్నవి.

"ప్రాసాదం సదనం సద్మ
హర్మ్య ధామ నికేతనమ్,
మందిరం దివ్యవైమానం
ఆధారం దేవమాశ్రితమ్."

ఇవన్నియు దేవతాగారములు, దేవాలయములు. అయితే యిట్టివాటిలో కొన్ని అంతర్భాగములు చేరియుండును. అంతస్తులతో గూడా యుండును. అంతస్తులు దాదాపు 9,11 వరకు గూడా ఉండవచ్చును. అందులో కొన్ని వివరించుటవసరము. ఉపపీఠము, ప్రస్తరము, వేదిక, శిఖరము, మొదలగునవి. ప్రస్తరము మీద యుండును. కలశబంధము, శ్రీకాంతము, యీ పేర్లు గలిగియున్నది. గర్భగుడి, అధిష్ఠానక్రమము తరువాతనే బయటి కట్టడములారంభించనగును. ఆలయనిర్మాణము ననుసరించి, వాటి కొలతల నుపయోగింపవలయును. ఒక్కయుదాహరణ. స్తంభప్రక్రియ తీసుకొందము. ఎప్పుడు స్తంభము అను పదములనే వాడుటనుబట్టి పర్యాయపదములు సాధారణముగా తెలియవు. తలపము, స్థూణము మొదలగు పేర్లుగూడా యున్నవి. ఈ స్తంభములు లేక తలపములు, 8, 12, 16, సరిసంఖ్యలో ఆ యా పద్ధతులకు భిన్నముగాక 32, 64, ఇంకా పైవరకు కూడా యుండును. వీటిపైననే గదా కప్పు! కాన లెక్కప్రకారమున కిది యొక గావు. ఉపపీఠము మొదలు స్థూపి వరకు తీసుకొనవలయును. కాని తొందరపడి యెక్కడి కక్కడే సరిపెట్టుకో కూడదు. చక్కగా శాస్త్రపరిశోధకుల సహాయము లెంతైనా గలవు.

గర్భగుడి, దేవుని పీఠము. 'చతురస్రం వృత్తము, షడస్రము.' ఈ విధముగా 7 రకములు. గర్భాలయము వెడల్పు 'దండము'-ఆలయము ముందు అర్థమంటపము కొలతనిడివి. అర్థమండపము తర్వాత మహామండపము. కొలతలు వాస్తుప్రకారముగా నుండవలెను. శైవ, వైష్ణవాలయములలో ఇవి మాత్రము తప్పవు. తగ్గవు. శివా




# దేవాలయ కట్టడములు!

కర్ణకూటమని నిర్మించిన మరొక యంతస్తు కవకాశము గలుగుచుండును. భక్తులు బయటి నుండి చూచినపుడే యే భాగము లున్నవో తెలియబడును. మొదట కనుపించునది గోపురము. తర్వాత ప్రాకారము. ఇది ప్రదక్షిణమున కుపయుక్తము. బలిపీఠము, ముందు ధ్వజము. ముఖమంటపము, గర్భాలయము. శైవమయితే నంది మండలము. వైష్ణవమయితే గరుడాలయము. ఇవి చాలా ముఖ్యమైనవి. ఇందు పేర్గొనువాటి కెంతో విలువయున్నది. నామకార్థము గాదు. కాన సాధకులు చక్కగా పరిశీలించగలరు. "రక్షార్థ మున్నతా ర్థంవా, బృహత్త్విత ప్రయోజనం." దేవతా రక్షణముకొరకు, భద్రతకొరకుపయుక్తము. అందుపైన 'అధిష్ఠానము,' విగ్రహమున కుపయోగము. 'అధిష్ఠానదేవత' యందురు. దాదాపు 32 రకముల పేర్లతో ప్రాముఖ్యము. పైగా ఆగమనియమము. కప్పుపైన చుట్టు ఉండునది 'ప్రస్తరము' వేదిక, కంఠము. ఇది బహువిచిత్ర నిర్మాణము. మనిషి తలకు, కడుపునకు మధ్యన గంఠమని యందుము. అటులనే యిది. ఇంకా పైన శిఖరము. కమలాకృతి, ఫలాకృతిగానో యుండవలయును. ఉత్తర దేశస్థులు "ఆమలక" మనుచుందురు. ఆమలకమనగా యుసిరికకాయ. దీనిపై కలశమని యనునది. 'స్థూపి' పోను పోను మొన సన్నగా ఉండును. ఇనుప ముక్క పైన కనుపించుటచేత పిడుగు ఇత్యాది యుపద్రవములను నివారించును. పెద పెద్ద భవనములవారు ఇట్టి శలాకాదుల నుపయోగించుచుందురు. పట్నవాసములలో దూరదర్శిని- టెలివిజన్ గుర్తుల కేమివాడుదురో గమనించుడు. దేవాలయము కొలతలు లోపలిభాగములవి లయమున నందివెనుక బలిహరణము. వైష్ణవాలయమున గరుత్మంతుని తర్వాత బలిపూజ. బలిపీఠ మధిష్ఠానమునకు సమానముగా నుండును. వీటిలో కొన్ని భేదము లున్నను అవి శాస్త్రసమ్మతములై యుండునని గ్రహించేది. ఆ ప్రమాణములు ఆగమ శాస్త్రమున చెప్పబడినవి. చూడవచ్చును. బలిపీఠమావల పెద్ద కట్టమీద ఎత్తుగా దారు, శిలతో చేయబడినదియే ధ్వజస్తంభ మందురు. కల్యాణోత్సవాదులలో, కార్తీక మాస పూజలలో ఇక్కడ ప్రత్యేక పూజలు జరుగును. సాధారణముగా మిక్కిలి ఎత్తు గలిగిన స్తంభము ధ్వజస్తంభము. దీని నిర్మాణపద్ధతి, స్థాపన మొదలగు వివరణములు ఆగమమున చాలా వివరింపబడినవి. దేవాలయమునకు ధ్వజము తప్పనిసరి. తరువాత తెలుసుకోదగినది ప్రాకార వివ

# పవిత్రోత్సవం

## (6-8-84 నుండి 9-8-84 వరకు)



**తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి 84 ఆగష్టు (శ్రావణమాసం) నెలలో పవిత్రోత్సవాలు ఈ క్రింది విధంగా జరుగుతై.**

| | | | | |
|---|---|---|---|---|
| 6-8-84 | — | సోమవారం | — | అంకురార్పణ |
| 7-8-84 | -- | మంగళవారం | — | పవిత్రప్రతిష్ఠ |
| 8-8-84 | — | బుధవారం | — | పవిత్రసమర్పణ |
| 9-8-84 | — | గురువారం | — | పూర్ణాహుతి |

గృహస్థులు రూ 5000/- లు చెల్లించి, ఈ ఆర్జిత సేవలో పాల్గొనవచ్చును. 5 మందికి ప్రవేశము మరియు ప్రసాదములు ఇవ్వబడును.

**తి. తి. దేవస్థానములు,**
**తిరుపతి.**

రణము; పంచ, **సప్త**ప్రాకారములు గలవి. **వీటి యావశ్యకత** యెంతైనా మంచిది. **భక్తులచిత్తము** భగవంతుని స్మరిస్తూ ప్రద**క్షిణము** ద్వారా గర్భాలయము జేరునప్పటి కేకాగ్రత గలిగి మన స్సు దేవునిపై స్థిర పడును. ప్రాకార లక్షణముగూడా దండ ప్రమాణము ననుసరించియే యుండును. నందికేశ్వరుఁడు భూతములు ఉండిన శివు డని, అంజనేయుడు, గరుత్మంతు డుండిన విష్ణుమూర్తి యని తెలుసుకోవచ్చును. 11 అంతస్తుల తరువాత గోపురములు లేవు. 16 వరకుండుట ఆగమ విరుద్ధము గాదను ప్రమాణ మున్నది. మూలవిరాట్టు కొలత లాధారముగా దేవుల కనుగుణముగా హిమాద్రి మొదలు, కాన్యకుబ్జము వరకే ఆర్యావర్తము. "ఆర్యావర్తః పుణ్యభూమిః" అనుచున్నారు కదా. ఏవి నిర్మించినా యిది తప్ప మరియొక ప్రదేశం లేదు. అయితే యీ భూమి అంతా ఒకటే విధము గాదు. 3 భాగములుగాగల యీ పవిత్రార్యావర్తము, హిమగిరి వింధ్యాద్రి వరకు సాత్త్వికము. వింధ్య మొదలు కృష్ణానది వరకు రాజసము. తరువాయి కన్యాకుమారి వరకు తామస భూములుగా పేర్కొనబడినవి. నిర్మాణ మూర్తులా యా రీతులతో అలరారు చుండును. విష్ణు వెప్పుడు సాత్త్వికవరు డనియు, శివుడు రజోమూర్తిగాను, బ్రహ్మ తమోమయుఁడుగాను నిర్వచించిరి. విగ్ర హములనే మూర్తులని పలుకుదురు. బింబము అంటే గూడా తప్పు లేదు. బింబములను మూడుగా విభజించినారు. నిష్కళము- కాళ్లుచేతులు లేనివి, శివ లింగములు. సకల ములనగా అంగములన్ని యుండునవి. రామ, విష్ణువులు. మూడవది మిశ్రమము అనగా పై రెండింటితో గలిసినది. ముఖ లింగఇత్యాదులు. ఇటుల ఇంకా ఎన్నో వివరములున్నవి.

— **శ్రీ బి. మాణిక్యశర్మ**

## పదునాల్గవ అధ్యాయం

### గుణత్రయ విభాగయోగం

శ్రీ భగవానువాచ:

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్।
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః॥

శ్రీభగవానుడు: జ్ఞానాలన్నిటిలోకి ఉత్తమం, ఉత్కృష్టం అయిన జ్ఞానాన్ని నీకు మళ్లీ చెబుతాను విను. ఈ జ్ఞానాన్ని తెలుసుకున్న మునులంతా సంసారవ్యథలనుంచీ, బాధల నుంచీ తప్పించుకుని మోక్షం పొందారు.

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ॥

ఈ జ్ఞానాన్ని ఆశ్రయించినా స్వరూపం పొందినవాళ్ళు సృష్టిసమయంలో పుట్టరు; ప్రళయకాలంలో చావరు.

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత॥



అర్జునా! మూలప్రకృతి నాకు గర్భాధానస్థానం. అందులో నేను సృష్టిబీజాన్ని వుంచుతున్నందువల్ల సమస్త ప్రాణులూ పుడుతున్నాయి.

సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా॥

కౌంతేయా! అన్ని జాతులలోనూ ఆవిర్భవిస్తున్న శరీరాలన్నిటికి మూలప్రకృతే తల్లి. నేను బీజాన్ని యిచ్చే తండ్రిని.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥

అర్జునా! ప్రకృతివల్ల పుట్టిన సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు శాశ్వతమైన ఆత్మను శరీరంలో బంధిస్తున్నాయి.

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ॥

అర్జునా! వాటిలో సత్త్వగుణం నిర్మలమయింది కావడం వల్ల కాంతి, ఆరోగ్యమూ కలుగజేస్తుంది. అది సుఖంమీద, జ్ఞానంమీద ఆసక్తి కలుగజేసి ఆత్మను బంధిస్తుంది.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్॥

కౌంతేయా! రాగస్వరూపం కలిగిన రజోగుణం ఆశకూ, ఆసక్తికీ మూలమని తెలుసుకో. కర్మలమీద ఆసక్తి కలిగించి అది ఆత్మను బంధిస్తుంది.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత॥

అర్జునా! అజ్ఞానంవల్ల జనించే తమోగుణం ప్రాణులన్నిటికీ అవివేకం కలగజేస్తుందని తెలుసుకో. అది పరాకు, బద్ధకం, నిద్రలతో ఆత్మను శరీరంలో బంధిస్తుంది.

# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత:

**శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి**

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత॥

అర్జునా! సత్త్వగుణం సుఖం చేకూరుస్తుంది; రజోగుణం కర్మలలో చేరుస్తుంది. తమోగుణం జ్ఞానాన్ని మరగు పరచి ప్రమాదం కలగజేస్తుంది.

రజ స్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత!
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥

అర్జునా! రజోగుణాన్నీ, తమోగుణాన్నీ అణచివేసి సత్త్వగుణం అభివృద్ధి చెందుతుంది. అలాగే సత్త్వతమోగుణాలను అణచివేసి రజోగుణమూ సత్త్వరజోగుణాలను అణగద్రొక్కి తమోగుణమూ వర్ధిల్లుతాయి.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత॥

ఈ శరీరంలోని ఇంద్రియాలన్నిటినుంచి, ప్రకాశించే జ్ఞానం ప్రసరించినప్పుడు సత్త్వగుణం బాగా వృద్ధిపొందిందని తెలుసుకోవాలి.

లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా।
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ॥

అర్జునా! రజోగుణం అభివృద్ధి చెందుతున్నప్పుడు లోభం, కర్మలపట్ల ఆసక్తి, అశాంతి, ఆశ అనే లక్షణాలు కలుగుతుంటాయి.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥

కురునందనా! బుద్ధిమాంద్యం, బద్ధకం, అలక్ష్యం, అజ్ఞానం-ఈదుర్లక్షణాలు తమోగుణ విజృంభణకు తార్కాణాలు.

యధా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే॥

సత్త్వగుణం ప్రవృద్ధిచెందిన సమయంలో మరణించిన వాడు ఉత్తమ జ్ఞానులుపొందే పుణ్యలోకాలు పొందుతాడు.

రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥

రజోగుణం ప్రబలంగా వున్న దశలో మృతిచెందితే కర్మలమీద ఆసక్తికలవాళ్ళకు జన్మిస్తాడు. అలాగే తమోగుణ వృద్ధిలో తనువు చాలించిన వాడు పామరులకూ, పశు పక్ష్యాదులకూ పుడుతాడు.

కర్మణ స్సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖం అజ్ఞానం తమసః ఫలమ్॥

సత్త్వగుణ సంబంధమైన సత్కార్యాల ఫలితంగా నిర్మల సుఖమూ, రాజసకర్మల మూలంగా దుఃఖం, తామసకర్మల వల్ల అజ్ఞానం కలుగుతాయని చెబుతారు.

సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥

సత్త్వగుణంవల్ల జ్ఞానం, రజోగుణంవల్ల లోభం, తమోగుణంవల్ల అజాగ్రత్త, మోహం, అజ్ఞానం సంభవిస్తాయి.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థాః అధో గచ్ఛన్తి తామసాః॥

సత్త్వగుణ సంపన్నులకు ఉత్తమలోకాలు సంప్రాప్తిస్తాయి. రజోగుణం ప్రధానంగా వున్నవాళ్లు మానవలోకాన్నే పొందుతుండగా తమోగుణం కలిగిన వాళ్లు నరకలోకానికి పోతుంటారు.

నాన్యం గుణేభ్యః కర్తారాం యదా ద్రష్టానుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥

కర్మలన్నిటికీ గుణాలను తప్ప మరోదాన్ని కర్తగా భావించకుండా, గుణాలకు అతీతమైన పరమాత్మ తత్త్వాన్ని గ్రహించిన వివేకి మోక్షం పొందుతాడు.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యు జరాదుఃఖైః విముక్తోఽమృతమశ్నుతే॥

శరీరం కారణంగా ఈ మూడు గుణాలనూ అధిగమించిన వాడు పుట్టుక, చావు, ముసలితనం, దుఃఖాలనుంచి విముక్తుడై అమృతపదం పొందుతాడు.

అర్జున ఉవాచ:

కైర్లింగై స్త్రీన్ గుణానేతాన్ అతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణానతివర్తతే॥

అర్జునుడు: ప్రభూ! ఈ మూడు గుణాలనూ దాటిన వాడి లక్షణాలేమిటి? అతని ప్రవర్తన ఎలా వుంటుంది? ఈ గుణాలను ఎలా అతను అతిక్రమించ గలుగుతాడు?

శ్రీ భగవానువాచ:

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి॥
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥
సమదుఃఖసుఖస్స్వస్థః సమలోష్టాశ్మ కాంచనః।
తుల్యప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః॥
మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే॥

శ్రీ భగవానుడు: అర్జునా! గుణాతీతుడి గుర్తులివి: తనకు సంప్రాప్తించిన సత్త్వగుణ సంబంధమైన సౌఖ్యాన్ని కాని, రజోగుణధర్మమైన కర్మప్రవృత్తికాని, తమోగుణలక్షణమైన మోహాన్నికాని ద్వేషించడు; అవి లేకుండాపోతే వాటిని ఆకాంక్షించడు. ఏమీ సంబంధంలేని వాడిలాగ వుండి గుణాల వల్ల చలించకుండా, సర్వకార్యాలలోనూ ప్రకృతిగుణాలే ప్రవర్తిస్తున్నాయని గ్రహించి, ఎలాంటి పరిస్థితులలోనూ తన నిశ్చలబుద్ధిని విడిచిపెట్టడు. సుఖదుఃఖాలు, మట్టిబెడ్డ, రాయి, బంగారం, ఇష్టానిష్టాలు, దూషణభూషణలు, మానావమానాలు, శత్రుమిత్రులను సమానదృష్టితో చూస్తూ కామ్య కర్మలన్నిటినీ విడిచిపెట్టి నిరంతరం ఆత్మావలోకనంలో నిమగ్నమైవుండే ధీరుడు.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణా న్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

అచంచలభక్తితో నన్ను సేవించేవాడు ఈ మూడు గుణాలనూ అధిగమించి ముక్తి పొందడానికి అర్హుడవుతాడు.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం అమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥

ఎందువల్లనంటే వినాశరహితం, వికారరహితం, శాశ్వత ధర్మస్వరూపం, అఖండస్వరూపమూ అయిన బ్రహ్మానికి నిలయాన్ని నేనే.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "గుణత్రయ విభాగయోగం" అనే పధ్నాల్గవ అధ్యాయం సమాప్తం.






అశ్వశిర మహారాజు అశ్వమేధ యాగమును పరిసమాప్తము చేసికొని ప్రశాంత హృదయముతో సభతీర్చి సింహాసనాసీనుడై యుండగా అచ్చటికి కపిలుడు, జైగీషవ్యుడను మునిశ్రేష్ఠులిర్వురూ విజయము చేసినారు. మహారాజు సింహాసనము నుండి దిగి ఆ ముని శ్రేష్ఠులిర్వురకూ వినయ వినమితాంగుడై నమస్కరించి స్వాగత సత్కారములు చేసెను. అనంతర మా మునివరేణ్యులు సుఖాసీనులు కాగా అశ్వశిరుడు వినయస్వరమున "తపోధనులారా! శ్రీమన్నారాయణ భగవానుని ఆరాధించుటకే దేని సుగమోపాయమున్నచో తెలియజేయ గోరెదను. ఆ విధానమును నేననుసరించెదను" అని కోరగా ఆ మునులు ప్రసన్నహృదయులై -"రాజా! నీవు నారాయణుడు నారాయణుడందువేమి? నీ సమక్షములో నిలిచియున్న మేమే నారాయణులము" అన విని మహారాజు వినయాంజలి బద్ధుడై "మహాత్ములారా! బ్రాహ్మణోత్తములు, తపోనిధులు అయిన మీరు మేమే నారాయణులమనుచున్నారే? శ్రీమన్నారాయణ భగవానుడు పీతాంబరధారియై శంఖ చక్ర గదాపద్మములను ధరించి చతుర్భుజములతో విరాజిల్లు గరుడవాహనారూఢుడు కదా! సమస్త దేవతలలో ఘనుడైన అట్టివాడు మరొకడుండునా! అన విని ఆ మునులిర్వురూ మందస్మితము చేయుచూ- "రాజా! నీవు శంఖ చక్ర గదా పద్మ లక్షణ లక్షితుడై, లక్ష్మీ వక్షఃస్థలాలయుడై దివ్యపీతాంబర శోభితుడైన శ్రీహరి రూపమును చూడగోరుచున్నావా! అనుచూ కపిలమహర్షి చతుర్భుజ విష్ణువు కాగా, జైగీషవ్యుడు గరుడుడాయెను. తత్సమయములో గరుడవాహనారూఢుడైన శ్రీహరిని సందర్శించి రాజసభ అంతయూ ఆశ్చర్యచకితమాయెను. కాని అశ్వశిరుడు పునః చేతులు జోడించి "అపూర్వ తపః శక్తి సంపన్నులైన బ్రాహ్మణోత్తములారా! క్షమించెదరుగాక! శ్రీహరి యిట్లుండడు. అతని నాభికమలమందు చతుర్ముఖ బ్రహ్మ విరాజిల్లుచుండును" అన్నమాటలు పూర్తి కాక ముందే కపిలుడు శేషశయనుడు కాగా జైగీషవ్యుడు నాభి కమలాసనముపై భాసిల్లు చతుర్ముఖుడాయెను. అశ్వశిరునకు దానితో జ్ఞాన ముదయించెను. శ్రీ మహావిష్ణువు సర్వవ్యాపకుడను విషయము నతడు గుర్తించెను.

నిమేషమాత్ర కాలములోనే ఆ రాజసభలో చీమలు, దోమలు, తుమ్మెదలు మొదలగు ననేకరకములైన పశువులు, పక్షులు, సింహ, వ్యాఘ్ర, మత్తేభ, హరిణ, జంబుకాద్యనేక అరణ్యమృగములు, ఆవు, మేక, పిల్లి, కుక్క మొదలగు ననేకమైన గ్రామ్యపశువులు- అన్నిటికన్నియు సర్వజగదాధారభూతుడగు శ్రీ మహావిష్ణువులో వారికి కనుపించెను. అది చూచి అశ్వశిరుడు విస్మయచకితుడై- "తపోధనులారా! యేమిటీ రహస్యము?" అని ప్రశ్నించెను. అంత వారిర్వురూ మందస్మితము చేయుచూ, "రాజా! మాధవుని సేవకు సుగమోపాయమేమని నీవుమమ్ములను ప్రశ్నిం



# బాలాజీ అర్చన

భక్తులు శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించేందుకు తిరుపతి దేవస్థానం వారు నూతనంగా 'బాలాజీ' అర్చన పథకాన్ని ప్రవేశ పెట్టారు.

మీరు చేయవలసిందల్లా ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు ద్వారా దేవస్థానానికి రూ. 5,000లు చెల్లించడం. ఇందుకు ప్రతిఫలంగా పది సంవత్సరాలపాటు ప్రతిసంవత్సరం మీరు కోరుకున్న రోజున శ్రీ వేంకటేశ్వరునకు అర్చనసేవ చేసుకొనే మహద్భాగ్యానికి పాత్రు అవుతారు.

మీరు చెల్లించిన డబ్బు పది సంవత్సరాలకు వడ్డీతో కలిపి రూ॥లు 15,000 అవుతుంది. దేవుడికి పదిహేనువేలు సమర్పించుకొన్న సంతృప్తి మీకు దక్కుతుంది.

సౌకర్యాలు :

అర్చన రోజున విరాళం ఇచ్చిన వ్యక్తికి వసతి సౌకర్యం కల్పిస్తారు. దంపతులిరువురూ అర్చన సేవలో పాల్గొన వచ్చును. కుటుంబం లోని ముగ్గురు వ్యక్తులకు సుప్రభాత దర్శనం, ప్రత్యేకదర్శనం లభిస్తుంది. ఇవిగాక అంగవస్త్రం లేక రవికగుడ్డ, ప్రసాదం లభిస్తాయి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

చితివి. ఈ దృశ్యములను చూపుట ద్వారా సర్వజ్ఞుడు, సర్వభూతాంతరాత్ముడూ అయిన శ్రీహరి గుణములను నీకు విశదీకరించితిమి. ఆ శ్రీమన్నారాయణ భగవానుడే అనేకానేక స్వరూపములను ధరించుచున్నాడు. ఈ సమస్త చరాచర జగత్తులో ఆ జనార్దనుడు నిండి నిబిడీకృతుడై యున్నాడు. సర్వాంతర్యామియైన భగవానుడొకేయొక స్థానమందాసీనుడై యున్నాడనుకొనుట కేవలము అజ్ఞానము. అట్టి సంకుచిత దృష్టితో ఆరాధించుట యథార్థమైన ఆరాధన కానేరదు. కాని జగత్పతియైన పరమాత్మను సర్వభూత స్థితునిగా చూడగలుగుటయే సత్యమైన ఆరాధన యగును. శ్రద్ధాభక్తులున్నచో దృఢతమ విశ్వాసమున్నచో ఆ దేవదేవుని మనయందే చూడ గలిగెదము. ఆ జగన్నాథుడెక్కడనో ఒక చోట ఉన్నాడనుట సర్వదా మోహజనిత విషయము. పరమాత్మ సర్వవ్యాపకుడను విశ్వాసమును నీకు కలుగజేయుటకు మే మా పరమాత్మ దర్శనము కలుగజేసినాము. ఆ సర్వవ్యాపకుడీ విధముగ నీయందు కూడ గలడు.

మంత్రులు, సేవకులు, తమ సమక్షములో యే యే జీవుల నిప్పుడు శ్రీహరిలో చూచినారో? అవన్నియు, హరిస్వరూపములే. కనుక రాజా! యీ మానవులందరూ హరిస్వరూపములే యనియు, శ్రీహరిలేని ప్రదేశ మీ బ్రహ్మాండములో అణుమాత్రము కూడ లేదనియు గ్రహించి యీ భావమును దృఢముచేసికొని యథాశక్తి సర్వులకూ సేవచేయుము.

(మార్కండేయపురాణం నుండి)

— శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి



# గుడిమల్లం పరశురామేశ్వరాలయం



ప్రాచీన వాస్తు నిర్మాణాలకూ అపురూప శిల్ప సంపదలకూ, తరతరాల పెన్నిధులను వెలికితెస్తున్న శిలాశాసనాలకూ నెలవై ఆంధ్రశాతవాహన, ఇక్ష్వాకు, పల్లవ, చోళ రాజుల హారతుల నందుకొని ప్రాచీన 'పరశురామేశ్వర' క్షేత్రంగా ప్రసిద్ధి చెందిన గుడిమల్లం గ్రామం చిత్తూరుజిల్లాలోని రేణిగుంటకు దాదాపు 15 కి. మీ. దూరంలో అందాలను చిందించే ప్రకృతి ఒడిలో గత చరిత్ర స్మృతుల్ని నెమరు వేసుకుంటూ యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తూ ఆహ్వానిస్తూవుంది.

## బౌద్ధక్షేత్రంగా 'గుడిమల్లం'

ఈ ప్రదేశాన్ని నిశితంగా పరిశీలించినట్లయితే క్రీస్తుకు పూర్వం బౌద్ధమత కేంద్రంగా ఈ ప్రాంతం విరాజిల్లుతూ వుండేదన్న విషయం స్పష్టమవుతుంది. నాగవంశానికి చెందిన, ఆంధ్రశాతవాహనుల దళాధిపతులైన తొండమానులు రాజ్యానికి రాకపూర్వం 'గుడిమల్లం' బౌద్ధక్షేత్రంగా వుండేది. ఆలయంలోని చైత్యాకారపు వాస్తువు ఇందుకు ప్రబలనిదర్శనం.

ఆలయం త్రవ్వకాలలో బయల్పడిన గర్భగుడిలోని 'U' ఆకారపు చైత్యనిర్మాణ వాస్తువు బౌద్ధకట్టడాలలోని ముఖ్యలక్షణం. ఇటువంటి వాస్తుకట్టడాలను నాగార్జునకొండ అమరావతులలో మనం చూడవచ్చు. ప్రస్తుతం రామేశ్వరాలయం వున్న ప్రాంతంలో పూర్వం కల్పవృక్షం వుండేదని చెబుతారు.

క్రీస్తుకు పూర్వం విగ్రహారాధకులు కాని బౌద్ధులు, కేవలం కల్పవృక్షాలను పూజించేవారు. క్రీస్తు పూర్వం 642 లో తొండమండలంలో పర్యటించిన చైనా బౌద్ధయాత్రికుడు, హ్యూయన్‌త్సాంగ్ తన గ్రంథంలో కంచి శ్రీకాళహస్తి, ఆలయాలతోబాటు వంద బౌద్ధ సంఘారామాలను పేర్కొన్నాడు. గుడిమల్లం ప్రాంతంలో పూర్వం బౌద్ధ సంఘారామమున్నట్లు ఆ గ్రంథంలో సూచన ప్రాయంగా తెలియజేయడం జరిగింది.

గుడిమల్లం పరశురామేశ్వరాలయం ఆవరణలో ఇటీవల జరిపిన త్రవ్వకాలలో బయల్పడిన ఇటుకలు, మంటప స్తంభాలు ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి. శాతవాహనులు హిందూమతంతో సమంగా బౌద్ధాన్ని ఆదరించారనడానికి చారిత్రక ప్రమాణాలున్నాయి.



పరశురామేశ్వర శివలింగం

క్రీస్తు పూర్వం 50 వ సంవత్సర ప్రాంతములో తిరుమల పరిసరాలను 'పుల్లి' అను కొండజాతి నాయకుడు పరిపాలిస్తున్నట్టూ, అదే సమయంలో కాంచీపురాన్ని (కంచి) కరికాళచోళుడు పాలిస్తున్నట్టూ వీరిరువురినీ జయించి తొండమానులు ఈ ప్రాంతాలను ఆక్రమించుకొన్నట్టూ తమిళ 'సంగమ' సాహిత్యంలో ప్రస్తావించబడింది. క్రమంగా భారతదేశంలోహిందూమతోద్ధరణ లక్ష్యంతో వైదికబీజం నాటుకొని బౌద్ధమత ప్రాధాన్యత తగ్గిన సమయంలో ఈ ప్రాంతంలోని బౌద్ధనిర్మాణాలను కూల్చివేసి ఇక్కడ శైవాలయం నిర్మించి వుంటారు.

## 'శైవక్షేత్రం' గా, రూపాంతరం

పరశురామేశ్వరాలయం పల్లపు ప్రాంతంలో నిర్మించబడటం వల్ల ఈ ఆలయమున్న ప్రాంతానికి గుడిపల్లం అని పేరువచ్చిందనీ, తరువాత గుడిపల్లం 'గుడిమల్లం' గా మారిందనీ స్థానికులు చెప్పారు.

ఈ ఆలయ నిర్మాణం వివిధ కాలాలలో అనేక దశలుగా జరిగిందని ఇక్కడ కట్టడాల శైలినిబట్టి చెప్పవచ్చు. భారతదేశంలోని అపురూపమైన శివలింగాలలో తలమానికంగా ఇక్కడి పురుషాకృతి శివలింగాన్ని శ్రీ జితేంద్రనాథ్ బెనర్జివంటి ప్రముఖ చారిత్రక పరిశోధకులు పరిగణిస్తున్నారు. వాత్సాయన కామసూత్రాల సమ్మేళనంతో

రూపుదిద్దుకొన్న భావాలకు ప్రతిబింబంగా ఈ శిల్పం కనిపిస్తుంది. గర్భాలయంలో రెండు గుండ్రని రాతి పీఠాలమధ్య లింగం ప్రతిష్ఠింపబడివుంది. ఈ శిల్పం నునుపుగానూ ప్రకాశవంతంగానూ వుంది. రాతి పీఠం చుట్టూ దాదాపు 1.37 మీటర్ల పొడవుతో చతురస్రాకారపు శిలాప్రాకారంవుంది. శివలింగంపై వేటనుంచి తిరిగివచ్చిన పరశురాముని శిల్పం మలచబడింది. అతని కుడి చేతిలో పరశువు, ఎడమచేతిలో జింక, చేతులకు కడియాలు, మెడలో రుద్రాక్షమాల మలచబడిన తీరు రమణీయంగా వుంది.

ప్రసన్నరూపంలో వున్న పరశురాముని పాదాలక్రింద మలచబడిన శిల్పం 'యక్షుని'ది గా చారిత్రకులు భావిస్తున్నారు. ఈ శిల్పం విషయంలో మాత్రం భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి.

పరశురాముని పాదాల క్రింద వున్నది 'పుల్లీ నాయకుడనీ' అసలీ ఆలయనిర్మాత అతనేననీ, పరశురామునిపై నున్న భక్తివల్ల తన శిల్పాన్ని అతని పాదాల క్రింద మలిపించుకొన్నాడనీ కొందరు వాదిస్తున్నారు. ఈ వాదన ఏ మాత్రం సమర్థనీయమైనదికాదు. ఎందుచేతనంటే లింగ ప్రతిష్ఠాపనకూ, పుల్లీనాయకునకూ మధ్యకాలంలో చాలా తేడా వుంది. ఈ శిల్పం 'బౌద్ధభిక్షువు' శిల్పమని ఊహించడం సమంజస మని పిస్తుంది. బౌద్ధాన్ని అణచివేసి వైదిక మతాన్ని పునరుద్ధరిస్తున్న కాలంలో ఈ లింగ ప్రతిష్ఠ జరిగింది. ఈ అంశాన్ని దృష్టిలో వుంచుకొని పూర్తిగాశిల్పాన్ని పరిశీలించి నట్లయితే 'బౌద్ధమతాన్ని అణచివేస్తూవైదికమతాన్ని సుస్థిరంగా గావిస్తున్నట్లు అర్థమవుతుంది. ఇక్కడ వైదిక మతానికి ప్రతీక పరశు రాముడు, బౌద్ధమతానికి ప్రతిరూపం భిక్షువు - అంటే వేదమతం బౌద్ధమతానికి పైచేయి అన్న భావం శిల్పంలో వ్యక్తీకరించబడిందన్నమాట.

## ప్రత్యేకశిల్ప విన్యాసం

లింగాకృతి శిల్పం 'మధుర' లో కనిపిస్తుంది. వటవృక్షపు నీడలో ఆరు బయట పూజలందుకుంటూ ఇక్కడి శివుడు కనిపిస్తాడు.



ఆలయ ప్రవేశ దృశ్యం

"ఉజ్జయిని" లో కొంతకాలం క్రితం జరిగిన త్రవ్వకాలలో లభించిన రాగి నాణాలపై 'పురుషలింగాకృతి,శివలింగపు ముద్ర లున్నాయి. ఈ నాణాలను క్రీస్తుపూర్వం రెండు, మూడు శతాబ్దాలకు చెందినవిగా నిర్ధారించడం జరిగింది.

"పురుషలింగాకృతి"శిల్పం పూజ క్రీ.పూ. నాటికి క్రొత్తకాదనీ, అప్పుడు ఈ విధమైన లింగపూజకు విశిష్టమైన స్థానం వుండేదనీ చారిత్రకులు అభిప్రాయపడుతున్నారు.

కర్నూలుకు సమీపంలోని "అలంపురం" అనే చారిత్రక ప్రదేశంలో నగ్నంగా మలచిన "దేవీవిగ్రహం"వుంది. ఇక్కడ నిత్యం నగ్నవిగ్రహానికి పూజలు జరుగుతూ వుంటాయి. ఇట్లాంటి పూజలవల్ల సంతాన ప్రాప్తికలుగుతుందని యాత్రికులు నమ్ముతారు. గుడిమల్లంలోని పరశురామేశ్వరాలయం, కడపజిల్లాలోని అత్తిరాల, (హత్యరాల)లో మరొక ఆలయం వుంది. అయితే ఇటువంటి శిల్పాకృతి అక్కడ కనిపించదు.

## చారిత్రక వైశిష్ట్యం

ఈ ఆలయంలోని శిల్పం క్రీస్తుకు పూర్వం ఒకటి రెండు శతాబ్దాల మధ్య కాలానికిచెందినదని పరిశోధకులుఅభిప్రాయ పడుతున్నారు. ఆలయప్రాంగణంలో ఇటీవల భారత పురావస్తుశాఖ జరిపిన త్రవ్వకాలవల్ల ఈ ఆలయ మొక దిబ్బపై, నున్నట్లు తేలింది. ఈ దిబ్బకు చుట్టుప్రక్కల జరిపిన త్రవ్వకాలలో క్రీ.పూ. ఒకటి, రెండు శతాబ్దాలకుచెందిన శాతవాహనుల కాలంనాటి శిథిల మృణ్మయపాత్రల శకలాలు, ఇటుకలు లభించాయి. శిథిలావశేషాలు, శివలింగాకృతి క్రీ. పూర్వానికి చెందినవి కావడంవల్ల 'లింగం' క్రీ. పూ. ఒకటి, రెండు శతాబ్దాలలో ప్రతిష్ఠింపబడి వుండవచ్చునని రూఢిగా చెప్పవచ్చు.

శాతవాహనుల, ఇక్ష్వాకుల కాలంలో మూలవిరాట్టుకు ఆలయనిర్మాణం జరి

[36వ పేజీలో]

## యువవాణి

# సంబంధాలు

జీవితంలో తోటి మానవునితో సంబంధం చాలా ముఖ్యమైంది. చాలామంది మనలో దీన్ని పట్టించుకోరు. మనకోసం మనం బ్రతుకుతాం! మన కోర్కెలు తీర్చుకోవటాన్ని ఎక్కువగా పట్టించుకుంటాం. తరువాతే యితరులు! ఇతరులతో సంబంధం విషయంలో ఏదో అంటీ ముట్టనట్లు ఉంటాం!

మనని మనమే పూర్తిగా తెలిసికోలేదింకా. ఇతరులకు మనదంటూ ఏం చూపగలం? ఇతరులకన్నా మనం మిన్న అన్నట్లు ఇతరుల యెడల ప్రవర్తిస్తూ ఉంటాం. చచ్చేంతవరకూ 'నువ్వా-నేను' అని పడి కొట్టుకుంటాం. ఇతరులు వాళ్ళకు వాళ్లు గొప్పవాళ్లుగా భావించుకుంటారు. అందుకే యీ వేర్పాటుధోరణి జీవితాంతం కొనసాగుతుంది. వేళ్లమీద లెక్కించినట్లు కొంతమంది మాత్రం తోటివారిపై ప్రేమ చూపిస్తారు; కనిపిస్తారు; ప్రోత్సాహమిస్తారు; అయినా యీ 'వేర్పాటు' ధోరణి సాగుతూనే ఉంది. దీనినుండి ఒకరంటే ఒకరికి పడకపోవటం, ఉద్రేకాలు, కోపతాపాలు, కోర్కెలు పడగలెత్తటం-ఫలితం భయం, ఆందోళనం. లైంగికంగా ఒకప్పుడొకటయితే కావచ్చు. అయినా 'నీకూనాకూ' గల సంబంధం మాత్రం నిశ్చలం-ఆ దెబ్బలాటలూ, మనస్పర్థలూ, అసూయలూ, కలవరపాట్లూ మామూలే! ఇవన్నీ సత్సంబంధాన్నిబట్టి ఆధారపడి ఉంటాయి.

ఇట్లాంటి పరిస్థితిలో మంచితనం వికసిస్తుందా? అయినా యీ సంబంధమే జీవితం. ఏదో ఓ రకమైన సంబంధం లేక ఎవడూ బ్రతకలేడు. ఎంతటి యోగియైనా, సన్యాసైనా, సాధుపుంగవుడైనా, యీ ప్రపంచం నుండి ఎంత దూరం తొలగిపోయినా, వాళ్లతో యీ ప్రపంచాన్ని కూడా యీడ్చుకుపోతున్నారు. ప్రపంచాన్ని వారు కాదనవచ్చు! మట్టిపెట్టొచ్చు! తమను తాము రంపపుకోత పెట్టుకోవచ్చు. ఎంతైనా యీ ప్రపంచంతో వారికి సంబంధం తప్పదు. ఎందుచేతనంటే వారు సంప్రదాయానికి బద్ధులు! మౌఢ్యానికి పుట్టినిళ్ళు. సృష్ట్యాది నుండి మానవుడు సంగ్రహించిన జ్ఞానానికి ప్రతినిధులు. అందుకే మానవులు ఈ ప్రపంచాన్ని విస్మరించలేకున్నారు.

గురుశిష్యుల మధ్య సంబంధముంది. అయితే గురువు తన గురుత్వాన్ని నిరూపించేలా శిష్యునికన్న మిన్నగా మెలగటం, శిష్యుడు తన గురువుకన్న అన్నివిధాలా చిన్నగా మెలగటం ఆనవాయితీగా ఉంది! ఇలాంటిది నిజమైన సంబంధం కాదన్నది స్పష్టం! ఇది శిష్యుల్లో భయాన్ని సృష్టిస్తుంది! బాధకు గురి చేస్తుంది. బరువెత్తినట్లు అవుతుంది. అందుకే 'నేనే గొప్పవాణ్ణి' అన్న గురుభావం, చిన్నప్పటినుండే శిష్యునిలో 'న్యూనతా' గుణాన్ని పెంపొందిస్తుంది. అందుకే శిష్యుడు, అయితే జీవితాంతం విప్లవకారుడైనా అయిపోతాడు; లేదా కుక్కినపేనులా నోరెత్తకుండా అణిగిమణిగి ఉండిపోతాడు.

పాఠశాల విశ్రాంతి స్థలం. ఇక్కడ గురుశిష్యులిద్దరూ విద్యార్థులే! చదువరులే! పాఠశాలంటే కేంద్రీకృతసత్యం. ఈ నేర్వటం విశ్రాంతి అంటే కేవలం ఖాళీగా కూర్చోవటం కాదు. విశ్రాంతి అవసరమే! ఏదో కాలక్షేపానికి పుస్తకం పట్టుకొని ఏ చెట్టుక్రిందో, ఏ పడగ్గదిలోనో కూర్చొని చదువుకోవటమే విశ్రాంతి అవుతుందా? విశ్రాంతి అంటే మనసు నిలకడ చేసికోవటమా? పగటికలలు కనటమా? ఎంత మాత్రంకాదు. మరి? ఎప్పుడూ ఏదో ఆలోచించడం, ఏదోసమస్యతో కొట్టుమిట్టాడటం, రసలోలుపతలో మునిగిపోవటం, భోగాలకు దాసుడవటం కాదు. చుట్టూతా ఏం జరుగుతుందో స్పష్టంగా చూసేందుకూ, వినేందుకూ, పరిశీలించేందుకూ తోడ్పడే మనఃస్థితే విశ్రాంతి. విశ్రాంతంటే స్వేచ్ఛ. తాను చేద్దామనుకున్నది తను చేయగల్గే స్వేచ్ఛ. ప్రశాంతమైన మనస్సే విశ్రాంతి. దానికి ఏకారకమూలేదు; నిర్దేశకత్వమూ లేదు. ఇదీ విశ్రాంతి. ఇట్టి మనః స్థితిలోనే మనం ఏదైనా నేర్చుకోగలం; శాస్త్రమో, చరిత్రో, గణితమో ఏదైనా సరే! అంతేకాదు. నిన్ను నువ్వు తెలిసికోగలవు; నీకూ నీలోని ఆత్మకూ గల సంబంధాన్ని గుర్తించగలవు.

అయితే దీన్నంతా పాఠశాలల్లో నేర్పగలమా? దీన్ని చదవగలమా? ముక్కునపెట్టగలమా? మరువగలమా? ఈ అసాధారణ సంబంధ ప్రాముఖ్యమును అర్థం చేసికోవటంలో గురుశిష్యులు తలమునకలై పని చేస్తున్నారు; వారు, వారి పాఠశాలలో వారి మధ్య నిజమైన సంబంధాన్ని నెలకొల్పుతున్నారన్నమాట. కేవలం విషయాల ప్రబోధంకన్నా విద్యలో యీ 'భాగం' మిన్న.

ఈ సంబంధస్థాపనకు ప్రజ్ఞ కావాలి. ఏ పుస్తకం ద్వారానూ దీన్ని కొనలేం, చెప్పలేం. బ్రహ్మాండమైనఅనుభవం ద్వారా సంపాదితమైంది కాదిది. జ్ఞానంవేరు, 'ప్రజ్ఞ' వేరు. జ్ఞానం అన్నది తెలివి కావచ్చు; వెలుగు కావచ్చు. ఉపయుక్తం కావచ్చు. కాని అది మాత్రం 'ప్రజ్ఞ' కానేరదు. 'ప్రజ్ఞ' ప్రకృతి సిద్ధంగా వస్తుంది. సులభంగా వస్తుంది. ప్రకృతి యావత్తూ సంబంధాల ఆకృతినిబట్టి లభిస్తుంది. అందుకే విశ్రాంతి అందరికీ కావాలి. పురుషునికైనా, స్త్రీకైనా, గురువుకైనా, శిష్యులకైనా! అప్పుడే ప్రశాంతంగా, తీవ్రంగా వారి మధ్యగల సంబంధాన్ని చర్చించుకోగలరు. అప్పుడే వారి నిజమైన ప్రతిచర్యలూ, అనుమానాలు, అడ్డుతెరలూ అన్నీ బహిర్గతమవుతాయి. ఇందులో 'ఊహ' కుగాని, 'కల్పన' కుగాని, 'పొగడ్త' లకుగాని, 'పరస్పరం అణచివేతకు' గాని తావులేదు.

విద్యార్థిలోగల యీ ప్రజ్ఞను జాగృతం చేయటం, సరియైన సంబంధం యొక్క ప్రాముఖ్యమును నేర్పటం - పాఠశాల చేయాల్సిన నిజమైన పని.

— శ్రీ పి. మోహన్

# వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

## గు రు వు

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః."

"గురువే బ్రహ్మదేవుడు; గురువే విష్ణుమూర్తి; గురువే పరమేశ్వరుడైన శివుడు. గురువే సాక్షాత్తు త్రిమూర్తులను తనలో లీనం చేసుకున్న పరబ్రహ్మ. కావున శ్రీ గురుదేవున కివే నమస్సులు" అని పై శ్లోక తాత్పర్యం.

గురువునకూ ఇష్టదైవానికీ అభేదం కల్పించటం, భారతీయ వేదాంత సంస్కృతిలో అనూచానంగా వస్తూన్న ఆచారం.

"మాతృదేవో భవ!
పితృదేవో భవ!
ఆచార్యదేవో భవ!"

అనేది ఉపనిషదనుశాసనం.

గురుభక్తి వలన, గురువుకు వచ్చే లాభంకంటె, శిష్యునకే యెక్కువ మేలు ఒనగూడుతుంది అని నిష్కర్షగా చెప్పవచ్చు. మహాభారతంలో ఏకలవ్యుని గాథ ఉదాహరణగా స్వీకరింపవచ్చు. ద్రోణుని మాట అటుంచి, గురుభక్తివల్ల నిస్సందేహంగా ఏకలవ్యుడు - నిరుపమాన విద్య ఆర్జించగలిగాడు. ఇచటమన సత్త్వవేత్తలు ప్రవచించే నిగూఢ రహస్యం ఒకటి ఇమిడి ఉంది. ఆలంకారికులు "రసం" - "యన్నిష్ఠం?" అని ప్రశ్నించి, రసం సామాజిక నిష్ఠం అని తీర్పుచెప్పారు. ఆ విధంగానే "విద్య" గూడ శిష్యనిష్ఠమైనదే గాని గురునిష్ఠమైనది కాదు అని చెప్పవచ్చు. వాసనారూపంగా, బీజప్రాయంగా జిజ్ఞాసువైన శిష్యుని హృదయంలో అంతర్నిహితమైన శక్తినే జ్ఞానాన్నే విద్యాప్రబోధవ్యాజంగా గురువుగారు వెలికి ఉబికేటట్లు చేస్తారు! బీజం శిష్యనిష్ఠం. విద్యాభ్యాసానికి ప్రాథమికావసరం శిష్యునిలోని జిజ్ఞాస. జిజ్ఞాస నాణెమునకు బొమ్మ అయితే బొరుసు గురుభక్తి. గురుభక్తి - విద్యాభ్యాసంలో కల్పించే ఉత్తేజం అనుభవా ప్రమేడితం.

ఆధునిక మనోధర్మశాస్త్రవేత్తలుగూడ విద్యాభ్యాసంలో

"Inspiration first; instruction next"

"మొదట ఉత్తేజం - పిమ్మట ప్రబోధం" అని ప్రతిపాదిస్తున్నారు. ఉత్తేజితుడు కాని శిష్యునకు విద్య గరపటం, వేడికాని చల్లని ఇనుముపై సమ్మెటపోటులు జరపటమే- అవుతుంది.

"గురువు ఒక చిరుప్రమిద కావచ్చు.
కాని-ఆ చిరుప్రమిద-ఎన్నో కాగడాలు
వెలిగించవచ్చు."

గురువు - మేఘునివంటివాడు.

మేఘం వర్షించినప్పుడు- ఆ వానచినుకులు ఎడారిలో పడితే ఇంకిపోతాయి. అగ్నికుండంపై పడితే ఆవిరి అవుతాయి. బురదగుంటలోపడితే రొచ్చుఅవుతాయి. ముత్తెపు చిప్పలో పడితే ముత్యాలుగా మారుతాయి! కాబట్టి శిష్యుడు తన మెదడును ముత్తెపు చిప్పగా తీర్చిదిద్దుకోవాలి.

అయితే - ఇక గురువుగారు నిర్వహించే భూమిక ఎటువంటిది?

అహము కొంత లేక-ఆత్మవంచన లేక
గొప్ప యెంతయున్న గురువు కాడు!
పాదపూజ కోరు భగవద్గురునికంటె
అహములేని శిష్యు డధికు డగును.

ఎవరైనా శిష్యులు కావచ్చు.

"శిష్యుడగుట సులువు-జిజ్ఞాసయున్నచో."

అయితే "గురువు" భూమిక ధరించటానికి ఎంతో సామర్థ్యం - సౌశీల్యం కలిసియుండాలి.

శిల్పి - పాలరాతిపై చక్కదనాలు చెక్కవచ్చు; అగసాలి బంగారంపై నగిషీలు చెక్కవచ్చు.

"మట్టిలోన కలిసె మాణిక్య మకుటముల్
పాలరాయి పగులు - పసిడి కరగు"

కాని - గురువుగారు మలచేది మనిషి మెదడునే.

యావత్ సృష్టిలో విలువైనది ఏది? "పసిడి కంటె వజ్రవైడూర్యముల కంటె విలువయైన దేది విశ్వమందు?"

సృష్టిని అపర సృష్టిని చేసే మనిషి మెదడు మిక్కిలి విలువయైనది. మనిషిని ఏది చంద్రమండలం మీదికి చేర్చింది? గ్రహాంతరయానాన్ని తీర్చి దిద్దేది ఏది - మనిషి మెదడే.

మెదడు తీర్చి దిద్దు మేధావి యెవడయా?
చదువు చెప్పునట్టి సద్గురుండు!

ఈ ఇహలోకంలో - పవిత్రమైన అనుబంధాలలో పరమపవిత్రమైన అనుబంధం గురుశిష్య సంబంధం.

శతకోటి మహా మంత్రాః
చిత్త విభ్రమ కారకాః,
ఏకమేవ మహా మంత్రం
గురు రిత్యక్షర ద్వయమ్.

"శతకోటి మహామంత్రాలు ఎందుకు? మెదడును పాడుచేస్తాయి; "గురు" అనే రెండక్షరాలు చాలు. అదే మహామంత్రం" అని పై శ్లోక తాత్పర్యం.

"గురుదేవో భవ."



# కళా వని

లోకమున చతుష్షష్టికళలు, చతుర్దశ విద్యలని ప్రచారములోనున్నవి. కవిత్వము, చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, నాట్యము అనువానినే చిత్రకళలని మరియు లలితకళలని పిలిచెదరు. కళలన్నియు సౌందర్యానుభూతిని కలిగించుటయేకాక మానవునికి మానసికాహ్లాదము కలిగించును. శిలాశిల్పి వివిధమూర్తులను రాళ్ళమీద అందముగా చెక్కి అవర బ్రహ్మయని కీర్తిగాంచును. ప్రత్యేకముగా దారువుతోనే విగ్రహములు మలచువానిని దారుశిల్పియని పిలుతురు. ఇంతియేకాక ఇత్తడి, కంచు, బంగారము, వెండి మొదలైన వానితో విగ్రహములను నిర్మించి


శ్రీనివాసుడు, పద్మావతి, ఆకాశరాజు, వకుళమాలకు అలంకరణ.

# దేవతాలంకారకళ


శ్రీ లక్ష్మీనృసింహస్వామికి అలంకరణ.

దేవతామూర్తులను దేవాలయమున ప్రతిష్ఠ కావించుట, పూజించుట మన మెరింగినదే. మానవాతీతుడైన దైవము యొక్క ఆదర్శ రూపమును మనముందుంచి దర్శించినంతనే మనబ్రతుకును ధన్యత పొందునట్లు చేయుట విగ్రహనిర్మాణ రహస్యము. నిర్గుణ రూపారాధన కష్టసాధ్యమైనది. అందుచేతనే సగుణరూపారాధన ప్రజలలో కలుగుటకు రూపనిర్మాణ మవసరము. కాగా పై వివిధ రకముల శిల్ప దేవతా రూపముల నిర్మాణములకు భిన్నముగా ఆంధ్రదేశమున చాలాకాలము నుండి అలంకారకళగా ప్రజలచే పిలువబడుచున్న దేవతాలంకార ప్రక్రియ కలదు.

దేవతాలంకారకళ మతపరమైనది. సృజనాత్మకమైనట్టిది. ఒక్కొక్క విగ్రహమును

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూ షెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డు వారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములోనైనా గాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమలసెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

తయారుచేయుటకు గంటకు పైగా కాల మవసరము. అలంకార విగ్రహములను తయారుచేయుటకు అలంకారికుడు కొయ్య, వార్నీష్, మైనము, కర్పూరపునూనె, మట్టితలకాయలు వివిధ రకములైన రంగులు తనకుతాను సేకరించుకొను వస్తువులు. పై వస్తువుల నుపయోగించి తీర్చిదిద్దిన దేవతా మూర్తులకు వస్త్రములను తొడిగి దివ్య సౌందర్యమును కలిగించును. చూచువారికి శిలా లోహవిగ్రహములవలె రసభావ రామ ణీయకతతో కన్పట్టును.ఆస్తికులకుచిన్మయా నందము కలిగించును. అలంకారికుడు ఏ దినమున కాదినము దేవతామూర్తులను ప్రదర్శించును. ఈ అలంకారములు వేయు వారు బాపట్ల, ఒంగోలు, నెల్లూరు, మచిలీ పట్టణము మొదలైన ప్రదేశములలో కలరు. దేవతాలంకార సేవద్వారా ప్రజలలో ఆస్తిక దృక్పథమును పెంపొందించు చున్న వీరి కళాసేవకు సహృదయులందరూ చేయూత నివ్వాలి.

ఇట్టి విశిష్టమైన దేవతాలంకార ప్రక్రి యలో నిష్ణాతులైన వారిలో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా కర్లపాలెం గ్రామ వాస్తవ్యులు శ్రీ బృందావనం రాధాకృష్ణమా చార్యులు ఒకరు.

దేవీనవరాత్రుల ఉత్సవ సమయము లందు దేవికి రోజుకొక అవతారమును వేసి భక్తులను రంజింప చేయుదురు. అటులనే శ్రీరామాయణ కథాఘట్టముల కను గుణముగా శ్రీమద్భాగవత సప్తాహసమయ ములందు వివిధ మూర్తులను నిర్మాణము కావింతురు. శ్రీ వేంకటేశ్వరుని ఏడడుగుల విగ్రహము తయారుచేయుట వీరి అలంకార కళాసృష్టిలో కలికితురాయి. రాచక్రీడలు, గీతోపదేశము వీరి అలంకార ప్రదర్శనలో సాటిలేని మేటి ప్రదర్శితాలు.

— శ్రీ పరిమి సుబ్రహ్మణ్యశాస్త్రి




1

## చిత్రకళాపోటీలు

గుంటూరుజిల్లా వెల్లటూరులో శ్రీ వెల్ల టూరి పూర్ణానందశర్మచే నవరంగ్ చిత్ర కళానికేతన్ వారి ఆధ్వర్యంలో 1984 మే నెలలో 11 వ అఖిలభారత చిత్రకళా పోటీలు నిర్వహింపబడ్డాయి. ఇందులో గెలుపొందిన వారి వివరాలు: బాలలకు సంబంధించిన వాటిలో 1. రథయాత్ర (చి॥ సంజీవ కుమార్, కేరిబుర్, బీహారు, వయస్సు 10 సం॥) - ప్రథమ బహుమతి; 2. ఆల యంలో అర్చనలు (కుమారి మేవీ, మద్రాసు) - ద్వితీయ బహుమతి; యువ చిత్ర కళాపోటీలో 3. రాక్షసగురువు శుక్రా చార్యుడు (శ్రీ రవికుమార్, రాజమండ్రి) కి ప్రథమ బహుమతి లభించింది.


2



# దయామయుడు

లీలామానుష విగ్రహ స్వరూపుడు అఘటన ఘటనా సమర్థుడు అయిన తిరుమలేశుని కరుణాసముద్రంలో మునిగి తరించనివారు చాల అరుదు.

ఎందరికో ఇలవేల్పు, ఇంకెందరికో నమ్మినబంటు మా కుటుంబంలో ఆయన లీలలుఎంత ఆశ్చర్యాన్ని కలిగించాయో తెలియబరిస్తే, నాస్తికులు, ఆస్తికులు అయినా కాకున్నా, నాకు ఆ మంగళస్వరూపుడు ముందు, ముందుకూడా నాసేవా కార్యక్రమాలలో తోడ్పడతాడని నమ్మి ఈ సంఘటనలు మీ ముందుంచుచున్నాను.

ఒకసారి మా నాన్నగారికి మానసిక ఆందోళన కలిగింది. ఆ పరిస్థితుల్లో ఆయన ఎవరికీ లొంగకపోగా ఒకసారి నిండైన బావిలోకి కూడా ఉరికారు కాని తిరుమల కొండలపై వేంచేసి యున్న ఆ తిరుమలేశుని కరుణ వల్ల రక్షింపబడ్డారు. అదే స్థితిలో ఉంటూఉండగా వైద్యం ఏవిధం గాను ఫలించలేదు. కాని ఆయన తిరుపతిలోని ఏడుకొండలవాని దర్శనానికి వెళ్ళటానికి ఏవిధమైన అడ్డంకులు పెట్టకుండా ఒప్పుకున్నారు.

నేను, మా నాన్నగారు తిరుమలేశుని రాత్రి 7 గం|| ప్రాంతంలో దర్శనం చేసుకున్నాము. తిరుగు ప్రయాణంలో మా నాన్నగారు నడిచి తప్ప బస్సులో క్రిందకు రానన్నారు. చేసేది లేక ఆయనవెంట నేనూ క్రిందకు దిగటం ప్రారంభించాము. ఎంతో మానసిక ఉద్రేకంతోవున్న మానాన్నగారికి కొండదిగే టప్పటికి, ఆ ఉద్రేకం తొలగటమేకాక పూర్ణమైన ఆరోగ్యంతో అలసట తీర్చుకుంటూ కనబడ్డారు. పూర్వపు అర్థంలేని మాటల స్థానంలో ఆయన స్పష్టమైన సంభాషణ మొదలుపెట్టి, తన పరిస్థితి చక్కబడినట్లు ఆయనే చెప్పి నన్ను ఆశ్చర్యపరిచారు.

ఇలాంటి సంఘటనలు ఎన్నో, ఎన్నెన్నో నేను వ్యక్తిగతంగా ఆ కళ్యాణగుణధాముని కరుణకు ఎలా పాత్రుడనైనానో ఈ క్రింది సంఘటన తెలియబరుస్తుంది.

నేను ఒకసారి డైరక్టరు ఆఫ్ స్కూలు ఎడ్యుకేషన్ అనుమతితో రీజనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు, బెంగుళూరు. నాలుగు నెలల ఇంగ్లీషుబోధ నారీతుల అధ్యయన కేంద్రానికి వెళ్ళాను. దురదృష్టవశాత్తు నా యాజమాన్యమువారు, వారి అనుమతి పొందలేదనే సాకుతో నా జీతం ఆపి నన్ను సంజాయిషీ అడిగి ఇబ్బందులలో ముంచారు. కుటుంబం ఒక క్రొత్తచోట, నేను బెంగుళూరులో-జీతం లేకుండా ఎలా గడపాలి! ఎన్ని సంజాయిషీలు ఇచ్చినా, నెలలు గడిచినా నాకు జీతం రాలేదుసరిగదా, పరిస్థితి జటిలమయింది. గజేంద్రుని వలె నేను ఆ తిరుమలేశునిపై భారం మోపి ఆయన దర్శనానికి బయలుదేరాను. అప్పటికి 4 నెలలు గడిచాయి. నాకు తిరిగి నా కార్యక్రమ నిర్వహణకు మేనేజిమెంటువారి అనుమతి వస్తుందా! రాదా! అనే పరిస్థితికూడా ఏర్పడింది.




అయితే విచిత్ర మేమంటే నేను ఆ సప్తగిరివాసుని దర్శనంచేసుకుని బెంగుళూరు చేరేటప్పటికి నాకు ఎంతో ఆశ్చర్యకరమైన విషయం స్పష్టమైంది. అదేమంటే యాజమాన్యంవారు నాకు రావలసిన జీతం ఇచ్చుటకు నిర్ణయించటమే కాక, నాకు శిక్షణపూర్తి అయిన పిమ్మట పూర్వపు స్థలంలో నేను నా బాధ్యతలు నిర్వహింపవచ్చని అనుమతి పత్రాన్నికూడా ఇచ్చారు.

ఇంతకీ విషయం ఏమంటే నమ్మినవారికి ఆ మహానుభావుని కరుణ తప్పక లభించి తీరుతుంది. ఆయన దర్శనం చేసుకున్న వారికి బాధలు, ఏవైనా తమంత తాముగా మాయం అవుతాయి. ఇలాంటి సంఘటనలు ఎన్నో! మరొకసారి అవకాశం ఉంటే మరిన్ని ప్రత్యక్ష నిదర్శనాలు మీ ముందుంచుతాను. *

— శ్రీ మద్దాల వెంకట సుబ్రహ్మణ్యం

## లోకమాయ

ఏడుకొండలమీద ఆహా!
ఎంత సుందరమైన లోయ
లోయగర్భములోన నీ గుడి
లోతు తెలియని లోకమాయ—

కొండలన్నీ కొలిచి కొలిచి
గుండెలో గుడి కట్టుకొంటి
లోయలన్నీ తరచి తరచి
నా లోననే నిను పట్టుకొంటి—

అన్ని గంగలు కలిపి తెచ్చి
ఆకాశ గంగను చేసితి
పరమసేవా భావములతో
పాపనాశ పథమ్ము వేసితి—

అమ్మలందరి నడిగి అడిగి
మంగమ్మ ఎవరో తెలుసుకొంటి
శంకలన్నీ వదలి వదలి
సత్యమేదో తెలుసు కుంటి—

— శ్రీ జె. బాపురెడ్డి, ఐ. ఎ. ఎస్.

"తస్మాద్విరాడజాయత" – ఆ పర బ్రహ్మనుండి విరాట్ పురుషుడు ఉద్భవించెను. అట్లభివ్యక్తమైన ఆ విరాట్ పురుషుడు వేదమును పారాయణ చేయుచూ కోటి సంవత్సరములకు పైగా తపస్సు చేసెను. అటుపిమ్మట వేదములయందు నిర్వచింపబడిన దేవతలను సృజించెను. ఆ వేదములను వారికి ఉపదేశించెను.

"బ్రహ్మ బృహస్పతయే ప్రోవాచ।
బృహస్పతి రింద్రాయ॥
ఇంద్రో భరద్వాజాయ।
భరద్వాజో ఋషిభ్యః
ఋషయో బ్రాహ్మణేభ్యః!"

ఈ విధముగా అనాదికాలం నుంచి ఆధునిక కాలం వరకు అపౌరుషేయములైన వేదములు ఆ యా ఋషిపరంపరచే అధ్యయనము చేయబడుచున్నవి. అంతేగాక అతీంద్రియ శక్తి సంపన్నులగు ఋషిగణము వేదాధ్యయనము ద్వారా లోకకళ్యాణము కొరకు మానవధర్మములను ఏర్పాటు చేసియున్నారు.

"అగ్నిః ప్రథమో దేవతానాం" – అను శ్రుతి ననుసరించి భూలోకవాసు లందరికి అగ్నిదేవతారాధన అతిముఖ్యమని వర్ణింపబడినది. దేవతలు – భూలోకవాసులు అందరూ అగ్నిదేవతను తప్పనిసరిగా ఆరాధించుట వలన సమస్త క్షేమములు కలుగునని వేదములు నొక్కిచెప్పుచున్నవి.

"బహుస్యాం ప్రజాయేయేతి" అను శ్రుతి ననుసరించి మానవజాతి సృజింపబడెను. అంతేగాక ఆ పరమాత్మ చరాచర జగత్తునకంతకూ విజ్ఞానమును ప్రసాదించెను. ఈ నాటికి కూడా ఆ విజ్ఞానమే భారతజాతి యందు వ్యాపించియున్నది.

నేటి భౌతిక విజ్ఞానంకంటె అత్యున్నతమైన అతీంద్రియ విజ్ఞానమును సమస్త ప్రజలకు అందుబాటు చేయుటకు భగవంతుడు తన అంశచే శ్రీ వ్యాసభగవానుని సృజించెను. శ్రీ వ్యాసులు పురాణములు ఉపపురాణములు, రచించి భారతీయ సంస్కృతిని ఇనుమడింపజేసెను.

లింగాకృతులు అనేకరూపములలో అత్యంత భక్తి శ్రద్ధలతో ఆరాధింపబడు చున్నవి.

శ్రీ మహావిష్ణువు లోక పాలనా బాధ్యతను వహించి, సృష్టికి ప్రతిబంధకముకల్గినపుడల్లా మత్స్యాద్యవతారములు ధరించి ధర్మరక్షణ చేయుచున్నట్లు శ్రీ వ్యాస భగవానుడు తన రచనల యందు వర్ణించియున్నారు. ఈ సందర్భములో రామ–కృష్ణావతారములు మానవరూపములో వచ్చి సమస్త ప్రజాక్షేమమునకు ఆదర్శనీయము, ఆచరణీయమైన ధర్మాలను తాము ఆచరించి ఇతరులు ఆచరించి తరించుటకు తగు ఏర్పాటులను చేసియున్నారు. త్రేతాయుగమందు రాముడు – ద్వాపరయుగమందు కృష్ణుడు లోకసంరక్షణ కొరకు అవతరించి భారతావనియంతయు సంచరించి అనేక ఋషిగణమును, మానవజాతిని, తరింపజేసి తమ తమ పునీత నామములను నేటివరకు ప్రతి మానవునియొక్క హృదయమునందు చిరస్మరణీయముగా వుండునట్లు చేసిరి. ద్వాపరమందు శ్రీకృష్ణుడు వేదసారమగు గీతను అర్జునునకు బోధించి కర్మ–

# హైందవ సంస్కృతి

ఈనాడు దృశ్యమానమగు సృష్టి ప్రారంభమై 27 మహాయుగములు గడచినవి. వర్తమానమందు 28వ మహాయుగము జరుగుచున్నది. (నాలుగు యుగములు ఒక మహాయుగము. వేద వాఙ్మయమందు కర్మ–భక్తి–జ్ఞానములు వివరింపబడినవి. కర్మప్రధానమైన విగ్రహారాధన విపులముగా వివరింపబడినది. అందు పంచాయతన పూజ ముఖ్యముగా అనుసరణీయమని వర్ణింపబడినది. అనగా ఈశ్వరుడు–విష్ణుమూర్తి–శక్తి–సూర్యుడు–గణపతి – యీ పంచాయతనమందు ముఖ్యమగు దేవతామూర్తులు.

భగవంతునియొక్క సృష్టియందలి మానవజాతి తరించుకొఱకు శ్రీ వ్యాసులు తాను రచించిన అష్టాదశ పురాణములలో శ్రీ మహావిష్ణువుయొక్క అవతారలీలలను వర్ణించుటయేగాక తాను రచించిన మహాభారతమందు సమస్త మానవులు అనుసరించ వలసిన ధర్మములను మిక్కిలి ప్రశంసనీయముగా వర్ణించెను. సృష్టికి ప్రతిబంధకముగాని ఈశ్వర స్వరూపమును శ్రీ వ్యాసులు తన రచనలలో చక్కగా వర్ణించెను. ఈనాడు ప్రాక్పశ్చిమ దేశముల యందు ఆ యీశ్వరునియొక్క

భక్తి–జ్ఞానము మూడింటినీ వేదమే చెప్పుచున్నదని ప్రచారముచేసి, అట్లు వేద విహిత కర్మానుష్ఠానము, అగ్ని ఉపాసనా ప్రాధాన్యముగా బోధచేసి యుండుట వలననే ఇంతవరకు ఖండఖండాంతరముల యందు కూడా భారతీయ సంస్కృతి ప్రచారము శాశ్వతముగావున్నది. ఇతరదేశస్థులు భారతదేశము వచ్చి వారిమత ప్రచారమును సామాన్యులకు, ప్రౌఢులకు కూడా తమ మతము నందు అనురాగము కలుగునట్లు చేయుచున్నారు. శ్రీకృష్ణ పరమాత్మ–అర్జునునితో వేదవిహిత కర్మానుష్ఠానమును విడచి, ఇతర మతములు స్వీకరించి, ఆ

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

| | |
|---|---|
| 1. స్పెషల్ దర్శనము | రు. 25 |

ఈ టికెట్టు తిరుమలలోనూ. దేశంలో ఆంధ్రా బ్యాంకువారి వివిధశాఖలలోను లభించును.

### సేవలు

| | |
|---|---|
| 1. ఆమంత్రణోత్సవము | రు. 400 |
| 2. అభిషేకము (పులికాపుసేవ) | రు. 500 |
| 3. పునుగుగిన్నె | రు. 200 |
| 4 జాఫ్రాగిన్నె | రు. 100 |
| 5. కస్తూరిగిన్నె | రు. 100 |
| 6. సహస్రకలశాభిషేకము | రు. 3500 |
| 7. తిరుప్పావడ * | రు. 5000 |
| 8. కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 3000 |
| 9. ఐనా మహల్లో డోలోత్సవం * | రు. 1500 |
| 10. సహస్ర దీపాలంకారసేవ | రు. 2000 |
| 11. పవిత్రోత్సవం | రు. 5000 |
| 12. ఊంజల్ సేవ | రు. 1500 |
| 13 నూతన ఊంజల్ సేవ | రు. 3000 |

### తిరుమల, తిరుపతిలో వసతి సౌకర్య వివరాలు

తిరుమలలో

| | |
|---|---|
| (1) ప్రత్యేకపు కాటేజీలు | రు. 75 |
| (2) టి. బి. లోపల కాటేజీలు | రు. 50 |
| (3) యస్. వి. గెస్టుహౌస్ పెద్దగదులు | రు. 50 |
| మూలగదులు | రు. 40 |
| ఒక్కగదిని | రు. 35 |
| (4) హెచ్. ఆర్. జి. కాటేజిలు కల్యాణమంటపాలు | రు. 150 |
| రూయాకాటేజి, గోగినేని కాటేజి | రు. 80 |
| సి. సి. కాటేజిలు | రు. 100 |
| కంపమిట్ట తూర్పు నెం॥ 9 | రు. 50 |
| ఆళ్వారుల టాంక్ కాటేజి నెం॥ 39 | రు. 80 |

తిరుపతిలో

శ్రీనివాస చౌల్ట్రి: 15, 12, 10. రూ.

పద్మావతి గెస్టుహౌస్ (ఏసి) రెండుపడకలని: 40 రూ.

ఒక్కపడకని: 30 రూ.

శ్రీవేంకటేశ్వర గెస్టుహౌస్: రెండుపడకలని: 16 రూ.

### ఉత్సవములు

| | |
|---|---|
| 1. వసంతోత్సవము | రు. 3000 |
| * 2. తెప్ప ఉత్సవం | రు. 2500 |
| 3. కల్యాణోత్సవము | రు. 2000 |
| 4. బ్రహ్మోత్సవము | రు. 1000 |
| 5. పుష్పయాగం | రు. 3500 |

### వాహనములు

| | |
|---|---|
| 1 బంగారుగరుడ కల్పవృక్ష. సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి | రు. 125 |
| 2. వెండిగరుడ, చిన్నశేష, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి | రు. 100 |

షరా:– సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును.

1. ఆమంత్రణోత్సవమునకు ఇద్దరికి మాత్రమే అనుమతి. 2, 3, 4, 5, 6, సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 7-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత వ్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

* ఈ ఉత్సవముల వారికి 5 గ్రా. బంగారు పతకం బహూకరింతురు.

### * నిబంధనలు *

కాటేజీలు కావలసినవారు ఆ ప్రాంతపు రిసెప్షన్ ఆఫీసర్ పేరిట కనీసం పదిరోజులు ముందుగా డిమాండ్ డ్రాఫ్టు మూలకంగా డబ్బుపంపాలి. ఒక కాటేజీ కొరకు పంపి వేరొక వసతి ఏర్పాటైతే జమచేయగా మిగిలిన డబ్బు వాపసు ఇవ్వబడుతుంది. ఉదయం 8 గంటలనుండి మరునాడు ఉదయం 8 గంటలవరకు ఒకరోజుగా లెక్కించబడుతుంది. డబ్బు కట్టినవారు మొదటి రోజున రానిపక్షంలో అంతకు ముందు చెల్లించిన డబ్బు తిరిగి ఇవ్వబడదు. తరువాత చార్జీలకు లెక్క కట్టబడదు.

ఈ రిజర్వేషను 2 రోజులకు మాత్రమే: పరిస్థితులను బట్టి పొడిగింపు వుంటుంది. ఏ వసతి దొరకని పక్షంలో డబ్బు తిరిగి ఇవ్వబడును.

డబ్బు కట్టినవారు తమకు ముందుగా పంపబడిన రిజర్వేషను కార్డును లేదా మనియార్డరు రశీదును లేదా నగదు రశీదును ఆయా రిజర్వేషన్ కేంద్రాలలో చూపవలసి వుంటుంది. లేనిచో రిజర్వేషన్ రద్దుకాగలదు.

తిరుమల తిరుపతి దేవస్థానం

చిహ్నములను ధరించినవారికి భారతీయ సంప్రదాయము ననుసరించి ముక్తిలభించ దని నొక్కి వక్కాణించెను.

ఇంతేగాక భారతీయ ఋషిసంప్రదాయము ప్రకారము ముక్తి పొందుటకు అన్యమత స్వీకారము విజ్ఞానులకు ఎంత అనవసరమో సామాన్య జనులకు అంత అనవసరము. ఏలనన వేదమునందు "అగ్నిర్నః పాతు కృత్తికాః" అను శ్రుతి ననుసరించి కృత్తికానక్షత్ర యుక్తమైన పౌర్ణమి కార్తీక మాసమని చాంద్రమాన వ్యవహారము. ఆ కార్తీక పౌర్ణమినాడు మహర్షులు నదీతీరమందేగాక సర్వత్ర దీపారాధనచేసి దేవతలను ఆహ్వానించుచున్నారు. అటులనే స్త్రీలు, పురుషులు గ్రామములయందు వీథులయందు అరుగులయందు దీపారాధనజేసి భగవంతుని ఆహ్వానించుచున్నారు. అటులనే సమస్త దేవతామందిరముల యందు ఆకాశదీపమును వెల్గించుచున్నారు. దీనివలన అందరకు ముక్తి లభించునని ఋషిప్రోక్తము. పిపీలికాది జీవకోటికంతకు అతి సులువుగా ఉత్తమ జన్మ కలుగుటకు అగ్నిదేవతయే ఇచ్చునని మహర్షులే దీపారాధన చేసి యీ శ్లోకమును పఠించుచుండిరి.

"కీటాః పతంగాః మశకాశ్చ వృక్షాః
జలే స్థలే యే ప్రచరంతి జీవాః।"
.... .... .... ....
శ్వపచా హి ద్విజాః"

కాన తరణోపాయముకు అన్యమతావలంబన ఎంతమాత్రము భారతీయులకు అవసరము కానరాదు. పిపీలికాదుల నుండి విజ్ఞానయుక్తమైన సమస్త జీవరాసులు ఆ దృష్టితోనే వుంటున్నారు. ఈనాడు విజ్ఞానము మానవుల కంటే పశుపక్ష్యాదులలో ఎక్కువగా గోచరించుచున్నది.

ఈనాడు శేషాచలస్థ శ్రీ అలమేలు మంగా, పద్మావతీసమేత శ్రీ వేంకటేశ్వర స్వామివారి స్వర్ణోత్సవసందర్భములో ఇట్లు భారతీయ విజ్ఞానముకు సంబంధించిన హిందూమత ధర్మప్రచారము చేయుచున్నందుకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన సంచాలకులు ఎంతో ప్రశంసనీయు లనుటలో అతిశయోక్తి లేదు.

— శ్రీ భమిడిపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి

*

# గ్రంథావిష్కరణ మహోత్సవము



తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో "మాలకొండనరసింహ ప్రచురణలు" చే ప్రచురించబడిన మూడు గ్రంథములను (1. శ్రీ మాల్యాద్రి లక్ష్మీ నృసింహ సుప్రభాతము – శ్రీ దువ్వూరి తిరువేంగళం, 2. శ్రీ మాల్యాద్రి నృసింహ శతకము – శ్రీ మొవ్వ వృషాద్రిపతి, 3. శ్రీ వెలుగొండస్వామి చరిత్రము– శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు) తే. 16–6–84 న కందుకూరు తాలూకా మాలకొండ క్షేత్రమువద్ద ఒంగోలు జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ ఆర్. సీతారామారావు, ఎం.ఏ., ఆవిష్కరించారు. ఫోటోలో స్వాగతోపన్యాసం చేస్తున్న శ్రీ పవని శ్రీధరరావు, కూర్చున్నవారు సర్వశ్రీ కొమాండూరి రామానుజాచార్యులు, ఆర్. సీతారామారావు (పోలీసు సూపరింటెండెంటు, ఒంగోలు), జె. వి. నరసింహం (సబ్‌జడ్జి, ఒంగోలు), అధ్యక్షులు దువ్వూరి తిరువేంగడం, మొవ్వ వృషాద్రిపతి.

## అన్న విజ్ఞానము

[కర్త: శ్రీ యస్. టి. వి. రాజగోపాలాచార్యులు గారు ప్రాప్తిస్థానం: వ్యవస్థాపక సంచాలకుడు, శ్రీనివాసభారతి, భీమవరం_2 పశ్చిమగోదావరిజిల్లా వెల: రూ. 6_00]

"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అని శ్రుతి అన్నం పరబ్రహ్మ స్వరూపమని బోధిస్తున్నది. మన ఆరోగ్యం మనం తినే ఆహారం మీదనే ఆధారపడి ఉంటుంది. శరీరమే మొదటి ధర్మసాధనం కాబట్టి ఆరోగ్యం చాలా ప్రధానమైనది. అంతేకాదు. మన ఆలోచనలు, ప్రవృత్తి మొదలైన వాటికి కూడా ఆహారమే మూలకారణం. సాత్త్వికాహారం తీసుకొంటేనే ప్రవృత్తికూడా సాత్త్వికంగా ఉంటుంది. అందుకే భగవద్గీత సాత్త్విక, రాజస, తామస ఆహారాలను గురించి విపులంగా వివరించింది. అందువల్ల అన్నాన్ని గూర్చిన విజ్ఞానం మనకు అత్యంతావశ్యకమనడంలో సందేహం లేదు.

భీమవరం కళాశాలలో ఆంధ్రోపన్యాసకులైన శ్రీ యస్. టి. వి. రాజగోపాలాచార్యులు 'అన్నవిజ్ఞానము' అన్న గ్రంథాన్ని రచించారు.

'శ్రీనివాస భారతి' అనే సాంస్కృతిక ఆధ్యాత్మిక సంస్థను స్థాపించి వీరు ఇతర గ్రంథాలు కూడా ప్రచురించి యున్నారు. ప్రకృత గ్రంథంలో అన్న నిర్వచనము, ఏడురకాలైన అన్నాలు, అన్నయజ్ఞం, అన్నమయ కోశము, అన్నప్రభావము, అన్నదాన మహిమ ఇత్యాదిగా అన్నానికి సంబంధించిన అనేక విషయాలను కూలంకషంగా చర్చించారు. తమ వాదానికి ఆధారంగా అనేక శాస్త్రప్రమాణాలు చూపారు. ఎలాంటి అన్నాన్ని ఎప్పుడు, ఎలా భుజించాలి? అనే విషయాలను ఈ గ్రంథం సమగ్రంగా వివరిస్తున్నది.

అనేక గ్రంథాలను పరిశీలించి అన్నానికి సంబంధించిన విషయాలన్నిటినీ ఏర్చి, కూర్చి, ఈ గ్రంథాన్ని ప్రచురించి లోకానికి మహోపకారం చేసిన శ్రీ రాజగోపాలాచార్యులవారు అభినందనీయులు.

— సముద్రాల లక్ష్మణయ్య

## శైవాగమకారికావళి

(శైవాగమకారికావళి_రచయిత: నందివెలుగు వేంకటేశ్వరశర్మ. క్రౌను సైజు 92 పుటలు. వెల: 5_00 ప్రాప్తిస్థానము: మహర్షి సదనము శైవాగమ విద్వాన్ నం. వేంకటేశ్వరశర్మ. మైలవరం (కృష్ణాజిల్లా)

జీవి పుట్టి పెరిగి తన కోరికలు తీర్చుకొనుటకు ప్రయత్నము చేయుచు కోరికలు నెఱవేరనపుడు ఏదో శక్తివల్ల ఇదంతయు జరుగుచున్నదని దాని నారాధించ మొదలు పెట్టి ఆ శక్తిని భగవంతునిగా గ్రహించి పూర్వులు చెప్పిన విషయములపై పు దృష్టి మరలించును. ఆ భగవంతుని రూపము ప్రత్యక్షముగా కనిపించనపుడు ఆ భగవంతుని గుణగణములను తెలిసికొని వానితో ఒక మూర్తిని కల్పించుకొనును.

# గ్రంథసమీక్ష

భగవద్గీతలో "ద్వావిమౌ పురుషౌలోకే క్షరోఽక్షర ఏవ చ," అని చెప్పబడినది. ఆ భగవంతుని నిర్గుణ స్వరూపమును మోక్షమును గూర్చి ఉపనిషత్తులు బోధించుచున్నవి. సగుణరూపమును తద్విశేషములను ఆగమములు పురాణములును బోధించుచున్నవి.

ఆగమములు శైవాగమములు, వైష్ణవాగమములు, పాంచరాత్రములు మొదలుగా చెప్పఁబడినవి. శివునిగూర్చి చెప్పినవి శైవాగమములు విష్ణువునుగూర్చి చెప్పినవి వైష్ణవాగమములు. సూర్యునివంటి ఏ దైవాగమములముందు తదితరములగు పంచశాస్త్రములు రాత్రులుగా తలచబడినవో అవి పాంచరాత్రములు అనబడినవి. ఉపనిషత్తులలో ఆత్మను గూర్చియే చెప్పఁబడినది. శివుఁడు శుభమైనవాఁడు, విష్ణువు వ్యాపకుడు అని పెద్దలు చెప్పుదురు. ఉపాసకులు తమ యభిరుచినిబట్టి ఒకే రూపమును అనేక విధములుగా ఉపాసింతురు.

యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ విదధామ్యహమ్.

(గీత 7_21)

ఏ యే భక్తుడు శ్రద్ధతో,
నే రూపు గొల్వగోరునో
వానివానికి నందందే,
నిశ్చలభక్తిఁ గూర్చెదన్.

(నా తెనుగుగీత)

అని చెప్పబడినది.

శ్రీ వేంకటేశ్వర శర్మగారు ఉపాసకులకు సులభముగా తెలియుటకు శైవాగమము నుండి 'శైవాగమకారికావళి' అను పేరుతో గ్రంథ రూపమున వెలార్చిరి.

ఆగతం శివవక్త్రేభ్యః
గతం తు గిరిజాముఖమ్,
మతం శ్రీ వాసుదేవేన
తస్మా దాగమ ముచ్యతే.

(పుట 49)

సదాశివుని ముఖమునుండి ఉత్పన్నమై పార్వతికి ఉపదేశింపఁబడి విష్ణుసమ్మతమై యుండుటచే దీనికి ఆగమ మని పేరు వచ్చినది అని వారు చక్కగా వివరించిరి.

భావే తు విద్యతే దేవో
న పాషాణే న మృణ్మయే,
న ఫలం భావహీనానాం
తస్మా ద్భావో హి కారణమ్.

అను సూక్తినిబట్టి భగవద్భావమువల్ల ఉపాసకులు ఫలాదులను పొందుచున్నారని గ్రహింపవలయును.

"అశ్మాపి యాతి దేవత్వం
మహద్భిస్సుప్రతిష్ఠితః"

మహానుభావులచే ప్రతిష్ఠింపబడి ఱాయి కూడ దేవత్వమును పొందుచున్నది అని కూడ పెద్దల మాట.

స్థలములను పరీక్షించి, బీజాక్షరములు చక్రములు న్యాసముచేసి, దేవాలయములు నిర్మించి, అందు విగ్రహాదులను ప్రతిష్ఠించి, యుపాసకులు తరించుటకై పెద్దలు గొప్ప కార్యములను నిర్వర్తించియున్నారు.

ఏకైవ మూర్తి ర్బిభిదే త్రిధా సా
సామాన్యమేషాం ప్రథమావరత్వమ్,
విష్ణోర్హర స్తస్య హరిః కదాచిత్
వేధా స్తయో స్తావపి ధాతురాద్యౌ.

అని కాళిదాసు శివ విష్ణు బ్రహ్మదుల పూర్వాపరత్వములను గూర్చి చెప్పియున్నాఁడు.

ఇంక దేవాలయములు ఎట్లు కట్టవలయును, స్థలమాహాత్మ్యము ఎట్టిది, మట్టి ఎట్లు పరీక్ష చేయవలయును, ఎట్టి బీజాక్షరములు చక్రములు న్యాసము చేయవలయును, ఎట్లు విగ్రహములు తయారు చేయవలయును, ఎట్లు ప్రతిష్ఠచేయ వలయును, ఎట్లు చేసిన భక్తులకు ఫలములు సిద్ధించును - మొదలగు విషయములు ఆగమములలో నిరూపింపబడినవి.

'శైవాగమకారికావళి' లో రెండు భాగములు కలవు. మొదటిభాగము ఇష్టదేవతా ప్రార్థన, అష్టమంగళములు, అర్చకుఁడు మొదలైన శీర్షికలతో నిండియున్నది. వానిలోని కొన్ని ముఖ్యవిధులు, అర్చకుని లక్షణము,అర్చనకాలము,పూజాద్రవ్యములు దీపతైలము, నిర్మాల్యవిధి, నివేదనవిధి, పరిచారకలక్షణము, భస్మధారణవిధి, శివదర్శనము, శివమందిరవర్జ్యములు, శివపాద మహిమ, షోడశోపచారములు, సాష్టాంగ నమస్కారము లున్నవి.

రెండవభాగములో అంకురార్పణము, ఆదిశైవులు. పూజార్హులు దేవలకద్వదోషము, దేవతాప్రతిష్ఠ, పంచగవ్యవిధి, ప్రాయశ్చిత్తవిధి, మహాభిషేకవిధి – వర్జనీయ పుష్పాలు, పూజాయోగ్యపుష్పములు, వేదోచ్చారణ, శైవకర్మల నిషేధము, హోమ సమిధవిధి, హోమద్రవ్య ప్రమాణములు ముఖ్యములుగా చెప్పబడినవి.

శ్రీ వేంకటేశ్వరశర్మగారు, అన్ని విషయములు ఉపాసకులకు అనుకూలమైనవి మూలశ్లోకములతో పాటు తాత్పర్యములు వివరించియున్నారు.

అందులో కొన్ని విషయముల గూర్చి యిక్కడ ముచ్చటింతము. ఆదిలో పార్వతీ శంకరులకు నమస్కరించి అద్దము, పూర్ణ కుంభము, నంది, రెండు చామరములు, శ్రీవత్సము, స్వస్తికముద్ర, శంఖము, దీపము అను మంగళవస్తువు లెనిమిదింటిని పేర్కొన్నారు శర్మగారు.

ఆదిలో శివత్వముండుటచే ఆదిశైవులని, శివదీక్షాపరులగుటచే శివబ్రాహ్మణులని, సర్వోత్తములగుటచే పరాచార్యులని శివాచార్యులు మొదలుగా అర్చకులకు పర్యాయ పదములు కలవు.

ఈశ్వరుని కళలు అర్చకునందు గోపుర మందు లింగమందు విమానమందు బలి పీఠమందు ఉండును. ఇవి ఈశ్వరుని పంచ ప్రాణములని చెప్పబడెను. అర్చకుడు శీలవంతుఁడై ఆదిశైవ వంశభవుడై, శ్వేతవస్త్ర ధారియై శిఖాయజ్ఞోపవీతము విభూతి రుద్రాక్షమాల ధరించి పంచాక్షరీ మంత్రోపాసకుఁడై సర్వత్ర సమబుద్ధియై యుండ వలయునని యిందు చెప్పబడినది.

ఇంకను ఇందు చెప్పబడిన ముఖ్యాంశములు.

తులసి, మారేడు, వావిలి, ఉత్తరేణి, వెలగ, జమ్మి, ఉసిరిక, గరిక - ఇవి యెనిమిది అష్టబిల్వములు.

వాకుడు. జిల్లేడు, సురపొన్న, నంది వర్ధన, కలిగొట్టు, గన్నేరు, సంపెంగ, నల్లకలువ ఇవి అష్టపుష్పములు.

ఇల్లే అగరు చందనము తుంగముస్తలు మొదలైనవి ధూపములు.

శీలాది గుణయుక్తుఁడైన యర్చకుఁడు పై బిల్వములు పుష్పములు ధూపములు వేసి అర్చనాది కార్యములు నిర్వర్తించ వలయును. శర్మగారు ప్రమాణ శ్లోకములు ఉదాహరించి చక్కగా నిరూపించినారు.

ఘంటానాదమును గూర్చి యిట్లు చెప్పబడినది.

ఆదౌ మధ్యేఽభిషేకాంతే
ధూపే దీపే నివేదనే,
నీరాజనే చ శయనే
ఘంటానాదం సమాచరేత్.

మొదట, మధ్య, అభిషేకము చివర ధూపదీప నైవేద్య సమయములందు నీరాజన మిచ్చునపుడు పవ్వళింపు సమయమున గంటను వాయించవలెను.

ప్రదక్షిణ క్రమ మిట్లు చెప్పఁబడినది —
అపసవ్యం తు యతిః కుర్యాత్
సవ్యంతు బ్రహ్మచారిణామ్,
సవ్యాపసవ్యం గృహస్థస్య
శంభోర్నిత్య ప్రదక్షిణమ్

శివునికి ప్రదక్షిణము చేయునపుడు యతి అపసవ్యము గాను, బ్రహ్మచారి సవ్యము గాను, బ్రహ్మచారిపవ్యముగాను గృహస్థుడు సవ్యాపసవ్యము గాను చేయవలయును.

శివమందిరమున వర్జింపవలసినవి.

తైలాభ్యంగం, ఘృతాభ్యంగం
శిరసో వేష్టనం తథా,
కంచుకావరణం చాపి
వర్జయే చ్ఛివమందిరే.

నూనెతోగాని నేతితోగాని తలయంటుకొని, తలగుడ్డ చొక్కాను ధరించిగాని చెప్పుకాళ్ళతోగాని శివాలయమునకు వెళ్ళరాదు. మూలములో "చెప్పులకాళ్ళతో వెళ్ళరాదు" అని లేకపోయినను సదాచారమును బట్టి యిట్లు చెప్పుటవల్ల శ్రీశర్మగారి యుచితజ్ఞత ప్రకటమగుచున్నది.

దేవలకాదులు అర్చనకు పనికిరారు.
యో గృహీత్వా ధనం విప్రః
కురుతే దేవపూజనమ్,
స వై దేవలకో నామ
సర్వకర్మ బహిష్కృతః.

ఏ బ్రాహ్మణుడు ధనమును తీసికొని దేవుని పూజించునో వానిని దేవలకుడందురు. అతడు దైవసంబంధమగు సర్వ కర్మలకు పనికిరాడు. (పుట.60)

సువర్ణ తులసీ బిల్వం
తథైవ కమలాని చ,
ఏతే నిర్మాల్యతాం ప్రాప్య
పునః ప్రక్షాళ్య పూజయేత్.

బంగారు తులసీదళము మారేడుదళము తామరపువ్వులు = వీనిని ఒక పర్యాయము పూజచేసినను వానిని కడిగినచో మరల పూజకు పనివచ్చును. (64 పుట)

దిక్కుల విషయములో గూడ నిట్లు చెప్పఁబడెను.

యస్యాం దిశి భవేద్ద్వారం
తాం ప్రాచీం పరికల్పయేత్,
లింగస్యాభి ముఖం యత్తు
ద్వారం తత్పూర్వ ముచ్యతే.
(పుట-73)

ద్వారమున్న దిక్కే లింగాభిముఖమైన దిశ తూర్పుగా పరిగణించవలయును.

దేవాలయ ప్రతిష్ఠ చేయునపుడు విధిగా వాస్తుదేవతను గూర్చి హోమము చేయవలయుననియు లేనిచో కర్మ నిష్ఫలము అని యిందు చెప్పఁబడినది.

వాస్తుహోమం వినా యత్ర
తత్ర తత్కర్మ నిష్ఫలమ్,
తస్మాత్సర్వ ప్రయత్నేన
వాస్తుహోమం తు కారయేత్.

తుదకు భగవంతుని యాకారము ఇట్లు వర్ణింపఁబడినది —

శిఖరంతు శిఖే త్యాహుః
గర్భగేహం గళం తథా,
మంటపం కుక్షిరిత్యాహుః
ప్రాకారం జానుజంఘయోః.
గోపురం పాద ఇత్యాహుః
ధ్వజం జీవనముచ్యతే.

దేవాలయ శిఖరమే భగవంతుని బాహ్య శరీరమునకు శిరస్సు, గర్భాలయము కంఠము, మండపము ఉదరము, మోకాటి పిక్కలకు సమానమైనది ప్రాకారము, గోపురము పాదము, ధ్వజము ప్రాణము. ఈ వర్ణన పురుషసూక్తములో భగవత్పురుని యాకారమువలె ఎంత రమ్యమైనది!

ఇట్లు శ్రీ నందివెలుఁగు వేంకటేశ్వరశర్మ గారు సకల ముఖ్యవిషయములతో మామూలు భక్తులకు కూడ తెలియునట్లు శైవాగమముల నుండి ఏర్చి కూర్చి తెలిపి ఉపాసకులకు మహోపకారం చేసినారు. ఇందులకువారెంతయు అభినందనీయులు. ఇట్టి యుత్తమ గ్రంథములను ప్రచురించుటకు తగిన ఆర్థికసహాయము చేసిన తిరుపతి దేవస్థానము వారికి ఆస్తికపాఠక లోకమెంతయు ఋణపడి యున్నది. ఇట్లే దేవస్థానమువారు ఇట్టి ఉత్తమ గ్రంథ ప్రచురణకు సహాయపడుదురుగాక యని, వీనిని ఉపయోగించుకొని భక్తులు తరింతురుగాక యని కోరుచున్నాను.

—చర్ల గణపతిశాస్త్రి

## గోవింద రామాయణము-
## సీతారామమ్ [బాలకాండము]

కృతికర్త: కళాప్రపూర్ణ శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్య. మూల్యం: రు. 15-00. ప్రాప్తిస్థానం: 1-8-76, పి.జి.రోడ్డు, 35, జవహర్ నగర్, సికిందరాబాద్-3.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామా
యణాత్మనా."

రామాయణం వేదమంత పురాతనమయింది. పాణిని అష్టాధ్యాయిలో రామ కథలోని పాత్రలపేర్లున్నాయి. బౌద్ధ జాతక కథల్లో, జైనుల గ్రంథాల్లో రామకథ వర్ణింపబడింది. వ్యాసవిరచిత మహాభారత అరణ్య పర్వంలో రామకథ వుంది. రామాయణం ఎంత ప్రాచీనమో అంత ఆధునికం. భారతీయుల జీవన విధానాలమీద, సంస్కృతి మీద ఆచారాలమీద ప్రగాఢమైన ప్రభావాన్ని నెరపిన కథ రామకథ. అందుకే ఈ నాటికీ ఆరాధ్య మవుతుంది. ఆదర్శ జీవిత దిక్సూచిగా నిలిచింది. ఈ నాటికీ ఎందరో ఎన్నో ప్రక్రియలద్వారా రామకథ నందిస్తున్నారు. ఎవరి అనుభూతికి తగినట్లు వారు రామకథాసంబంధ రచనలు చేస్తున్నారు. అటువంటి వాటిల్లో సారళ్య, సౌందర్య, సౌకుమార్యాలనే లక్షణత్రయ ప్రధానంగా వెలువడింది ఈ గోవింద రామాయణం. కీ. శే. ఆత్మకూరి గోవిందాచార్యులుగారు స్వాతంత్ర్యసమరంలో చెరసాలల క్లేశాన్ని అనుభవించిన నిష్కళంక దేశభక్తులు. అర్థశాస్త్ర, భారతదేశ రాజ్యాంగ చరిత్రాది బృహద్గ్రంథ రచనా పారీణులు.

రామాయణం షట్కాండలు సుమారు పదివేల పద్యాలలో వ్రాశారు ఆచార్యుల వారు.

"జానకిని రాఘవుడు వీడు చరిత నాడు
భక్తతతి కంట దడివెట్ట వ్రాసినాడ
జానకిని రాఘవుడు గూడు చరిత నేడు
భక్తతతి సంతసింపంగ వ్రాయువాడ"

అని చెప్పి ఒక ఆదర్శంతో, దీక్షతో, పాఠక జనప్రియంగా కర్ణపేయంగా వ్రాసినారు. కరుణరసవర్తిగా, భక్తిరసమూర్తిగా కావ్యాన్ని తీర్చిదిద్దారు. అందుకే గోవింద రామాయణం చదివిన తర్వాత వేరువేరు రామాయణాలు చదువనక్కరలేదు అన్నారు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

శ్రీ వైష్ణవ వేదాంతుల 'శరణాగతి' ఈ రామాయణ ఆశ్వాసాంత పద్యాల్లో దర్శనమిస్తుంది. 'కట్టెద ప్రపత్తి సౌధ మీ కావ్యమందు' అని ఆచార్యులవారు కంఠోక్తిగా చెప్పుకున్నారు. తిక్కన, పోతనల వలెనే ఆచార్యులవారికి "భవం బికలేక తరించుట" యే కావ్య రచనలోని ఆశయం. అంతేగాని 'యశసేఽర్థకృతే' గాదు

బాలకాండను 1. శ్రీ లీలా కృపాశ్వాసము 2. శ్రీ అవతారాశ్వాసము. 3. శ్రీ శరణాగతాశ్వాసము అని మూడు ఆశ్వాసాలుగా విభజించారు. శరణాగతాశ్వాసంలో విశ్వామిత్రుడు దశరథుని దర్శించడం మొదలుకొని కళ్యాణానంతరం సీతారాములు అయోధ్యకు రావడం వరకు విషయ విభాగ యుక్తంగా సాగింది రచన.

రచన మొత్తం రసప్రధానంగా సాగింది. అవసరమైనప్పుడు తటాలు ఒరుసుకొని గంభీరంగా సాగే గంగాసదృశంగా ప్రవహిస్తుంది. ఉదాహరణకు-

"ఖళిరే కంటిమి కంటి మిప్పుడు
మహాప్రజ్ఞాధురీణున్ ఘనున్
విలయాకార ధనుర్విభేది
విలసద్వీరాగ్రగణ్యోత్తమున్
లలితశ్యామల ప్రావృడభ్రరుచి
లీలామానుషాగ్రేసరున్
దులలేకుండిన బాలరాము నని
రెంతో వింత నచ్చో నృపుల్."

కొన్ని సమయాల్లో వారి కవితా వాహిని ఆగి ఆగి మందమందంగా లలిత లలితంగా హొయలు పోతుంది.

"బాటలన్నియు సుమముల పాన్పుగాగ
మాటమాటయు రఘురాముమాటగాగ
ఇండ్లు వాకిళ్ళు సిరికి పెండ్లిండ్లుగాగ
దనరు సాకేతపురి జేరె దాశరథులు"

అనే పద్యాన్ని గమనించవచ్చు.

వ్యాఖ్యలతో, టీకలతో పనిలేకుండా చదువుకొని ఆనందించడానికి అనువైన గ్రంథమిది. సామాన్య పాఠకుణ్ణి సైతం పరమానందంలో ఓలలాడించగల సులభ శైలీ సంపన్నమైన గ్రంథ మిది. దేశ సేవయేకాక ఈ విధంగా ఆంధ్రభాషా సేవచేసిన ఆచార్యులవారు సదా స్మరింప దగినవారు.

— డా॥ మద్దూరు సుబ్బారెడ్డి

## స్తుతి గీతికలు

రచయిత: శ్రీమాన్ ఎన్. ఎం. సహాయాచారి. వెల: తెలియదు, ప్రాప్తిస్థానము: శ్రీ ఎన్. ఎం. సహాయాచారి, 36–28–3, సాలుమూరివారి వీధి, ఇన్నీసుపేట, రాజమండ్రి-533 103.

"రసేనైవ సర్వం జీవతి కావ్యం" అని అభినవగుప్తుడు, రసముచేతనే కావ్యము జీవించునని పల్కాడు. అలా శ్రీ యన్. యం. సహాయాచారిగారు "స్తుతి గీతికలు" అనే కావ్యంలో భక్తిరసంతో కావ్యాన్నంతా నింపి, ఈ కావ్యానికి ప్రాణం పోశారు.

శ్రీ యన్. యం. సహాయాచారి గారు వ్రాసిన ఈ కావ్యం చదువుతూంటే వీరిలో వున్న సృజనాత్మకమైన శక్తి, వీరికి భాషపై వున్న అధికారం చూసిన తరువాత మెచ్చుకోక తప్పలేదు.

దాహం గొనిన భక్తునికి, దాహం తీర్చేందుకు, ఎడతెరిపిలేకుండా పారి తేరిన మంచినీటి జాలు ఎంత అవసరమో! గ్రహించి తన కలం ద్వారా తన కవితలో భక్తిధార కురిపించి, భక్తుని దాహం తీర్చాడు. భక్తి తత్త్వమేగానీ ఈ కావ్యంలో కవితాతత్త్వం అంతగా కన్పడక పోవచ్చు. అయినా కవితాపరంగా చూస్తే యీ కావ్యంలో, భాషా సౌలభ్యము, పద్యముల నడక శ్లాఘింపదగినవి అక్కడక్కడా కొన్ని అంశములలో మృదువైన పదాలతో భావాన్ని చక్కగా రూపుదిద్దటం వీరి ప్రతిభకు గీటురాయి.

శైలిలోను, భాషలోను ఎంత ప్రతిభ చూపినా యితివృత్తంలో ఎంతమార్పు తెచ్చినా, (దీనికి యితి వృత్తం లేకపోవటం బాధాకరం) కావ్యానికి వస్తుప్రాధాన్యత లేకపోతే ఆ కావ్యం రాణించదు. అదిగాక కావ్యానికి ముఖ్యప్రాణం భావవాహిని. పదాలకూర్పులు, గణములు, కవిత్వానికి ప్రాణం కాదు.

ఎంతచేతకాని కవియైన పద్యం వ్రాసి బాగానే వుందనిపించుకోవచ్చు, కారణం కవి ప్రతిభకాదు, సంప్రదాయాన్నిమథించినకవి అభ్యాసలక్షణమే అవుతుంది. నా దృష్టిలో కాస్త వ్యుత్పత్తి వుంటే పద్యమంత సులువైన రచన మరొకటి వుండదు. ఇకపోతే నాదృష్టిలో పద్యాలలో ఏదైనా లోక సత్యాన్ని చెప్పి ఆ సత్యాన్ని ప్రజల గుండెల్లోకి లోతుగా, సూటిగా నాటుకు పోయేటట్లు చెయ్యడం. లేదా-పద్యాలలో ఉపమానములతో ముద్రవేయడం లేదా పద్యములలో అలంకారములను పొందుపరిచినా ఆ కావ్యానికి ఎంతో విశిష్టతచేకూర్తుంది.

ఇకపోతే వీరి ప్రతిభావిశేషాలకు, ఒక నిదర్శనముగా "ఆంజనేయస్తుతి" అనే గీతికలో బడబానలం వంటి భావన, దావానలంలాంటి ఉద్వేగాన్ని పొందుపరుస్తూ 'మారుతి' చిఱుతప్రాయంలో సూర్యుని మ్రింగిన సందర్భాన్ని వివరిస్తూ మారుతిని ప్రశంసించిన తీరు కవి వర్ణిస్తూ

మ॥ వహవా! ఏమని నిన్నుతింతు?
చిఱుతప్రాయాన పండంచు సూ
ర్యు హరింపంగ శ్రమించి వేడిమికి
నోవోర్వంగ రాకుంటచే॥

అనే యీ పద్యము కవి కవితోపజ్ఞతకు ప్రత్యేకత అని చెప్పక తప్పదు. అలాగే – "ఏడుకొండలవానిస్తుతి"లో ఉపనిషత్తులలో వర్ణింపబడిన తేజోరూపుడగు భగవంతుడై ఆ ఏడుకొండలవానిని కవి స్తుతిస్తూ పాపములను నశింపజేయువాడనీ, భక్తవరులకు కొంగుబంగారమై మెలిగేవాడు అనీ కవి వివరిస్తూ ఇలా అంటారు —

తే॥ కరడుగట్టిన పాపాలనిరుపమాన
మగు విధాన బోగొట్టి నిత్యమ్ము భక్త
వరుల కొంగుబంగారమై ప్రబలువాడ
ఏడుకొండలవాడ! నన్నేలువాడ॥

ఇది కవి ప్రతిభావిశేషమునకు మచ్చుతనకే: హృదయావేశానికి, అక్షరరూపమైన రీతి, వీరి కవితావిభవము మెచ్చదగినవే!

ఈ కావ్యంలో ముఖ్యంగా ప్రశంసింపదగినవి - లోకబాంధవస్తుతి, ఆంజనేయ స్తుతి, వాణీస్తుతి, ఏడుకొండలవానిస్తుతి, కాశికాస్తుతి, పెనుశిలస్వామిస్తుతి, మొదలగునవి. వీటిలో భాష, భావము, పద్యముల నడక బాగున్నాయి.

ఇకపోతే కొన్నికొన్ని పద్యములలో చెప్పదలచిన విషయం శూన్యమైంది. కావ్యంలో సక్తి ఎంత తక్కువో భక్తిభావం అంతఎక్కువే! ఏది ఏమైన ఈ కవివ్రాసిన యీ కావ్యాన్ని రేఖామాత్రంగానే పరామర్శించాను. ప్రతిఒక్కరూ చదవవలసిన

పుస్తకమే! ఈ కవి కలంనుండి మరిన్ని మంచి కావ్యాలు వెలువడగలవని ఆశిద్దాం.

— చంద్రభాను

## మహాభాగవతం

(మొదటిభాగం)

[రచన: నాయుని కృష్ణమూర్తి, విజయవాణి పబ్లిషర్స్, చౌడేపల్లి – 517257, చిత్తూరుజిల్లా, ఆం. ప్ర. మూల్యం: రు. 15–00.]

భారతీయ సాంస్కృతిక సౌధానికి రామాయణ భారత భాగవతములను మూల స్తంభాలుగా పరిగణిస్తారు. అందులో భాగవతానికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. అది భగవత్కథ, భాగవతకథ. అనేక సృష్టి రహస్యాలను వివరించే శాస్త్రాలు, సాధన మార్గములు అందులో నిక్షిప్తమై యున్నాయి. ఇతర గ్రంథాలపైన అధికారం సిద్ధించినవాళ్ళు కొల్లలుగా దొరుకుతారు, కాని, భాగవతశాస్త్ర నిష్ణాతులైన మహనీయులు చాలా కొద్దిమంది. ఈ శాస్త్ర దృష్టి విడిచిపెట్టి ఒక కావ్యంగానో, కమనీయకథగానో పరిశీలించినపుడు కూడా భాగవతంతో సమానమైనవి ఒక్క భారతీయ సాహిత్యంలోనే కాదు, విశ్వసాహిత్యంలో కూడా లేవనే చెప్పాలి. వేదవిభజన, బ్రహ్మసూత్రప్రవచనము, అష్టాదశపురాణ రచన అయినపిమ్మట కూడా వ్యాసభగవానునికి ఆత్మానందం లభించక కొట్టుమిట్టాడుతున్న వేళ నారదమహర్షి చేసిన ఉపదేశం వలన వ్యాసులు భాగవతరచన చేసినట్టూ, అది క్రమశః పఠన పాఠన సంప్రదాయాలలో శ్రీ శుకులూ శిష్యవర్గమూ వ్యాప్తిచేసినట్లూ భాగవతాంతర్గతమైన కథనము. దీనినిబట్టి మానవుని సర్వసాధనలకు పరాకాష్ఠగా భక్తి, ప్రేమ, ప్రపత్తి అన్నవి ప్రతిపాదించడమే భాగవత ధ్యేయమనిపిస్తుంది. భాగవత కల్పతరువు సర్వ మానవకోటికీ నిరంతర శ్రేయోదాయకము. విశేషించి అలసులు, మందబుద్ధియుతులు, అల్పతరాయువులు, ఉగ్రరోగ సంకలితులు అయిన కలియుగ మానవులకు స్మరణ మాత్రాన సన్నిధిని ప్రసాదించి కలిసంతరణమునకు మోక్షసిద్ధికి హేతుభూతమవుతుంది. ఇలా ఎంత చెప్పుకున్నా ఇంకా చెప్పవలసినది మిగిలి ఉండేంత మాహాత్మ్యము భాగవతానికి ఉంది.

ఆంధ్రులకు పోతనగారి భాగవతాను వాదం అనన్యసాహిత్య తీర్థం. ఆ అవతార పురుషుడు కవిత్వశిల్పంలో పండి, కవిత్వాన్ని మించిన ఋషిత్వాన్ని జీవిత మార్గంగా, సాహిత్యధ్యేయంగా ప్రవర్తిల్లిన సహజపాండిత్యుడు. వ్యాసప్రోక్తమైన భాగవతాన్ని ఆయన రామప్రేరణచేత పలికిన తీరు తెలుగుకవులలో ఇప్పటికీ ఎవరూ అందుకొన్నదికాదు. మూలంలోని ఏ అంశాన్నీ పరిహరింపక ప్రసిద్ధ వ్యాఖ్యాతల అభిప్రాయాలనుకూడా మేళవించి ప్రామాణికతను, ప్రసన్నతను జోడుగుఱ్ఱాలుగా నడుపుతూ కలకండలు అచ్చులుగా పోసినవాడు పోతన. ఇన్నితరాల తెలుగు పాఠకులు ఆయన భాగవతానికి పూజా పీఠంలో స్థానం కల్పించి, పారాయణం చేసి తరించారు. అందుకే మహాకవి అన్నట్టు ఆయన "తెలుగుల పుణ్యపేటి."

ఆ యా భాగవతరచనలో తలమునకలై తాము చవిచూచిన మందార మకరంద మాధుర్యాన్ని ఒకసారి తెనుగువచనంలో వ్రాసి ఆ ఋషి ఋణం తీర్చుకొందామని కొందరు, పద్యకవిత్వ వైశద్యాన్ని అందుకోలేని సామాన్య పాఠకులకు దానిని తెనుగులో చెప్పి మెప్పించాలని కొందరు, అందులోని గ్రంథగ్రంథులను అంతర్లీన తాత్త్వీక, శాస్త్రవిషయాలను ఆంధ్రపాఠకులకు అరచేతి అరటిపండు చేయాలని కొందరు – ఇలా ఎందరో మహానుభావులు తెలుగుజాతికి పోతనగారి ఋణం తీర్చుకుంటున్నారు, తీర్చుకుంటుంటారు. ఎప్పటికి తీరుతుందో చెప్పలేము. వీరంతా తమ చుట్టూ ఉన్న సామాన్య పాఠకులలోని వాసుదేవునికి తృప్తికలిగించి, పోతనకవిత్వ విష్ణుత్వాన్ని ఆరాధించి, సాక్షాన్నారాయణ స్వరూపుడైన వ్యాసభగవానునికి అంజలిస్తున్నారు. ఈ మొత్తమూ విష్ణువిరాణ్మూర్తియైన అపరతత్త్వానికి భాగవత కైంకర్యమే అవుతున్నది.

ఇలాంటి ఉత్తమ కామనతో పోతన భాగవతానికి వ్యావహారిక రూపం కల్పించి, తమ పితృపాదుల దివ్యస్మృతికి అంకితం చేసిన శ్రీ నాయుని కృష్ణమూర్తిగారొకరు. ప్రజాసామాన్యానికై చక్కని, చిక్కని తెలుగులో చేసిన ఈ రచన ఎట్టి పాఠకుణ్ణయినా ఇట్టే ఆకట్టుకోవడంలో సందేహం లేదు. అధికారికత, సంప్రదాయము ఎక్కడా చెక్కుచెదరకుండా ఆకర్షక వచన, రచనలో తెలుగు భాగవతాన్ని అందించే అసిధారావ్రతాన్ని నాయునివారు సమర్థంగా నిర్వహించారు. అక్కడక్కడా సాంకేతిక పదాలకు అర్థవివరణ చేయడం వంటి మెరుగులు గ్రంథ ప్రాశస్త్యాన్ని ఇనుమడింపజేశాయి. ముఖచిత్రము, ముద్రణ ముచ్చటగా ఉన్నవి. గ్రంథ మూల్యం కూడా సరసంగా ఉన్నది. ఇలాంటి ప్రయత్నాలు ఎన్ని జరిగితే తెలుగు పాఠకులకు అంత మేలు. అందుచేత నాయుని కృష్ణమూర్తిగారిని అభినందిస్తున్నాను.

— డా॥ ధారా రామనాథశాస్త్రి

*

# గృహలక్ష్మి




దశరథమహారాజుకు ఇంపారిన ప్రేయసులు ముగ్గురు. కోసలరాజపుత్రి పెద్దరాణి; పట్టమహిషి. ఆమె పేరు కౌసల్య. కేకయ రాజు కూతురు చిన్నరాణి; ముద్దులభార్య, ఆమెపేరు కైకేయి. మధ్యరాణి మగధేశ్వరుని కుమార్తె; ఆమె పేరు సుమిత్ర. కౌసల్యకు, కైకేయికి సొంత పేర్లున్నట్లు లేదు. సుమిత్రకు మాత్రము వాల్మీకి సొంత పేరు పెట్టినాడు. అది ఆమె స్వభావమును ప్రతిఫలించునదిగా ఉండుటయే అందులో విశేషము. వాల్మీకి, రామాయణములోని పాత్రలకు పేర్లు పెట్టుటలో కూడ ఎంతో శిల్పమును ప్రదర్శించినాడనుటకు ఇది చక్కని నిదర్శనము.

జీవితములో కొందరు తామే ముఖ్యులనియు, ఇతరులు తమ చుట్టును ఉండవలసినవారనియు తెలియజేయునటువంటి వాతావరణమందు పెరుగుదురు. మరి కొందరు ఇతరులు ముఖ్యులు, తాము వారితోపాటుండవలసినవారు అను దృష్టితో పెరుగుదురు. తాము ముఖ్యులమని బయలుదేరిన వారందరును త్వరగానో, నిదానముగానో, ఒకరోజు కాకుండిన ఇంకొక రోజు, లోకజీవనము తమ జీవనము కన్న పెద్దదని తెలిసికొందురు. రెండవ గుంపుకు ఈ అవశ్యకత లేదు. మొదటి గుంపు పెరుగుదల అదృష్టచక్రముచెంట పైనికి పోవుట వంటిది; తరువాత వారికి కలుగు జ్ఞానోదయము ఆ చక్రముతో క్రిందికి దిగుట వంటిది. తాము ముఖ్యులు కాదని బయలుదేరు వారికి ఆ పైనికి పోవుటయు లేదు; ఆ క్రిందికి దిగుటయు లేదు. వీరు జీవితమున ఎక్కువ సుఖసంతోషములకై ఎదురు చూడరు. అవి కొలదిగా లభించినను వారికి అతృప్తి కలుగదు. వీరు తక్కువగా కోరుదురు కాన ఎంతటి సుఖసంతోషములు లభించిన అంతటితోనే తృప్తి చెందుదురు. సుమిత్ర ఇటువంటి స్వభావముగల సాధ్వీమణి. దశరథుడు ఆమె యెడల మిక్కిలి ప్రేమను ప్రదర్శించలేదు. మంచిదే అయినది. అటు పట్టమహిషి కాదు; ఇటు మెప్పుల రాణి కాదు. ఆమె కందువలన చింత లేదు. రెండవ రాణియై మధ్యవయస్కుడైన రాజును చేపట్టినందువలన ఎక్కువ ప్రేమకై ఎదురు చూచుటకు వీలు లేదు కదా! రాజుకు సుమిత్ర యందు కొంత ప్రేమ ఏమో ఉండినది. అంతియే ఆమెకు తృప్తి. ఇద్దరు కుమారులను కన్నది. ఒక్కొక్కడు ఒక్కొక్క అన్నతో కలసి పెరిగిరి. వారి కష్టసుఖములను గురించి సుమిత్రకు యోచించవలసిన అవసరముండలేదు. రామునకు ఐనది లక్ష్మణునకు; భరతునకైనది శత్రుఘ్నునకు. కైకేయి అభిమానవతియైనందువలన సుమిత్ర కౌసల్యతో స్నేహము చేసినది. అథవా, రాజు చిన్నరాణితో ఎల్లప్పుడును ఉంటున్నందువలన పెద్దరాణులు సహజముగా ఒకరితో ఒకరు నెయ్యము నెఱపిరి. అందుచేత కౌసల్య కైనది తనకు. ఇట్లు సుమిత్ర జీవనతత్త్వము ఆత్మనిరాకరణమైనది. భరతుని మామగారి ఇల్లు శత్రుఘ్నునికిని మామగారి ఇల్లయినది. రామునికి సంభవించిన వనవాసము లక్ష్మణునికిని వనవాసమైనది. సుమిత్ర కౌసల్య దుఃఖములో భాగస్వామిని ఐనది. రాముని అతని తల్లి వనములకు పో వలదన్నది. లక్ష్మణుని తల్లి అతనిని వనములకు పోయి రమ్మని పంపినది. "సృష్టస్త్వం వనవాసాయ" అన్నది. రాముడు వనములకు పోవలసి వచ్చినచో, లక్ష్మణుడు కూడ అతనితోపాటు పోవలెను. లక్ష్మణుడు వనవాసము కొఱకే పుట్టినట్లు లెక్క. కౌసల్య పుత్ర వియోగముతో దుఃఖించుచున్నపుడు సుమిత్ర ఆమెకు ధైర్యము చెప్పెను. ఆమె స్వభావము ఎంతటి స్నేహమయమయినదన్న విషయము ఆమె అప్పటి మాటలవలన రుజువగును. రాముడెంతటి





### ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏళ్ళై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల రూ. 600/- అవుతుందికనుక టి. టి. డి. కార్యనిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

గుణశాలి; ఎంతటి ధీరుడు! సూర్యుడతనికి శ్రమను కలిగించడు; అనిలుడు అతనికి విరోధముగ నుండడు; చంద్రుడతనిని కౌగిలించుకొని, ముద్దుపెట్టుకొనును. అతని వెంట లక్ష్మివలె సీత; సేవచేయుటకు తన కుమారుడు లక్ష్మణుడు. అతని కేమి తక్కువ? ముగ్గురు స్త్రీలలో మధ్యమురాలిగా ప్రీతి లేని రాజభవనమున బ్రదికిన బ్రదుకువలన సుమిత్ర ఒక విషయమును అతిస్పష్టముగా అర్థముచేసికొని ఉండినది. కావలసిన వారుండినచో కాననమే నగరము; అటువంటివారు లేకున్నచో నగరమే కాననము. లక్ష్మణుడు అరణ్యమునే అయోధ్యగా ఎఱుగవలయునని అతనికి హితబోధ చేసెను. ఆమె ఆ సమయమున అయోధ్యనే అరణ్యమని ఎఱిగియుండినదని అగుపించును. తన దుఃఖము కౌసల్య దుఃఖము కన్న తక్కువ కాకపోయినను ఆమె కౌసల్యకు ధైర్యము చెప్పినది; ఆమెను ఓదార్చినది. ఆమె ధైర్యవచనములు, ఓదార్పు మాటలు నిజమైన స్నేహముచేత హృదయాంతరాళమునుండి వెలువడినందువలన కౌసల్య దుస్సహదుఃఖముకూడ ఆ మాటల చేత కొంతవరకు తగ్గినది. సుమిత్ర యొక్క ఈ ప్రవర్తన అందరకును ఆశ్చర్యమును కలిగించి ఉండవలెను. మరణశయ్యపై పరుండి వీరిని చూచుచు, వీరి మాటలను వినుచు ఉన్న దశరథునికి తన రెండవ రాణి మనోధర్మమును చూచి గౌరవభావము కలిగినదని అనిపించును. అతడు మరణించుటకు ముందు పలికిన పలుకులలో కైకేయిని, 'అమిత్రే, కులపాంసని' అని నిందించినట్లే, సుమిత్రను 'హా సుమిత్రే, తపస్విని' అని ప్రశంసించును. దశరథుని ఆ మాటలలోని భావము సత్యమైనది. సుమిత్ర ముఖ్యముగా తపస్విని.

కైకేయి రాముని అరణ్యములకు పంపి, తనకు రాజ్యమును సంపాదించి పెట్టినదనియు, దశరథమహారాజు మరణమునకు కారణమైనదనియు భరతునికి తెలిసి, అతడు తల్లిని నిందించెను. తనకు రాజ్యమక్కఱ లేదనెను. అరణ్యములకుపోయి, రాముని వేడికొని, వెనుకకు పిలుచుకొని వత్తుననెను. రాము డయోధ్యకు రాకపోయినచో, తాను రాముని దాసుడై వనములందే వసింతుననెను. అప్పుడు కైకేయి ఎట్లు ప్రవర్తించినదని వాల్మీకి చెప్పడు. కైకేయికి తన ఆశ ఫలించలేదు. తాను చేసినపని భరతునికి బొత్తిగా ఇష్టములేనిదని తెలిసినది. ఆ పని చాల దుష్టమైనదని తేలినది. అందువలన ఆమె పశ్చాత్తాపముతో క్రుంగిపోయి ఉండవలెను. ఆ సమయమున తప్పక సుమిత్ర ఆమెకు "జరిగినపని ఏదో జరిగిపోయినది. అందుకు వగచి ప్రయోజనము లేదు. ప్రశాంతముగా ఉండవలెను. మనము విధిచేతిలో కీలుబొమ్మలము. విషఘడియలో ఏదో నీ మనస్సులో చెడ్డతలపు పుట్టినది. అది ఇంత అనాహుతము చేసినది. రాముని తిరిగి అయోధ్యకు రప్పించు ప్రయత్నములు చేయవలెను. మనముకూడ భరతునితో రాముని తోడ్కొని వచ్చుటకు పోవలెను" అని చెప్పి ఆమెను సమాధానపరచి ఉండవచ్చును- ఉండునుకూడ. ఇది సుమిత్ర స్వభావమునకు విరుద్ధమైన ప్రవర్తన కాదు. సుమిత్రకు శత్రువులు లేరు. ఆమె అందరకును సుమిత్రయే! ఆమె శాంతగుణపేటిక; మహిళామణి; వినయాంబుధి; త్యాగనిధి; అన్వర్థనామధేయ. వాల్మీకి సృష్టించిన స్త్రీ పాత్రలలో శ్రేష్ఠురాలు.

రామాయణములో సుమిత్ర పాత్రకు ప్రముఖస్థానము లేకపోవచ్చును; కానీ, రామాయణమును జాగ్రత్తగా పఠించిన పాఠకుల హృదయములలో మాత్రము ఆ అమృతమూర్తికి ప్రముఖస్థానము దొరకక పోదు.

— శ్రీ శంకరగంటి రంగాచార్యులు



# రాయలసీమలో రాతిమంచం

అలనాట సంస్కృతికి ప్రతికలు నేటి శిథిలమైన శిల్పాలు శాసనాలు. ప్రాచీన కళాసంస్కృతికి భారతదేశం నిలయమంటే అతిశయోక్తికాదు. విజయనగర సామ్రాజ్యంలో అంతర్భాగమైన రాయదుర్గం ప్రాంతం అలనాటి భూపతి రాయలచే పరిపాలింపబడింది.

రాయదుర్గంలో అపూర్వ కళాసంపదలున్నా పురాతత్త్వశాఖవారు ఇప్పటివరకు పరిశోధనలు జరుపలేదు. సంస్కృతికొక స్వరూపం, కళకొక వైశిష్ట్యం కలదని రుజువుచేయడానికి నేటికి ఎవరు పట్టించుకోని రాతిమంచమే సాక్షి.

అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకా, 75 వీరాపురం గ్రామంలో (రోడ్డుకు కిలోమీటరు తూర్పుదిశలో) బండెప్ప గుడి ప్రక్కన అద్భుతమైన రాతిమంచం ఒకటుంది. ఇది ఒక అపూర్వకళాఖండం. ఇది 6 అడుగుల పొడవు, 4 1/2 అడుగుల వెడల్పు కలిగియుంది. దీనిని చూస్తే నాటి శిల్పుల కళానైపుణ్యం మనకు బోధపడుతుంది. ఈ రాతిమంచానికి మూడు తలదిండ్లు కూడా కలవు.

ముఖ్యంగా ఈ రాతిమంచానికి క్రింది భాగంలోగల గుర్తులను తిలకిస్తే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. రాతిమంచానికి క్రిందిభాగంలో మూడు పుష్పములు చిత్రీకరించబడినవి. మధ్యగల పుష్పానికి నాలుగువైపుల నాగసర్పం పడగ గుర్తులు, మిగిలిన రెండు పుష్పములకు నాలుగువైపుల రామచిలుకల గుర్తులు మలచబడియుండడం విశేషం.

ఈ రాతిమంచానికి కొద్దిదూరంలో బండపైన ఓ చిన్న శివాలయం వుంది. దీని ప్రక్కనే ఓ చిన్న దోణి వుంది. ఇందులో ప్రస్తుతం కొన్ని నీళ్ళున్నాయి. సామాన్యంగా మనం ఆలయాలకు ముందు భాగాన ధ్వజస్తంభములు ఉండడం చూస్తాం. అయితే ఈ శివాలయానికి పశ్చిమ భాగాన ధ్వజస్తంభం వుంది. ఈ శివాలయాన్ని గ్రామస్థులు బండెప్ప గుడి అని అంటున్నారు.



ఈ రాతిమంచాన్ని ముత్యపు మంచం అని కూడా కొంతమంది అంటున్నారు. బండెప్ప గుడికి పశ్చిమభాగానగల ధ్వజస్తంభంపై కూడా నాలుగు గుర్తులున్నాయి. 1) నాగసర్పం గుర్తు. 2) ఇద్దరు మొక్కే గుర్తు. 3) ఏనుగు గుర్తు. 4) ఒకరు కూర్చొన్న గుర్తు.

ఇంతేకాక ఈ శివాలయానికి కొద్ది దూరంలో బండపైన రెండు శిల్పాలు మలచబడ్డాయి. ఒకదానికి రెండు ప్రక్కల ధ్వజస్తంభాలున్నట్లు, మరొక విగ్రహం ప్రక్కన ఓ నాగసర్పం గుర్తులున్నాయి. ఇవి ఒక అడుగు ఎత్తున్నాయి.

ఈ రాతిమంచాన్ని బండెప్ప అనే మునీశ్వరుడు ఉపయోగించి యుండవచ్చునని కొందరు వృద్ధులు అన్నారు.

అద్భుతమైన, అపురూపమైన ఈ శిలామంచాన్ని పురాతత్త్వశాఖ పరిశీలించి, ప్రదర్శనశాలలో వుంచవలసిన అవసరం ఎంతైనా వుంది. బహుశా ఈ రాతిమంచాన్ని నాటి ప్రజలు ఏ స్వామి సేవకైనా ఉపయోగించారేమో?

ఈ రాతిమంచాన్ని ప్రదర్శనశాలకు చేర్చి పరిరక్షించినట్లయితే ఒక అపూర్వ కళాఖండాన్ని కాపాడినట్లవుతుంది. ఏ స్వామిదో ఈ రాతిమంచం? పురాతత్త్వశాఖ వారు పరిశీలించాలి. •

— జయసుమన్




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

పథకంలోని ముఖ్యాంశాలు :

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.

* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)

* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు

* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్యదాత తన వారితోసహా తిలకించవచ్చును.

* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.

* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.

* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆ యా దాతలకు తెలియచేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.



# బాలప్రబోధం



## కర్మఫలం

ఢాకినీపుర రాజ్యాన్ని కామపాలుడు పాలిస్తున్నాడు. గుణాఢ్యుడు ఆతని మంత్రి. ఓ తెల్లవారుజామున అ రాజు కో కల వచ్చింది. మెలకువ వచ్చిన సమయాన్ని రాజు గుర్తించాడు. సూర్యోదయానికి ఇంకా ఒక జాము వ్యవధి ఉంది. అంటే సద్యః ఫలితము లభించదన్నమాట. బహుశః దాని కితరుల తోడ్పాటు కూడా అవసరం కావచ్చు. తా నొక్కడే చేయగలడా? చేయ గలిగినా, అప్తమిత్రుడైన మంత్రి లేకుండా తా ననుభవించగలడా? తన కన్ని విష యాలలోనూ అన్ని విధాలా తోడుపడే ప్రాణ మిత్రుడు....

అను కొన్నంతలోనే గుణాఢ్యుడు రాజ దర్శనానికి వచ్చాడు. రాజ దర్శనానికి ఎవరికి పడితే వారికి, ఎప్పుడు పడితే అప్పుడు అవకాశం లేదు– మంత్రికి తప్ప. ఆ మంత్రి కూడా అనవసరంగా అకాలంలో



రాజును దర్శించి ఆయన సుఖానికి భంగం కలిగించడు. ఆ వచ్చిన గుణాఢ్యుణ్ణి ద్వారపాలకు లడ్డగించరు. ఐనా ద్వార పాలకుడు అంతఃపురంలో రాజుకు తన రాక ఎరిగించిన తరువాతే మంత్రి రాజ దర్శనం చేస్తాడు. నిజాని కట్లా చేయటం అనవసర మని రాజు భావించినా మంత్రి కిష్టం గదా అని సరిపెట్టుకొన్నాడు. ఈనాడు మంత్రి రాక విన్న క్షణాననే రాజు ద్వారం పైపు నడవసాగాడు. రాజు మంత్రిని చూశాడు. మంత్రి మొగంలో నూతనోత్సాహం వెలు గుతూ ఉంది. రాజ్యానికి శుభమైనదో, రాజైన తనకు మేలైనదో ఉంటే ఆ మంత్రి మొగం అట్లా వెలుగుతూ ఉంటుంది, అను కొన్నాడు రాజు.



గుణాఢ్యుడు రాజు మొగం చూచాడు. తాను పద్దెనిమిది సంవత్సరాలుగా రాజును సేవిస్తున్నాడు. ఇంత ఉత్సాహంగా రాజె ప్పుడూ లేడు. ఈలాగున తన కెప్పుడూ ఎదురు రాలేదు. బహుశః రాజ్యానికి శుభ మైనదో మంత్రినైన తనకు చెప్పవలసినదో ముఖ్యవార్త ఉండి ఉండాలి. మరి వెంటనే రమ్మని తనకు ఆజ్ఞ రాలేదే? ఇదేదో తెల్ల వారు జామున వచ్చిన ఆలోచనో, కలో అయ్యుండాలి. రాజు కాలకృత్యాలు తీర్చు కొని భగవత్ప్రార్థన చేసికొని నా కోసం ఎదురు చూస్తున్నాడన్నమాట. సూర్యో దయ కాలమందే అనుష్ఠానానంతరం రాజ దర్శనం చేసే అలవాటు తనకుంది. తనకు ఇబ్బంది కలుగకుండా ఉండాలని ఇంత వరకు ఆగాడు రాజు. ఆహా! ఏమి మిత్రుడు! తనరాక తెలిసి స్వయంగా ఎదురు వచ్చాడు, అనుకొంటూ రాజుకు నమస్కారం చేశాడు.

“మిత్రమా! జీవికాజీవుల్లా ఉన్న మనం ఒకరి కొకరం నమస్కరించుకోవటం అర్థం లేని ఆచారం” అన్నాడు రాజు. “రాజా! మీలో ఉన్న విష్ణువుకు నమస్కరించవల సిందే. “నా విష్ణుః పృథివీపతిః” అని పెద్ద

అంటారు. "అన్నాడు మంత్రి" మరి మీరు మాత్రం సామాన్యులా? అగ్నితుల్యులు కారా?" అన్నాడు రాజు. "కాగా చెప్పారు. దేవతలలో మీరు మొదట, నేను చివర. ఐతే క్రీడార్థం ఆ దేవతలంతా వర్తులాకారంగా నిలిచారనుకొంది. కొసలనున్న విష్ణువు, అగ్ని కలసుకోరా? అట్లాగే మనమిద్దరమూ, అన్నాడు మంత్రి. "ఎంత సేపు చెప్పినా మీ మాటలు విన సొంపుగా ఉంటాయి. మిమ్మల్ని చూచిన వెంటనే చెప్పాలనుకొన్న మాటలు మరిచిపోయాను. అన్నాడు రాజు. ఏదో కల వచ్చి ఉంటుంది." అన్నాడు. మంత్రి. "బృహస్పతులవంటివారు, మీకు నేను చెప్పాలా? బ్రాహ్మీ ముహూర్తంలో ఒక కల వచ్చింది. మన మిద్దరం ఆకాశ గమనం చేస్తున్నామట! కోరిన స్థలానికి పోతున్నామట" అన్నాడు రాజు.

"మహారాజా! మన మిద్దరం అంబ దర్శనం చేస్తున్నట్లు కల వచ్చింది. స్వప్న సమయం సమానం; కాబట్టి అంబ దయ వల్ల మనకు కామితార్థం ఫలిస్తుంది. ఐతే దానికి పండ్రెండు సంవత్సరాల వ్యవధి ఉంది ప్రభూ! నా కల ప్రకారం దానికి తల్లిదయ కావాలి. అనుమతిస్తే అరణ్య మధ్యంలో నెలకొని ఉన్న ఢాకినీ మాత దర్శనం చేసికొందాం" అన్నాడు మంత్రి.

అనుకొన్నదే తడవుగా గుర్రాలెక్కి వారు రాజధానికి పది యోజనాలున్న అమ్మవారి గుడికి వెళ్లారు. గుడిలో వృద్ధుడైన పూజారి కుమారభట్టు నిష్ఠగాజపంచేసి కొంటున్నాడు. ఘంటానాదం చేస్తే ఆయనకు సమాధి భంగం అవుతుందని ఆ రాజూ మంత్రీ అక్కడే కాలం గడుపుతున్నారు. పైన సూర్యభగవానుడు చండప్రచండంగా వెలుగుతున్నాడు. లోపల ఆ మంత్రికీ రాజుకూ ఆకలి దహించుకుపోతూంది. ఐనా పట్టువిడవకుండా అంబసన్నిధిలో వారు నిరాహారంగా ఉండిపోయారు. ఆకలిమాట మరిచిపోయారు. సాయంకాలమైంది. సూర్యుడస్తమిస్తున్నాడు. పూర్ణచంద్రుడుదయిస్తున్నాడు. పూజారి ధ్యానం ముగించి ఘంటానాదం చేశాడు. కళ్ళు మూసికొని ఆలోచిస్తున్న వారిద్దరూ దాన్ని అంబ పిలుపుగా భావించారు. పోయి మాతృసన్నిధిలో నిలబడ్డారు.

'అమ్మా! ఈ రోజంతా నా కన్నుల ముందు నాట్యం చేశావు. ఎనిమిదో ఏట ఉపనయనమై ఈ నీ సేవకు అంకిత మయ్యాను. ప్రతి పూర్ణిమనాడు నీ పరిపూర్ణ కటాక్షం ప్రదర్శిస్తున్నావు. ఈ లాగున ఎన్ని పూర్ణిమలు గడిచాయో? ఇంకా ఎన్ని గడవాలో?' అనుకొన్నాడు పూజారి మనసులో. అదే సమయంలో రాజు మంత్రి కూడా తల్లికి నమస్కరించారు. వారు తమ కలలను గుర్తుచేసికొన్నారు. తమకు కామగమనం కావాలని రాజు కోరాడు మనసులో. రాజు కోరిక తీరాలని మంత్రి ప్రార్థించాడు. 'పండ్రెండు సంవత్సరాలు' అని ఆ ముగ్గురికీ స్ఫురించింది.

పూజారి లెక్క వేసికొన్నాడు. మరి పండ్రెండు సంవత్సరాలు తాను తల్లిని సేవిస్తే వేయి పూర్ణిమలు దేవిని సేవించిన వాడౌతాడు. "తల్లీ! నేను పూర్వ పూర్వ జన్మలలో తెలిసీ తెలియకా ఏవేవో చిరుకోరికలు కోరి నిన్ను పూజించి ఉంటాను. నిజాని కవన్నీ బంధాలే అని ఇప్పుడు గ్రహించాను. అంబా! ముందు నన్నా బంధాల్నుంచి తప్పించు. అవన్నీ అనుభవించటానికి మళ్ళీ మళ్ళీ జన్మ లెత్తలేను మాతా! నారాయణీ! నాకు మోక్షం ప్రసాదించు. నీకు నారాయణుడికి భేదం లేదు' అనుకొన్నాడు.

రాజుకు ఈ పండ్రెండు సంవత్సరాలు తల్లిని సేవిస్తే తాను కోరే కామగమనం తమకు సిద్ధిస్తుందనిపించింది. ఈ పండ్రెండు సంవత్సరాలు రాజ్యం మంత్రికి ఒప్పగించి తాను దీక్షగా తల్లిని సేవించాలనుకొన్నాడు. ఆ మాట మంత్రికి చెప్పాడు. మంత్రి రాజాజ్ఞను పాలించటానికి తాను సిద్ధమే కాని తోడుగా తానుకూడా ఉంటే బాగుంటుందన్నాడు. నగరరక్షకుడూ, రాజు మేనమామా ఐన సర్వార్థ సిద్ధికి రాజ్యం బాధ్యత ఒప్పగించటం మేలన్నాడు. రాజంగీకరించాడు.

పదకొండు సంవత్సరాల పదకొండు నెలలూ పదకొండు రోజుల పదకొండు ఘడియల్లాగ గడిచిపోయాయి. పూజారి కుమారభట్టుకు తెల్లతెలవారే వేళ ఒక కల వచ్చింది. పూర్ణచంద్రుడు ఆకాశంలో పరిపూర్ణంగా ప్రకాశిస్తున్నాడు. ఇంతలో రెండు మేఘాలు ఎక్కడినుంచో కలిసివచ్చి ఆ చంద్రుణ్ణి కప్పివేశాయి. తాను అంధకారంలో కొట్టుమిట్టాడుతున్నాడు. అప్పుడు తనకు అంబ జ్ఞాపకానికి వచ్చింది. చల్లని గాలి వీచింది. మేఘాలు ఆకాశంలో చెట్టా పట్టాలు వేసికొని ఎట్లా వచ్చాయో అట్లా వెళ్ళిపోయాయి. ఒక్క చంద్రుడే వేయి చంద్రుల్లాగా వెన్నెలలు వెదజల్లాడు. మెలకువ వచ్చింది. కుమార భట్టు ఆలోచించాడు. తల్లి చెప్పిన చివరి సంవత్సరం చివరి నెలలో పడ్డాడు తాను. అతనికి నిత్యమూ పూర్ణిమలాగా ఉంది.

ఈ పండ్రెండు సంవత్సరాలూ కామపాల గుణాఢ్యులు దేశమంతా తిరిగారు. ప్రతి శక్తి ఆలయం దర్శించారు. అనేక విధాలైన అనుభూతుల్ని పొందారు. చివరి సంవత్సరంలో రాజుకు ఒక కల వచ్చింది- తనకు కామగమన సిద్ధి కలగటానికి సద్వంశ సంజాతుడు సకలశాస్త్ర పారంగతుడు అయిన బ్రాహ్మణుణ్ణి అతని సమ్మతితోనే అంబకు బలి ఇవ్వాలి, అని. రాజు తన కల మాట మంత్రికి చెప్పాడు. అప్పుడే మంత్రికిన్నీ ఒక కల వచ్చింది. తాను గుర్రమై రాజును దేశదేశాల త్రిప్పుచున్నాడు. రాజు మహావీరుడు శత్రువుల్ని జయించి విస్తార రాజ్యం సంపాదిస్తున్నాడు. మంత్రి తన కలమాట రాజుకు చెప్పాడు. ఆ సంవత్సరమంతా రాజూ మంత్రీ ఎన్నో అగ్రహారాలు తిరిగారు. సద్వంశ సంజాతునికి శాస్త్ర పరిచయమే లేదు. శాస్త్రపరిజ్ఞానం ఉన్నవాడు ప్రాణత్యాగానికి అంగీకరించలేదు. అంగీకరించే శాస్త్రపండితుడు సద్వంశ సంభూతుడు కాడు. ఈ లాగున వారిద్దరూ తిరిగి తిరిగి పండ్రెండు సంవత్సరాల క్రిందట ఏ శక్తి ఆలయం వదలి వెళ్ళారో ఆ శక్తి ఆలయం ప్రవేశించారు.

అలసిసొలసి వచ్చినవారికి పూజారి కుమారభట్టు స్వాగతంచెప్పాడు. ఆ రోజు వాళ్ళిద్దరూ వచ్చినప్పుడే తల్లి తనకు పండ్రెండు సంవత్సరాలు సేవించుమని సెలవిచ్చింది. రమారమి పండ్రెండు సంవత్సరాలైనా వారిద్దరిరాక, వారి ప్రసన్న వదనాలు భట్టు హృదయంలో భద్రంగా ముద్రవేసికొన్నాయి. వారున్నూ పూజారి కుమారభట్లు ఈ పండ్రెండు సంవత్సరాలు తల్లినెంతో భక్తిశ్రద్ధలతో పూజిస్తూ

అలయ పవిత్రతను కాపాడుతూ ఉన్నందుకు సంతోషించారు. ముఖ్యంగా చాలా వృద్ధుడైన ఆ పూజారి తమ కోసమే ఎదురు చూస్తున్నట్లు అంబప్రసాదాన్ని అందించటానికే ఎదురు వస్తున్నట్లు ఆనందించారు.

నాడు పూర్ణిమ దానితో రాజుకు దీక్ష పూర్తి అవుతుంది. ఢాకినీమాత సన్నిధిలో మంత్రి రాజు కిట్లా మనవి చేశాడు. "ఓ రాజా! నీ కోరిక తీరే సమయ మాసన్నమైంది. నాకు వచ్చిన కలలు రెండూ ఈ ఫలితాన్నే సూచిస్తున్నాయి. నీకు తల్లి సూచించిన సద్వంశ సంజాతుడు సకలశాస్త్ర పారంగతుడు ఐన బ్రాహ్మణుణ్ణి నేనే అని చెప్తే అహంకారం అనుకోవు. మా వంశం ఎంతో కాలంగా మీ వంశాన్ని సేవిస్తూ ఉంది. అంబకు నన్ను నేను అర్పించుకొంటున్నాను. మీరు చేయవలసిందల్లా నివేదనే?" రాజుకు కళ్లల్లో నీళ్ళు నిలిచాయి. మంత్రి అవి ఆనందబాష్పాలను కొన్నాడు. కాని రాజు కవి దుఃఖబాష్పాలు. 'మిత్రమా! ఎన్ని జన్మలనుండి మనము కలిసి మెలిసి జీవిస్తున్నామో! ఇప్పుడు నా స్వార్థంకోసం నిన్ను, సద్వంశ సంజాతుణ్ణి, సకలశాస్త్రపారంగతుణ్ణి చంపి మహానరక మనుభవించనా? వద్దు, మిత్రమా, వద్దు. నీవు సకల సద్గుణ గరిష్ఠుడివి. నిజానికి ఈ ఫలం నీవు పొందాలి. కాని తల్లి బ్రాహ్మణుణ్ణే బలికోరటంవల్ల నేను అయోగ్యుణ్ణి అనర్హుణ్ణి ఐనాను. అంత మాత్రంచేత నిన్ను వదలి నాకు కలుగబోయే ఫలం – కామగమనమే కాదు, ఎంత గొప్పదైనా – ఒంటరిగా అనుభవించలేను. అన్నాడు రాజు.

పూజారి కుమారభట్టు వాళ్ళ సంభాషణ విన్నాడు. 'వాళ్ళెంత మంచివాళ్ళు! వాళ్ళ కోరిక కామగమనమా? దానికి తల్లి సద్వంశ సంజాతుడూ సకలశాస్త్ర పారంగతుడూ ఐన బ్రాహ్మణుణ్ణి బలి కోరిందా? పరమ దయామయి భక్తుల రక్తం కోరుతుందా? బ్రాహ్మణుడు నాకు పూజ్యుడు అని అగ్నిద్యోతనుణ్ణి సేవించి నిరూపించాడే శ్రీకృష్ణుడు! అటువంటిది బ్రాహ్మణ రక్తమే కావాలని నారాయణి చెప్తుందా?' అనుకొన్నాడు కుమారభట్టు. అతనికి ఒళ్లు మరపు వచ్చింది. తల్లి వచ్చి తల నిమిరి నట్లైంది. ఆమె తన్ను ఆశీర్వదిస్తూంది. ఆ తల్లికి మనసా తన్ను తాను అర్పణ చేసికొన్నాడు.

కుమారభట్టుకు ఒళ్ళు తెలిసింది. రాజూ మంత్రీ ఇంకా వాదించుకొంటూనే ఉన్నారు. 'అయ్యా! మీ ఉభయుల స్నేహం చాలా దొడ్డది. మీ కోరికను తీర్చటానికి తల్లి సిద్ధంగా ఉంది. నాకు నేటితో వేయిపూర్ణిమలు తల్లినిసేవించిన ఫలం సిద్ధిస్తోంది. నాకువేరే కోరికలేదు. నన్ను తల్లికి అర్పించుకొంటున్నాను. ఆ ఫలం మీకు సిద్ధించుగాక!" అన్నాడు. అప్పుడు రాజన్నాడు కదా 'ఓ బ్రాహ్మణోత్తమా! తల్లి కోరిన సద్బ్రాహ్మణుడు మీరే కాబోలు! మీ సమర్పణ భావానికి జోహార్లు, కాని ఒక్క మనవి, నా మన సెందుకో సర్వప్రపంచం తిరిగి రావాలని కోరుతోంది. మీ ప్రాణం అమూల్యమైంది, దానికి వెల కట్టడం అపరాధం. ఐనా చంద్రుడికి నూలు పోగన్నట్లు నారాజ్యం సర్వం మీకు ధార పోస్తున్నాను, అని.

దానికి కుమారభట్టు నవ్వి, 'రాజా! చనిపోయిన తరువాత నాకీ జంజాటం ఎందుకు? నీ రాజ్యమే కాదు పరశురాముడు కశ్యపుడికిచ్చినట్లు సర్వ భూమండలం ఇచ్చినా వద్దు. ఆ తల్లే వచ్చి స్వర్గం ఇస్తానన్నా వద్దు. నాకేమి తగునో ఆ తల్లికి తెలియదా?' అన్నాడు. అప్పుడు గుణాఢ్యు డందుకొని 'సంపాదించేవాళ్ళు చనిపోతామని మానేస్తున్నారా?' అన్నాడు. "వాళ్ళకు పెళ్ళాం బిడ్డ లుండవచ్చు. మరి నాకు పెళ్ళే కాలేదే! తల్లీ దండ్రీ ముందే గతించారు. పేదవాణ్ణి కాబట్టి బంధువు లెవరో నాకు తెలియనే తెలియదు. ఈ రాజ్యం తీసికొని నే నెవరికీయను? అన్నాడుభట్టు. "పోనీ ఎవరికైనా దానం చేయండి" అన్నాడు మంత్రి. "బాబూ! సులభంగా చెప్పావుకాని, కోరికలు కోరిచేస్తే దానం కూడా బంధమే కదా!" అన్నాడు భట్టు. "మీరు పరమయోగి పుంగవులు యోగాన్నవలంబించి ప్రాణత్యాగం చేయకలరు గదా! మరి బలి కావాలనుకొంటున్నారెందుకు?" సందేహం వెలిబుచ్చాడు మంత్రి, "ఏదో స్వయం కృతం ఐ ఉంటుంది. తెలిసో తెలియకో ఇటువంటివే ఏ జన్మలోనో చేసి ఉంటాను. నీకు తెలియనిదేముంది? 'యథా కామో భవతి తత్ క్రతుర్భవతి, యత్క్రతుర్భవతి తత్ కర్మ కురుతే, యత్ కర్మ కురుతే తదభిసంపద్యతే' అన్నారు కదా! అంటే కోరికనుబట్టి సంకల్పమూ, దాన్నిబట్టి కర్మ, కర్మనుబట్టి ఫలమూ కలుగుతాయి. కాబట్టి ఫలము సత్ఫలము కావాలంటే కామము అంటే కోరిక మంచిదికావాలి, మోక్షమొక్కటే సత్ఫలం. దానికి సంబంధించిందే మంచికోరిక" అన్నాడు భట్టు. అప్పుడు "మీరుభయులు సకల శాస్త్ర పారంగతులు, మీ కెవరు చెప్పగలరు! ఆ తల్లే వచ్చి చెప్పాలి" అన్నాడు రాజు.

అన్నట్లే వచ్చింది ఢాకినీ దేవి. ఆమె అన్నదిగదా! "ఓ బ్రాహ్మణోత్తమా! క్రిందటి జన్మలో నీవు రాజువు, ప్రాప్తి ప్రాకామ్యాలను కోరి రెండు గొర్రెలను బలి ఇచ్చావు. ఆ గొర్రెలే వీరుడుగా వాని గుర్రంగా తరువాతి జన్మలో జన్మించాయి" అని. రాజు మంత్రి ఆశ్చర్యపోతున్నారు. మంత్రి తనకు సంవత్సరం క్రింద వచ్చిన కలను గుర్తుచేసుకొన్నాడు. రాజు మంత్రి కళ్ల మెరుపు గ్రహించాడు. మళ్లీ అంబ అన్నదిగదా! 'బలి బలినే కోరుతుంది. కాబట్టే వారికొరకు నీవు ప్రాణత్యాగం చేయాలనుకొంటున్నావ్. ఐతే వారే నిన్ను బలిచేయాలని ఎందుకు కోరుకొంటున్నావు? అంటే నీ క్రిందటి జన్మలో ఆ గొర్రెల్ని కనురెప్పపాటులో తల మెడ వేరు చేశావు గదా! ఆ గొర్రెలే వీరుడుగా గుర్రంగా మొదట జన్మించి మరుసటి జన్మలో రాజు మంత్రిగా వచ్చాయి. కాబట్టి నీవు కోరినా కోరకున్నా వీరు అదే పని చేస్తారు.'

అంబ ఇట్లా అంటూ ఉండగానే రాజు కత్తి పూజారి మెడమీద పడ్డది. పూజారి శిరస్సు విరిసిన ఎర్రతామర పువ్వులాగా అమ్మ పాదాల కడ ఎగిరి పడింది. అప్పటికే రాజు ఆకాశంలో ఉన్నాడు, చేసేది లేక మంత్రి మనసులో "కర్మణా బధ్యతే జన్తుః," అనుకొంటూ రాజునను సరించాడు.

— చిట్టా దామోదరశాస్త్రి

(14వ పేజి తరువాయి)

గింది. ఇక్ష్వాకులను పురాణాలలో శ్రీపర్వతీయాంధ్రులనీ, ఆంధ్రశాతవాహన భృత్యులనీ పేర్కొన్నారు.



అమ్మణ్ణమ్మ దేవాలయం

## అనుబంధ ఆలయాలు

ఆలయానికి వాయవ్యదిశలో "అమ్మణ్ణమ్మ" ఆలయం, దక్షిణాభిముఖంగా దేవసేన, వల్లీసమేత కార్తికేయ స్వామి ఆలయం, తూర్పుదిశాభిముఖంగా సూర్యనారాయణస్వామి ఆలయం వున్నాయి. ఇవన్నీ చోళరాజుల సామ్రాజ్యకాలానికి చెందినవని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

## చారిత్రకాధారాలు - శిలాశాసనాలు

ప్రవేశద్వారం, ఆలయంలోవున్న బావి క్రీ. శ. 13, 14 శతాబ్దాలకు చెందినవి. ఆలయకుడ్యాలపైన, శిలాఫలకాలపైన అనేక దానశాసనాలున్నాయి. విచిత్రమేమిటంటే ఈ శాసనాలలో "గుడిమల్లం" అను గ్రామ నామం ఎక్కడ పేర్కొనబడలేదు. పరశురామేశ్వరాలయ ప్రసక్తి మాత్రం ఈ శాసనాలలో కనిపిస్తుంది. ఒకచోట ఆలయపరిసర గ్రామాన్ని "విప్పిరమ్‌పేడు" గాపేర్కొనడం జరిగింది. 'విప్పిరమ్‌పేడు' అంటే విప్రపీఠం అని అర్థం.

ఇక్కడి శాసనాలు చాలవరకూ గ్రంథ లిపిలో వున్నాయి. ఆలయంలో నిత్య సేవా కైంకర్యాలకు వివిధ కాలాలలో వేరువేరు వ్యక్తులు ఇచ్చిన భూ, ధన, ధాన్య, వస్తు వాహనాలకు సంబంధించి ఈ శాసనాలు వేయబడ్డాయి. క్రీ.శ.897-905 మధ్యకాలంలో బాణరాజులు, చోళరాజులు ఈ శాసనాలను ఎక్కువగా వేయించారు. శాసనాలలో పేర్కొన్న సంవత్సరాలను బట్టి ఇవి చోళరాజు విక్రమ చోళుడు, రాజరాజుల పరిపాలనా కాలాలకు చెందినవిగా భావించడం జరిగింది. ఇవి గాక క్రీ. శ. 1346 కు చెందిన యాదవ దేవరాయల శాసనాలు కొన్ని కనిపిస్తున్నాయి. బహుశా ఈ యాదవ దేవరాయలు, రేచయ దండనాయకుని కుమారుడైన శ్రీరంగనాథ యాదవదేవరాయలు కావచ్చును.

క్రీ. శ. 1125 లో శిథిలమైన ఆలయం స్థానే నూతనంగా పునర్నిర్మాణ కార్యక్రమాలు జరిగాయని చెప్పడానికి ప్రబలమైన ఆధారాలు వున్నాయి. ఈ సమయంలోనే మండపం 'ముఖద్వారం' కుడ్యస్తంభ విశేషాలతో నిర్మించిన ద్వార శాల నిర్మితమైనట్లు తెలుస్తున్నది.

అపురూపమైన శివలింగాకృతికీ, విశిష్టమైన చారిత్రక ప్రాభవానికీ ఉనికిపట్టయిన గుడిమల్లం పరశురామేశ్వరక్షేత్రం కళాహృదయులకు, పరిశోధకులకు దర్శనీయ ప్రదేశం.

— శ్రీపాయసం సుబ్రహ్మణ్యం

# రామ్ జనార్దన మందిరం

చారిత్రాత్మక పుణ్యస్థలమైన ఉజ్జయిని నగరమందు వందలకొలది దేవాలయాలు వున్నవి. అందు, అతిముఖ్యమైన కొన్నింటిలో రాయ్-జనార్దన్ (మందిర్) దేవాలయం ఒకటి. ఇది నగరానికి 4 కి. మీ. దూరములో వెలసివున్నది. సుమారు 5 ఎకరముల స్థలములో, రామ, లక్ష్మణ, సీత విగ్రహాలున్న రామ దేవాలయం, జనార్దన విష్ణు విగ్రహమున్న జనార్దన దేవాలయం ప్రక్కప్రక్కన నిర్మించబడినవి. కళాత్మకముగా పేరుగాంచిన ఉజ్జయిని దేవాలయాలలో ఈ మిత్ర దేవాలయం కూడా వున్నవి.

ఈ మందిరములు క్రీ. శ. 17 వ శతాబ్దములో 9 అడుగుల ఎత్తుగల పునాదిపైన నిర్మించబడి వున్నవి. వీటిని కట్టించినవారు 'మీర్జా రాజా జయసింగ్.' ఈ రెండు దేవాలయాల మధ్యదూరము 21 అడుగులు.

## ప్రాధాన్యత

ఈ ఆలయములోని ప్రతిమలు క్రీ. శ. 10-12 శతాబ్దములకు చెందినవి. దేవాలయం క్రీ. శ. 17 శతాబ్దమునకు చెందినది. ఈ విగ్రహాల దృష్ట్యా ఈ ఆలయం చరిత్రాత్మకముగా గొప్పది. కళాత్మకముగా పేరుగాంచినది. ఈ దేవాలయాలలో మరాఠీ చిత్రాలు, వివిధ రంగులలో కన్పించడం విశేషం.

ప్రాకారం చాల పెద్దదిగా కోటగోడవలె కట్టబడినది. ఇది క్రీ. శ. 18 వ శతాబ్దమునకు చెందినది.

## రామ్ మందిరము

ముఖమంటపంలో హనుమంతుని విగ్రహం ముఖ్యప్రతిమకు ప్రతిముఖంగా చిన్న గోపురంలో ప్రతిష్ఠింపబడి వున్నది. ముఖమంటపద్వారం మీద ఇరువైపుల ద్వారపాలక విగ్రహాలు కన్పిస్తాయి.

మహామంటపం షడ్భుజాకారంలో నిర్మింపబడినది. ఈ మంటపం 18 స్తంభాలతో విశాలముగా వుంటుంది. మంటప ఊర్ధ్వభాగం గోళాకార నిర్మితము.

అంతరాళం చాల చిన్నది. అంతరాళం గోడలమీద ఎడమవైపున వున్న శేషశాయి విష్ణుప్రతిమ చాల కళాత్మకముగా చెక్కబడియున్నది. ఇది క్రీ.శ. 10వ శతాబ్దమునకు చెందినది. కుడివైపున వున్న బ్రహ్మ, విష్ణు మహేశ్వర విగ్రహాలు క్రీ. శ. 12 వ శతాబ్దానికి చెందినవి. ఇవి చాల కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తాయి.

గర్భగృహం చతురస్రాకార నిర్మితం. గర్భగృహద్వారం మీద లక్ష్మి, విష్ణు, వినాయకుడు, కృష్ణుడు గోపికల చిత్రాలు దర్శనమిస్తాయి. గర్భగృహంలో రామ, లక్ష్మణ సీత విగ్రహాలు ప్రతిష్ఠింపబడి వున్నవి. గోడలమీద పై భాగంలో మరాఠీ చిత్రాలు అద్భుతముగా కన్పిస్తాయి. ఇవికాక రాముని విద్యాభ్యాస చిత్రాలు కూడా కన్పించడం విశేషం. ఈ చిత్రాలు క్రీ. శ. 18 వ శతాబ్దమునకు చెందినవి.

గర్భగృహ గోపురం 'నాగర' శైలిలో నిర్మింపబడి వున్నది. గోపురంపైన ఏక



రామ్ మందిరం

జనార్దన్ మందిరం

కలశం దర్శనమిస్తుంది. అష్ట భుజ శిఖరం. దేవాలయం చుట్టూ ప్రదక్షిణాపథం కలదు. ముఖ్యాలయం వెనుక భాగంలో క్రింద వైపున ఏనుగుబొమ్మలు చెక్కబడి వున్నవి.

## జనార్దన్ మందిరం

ఈ మందిరం 'నాగర' శైలిలో నిర్మింప బడినది. దేవాలయం ముందు నిర్మితమై వున్న కొలను క్రీ. శ. 18వ శతాబ్దమునకు చెందినది. కొలను లోపల భాగం వరకు నాలుగు వైపులుగా మెట్లుకట్టబడి వుండటం విశేషం.

ముఖమంటపం ద్వారం మీద వినాయక విగ్రహం మరియు ద్వారపాలక ప్రతిమలు దర్శన మిస్తాయి. సభామంటపం షడ్భుజా కారంలో గోళాకార గోపురం కల్గివుంటుంది. సభామంటపంలో ముఖద్వారం కాక, మరి రెండు చిన్నద్వారములు కన్పిస్తాయి. 18 స్తంభాలు వివిధ సుందరుల ఆకృతులు కల్గి ఉంటాయి. గోపుర అంతర్భాగం అనేక దేవతాకారాలతో నిండి వుంటుంది.

అంతరాళం చిన్నది. కుడివైపు గోడమీద శివపార్వతి విగ్రహం, ఎడమవైపు వినాయక విగ్రహం దర్శన మిస్తాయి.

గర్భగృహం చతురస్రాకారము, గోపురం లోపలిభాగం అష్టభుజ ఆకృతికల్గివుంటుంది. 'జనార్దన – విష్ణు' విగ్రహం ఇందు ప్రతిష్ఠింపబడి వుంటుంది. ముందు శ్రీకృష్ణుని విగ్రహం కూడా దర్శన మిస్తుంది. గర్భ గృహం గోడలపై మరాఠీ చిత్రాలు మరియు "బొదల్యా బూ మహరాజ", 'సంత్ తుకోబా' చిత్రాలు సుందరంగా అలంకరింప బడి వున్నవి. ఇవి మంచి అనుభూతిని కల్గిస్తాయి. శిఖరంపై 'పద్మాకార' కలశం దర్శన మిస్తుంది.

## ఇతర ప్రతిమలు

ఈ దేవాలయం కుడిప్రక్క దిగువ భాగంలో 'గోవర్ధన ధారి కృష్ణ' ప్రతిమ దర్శన మిస్తుంది. ఇది క్రీ.శ. 11వ శతాబ్దం నాటి ప్రతిమ మరియు కళాత్మకముగా విశిష్టత కల్గినది.

ఈ దేవాలయం వెనుక భాగాన 'హనుమంతుని' దేవాలయం ఈ మధ్య కాలం లోనే, క్రీ. శ. 19వ శతాబ్దంలో కట్టబడినది.

— శ్రీ గుంటక విజయభాస్కర రెడ్డి

---

# దివ్యమంత్రపంచకము

(గతసంచిక తరువాయి)

"నాచే చెప్పబడిన అనేక ధర్మము లను పాటింపలేకపోయినను, యీ ఒక్క ధర్మమును మాత్రము తప్పక పాటింపుము. ఒక్కడైన నాకు శరణు జెందుము. అట్టి యెడ నేను నిన్ను సకల పాపములనుండి విముక్తుని జేయుదును, శోకింపకుము" అని యీ శ్లోకభావము.

కాని, యీ శ్లోక ఫలితార్థమును గమ నింప దగియున్నది–

"సర్వధర్మములలో శ్రేష్ఠమయిన ధర్మము స్వార్థరాహిత్యము. ఇయ్యది నిన్ను సకల పాపములనుండి దూరముగా నుంచును. శోకింపకుము'' అని ఫలి తార్థము.

శరణాగతి భావమున, ప్రపత్తిభావమున చేతనునకు స్వార్థరాహిత్యభావము అలవ డును. స్వార్థరాహిత్యుడు చేయదగు పాప ముండదు. మానవుడు చేయు యే పాప కార్యమునకును స్వార్థభావము మూలమై నది. స్వార్థరహితుడు లోకకల్యాణార్థము కృషిచేయును. సేవా భావము స్వార్థ రాహిత్యభావమున జనించును.. స్వార్థ రాహిత్యుడు యే పాపమును చేయుడు. ఎల్లప్పుడు మోక్షభావమున పరమానంద మున నుండును.

ఈ శ్లోకము యెంతటి నైర్మల్య జీవిత మునకు మార్గదర్శియో గమనింపుడు. స్వార్థ రహితుడు కర్మఫలత్యాగి. మానవులు కర్మ ఫల త్యాగులుగా నున్నయెడల సంఘము యెంతటి ఆనంద స్థితియందుండునో కదా!

సక్తాః కర్మణ్యవిద్వాంసో
యథా కుర్వంతి భారత,
కుర్యా ద్విద్వాం స్తథాసక్త
శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్. (3-25 గీత)

సామాన్య జనుడు సంగయుక్తుడై, స్వార్థపరుడై, కర్మల జేయును. పండితు డైనవాడు సంగరహితుడై, స్వార్థరహిత భావముతో లోకకల్యాణార్థము కర్మల జేయును.

విద్యావంతునకు అవిద్యావంతునకున్న తేడా యిదే. భక్తి(ప్రేమ)యుక్తునకును, భక్తిరహితునకున్న తేడా యిదియే. స్వార్థ పరునకును, స్వార్థరహితునకును మధ్య గలట్టి భేదము యిదియే.

గీతా చరమశ్లోకము యిట్టి స్వార్థ రహిత సేవాభావములను ప్రబోధించు చున్నది గాన చరమశ్లోకమని ప్రసిద్ధి గాంచినది. చరమశ్లోకభావము సామ్యవాద మును, సమతా రాజ్యమును పెంపొం దించుటకు యెట్టి శక్తిని గలిగియున్నదో గమనింపుడు.

భగవద్గీత పురాణకాలమున వ్యాసమహ ర్షిచే రచియింపబడినను, శ్రీరామానుజుని కాలము వరకును చరమశ్లోకము గుప్త ముగానుండెను. గీతాచరమ విషయం బెయ్యది అను సమస్య భక్తులను, ఆధ్యా త్మిక జ్ఞానులను చాలకాలము వేధించుచునే యుండెను.

శ్రీమద్రామానుజునకు షుమారు 150 సంవత్సరములకు పూర్వము జీవించిన ఆది శంకరాచార్యులవారు ప్రథమముగా గీతా భాష్యమును రచించినవారై యీ క్రిందిది గీతా చరమ శ్లోకముగా నిర్ణ యించిరి.

మత్కర్మకృన్మత్పరమో
మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు
య స్స మామేతి పాండవ.

"కేవలము నా నిమిత్తమే కర్మలు చేయువాడును, నేనే పరమ దైవముగా గలవాడును, నాకు భక్తుడును, సంగవర్జి తుడును, సకల భూతముల యందును వైరములేని వాడును అయి యెవ్వడుం డునో వాడు నన్ను పొందును," అని తాత్పర్యము.



గీతా పదునొకండవ అధ్యాయములోని కడపటి శ్లోకమయిన యిది చరమ శ్లోకమయితే, యిక గీతలోని తక్కిన యేడు అధ్యాయముల (12-18) యొక్క ప్రయోజనం బెయ్యది అనెడు సమస్య మరలా జిజ్ఞాసులను వేధించుచూ వచ్చినది.

కడకు శ్రీమద్రామానుజాచార్యులవారు (1017-1137 క్రీ. శ.) తన గీతాభాష్యమున "సర్వధర్మాన్—") అను శ్లోకమును (18-66) చరమశ్లోకముగా నిర్ణయించిరి. శరణాగతి, స్వార్థరాహిత్య సేవాభావము అను ప్రబోధించు తన విశిష్టాద్వైత సిద్ధాంతమును సమర్థించుచున్నదీ చరమశ్లోకము. మరియు యీ శ్లోకముతోనే గీతాచార్యుడు ప్రబోధించు జ్ఞానము సమాప్తికి వస్తుంది. శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు అను త్రిమతాచార్యులు వేర్వేరుగా భగవద్గీతకు భాష్యములు వ్రాసినను, భాష్యకార్లు అను తిరునామము శ్రీరామానుజాచార్యులవారికే అబ్బినది.

రహస్యముగా పెట్టబడిన తిరుమంత్ర జ్ఞానమే చరమ శ్లోక భావము. ఒక విధముగా చెప్పాలంటే గీతాచరమ శ్లోక క్లుప్త రూపము తిరుమంత్ర మవుతుంది. తిరుమంత్రముయొక్క విస్తరణ చరమశ్లోక మవుతుంది. అందువలన కొందరు భక్తులు అ (ష్టా) క్షరీ మంత్రమునే గాక గీతాచరమ శ్లోకమును గూడా తిరుమంత్రమంటారు. ఇది నిజముగా సమర్థనీయమే.

రహస్యముగా పెట్టబడిన యీ జ్ఞానమును శ్రీ రామానుజుడు, యామునాచార్యులు తన మరణమునకు పూర్వము ఆజ్ఞాపించిన ప్రకారము, యామునాచార్యుని శిష్యరత్నమగు తిరుక్కోట్టియూర్ నంబి (గోష్ఠీపూర్ణుడు) నుండి పొందెను. గురువు యీ విషయమును రహస్యముగా నుంచమని రామానుజుని ఆజ్ఞాపించినను, రామానుజుడు తిరుక్కోట్టియూర్‌లోని విష్ణు దేవాలయ శిఖరము నధిరోహించి, తిరుమంత్ర జ్ఞానమును, అనగా అష్టాక్షరీమంత్రమును, గీతా చరమశ్లోకమును యెల్లవారికి అన్ని వర్ణముల వారికి, వెల్లడించెను. సర్వులు మోక్షభావము ననుభవింపవలయునని దయాసముద్రుడు రామానుజుడు ఉద్దేశించినాడు. అందువలననేగదా శ్రీరామానుజుని భక్తులు యిట్లు ప్రశంసించిరి:-

ఏకైక పూరుష సురక్షిత వంశరీత్యా
గుప్తా ప్రపత్తి పదవీవురుపైః పురాణైః
రామాను జస్తు పరయా
దయయా దయాళుః
సీమామిమా మతియయౌ
జగతాం హితాయ.

ఇట్టి దయార్ద్ర హృదయుడును, ఉదార స్వభావుడును అయిన శ్రీ రామానుజుడు మైసూరు రాష్ట్రమున తిరునారాయణ పురమున (మేల్‌కోట) పంచములనబడు వారికెల్లరకును దేవాలయ ప్రవేశమును కలుగజేసిన వారైరి. మీదు మిక్కిలి అన్యమతస్థురాలయిన సుల్తాన్ కుమార్తె బీబీని ఋషి తుల్యగా భావించి ఆమెకు తిరునారాయణ పుర దేవాలయమున నివాసము నేర్పరచెను. ఆమెయే బీబీనాంచియార్, ఆమెను ఆండాళ్‌తో సమానముగా అభివర్ణించినాడు శ్రీరామానుజుడు. రామానుజుడిట్టి ఉదార స్వభావుడు! ఆచార్యులు పీఠాధిపతులు వాస్తవముగా ఆ యుదార ధర్మముల నేల పాటింపరు ? !

శ్రీరామానుజాచార్యుల కాలమున తిరుమలేశ విగ్రహము శైవ విగ్రహమా, వైష్ణవ విగ్రహమా అను పోరాటముకాగా, శ్రీరామానుజుడు అప్పుడు నారాయణవనము రాజు అధ్యక్షించిన సభలో వైష్ణవుల తరపున వాదించి, శైవుల నాయకుడును భక్తుడును అయిన శివజ్ఞాన పెరుమాళ్‌ను తన వాదముచే ఒప్పించి, తిరుమలేశ దేవాలయము వైష్ణవాలయమని నిర్ణయించి, అమలు పరుపబడినట్లు గావించెను.

అట్టి తరి శ్రీరామానుజుడు తిరుమలేశ విగ్రహమునకు శంఖచక్రముల సమకూర్చి ఊర్ధ్వపుండ్ర ధారణకలుగ జేయుటయే గాక, తిరుమలేశ, విగ్రహమునకు ఉన్న రెండు హస్తములుగాక, మరి రెండు హస్తములను కలుగజేసి తిరుమలేశుని చతుర్భుజునిగా జేసెను.

ఈ నూత్నముగా యేర్పాటు చేయబడిన హస్తములు ఉపాయ అభయ హస్తము లంటారు.

ఉపాయ హస్తము తన పాదమును సూచించుచూ, చరమ శ్లోకము యొక్క మొదటి పాదార్థమును తెల్పుచున్నది. అభయ హస్తము చరమ శ్లోకము యొక్క రెండవ పాదార్థమును తెలుపుచున్నది, ఉపాయ అభయములతో గూడినది చరమ శ్లోకము, ఉపాయ అభయహస్తములతో గూడినది తిరుమలేశ విగ్రహము, అందువలన శ్రీనివాసుడు వేంకటేశ్వరుడయినాడు. వేం=పాపమును, కట=నాశనముచేయు, ఈశ్వరుడు=స్వామి.

అరిదువలన శ్రీవేంకటేశ్వరుడు గీతా చరమ శ్లోకార్థ ప్రదాతయైనాడు. శ్రీవేంకటేశ్వర విగ్రహ దర్శనమనగా ఒకసారి గీతా చరమ శ్లోక భావమును స్ఫురణకు దెచ్చుకొనుటయగును. శ్రీ వేంకటేశ్వర విగ్రహ ప్రాశస్త్య మిట్టిదని భక్తులు గమనింతురు గాక! ఈ స్వామి విగ్రహము యిట్టి సత్యమునకు సాంకేతికముగా నున్నది.

శ్రీకృష్ణుడు గీతా ప్రదాత అయితే, శ్రీరామానుజుడు గీతా చరమ శ్లోక ప్రదాత; శ్రీ వేంకటేశ్వరస్వామి దివ్య విగ్రహరాజము గీతా చరమ శ్లోకార్థ ప్రదాత అవుతుంది. భావము అక్షరముల ద్వారా ప్రదర్శింపబడ్డట్లు, భావము శిల్పము ద్వారా ప్రదర్శింపబడినది తిరుమలేశ విగ్రహమున. తిరుమలేశ అర్చావతార ప్రయోజనము గీతా చరమ శ్లోకార్థమును చేతనులకు ప్రచారముచేయుట అగును. తిరుమలేశ గర్భగుడియందు స్వామి విగ్రహముపైన గోడపై గీతాచరమ శ్లోకమును సువర్ణ రత్నములతో లిఖింపజేయడము భావ్యముగదా!

గీతా చరమ శ్లోకము యిట్టి విశిష్ట విజ్ఞానమును ఒసంగుచున్నది.

గీతా చరమ శ్లోకార్థ ప్రదాత శ్రీ వేంకటేశ్వరస్వామి. *

—శ్రీ టి. రాఘవయ్య

కస్తూరీతిలకం లలాటఫలకే,— అనే శ్లోకాన్ని సాధారణంగా మనలో విననివారుండరు. హిందూమతానికి శిఖాయజ్ఞోపవీతతిలకాలుముఖ్యచిహ్నాలు. వానిలోయజ్ఞోపవీతం కొన్ని వర్ణాలకు మాత్రమే పరిమితం. సన్న్యాసులు వీరశైవులుగూడా దాన్ని త్యజించినా తిలకాన్నిమాత్రం విడువలేదు. అది అన్ని మతాలకు స్త్రీ, పురుష వివక్షతలేకుండా సమానంగా ఆదరణీయ మయి నేటికీ నిలిచింది.

తిలకానికిగల పరమప్రయోజనం మత వ్యక్తీకరణం. వైదికులు భస్మంతో ఓ ఊర్ధ్వపుండ్రం దానిపై అడ్డంగా మూడు

నేటి చట్టంలాయర్లకు నల్లకోటు, పోలీసు వారికి ఖాకీడ్రస్సు విధించింది. అంతేగాక ఆ శాఖలో వారి వారి కేడరు ననుసరించి బాహుపురులు, నక్షత్రధారణం ఏర్పాటు చేసింది. ఆ గుర్తులవల్ల వారెక్కడికి వెళ్ళినా ఎదుటివారు, వారి నెరిగి తగిన రీతిగా మర్యాద లిచ్చే అవకాశం ఉంది.

మనం ధరించే తిలకం, ఇంకా ఇతర మతచిహ్నాలైన యజ్ఞోపవీతం, లింగధారణం, తులసీ, రుద్రాక్షమాలలు, మొదలైనవి సంఘంలో ఒకనాడీ ప్రయోజనాన్ని నెరవేర్చాయి.

అంతేగాక వానికి కేవలమీ లౌకిక ప్రయోజనమే గాదు ఉన్నతమైన ఆధ్యాత్మిక సంకే

తాలు, కటిపైగల పృష్ఠభాగం అనే ప్రదేశాలలో గూడ మన మతచిహ్నాలు ధరించవలసి ఉంది. వీనిలో ఎక్కడ ధరించకున్నా నుదుట మాత్రం తప్పదు.

రంగునుబట్టి సాకారుడైన బ్రహ్మ ఎఱుపు అందువల్ల అతని స్థానంలో ధరించే మత చిహ్నాలైన తిలకంలో ఎఱుపు రంగుకు ప్రాధాన్యము లభించింది. దీనికి మరో రహస్యంగూడా ఉంది. మన హృదయకోశంలో నివసించే జీవుడు జ్యోతి స్వరూపుడు. అతనిని మంత్రపుష్పం—

"నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" —— అని వర్ణించింది.




తిర్యక్పుండ్రాలు వానిపై కుంకుమ బొట్టు ధరిస్తారు. శైవులుకేవలం తిర్యక్పుండ్రాలు, వైష్ణవులూర్ధ్వపుండ్రాలు మాత్రమే పెడతారు. ఊర్ధ్వపుండ్రాలలో మాధ్వులు రెండు రేఖలు మాత్రమే ధరిస్తే తెంగల వైష్ణవులు తాము ధరించే మూడు రేఖలక్రింద మరో పాదరేఖ పెడతారు. పంచాననులు చందనంతో చంద్రరేఖలు, వైశ్యులు ఓ గంధం చుక్క, దానిపై కుంకుమ ధరిస్తారు. ఈ విధంగా మనతిలకంలో జాతిని, మతాన్ని అనుసరించి భిన్నభిన్న రీతు లున్నాయి.

నేడు మనం కులమతరహితసమాజంలో ఉన్నాం గాబట్టి మతచిహ్నల ప్రయోజనమేదో మనకు తెలియదుగాని సమాజంలో కొందరు వ్యక్తుల విషయంలో వారి హోదా లెరిగి గౌరవించటం అవసరం. అందుకు వారికి కొన్ని గుర్తులవసరం.

తం గూడ ఉంది. శైవులు తిర్యక్పుండ్రాలే ఎందుకు ధరించాలి? వైష్ణవులూర్ధ్వపుండ్రాలే ఎందుకు పెట్టాలి? అనే విషయంపై ఆయా మతగ్రంథాల్లో అర్థపూర్ణమైన చర్చ లున్నాయి. ప్రస్తుతం నేను వాని జోలికి పోక తిలకానికి స్థానవర్ణాలుమాత్రం చెబుతాను.

మన దేహం అనేక తత్త్వాల సమాహారం. దీనిలో జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు ఇంకా ఇతరమైన అంగాలకు ఒక్కొక్క అధిదేవతున్నాడు. వానిలో లలాటానికి అధిదేవత బ్రహ్మ. నేడు మనలోని శైవ వైష్ణవ మతా లన్నిటికీ శ్రుతులే ప్రమాణాలు. అవి బ్రహ్మ ముఖాలనుండి వెలువడినవి గాబట్టి తచ్చిహ్నాలైన తిలక ధారణకు బ్రహ్మస్థానమైననుదురు ప్రధానకేంద్ర మయింది.

నుదుటనేగాక ఇంకా కపాలం, కంఠం, హృదయం, ఉదరం, బాహుప్రకోష్ఠప్రదే

ఈ జీవుడు జాగ్రదవస్థలో భ్రూమధ్య మండలి ఆగ్నేయ చక్రంలోను, స్వప్నావస్థలో కంఠస్థానంలోని విశుద్ధంలోను, సుషుప్తిలో హృదయంలోని అనాహతంలోను సంచరిస్తుంటాడని సాంఖ్యం చెబుతుంది కాబట్టి, మనం భ్రూమధ్యంపై ధరించే తిలకం ఈ జీవునికి చిహ్నంగా భావించబడుతుంది. ఆ కారణంగానే తమ పిల్లలు నిద్రిస్తున్నపుడు జీవు డపు డక్కడ లేడుకాబట్టి వారికి తిలకంపెట్టరు. ఈ ఆధ్యాత్మిక రహస్యంవారికి తెలియకపోవచ్చుగాని మూఢనమ్మకం పేర, లేదా ఆచారంపేర ఈ రహస్యం వారిలో గూడుకట్టుకుని నిలిచింది. భర్తృహీనలు జాగ్రదవస్థలో ఉన్నా వారి యింద్రియాలకది జాగ్రదవస్థకాదు కాబట్టి తిలకం వారికి నిషేధించబడింది.

ఈ జీవుడు జ్యోతిస్స్వరూపుడుగాబట్టి అతని చిహ్నంగా మనం ధరించే తిలకం తప్పక ఎఱుపురంగులోనే ఉండవలసిఉంది.

ఈనాడు ఫ్యాషనులు ముదిరి తిలకాలకు గూడ మ్యాచింగుకలర్సు వాడుతున్నారు గాని పూర్వం ఎవరైనా కుంకుమయే వాడే వారు. వారు మేలిమిపసుపుకొమ్ములు సల్లించి వానిపై రెండుమూడు తడవలు నిమ్మ పులుసు పిండి ఎండించిపెట్టుకుని అవసరమైనపు డది రోటిలోనో ఖల్వంలోనో వేసి నూరుకునేవారు. దానితో మేలిమి కుంకుమ తయారవుతుంది. అపు డందులో కాసింత వెలిగారం పలుకు గూడవేస్తే దానికి రంగు మరీ యెక్కి తళతళలాడుతుంది.

ఇక కలవారైతే దీనికి బదులు కుంకుమ పూవు, గోరోచనం, కస్తూరి, కర్పూరం, పన్నీటిలో నానవేసి రంగరించి చందనంలో కలుపుకుని గాని లేదా విడిగాగాని ధరించే వారు. పెద్దనగారి సరస్వతి సిందూర తిలకాన్ని ధరించింది.

ప్రాచీనులు తిలకంగా వాడే ఈ వస్తువు లాయుర్వేదంప్రకారం ఉత్తమమైన ఓషధీ ద్రవ్యాలు.

నుదురు మనశరీరంలో ఓ ఆయువు పట్టు. మనకు విపరీతంగా జ్వరం వచ్చినపుడు. దోషజ్వరంలో ప్రలాపన ఏర్పడినపుడు డాక్టర్లు నుదుటిపై తడిగుడ్డను వేస్తారు. కాబట్టి దిన దినం మనం తిలకం పేర నుదుటిపై ధరించే విభూతి చందనాదులు, కాశ్మీరగోరోచనాదులు నుదుటిపై పట్టీవేసిన ఔషధద్రవ్యాలుగా మన ఆరోగ్యరక్షకై పనిచేస్తుంటాయనటానికి సందేహం లేదు.

తిలకంగా మనం లలాటానికి ధరించే చందనం మన మేధస్సును వేడినుండి రక్షిస్తుంది. శరీరతత్త్వాన్ననుసరించి అందులో కాశ్మీరాదులు కావలసినవారు చేర్చుకోవచ్చు. ఇది పూర్వుల పద్ధతి. ఈ తిలకధారణలో మరో ధర్మసూక్ష్మం గూడా ఉంది. సాధారణంగా పెద్ద పెద్దవిందులలో పంక్తిభోజనాల వేళ అతిథులకు చందనాన్ని ఎదకు, దండ చేతులకు, వీపుకు పూయటం కద్దు. దేవతార్చనలోని చందనమంత్రం—

"శ్రీఖండం చందనోన్మిశ్రం
కర్పూరేణ సుసంయుతం
విలేపనం సురశ్రేష్ఠం.... ॥"

అని చెబుతుంది. శ్రీఖండమంటె మారేడు చెక్క. సానపై మొదట మారేడుగంధం తీసి ఆపైని చందనకాష్ఠం నూరాలి. దానిలో కర్పూరం కలపాలి. అది విలేపనానికి శ్రేష్ఠమయిందని పై మంత్రతాత్పర్యం. ఇందులో చెప్పబడిన శ్రీఖండచందనాదులు గరహర ద్రవ్యాలు. 'గరం' అంటే పెట్టుడు మందు.

పెద్దపెద్దపంక్తిభోజనాల సమయంలో వంట వారి అశ్రద్ధవల్లనో, లేక నిర్వాహకులలోపం వల్లనో ఒక్కొక్కపు డాహారంలో దోషాలు సంక్రమించే అవకాశముంది. గరప్రయోగాలుగూడ భోజనవేళనే జరుగుతుంటాయి కాబట్టి భోజనసమయంలోని ఈ చందనచర్చ వారికి ప్రాథమిక రోగనిరోధక క్రియగా పనిచేసి సుఖంగా ఆహారం జీర్ణం కావటానికి దోహదం చేస్తుంది.

మనం తిలకం లలాటమధ్యభాగంలో ధరించవలసి ఉంది. అక్కడమనకపాలాస్థి అస్థిగా గాక ఘనీభవించిన మజ్జవలె మృదువుగా ఉంది. మరణోత్తరక్షణంలో అస్థి ప్రాయంగా మారుతుందట. డాక్టర్లు చెబుతుంటారు కాబట్టి వారి సిద్ధాంతం ప్రకారం తిలక స్థానం మన శరీరంలో ఓ ముఖ్యమైన ఆయువుపట్టు. అందువల్ల ఆ స్థానంలో ఓషధీప్రాయమైన తిలకాన్ని విధించటం ప్రాచీనులు మనశరీరతత్త్వమెరిగి చేసిన నిర్ణయాలలో ఒకటి అని అనవలసిఉంది.

— శ్రీ కె. లింగమూర్తి

# రమాపరిణయంలో రామణీయకత

శ్రీ వేంకటాచలపతి దివ్యపదయుగళికి సమర్పణము గావింపబడిన ద్విపద కావ్యము శ్రీరమాపరిణయము. ఇది భక్త కవయిత్రి తరిగొండ వేంకమాంబచే భాసుర భక్తితో రచింపబడినది.

ఈ రచన ఆత్మజ్ఞానముకంటె ఔచిత్యమున కాటపట్టు. భక్తితత్త్వమునకంటె భావనాబలమునకు తావలము. కమలాక్షు వినుతించు కావ్యసరణికంటె కమనీయ కవితా రస నిష్యందమునకు కాణాచి. పరతత్త్వపరత కంటె చతురత, సరసత సంతరించుకొనిన శ్రవణపేయ సమాహారము.

ఆది యెట్లో శ్రీరమాపరిణయ కావ్యకథా కథనముద్వారా చవిచూచుటయే ప్రస్తుత వ్యాసోద్దేశము.

పాలసముద్రంలో పాపరాయని పడకపై పవ్వళించిన పరంధాముడు యోగనిద్రలో మునిగి యుండగా హరబ్రహ్మాది సురలేతెంచి ముకుళితహస్తులై ముందర నిలచి అకలంక భక్తితో "ఓ దేవదేవా! మమ్మేలుకోవా, నిద్రనుండి మేలుకోవా!" అని ప్రార్థించారు. తదుపరి 'ఓ పరమాత్మా! నీ దివ్యపాదపద్మాలను చూచిపోవడానికే వచ్చాం' అని సెలవిచ్చారు. తరువాత చివరగా 'సర్వజ్ఞుడవు, సర్వశక్తియుక్తుడవు, నిర్వాణమయుడవు, నిర్వికారుడవు అయిన నీయొక్క పాదద్వయాన్నే యెంచుకొని, నిన్ను ఆత్మపతిగా తలంచుకొని,

శ్రీ ఏ. వి. రమణప్రసాద్

నీ పాణిగ్రహణం కోసం సిగ్గుతో తలవంచుకొని యున్నదయ్యా జలరాశిపట్టి. ఆ రమామణిని చెట్టపట్టవయ్యా. ఇది చెప్పడానికే మేము వచ్చాం' అని అసలు విషయం బయటపెట్టారు అమరవరులు. నవ్వాడు నందకిశోరుడు. 'గరళకంధరా! పద్మగర్భా! నేను భూలోకంలో శేషాచలంపైన వేంకటేశ్వరు డనే పేరుతో విఖ్యాతి బొందెదను. అలమేలుమంగ యనే అభిధానంతో ఇందిర నాకు భార్య కాగలదు. వరాహస్వామి అనుమతితో నేను వేంకటాద్రిపై విలసిల్లెదను. మీరు పెళ్ళిపెద్దలు కండు' అని నారాయణుడు వివరించాడు.

వారు సంతోషంతో సాగరుని సమీపించడం, సంగతి తెలిసికొన్న సముద్రుడు మనమున నుప్పొంగి మాకన్యను మధుసూదనున కిచ్చెదనని మాటఇవ్వడం, తటుకున పెండ్లికి తరలిరమ్మని తరిగొండహరి శంకరబ్రహ్మాదులను సపత్నీ సపరివారంగా ఆహ్వానించడం, విష్వక్సేనాది పరివారంతో అచ్యుతుడు కల్యాణానికి కదలి వెళ్ళడం చకచకా జరిగిపోయాయి.

ఘనశుభవాద్యములు వినిపించాయి. మంగళద్రవ్యాలతో హరి విరించి సురేశ్వరాదులు పద్మాక్షువెంట వచ్చారని తెలిసింది సాగరునికి. తనవైపుకూడా మంగళ తూర్యములను మ్రోయింపజేశాడు. శోభన ద్రవ్యములుగొని పరివారవితతితో ఎదురేగాడు రత్నాకరుడు. బ్రహ్మరుద్రాదులతో బంధుజనంతో హరిని ఆత్మపురంలోనికి ఆహ్వానించాడు. వేడుకగాలిపె విడిదిలోనికి తోడుకొనిపోయాడు. పచ్చతోరణాలతో, ముత్యాలముగ్గుతో, వింతచిత్రరువుతో, శృంగారమయంగా నగరాన్ని అలంకరించారు. కల్యాణవేదిక కళకళలాడుతోంది. ముత్యాలగద్దెపై బంగారు పీటలను వేశారు. మంగళద్రవ్యా లుంచారు. వరరత్నభూష



ఫోటో: జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, తిరుపతి.

కాలంకృతులై పట్టుచీరలు కట్టుకొన్న ముత్త యిదువలు వస్తున్నారు. సలలితంగా వాద్య ఘోషలు వినిపిస్తున్నాయి. ముకుందుడు ముత్యాలగొడుగు నడుమ నడుస్తున్నాడు. గంగ, గౌతమి, యమున, నర్మద, మణికర్ణిక తుంగభద్ర మొదలగు వనధి భార్యలు అనురాగమున శోభనాక్షతలు గొని వరవైభవ ముతో వరుని వెనుక వస్తున్నారు. కమనీయ భక్తితో ఆ కమలలోచనుని సముచితక్రమ ముతో పూజించారు. వరపూజ ముగిసింది.

వెంగమాంబ రాయలసీమ సీమంతిని. ఈ కావ్యంలో ఈమె గావించిన తరిగొండ హరి వరపూజ రాయలసీమ ప్రాంతపు పెండ్లిండ్లలో అనూచానంగా వస్తున్న ఆచారాన్ని ప్రతిబింబింపజేస్తుంది. తక్కిన ఆంధ్ర ప్రాంతపు పెండ్లిండ్లలో నేడిట్టి వరపూజ కానరాదు.

నెత్తమ్మికంటికి కాబోయే అత్తలును. కడలికామినులును అయిన గంగా యమున సరస్వతులు లోకమాతలను పెండ్లి పేరంటానికి పిలిచే తీరులో ఎంత సొరు!

"రయమున మామందిరమున కో గిరిజ!
ప్రియ మొప్ప రావమ్మ పేరంటమునకు
రామాలలామ భారతి! నీవు వేగ
ప్రేమతో రావమ్మ పేరంటమునకు
.......................................
మునివధూమణులార! ముచ్చటమీర
పెనుపొంద రారమ్మ పేరంటమునకు
.......................................

చూశారా సహజత్వం. మొత్తానికి వెంగమాంబ పేరంటా లనిపించుకుంది.

సాగరుడు, సోముడు, ఉచితక్రమంగా పెండ్లి యేర్పాట్లన్నీ చూస్తున్నారు. విశ్వేశ జలజాసనాదులు సభికులు కాగా, పార్వతీ భారతీ ప్రముఖ తరుణులు పెండ్లిముత్తైదువలు కాగా కశ్యపుడు వివాహ కృత్యములు నెరపుచున్నాడు.

హరి కాశీయాత్రకు ఏగుసమయం ఆసన్నమయింది. కమలనేత్రుడు కాశీయాత్రకు కదలుచున్నాడు. అది చూచాడు సముద్రుడు. చూచి 'వాసిగా' వచ్చాడు అంటుంది వెంగమాంబ. కంగారుపడలేదు. పరుగెత్తలేదు. ఈ కాశీయాత్ర అందరికీ తెలిసిన విషయమే. మామూలే. అందుకనే తాపీగా హరిదగ్గరకు వచ్చి—

'కపటనాటక! నీవు కాశి కేగెదవె
యిపుడు నా సుతను నీ కిచ్చెద'

ననుచు తన మందిరమునకు తోడ్కొని పోయినాడు.

"ఏదో శాస్త్రసమ్మతంగా నీవు కాశీయాత్రకు వెళ్ళుతున్నట్లు వెళ్ళడము, మధ్యలో నే నడ్డుపడి వెళ్ళకయ్యా? నా కుమార్తె నిచ్చి నీకు పెళ్ళిచేస్తాను అని చెప్పడమూ- ఇదంతా పెండ్లితంతు మాత్రమే కానీ నిజంగా నీవు కల్యాణం మానేసి కాశీకి వెళ్ళుతావటయ్యా! నీవు పంకజాసనుని, ఫాలనయనుని, పాకశాసనుని ప్రార్థించి-

'క్షీరవారిధి జేరి శ్రీరమాసతిని
నే రీతి నైన నా కిమ్మని యడిగి
నిరుపమ లగ్నంబు నిర్ణయించుకొని

సరగున రం'—డని ఆజ్ఞాపించి వారిని నా వద్దకు పంపించడం నే నెరుగనా? నాకు తెలుసులేవయ్యా! నా చక్కని చుక్కపై నీకు మక్కువ యెక్కువని —" అనే అంతరార్థం సముద్రుడు పల్కిన 'కపటనాటక' అనే సంబోధనలో కన్పిస్తుంది. కపటనాటక అనే ఆరు అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని వెంగమాంబ ఇమిడ్చిందని భావించడం ఇక్కడ అతిశయోక్తి కానేరదు. అందుకు సాక్షి 'కపటనాటక! నీవు కాశి కేగెదవె'—అనే పదరచనే.

అనుపమ దివ్యవైభవముతో కన్యావరణము జరిగింది. సాగరుడు మురిసిపోయినాడు. భక్తితో పంకజాక్షునకు మనము రంజిల్లగా మధుపర్కమిచ్చాడు. నవ్యభూషణములు, నవ్యవస్త్రములు, దివ్యగంధములు, దివ్యమాల్యములు ప్రమదముతో సమర్పించాడు. కమలాక్షునకు కన్యాదానం చేశాడు. హరి రమా కరగ్రహణం గావించాడు. మంగళదేవత మెడలో మంగళసూత్రం కట్టేడు. తలంబ్రాలు పోసినాడు. పాణిగ్రహణంచేసినా, మాంగల్యధారణ గావించినా ఊరుకుంది గానీ, తలంబ్రాలు పోస్తుంటే చూస్తూ పూరుకోలేదు ఉదధిపట్టి. హరిశిరసుపై తానూ తలంబ్రాలు పోసింది. ఆ విధంగా రమణీయంగా రమా పరిణయం జరిగింది.

ఈ కావ్యంలో ఇంతవరకూ జరిగిన స్వామి కల్యాణపు వేడుకలు ఒక యెత్తు. ఇకపై బువ్వముబంతితో ప్రారంభమయ్యే చతుర సంభాషణలు, ఛలోక్తులు. ముచ్చట్లు ఒక యెత్తు. వెంగమాంబ వర్ణించిన బువ్వముబంతి ఆమె రమ్యకవితా రచనా చమత్కృతులకు ఒజ్జబంతి.

గంగ, గౌతమి, యమున మొదలగు జలరాశి ముఖ్యకామినులు వేడుకతో వధూవరులకు పైడి పళ్ళెరముల నుంచి బహువిధ భక్ష్యములు, పక్వశాకములు, దివ్యాన్నములు, వింతపచ్చళ్ళు, నెయ్యి, పాలు, పెరుగు, తేనె ఊరుగాయలు మొదలగు నవన్నియు ప్రియముగా తెచ్చి వరుసగా వడ్డించినారు. సువర్ణకలశంతో నిర్మలోదకాన్ని ఉంచినారు. నీలకంఠుడు నీరజోదరుని గాంచి "ఓ జలజాక్షా! నీవు కలుములచెలిని గైకొన్న కతన నీకు అసమాన సౌఖ్యంబు లబ్బినవయ్యా, కాబట్టి కడుపు నిండా తినవయ్యా!

'మీనరూపము దాల్చి మెండుగా జలము
పానంబు జేసినప్పటివలె గాదు
ఈ నిర్మలాన్నంబు నిచ్చట నీవు
పూని ఆకలిదీర భుజియించ వోయి....

(సశేషము)

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## శ్రీ ఆదిమహాలక్ష్మీదేవి విగ్రహప్రతిష్ఠ

వరంగల్ నగరసమీపంలో 'శాయంపేట హవేలి' గ్రామంలో ప్రాచీనమైన శ్రీపాంచాలరాయస్వామి (శ్రీకృష్ణ) దేవాలయంలో గత మే 7 వ తేదీన శ్రీ కందుకూరి శివానందమూర్తి (రిటైర్డు పోలీస్ ఆఫీసరు) శ్రీ ఆదిమహాలక్ష్మీదేవి విగ్రహమును ప్రతిష్ఠించారు. ప్రతిష్ఠాకార్యక్రమం చాలవైభవంగా జరిగింది. ఈ దేవాలయాన్ని ఉద్ధరించవలెననే ఆకాంక్షతో, చాలారోజులుగా శ్రీ ఆచార్య బిరుదరాజు రామరాజుగారు ఇచట అనేక ధార్మికకార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. తి.తి.దే. మాజీ కార్యనిర్వహణాధికారి శ్రీ రాజగోపాలరాజుగారు ఈ దేవాలయాన్ని సందర్శించారు.

## పాందువ్వ హరిజనవాడ

పశ్చిమగోదావరి జిల్లాశాఖ హిందూధర్మరక్షణ సంస్థవారి ఆధ్వర్యంలో ఈ జూలై 4 పాందువ్వ హరిజనవాడలో ధర్మరక్షణ కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. ఈ కార్యక్రమాలకు తి. తి. దే. ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ వి. కె. డి. వి. సత్యనారాయణరాజుగారు అధ్యక్షతవహించారు. పంచాయితీ సర్పంచ్ శ్రీ దాగారపుతాతయ్య స్వాగతంపలికారు. శ్రీ సూరపురాజు తదితరులు ప్రసంగించారు. తి. తి. దేవస్థాన ప్రచురణలు, శ్రీ కంచికామకోటివారిచే ఇవ్వబడిన లాకెట్లు, మున్నగునవి అధ్యక్షులు హరిజనబాల బాలికలకు పంచిపెట్టారు. హిందూధర్మరక్షణసంస్థ చేస్తున్న కార్యక్రమాలనుగూర్చి ప్రశంసించారు. తదుపరి శ్రీ ముత్యాల వేంకటేశ్వర్లు భాగవతార్ గారిచే శ్రీనివాసకల్యాణము హరికథా కాలక్షేపము జరిగింది. జిల్లా ఆర్గనైజరు శ్రీ సి. హెచ్. వి. సూర్యనారాయణరాజు ధన్యవాదాలతో సభ జయప్రదంగాముగిసింది.

అలాగే జూన్ 20, జంగారెడ్డి గూడెంలోను, కన్నాపురం శ్రీ దుర్గాభవానీ, రసలింగేశ్వర దేవస్థానము నందు జిల్లా ఆర్గనైజరు శ్రీ సి. హెచ్. వి. సూర్యనారాయణరాజు అధ్వర్యంలో ధార్మికకార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. అలాగే గిరిజనసేవాసమితి రామన్నగూడెంలోకూడ ధార్మిక కార్యక్రమాలు ఏర్పాటుచెయ్యడం జరిగింది.

## చుండూరులో

హిందూధర్మరక్షణసంస్థ గుంటూరుజిల్లా శాఖ అధ్వర్యంలో జూన్ 23 న పెదగాదెలపర్రు, చినగాదెలపర్రు, వైకుంఠపురం మున్నగు గ్రామాల్లో సామూహిక పాదయాత్రచేస్తూ భజనకార్యక్రమాలు నిర్వహింప బడ్డాయి.

## వరంగల్లులో

హిందూధర్మరక్షణసంస్థ వరంగల్లు జిల్లాలో ఈ నెలలో 6 ధార్మిక ఉపన్యాసములు, 4 భజనలు, 2 హరికథలు నిర్వహించారు. ముఖ్యంగా హరిజనవాడలో ప్రతి యింటికి ఓంకారము (స్టిక్కరు) అతికించి సనాతన ధర్మంపట్ల వారికి ఆసక్తి కల్గించే ఆధ్యాత్మిక ఉపన్యాసాలు, భజనలు నిర్వహించడములో ఎక్కువ కృషి జరుగుతోంది. ఈ కార్యక్రమాలన్ని జిల్లా ఆర్గనైజరు శ్రీ వై. సూర్యచంద్రారెడ్డిగారి అధ్వర్యములో ఆసక్తికరంగా జరిగాయి.

## భక్తిరంజని

"సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే మనసా" అని నాదబ్రహ్మ త్యాగరాజస్వామివారు అన్నట్లుగా సంగీతజ్ఞానం, భక్తిసమపాళ్ళలోమేళవించుకొన్న మధుర గాయని కుమారి అన్నాప్రగడ రామసాయి కుమారి తి.తి. దేవస్థానం హిందూధర్మరక్షణ సంస్థవారి అధ్వర్యంలో తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో గత జూన్ 20 తేదీ బుధవారం నిర్వహింపబడిన సంగీత సభలో శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీరామ, శ్రీకృష్ణ, కనకదుర్గ, ఆంజనేయస్వామి వార్లపై 15 భక్తిగీతాలను పాడి శ్రోతలను పరవశింపచేశారు. దాదాపు గంటన్నరకిపైగా సాగిన ఈ కార్యక్రమంలో ప్రక్కవాద్యాల్లో వయోలిన్‌పై శ్రీ నారాయణస్వామి, తబలపై శ్రీ పార్థసారధి సహకరించారు.

విజయవాడకు చెందిన ఈమె,విజయవాడ ప్రభుత్వ సంగీత కళాశాల నుండి సర్టిఫికెట్ కోర్సులో ప్రావీణ్యము గడించి అతిపిన్న వయసులోనే పలుప్రాంతాల్లో ఈ విధమైన కార్యక్రమాల్లో పాల్గొనివున్నారు. హిందూధర్మరక్షణసంస్థ పక్షాన చిత్తూరుజిల్లాలో 84 జూన్ 17 వతేదిన బొమ్మరాజపురం, 18 వ తేదిన వెదుళ్ళచెర్వు, 19 వ తేదిన ఎలమండ్యం, 21 వ తేదీన పెరుమాళ్ళపల్లిలో ఈ కార్యక్రమాలను దిగ్విజయంగా నిర్వహించి శ్రోతలమన్ననలను పొందారు.

## 'శ్రీ అన్నమాచార్య చరిత్ర' సంగీత నృత్యరూపకం

ప్రసిద్ధ వాగ్గేయకారుడు, శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తుడు, చిన్నతనంలోనే అలమేలు మంగను ప్రత్యక్షంచేసుకొని,అలమేలుమంగ వేంకటేశ్వరస్వామిపై వేలాది పద రచనలు చేసిన శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులవారి చరిత్రను వారు రచించిన వివిధ కీర్తనలను చేర్చి జూన్ 2 వ తేదిన త్యాగరాయగాన సభలో భద్ర ఆర్ట్స్, మల్కాజిగిరివారు తమ తృతీయ వార్షికోత్సవం సందర్భంగా కుమారి బి. వి. నిరంజని బృందంచే సంగీత నృత్య రూపకంగా ప్రదర్శించారు. ఈ రూపకానికి నృత్యరూప కల్పన శ్రీమతి బి. సోమేశ్వరి, సంగీత రూపకల్పన శ్రీమతి బి. సోమేశ్వరి, శ్రీ ఎ. ఎం. ఆంథోని నిర్వహించారు. కీర్తనల గానం శ్రీమతి బి.సోమేశ్వరి, శ్రీ వై. శేషయ్య నిర్వహించగా మొత్తం రూపకం నిర్మాణ నిర్వహణను శ్రీ బి. వి. స్వామి నిర్వహించారు.





# స్వర్ణోత్సవ సంచిక

[తి. తి. దే. ప్రచురణ: పుటలు: 496+32: వెల: 25-00. ప్రాప్తిస్థానము: వెల్‌ఫేర్ ఆఫీసరు. దేవస్థాన ప్రచురణలు. తి. తి. దేవస్థానములు. తిరుపతి-517501]

తిరుమల తిరుపతి దేవస్థానము పరిపాలనా యంత్రాంగ స్వర్ణోత్సవ సందర్భంగా ప్రత్యేక సంచికను ప్రచురించడం జరిగింది. తిరుపతిలో అత్యంత వైభవంగా జరిగిన ఈ స్వర్ణోత్సవం వేడుకల్లో మొదటి రోజున (84, ఏప్రిల్ 22) ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావుగారి ధర్మపత్ని శ్రీమతి బసవ తారకమ్మ ఈ సంచికను ఆవిష్కరించారు.

సుమారు 500 పుటలుగల ఈ సంచికలో ప్రతిపుట చుట్టు రంగురంగుల ఆకర్షణీయమైన అంచులుండటం విశేషం. ఇందులో చోటు చేసుకున్న శ్రీవారు, అలమేలుమంగ, వజ్రకవచధారి, ముత్యాలకవచధారి, త్రిమతాచార్యులు, అన్నమాచార్యులు మున్నగు పదహారు వర్ణచిత్రాలున్నాయి. ఇందులో ఏ ఒక్క వ్యాపారప్రకటనలేకుండా ప్రకటించబడిన సంచిక ఇది.

ఈ సంచికలో 1933-83ల మధ్య గల 50 సంవత్సరాల కాలంలో దేవస్థాన పరిపాలనలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలు, ఇతర విభాగములు, దేవస్థాన చరిత్రలో, భక్తులసేవలో ప్రఖ్యాతి గడించిన మహనీయులు, యాత్రికుల సౌకర్యాలకు సంబంధించిన సమాచారమే కాకుండా, సనాతన ధర్మము, మన ప్రాచీన సంస్కృతికి సంబంధించిన అనేక వివరాలు పొందుపరచడం జరిగింది.

ఈ సంచికలో తెలుగు, ఆంగ్ల, తమిళ, కన్నడ, హిందీ విభాగాలుగా చూపబడిన వ్యాసాలన్నీ ఆయా భాషా సాహిత్యాల్లో నిష్ణాతులైన కవిపండితుల చేత రచింపబడ్డాయి.

ప్రత్యేకంగా తెలుగు విభాగంలో 62 వ్యాసాలున్నాయి. వాటిని వేదాలు, ఆగమాలు, ఉపనిషత్తులు, పురాణాలు, శైవ, వైష్ణవ, మధ్వ సంప్రదాయము, అన్నమాచార్యులు, తరిగొండ వెంగమాంబలకు సంబంధించిన పరిశోధనవ్యాసములు, సంగీత, నృత్య, శిల్ప, శాస్త్రాలకు సంబంధించిన విశేషాలు "ప్రగతిపథంలో సప్తగిరి" అను వ్యాసం, 'తిరుమల' వర్ణనకు సంబంధించిన అనేక విషయములు- అన్నీ శిష్ట వ్యవహారిక భాషలోనే ఉన్నాయి.

ఇక తమిళవిభాగంలో 22, కన్నడ విభాగంలో 10, ఆంగ్లవిభాగంలో 15, హిందీ విభాగంలో 12 వ్యాసాలున్నాయి. ఇవి భక్తకోటికి కొంగుబంగారమై దర్శనమిస్తున్న తిరుమల కోనేటిరాయని ఆర్తరక్షకత్వమును సర్వదాతృత్వమును, పురుషోత్తమత్వమును, విశ్వాత్మకత్వమును, అఖండ పరిపూర్ణత్వమును, ఆద్యంత రహితత్వమును, ఆపదుద్ధారకత్వమును వేయి విధముల చాటుతున్నవి. ఈ సంచికపై అట్టమీదివర్ణ చిత్రం నీలిరంగుతో బంగారు ఆనంద నిలయంలోని ఘన వేంకటేశుని త్రివర్ణచిత్రం" ఈ విషయాన్నే చాటుతున్నది. *

---

## విదేశాలలోని హిందూదేవాలయ సహాయ పథకం

మాతృభూమికి దూరంగా వివిధదేశాల్లో ఉంటున్న భారతీయులలో జన్మభూమి సంస్కృతిని పరిరక్షించుకోవాలన్న తపన చాలా బలీయమౌతున్నది. అనేక సంస్థలు ఆయా దేశాలలో హిందూ దేవాలయ నిర్మాణానికి పూనుకుంటున్నాయి. ఆర్ష ధర్మ ప్రబోధము, శ్రీనివాసప్రభా ప్రసారం ముఖ్యకార్యక్రమంగా తిరుమల తిరుపతి దేవస్థానం అమెరికాలోని పిట్స్‌బర్గ్‌లో శ్రీ వేంకటేశ్వర ఆలయ నిర్మాణానికి వస్తురూపేణ, సిబ్బంది రూపంగా కూడా యథాశక్తి తోడ్పడింది. తదాది వివిధదేశాలలోని ఆధ్యాత్మికతా జిజ్ఞాసువులు, భారతీయ ధర్మాభిరతులు తమతమ దేశాలలో హిందూ దేవాలయాల నిర్మాణానికి తిరుమల తిరుపతి దేవస్థాన సహాయానికి ఎదురు చూడటమే గాక, ఆయా ఆలయాల నిర్మాణంలో ఇతోధిక భాగస్వామ్యం వహించి విదేశాలలో భారతీయ ధర్మప్రబోధానికి తోడ్పడ వలసిందిగా వత్తిడి చేయటం జరుగుతున్నది. భారతీయ ధర్మప్రబోధం, పరిరక్షణ ప్రధాన కర్తవ్యంగా గల దేవస్థానం విదేశాలలోని హిందూ దేవాలయ నిర్మాణ సహాయానికి ఒక ప్రణాళికను సిద్ధంచేసింది.

ఈ పథకం ప్రకారం దేవస్థానం ఒక షెడ్యూల్డ్ బ్యాంకులో ఒక కోటి రూపాయల నిధి ఏర్పాటు చేస్తుంది. అవసరాన్ననుసరించి దీనిని పెంచటం జరుగుతుంది. ప్రపంచంలో ఏ దేశంలోనిదైనా, రిజిష్టరైన హిందూదేవాలయ సంస్థ లేదా వ్యక్తులు సంస్థగా రూపొందితే ఈ విరాళాన్ని 15 లక్షల రూపాయలకు మించకుండా పొందవచ్చు. అయితే ఈ విరాళం ధన రూపంలోగాక కట్టడాలు, విగ్రహాలు, సిబ్బంది సరఫరా, అర్చకుల ఏర్పాటు మొదలైన వాటి రూపంలో ఉంటుంది.

ఈ పథకంలో సహాయం పొందదలచిన సంస్థలు తమ స్థితిగతులు, స్థలసేకరణ పత్రాలు, నమూనాలు. వ్యయం అంచనాలు ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖ కమీషనర్ ద్వారా, ఆ శాఖ స్థపతిచేత తనిఖీ చేయించుకోవలసి వుంటుంది.

సహాయం పొందిన సంస్థలు ఆలయ నిర్మాణాదులు పూర్తయిన తరువాత వడ్డీ లేని వాయిదాలలో తిరిగి చెల్లించవచ్చు. లేదా వైద్య పరికరాల సరఫరాలాంటి వస్తురూపంలో కూడా తిరిగి చెల్లించవచ్చు.

ఇచ్చిన సహాయం సక్రమ వినియోగ విషయంలో కార్యనిర్వహణాధికారిగాని మరి ఏ ఇతర ఉద్యోగినైనాకాని పంపి తనిఖీ చేయించే హక్కు దేవస్థానానికి ఉంది.

సహాయం సద్వినియోగం కాని పక్షంలో సహాయంపొందిన సంస్థనుండి 15% సాలీనా అపరాధపు వడ్డీతో సహా అసలు సొమ్మును తిరిగి చెల్లించవలసిందిగా అడిగే హక్కు దేవస్థానానికి ఉంది.

# వార్తాలహరి

## నెల్లూరులో స్వర్ణోత్సవాలు

దేవస్థాన పరిపాలనా యంత్రాంగ స్వర్ణోత్సవాలు రాష్ట్రవ్యాప్తంగా జరిగే పథకం క్రింద జూన్ 1, 2 తేదీలలో నెల్లూరులోని దేవస్థాన కల్యాణమండప ప్రాంగణంలో జరిగాయి. మామూలు ప్రకారం ఈ రెండు రోజుల కార్యక్రమాలు ఉదయం గీతాపారాయణంతో ప్రారంభమైనాయి.

మొదటిరోజు కార్యక్రమానికి జిల్లా జాయింట్ కలెక్టరు శ్రీ ఐ. వై. ఆర్. కృష్ణారావు (ఐ.ఏ.ఎస్.), ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. అన్నమాచార్య సంకీర్తన కార్యక్రమం జరిగింది. హిందూధర్మ రక్షణసంస్థ సహాయాధికారి శ్రీ ఇ. కరుణాకరన్‌గారి నిర్వహణలో 'గోవిందామృతం' అనే వ్యాఖ్యానపూర్వక గేయరూపక ప్రదర్శన జరిగింది. కార్యక్రమం శ్రీ వంగల పట్టాభి భాగవతార్‌గారి కథాకాలక్షేపంతో ముగిసింది.

2-6-84 నాటి కార్యక్రమాలకు జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ కె. కృష్ణమూర్తి (ఐ. పి. ఎస్.), ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. శ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రి, శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ ప్రసన్నానందస్వామి (ఉదయగిరి) వారి ధార్మిక ప్రసంగాలు జరిగాయి. అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులు కచ్చేరి అనంతరం శ్రీమతి దుర్గాంబ భాగవతారిణి హరికథతో కార్యక్రమాలు సమాప్తమైనాయి.

(చిత్రాలు: 2 వ కవరుపేజీలో)

## ఆభరణాల వేలం

శ్రీ వేంకటేశ్వరస్వామి, ఇతర దేవాలయాలలో భక్తులువేసిన బంగారు ఆభరణాలను చాలాకాలం తర్వాత ఇటీవల వేలం వేశారు. ఐదురోజులపాటు జరిగిన ఈ వేలంలో, కంఠాభరణాలు (నెక్లెస్‌లు), వడ్డాణాలు తదితర విలువైన ఆభరణాలు వేలం వేయటం జరిగింది. సుమారు 250 మంది పోటీదారులు దేశంలో వివిధ ప్రదేశాల నుండి వచ్చి పాల్గొన్నారు. ఈ వేలం ద్వారా దేవస్థానానికి రు. 1.03 కోట్లు వచ్చింది.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఆర్థిక సలహాదారు శ్రీ కృష్ణస్వామి, ఉపకార్యనిర్వహణాధికారి శ్రీ ఆర్. వాసుదేవనాయుడు మాత్రమేగాక ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణరాజు, సభ్యులు శ్రీ పి. యాదగిరి, నరసింగ్‌నాయక్, శ్రీమతి నన్నపనేని రాజకుమారి, శ్రీ పి. వేంకటేశ్వర్లు, దేవాదాయ కమీషనర్ శ్రీ కె. మురళీధర్ కూడా ఈ సందర్భంలో హాజరయ్యారు.

(చిత్రాలు: 3 వ కవరుపేజీలో)

## దేవస్థాన సంక్షేమ సంస్కృతీ పథకాలు

ఉద్యోగుల సంక్షేమ ప్రణాళికలలో భాగంగా వారికి మీకు సొంతఇల్లు అనే ఈ పథకం క్రింద 350 ఇళ్లు నిర్మించేందుకు

## రైలు విద్యుద్దీకరణ

తిరుపతి తిరుమల యాత్రికుల సౌకర్యార్థమై రైల్వేమార్గ విద్యుద్దీకరణలో దక్షిణ మధ్య రైల్వేవారు ప్రత్యేకశ్రద్ధ కనపరుస్తూ, ఇందులో భాగంగా ఈ నెల గూడూరు-రేణిగుంట మధ్యగల 83 కిలోమీటర్ల దూరం విద్యుద్దీకరణ పూర్తి చేశారు. జూన్ 29 ఉదయం 5 గంటలకు దక్షిణమధ్య రైల్వే జనరల్ మేనేజరు శ్రీ సి. ఎం. మల్లిక్ రేణిగుంట స్టేషన్‌లో నం. 5, తిరుపతి-సికింద్రాబాదు కృష్ణా ఎక్స్‌ప్రెస్ విద్యుత్తురైలుకు ప్రారంభోత్సవం చేశారు.

* ఈ బండి రాకపోకల వేళలను సవరించ గోరుతున్నాం.



రెండుకోట్ల ముప్పైఫవేల రూపాయలు దేవస్థాన కార్యనిర్వాహకమండలి 13-6-84 మంజూరు చేస్తూ తీర్మానించినట్లు ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణరాజు పత్రికా విలేఖరులతో చెప్పారు. తిరుపతికి సమీపంలోని అవిలాల దగ్గర 25 ఎకరాల విస్తీర్ణంలో ఈ నిర్మాణం జరుగుతుందని, ధర్మకర్తలమండలి కూడా ఈ విషయంలో తగు నిర్ణయం తీసుకొంటుందని ఆయన అన్నారు.

పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయ భవనాదులకుగాను 32 లక్షల రూపాయల విలువగల 131 ఎకరాల భూమిని కేటాయించటం జరిగిందని, ఇందుకు బదులుగా అంతే భూమి నిచ్చేందుకు ప్రభుత్వం అంగీకరించిందనీ ఆయన అన్నారు.

కపిలతీర్థం వద్ద అర్చకుల నిర్వహణలో ఉన్న శ్రీ వేణుగోపాలస్వామి ఆలయాన్ని పునరుద్ధరించాలని, శ్రీనివాసమంగాపురములో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం దక్షిణ దిశలో కోనేరు నిర్మించాలని, అక్కడ జూలై నెలలో సాక్షాత్కార వైభవోత్సవం సందర్భంగా మూడు రోజులు శ్రీ వేంకటేశ్వరస్వామి ఉత్సవ విగ్రహం ఊరేగింపు జరపాలని, తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలోని శ్రీనివాసుని దేవేరులతో ప్రతి మాసం శ్రవణనక్షత్రం పాటు ఊరేగించాలనీ కూడా శ్రీ సత్యనారాయణరాజు వివరించారు.

పోలీసుశాఖ తిరుమలలో నెలకొల్ప దలచుకొనే అత్యధిక ఫ్రీక్వెన్సీ రిపీటర్ స్టేషనుకుగాను తిరుమలలో మైక్రోవేవ్ స్టేషన్‌వద్ద 1000 చ. గజాల స్థలాన్ని కేటాయించినట్లు రాష్ట్రంలోని 50 ప్రదేశాలలో 25 లక్షల రూపాయల విలువచేసే ప్రార్థనా మందిరాలను తిరుమల తిరుపతి దేవస్థానం నిర్మింప నిర్ణయించినట్లు ధర్మకర్తల మండలి అధ్యక్షులు పేర్కొన్నారు.

---

## జ్ఞాన మహాయజ్ఞ కేంద్రం

1984 వినాయకచవితి పర్వదినం నాటికి "వినాయకవ్రతకల్పం" లక్ష ప్రతులను వితరణ చేయాలని పై సంస్థవారు సంకల్పించడం జరిగింది. అందుకుగాను దాతల నుండి విరాళములు స్వీకరింపబడుచున్నవి. వివరములకు శ్రీపురాణపండ రాధాకృష్ణ మూర్తి, జ్ఞానమహాయజ్ఞకేంద్రం, రాజమండ్రి-4 వారిని సంప్రదించండి.

---



(4 వ పేజీ తరువాయి)

దాన్ని అరాచకానికి అడ్డుగోడగా నిలిపారు. కలం పట్టిన చెయ్యి కత్తిని కూడా పట్టగలదని నిరూపించారు. అందుకే ఈనాటికీ కూడా వారు చిరస్మరణీయులు కాగా వారి సంబద్ధ ప్రదేశాలు అటు హిమాచలం నుండి ఇటు కన్యాకుమారి వరకు, అమృతసరం నుండి కాశీ ఘాట్ వరకు వర్ణ వర్గ భేదాలు లేకుండా వందనీయా లయ్యాయి.

కానీ ఈనాడు గురువుకు కాలికాలం వచ్చింది. సమాజంలో అన్నివర్గాలలోనూ ఆరాటం చోటు చేసుకుంది. అశక్త దుర్జనత్వం, ఆంతరంగిక విద్వేషాలు ఆరాధనీయాలౌతున్నాయి. ఆరాధనాలయాలు అరాచక నిలయాలై ప్రళయాన్ని సృష్టిస్తున్నై. అహంకారాత్మకులైన బోద్ధలు బోధారులౌతున్నారు. ప్రభువులకు విజ్ఞానం మీదకన్న విభూతిమీదనే ఆసక్తి. మనకు నచ్చితే మనీషిని కాక పగటు మనిషినే గురువంటున్నాం. బరువనిపిస్తే దించేసుకుంటున్నాం: ఇలా గ్రహణం పట్టి గురువు లఘువౌతున్నాడు లోకకల్యాణ కాంక్షులైన గురుపుంగవుల అమృతమయ భావనావీచికలను మనం ఎంతవరకు అందుకోగలిగాం? సమాజం ఎటు పోతూంది? ఏమిటో! మంచి మాటలు మనస్సులోనే ఇంకిపోతున్నవి.

బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతాశ్చాన్యే
జీర్ణమంగే సుభాషితమ్.

—(భర్తృహరి)

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.




# తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక





ఆగష్టు 1984
వెల : 1-00



దేవతలు గెలువరో తెగి దైత్యులు పొరరో
భావించ నింతటిలో భూభారమెల్ల నణఁగె

నేఁడు కృష్ణుఁడు జనించె నేఁడే శ్రీజయంతి
నేఁడే రేపల్లెలోన నెలవైనాఁడు
పేఁడుక యశోదకు బిడ్డఁడైనాఁ డిదె నేఁడే
పోఁడిమి జాతకర్మ మొప్పుగనాయ నేఁడు

ఇప్పు డిదె గోవుల నిచ్చెను పుత్రోత్సవము
ఇప్పుడు తొట్టెల నిడి రింతు లెల్లాను
చెప్పరాని బాలలీల సేయఁగల దెల్లాఁ జేసి
కిప్పెను విష్ణుమాయలు గక్కన నేఁడిపుడు

ఇదివో వసుదేవుని ఇంటిచెరలెల్లఁ బాసె
ఇదివో దేవకి తప మిట్టె ఫలించె
చెదరక తా నిలిచె శ్రీ వేంకటాద్రిపై నిదె
యెద నలమేలుమంగ యెక్కివున్న దిదివో

— అన్నమయ్య అధ్యాత్మకీర్తన

(శ్రీకృష్ణ జయంతి సందర్భంగా)

# మీమాట

## మార్చండి

అయ్యో! కొన్ని పనులు అయ్యో అని పిస్తే, ఆ ప్రక్కనే మరి కొన్ని ఆహా! అని పిస్తే. తిరుమలకు గుంటూరు, అపై నుండి వచ్చే యాత్రికులకు సర్కారుతో వచ్చే కాకినాడ – తిరుపతి పెట్టెను తప్పించేశారు. గుంటూరు – సికింద్రాబాదు నడుమ నడిచే కృష్ణా ఎక్స్‌ప్రెస్ గుంటూరును తప్పించి తిరుపతి దాకా వస్తున్నది. గుంటూరు హౌరాలమధ్య నడిపే ఈస్టు కోస్టుఎక్స్‌ప్రెస్ మొదట తిరుపతి దాకా అనుకొని ఇప్పుడు హైద్రాబాదుల నడుమ ఏర్పాటు చేయటం వల్ల గుంటూరుకు ఆ సౌకర్యం కూడా పోయింది. ఇక గోల్కొండ ఎక్స్‌ప్రెస్ ఒకటి మిగిలి ఉంది పాపం. ఇది కూడా త్వరలో ఈ దారినే వెళ్ళినా ఆశ్చర్యం లేదు.

ఇన్నిటికి ఉగ్గబట్టుకొన్నారు; ఇక మర్యాద కాదనుకొన్నారో ఏమో రైల్వేశాఖ వారు వాల్తేరు నుండి గుంటూరుకి సింహాద్రి ఎక్స్‌ప్రెస్ ఏర్పాటు చేశారు. ఇది కొంతలో కొంత నయం. సింహాద్రి అప్పన్ననుండి కనకదుర్గమ్మను పల్కరించి గుంటూరు వస్తున్నది. తిరుపతి – వాల్తేరుల మధ్య తిరుమలకాక మరొక్క రాత్రి పూట ఎక్స్‌ప్రెస్‌గా సర్కారు ఎక్స్‌ప్రెస్‌ను మార్చవలసిందిగా సప్తగిరిద్వారా తరచుకోరటం జరుగుతున్నది. ఇప్పుడా అవకాశాన్ని సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌కు వినియోగిస్తే యాత్రికులకు మేలు కలుగుతుంది.

సాయంత్రం 18-25కు గుంటూరుకు చేరే సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌ను గుంటూరులో రాత్రి 7 గంటలకు బయలుదేరి, రాత్రి 1-30 గంటల ప్రాంతంలో చేరేటట్లు గూడూరు వరకు పొడిగించి, సాయంత్రం 6 గ॥ తిరుపతి చేరే పూరీ పెట్టెలతో రాత్రి 10-30 బయలుదేరి 1 గంటకు గూడూరు చేరేటట్లు లింక్ ఎక్స్‌ప్రెస్ నడుపవచ్చు. రెండు బళ్ళు గూడూరులో పెట్టెలు మార్చుకొని 2 గంటలకు గూడూరులో బయలుదేరి 4-30 గంటలకు తిరుపతికి, ఉ॥ 7-30 గంటలకు గుంటూరుకు చేరితే అక్కడనుండి సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌గా 8-30 వాల్తేరుకు బయలుదేరవచ్చు. ఇది కాదనుకుంటే తిరుపతిలో 22 గంటలకు బయలుదేరి గుంటూరు 7గంటలకుచేరి, 8-30 గంటలకు వాల్తేరుకు బయలుదేరే సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌గా పూరీ ఎక్స్‌ప్రెస్ పెట్టెలను తిరుపతి 4-30 గంటలకు చేరే సింహాద్రి ఎక్స్‌ప్రెస్ పెట్టెలను ఉ॥ 10 గంటలకు బయల్దేరే పూరీ ఎక్స్‌ప్రెస్‌కు వాడుకోవచ్చు.

ఇటు తిరుపతిలోనూ అటు గుంటూరులోనూ ఉండిపోయే పెట్టెలు ఈ పద్ధతివల్ల యాత్రికసేవలో సద్వినియోగమౌతాయి. కేవలం పెట్టెల మార్పిడే కనుక ఈ రెంటిలో ఏ ఒక్కబండి ప్రయాణానికి యిబ్బంది ఉండదు. పైగా యాత్రికులు తెల్లవారే సరికి తిరుపతి చేరే వీలు ఉంటుంది.

ఇది జరిగితే తిరుమల ఎక్స్‌ప్రెస్సును గోల్కొండతో కలిపి హైదరాబాదుకు పొడిగించవచ్చును.

ఇక కృష్ణాఎక్స్‌ప్రెస్ తిరుపతి వదిలే, చేరే వేళలు ఏ మాత్రం అనుకూలంగా లేవు. అందువలన బయలుదేరేటట్లు 20.00 గంటల లోపల తిరుపతి సికింద్రాబాదులు చేరేటట్లు మారిస్తే చాలా సౌకర్యంగా వుంటుంది. గుంటూరు ప్రాంతంవారి సౌకర్యం కోసం తెనాలిలో చేర్చేటట్లు ఒక పెట్టెవేయటం లేదా ఆ బండి కనుకూలంగా 14-05 బదులు 13-20కి బయల్దేరేలా గుంటూరు-తెనాలి రైలు వేళలుమార్చటం జరిగితే బాగుంటుంది.

గంగా – కావేరి ఎక్స్‌ప్రెస్‌కు పుణ్యక్షేత్రమయిన తిరుపతితో ఏమీ సంబంధముండ గూడదా? ఇది ఆలోచించదగ్గ వలసిన విషయము.

మిగిలినవి ఇదివరకు అనుకున్నవే గనుక అవిచ్ఛిన్నంగా జరిగినా పరవాలేదు. అసలు జరగటం ఊహమాత్రం అనే సంగతి మరి ఈ కూత ఏ చెవిన పట్టుందో!

నాగరాజ్ — తిరుపతి

## సంపాదకీయం

ఆధ్యాత్మిక విషయాలను ప్రముఖంగా ప్రచురిస్తూ పలువుర్ని ఆకర్షిస్తున్న 'సప్తగిరి'కి మా కృతజ్ఞతలు. జూన్ సంపాదకీయం అర్థవంతంగా ఉంది.

యం విజయ — నల్లగొండ

## బాలప్రబోధం

జూన్‌నెలలోని బాలప్రబోధం మహీదాసు కథ చాల బాగున్నది. మాకు 'సప్తగిరి' పత్రిక చాల ఉత్సాహంగా వున్నది.

చి॥ వద్ది ఓబులేశు — ప్రొద్దుటూరు

## గృహలక్ష్మి

డా॥ ఎల్లంరాజు గారి "మహాపురుషుల మాతృభక్తి" ఎంతో సంతృప్తి నిచ్చింది. ప్రతినెలా ఇలాంటి స్ఫూర్తి నిచ్చే వ్యాసాలను తప్పక ప్రచురిస్తారని ప్రార్థన. ఈ శీర్షికలో ఇంకా మాతృభక్తి కలవారిని గూర్చి ప్రచురిస్తారని ప్రార్థన.

కల్యాణి జనరల్ ట్రేడర్స్ — విజయవాడ

## అచ్చు పొరపాటు

84 జూన్ "సప్తగిరి" మాస పత్రికలో 44 వ పుట యందు మొదటి కాలంలో పైనుండి మూడవపంక్తి "వెక్కివెక్కి ఏడుస్తూ ఉద్దాలకుడు ఇలా బదులిచ్చాడు" అని వుంది. ఆ వాక్యం సరిపోవునా? పరిశీలించవలసింది.

ఎం. వెంకటాచార్యులు — అందోలు

"వెక్కి వెక్కి యేడుస్తూ ఐతరేయుడు ఇలా బదులిచ్చాడు" అని వుండాలి. అచ్చు పొరబాటుకు చింతిస్తున్నాం. ॥సం॥

## ఆణిముత్యాలు

జూన్ "సప్తగిరి" లోని వ్యాసాలు అన్నీ ఆణిముత్యాలు. "కర్మసిద్ధాంతం- రోగహేతు పరిశీలన," మహాపురుషుల మాతృభక్తి, మహీదాసు, భక్తాగ్రణి పావని, మున్నగు వానిలో ఎన్నో అమూల్య విషయాలు తెలియపరచడమైనది. ముఖచిత్రం గతంలో లాగ త్రివర్ణంలో ముద్రిస్తే బాగుంటుంది.

కె. వీరభద్రరావు — ఈతముక్కల

## గమనిక

ఈ సంచిక 14 వ పుటలో 'స్వర్ణాశ్రమ్'కు బదులు 'స్వర్గాశ్రమ్' గా చదువవలసింది.

సం॥

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాస పత్రిక...

ఆగష్టు 1984

సంపుటి 15 సంచిక 3





రాగలహరి 30 వ పుటలో


## ఈ సంచికలో....



ముఖచిత్రం: శ్రీ రాధాకృష్ణులు, చిత్రకారుడు : శ్రీ కె. జగదీశ్.

2 కవరుపేజి: తుండము నేకదంతమును.... - శ్రీ మారేమండ శ్రీనివాసరావు.

4 వ కవరుపేజి: వామనావతారం.

3 వ కవరుపేజి: శ్రీ రాఘవేంద్రస్వామి.

# సంపాదకీయం

తిను–అను–కను అనుకోవటానికి చాలా మొరటుగా అనిపించినా ప్రపంచధర్మం ముఖ్యంగా మానవ జీవితం ఈమూడింటి మీద ఆధారపడిందనే చెప్పాలి. ప్రాణికోటి జీవనానికి ఆహారం చాలా అవసరం. అది లేకపోతే శరీరం నిలవటం కష్టము. శరీరం లేకపోతే జీవులకు ధర్మసాధనమే లేదు. కనుకనే శరీరమాద్యం ఖలు ధర్మసాధనం అన్నారు. గొప్పవారంతా కూడా ఉత్క్రమణానికి బాధపడడానికి బదులు ధర్మసాధనమైన శరీరం లేకుండా పోతుందే అని తపించారట. ఈ తనువుకు మూలకారణం అన్నం అన్నారు. అన్నాద్భవంతి భూతాని అని ప్రారంభించి చివరకు అన్నాన్ని బ్రహ్మస్వరూపంగా గౌరవించారు.

దేహికి అన్నం కావాలి. అన్నమేకాదు ఇంకా ఏవేవో కావాలి. కాని వాటిని సాధించుకొనేందుకు ఆ కోర్కెలను బయటికి అనాలి. అదే భావప్రకటన. దీంట్లో ఒక సొంపు ఉండబట్టే మిగిలిన జీవజాలాలవి అరుపులు కోతలుగా మిగిలిపోతే మనిషి కూత మాత్రం ముద్దుమాటై సాహిత్యమై చివరకు బ్రహ్మానందాను సంధాయక పరమపద సోపానమైంది.

ఐతే మానవుడి ప్రగతి తినటం కావాల్సినవి అనటంతో ఆగిపోలేదు మరి! అంటూ తింటూ గడిపే కాలచక్రంలో మానవుడికి కొత్త కొత్త రుచులు, అభిరుచులు, భావాలు, అనుభూతులు ఏర్పడుతున్నాయి. తన చుట్టూ తిరిగే వాటిని, తనలోని వాటికి, తన పైన వాటికి గల సంబంధాలై ఆలోచన పెరిగి తన 'ఆర్జన' సారాన్ని ముందు తరానికి పంచి పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు. ఐహికంగా ఆస్తులు (అప్పుడప్పుడు అప్పులు) పారలౌకికంగా వేదాంత విజ్ఞానాన్ని ముందు తరాల కందించాలనే తపన ఎక్కువైంది తన అనుభవంలోకి రానిదాన్ని కొత్తగా తెలుసుకున్నదానిని పామరుడు కన్నా నంటున్నాడు. పండితుడు దర్శించా నంటున్నాడు. ఇలా అనుభూతి అనుశీలన పూర్వకమైన తపన లౌకికంగా పదార్థ విజ్ఞానావిష్కారంతోనూ ఆధ్యాత్మికంగా పారమార్మిక దర్శనాది శాస్త్ర గ్రంథావతరణకు బంగారు బాటవేసింది.

ఇహానికి పరానికి అవసరమైన ఈ మూలధర్మత్రయాన్ని, తమ తమ జీవన వికాసానికి వీటి విషయంలో గల హక్కులను మన పూర్వులు ఏనాడో గుర్తించారు. కనుకనే ఎవరి హక్కులకు భంగం కలుగని రీతిగా సహజీవన సహభావన సహదర్శన సిద్ధాంతాలను బోధించారు. వికర్షణద్వారా సంఘర్షణకు అవకాశ మున్నచోట్ల ఆత్మావలోకనం, సంయమనం బోధించారు. యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా తస్య వశ్యాణీంద్రియాణి సదశ్వా ఇవ సారథేః అనీ, శుని చైవశ్వపాకే చ పండితాస్సమదర్శినః వంటి వాటి సారాంశం ఆత్మవత్తు తత్త్వదర్శనమే.

కనుకనే ఈ దేశం బహుభాషల, రూపాల, ఆధ్యాత్మికతల సంగమమైంది. మనవికాని మతాలెన్నో మన మధు మన్స్రవంతులలో అంతర్వాహినులు కాగా మరికొన్ని మచ్చికతో తమ మనుగడ సాగిస్తున్నాయి.

తరతరాలుగా విశ్వవ్యాప్తంగా వున్న ఘర్షణలకు కారణం పై మూడు విషయాలలోను వానికి గల హక్కునీ తోటివాడు గుర్తించక పోవడం రాముడికి గల హక్కును రావణుడు గుర్తించకపోవటం రామాయణంలో ఘర్షణకు ఐదుగురికి ఐదూళ్ళ నిరాకరణ ధర్మక్షేత్రం కురుక్షేత్రం కావటానికి కారణం కావటంలో ఆంతర్యం ఇదే, అశోక కళింగ యుద్ధాలు ప్రపంచంలో జరిగిన అనేక యుద్ధాలు కూడా ఈ ప్రాథమిక సూత్రత్రయానికి తిలోదకాలీయటంవల్ల జరిగినవే.

జాతి ఎన్ని ఆపద లొస్తున్నా తట్టుకు నిలబడడానికి కారణం మనకు సహజీవన, సహభావన, సహదర్శన సిద్ధాంతాల పైన గల నమ్మకమే. అందువల్లనే మన ఆత్మశక్తివల్ల ఎన్నో త్యాగాలు చేసి, లౌకిక స్వాతంత్ర్యాన్ని రాజకీయ స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందగలిగాం. చిన్నగా ముందడుగు వేస్తున్నాం బాగానే వుంది.

[48 వ పేజీలో]

# అఖండజ్యోతి గాయత్రి

'యస్య కస్యాపి మంత్రస్య
పునశ్చరణమారభేత్,
వ్యాహృతిత్రయసంయుక్తా
గాయత్రీ మయుతంజపేత్.

నృసింహార్కవరాహాణాం
రకాలా తాంత్రికీ తథా,
వినా జప్త్వా తుగాయత్రీ
తత్సర్వం నిష్ఫలం భవేత్.

గాయత్రి, గీత, గంగ, గోవు- ఈ నాల్గును భారతీయసంస్కృతికి మూలాధారములు. వీనిలో గాయత్రిస్థానము అత్యంత ప్రముఖమైనది. నృసింహ, సూర్య వరాహాదులలో ఎవరిని ఉపాసించినను ప్రప్రథమముగా గాయత్రినే ఉపాసించవలెను. ఆకాశవాణివలన సృష్టికర్తయగు బ్రహ్మకు గాయత్రీమంత్రోపదేశము జరిగెనని పురాణకథనము. ఈ మంత్ర సాధనము వలననే సృష్టినిర్మాణశక్తిని ఆయన పొంది యుండెనని చెప్పబడినది. గాయత్రిలోని నాలుగు చరణములే బ్రహ్మచతుర్ముఖముల నుండి నాలుగు వేదములుగ రూపొందెనట.

గాయత్రీమంత్రములోని యిరువది నాలుగు అక్షరములు అపారమాహాత్మ్యము కలిగియున్నవి. వేద, శాస్త్ర, పురాణ, స్మృతి ఉపనిషత్తులు మొదలైనవానియందుగల జ్ఞానసంపదయంతయు నీ యిరువది నాల్గక్షరములందే నిక్షిప్తమైయున్నది.

గీతలో భగవానుడు "గాయత్రీ ఛందసామహమ్" అని ప్రవచించినట్లు గాయత్రీవైశిష్ట్యమును గ్రహించినవారు సర్వజ్ఞులగుదురు. సంపూర్ణసత్ఫలితమును కలిగించు గాయత్రీమంత్రసాధనతో సాధించజాలని సత్కార్యము లేదు. అనేక దివ్యాస్త్రశస్త్రములు, సువర్ణాదివివిధలోహములు తయారుచేయువిధానములు, ఓషధులు, రసాయనములు, దివ్యమంత్రములు, సిద్ధులు, శాపవరదాన ప్రయోగములు, నానావిధోపచారవిధానములు, కుండలినీ చక్రములు, మహామాతృక జీవననిర్మోకము, అజ్ఞాతసేవనము, శబ్దపరివ్యూహము, సూక్ష్మసంభాషణము, మున్నగు అనేకలుప్తప్రాయమయిన విద్యారహస్యములు గాయత్రియందు నిబిడీకృతమైయున్నవి. ఇట్టి విద్యల నభ్యసించి పూర్వ మనేకులు చక్రవర్తులు, జగద్గురువులు లోకమునకు మహత్తరసేవయొనర్చి విఖ్యాతులైరి.

గాయత్రీ సాధనము వలన ఆత్మ నావహించి యున్న మలినములు, వికారములు పటాపంచలై పోవును. గాయత్రీ ఉపాసన ప్రత్యక్షమయిన తపశ్చర్య. దీని వలన సాధకుడు సాంసారిక సౌఖ్యములనే గాక, ఆత్మికకాయకల్పము పొందగలుగును, సాత్త్వికగుణ మున్నత మగును. సంయమనము, నమ్రత, పవిత్రత, స్ఫూర్తి, శ్రమ, శీలము, పత్యనిష్ఠ, ఉదారత, ప్రేమ, ప్రమోదము, శాంతి, సేవాభావము, సౌమ్యత, ఆత్మీయత మున్నగునవి, దిన దినాభివృద్ధిచెందును. అజ్ఞానజన్యదుఃఖము లన్నియు అంతరించును.

భగవానుని నారీ స్వరూపమే గాయత్రి యని చెప్పబడుచున్నది. శారీరక, మానసిక రుగ్మతలను నిర్మూలించు దివ్యౌషధము గాయత్రి.

పురుషులతోపాటు స్త్రీలు కూడా గాయత్రీ ఉపాసన కర్హులే! వితంతువులకు దీని వలన సంయమనము, ఇంద్రియ నిరోధము, సాత్త్వికతత్త్వము అలవడును. కన్యకామణులు గాయత్రిని ఉపాసించి సద్గుణశీలురగు పతులను పొందెదరు. గర్భవతులు సత్సంతతిని కందురు. ఆయు, ప్రాణ, బల, యశో, ధన, ధాన్యాదులు, బ్రహ్మతేజస్సు ప్రసాదించునది గాయత్రి యని అథర్వవేదమున పేర్కొనబడినది. యోగమునకు మూలాధారమగు గాయత్రి వలననే సంపూర్ణయోగ సాధన చేకూరును. "గాయత్రీ మంత్రము నిత్యము జపించుట వలన రోగులు స్వస్థులై ఆత్మోన్నత్యమును బడయుదురు" అని మన జాతిపిత గాంధీజీ ప్రవచించెను. "మహర్షులు మన కొసగిన అమూల్య రత్నములలో గాయత్రి యొకటి" యని మదనమోహన మాలవ్యా యభిప్రాయపడెను. "ఎట్టి మహత్తర కార్యము

నైనను మనచేత చేయించుశక్తి గాయత్రి యందు కల"దని అరవిందుడు అభివర్ణించెను.

పరమాత్మనుండి సద్బుద్ధిని గ్రహించుటకు ఆవశ్యకమైన గాయత్రి అన్ని మంత్రములలోను శ్రేష్ఠమైనదని స్వామి వివేకానంద విపులీకరించెను.

గాయత్రీ మహిమను వర్ణించుట మానవుని సామర్థ్యమున కతీతమైనట్టిది. "ఋతువర్ణనకు, దురిత నిర్మూలనమునకు గాయత్రి యవతరించిన"దని జగద్గురు శంకరాచార్యులు శ్లాఘించిరి. "మనలో జీవన స్రవంతిని పునరుత్పన్నము చేయునదియే గాయత్రి" యని సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు స్పష్టీకరించెను. ఇట్లు ప్రాచీనులలో — అర్వాచీనులలో పలువురు ప్రముఖులు "గాయత్రిని" ప్రస్తుతించిరి.

ఓం భూర్భువస్సువః, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ – అను నీ గాయత్రీ మంత్రమును సస్వరోచ్చారణ గావించిన యనుష్ఠానపరులు దుష్కర్మలపట్ల విముఖులగుదురు. ఆధ్యాత్మికముగను, భౌతికముగను సుఖశాంతుల నందగలరు. "ఆత్మవత్సర్వభూతాని" యన్న భావముగ్రహింపగలరు. అందరి యందు పరమాత్మను దర్శించి, జీవితసార్థక్యము నార్జింపగలరు.

— శ్రీ చిమ్మపూడి శ్రీరామమూర్తి

*



## శ్రీ విఘ్నేశ్వర

శ్రీవిఘ్నేశ్వర
విఘ్నవినాయక
కొలుతుము నిన్నే
కొండంత దైవంగా
దేవగణ పూజిత
దేవతల నాయక
ధ్యానింతుము నిన్నే
విఘ్నవినాయక
శ్రీవిఘ్నేశ్వర.
భాద్రపద శుభదినంబు
శుద్ధ చవితి పండుగనాడు
పాలవెల్లి కట్టి
వాకిలి అలికి పెట్టి
ముంగిట ముత్యాల ముగ్గు లల్లి
కుడుములు ఉండ్రాళ్ళు
నైవేద్యం పెట్టి
భక్తిశ్రద్ధలతోడ కొలిచేము మేము
కరుణజూపుము మాపై
కోటిదండాలు స్వామీ!
శ్రీవిఘ్నేశ్వర
విఘ్నవినాయక!

— ఎల్. ప్రఫుల్లచంద్ర

# శ్రావణమాస విశిష్టత

ప్రతి మతంలోను పండుగ లున్నాయి. కానీ మన హిందువులకు వున్న పండుగలు మరి ఏ మతంవారికి లేవు. ఈ పండుగలు మరియు వ్రతాల ఆచరణవల్ల ఆత్మకు శాంతి చేకూరును. మనస్సు భగవంతుని చరణార విందముల లగ్నమగును. మానసికానందం కలిగితే అంతకన్న ఆరోగ్యం మరొకటి లేదంటారు. కనుక మనము వీటి నాచ రించి ఆయురారోగ్య సుఖ సౌఖ్యములు పొందుదుముగాక!

పర్వదినాలు మనకు కోకొల్లలు. కనుకనే ప్రతిమాసము ఏదో వొక పుణ్యకార్యమున కాలవాలమై యున్నది. ఆ మాసములలో శ్రావణమాసము పరమశుభప్రదముగా నున్నది. ఎందుచేతననగా ఈ మాసములో ఆచరించబడు వ్రతాలు ఏ ఇతర మాసము లలో కూడ ఆచరింప బడవు. ఈ శ్రావణ ములో వచ్చు పండుగలను వ్రతములను విశ్వాసముతో అన్నివర్గాలవారు ఆచరించె దరు. శ్రావణమాసమునందు ప్రతి సోమ వారము ఉమామహేశ్వర పూజ సర్వసుఖ ముల నిచ్చును. మరియు ప్రతి సోమ వారం సోమవారవ్రత మాచరించవల యును. గౌరీసహిత త్ర్యంబకమూర్తిని పూజించి త్ర్యంబక మహామంత్రము జపించ వలయును. ఈ వ్రతాచరణవలన సంతా నము ధనము ప్రాప్తించును.

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మా మృతాత్ ॥

"మమ శివలోకప్రాప్త్యర్థం శ్రావణ మాసే సోమవాసరే .... నిమిత్తం ఉమా మహేశ్వర పూజాం కరిష్యే"

ప్రతి సోమవారము శివపూజ యొనర్ప వలయును. స్త్రీలు ప్రతి మంగళవారము రోజున మంగళగౌరీ వ్రతము, తమ మాంగల్యాభి వృద్ధికై ఆచరించుదురు.

## "నాగపంచమి"

ఈ పండుగ శ్రావణ శుద్ధపంచమి నాడు జరుపబడును. ఇది కేవలము సర్పముల పూజా నిమిత్తమై యేర్పడినట్టిది. నాగ పూజ మన దేశమున అతి ప్రాచీన కాలము నుండి ఆచరణలోనున్నది. ప్రతి గ్రామము నందున వేపలేక రాగిచెట్టుయొక్క మూల మున నాగవిగ్రహము లుండును. వానికి నాడు ఉదయమున పాలు, కొబ్బెర, పాయ సము అన్నము ఆరగింపు చేయుదురు. తరువాత పుట్టల యొద్దకు వెళ్ళి ప్రత్తితో వస్త్ర ముల వంటివిచేసి పుట్టల నలంకరించి, పూజించి పుట్టలలో పాలు పోసి ప్రదక్షిణ నమస్కారములు చేయుదురు. నాగపంచ మినే వైష్ణవసంప్రదాయానుయాయులు 'గరుడ' పంచమి యందురు, నాగపంచమి గురించి కొన్ని కథలు ప్రచారములో కలవు. ఈ రోజు భూమిని త్రవ్వరాదట.

## వరలక్ష్మి వ్రతము

ఈ వరలక్ష్మి వ్రతము శ్రావణ పూర్ణిమకు ముందువచ్చే శుక్రవారమున ఆచరింపబడు చున్నది. ఈ వ్రతమును సత్సంతానప్రాప్తి కొరకును మరియు సకల సంపదల కొరకును జరుపవలెనని శంకరుడే పార్వతికి చెప్పి నట్లు పురాణములయందు గలదు. ఈ వ్రత మాచరించుట వలననే పార్వతికి షణ్ముఖుడు జనించెను. పలువురు పతివ్రత లీ వ్రతము చేసిరి. పూర్వము కుండిన పురమున చారుమతి యను పతివ్రత స్వప్నమున ఈ వ్రతమును గ్రహించి శుక్రవారమున అతి భక్తితో చేసెను. ఈ వ్రతము వలన స్త్రీలకు సంతాన సౌభాగ్య ఐశ్వర్యములు కలుగును.

## "శ్రావణ పూర్ణిమ" - "రాఖీపూర్ణిమ"

శ్రావణపూర్ణిమను శ్రావణీ యనిసంస్కృతంలో అన్నారు, జంధ్యాల పూర్ణిమ యని ఆంధ్రులు, పూనూల్ పున్నమ యని అరవలు, నార్లపున్నమ అని మహారాష్ట్రులు, గుజరాతీలు, మాళవ దేశీయులు "రాఖీపున్నమి" అని ఆ యా రాష్ట్రాలలో ఆచార వ్యవహారాలను బట్టి విభిన్న నామాలతో వ్యవహరిస్తుంటారు. ఉపాకర్మ అంటే ప్రారంభ మని అర్థము. ఇది అత్యంత ప్రధానమైన వైదికకర్మ. తొలిసారిగా జరిగే యజ్ఞోపవీత సంస్కారానికి ఉపనయనం అని పేరు. వేదాధ్యయనం గాయత్రి జపంతో ప్రారంభమౌతుంది. ఈ పండుగనాడు యజ్ఞోపవీత ధారులు క్రొత్తజందెములను ధరిస్తారు. జందెములో మూడు పోగులు అనగా తొమ్మిది తంతువు లుండును. అట్టి వాటిని గృహస్థుడు మూడు - వానప్రస్థుడు రెండు - బ్రహ్మచారి, యతి ఒకటి చొప్పున ధరింపవలెను.

## రక్షాబంధన పూర్ణిమ

అని కూడ శ్రావణ పూర్ణిమకు పేరున్నది. ఇరుగు పొరుగులు అన్యోన్య ప్రేమతో సోదరసోదరీ పవిత్రబంధాన్ని విశ్వాసానికి చాటిచెప్పే దివ్యపర్వము ఇది. సోదరీ సోదర పవిత్రప్రేమకు రక్షాబంధనం రమణీయ చిహ్నం ఈ పండుగరోజున సోదరీమణులు అన్నతమ్ములకు రాఖీ (రక్ష) కట్టి వారిని తమ సంరక్షణ నిర్వాహకులుగా భావిస్తారు. ఈ రోజు బంధువులును స్నేహితులును ఒకరికొకరు ముంజేతిపై కంకణములను కట్టుకొందురు. దీనినే రక్షా బంధన్ అని యందురు. పరస్పర అనుబంధాన్ని పెంచే బంధం కనుక దీని కింత ప్రాముఖ్యం. సర్వదేవతలకు ఈనాడు పవిత్రోత్సవములు చేయువచ్చును.




## ప్రకటన రేట్లు

**మామూలు పేజీలకు :**

| | |
|---|---|
| పూర్తి పేజీ : | 500 రూ |
| అర్ధ పేజీ : | 300 రూ |
| పావు పేజీ : | 150 రూ |
| ఒక కాలమ్: | 200 రూ |

### సాంకేతిక సమాచారం

| | |
|---|---|
| పేజీపై కాల్యం; | 27.5 సెం మీ × 21.5 సెం. మీ |
| ముద్రణస్థలం: | 24" × 19 సెం. మీ |
| కాలమ్‌లు : | 3 |
| స్క్రీన్ కవరు | 100 |
| లోపల: | 65 |

**గమనిక :**

1. ప్రకటన సమాచారం, బ్లాకులు ప్రకటన దారులే ఇవ్వాలి.
2. ఆరు నెలలకు ముందుగా ప్రకటనస్థలం కేటాయించు కొనదలచిన వారికి 10 శాతం, సంవత్సరానికి ప్రకటనస్థలం కేటాయించుకొనే వారికి 15 శాతం, పై రేట్ల పై తగ్గింపు ఇవ్వబడుతుంది.
3. ఏవిధమైన నోటీసుగాని లేదా ఏ కారణంగాని తెలుపకనే ప్రకటనలను తిరస్కరించే హక్కు సంపాదకుడికి వుంటుంది.
4. కవరు పేజీలకు ప్రకటనలు స్వీకరింపబడవు.

ఇతర వివరాలకు :

సంపాదకుడు.

### శ్రీకృష్ణజన్మాష్టమి

శ్రీమహావిష్ణువు అవతారముగా హిందూ ప్రపంచముచే పూజింపబడు శ్రీకృష్ణ భగవానుడు దేవకీ వసుదేవుల అష్టమగర్భంబున రోహిణీ నక్షత్ర యుక్తమైన శ్రావణ బహుళ అష్టమిరోజున జనన మందెను. కావున ఈ రోజున శ్రీకృష్ణుని జన్మదినోత్సవము జరుపబడును. శ్రీకృష్ణుడు అష్టమినాడు రోహిణీ నక్షత్రమున రాత్రి యుద్భవించెను. కనుక ఆనాడు పగలంతయు నుపవసించి సాయంకాలమున కృష్ణుని పూజించి భగవద్గీత మున్నగు గ్రంథములను పఠించవలెను. శ్రీకృష్ణుడు లోకోపకారార్థము ప్రపంచమునకు ప్రసాదించిన గొప్పగ్రంథము "భగవద్గీత." గీత సమస్త దేశములలో సర్వకాలములలో సర్వమానవుల కుపకరించు మహాగ్రంథము. శ్రీకృష్ణుని చరితము అపరిమితమైనది. ఇతనిపై నున్నంత సాహిత్యము ప్రపంచమున నేభాషలలోనులేదనవచ్చును. ఇతని చరిత్ర ఆబాలగోపాలము ఎరిగినదే గనుక మరల వివరించుట చర్వితచర్వణము.

### "పొలాల అమావాస్య"

ఈ రోజున దేవీవ్రతము జరుపుదురు. దీనినే "తల్లి కడుపు నోము" పూజ అనెదరు. తల్లి తన కుమారులకు కంకణములు కట్టును. ఇంతేకాక దీనిని "వృషభ పూజా పిఠోరి వ్రతం" అని కూడ అందురు. వృషభ పూజ చాల ముఖ్యమైనది. ఈనాడు పశుగణముల నలంకరించి పూలదండలు మెడలో వేయుదురు. వృషభములను గౌరవించెదరు.

— జి. ఆర్. నరసయ్య



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత :

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి



(గతసంచిక తరువాయి)

## పదిహేనవ అధ్యాయం

### పురుషోత్తమ ప్రాప్తియోగం

శ్రీ భగవానువాచ :

ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥

శ్రీ భగవానుడు: వేదాలు ఆకులుగా వేళ్లు పైకి, కొమ్మలు క్రిందికీవుండే సంసారమనే అశ్వత్థవృక్షం(రావిచెట్టు) నాశం లేనిదని చెబుతారు. ఇది తెలుసుకున్నవాడే వేదార్థం ఎరిగినవాడు.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖాః
గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే॥

ఈ సంసారవృక్షం కొమ్మలు గుణాలవల్ల పెంపొందుతూ విషయ సుఖాలే చిగుళ్లుగా క్రిందికీ మీదకీ విస్తరిస్తాయి. మానవలోకంలో ధర్మాధర్మకర్మబంధాలవల్ల వానివేళ్లు దట్టంగా క్రిందికి కూడా వ్యాపిస్తాయి.

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూలం
అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా॥

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

ఈ సంసార వృక్షం స్వరూపం కాని, ఆదిమధ్యాంతాలు కాని ఈ లోకంలో ఎవరికీ తెలియవు. లోతుగా నాటుకున్న వేళ్ళతో విలసిల్లుతున్న ఈ అశ్వత్థ వృక్షాన్ని వైరాగ్యమనే ఖడ్గంతో ఖండించివేశాక, పునర్జన్మలేకుండాచేసే పరమపదాన్ని వెదకాలి. అనాదిగా ఈ సంసారవృక్షం విస్తరించడానికి కారకుడైన ఆదిపురుషుణ్ణి-పరమాత్మను శరణు పొందాలి.

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్॥

అభిమానం, అవివేకం లేకుండా, అనురాగదోషాన్ని జయించి, ఆత్మజ్ఞాన తత్పరులై, కోరిక లన్నిటినీ విడిచిపెట్టి, సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతులైన జ్ఞానులు శాశ్వతమైన ఆ బ్రహ్మపదాన్ని పొందుతారు.

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥

దాన్ని సూర్యుడు కాని, చంద్రుడు కాని, అగ్ని కాని ప్రకాశింపచేయలేరు. దేనిని పొందితే మళ్ళీ సంసారానికి రానక్కర లేదో అలాంటి పరంధామం నాది.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥

నాలోని శాశ్వతమైన ఒక అంశమే మానవలోకంలో జీవాత్మగా పరిణమించి ప్రకృతిలోని జ్ఞానేంద్రియాలనూ, మనస్సునూ ఆకర్షిస్తుంది.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్॥

వాయువు పువ్వులనుంచి వాసనలను తీసుకుపోయే ట్లుగా జీవుడుశరీరాన్ని ధరించేటప్పుడూ, విడిచిపెట్టేటప్పుడూ ఇంద్రియాలనూ, మనస్సునూ వెంటబెట్టుకు పోతాడు.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥

ఈ జీవుడు చెవి, కన్ను, చర్మం, నాలుక, ముక్కు అనే ఐదు జ్ఞానేంద్రియాలనూ, మనస్సునూ ఆశ్రయించి శబ్దాది విషయాలను అనుభవిస్తాడు.

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥

మరో శరీరాన్ని పొందుతున్నప్పుడూ, శరీరంలో వున్నప్పుడూ విషయాలను అనుభవిస్తున్నప్పుడూ, గుణాలతోకూడి వున్నప్పుడూ కూడా ఈ జీవాత్మను మూఢులు చూడలేరు. జ్ఞానదృష్టి కలిగినవాళ్లు మాత్రమే చూడగలుగుతారు.

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥

ప్రయత్నం సాగించే యోగులు తమలోని పరమాత్మను దర్శిస్తారు. ఆత్మసంస్కారంలేని అవివేకులు ప్రయత్నించినా ఈ జీవాత్మను తిలకించలేరు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

సూర్యుడిలో వుండి జగత్తునంతటినీ ప్రకాశింపచేసే తేజస్సూ, చంద్రుడిలో, అగ్నిలోవుండే తేజస్సూ నాదే అని తెలుసుకో.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీః స్సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥

నేను భూమిలో ప్రవేశించి నా ప్రభావంతో సర్వభూతాలనూ ధరిస్తున్నాను. అమృతమయుడైన చంద్రుడిగా సమస్త సస్యాలనూ పోషిస్తున్నాను.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

"వైశ్వానరుడు" అనే జఠరాగ్నిరూపంతో సకల ప్రాణుల శరీరాలలోనూ వుండి ప్రాణాపానవాయువులతో కలిసి, నాలుగురకాల ఆహారాలను జీర్ణం చేస్తున్నాను.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥

సర్వప్రాణుల హృదయాలలో వున్న నావల్లనే జ్ఞాపకం, జ్ఞానం, మరపుకలుగుతాయి. వేదాలన్నిటివల్ల తెలుసుకోవలసినవాణ్ణి నేనే. వేదాంతాలకు కర్తనూ, వేదాలను ఎరిగినవాణ్ణి నేనే.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥

ఈ లోకంలో క్షరుడనీ, అక్షరుడనీ ఇద్దరు పురుషులున్నారు. నశించే సమస్తప్రాణుల సముదాయాన్ని క్షరుడనీ, మార్పులేని జీవుణ్ణి అక్షరుడనీ అంటారు.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

ఈ ఉభయులకంటే ఉత్తముడు నాశనంలేని ఈశ్వరుడిగా మూడు లోకాలలోనూ వ్యాపించి, వాటిని పాలిస్తున్న పరమాత్మ.

యస్మాత్క్షరమతీతోఽహమ్ అక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥

నేను క్షరుడిని మించినవాడినీ, అక్షరుడికంటే ఉత్తముడినీ కావడంవల్ల లోకంలోనూ, వేదాలలోనూ పురుషోత్తముడిగా ప్రసిద్ధి పొందాను.

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ! ॥

అర్జునా ! అజ్ఞానం లేకుండా అలా నన్ను పురుషోత్తముడిగా తెలుసుకునే వాడు సర్వజ్ఞుడై అన్నివిధాల నన్నే ఆరాధిస్తాడు.

ఇతి గుహ్యతమం శాస్త్రమ్ ఇదముక్తం మయాఽనఘ!
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత !

అర్జునా! అతిరహస్యమైన ఈ శాస్త్రాన్ని నీకు చెప్పాను. దీన్ని బాగా తెలుసుకున్నవాడు బుద్ధిమంతుడూ, కృతార్థుడూ అవుతాడు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "పురుషోత్తమప్రాప్తియోగం" అనే పదిహేనవ అధ్యాయం సమాప్తం.

# రమాపరిణయంలో రామణీయకత

(గతసంచిక తరువాయి)

తాబేలివై స్వల్పజంతువులను అరుదుగా భక్షించడం కాదయ్యా ఈ కుడుములు నతి రసంబులు దృప్తిగా భుజియించవయ్యా! పందివై తుంగగడ్డలను కరకర నమలడం కాదయ్యా, ఈ కరజికాయలు,వడలు,గారెలు, ఇడ్డెనలు రుచిరుచిగా భుజియించవయ్యా! హిరణ్యకశిపుని రక్తాన్ని పానం చేయడం కాదయ్యా, ఈ తేనెపానకమును పానము సేయవయ్యా! ఇంతవరకు బ్రహ్మచారిగా వుంటూ ఆహారనియమాన్ని పాటించావు. ఇంకనీయిష్టం.భ్రమతీర అన్నియుభక్షించ వయ్యా!-" అని ఈశ్వరుడు ఈసడింపుగా ఇంపుగా పల్కినాడు. అవన్నీ తిన్నాడో లేదో గానీ మాటలు మాత్రం తక్కువతిన్నాడా మాధవయ్య. ఓపన్నగాభరణా! చక్కని పునుక కంచం పుచ్చుకొని యెక్క డెక్కడో బిచ్చ మెత్తినాసరే ఆకలితీరక చివరకు విషం మెక్కడంకాదయ్యా,ఇప్పుడీదివ్యాన్నాన్ని ఇష్టంగా భుజించవయ్యా! భూతములను చంపి తిని అంత్రటితో పరితృప్తి చెందక పావనుండైన చిరుతొండ భక్తుని శిశు మాంసము భక్షించుట కాదయ్యా, ఇప్పుడీ భక్ష్యంబు లన్నియు భుజియింపవయ్యా!' అని లోగుట్టు బయటపెట్టాడు ముకుందుడు.

'ఈడిగదాని కల్లుకుండ వలన
కలిగిన మాలిన్యం తొలగి
పోతుందిలే. ఇదిగో నా యెంగిలి తిను'

అని తన భుక్తశేషాన్నాన్ని శివుడారగించే కనకపాత్రలో వేశాడు హరి. శంకరుడు

శ్రీ ఏ. వి. రమణప్రసాద్

సంతోషించాడు. 'నీవు ఆకలికి ఆగలేక బోయదాని యెంగిలిపండ్లు తినలేదా! ఆ దోషం పోవాలంటే ఇదిగో నా యెంగిలి తిను' మని శివుడు తన అన్నాన్ని హరి పళ్ళెరంలో వేశాడు. విష్ణువు ఆనందించాడు.

'ఆహా! ఏమి నీ శీలము. నీ గొప్పతనము కన్నప్పకేయెఱుక.ఎందుకులేఇప్పుడదంతా. నా చెల్లెలు ముందు నిన్ను చిన్నబుచ్చడం భావ్యం కాదు' — అన్నాడు హరి.

'నీ చపలత్వ మెట్టిదో గోపసుందరులకే తెలుసు.ఎందుకులే రమాదేవి ముందునిన్ను రట్టు గావించడం' అన్నాడు హరుడు.

'అవునవును. నీ నిశ్చల చిత్తము మోహినీదేవి బాగుగా ఎఱుంగును' — అని కేశవుడు నుడువగా—

'నిజమే మరి. నీ కామ సంకల్పము బ్రహ్మాదులకు తెలుసుకదా' అన్నాడు శివుడు. ఇట్లు హరిహరులు అన్యోన్యముగా వాదులాడుకొను చుండగా ఇక తమవంతు తప్ప దన్నట్లు హిమతనూజ రమాదేవితో 'ఓ చిగురుబోడి! భోజనము చేయకున్నా వేమిటి? చక్కెరపొంగలి మెక్కడానికి సంకోచ మెందుకమ్మా! పెళ్ళికూతురువు. నీవే ఇవన్నీ భోంచేయాలి' అని పల్కుచూ నవ్వుచుండగా యమున విన్నది.

పెండ్లికొడుకు గడుసరి, నోరు విప్పితే పెడసరి. మాటకు మాట వడ్డిస్తున్నాడు. అతనికి ఎవరి సహాయమూ అక్కరలేదు. పెళ్ళి కూతురు సిగ్గరి. మాటాడితే ముక్తసరి. పాపం! బదులు పలుకలేక పోతోంది. ఆడపడుచు ఆటపట్టిస్తోంది. అందుకే కూతురు తరుపున తల్లి వచ్చింది. యమున అంది కదా! "ఏమ్మా! పార్వతీ! పెళ్ళికూతురు పదార్థాలు ఒకటి కూడా భక్షించడం లేదు. సిగ్గేమో? పోనీలే పసిబిడ్డకదా! ఏం తింటుంది?



'నీవు మునుకొని బ్రహ్మాండముల
నీనినావు
కనుక నీ కడు పతి ఘనముగా నుండు
అటుగాన భక్ష్య భోజ్యాదు లెన్నైన
పటు తీవ్రముగ నీవు భక్షింపగలవు.'

కావున నీవు కోరినవన్నీ వడ్డిస్తాను, తిన వమ్మా!" — అని పల్కింది. దానికి బదు లేమివ్వాలో పార్వతికి తోచలేదు.

'అత్తగారూ! పాలు త్రాగడం కూడా చేతగాని పసిబిడ్డ అని కూతురును వెనకేసుకొని మాట్లాడుతున్నారా! నిజంగా మీ అమ్మాయి బాలికయే అయినచో భర్త కొరకు తపమెట్లు చేసింది? మా అన్న నెలా వలచింది? అమ్మో! మీ కూతురు పసిబిడ్డా! కాదు అసాధ్యురాలు. బహుసూత్రధారి. మహా సాత్త్వికులకు సైతం గర్వము పుట్టించ గలదు. కపటంబుతో కాలగతుల భావించ గలదు. పేదలను ధనవంతులుగను. ధన మదాంధులను ధనహీనులుగను మార్చ గలదు. ఎల్లజాతులను చపలుర గావించ గలదు.' — అని ఇక్కడ పార్వతీదేవిచేత వెంగమాంబ ఇందిరను నిందాస్తుతి గావించి లోకమాతగా లోకానికి తెలియజేసింది.

ఆంధ్రవాఙ్మయంలో బువ్వము బంతిని ఇంత సుదీర్ఘంగా వర్ణించినది శ్రీనాథుని తరువాత వేంగమాంబయే అని చెప్ప వచ్చును. శ్రీనాథుని బువ్వము బంతి రసిక జన కలాపము కాగా వెంగమాంబ బువ్వము బంతి సరసవచోవిలాసము.

ఆ విధంగా హరిహరులు, రమాగిరిజలు మేలము లాడుకొను చుండగా సాగరుడు నవ్వుచూ వచ్చి "మీరు బలవంతులు. ఆనంద భరితులు. ఒక్కరొక్కరికన్న ఉత్తమోత్త ములు. మీకు భేదములేదు. ఓ జలజాక్షా! సమస్తలోకాలూ నీ చిన్ని బొజ్జలో శ్రీరామ రక్షగా వున్నవయ్యా. నీ ఆకలి తీర్చుటకు నే నెంతవాణ్ణి. నా కల్గినయంతమాత్రమున సత్కరించుచున్నానని, లోకసహజంగా ఆడపిల్లతండ్రిగా పల్కినాడు.

జలజాసనాదులు ఆ జలరాశి మాటలకలరి, ముదమంది తృప్తిగా భుజించి లేచి కరప్రక్షాళన ములు గావించినారు. అందరికినీవిడెము లిప్పించినాడు పెండ్లికొడుకు. అందరును ఇష్టకథావినోదముల సంతోషమగ్నులై యున్నారు. అటు ఇటు చూచాడు హరి. ఎవరూ చూడ్డంలేదనుకున్నాడు.

"శ్రీ వేంకటేశు డాశ్రిత జనావనుడు....
అంతనచ్చటనుండి హాటక కలశ
మెంతయు భీతితో నెలమి నెత్తుకొని
వేటొక్క విడిదికి వేడ్కతో"..నరిగినాడా.

తానందరికీ తాంబూలా లిప్పించాడు. మరి? తన కిచ్చేవారు? రారు. వారు రావాలను కున్నా ఆ చోటు చాటు కాదుకదా! అందుకే చటుకున అటనుండి విడిది కేగినాడు. ఊరికే వెళ్ళితే ఊహిస్తారనికాబోలు! కనక కల శాన్ని కైకొని కదిలాడు. ఇదంతా కాంత కోసం కాంతుని వలవంత అని పసికట్టినారు సాగరాంగనలు. ఇందిరను ముందరిడుకొని వచ్చి వివరించి విడిదిలోనికి పంపించి సర్వోప చారాలూ చేయించారు. కాంక్షతీరింది కన్న య్యకు, కప్పురపు విడెము కరకరా నములు తున్నాడు. అందరి వదలి, శేషహోమము విడిచి ఎందు కిలా వచ్చాడో అర్థం కాలేదు అమ్మవారికి.

"జలజాతనయన నాస్వామి యిచ్చటికి
యలసివచ్చిన దేమి యానతీవోయి!"

అని అడిగింది.

"మజ్జనకు నివ్వేసాలచేత
నళికింప దలచి నే డలిగి వచ్చితివా'
'చెల్లెలౌ పార్వతి కచట
అన్నంబుసాల కిట్లలిగివచ్చితివా'

"తిరుపణాచారైన దెప్పింతు ననిన
హరుని వాక్యముల కిట్లలిగి వచ్చితివా"
'పేదవారింటిలో పెండ్లి యాడితిని
యాదాయ మేమని యలిగి వచ్చితివా'

"పెండ్లికి దీసిన అప్పెట్లుదీర్తునని
విచారమునని ట్లలిగి వచ్చితివా"

(37 వ పేజీలో)

సాంస్కృతిక భారతావనిలో 'ఋషీకేశ్' పుణ్యస్థలాన్ని గూర్చి విననివారు అరుదు. హరిద్వార్‌కు ఈశాన్యదిశలో 24 కి. మీ. దూరంలో ప్రశాంత ప్రకృతివాతావరణంలో "ఋషీకేశ్" పుణ్యక్షేత్రం ఉంది. దీని వైశాల్యం 11.20 చ. కి. మీ. ఉంటుంది. జన సంఖ్యాదాదాపు 30 వేలు. హిమాలయాలలో ఉంది. దక్షిణపు దిక్కున పవిత్ర గంగానది ప్రవహిస్తుంటుంది. మిగిలిన మూడు దిక్కులలో హిమాలయాల రమణీయ ప్రకృతి శోభ చుట్టి ఉంటుంది.

"రవ్యమహాముని" ఇక్కడ ఘోర తపస్సు చేశాడని, భగవంతుడు "హృషీకేశు"డనే నామంతో దర్శనమిచ్చాడని ఇక్కడ స్థల పురాణం చెబుతుంది.

"హృషీక" మనగా త్వక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు. వీనినే విషయేంద్రియములంటారు. హృషీకములను గెల్చినవాడు 'ఋషి' అవుతాడు. హృషీక + ఈశుడు — హృషీకేశుడు ఇంద్రియములకు అధిపతి— భగవానుడు (విష్ణువు రూఢి అర్థం). సహజంగా మానవుడు విషయేంద్రియములకు దాసుడైతే, ఆ విషయేంద్రియములే భగవానునిచే శాసింపబడతాయి. ప్రతిజీవి హృదయస్థానమే భగవన్నిలయం అని ఆర్యవాక్కు—

హృదయం హృషీకేశస్థానం సర్వేంద్రియ వ్యాపార నిరోధకతా రూప శక్తేః తత్ర సత్త్వాత్.

శ్రీమద్రామానుజాచార్యులవారు హృషీకేశ్‌ను గురించి ఈవిధంగా ప్రవచించారు-

జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజసాం నిధిం స్వసంకల్పకృత జగదుదయ విభవ లయలీలం హృషీకేశమ్.



హృషికేశుని శ్రీ మహావిష్ణువుగా ఊహించి ఇక్కడ గంగాతీరంలో 'భరత మందిర్' నిర్మించారు. శ్రీమహావిష్ణువుకు భరతుడనే నామము కూడ ఉంది. అయితే భరత దేవాలయంలో కల శ్రీమహావిష్ణువుని శ్రీరాముని అనుజుడు "భరతుడు" గా కూడ కొందరు చెప్తారు. భరత మందిరానికి 108 సార్లు ప్రదక్షిణం చేసినవారికి బదరీ నారాయణుని సేవించిన ఫలితం కలుగుతుందని యిక్కడి వారి నమ్మకం.

### సూర్యభగవానుని విగ్రహం

భరత మందిరానికి ప్రదక్షిణంచేసే సమయంలో ఒక విషయం యాత్రికుల హృద




ఇక్కడనుండి డెహ్రాడూన్ 42. కి. మీ., ముస్సోరి 77కి. మీ., దేవప్రయాగ 70 కి.మీ, రుద్రప్రయాగ 139 కి. మీ., కర్ణప్రయాగ 170 కి.మీ, యమునోత్రి 288 కి.మీ, గంగోత్రి 258 కి.మీ. ఉత్తర కాశి 154 కి. మీ., కేదార నాథ్ 228 కి. మీ., బదరీనాథ్ 298 కి. మీ. దూరంలో ఉంటాయి. దేశవిదేశాలనుండి నిత్యము అనేక వేల సంఖ్యలో యాత్రికులు ఈ పుణ్యస్థలిని దర్శించుకొని పునీతులౌతుంటారు.

### "ఋషీకేశ్" కు అర్థం ఏమిటి ?

ఈ నాటి "ఋషీకేశ్" పూర్వం 'హృషీకేశ్' గా వ్యవహరింపబడేది. సత్యయుగంలో

షేక్ మౌలాలి



విశ్వవిఖ్యాతమైన 'లక్ష్మణఝూలా' మరియు వెనుక 'స్వర్గాశ్రమ్' ను చిత్రంలో చూడవచ్చు.

యాన్ని కలిచివేస్తుంది. గర్భగుడి వెనుకవైపు సూర్యభగవానుని విగ్రహం, ముఖము, చేతులు వికృతం చేయబడి ఉన్నవి. కారణం అడిగితే ఔరంగజేబు దండయాత్రల ఫలితమని అక్కడ పూజారి చెప్పాడు. భరత మందిరానికి దాపులో హనుమాన్ మందిర్ ఉంది.

కాలగతిలో "హృషీకేశుడు" ఋషీకేశుడు గాను, హృషీకేశ్ ఋషీకేశ్ గాను మారి ఈ పుణ్యస్థలి సర్వదా సాధుసమాజముతోను, భక్తబృందాలతోను విలసిల్లుతూ వస్తుంది.

## త్రివేణీ ఘాట్

యమున, సరస్వతీ అనే చిన్న ఉప నదులు ఋషీకేశ్‌లో 'గంగ'తో సంగమిస్తాయి. ఆ సంగమస్థలిని "కుబ్జాభ్రకము" అంటారు. శ్రీరాముడు ఉత్తరఖండంలో కొంతకాలం యిక్కడ తపస్సు చేశాడని స్థానికులు చెప్తారు. సంగమం ఒడ్డున శ్రీ రఘునాథ దేవాలయం ఉంది.

ప్రతిరోజు వేలాది యాత్రికులు పూర్వీకులకు త్రివేణీ ఘాట్‌లో పిండప్రదానం చేస్తారు. సంధ్యాసమయంలో చిన్న చిన్న బుట్టల్లో పుష్పములు, దీపములు అమర్చి గంగా ప్రవాహంలో వదులుతారు. ఇలా చేస్తే తమ పూర్వీకులకు పుణ్యఫలాలు, మోక్షప్రాప్తి చేకూరుతుందని వారి నమ్మకం. సంధ్యాసమయపు చిరు చీకట్లలో లేత నీల వర్ణంగా కానవచ్చే గంగాప్రవాహంలో బంగారు వన్నెలతో వెలిగే సహస్రాధిక దీపాలు "నీలకాంత మణులా!" అన్న భ్రమకు లోనుచేస్తాయి. అర కిలో మీటరు వెడల్పు, ఒక కిలో మీటరు పొడవున దీప మాలికలు ఆకాశంలో నక్షత్రమాలికలను ధిక్కరిస్తూ 'హరిద్వార్' వైపు పయనిస్తుంటాయి.

త్రివేణికి పైన "చంద్రభాగ" నది గంగతో కలుస్తుంది. ఆ సంగమస్థానాన్ని 'మాయాకుండ్' అంటారు. మాయాకుండ్ కుబ్జాకుండ్‌ల మధ్య 1 కి. మీ. పొడవున ఋషీకేశ్ నగరం ఉండేది. కాని ఈనాడు అది 5 కి. మీ. పెరిగి లక్ష్మణ ఝూలా వరకు వ్యాపించింది.

## జగత్ప్రఖ్యాతమైన 'లక్ష్మణఝూలా'

ఋషీకేశ్ బస్టాండు నుండి 5 కి. మీ. దూరంలో విశ్వవిఖ్యాతిగాంచిన లక్ష్మణ ఝూలా ప్రతి యాత్రికుని ఆహ్లాదంతోపాటు ఆనందాన్ని కలిగిస్తుంది. ఇక్కడ గంగా నది తూర్పునుండి పడమర దిక్కుకు చాల శీఘ్రగతిని ప్రవహిస్తుంటుంది. ఉత్తర ఖండంలో శ్రీరాముడు 'గంగ'ను దాటటానికి అనువుగా అంబులతో ఒక వంతెనను కూర్చాడని స్థానికుల కథనం. కాలగతిలో అక్కడ మధ్యలో ఏ ఆధారం లేకుండ నార తాళ్ళతో ఒక వంతెనను ఏర్పరచి, దానికి ఒక చెక్కపెట్టెను వ్రేలాడదీసి, అందులో మనుష్యుల్ని కూర్చోబెట్టి వేరే తాడు సాయంతో నదిపై చేరవేసేవారు.

క్రీ. శ. 1889 సం. లో ఒక విషాద సంఘటన జరిగింది. కొందరు యాత్రికులు చెక్కపెట్టెలో కూర్చొని 'గంగ'ను దాటుతూ నదీమధ్యలోకి వచ్చేసరికి, తాడు తెగి అంతా గంగ పాలైనారు. ఆ హృదయ విదారక దృశ్యాన్ని జయపూర్‌కు చెందిన ఒక జమీందారిణి నిల్చొని చూస్తుండిపోయింది. వెంటనే కుమారుడైన సేఠ్ సూరజ్‌మల్ శ్రీ ప్రసాద్‌జీను మామూలు తాడు స్థానే లోహపు తాళ్ళతో వేలాడే వంతెన నిర్మించవలసినదిగా కోరింది. ఈనాడు మనకు కన్పించే వంతెన 19 7లో ప్రభుత్వం నిర్మించింది. దీని పొడవు 450 అ. ఎత్తు 70 అ. ఈ వంతెనపై నిత్యం కొన్ని వేల యాత్రికులు నడుస్తుంటారు. యాత్రికుల గమనానికి ఈ వంతెన కదుల్తూ ఊయల లాగ ఊగుతూ వినోదాన్ని కలిగిస్తుంది. ఈ వంతెన దాటినవారు 'ముక్తి' పొందుతారని భక్తుల విశ్వాసము. ప్రపంచంలోని ముఖ్యదర్శనీయ దృశ్యాలలో లక్ష్మణఝూలా ఒకటి.

ఇక్కడే ఉత్తరపు గట్టుమీద లక్ష్మణుడు తపస్సు చేసిన స్థలములో లక్ష్మణ దేవాలయం వెలసింది. దానికి దగ్గరలోనే లక్ష్మణ ఝూలా హోటలు ఆధునిక సౌకర్యాలతో యాత్రికులను ఆకట్టుకుంటుంది. యాత్రికులు మొదట లక్ష్మణ దేవాలయం దర్శించి, లక్ష్మణ ఝూలా దాటగనే పదమూడు అంతస్థులతో అధునాతనంగా కట్టబడిన పెద్దదేవాలయం 'స్వర్గాశ్రమ్' లోకి వెళతారు. దీనినే 'కైలాసా

నందమందిర్' అంటారు. అందు ప్రతి అంతస్థులో విభిన్న దేవీదేవతల విగ్రహాలు ఉన్నాయి. 13వ అంతస్థులో ధ్యాననిష్ఠలో కూర్చున్న 'శివమూర్తి' దర్శన మిస్తాడు. అక్కడ గంగోత్రినుండి తెచ్చి సీలు చేసిన 'గంగాజలము',పూజచేసిన రుద్రాక్ష, తులసీ మాలలు భక్తులకిస్తారు. అక్కడ నుండి సంపూర్ణ ఋషీకేశనగర దర్శనం అవుతుంది. హిమాలయ రమణీయ ప్రకృతి శోభ తిల కించ వచ్చును. క్రింద పర్వతాలను చీల్చు కుంటూ పరుగిడు గంగా ప్రవాహదృశ్యము ఆహ్లాదకరం గాను, మనోహరం గాను ఉంటుంది.



ఆదిశంకరులచే స్థాపించబడిన 'కైలాస ఆశ్రమ్'

కైలాసానంద మందిరానికి పడమరగా భారత్ కా సాధు సమాజ్, మహర్షి ధ్యాన విద్యాపీఠ్,గీతాభవన్,పరమార్థనికేతన్,ఆశ్ర మాలు ఉన్నాయి. ఈ ఆశ్రమాల్లో నిత్యము వేదము, గీత, రామాయణ మహాభారత తది తర పురాణముల ప్రవచనం, భజనలు, కీర్త నలు జరుగుతుంటాయి. ఇక్కడ ఎంద రెందరో సాధుపుంగవులు దర్శన మిస్తారు. ఈ ఆశ్రమాల్లో భక్తులకు ఉచిత భోజన వసతి సదుపాయాలు ఉన్నాయి. గీతా భవన్‌లోని 'శివమందిరం' ఒక ప్రత్యేక ఆకర్షణ. దీనజనోద్ధరణ, పరమార్థనికేతన్ ఉద్దేశ్యం. వేదనికేతన్ దాపులో మహేష్ యోగి ఆశ్రమ మున్నది.

పై ఆశ్రమములకు స్వర్గాశ్రమానికి మధ్య మార్గమున కిరుపైపుల మామిడి తోటలు మిక్కుటంగ ఉన్నాయి. ఈ మామిడిచెట్లు మే, జూన్ నెలలలో పుష్పించి అక్టోబరు, నవంబరు మాసములలో ఫలవంత ములు కావటం మరొక విశేషం. మార్గ మంతా సిమెంటు పూయబడి యిరుపైపుల యాత్రికుల విశ్రాంతికొరకు బెంచీలు వేయ బడి ఉన్నాయి. ప్రతి నూరు గజాలకు మంచినీటి కుళాయిఉంది. చిన్న చిన్న ఫలహార శాలలు, టీ దుకాణాలు ఉన్నాయి.



ఋషికేశ్‌లో గంగాతీరాన వివిధ ఆశ్రమాలు

### కణ్వాశ్రమము

ఋషీకేశ్‌కు 74 కి. మీ. దూరంలో కోట్ ద్వార్ అనే గ్రామం ఉంది. అక్కడినుండి 6 కి. మీ. దూరంలో 'మాలిని' అనే ఉప నది ఒడ్డున కణ్వాశ్రమము ఉంది. దుష్యంతుడు, శకుంతలను గాంధర్వ వివా హం చేసుకున్నది యిక్కడే! ఆ తపో భూమిని దర్శించుకున్న సాహితీ ప్రియు లకు మహాకవి కాళిదాసు దుష్యంతునిద్వారా చేసిన మనోహర వర్ణనలు తప్పక స్ఫురి స్తాయి.

నీవారాః శుకగర్భ కోటర
    ముఖభ్రష్టాః తరూణామధః
ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీ ఫలభిదః
    సూచ్యంత ఏవోపలాః,
విశ్వాసోపగమాత్ అభిన్నగతయః
    శబ్దం సహంతే మృగాః

[36 వ పేజీలో]

# గ్రంథసమీక్ష

## శ్రీ రామాయణ రహస్యము

[హిందీమూలం: పూజ్యపాదశ్రీ 108 రామచంద్ర డోంగ్రే మహారాజ్.
అనువాదం: డా॥ కె. శివసత్యనారాయణ.
ప్రకాశకులు: శ్రీనివాసా పబ్లిషర్సు, నర్సాపురం, ప. గో. జిల్లా. (ఆం.ప్ర.)
వెల: రు. 12–00.]

ప్రపంచ సాహిత్యంలో రామాయణానికి సాటి రామాయణమే. ఏ ముహూర్తాన వాల్మీకిమహర్షి ఆ కావ్యాన్ని రచించాడో, అది మొదలుగా ఆ కావ్యం ఈనాటి వరకు అదే నిత్యనూతనత్వంతో వెలుగుతూంది. భారతీయభాష లన్నిటిలో ఆ కావ్యానికి అనువాదాలు వెలశాయి. ప్రపంచ భాష లన్నిటిలోను ఆ కథ వ్యాపించింది. ఖండాంతరాల్లోను, ద్వీపాంతరాల్లోను కూడ రామనామం వినిపిస్తుంది. రామకథా సంబంధి స్థలపురాణా లెన్నో ఆ యా చోట్ల వ్యాపించాయి.

భారతీయ సాహిత్యంలో వాల్మీకి రామాయణం ఆదికావ్యం. హిందువులకి అది వేద తుల్యం. సీతారాములు వారి దృష్టిలో జగన్మాతాపితరులు. వారవతరించినది లోకోద్ధరణకు. ఆచరించిచూపినది ఆదర్శజీవితం. నెలకొల్పినది రామరాజ్యం.

"రమంతే యోగినోఽనంతే
నిత్యానందే చిదాత్మని,
ఇతి రామపదేనాసౌ
పరంబ్రహ్మాభిధీయతే."

అని శ్రీరామ రహస్యోపనిషత్తులో శ్రీరాముని పరబ్రహ్మ స్వరూపం వెల్లడించబడింది. అది ఆనంద నిధానం. అందుకు యోగిజనులే సాక్షులు.

"మూలప్రకృతి రూపత్వాత్
సా సీతాప్రకృతిః స్మృతా,
ప్రణవప్రకృతి రూపత్వాత్
సా సీతాప్రకృతి రుచ్యతే."

అని సీతోపనిషత్తులో సీత మూలప్రకృతిగా, ప్రణవప్రకృతిగా వర్ణించబడింది. ఇట్లున్న ఈ ప్రకృతి పురుష లీలా విలాస వివరణమే రామాయణ మహాకావ్యం. బాలకవి, బాలయోగి, హరిరామనాథ్‌గారి మాటల్లో "వాల్మీకి రామాయణం మానవుని స్వస్వరూపం దగ్గరకు అడుగులు వేయిస్తుంది. తులసీదాసుగారి శ్రీరామచరిత మానస్ జీవుని ఏకంగా స్వస్వరూపంలో లీనం చేసేస్తుంది. స్వస్వరూపమే ఈ విశ్వరూపం. అదే పరమాత్మ స్వరూపం. ఆయనకు రూపం లేదు. అయినా సమస్తరూపాలు ఆయనవే. మానవశరీరంలో కటివరకు శక్తితత్త్వం. ఆపై పురుషతత్త్వం."

రామాయణ కథలో ఎన్నెన్నో చిత్రవిచిత్రమయిన జీవితసమస్యలు వినిపిస్తాయి. వాటన్నిటికీ ఆదర్శాత్మకమైన పద్ధతిలో సమాధానాలుకూడ అందులోనే కనిపిస్తాయి. రాముడు ఆదర్శ పురుషోత్తముడు. సీత ఆదర్శ పతివ్రతాశిరోమణి. ఆ ఆదర్శ మెరిగి అనుకరించడమే మానవునికి ఇహపరసాధనమైన ఉపాయం. సీతారామ సదానుస్మరణ మీ ఆదర్శాచరణకు దోహదం..

పూజ్యపాదశ్రీ 108 రామచంద్ర డోంగ్రే మహారాజ్‌గారు హిందీభాషలో వ్రాసిన ఈ 'శ్రీ రామాయణ రహస్యము' శ్రీరామకథా వివరణతోపాటుగా ఆ యా చోట్లగల అతి నిగూఢమైన ఆధ్యాత్మిక రహస్యాలన్నిటినీ అతిసరళమైన సంగ్రహమైన శైలిలో వివరిస్తూంది. తెలుగు అనువాదకులు డా॥ కె. శివసత్యనారాయణగారు హిందీభాషా కోవిదులు. విశేషించి రామభక్తులు. ఈ గ్రంథాన్ని తెలుగులో వ్రాసి ఆస్తికులైన వారందరికీ ఉపకారం చేసినవారయ్యారు. అనువాదం సాపుగా, సరళంగా అదే మూలమన్నంత చక్కగా సాగింది. ఇక ఈ గ్రంథంలో, రామాయణంలోని ఏడుకాండల కథ అంతా చిన్నచిన్న సంభాషణలుగా, తీరుబడి ఉపదేశాలుగా వర్ణించబడింది. వాల్మీకి, తులసీదాసు, ఏకనాథుడు రామాయణకర్తల రచనా విశేషాలన్నీ తరిచిచూచి మేలు గ్రహించి, లోకవృత్తమెరిగి తదనురక్తికరమైన శైలిలో ఈ గ్రంథం సంతరించబడింది.

"మాతృపితృభక్తి, బంధుప్రీతి, నిగ్రహశక్తి, సదాచారము, సరళత, ఏకపత్నీవ్రతము, సత్యవాక్పాలన, ఔదార్యము, శరణాగతవాత్సల్యము, నిర్భయత్వము, మధురభాషణత్వము మున్నగు సద్గుణాలన్నీ శ్రీరామునిలో చోటుచేసుకొన్నాయి. ఆయన సకల సద్గుణాభిరాముడు. శ్రీరాముడు తల్లిదండ్రుల యెడ అనన్యమైన భక్తి గల్గియుండేవాడు. కొందఱు చదువుకొన్నవాళ్లు నేడు దేవాలయానికి వెళ్లి భగవంతునకు నమస్కారం చేస్తారు. కాని తమ గృహంలోవుండే భగవత్స్వరూపులైన తమ ముదుసలి తల్లిదండ్రులకు నమస్కరించరు. అది వారికి నామోషి! భగవంతుడు నీవు నాకైతే నిత్యము నమస్కరిస్తున్నావు. కాని నియింటి దగ్గరున్న వృద్ధులైన తల్లిదండ్రులకు నమస్కరిస్తున్నావా? అని అడిగాడు. 'ఒకప్పుడు చేసేవాడిని కాని బి.ఎ., పాసైన తరువాత చేయడం మానేశాను.' చదువుకొన్నవాడు జవాబిచ్చాడు.

"ఏ చదువువలన తల్లిదండ్రులకు నమస్కరించడానికిగాని సేవచేయుడానికిగాని సంకోచం కలుగుతుందో అటువంటి చదువు ఎందుకు? తల్లిదండ్రులకు సేవచేయనివాడు దేశానికి సంఘానికి లేక భగవంతునకు ఎలా సేవచేయగలడు?"

పై ఉద్ధరణ ఈ గ్రంథంలోని కథాకథన విషయ వివరణాలకి ఉదాహరణ. ఈ రోజుల్లో ఇటువంటి గ్రంథాలెంతైనా అవశ్యకం. శ్రీ సత్యనారాయణగారు చక్కని గ్రంథాన్ని ఎంచి అనువదించారు. గ్రంథముద్రణ కూర్పుతీర్పులన్నీ చాలా బాగున్నాయి. 250 పేజీలకు పైగా ఉన్న యీ పుస్తకం వెల: 12–00 కూడ చాల సరసంగా

(33 వ పేజీలో)

# యువ వాణి




విశాలమైన మహోన్నతమైన ఆ వృక్షం వైపు చూస్తుంటే యేమనిపిస్తుంది? ఈ వృక్షం యెన్ని తరాలనుండి ఈ విధంగా నిలబడి ఉందో, అసలీ వృక్షం ఇలా యెదగడానికి మూలమైన దీని తల్లి ఎక్కడ ఉందో, ఆ తల్లికూడా యెన్నాళ్లుగా నీడనిస్తూ పళ్లనిస్తూ ఈ జీవకోటికి సేవచేస్తుందో అని తలపింపజేస్తుంది. ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ కలిగించే ఇలాంటి తలపులెన్నెన్నో మనోవీధిలో పుడుతూనే ఉంటాయి. చివరకు చెట్టుకో తల్లి ఉంది, ఆ తల్లికో తల్లి ఉండింది, ఆ తల్లికో తల్లి ఉండేది అని నిర్ణయించుకుంటాం. ఈ విధంగా వెనక్కు పోయిన కొద్ది అమ్మకోఅమ్మ అనేదే మిగిలిపోతుందిగాని మూలపుటమ్మ యెవరో తేలనే తేలదు. అప్పుడు చెట్టు అనాది అనే నిర్ణయానికి వచ్చేస్తాం మనం. ఎందుకు అనాది అనే నిశ్చయానికి మనం వచ్చామంటే, మానవ మేధ ఎంత పరిశోధన చేయగలదో అంత చేసేసి, ఎంత ఊహించగలదో అంత ఊహించేసి, ఇక అవతలికి వెళ్లలేని స్థితిలో "అనాది" అనే మాటతో తృప్తిపడే స్థితికి వచ్చిందని అర్థం.

అలాగే ఓ వ్యక్తి విషయంలో కూడా. ఆయన సమున్నతుడు-సంస్కారవంతుడు. అతనికి తల్లీతండ్రి ఉన్నారు. వారికికూడా తల్లీతండ్రులు ఉండేవారు. అదేవిధంగా ఆ వారికికూడా తల్లీతండ్రులు ఉండేవారు. ఇది యెంతకూ తెగదు, ఇలాగే వెనక్కి వెళ్లాల్సి వస్తుంది. ఎంత వెనక్కి వెళ్లినా తల్లిదండ్రులు-తల్లిదండ్రులు అంటూ చెప్పుకుంటూ పోవల్సిందేగాని ఆ మూలం అంతు చిక్కదు. అందుకే చివరికి తల్లిదండ్రులనేవారు కూడా "అనాది" అనే నిర్ణయించాల్సి వస్తుంది. అయితే ఇక్కడ మనిషికి ఏకకణజీవి-అమీబా మూలం అని డార్విన్ అన్నాడు. జీవపరిణామ సిద్ధాంతం అంటూ మనమధ్యకు వచ్చేసి ఎలుగెత్తి అరిచాడు. అరిస్తే అరిచాడు గాక! మూలపదార్థం [చేతనమా అచేతనమా అనే చర్చకు తావు కాదిది] మాత్రం "అనాది" అని తప్పకుండా అంగీకరించాల్సి వస్తుంది. కాదన్నమాదన్న యెవడన్నా కలడోలేడో చెప్పలేం!

అదేవిధంగా ఆకాశంలో సూర్యచంద్రనక్షత్రాలు. వీటి కథాకమామిషు ఇంతే. ఖగోళమంతటా కనిపిస్తూ దివ్యతేజస్సు వెదజల్లే ప్రస్తుత సూర్యచంద్రనక్షత్రాలు అన్నీకలిపి ఒక సౌరకుటుంబం. కోట్లాది సంవత్సరాల క్రితం ఇప్పుడున్న ఈ సౌరకుటుంబం పుట్టింది అంటున్నారు. కొందరు వందలకోట్లు అంటున్నారు. కొందరు వేలకోట్లు అంటున్నారు. ఖచ్చితమైన తారీఖు నిర్ణయించి చెప్పడం మాత్రం ఎవరికీ సాధ్యంకాలేదు, ముందుముందన్నా అవుతుందనే భరోసా ప్రస్తుతానికి మాత్రంలేదు. మరి ఈ సౌరకుటుంబం పుట్టడానికి పూర్వపు సంగతేమిటని ప్రశ్నిస్తే, మరో సౌరకుటుంబం ఉండేది, అది కాంతిహీనమై, శక్తిహీనమై అదృశ్యమైపోయింది అనే సమాధానం వస్తుంది. అంతకు పూర్వం అని మళ్లీ అడిగితే మళ్లీ ఇదే సమాధానం వస్తుంది. ఈ సమాధానాలవల్ల కూడా చివరికి తేలేదేమిటంటే సౌరకుటుంబం కూడా "అనాది" అని. ఈ అనాది అనే మా. మానవ మేధ వికసించడానికి ఆటంకంగా ఉన్నట్లనిపించినా ఆ మాట దగ్గర ఆగిపోయిన ప్రతి వ్యక్తికి శాంతి - సౌఖ్యం సంతృప్తి లభిస్తుందనేది మాత్రం సత్యం.

భౌతికంగా కనిపిస్తున్న ఇటువంటివాటినే మనం అనాది అని ఆనందిస్తున్నామంటే ఈ సృష్టికే మూలమైన పరమాత్మయైన పరబ్రహ్మ స్వరూపం, సంగతేమిటి అనే ప్రశ్న పుడుతుంది. ఈ ప్రశ్న పుట్టినందువల్లనే హిందూతత్త్వవేత్తలూ దార్శనికులూ ఆ పరమాత్ముణ్ణి అనాది లోకే చేర్చారు. ఆయన్నొక్కణ్ణేకాదు ఆయనతోపాటు మరి కొన్నింటిని కూడా చేర్చారు.

ఈ సృష్టి పరమాత్ముడే చేశాడు అనడం అందరికీ పరిపాటయిపోయింది. జగన్నిర్మాత పరమాత్ముడు అనగానే ఆయన యెక్కడ ఉండి నిర్మించాడు, ఎలా నిర్మించాడు, ఎందుకు నిర్మించాడు అనే ప్రశ్నలు పుట్టాయి. అంతేకాదు సృష్టిచేశాడంటున్నారు, ఆ చేసినాయన రూపురేఖలేమిటి? రూపురేఖలే లేకపోతే నిర్మాణం చేసిందెలా అని ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించారు. ఆ ప్రశ్నలూ సమాధానాలే భారతీయ సంస్కృతికి మూలకందాలైన వేద-వేదాంగాలయ్యాయి. అవి విశ్లేషించబడ్డాయి-వ్యాఖ్యానించబడ్డాయి- భాష్యించబడ్డాయి. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత త్రితయ సిద్ధాంతాలుగా ఇంకా ఏమేమోగా వాటి చుట్టూ అల్లుకొన్నాయి. ఎన్నిఅల్లుకొన్నా, ఎన్నికప్పుకొన్నా, ఎంత ఎంత ముదిరినా-ఎంత వదిరినా, ఖండించినా - మండించినా గింజుకొన్నా-తలబద్దలు కొట్టుకున్నా, లోన గుడగుడ అన్నా- బయటికి గడగడ అన్నా, ఏమన్నా - ఏమనుకున్నా చివరకు ఆ పరమాత్ముడు "అనాది" అనే దగ్గర మాత్రం అందరూ తలలు వంచేశారు. కాబట్టి పరబ్రహ్మ అనాది అనే మాటలో ఇక ఎటువంటి విప్రతిపత్తి లేకపోయింది.

అంతటితో ఊరుకోలేదు మన దార్శనికులు. పరబ్రహ్మతోబాటు వారి మనస్సు ఈ సృష్టిమీదికి, ఈ జగత్తుమీదికి, ఈ ప్రకృతిమీదికి మళ్లింది. పరబ్రహ్మచేయని ఈ ప్రకృతి యెవరు చేశారనే ప్రశ్నలు శరపరంపర

లుగా పుట్టుకొంటూ వచ్చాయి. ఎవరు? ఎప్పుడు? ఎక్కడ? ఎందుకు? ఎలా? ఏమని చెప్పాలి- ఎంతని చెప్పాలి. చర్చలు వర్ధిల్లాయి, మనస్సులు వికసించాయి. వేదాంతపు వెలుగులు ప్రసరించాయి. "ప్రకృతి" అనాది అని సిద్ధాంతీకరించబడింది.

అదేవిధంగా జీవుని విషయం చర్చకు వచ్చింది. విశ్వపరిణామాన్ని అంగీకరించవచ్చుగాని జీవపరిణామాన్ని అంగీకరించవచ్చా అనేది పెద్ద ప్రశ్న అయింది. మనస్సులో పరిణామం జరిగే ఆస్కారముంది, కాని ఓ జీవి మరో జీవిగా పరిణామం చెందే అవకాశం ఉందా అనేది మనిషి మేధను పొడిచి పొడిచి విడిచింది. సత్య సాక్షాత్కారం జరిగింది. దేవునిలాగానే జీవుడు కూడా "అనాది" అని తేలింది. ఇక దీన్నికూడా ఖండించేవారుగాని ప్రతిఘటించేవారుగాని లేకపోయారు.

తత్త్వచింతన ఇంతటితో ఊరుకునేదేనా యేమన్నా! ఊరుకుంటే మనిషిమేధ జడమయ్యేది. మనిషిలో మనీషులు పుట్టకపోయేవారు. ఇన్ని గ్రంథాలు పుట్టకపోయేవి. ఇంతగా విజ్ఞానం ఎదగకపోయేది. మానవుడు నిత్యచైతన్య ప్రవర్ధమానుడుగా కనిపించక జడునిగా - మందునిగా-శిలగా కనిపించేవాడు. కాని మానవునిలోని అంతశ్చేతన నిత్యం ఊర్ధ్వముఖంగానే పయనిస్తుంది. ఆ కారణాన్నే మరికొన్నిటిని అనాదిగా నిర్ధారించడం తప్పనిసరి అయింది.

అందులో ప్రధానమయింది ప్రకృతి పరమాత్మల సంబంధం. ప్రకృతిలోని దివ్యశక్తుల్లో పరమాత్మతత్త్వం గోచరించసాగింది. అలా గోచరించడానికి కారణమంటూ వెతికితే కనిపించడంలేదు. ఈ కనిపించనిదాన్ని పట్టుకునేదెలా? నిర్వచించడమెలా? పూర్వాపరాల విచారణ జరిగింది. ఈ సంబంధం ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, ఏ విధంగా ప్రారంభమయిందో ఎవరికీ అర్థం కాలేదు. ఆ కారణాన్నే ప్రకృతి పరమాత్మల సంబంధం కూడా "అనాది" అని చెప్పక తప్పలేదు.

ముడులన్నీ విప్పుకుంటూ ముందుకు పోయిన కొద్దీ మరో ముడి తగుల్తానే ఉంది. ముడి ముడిగానే ఉంటే విజ్ఞానం అంతటితో ఆగిపోయేదే. ఆ స్థితే కలిగితే ఇదివరకే మానవుడు దివ్యత్వం వైపు పోవడంగాక పశుత్వంవైపు అడుగులేసేవాడు. అలాంటి ప్రగతి ప్రతిబంధక స్థితి నుండి దాటినవాడు కాబట్టే జీవునిలో దేవుణ్ణి దర్శించడం మొదలెట్టాడు. ఆ కారణాన్నే జీవేశ్వర సంబంధాల్ని గురించి గణాంకాలు వేయనారంభించాడు. జీవునిలో దివ్యత్వం కనిపిస్తోంది. జీవుని మూలం కనుగొనడం కూడా కష్టమైపోయింది. మూలం కనుక్కోడం కష్టం, కనిపిస్తున్న దివ్యత్వం నిరూపించడం కష్టం. అందుకే జీవేశ్వర సంబంధం కూడా "అనాది" అనే స్థితికిరాక తప్పలేదు మానవునికి.

మానవునిలో దివ్యత్వంతోబాటు కనిపించే కామక్రోధ మోహలోభాలకు మూలమేమిటో అంతుచిక్కలేదు దార్శనికులకు. ఇదేదో మాయ అనే స్థితికి వచ్చారు. అందుకే మాయకూడా అనాది అయి కూచుంది. ఇంతటితో ఆగితే సరిపోయేది కాని వీటన్నింటిని కాలిచిచూపే కాలం అంతు తేల్చడానికి యత్నించి చివరకు "కాలం" కూడా అనాది అని నిర్ధారించాడు. అనాది అయిన ఇలాంటివి కొన్ని మానవ విజ్ఞానానికి పునాది కాగా వాటిమీద గోడలు - మేడలు కడుతున్నాడు. శాంతినీ - సౌఖ్యాన్నీ అనుభవిస్తున్నాడు.

— డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి

## మూర్ఖుని మనస్సు

ప్రసహ్య మణి ముద్ధరే
న్మకర వక్త్రదంష్ట్రాంతరాత్
సముద్రమపి సంతరేత్
ప్రచలదూర్మి మాలాకులమ్.
భుజంగమపి కోపితం
శిరసి పుష్పవద్ధారయేత్
న తు ప్రతినివిష్ట మూర్ఖజన
చిత్త మారాధయేత్.

భర్తృహరి మహాకవి రచించిన పై శ్లోకానికి తెలుగులో సరళ సుందరమైన అనువాదం ఏనుగు లక్ష్మణకవి పద్యం.

మకర ముఖాంతరస్థమగు
మానికమున్ పెకలింపవచ్చు: పా
యక చలదూర్మికానికర
మైన మహోదధి దాటవచ్చు: మ
స్తకమున పూవుదండవలె
సర్పమునైన భరింపవచ్చు; మ
చ్చిక ఘటియించి మూర్ఖజన
చిత్తము తెల్ప అసాధ్య మేరికిన్.

మొసలి ముఖంలో ఉన్న మాణిక్యాన్ని సయితం బయటకు తీయవచ్చు ? పెద్ద పెద్ద కెరటాలతో గట్టు కనిపించకుండా వ్యాపించిన సముద్రాన్ని గూడా ఈదవచ్చు ! పూలదండవలె మెడలో త్రాచుపామును వేసుకొని తిరుగవచ్చు. కానీ - మూర్ఖునికి ఏ విషయమైనా అవగాహన అయ్యేటట్లు బోధించి అతని మనస్సును రంజింప చేయటం అసాధ్యం!

అనగా మూర్ఖుల మనస్తత్వం అతి విచిత్రమైనది, పరమగహనమైనది.

ఈ విషయం ఇంత ఘాటుగా నిర్వచించిన మహాకవి మానవ మనస్సును క్షీర సాగరం వలె మథించిన మహనీయుడు భర్తృహరి.

తివిరి-ఇసుమున తైలంబు తీయవచ్చు
తవిలి మృగతృష్ణలో నీరుత్రాగవచ్చు!
తిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు!
చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు.

అన్నాడు భర్తృహరి. ఇసుకనుండి తైలం తీయటం సాధ్యం కాదు. ఎండమావులలో నీరు ఉన్నట్లు కనిపిస్తుంది. కాని అసలు నీరు ఉండదు. అది నేత్రభ్రమ మాత్రమే. సృష్టిలో కుందేటికి కొమ్ము ఉండదు. అయితే - అట్టి అసాధ్యవస్తువులను అయినా సంపాదించ వచ్చునేమో గాని మూర్ఖుల మనస్సు రంజింపజేయటంమాత్రం సాధ్యం కాదని భర్తృహరి మహాకవి చాటిచెప్పాడు.

మూర్ఖత్వానికి రాబందు రెక్కలు-గుడ్లగూబ కన్నులు ఉంటాయని డచ్చివారి సామెత.

ప్రపంచ సాహిత్యాలలో మూర్ఖుని నిర్వచనాలు హృదయంగమంగా ఉంటాయి.

# వెలుగుబాట

డా॥ నండూరి రామకృష్ణమాచార్య

అరేబియా దేశ సారస్వతంలోని ఒక సుభాషితం మూర్ఖునికి ఆరు లక్షణాలు నిర్దేశించింది.

(1) కారణం లేని కోపం
(2) ప్రయోజన రహితమైన వాగుడు
(3) అభ్యుదయంలేని మార్పు
(4) లక్ష్యంలేని అన్వేషణ
(5) అపరిచితులను నమ్మటం
(6) శత్రువులను మిత్రులుగా భావించటం

పై ఆరూ మూర్ఖుని లక్షణాలు!

సంపన్నుడైన మూర్ఖుడు సమాజానికి ముప్పు - అని ఒక ప్రాచీన గ్రీకు కవి ప్రవచనం.

"సామంత ప్రభువుగారి మెచ్చికోలు మూర్ఖునకు మేటి విందు" అని ఆంగ్ల సుభాషితం.

మూర్ఖునకు ప్రతిరోజు పండుగ సెలవు దినమే - లాటిను సామెత. ఒక మూర్ఖుని మెచ్చుకునేందుకు ప్రక్కనే మరియొక మూర్ఖుడు ఉంటాడు.

— స్పెయినుదేశపు సామెత

పర దుఃఖమునకు కన్నీరు కార్చలేని యువకుడు ద్విపాదపశువు;

ప్రపంచాన్ని చూచి నవ్వలేని వృద్ధుడు మూర్ఖుడు.

— జార్జి సంతాయన

అధికారంలో ఉన్న మూర్ఖుడు పిచ్చికుక్క కంటె ప్రమాదం.

— ఫ్రెంచి సామెత

నిరక్షరకుక్షియైన మూర్ఖునివల్ల దాపురించే ఉపద్రవంకంటె పండితుడైన మూర్ఖుని వల్ల కలిగే ప్రమాదమే భయానకమైనది.

— ఎరాఎమోమోలో

స్వతంత్రంగా ఆలోచించటం చేతగాని పరప్రత్యయనేయ బుద్ధికలవాడుమూర్ఖుడు.

— కాళిదాసమహాకవి

తాను నేడు చేయగలనని రేపటికి వాయిదా వేసేవాడు మూర్ఖుడు.

— ఆంగ్లసుభాషితం

మహానుభావులు మహర్షులు అని ప్రసిద్ధికెక్కినవారి మెదడులో ఒక మారుమూలలో కొంత మూర్ఖత్వం దాగి ఉంటుంది.

— అరిస్టాటిలు

అప్పుడప్పుడు మూర్ఖుడు గూడ మంచి మాట చెప్పవచ్చు.

— విలియంకూపరు

ఒకసారి డాక్టరు ఛార్లెసుగారిని - ఆసుపత్రిలో ఒక రోగి నోటికి వచ్చినట్లు తిట్టాడు కాని ఛార్లెసు మారుమాట పలుకలేదు. ప్రక్కనున్న ఒక వైద్యవిద్యార్థి - "ఆ రోగికి మీరు ఎందుకు బదులు చెప్పలేదు?" అని ప్రశ్నించాడు. దానికి డాక్టరు ఛార్లెసుగారి సమాధానం చిరస్మరణీయమైనది. "నాయనా! ఆసుపత్రిలో ఒక మూర్ఖుడు ఉన్నది చాలు" ఆసుపత్రిలోనేగాదు — మరెచ్చటనైనా ఇద్దరు మూర్ఖులు ఉండటం ఎందుకు? ఏ సంస్థ అయినా ఒక మూర్ఖుడుతోనే వేగలేదు.

అయితే — సూక్ష్మదృష్టితో చూస్తే, మూర్ఖుడే "జగద్గురువు". యావత్ప్రపంచం మూర్ఖునినుండే గుణపాఠాలునేర్చుకోవాలి.

# శ్రీవేంకటేశ్వర గీతానవరత్నమాలికాస్తుతి



## పండిత శ్రీ అగ్రజ సత్యనారాయణశాస్త్రి

గోవింద గోకులానంద
యశోదానంద నందన
రాసక్రీడాఽనంద బృందా
రాధాకృష్ణ నమోఽస్తుతే॥

తింటే గారెలు తినవలె
వింటే భారత కథాళి వినవలెఁ జుమ్మీ
ఉంటే తిరుమల లోపల
కంటే శ్రీ శ్రీనివాసుఁ గనవలె ననఘా!॥

వేంకటేశ్వర! నాదు వివేకబుద్ధి
హైన్యమునఁ జేసినట్టి పాపాటవులను
నీదు భక్తి ప్రపత్తులనే దవాగ్ని
చేత దహియించి మమ్ము రక్షింపుమయ్య॥

శనివారంబని వేంకటేశ్వర నినున్
సంప్రీతి గావింతు మే
మనుచున్ పెద్దలు పిన్నలు న్విధిగ
నాహారంబులందున్మహా
మునిధర్మంబు వహింతురెల్ల రెలమి
న్మోదంబుతోఁ బూర్ణ భ
క్తిని సేవింతు రదెంత పుణ్యదినమో
దేవా! కృపన్ బ్రోవవే॥

ధరలో నెవ్వడు సుప్రభాతములచేత
న్వేద ఘోషంబులన్
వరుసన్మంగళవాద్య గానకళలన్
వైఖానసాఽర్చావళిన్
సురబృందంబులచే భజింపబడు
విష్ణుప్రక్రియన్వేంకటే
శ్వరనామంబున సంస్తుతింపబడు
వో సర్వేశ! నిన్గొల్చెదన్॥

దేవకీపుత్రుడే యనఁ దిరుమలందు
వేంకటేశ ప్రభుండవై వెలసినావు
ఆర్తజనరక్షణము సల్పుమయ్య నీవు
వకుళ హృత్పోషితాంగ ప్రపన్నవరద!॥

వారాహకల్పానవైనతేయానిత
వైకుంఠ తిరుమలపట్టణంబు
బ్రహ్మాదిదేవతా ప్రార్థనాంగీకృతాఽ
ర్చావతారాఽఽగమాఽర్చాశ్రయంబు
స్థానిక యాత్రిక స్నానదానపవిత్ర
గంగాదినిలయ పుష్కరజలంబు
జాతిమతాచార శౌచభేదాఽభావ
పుణ్యసాధునివాస భూతలంబు
నిత్యకళ్యాణభూషణ నిత్యభోగి
విమల మునియజ్ఞరక్షక వేషధారి
కలియుగాశేష మానవకామ్యదాత
వైప్రసిద్ధుండవగు నీకు వందనంబు॥

శుక్రవారాన వేదవిధిక్రమాభి
షేక సువిశిష్టవస్త్ర విశేషవజ్ర
కవచ సాహస్రనామ సద్గ్వ్రజమకుట
శోభితుని నిన్ను శ్రీనివాసాభిధాన!
సర్వదర్శన మొనరించు సకలజనుల
పాపములఁబాపి కాపాడు వాసుదేవ!
ముక్తులై ధన్యులౌదురు ముదముతోడ
శేషగిరివాస! మహనీయఁ చిద్విలాస!॥

పూర్వమావేదవతి విష్ణుమూర్తిగూర్చి
అధిక తపమాచరించి లంకాధినాథు
డింతి కరమునుఁ దాక శపించి తనువు
వీడి సద్భక్తితోడ నా విష్ణుదేవు
డనుచునో వేంకటేశ్వర! నిను వివాహ
మాడెఁ బద్మావతి యనంగ నాఖ్యతోడ॥

భక్తితాత్పర్య మట్టిదో వాసుదేవ!
అట్టి నీ మహనీయత్వమెన్నఁ దరమె!
భక్తిచే వేంకటేశ్వర! భవవినాశ!
వందనము సల్పు మమ్ముఁ గాపాడుమయ్య॥







హరితవర్ణపు చీర చుట్టుకుని, నీలిమబ్బు రైకతొడిగి పచ్చచేమంతులు సిగలో తురుముకుని, తొలకరి జల్లుల నవ్వులతో, చల్లగా పలకరిస్తూ, నూతన వధువులా వయ్యారి నడకలతో వస్తుంది శ్రావణలక్ష్మి.

గృహసీమలను రంగు రంగుల రంగవల్లులతో అలంకరించి, గడపలకు పసుపు కుంకుమలను దిద్ది, గుమ్మాలకు పచ్చని మామిడి తోరణాలు కట్టి శ్రావణలక్ష్మికి ఘన స్వాగతం పలుకుతారు స్త్రీలు.

శ్రావణమాసం స్త్రీలమాసం. నోములు, వ్రతాలు, ఉపవాసాలతో వారికి విశ్రాంతి అనేది ఉండదు. ఐనా రెట్టింపు ఉత్సాహంతో వారు శ్రావణలక్ష్మిని సత్కరిస్తారు.

తమను అదుపులోపెట్టిన ఆషాఢం తప్పుకుని శ్రావణం రాగానే నూతన వధూవరులు హాయిగా గాలి పీలుస్తారు.

నూతన వధువుచేత ఈ మాసంలో మంగళగౌరి నోము ప్రారంభం చేయిస్తారు. మాంగల్యరక్షకోసం దీక్షగా గౌరీదేవిని ప్రీతితో పూజిస్తుంది నూతన వధువు.

తర్వాత ముఖ్యంగా వయోభేదం లేకుండా ప్రతిస్త్రీ తప్పక ఆచరించే వ్రతం వరలక్ష్మి వ్రతం. శ్రావణ పున్నమి ముందు వచ్చే శుక్రవారం నాడు ఈ వ్రతం చేస్తారు. సంపదకోసం లక్ష్మీదేవిని ఆరాధించే వ్రతం ఇది.

శ్రావణ శుక్రవారం రాగానే ప్రతి ఇల్లు బంధు మిత్రులతో సందడిగా ఉంటుంది. స్త్రీలు వేకువనే లేచి అభ్యంగన స్నానంచేసి, ఇల్లు, పరిసరాలను శుభ్రంచేసి, వరలక్ష్మి దేవికి ప్రత్యేకస్థలం నిర్దేశించి, మండపం తయారు చేస్తారు. వారి వారి తాహతునుబట్టి వరలక్ష్మి ప్రతిమను తయారుచేసి, రకరకాల ఆభరణాలతో ఆ దేవిని అలంకరిస్తారు. తర్వాత వరలక్ష్మీదేవిని కలశంతోసహా ఆ మండపంలో ప్రతిష్ఠించుతారు. రంగు రంగుల పూలతో, గంధము, అక్షతలతో ఆ దేవిని పూజిస్తారు, సేవిస్తారు.

జయదాయిని పరమేశ్వరి
జయ జయ వరలక్ష్మి
భయము బాపి సౌభాగ్యము
దయచేయగదే జననీ జయ॥

నిదురజెందు చారుమతిని
నిర్వ్యాజంబగు కృపతో
గదిసి మేలు కొలిపి యామె
హృదయ మెరిగి వర మొసగిన జయ॥

ఇరుకెలంకులందు నిలచి
సురలు సుధాకలశములతో
కర మభిషేకింప కనక
కమలపీఠి నధివసించు ॥జయ॥

శ్రావణభృగు వాసరమున
దేవదేవి నిన్ను భక్తి
పూవులపత్రాక్షతలచే
పూజించిన వారె ధన్యులు ॥జయ॥

అంటూ భక్తిశ్రద్ధలతో ఆ దేవిని కీర్తిస్తారు. పలురకాల పిండి వంటలుచేసి ఆ దేవికి నివేదిస్తారు. ఒక ముత్తైదువను పిలిచి, ఆమెను వరలక్ష్మీదేవిగా భావించి, భోజనంపెట్టి, పిండివంటలు ఆమెకు వాయనంగా ఇస్తారు. ఆ సాయంత్రం ముత్తైదువుల నందరినీ పేరంటానికి పిలిచి పసుపు కుంకుమలను, పండు తాంబూలాలను ఇచ్చి వారిని సత్కరించి, వారిచే దీవన లందుతారు.



స్త్రీలకోసం మనపెద్దలు ఏర్పరచిన ప్రతి నోము, ప్రతి వ్రతం వెనుక ఓ పరమార్థం తప్పక గోచరిస్తుంది. అది తెలుసుకుని ఆ వ్రతంకానీ, నోముకానీ, ఆచరించి నప్పుడే వాటికి సార్థకత లభిస్తుంది.

ఈ వరలక్ష్మీవ్రతం చేయడంలో కూడ ఓ పరమార్థం ఉంది. పూజ పూర్తయ్యాక, వరలక్ష్మీ వ్రతకథ చెప్పి చివరన ఓ వాక్యం పలుకుతారు. శక్తి తప్పినా భక్తితప్పరాదు అని. యథావిధిగా వ్రతంచేయడానికి ఆర్థిక శక్తి లేకపోయినా భక్తిశ్రద్ధలలో మాత్రం లోపం ఉండకూడదు. భక్తిగా వ్రతంచేస్తే ఫలితం పూర్తిగా లభిస్తుంది. "పుష్పం కానీ పత్రం కానీ చివరకు తోయమైనా భక్తిగా అర్పిస్తే ప్రీతిగా పుచ్చుకుంటా "నని భగవంతుడు చెప్పిన మాటను, అందరికీ గుర్తుండేలా ప్రతి నోము చివరన, ఫలశ్రుతిగా ఆ మాటను ఏర్పరచారు పెద్దలు.

సహజంగా అసూయకు ఆలవాలం స్త్రీ మనస్సు అని నానుడి. ఈ అసూయాభావం వారి మనస్సులలోంచి పోవడానికి ఈ పేరంటం చేయడం అనేది ఓ దారి. తన సాటి స్త్రీని లక్ష్మీదేవిగా భావించి, ఆమె పాదాలనంటి నమస్కరించడం అనేది ఎంతో ఉన్నతమైన భావం. ఎదుటి మనిషిలో దైవాన్ని దర్శించే బాటను సున్నితంగా స్త్రీల మనస్సుల్లో ఏర్పడేలా చేశారు పెద్దలు. ఆ భావం కలిగినపుడు సాటి స్త్రీపై అసూయ జనించేందుకు అవకాశం లేదుకదా!

పూర్వం చారుమతి అనే బీదరాలు ఉండేదని, ఆమెచాలా సదాచారం, సత్శీలత ఓర్పుకలిగిన స్త్రీ అనీ, కొంతకాలం గడిచాక లక్ష్మీదేవి ఆమెను కరుణించిందని వరలక్ష్మీ వ్రతకథ. ఈ కథలో చారుమతికి ఉన్న గుణాలన్నీ ప్రతి స్త్రీకి ఉండవలసిన సద్గుణాలే. శుచి, శుభ్రతగలచోట లక్ష్మీ స్థిరనివాసం ఏర్పరచుకుంటుం దన్న భావం స్త్రీల మనస్సుల్లో నాటి వారికి సదాచారం, సత్శీలం అలవడడానికే పెద్దలు ఈ వ్రతాన్ని ఏర్పరచారు. అదే ఈ నోములక్ష్యం.

ఇలా మనకోసం మెరపుతీగలా కదలి వచ్చే శ్రావణలక్ష్మీ ఇంటింటా సిరులు పంచుతుందని ఆశిస్తూ శ్రావణలక్ష్మిని ఆహ్వానిద్దాం. ఆమెకు మనసారా స్వాగతం పలుకుదాం.

—శ్రీమతి శిష్ట్లా వసుంధరాదేవి



## దశభుజ గణపతి

సామాన్యంగా చాలామంది ఆస్తికులు ఎన్నో ఆలయాల్లో వినాయకుని విగ్రహాలను చూచియుంటారు.

అయితే దశభుజగణపతిని చాలా కొద్ది మందే చూచియుంటారు. ఈ దశభుజగణపతి ఆలయం మరో విశేషంతో కూడికొనియుంది. అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకాలో దశభుజగణపతి ఆలయం వుంది.

రాయదుర్గం ప్రాంతం అలనాడు భూపతి రాయల పరిపాలనలో విలసిల్లింది. ఆ తరువాత పాళెగాండ్రుకూడా ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. రాయదుర్గం కొండపై అధిరోహించే మార్గానికి ప్రారంభంలో (ఆత్మకూరు వీథిలో) దశభుజ గణపతి ఆలయం వుంది.విశాలమైన ఒకేరాతి పై దశభుజములతో అలరారే వినాయకుని తొడపై స్త్రీ విగ్రహంతోపాటు మలచారు.

కొంత మంది వృద్ధులు, పురాణాల్లో గణపతికి సిద్ధి-బుద్ధి అనే భార్యలున్నారని చెబుతుంటారు. ఈ యాలయాన్ని సిద్ధి వినాయకుని ఆలయమని కొంతమంది అంటున్నారు. వేములవాడలో శ్రీ రాజరాజేశ్వరి దేవాలయంలో చతుర్భుజ గణపతి విగ్రహముంది. ఈ గణపతి తొడపై కూడా స్త్రీ విగ్రహం మలచబడివున్నందున దీనిని లక్ష్మీగణపతి అని అంటున్నారు.

దశభుజములతో పాటు స్త్రీవిగ్రహం మలచబడిన వినాయకుని ఆలయం రాయదుర్గంలో మాత్రం వుంది. అలాంటిది మరెక్కడనూ లేదు.

— జయసుమన్




రారా, నా రతనాలమూట, యవిచార ప్రచారంబులం
దేరా, యెందులకేగినావుర, మహాదృష్టంబు దృష్టంబ వీ
వై రాజిల్లుట మాకు సర్వులకు, సమ్యక్స్ఫూర్తి మన్మూర్తి వౌ
దే, రోలెక్కుట యుట్లు కొట్టుటలు మేలే, పాలు లేవాయెనే.

రోలంబాలక, లోలబాలక, నినున్ రోషించి చేయెత్తి నేఁ
జాలన్ వ్రేయఁగ నొక్క వ్రేటయిన, నీ సావాసగాండ్లిందఱే
మో లజ్జింప రకార్యధోరణికి, వాదోవచ్చు నీ మీదికే
చాలుంజాలును వారి యాగడము, లుత్సర్జింపు తత్సఖ్యముల్.

క్రేపులనాకుచున్ జనెడు కేవల మాతృసమాదర ప్రథా
ప్రాపణగోకదంబకము పచ్చిక పట్టునఁ దెండియుండ, నే
దో పనిమీద వెన్దిరిగి యూరికి వచ్చుట, గోపకాంతలన్
రాపిడివెట్టుటేల, వినరా, తగవా నగుబాటు చెయ్యువలున్.

కాళిందీనదిలోని యమ్మడుగువంకన్ బోకురా, యద్ది నా
గాళీ జుష్టము, దుష్టపన్నగ విషవ్యామిశ్ర నీరంబులన్
గ్రోలన్ వ్రాలెను గోవు లన్నదతికిన్ రూపించు నిర్భీకుఁడై
వ్యాళాహారి కలాపధారి స్వశిఖావ్యాలోల బర్హచ్ఛవుల్.

'అన్నా,' 'యేమిర,' 'గోవులేవి?' 'చనె నీరానంగఁ
గాళిందిలో';
'ఉన్నే యవ్వి సజీవ,' 'మేమిభయ,' 'మందున్నాడు
పెన్నాగు,' వా
నిన్నేమించుటయెట్లు' 'యెట్టులని సందేహించి కూర్చున్ననా
వన్నంబౌ మన మంద' యంచుఱుకు గోపాలుండు మా రక్షయౌ.

గోపాలా, యదుబాల, బాలకరధృత్ గోవర్ధనోర్వీధ్ర, గో
పీ, పీన స్తన గోత్రచంచలకరా, వేణూదితాస్వాద్య గీ
తాపీయూష సరత్ఝురాప్లుత దిగంతా, ప్రీత సుస్వాంత, రా
ధాపర్యంక నిరంకనిస్తుల రసాధారా, జగన్మోహనా.

నిలునిలుమంచునుంబిఱుదనెట్టనఁ బర్విడు తల్లి చేరులో
వల, ఫెళఫెళ్ళనన్ భిదురపాతముబోని రవంబు, జంటమ
ద్దులు విఱుగంబడన్, నడుమదూఱిన రోలును లాగికొంచు నీ
వలి కరుదెంచు స్మేరముఖ పద్మని వెన్నుని మూర్తినెన్నెదన్.

చనుగవనున్ విషం బలది, చన్గుడుపిచ్చుట కేగుదేరి వ
చ్చిన ఛలధాత్రి దానవిని జేరఁగనిచ్చి, పయస్సుతోనసుల్
పనివడి నాచికొన్న పసిపాపని పాటవమేమి చెప్ప! సం
జనన జయిష్ణు విష్ణు విలసన్మహిమోత్తర లీలగా కిలన్.

అందఱు గోపికాంగనల కందఱ కందఱు కృష్ణు లున్న యా
చందము నద్భుతంబు సరసంబుగ లెస్సగ నిర్వహించి, కా
ళింది కడింది సైకత తలిన్ శరదిందు మరీచిఁ బొల్చు వ
స్పందునిఁగొల్తు యోగవిభు, సాంద్రరసాశ్రయ
హృత్కుశేశయున్.

తపుఁతలకట్టునుం దవిలి తద్దఁ జనించెడు పించియంబుతో
నవనవలాడు నెమ్మొగమునన్ నగురేక సమావహిల్లఁగా
చెవులను జేతులన్ మెడరుచి ప్రచురమ్ములు సొమ్ములారుమ
త్సవ కరనందనందన లసత్ శిశుమూర్తి నెదన్ భజించెదన్.

మ్రోలను గవ్వముంచుకొని ముగ్ధమనోజ్ఞ బహూహ లేలుకొం
బోలి యశోదయున్నతఱి, నొయ్యనఁ జేర్గొని వెన్కముళ్ళుగా
వ్రాలుచు వీపునన్, మెడఁగరద్వయిఁ గూర్చుచుఁ, జెక్కు
దోయిపై
మౌళికలాప మద్దు యదుకుండల మండను లీల నెన్నెదన్.

'తెఱవరనోరు, మన్దినుట తెల్లమయౌ' నను తల్లికీవు నో
ర్దెఱచుటతోడఁదోఁచె సముదీర్ణ చరాచర జీవసంచయో
ద్ధుర జలజోద్భవాండమటె! దుర్భర విభ్రమ మగ్ననామె నే
త్రెఱఁదెరదించి వాతెఱను, దేరుపవోటు తదంకశాయివై.

(28వ పేజీలో)



పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

అని శ్రీకృష్ణుని వచనము. దుర్జనులను శిక్షిస్తూ, సజ్జనులను రక్షిస్తూ ధర్మాన్ని నిలుపుటకై భగవంతుడు యుగయుగాల్లోను అవతరిస్తాడని భావం.

గడచిన అనంత కాలంలో పుట్టిన లోక కంటకు లనేకులను పరిమార్చి లోకంలో ప్రశాంతతను కలిగించుటకై పరమాత్ముడు పలుమార్లు అవతరించాడు. వానిలో ముఖ్యంగా చెప్పుకొని స్మరింపదగ్గవి దశావతారాలు.

"మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహో௨థ వామనః,
రామో రామశ్చ కృష్ణశ్చ
బుద్ధః కల్కి రేవ చ."



అని వరుసగా శ్లోక రూపంలో చెప్ప బడ్డాయి. ఈ దశావతారాల్లో కొందరు కృష్ణావతారానికి బదులుగా బలరామావతారాన్నికూడ చెప్పడం కద్దు. అసలు 'శ్రీకృష్ణుడు' అవతారం కాదు. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే. సాక్షాత్తుభగవంతుడే ఆయన, అని మరికొందరి పెద్దలమాట. బలరామకృష్ణుల్లో ఏ ఒక్కరిని స్వీకరించినా ఇరువురను స్వీకరించినట్లే అని కూడ చెప్పడం కద్దు.

ముఖ్యంగా శ్రీకృష్ణావతారం, శ్రీకృష్ణ లీలలు, శ్రీకృష్ణపాత్ర ఇత్యాదిగా మన భారతీయ వాఙ్మయంలో అనేక చోట్ల అనేక గ్రంథాల్లో వర్ణింపబడ్డాయి. 'గీతగోవిందం' లో జయదేవుడు, శ్రీకృష్ణ లీలాతరంగిణిలో నారాయణతీర్థుడూ, 'శ్రీకృష్ణకర్ణామృతం' లో లీలాశుకుడూ - ఇలాగ ఎందరో మహాకవులు శ్రీకృష్ణుని సుసంపన్నంగా తనివితీర వర్ణించి మహాభక్తులుగా కూడ ప్రసిద్ధిని పొందారు. ప్రధానంగా ఆంధ్రసాహిత్యంలో, జానపద వాఙ్మయంలో, శతకవాఙ్మయంలో, హరివంశ భాగవతాది మహాకావ్యాల్లోను, అనేక యక్షగానాల్లోను ఈ కృష్ణపాత్ర కడు మనోజ్ఞంగా వర్ణింపబడింది.

పదకవితాపితామహుడు. హరి యవతారము అయిన తాళ్ళపాక అన్నమాచార్యులు తన పద సాహిత్యంలో శ్రీకృష్ణుని యవతారమును, శ్రీకృష్ణలీలలను, శ్రీకృష్ణావతార తత్త్వాన్ని ఎలా వర్ణించాడో ఇంచుక పరిశీలించుటే ఈ వ్యాసోద్దేశం.

### రామక్రియ

ఎక్కడి కంసుఁడు యింక నెక్కడి
భూభారము
చిక్కువాప జనియించె శ్రీకృష్ణుడు॥
అదివో చంద్రోదయ మదివో రోహిణి
పొద్దు
అదన శ్రీకృష్ణుఁడందె నవతారము
గదయు శంఖచక్రాలుగల నాలుగుచేతుల
నెదిరించియున్నాఁడు ఇదివో బాలుఁడు॥
వసుదేవుఁడల్లవాఁడే, వరుస దేవకియదే
కొసరే బ్రహ్మాదుల కొండాట మదే
పొసఁగఁ బొత్తుల మీఁదఁ బురుఁటింటి
లోపల
సిసువై మహిమ చూపె శ్రీకృష్ణుఁడు
పరంజ్యోతి రూప మిదె పాండవుల
బ్రదికించె
అరిది కౌరవుల సంహారమూ నిదె
హరికర్తవ్యము లీరో జయంతి పండుగ
సేయరో
కెరలి శ్రీ వేంకటాద్రి కృష్ణుఁడితఁడు
(అన్నమయ్య ఆధ్యాత్మ సంపు 10 కీర్తన 1)

అది ద్వాపరయుగము. వేలకొలది రాక్షసులు రాజవంశమున జన్మించి లోకకంటకులై మిగుల భూభారము కల్గించినందువల్ల, భూదేవి బ్రహ్మాది దేవతలతో కూడి తన భారము తగ్గించ వలసిందని శేషశాయి




అయిన మహావిష్ణువును ప్రార్థించినది. అందుకుగా శ్రీకృష్ణు డవతరించెను. శ్రీకృష్ణావతారము వలన ఇక కంసుడెక్కడ నుండగలడు? కంసు డంతరించినట్లే. భూభారమూ తొలగినటులనే అని భావం.

భగవానుడు యవతరించు సమయ మదిగో. చంద్రుడూ ఉదయించుచున్నాడు. కారు చీకట్లు నిండిన రాత్రి సమయంలో. ఆ చీకట్లను తొలగించుచు చంద్రుడుదయించు చున్నాడు. అది రోహిణీ నక్షత్రపు పొద్దు. అప్పుడు చతుర్భుజములు శంఖము చక్రము గద ధరించి యొకచేత అభయ మిచ్చుచూ ఇదిగో బాలకృష్ణుడు అవతరించినాడు. చంద్రుడు ఉదయించుటవల్ల చీకట్లు తొలగినట్లుగానే శ్రీకృష్ణుని ఉదయము వల్ల భూభారము తొలగునని అన్నమయ్య భావము.

ఆ బాలుని సమీపంలో అదివో వసుదేవుడు నమ్రతతో నిలిచియున్నాడు. ప్రక్కన వసుదేవుని వరుసనే దేవకీదేవి. అదిగో ఆ వైపున బ్రహ్మాదిదేవతలు ఆనందంతో ఆట పాటల శ్రీకృష్ణుని కొనియాడుతూ వినోదించుచున్నారు. మరల అంతటిలోనే ఆ శంఖ చక్ర గదాధారియైన కృష్ణుడు చిన్న శిశువుగా మారి తన మహిమ చూపెను గదా!

చరాచరమున కంతటికిని ఆధారమైన పరంజ్యోతి స్వరూప మిదియే! ఈ బాల కృష్ణుడే పాండునందనులను బ్రదికించినాడు. అదిగో ఆశ్చర్యము! కౌరవసంహారముకూడ చూడుడు. అట్టి శ్రీహరికి అర్ఘ్యము లియ్యరో. నేడే శ్రీకృష్ణజయంతి. ఆ జయంతిని ఎంతో భక్తితో ఆనందంతో చేయవలసినది. అదిగో ఆ ద్వాపరయుగం నాటి

# అన్నమయ్య

## బాలసుబ్రహ్మణ్యాం

శ్రీకృష్ణుడే వేంకటాద్రిలో (తిరుమల) లో నిలిచియున్నవాడు.

అని అన్నమాచార్యులు శ్రీకృష్ణజయంతిని గూర్చి భక్తి పూర్వకముగా కీర్తించినాడు. ద్వాపరయుగంలో శ్రావణ మాసం, బహుళ అష్టమినాడు రాత్రి రోహిణి ప్రొద్దున శ్రీకృష్ణ జననం జరిగింది. మరి ఈ కలియుగంలో కూడ తాళ్ళపాక అన్నమయ్య కృష్ణావతారమును ప్రత్యక్షముగా దర్శించినట్లు "అదిగో" చంద్రోదయము, రోహిణీ నక్షత్రము, చతుర్భుజుడు శంఖ చక్ర గదాదుల ధరించినమూర్తి 'అదివో', వానిని చూచి ఆనందించిన దేవకీ వసుదేవులు 'వారే' బ్రహ్మాదుల కొండాట 'మదె'. పాండవులను బ్రదికించి అర్జునునకు చూపించిన విశ్వరూపము "అదె". మహాభారత కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవ సంహారము 'నిదె'. అని "అదివో, అదె, నిదిగో, నిదె" అని చిన్నవదాలతో అలనాటి శ్రీకృష్ణ జననాన్ని శ్రీకృష్ణ లీలలను శ్రీకృష్ణావతార తత్త్వాన్ని తాను స్వయంగాదర్శించి మీరూ దర్శించండి అని మనలనూ ప్రబోధిస్తున్నాడు అన్నమయ్య.

ఎప్పటి ద్వాపరయుగం! ఎప్పటి శ్రీకృష్ణుడు!! మనకు గోచరమగునా? అని సందేహించనవసరం లేదు. ఆ ద్వాపర యుగంలోని కృష్ణుడే! కంసుణ్ణి వధించిన కృష్ణుడే, పూతనా తృణావర్త శకటాసుర సంహారము, కాళీయగర్వభంజనము, నరకాసురవధ, శిశుపాలవధ కావించి భూభారమును తొలగించిననాటి శ్రీ కృష్ణుడే, కౌరవ నాశనముచేసి పాండవుల బ్రదికించి పరంజ్యోతియైన శ్రీకృష్ణుడే నేడు వేంకటాద్రిపై శ్రీ వేంకటేశ్వరునిగా నిలచినాడు అని తాళ్ళపాక అన్నమయ్య ఉపదేశించినాడు. అనగా అన్నమయ్య తిరుమల శ్రీ వేంకటేశ్వరునిలో సాక్షాత్తుగా అలనాటి ద్వాపర యుగంనాటి శ్రీకృష్ణావతార విశేషాలను దర్శించినాడు. అంతేకాదు ఈ ఒక్క సంకీర్తనతో భాగవత భారత విష్ణుపురాణాదులలో వర్ణింపబడ్డ శ్రీకృష్ణావతార తత్త్వాన్ని అంతయు మనకు దర్శింపజేసినాడు. ఇలాంటి శ్రీకృష్ణజయంతిని, శ్రీకృష్ణలీలలను, శ్రీకృష్ణుని చిలిపి పనులను వర్ణించే పాటలను అన్నమయ్య కోకొల్లలుగా భక్తితో పాడి వరమగానములుగా లోకమున కందించినాడు.

## తిరుమల శ్రీవారి ఉట్ల ఉత్సవం

తిరుమలలో శ్రీవారికి శ్రీకృష్ణజయంతి నాడు జరిగే ఉట్ల ఉత్సవాన్ని దర్శించి అన్నమయ్య అనేక కీర్తనల్లో కీర్తించినాడు. వానిలో మచ్చున కొకటి.

ఉట్లుఅనగానే ఉట్లమీది పాలు, వెన్నా, మీగడా వెను వెంటనే ఆ పాలను, వెన్నను దొంగిలించే వెన్నదొంగ చిన్నికృష్ణుడు జ్ఞాపకం వస్తాడు. అంటే అలనాటి ద్వాపర యుగంలో బాలకృష్ణుని చిలిపి పనులనూ ఉట్లుగొట్టి వెన్నలు దొంగిలించడం వంటి



లీలలను స్మరించుకుంటూ మళ్ళీ ఆనందంతో ఉట్లతో ఉత్సవం జరుపుకోవడమే ఉట్ల ఉత్సవమంటారు. పైగా ఎప్పుడంటే అప్పుడు ఈ ఉత్సవాన్ని చేయరు. శ్రీకృష్ణునికి సంబంధించిన ఉత్సవం కాబట్టి శ్రావణమాసంలో శ్రీకృష్ణజయంతి నాడే నిర్వహింపబడుతుంది. ఈ ఉట్ల పండుగ చాల పూర్వం నుంచీ తిరుమల శ్రీ వేంకట ప్రభువునకు జరుపబడుతున్నట్లు మనకు ఎన్నో శాసనాధారా లున్నాయి. అలాగే వైభవోపేతంగా జరుగుచున్న శ్రీనివాసుడి ఉట్ల పండుగ వేడుకలను తాళ్ళపాక అన్నమాచార్యులు అనేక కీర్తనల్లో వర్ణించి కీర్తించియున్నాడు.

బౌళి

ఎటువంటి యాగడీఁడే యీ కృష్ణుఁడు
జొటజొటఁ గారఁగానే జుట్టీ మీఁగడలు!





కొట్టెఁగృష్ణుఁడు వాఁడె కోలలెత్తి వుట్లపై
దట్టముగ గొల్లెతలు దాఁచిన పాలులు
చుట్టిన చక్కిలములు చొక్కపు నురుగు
లునుఁ
బెట్టిన కాఁగులతోనే పెంచులుగఁజేసినే॥

దొంతులు దించి దించి దొరకొని
కృష్ణుఁడు
బంతిఁజక్కెర వెట్టి గోపాలులకెల్ల
మంతనాన వద్దని మానుపఁ బోతేఁ దాను
కొంతవారి నోరఁ బెరుగులు చమరీనే॥

వీదులెల్ల దానె శ్రీవేంకటాద్రి కృష్ణుఁడు
ఆదిగొని మెసగీని యడుకులెల్ల
కాదని పెనఁగితేను కాఁగిలించీ గొల్లెతల
సోదించి కుచము లంటి సొంపుగాఁ
గూడీనే॥

పై పాటలో కృష్ణుని ఆగడపు పనులు వర్ణింపబడినాయి. ఉట్లను కోలలతో కొట్టి గొల్లెతలు దాచినపాలు, చక్కిలములు మరుగులు కాగులతోకూడ పెంచులు పెంచులుగా పగులకొట్టినాడట.

ఉట్లపై దొంతరలుగానున్న కుండలను దించి అందులోని చక్కెరలను గోపాలులకు పంచుతుండగా వద్దని వారింప బోవువారి నోళ్ళలో కూడ పెరుగులు చమురుతాడట వెన్నదొంగ కృష్ణుడు అన్ని వీథులూ తనవే అన్నట్లుగా తిరుగుతున్న శ్రీ వేంకటాద్రి కృష్ణుడు యటుకులను మెక్కుతున్నాడు. వద్దని వారించే గొల్లెతలను కౌగిలించుకొనే వాడు కొంటెకృష్ణుడు అని అన్నమయ్య శ్రీకృష్ణుని ఉట్లపండుగను వర్ణిస్తూ ఆనాడు ఎన్నో రకములయిన ఉట్లు కట్టబడినట్లు మరొకకీర్తనలో ఇలా వర్ణించినాడు.

శంకరాభరణం

అక్కలాల చూడుఁడందరును
నిక్కివారివట్టీ నేఁడు గృష్ణుఁడు॥

ఆనవాల వుట్టి అడుకుల వుట్టి
పానకపుటుట్టి బలిమినే
ఆనుక కోలల నంది యంది కొట్టి
తేనె వుట్టి గొట్టి దేవకి సుతుడు॥

పెరుగువుట్టి మంచిపేరిన నేతివుట్టి
సరివెన్నవుట్టి చక్కెరవుట్టి
వెరవుతోఁగొట్టి వెస బాలులతో
బొరుగువుట్టి గొట్టీ పొంచి రాముఁడు॥

మక్కువ నలమేలుమంగఁ గూడి నేఁడు
చొక్కి శ్రీ వేంకటేశుఁడు వీథుల
నిక్కి వుట్లెల్లా నిండాఁ గొట్టె వుట్టి —
చక్కిలాలు గొట్టీ జగతీశుఁడు॥

బాగా ఇగురకాచిన పాల (ఆనవాల) వుట్టి, అటుకులవుట్టి, పానకపుటుట్టి, తేనెవుట్టి ఇన్ని ఉట్లను దేవకి సుతుడు కోలలతో ఎగిరి ఎగిరి కొట్టినాడట.

అట్లే పెరుగు వుట్టి, గట్టిగ పేరిన నేతివుట్టి, వెన్నవుట్టి, చక్కెరవుట్టి, బొరుగువుట్లను పొంచి పొంచి బలరాముడు కొట్టేవాడట.

మక్కువతో శ్రీ వేంకటేశుడు అలమేలు మంగతో కూడి వీథులలో కట్టబడిన ఉట్లనెల్లా నిక్కినిక్కి కొట్టినాడట అని అన్నమాచార్యులు అనేక రకములయిన ఉట్లను, ఉట్లపండుగ వేడుకలను వర్ణించినాడు. ఈ వినోదములెల్ల ద్వాపరయుగము నాటి చిన్నికృష్ణుని చిలిపిచేష్టలకు నిదర్శనములు. ఈ వేడుకల్లో పాల్గొనువారు కృష్ణుని వేషం ధరించి ఉట్లను గొట్టుదురు. అంటే ఈ ఉట్లను కొట్టువారే గోపాలకృష్ణు డన్న మాట. ఈ ఉట్లపండుగ వేడుకలు శ్రీవారి ఉత్సవమూర్తి ఎదుట వీథులలో నిర్వహింపబడుతవి. నేడు కూడ తిరుమల శ్రీవారికి ఈ ఉట్లపండుగ ఉత్సవాలు రోహిణీనక్షత్రం ప్రధానంగా గల రోజున ఘనంగా నిర్వహింపబడుతున్నాయి. •




క్లైబ్యం మా స్మ గమః పార్థ
నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయ దౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరంతప. (గీత 2-3)

"ఓ అర్జునా! అధైర్యమును పొందకుము. ఇట్టి పిరికితనము నీకు తగదు. నీచమగు ఈ మనోదుర్బలత్వమును విడనాడి లెమ్ము! కర్తవ్యమునకు గడంగుము."

మనోదౌర్బల్యముచే, అధైర్యమును చెందినవారై, కర్తవ్యము దెలియక సాహసముతో ముందడుగు వేయలేని మానవాళికి సర్వజగద్రక్షకుడైన, సకలలోక పాలకుడైన శ్రీకృష్ణ పరమాత్మ ఉత్తేజపరచి, కర్తవ్యమును గడంగునట్లు చేయుటకుగాను అర్జునుని ముఖముగా యిచ్చిన సందేశము ఈ శ్లోకములో ఇమిడి యున్నది.

ఇది చాల అద్భుతమైన శ్లోకము. గీతా సందేశమంతయు యీ ఒక్క శ్లోకంలోనే యిమిడి యున్నది. పిరికితనముచే, మనోదౌర్బల్యముచే జడప్రాయులైన మానవాళి నెల్ల చైతన్యవంతులుగా ముందుకు నడవగల్గిన అద్భుతశక్తి యీ శ్లోకమునకు కలదని చెప్పుట అతిశయోక్తి కానేరదు. ఎందరో మహానుభావులు మానసికంగా క్రుంగి, పిరికితనము పొందినవారై కర్తవ్యము బోధపడక, నిస్సహాయస్థితిలో నున్నపుడు చైతన్యపరచి, ధైర్య సాహసముల నిచ్చి ముందుకు నడిపినట్లు వారి చరిత్రలను పరికించిన మనకు తెలియగలదు. వివేకానందుడు, మహాత్మాగాంధీ స్వయంగా అట్లు ఉత్తేజమును పొందినట్లు చెప్పుకున్నారు. గీతాపఠనంచేసే ప్రతివారు గూడ యీ శ్లోకంచే ఉత్తేజముపొంది, చైతన్యవంతులై కర్తవ్య శూరులు కాగలరనిన అతిశయోక్తి కానేరదు.

స్వామి వివేకానంద, ఈ శ్లోకముయొక్క అద్భుతశక్తిని యీ విధముగా చెప్పారు.

"ఈ ఒక్క శ్లోకమును చదివినయెడల గీత యంతయు చదివిన ఫలితమును మనుజుడు పొందగలడు. ఏలయనిన గీతయొక్క సందేశమంతయూ దీనిలో యిమిడి యున్నది."

మనము ఏకార్యమునకు పూనుకొన్ననూ, ఉత్సాహ, ధైర్య సాహసములతో ముందుకు నడవాలి. భయమునకు, పిరికితనమునకు తావివ్వరాదు. భయం, పిరికితనములు మనిషి వివేకమును పోగొట్టుతాయి. అవి చోటుచేసుకుంటే దౌర్బల్యముతో మనిషి మంత్రించినట్లు కట్టివేయబడతాడు. అన్యాయాలను, అక్రమాలను, అవమానాలను తలవంచుక భరించేటట్లుచేస్తుంది. సంఘ విద్రోహులను, దోపిడీదారులను, గూండాలను ఎదుర్కొని న్యాయం ధర్మ రక్షణకు నిలబడేశక్తి క్షీణిస్తుంది. వారికి తల ఒగ్గేటట్లు చేస్తుంది.

భయము పిరికితనము మొదట చోటు చేసుకొని క్రమముగా సకల దుర్బలత్వములు చేరుకుంటాయి. ముఖ్యముగా ఇవి మనిషిని స్వధర్మాచరణం నుంచి కూలదోస్తుంది. కర్తవ్య విమూఢుణ్ణి చేస్తుంది. అందుచేత లోకంలో ధర్మరక్షణ, సాధుజన రక్షణఅన్నవి కుంటుబడుతవి. అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్యాలు ప్రబలుతాయి. మానవజాతే అరాచకములతో అంతరిస్తుంది.

మనిషి ఏ పనినైనా సమర్థతతో చేయాలంటే, మనోదౌర్బల్యమును పిరికితనాన్ని తొలగించుకోవాలి. అప్పుడు మనిషిలో ధైర్యసాహసాలు నెలవు చేసుకొంటాయి. అట్టి ధైర్య, సాహస గుణాలు కలచోటనే



దేవుడు కూడా వసిస్తాడని శాస్త్రాలు ఘోషి స్తున్నాయి.

ఉత్సాహం సాహసం ధైర్యం
బుద్ధి శ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠంతి
తత్ర దేవోఽపి తిష్ఠతి.

భగవానుడు ప్రయత్నాధీనుడు. కర్తవ్య దీక్షుడైనవానికి భగవానుడు విజయాన్ని చేకూరుస్తాడు. కర్తవ్యదీక్షుడైన వానిలో పైశ్లోకంలో చెప్పిన ఆరు దైవగుణములు వచ్చి చేరుతవి. ఇట్టి దైవ గుణములు ఎచ్చట ఉంటాయో అచట విజయంతథ్యం. ప్రతివ్యక్తి కర్తవ్యదీక్షుడై స్వధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తాడు. కావున అక్రమాలు, అన్యాయాలు, దౌర్జన్యములకు చోటులేక సర్వత్రా ధర్మము, న్యాయము ప్రతిష్ఠింపబడి లోకం సుభిక్షంగా ఉంటుంది.

భగవానుడు "క్షుద్రం హృదయ దౌర్బల్యం" అని హెచ్చరిస్తున్నాడు. మానసిక బలహీనత క్షుద్రగుణం. మనస్సు దుర్బలమైతే అన్ని అవలక్షణాలు దొంగల్లాగవచ్చి చేరి మనిషిని దోచుకుంటవి. అట్టి వానికి మరణమే శరణ్యం. అందుకే మనోదుర్బలత్వం మరణంతో సమానమని చెప్పబడింది.

పిరికివాళ్ళనే మరణం త్వరగా కబళిస్తుంది. సర్వశక్తులుడిగి దుర్బలుడైన వానిని సర్వులు పీడిస్తారు. ఎదిరించేశక్తి లేక వానికి బలికావలసినదే. అట్టివాడు మనిషిగా ఉన్నా మృతతుల్యుడే. మరణ తుల్యంగాబట్టి మనోదుర్బలత్వం క్షుద్ర గుణమని భగవానుడు హెచ్చరిస్తున్నాడు.

భగవానుడు పిరికితనం. అధైర్యం తగదని హెచ్చరించాడు, ఇది మానవాళికందరకు చేసిన హెచ్చరిక. ఎందుకంటే మనిషికి పిరికితనం సహజగుణంకాదు. అతడు ఆత్మస్వరూపుడు. దైవగుణశోభితుడు. అతనిలో దైవత్వం అధికంగా ప్రతిఫలిస్తుంది. పరిపూర్ణత్వాన్ని పొందటానికి సృష్టిలోనే సహజంగా అర్హుడైనవాడు. కాబట్టి అట్టి ఉన్నతుడైన మానవునికి పిరికితనం సహజగుణంకాదు. అందుచేత అది వానికి తగని లక్షణం. దీనికి భిన్నంగా పిరికితనానికి చోటిస్తే అది స్వాపరాధము అవుతుంది. అట్టియెడ మానవుడు స్వధర్మాచరణము నుండి దూరమౌతాడు. అందుచే లోకంలో ధర్మగ్లాని జరుగుతుంది. అధర్మము, అన్యాయాలు వీరవిహారంచేసి, సర్వత్రా అశాంతి నెలకొని మానవాళి వినాశమునకు దోహదం చేస్తుంది. అందుచే మానవునకు పిరికితనం పనికిరాదని జగద్రక్షకుడైన శ్రీకృష్ణ పరమాత్మ మానవాళిశ్రేయస్సు గోరినవాడై మిక్కిలి దయతో హెచ్చరిస్తున్నాడు.

భగవానుని హెచ్చరికను మానవాళి ఖాతరుచేయకున్న వినాశము కోరితెచ్చుకున్నట్లే అవుతుంది. కాబట్టి భగవానుని హెచ్చరికను సర్వ మానవాళి అనుసరించి, జాగృతినొంది, చైతన్యవంతులై దైవ గుణములను బొంది జీవిత సుఖమును పొందాలి. అప్పుడే లోకకల్యాణము జరుగుతుంది. ధర్మము నాలుగు పాదముల నడుస్తుంది.

ఇట్టి అద్భుతశక్తిగలిగిన ఈ శ్లోకాన్ని భగవానుడు మానవాళికి దయతో యిచ్చిన వరప్రసాదంగా భావించి నిత్యం పారాయణంచేసి, చైతన్యవంతులై, కర్తవ్యదక్షులై భగవానుని అనుగ్రహాన్ని పొంది సుఖ శాంతులతో మనుగాత.

— సాయిశ్రీ

---

( 23 వ పేజీ తరువాయి )

అలివేణీ నిచయంబు లారయుడుని న్న య్యామునాంభఃస్థితున్
బలవద్వ్యాళ వివేష్టితావయవు, దుర్వారోరుమూర్ఛాగతున్
లులితాందోళిత దృఙ్మనోవితతికిన్ దోస్సార విస్ఫారని
స్తులవేగోద్ధత తాండవాకృతిగఁ దోడ్తోఁదోఁచు నిన్గొల్చెదన్.

హేలాలోలము లోలచూడము సమాకృష్టాంగనానీక, ము
ద్వేలశ్రీకము, భీకరాహిఫణ పంక్తిన్యస్త పాదాంకమున్
కాళిందీ తటినీ నితంబతట సంక్రాంతాద్భుతక్రీడ, మా
శాళీవ్యాప్త యశస్కముం గొలుతు నిత్యానందగోపాలమున్.

బృందాగుల్మవనావనీచర రసావిర్భావ పుంభావ మూ
ర్తిం, దారుణ్యవిలాస భాసవరనారీలోక సమ్మోహనా
ద్యుం, దివ్యాద్భుత విక్రియాప్రచుర యోగోద్భూతి
విక్రాంతు సా
నంద స్వాంతుని; గోపవేషుని హృదంతర్వేది నర్చించెదన్.

సాలతమాల తాళ తరుజాల వినీల కళిందజాపగా
కూల తటానుకూల వినిగూఢ భవద్బహు చోద్య బాల్యలీ
లా లహరుల్ చెలంగినవి రాసవిలాసగ గోపకామినీ
లోల విలోల వర్తన, ల లోలమహత్తర యోగసిద్ధులై.

నందకిశోర! గోకులజనప్రకరాఖిల చిత్తచోర! సం
స్పందిత వేణువాద పరిసర్పిత మోహవశీ కృతాంగనా
బృంద సమావృతా! భువనవిశ్రుత! విచ్యుతధర్మ భర్త్రిసతా
క్రందనభాగ్యనావన పరా! వరమ్మాశయ! ధర్మసంశ్రయా!

శాపగ్రస్త విముక్తి దక్షము, కనత్ శ్యామాంగ మర్చింతు, నా
క్షేపోదర్క రిపుప్రభుప్రహతికృత్ శ్రీరమ్య సమ్మాన్యమున్,
పాపోదగ్ర ధరాధిపప్రకర విధ్వంసాహవోత్పాదకం,
బాపద్బాంధవ, మార్తివారకము, గీతాలాప గోపాలమున్.

# శ్రీకృష్ణుని శిరోవేదన

శ్రీకృష్ణులవారికి అష్టభార్యలు!
ఆపైన పదహారువేల మంది ఇష్టప్రేయసులు!!

వీరంతా ఎవరికివారే తాము మాత్రమే శ్రీవారి మనసుకెక్కిన వారమని మురిసిపోయే మదవతులు. వీరందరూగాక శ్రీకృష్ణుడికి రాధ కూడా వుంది. వారి అనుబంధం స్థూల భావనకు లోకదూషితం' అంతశ్చక్షువులకు అదొక ఆత్మపరమాత్మిక సంబంధం. అతిలోక సౌందర్యవతులైన అంతమంది కాంతామణులుండగా అతి సామాన్యయైన రాధమీద కృష్ణుడికి చెప్పరాని అనురాగం ఎందుకు చెప్పుమా అని నారదులవారికి ఓసారి ఒక సందేహం వచ్చింది—

"స్వామీ! తమకు ఆ రాధమ్మ మీద ఎందు కంత పక్షపాతం? ఏమిటి ఆవిడ ప్రత్యేకత?" అంటూ ఆ కలహాభోజనుడు శ్రీకృష్ణుడిని కొంటెగా ప్రశ్నించాడు.

'ఈ చెప్పుడు మాటలకేం మొచ్చెగాని నారదా! నీతో నాకొక పనుంది. చేసిపెడతావా చెప్పు?' అన్నారు శ్రీకృష్ణులవారు చిరునవ్వు నవ్వుతూ!

"అవశ్యం! అనుజ్ఞ ఇవ్వండి" అన్నాడు నారదుడు.

"నాకు విపరీతమైన శిరోవేదనగావుంది. నా భక్తులలో ఒకరి పాదధూళిని తెచ్చి దానితో చందనచర్చ చేస్తే అది ఉపశమిస్తుంది. కనుక ఆ పాదధూళిని సంపాదించు" అన్నారు భగవానులు.

'అదెంతపని!' అంటూ ముందుగా రుక్మిణీదేవి వద్దకు వెళ్ళాడు నారదుడు.

"తల్లీ! నువ్వు పరమసాత్త్వికురాలివి. పతివ్రతవి! నీకు మించిన భక్తురాలు వేరెవరున్నారు? మీ నాథునికి శిరోవేదనగా వుంది. మీ పాదధూళియే దానికి పరమాంజనమట! కనుక దానిని నాకు ప్రసాదించండి" అంటూ అభ్యర్థించాడు. ఆ మాటలు విని—

'అమంగళము ప్రతిహతమగు గాక' అంటూ చెవులు మూసుకొంది రుక్మిణీదేవి.

'ఏమిటీ? శ్రీకృష్ణభగవానుడి నుదుటిపై నా పాదధూళిని ఉంచటమా? ఎంత అపచారం! ఆయన సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు. ఆ దేవదేవుని పాదాలను జలజాతాసన వాసవాదులు తలపై పెట్టుకొంటారు. అటువంటి స్వామి శిరసుపై నా పాద ధూళిపడితే నేను పాపకూపంలో పడిపోనా?" అంటూ విలవిలలాడిపోయిం దా దేవి.

నారదుడు తన భక్తి సూత్రాలను వల్లెవేశాడు. కాని ఆమె ఆ పని తనవల్ల కాదంది. చివరికి నిరాశతో ఆ జగడాలముని జాంబవతిని ఆశ్రయించి ఆమె పాదధూళిని అడిగాడు. ఆ కోరికకు జాంబవతి తీరికగా నవ్వి ఇలా అంది.

"నారదా! నువ్వు బ్రహ్మమానస పుత్రుడివి! బ్రహ్మజ్ఞానివి! నీ వేదాంత పరిజ్ఞాన



మేమైంది? సాక్షాత్తు ఆ శ్రీమహావిష్ణువే శ్రీకృష్ణుడయ్యాడు. ఆ పరబ్రహ్మానికి సహస్ర శీర్షాలూ; సహస్ర పాదాలూను! ఇంతకీ మా శ్రీవారి శిరోవేదన ఏ శిరసు కని? చాలుచాలు పోవయ్యా! నీ మాటలతో నన్ను ఆటపట్టించలేవు" అంటూ పరిహాసాలతో ఆమె నారదుణ్ణి సాగనంపింది. ఇక అక్కడి నుంచి సత్యభామ ఇంటికి పోదామా అనిపించింది. ఆవిడకూడా తన మాటలను 'అసత్యం' గా కొట్టిపారెయ్యడం తథ్యం! పాపం! ఆ దేవమునికి దిక్కుతోచ లేదు.

చివరి ప్రయత్నంగా ఆతడు రాధమ్మ ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆమె స్నానం చేసి వస్త్రధారణలోవుంది. నారదుడు కాసేపు వాకిట వేచివుండి ఆ తరువాత నారాయణ! నారాయణ! అంటూ లోనికి వెళ్ళాడు. రాధాదేవి అర్ఘ్యపాద్యాదులతో నారదుణ్ణి ఆదరించింది. ఆమె ఆతిథ్యం స్వీకరించాక, మెల్లగా తాను వచ్చినపని చెప్పాడు నారదుడు.

"అయ్యయ్యో! స్వామికి శిరోవేదనా? నారదా! వచ్చిన వెంటనే ఈ వార్త చెప్పక ఎందుకు కాలహరణం చేశావు? స్వామికి నేను ఉపచారాలు చేయాలి" అంటూ రాధాదేవి వీథిలోకి పరుగిడబోయింది. అతికష్టం మీద ఆమెను ఆపి- 'అమ్మా! మీరు పరుగెత్తి ప్రయోజనం లేదు. స్వామివారి శిరోవేదనకు మందు మీవద్దనే వుంది. అది తీసుకుపోయేందుకే నేను వచ్చాను" అంటూ విన్నవించాడు నారదుడు.

'ఆ ఔషధమేదో సెలవివ్వండి. తక్షణం తీసుకొస్తాను'రాధాదేవిఆతృతగా అడిగింది!

'అది నీ పాదధూళియే తల్లీ!' అన్నాడు నారదుడు. మరి ఆ మాట చెప్పవేమి అంటూ రాధమ్మ తన పాదాలను మట్టిలో ముంచి కాళ్ళకంటుకొన్న ధూళిని తీసి ఒక బరిణెలో వుంచి నారదుడి చేతికి యిచ్చింది.

'స్వామీ! శీఘ్రమే బయలుదేరండి. ఆలస్యైతే స్వామికి ఏమవుతుందో ఏమో?' అంటూ నారదుణ్ణి త్వరపెట్టింది.

'అమ్మా! బాగా ఆలోచించే ఈ పని చేశావా? నీ పాదధూళిని ఆ పరమాత్మ శిరసుపై వుంచటం పాపం అవుతుందేమో?' నారదుడు తన ధర్మసందేహం వెలిబుచ్చాడు.

'స్వామీ! నాకు కావలసింది నా శ్రీకృష్ణుడు శిరోవేదన తొలగి సుఖంగా ఉండటం. అందుకోసం నేను ఏమైనా చేస్తాను. ఇందులో పాపపుణ్యాల ప్రసక్తి లేదు" అంది రాధమ్మ నిబ్బరంగా, నిర్భయంగా! ఆ క్షణంలో రాధామాధవుల ప్రేమ తత్త్వం అవగతమైంది నారదుడికి!!

తథాస్తు అంటూ నారదుడు ఆమె పాదధూళి బరిణెను తీసుకెళ్ళి శ్రీకృష్ణుడికి ఇచ్చాడు.

'ఎవరిదీ పాదధూళి?' క్రీగంట చూస్తూ కొంటెగా అడిగాడు శ్రీకృష్ణుడు.

'స్వామీ! ఇది ముగ్ధభక్తురాలయిన ఓ ముద్దరాలిది' అన్నాడు నారదుడు.

'ఎవరావిడ?' మళ్ళీ అమాయకంగా అడిగాడు శ్రీకృష్ణుడు.

'భక్తజనపక్షపాతివి! ఆ మాత్రం మీకు తెలియదా?' అంటూ చిరునవ్వుతో అక్కడి నుంచి నిష్క్రమించాడు నారదుడు.

—'కృష్ణచైతన్య'

---

## రాగలహరి



### శ్రీకృష్ణలీలలు

(స్టీరియో కేసెట్టు)

నిర్మాత: శ్రీ పి. తాయప్ప; M/s. విజయలక్ష్మి మ్యూజిక్ సర్వీస్. 46-93 బుధ్వార్ పేట. కర్నూలు. వెల: రూ. 32-00.

"ఓంకారం సృష్టికి మూలాధారం, వేదానికి ఆది, నాదానికి నాంది ఓంకారమే" అని చెప్తూ, ఈ సృష్టిలో దుష్టులను శిక్షిస్తూ, శిష్టులను రక్షిస్తూ, భగవంతుడిని ప్రార్థిస్తూ, కీర్తిస్తూంటాడని, ఈ ప్రపంచంలోని మానవుని జన్మవృత్తాంతముతో మొదలు పెట్టి "శ్రీకృష్ణలీలలు" పాటల రూపంలో భక్తి మరియు భావ యుక్తముతో ఈ కేసెట్‌లో పొందుపరచబడినది.

"కృష్ణలీలలు" వర్ణించి చెప్పిన కాంచన అలనాటి ద్వారక కనులముందుంచారు. ఇందులోని భక్తియుక్తమైన పాటలు పి. సుశీల, బి. వసంత, ఎస్. పి. శైలజ గానం చేశారు.

కొన్ని పాటలకి కూర్చిన సంగీతం భావాతీతముగా ఉన్ననూ, "లీలామానుష విలాసరూపాగోపాల" అనే పాటలో పి.సుశీల, కృష్ణుని బాల్యం తెలుపుతూ రాగ, భావాల కలయికతో పాడారు. బి. వసంత పాడిన శ్లోకము మనోహరముగా ఉన్నది. ఎస్. పి. శైలజ పాడిన పాటలు ఆమె స్వరమునకు తగినటులే ఉన్నవి.

శ్రీ చిరంజీవి రచించి, శ్రీ జె. పురుషోత్తమ్ సంగీతం సమకూర్చిన "శ్రీ కృష్ణ లీలలు" బహుళ ప్రజాదరణ పొందగలదు.

— డా॥ బి. రజనీకాంతరావు




1937–జనవరి నా జీవితంలో మరువలేని నెల అది. విజయనగర మహారాజుసంస్కృత కళాశాలలో విద్యార్థిగా ఉంటున్న రోజులవి. సెలవుల్లో కళాశాల విద్యార్థులు పదునైదు రోజులు ఎక్కడికైనా వెళ్లి రావడానికి తక్కువ రేటు రైలు టిక్కెట్టు మీద ప్రయాణం చెయ్యవచ్చు. ఆ పద్ధతిన నేను విజయనగరం నుంచి మద్రాసుకు టిక్కెట్టు తీసుకుని బయల్దేరాను. నాతో మా చిన్నక్క మరిది దారాముక్కల చిన్న యజ్ఞేశ్వర శర్మ (చిన్న అని పిల్చేవారు సాలూరు ప్రాంతం అంతా) వచ్చాడు. నాకు చిన్నప్పుడు మా తల్లిదండ్రులు చేసిన మ్రొక్కుబడి తీర్చుకోవాలని గూడూరు వద్ద దిగి తిరుపతి వెళ్ళాము. అప్పుడు కొండమీదికి నడచి గానీ డోలీలమీంచి గానీ వెళ్ళాలి. మేము నడిచే వెళ్ళాము.

చుక్కల పర్వతంవద్దకు వెళ్ళేసరికి నాకు చుక్కలు కనిపించాయి. గాలిగోపురంవద్ద కూర్చుని వేంకటేశ్వరస్వామిని హేళనచేస్తూ ఒక పద్యం చెప్పాను. (అప్పుడు ఆశువుగా చెప్పేవాణ్ణి. శతావధాన్లుగారి తరిఫీదు ప్రభావం అది.) ఎవరు చెప్పిన పద్య మది బావా! అని మా చిన్న బావ అడిగాడు. ఎవడో చెప్పినది చదవడం నా ప్రారబ్ధమా? చెళ్ళపిళ్ళ వారి శిష్యుడవు నీకు తెలియదా? అని ధీమాగ అన్నాను. ఏమైనా చెప్పేదువు గాని, వేంకటేశ్వరుడి మీద ఆలాటి హేళన పద్యాలు చెప్పితే చెంపవాయగొడతాడు! సుమా అన్నాడు మా బావ. అదేదో చూస్తాను అని మరొక పద్యం చెప్పాను. నీ కేదో పట్టింది–అని ముందడుగు వేశాడు. నేనూ లేచాను ఈడుపు కాళ్ళతో ఏడుపు మొగంతో పైకి వెళ్ళాను. స్వామి దర్శనం చేసుకొని తిరుగు ముఖం పట్టాము.




మా కన్న ముందు బయల్దేరిన డోలీవాని కన్నా వడివడిగా అడుగులు వేస్తూ నేను ముందు దిగాను. అరగంట ఆలస్యంగా వచ్చాడు మా బావ. నిజంగానే పెనుగాలి త్రోసివేసినట్టు ఏదో ఆవేశముతో వచ్చాను. నా స్థితి మా బావ కనిపెట్టుతూనే ఉన్నాడు.

మేము బస చేసిన యింటి యజమాని 'రండి, కులాసాగ వెళ్ళి వచ్చారా' అని అడిగాడు. వచ్చామన్నాను నేను. నా మాట ఆయనకి తెలియలేదు. మళ్ళీ అడిగాడు. జవాబు చెప్పాను. ఆయన మా బావతో అన్నాడు. 'ఈయన నోరు ఆడిస్తాడు గాని ఆ మాట ఏదో పైకి రాలేదేమిటయ్యా! అని. నేను ఆయన మాట వింటూనే ఉన్నాను. జవాబు చెప్తూనే ఉన్నాను. కాని ఆయనకి వినిపించ దది.

ఒక గడియ అయే సరికి బుగ్గలూ పెదవులూ పొంగి పోయాయి. ఏదో బాధ. ఆయనా మా బావ కలిసి నన్నొక వైద్యుడి వద్దకు తీసుకువెళ్ళి పరీక్ష చేయించారు. ఆయన నోరు తెరచి బ్యాటరీలైటు వేసి చూశాడు. ఏమీ లేదే. లోపల అంతా బాగానే ఉంది. అని అన్నాడు.

ముగ్గురం ఇంటికి వచ్చాము. మా బావ చెప్పాడు. వీడు స్వామివారిని హేళనచేస్తూ పద్యాలు చెప్పాడు. స్వామివారు కొట్టారు దెబ్బ—అని. అలాగా? ఈ యింటి యజమాని కాగితం కలం ఇచ్చి ప్రార్థిస్తూ పద్యాలు వ్రాయండి అని అన్నాడు. వెంటనే 'నక్షత్రమాల' పేరుతో ఇరవైయేడు పద్యాలు వ్రాశాను. ఇరవైఆరో పద్యం వ్రాసే సరికి నోటి వాపూ బాధా ఏష్యమై పోయాయి. నా మాట ఎదుటి వారికి వినిపించింది. ఆ పద్యం ఇది.

'ఏమి తలంచితో పెదవు లేమియు నాడవు
దౌడ సాగ దిం
కేమి గతిన్ నుతించునను నీతడు
తిట్టిడి వాడె యంచు; ఓ
స్వామి! భయంబు లే దరయ;
జంకదుగా కల మూరు భావముల్
వేమరు: దాచ పన్నికలు
పెండిలి యాగునె వేంకటేశ్వరా!

—శ్రీ యామిజాల పద్మనాభస్వామి











# ప్రముఖుల సందర్శన

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రావణ్‌కుమార్ ఐ.ఏ.ఎస్., తిరుమల తిరుపతి దేవస్థాన సంక్షేమ సంస్థలైన శ్రీ వేంకటేశ్వర బాలమందిర్, శ్రీ వేంకటేశ్వర కృత్రిమావయవ కేంద్రం, వికలాంగుల శిక్షణ మరియు ఉపాధి కేంద్రాలను 22-7-1984న సందర్శించారు. వికలాంగుల సంక్షేమంకోసం ఇటువంటి కేంద్రాలను రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో ఏర్పాటు చేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సంకల్పం. ఇందుకుగాను వీరు ప్రభుత్వానికి నివేదిక సమర్పిస్తారు. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఐ. ఏ. ఎస్., మరియు ఇతర దేవస్థాన అధికారులు వెంటరాగా వివిధ విభాగాలను పరిశీలించి, దేవస్థానం చేస్తున్న కృషిని అభినందించారు.

చిత్రాలు:

1. శ్రీ వేంకటేశ్వర బాలమందిర్.
2. శ్రీ వేంకటేశ్వర కృత్రిమావయవ కేంద్రం.

3, 4, 5, 6. శ్రీ వేంకటేశ్వర వికలాంగుల శిక్షణ మరియు ఉత్పత్తి కేంద్రం.



[ 16 పేజీ తరువాయి ]

ఉన్నది. ఇట్టి గ్రంథానికి ప్రకాశనార్థం ద్రవ్య సహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానంవారి దాతృత్వం సఫలం. ఇత రులు కూడ ఈ సత్కార్యానికి తోడ్పడడం ముదావహం. గ్రంథం పిన్న పెద్దలందరూ చదువతగినది.

— ముట్నూరి సంగమేశం

## భారతనామానుక్రమణిక

(1 2 3 4 5 భాగములు)

రచయిత : శ్రీ పురాణపండ శ్రీచిత్ర.

ప్రాప్తిస్థానము : శ్రీ పురాణపండ శ్రీచిత్ర
పురాణపండవారి వీధి
అలమూరు (తూ॥ గో॥ జిల్లా)

భారతదేశ మనగా రామాయణ మహా భారత భాగవతము లనివిజ్ఞుల నిర్వచనము. ఆమహాగ్రంథముల పావిత్ర్య ప్రశస్తులట్టివి. ఇందులో మొదటిది కావ్యము. రెండవది ఇతి హాసము.మూడవది పురాణము.కాలక్రమము ననుసరించి మహాభారతము ద్వితీయమై నను గ్రంథవిస్తృతి, ఇతివృత్తవైపుల్యము, విషయ బాహుళ్యము, లౌకికపారలౌకిక విజ్ఞానసమృద్ధి దృష్ట్యా మహాభారత మద్వి తీయము. అందుకే మహాభారతేతిహాసము నకు పంచమ వేదమను ప్రసిద్ధి కలిగినది. కనుకనే వ్యాసభారతము నుద్దేశించి నన్నయ భట్టారకుడు—

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁజేసె భారతమ్ము"

అని పొగడినాడు.

మహాభారతము మన ప్రాచీన విజ్ఞాన సర్వస్వము.

అందుకే—

"యదిహాస్తి తదన్యత్ర
యన్నేహాస్తి న తత్క్వచిత్"

అనగా మహాభారత మందున్నదే ఇత రత్ర కలదనియు అందులో లేనిది మరెచ్చ టను లేదనియు చెప్పట జరిగినది. సము ద్రమున కేతమెత్తినట్లు మహాభారతము లోని విషయముల గూర్చి ఎందరెన్ని చెప్పి నను, ఎంత కాలమునుండి చెప్పుచున్నను దానికి తరుగులేదు. పాశ్చాత్య పరిశోధన విమర్శన పద్ధతులు మన దేశమున గూడ వ్యాపించిన తరువాత మహాభారతమును గూర్చి తీరు తీరు గ్రంథములు వెలువడి నవి, వెలువడుచున్నవి. అట్టివానిలో "మహా భారత నామానుక్రమణిక" యొకటి.

"ఇందులో మహాభారతమున ప్రసక్త మైన లోకములు, ద్వీపములు, దేశములు నగరములు, జనపదములు, సముద్రములు, నదీనదములు, సరోవరములు, కుండములు, తీర్థములు, వనములు,పర్వతములు, దేవదేవ తలు, మాతృకలు, యక్ష గంధర్వనాగులు, నక్షత్రములు, అప్సరసలు, రాక్షసులు, అసు రులు, దైత్యదానవులు, ఋషులు,మునులు, రాజులు, ఇతరమనుజులు, స్థానములు, వస్తు వులు, పర్వము"లాదిగా గలవాని పేర్లు వాని సంక్షిప్త వివరణములు అకారాదిక్రమములో కూర్చబడినవి. ఆ యా పేరుల ప్రసక్తి మహాభారతమునం దెచ్చటెచ్చట ఏ యే ముఖ్య సందర్భములందు వచ్చునో దాని వివరణ మిందు గలదు. ఇది జిజ్ఞాసువులకు పరిశోధకులకు మిక్కిలి సహాయకారిగా నుండును. అందువలన ఇట్టి నామానుక్రమ ణికలు ఆంగ్లభాషలోను హిందీలోను అనే కము ప్రకటింపబడినవి.

తెలుగులో "భారతనామానుక్రమణిక" పేరుతో నొకగ్రంథము పురాణపండ శ్రీచిత్ర గారు సంగ్రహించినారు. ప్రకాశకులు అల మూరు అధ్యాత్మ ప్రచారక సంఘమువారు. మొదటిభాగము అ–జా ఆద్యక్షర నామ ములు 104 పుటలు ఒక సంపుటముగను (1981), రెండవభాగము క–ఘ ఆద్యక్షర నామములు 114 పుటలు ఒక సంపుటముగను (1982) మూడవభాగము, చ–ద ఆద్యక్షర నామములు 88 పుటలు, నాలుగవభాగము ధ–ల ఆద్యక్షర నామములు 90 పుటలు, ఐదవభాగము వ–హ ఆద్యక్షర నామములు 100 పుటలు మరియొక సంపుటముగను (198౽) ప్రకటించినారు. మొత్తము వెల 8 + 8 + 18 = 34 రూపాయలు. ఇది తిరుమల తిరుపతి దేవస్థానముల వారు, మరికొందరు వదాన్యు లొనర్చిన ఆర్థిక సాహాయ్యముతో ప్రకటితమైనది. వివరణము సరళవ్యావహా రికము. రచయిత పురాణపండ శ్రీచిత్రగారు మూడవభాగమునకు వ్రాసిన భూమికలో (పుట V)—

"వ్యాసభారతం మానాన్నగారి భారతం గీతాప్రెస్ గోరఖ్‌పూర్ వారి భారతం ఆధా రంగా పది సంవత్సరాల నిర్విరామకృషితో భారతానామానుక్రమణిక తయారు చేయ గలిగాను. 1902 సంవత్సరమందు ఈ రకమగు గ్రంథం ఇంగ్లీషుభాషలో ఎనిమిది వందల పుటలతో తయారైంది. అది 1904లో లండన్‌లో ప్రచురింపబడింది. దానిని తయారుచేసింది శ్రీ డా॥ సోరెన్సెన్ ఆ మహానుభావుడు తయారుచేసిన ఆ గ్రంథం లబ్ధంకాదు. లభించినా ధర అధికం. అందరికీ అందుబాటులో లేదు. ఆ గ్రంథమే లభిం చిన ఇంకా వివరంగా వ్రాసి ఉండేవాడిని" అని తమ కృషిని గూర్చి చెప్పుకొన్నారు.

పురాణపండవారి కృషి ఇంగ్లీషు, హిందీ భాషలు రాని తెలుగు పాఠకులకు కొంత వరకుపయోగించు నట్టిదే. వారు పేర్కొన్న గీతాప్రెస్ గోరఖ్‌పూర్‌వారే "మహాభారత్ కీ నామానుక్రమణిక" పేరుతో 1962 లోనే గొప్ప హిందీ గ్రంథము ప్రకటించినారు. కాపీరైటు బాధలు తప్పించుకొనుటకో యేమో అటనట రెండు మూడు వాక్యములు విడిచిపెట్టి చేసిన ఆంధ్రానువాదమె ఈ తెలుగు "భారతానుక్రమణిక".. అంతేకాదు

ఆ హిందీ గ్రంథమునకు కాశీ విశ్వవిద్యాలయ మహాపండితులు వాసుదేవ శరణ అగ్రవాల్‌గారు సంతరించిన భూమికయే (V పుటలోని ఐదుపంక్తులు VII పుటలోని కొంత గొడవ తప్ప) తెలుగు భూమికగా సంగ్రహించినారు. డాక్టర్ సోరేన్సేన్‌గురించి ఆతడు సిద్ధము చేసిన ఇంగ్లీషు భారత నామాను క్రమణిక గురించి దాని యుపలబ్ధి గురించి వ్రాసిన వ్రాతలుకూడ అగ్రవాల్‌గారిమాటల కనువాదములే. సోరెన్సేన్ గారి గ్రంథము 1963లో మోతీలాల్ బనార్సీదాస్‌వారు ముద్రించిన సంగతికూడ వీరికి తెలియనట్లున్నది. హిందీ ఇంగ్లీషు భారత నామానుక్రమణికలలో ఒకే పేరును గూర్చిన సమాచారమునందే యే తావుల ప్రసక్తమైనదో ఆకరము లీయబడినవి. తెలుగు పాఠకు లట్టి సౌకర్యము కోల్పోయినారు. ఆయా విశేషములు తెలియవలెనన్న తెలుగువారు మరల సంస్కృత భారతమో హిందీనామానుక్రమణికయో సోరెన్సేన్ ఇంగ్లీషు గ్రంథమో ఆశ్రయించవలెను. ఈ తెలుగు భారతనామానుక్రమణిక గోంఖ్‌పూర్‌వారి హిందీ గ్రంథమునకు (అసమగ్ర) అనువాదమని ఒక్కవాక్యమైనను చెప్పకపోవుట మహాపచారము.

— సీతాపతి

## శ్రీ రామచంద్రశతకము

[రచయిత : శ్రీ ప్రఖ్య శ్రీరామచంద్రమూర్తిశాస్త్రి. పుటలు : 42. వెల : అమూల్యము. ప్రాప్తిస్థానము : రచయిత. చాగల్లు. పశ్చిమగోదావరి జిల్లా.]

అలనాటి శ్రీరామచంద్రుని పునీత పాదస్పర్శ చేతపులకరించిపోయినది మన ఆంధ్రదేశము. కనుకనే తెలుగునేల నలుచెఱగులా రామాలయాలు కనబడని జనపదాలు కాని, రామనామస్మరణ హృదయాలయంగా చేసుకొని పరవశించని తెలుగువారుగాని కనబడరు. భద్రాచల రామవైభవాన్ని స్మరించి, తరించిన కంచెర్ల గోపన్న మొదలు నేటివరకెందరో మహాభాగులు ఆ శ్రీరామపాదారవిందాలను తమ హృదయ కేదారాల్లో నిక్షిప్తంచేసుకొని, అక్షరమైన అక్షరశతక మందారాలను ఆవిర్భవింపజేశారు. అలాంటి కవితా సుమార్చన, విదేశీయ విపరీత విజాతీయ పరీతమైన ఈ కళ్మలపురోజుల్లోగూడ వెలువడుతున్నాయంటే ఆ చిద్విలాసుని మహిమాసంపత్తి నిత్యనూతనమని చెప్పక తప్పదు. సార్వకాలిక, సార్వజనీనమైన విశ్వకల్యాణాపాది ఆ రామచంద్రునిస్మరణ వైభవము. సద్యోహృద్యంగా, సహృదయసైవేద్యంగా శ్రీ ప్రఖ్య శ్రీరామచంద్రమూర్తి శాస్త్రిగారు ప్రకృతం శ్రీరామచంద్రమూర్తి శాస్త్రిగారు శ్రీరామచంద్ర శతకాన్ని కృతికర్త, కృతిభర్తల నామాలకుభయత్ర సంక్రమించేటట్లు శ్లేషాశ్లేషంతో కూర్చారు. పండిత పామర జనరంజకమైన భాషాసారళ్యంతో, భావసౌకుమార్యంతో ఈ శతకం శ్రీరాముని రూపగుణవైభవాలను ప్రత్యక్షరంలోనూ ప్రత్యక్షంచేస్తున్నదనటం సత్యదూరం కాదు. ప్రాచీనతెలుగు సాహితీమూర్తులైన నన్నయ, పోతనాదిమనీషుల కవితా శిల్పాల నాకళింపుజేసుకున్న రీతి నీతు లెన్నో యిందు దర్శన మిస్తాయి.

"బ్రహ్మవేత్తలు పరబ్రహ్మమటంచును, ధర్మవేత్తలకు సద్ధర్మ మగుచు" అన్నట్టి పద్యాలు ఆదికవి భావశబలతకూ, పంకజనాభ నీ పాదపద్మమ్ముల సేవచేయగలేని చేతులేల "అన్నట్టి పద్యాలు భక్తకవి పోతనామాత్యుని సుకుమారభావప్రదర్శనకు నిదర్శనాలని చెప్పవచ్చును. ఏమాటమానోట ఇను మారు ముమ్మారు పలుకవేడాను తేనెలొలుకునట్లు, ఏపాట మానోట సాపాటు మరపించి పాడ నేడును" వంటి పద్యాలు మధురవీణా నిక్వణాలై వీనులవిందుచేసిఅలనాటిప్రబంధ కావ్యరచనా కామనీయకతను స్మృతికి తెస్తాయి. సీసపద్యాల్లో ఈ శతకం చెప్పబడి మకుటం ఆదిలో యివ్వబడింది.

ద్రాక్షాపాకమైనశైలియే ఈ శతక పద్యాలలో ఆద్యంతంనిండి అంతరసీమలను ఆ పాతమధురం, ఆలోచనామృతం అయిన ముముక్షుత్వ భావసిద్ధిని కలిగిస్తుంది. "మరి నామస్మరణంబు ఆర్తరక్షణమయ్యు ముక్తి నిదానము మూలశక్తి" అని, "శాస్త్రముల్ నేర్చిన శాస్త్రిగాను'' అంటూనే సర్వవేదోపనిషత్సారభూతమైన మోక్షాన్ని సూక్ష్మమార్గంలో అందించారు. విషయవివరణ లేకుండా షష్ఠ్యంతాల్లాగా కొన్ని పద్యాలకు పద్యాలే భగవత్సంబోధనామృతంలో కురిపించారు." హే! కృష్ణగోపాల! హే రఘునందనా," "వరదరాజ గజేంద్రవరద గోవింద" వంటి సీసాల కవితాసవం సహృదయ హృదయస్పర్శి అవుతుం దనటంలో ఆవంతైనా సందేహం లేదు.

కొన్నిభక్తిభావాల పునరుక్తిగూడ ఈ శతకంలో అవిరళంగా కనబడుతుంది. "సుగ్రీవుడేపాటి సుంక మిచ్చెను నీకు", నారాయణా యను నాస్వరమ్మును నోరార పల్కెడు నోరు నోరు" వంటి పద్యాలపునరుక్తి రసభావవ్యక్తీకరణమున పునరుక్తి దోషం గాదని సమర్థించుకోవచ్చును, 'శత్రుసోదరునికి శరణన్నమాత్రాన నమ్మి రాజ్యము నీయ నమ్మగలమె'' వంటి వ్యాజస్తుతి పద్యాలుగూడ రచయిత బహుముఖ ప్రతిభా పాటవానికి తార్కాణాలు. "ముక్కుమూసుకొనుచు మూఢముగాచేయు తపోచ్ఛాంద సత్వాన్ని వేమనలా ఖండించటం బాగున్నది.

ఐహికానందం, ఆధ్యాత్మిక ప్రతిపత్తి ఇబ్బడిముబ్బడిగా కనిపిస్తున్న ఈశతకం రాశిలో చిన్నదైనా వాసిలో విశిష్టమైనది. ఈ కొద్దిపుస్తకంలో అచ్చుతప్పులు విశేషంగా దొరలటం విచారకరం. మత్రుమూర్తి, సధా, రాజులలామా, నియమకఖుల, రామావరార, పరత్మ వంటి ముద్రరాక్షసాలు ఎలుకవాహన, పూర్ణచవటవంటి విరుద్ధ ప్రయోగాలు పాఠకులకు చిడిముడి పాటును కలిగించినా, సరసులకు కవి కులగురుని ఏకో హి దోషో గుణసన్నిపాతేనిమజ్జతీందోః కిరణేష్వివాంకః" సూక్తినిస్ఫురణకుదెస్తుంది.

"ధర్మో రక్షతి రక్షితః" అన్న నుడికి సార్థకత వహించిన తిరుమల తిరుపతి

దేవస్థానం వారు ఇలాంటి ధార్మిక గ్రంథాలకు చేయూతనీయటం ఆస్తికమహాజనులకు చైతన్యదీపకళిక అవుతుంది. విద్వత్కవులైన రచయిత ఇత్యాదిగ్రంథాలను మిక్కిలిగా వెలార్చి, ఆంధ్రశారదను అవిరళ భక్తి సుమాలతో అర్చిస్తారని ఆశిద్దాం.

"సుచంద్ర"

## భారతకథలు – అంతరార్థము

[రచయిత: శ్రీ దేవరకొండ శేషగిరిరావు ఎం. ఏ. ప్రతులకు: శ్రీ డి. వి. సుబ్బారావు. 8-14-2 రెడ్‌క్రాస్ రోడ్డు గాంధీనగరం కాకినాడ—533004. మూల్యము: రు. 15-00]

మహాభారతం - ఆర్షవిజ్ఞాన సర్వస్వముగా విశ్వజనీనముగా వ్యాసమహర్షి రచించినట్లు నన్నయ మహాకవి అభిభాషణం. ఒక మహానదికి ఎన్నో ఉపనదులు ఉన్నట్లు, ఏ మహేతిహాసానికైనా, ఉపాఖ్యానాలు, అంగభూతములైన ఉపకథలు ఎన్నో ఉంటాయి. వీటి అన్నిటి అంగాంగిభావం-అంతరార్థాలు సూక్ష్మదృష్టితో అనుశీలించ వలసియుంటుంది. సమగ్రబోధకు మహాభారతం పంచమవేదంగాను ప్రసిద్ధం.

"ధర్మమూలం జగత్ సర్వం
ధర్మశ్చ శ్రుతి మూలకః,
భారతం పంచమో వేదః
శ్రుతి సర్వస్వ విస్తరః".

శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు— "భారత కథలు — అంతరార్థము" అనే యీ గ్రంథంలో చదువరులకు ఈ సూక్ష్మదృష్టి ప్రసాదించారు. ఇందు వృత్రాసుర సంహారము, శునశ్శేపునికథ – త్రిపురాసుర సంహారము–క్షీరసాగర మథనము–సావిత్రీ–ఉదంకుని కథ – సువర్ణోపాఖ్యానము మున్నగు కథలలోని అంతరార్థాలు వివరింపబడ్డాయి. క్షీరసాగర మథనం మేల్కొన్న కుండలినీశక్తి గాథగా, ఉదంకుని గాథ కాలకాలదర్శనంగా, శునశ్శేపుని కథ పాశవిముక్తిగా, సువర్ణోపాఖ్యానం వేదాత్మ వివరణగా రచయిత అంతరార్థాలు వివరించారు. ఈ కథలు వేదవాఙ్మయంలో బీజప్రాయాలుగా ఉన్నవి - ఏ విధంగా మహాభారతంలో శాఖోపశాఖలతో విస్తరించి వృక్షప్రాయములుగా భాసించుచున్నదీ రచయిత ఈ గ్రంథంలో హృదయంగమంగా వివరించారు. అందుచేత, మహాభారతం "ఇతిహాసం" మాత్రమేగాక — అది ఏ విధంగా "పంచమవేదం" అయిందో శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు ఈ గ్రంథములో సోదాహరణంగా నిరూపించారు.

అర్థవివరణలోనే ప్రాయికముగా పండితులలో ఏకగ్రీవత సిద్ధించదు. ఇంక, అంతరార్థ వివరణ మాట వేరే చెప్పాలా? ఈ అంతరార్థాలు కేవలం ప్రజ్ఞావాదాలు కాకూడదా? అని ఎదురుప్రశ్న వేసే విమర్శకులు ఉండవచ్చు. అంతేకాక, ఆధునికులు మరో ప్రశ్నకూడ వేస్తారు. అసలు కవి చెప్పదలచుకున్నది ఎందుకు సుస్పష్టంగా చెప్పకుండా అంతరార్థం లోపలమాటు పెట్టి ఎందుకు చెప్పాలి? సావిత్రీగాథ, గాయత్రీమంత్ర వ్యాఖ్యానం అని సుస్పష్టంగా వేదవ్యాసమహర్షి ఎందుకు చెప్పకూడదు? అని ఐదంయుగీనులు ఎదురుప్రశ్న వేయవచ్చు.

ఈ గ్రంథంలో శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు - వైదిక వాఙ్మయంలో నుండి ఎన్నో ఉదాహరణలు వివరించి సోపపత్తికంగా ఆ యా గాథలకు "అంతరార్థాలు" వివరించారు. అందుచే ఇవి కేవలం ప్రజ్ఞావాదాలు కావు. శ్రీ శేషగిరిరావుగారి స్వకపోల కల్పనలుగావు - అయితే - ఈ గాథలలో విద్వాంసులు మరికొన్ని అంతరార్థాలు చూపించవచ్చు. ఈ గ్రంథంలో భారతంలోని అన్ని గాథలకు శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు "క్షుణ్ణంగా" అంతరార్థాలు వివరించినట్లు చెప్పుకోలేరు. ఈ గ్రంథం మహాభారతానికి ఒక ఉపోద్ఘాత ప్రాయమైనది మాత్రమే. అందుచే "భారతకథలు–అంతరార్థం'' అనే యీ గ్రంథమునకు అనుబంధముగా రెండవ మూడవ ఇత్యాది భాగాలు వెలువడ వలసియున్నది. ఇక – "అంతరార్థం" — అసలు రచయిత ఎందుకు సుస్పష్టంగా ప్రతిపాదించకూడదు?? అనే చిక్కుప్రశ్న మిగిలి ఉంటుంది. ప్రకృతి - బంగారాన్ని మట్టితో రాయితో కలగాపులగం చేయకుండా ఎందుకు నిర్మలమైన ముద్దగానే భూమిలో నిక్షేపించకూడదు? అని ప్రశ్నిస్తే ఏమి ప్రయోజనం? ప్రకృతిలో మట్టి రాయిని శుద్ధిచేసి బంగారం సంపాదించాలి. ఇతిహాస పురాణాలలో అమూల్యమైన అంతరార్థాలు గూడ ఆ విధంగానే విశేషపరిశ్రమ చేసే సాధించాలి. మహాభారతాన్ని - కేవలం ఒక గాథగా, ఇతిహాసంగా చదువుకుని సంతృప్తిపడే సహృదయులు ఉండవచ్చు. అది ఒక పద్ధతి. ఆ పంచమవేద మహాసాగరంలో మునిగి అనర్ఘరత్నాలను వెలికితీసే మహానుభావులు మరికొందరు ఉంటారు.

శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు, మహాభారత సాగరంలో కొన్ని అమూల్య మణులను వెలికి తీశారు. ఇంకా తీయవలసిన మణులు ఎన్నో ఉన్నాయని వేరుగ చెప్పనక్కరలేదు. ఆ పనికి భవిష్యత్ కాలంలో శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు - ఇతర విద్వాంసులు పూనుకోవచ్చు.

"అద్యాపి రత్నాకర ఏవ సింధుః"

— శ్రవణం

## శ్రీ ఆదిశంకరాచార్య విరచిత శివానంద సౌందర్యలహరులు

(సరళ తాత్పర్య సహితం)

[అనువాదకుడు: శ్రీ పురాణపండ రామకృష్ణమూర్తి: ప్రకాశకులు: సనాతన ధర్మవాణి ప్రచురణసంస్థ, 81-1-23 జెండా పంజారోడ్, రాజమండ్రి-1 మూల్యము రు. 5/-]

మోక్షసాధన సామగ్రి యందు భక్తి గరీయసి యని నిర్వచించిన శ్రీ శంకర భగవత్పూజ్యపాదులవారు భారతదేశమును భారత భారతీ వాఙ్మయమును సర్వాస్తిక భక్తజన హృదయములను అపార భక్తి కవితా తరంగ ప్లావితము చేసిరి. ఆయన

రచించిన అనేక స్తోత్రములు, నిఖిల దేవతా కృపాలాభములు, అనల్ప కవితామృత ప్రవాహములు, శ్రేయోనిధానములు, పండితులకు పామరులకు ఉపకారకములు.

మంత్రమయవాణియైన శ్రీ భగవత్పాదుల కవితావాణిని యథాతథముగ అనువదించుట తేలికపని కాదు. 'నీటికొలదితామర' యన్నట్లు – ఆ రచనలు – ఎవరికి తగినట్లు వారికిఅవగాహన అగుచుండును. అతి సామాన్యులకుకూడ అవగాహనఅయినట్లేతోచినప్పటికీ పండిత ప్రకాండులు సైతము పూర్తిగా అవగాహన చేసికొంటిమని చెప్పుటకు వీలు కాని ప్రగాఢత్వము కలిగినవా రచనలు. కేవలము సాహిత్య దృష్టితో చూచినను వాల్మీకి వ్యాసుల రచనల ప్రక్కనుండవలసినవి.

ఈ సనాతన ధర్మవాణి ప్రచురణ సంస్థ వారు – తమ తొలి ప్రకటనగా – శ్రీ భగవత్పాదుల స్తోత్ర రచనలలో ప్రముఖమైన శివానందలహరి, సౌందర్యలహరి అనువాదము నెన్నుకొనుట ముదావహము. వారి కృషి చక్కగా సాగి సకలాస్తిక లోకము చేత సమాదరింపబడవలెను.

సంస్కృతమున ధాతుప్రయోగము అతి ప్రగాఢభావ పుష్టిని వెలార్చుటలో కడు హొయలు సొబగులు పోవును. అందు శ్రీ భగవత్పాదుల శ్లోకములందు మరియును. ఈ రెండు లహరులు–ముఖ్యముగా సౌందర్యలహరి – సాహిత్య సౌందర్యలహరి. అందు కనియే ముప్పదియారు వ్యాఖ్యానములు పుట్టినవి. భగవత్పాదుల రచనలలోని సాహిత్యస్వాదువును, మంత్రశాస్త్ర రహస్యమును, భక్తిలహరిని, అలంకారధ్వని వైభవమును – సంస్కృతము నుండి సరాసరి తెనుగునకు తెచ్చుటే సులభము కానిదైయుండ – యీ అనువాదకులు హిందీపై ఆధారపడి అనువాదమును చేసిరి. అందుచేత వాక్య విన్యాసాదులు సరళముగా నున్నను మూలమునందున్న చమత్కార భావ శబలత – పూర్తిగా – పుష్టిగా వెలువడినట్లు తోచదు. అయినను అనువాదకుని భక్తి శ్రద్ధలు తెలుగు శైలిలోని సాధు సరళత్వములు ప్రస్ఫుటముగా నున్నవి.

— రామహారిత

( 15వ పేజీ తరువాయి )

తోయాధార పథాశ్చ వల్కల శిఖా
నిష్యంద రేఖాంకితాః ॥

భారత ప్రభుత్వం ప్రస్తుతం ఇక్కడ వన్యమృగ సంరక్షణ కేంద్రం నెలకొల్పింది.

## నీలకంఠ మహాదేవ్

లక్ష్మణ ఝూలానుండి నైరుతీ దిశలో 12 కి. మీ. దూరంలో సముద్ర మట్టానికి 5,500 అ. ఎత్తుననీలకంఠమహాదేవ్ మందిర్ ఉంది. అక్కడ నుండి తిలకిస్తే హిమాలయ ప్రకృతిశోభ చాల నేత్రపర్వంగా ఉంటుంది.

ఆశ్రమాలన్నీ దర్శించుకున్నవారు పరమార్థ నికేతన్‌వద్ద పడవలద్వారా నదిని దాటుతారు. ఇక్కడ గంగానది దాదాపు 600 మీ. వెడల్పు ఉంటుంది. లోతు 25 అ. నుండి 250అ. వరకు ఉంటుంది. ముప్పయి ఏనుగులు ఒక దానిమీద ఒకటి నిలబడితే ఇక్కడ మునిగిపోతాయని నావికులు చెప్తారు.

## ఆధ్యాత్మిక, సాంస్కృతిక కేంద్రాలు

ఋషీకేశ్ నుండి లక్ష్మణ ఝూలా మార్గములో కైలాస ఆశ్రమము, యోగనికేతన్, శివానంద ఆశ్రమము, దర్శన మహా విద్యాలయము మున్నగు ఆధ్యాత్మిక, సాంస్కృతిక కేంద్రాలను యాత్రికులు దర్శిస్తారు. వీనిలో అనేకమంది దేశ–విదేశీ విద్యార్థులు శిక్షణ పొందుతుంటారు. అందులో కైలాస ఆశ్రమము ఆదిశంకరులచే స్థాపించబడినది.

ఋషీకేశ్‌లో గమనింపదగిన విషయం మరొకటున్నది. మార్గం వెంట కరివేపాకు చెట్లు ఘుమఘుమలు వెదజల్లుతుంటాయి. ఇంకా వివిధ వృక్షజాలం పర్చుకొని ఉంటుంది. 'గంగానది'కి ఇరువైపుల జ్ఞానవృక్షాలు పెరుగుతాయి. వీటి ఫలాలను 'జ్ఞానఫలాలు' లేక 'ముక్తిఫలాలు'



గీతామందిర్‌లో శివాలయం

అంటారు. ఇవి సీమరేగు కాయల్లాగ ఉంటాయి. వీ. రుచి చాల మధురంగా ఉంటుంది. రూపాయికి 15 నుండి 20 కాయలదాక యిస్తారు. రైలు స్టేషన్‌లో దిగ్గానే 'జ్ఞాన ఫలాలు' దర్శన మిస్తాయి. ఇవి ఆస్వాదించిన వారికి "జ్ఞానం," తద్వార 'ముక్తి' కలుగుతుందని భక్తుల నమ్మకం. ఈ ఫలాలు మరెక్కడా పండక పోవటం ఆశ్చర్యకరమైన విషయం.

## ధర్మశాలలు

ఋషీకేశ్‌లో యాత్రికుల సౌకర్యార్థం టూరిస్టు సెంటర్లున్నవి. ఇవికాక దాదాపు యాభయికి పైగా ధర్మశాల లున్నవి. కాలీకమ్‌లీ వారి ధర్మశాల, పంజాబు సింధ్ క్షేత్రము ప్రసిద్ధిచెందినవి. ఈ ధర్మశాలల్లో ఆధునిక సౌకర్యాలు అన్నీ ఉన్నాయి. యాత్రికులకు ఏ విధమైన భయము, యిబ్బంది ఉండవు. ఏ మాత్రం డబ్బు చెల్లించకుండ నాలుగైదు రోజులు ధర్మశాలల్లో ఉండవచ్చును. 'కాలీకమలి' వారి ధర్మశాలవారు యాత్రికులకు నిత్యం అన్నదానం కూడ చేస్తారు. తిరుపతి – తిరుమల దేవస్థానం వారి ఆంధ్రాశ్రమము ఆంధ్రులకు ప్రత్యేక స్వాగతం పలుకుతుంది. ప్రక్కనే ఆలయంలోని శ్రీ వేంకటేశ్వరుడు అందరకు అభయం యిస్తుంటాడు.

హృషీకేశ్‌లో అన్ని విధాలైన భోజనాలు దొరుకుతాయి. దేశంలో ప్రధాన నగరాల నుండి రైలు సౌకర్యముంది. ఉత్తర ప్రదేశ్ రోడ్డు రవాణావారి బస్సులు ఉన్నాయి. అనేకములైన టూరిస్టుసంస్థల బస్సులు ఉన్నాయి. 21 కి. మీ. దూరంలో 'భనియావాలా' విమానాశ్రయం (డెహ్రాడూన్) ఉంది. హిందీ బాగా ప్రచారంలో ఉన్న భాష. పంజాబీ, ఘర్వాలీ భాషలు కూడ వినిపిస్తుంటాయి. ఆంగ్లం చాల అరుదుగా వింటాము.

విశ్వ సంస్కృతికి భారతదేశం కేంద్రమనుకుంటే పవిత్ర భారతావనికి ఆధ్యాత్మిక హృదయం హృషీకేశ్.

(12వ పేజీ తరువాయి)
ఏల వచ్చితివయ్యా! అని పరిపరివిధము లుగా ప్రశ్నించింది. 'శివుడు, చంద్రుడు నీవు చేసినపనికి అవిరళంబుగ చాల హాస్యంబు సేయతలచుచున్నారు. ఇంక దయచేసి లేసి రావోయి; సదమలచరిత నా స్వామి రావోయి!" అని ప్రార్థించింది. ఎందుకువచ్చాడో ఏమని చెప్పగలడు? ఎలా గై తేనేం వచ్చినవని అయింది. అందుకే దరహాసకలితాస్యుడగుచు ఇందిర కరపద్మ మింపొందబట్టికొని అందుండి కదలి యేగి నాడు.

శేషహోమము ముగిసింది. సర్వ కృత్యాలూ నెరవేర్చారు. ఎంత కలుముల రాణి అయితే నేం? కన్నకూతురుకు ఇవ్వ వలసిన వన్నీ ఇచ్చారు తల్లిదండ్రులు. ముందుగా ముద్దులపట్టికి ముత్యపుటాడిం బాలుగట్టి మురిసిపోయారు. ఆడపడుచుకు 'ఒడిబియ్యం' కట్టి ఆనందించడమనేది నేటికీ రాయలసీమలో కన్పిస్తుంది.

దివ్యాశ్వబృందాల్నీ, కరిరథావళులను, దాసదాసీజనాన్నీ ఇందిరకోసం నందనంద నుని కందించారు సాగరదంపతులు.

మామను, సోముణ్ణి, అత్తలను శేషా చలానికి ఆహ్వానించాడు అచ్యుతుడు. మంగళతూర్యముల్ మొరయ శుభలగ్న మందు అందరును శేషాద్రిపైన స్వామి వారి నగరంలో ప్రవేశించారు. విందు చేయించాడు వేంకటేశ్వరుడు. అత్తమామ లకు ఆదిదంపతులకు చందన తాంబూలాది కనకాంబరాలను కరుణతో సమర్పించు కున్నాడు.

కలుముల చెలితోడ కదలి కేగంగ అను మతి ఇమ్మని అల్లుణ్ణి అర్థించాడు రత్నా కరుడు.

"మామా! ఒక్కక్షణంకూడా నా భార్యను వదలి నేనుండలేను. నేను నాలక్ష్మిని పంపించ లేను" అని నిర్మోహమాటంగా చెప్పేశాడు క్రొత్తల్లుడు. చింతాక్రాంతుడయ్యాడు సముద్రుడు. 'శ్రీపన్నగాధీశా! పటుకృపా సాంద్రా! సర్వేశ్వరా! సర్వాత్మకా! సర్వ సాక్షీ! సద్బ్రహ్మ! నీవు యెఱుంగని నీతి కలదా! నాలచ్చిమి పసిబిడ్డ. దాన్నివదలి వెళ్లుటకు మాకు కాళ్ళెట్లాడునయ్యా! మా ఇంట ఆటలే మరిగిన బాల నీయింట పని పాట్లు చేయు నే లీల? బ్రహ్మాండరూపంబు పొసగచూడ జాలని యింతి సురుచిరంబుగ సేవచేయు నే రీతి? ఇంతదనుక తల్లులచెంత చనువుగానుండిన ముద్దుగూన భయభక్తు లెరుగని చాన, కాన దయచేసి ఈ మాటు మా వెంట పంపవే మహితాత్మా!', అని ప్రార్థించినాడు.

అందులకు వనజోదరుడు నవ్వి వకుళా దేవికి కనుసైగ చేశాడు. అప్పుడామె హరి వాంఛితం బెరింగి 'సాగరా! బహుజన్మ సంస్కారమహిమవలన ఈ ఆదిదేవత నీకు కుమార్తెయైనది. వేదాంతవేద్యుడైన శ్రీ మహావిష్ణువు నీకు అల్లుడైనాడు. వారిని మానవమాత్రులుగా నీవు భావించు చుంటివా? వారు నీకు ఆత్మీయులగుట నీ భాగ్యము. నీ సుతను స్వామి చెంగట నుంచుము. మీకంటెను అధికముగా నీ దేవిని నేను గారవించెదను' అని పల్కి వకుళ సిరి నంకపీఠమున జేర్చుకొని నెమ్మోము నిమురుచుండగా కడలిరాయడు తన కాంతల నందరికిని ఊరటబల్కి తన కుమార్తెను సమీపించి "అమ్మా! వకుళమాలికను మనము రంజిల్లగా మన్నింపుము. పతికి ప్రియంబుగా నడచుకొనుము. భగవంతుని దర్శింపవచ్చిన భక్తకోటులకు అన్నపానము లిచ్చి ఆదరించుచుండుము. మునుపటివలె ఆటలాడకుము. బాధ్యతగా ఇంటి పెత్త నము వహించియుండుము. లోభగుణము లేక అందరికిని అవ్వారిగాగ వరములిచ్చు చుండుము. నీ పతి నవ్వులాటకు నిన్ను పొగడినను, తెగడినను పొంగకుము; క్రుంగకుము. ఒకే విధముగా పతిని సేవించు చుండుము. పతివ్రతయైన వనితకు జగమం తయు కరతలామలక మగును. కావున సర్వ మంగళవై పరమాత్ముని ఇల్లాలివై లోక మును రక్షింపుము" అని సముద్రుడు కూతునకు బుద్ధులు సెప్పినాడు. వెంగమాంబ కలంలో, కడలిరాయని గళంలో శకుంతల నత్తవారింటికి పంపే కణ్వుడు కనిపిస్తాడు ప్రతిపాఠకునికీ హృదయఫలకంలో.

సముద్రుడు మళ్ళీ అల్లునివైపు తిరిగి "ఓ శేషగిరివాస! నామీద వాత్సల్యముంచి నాపట్టిని కుశలంబుగా నేలుకొనుము. తప్పొప్పులను దిద్ది మన్నించి బ్రోచుము. నా కుమార్తెను నీ చేతుల్లోనుంచుచున్నాను. పాలముంచెదవో, నీటముంచెదవో, నీదే భారం' అని పలికినాడు. వనధినిగాంచి వాసుదేవుడు 'ఓ మామా! ప్రేమతో మీరు చెప్పిన చందమున మీ బిడ్డను ప్రఖ్యాతి గాంచునట్లు ఉరమున నిడుకొందును. ఈ కౌస్తుభమణి తోడ మీ పుత్రికారత్నము సంతతము నా వక్షంబుపై నుండును. మీకు చింత వలదు, అని పలికి వారందరినీ వీడ్కొలిపి శ్రీ వేంకటేశ్వరుడు ఆనంద నిలయమునందు నిరుపమానములైన నిత్యోత్సవములతో పరమసంతోషభరితుడై యలరారుచు బహుభాగ్యములను వరుసగా గైకొని భక్తులకు వరములిచ్చుచు శ్రీ పన్నగాద్రిపై స్థిరముగా పెన్నిధానమై వెలసి యుండెను.

ఇట్లు అలమేలుమంగతో ఆనందముగా సులలిత లీల సుఖియించినట్టి శ్రీ శేషాచలా ధీశుడగు వేంకటరమణుడు ఆచంద్ర తారా ర్కము మహాపుణ్యులు చదువుటకొరకై తన పాదముల చెంతనుంచబడిన శ్రీ రమా పరిణయ కావ్యమును గైకొని తరిగొండ వెంకమాంబ రమణీయ కవితా మరంద ధారలను భక్తశ్రేణి హృదయారవిందముల పై వర్షించుచున్నాడు. •



# ఆత్మార్చన

నన్ను నిలువునా తనలోకి తీసుకుంటూ-హత్తుకుంటూ - ఒరుసుకుంటూ - రాజీలేని ఋజుమార్గంలోకి నన్ను ఆకర్షించుకుంటూ-తనలో లీనం చేసుకుంటూ - నాలో ప్రవహిస్తోందో, నన్ను ప్రవహింప జేస్తోందో తెలియనీయకుండా నా ఏకాగ్రతను తన వైపు మళ్లించుకొన్న మనోజ్ఞ అసదృశాను భూతికి లోను చేసిన అదృశ్య హస్తస్పర్శ.

అదే ప్రభూ, నన్ను కాంతిరేఖను చేసింది. నీ వర్ణనాతీత అనుపమాన సౌందర్య విలసిత వదనాన్ని దర్శనీయం చేసేందుకు. నా తృష్ణ తీరలేదు.

నన్ను శబ్దతరంగాన్ని చేసింది - నీ ఆలయశోభస్కర శుభ ప్రాంగణాన ఘంటా నాదాన్నై నీయశస్సును ప్రణుతించేందుకు నా తమకం హెచ్చింది.

నన్ను పుప్పొడిరేణువునుగా చేసింది. నీ సాన్నిధ్యాన్ని పరిమళభరితం చేసి నీ కాహ్లాదం కలిగించేందుకు - నా తపన పెరిగింది.

నన్ను దీపకళికను చేసింది - నీకు నీ రాజనమ్మై నిలిచి తరించేందుకు. నా మోహం పెచ్చు మీరింది.

నన్ను శబ్దాన్ని చేసింది-నీ దివ్యనామాన్ని నేనై జనగణమనములలో మార్మోగేందుకు. నీస్తోత్రగానంలోపదాన్నై పరవశించేందుకు. నా కోరిక మిగిలే ఉంది.

నన్ను కుసుమాన్ని చేసింది - నీ పాదాల పై వాలి ధన్యత నొందేందుకు. నా కాంక్ష ప్రబల మయింది.

కానీ నేనా చిరంతన జ్యోతి ఆదరణలో ఇంకా మున్ముందుకు సాగలేక పోతున్నాను. ఏదో - ఎవరో నన్ను నిలిపి వేస్తున్నారు. నన్ను నిరోధిస్తూ అడ్డుగా మరో అవరోధం.

ఆందోళన - ఆతృత - తొందర - భయం. సుషుప్తిలోంచి వాస్తవంలో కొచ్చాను లాగుంది. నిటారుగా పడ్తున్న వర్ష ధారలు మాత్రం తెలుస్తున్నాయి. చలి, కారుచీకటి. నన్ను నడిపించిన కాంతిపుంజ మేదీ!

వీపు తడుముకున్నాను - ముళ్లు-ఒళ్లంతా రక్తపు జిగురు. గాట్లు-గాయాలు-అందుకు కాదు నాబాధ -

నా స్వామిరూపం చెదిరి పోయింది - నా మనసు వికలమయింది.

కానీ ఆశ విరిగి పోలేదు - పోదు. ఏదో ఒక ముహూర్తంలో నా స్వామి నాకోసం సప్తశిఖరాలూ దిగివచ్చి నన్ను చేకొనక పోడు. అదే నా జీవితాశయం - నా జీవిక -

ఆశ్చర్యం. దీర్ఘ ధ్యానంతో స్వామినే జపిస్తున్న నన్ను నిద్రాదేవి ఎప్పుడు ఒడి జేర్చుకుందో - ఎప్పుడు నేను స్వామిసేవకు బయలుదేరానో-నన్ను నడిపించింది ఎవరో-ఈ చీకటిలో ముంచింది ఎందుకో నాకు తెలియదు.

— ఓంకార్

---

# మేధావి కథ




ధర్మరాజు అడిగాడు:

"కాలం అన్ని జీవులనూ తన పొట్టను బెట్టుకుంటూ ఆగకుండా పరుగులుతీస్తూంది. ఈ జీవితంలో మనిషి కర్తవ్యం ఏమిటి?"

భీష్ముడు చెప్పాడు:

పూర్వం ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. వేదం బాగా చదువుకున్నాడు. ఆయనకు ఒక కుమారుడు. అతని పేరు 'మేధావి'. పేరుకు తగ్గట్టే అతడు మహామేధావి.

పొద్దస్తమానం వేదం వల్లిస్తూ కూర్చోవడం తప్ప వేరు వ్యాసంగం లేని తండ్రిని అతడు ఇలా అడిగాడు. నాయనా! అతి వేగంగా ఆయుస్సు చెల్లిపోతూందిగదా! ఈ లోకంలో మనం చేయవలసి ఉన్న మంచిపనులు ఏమిటి?"

తండ్రి అన్నాడు: "ఏముంది? బ్రహ్మచర్యంలో వేదాలు చదువుకోడం, పితృదేవతల ఋణం తీర్చుకోడం కోసం వివాహమాడి పిల్లల్ని కనడం, అగ్నిని ఆరాధించడం ఆ తరువాత అడవికివెళ్ళి తపస్సు చెయ్యడం!"

"క్షణ క్షణం మనం కొట్టబడుతున్నాం. ఒకమూల అతిదారుణమైన ముట్టడి జరుగుతూంది. అడ్డం ఆపు లేకుండా రాలిపోతున్నాయి. అయినా నిదానంగా ఇవన్నీ చెయ్యవచ్చునని ఎంత ధైర్యంగా చెబుతున్నావు తండ్రీ?" అన్నాడు కొడుకు.

"దేనిచేత మనం కొట్టబడుతున్నాం? ఏది మనల్ని ముట్టడిస్తూంది? ఏవి ఊరికే రాలిపోతున్నాయి? వివరంగా చెప్పు నాయనా! నన్ను భయపెట్టకు!" అన్నాడు తండ్రి.

"మృత్యువుచేత క్షణక్షణం కొట్టబడుతున్నాం. ముసలితనం మనల్ని ముట్టడిస్తూంది. రాత్రులూ, పగళ్ళూ అదేపనిగా రాలిపోతున్నాయి" అన్నాడు మేధావి.

ఇంకా ఇలా అన్నాడు: "వలలో చిక్కుకొన్న చేప ఆ మాట మరచి పోయి మిట్టిపడేట్టు మనం నిదానంగా జీవించడం ఎలా సాధ్యం తండ్రీ! రాత్రి రాత్రికీ మన ఆయుస్సు తరిగిపోతూంది. ఏ రాత్రి తల్లి గర్భాన పడ్డామో ఆ రాత్రే మృత్యువువైపు తిరుగులేని ప్రయాణం ప్రారంభించాం. ఏ రోజు మంచిపని ఒక్కటైనా చెయ్యమో ఆ రోజు నిరర్థకమైనరోజు. పరధ్యానంగా ఆకులు మేస్తున్న మేకపిల్లను తోడేలు వేసుకుపోయినట్టు ఏ క్షణమో మృత్యువు మనల్ని ఎత్తుకు పోతుంది. చెయ్యగల మంచి ఏదో ఈ రోజే చెయ్యాలి. రేపటికి రేపటికి వాయిదా వెయ్యకూడదు. మంచి పనులు చెయ్యనివాణ్ణి మృత్యువు కబళిస్తుంది. ఎప్పుడు వస్తుందో మృత్యువు ఎవ్వడికీ తెలియదు. ముందుగా ఆహ్వానం పంపి రాదు అది. చేపలు పట్టేవాడు ఎప్పుడు తనను పడతాడో చేపకు తెలుసా? అందుచేత చిన్నతనంనుంచే ధర్మం ఆచరించాలి. ధర్మపరుడైన వాడికి ఇహలోకంలో కీర్తి, పరలోకంలో సౌఖ్యం దక్కుతాయి.

మోహంతో పుత్రుల్నీ, భార్యనీ సుఖపెట్టాలనీ తాపత్రయపడేవాణ్ణి నిద్రపోతున్న మనిషిని పెద్దపులి వేసుకుపోయినట్టుగా తెలియకుండా వచ్చి మృత్యువు ఎగరేసుకుపోతుంది.





# బాలాజీ అర్చన

భక్తులు శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించేందుకు తిరుపతి దేవస్థానం వారు నూతనంగా 'బాలాజీ' అర్చన పథకాన్ని ప్రవేశ పెట్టారు.

మీరు చేయవలసిందల్లా ఇండియన్ ఓవర్ సీస్ బ్యాంకు ద్వారా దేవస్థానానికి రూ. 5,000లు చెల్లించడం. ఇందుకు ప్రతిఫలంగా పది సంవత్సరాలపాటు ప్రతిసంవత్సరం మీరు కోరుకున్న రోజున శ్రీ వేంకటేశ్వరునకు అర్చనసేవ చేసుకొనే మహద్భాగ్యానికి పాత్రు లవుతారు.

మీరు చెల్లించిన డబ్బు పది సంవత్సరాలకు వడ్డీతో కలిపి రూ॥లు 15,000 అవుతుంది. దేవుడికి పదిహేనువేలు సమర్పించుకొన్న సంతృప్తి మీకు దక్కుతుంది.

సౌకర్యాలు :

అర్చన రోజున విరాళం ఇచ్చిన వ్యక్తికి వసతి సౌకర్యం కల్పిస్తారు. దంపతులిరువురూ అర్చన సేవలో పాల్గొన వచ్చును. కుటుంబం లోని ముగ్గురు వ్యక్తులకు సుప్రభాత దర్శనం. ప్రత్యేకదర్శనం లభిస్తుంది. ఇవిగాక అంగవస్త్రం లేక రవికగుడ్డ, ప్రసాదం లభి స్తాయి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

కోరికలు ఇంకా ఇంకా పెంచుకుంటూ ఎంతకూ తనివితీరని మనిషిని అడవిలో తిరుగుతున్న పసరాన్ని పెద్దపులి వేసుకు పోయినట్టు మృత్యువు ఎగరేసుకుపోతుంది. 'నాకు ఇది కావాలి' 'నాకు అది కావాలి' అంటూ కోరికలు పెంచుకునేవాడు మృత్యువు వశం అవుతున్నాడు.

మృత్యువు, ముసలితనం, వ్యాధి, నానా విధాలైన రోగాలు చుట్టు ముట్టి ఉంటే నిమ్మకు నీరెత్తినట్టు ఉండడం ఎలాసాధ్యం?

మీది మీదికి వచ్చే మృత్యు సేనను జయించేందుకు 'సత్యం' ఒక్కటే సాధనం "సత్యం" అమృతత్వాన్ని స్తుంది.

ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి. కొడు కులు ఉద్ధరించరు. కొడుకులు లేకపోయినా ఫరవాలేదు. నేడో, రేపో, చచ్చిపోబోతున్న వాడికి డబ్బుతో ఏమి పని? బంధువులతో ఏమి పని? మీ తాతగారు ఏమయారు? మీ తండ్రి ఏమయారు?

మృత్యువూ, అమృతత్వం రెండూ మనిషి దేహంలోనే ఉన్నాయి. మోహం వల్ల మృత్యువునీ, సత్యంవల్ల అమృ తత్వాన్నీ పొందుతాము.

విద్యను మించిన కన్ను లేదు. సత్యాన్ని మించిన బలం లేదు. రాగం అంత దుఃఖం లేదు, త్యాగం అంత సుఖం లేదు.

కొడుకు మేధావి చెప్పిన మాటలు తండ్రికి కనువిప్పు కలిగించాయి.

(మహాభారతం : శాంతిపర్వం)

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు



సృష్టిలో మానవుడు విశిష్ట ప్రాణి. ఎందుకూ? అతనికి ఇతర జంతుజాలము కంటే విలక్షణమైన భాష వుంది. ఈ భాష మానవుని ప్రారంభదశలో పశుపక్ష్యాదుల "అంబా, కుహూ" మొదలగు శబ్దములవలె అవ్యక్త అస్పష్టనాదముగా నుండేది. క్రమముగా అది వ్యక్తనాదమై - సుస్పష్టమై భాసించింది. ఎదురెదురుగానున్న యిర్వురు వ్యక్తులు పరస్పరాభిప్రాయాలను ప్రకటించుకొనుటకై భాష ఉపయోగపడుతుంది. కానీ అప్రత్యక్షంగా ఎక్కడో వున్న వానికి తమ భావం తెలపాలంటే యీ భాషకు శక్తి చాలదు. అప్పుడే లిపి పుట్టింది. అంటే ముందుభాష, తరువాత 'లిపి' అని మనం భావించవచ్చు. నేటికీ 'లిపి' లేని అనేకభాషలు వ్యవహారంలో వున్నాయిగదా.

ఈ లిపి యిప్పటికి సుమారు 5 వేల సంవత్సరాలకు పూర్వం కనిపెట్టబడింది అని మన మంచనా వేయ వచ్చు. మనకు తెలిసిన విషయాన్ని భావితరాల కందించటంలో యీ లిపి మన కెంతో ఉపకరిస్తూంది. ఈ లిపి వ్రాసే వానిని వ్రాయసకాడు లేక లేఖకుడు అంటారు. వాఙ్మయ ప్రపంచంలో యీ లేఖకునికి చాలా ప్రాధాన్య ముంది.

వేదాలను వింగడించి, పురాణాలను ప్రపంచించి సంస్కృతభాషలో అనంతమైన వాఙ్మయాన్నీ, సంస్కృతినీ ప్రసాదించిన వ్యాసమహర్షికే మహాభారత రచనా సంకల్ప సమయంలో యీ వ్రాయసకాని సమస్య వచ్చింది. ఉప్పొంగి వస్తూన్న కవిత వెల్లువై ప్రవహిస్తూంది. భావాలు తరంగాలై-యెద అంచులకు ఒరసుకుంటున్నాయి. ఆవేశం చెప్పేటప్పుడు గణ, యతి, ప్రాసలలోగానీ, ఇతర విషయాలందుగానీ ఏ వైనా పొరపాట్లు వస్తే, అప్పటికప్పడే సవరించి సమర్థించి వ్రాయగలవాడుగా వుండాలి. ఏ పరిస్థితిలోనూ కవి ఆవేశానికి భంగకారి కారాదు. ఇన్ని అర్హతలుగల లేఖకుడు దొరకటం సాధ్యమా? వ్యాసమహర్షి సృష్టికి మూలపురుషుడైన బ్రహ్మతో ఆలోచించాడు. బ్రహ్మ 'గణపతి' ని లేఖకునిగా సూచించాడు.

వ్యాసుడు గణపతిని గూర్చి ప్రార్థించాడు, ఆతడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకొమ్మన్నాడు. వెంటనే వ్యాసుడు "నేను సంకల్పించిన యీ మహాభారత రచనకు నీవు లేఖకుడు కావాలి" అన్నాడు.




నేటి సమాజంలో అక్షరాస్యులనే చదువు కొన్నవారుగా మనం భావిస్తున్నాము. కానీ చదువు వేరు అక్షరాస్యత వేరు. మన ప్రాచీనులలో పూర్వం వేదాధ్యయనం-శాస్త్రాధ్యయనం మొదలగునవి పుస్తకాపేక్షతో జరిగేవికావు. కేవలం గురువు చెప్పటం శిష్యుడు వినటం- ద్వారా చదువు సాగేది. ఈ విద్వాంసులలో అనేకులకు విద్య తెలుసు కానీ వ్రాయటం (లిపి) రాదు, అంటే మన మాశ్చర్యపడ నక్కరలేదు.

అవధులు దాటుతున్నది. ఏదో వ్రాయాలనీ, ఏదో చెప్పాలనీ, ఏదో వెల్లను యీ ప్రపంచాని కందించాలనీ అంతులేని చింతన-అంతర్మథన. వ్యాసభగవానుడీ ఉద్వేగాన్ని భరించలేకపోతున్నాడు. వెంటనే ప్రారంభిదామంటే తగిన లేఖకుడు లేడు. లేఖకుడంటే సామాన్యుడా? ఎంతో తెలివైన వాడై వుండాలి. చక్కగా తప్పులులేకుండా వ్రాయగలవాడై వుండాలి. కవిహృదయం తెలిసిన వాడై వుండాలి. కవి ఆవేశంలో వేగంగా

శ్రుత్వైతత్ ప్రాహ విఘ్నేశో
యది మే లేఖినీ క్షణమ్।
లిఖితో నావతిష్ఠేత
తదా స్యాం లేఖకో హ్యహమ్॥

వెంటనే గణపతి "నాకలం ఒక్క క్షణం కూడా నిలబడకుండా నీవు చెప్పాలి. ఏ పని యందు నియుక్తుడైనవానికి, ఆ పని అయిపోయేదాకా నిండుగా అవిరామంగా జరిగితేనే బాగుంటుంది. కాబట్టి అట్లా వేగంగా ఆపకుండా నీవు చెబుతానంటేనే

నేను నీకు లేఖకుడుగా వుంటాను" అన్నాడు. వ్యాసుడు మళ్ళీ ఇలా అన్నాడు.

"వ్యాసోఽప్యువాచ తం దేవ
మబుద్ధ్వా మా లిఖ క్వచిత్."

"అయితే స్వామీ! నేను నీవు చెప్పినట్లుగా నిలవకుండా వేగంగా చెబుతానుగానీ నేను చెప్పే ప్రతివాక్యం నీవు బాగా అర్థంచేసుకొనే వ్రాయాలి-అర్థంచేసుకోకుండా వ్రాయకూడదు" అని,

ఈ వ్యాస - వినాయకుల సంభాషణలో-'లేఖనక్రియ' లోనున్న కష్టము, లేఖకునికి వుండవలసిన విశిష్టలక్షణాలు మనకు బాగా ద్యోతకమౌతాయి. చీటికీ మాటికీ యితర ధ్యాసలో లేవకుండా, ఓపికతో ఎంతకాలమైనా వ్రాస్తూ కూర్చోగలవాడు కావాలి. ఇది సామాన్యలక్షణం. ఇక ఈ సంభాషణలో ఆపకుండా ఆశువుగా చెప్పడం కవికీ, అర్థం చేసికొని వ్రాయటం లేఖకునికీ, వుండవలసిన విశిష్టలక్షణాలని మనకు తెలుస్తూంది. ఈ రెండూ నిజానికి కష్టతరములై నవే.

సరే వ్యాసునికోర్కె ప్రకారం అర్థం చేసుకొని వ్రాయటానికే వినాయకుడు సిద్ధపడ్డాడు. వ్యాసుడు కూడా ఆపకుండా చెప్పాడు. అయితే ఎంతటి మహాకవికయినా ఒక్కొక్కప్పుడు ఆవేశభంగం కలిగితే ఆశువుగా చెప్పటం సాధ్యంకాకపోవచ్చు. అప్పుడు ఉప్పొంగి వెల్లువై వచ్చే కవిత కూడా ఆగిపోవచ్చు. కానీ అట్లా వీల్లేదన్నాడు గణపతి. అందుకోసమే వ్యాసుడు ఒక్కొక్కసారి చాలా క్లిష్టమైన శ్లోకాలను చెప్పేవాడు. మరి గణపతి అర్థం చేసికోకుండా వ్రాయకూడదు కదా!

'సర్వజ్ఞోఽపి గణేశో యత్
క్షణమాస్తే విచారయన్।
తావచ్చకార వ్యాసోఽపి
శ్లోకానన్యాన్ బహూనపి॥'

సర్వజ్ఞుడైన గణపతికికూడా ఆ కఠిన శ్లోకాలను అర్థం చేసికోవటానికి కొంత సమయం పట్టేది. ఆత డాలోచిస్తూ కూర్చున్నంతలో వ్యాసుని ఆలోచనకు అవకాశం వచ్చేది. మళ్ళీ ఎన్నో క్రొత్తశ్లోకాలను ఆశువుగా చెప్పేవాడు.

వంద శ్లోకాలు కలిగిన ఒకశతకాన్ని వ్రాయాలంటేనే కవి ఎంతో శ్రమకోర్చి-ఎన్నోసమస్యల నెదుర్కొనవలసి వుంటుంది. అలాంటిది

'యదిహాస్తి తదన్యత్ర -
యన్నేహాస్తి న తత్ క్వచిత్'

అని సర్వసమగ్ర గ్రంథంగా కీర్తింపబడిన లక్షశ్లోకాత్మకమైన మహాభారతాన్ని వ్రాయటానికి పూర్వరంగం ఎంత వుంటుందో మన మూహించవచ్చు. ఏ కావ్యమైనా - గ్రంథమైనా రచింపబడాలంటే, అది వెల్గు చూడాలంటే కవి ఎంత ప్రధానమైనవాడో లేఖకుడు కూడా అంత ప్రాధాన్యం కల్గినవాడని మనం తెలుసుకోవాలి.

సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలొకసారి కావ్యము రచింపుమని అనగా ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దన తన కవితావస్తువులను యిట్లా పేర్కొన్నాడు.

"నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక
తెచ్చియిచ్చు క
ప్పుర విడె మాత్మకింపయిన భోజన
ముయ్యెలమంచ మొప్పత
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల
లేఖక పాఠకోత్తముల్
దొరికినగాక యూరక కృతుల్ రచియింప
మటన్న శక్యమే?" అని-

ఇచట 'ఊహతెలియంగల లేఖక' అని లేఖకుని గూడ కవితావస్తువులలో నొకనిగా నుడివాడు పెద్దన మహాకవి. స్వయంగా అనుభవంలో ఉన్న విషయం కాబట్టి 'కవి ఊహ నారయువాడు' అని లేఖక పదాన్ని విశేషణ పూర్వకంగా చెప్పి, కావ్యనిర్మాణంలో లేఖకుడు ఎంతో ప్రధానమైనవాడు అని సూచించాడు పెద్దన.

ఈ రీతిగా వాఙ్మయప్రపంచంలో లేఖకునికి ఎంతో ప్రధానస్థాన ముంది. అయితే ఆధునిక సమాజంలో కవియే లేఖకుడుగా కూడ కొద్దిపాటి తన బాధ్యతను నిర్వహిస్తున్నాడు. ఏమైనా లేఖకుని అపేక్ష బొత్తిగా లేకుండా ఏ గ్రంథము వెలుగు చూడటం లేదు. అటువంటి లేఖకునికి వాఙ్మయ ప్రపంచంలో తగు స్థానం లభించుగాక.

నిద్రాముద్రిత సాహితీజగతికిన్ నీ శక్తి
మేల్కొల్పుగా
ముద్రారాక్షసముల్ విదల్చి,
సవరింపుల్ గూర్చుటేగాక, ని
ర్నిద్రశ్రీఁ గవిరాక్షసంబుల నవోన్మేష
ప్రభన్ దిద్దరా
భద్రంబై తెరవెన్క నీ ప్రతిభ
యుద్భాసించుతన్ లేఖకా!

— శ్రీ మాడుగుల నాగఫణిశర్మ

*

## ప్రత్యేక కల్యాణోత్సవం




తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆర్జిత కల్యాణోత్సవం - కలవారు మాత్రమే చేయగల కైంకర్యం కాదిప్పుడు! 1981 నవంబర్ 1వ తేది నుండి ఆర్జిత కల్యాణోత్సవం రేటు 2,000 రూ.లకు పెంచబడిన దృష్ట్యా సామాన్యులకు అందుబాటులోవుండే విధంగా కేవలం 500 రూ.లతో మాత్రమే వేరొక 'కల్యాణోత్సవం' ఏర్పాటయింది. గృహస్థుతోకలిసి ఐదుగురిని మాత్రమే అనుమతించే ఈ కల్యాణోత్సవంలో ప్రసాదాల వంపకం వుండదు. మిగతా అంశాలన్నీ మామూలుగానే వుంటాయి. ఈ కల్యాణోత్సవం జరిపించ దలచేవారు—

పేష్కారు, తిరుమల ఆలయం సంప్రదించవలసి వుంటుంది.

# సూరసాగరంలోని ఆధ్యాత్మిక భావసంపద

మహాకవి సూరదాసు అమరకృతి అయిన "సూరసాగరం" ఒక అధ్యాత్మ భావ సుధా సాగరం. సూరదాసుని కృష్ణుడు సచ్చిదానంద స్వరూపుడైన పూర్ణపురుషుడు శ్రీమన్నారాయణుని అవతారమే శ్రీకృష్ణ పరమాత్మ. ఆత్మానంద ప్రకాశనార్థమై రాధాకృష్ణులుగా విభిన్నంగా కనుపించినా ఇరువురూ ఒక్కరే!

కృష్ణ పరమాత్మ ఒక్కచోట రాధతో ఇలా అంటాడు.

ప్రకృతి ఔర్ పురుష ఏకహీ సమఝో
హమ తుమ ఏకహీ హైం,
భేద కేవల కహనే భరకో హై
జల థలమే జహాం కహీం భీ
మైం రహతాహూం
తుమ్హారే బినా నహీం రహ సకతా
యహ వేద ఔర ఉపనిషదోంనే
గాయా హై.

కృష్ణుడు లేనిదె రాధ లేదు. రాధ లేనిదే కృష్ణుడు లేడు. ఇరువురూ ఒక్కరే. గోపికలు వేదఋక్కులు. బ్రహ్మ, శివుడూ, లక్ష్మి, ఏ ఒక్కరు వీరితో సరితూగ లేరని బ్రహ్మ స్వయంగా భృగుమహర్షితో అంటాడు. రాధ గోలోకానికి అధీశ్వరి. బృందావనం రాధామాధవుల విలాసభూమి.

ఒకసారి కృష్ణుండు రుక్మిణితో

'యద్యపి ద్వారకా స్వర్ణ రచిత హై
యహాం
సమస్త విషయ భోగప్రాప్త హై
తోభీ మేరా మన సదైవ వంశీవట ఔర్
బృందావనకే లతాకుంజోం మే
రహతా హై'

ద్వారక స్వర్ణమయమై, సర్వసుఖాలకూ ఆస్పదమైనప్పటికీ నా మనస్సు మాత్రం ఆ బృందావనం, ఆ లతానికుంజాలలో మాత్రమే పరిభ్రమిస్తూ ఉంటుంది అంటాడు. బృందావనం భక్తికి క్షేత్రమైతే, వేణువు అణిమాద్యష్ట సిద్ధులకు కామధేనువు. వస్త్రాపహరణమనేది భగవానునికి భక్తునికి మధ్యనున్న వ్యవధానాన్ని తొలగించటం మాత్రమే.

పురుషోత్తముడూ పూర్ణకాముడూ సచ్చిదానంద స్వరూపుడూ అగు ఆ కృష్ణుని పరమానంద స్వరూపానికి పూరణ మాత్రమే రాధ. రాసలీల అనేది అందునా కృష్ణుని సగుణరూపునిగా లీలామూర్తిగా సృష్టించి నడుమ నడుమ అజ్ఞాన జనితమైన మాయని కల్పిస్తూ కృష్ణపరమాత్మ అద్వైతతత్త్వాన్ని ఆనందరూపాన్ని మనకు అవగతం చేసేందుకా అన్నట్లు, సూరమహాప్రభువు సూరసాగరాన్ని వెలయించాడు. అజ్ఞాన జనితమైన మాయని కల్పిస్తూ కృష్ణ పరమాత్మ తల్లి యశోదనూ, గోపికలనూ, గోపాలురనూ, దేవాదిదేవులనూ, సమస్త సృష్టినీ



మహాకవి సూరదాసు

ఎలా మరపింప చేశాడో చక్కగా వర్ణించాడు. అదంతా ఒక అపూర్వ కళాసృష్టి.

జనుషాంధుడైనా మహాకవి సూరదాసు తన మనో నేత్రాలకు కనవ్పటిన కన్నయ్య అద్భుతమైన లీలామానుష రూపంలోని మాధుర్యాన్నీ, సౌందర్యాన్నీ, అంతర్యాన్నీ సూరసాగరంలో అందంగా, హృద్యంగా వర్ణించి, కీర్తించి, మధురంగా గానం చేశాడు. అందలి అపూర్వ కళాసృష్టిని పరిశీలిద్దాం.

గోవర్ధనాన్ని ఎత్తిన కృష్ణుని భుజాలు ఎంత నొచ్చుకున్నాయో అని వత్తుతున్న యశోదను చూచి బలరాముడు నవ్వుకుంటాడు. పదునాల్గు భువనములనూ తన చిన్న బొజ్జలో ఇముడ్చుకున్న ఈ మహానుభావునికి ఈ కొండను మొయ్యటం ఒక లెక్కా అని.

దానలీలా మహోత్సవంలో గోపికలు నీవు ఇలాగే మమ్మల్ని వేధిస్తూవుంటే 'వ్రజకో ఛాండి చలై'–"ఈ గోకులాన్ని వదలి వెళ్ళిపోతాం" అంటూ బెదరిస్తారు. .... మా గ్రామాన్ని వదలి మీరు పోలేరు. ఎక్కడ ఉంటారు అంటాడు కృష్ణుడు. ఓ యబ్బో! నీ సహాయం మాకేమీ అక్కర లేదులే .... "తల్లి యశోద రోటికి కట్టివేయగా ఎవరయ్యా నిన్ను విడిపించింది?" అంటారు గోపికలు. "నాకు తల్లి ఎవరూ? తండ్రి ఎవరూ? అయినా నే పుట్టగామీరుచూచారా!" అంటూ గంభీరంగా పలుకుతున్న బాలకృష్ణుని అంతర్యాన్ని తెలియక గోపికలు వాదానికి దిగుతారు.

ముఖ్యంగా బాలకృష్ణ పదాలలో ఈ అధ్యాత్మభావం సుస్పష్టంగా మనకు గోచరిస్తుంది. బాలకృష్ణుడు ఉయ్యాలలో పడుకొని కాలి బొటనవేలు చీకుతున్నాడు. దానిని సూరమహాకవి ఇలా అంటాడు.

చరన గహే అంగూఠా ముఖ మేలత,
జా చరనారవింద రస సుర నర కరత
వివాద
సో రస మోహీ కో దురలభ తాతే లేత
స్వాద॥

ఏ చరణ కమలామృత రసాస్వాదనానికి వరవశించి, మానవులూ, దేవతలూ కూడా ఆనందంతో మైమరచి పోతూ వుంటారో అట్టి ఆనందం నాకుకూడా దక్కక పోయెనే అని కుతూహలంతో కాలి బొటనవేలిని నోట నిడుకొని కృష్ణపరమాత్మ ఆస్వాదిస్తున్నాడట.

తల్లి యశోద బాలకృష్ణుని నిద్ర పుచ్చుతోంది. అది చూచిన శివుడూ బ్రహ్మ కూడా కంపించిపోయారట. కారణ మేమంటే–

జసోదా మదనగోపాల సువా వై
దేఖి సపనగత త్రిభువన కాంప్యో
ఈస విరించి భ్రమా వై॥

సమస్తసృష్టినీ పోషించి రక్షించవలసిన ఆ పరమాత్మే నిద్రపోతే ఈ సకల చరాచర జగత్తూ ఏమైపోతుందో అనే భయం వారికి పట్టుకుంది.

స్వాస ఉదర ఉభరత యోం మానో
దుగ్ధ సింధు ఛవి పావై
నాభి సరోజ ప్రకట పదమాసన
ఉదర నాల పఛతా వై ॥

కర సిర తర కరి శ్యామ మనోహర
అలక అధిక సో భా వై
సూరదాస పన్నగపతి మానో
ప్రభు ఊపర ఫన ఛావై॥

ఉయ్యాలలో చేతిని తలక్రింద ఉంచుకొని పండుకొన్న బాలకృష్ణుని రూపంలో సూరదాసు శేషశాయి అయిన ఆ మహా విష్ణుని రూపాన్ని సందర్శిస్తాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కదలి కెరటాలపై మఱ్ఱి ఆకున కదలుచున్న కన్నయ్య చిన్నిబొజ్జ ఎగిరెగిరి పడుతున్నదట. నాభి సరోజం వలె వున్నదట. పున్నమ చందమామ వంటి ముఖాన్ని అంటిపెట్టుకొని వున్న ముంగురులు పన్నగపతిని స్ఫురణకు తెస్తున్నాయి అంటాడు.

నందుడు బాలకృష్ణునికి అన్నప్రాశన చేయ సంకల్పిస్తాడు. చిన్ని కృష్ణుని ఒడిలోనికి తీసుకొని ముందు పాయసం తరువాత షడ్రుచులనూ చవి చూపిస్తాడు నందుడు. అవి పెదవికి తాకగానే ముఖాన్ని చిట్లిస్తాడు బాలుడు.

నంద లై లై ముఖ జురరావత
షటరస కే పరకార జహాఁ లగి
లై లై అధర ఛువావత
విశ్వంభర జగదీశ జగతగురు
పరసత ముఖ కరువావత.

అవును ప్రాపంచిక విషయాసక్తికి విముఖుడైన పరమ యోగేశ్వరేశ్వరుడైన ఆ జగదీశ్వరునికి ఇవి ఏమి రుచిస్తాయి.

అట్టి పరమానంద కందశితమైన సుందర రూపాన్ని పొందగలిగిన భాగ్యం కేవలం గోపికలకి మాత్రమే దక్కింది.

జా కో నేతి నేతి స్మృతి గావతి
ద్యావతి శివముని ధ్యాన ధరే
సూరదాస తిన కో బ్రజ జువతీ
ఝుకఝోరతి ఉర అంక లియే॥

ఏ పరమాత్మ ఉనికిని తెలియక వేదాలు తల్లడిల్లి పోతున్నాయో, ఏ మహామహుని జాడకానక శివుడూ బ్రహ్మకూడా తల్లక్రిందులుగా తపస్సు చేస్తున్నారో అట్టి ఆ పరమాత్ముని వ్రజభామినులు తమ కౌగిళ్ళతో బంధించి ఆత్మార్పణమను భక్తి భావనతో చేజిక్కించుకొని ఆనంద డోలలలో తేలియాడు తున్నారని అంటాడు.

ఈ సమస్త చరాచర జగత్తూ ఆ పరమాత్మకు ఒక్క విలాసం. ఆయన ప్రతిరూపమే ఈ జగత్తు.

ముఖప్రతిబింబ పకరిబే కారన
హులసి ఘుటరువన ధావత
ఛినక మాంఖు త్రిభువన కీ లీలా
సిసుతా మాహి దురావత.

బాలుడు నందుని మణిమయ సౌధంలో మోకాళ్ళపై దోగాడుతున్నాడు. మణిమయ స్తంభాలలో ప్రతిఫలించిన తన ప్రతిబింబాన్ని చూచిన కృష్ణుడు దానిని వేరొక బాలునిగా భావించి పట్టుకోవాలని ప్రయత్నిస్తాడు. ఆ క్రీడను తన మనోనేత్రంతో చూచిన సూరదాసు త్రిభువనాలనే ఒక్క క్షణంలో ఆడించగల ఆ పరమాత్మ మణిమయ స్తంభాలలో ప్రతిబింబించిన తన రూపాన్నే ముద్దుబాలునివలె పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నా డంటాడు.

ఒక్క అడుగులో సమస్తభూమినీ కొలవగల ఆ పరమాత్మ యశోదమ్మ ఇంటి గుమ్మాన్నే దాటలేక పోయాడనటం చేతకాక కాదు. ఆ యశోద భాగ్యం పండించాలని మాత్రమే. ఆ యమ్మ భాగ్యమే భాగ్య మనాలి.

ఘర ఆంగన అతిచలన సుగమ భయా
దేహ దేహరీ మే అటకాయో
ఉరహు పైగ వసుధా సబ కీన్హీ
ధామ అవధి బిసరావతి.

— — — — — —

(మనహీ మన బలధీర కహతహై
ఐసో రంగ బనాయో.)

అలా ఇంటిగుమ్మాన్నే దాటలేక దిక్కులు చూస్తూ తన అశక్తతను తెలియజేస్తున్న తన తమ్ముడు.... "ఎంత నాటకం ఆడుతున్నాడు" అని తమ్ముని లీలా విలాసాన్ని చూస్తున్న బలరాముడు తనలో తానే నవ్వుకుంటాడు.

కోటి కోటి బ్రహ్మాండములను ఒక్క త్రుటిలో సృజించి, సంహరించగల ఆ పరమాత్ముని యశోదమ్మ చేయిపట్టుకొని మెల్ల మెల్లగా గుమ్మాలను దాటిస్తుంది.

"కరటేకి శ్యామకో, క్రమ క్రమకై
ఉతరా వై"

తన తల్లి పెరుగు చిలుకుతుండగా చూచిన బాలకృష్ణుడు మెల్లమెల్లగా వచ్చి పెరుగు కుండలో గిరగిరా తిరుగుతున్న కవ్వాన్ని కదలకుండా పట్టివేస్తాడు. అది చూచి వాసుకి భయపడ్డాడు. మందరం స్తంభించింది.

(48 వ పేజీలో)

# వార్తాలహరి

## 'మారుతికారు' కానుక

'మారుతికారు' సంస్థ, మొట్టమొదటిగా ఉత్పత్తియైన కారును జూలై 7న తిరుమలలో శ్రీస్వామివారికి కానుకగా సమర్పించింది. మారుతి ఉద్యోగ్ లిమిటెడ్, దాని అనుబంధసంస్థల ఉద్యోగుల తరపున ఆ సంస్థ ఛైర్మన్ శ్రీ వి. కృష్ణమూర్తి సుమారు 50 వేల రూపాయల విలువచేసే ఈ కానుకను తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డికి అందజేయడం జరిగింది.



## స్వర్ణోత్సవాలు

కడపజిల్లా రాజంపేటలో శ్రీ ఎ.బి. నారాయణరెడ్డి కాలనీ మైదానంలో ఈ జూలై 10, 11 తేదీల్లో సాయంత్రం 6 గంటలకు తి. తి. దేవస్థానంవారు స్వర్ణోత్సవాలు వైభవంగా నిర్వహించారు. మొదటిరోజు గీతా పారాయణతో సభ ప్రారంభమైంది. స్థానిక ఆర్యవైశ్య సంఘాధ్యక్షులు శ్రీ బొగ్గరపు సుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి, పూజ్యశ్రీ ఆనందగిరి మాతాజీ,శ్రీ ముదివర్తి కొండమాచార్యులు ధార్మిక ప్రసంగాలు చేశారు.

రెండవరోజు (జూలై 11)న కడపజిల్లా కలెక్టరు శ్రీ అమితాభ్ భట్టాచార్యగారు అధ్యక్షత వహించగా తి.తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి సభను ప్రారంభం చేశారు. తదుపరి శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, శ్రీ ఆనంద మాతాజీ ధార్మిక ప్రసంగాల అనంతరం తి. తి. దే. అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులు సంకీర్తన కార్యక్రమము కొనసాగించారు. చివరగా శ్రీ వంగల పట్టాభిభాగవతార్‌గారి 'శ్రీనివాస కల్యాణం' హరికథా కాలక్షేపంతో రెండు రోజుల స్వర్ణోత్సవ సభలు మంగళప్రదంగా ముగిశాయి.

## వేదశాస్త్రాగమ సదస్సు

ఈ జూలై 0వ తేదీన మంగాపురంలో తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి 'వేదశాస్త్రాగమ సదస్సు' ప్రారంభంచేస్తూ, దేవస్థానం అమలుచేస్తున్న వివిధ పథకాలను వేద పండితులు సద్వినియోగం చేసుకోవలసిందని ఉద్బోధించారు. తి. తి. దేవస్థాన వేద పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీ డి. రామచంద్ర శాస్త్రి నివేదికను చదివారు. తదుపరి దేవస్థాన ప్రజాసంబంధశాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి తి. తి. దేవస్థానం వేదప్రచారానికి అమలుచేస్తున్న పథకాల తీరును విపులంగా వివరించారు. చివరగా దేవస్థాన విద్యాశాఖాధికారి శ్రీ చంద్రశేఖర నాయుడు వేదపండితులను దుశ్శాలువలతో సత్కరించారు.

## అన్నమాచార్య ఉత్సవాలు

సికింద్రాబాదు "శ్రీ తాళ్లపాక అన్నమాచార్య కళాక్షేత్రం" వారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ సహకారంతో 84 జూలై 6, 7 తేదీల్లో రెండు రోజులు తాళ్లపాకలో "అన్నమాచార్య ఉత్సవాలు" నిర్వహించారు.

మొదటిరోజు ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నరు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు ఉత్సవాలను ప్రారంభం చేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల కార్యదర్శి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌గారు



అన్నమాచార్యుల కీర్తనలను ఇంకా విస్తృతంగా ప్రచారం చెయ్యవలసిన అవసరం ఇంకా ఎంతైనా వుందని విజ్ఞప్తి చేశారు. తదుపరి ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావు, తదితరులు ఉపన్యసించారు.

సాయంత్రం 7 గంటలకు శ్రీమతి శోభారాజు (రామరసవాహిని,భద్రాచల దేవస్థానం) అన్నమాచార్య కీర్తనలను గానం చేసి శ్రోతలను ఆనందింప జేశారు. శ్రీ కృష్ణమరాజుగారి వందన సమర్పణలో మొదటి రోజు కార్యక్రమాలు ఘనంగా ముగిశాయి.

7వ తేదీ డా॥ సి. నారాయణరెడ్డి (తెలుగు భాషా కమిషన్ అధ్యక్షులు) రెండవరోజు కార్యక్రమాన్ని ప్రారంభం చేస్తూ అన్నమయ్య వాఙ్మయంలో కవిత్వానికి కావలసిన సామగ్రి ఎంతైనా వుందని, అది తరువాతి కవులకు, పండితులకు ఒక ఖజానాగా ఉపయోగ పడిందని చెప్తూ, "ఏమొకొ చిగురు టధరమున" అను అన్నమయ్య పాట పారశీకపంథాలో నడచిన, పారశీక ప్రభావం కలిగిన పాట అని వక్కాణించారు.

కడపజిల్లా జాయింట్ కలెక్టరు శ్రీ యస్. చెల్లప్ప తాళ్ళపాకలో చెన్నకేశవాలయానికి నిత్య నైవేద్యాలకు కావలసిన ఆర్థిక సహాయం చేయగలమని హామీ ఇచ్చారు. శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి తాళ్ళపాక దేవాలయాన్ని అభివృద్ధి చేయవలసిన అవసరం వుందని చెప్పారు.

తి. తి. దే అన్నమాచార్య వాఙ్మయ ప్రాజెక్టు ప్రత్యేకాధికారి శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు ప్రసంగిస్తూ, అన్నమయ్య అధ్యాత్మ కీర్తనలను తన పూర్వ వయస్సులో రచించినాడనీ, తదుపరి, అన్నమయ్యకు శ్రీ స్వామివారితో పరిచయం బాగా బలిసిన అపరవయస్సులో శృంగార సంకీర్తనలను రచించినాడని తెలియజేశారు. అన్నమయ్య గోపికలవలె శ్రీ స్వామివారితో శృంగారం నెరపాడనీ, అది అందరి దృష్టిలో ఉన్న లౌకిక శృంగారం కాదని సోదాహరణంగా వివరించారు. అన్నమయ్య ఒక విరాగి. ఆయనకు కీర్తికాంక్ష లేదు. అందుకే అన్నమయ్య అన్ని పాటలను 'వేంకటేశ' ముద్రతో రచించారు. పాడేవాడు తాను-వినేవాడు స్వామి. అంతే. "త్యాగరాజనుత" అని త్యాగరాజు చెప్పుకున్నట్లుగా అన్నమయ్య ఎక్కడా తనపేరు "అన్నమయ్యనుత" గా చెప్పుకోని విరాగి.... అని ప్రసంగించారు.

తి. తి. దే. హిందూ ధర్మ రక్షణసంస్థ కార్యదర్శి, అన్నమాచార్య ప్రాజెక్టు ఇన్ చార్జి డైరెక్టరు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు ప్రసంగిస్తూ, 'ఏ రీతి రచించిరేని సమకాలమువారు మెచ్చరుగదా - (అన్న రీతి అన్నమయ్యను తాళ్ళపాకవారు నిరాదరించినా, ఆ అన్నమయ్యవల్లనే తాళ్ళపాక అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించబోతున్నదని వక్కాణించారు. వ్యాస వాల్మీకి పోతన మహాకవుల్లో కానరాని అద్భుత కల్పనలు అన్నమయ్య కల్పించాడని, సకల వేదాలను సంకీర్తనలుగా పాడినాడని, భగవద్గీతాసారాన్ని తన పాటల్లో వివరించాడని, అల్పకాలంలో అన్నమయ్యకు, అన్నమయ్య పాటలకు అనల్ప ప్రచారం వచ్చిందనీ, ఇక కొద్దికాలంలో ఏ వాగ్గేయకారునికి లేనంత విస్తృత ప్రచారం అన్నమయ్యకు కలుగబోతున్నదని శ్రీ లక్ష్మణయ్యగారు ప్రసంగించారు.

శ్రీ యం. శ్యామలరావు భారతప్రభుత్వ పబ్లిసిటి ఆఫీసరు గారి అధ్యక్షతలో శ్రీ ఎ. ఆర్. కృష్ణ (ఆంధ్రప్రదేశ్ నాటకసంస్థ, నట మండలి) వీధి నాటక ప్రాశస్త్యాన్ని వివరిస్తూ "వీధినాటక గురుకులం" సంస్థకు ప్రారంభోత్సవం చేశారు.

శ్రీ పి.వి.యస్. కృష్ణశాస్త్రి అన్నమయ్య మహిమలను క్లుప్తంగా వివరించారు.

తదుపరి తి. తి. దే అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులు శ్రీ పి. యస్. రంగనాథం, శ్రీ ఎ. నాగేశ్వరనాయుడు బృందం అన్నమాచార్య కీర్తనలను శ్రుతిమధురంగా పాడి శ్రోతలను ఆనందింపజేశారు.

శ్రీకృష్ణమంజుగారి వందన సమర్పణతో రెండవరోజు ఉదయం కార్యక్రమాలు ముగిశాయి.

## బ్రహ్మోత్సవాలు

కడప జిల్లా తాళ్ళపాక గ్రామంలో ఈ జూలై 9 నుండి 17వ తేది వరకు శ్రీ చెన్నకేశవస్వామి మరియు శ్రీ సిద్ధేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు తి. తి. దేవస్థానం వారి ఆధ్వర్యంలో వైభవంగా జరిగాయి. ప్రతి రోజు శ్రీవార్లకు ఉత్సవాలు, ధార్మిక కార్యక్రమాలు, తి. తి. దేవస్థాన అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారులచే హరికథలు, అన్నమాచార్య కీర్తనల కార్యక్రమాలు ఘనంగా నిర్వహించారు.

## తి.తి. దేవస్థాన ధర్మకర్తలమండలి నిర్ణయాలు

తిరుమల, తిరుపతిలో దేవస్థానమునకు సంబంధించిన కేసులను విచారించేందుకై తిరుపతిలో ప్రత్యేకంగా ఒక న్యాయస్థానాన్ని ఏర్పరచవలసిందని, అందుకు గాను తాము ప్రతి సంవత్సరం 1.5 లక్షల రూపాయలను భరించగలమని, ధర్మకర్తల మండలి హైకోర్టును కోరడం జరిగింది.

శ్రీ వేంకటేశ్వర సనాతన ధర్మ గ్రంథాలయం, పరిశోధనాకేంద్రం ఏర్పాటుకు గాను 40 లక్షల రూపాయలను మంజూరు చేయడాన్ని నిర్ణయం జరిగింది.

తిరుపతి ఓవరుబ్రిడ్జి నుండి చిత్తూరు రోడ్డు వరకు బైపాస్‌రోడ్డు నిర్మాణానికిగాను రూ. 50 లక్షలు మంజూరు చేయడానికి నిర్ణయం తీసుకొనడం జరిగింది.

హరిద్వార్‌లోని సప్తసరోవరం వద్దగల భద్రకళాపీఠాన్ని దేవస్థానం స్వాధీనం చేసుకొని, అభివృద్ధి చేయాలని నిర్ణయించింది.

చిత్తూరులోని వేంకటేశ్వర కళాపీఠాన్ని కల్యాణమండపంగాను, ఆడిటోరియం కాంప్లెక్సు మార్చి నిర్మాణంచేయుటకు బోర్డు తీర్మానించింది.

ఆదిలాబాద్ జిల్లా మంచిర్యాలలో, నల్గొండజిల్లా మండపల్లిలో 20 లక్షల రూపాయల ఖర్చుతో కల్యాణమండపాలు నిర్మించుటకు తీర్మానించడమైనది.

అలాగే భువనేశ్వర్‌లో తి. తి. దే. సమాచార కేంద్రాన్ని ఏర్పాటుచేయాలని కమిటీ నిర్ణయించింది.

తి.తి.దే. నాల్గవతరగతి ఉద్యోగస్థులకు ఖాదీ దుస్తులకు బదులుగా టెరికాటన్ దుస్తులను ఇచ్చుటకు నిర్ణయించింది. *

# ధర్మ రక్షణ కార్యక్రమాలు

## వికాసభారతి

గత జూలై 11 బుధవారం విజయవాడ సత్యనారాయణపురం శ్రీ సీతారామకల్యాణ మండపంలో, తి.తి.దే. హిందూధర్మరక్షణ సంస్థ కృష్ణాజిల్లా శాఖ సహకారంతో, "వికాసభారతి" సంస్థవారు ధార్మిక కార్యక్రమాలు నిర్వహించారు. రైల్వే డివిజనల్ సూపరింటెండెంటు శ్రీ యం. కె. రావు ముఖ్యఅతిథిగా, డా॥ దమ్మాలపాటి రామారావుగారు అధ్యక్షతవహించిన ఈ సభలో కుమారి యన్. లక్ష్మీకుమారి, శ్రీ బసవరాజు సుబ్బారావుగారు, రామాయణవిశిష్టత, రామనామప్రభావం గురించి ప్రసంగించారు.

శ్రీమతి సీతా రావుగారు భక్తులకు శ్రీ కంచి స్వామివారు పంపిన రామకోటిపుస్తకాలను, తి. తి. దే. ప్రచురణలను, లాకెట్లను పంపిణీ చేశారు. అనంతరం వికాసభారతి బాలల విభాగం వారిచే 'దంతవేదాంతం' నాటిక ప్రదర్శింపబడింది.

## మెదక్ జిల్లా

హరిజనవాడ బాబానగరంలో ఇంటింటికి వెళ్ళి హిందూధర్మరక్షణసంస్థ మెదకు శాఖ వారు.

సప్తగిరీశుని సప్త సూత్రములను 1. స్నానంచేయుట ౨.బొట్టుపెట్టుకొనుట ౩.ఇష్ట దేవతాపూజ, ప్రార్థన 4. గీతాపారాయణం 5. తులసిమొక్కను పెంచుట 6. ఇంటి ద్వారముపై ఓంకారమును చిత్రించుట 7. ప్రతివారము సత్సంగసమావేశాల్లో భజనల్లో పాల్గొనుట ప్రచారం చేశారు. అట్లే సోమేశ్వరవాడలోను పై అంశములగూర్చి ప్రచారం చేశారు. భజన కార్యక్రమాలు నిర్వహించారు.

## విష్ణు సహస్రనామ పారాయణ

తి. తి. దే. హిందూధర్మరక్షణ సంస్థ గుంటూరు జిల్లాశాఖవారి ఆధ్వర్యంలో గుంటూరు శ్రీ రమా సత్యనారాయణస్వామి దేవస్థానంలో జూలై 15 న "శ్రీ విష్ణుసహస్రనామపారాయణ" కార్యక్రమం ప్రారంభింపబడింది. శ్రీవిష్ణుసహస్రనామ ప్రాశస్త్యాన్ని శ్రీ సోమాశి బాలగంగాధర శర్మగారు వివరించారు. ఈ కార్యక్రమం శ్రీ చావలి వెంకటగోపాల కృష్ణమూర్తి స్వాగతం పలుకగా, శ్రీ కొడ్డపాటి దుర్గాప్రసాద్‌గారు ప్రారంభం చేశారు. ఈ పారాయణకార్యక్రమం నలభైరోజులు అనగా ఆగష్టు ౨౩ వరకు నిర్వహింపబడుతుంది.

చిలకలూరుపేట సొలస గ్రామంలోకూడ జూన్ ౨౯న శ్రీ వేంకటేశ్వరభక్తసంఘం సౌజన్యంతో ఇంటింటా ధార్మిక ప్రచారం కావింపబడింది. ఇంటింటికి "ఓం" కారాన్ని అతికించి ప్రసాదవినియోగం నిర్వహింపబడింది. సాయంత్రం విజ్ఞానమందిరంలో గీతాపారాయణ, హనుమాన్ చాలీసా కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి.

## విశాఖ జిల్లాలో

సాంబమూర్తి నగర్‌లో శ్రీపార్వతీచంద్రమౌళీశ్వరస్వామి దేవస్థానంలో జూన్ ౨6 నుండి జూలై ౩ తేదీవరకు శ్రీమద్రామాయణ హరికథా కాలక్షేపం శ్రీ తాళ్ళూరి చిన అప్పలస్వామి భాగవతార్ గారిచేత నిర్వహింపబడింది. హిందూధర్మరక్షణసంస్థ జిల్లా ఆర్గనైజరు శ్రీ ఎం. సత్యనారాయణమూర్తి ధార్మిక ఉపన్యాసాలిచ్చారు.

## శ్రీ పంచముఖ ఆంజనేయస్వామి ప్రతిష్ఠ

ఒంగోలు లాయరుపేటలోని సుందరనగరంలో శ్రీ పంచముఖ ఆంజనేయస్వామి శ్రీరాఘవేంద్ర బృందావనము ప్రతిష్ఠింప సంకల్పించారు. ఈ ధార్మిక కార్యక్రమానికై ఒంగోలు రూరలు పంచాయితీవారలు, బ్యాంకు ఎంప్లాయీస్ కో-ఆపరేటివ్ బిల్డింగు సొసైటీవారు వేయి చ. గజముల స్థలమును విరాళముగా సమర్పించారు. 84 ఆగష్టు 6న సంకర్షణము, ఆగష్టు 22 న శంకుస్థాపనమునకు సుముహూర్తము నిర్ణయింపబడినది. భక్తాదులు ఈ కార్యక్రమాలలో పాల్గొని తీర్థప్రసాదములు పొందవచ్చును. విరాళములివ్వదలచిన భక్తులు శ్రీధేనువుకొండ కంచి వరదరాజు, కార్యదర్శి, శ్రీ పంచముఖ ఆంజనేయ రాఘవేంద్ర సాంస్కృతిక సంఘం, సంగమూరు డొంక, ఒంగోలు, వారికి పంపవచ్చును.



వికాసభారతి కార్యక్రమ దృశ్యం: (కూర్చున్నవారు: కుడినుంచి ఎడమ వైపుకు) కుమారి యన్. లక్ష్మీకుమారి, శ్రీమతి ఎమ్. సీతారావు, శ్రీ ఎమ్. కె. రావు, డివిజనల్ రైల్వే సూపరింటెండెంటు, డా॥ దమ్మాలపాటి రామారావు, మాజీ ఎమ్.ఎల్.ఏ., శ్రీ బి. సుబ్బారావు, జిల్లా ఆర్గనైజర్, శ్రీ సి. హెచ్. గౌరీశంకర్.

(44 వ పేజీ తరువాయి)

సాగరం పూర్తిగా కంపించింది. ఈ మహానుభావుడు తిరిగి సముద్రమథనం చేస్తే తిరిగి హాలాహలం జనిస్తే, మళ్ళీ హాలాహలాన్ని ఎక్కడ భక్షించవలసి వస్తుందో నని శివుడు కూడా భయపడి పోతాడట. అలా పెరుగు కుండలో గిరగిరా తిరిగే కవ్వాన్ని కదలక పట్టిన ఆ స్వామి విన్యాసాన్ని తన మనోనేత్రంతో చూచిన సూరదాసు చక్కటి రూపకల్పన చేస్తాడు. చిత్తగించండి.

మథత దధి మధనీ టేకి ఖర్యో
ఆరి కరత మటుకీ గహ మోహన వాసుకి
సంభు డర్యో
మందర దురత, సింధు పుని కాంపత,
ఫిరి జని మథన కర్యో.

ఒక్కొక్కసారి తనకూ శివునకూ భేదమే లేదని అనిపించేటట్లు గోపికలకు భ్రమని కలిగిస్తాడు. అదంతా పరమాత్ముని లీల.

సఖిరీ నందనందన దేఖు
ధూరి ధూసరి, జటాజూటని హరి కియే
హర భేషు.

సఖీ! చూచావా మన బాలకృష్ణుడు శరీర మంతా దుమ్ముకొట్టుకొని ఎలా పరమశివుని లాగా వున్నాడో! అంతే కాదు....

మనో గంగా గౌరిడర ఉర లియో
కంఠ లగాయ
కేహరి కోనఖహి నిరఖత రహీ నారి బిచారీ
బాల ససి మనో భాలతే లై ఉర ధర్యో
త్రిపురారీ!

ఒక్క బూడిదేకాదు. గంగమ్మ గౌరమ్మకి భయపడి శివుని కౌగిలించుకొన్నట్లు ఆ ముత్యాల సరాలను చూడవే! తలమీది బాలచంద్రుని సడలించి కన్నయ్య పులి గోరుగా ధరించలేదు కదా! అని అనుకుంటూ విభ్రాంతలై చూస్తారు గోపికలు.

నిజానికి బలరాముని కొక్కనికే శ్రీకృష్ణుని అవతార రహస్యం తెలుసు. అందుకే మాటిమాటికీ—

"పుని పుని కహత కౌనహై మాతా కోహై
తుమ్హారే తాతా"

నీ తల్లి ఎవరో, నీ తండ్రి ఎవరో కాస్త చెప్పమంటూ మాటిమాటికీ కవ్విస్తాడు బలరాముడు.

ఈ విధంగా సమగ్ర సూరసాగరంలో శ్రీకృష్ణుని పరబ్రహ్మ తత్త్వాన్ని ఆనందమయ రూపాన్ని అడుగడుగునా చూస్తాం.

జో మూరతి జలథల మో వ్యాపక నిగమ
నఖోజత పాయీ
జోమూరతిజూ ఆపనే ఆంగన చుటకీ
దైదై నచాయీ.

గోకులంలో శ్రీకృష్ణుని అవతరణ దుష్టశిక్షణ, శిష్టరక్షణ నిమిత్తం అని మనం గ్రహించాలి.

సర్వోపనిషదోగావో దోగ్ధాగోపాల
నందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతా
మృతం మహత్.

సమస్త ఉపనిషత్తులూ గోవులు. పాలు పిదుకువాడే గోపాలుడు. గోవత్సమే పార్థుడు. గీతామృతమే క్షీరము. వివేకవంతు లందరూ భోక్తలు అని నట్లుగా సజ్జనులకూ, పుణ్యాత్ములకూ ఆనందం కలిగించే నిమిత్తం భగవానుడు లీలారూపాన్ని ధరించాడు.

"సూరస్యామ సురభీ దుహి సంతన
సుఖ దాయీ."

భగవానుడు భక్తులకు ఆనందం కలిగించే నిమిత్తమే గోకులంలో అవతరించి గోవుల పొదుగుల్లో నుంచి అమృతాన్ని పిండాడట.

అవును మరి! సమస్త "సూరసాగరం" కృష్ణ లీలామృతధారలతో నిండి మధురాతి మధురమై పరమ పవిత్రమై భక్తమానసాలను ఆనందపరవశం చేసిం దనటంలో ఎట్టి అతిశయోక్తి లేదు.

సి.వి.ఎస్. అన్నపూర్ణేశ్వరి 'శ్రీవల్లి'

---

(4 వ పేజి తరువాయి)

కాని మన ముందడుగులో పరుగులో మనకు తెలియకుండా పొగొట్టుకొన్నది ఒకటుంది. మన దేశంలో మనపాలనలోనే, మనదైవ తత్త్వాన్ని జాతివిధానాన్ని ప్రచారంచేసుకో లేనంతగా గిరి గీచుకొని క్రమంగా స్పృహనే కోల్పోతున్నది. అహరహం ఐహిక సుఖాలను అనుభవించే పశ్చిమ బుద్ధులు భారతీయ విజ్ఞాన భాస్కరారాధనలో మునిగి తేల్తుంటే మనకిది పెరటియందై చైతన్యం కావాలని సూర్యాస్తమయం చూస్తున్నాం. భారతీయు డనిపించు కోవటానికి భయం. హిందువునని చెప్పుకోవటం హీనం అనే స్థితికి వచ్చాం. ఇచ్చకాలకు మెఱమెచ్చులకు మోసపోయి సంప్రదాయాలను సమీక్షించకుండానే సమాధి కడుతున్నాం. మనతాడు పాము సిద్ధాంతం మంచిని చెడని భ్రమింపజేస్తున్నది. ఫలితం మనం మనం కాకుండా పోతున్నాం. మన మనస్సే మనది కాకుండా పోతున్నది.

ఈ అలసత్వం నుండి అశక్తతనుండి బయటపడి మన మెవరో చెప్పుకోగల్గిననాడు నిజంగా సర్వదా స్వాతంత్ర్యం సిద్ధించినట్లు, జాతి తన పురోగమనంలో మరొక మెట్టెక్కినట్లు సర్వమత సమాదరణమంటే స్వమత నిరాకరణమని మాత్రం అర్థం కారాదు. అంతే. భర్తృహరి చెప్పనే చెప్పాడు,

"సుప్తం ప్రమత్తం విషమస్థితం వా
రక్షన్తి పుణ్యాని పురాకృతాని" అని

కాలక్రమాన తాతల నేతులు చెప్పుకొంటున్న మనకు మొదటి మూడూ సిద్ధించినై. ఇక వాగ్గోదే శరణ్యం.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.




# తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక





ఆగష్టు 1984

వెల : 1-00

'నీవు మునుకొని బ్రహ్మాండముల
నీనినావు
కనుక నీ కడుపతి ఘనముగా నుండు
అటుగాన భక్ష్య భోజ్యాదు లెన్నైనన
పటు తీవ్రముగ నీవు భక్షింపగలవు.'

కావున నీవు కోరినవన్నీ వడ్డిస్తాను, తిన వమ్మా!" — అని పల్కింది. దానికి బదులేమివ్వాలో పార్వతికి తోచలేదు.

'అత్తగారూ! పాలు త్రాగడం కూడా చేతగాని పసిబిడ్డ అని కూతురును వెనకేసుకొని మాట్లాడుతున్నారా! నిజంగా మీ అమ్మాయి బాలికయే అయినచో భర్త కొరకు తపమెట్లు చేసింది? మా అన్న నెలా వలచింది? అమ్మో! మీ కూతురు పసిబిడ్డా! కాదు అసాధ్యురాలు. బహుసూత్రధారి. మహా సాత్త్వికులకు సైతం గర్వము పుట్టించ గలదు. కపటంబుతో కాలగతుల భావించ గలదు. పేదలను ధనవంతులుగను. ధన మదాంధులను ధనహీనులుగను మార్చ గలదు. ఎల్లజాతులను చపలుర గావించ గలదు.' — అని ఇక్కడ పార్వతీదేవిచేత వెంగమాంబ ఇందిరను నిందాస్తుతి గావించి లోకమాతగా లోకానికి తెలియజేసింది.

ఆంధ్రవాఙ్మయంలో బువ్వము బంతిని ఇంత సుదీర్ఘంగా వర్ణించినది శ్రీనాథుని తరువాత వేంగమాంబయే అని చెప్ప వచ్చును. శ్రీనాథుని బువ్వము బంతి రసిక జన కలాపము కాగా వెంగమాంబ బువ్వము బంతి సరసవచోవిలాసము.

ఆ విధంగా హరిహరులు, రమాగిరిజలు మేలము లాడుకొను చుండగా సాగరుడు నవ్వుచూ వచ్చి "మీరు బలవంతులు. ఆనంద భరితులు. ఒక్కరొక్కరికన్న ఉత్తమోత్తములు. మీకు భేదములేదు. ఓ జలజాక్షా! సమస్తలోకాలూ నీ చిన్ని బొజ్జలో శ్రీరామ రక్షగా వున్నవయ్యా. నీ ఆకలి తీర్చుటకు నే నెంతవాణ్ణి. నా కల్గినయంతమాత్రమున సత్కరించుచున్నానని, లోకసహజంగా ఆడపిల్ల తండ్రిగా పల్కినాడు.

జలజాసనాదులు ఆ జలరాశి మాటలకలరి, ముదమంది తృప్తిగా భుజించి లేచి కరప్రక్షాళనములు గావించినారు. అందరికినీ విడెము లిప్పించినాడు పెండ్లికొడుకు. అందరును ఇష్టకథావినోదముల సంతోషమగ్నులై యున్నారు. అటు ఇటు చూచాడు హరి. ఎవరూ చూడ్డంలేదనుకున్నాడు.

"శ్రీ వేంకటేశు డాశ్రిత జనావనుడు....
అంతనచ్చటనుండి హాటక కలశ
మెంతయు బ్రీతితో నెలమి నెత్తుకొని
వేత్తొక్క విడిదికి వేడ్కతో"..నరిగినాడా.

తానందరికీ తాంబూలా లిప్పించాడు. మరి? తన కిచ్చేవారు? రారు. వారు రావాలనుకున్నా ఆ చోటు చాటు కాదుకదా! అందుకే చటుకున అటనుండి విడిది కేగినాడు. ఊరికే వెళ్ళితే ఊహిస్తారనికాబోలు! కనక కలశాన్ని కైకొని కదిలాడు. ఇదంతా కాంత కోసం కాంతుని వలవంత అని పసికట్టినారు సాగరాంగనలు. ఇందిరను ముందరిడుకొని వచ్చి వివరించి విడిదిలోనికి పంపించి సర్వోపచారాలూ చేయించారు. కాంక్షతీరింది కన్నయ్యకు, కప్పురపు విడెము కరకరా నములుతున్నాడు. అందరి వదలి, శేషహోమము విడిచి ఎందు కిలా వచ్చాడో అర్థం కాలేదు అమ్మవారికి.

"జలజాతనయన నాస్వామి యిచ్చటికి
యలసివచ్చిన దేమి యానతీవోయి!"

అని అడిగింది.

"మజ్జనకు నివ్వేసాలచేత
నళికింప దలచి నే డలిగి వచ్చితివా'
'చెల్లెలౌ పార్వతి కచట
అన్నంబుసాల కిట్లలిగివచ్చితివా'

"తిరుపణాచార్యైన దెప్పింతు ననిన
హరుని వాక్యముల కిట్లలిగి వచ్చితివా"
'పేదవారింటిలో పెండ్లి యాడితివని
యాదాయ మేమని యలిగి వచ్చితివా'

"పెండ్లికి దీసిన అప్పెట్లుదీర్తునని
విచారమునని ట్లలిగి వచ్చితివా"

(37 వ పేజీలో)



**తిరువీథుల** మెఱసీ దేవదేవుఁడు
గరిమల మించిన సింగారములతోడను.

తిరుదండెలపై నేఁగీ దేవుఁడిదే తొలునాఁడు
సిరుల రెండవనాఁడు శేషుని మీఁద
మురిపెన మూఁడోనాడు ముత్యాలపందిరి క్రింద
పొరి నాలుఁగోనాఁడు పువ్వుఁగోవిలలోను.

గ్రక్కున నైదవనాఁడు గరుఁడునిమీఁద
యెక్కెను ఆరవనాఁడు యేనుఁగుమీఁద
చొక్కమై యేడవనాఁడు సూర్యప్రభలోనను
యిక్కువఁ దేరును గుఱ్ఱ మెనిమిదోనాఁడు.

కనకపుటందలము కదిసి తొమ్మిదోనాఁడు
పెనచి పదోనాఁడు పెండ్లిపీట
యెనసి శ్రీ వెంకటేశుఁ డింత యలమేల్మంగతో
వనితల నడుమను వాహనాలమీఁదను.

(తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాల సందర్భంగా
అన్నమాచార్య సంకీర్తన.)



# మీమాట

## సూచనలు

సప్తగిరి సకాలంలో అందజేయడం, ముఖచిత్రంపై వ్యాఖ్య, 'ఓం' స్టిక్కరును సప్తగిరితో జతచేయడం, ప్రతినెలా పంచాంగం, ప్రతినెలా ఆ నెలలో వచ్చే పండుగలకు సంబంధించిన వ్యాసాలను ప్రచురించడం, సప్తగిరి పేజీలను పెంచడం, తిరుమల యాత్రికుల నిమిత్తం దేవస్థానంవారి వివిధ సేవాపథకాలను వివరించడం, దేశము అన్ని చోట్ల నుంచి ప్రయాణ సౌకర్యాలను తెలియజేయడం ద్వారా 'సప్తగిరి' మరింత జనాదరణ పొందగలదని నా సూచన. తప్పక అమలువరుస్తారని ప్రార్థన.

కొవ్వూరి విజయకుమార్ — విజ్ఞానపల్లి

## స్వర్ణోత్సవాలు

మే సంచికలోని తి.తి.దే. స్వర్ణోత్సవాల వివరాలు చిత్రాలు చాల బాగున్నాయి. చూడకపోతిమే అన్న బాధ తొలగింది. వివరంగా వ్రాసిన నాగరాజ్ గారికి మా అభినందనాలు.

పేర్ల గోపాలకృష్ణా సుబ్బారావు — నూజివీడు

## పంచరంగుల్లో

'సప్తగిరి' పత్రికలోని చిత్రాలను పంచ రంగులలో ముద్రిస్తే మరింత ముచ్చటగా ఉంటుంది. మొదటి పుటలో ప్రచురిస్తున్న అన్నమయ్య కీర్తనకు రాగము, తాళము, భావము విశేషాంశములు పొందుపరిస్తే మరింత రమణీయంగా వుంటుంది. స్వామి వారి సుప్రభాత శ్లోకాలు వానికి సంబంధించిన రంగులలో చిత్రిస్తే బాగుంటుంది.

బి. శ్రీనివాసాచార్యులు — కర్నూలు

పి. కామేశ్వరశర్మ — హైదరాబాదు

## రాశిఫలాలు

వేదాంగములలో జ్యోతిశ్శాస్త్రము ఒకటి. కనుక ప్రతిమాసంలోను 'రాశిఫలాలు' శీర్షిక ప్రారంభం చేసి ప్రచురిస్తే చాల బాగుంటుంది. ఈ సూచనను పాటింపగలరని ప్రార్థన.

వేపా భీమనాథశాస్త్రి — మచిలీపట్టణం

## ముఖచిత్రం

జూలై నెల సప్తగిరి సర్వదేవతాస్వరూపుడైన శ్రీ వేంకటేశ్వరుని చూడగానే నమస్కరించాలన్న భక్తిభావం కలుగుచున్నది. బాలప్రబోధం, గృహలక్ష్మికూడ చాలా బాగున్నవి.

నందిగామ చిన్నాదేవి — ఒంగోలు

నందనవనం అనసూయమ్మ — విజయవాడ

## భగవద్గీత

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారి భగవద్గీత వ్యాఖ్యానం బాగుంది. ఇలాగే భాగవతం, భారతం, రామాయణాది విషయాలను సంక్షిప్తంగా అయినా సీరియల్స్‌గా వేస్తే చాలా బాగుంటుంది. సప్తగిరి ముఖచిత్రాలు, స్వామివారి అలంకరణలు, స్వామివారి చిత్రాలు అయితే బాగుంటుంది. జూన్, జూలై పత్రికల ముఖచిత్రాలు ఏవో ప్రచురింపబడినవి. పత్రికలో దేవస్థాన విశేషాలకు కూడ ప్రాధాన్యము ఇవ్వదగునేమో కదా!

అవ్వారి వేంకటకృష్ణయ్య — తాడికొండ

భగవద్గీత శ్లోకములను వ్యాఖ్యానముతో ప్రచురిస్తే బాగుంటుంది. భక్తుల కథలు కూడ ప్రచురించవలసింది (ముఖ్యంగా అన్నమాచార్యుల జీవితగాథ).

రామాయణం జయచంద్రరాజు — రాయచోటి

## తిలకధారణ

'తిలకధారణ' అనాగరికతగా భావించే నేటివారికి 'తిలకధారణం' హృద్వికాసాన్ని కలిగిస్తుంది. తిలకధారణం ఆరోగ్యచిహ్నమే గాక, ఆకర్షణకు మొదటి కారణంకూడా అవుతుంది. శ్రీ కె. లింగమూర్తికి అభివందనములు. జూలై సప్తగిరి ముఖచిత్రం మా హృదయాలను ఎంతో అలరించింది. సర్వాంగ సుందరంగా చిత్రించిన చిత్రకారుడు శ్రీ ఎస్. సత్యనారాయణగారికి కృతజ్ఞతలు.

మల్లాది సుమిత్రాకృష్ణ — విజయవాడ

## గ్రంథప్రచురణలు

స్వర్ణోత్సవాల సందర్భంగా దేవస్థానం 50 గ్రంథాలను ప్రచురించిందని మే, 84 సప్తగిరిలో తెలియచేసినారు. ఈ పుస్తకముల వివరములను క్లుప్తంగాగాని, సమీక్షగాగాని సప్తగిరిలో ప్రచురించి, పాఠకులకు అందించ ప్రార్థన.

వి. రాఘవేంద్రరావు — తిరుపతి

## ముఖాముఖి

'సప్తగిరితో ముఖాముఖి' అనే శీర్షిక ప్రారంభించి పాఠకుల ఆధ్యాత్మిక జ్ఞానాభివృద్ధికి తోడ్పడవలసిందని నా మనవి. జూలై నెల సప్తగిరి వర్ణ ముఖచిత్రం ఆధ్యాత్మికంగాను, చూచుటకు చాలా ఇంపుగాను ఉన్నది. బాలప్రబోధంలో కర్మఫలం అను కథ చాలా బాగుంది.

కె. అన్నపూర్ణ — బైరెడ్డిపల్లె

## ఆలస్యం

చాలాకాలంనుంచి సప్తగిరి పత్రికను చదివి ఆనందిస్తున్నాను. ప్రస్తుతం చాలా ఆలస్యంగా వస్తున్నది. కనుక సకాలంలో అందించే ఏర్పాటుచేయాలని నా సూచన.

ఎమ్. వి. శేషాచారి — గుంటూరు

## పురాణ ప్రబోధ పరీక్షలు - జనవరి 1985

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధర్మరక్షణ సంస్థ ఆధ్వర్యంలో ఆరవ పురాణ ప్రబోధ పరీక్షలు 1985 సం॥ జనవరి 27వ తేది ఆదివారం జరుగనున్నాయి. ఆంధ్రప్రదేశ్ లోని ఉన్నత పాఠశాలలోని విద్యార్థినీ విద్యార్థులు వీటిలో పాల్గొనవచ్చును. అభ్యర్థులు తమ దరఖాస్తులను తే. 31-10-1984 లోగా తమ పాఠశాల ప్రధానోపాధ్యాయుల ద్వారా పంపవలసియుంటుంది. ఉత్తీర్ణులయిన విద్యార్థులకు యోగ్యతాపత్రాలు, రజతపతకాలు మరియు ప్రత్యేక నగదు బహుమతులు వుంటవి. ఇతర వివరములకు "స్పెషల్ ఆఫీసర్, పురాణ ప్రబోధ పరీక్షా విభాగము, హిందూ ధర్మరక్షణ సంస్థ, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి - 517501" అనే చిరునామాకు వ్రాసి తెలుసుకొనవచ్చును!




కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
* తిరుపతి *




గౌరవసంపాదకులు :
శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఏ.

*

ముద్రాపకుడు :
ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00
సం॥ చందా - రు. 12-00

*

ప్రతులకు :
వెల్ ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

సెప్టెంబర్ 1984
సంపుటి 15 సంచిక 4



ముఖచిత్రం: తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవ సందర్భంగా రథోత్సవం. 4 వ కవరుపేజి : గరుడవాహనముపై శ్రీవారు.
2 వ కవరుపేజి: పెద్దశేషవాహనముపై శ్రీవారు. 3 వ కవరుపేజి : సూర్యప్రభవాహనముపై శ్రీవారు.

# సంపాదకీయం

ఆపదలో వున్నాం, ఆరాటపడుతున్నాం లేదా పోరాడుతున్నాం. అడ్డుపడి ఆదుకున్నాడనో చేయిచ్చి చేదుకున్నాడనో, మన మద్ధరించ వచ్చిన దేవుడనీ నరరూప నారాయణుడనీ భావిస్తాం, సంభావిస్తాం. వీలైతే మన చర్మంతో చెప్పులు కుట్టిద్దామనుకొంటాం. ఆ ఆత్మీయతలోని ఆంతర్యం అలాంటిది. ఆ కృతజ్ఞతలోని విజ్ఞత అలాంటిది.

సమాజానికి కూడా అలాంటి ఆపదలు, ఆరాటపోరాటాలు ఏర్పడుతుంటాయి. తులువలు పలువలు చిలవలు పలవలుగా తయారై తమతమ ఆగడాలతో సమాజానికి ప్రమాదం కల్గిస్తుంటారు. అత్యాచారులు కొందరైతే, ఆతతాయిలు, అపమార్గ ప్రవర్తకులు మరికొందరు. చేతి కందినవి సముద్రంలో దాచుకొనేవారు కొందరైతే, నా కన్న దేవు డెవడని దండించేవాళ్లు కొందరు. అతిబల సంప న్నుల మని అందినది పుచ్చుకొని అదేమంటే దిక్కున్నచోట చెప్పుకోమని ధిక్కరించేవాళ్ళు కొందరు. ఇలా ఇలా పాపాలు పండగా ఒకానొక మహిమాన్వితుడు మనముందో మనసుండో అవతరించి యథారూపంగా ఆగడాలను అరికట్టి మళ్ళీ సమాజంలో మానవత్వపు మధువు వర్షించి, జీవసమతా సస్యాలను పండిస్తాడు. అందుకే అవతారాలన్నీ దండనావతారాలు కా నక్కరలేదు.

మహావిష్ణువుకున్న అనేక అవతారాలలో కపిల ఋషభ సుయజ్ఞావతారాలు కేవలం సాత్త్వికము. జ్ఞానబోధాత్మక మైనవి. వామనావతారం కూడా అలాంటిదే. ఇంతవరకు అంతుతేలని బుద్ధ కల్క్యవతారాలు వదిలితే మిగిలినవన్నీ దుష్టశిక్షణ, శిష్టరక్షణ ధర్మ సంస్థాపనలు ధ్యేయంగా గలవే. ప్రతి అవతారాన్ని మనం విశ్లేషించ గలిగితే, చేదుకోగల్గినవారిని చేదుకున్నంతగా చేరువైన శాశ్వత వైజ్ఞానిక లౌకిక సత్యా లెన్నో పారమార్థికపు పరదాల నుంచి తొంగిచూస్తుంటాయి.

అవతారాల విషయంలో మహావిష్ణువుకు మహామాయకు దగ్గర సంబంధం కన్పిస్తుంది. ఇద్దరికిని అనంతావతారాలున్నా అవతారదశకమే ఇద్దరి విషయంలో ప్రసిద్ధి పొందింది, జనసామాన్యాని కందింది.

చతుర్భుజుడైన నారాయణుడు చతుర్భుజియైన నారాయణికీ ఆదిత్యమండలాంతర సంస్థాపనం పూజనం నిర్దిష్టాలయ్యాయి. నారాయణుణ్ణి మధుకైటభారి అన్నట్లుగానే నారాయణికి కూడా మధుకైటభ ప్రశమని అని పేరుంది.

అన్నిటికన్న విచిత్రమైనది వరాహావతారం. మహావిష్ణువు శ్వేతవరాహరూపంలో హిరణ్యాక్షుణ్ణి చంపి భూమి మద్ధరించి, భూవరాహమూర్తి అయినట్లు తెలుసు. దేవీ అవతారాలలో వారాహి ఒకటి. ఆమె కూడా ఈ అవతారంలో భూమి మద్ధరించినట్లు దేవీభాగవతంలో వుంది. స్వామి నరసింహావతారము ధరిస్తే, మంత్రశాస్త్రంలో దేవికి సింహముఖిగా ఒక అవతారం వుంది. కల్క్యవ తారంలో విష్ణువు అశ్వవాహనుడైతే దేవికికూడా నీలాశ్వం వున్నట్లు శాస్త్రంలో ఉంది.

అసలు నారాయణుని లీలలను వర్ణించేది శ్రీమద్భాగవతం. దేవ్యవతార చరిత్రను వర్ణించేది కూడా భాగవతం పేరుతోటే వుండటం కాకతాళీయం కాదేమో.

అంతెందుకు, ఈ శేషగిరి కొమ్మున ఉన్నది కోకలెత్తుకు వెళ్ళిన కోనేటిరాయడని, కాదు కొండలరాయని కూతురని, ఇవేవీ కావనీ మనలో మనం గుద్దులాడు కొంటున్నా సాధారణంగా ఈ స్వామి బ్రహ్మోత్సవం, ఆ దేవి దశరాత్రం కలసి వస్తూ మనలను కరుణిస్తున్నాయి. మనం తరిస్తున్నాం తాత్కాలికంగా.

సూర్యుడొక్కడే — చుక్కగా ఒకచోట, చక్రంగా మరొక్కచోట అంతే. వివాదంగా అనుకోవటాలు అజ్ఞానంవల్ల. అది అలా అలా సాగిపోతుంది.

ఏకం సత్ విప్రా బహుధా వదంతి.

కృతే తు నారసింహశ్చ
త్రేతాయాం రఘునందనః।
ద్వాపరే వాసుదేవశ్చ
కలౌ వేంకటనాయకః॥

# సంభవామి యుగే యుగే!

ఈ శ్లోకం చాలా పురాతనమైనది. ఎవరి చేత ప్రసాదించబడినదో తెలియకపోయినా చాలా విశిష్టమైన శ్లోకం. కృత, త్రేతా, ద్వాపర కలియుగాలలో శ్రీమన్నారాయణుడి అవతార ప్రాశస్త్యాన్ని వివరిస్తుంది. "సంభవామి యుగే యుగే" అనే గీతాచార్యుడి-భగవానుడి వాగ్దానానికి అద్దం పడుతున్నది.

## కృతే తు నారసింహశ్చ :

కృతయుగంలో ఒక నారసింహుడి అవతారమే ఆవిర్భవించలేదు. వేదాలను ఉద్ధరించటానికి మీనావతారం, మందరగిరిని వరగర్వితుడైన హిరణ్యకశిపుడిని అంతం చేయటానికి నరసింహరూపంలో ఏ ఆయుధం లేకుండా నిర్జీవ, సజీవాలుగా వ్యవహరించే నఖాలతో, దివారాత్రాలు కాకుండా అసురసంధ్యలో, ఇంట్లో బయట కాకుండా గడపమీద- అతడి చావును సిద్ధం చేశాడు. అంతేకాకుండా "హరి సర్వాంతర్యామి" అనే ప్రహ్లాదుడి వాక్యం నిజం చేయటానికి సర్వే, సర్వత్రా వ్యాపించాడు. అన్నిటా వ్యాపించి అన్నీ తనలో లీనం



సముద్రగర్భంలో మునగకుండా ఉండేందుకు కూర్మావతారం, భూమిని చాపగా చుట్టి సముద్రంలో దాచిన హిరణ్యాక్షుడిని అంతం చేయటానికి వరాహావతారం, బాల ప్రహ్లాదుడిని బ్రోచి హిరణ్యకశిపుడిని సంహరించటానికి నరసింహావతారం, బలి చక్రవర్తిని అణచటానికి వామనావతారం శ్రీమన్నారాయణుడు రూపుదాల్చినప్పటికీ నరసింహావతారానికి ఒక విశిష్టత ఉంది. బ్రహ్మగురించి తపస్సు చేసి వరాలు పొంది చేసుకునే శక్తి శ్రీ మన్నారాయణుడికి మాత్రమే ఉంది. ఓ నటుడికైతే కేవలం ఓ స్తంభంలోనే దాక్కునే శక్తి వుంటుందని హరికథల్లో హరిదాసులు చమత్కరిస్తూ వుంటారు. అందువల్లనే "కృతే తు నారసింహశ్చ" అనే విశేషణం శ్రీ మన్నారాయణుడి అవతారమూర్తికి చెప్పారు.

## త్రేతాయాం రఘునందనః

త్రేతాయుగంలో పరశురామావతారం ఉన్నప్పటికీ పరిపూర్ణత లేదు. అందుకు కారణమేమిటంటే నారాయణాంశ మాత్రమే పరశురామావతారంలో వుంది. శ్రీరాముడిలో పరిపూర్ణమైన నారాయణ మూర్తిత్వముంది. అంతేకాకుండా శ్రీరాముడిగా అవతరించిన నారాయణుడు దుష్టశిక్షణతో బాటు, శిష్ట, ధర్మరక్షణ, ప్రబోధం చేయటమే కాకుండా ఆ యా ధర్మాలను తాను, స్వయంగా ఆచరించి చూపాడు. అందుకే ఆదికవి విరచితమైన రామాయణం వేదంతో సమానమైనది. వేదాలయొక్క ఆత్మ రామాయణ మనే శరీరంలో ప్రతిబింబిస్తుంది. మరో విశిష్టత ఏమిటంటే- వర్ణాశ్రమ, జాతి విచక్షణ లేకుండా చేతనకోటికంతటికీ మోక్షాన్ని ప్రసాదించాడు శ్రీరాముడు. శ్రీ మద్రామాయణంలో శరణాగతి తత్త్వం కూడా సుబోధకంగా అనుగ్రహించబడింది.

## ద్వాపరే వాసుదేవశ్చ :

ద్వాపరయుగంలో వసుదేవసుతుడి కంటే అగ్రజుడైన బలరాముడిలో శేషాంశ



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏభై శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల రూ. 650/- అవుతుందికనుక టి. టి. డి. కార్య నిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ఉన్నప్పటికీ కొంతమంది నారాయణుడి అవతారంగానే పరిగణిస్తారు. శ్రీకృష్ణుడి జననం ఒకచోట, బాల్యం ఒకచోట. జరిగింది. బాల్యక్రీడల ద్వారా వ్రేపల్లెకి వినోదం కలిగించాడు. తన భగవత్స్వరూపాన్ని యశోదకీ, తదితరులకీ అనుగ్రహించాడు. శ్రీకృష్ణుడి విశ్వరూపాన్ని దేవకీ వసుదేవులు, యశోద, భీష్మ, ధృతరాష్ట్రాదులు, అర్జునుడు సందర్శించి తమ జన్మలను సార్థకం చేసుకున్నారు. శ్రీకృష్ణుడి గీతార్థసారాన్ని అర్జునుడికి ప్రసాదించటమే కాకుండ సకల మానవాళికి జ్ఞానోదయం కలిగించాడు. ఆ విధంగా దుష్టసంహారం, పరమాత్మ స్వరూపం, భక్తితత్త్వం, ఆర్తత్రాణపరాయణత్వం ఈ అవతారంలో నిబిడీకృతమై వుంది.

### కలౌ వేంకటనాయకః :

దశావతార క్రమంలో నారాయణుడి అవతారం కలియుగంలో కల్కి అవతారం. కానీ కలియుగానికి నాయకుడు శ్రీ వేంకటేశ్వరుడు. పాపాలను పరిహరించే వాడు వారివారి ఆపద మొక్కులను తీర్చే పరమ దయాళువు. తన ప్రతిఫలాన్ని భక్తుల నుండి ఆశించటంలో కూడా గడుసరి. కుబేరుడి డబ్బుతో పెళ్లిచేసుకుని తిరుపతిలో వుండి ఎంతోమందిని తరింప చేసే శ్రీనివాసుడు. ఋషులందరూ యాగం చేస్తున్నపుడు హవిర్భాగాన్ని ఎవరికి ఇవ్వాలనే సమస్య ఉత్పన్నమైంది. నారదుడు ఆదేశించిన విధంగా "పరమ సాత్త్వికుడైన వ్యక్తిని" వెదకటానికి భృగుమహర్షిని పంపించారు. భృగుమహర్షి పరిశీలనలో సత్త్వగుణసంపన్నుడిగా శ్రీమన్నారాయణుడు నిలిచాడు. తన వక్షస్థలాన్ని భృగువు పాదంతో తాడనం చేసినందువల్ల నారాయణుడు ఆయన పాదసేవనంచేస్తూ "పాదంలో వున్న "గర్వనేత్రాన్ని" అణచివేసి లక్ష్మీదేవి అలకకు కారణ మయ్యాడు. లక్ష్మీదేవి వైకుంఠాన్ని వీడాక నారాయణుడు సిరి లేని శ్రీనివాసుడై వైకుంఠాన్ని విడి, పద్మావతిని పెళ్లాడి మళ్లీ సిరిని పొంది శ్రీనివాసుడై భక్తసులభుడనే బిరుదును సంపాదించుకుని, కలియుగంలో పండిత, పామరులకు ఆరాధ్యదైవ మయ్యాడు.

ఈ నాలుగు విశిష్టావతారాలను ఒకేచోట పొందుపరచి చెప్పిన శ్లోకంలో "అజ్ఞాతకవి" భావం ఇదికూడా కాబోలు! శ్రీమన్నారాయణుడి వెంట లక్ష్మీదేవి కూడా ఉండటం, భక్తసులభుడైన నారాయణుడు నారసింహ, రామ, కృష్ణ, వేంకటేశ్వరాది అర్చావతార రూపంలో సకల చేతనా వ్యవహారాన్ని పునీతం చేస్తున్నాడు.

శ్రీ వాదిభీకరగురు కృతమైన "శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం" లో దశావతార వర్ణన శ్లోకం ఎంతో భావగర్భితంగా వుంది.

మీనాకృతే కమఠకోల నృసింహ వర్ణిన్
స్వామిన్ పరశ్వథ తపోధన రామచంద్ర,
శేషాంశరామ యదునందన కల్కిరూప
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్.

కలియుగంలో "నిత్యకల్యాణం పచ్చతోరణంగా" నిత్యవైభవంగా, జగదేక సౌందర్య తేజంతో తిరుమలపై వేంచేసి వున్న శ్రీ వేంకటేశ్వరుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే, ఆ శ్రీమన్నారాయణుడిని శరణాగతి చేస్తే సకల మానవులు పునీతులై తరిస్తారు. జన్మరాహిత్యాన్ని పొందుతారు.

— శ్రీ కె. రఘుపతి



# శ్రీ శఠకోపుల అనుభవములు

శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన నాలుగు వేదముల సారములగు నాలుగు దివ్య ప్రబంధములలో,సామవేద సారమగు "తిరువాయ్ మొళి" యందుగల వేయిపాశురము లను పది, పదులు అందురు. పది లేక పత్తు అనగా నూరు పాశురములని సంజ్ఞ.

అందు మొదటి పదిలో (అనగా మొదటి నూరుపాశురములలో- ఇట్లే అన్నియును తెలిసికొనవలెను), "అడితొజుతు ఎజు" (పాదముల సేవించి ఉజ్జీవింపుమా) యనుటచే భగవత్కైంకర్యమే పురుషార్థమని తెలియబఱచిరి. రెండవ పత్తులో "తనక్కే యాక ఎనై క్కొళ్ళుమ్" (తనకొఱకే నన్ను స్వీకరింపవలయును) అనుటచే ఆ కైంకర్యమునందలి కలుపును (అనగా అహంకార, మమకారములను) పోగొట్టవలయు ననిరి. మూడవ పదిలో "వయిలుమ్ శుడ రొళి" అను తిరువాయ్‌మొళి (పది పాశురముల) చే భగవత్కైంకర్యమునకు విరోధి (కలుపు) యగు అహంకార మమకారములు నశించిన వేషము (లక్షణము) భాగవత శేషత్వముతో కూడుకొనిన భగవత్కైంకర్య మనిరి. నాల్గవ పత్తులో "ఒరు నాయికమ్" అను పది పాశురములలో కైంకర్యమునకు విరోధి ఐశ్వర్య, కైవల్యము లనిరి. ఐదవ పత్తులో "కళై కణ్ మత్తిలేన్" (రక్షకము వేరొకటి (లేనివాడను) అనుటచే యా విరోధులను పోగొట్టువాడును సర్వేశ్వరుడే యనిరి. ఆరవ పత్తులో "అడిక్కీ-జ్ అమర్న్దు పుగున్దేనే" (శ్రీపాదములక్రింద అమరికతో ప్రవేశించితిని) యనుటచే విరోధులను పోగొట్టు స్వభావము గలవాని శ్రీపాదములయందు శరణాగతి నొనర్చిరి. ఏడవ పత్తులో "ఉణ్ణిలావి" యను తిరువాయ్‌మొజిచే శ్రీమహాలక్ష్మి పురుషకారముతో శరణాగతి యొనర్చినను, దగ్ధపటన్యాయము (కాలినబట్ట ఉపయోగపడ కున్నను పడుగు పేక చెడకుండ వస్త్రాకారమున నుండుటచే దానిని చూచినపు డెల్లదుఃఖింప దగియుండునట్లు) వలె, సంసారము వెంబడించు విధమును దలచి దుఃఖించిరి. ఎనిమిదవ పత్తులో "నజ్గళ్ వరివళై" యను తిరువాయ్‌మొజిచే నిట్లు ప్రసన్నులై యున్నను "నన్ను విడువక ఈ సంసార మనువర్తించుటకు హేతువు నాయొక్క ఆత్మాత్మీయములయందు నాకు ఆశ నశింపక పోవుటచేతనే కదా! యని చూచి వానియందు నా కెట్టి ఆశయును లే" దనిరి. తొమ్మిదవ పత్తులో ఇట్లు ఆశ నశించినను రక్షించ డేమి? యని యాళ్వార్లు సంశయింప, నందులకు సర్వేశ్వరుడు "నేను నారాయణుడను, సర్వ శక్తియుక్తుడను, మీ సర్వాపేక్షితములను పూర్తి యొనర్తును" అని యనుగ్రహింప, వాని శీలగుణము నందు సక్తులగుటను "మాలై నణ్ణి" యను తిరువాయ్‌మొజియందు తెలియబఱచిరి. పదియవ పత్తులో ఆళ్వార్ల త్వరాతిశయమును జూచి సర్వేశ్వరుడు "తిరుమోగూరు" నందు వేటగాడు మృగమునకై పొంచియుండునట్లు పొంచియుండి, ఆళ్వార్లకు అర్చిరాది మార్గమును జూపి వీరి యపేక్షితమును ఉపశమింపజేసిన రీతిని "ఎన్న వావఱ చ్చూ జ్న్దాయే" (నా ఆర్త్యతిశయము నశించునట్లు నన్ను చుట్టుకొంటివి) యనుటచేత తెల్పిరి.

ఇట్లు ఆళ్వార్లు "తిరువాయ్‌మొజి" దివ్య ప్రబన్ధమున అనుభవించిన సర్వేశ్వరానుభవము 34 దివ్య దేశములకు పరిమితమైనది. అందు మొదటి దివ్యదేశము శ్రీ వేంకటాచలము. శ్రీ వేంకటేశుని విషయమున మొదట 3వ వందలో 3వ తిరువాయ్ మొజి "ఒజివిల్ కాలమ్" నందును, తర్వాత 6వ వందలో 10వ తిరువాయ్ మొజి "ఉలకముణ్ణ పెరువాయా" యందును రెండుమార్లు మొత్తము ఇరువది పాశురములలో పూర్ణానుభవ మొనర్చిరి.

అందు ప్రస్తుతము "ఒజివిల్ కాలమ్" అను పది పాశురములలోని మొదటి పాశురమున నాళ్వార్ల శ్రీవేంకటేశుని యనుభవము నొక్కింత యిట ననుభవింతము.

**అవతారిక**

శ్రీ శఠకోపులు సర్వేశ్వరుని సమీపించి తమ సహజ దాస్య స్వరూపమును లభించగనే, యట్టి స్వరూపమునకు తగిన కైంకర్యమును లభింపవలయునని యీ తిరువాయ్‌మొజియందు యత్నించుచుండిరి.

ఆళ్వార్లు సర్వేశ్వరునకు సర్వేంద్రియములచేతను సర్వవిధ కైంకర్యములను జేయవలయునని యత్నింప, నీ యింద్రియములు ప్రాకృతములై, సంకోచత్వము గలవగుటచే వీలుపడక బాధపడిరి. సర్వేశ్వరుడును తన నెల్లరు ననుభవించుటకు తగినట్లుగ ననేక యుపాయముల యోజించి యవతారముల నెత్తియు, నంతరాత్మతను తెల్పియు నుపకరించినను వాని నన్నిటిని తప్పిన నేను యిక వానిని పొందుట యున్నదా? యని నిరాశతో నశింప యత్నింప; సర్వేశ్వరుడుజూచి, "ఆళ్వారే! యిటురండు! మేము మీ కోసమే కదా! తిరుమలయందు నిలువబడినది. మీరు పరమపదమున ననుభవించు స్థితిని యీ శరీరముతోనే యిచ్చటనే యనుభవించునట్లు వేంచేసియుంటిమి. ఇక మీ శరీరము మమ్మనుభవించుటకు విరోధి కాదు సుడీ! మీరు ఇంద్రియ సంకోచముచే బాధపడుచున్నవారలైనచో, అనాదిగ నింద్రియ

సంకోచములేని నిత్యసూరులును పరమ పదమున మమ్మనుభవించుట కిట్లే పొట్లు పడుచుండిరి సుమా! వారును వచ్చి యనుభవించునదిచ్చటనే (తిరుమల యందే) గాన; మీరును యీ శరీరముతోనే యిచ్చటనే యన్ని కైంకర్యములను జేయుడు" యని తిరుమలయందు నిలిచిన తన స్థితిని జూప సమాధానమొనర్ప ఆళ్వార్లు సమ్మతించినవారై "ధర్మి (పరమ పదనాథుడును, శ్రీ వేంకటేశ్వరుడును) యొక్కడే యగుటచేతను, విషయమంత టను నొకే విధముగ పూర్ణమై యుండుట చేతను పరమపదమున చేయదగిన సేవ లన్నియు నిచ్చటనే చేయుటకు శరీరమును విరోధములేక యుండుటచేతను పరమ పద మునకు పోయినను "సోఽశ్నుతే సర్వా న్కామాన్" (తై. ఉ. ఆ.) (ముక్త పురు షుడు సర్వేశ్వరుని సమస్త కల్యాణ గుణ ములను పొందుచున్నాడు) అన్నట్లు గుణానుభవమే గదా! చేయునది. ఆ శీలాది గుణములున్న స్పష్టమై యుండునదియు నిచ్చటనే యగుటచేతను, నిత్యసూరులును వచ్చి సేవించున దిచ్చటనే యగుటచేతను, "నేనున్నూ తిరుమలకు పోయి కైంకర్య మొనర్తు"నని నిశ్చయించి, ఆకలియుండి, చేతియందన్నమున్నవాడు, నీరును- నీడను చూచినచో తినుటకు యత్నించు నట్లు ఆళ్వార్లును కైంకర్యమొనర్ప యత్నించుచున్నారు. భగవత్సేవయందా సక్తిగలవారెల్లరకు నుండు యొకే లక్షణము, చేయబోవునది ముందుగనే యూహించుకొనుచు దిగుట. "అహం సర్వం కరిష్యామి" (నేనన్నియును చేయగలను) అని కదా! లక్ష్మణస్వామి విధము. భోజనమునందాసక్తి కలవారు ఊహాధ్యాయ(తినబోవు పదార్థములనెట్లెట్లు తినవలెనో యూహించుకొనుట) మొనర్చు నట్లున్నది యాళ్వార్ల కైంకర్య మనోరథ మును.

ఈ మొదటి పాశురమున శ్రీవేంకటేశ్వ రుని శ్రీపాదములయందు సర్వదేశ, సర్వ కాల, సర్వావస్థలయందును, సర్వవిధ కైంకర్యములను జేయవలెననిరి.

పాశురము:

"ఒழிవిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని
వழுవిలావడిమై శెయ్యవేణ్డుమ్ నామ్
తెழிకురలరువిత్తిరువేఙ్గడత్తు
ఎழிల్కొళ్ శోతి ఎన్దై తన్దై తన్దైక్కే॥"

తా॥ విచ్ఛేదములేని కాలమంతయు కూడి యుండి, సర్వవిధకైంకర్యములను జేయవలయును. గంభీరమగు ధ్వనిగల సెలయేళ్ళుగల వేంకటాచల మున మిక్కిలి ప్రకాశించు స్వామి, నాకును మా తండ్రికిని నా తాతకును సర్వశేషి.

వ్యాఖ్య:

(ఒழிవిల్ కాలమెల్లామ్) విచ్ఛేదము లేని అనంతమగు కాలమంతయును, ఆశ్రయించి లక్ష్మణస్వామి (ఉడనాయ్) రాజధానియందును వనవాసమునను కైంకర్యమొనర్చినట్లు, (మన్ని) స్థిరముగ నుండి సర్వేశ్వరుడును, పిరాట్టియు (అమ్మ వారును) తెరవేసికొని యున్నప్పుడును, తాంబూల (రసము ఉమ్మివేయు) పాత్రయు, దీపపు గుత్తియువలె దగ్గరగ నుండి అంతరంగమగు సేవలనున్ను జేయ వలెను. దీనిచేత సర్వావస్థలను తలుచు చున్నారు. [రమమాణా వనే త్రయః] (వనమున ముగ్గురును సంతసించిరి.) ఇద్దరి కుండదగిన యనుభవమున ముగ్గు రను తెల్పుచున్నదేమి? యనిన; ఆ యిరువురకును (సీతారాములకు) ఒకరితో నొకరికిగల కలయికచేత పుట్టునట్టి రసము, ఆ చేరికనుజూచి సంతసించు వానికిని (లక్ష్మణునకును) కల్గుటచేత.

(వழுవిలా అడిమై శెయ్య వేణ్డుమ్) కైంక ర్యమునందొక్కటియు నొక్కనికిని భాగము పంచియీయకుండ అన్ని కైంక ర్యములను నేనే చేయవలయును. లక్ష్మణ స్వామి యెడబాయక అడవికిన్ని పోయి చేసిన కైంకర్యములను చేయవలెను. శ్రీ భరతులవారు రాజధానిలో యెడబాసి యుండి చేసిన కైంకర్యములను చేయ వలయును. శ్రీభరతునితో కైకేయి, 'రాజా' అనగా, అప్పుడా స్వాతన్త్ర్యమును సహింపలేక మనసున మిక్కిలి వ్యసనపడి సభామధ్యముననే ("విలలాప" యన్నట్లు) మిక్కిలి దుఃఖించెనుగదా; పారతన్త్ర్య రసమెరిగినవారికి స్వాతన్త్ర్య మనర్థమని తోచునుగదా!

ఏభిశ్చ సచివైస్సార్థం శిరసా యాచితో మయా,
భ్రాతుశ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తుమర్హసి.
[రా. అ. 101-12.]

[ఏభిశ్చ సచివైస్సార్థం] మంత్రు లతో సహా. తన కన్నను దైన్యము నొందు వారెందరో కలరు గాన నట్టి వారందరను కూర్చుకొని పోయెను. తానొక్కడే వెళ్ళ కూడదా? యనిన తాను తమ్ముడగుటచే స్వాతంత్ర్యంచేత తిరిగి రాకుండ మనః క్లేశము కల్గించవచ్చును; కాని మంత్రులు, తామే కార్య నిర్ణయమొనర్చి "మీ రిట్లు చేయుడు" అని యాజ్ఞాపించిన యట్లు (రాముడు) చేయవలసి యుండుటచే వారలనూ వెంట నిడుకొని పోయెను. రాముని యెడబాటునందు భరతునకున్నట్టి ఆర్త్యతిశయమును ఒంటరిగా పోయి తెలియబఱచవచ్చును గదా? యనిన; తన యొక్కని ముఖమున కన్నీరు సహింపలేని వాడు, తన యెడబాటును సహింపలేక దుఃఖించువారనేకు లుండిరని చూచినచో మరలి రాడా యను నభిప్రాయముచేత యుద్ధమునకు పోవువారివలె, ఏనుగులను గుర్రములను అన్నిటిని వెంటబెట్టుకొని పోయినాడేమి? యనిన; వానికిని రామ విరహవ్యసన ముండుటచేత. (శిరసా యాచితః) నా లాభమునకు తానే యపే క్షించియిచ్చువాడు, నేను నా ప్రయత్నము చేత యాచించిన నిషేధించునా? (మయా) ఆతడొనర్చదగిన యాచన నే నొనర్చినచో చేయకయుండునా? (భ్రాతుః) మీకు లేకుండ నాకుండు సుఖమును అగ్ని కాల్చి వేయుగాక, యనిన వాని వెనుక పుట్టిన వాడనుగానా? ("యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద, భవే న్మమ సుఖం కించిద్భస్మసాత్కురుతాం శిఖీ" (రా. అ. 97-8)] నా తమ్ముల కుపయోగ పడని నా సుఖమును అగ్నికి విందుగా పెడు దును, అనినాడుగదా. [శిష్యస్య] సోదరు నిగా వంచుకొని కిరీటము ధరించి యుండు వాడనా? నేను. అశేష రహస్యములను

(44 వ పేజీలో)

## పదహారవ అధ్యాయం

### దైవాసుర సంపద్విభాగయోగం

శ్రీ భగవానువాచ:

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥
అహింసా సత్యమక్రోధః త్యాగశ్శాంతిరపైశునమ్।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥
తేజః క్షమా ధృతిశ్శౌచమ్ అద్రోహో నాతిమానితా।
భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత॥

శ్రీ భగవానుడు: అర్జునా! భయం లేకపోవడం, చిత్తశుద్ధి, జ్ఞానయోగనిష్ఠ, దానం, ఇంద్రియ నిగ్రహం, యజ్ఞం, వేదపఠనం, తపస్సు, సరళస్వభావం, అహింస, సత్యం, కోపం లేకపోవడం, త్యాగబుద్ధి, శాంతి, చాడీలు చెప్పకపోవడం, భూతదయ, విషయసుఖాలు వాంఛించకపోవడం, మృదుత్వం, సిగ్గు, చపలత్వం లేకపోవడం, తేజస్సు, ఓర్పు, ధైర్యం, శుచిత్వం, ద్రోహం, చేయకపోవడం, దురభిమానం లేకపోవడం — ఈ ఇరవై ఆరు సుగుణాలూ దేవతల సంపదవల్ల పుట్టినవాడికి కలుగుతాయి.

ద్వౌ భూతసర్గౌలోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు॥

అర్జునా! ఈ లోకంలో ప్రాణుల సృష్టి దైవమనీ, అసురమనీ రెండు రకాలు. దైవసంపద గురించి వివరంగా ఇదివరకే చెప్పాను. ఇక అసుర సంపద గురించి విను.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః।
న శౌచం నాపి చాఽఽచారో న సత్యం తేషు విద్యతే॥

అసుర స్వభావం కలిగినవాళ్లకు చేయదగ్గదేదో, చేయకూడనిదేదో తెలియదు. వాళ్లలో శుచిత్వం, సదాచారం, సత్యం కనుపించవు.

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్॥

ఈ జగత్తు అసత్యమనీ, ఆధారమూ అధిపతీ లేనిదనీ, కామవశంలో స్త్రీ పురుషుల కలయిక తప్ప సృష్టికి మరో కారణం లేదనీ వాళ్లు వాదిస్తారు.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥



# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత:

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్॥

పార్థా! రాక్షస సంపదలో పుట్టినవాడి లక్షణాలు ఇవి: కపటం, గర్వం, దురహంకారం, కోపం, కఠినత్వం, అవివేకం.

దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా।
మా శుచస్సంపదం దైవీం అభిజాతోఽసి పాండవ॥

దైవసంపద మూలంగా మోక్షమూ, అసుర సంపదవల్ల సంసార బంధమూ కలుగుతాయి. అర్జునా! నీవు దైవసంపదలోనే జన్మించావు. కనుక విచారించనక్కర లేదు.

అలాంటి నాస్తికులు - ఆత్మను కోల్పోయిన అల్పబుద్ధులు - ఘోరకృత్యాలుచేసే లోకకంటకులు, ప్రపంచ వినాశానికి పుడతారు.

కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః॥

వాళ్లు అంతూ దరీలేని కోరికలతో, ఆడంబరం, గర్వం, దురభిమానమనే దుర్గుణాలతో, అవివేకంవల్ల దుష్టభావాలతో దురాచారులై తిరుగుతారు.

చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః।
కామోపభోగపరమాః ఏతావదితి నిశ్చితాః॥

ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థమ్ అన్యాయే నార్థసంచయాన్॥

వాళ్లు మృతిచెందేవరకూ వుండే మితిలేని చింతలతో కామ భోగాలను అనుభవించడమే పరమావధిగా భావించి, అంతకు మించిం దేదీ లేదని నమ్ముతారు. ఎన్నో ఆశాపాశాలలో చిక్కుకుని కామక్రోధాలకు వశులై విషయ సుఖాలను అనుభవించడం కోసం అక్రమ ధనార్జనకు పూనుకుంటారు.

ఇద మద్య మయా లబ్ధం ఇమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥
అసౌ మయా హతశ్శత్రుః హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞానవిమోహితాః॥
అనేకచిత్తవిభ్రాన్తాః మోహజాల సమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥

ఈ వేళ నాకిది లభించింది. ఇక ఈ కోరిక నెరవేరుతుంది. నాకింత ఆస్తి వున్నది. మరింత సంపాదించబోతున్నాను. ఈ శత్రువును చంపేశాను. మిగిలిన శత్రువులను కూడ సంహరిస్తాను. నేను ప్రభువును, సుఖభోగిని, తలపెట్టినపని సాధించే సమర్థుణ్ణి, బలవంతుణ్ణి, సుఖవంతుణ్ణి, నేను డబ్బున్నవాణ్ణి. ఉన్నత వంశంలో ఉద్భవించాను. నాకు సాటి అయిన వాడెవడూలేడు. నేను యజ్ఞాలు చేస్తాను, దానాలిస్తాను, ఆనందం అనుభవిస్తాను, అని వాళ్లు అజ్ఞానంలో అనేకవిధాల కలవరిస్తారు. మోహవశులైన ఆ అసురస్వభావం కలిగినవాళ్లు నిరంతరం కామభోగాలలోనే చిక్కుకుని చివరకు ఘోరనరకాల పాలవుతారు.

ఆత్మసంభావితా స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజంతే నామ యజ్ఞైస్తే దమ్భేనాఽవిధిపూర్వకమ్॥

తమను తామే పొగడుకుంటూ, వినయ విధేయతలు లేకుండా, ధనమద గర్వంతో వాళ్లు శాస్త్రవిరుద్ధంగా పేరుకు మాత్రం యజ్ఞాలు చేస్తారు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥

అహంకారం, బలం, గర్వం, కామం, క్రోధం - వీటిని ఆశ్రయించి అసూయాపరులైన వీళ్లు తమ శరీరంలోనూ, ఇతరులలోనూ వుంటున్న నన్ను ద్వేషిస్తారు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీ ష్వేవ యోనిషు॥

ద్వేషపూరితులు, పాపచరితులు, క్రూరస్వభావులు అయిన అలాంటి మానవాధములను మళ్లీ మళ్లీ సంసారంలోనే పడవేస్తుంటాను.

ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాం గతిమ్॥

కౌంతేయా! అసురజన్మపొందే అలాంటి మూర్ఖులు ఏ జన్మలోనూ నన్ను చేరలేకపోవడమే కాకుండా అంతకంతకీ అధోగతి పాలవుతారు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధ స్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్॥

కామం, క్రోధం, లోభం - ఈ నరకద్వారాలు మూడూ ఆత్మవినాశానికి కారణాలు. అందువల్ల ఈ మూడింటిని విడిచిపెట్టాలి.

ఏతైర్విముక్తః కౌంతేయ! తమోద్వారైస్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనశ్శ్రేయః తతో యాతి పరాం గతిమ్॥

కౌంతేయా! ఈ మూడు దుర్గుణాలనూ విసర్జించినవాడు తనకు తాను మేలు చేసుకుని పరమపదం పొందుతాడు.

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥

శాస్త్రవిధులను విడిచిపెట్టి తన ఇష్టానుసారం ప్రవర్తించేవాడు తత్త్వజ్ఞానం కాని, మోక్షం కాని పొందడు.

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥

అందువల్ల చేయదగ్గదేదో, చేయకూడనిదేదో నిర్ణయించుకోవడంలో నీకు శాస్త్రమే ప్రమాణం. శాస్త్రవిధానాలను తెలుసుకొని తదనుగుణంగా ఈ లోకంలో నీవు కర్మలు చేయాలి.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని

"దైవాసుర సంపద్విభాగయోగం" అనే
పదహారవ అధ్యాయం సమాప్తం.

కాలం

పునర్మిత్రం పునర్విత్తం
పునరనేక వస్తునః।
కాలో హి న పునః పునః
క్షణే గతే గతం గతం॥

"తిరిగి మిత్రులను సంపాదించుకో వచ్చు; మరల ధనార్జన చేయవచ్చు; అయితే కాలం ఎన్నటికీ తిరిగి రాదు. గతించిన క్షణం గతించినట్లే." పై శ్లోక తాత్పర్యం ఇది.

కూర్చవచ్చు మరల కోల్పోయిన
ధనమ్ము;
స్నేహితులను తిరిగి చేర్చ వచ్చు
కూడగట్టలేము కోల్పోయిన క్షణమ్ము;
కాలమునకు విలువ గట్టలేము.

కాలమహాప్రవంతికి కత్తుల వంతెనలు కట్టిన కూరాగ్రేసరులున్నారుగాని – ఆనకట్ట కట్ట గల అధివేత యెవ్వడున్నాడు? లౌకికులు కాల ప్రవాహానికి ఎదురీదకుండ, వాలు ఈది గమ్యం చేరటానికి ప్రయత్నిస్తారు.

"ఉచితకాల యత్నవిధి కదా సమగ్ర ఫలంబు నిచ్చు" — అని మహాభారత ప్రవచనం. తొలకరి చిటపట చినుకులు పడేటప్పుడు రైతు భూమిని దున్ని విత్తులు నాటాలి. "విజయం = ఉచితకాలం + ప్రయత్నం" (Success is the chemical compound of man with the minute) అని ఆంగ్లసుభాషితం. కాలం కలిసిరానప్పుడు కొద్దత్యం ఎందుకు? అసమయ సాహసం పిరికితనంకంటె గూడ గర్హించ దగింది. ప్రాచీన భారతీయ సంస్కృతి త్రికాలజ్ఞులైన ఋషులనుగూర్చి ప్రస్తుతించింది.

అధునాతన శాస్త్రవేత్తలలో అగ్రగణ్యులైన ఐన్‌స్టైన్ కాలాన్ని విశ్వసృష్టికి నాల్గవ కొలతగా" ప్రతిపాదించాడు. పొడుగు – వెడల్పు – ఎత్తు మనకు చిరపరిచితమైన కొలతలు. కాలం నాల్గవ కొలత అనే భావన సామాన్యులు అవగాహన చేసుకోటం కష్టం.

మహాభారతంలో కాలమహిమ పలు చోట్ల ఉగ్గడింపబడింది. సత్యవతి తండ్రి దాశరాజు తన కూతురు సంతానమే కురు రాజ్యం ఏలాలని కోరుకున్నాడు! భీష్ముడు బ్రహ్మచర్య శపథం స్వీకరించి రాజ్య త్యాగం చేశాడు. అయితే — సత్యవతి బ్రతికియుండగానే ఆమె ఇద్దరు కొడుకులు దివంగతులైనారు! సత్యవతియే, భీష్ముని గృహస్థాశ్రమం స్వీకరించి వంశోద్ధరణ చేయమని అర్థించింది! అందుకు భీష్ముడు అంగీకరించలేదు. చివరకు సత్యవతి — సత్యవతి కోడళ్లు అంబిక – అంబాలిక మునలివాళ్లుగ మిగిలియుండగనే పాండు రాజుకూడ దివంగతుడైనాడు. కాలజ్ఞుడైన వేదవ్యాస మహర్షి – తన తల్లి సత్యవతితో

# వెలుగుబాట

డా॥ వండూరి రామకృష్ణమాచార్య

"మతిదలవగ సంసారం
బతిచంచల – మెండ మావులట్టుల
సంపత్
వ్రతతు లతిక్షణికంబులు;
గతకాలము మేలు వచ్చు కాలము
కంటెన్."

అని వారికి అరణ్యవాసం కర్తవ్యమని ప్రబోధిస్తాడు. "గతకాలము మేలు వచ్చు కాలముకంటెన్" అనేది వృద్ధ వేదాంతం. అచటి – వ్యాసుడు "పృథివీ గతయౌవనా" భూదేవికి వార్ధక్యంవచ్చింది అంటాడు!

మహాభారతంలో ఇంకోచోట "కాల పర్యాయవేది" యైన వ్యాసుని ప్రవచనం.
"కాలః పచతి భూతాని సర్వాణి"
ఇంకోచోట—

కాలము నేమన వచ్చును
కాలము కాలంబ పోలుగా కొంటికి

## యువవాణి

ఈ లీలలు గలవే;"
అని అర్జునుడు ధర్మరాజుతో అంటాడు.

అది శ్రీ కృష్ణ నిర్యాణ ఘట్టం. జగదేక ధనుర్ధరుడైన అర్జునుడు ద్వారకనుండి హస్తినాపురికి శ్రీ కృష్ణుని భార్యలను తీసుకొనివచ్చాడు. మార్గ మధ్యంలో అతనిని బోయలు అడ్డగించి అపార ధన రాసులను కొల్లగొట్టి శ్రీ కృష్ణుని అంతఃపుర స్త్రీలను కొందరిని చెరబట్టుకొని పోయారు!! అది కలికాల మహిమ అని అర్జునుడు సరిపెట్టుకున్నాడు.

ప్రాచీన గ్రీకు వేదాంతి పైథాగరసు "కాలం విశ్వసృష్టికి ఆత్మ" అని అన్నాడు. కార్యశూరుడైన నెపోలియను – "నన్ను మీరేదైనా అడగండి కాని కాలాన్ని మాత్రం అర్థించకండి." నేను ఇవ్వలేనిది కాలవ్యవధి" అనేవాడు.

"నిరీక్షణ చేసేవారికి కాలం చాలా
మెల్లగా, మందంగా కదలుతున్నట్లు
అనిపిస్తుంది;
భయార్తులకు కాలం మిక్కిలి వేగంగా
పరిభ్రమిస్తున్నట్లు తోస్తుంది;
దుఃఖితులకు నిముషాలు సంవత్స
రాలు భాసిస్తాయి;
సంతోష స్వాంతులకు సంవత్సరాలు
నిముషాలుగా కనిపిస్తాయి;
ప్రేమ పరిపూర్ణులకు కాలగమనమే
గోచరింపదు."

అని కోల్టన్ మనీషి అభిభాషణం.

"ఆ చంద్ర తారార్కముగా" — అని అంటాముగాని, చంద్రుడు భూమి తారకలు గూడ కాలమహాప్రవాహంలో లీనమై పోయేవే. కాలం కబళించకుండా నిలిచేది ఏది? అందుచేత భారతీయ సంస్కృతిలో "మహాకాళి" కల్పన ఏర్పడింది! కాళికాదేవి బ్రహ్మకపాలంలో రుధిరపానం చేస్తుంది!!

# భగవానుని ఆక్రందన

ఒకరోజు అపరరాత్రి ప్రాపంచిక విషయములతో విసుగుచెందిన ఒకడు ఇల్లు విడిచి పారిపోవాలనుకొన్నాడు.

"పరమాత్ముని అన్వేషణ కొఱకు నేను ఇల్లు విడిచి పోవాలను కొంటున్నాను. కానీ ఎవరు నన్ను ఆపటానికి ప్రయత్నిస్తున్నారు?" అని అరిచాడు వాడు.

"నేనే" అన్నాడు భగవంతుడు. కాని ఆ మాట ఆ మనిషి చెవిలో పడలేదు.

మంచంమీద అతని ప్రియతమ భార్య కుమారుని కౌగిలించికొని ప్రశాంతంగా నిద్రిస్తూంది.

'ఎవరు మీరు? నామీద మీయుక్తులు ప్రయోగిస్తున్నారు? మీ మాయతో మోసగిస్తున్నారు. నన్ను భ్రమింప చేస్తున్నారు?" అని అరిచాడు వాడు.

"నేనే" అన్నాడు భగవంతుడు. కానీ ఆ మనిషి వినిపించుకోలేదు.

పడకనుంచి ఇవతలికి వచ్చి వాడు ఆక్రందించాడు.

"భగవంతుడా! ఎక్కడున్నావు స్వామీ!"

"ఇక్కడే" అన్నాడు భగవంతుడు. కానీ ఆ మనిషి చెవిలో వేసుకోలేదు.

కుమారుడేదో పీడకలలో కలువరించి తల్లికి దగ్గరగా జరిగాడు.

"వెనక్కు తిరిగిరా" భగవంతుడు పిలిచాడు. ఆ మనిషి నుండి బదులు లేదు.

"అయ్యో! నా భక్తుడు నన్ను విడిచి ఎక్కడికి వెళ్ళిపోతున్నాడు" అంటూ నిట్టూర్చాడు భగవంతుడు బాధగా.

భావం: ప్రపంచంనుండి పారిపోవటం భగవంతుడినుండి దూరమవటమే, ప్రపంచం దేవుడి శరీరము. ప్రపంచం దేవుడిసృష్టి. భగవంతుడు శ్రీకృష్ణుడు బోధించిన కర్మయోగమునకు ఇది చక్కటివివరణ.

—శ్రీమతి యస్. మయూరి

కాలస్వరూపం **ఊహాతీత మైనది.** కాల పరిణామ వికాస వికార విభ్రమాలు చిత్ర విచిత్రాలు.

గోచరించు – ముందు – కొదమ
సింగము వోలె;
కవియ – ఎదురు బొదురు – గంగి
గోవు;
వెనుకనుంచి చూడ కనుపించు గాడిదై
కాలరూప మరయ కనుల కెపుడు.

ఉదాహరణకు విద్యార్థి దృష్టిలో "పరీక్షలు" తీసుకోవచ్చు. ముందు అవి సింహం వలె కన్పించవచ్చు. ఎదుట పడినపుడు అవి గంగిగోవు వంటివే, సమర్థుని దృష్టిలో. పిదప అవి గార్దభ సదృశాలే. అట్లాగే– జీవితంలో రాపురాచే వివిధ సమస్యలు! వేదాంత దృష్టితో వైజ్ఞానిక దృష్టితో చూచినా కాలం నాలుగో కొలతయే. కాలాన్నిబట్టి విలువలు మారక తప్పదు.

"తియ్యని కలలను ఉయ్యాలలో పరుండబెట్టి జోకొట్టి ఊపే కాలమే దురాశా పాశాలకు లోతైనగోతులు త్రవ్వి గోరీలు కడుతుంది. కొరడా ఝుళిపించి మూర్ఖుల మెదడులో భయాందోళనలు గ్రమ్మించి వీపుపై బొబ్బలు తేలేటట్లు దెబ్బలు కొట్టగలదు. ప్రాజ్ఞుల పాలిటి కల్పవృక్షమై వారి కోరికలు **ఈడేర్చగలదు; కాలంచేసే హెచ్చ**రికలు ముందుగానే గుర్తించగల **విజ్ఞుల** సంఖ్య అత్యల్పం. ఇక **చేతులు కాలిన** పిమ్మట ఆకులకోసం అన్వేషించే అజ్ఞులు కోకొల్లలు!

"వివేకం కాలానికిముందు పరుగెత్తుతుంది.
అవకాశం కాలంతోపాటు చెట్టాపట్టాలు వేసుకొని తోడునడుస్తుంది.
పశ్చాత్తాపం కాలం వెనుక నడువలేక వీథిలో చతికలబడి విలపిస్తుంది.
కాలాన్ని – తనకు మిత్రముగా చేసుకున్నవాడు శత్రువులను జూచి భయపడనక్కరలేదు.
కాలాన్ని – తనకు శత్రువుగా చేసుకున్నవాడికి మిత్రులు చేయగల సాయం ఏదీ ఉండదు."

ఈ చర్చకు ముగింపుగా ఉదాహరింపదగింది మహాభారతంలో కాలాన్నిగూర్చి చేసిన సమీక్ష.

కాలగతి గనుట శాంతికి
మూలంబై అంతరంగమున కాత్మమయ
త్వాలంబంబును నిచ్చుత
దావీనుండైన పురుషు డక్షోభ్యుడగున్.




ఆచారము అంటే ఆరోగ్యమే. తరతరాలుగా వస్తున్న మన పూర్వకాలపు ఆచారములు, సంప్రదాయములు, సాంఘిక సంస్కరణలు, మొదలగునవి మానవుని నడవడిని, ప్రవర్తనను క్రమబద్ధం చేయుటకు నిర్దేశింపబడినవి. ప్రతి ఒక్క ఆచారసంప్రదాయము వెనుక అనేక ఆరోగ్యసూత్రములు నిక్షిప్తమై యున్నవి. గతాన్ని గతదృష్టిలో కాకుండా వర్తమాన దృష్టిలో పరిశీలిస్తే అన్ని వక్రంగానే కనిపిస్తాయి. అలా కాకుండా ఆ కాలంలోని సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని పరిశీలించటం శ్రేయస్కరం. పూర్వకాలంలో ప్రజలకు దైవభక్తి, పాపచింతనము మెండు కాబట్టి విజ్ఞులు ఈ ఆచారాలను (ఆరోగ్య సూత్రాలను) దైవసంబంధాలుగా, సాంఘిక కట్టుబాట్లుగా తీర్చిదిద్ది సంఘమునకు అందజేసారు. ఈ సూత్రములనే నేటి శాస్త్రవేత్తలు "సైన్స్" పరిభాషలో భాషను మర్చి (ఆంగ్ల భాషలో) ఇవి ఆరోగ్యసూత్రములు అని చెబుతున్నారు. పూర్వకాలంలో ప్రజలకు దైవభక్తి మీద ఉన్నంత విశ్వాసం "సైన్స్" పై లేనందున వాటిని ఆచారాలుగా దైవసంబంధములుగా పాటించేవారు. ఇచ్చట కొన్ని ఆచారముల వెనుక దాగియున్న ఆరోగ్యసూత్రములు ఎట్లు ప్రజలకు శ్రేయస్కరములై వారియొక్క ఆరోగ్య పరిస్థితి సాంఘికహోదాను పెంచాయో కొన్ని ఉదాహరణములద్వారా పరిశీలించుట ఉచితం.

1. మనము వివాహాది శుభకార్యములలో మామిడి ఆకులు తోరణములుగా కట్టుట ఒక ఆచారము. ఇందులో ఆరోగ్య సూత్రం ఏమనగా మామిడాకు తెంపిన కొన్ని గంటలవరకు శ్వాసక్రియ జరుపును. దీనివల్ల ప్రయోజనములలో జన సమూహము వదులు బొగ్గుపులుసు వాయువును గ్రహించి ఆక్సిజన్ వదలుటద్వారా గాలిని శుభ్రపరచును. ఈ విధంగా ఇటు శోభాహేతువేగాక ఆరోగ్యసూత్రము దీనియందు నిక్షిప్తమైయున్నది.

2. పర్వదివసములందు (ఏకాదశీ, పౌర్ణమి, అమావాస్య, శనివారము) ఒక్క ప్రొద్దులు, ఉపవాసములు చేయుట ఒక ఆచారముగా కలదు. దీని వెనుక ఒక ఆరోగ్యసూత్రము కలదు. ఏమనగా మనుష్యులు అమితాహార సేవనంవల్ల అజీర్తి మలబద్ధకము మొదలగు వ్యాధులకు గురికావలసి యుండును. ఈ ఉపవాసముల వలన వారమునకు ఒకరోజు చొప్పున ఆహార నియమం పాటించుటవలన పై వ్యాధులను రాకుండా అదుపుచేయును.

3. మన హైందవ సంప్రదాయంలో స్త్రీలు కాళ్ళకు ముఖమునకు పసుపు రాచుకొనుట ఒక ఆచారము. అది అలంకారముగాను, ఆరోగ్యసూత్రముగాను ఉన్నది. స్త్రీల పాదములు కోమలములు. వారు గృహ కార్యక్రమములలో పాల్గొనునపుడు ఎక్కువగా నీటితో పనియుండి కాళ్ళుచెడును. అందుచే సూక్ష్మక్రిములు చొర వచ్చు. అందుచేతనే, కాళ్ళకు పసుపు రాచుకొని సూక్ష్మక్రిములను సంహరించి ఆరోగ్యమును కాపాడుకొందురు. (నేటి వీకో టెర్మరిక్ ఈ సిద్ధాంతం పై తయారు చేసినదే.)

4. దేవాలయములందిచ్చు తీర్థము ఒక దివ్యౌషధము వంటిది. ఎందుకనగా అందు క్రిమిసంహారకములు మరియు సుగంధపూరితములైన తులసి, హారతి కర్పూరం, యాలకులు, తక్కోలములు, చందనము మొదలగునవి యుండుటచే ఇది రోజు సేవించిన క్రిమిసంహారము చేయును. ఇది సర్వరోగనివారణి. (నేటి పెన్సిలిన్ వలె)

5. ఇప్పటికీ కొన్ని పల్లెలలోనివారు అంటూ ఉంటారు. కొన్ని జాతులవారిని మసూచి, కలరా, మొదలగు వ్యాధులు అంటవని. దానికి కారణం వారు ఆచార సంపన్నులని, పూజాపరులని. అవి ఎంత వరకు నిజమో కాని ఆచారము మటుకు నూటికి నూరుపాళ్ళు నిజము. ఉదా:— ప్రతిరోజు స్నానముచేయుట, పట్టుది. (పట్టుతో చేయనవసరము లేదు ఉతికిన వస్త్రం అని అన్వయము) కట్టుకొని ఒక వేళకు ఆహారము తీసుకొనుట, వారి అలవాటు. వారు ఎక్కడబడితే అక్కడ తిన

కూడదని, నీరు త్రాగకూడదని, వారి ఆచారము. వారిని మనం ఎగతాళి చేస్తూ ఉంటాం. ఒక కవి ఇలా అన్నాడు- "హోటల్లో కాఫీ త్రాగుటకన్నా తాళ వృక్షం క్రింద కల్లుత్రాగుట మిన్న" అని ఎందుకంటే ఇక్కడ కాఫీ నూరుమంది వివిధ ప్రకోపములు కలవారు ఒకే గ్లాసులో త్రాగుతారు. అక్కడ ఎవరి ఆకు వారిదే అని అతని భావం. అందుచే పై ఆచారము మంచిదో కాదో అది మనమే తెలుసుకోవాలి,

6. కలాపి చల్లుట నేటికి (పట్టణంలో పేడ ముట్టుకొని కలాపి చల్లుట మోటు అయింది గాని) పల్లెలలో ఒక ఆచారము. దీనివల్ల ఇంటి ముందుభాగము శోభాయ మానంగా యుండుటయే కాక, తెల్లవార్లు చీకట్లో అనేకక్రిములు భూమిపై ఆపాదించును మరియు చంటి పిల్లలు విసర్జించు మలినములు ఉండును. దానిపై పేడలో కలిపిన నీళ్ళు చల్లిన అవి నశించును. అలా కాకుంటే అవి పైకిలేచి మనకు సోకును.

7. పూర్వము, నేటికినీ కొందరిండ్లలో పని మనుష్యులు తోమిన పాత్రలలో నిప్పులువేసి లేదా పేడ నీళ్ళతో శోధిస్తారు. ఎందుచేత నంటే పనివారికి ఏదో పని కావాలి అనే కాని శుద్ధితో సంబంధం యుండదు. పైవిధంగా చేయుటవల్ల క్రిములు నశించును.

8. హిందువులు నుదుట కుంకుమ (నేటి రంగులు కాదు పసుపు, సున్నము మొదలగు వాటితో చేసినది) పెడ్తారు ఇది శోభా హేతువే కాక రెండు బొమ్మలమధ్య స్థలాన్ని రోజు నొక్కి పట్టి బొట్టు పెట్టుటవలన నాడీ మండలము వత్తిడికి లోనై చురుకుగా పని చేయును.

9. పూవులు ధరించుటవల్ల అవి ఆనందమును కల్గించుటయే కాక వాటి సువాసన, ఘాటు అయిన పుప్పొడి పరాగములు దుర్గంధమును పోగొట్టి క్రిములను నాశనము చేయును.

10. కొన్ని వర్గములవారు మాంసాహారమును తీసుకోరు. అవి వారి పూర్వుల నుండి సంక్రమించిన ఆచారం. తిండిపై మనస్సు యొక్క ప్రవృత్తి ఆధారపడి ఉంది, సాత్త్వికమైన ఆహారం తీసుకొంటే సత్త్వబుద్ధి, మాంసం వగైరాలు తీసుకొంటే రజోగుణం వృద్ధి అగును.

11. మన పూర్వులు మానవ జీవితాన్ని క్రమబద్ధమైన ఆశ్రమములుగా ఏర్పరచినారు. అవి 1. బ్రహ్మచర్యము 2. గృహస్థాశ్రమము 3. వానప్రస్థము 4. సన్యాసము. వీటిలో మానవుడు దేనిని వెనుక ముందులుగా ఆచరించినను అనేక కష్ట నష్టములకు గురి అగును.

12. భోజనానంతరం వంద అడుగులు నడచుట, తాంబూలసేవనం ఒక అలవాటు. తాంబూలంలో యాలకులు, లవంగాలు, పోకలు, సోపు, తమలపాకులు మొదలగు వాటివల్ల నోటిలో లాలాజలమును ఊరించి జీర్ణక్రియకు తోడ్పడును.

13. పూర్వకాలంలో గృహములు వాస్తు శాస్త్రానుగుణంగా కట్టేవారు. బావి ఎచ్చట ఉండాలి, వంటగది, పడకగది, ధాన్యాగారం, సమావేశమందిరం మొదలగునవి ఏది దిక్కుకు ఉండవలె, ఏది ఎంత ఎత్తులో యుండవలెను నిర్దేశించును. ఆ శాస్త్రానుగుణంగా యిండ్లు కట్టుకొనుట వారికి ఒక ఆచారము. దీనివల్ల పరిశుభ్రమైన పరిసరములు ఏర్పడును.

14. పూర్వకాలము నుండి నేటివరకు యజ్ఞయాగాదులు చేయటం ఒక పరిపాటి. ఆలా చేయటంవల్ల దేవతలు తృప్తిపొంది ఈప్సితార్థములు (కోరినకొర్కెల) తీర్చెదరని వారి భావన. అది నిజము అని నమ్మిన నమ్మిక పోయిన మనము యజ్ఞకుండము లందు వేయు నెయ్యి, హోమద్రవ్యము కలుషితవాయువును శుభ్రపరచును. ఇది ఇందు దాగియున్న సూత్రము.

15. ఇంకా తలపాగ ధరించుట అభ్యంగన స్నానము మొదలగు వాటికి కూడా కొన్ని ఆరోగ్య నియమములు ఉంటాయి. మనది ఉష్ణప్రదేశము కావున శరీరములో తల అత్యంత ప్రాముఖ్యంగల భాగము దానిని రక్షించు నిమిత్తం తలపాగ ధరిస్తారు. ఇది శిరోభూషణం. తైలము శరీరమునకు మర్దించి చేయు స్నానము వలన శరీరమునకు తేజస్సు కలుగును.

పైవిధంగా ఇంకా తోడుతూ వుంటే అనేక ఆచారసంప్రదాయముల వెనుక ఆరోగ్యసూత్రములు మనకు ప్రస్ఫుటంగా కానవస్తవి. దానికి ఆచారములను సహృదయంతో అర్థంచేసుకొని ఆకాలంనాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మత సంబంధ విషయాను గ్రహణం చేసిన, అవి ఎందుకు ఏ పరిస్థితులలో, వేటిని సముద్ధరించుటకు ప్రతిపాదించబడినవో తెలుసుకొనుటకు పరిశోధన ఎంతయేని ఆవశ్యకము.

నేడు కొందరు ఆచారములను దురాచారము అని మంచి వాటిని కూడ "గుఱ్ఱం గాడిదను ఏకం చేసినట్లు" చేస్తున్నారు. ఇది చాలా శోచనీయం. కొన్ని నిజంగా దుష్టపద్ధతులు సమాజంలో ఉన్నాయి. అది అందరు వ్యతిరేకించ వలసినదే. ఉదా:- సతీసహగమనం, బాల్య, వృద్ధ వివాహములు మొదలగునవి సాంఘికంగా సమాజాన్ని అధోగతి పాలు చేయునవి. మనము మన ఆచారముల పరిశీలన చేయునపుడు "మరాళ న్యాయము" అంటే నీళ్ళుపాలు కలసివుండే వాటిలో పాలను మాత్రమే త్రాగి నీటిని విసర్జించును. అలా మరాళ న్యాయానుసారముగా పరిశీలనము చేయువారు ఎంతమంది ఉన్నారిపుడు? ఇవికాక నేడు కొందరు ఈ ఆచారములను ఒక మతానికి అంటగడ్తున్నారు. అసలు మతిని సక్రమంగా ఉంచటానికి ఏర్పడ్డది మతము. కొన్ని సూత్రాల ఆధారంగా ఒకచోట చేరిన జనసమూహమే మతము. ఏ మతమైన మానవకళ్యాణాన్నే ఆకాంక్షించును కాని మానవ వినాశనాన్ని ఏ మతము కోరదు. మతంలోని సూత్రాలకు కొందరు ప్రబుద్ధులు వక్రభాష్యాలు చెప్పి మానవులను వక్రమార్గాలద్వారా నడిపించి మతసంఘర్షణలకు గురి చేయటం చాలా దురదృష్టకరం. నేటి ఆధునిక ప్రపంచ

(36 వ పేజీలో)

# ఆకాశతీర్థావతరణము

స్వర్గ మర్త్య పాతాళములయందు 3 కోట్ల యాభై లక్షల తీర్థములున్నట్లు ఋషులు వచించియున్నారు. అట్టి తీర్థములయందు స్నానమాచరించిన మన పాతకములు నివృత్తియగు నని శాస్త్రములు వచించుచున్నవి. ఆ తీర్థములయందు మునులు ఋషులు జ్ఞానులు భక్తులు భాగవతులు అందరు స్నానమాచరించి వారి స్పర్శ ఆ నదుల కుండుటచే వారి స్పర్శచే మనకు పవిత్రత కలిగి మన పాపములు నాశము కాగలవని పెద్దల నుడి. అట్టి మహత్తరమైన తీర్థములలో ముఖ్యమగు రెండు తీర్థములు శ్రీ వేంకటేశుని సన్నిధానమునందు మనము కనగలము. 1. పాపవినాశనము 2. ఆకాశతీర్థము. ఇందు ఆకాశ తీర్థావతరణము గురించి మన మొక్కింత యనుభవింతము.

తిరుమలయందు, 11 వ శతాబ్దియందు పెరియ తిరుమలనంబి లేక శ్రీశైలపూర్ణులను మహాప్రపత్తి నిష్ఠులు కైంకర్యపరులుండెడివారు. వీరే శ్రీభగవత్ రామానుజాచార్యులకు శ్రీమద్రామాయణమును ఒక సంవత్సరకాలము కాలక్షేపము సాయించిరి. వీరు ప్రతి నిత్యము ఉదయమున కాలకృత్యములు తీర్చుకొని పాపవినాశనమునకు జని అచ్చట స్నానమాచరించి విధ్యుక్త రీతిని ఊర్ధ్వపుండ్రములను ధరించి యొక కుంభము నిండుగా పాపవినాశన తీర్థము తీసుకొని భక్తితో శిరమున దాల్చుకొని అంజనాద్రీశునికి తిరుమంజనార్థము సమర్పించుచుండెడివారు.

ఇట్లుండ ఒకనాడు వేంకటేశుడు తన మనమున నీ శ్రీశైలపూర్ణులు వృద్ధులై యుండియు ప్రతి నిత్యము (రానుపోను 4 మైళ్లు నడచి) పాపవినాశము నుండి తిరుమంజన (అభిషేక) తీర్థము తెచ్చి నాకు సమర్పించుచున్నారని జాలివడి ఒక వేడుక చేయదలచి వేటగాడి వేషము బూని యా యరణ్యమునగల మేటి సింగములను, శార్దూలములను శరభ చమరీమృగ కృష్ణ సారములను తన శరధాటిచే దునుముచు విహరించుచూ నలసి సొలసి యొక వృక్ష రాజము క్రింద విశ్రమించియుండెను.

ఇంతలో పాపవినాశన తీర్థకుంభమును తన శిరసున కుదురుగా నిలుపుకొని, మంత్ర రత్నార్థమును మనసున స్మరించుచూ శ్రీశైలపూర్ణులు యేతెంచుచుండ, కపట నాటక సూత్రధారియై వేటగాని రూపుదగు శ్రీనివాసులు శ్రీశైలపూర్ణుల సమీపించి వినయ సంభ్రమములు తోప "తాతా వేటాడి అలసి సొలసి యున్నాను. దాహమగుచున్నది గాన దాహతీర్థ"మిమ్మని, యర్థించెను. అంతట శ్రీశైలపూర్ణులు "నాయనా అంజనాద్రీశుని అభిషేక తీర్థ మిది. అన్యులకీయరాదు. మరెచ్చటనైనా దాహము తీర్చుకొ"మ్మని, చెప్పి ముందుకు చనుచుండ, నంత నా మురారి తాత వెంబడి చనుచూ తాత శిరమున నుండు కుంభమునకు తన బాణముతో నెమ్మదిగా సన్నని తూటువేసి ధార స్రవించుచుండ తన అంజలితో ధారగావచ్చు తీర్థమును త్రాగుచూ తాత వెంబడి చనుచుండగా, కొంత దూరమేగునరికి కుంభము తేలికయైన శ్రీశైలపూర్ణులు ఆశ్చర్యము నొంది వెనుతిరిగి చూడ విలుకాడు అంజలితో నీరు త్రాగుట గ్రహించి "వత్సా నెన్నని యెడ యిట్టి యపరాధము చేయనగునా? నేడు తీర్థ కైంకర్యమును వ్యర్థము చేసితివి గాదె! నీవలన నాకు అపరాధము సిద్ధించెను గదా!" యని ముఖము చిన్నబుచ్చుకొని పరితాపముగా నుడువ కపటసూత్రధారి విని "తాతా, నే నేమి తప్పుచేసితిని, దాహమున కట్లొనర్చితిని. అయనను మించినదిలేదు. నావెంట రమ్ము. మీకొక తీర్థము చూపెద" నని కొంతదూరము తీసుకొనివెళ్లి కొండల చరియలపైగల నొక చెమ్మటను చూపించెను.



అంతట శ్రీశైలపూర్ణులు కొండ పై భాగమున కనుపడు ఆ తీర్థమును నే నెట్లు ఘటమున పూరింపగలను, నన్ను హేళన చేయుచు ఆటలాడించుట నీకు తగనివని" యని కోపగించ, "తాతా బాలుడనగు వీనిపై దయచూపవలెగాని కోపపడనగునా? జగదార్యా, మాకు మీబోటివారి అనుగ్రహమేగదా సర్వసుఖప్రదము. కాన తాతా తెలియక హేళన చేసితి దీనికి నిష్కృతిగా ఒక సెలయేరు పుట్టించెద నిదిగో చూడు"డని సురులు మెచ్చునట్లుగా తన చేతి విల్లును లాగి దగ్గరగల కొండ చరియలకు గురిచూచి బాణము సంధించెను. అంతట ఆ పర్వతము వటవట పగిలి భూనభోంతరాళములు పెగ్గడిల్లగ శబ్దించి అందుండి సుధాధవళ మహానిరధార ప్రవహించగా చూచి, "తాతా యీ రోజు నుండి యీ తీర్థము తెచ్చి మాకు తిరుమంజనార్థము సమర్పించు" మని యాజ్ఞాపించి అంతర్ధానము చెందిన తాత విస్మయము చెంది, "అయ్యో వేటగాడుగా డితడు. వేంకటేశ్వరుడే యిట్లు జేసెనని, దాహమడిగిన నీర మివ్వని పాపి నైతినని విచారపడి భగవదాజ్ఞప్రకారము ఆ తీర్థమే తీసుకొనివచ్చి అంజనాద్రీశుని తిరుమంజనార్థము సమర్పించుచుండిరి. నేటికిని శ్రీనివాసమూర్తి తిరుమంజనార్థము ఆకాశ తీర్థమే వినియోగపడుచున్నవని ప్రతీతి. ఆనాటినుండి ఆకాశతీర్థమని ఆ ధారకు పేరు సార్థకమయ్యెను.

బ్రహ్మకు తండ్రియైన (పితామహునకు తండ్రియైన) శ్రీహరి "తాతా" యని శ్రీశైలపూర్ణుల పిలుచుటచే పితామహ పితామహులని, తాతాచార్యులనియు వారికి సార్థకనామములయ్యెను. వీరే తాతాచార్యు లనువారు. వీరి వంశీయులు మంచి నిష్ఠాగరిష్ఠులు. సుదర్శన మంత్రమును పఠించి సిద్ధిపొందినవారు.

తిరుపతిలో క్షుద్రదేవత కలదు. ఆ క్షుద్రదేవత ప్రభావము యెక్కువగా యుండి ప్రజలను బాధించుచూ పెద్దమ్మవారు, కలరా ప్రజలకు సోకి ఎక్కువగా ప్రజలు చనిపోవుచుండ వీరి వంశములో కుమారతాతాచార్యులను వారున్ను దయార్ద్రహృదయులగు వీరు గమనించి ప్రజలబాధ నివృత్తి చేయదలచి, పగలంతయు సుదర్శన హోమము గావించి రాత్రి 9 గంటలు కాగానే క్షుద్రదేవత ఆలయమునకు జని, దేవత ఊరిలో పర్యటనకు వెళ్ళుటచూచి, ఆ గుడిలో తాము ప్రవేశించి అచ్చట నారసింహ సుదర్శన హోమములు ప్రారంభించి చేయుచుండగా తెల్లవారుఝాము అగునప్పటికి క్షుద్రదేవత తిరిగి తన ఆలయమునకువచ్చి తలుపుతట్టెను. లోపల తలుపు తీయక సుదర్శన మంత్రముల నుచ్చరించుచూ భయపడకుండా తాతాచార్యు లుండిరి. హోమం పూర్తికాగానే హోమంలో అంతకుమునుపే యుంచియున్న శంఖచక్రములను చేతపుచ్చుకొని తటాలున తలుపుతీసి దేవత కుడిభుజమున చక్రముద్రను వేయగా అబ్బొబ్బో కుయ్యో యని కేకలు పెట్టుచూ ఆ దేవత పరుగిడుచుండగా వీరున్ను ఆ దేవత వెంబడి పరుగిడి తాతాచార్యుల ముద్రభుజముతప్పినను వీపుతప్పదని శంఖముద్రను వీపున వేసిరి. అంతట ఆ దేవతకు పాంచజన్యస్పర్శచే జ్ఞానంకలిగి స్వామిని సేవించుకొని పాదములమీదపడి నేను మీ దాసురాలను. నాకు జ్ఞానం కలిగినది. నేను మీ ఆజ్ఞానుసారము నడచుకొందునని మన్నింపుకోరగా, తాతాచార్యులవారు "దేవతా! నీవు ఊరుబయటగల చెఱువు లేక గుంటయొద్ద యుండి మా శిష్యులగు యీ తిరుపతి ప్రజలకు యే కష్టము లేకుండా కాపాడుచుండుమని ఆజ్ఞాపించగా దేవత సరి యని వూరిబయట గుంటగట్టు చేరెను. ఆ గుంటకు యిప్పటికి తాతాయి గుంట యని పేరు వాడుకలో గలదు.

సుదర్శన పాంచజన్యముల యందు ఇట్టి విశిష్టత కలదు. అందువల్లనే మన పూర్వులు మన యింటిగుమ్మము ముందు, సుదర్శన పాంచజన్య గరుడ హనుమలుగల పటములను తగిలించుకొనుచుందురు. అవి యింటి గుమ్మము (సింహద్వారమున) నకు యుండగా, భూతప్రేత పిశాచములు అవి చూచి అనగా ఆంజనేయులను చూచియు చక్రమును చూచియు భయపడి యింటిలో జొరపడకుండా పోవును. కాన యివి ఇంటి క్షేమమునకు యెంతైనా అవసరము. అందుకనే సుదర్శన యంత్రమును గోడకు కొట్టి యుంతురు. కాన ఆస్తికులు సద్విషయముల గ్రహించి భారతీయ సంప్రదాయముల ననుసరింతురని కోరుచున్నాము.

— శ్రీ జి. ఎస్. రామానుజస్వామి

*

# శ్రీ ప్రసన్న వేంకటేశ్వరాలయం



**ఆంధ్ర** దేశమందున్న అనేక వేంకటేశ్వరాలయములలో అతి ప్రాచీనమైనది చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా మంగళంపేటలోని శ్రీప్రసన్న వేంకటేశ్వరాలయము. ఈ ఆలయం క్రీ. శ. 7, 8 శతాబ్దాల నాడు నిర్మింపబడినదిగా ఆలయ శిల్ప రీతులను పరిశీలించి చెప్పవచ్చు. ఆలయ విమానము అధిష్ఠానము పల్లవ వాస్తు రీతులలో నిర్మితమై యున్నవి. ప్రస్తుతము ఆలయము శిథిలావస్థలో ఉన్నను, కుప్పలు తిప్పలుగా పడియున్న స్తంభాలు, బండలు, గల ఈ ఆలయం విశాలమైన ఆవరణతో అనేక మండపాలను కలిగి వైభవోపేతంగా అలరారివట్లు చెప్పవచ్చు. ఐతే ఇంతటి ఔన్నత్యాన్ని పొందిన ఆలయ మెందులకు శిథిలమైనదో తెలియరావడం లేదు. స్థానికుల కథనం ప్రకారం, ఈ ఆలయాన్ని ఒక శతాబ్దానికి పూర్వం ఆనాటి ఆలయ ధర్మకర్తలు, పునరుద్ధరించుటకు పూనుకొని, పాత మండపాలను పడగొట్టి, క్రొత్తగా కళ్యాణమండప నిర్మాణమునకు సన్నాహాలు చేస్తూండగా ధర్మకర్తయైన షావుకారు మరణించుటచేత ఆ మండప నిర్మాణము అలాగే ఆగిపోయిన వని తెలియుచున్నది. ఇటీవలే ఆంధ్రరాష్ట్ర దేవాదాయ, ధర్మాదాయశాఖ ఆలయంయొక్క ఔన్నత్యాన్ని గుర్తించి ఆలయ మండపాలను తిరిగి నిర్మించుటకు పూనుకొని, ప్రస్తుతానికి ఆలయంచుట్టూ ఎత్తైన ప్రహరీగోడ నిర్మాణమును పూర్తి చేసినారు.

## ఆలయ నిర్మాణము

పూర్వ మీ గ్రామం 'జమీన్ దారుల' పాలనలో ఉండెడిది. క్రీ. శ. 8వ శతాబ్దినాడు మల్లప్పనాయుడనే జమీందారు (పాళెగారు)కు నడివయస్సులో కంటిచూపు లోపించి అంధుడైనాడట. అతడు తిరుమల వేంకటేశ్వరుని భక్తుడగుటచేత స్వామిచెంత కేతెంచి, స్వామిని పూజించి తనకు చూపు ప్రసాదించమని ప్రార్థించి, అలా చూపు కలిగితే తిరుమల ఆలయాన్ని పోలిన ఆలయాన్ని తన గ్రామంలో 4 మాడ వీథులతో నిర్మిస్తానని మ్రొక్కుకొన్నాడట! ఆపద మ్రొక్కులవాడు ప్రసన్నుడై భక్తుని ప్రార్థనను మన్నించి అతడికి చూపును ప్రసాదించినాడట! అన్నమాట ప్రకారం మల్లప్పనాయుడు భక్తి తిరుమల ఆలయాన్ని పోలిన ఆలయాన్ని నిర్మించి ఆలయానికి ప్రసన్న వేంకటేశ్వరాలయమని పేరు పెట్టినాడు. ఎవరైనా ఈ గ్రామాన్ని చూస్తే తిరుమల గ్రామ నిర్మాణము, స్వామివారి ఆనంద నిలయం యొక్క పోలికలు గోచరిస్తాయి.

ఆలయమందు గర్భగృహము, అంతరాళము, ముఖమండపము ఉన్నవి. ఐతే మహా మండపము, యాగశాల, కళ్యాణ మండపములు పడగొట్టబడినవి. ఐనా ఆ మండపాల నిర్మాణాని కుపయోగించిన రకరకాల శిల్పాలతో అలంకరింపబడిన గండశిలలు నిర్జీవంగాపడి విలపిస్తున్నాయి. ఈ ఆలయానికి ఎంతోమంది రాజులు, జమీందారులు, దాతలు ఎన్నో దానధర్మాలు చేసినారు. ఇవన్నియు గుప్త ధర్మాలే. స్వామికున్న ఆస్తి పాస్తులు ఈ కుగ్రామంలోనే ఎన్నో లక్షలకు విలువ కట్టబడినవి. స్వామివారి భూములలో కొన్ని అన్యాక్రాంత మైనను, మిగిలినవాటిని ప్రభుత్వమువారు విక్రయించుటకు పూనుకొని క్రీ. శ. 1981 సం॥ మందు వేలంపాట పెట్టగా వాటిలో కొన్ని దాదాపు రెండు లక్షల రూపాయల వెలకుపోయినవి. ఇంకా రెండులక్షలు విలువచేసే భూము లున్నాయి. వాటిని కూడా విక్రయించుటకు ప్రయత్నాలు జరుగుచున్నాయి.



స్వామివారికి పూర్వము తిరుమలలో వలెనే అన్ని పూజలు జరిగెడివి. అందుకే వాహనం మోతవార్లకు, చాకలి, మంగలి, కుమ్మరి, అర్చకులకు స్వామివారి అలంకరణకు పూలు సరఫరా చేసెడి సాతాని జియ్యర్లకు గృహవసతితోపాటు మాన్యాలుకూడా ఏర్పాటు చేసినారు. అన్నిటికంటే ముఖ్యంగా పేర్కొనదగిన విషయం, ఈ గ్రామంలోని దేవదాసీ కుటుంబీకులు. వీరు తర తరాలుగా స్వామికి సేవ చేస్తూ వారికే అంకితమై యుండినారు. వీరి గృహాల్లో నిన్న మొన్నటివరకు ఆడపిల్లలను స్వామివారి కిచ్చి వివాహము (ముద్ర) జరిపించెడివారు. మారుతున్న సమాజంతో పాటు, అలవాట్లు మార్చుకొన్న ఈ గృహస్థులే ఈనాడు స్వామివారి ఆలయోద్ధరణకు ముందుకు సాగుతున్నారు. తిరు

మలకొండకు ఉన్న నాలుగు ముఖద్వారాల్లో ఒకటైన కల్లూరుమార్గం, ఈ గ్రామంనుండే సాగుతుంది. పూర్వము కర్ణాటక రాష్ట్రం నుండి తిరుమల వెళ్ళే యాత్రికులు కోలారు, ముళబాగల్, రాయచోటి, కల్లూరు గ్రామాలద్వారా వయనించి మంగళంపేట మీదుగా తిరుమల చేరెడివారు. ఈగ్రామం రహదారిమీదుగా తిరుమలకు నలభై మైళ్ళలో ఉన్నను, పూర్వపు ఈ కాలిబాట మీదుగా ఎనిమిది మైళ్ళ దూరంలోనే యున్నది. మంగళంపేట ద్వారా వయనించే ఈ కాలి (వరసు) బాట కిరువైపుల ఒక ఫర్లాంగునకు ఒక కోనేరు, ఒకతోట, మధ్య మధ్యన ఒక సత్రము నెలకొల్పబడి యున్నాయి. మంగళంపేటకు ఇటు, అటు రెండుమైళ్ళ పర్యంతము, ఈ తోటలు, మండపాలు, కోనేరులు ఈ నాటికీ చూడ వచ్చు.



ఆలయవిమానం

**ఆలయవర్ణన**

ఆలయ ముఖద్వారము తూర్పు వైపుగా నిర్మితమై సమీపములోనున్న తిరుమల గిరులను చూస్తూ వున్నట్లున్నది. ఆలయమందు దీర్ఘ చతురస్రాకారంలో ఇరుకుగా నిర్మితమైన గర్భగృహము, అంతరాళములు మాత్రమే ప్రస్తుత మున్నవి. గర్భాలయం పై కప్పు, పెద్ద పెద్ద రాతి స్తంభాల సాయంతో నక్షత్రాకారంలో పొదిగి మధ్యన కొయ్యదంతులు కలిగియున్నది. ఈ కప్పు మీద ఆలయ విమానము, శాలాకోష్ఠములతో అలంకరింపబడి, శిఖరముపైన కలశము లను కలిగియున్నది. ఈ విమానము పక్తు పల్లవ రీతిలో నిర్మితమైనది. పల్లవ శిల్పములను కలిగియున్నది. గర్భాలయ మధ్యభాగమున (తిరుమల ఆలయమువలె) ప్రసన్న వేంకటేశ్వరుని పేర, స్వామివారు ఇరువైపుల శ్రీదేవి, భూదేవి ఉన్నారు. మూలవిరాట్టునకు ముందు భాగమున తిరుమలలోని భోగశ్రీనివాసుని పోలిన ఉత్సవమూర్తి, భూదేవి, శ్రీదేవి, శ్రీ చక్రముల పంచలోహ విగ్రహములున్నవి. క్రీ. శ. 1819 సం॥ మరాఠీ భాషలో వ్రాసి యున్న పైమాషి లెక్కలలో ఈ గ్రామాన్ని పాకాల, పాళెం, మంగాపురంగా పేర్కొని, పైన పేర్కొన్న విగ్రహ వివరములను, మండపాలను గురించి తెలియజేసినారు. దీనినిబట్టి మంగళం పేటకు మంగాపురం అనే మరొక నామ మున్నట్లు తెలియు చున్నది.

ఈ గ్రామాన్ని మంగళంపేట అను పేరున పిలుచుట కీ క్రింది కథనాన్ని స్థానికులు పేర్కొంటున్నారు. పూర్వమీ గ్రామం పాళెగార్ల పాలనలో వుండినది. అందులో ఒక ముసలి పాళెగారిని అతడి దాయాదులు చంప తలంచి అతడికి క్షౌరముచేయు మంగలిని ప్రలోభపెట్టి అతడిచేత క్షౌరము చేయు నెపంతో పాళెగారు గొంతు కోయించినారు. పాళేగారు భార్య మహాపతివ్రత, ప్రసన్న వేంకటేశ్వరుని సన్నిధి కేతెంచి, స్వామివారి సమక్షంలో, ఈ గ్రామంలో ఎవరైన వృత్తివనివారు నివసించినచో సంవత్సరకాలంలో వారి వంశము నాశనమగునని తమ సంపదను చేజిక్కించుకొన్న వారు మతిభ్రష్టులయ్యెదరని శపించి ఆత్మహత్య చేసుకొని భర్తతోడనే అంత్యక్రియలు జరిపించుకోగా, ఒక సంవత్సరము నిండకమునుపే గ్రామంలో కలరా వ్యాపించి వృత్తి వనుల



స్వస్తిక్ ఆకారంలోవున్న రాతిదిమ్మలు, కొయ్యల గర్భాలయం పై కప్పు.



ఆలయకుడ్యాలపై చెక్కిన పల్లవశిల్పాలు.

వారల కుటుంబములందు అనేకమంది మరణించ సాగగా, ఆ కుటుంబముల వారందరు గ్రామం వదలిపెట్టి మైలుదూరాన వేరే గ్రామాలు నిర్మించుకొని నివసిస్తున్నారు. ఈ నాటికికూడ ఈ గ్రామంలో ఒక వృత్తి పనివారి కుటుంబము లేకుండుట గమనించ తగ్గ విషయము. అలా మంగలివాడు పెట్టిన 'పెంట' (పాడుపని) వల్ల గ్రామాన్ని మంగలిపెంట అన్నారు. అలా మంగాపురం మంగలిపెంటగా మారి నేడు మంగళంపేటగా రూపు దిద్దుకొన్నదని తెలియు చున్నది.

చారిత్రకంగా కూడా ఈ గ్రామం ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది. మొదట ఆంగ్లేయులపైన 1806 సం॥మందు తిరుగుబాటు చేసిన చిత్తూరుజిల్లా పాళేగార్ల మూలపురుష డీ గ్రామస్థుడు. ఈ పాళేగార్లను అదుపులో పెట్టుటకు మద్రాసు దొరను చిత్తూరుజిల్లాకలెక్టరుగా కంపెనీవారు నియమించగా, అతడు మంగళంపేటలో పాళేగార్లను అదుపులో పెట్టుటకు 'పోలీసు స్టేషన్, ఏర్పాటు చేసి స్వయంగా ఈ గ్రామాన్ని దర్శించినాడట! అలాగే మహారాష్ట్రనాయకుడైన రాఘోజికి, కర్ణాటక నవాబు దోస్తు ఆలీకి ఈ గ్రామం వద్దనే యుద్ధం జరిగినది. అయితే చరిత్రకారులు పొరపాటున ఈ యుద్ధాన్ని 'దామల్‌చెరువు యుద్ధం' అంటున్నారు. ఈ గ్రామం సమీపంలో ఒక ఎత్తైనకొండ 'దుర్గ' మనుపేరున పిలువబడుచున్నది. ఆ కొండపై ఒక కోనేరు, రాతితో మలచిన తొట్టిలు, రాతిగొలుసు, కొన్ని శిల్పాలు, శిథిలమైన గోడలు ఈ నాటికి వున్నాయి. దుర్గం చుట్టు వున్న ప్రాంతాన్ని కోట గడ్డలని పేర్కొంటారు. ఈ దుర్గమే ఆనాటి పాళేగార్లకు రహస్య నిలయము.

తిరుమల శ్రీనివాసుని ఆలయ ప్రతిరూపమైన మంగళంపేట ప్రసన్న వేంకటేశ్వరాలయం, ఎన్నో లక్షల ఆస్తిపాస్తు లున్నను, అతిదీనావస్థలో స్వామివారు, శిథిలావస్థలో ఆలయము ఉండుట అతి విచారకరమైన విషయం. ఇంతటి ఉన్నత చరిత్ర కల్గిన పుణ్యక్షేత్రాన్ని, స్వామివారి ఆస్తి పాస్తులతోసహా స్వాధీనము చేసుకొని ఆలయాన్ని ఉద్ధరిస్తే, దాదాపు వేయి సంవత్సరాల నాటి వైభవం, శ్రీ ప్రసన్న వేంకటేశ్వరునికి తిరిగి చేకూర్చవచ్చు.

— శ్రీ పి. కృష్ణమూర్తి

# మా ఇష్టదైవము

శ్రీ వేంకటేశ్వరస్వామి పిలిచిన వెంటనే పలికేదేవుడు. వరాలనిచ్చే వడ్డీకాసులవాడు. ఆపదలయందు ఆదుకునే ఆపద్బాంధవుడు. కన్నుతెరచినా, మూసినా, ప్రత్యక్షమయ్యే ఆ శ్రీనివాసుని ఇంకా యింకా తనివి తీరా చూడాలని ఆతురత గలుగుతుంది.

ఆ స్వామిని గూర్చి మా అనుభవాల్లో ఒక సంఘటను గూర్చి వ్రాయాలని నా కొక కోరిక గలిగినది. మాకు ఆ శ్రీనివాసు డనిన ఎనలేని భక్తి, నమ్మకము. ప్రతి సంవత్సరము మేము రెండు లేక మూడు సార్లు ఆ స్వామిని దర్శించనిదే మాకుతృప్తి కలుగదు.

మా వూరులో అమితమైన దొంగల బాధ. మేము ప్రతి సంవత్సరము వేసవి సెలవుల్లో మా స్వగ్రామమునకు వెళ్ళేడి వారము. అదేవిధముగ ఈ సంవత్సరముగూడ వేసవి సెలవుల్లో, కొన్నివేల రూపాయల ఖరీదు చేసే సామగ్రిని వదలి మా స్వగ్రామమునకు ఆ స్వామి మీద నమ్మకముతో వెళ్ళినాము. వెళ్ళిన ఒక నెలరోజులకు "మీ యింట్లో దొంగలు పడ్డారు వెంటనే రండి" అని టెలిగ్రాము వచ్చినది. దానిని చూచిన వెంటనే గుండె ఆగినంతపని అయింది. నోట మాట రాలేదు. అయ్యో! ఆ స్వామినే నమ్మినాము గదా! ఆ స్వామి యింత పని చేస్తాడా! ఆయన ప్రతి నిత్యము కొన్ని వేలమంది భక్తులను దేశములోని నలు మూలల నుంచి రప్పించు కొంటున్నాడే! స్టేషనులోను, సత్రములలోను, హోటళ్ళలోను, రోడ్లమీదను, జనము క్రిక్కిరిసి ఆయన దర్శనమునకు తండోపతండాలుగా వస్తున్నారుగదా! "నీవే గనుక నిజమైన స్వామి వై యుంటే మా వస్తువులు మాకు దక్కాలి. అలా జరిగినట్లైతేనే నీ దర్శనమునకు వెంటనే వస్తా" మని మ్రొక్కుకొని బస్సు ఎక్కాము. దిగులు, విచారముతో ఎస్తూ వుండగామార్గ మధ్యములోనే మాకు పరిచయమైన ఒక వ్యక్తి కనబడి, భయపడకండి మీ వస్తువులు ఏమీ పోలేదు అని చెప్పారు.




నిజముగా మా ఆనందానికి అవధులు లేవు. మా సంతోషానికి ఆనకట్టలు కట్టలేక పోయాము. ఆ శ్రీనివాసుని మహిమ యెంత గొప్పదో చెప్పడానికి గాని వ్రాయడానికిగాని మాటలు చాలవు. భాషకూడ చాలదేమో అనిపించింది.

మేము మా వూరు చేరి యింటి తాళాలు తెరచి చూచేటప్పటికి, నిన్నటిరాత్రి వంట గది కిటికి వగులగొట్టి, లోనికి ప్రవేశించి ముఖ్యమైన గది తాళాలు బ్రద్దలుకొట్టు చుండగా, మాప్రక్క యింటివారు మేల్కొని "దొంగ" "దొంగ" అని కేకలు వేయుసరికి, ఆ దొంగ ఆయుధములను గూడ వదలి పారిపోయినట్లు తెలిసినది. ఆ ఇంట్లో దొంగ అడుగు జాడలు స్పష్టముగ కనబడుచున్నవి. చూడండి! కొన్ని వేల రూపాయల ఖరీదు చేసే వస్తు సామగ్రిని రెప్పపాటుకాలములో దక్కించిన ఆ దేవుని మహిమ వేనోళ్ళ పొగడబడినది.

మేము పరమానందముతో మరునటి రోజుననే ఆ భగవంతుని దర్శనమునకై, సాధ్యమైనంత త్వరలో చేసుకోవాలని తిరుపతికి బయలుదేరినాము. ఆ యేడు కొండలవాడు, భక్తజనవత్సలుడు దర్శనము చేసుకొని, మా వూరుకి తిరిగివచ్చి, ఆ స్వామి పేర సంతోషముతో, ఇరుగు పొరుగు వారలకు భోజనము పెట్టి, ప్రసాదములను పంచితిమి.

— శ్రీమతి పి. సరోజినివర్మ



## భలే భలే

భలే భలే పువ్వు
బంతి పువ్వు
మా పాప జడలో
విరిసిన పువ్వు
దేవుని పాదాన
మెరిసిన పువ్వు

భలే భలే పండు
అరటి పండు
మా పాప నోటికి
నచ్చే పండు
దేవుని ప్రసాదానికి
పనికొచ్చే పండు

భలే భలే పాట
దేవుని పాట
మా పాప నోటిలో
మెదిలే పాట
దేవుని హృదయాన్ని
కరగించే పాట

— శ్రీ బి. వి. పట్నాయక్

# తిరుమల శ్రీవారి ఆలయము - అర్చనలు - సేవలు

కలియుగదైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామి నెలకొనియున్న తిరుమల పుణ్య క్షేత్రము నేడు జగద్విఖ్యాతము. ఈ స్వామిని ఆపదమొక్కులవాడా అని, అడుగడుగు దండాలవాడా అని, వడ్డికాసులవాడా అని, గోవిందా అని, తిరుమల వెంకన్న అని, భక్తులు తమకు ఇష్టము వచ్చిన పేర్లతో పిలుచుకొని, స్వామి దివ్యమంగళవిగ్రహమును సందర్శించి, శ్రీవారికి కానుకలు అర్పించుకొని తమ జీవితములను పునీతము గావించుకొనుచున్నారు. ఈ స్వామి భక్తులు ప్రపంచ మందంతటను గలరు. అంతటి ప్రఖ్యాతిగల శ్రీవేంకటేశ్వరుని ఆలయమునందు ప్రతినిత్యం జరుగుసేవలను, అర్చనలను గురించి భక్తజనులు తెలుసుకొనవలసినఅవసరమెంతయో ఉన్నది.

తిరుమలలో శ్రీవారి ధ్రువమూర్తి మానవ నిర్మితముగాక, మానవకృత ప్రతిష్ఠాదులన్వయింపబడకయున్న కారణమున, ఒక నిర్దుష్టమగు పూజావిధానము అతి ప్రాచీనకాలమునుండిలేదనియే చెప్పవలెను. పన్నిద్దరాళ్వారులలో ఒకరైన 'తిరుప్పాణాళ్వారు", తమ 'అమలనాదపిరాన్' అను గ్రంథము 3 వ పద్యములో వేంకటాద్రిపైనున్న స్వామికి అర్చనలు స్వర్గనివాసులు, బ్రహ్మాదిదేవతలచే రాత్రియందు నిర్వహింపబడుచుండెడివని వ్రాసెను. తిరుమల తిరుపతి దేవస్థానముల శాసన సంపుటిలోని 1-8వ శాసనములోని పదముల క్రమమును బట్టి క్రమపూజావిధానము క్రీ. శ. 966 సంవత్సరమునకు పూర్వమే యున్నట్లు, అది భోగ శ్రీనివాసమూర్తి ప్రతిష్ఠతో నిలద్రొక్కుకున్నట్లు తెలియుచున్నది. శ్రీవారి అర్చకత్వము మాత్రము పూర్వము నుండియు వైఖానస మతమువారే నిర్వహించుచున్నారని అన్ని పురాణములు, ఇతిహాసములు స్పష్టపరచు చున్నవి. దీనిప్రకారము మొట్టమొదటి అర్చకుడు శ్రీ గోపీనాథాచార్య స్వామివారని తెలియుచున్నది.

శ్రీవైఖానసాగమము షట్కాలపూజ పేర్కొనుచున్నది. అవి: 1. ప్రత్యూషపూజ (అరుణోదయము, ఉషఃకాలము) 2. ప్రభాతపూజ (ప్రాతఃకాలము) 3, మధ్యాహ్నపూజ 4. అపరాహ్ణపూజ 5. సాయంకాలపూజ 6. నిశిరాత్రిపూజ కులశేఖరాళ్వారు తమ తిరుమొళి గ్రంథములో (1-7) శ్రీరంగములో షట్కాల పూజ జరుగుచుండెనని వ్రాసెను.

## షట్కాలపూజ ప్రయోజనము

మన ఐహిక ప్రయోజనమే షట్కాల పూజా రహస్యమని ఆగమములు పేర్కొనుచున్నవి. ఉషఃకాలములో పూజ ప్రజాభివృద్ధిని, పశువృద్ధిని గల్గించును. ప్రాతఃకాలపూజ జపహోమాదులను వృద్ధిపరచును మధ్యాహ్నపూజ రాజ, రాష్ట్రాభివృద్ధిని కల్గించును. అపరాహ్ణపూజ దైత్యవినాశనమునకు దోహదము చేయును.



కొలువు శ్రీనివాసమూర్తి, తిరుమల

సాయంకాలపూజ సస్యాభివృద్ధికి మార్గము. అర్ధరాత్రిపూజ పశుగణాభివృద్ధి ప్రయోజనముగ చెప్పబడినది. ఇది వైఖానసాగమోక్తము. యాత్రికులు, భక్తులు అసంఖ్యాకముగ వచ్చుటవలన తిరుమల శ్రీవారి ఆలయములో ఈ షట్కాలపూజ ప్రతినిత్యము బహువిశ్రాంతిగా జరుపబడుట అసాధ్యవిషయముగనున్నదని చెప్పవలెను.

తిరుమలలో నిత్యము నిజమునకు రెండు పూజలు మాత్రమే జరుగుచున్నవి. తోమాల సేవ కనుబంధముగ ఒక పూజ జరుగును. దీనికి భక్తులకు ప్రవేశమున్నది. ప్రత్యేక రుసుమును దీనికై దేవాలయములో చెల్లింప వలయును. రెండవసారి సాయంకాలపూజ. అది అతిరహస్యము. కేవలము అర్చకస్వాములు, ఆచార్యపురుషులు, ఇతర దేవస్థానపు సిబ్బంది మాత్రమే పాల్గొందురు, అపరాహ్ణవేళలో మరియొకపూజ జరుగును. వీనినే సేవలని పిలిచిరి. అవి: విశ్వరూప సేవ, తోమాలసేవ, మొదటి అర్చన, కొలువు సేవ, నివేదనము, శాత్తుమొఱ, రెండవ అర్చనము, రెండవ నివేదనము, ధర్మసేవ. ఏకాంతసేవలు. ఇందులో ధర్మసేవ, విశ్వరూప దర్శనము మాత్రము ఉచితము. శాత్తుమొఱ వైష్ణవ స్వాముల కుచితము. వైఖానసార్చక స్వాములు మాత్రమే నివేదన సమయములో శ్రీవారి సన్నిధిలో నుందురు. తోమాలసేవ, ఏకాంతసేవ ఆర్జితములు. యాత్రికులు ఆసేవలో పాల్గొనుటకు వీలులేదు. దర్శనమును మాత్రమే

[26 వ పేజీలో]

పురావస్తు ప్రదర్శనశాలలు దేశంలో ఎన్నో వున్నప్పటికి ఆలయకళకు సంబంధించిన పురావస్తుశాల మొట్టమొదటగా తిరుపతిలో ప్రారంభించబడటం గర్వ కారణం. మ్యూజియంలోని ప్రదర్శనాంశాలు పండితులకే గాక ప్రాథమిక పాఠశాల స్థాయినుంచి, కళాశాలస్థాయి విద్యార్థినీ, విద్యార్థులు సైతం తెలుసుకొనదగిన రీతిలో వివరింపబడి వున్నాయి. ప్రజలకు పురావస్తు ప్రదర్శనశాలల ఆవశ్యకత, అవసరం తెలియక పోవడం ఎంతైనా శోచనీయం. సంతోష ప్రదమైన జీవితానికి ఉపకరించే అంశాలలో మ్యూజియం సందర్శించడ

మూడవ విభాగంలో ఆలయనిర్మాణానికి సంబంధించిన అంశాలు కలవు. ఆలయ విభాగాలైన అధిష్ఠానం, శిఖరం, స్తంభం, పాదం, పీఠం, గోపురం మొదలగువాని గూర్చి అతి వివరంగా తెలియచేయబడి వుంది. కుడ్యాలపైన, స్తంభాలపైన చేయబడిన అలంకరణరీతుల తీరు ఫోటోలద్వారా, రాతివస్తువులద్వారా ప్రదర్శింపబడివుంది. విగ్రహాల కొలతలు, వాటికి సంబంధించిన వివరాలను సమగ్రంగా తెలియచేసే శాఖ నాల్గవ విభాగం. స్థపతి అంటే ఎవరు? అతని పవిత్ర చర్యలేవి? విగ్రహాల కొలతల తీరు మున్నగు ముఖ్యాంశాలు అతి వివరంగా తెలియజేయబడ్డాయి.

# కళావని

ర్వింశతి రూపాలు దర్శనీయంగా వున్నాయి. ప్రాచీన దేవతల ఆభరణాల వన్నెలు, వారి కేశాలంకరణ చిన్నెలు నమూనాలతో సహా పొందు పరుపబడి వున్నాయి.

వైష్ణవ మహాపురుషులైన ఆళ్వార్ల జీవిత చరిత్ర చిత్రణమే ఆరవ విభాగం. శ్రీ వేంకటేశ్వరుని అనుక్షణం కీర్తించి, తరించిన పావన పురుషులైన ఆళ్వార్లను గుర్తుకు

# తిరుమల ఆలయ కళకు ఒక రూపు శ్రీ వేంకటేశ్వర మ్యూజియం!

మనేది కూడా ముఖ్యాంశం. ఆధునిక కాలంలో ప్రాచీన సంస్కృతి, సంప్రదాయాలు మరుగునపడి పోతున్నాయి. విశిష్టమైన మన సంస్కృతి, ఆచార వ్యవహారాలను ప్రజలు గుర్తించి బుద్ధి వికాసము పొందాలనే ప్రయత్న ఫలితమే ఈ ఆలయ మ్యూజియం.

మ్యూజియం సందర్శకులకు సహకరించుటకై సమర్థవంతులైన ఉపన్యాసకులు కూడా ఉన్నారు. జీవంలేని రాతి బొమ్మలను చిత్రపటాలను తమ వివరణలలో సజీవంగా విద్యార్థుల ముందుంచుతున్నారు.

మ్యూజియంలో ప్రదర్శింపబడియున్న ముఖ్యాంశాలను పరిశీలిద్దాం. మొదటి విభాగంలో శ్రీమహావిష్ణువు సాక్షాత్కారాలు, వైష్ణవమతశాఖలైన పాంచరాత్ర, వైఖానస ఆగమాల వివరణ గావించబడింది. రెండవ విభాగంలో ఆలయ నిర్మాణానికి ఎంచుకొనదగిన స్థలం, షిలాస్థాపన, మానవుడు-దేవాలయం భూపరీక్షలు, దేవాలయం రకాలు మొదలగు అంశాలు చిత్రపటాలు, నమూనాలు పొందుపరచబడివున్నై.

5వ విభాగం ప్రాణికోట్లను పాలించే అవతార పురుషుడైన విష్ణువుకు చెందింది. దశావతార చిత్రాలు, వాటికి సంబంధించిన విగ్రహాలు అత్యద్భుతంగా ఉన్నాయి. భోగ, వీర, అభిచార మూర్తులు ఏ ఏ ప్రదేశాల్లో నెలకొని వుంటారు, ప్రతిమలు ఎన్ని వర్గాలుగా విభజించబడ్డాయి, విష్ణువు చతు



చక్రత్తాళ్వార్, 15వ శతాబ్దం

తేవడం అభినందనీయాంశం. వైష్ణవ దేవాలయాల్లో వాడే పూజాపాత్రలు మనలో ఎంతమంది తిలకించి వుంటారు? కనీసం ఉద్ధరిణ అంటే అర్థం ఎంతమందికి తెలుసు? వాటి వివరణలు, పాత్రలతో సహా ఈ మ్యూజియంలో పొందుపరుపబడి వున్నాయి. అష్టాదశ సంస్కారాలకు, ముద్రలకు చక్కని రూపకల్పన గావించారు. ఆలయ ఉత్సవ సందర్భాల్లో వాడే వాహనాల నమూనాలు కొయ్యతో మలచబడి ముచ్చటగా ముద్దులొలుకుతున్నాయి.

మానవులు 108 దివ్య క్షేత్రాల సందర్శనలో మోక్షం పొంది తరించాలనుకోవడమే ఏడవ విభాగం ప్రత్యేకాంశం. మోక్ష సాధన మార్గాలలో తీర్థయాత్రలు, క్షేత్ర సందర్శన ముఖ్యమైంది. క్షేత్రదర్శనం గావించి, విగ్రహారాధన సలుపుటవల్ల మానసికోల్లాసం, మోక్షప్రాప్తి సిద్ధిస్తాయని మనవారి నమ్మిక. వైష్ణవ దివ్యక్షేత్రాలు 108 ఏ ఏ ప్రాంత్రాల్లో, ఏ ఏ రూపంలో నెలకొనబడి వున్నాయో వివరంగా తెలియచేయబడి వున్నాయి.

లలితకళలు సర్వులను ఆనంద పరుస్తాయి. ఇది అందరూ ఎరిగిన సత్యమే. సంగీత, నృత్యాలకు సంబంధించిన విభాగంలో ఈ మ్యూజియం సందర్శన పూర్తవుతుంది. దాస సాహిత్య కర్తలైన పురందరదాసు, జగన్నాథదాసు, గురు జగన్నాథదాసు మున్నగువారి మట్టిబొమ్మలు సజీవములా అన్న సందేహంలో పడవేస్తున్నాయి. మరుగువడి పోయిన తోలుబొమ్మల ప్రదర్శన వెలికి తీయబడింది. ఈ పురావస్తుశాలలో నృత్య మాతృకలైన కరణాలు 108 అపురూపంగా చిత్రింపబడి వున్నాయి. చిదంబరం దేవాలయం గోడల పైన ప్రదర్శింపబడివున్న రాతి బొమ్మల ఆధారంతో ఇచట చిత్రాలు చిత్రించబడ్డాయి. కరణాలకు సంబంధించిన వివిధ భంగిమల నమూనాలు మట్టితో చేయబడి వున్నాయి.



వివిధ దీపపు స్తంభాలు

శ్రీనివాసకల్యాణం బొమ్మలలో వివరింపబడి సందర్శకులను ముఖ్యంగా ఆకర్షించుట చెప్పుకోదగిన అంశం. సామాన్య ప్రజానీకం దృష్టిని పురాణాలు ఆకట్టుకోడానికి ఈ బొమ్మల ప్రదర్శన ఎంతేని ఉపకరిస్తోంది. ఇదియేగాక అతి ప్రాచీన కాలానికి చెందిన రాతి విగ్రహాలు, ఇటుకలు, ప్రాచీన సంగీత సాధనాలు ఉన్నాయి. వీటి ప్రదర్శన నేత్రాలతో గాంచి తరించవలసిందే గాని వర్ణింప నలవికాదు. పండిత వర్గమేగాక, పామరులు సైతం మన ప్రాచీన వేదసంస్కృతిని, సంప్రదాయాలను తెలుసుకునేందుకు వీలుగా ఈ మ్యూజియం అందుబాటులో వుంది.

అతి తక్కువకాలంలో అతి సుందరంగా కనువిందుచేసే ఈ మ్యూజియం సందర్శకుల ప్రోత్సాహంతో అభివృద్ధి దిశకు పయనిస్తుందని ఆశిద్దాం.

— శ్రీ ఏ. కె. వి. ఎస్. రెడ్డి





"ఊఁ ఊఁ చెప్పమ్మా....అప్పుడు....."

'అప్పుడే నాయనా, మన పాలిటి కొండలప్ప' లక్కమాంబ చెబుతున్నది.

కళ్ళు మిరుమిట్లు కొలిపే కాంతులు. కళ్ళు మూతలు పడుతున్నాయి. మీ నాన్నగారు కూడ అలాగే అవాక్కై నిలిచిపోయారు. ఆ తేజస్సు మెల్లగా మా చేతుల్లో ఒక ఖడ్గాన్ని ఉంచి అదృశ్యమైంది. తర్వాత ఏం జరిగిందో తెలియదు. ఇదంతా గరుడ గంభం వద్దనే. ఇంతలో స్వామిసన్నిధిలో ఉన్నాం. చిరునవ్వులు చిందిస్తూ నిలుచున్నాడు. ధగధగ మెరిసే కిరీటం. నొసట పెద్దనామం. మొసలి మూతి కుండలాలు చెవుల్లో. చక్రం. శంఖం. రెండు చేతుల్లో. మెడలో ముత్యాల హారాలు. పైనుంచి కిందిదాక తోమాలలు. వనమాల. వక్షస్థలంలో ఒకవైపు అలమేలు మంగ. మరోవైపు భూదేవి. బొడ్డులో కఠారి. ఒడ్డాణం. నా పాదాలను ఆశ్రయించండి అని చూపే వరదహస్తం. ఇక్కడ చేరిన వాళ్లకు సంసార సాగరం మొలలోతే అని తెలిపే కటిహస్తం. పాదాలు నేలలో ఉన్నాయి. క్రింద విరజా నది ప్రవహిస్తున్నదట, ఆ పాదాలతీర్థం.... "ఇందా" అంటూ అర్చకులు తీర్థమిచ్చారు.




చందన ప్రసాదాలు చేతికిస్తూ 'నీ కడుపు పండుతుందిలే. 'వెంకన్నను నమ్ముకుంటే చాలు పుట్టు గొడ్రాలైన బిడ్డల తల్లి కావల సిందే' అంటున్నాడు వైఖానస నంబి. తర్వాత తాళ్ళపాకకు తిరిగి వచ్చాం," సిగ్గు పడుతూ లక్కమాంబ త్వరత్వరగా కథ ముగించింది, 'అంతే ఈ బంగారు కొండనా ఒళ్ళోపడ్డాడు' అంటూ తల్లి తన పసికూనను గాఢంగా అక్కున చేర్చుకొన్నది. ఆ మాతృ మూర్తి స్తనాలలో పాలు పొంగాయి. కళ్లల్లో ఆనంద బాష్పాలు చిందాయి.

అన్నమయ్య మనసంతా తిరుమల కొండే అయింది.

అన్నమయ్యకు ఏడేండ్లు నిండాయి. ఏడుకొండలమీద కెళ్ళాలని, అమ్మ చెప్పిన బొమ్మను చూడాలని, ఆ బంగారు బొమ్మతో ఆడుకోవాలని పాడుకోవాలని తహతహ లాడుతున్నాడు. కళ్ళు మూసుకొంటే నల్ల నల్లని మబ్బులు కదుల్తూ కనిపిస్తాయి. ఎవరో దూరంగా తన పేరుపెట్టి పిలిచినట్లె ఉలిక్కిపడతాడు. కొండల్లో కోనల్లో తిరుగు తున్నట్లు కలలు కంటాడు. ఆ స్వప్నాల్లో ఎన్నో బొమ్మలు మెరుపులు. వేదఘోషలు. తపస్సు చేసుకొంటున్న ఋషులు. అర అరగకళ్ళు మూసుకొన్నారు. హఠాత్తుగ వాళ్ళంతా పెద్ద పెద్ద చెట్లైపోయారు. వాటికి వన్నె వన్నెల పూలు, పళ్ళు. రక రకాల పక్షులు. వింత వింత ధ్వనులు. కొండ వాగులు, కొండగాలులు. పింఛం విప్పిన నెమళ్ళు. పరుగెత్తే జింకలు. ఆవులు కుందేళ్ళు. ఆ జంతువులన్నీ దివ్య పురుషులయ్యారు. వాళ్ళకు పెద్ద పెద్ద కిరీటాలున్నాయి. కళ్ళు ఎప్పుడూ తెరచుకొనే ఉంటారు. ఒళ్ళంతా నగలు దిగేసుకున్నారు. అందంగా హుందాగా తిరుగుతున్నారు. పంచవన్నెల సర్పాలు. ఐదు ఏడు పడగలున్న పాములు ఆడుతున్నాయి.

అన్నమయ్య ఉలిక్కిపడ్డాడు. అమ్మను గట్టిగ పెనవేసుకొని కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు మూతలు పడుతున్నాయి. మెల్ల మెల్లగ కమ్మని కలలోకి జారిపోయాడు. కొండలు, కొండలు. శేషుడు వందలు వది వేలుపడగలు విప్పి నాట్యమాడుతున్నాడు. ఆ పడగలు పాల నురుగుల్లా ఉన్నాయి. పెద్ద పెద్ద గోపురాలు. ప్రాకారాలు. బంగారు వాకిళ్ళు, బారులు తీర్చిన దీపస్తంభాలు. రాములవారి మేడ. నల్లగ నవనవోన్మేషంగ నిల్చున్నాడు కొండలరాయుడు. పట్టు పీతాంబరం ఒయ్యారంగ కదులుతుంది. పాట వినిపిస్తున్నది. ఎవరో పాడుతున్నారు. చేతిలో కిన్నెర మీటుతూ పాడుతున్నాడు. ఆ ఆకారం కదుల్తున్నది. అరే, ఇదేమిటి తానే. ఆ పాడేది తానే. తన కళ్ళు చెవులు ఎలా మోసం చేస్తాయి. అది కలా కాదు. నిజమే! నిజమే. అన్నమయ్య పాడుతున్నాడు.




"హరిగంటి గురుగంటి అంతట మేలు కంటి"

ఎదురుగ లక్కమాంబ ఆశ్చర్యంగా చూస్తున్నది. నారాయణయ్య ముక్కుమీద వ్రేలేసుకొని నిల్చున్నాడు. అన్నమయ్య మనుష్యుల్లో పడ్డాడు. మనుష్యులు అన్నమయ్యలో పడ్డారు. అందరూ అన్నమయ్య పాటకు లోబడ్డారు.

అన్నమయ్య పాటకు లోబడని వారెవ్వరు!

ఎనిమిదేండ్ల బాలుడు. చెవుల్లో మద్దికాయలున్నాయి. మెడలో జందెం పోగువేలాడుతున్నది. చేతిలో తంబురు మీటుకొంటూ ఆనందంతో చిందులేస్తూ పాడుతున్నాడు.

ఆ పాట శేషాచలం సానువులో మార్మోగు తున్నది. జనం తండోపతండాలుగ గుమి గూడారు.. అన్నమయ్య పాడుతున్నాడు.

'అదివో! అల్లదివో! హరి వాసము
పదివేల శేషుల పడగలమయము'

అన్నమయ్య పాడుతూ కొండెక్కుతున్నాడు. పాట కొండెక్కుతున్నది. పాటతో పాటు అందరూ కొండెక్కుతున్నారు. ఆళిపిరి గోపురంవద్ద నిలిచాడు. అనంతంగా వ్యాపించిన వేంకటాచల శిఖరాలను చూస్తూ పాడుతున్నాడు.

అదె వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిల మునులకు






అదె చూడుడు! అదె మ్రొక్కుడు!
ఆనందమయము.

అన్నమయ్య పాడుతూ మోకాళ్లకొండ చేరాడు. యాత్రికులు పారవశ్యంతో వింటు న్నారు. సాలగ్రామమయమైన ఆ కొండ శిలల్లో దేవతా మూర్తులను దర్శించాడు.

చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము

పాట స్వామి పుష్కరిణి చేరింది. పాప క్షాళనమైంది. అన్నమయ్య కళ్ళు ఎటో చూస్తున్నాయి. తంబుర తీగ నినదిస్తున్నది. అది ప్రాక్తన శ్రుతి. అది పురాకృత స్మృతి. యాత్రికులు చూస్తున్నారు. అన్నమయ్య చేత్తో చూపుతూ పాడుతున్నాడు.

అది ఆనంద నిలయం:

ముంగిట నల్లదివో మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము

అది ఆనంద నిలయం:

కైవల్యపదము వేంకట నగ మదివో
శ్రీ వేంకటపతికి సిరులైనది.

అది ఆనంది నిలయం-

భావింప సకల సంపద రూప మిదివో
పావనముల కెల్ల పావన మయము.

అది ఆనంద నిలయం- అది వేంకటపతి నిలయం; అది ఆనందనిలయం- అది శ్రీని వాస నిలయం; ఆనందమయం. బ్రహ్మ మయం, పావనమయం.

"బంగారు శిఖరాల బహు బ్రహ్మ మయము"

అన్నమయ్య పాడుతూనే ఉన్నాడు....

— శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు

*

అన్నమయ్య సర్వాత్మనా శ్రీ వేంకటేశ్వరునకు అర్పణం చేసు కొన్నవాడు. 'శ్రీ వేంకటేశ్వరుఁడే పరమతత్త్వమనే నిశ్చంచలమైన గట్టి నమ్మిక ఎవరి పుణ్యానో ఇతనికి లభించింది. ఆ మూర్తినే ఆధిభౌతిక మైన, ఆధ్యాత్మికమైన సర్వప్రపంచములోనూ అంతర్యామిగా బహిర్యా మిగా భావించి, పూజించి, ప్రేమించి, కలహించి, ప్రాధేయపడి, ప్రార్థించి, పొగడి, తెగడి, అనుభవించి, ఏకీభవించి జీవితంలోని అంతరంగ బహిరంగ పరమాణువులన్నిటా అతని బ్రతుకే బ్రతికినవాడు. ఆ అనుభవాలన్నీ మానసికంగా, కాయికంగా మాత్రమేకాక, వాచికంగా కూడ అనుభవించిన వాడు. ఆ వాచికానుభవాలే ఆయన పదకవితలు.'—

కీ. శే. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

(21 వ పేజీ తరువాయి)

అనుభవించవచ్చును. అర్చనలలో రుసుము చెల్లించువారి గోత్రనామములు అర్చనాంతమున శ్రీవారికి నివేదింపబడు సంప్రదాయము పూర్వముండెడిది. నేడు అదియును లేదు. ఎవరి గోత్రనామములను వారే చెప్పి కొనవలెను.

నిత్యపూజావిధి ప్రధానముగ వైఖానసాగమానుసారము. సంప్రదాయ బద్ధమైన వైఖానస పూజావిధానము ననుసరించి జన్మచేత వైఖానసుడు కానివాడు పూజా నిర్వహణమునకు అనర్హుడు.

తిరుమల తిరుపతి ఆలయములలో పరిచారకుడు సన్యాసి. ఈతడు దీక్షను స్వీకరించుటగాని, వైఖానస దీక్షితునియొద్ద ఉపదేశమును పొందుటగాని లేదు. మంత్రపుష్పమును నిర్వహించు ఈతడు ఆచార్య పురుషులలో నొకరు.

### నిత్యార్చనాక్రమము

ఉషఃకాల మనునది 3-00 గం॥ నుండియే ప్రారంభమగును. అర్చకుడు, పరిచారకుడు గొల్ల లోనికి ప్రవేశించినంతనే బంగారు వాకిలి మూయబడును. పరిచారకుడు సమ్మార్జనము చేయగా, గొల్ల దీపములు వెలిగించు కార్యములో నిమగ్నుడగును. మూయబడిన తలుపులకు ముందు తిరుమామణి మంటపములో స్వామివారికి అభిముఖముగ నిలచి శ్రీవారి సుప్రభాతమును పఠింతురు. భోగ శ్రీనివాసమూర్తిని ఈ సమయములో శయనమునుండి వేరుపరచి (శ్రీవారి సన్నిధి) జీవస్థానముకడకు చేర్తురు. ఈ సమయమున దర్శనము లేవియు లేవు. బ్రాహ్మణుల వేదపఠనము, సుప్రభాతసేవ అయిన తర్వాతనే జరుగుచున్నది. హారతి, నవనీతము, భోగమూర్తిని శ్రీవారి పీఠము కడకు చేర్చిన అనంతరమే నివేదింపబడును. ఆయన శయితుడై యున్న సందర్భములో మాత్రముకాదు.

### శ్రీవారి విశ్వరూప సేవ

భక్తులు ధ్రువమూర్తితో జేరిన భోగ శ్రీనివాసమూర్తిని దర్శింతురు. దీనిని "విశ్వరూప సందర్శనసేవ" అని పిలుతురు. రాత్రి బ్రహ్మార్చనముతో ఈ సేవ అనుబంధితమగును. దర్శనములో భాగముగ బ్రహ్మాదులు గావించిన పూజాతీర్థమును భక్తులకు అనుగ్రహింతురు. శుక్రవారము నాడు తప్ప ఇతరదినములలో ఈ సేవ ఉచితము.

### తోమాలసేవ

తమిళపదమగు "తోమాలై" అనునది, 'పూలదండలతో స్వామిని అలంకరించుట' అను అర్థ మొసగును. తిరుమల ఆలయములో శ్రీవారి ధ్రువబేరమును పూలదండలతో అలంకరించుట అనునది ప్రత్యేక లక్షణము. పూలదండలు అన్నివిధముల ఆకృతులలో చిన్నవి, పెద్దవి యుండి ఒక్కొక్క ప్రత్యేక భాగములో అలంకరింపబడుటయే ఈ తోమాలసేవ లక్షణము.



విశ్వరూప సేవా సందర్శనానంతరము బంగారువాకిలి తెరవేయుదురు. పూజా సామగ్రిని కడిగి, ధ్రువమూర్తినుండి గతరాత్రి వాడబడిన పూలను వేరుచేసి "పూలబావి"లో వేయుదురు. ప్రాతపుష్పములను, శ్రీవారి నలంకరించిన దండలను వేరుచేయు కార్యక్రమమును "నిర్మాల్య శోధన" అందురు.

పూజాకార్యక్రమములను నిర్వహించుటకు కావలసిన తీర్థమును ఆకాశగంగనుండి తెత్తురు. తిరుమల తిరుపతులలో ప్రథమాచార్య పురుషులను నెలకొల్పిన తిరుమల నంబి కుటుంబములోని వంశపరంపరలోని వారికి ఆకాశగంగ తీర్థముతెచ్చు కార్యము విడదీయరానిదిగ నిర్ణయింపబడినది. ఆకాశగంగ తీర్థము మూడు పెద్దకలశములలో పూజార్థము తెచ్చెదరు. ఒక కలశములోని నీరు ఉదయపూజకు, రెండవది అపరాహ్ణ పూజకు, మూడవది రాత్రి బ్రహ్మారాధనమునకు ఉపయోగింతురు.

### పూజాక్రమము

తిరుమల శ్రీవారి ఆలయములోని పూజాక్రమమును క్రిందివిధముగ తెలియనగును. పూజాక్రమము 6 విధములుగ విభాగింపబడును. 1. మంత్రాసనము, 2. స్నానాసనము. 3. అలంకారాసనము. 4. భోజ్యాసనము. 5. యాత్రాసనము. 6. శయనాసనము.

### మంత్రాసనము

మంత్రాసనములో శ్రీవారికి అర్ఘ్య పాద్యాచమనము, తాంబూలము,ఆసనము- ఇవి ఐదు ఉపచారములు. పాద్యము పాదశుద్ధి కొరకు, అర్ఘ్యము హస్తశుద్ధికొరకు, ఆచమనము ముఖముకడుగుకొనుటకు వెండి ఉద్ధరిణిలో స్వామికి అర్పణముచేయు ఉపచారములు.

### స్నానాసనము

స్నానాసనములో ప్రతినిత్యము ధ్రువబేరమునకు అభిషేకము చేయుట సాధ్యము కాదు. కావున ఆలయములో శ్రీవారి ధ్రువ

శేర పాదముపై నున్న కవచమును దీసి వేరుగా నుంచి పాదాభిషేక మొనర్తురు. అభిషేకం సమయమున పురుషసూక్తాదులను పఠింతురు. మొదట కౌతుక మూర్తికి సుగంధపుష్ప తైలానులేపనమును గావింతురు. ఆ వెనుక నీటితో వీనిని కడుగుదురు. అంత గోక్షీరము, గంధోదకము, మధువు, హరిద్రోదకముతో వరుసగా అభిషేక మొనర్తురు. ఒక్కొక్క అభిషేకాంతమున ఒక శుద్ధోదక స్నానము సమర్పింతురు.

## అలంకారాసనము

ఇందు వస్త్రము, భూషణము, ఉత్తరీయము మొదలగు వానిచేతను, ఊర్ధ్వపుండ్ర ధారణము, యజ్ఞోపవీత సమర్పణము వాని వాని మంత్రములచే శ్రీవారికి సమర్పణమగును. తిరుమలలో శ్రీవారికి ఊర్ధ్వపుండ్రముగ పచ్చకర్పూరము, కస్తూరిని ఉపయోగింతురు. దీనితర్వాత మంత్రపుష్పము పఠింపబడును. ఉదయము ఆలయములో జరిగెడి ఈ అలంకారాసన ప్రక్రియయే ఒక దర్బారుగ నుండును.

## శ్రీనివాస సహస్ర నామార్చనము

ఇది నిత్యకార్యక్రమములోనిదైనను, భక్తులకుగూడ అవకాశమీయబడినది. భక్తులెవ్వరైనను తమ ఐహికాముష్మికములగు వాంఛలను తీర్చుకొను నిమిత్తము దేవస్థానము వారికి రుసుముచెల్లించి ఈ అర్చనము నిర్వర్తింప జేసికొందురు. ఈ పూజా సమయములో శ్రీ వేంకటేశ్వరుని సహస్ర నామములే పఠింతురు. భక్తులు ఎవరి గోత్రనామములను వారే చెప్పికొనవలసి వచ్చుట ఇటీవల జరిగినమార్పు. త్వరిత గతిని దర్శనము కొనసాగించుటకై ఈ పద్ధతి ఏర్పాటుగావింపబడినది.

## భోజ్యాసనము- నివేదనము

శుద్ధి కార్యక్రమము జరిగిన తర్వాత తయారైన ప్రసాదములన్నిటిని గర్భగృహమునకు ముందున్న ముఖమండపము కడకు చేర్చెదరు. ఈ ప్రసాదములను గంగాళములలో దెత్తురు. బంగారువాకిలి మూయబడును లేదా తెరవేయబడును. అర్చకులు మాత్రమే లోపలనుందురు. మంటపములోని రెండు ఘంటలు చెవులు గింగురుమనునట్లు మ్రోగింతురు. తలుపులు లేదా తెర వేయకముందే అందరును ముఖమండపమునుండి వెడలుదురు.

## హోమము

వైవేద్యము తర్వాత హోమము గురించి శాస్త్రము చెప్పినది. ఈ హోమము దినమునకు మూడు పర్యాయములు లేదా కనీసము ఒక్క పర్యాయమైనను చేయునగునని చెప్పబడినది. తిరుమల శ్రీవారి ఆలయములో హోమనిర్వహణము ఇటీవల నూతన ఆస్థాన పండితులవారి ప్రేరణచే పునరుద్ధరింపబడినది.

## యాత్రాసనము- బలినివేదనము

"బలి" అనగా ముద్గాన్నము (పెసరపప్పుతో ఉడికించిన అన్నము.) తిరుమల శ్రీవారి ఆలయమున బలి నివేదనమును, అర్చక పరిచారకులు విమానప్రదక్షిణమును చుట్టి, విష్వక్సేనునకు, గరుడునకు వారి స్థానములలోను, ధ్వజమునకు, యూథాధిపునకు నొసగి, మిగిలినది బలిపీఠమునకు ధ్వజమునకు మధ్యగల ఐదు శిలాఫలకములమీద నుంచుదురు.

## శాత్తుమొఱ (మంగళాశాసనము)

బలి నివేదనము తర్వాత అర్చకుడు ఆలయప్రవేశము గావించిన తర్వాత శ్రీ వైష్ణవులు జియ్యంగారిని ముందిడుకొని సన్నిధిలోనికి ప్రవేశింతురు. అచట జియ్యంగారుచేతితో పుష్పములను ఇచ్చును అర్చకస్వామి శ్రీవారికి పూజ యొనర్చును. ఈ సందర్భమున వైష్ణవశిఖామణులు ప్రబంధమును పఠింతురు. మధ్యాహ్న పూజ (తోమాలసేవ) శాత్తుమొఱతో పూర్తి యగును.

## ధర్మ (సర్వ) దర్శనము

దీనికి ఉచితదర్శనమనియు, సర్వదర్శనమనియు, ధర్మదర్శన మనియుపేర్లు. ఈ ధర్మదర్శనములో బీద, బిక్కి, ధనవంతుడు, దరిద్రుడు, చిన్న పెద్ద, స్త్రీ పురుష, బాల వృద్ధ భేదములేక ఎల్లరకును దర్శనము లభించును. ఇది నేడు రాత్రి పది గంటల వరకు పొడిగించబడినది.

## అపరాహ్ణపూజ

ఇది రెండవ ఘంటాకాలము. సంగ్రహపూజ జరుగును. ఈ అర్చనకూడ పూర్వము అర్జితమే. నేడు పరిమితము. ఈ పూజ అనంతరము తిరుమామడి మంటపములో నున్న రెండు ఘంటలు మొరయును, నివేదనము జరుగును. రెండవ ఘంట అనంతరము పగటి కార్యక్రమము పూర్తియైనట్లు భావింపవచ్చును. పూర్వము ఈ కార్యక్రమానంతరము పగటి పూట తలుపులు మూసివై చెడివారు. కాని నేడు ఈ సమయమును ధర్మదర్శనమునకు వినియోగించుచున్నారు.

## రాత్రిపూజ

రాత్రిపూజ ఉదయపు తోమాలసేవను బోలియుండును. ఇది పూర్తిగా ఇతరులకు ప్రవేశము లేనిది. ఆ సమయములో విధులను నెరవేర్చువారుతప్ప ఇతరులెవ్వరును ప్రవేశింపరాదు. ఇచట నివేదింపబడు అన్నప్రసాదములు పరిమాణములోను, పరిమితిలోను ఉదయముకంటె చాలతక్కువ. నేడు ఈ పూజాకాలములో మాత్రము సర్వదర్శనము కొంత తడవు ఆపి మరల సర్వదర్శనము కొనసాగించుచున్నారు.

## నిశిరాత్రిపూజ

దీనిని అర్ధయామ పూజ యందురు. ఈ పూజలఘువుగను, సంగ్రహముగను జరుగును. మధుర పదార్థములు, పాయసము నివేదింపబడును.

## శయనాసనము

ఇందు భోగ శ్రీనివాసమూర్తిని శయన స్థలికి జేర్తురు. మార్గశిరమాసము (ధనుర్మాసము)లో దప్ప మిగిలిన పదకొండు నెలల కాలములోనూ ఈ మూర్తియే శయనమూర్తి మంచిగంధపు చెక్కతో చేయబడిన ఉయ్యాల మంచమునకు వెండిగొలుసులు తగిలించి, లోపల మెత్తటి పట్టు పరుపును దిండులను ఉంచెదరు. ఈ సేవను దర్శించుటకు భక్తులు రుసుము చెల్లించవలెను. దీనికి ఏకాంతసేవ అనియు పేరు. తీయని వేడిపాలు, పండ్లు, బాదము పలుకులు

శ్రీవారికి నివేదించినవి భక్తులకు ప్రసాద ముగ ఇచ్చెదరు.

### పూలంగి సేవ

ప్రతి గురువారము మధ్యాహ్నకాల పూజానంతరము శ్రీవారికిగల సర్వాభరణ ములను సడలింతురు. కేవలము ధోవతి, ఉత్తరీయములను మాత్రము అలంకరింతురు. పచ్చకర్పూరముతో అమర్చబడిన నామమును కస్తూరిని కేవలము చిహ్నము గానుంచి మిగిలినదంతయును తీయుదురు. నాడు సర్వదర్శనము సాయంత్రము 6 గంటలవరకు మాత్రమే యుండును. ఆతర్వాత శ్రీవారికి పూలంగిసేవకు సన్నాహ మొనర్తురు. శుద్ధి కార్యక్రమమైన పిదప, వక్కని సన్నాయి మేళము మ్రోగు చుండగ, ప్రత్యేకముగ తయారుచేసిన దండలతో శ్రీవారిని అలంకరింతురు. ఈ అలంకరణములో ధ్రువబేరము నంతయు పూలతో కప్పుటచే ఈ సేవను పూలంగి సేవగా వ్యవహరించుచున్నారు. రాత్రి 8 గంటలనుంచి 10 గంటలవరకు పూలంగి సర్వ దర్శనం గలదు. ఈ పూజ (సేవ) ఎప్పుడు ప్రారంభమయ్యెనో తెలియదు. కాని "శిల ప్పదిగారము"న శ్రీవారిమూర్తిని వర్ణించు సందర్భమున ఈ సేవవర్ణింపబడినది. తమిళ పదమగు 'పూవాడై' అనుపదమునకు తెలుగు పదము పూలంగి. శుక్రవారము జరుపబడ బోవు అభిషేకమునకు పూర్వరంగమే ఈ సేవ లోని అంతరార్థమని గూడ చెప్పవచ్చును.

### శుక్రవారాభిషేకము

తిరుమల శ్రీవారికి నిత్యాభిషేకము లేకుండుటతో వారమున కొకసారి, అదియును శుక్రవారమునాడు ఈ అభిషేకము జరుగుచున్నది. పునుగు తైలమును తయారుచేసి దానిని శ్రీవారి ధ్రువబేరము ముఖమునకు లేపనముచేయుటను 'పునుగు కాప్పు' అందురు. నేడు ఈ సుగంధ తైలమును శ్రీవారి అంగములకన్నిటికి పట్టించుచున్నారు. ఈ శుక్రవారాభిషేకము నకు చాల ప్రాచీనత గలదు. పునుగుతైల మును శ్రీవారికి లేపనముచేయుటకు ముదలియార్ తిరుక్కలి కనిదాసరు అల గప్పిరానార్ అను వైష్ణవనాయకుడు ఈ తైలమును సరఫరాచేయుటకు (1-207. 16-7-1434) దానశాసనము వ్రాయించెను.

భక్తులు శుక్రవారాభిషేకమునకు రుసుము చెల్లింపవలెను. రూ. 500, 200, 100 లు ఈ రేట్లతో భక్తుని శక్తినిబట్టి చెల్లించవలెను. 5 గంటలకే అభిషేకము ప్రారంభింతురు. పూర్తియగుటకు 6-30 గం॥లగును దేవాలయాధికారులే గిన్నెలతో ఆ యా అభిషేకద్రవ్యములను అర్జితసేవా భక్తుల కొసం గుదురు. మేళములతో విమాన ప్రదక్షిణము గావింతురు. కేవలము శ్రీవారికి గాక, శ్రీవారి వక్షమందు తగిలింపబడిన "అలర్ మేల్ మంగాదేవికి" గూడ అభిషేకము జరుగును. ఈసందర్భమున ఉపయోగించు వస్తుసామగ్రి:- గంబూర పచ్చకర్పూరము 84 తులములు; పునుగుసంచులు- 1 1/2 వీశె కుంకుమపువ్వు- 36 తుల కస్తూరి 3 వరాహ ముల తూకము. పసుపు- 7 తులములు. పై విధముగ తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఆలయమున అర్చనలు, సేవలు జరుగుచున్నవి. ఈ సేవలను, అర్చనలను సందర్శించి భక్తులు తమ పాపములను ప్రక్షాళనము గావించుకొనుచున్నారు.

ఈ వ్యాసమునకు ఆధారగ్రంథము:- తిరుపతి చరిత్రము- శ్రీమాన్‌దివిరంగనాథా చార్యులవారు.

— డా॥ సి. రమణయ్య



## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం, అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.

"నేనెవరిని ?"

[పుటలు 69; 1/8 క్రౌన్; వెల 4.00: ప్రాప్తిస్థానం:- హరినామసంకీర్తనాశ్రమం రామతీర్థం (వయా) చీమకుర్తి, ప్రకాశం జిల్లా.]

గాయత్రీమంత్ర స్వరూపులైన పండిత శ్రీరామశర్మ ఆచార్యగారు సుమారు 600 ఆధ్యాత్మిక గ్రంథాలను రచించిన మహామనీషి. ఆగ్రంథమాలలో ఈ పుస్తకం పరిమళాన్ని వెదజల్లే ఒకకుసుమం. వారుహిందీలో వ్రాయగా బహుభాషావిద్వాంసులైన శ్రీమాన్ పరాశరం నరసింహాచార్యులవారు దీనిని తెనిగించారు. రచయిత వృత్తిరీత్యా శారీరక వైద్యులైనా ప్రవృత్తిరీత్యా ఆధ్యాత్మిక వైద్యులుకూడా.

ప్రాణమనోబుద్ధీంద్రియాలకు అతీతంగా ఉన్న ఆత్మను తెలిసికోవడానికి అనాది నుండి మానవుడు ఆరాటపడుతున్నాడు. రకరకాల సాధనలను చేస్తున్నాడు . కస్తూరి మృగం తననుండి వచ్చే సువాసనను గుర్తించలేక ఎక్కడనుండో వస్తోందని ఎట్లా తిరుగుతూ ఉంటుందో అట్లాగే మనిషి ఎక్కడో ఆనందం కలుగుతుందని అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఎక్కడో కాదు, ఆ సుగంధం నీలోనే ఉందని మాటిమాటికి మహాత్ములు హెచ్చరిస్తూనే ఉన్నారు. అయినా మాయ క్రమ్ముతూనే ఉంది.

పొగతో కూడిన వాతావరణంలో ప్రాణాయామం చేయాలని చెబితే ఉపకారం కన్న అపకారం ఎక్కువచేస్తుంది కదా! గుర్రానికి నాడాలు కొడితే లాభంకాని, కప్పపిల్ల కాళ్లకు నాడాలు కొడితే మొదటికే మోసంకదా! అట్లాగే యోగమంత్ర సాధనలవల్ల లాభం లేదని 'నే నెవ'రనే ఆత్మవిచారణవల్లనే అనంతసుఖం లభిస్తుందని గ్రంథకర్తల హెచ్చరిక.

నిజమే! అందరూ ఆ చివరమెట్టు ఎక్కగలరా? అధికారిభేదాన్ని గుర్తించి రకరకాల మనః ప్రవృత్తులు కలవారికి భిన్నభిన్న సాధనలను అందించింది మన సంప్రదాయం. దీనిని గుర్తిస్తూ 'నేనెవరిని' అనిప్రశ్న వేసుకుంటూ ముందుకు సాగుదాం. గొర్రెల మందలో చిక్కిన సింహాన్ని "నువ్వు గొర్రె పిల్లవు కాదు, సింహానివే, గర్జిం"చని హెచ్చరించినట్లుగానే మనం అమృత పుత్రులమని ఈ పుస్తకం మేలుకొల్పుతోంది.

నీరు సముద్రానికి చెందింది కాబట్టి సముద్రం పై పుకి పరుగెత్తుతోంది. దీపకాంతి సూర్యునికి చెందింది కాబట్టి దీపశిఖ చూపు పైపైకే. అట్లాగే జీవుడు పరమేశ్వరునికి చెందినవాడు కాబట్టి పరమేశ్వరునివైపే దృష్టిపెట్టాలని సర్వవేదాంత గ్రంథాల సారాంశం.

ఈ చిన్నిపుస్తకంలో 25, 30 అచ్చు తప్పులుండడం బాధాకరం. శ్లోకాల్లో, మంత్రాలలోకూడా తప్పులు దొర్లాయి, ఈ పుస్తకాన్ని చదవండని చెప్పడంకన్న ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించండన టం సబబు.

—దేవరకొండ శేషగిరిరావు.

# గ్రంథసమీక్ష

## "శ్రీ వేంకటేశ్వర హంసయాన మంజరి"

[రచయిత: శ్రీ కార్యమపూడి నాగభూషణం వలపర్ల (పోస్ట్) ప్రకాశం (జిల్లా) పుటలు: 34; వెల రు. 1.50]

ఇది భక్తిశతకం; "వేంకటేశ్వరా" అనే మకుటంతో వ్రాయబడ్డ గ్రంథం. శతక మర్యాద ననుసరించి అష్టోత్తరశత (108) సంఖ్య పద్యపరివ్యాప్తమైఉంది. రచయిత ఎన్నుకొన్న ఛందస్సు "హంసయానము". ఇది సాధారణంగా అందరు కవులు తీసుకొని వ్రాసే ఛందం కాదు. ఈ ఛందం రచయిత స్వీకరించడంలోనే వారికిగల నవ్యత్వాభిలాషవ్యక్తం అవుతున్నది. ప్రతి పాదానికి ర, జ, ర, జ, ర అనే ఐదు గణాలుంటాయి. తొమ్మిదవ అక్షరం యతి స్థానం. ప్రాస నియమం ఉంటుంది. ఇదీ బాహిరమైన హంసయానపద్య స్వభావం. తెలుగు ఛందం అయిన ఉత్సాహ పద్యానికి దగ్గరగా ఉంటుంది. హంసయానము- అనే పేరులోనే ఆ పద్యం ఎంత మనోహరంగా నడుస్తుందో వ్యక్తం అవుతూనే ఉంది.

శ్రీ నాగభూషణంగారు ఇదివరకే ఎన్నో గ్రంథాలు రచించి ప్రచురించిన కవులు. 'మధుర భారతి' వీరికి అన్వర్థ బిరుదం. కవిత్వానికి కావలసిన ప్రసాదగుణం వీరి కవితలో ప్రతి పద్యంలోను సాక్షాత్కరిస్తూ ఉంది.

జీవితంలో తటస్థించే కష్టసుఖాలను గూర్చి ప్రస్తావించారు; తాత్కాలిక యౌవనదశను నిరసించారు. భక్తి- ప్రధానమైన నాడిగా నడచిన ఈ గ్రంథంలో తెలుగు సంస్కృతాలు సమానమైన ప్రౌఢ సరసత్వాలతో ప్రయుక్తాలైనవి.

"తమ్మిచూలి గన్న బొడ్డు దమ్మివాడ! వెల్గులన్
జిమ్ము మానికంపు సొరు జీరు కేల్గలాడ!లో
కమ్ములేలు దొడ్డఱేడ! కట్టివేల్పు! వేగ జే
కొమ్ము నా జొహారు లివ్వె కూర్మి వేంక టేశ్వరా!"

అన్నపద్యంలో 'లోకమ్ములు' అనే పదం తప్ప మిగిలినదంతా అచ్చ తెలుగులో ముచ్చటగా ఉంది.

"పాహి వేంకటాద్రివాస! పాహి శ్రీనివాస! మాం
పాహి గారుడాద్రివాస! పాహియంచు భక్తులు
ద్వాహులై భవన్నిశాంత భర్మగేహళిన్ కృతో
త్సాహులై భజించుచుంద్రు తాల్మి వేంక టేశ్వరా!"

అనే పద్యం "సంస్కృతంబు గుణమగు" కొందఱికి "ఒహో!" అని పించక మానదు.

కొన్ని పదాలలో కంచెర్లగోపన్న గుర్తు వస్తాడు.

అజమహారాజు కుమారుడైన దశరథుఁడు అనడానికి బదులుగా "అజి" అని ప్రయోగించడం ప్రౌఢ సుందరం.

సరసమైన భావన, సరళమైన రచన.

భక్తులు చదివి ధన్యులు కాదగ్గ పుస్తకం. పట్టుమని కూర్చుంటే పారాయణచెయ్యడానికి అర గంట.

—గాదేపల్లి.

## మహాభాగవతం

(మూడవ భాగం)

[రచయిత: శ్రీ నాయని కృష్ణమూర్తి
ప్రాప్తిస్థానము:— విజయవాణీ పబ్లిషర్సు
చౌడేపల్లి–517257 చిత్తూరు జిల్లా.]
వెల: రూ. 10–00.

పోతనామాత్యుని భాగవతాన్ని అనుసరించి వ్యావహారికభాషలో సంతరించిన గ్రంథం. శ్రీ కృష్ణావతార ఘట్టానికి సంబంధించిన దశమస్కంధానికీ, తరువాతి రెండు స్కంధాలకూ (ఈ రెండూ పోతన ప్రియశిష్యుడు వెలిగందల నారయ రచించినవి) ఇది కాస్తసంక్షిప్త రూపం.

భాగవతానికి జీవధాతువు దశమ స్కంధం. కృష్ణావతారం వన్నెచిన్నెలూ విలాసాలూ విహారాలూ కళ్లకి కట్టినట్టు పోతనామాత్యుడు చెప్పాడు. మిగిలిన కథలు గల స్కంధాలు వేరు.

రామాయణానికి సుందరకాండ, భారతానికి విరాటపర్వం, భాగవతానికి దశమ స్కంధం హృదయగ్రంథులుగా ప్రసిద్ధాలు. అలాటి భాగవతం తాత్త్విక ధర్మసూత్రానికి కుదురుగా కూడా పేరు పొందింది. భక్తికీ రక్తికీ ముక్తికీ భాగవతం విడిదిపట్టు. భక్తి విషయములో వ్యాసులవారి అభిభాషణాలకు పైచేయిగా పోతనామాత్యుడు తన రచన నడిపించాడనేది నిర్వివాదం.

మూలాన్ని అనుసరించి పద్యరూపముగా కొందరు పెద్దలు తెనుగు చేశారని వినికిడి. గ్రాంథికవచనములో కొందరు వ్రాసి అచ్చయిన వాటిని కొన్నిటిని చూశాను. నేనూ వ్యావహారిక వచన రీతిని సంతరించాను.

ఏతద్గ్రంథకర్త వచనం పండితులమాట చెప్పలేనుగాని సామాన్యుల కందరకూ సులభగ్రాహ్యమై ఆరంభిస్తే చివరంటా చదివిస్తుంది. అక్కడక్కడ తొందరపాటుగా దొరలిన పొరపాట్లు (దంతవక్త్రుడు కృష్ణుణ్ణి శిశుపాలదంతవక్త్రసంహారకా అని సంబోధించడంవంటివి) సవరించవలసినవీ ఉన్నా చదువుకోవడానికి హాయిగా ఉంది. నేడు ఈలాంటి గ్రంథాలు ప్రచారంలోనికి రావలసి ఉన్నాయి. శ్రీ కృష్ణమూర్తి ఇదే విధంగా భాస్కరరామాయణం కూడా వ్రాసి ప్రకటించడం ఉభయతారకం అని నా సలహా.

దీని ముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేసిన ఆర్థికసహాయం సార్థకమయింది.

— యామిజాల పద్మనాభస్వామి

## విజయగీత

[రచయిత:– చింతలపూడి వెంకటేశ్వర్లు, 1/8డెమ్మీసైజు పుటలు: 58. ప్రతులకు: శ్రీ కూర్మాల రాములుగారు, చందాసత్రం వీథి, రాజమహేంద్రవరము 533101 వెల:– 5 రూ.]

మతంపట్ల, మతగ్రంథాలపట్ల ఆసక్తి తరిగి పోతుందని కొందరి అభిప్రాయం. కాని ఈనాడు వెలువడుతున్న మత గ్రంథాల ప్రచురణ అయితేనేం, దేశమంతటా జరుపబడుతుండే గీతాయజ్ఞం, మహాపురుషుల జయంతి ఉత్సవాలు, సప్తాహాలు, సామూహిక భజన కార్యక్రమాలు పై అభిప్రాయాన్ని కాదని నిరూపిస్తున్నవి. ఇది జాతికి శుభలక్షణం కూడా.

మతగ్రంథాలల్లో గీతకున్న ప్రాధాన్యం మరి దేనికీ లేదు. ఈ భగవద్గీత సాహిత్యంలోని వివిధ ప్రక్రియారూపాల్లో వెలువడుతుంది. ఒకప్పుడు వేదాన్ని అనువదించడం పాపం. భారతభాగవతాదుల్ని తెలుగు చేయడం నేరం. అది ఆనాటి సాంఘికవ్యవస్థ. కాలం మారింది. ప్రజలు మారారు. మతాధినేత లనే మతాధిపతులు, ధర్మోపదేశం చేసే స్వాములు తమ అభిప్రాయాల్ని మార్చుకొన్నారు. తెలుసుకోవాలనే జిగీష, తెలియ జెప్పాలనే తపన దీనికి కారణం. ఈలాంటి ప్రయత్నంలో "గీతానువాదం" బాగా ప్రచారం పొందింది.

శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు ప్రసిద్ధ కవులు. ఇదివరకే పద్మావతీ పరిణయం, అమృతవర్షిణి గ్రంథాలు వ్రాశారు. వీరు తణుకు ఉపకారాగారంలో పూర్తి చేసిన రచన 'విజయగీత'. ఈ పేరు పెట్టడంలో ఔచిత్యం వుంది. భారతానికి 'జయ' అనే పేరుంది. భారతంలోనిదే భగవద్గీత. అంచేత 'జయగీత'. విజయునికి బోధింపబడ్డ గీత. అంచేత విజయగీత. అంతేకాదు లౌకిక ఆధ్యాత్మిక విజయం పొందాలనే వారికి ఉద్బోధించే గీత విజయగీత.

భగవద్గీతను ముద్రించినవారు అనేక రకాల వాళ్ళున్నారు. మూలం మాత్రం వేసినవారు కొందరు, మూలంతో అనువాదం ప్రకటించినవారు కొందరు. మూలం, అనువాదంతో వ్యాఖ్యానం చేసినవారు కొందరు. మూలానికి వ్యాఖ్య వ్రాసినవారు కొందరు. కథాప్రవాహంలో భగవద్గీతను సాగిస్తూ చివర శ్లోకాలను ఒక చోట కూర్చినవారు కొందరు. అయితే శ్రీ వేంకటేశ్వర్లుగారు 'అనువాదం' మాత్రం ప్రకటించారు. ఈ అనువాదంలో ఎంతో వైశిష్ట్యం వుంది.

మొదటిది సంస్కృతం తెలిసినవాడు మూలాన్ని ఎంత బాగా అనువదించాడో చూస్తాడు. మూలానుసారి అయితే సంతోషిస్తాడు. 'గీత'లో ప్రసిద్ధమయిన శ్లోకనువాదం ఎలావుందో పరిశీలిస్తాడు. శ్రీ వేంకటేశ్వరుల వారు చక్కటి అనువాదం చేసినవారు.

మచ్చుకు–

"కర్మణ్యేవాధికారస్తే
మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూః
మా తే సంగోఽస్త్వకర్మణి."

కర్మ చేయుటె నీవంతు కాని దాని
ఫలమునకు కారణముకావుతెలిసికొనుము;
సిద్ధి కలిగిన కాకున్న బుద్ధికలిగి
సమమనస్కుఁడవై కమ్ము సాధకుఁడవు.

అనువాదంలో తెలుగుతనం నిలపడం రెండవ అంశం. స్వతంత్రరచన యనిపించే టట్లుగా సాగించడం ఇందులోని ప్రత్యేకత.

ఉదాహరణకు :

"పుట్టి చచ్చెడి కట్టెల పుట్టలందు
మనసునుంచరు పండితజనులు భువిని'
"నీదు తలమీదనే పోరు లేదు పార్థ
రగులు నది నాదు నానపై"
"నాదు కనుసన్నలందు నీ ఖేదజగతి
నాట్యమొనరించుటే గాని"
"చెవులఁ జవులూరునట్లు నేఁ జెప్పినట్టి"
"పార్థు సందేహ వివృతికి బట్టవిప్పి
గుట్టుఁ జూపిన కృష్ణుండు"

అనువాదంలో కావ్యగుణాల్ని పరిశీలించడం కూడా విమర్శలో ఒక భాగం. ప్రధానంగా 'శైలి' ఇందులో చేరుతుంది. శ్రీ వేంకటేశ్వరుల పద్యాలలో ఎక్కడా 'విరుగుడు' 'పులుముడు' కనిపించవు. సహజంగా సరళంగా సాగడం వీరి పద్య ధారలో మెచ్చుకోదగ్గ అంశం. అప్రయత్నంగా వృత్త్యను ప్రాసాదులు అందంగా అమరడం మరొక విశేషం.

"అంచుఁ దలవంచి విలపించు...............
రంగు నరురంగు పొంగనుత్తుంగసంగ
రాభిముఖుఁజేయు"

సముద్రంలో రత్నాలు తీసినకొద్దీ ఇంకా లభిస్తూనే వుంటాయి. 'గీత'కు ఎన్ని వ్యాఖ్యలు వచ్చినా చాలవు. ఆ భగవద్గీతకు పద్యానువాదరూపమయిన వ్యాఖ్యానం 'విజయగీత'. తిరుమల తిరుపతి దేవస్థానం వారు 'విజయగీత'కు ఆర్థిక సహాయం చేయడం ఎంతో ప్రశంసింపదగినది.

—డా॥ కె॥ సర్వోత్తమవ్

## ఆక్రందన శతకం

[రచన : డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం సైజు : క్రౌన్ ¼ పుటలు 12+88 వెల : నాలుగు రూపాయలు దొరకుచోటు : శ్రీ గిరిజా ప్రచురణలు బి-31 విద్యాలంకార్. శ్రీనివాసనగర్ కాలని, గుంటూరు-6.]

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తంగారు వ్యాకర్తగా కవిగా విమర్శకులుగా సుప్రసిద్ధులు.

"ఆలకింపు మాక్రందన మాంజనేయ" అనే మకుటంలో 150పైగా తేటగీతి పద్యాలు గల పుస్తక మిది. నేటి సమాజంలో నెలకొని ఉన్న అనేక దోషాలను ఎత్తిచూపుతూ "రామ భజనకు సుంత విరామ మొసగి" తన ఆక్రందన ఆలకించ వలసిందని ఆంజనేయుని దగ్గరకు పిలిచి చెప్పుకొంటున్నారు కవి-సిగ్గు విడిచి, నొప్పి తగ్గుతుందనే ఉద్దేశంతో, వేరే దిక్కులేక.

"సర్వరోగాలు దీర్చు నౌషధ మొకండు
పడసి యేదైన సంజీవ పర్వతమున
తత్క్షణ మొసంగుమా ప్రాణభిక్ష మాకు"

అని లక్ష్మణ ప్రాణదాతను కవి అభ్యర్థిస్తున్నారు.

"కలియుగాంత విజ్ఞానమ్ము" ఎటువంటిదో కవి యీ చిన్న పుస్తకంలో వీలైనమట్టుకు వివరించారు.

"తల్లిదండ్రుల పట్ల, బాంధవము పట్ల
అన్నదమ్ముల పట్ల, ప్రజాళి పట్ల
చెక్కుచెదరని వ్యాపార చింత చెలగు"

చున్నదని కవి బాధపడతారు.

"విగ్రహారాధనం బవివేక మనుచు
వీథివీథుల నాయక విగ్రహములు
నేల నెలకొల్ప?" నని ప్రశ్నిస్తున్నారు కవి.

"మానవసేవే మాధవసేవ" అనే మాట మనం పెక్కుచోట్ల గమనిస్తున్నాం. 'మాధవుని జాడ లెఱుగని' వారు మానవసేవ మాత్రం ఏమి చెయ్యగలరని కవి అబ్బురపడతారు. మాధవుడు కాదగిన మానవుడు దానవుడుగా దిగజారుతున్నాడు. సత్కర్మ చెయ్యడం కన్న సులువుగా కవిత అల్లడం ఎక్కువయి పోయిం దీ నాడు. "చెప్పుట సులభం చేయుట కష్టం" సామెత ఉన్నదే. అయితే ఎవరికి వారు ఆత్మపరిశీలన చేసుకోవలసి ఉంది.

దేవుడు లేడు లేడంటూ పూజించేవాళ్లు కొందరు. కలడు కలడంటూ మోసం చేసే వాళ్ళు కొందరు. నరుల నటనా విశేషాల్ని వర్ణించడం ఎవరి తరం పొమ్మంటున్నారు కవి.

'కుక్క విశ్వాసముగల జంతువు' అని మనం చదువుకున్నదే. కాని విశ్వాస గుణాన్ని కుక్కకే వదలి వేస్తున్నాము. ఎందుకు? అది జంతు గుణమని! 'కుక్క తోక వంకర' అని తెలుసు. ఆ వంకరబుద్ధి మాత్రం మనకు బాగా ఒంట బట్టింది.

దేవాలయాలకు వెళ్ళే ఆసక్తి లేదు. సినిమాలకై తిరుగాడుతారు. సకల కళాను భూతి అక్కడే లభిస్తుంది. అందమంతా చీరలోనే ఉన్నది కద? అథవా గుడికి వెళ్ళినా ముగ్ధకన్యల పట్ల వ్యామోహ బుద్ధితోనే గాని అన్యచింతన లేదు.

ఇట్లా లోకపరిశీలన కొనసాగి పోతుం దీ రచనలో. ఈనాడు సమాజాన్ని చూచి బాధపడుతూన్న సంస్కరణాభిలాషు లందరూ ఈ విమర్శను యథాక్షరంగా అంగీకరించ లేక పోవచ్చుగాని, ఇందలి కవి ఆక్రందన వారి చిత్తశుద్ధికి తార్కాణగా మాత్రం నిలబడుతుంది.

'స్వీయమున కన్న పరము రుచించు మిగుల' అని కవి ఎత్తి పొడుస్తాడు.

"ఎదుటివారి సొమ్ము లెల్లవారికి దీపు' అని వేమన కూడా అన్నదే.

'కొడుకులను గన్న యమ్మకు గోడపంచ
కూతులను గన్నతల్లికి కుర్చిపీట —

'ఆలివైపున బందుగు లాప్తులౌర!' అని అంటారు కవి. వేమన యీ మాటనే యింకా బలంగా అన్నాడు —

'అలివంకవారు ఆప్తబంధువు లైరి
తల్లి వంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాది పగవారు'

డా. బొడ్డుపల్లివారు ఈనాటి సమాజం లోని కుళ్ళును చేతనైనంత ఎత్తిచూపారు. వేమన, సర్వజ్ఞుడు మొదలైనవారు ఆయా కాలాల సమాజాల దోషాలను ఎగతాళి చేసి సంస్కరింప జూచిన వాళ్ళే. "విశ్వశ్రేయః కావ్యమ్" కద? "ఈ జగము లంక, నీవె దహింపవలయు" అన్నది కవిగారి ప్రార్థన. 'వానరుల మేము నాయకత్వము వహించు' అని కూడా అభ్యర్థిస్తున్నారు. "గుండెలను జీల్చి నీపలె గుడిని గట్టు పరమ భక్తుండు గలడె?" అని హనుమంతుని ప్రశంసిస్తున్నారు.

లోకనిందలో కవిగారు తమను గూడా చేర్చుకున్నారా అనిపిస్తుంది; క్రాప్ చేసుకొని, కోటు-టై-వేసుకొని ఫోటో తీయించుకున్నవారు వస్త్రధారణలో కేశ సంస్కారంలో అన్యసభ్యత తప్ప ఆర్షసభ్యత లేశమైనా లేదని ఆక్రందన చేశారు. లంచమిచ్చి దేవుణ్ణి మెప్పించే ప్రయత్నం అధికమైందని, లంచపు ఒత్తిడికి దేవుడి రాతి గుండెకూడా మెత్తబడుతుందనీ కవిచేస్తున్న తీవ్ర పరిహాసం — లంచాన్ని గురించే అయినా — భక్తుల దృష్టిలో కొంచెం శ్రుతి మించినట్లే.

ఈ ఆక్రందనను ఆర్తభక్తిగా పేర్కొన్నారు మున్నుడివ్రాసి యీ పుస్తకాన్ని ప్రచురించిన శ్రీమతి కె. గిరిజాలక్ష్మి, ఎం. ఏ., ఎం. ఫిల్.

"క్రియలలో శూరత్వమ్ము పూర్తిగ నశించె" అనే పాదం కవిగారు మరొకమారు జాగ్రత్తగా చూచుకొని ఉంటే ఛందోభంగం సవరించుకొని ఉండేవారు. కొగంటి సీతారామాచార్యులు గారు "ఆవిష్కృతి"లో ఇందలి కొన్ని గుణదోషాలను ప్రస్తావించారు. వారు పేర్కొన్న ఛందో వ్యాకరణాది దోషాలు భక్తి సాహిత్యంలో పెద్దపట్టింపు కిందికిరావు. ఇందలి పద్యాలు కమ్మగా హాయిగా దొర్లిపోతున్నాయి.

ఇది కవిగారి బాబాయి సీతారామాంజనేయులు గారికి అంకితం చెయ్యబడింది.

"ఆంజనేయం మహావీరం
బ్రహ్మవిష్ణు శివాత్మకమ్,
తరుణార్క ప్రభాభాసం
రామదూతం నమామ్యహమ్"

— వంటి శ్లోకానువాద పంక్తులు కొన్ని మొదట చేర్చబడినా, ఇది పూర్తిగా స్తుతి కావ్యం కాదుగాని, ఆస్తికు లోకసారి సరదాగా చదువుకోవచ్చు. ఇటువంటి పుస్తకాల వెల విషయమై కవిగా రన్నట్టు 'వ్యాపార చింత' ఎంత తగ్గితే అంత మంచిది.

— బండి నాగరాజు



# శ్రీనివాస సంకీర్తనం

జయ జయ పద్మావతీ హృదయేశ్వర
శేషగిరీశ్వర! శ్రీవేంకటేశ్వర! ॥ జయ జయ ॥

ఏడుకొండల మీద - కొలువున్న దేవా!
ఈరేడు లోకాల - ఏలుతున్నావా
ఆ వేగమందేము - వేవేగ రావా
శరణాగతుల గావ - కరుణార్ద్రభావా! ॥ జయ జయ ॥

పిలిచిన ఓయని - పలికేటి స్వామీ!
అడుగడుగు దండాల - అందుకోవేమీ!
శుభములు పొంగే - విభుడవు నీవే
అభయ మొసంగే - ప్రభుడవు నీవే ॥ జయ జయ ॥

నీ సుప్రభాతాలు - నిత్యకల్యాణాలు
నీ కాంతివలయాలు - ఆనంద నిలయాలు
ముగ్ధమోహన మధుర - లీలా విలాసా!
స్నిగ్ధసుందరహాస! - శ్రీ శ్రీనివాసా! ॥ జయ జయ ॥

స్వర్ణహార కేయూరాభరణా!
స్వర్ణ నూపురాలంకృత చరణా!
స్వర్ణోజ్జ్వల వజ్రమకుట మౌళీ!
స్వర్ణోత్సవ నవవైభవశాలీ! ॥ జయ జయ ॥

— డా॥ తరుణశ్రీ

# హాని చేసే పుస్తకం



చిల్లరకొట్టు చలమన్న వద్దకి చిత్తు కాగితాలతోపాటు అందమైన అట్టతో ఉన్న 'చోరశాస్త్రం' అనే పుస్తకం ఒకటి వచ్చింది. మంచి ధర వస్తే పుస్తకాన్ని అమ్మవచ్చని దురాశపడి ఇంట్లో దానిని భద్రపరిచాడు. ఒకసారి చలమన్న తండ్రి దృష్టిలో ఆ పుస్తకం పడింది. వెంటనే బీరువాలోనే, ఇంకొకచోట భద్రంగా దాచేడు. సామాన్లు కొనడానికి కొట్టుకి వచ్చే వాళ్ళకు పుస్తకం అమ్మజూపేడు. ఎవరూ కొనడం లేదు. పుస్తకం బీరువాలోనే ఉండిపోయింది. కొన్నాళ్ళకు చలమన్న కూడా ఆ పుస్తకం గూర్చి మర్చిపోయేడు. అతని పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళ చదువులు కూడ అవుతున్నాయి.



కొడుకును పిలిచి, "చలమన్నా! ఇది దుష్టగ్రంథం. దీనివల్ల హాని కలుగుతుంది. నీ పిల్లలు పెద్దవారవుతున్నారు. ఇది వాళ్ళ దృష్టిలో పడకూడదు. తీసి పారేయ్ ఈ పుస్తకాన్ని" అని మందలించాడు. చలమన్నకు తండ్రి మాటలు రుచించలేదు. ఆకర్షణీయంగా అందంగా ఉన్న ఆ పుస్తకాన్ని పారవేయడానికి మనసొప్పలేదు. తండ్రి కళ్ళు కప్పి ఆ పుస్తకాన్ని మళ్లీ

చలమన్న పెద్దకొడుకు రంగబాబుకి ఒకసారి బీరువాలో ఉన్న చోరశాస్త్రం పుస్తకం కంటపడింది. ఆమూలాగ్రం చదివి విషయసారాన్ని ఒంటపరచుకొన్నాడు. ఇంట్లో ఎవరిదృష్టిన పడకుండా జాగ్రత్తగా చిల్లర చిల్లర దొంగతనాలు చేయనారంభించాడు. వ్యాపారపుసందడిలో చలమన్న రంగబాబు చేస్తున్నపనులు పట్టించుకోలేక పోయాడు. ఒకరోజు తల్లి



## బాలప్రబోధం

మెడలో ఉన్న బంగారు నగను కత్తిరించి రంగబాబు ఊరునుంచే పరారై పోయాడు. విషయం తెలుసుకొని చలమన్న చాల బాధపడ్డాడు. తండ్రివచ్చి "చలమన్నా! చోరశాస్త్రం పుస్తకం చించివేయకుండా దాచిపెట్టావా, ఏమి? మన ఇంటావంటా దొంగతనమనేది తెలియదు. వాడికి ఏ లాగున ఈ పాడుబుద్ధి పుట్టిందో?!" అని నొచ్చుకున్నాడు. అప్పుడు చలమన్నకు చోరశాస్త్రం పుస్తకం గుర్తుకు వచ్చింది. బీరువా వెదికాడు. పుస్తకం కనిపించలేదు. కొడుకు దొంగగా మారడానికి కారణం తెలుసుకొని పిచ్చిగా జుత్తు పీక్కున్నాడు చలమన్న.

—బెలగాం భీమేశ్వరరావు

*

## నామ మాహాత్మ్యము

సర్వ శాస్త్రముల సారమౌ నామము
సంసార సంద్రమును దాటించు నామము
ఇహ పరములకు తారకమౌ నామము
మరి మరి పలికిన మధురమౌ నామము
ముక్కోటి దేవతలు కీర్తించు నామము
మునిజన ధ్యానైక పావన నామము
భక్తుని మది నిను బంధించు నామము
ఎదలోని జ్యోతిని వెలిగించు నామము
చక్కని మార్గము చూపించు నామము
శ్రీ వెంకటాద్రివిభు నీ నామము
తేనెల కన్న తీయనిది నిజము.

—కుమారి పి. ఆదిలక్ష్మి



# తెలుగులో శ్రీ వేంకటేశ్వర శతకాలు

ప్రాచీన తెలుగు సాహిత్యంలో ప్రసక్తానుప్రసక్తంగా తిరుమల వేంకటేశ్వరుని ప్రస్తావన మనకు కనిపిస్తుంది. పింగళి సూరన కళాపూర్ణోదయంలో సప్తర్షులు తిరుమల సందర్శించినట్లు వర్ణించబడింది. అలానే తెనాలి రామలింగని ఘటికాచల మాహాత్మ్యంలో వసిష్ఠాది మహామునులు శేషశైలాన్ని దర్శించినట్లు చెప్పబడింది. భక్తి రస భరితాలైన శతకాల ద్వారా తిరుమలేశుని భజించిన ఆధునిక కవులెందరో గలరు. ఆంధ్రశతక సాహిత్య వికాసమను పరిశోధనా గ్రంథమున డా. కె. గోపాలకృష్ణారావుగారు వివిధ శతకములను గూర్చి సవివరంగా చర్చించారు. అందులో వేంకటేశ్వర శతకాలను గూర్చి ఒక ప్రకరణం చేర్చారు.

తిరుమల క్షేత్ర దైవమైన వేంకటేశ్వరుని భక్తులు ఇష్టదైవంగాను, కలియుగ దైవాధి నాథుడుగాను, కొంగు బంగారంగా కొలుస్తున్నారు. తాళ్లపాక వంశంలోని కవులు స్వామి కొలువులో సంకీర్తనలు రచించి తరించారు. వేంకటేశ్వరుడు శ్రీహరి అవతార విశేషమని భక్తుల భావన! క్షేత్ర ప్రాధాన్యాన్ని కొందరు కవులు వర్ణిస్తే, పద్మావతీ వేంకటేశ్వరుల ప్రణయాన్ని మరికొందరు, విష్ణుమూర్తి లీలలను ఇంకొందరు వర్ణించారు.

18వ శతాబ్దికి చెందిన మంచెళ్ళ కృష్ణ కవి వేంకటనగాధిప శతకాన్ని రచించాడు. చంపకోత్పల వృత్తాలలో ఈ శతకం వేంకటేశ్వరుని కృపారస వీక్షణాలను వర్ణిస్తుంది. స్వామి దర్శనభాగ్యంతో తనవంటివారి చాపల్యం నశించి పోతుందని కవి భావించాడు. భవబంధములనుండి విముక్తి నొందుటకు స్వామి సేవయే పరమావధియని కృష్ణకవి అభిప్రాయం. క్రీ. శ. 1806. ప్రాంతమున రచింపబడిన శ్రీ తిరుమలగిరి వేంకటేశ్వర శతకకర్త శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యకవి. కృష్ణాతీరంలోని నందిగామ తిరుమల క్షేత్ర దైవమైన వేంకటేశ్వరుని వర్ణిస్తూ కవి ఈ శతకం రచించారు. మానవుని శరీరాంగాలన్నీ భగవంతుని సేవలో వినియోగించడాని కేర్పడినవే నని కవి నమ్మకం. కందపద్యాలలో రచింపబడిన ఈ శతకం భక్తిరస భరితం. శ్రీవిష్ణుమూర్తి అవతారమే వేంకటేశ్వరుడని కవి ఆరాధించెను.

భుజమెళ్ళ భగవచ్ఛాస్త్రి 1858 ప్రాంతంలో తిరుమల శ్రీ వేంకటేశ శతకం కూర్చాడు. నామగుణ స్తుతిరూపకమైన ఈ శతకంలో జీవన్ముక్తికై ఇష్ట దైవాన్ని కవి స్థాపించడం విశేషం! శిరస్సుపై రత్నకిరీటము, ఉరస్సుపై కౌస్తుభ రత్నము ధరించిన స్వామి విభీషణాది భక్తులను బ్రోచినట్లుగా తననుగూడ రక్షించ గలడని కవి విశ్వాసం!

అభినవ వేంకటేశ్వర శతకాన్ని 1925లో గోళ్ళబుచ్చిరాజు ప్రకటించారు. స్వామియే స్వప్నంలో సాక్షాత్కరించి శతక రచనకు పురికొల్పాడు. స్వప్నంలో భగవంతుడు సాక్షాత్కరించడం మనకు ప్రాచీనకవులు పెట్టిన వొరవడి: తిక్కనకు హరిహర నాథుడు కలలో కన్పించాడు. పోతనకు శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణదేవరాయలకు శ్రీకాకుళాంధ్ర దేవుడు-ఇలా ఎందరో ప్రాచీనకవులు తమ యిష్టదైవతాలు స్వప్న సాక్షాత్కారం చేసినట్లు చెప్పుకొన్నారు. అలానే ఈ శతకకర్త! పలికెడిది భాగవత

మట! పలికించెడివాడు రామభద్రుండట అని పోతన భక్తి పారమ్యంలో పలికినట్లుగా ఈ కవి 'పలుకు నీది, చెప్పువాడవు నీవు, చేయువాడను నేను–' అని భక్తి పారవశ్యంతో చెప్పాడు. వైరాగ్యోపదేశము ఇందు ప్రధాన విషయము.

మేరెడ్డి ఘట్టయ్య శ్రీ తిరుమల వేంకటేశ్వర స్తోత్ర మను పేర ఒక శతకమును 1929 లో రచించాడు. సీసపద్యాలలో నీ శతకం వ్రాయబడింది. 1932 లో పార్థసారథి నాయుడు చిత్తూరు జిల్లాలోని నారాయణవన వేంకటేశ్వర స్తుతిరూపమైన కల్యాణ వేంకటేశ్వర శతకాన్ని నామ గుణ స్తుతి ప్రధానంగా వెలయించాడు. స్వామిపేరు చెవి తినే సకల పాపాలు హరిస్తాయని కవి విశ్వాసం. ఈ కవి స్వామి దశావతారవర్ణనను వ్యాజస్తుతి ప్రధానంగా మధురభక్తి యుతంగా వర్ణించాడు. నీవు ఏ అవతారం దాల్చినా నీ ఆనవాలు నాకు తెలియకపోదు– నిన్ను వదలనని కీర్తిగుణ గానం చేశాడు.

చేపవై మున్నీటిలోపల దూరిన
వెదకి పట్టిదగాని విడువ నిన్ను
(మత్స్యావతారం)

తాబేటివై ధరాధరము క్రిందటనున్న
వెదకి పట్టిదగాని విడువ నిన్ను
(కూర్మావతారం)

గోటను ధరనిల్పుకొని ఘోటివైయున్న
వెదకి పట్టిదగాని విడువ నిన్ను
(వరాహావతారం)

ఇలా సాగిన ఈ పద్యం కవి వ్యాజస్తుతి రూపంలో సాగుతుంది.

1948 లో అల్లమరాజు నారాయణరావు, ఖులుసు వేంకటకవులు ఇద్దరూ కలిసి స్వామిని తమ 60వ ఏట సందర్శించారు. 21 దినాలలో ఈ శతకాన్ని పూర్తి చేశారు. కరములు గలిగినందుకు ధన్యత్వము కాగితము, కలము తీసికొని శతకము వ్రాయవలెనని వారి సంకల్పము. స్వామికే శతకమంకితము. వేంకటేశ్వరుడు బీబినాంచారమ్మను పరిణయమాడి హిందూమహమ్మదీయ మత సామరస్యమును పాటించెను. నిజాం పాలనలో వేలాది స్త్రీలు రజాకార్ల ఉద్యమంలో చెరబడ్డారు. నరకాసురవధ చేసిన స్వామి కారాగార బంధితులైన వేలాది స్త్రీలను రక్షించునట్లు వీరుకూడా రక్షింపబడాలని కవుల కోరిక. జాతీయనాయక స్తుతి హరిజనోద్యమము యిందు ప్రస్తావింపబడుట విశేషము.

అందే వెంకటసుబ్బయ్య (1949) లో గేయరూపమున వేంకటశ్వరుని శతకస్తుతి చేసెను. పద్మావతీ శ్రీనివాసుల ప్రణయమిందు ప్రధానము. కథ వరుసగా ప్రస్తావించబడినది. తిరుమల సందర్శనమున భక్తుడు పొందు రసానుభూతిని కవి విశేషముగ వర్ణించెను. ప్రమథ గోపురమువద్ద స్వామి పాదరక్షల దర్శనము ఆనంద ప్రదము. పుష్కరిణీస్నానము కల్మష దూరులను చేయును. గోగర్భాదుల స్నానము పుణ్యప్రాప్తి దాయకము. సోపానములలో సొమ్మసిలి పడిపోకుండా స్వామియే రక్షింపవలెను.

మద్దూరి పాపారావు రచించిన శ్రీవేంకటేశ్వర శతకము నరాంకితము. తిరుపతి క్షేత్ర ప్రశస్తి యిందు గలదు. ఇట్లే 1950 ప్రాంతమున మహాకాళి వేంకటేశ్వరరావు క్షేత్రమహిమను వివరించుచు శ్రీవేంకటేశ్వరశతకమును రచించెను. ఇందులో కథ విశేషముగా నున్నది.

బ్రహ్మదేవుడు నిద్రించు సమయమున భూమి క్రుంగి పోయినది. హిరణ్యాక్షుడు భూమిని పాతాళానికి దొంగిలించు కెళ్ళాడు. వరాహావతారమున శ్రీమన్మహావిష్ణువు భూమి నుద్ధరించాడు. శ్రీహరి వైకుంఠమును జేరక, గరుత్మంతుడు తెచ్చిన అద్రిపై మహాలక్ష్మితో నివసించాడు. అదియే శేషాచలము, క్రీడాచలము. ఈ కొండపై శ్రీరామచంద్రుడు కపిసేనలతో కొన్నాళ్ళు విశ్రమించెను. వెంద్రుకలనిచ్చుట దాసానుదాసుల మని చెప్పుటకే నని కవి చమత్కరించెను. నిత్యకల్యాణము, పచ్చ తోరణముగా స్వామి వేడుకలు జరుగుటను కవి వివరించెను. మత సామరస్యమును గూడ కవి ప్రస్తావించెను.

1953 లో శ్రీమతి యామినీ పూర్ణ తిలకమ్మ తన కుమార్తె ఆరోగ్యమునకై వేంకటేశ్వర శతకమును రచించెను. భువనగిరి విజయరామయ్య వేంకటేశ్వర శతకమున సృష్టిపై చిత్రిని వర్ణించెను. స్వామి దివ్యశక్తులను కవి వివరించెను. యామిజాల వేంకటశాస్త్రి 1934–47 మధ్యకాలమున వ్రాసిన చిన్మయశతకము వేంకటేశ్వర భక్తి ప్రబోధకము. ద్వారకా తిరుమల వేంకటేశ్వరుని తన అల్లునిగా భావించి కవి మామ అల్లుళ్ల సరసములను వర్ణించెను. చిత్రకవిత్వభరితంగా పొత్తూరి వీరరాఘవ కవి 1961 లో శ్రీ తిరుపతి వేంకటేశ్వర శతకం వ్రాశారు. గర్భకవిత్వం ఇందులో ప్రధానం. కలువగుంట శేషాచార్యులు వేంకటేశ్వర శతకములో తిరుపతి క్షేత్ర గాథను వర్ణించెను.

వృషభాసురుడు ఘోరతపస్సు చేస్తున్నాడు. మును లాతని తపస్సుకు కారణం అడిగారు. మీతో యుద్ధం చేయాలన్నాడు. దానికి విష్ణుమూర్తి కోపించి చక్రం ప్రయోగించాడు. ఆ చక్రనిహతుడైన వృషభాసురుడు తనపేరు శాశ్వతం కావాలని కోరాడు. అది వృషభాద్రిగా ప్రశస్తి పొందింది. త్రేతాయుగంలో అంజనాద్రిగా, ద్వాపరయుగంలో శేషాచలంగా వ్యవహరించారు. కలియుగంలో అది వేంకటశైలమైంది.

వత్రి రమణప్పరాయకవి వేంకటరమణ శతకమున తిరుమల కలియుగ వైకుంఠముగా వర్ణింపబడినది. శ్రీమన్నారాయణుడు వేంకటేశ్వరుడుగా, లక్ష్మీదేవి అలిమేలు మంగగా పేర్కొనబడింది. కొటిదెన వేంకటనారాయణ, యజ్ఞన్నశాస్త్రి సంపూర్ణారోగ్యము కొరకై వేంకటేశ్వరశతకాలు వ్రాశారు. ఇట్లే రోగనివారణార్థము ఇంకొల్లు ఆదిశేషశర్మ, భారతము సుబ్బరాజు, వేంకటేశ్వర శతకములు రచించిరి. ఆదిశేషశర్మ

అధ్యాత్మిక గమ్యాన్ని పొందండి!

ఎనిమిది ముద్రణములు పొంది, వేలాది ప్రతులు అమ్ముడుపోయి, ఆధ్యాత్మిక గ్రంథముల ప్రచురణములలోనే అపూర్వ సంచలనమును కలిగించిన—

'శ్రీ అనుభవానందస్వామి' విరచిత

# సాధన రహస్యము

(సాధన ప్రాముఖ్యమును దెలుపు యీ గ్రంథము ఏడు భాషలలోనికి అనువదింప బడి ప్రచురింపబడనున్నది.)

ముముక్షువులకు మార్గదర్శియై, సాధకుడు చేయవలసిన సాధనా విధానములను, ఆ యా సాధనా ఫలితములను, చక్కని వ్యావహారిక భాషలో దెలిపి, పత్రికల, పండితుల, అశేష ప్రజాదరణ పొందిన మహోత్కృష్ట గ్రంథరాజము.

ప్రముఖ చిత్రకారులు 'శ్రీ బాపు' చిత్రించిన సుందర ముఖచిత్రముతో వెలువడినది.

1/8 డెమ్మి. పుటలు: 280.

వెల: రు. 22-00.

రిజిష్టరుపోస్టులో రు. 26-50.

ప్రతులకు:

శ్రీ అనుభవానంద గ్రంథమాల,

బాపట్ల-522 101, (గుంటూరు జిల్లా.)

తిరుమలేశుని గరుడోత్సవమును జూచి 'రెడ్డిదొర' వలె నిక్కి తిరుగుచున్నావని నిందాస్తుతి జేసెను.

ఇట్లే పంచాగ్నుల వేంకటశివదీక్షితులు, ప్రతాప రాఘవసోమయాజి కోటభట్టరు, రంగాచార్యులు, వేంకటప్పరాయడు, సూరి రాజు, రత్నమాంబ, మక్తల జయరామ కవి, బుచ్చి కామకవి, వివిధ వర్ణనలతో వేంకటేశ్వర స్తుతిరూపకములైన శతకాలను రచించారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కొన్ని శతకపద్యములను శ్రీ వేంకటేశ్వర లఘుకృతులపేర ప్రకటించారు.

ఆధునిక కాలంలో వచ్చిన కవులనేకులు స్వామిపై శతకాలు, కావ్యాలు వెలయించారు. ఈ రచయిత కూడా వేంకటేశ శతకం 1984 ప్రాంతంలో రచించాడు. భవబంధవిముక్తి కొరకు కొందరు, రోగ విముక్తికి మరికొందరు, స్వామి వైభవాన్ని స్తుతిస్తూ మరికొందరు స్వామి గుణ గణాలను గానం చేయడం ప్రశస్తం! (ఈ వ్యాసరచనకు కె. గోపాలకృష్ణారావుగారి శతకసాహిత్యవికాసమే మూలాధారం)

— డా॥ ఆర్. అనంతపద్మనాభరావు



[14 వ పేజీ తరువాయి]

వాసులం అని చెప్పుకునేవారు ఏదైన మంచి ఆచారం ఉంటే దానిపై వారికి నమ్మకం తక్కువ. ఎక్కడ ఏదైన ఒక చెడు కనిపిస్తే దాన్ని లాక్కొచ్చి ఆచారము ప్రక్కనచేర్చి దాన్ని దురాచారం అంటారు. సరే మనము ఎవరికైనా పెద్దలకు నమస్కరిస్తే వారు ఏదో శుభముగు గాక అని అంటారు. అపుడు కొందరు వారు దీవించగానే అవుతుందా! అంటారు. కాని ఎవరైనా మనలను ఏదైనా తిట్టు (చెడును ఆకాంక్షిస్తూ) తిడితే వారిపైకి పోట్లాటకు వెడతాము. మరి ఈ తిట్టు జరిగితీరుతుందా! అని ఆలోచించము. ఇలా చెప్పుతూ ఉంటే ఎన్నో విషయములు తెలుస్తూ వుంటవి. "దీపము క్రింద చీకటి యున్నట్లు" కొన్ని దుష్ట సంప్రదాయాచారము లున్నట్లైతే మొత్తం దుష్టసంప్రదాయాలేనా! అలాగనే చేస్తే దీపాన్నే ఆర్పేసినట్లవుతుంది. అపుడు మన పని త్రిశంకుస్వర్గం. అటు రాకెటు వేగంలో వెడుతున్న విజ్ఞాన శాస్త్రాన్ని ఆకళింపు చేసుకోలేము. ఇటు మనము అంటే ఏమిటి? అనికూడ తెలుసుకో లేని స్థితిలో వస్తాము. దేన్నయినా యుక్తాయుక్త విచక్షణతో ఆలోచించి ఆచరించుట శ్రేయస్కరం.

— శ్రీ కె. వేంకటనరసింహాచార్య

## ప్రత్యేక కల్యాణోత్సవం




తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆర్జిత కల్యాణోత్సవం - కలవారు మాత్రమే చేయగల కైంకర్యం కాదిప్పుడు! 1981 నవంబర్ 1 వ తేది నుండి ఆర్జిత కల్యాణోత్సవం రేటు 2,000 రూ.లకు పెంచబడిన దృష్ట్యా సామాన్యులకు అందుబాటులోవుండే విధంగా కేవలం 500 రూ.లతో మాత్రమే వేరొక 'కల్యాణోత్సవం' ఏర్పాటయింది. గృహస్థుతోకలిసి ఐదుగురిని మాత్రమే అనుమతించే ఈ కల్యాణోత్సవంలో ప్రసాదాల వంపకం వుండదు. మిగతా అంశాలన్నీ మామూలుగానే వుంటాయి. ఈ కల్యాణోత్సవం జరిపించ దలచేవారు—

పేష్కారు, తిరుమల ఆలయం సంప్రదించవలసి వుంటుంది.

# అభిమానవతి ద్రౌపది

ఆంధ్ర భాషాయోష కంఠసీమ నలంక రించిన అమూల్య రత్నహారము మహా భారతము. ఆ రత్న హారమునందలి నాయకమణివంటిది ద్రౌపది. 'తింటే గారెలు తినాలి, వింటే భారతము వినాలి' అన్నట్లు భారతము ఎన్నిమార్లు విన్నా, చదివినా, తనివి తీరనే తీరదు. అందులోని ఉత్తమ నాయిక ద్రౌపదిని గురించి ఎంత తెలుసుకున్నా మనసే తీరదు.

పతికి సంతానార్హత లేదని తెలుసుకొని పాండురాజు అనుమతి గైకొని తాను బాల్యమున దూర్వాసుని వలన పొందిన వరముచేత మహాపురుషులను ప్రార్థించి వారివలన మహావీరులను గని భారతకథకొక రూపం కల్గించిన వీరమాత కుంతీదేవి. తనపై నిగల ప్రేమచేతనే, తనసంపర్కము వలననే పతికి మరణము సంభవించినదని పాండురాజుతో సహగమనము నొందిన ధర్మపత్ని మాద్రి. పుట్టుగ్రుడ్డివాడై లోకమును గాంచలేకయున్న ధృతరాష్ట్రునితో పాటు తానుకూడ లోకమును చూడనొల్లనని కనులకు గంతలుకట్టుకొనిన పతివ్రత గాంధారి. ఇలా ఎంతమంది మహిళలు తమ తమ ఒప్పిదమైన గుణములచేత ప్రశంసింపబడినారు. వారందరియందును తలమానికమువంటిది యాజ్ఞసేని. ద్రుపద మహారాజునకు యజ్ఞకుండమున లభించినది కనుక యాజ్ఞసేని అనియు కృష్ణ అనియు పిలువబడినది. కడుమెత్తని హృదయము, రూపెత్తిన యందము, అపమతినొప్పని మానుషము, అజ్ఞతనొల్లని పౌరుషము, ఆమెకు తొడవులు. కీడును సైపని వాడియు, కుటిలతనోపని వేడియు, ఆమె గుణములు. గరువతనము, కలికితనము నుజ్జగింపని వడుతులమిన్న ద్రుపదరాజనందన-మత్స్య యంత్రమును ఛేదించినది అర్జునుడే అయినా అత్త కుంతీదేవి అనుమతివలన పాండవపంచకమునకు భార్యగా రూపొందినది.

"అఖిల లావణ్య పుంజంబు రాశిపోసి నెలతగా దీని మార్చెను అబ్జభవుడు" అని ఇతర మగువలందరూ ఆమె అందచందములను చూచి ఈర్ష్యనొందునట్టి సౌందర్యవతి ద్రౌపది. కపటద్యూతమున భర్తలోటమి పొందినపుడు దుశ్శాసనుడు ఒంటి చీరతోనున్న ఆమెను వివస్త్రనుచేయ ప్రయత్నించినపుడు కృష్ణభగవానుని వేడి తన శీలమును కాపాడుకొనిన పతివ్రత ద్రౌపది. ధృతరాష్ట్రుడు వరములు కోరుమని పలికినపుడు క్షత్రియధర్మమును మాత్రమే పాటించి వరములుగోరి భర్తలకు రాజ్య పదవి పొందునట్లు చేసిన క్షత్రియకాంత ద్రౌపది. మయసభలో నీటిమడుగున జారిన దుర్యోధనునిగాంచి ద్రౌపది నవ్విన నవ్వే కురుక్షేత్రయుద్ధానికి కారణమైనదని అంటారు. ధర్మరాజు సంపదలను గాంచి ఈర్ష్యచెందిన దుర్యోధనుని ఈర్ష్యాగ్నిలో ద్రౌపది నవ్వు అపహసితము ఆజ్యముపోసినట్లు అయినది. మాయాజూదములో ఓడిన ధర్మరాజు తననుకూడ ఓడినపుడు "తానోడి నన్నోడెనా, నన్నోడి తానోడెనా" అని ధర్మసందేహమును వెలిబుచ్చిన ధీరవనిత ద్రౌపది. పతులతోపాటు అడవులలో పడరాని ఇడుములను పడి వారికి నీడవలె సంచరించినది. వారితోపాటే సుఖ దుఃఖముల నన్నింటిని పంచుకొన్నది- అడవియందు ఒంటరిగానున్న తన్ను మోహించిన సైంధవుని తన భర్తలచేత అవహేళన మొనరింపచేసినది.

ద్రౌపది పాండవులతోపాటు అరణ్యావాసమున నున్నపుడు ఒకనాడు సత్యభామ కృష్ణునితో కలసి వారిని చూచుటకు వచ్చినది. అపుడు సాత్రాజితి పాంచాలి నిట్లడిగినది- "నీ భర్తలందరు ఒకరికంటె ఒకరు నిన్ను ప్రేమతో అనురక్తులై చూచుచున్నారు. నీయందు నీపతులకెటువంటి గింకిరిపాటులేదు. దీనికి కారణం? ఏదైనా వ్రతమా? మంత్రౌషధవైభవమా? లేక నీ విభ్రమోల్లాసమా? నీవలన తెలుసుకొని నేనుకూడ కృష్ణుని వశగతుని చేసుకొందు"నని సత్య పలికెను. దానికి ద్రౌపది నవ్వి "మంత్ర, తంత్రములచేత, మందులచేత భర్తలను లొంగదీసుకొనుట అనునది చాల బేలతనము. మరుగుమందులు, మాకులు మగనిని వశం చేసుకొనుటకు పెడితే రోగముల పాలౌదురు కానీ




వేరేమీ లేదు. అపుడు స్త్రీలకు హాని కలుగుతుంది" అని అంది ద్రౌపది. కేవలం వారిని నా సేవలతోనే అలరింతును. వారికి తగిన వేళలందు మజ్జన, భోజన క్రియలలో ఏమరుపాటు సేయను. వృథాగా వ్యయము సేయను. గృహస్థలము భాండములు అన్నియు ఇంపుగానుంచి బంధుకోటికి ప్రమోదము కలిగింతును. పలుమారు తలవాకిట నిలుచుట, దుష్టస్త్రీల స్నేహము మొదలగునవి నాకు నచ్చనివి. నా భర్తలు దూరప్రాంతమున నున్నపుడు నాకు పుష్ప గంధ ఆభరణములు ధరించుటకు మనసు రాదు. కేవలం వారి రాకకొరకే ఎదురు చూచెదను. అత్తగారైన కుంతీదేవి చెప్పినట్లు విందును. గురు విప్రజనములు వచ్చినపుడు అతిథిపూజలు చేయుదును. నా భర్తలకు, అత్తగారికి భోజనస్నానాదికములలో పరిచర్య సేయుదును. ప్రతిదినము

ధర్మతనయుని బంతిలో పసిడి పళ్ళెముల యందు కుడుచునట్టి బ్రాహ్మణులు ఎనిమిది వేలు. యతులు పదివేలు. వీరందరికి ఉచిత వస్త్రభూషణాదులనిచ్చి గౌర వింతును. ధర్మరాజు నగరియందుగల సేవ కులనందరిని నేను గౌరవింతును. భద్ర గజములను, ఉత్తమాశ్వములను, గోవు లను మున్నగువానిని కాపాడువారందరిని పరిశీలింతును. పాండునందనుల పైన కుటుంబభారమును వేయను. అన్నియు నేనే చూచి ఆదాయ, వ్యయములను కూడ చూచెదను. రాజ్యభార కార్యయుక్తి చేత నాకు నిద్రకూడ సరిగా ఉండదు. ఆహార నిద్రలకొరకు నేను చింతించను. ఇటువంటి బాధ్యతలతో ఉన్నదానిని కనుక పాండు రాజనందనులు ఎల్లపుడు నాయందు ప్రీతితో ఉందు"రని ద్రౌపది పలికెను. గడుసరి (ఆంధ్ర) మహిళయైన ద్రౌపది మాటలు విని సత్యభామ లజ్జాకలిత చిత్తయైనది. క్షమించు మని ద్రౌపదిని వేడినది. అంతట పాండవభామినియైన పాంచాలి ప్రేమతో పతి మనసు నాకర్షించెడి చతురమైన ఉపా యములను సత్యభామకు చెప్పినది- స్త్రీలకు పతినిమించిన దైవము వేరే లేదు. అతడు బాధపడినను, దుఃఖపడినను స్త్రీలకు సుఖము లేదు. కనుక వారికి నిత్యము ప్రేమతో భక్తితో ప్రియము కావింపవలెను. శ్రీకృష్ణుడు నీ గృహద్వారమునకు వచ్చి నపుడు సంభ్రమముతో లేచి ఎదుర్కొనుము. కూర్చుండుటకు ఆసనములు మొదలగునవి, సేవకులున్నా కూడ, నీవే అతనికి ప్రేమతో ఆసనాదులు చూపవలెను. ఎప్పుడైనా మురారి రహస్య విషయాలు చెపితే నీ ప్రాణ సఖులకు కూడ చెప్పవద్దు. పతికి ప్రియమైన బంధువులు కాని, మిత్రులుకానీ వచ్చినచో ప్రేమతో అతిథిమర్యాదలు చేయుము. ఎన్నో రీతుల ప్రేమవచనముల తోను క్రియలతోను నీ భర్తను ఆకర్షించెదవు కానీ దీని కొరకు మందులు మాకులు, మంత్రాలు లేవు" అని చెప్పినది ద్రౌపది. ఈ విధంగా తన సుగుణాలచేతను, వాక్చాతుర్యము చేతను, సత్యకు కనువిప్పు చేయగలిగినది పతివ్రతా తిలకమైన ద్రౌపదీదేవి.



అజ్ఞాతవాసము చేయబోవునపుడు "మన వంశమును, వృత్తమును, పెంపును గావ జాలు పుణ్యవతివి, దుర్జనులగు తులువల తలపులు గనుగొని యేమరక మెలగవలయు జుమీ" అని ధర్మసూతి ముందు హెచ్చరిక సేయగా ఆదరమందస్మితముతో బదులిడి నది.

విరాటనగరమున విరటుని పత్ని సుధేష్ణ వరమొయిల్ గప్పిన బాదరి సునుగాంతి, కదలిన యమృతాంశుకలయుబోలె రాచ నగరున సైరంధ్రి వేషమున నడయాడు పాండవపత్నిని పిలిపించినది. సైరంధ్రికి సుధేష్ణ చెల్లించిన గౌరవమర్యాదలు ద్రౌపది గరువతనమునకే చెల్లినవి. అంద చంద ముల గంధర్వాప్సరఃకామినులను దల దన్నుచు ఒప్పిదమైన మేనికాంతితో నెల్లర నబ్బురపరచుచు, ఠీవి యెలర్చునట్టి సొంపులు వెలయించునట్టి ఆమెను బలగర్వి తుడైన కీచకుడు మోహించినాడు. తమ్ముని వెలిచవిని కాదనరాక అక్కగారైన సుధేష్ణ సైరంధ్రిని కల్లుదేర నాతని యింటికి పంపి నది. అచట ఆతడు అవినీతిసేసిన కేళిక తప్పించుకొని పరుగున విరటుని కొలువు చవికె చేరంబారినది ద్రౌపది. విరాటరాజు సభలో సభ్యులందరు వినట్లు, "ఇటు నాకు అవమానమువాటిల్లగా ఒక్కడును వారింప లేదయ్యెగదా! అందరు చూచుచు ఊరకుం డుట ఇది ఏమి పాపము. ఈ ఊర నింక ఏ ఇల్లాలు తన మానము రక్షించుకొనగలదు. ద్రౌపది చేసిన యాక్రందనమును విన్న ధర్మరాజు పరితపించిన హృదయముతో చెమ్మట గ్రమ్మిన మోముతో, "పలుకోకల బోవుచు, విచ్చల విడి నాట్యంబు మాపు

చాద్పున నిచటం కులసతుల గరువచందము
దొలగగ నిట్లునికి దగునె నీరజవదనా"– అనెను. అటకత్తెవలె రోదింతువేమి అని ధర్మజు డనగానే ద్రౌపదికి రోషమువచ్చినది. ఆమె రోషముగల ఇల్లాలు– కనుక వెంటనే జవాబిచ్చినది.

"నాదు వల్లభుండు నటు డింత నిక్కంబు.
పెద్దవారియట్లపిన్నవారు.కాన వతులవిధము
గాక యే శైలూషిగా ననంగరాదు కంతు
భట్టు– నాభర్త నటుడు, నాకు నాట్యము పరి
చితమే. అంతే కాదు నావతి కితవుండును
కూడ. జూదరియాలికి గరువతన మెక్క
డిది?" అని రోషముతోవెడలినది.

ధర్మ మీ విధముగా ఓడుట నాధారముగా గొని కీచకుడు తన్నుమరింత చుల్కన చేసి యేమి మీదకు తెచ్చునో– ఏమైనను వానిని రేవట, మాపట మాటుబెట్టింపవలయునని ఆలోచన చేసినది. మెల్లగా దినమంతయు కరగి రాత్రిభాగముకరగిపోయినది. సమస్త జనము నిద్రించువేళయందు ద్రౌపది తన భంగపాటు చెప్పుకొనుటకు భీముని శయ్యా గృహమునకు కదలినది. అమ్మహానస గృహంబున అతడు ఒడలు మరచి నిద్రించుచున్నాడు. ఆ దృశ్యము చూడగానే యెన్నియో కష్టముల పాలైన ద్రౌపది నెమ్మది యుమ్మలికకు కారణమైనది. పేరలుక పిచ్చలించినది. కనుబొమలు ముడివడినవి. నిద్రించుచున్న భీముని

నన్ను పరాభవించి సదనంబున కుం
జని కీచకుండు ము
న్నున్న తెఱంగు తప్పక
సుఖోచితశయ్యను నిద్ర సేయు నీ
కన్ను మొగుడ్చు నూఱటకు
కారణమెయ్యది భీమసేన, మీ
యన్న పరాక్రమంబు వలదన్న
నాకో దయమాలి తక్కటా!

అని మంద మంద సంభాషణముల సంబోధించి పాదస్పర్శచే మేల్కొల్పినది. కీచకుని వధకు భీముని పురికొల్పినది. సుదేష్ణకు వలుగు నూరి, చందనము రాచి కాయలు కాచిన చేతులను భీముని ముందిడి యా క్రోశించినది. కసితో భీమసేనుడు లోక దుర్జయుడైన కీచకుని వధించినపుడు విస్మయానంద నిర్మగ్న హృదయముతో భీముని యుత్తమనాయకత్వమును ఎన్నో విధాలుగా ప్రశంసించినది. రాచపుట్టువు పుట్టి మగసింహములవలె నున్న తన భర్తలను గురించి "దుర్వారోద్యమబాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర దర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్" అని తాను తన మగలప్రతాపమునుగూర్చి చెప్పుకొనినది ద్రౌపది.

ఇక ఉద్యోగపర్వమున కృష్ణరాయబార ఘట్టమున ద్రౌపది ఒక అసాధారణవ్యక్తిగా మారినది. వరాభవమునొందిన భారతవీర పత్ని, భారతవీరమాతగా చిత్రించబడినది. పాండవ పంచకమునకు ధర్మపత్నియైన ద్రౌపది స్వరాజ్యసిద్ధికొరకు రాయబారము పోవునట్టి కృష్ణునకు తన మనసులోని భావములను అద్భుతముగా తెలిపినది రాయబారమునకుపోవు కృష్ణునితో.

నీవు సుభద్రకంటె కడునెయ్యము
గారవముం దలిర్ప నం
భావనసేయు దిట్టి నను పంకజనాభ
యొకండు రాజసూ
యావభృథంబు
నందు శుచియై పెనుపొందిన
వేడివట్టి యా
యేవురు చూడగా సభకునీడ్చె
కులాంగన నిట్లొనర్తురే.

అని పలికి దుశ్శాసనుడు పట్టి గుంజి నట్టి తన వెండ్రుకలను గోవిందుని ముందటపెట్టి

ఇవి దుష్టసేను ప్రేళ్ళం
దవిలి సగము ద్రెస్సిపోయి దక్కినయవి కౌ
రవులకడ తీరుమాటల
యవసరమునం దలవవలయు నచ్యుత
వీనిన్.

ఈ వెండ్రుకలు పట్టి ఈడ్చిన యాచేయి
తొలుతగా పోరిలో దుష్టసేను
తనువింతలింతలు తునియలై
చెదరి రూ
పఱియున్నంగని యుడు కారుంగాక
యలుపాలబొనుపడునట్టి చిచ్చె యిది
పెనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును పాటించి గాండీవ
మనునాక విల్లెప్పుడును వహించు
కట్టి విక్రమంబు గాల్పనే, యిట్లు బ
న్నములువడిన ధర్మ నందనుండు.
నేను రాజరాజుపినుంగు గన్నారం
గానం బడయమైతి మేని కృష్ణ!

ద్రౌపదికి సంధిరాయబారమే మాత్రం ఇష్టం లేదు. రాజరాజుశవాన్ని కండ్లార చూడటమే ఆమె అభీష్టం. ఏమైతే నేమి ఆమె అనుకొన్నది సాధించినది. తనను అవమానవరచిన శత్రువుల నందరిని ఆమె ప్రియభర్తలు తునుమాడినారు. దుశ్శాసనుని చంపి వానిరక్తముతో ద్రౌపది కచభారాన్ని ముడివేసినాడు భీముడు. తనను తొడలపైన కూర్చుండుటకు రమ్మని సైగచేసిన దుర్యోధనుని తొడలువిరిచినాడు. ఆ భయంకర యుద్ధాగ్నిలో ఆమె ప్రియపుత్రులైదుగురు బలైపోయినా ఆమె భరించినది. చివరకు హస్తినాపురపు మహారాజ్ఞి అయి భారతవీర పత్నిగా వీరమాతగా రాణించినది. అందుకే ద్రౌపదీదేవి మహిళాలోకానికి మరపురాని మగువ అయినది కదా.

— శ్రీమతి జి. సుమిత్రారామకృష్ణ





# శ్రీ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవములు, తిరుమల

## ( 25-9-84 నుండి 4-10-84 వరకు )

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 25- 9-84 | మంగళ | — | సేనాధిపతి ఉత్సవము, అంకురార్పణము |
| 26- 9-84 | బుధ | వజ్రకవచాద్యాభరణములతో బంగారు తిరుచ్చి ఉత్సవము, ధ్వజారోహణము | పెద్దశేషవాహనము |
| 27- 9-84 | గురు | చిన్నశేషవాహనము | హంసవాహనము |
| 28- 9-84 | శుక్ర | సింహవాహనము | ముత్యపుపందిరివాహనము |
| 29- 9-84 | శని | కల్పవృక్షవాహనము | సర్వభూపాలవాహనము |
| 30- 9-84 | ఆది | (పల్లకిలో) మోహినీ అవతారోత్సవము | మకరకంఠి శ్రీ లక్ష్మీహారాద్యాభరణాద్యాలంకారములతో గరుడోత్సవము |
| 1-10-84 | సోమ | హనుమద్వాహనము, సాయం॥ వసంతోత్సవం | గజవాహనము |
| 2-10-84 | మంగళ | సూర్యప్రభవాహనము | చంద్రప్రభవాహనము |
| 3-10-84 | బుధ | రథోత్సవము | అశ్వవాహనము |
| 4-10-84 | గురు | తిరుచ్చి ఉత్సవం, (తీర్థవారి) అవభృథోత్సవం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవము |



"వేచితి నీ పద్దయకే,
కాచితి నీ ద్వారమందు కరుణాకర నన్
తాచిన నూచిన రాచిన
వేచిన నిన్ విడువ సుగుణ!
వేంకటరమణా!"

"బిడ్డల కేడ్చువారు, తమ
పెండిలి కాదని కుందువారు చే
బడ్డ ధనంబు పోయెనను
భ్రాంతి దలంకెడువారు, జూదమం
దొడ్డినడబ్బు ద్రొబ్బెనని
యూరక క్రుంగెడువారె కాని మీ
దొడ్డపదాంబుజంబులను
దూర్పరు చిత్తము వేంకటేశ్వరా!"

"కలియుగ విష్ణులోక మిదె
కాంచుడు, వెన్నుడు సత్ప్రమాణుడై
వెలసెను, లేడు దేవుడని
బిట్టులు బల్కెడి పాపకర్ము లీ
స్థలమును గాంచియైనను వి
చారము జేసి తరింపుడయ్యా మి
మ్ముల ననిశంబు బ్రోచునని
మూర్ఖుల దెల్పెద వేంకటేశ్వరా!"

"భర్గుడ వంచు శైవులును,
బద్మదళాక్షుడ వంచు వైష్ణవుల్,
దుర్గ వటంచు గొందఱును
ద్రోపున వాదము లాడుచుండ్రు నీ
మార్గము గాంచి సృష్టికిని
మానుగ బోషణకున్, హరింప భూ
వర్గము దీర్ప, నీవ యను
భావము జేర్పరు వేంకటేశ్వరా!"

శ్రీ వేంకటేశ్వరస్వామి మా అభిమాన దేవుడు. మా కనవేల! ప్రతివారికి దర్శనీయుడు గదా! కొన్ని సంవత్సరముల క్రింద (1949) శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనార్థము నేను తిరుమలకు పోగా, ఆనాడు ప్రాతఃకాలమున భక్తులు కొందరు పరిశుద్ధగాత్రముతో శ్రీ వేంకటేశ సుప్రభాతమును స్వామివారి ఆలయప్రాంగణమున జదువుచుండుటయు, ఆ సుప్రభాత మందలి ప్రతి శ్లోకమును "శేషాద్రిశేఖర

# బ్రహ్మోత్సవ వైభవం

విభో తవ సుప్రభాతమ్" అను మకుటముతో కూడియుండుటయు నన్నెంతో ఆకర్షించినవి. నేనును శ్రీ స్వామివారి సుప్రభాత దర్శనమునకు పోగా, పఠనము ముగిసిన వెంటనే ఆలయ స్వర్ణద్వారములు తటాలున తెఱచుకొనెను. శ్రీ వేంకటేశ్వర స్వామి పుష్పాలంకృతుడై సుందర మందహాస వదనారవిందముతో భక్తులకు ప్రత్యక్షమయ్యెను. ఆనాటి భక్తుల "గోవింద, గోవిందా!" అను శబ్దము నన్ను ముగ్ధుని చేసినది. అటుతర్వాత ఎన్నియోసార్లు శ్రీ స్వామివారి సుప్రభాత- దర్శనములు నాకు లభించుచున్నవి. పునర్దర్శన ప్రాప్తి శ్రీవారి కటాక్షమేకదా! శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమునందు సమస్త చరాచరములను పరిపాలించు దివ్యమంగళ స్వరూపుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి మేల్కొలుపులు. స్తోత్రములు శ్లోకరూపమున ఉన్నవి. ప్రాతఃకాలమున ఈ పవిత్ర శ్లోకములను పఠించు భక్తాదులకు బుద్ధిప్రసన్నతయు, జ్ఞానోదయమును కల్గునని చెప్పుటకు సందేహము లేదు. దీనిని పఠించువారికి భక్తిబీజము అంకురించును. వారివారి అంతస్తు కొద్ది వారు శ్రీ స్వామివారి అనుగ్రహమునకు పాత్రు లగుదురు. ప్రాతఃకాలమున బ్రహ్మాది సమస్త దేవతలు నీ పరమపురుషుని ఆరాధనకై శ్రీవారి ద్వారమునందు వడిగాపులై వేచియున్నారని హెచ్చరించుచు, శ్రీవారి వైభవమునుగూర్చి చాల ప్రశంసనీయముగా ఈ శ్లోకములందు కొనియాడబడినది. నిత్యకల్యాణము, పచ్చతోరణముగ నలరారు శ్రీ వేంకటేశ్వరస్వామి కరుణా కటాక్ష వీక్షణ ప్రసారమే లోకకల్యాణము గదా!

తిరుమలలోని ఆనందనిలయవాసుని (కొండలలో నెలకొనియున్న కోనేటి



రాయడు) బ్రహ్మోత్సవాలు పురాణాలలో కూడ చోటుచేసుకున్నాయి. శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలో, శ్రీ వేంకటేశ్వరుని ప్రీత్యర్థం బ్రహ్మదేవుడు ఆ ఉత్సవాలను జరిపినట్టుగా పేర్కొనబడింది. అవి ఎప్పటినుంచి అవిరళంగా జరుగుతున్నాయో ఇదమిత్థంగా చెప్పలేం. తిరుమల తిరుపతి దేవస్థానం శాసనం క్రీ. శ. 614 కు చెందిన దానిలో వాటి ప్రస్తావన వుంది. కాబట్టి బ్రహ్మోత్సవాలు ఆలయం వెలసినప్పటినుంచి అమలులో ఉన్నట్టుగా పరిగణించవలసి వస్తోంది.

ట్రాది పైనున్న శ్రీ వేంకటేశ్వరస్వామి అత్యంత ప్రభావం కలవాళ్లనే విషయం మనకందరికీ తెలిసినదే!

ముఖ్యంగా మనము గమనించవలసిన మరియొక విశేషమేమన తిరుమల "స్వయంవ్యక్త" క్షేత్రము. ఏలయన శ్రీనివాసుడు స్వయముగా దీని ఎన్నిక చేసికొని స్వయంగా ఆవిర్భవించిన మహాదివ్య క్షేత్రము. అచ్చటి వైభవం అద్వితీయం. శ్రీవారి మూర్తిలోని పవిత్రత, సౌందర్యం అలోకసామాన్యం. దర్శించి, అర్చించిన

సింహవాహనం. రాత్రి మౌక్తికమండపం. నాలుగోరోజు ఉదయం కల్పవృక్షం. రాత్రి సర్వభూపాల వాహనం. అయిదవ రోజు ఉదయం మోహినీఅవతారం. రాత్రి గరుడోత్సవం. ఆరవరోజు ఉదయం హనుమద్వాహనం. రాత్రి గజవాహనం. ఏడవరోజు ఉదయం సూర్యప్రభవాహనం. రాత్రికి చంద్రప్రభవాహనం. ఎనిమిదవ రోజు ఉదయం రథోత్సవం. రాత్రికి అశ్వవాహనం. తొమ్మిదవరోజు హరిద్రాభిషేకం



బ్రహ్మోత్సవాలు సాధారణంగా భాద్రపదమాసం- సెప్టెంబరు అక్టోబరు నెలలలో ప్రతి సంవత్సరం జరుగుతాయి. ఒక్కో సంవత్సరం రెండు బ్రహ్మోత్సవాలు కూడ వస్తాయి. అప్పుడు రెండవ బ్రహ్మోత్సవాన్ని నవరాత్రి బ్రహ్మోత్సవం అంటారు. అవి దేవీ నవరాత్రులప్పుడు జరుగుతాయి. రెండు బ్రహ్మోత్సవాలు పంచాంగంలోని అధిక మాసాలనుబట్టి వస్తూంటాయి. 1983 లో రెండు ఉత్సవాలు వచ్చాయి.

బ్రహ్మోత్సవం పదిరోజులపాటు జరుగుతుంది. అందులో ముఖ్యమయినది గరుడ సేవ, రథోత్సవం. మొదటి బ్రహ్మోత్సవంలో కొయ్యతేరు ఉపయోగిస్తే, రెండవ బ్రహ్మోత్సవంలో వెండితేరు శ్రీవారి ఊరేగింపునకు ఉపయోగిస్తారు. ఈ బ్రహ్మోత్సవంలో అశేష ప్రజానీకం పాల్గొంటారు.

కృతయుగంలో కంచి వరదరాజస్వామి, త్రేతాయుగంలో శ్రీ రంగంలోని రంగనాథస్వామి, ద్వాపరయుగంలో పూరీలోని జగన్నాథస్వామి, కలియుగంలో వేంక

ప్రతివారి హృదయం అత్యంత ఆనందముతో నిండిపోతుందనుటలో ఏలాటి అతిశయోక్తిలేదు.

శ్రీ హరివాసములోని శ్రీనివాసునికి "నిత్యకల్యాణం పచ్చతోరణం."

ప్రతి సంవత్సరము జరిగే బ్రహ్మోత్సవం బ్రహ్మదేవుడే స్వయముగా దేవతలతోను మహర్షులతోను కలిసి తిరుమల వేంచేసి, ఈ ఉత్సవాన్ని జరిపించినట్లు భవిష్యోత్తర పురాణం చెప్పుచున్నది. దీక్షతో తొమ్మిది రోజులు ఈ ఉత్సవం జరుగుతుంది. బ్రాహ్మణులు తొమ్మిది మంది నవాహ్నికముగ ఈ ఉత్సవాలు జరిపిరి కాబట్టి వీటికి "బ్రహ్మోత్సవం" అని పేరు వచ్చినదని కొందరి అభిప్రాయం.

శ్రీవారిని బ్రహ్మోత్సవానికి ఆహ్వానించిన తతంగం పూర్తికాగానే శ్రీ స్వామికి శేషవాహనోత్సవం జరుపుతారు. రెండవ రోజు ఉదయం చిన్నశేషవాహనం, రాత్రి హంసవాహనం, మూడవరోజు ఉదయం

చేసికొన్న శ్రీమలయప్పస్వామి వారిని పల్లకి మీద అవభృథోత్సవానికి తీసికొని వెళ్లెదరు. ఎందరో లక్షలాది భక్తులు ఈ బ్రహ్మోత్సవంలో పాల్గొని తరిస్తూ ఉంటారు. ఊరేగుతున్న శ్రీ శ్రీనివాసుని దర్శించిన వాళ్లకు జన్మసాఫల్య మగుతుంది.

శ్రీవారి గరుడసేవ ప్రాముఖ్యం అంతా యింతా కాదు. ఆలయంలోని మూల విగ్రహం నగలన్నీ ఉత్సవమూర్తి అయిన శ్రీ మలయప్పస్వామికి గరుడసేవనాడు అలంకరింప జేస్తారు. తమిళనాడు శ్రీరంగం నుంచి, గోదాదేవికి అలంకరింప జేసిన పూలమాలను నియమప్రకారం వారు తేగా, ఆ రోజు శ్రీవారు ఆ పూలమాలను ధరిస్తారు. మద్రాసు నుంచి కాలినడకన తెచ్చిన కొత్త గొడుగులు (గొడుగులు ధర్మ సంస్థవారిని) వెంటరాగా శ్రీవారు మెరవణకు బయలుదేరుతారు. ఆ రోజుకోసం ప్రత్యేకమైన బాణసంచా తయారుచేసి పెట్టివుంటారు. ఈ ఆచారాలు, అలంకారాలు

అన్నీ పూర్తయి దేవుడు ఊరేగింపుకు బయలుదేరే సరికి దాదాపు అర్ధరాత్రి అవుతుంది. పరిసరాల్లోని ప్రజలందరూ రావడంతో తిరుమలలో ఇసుకవేస్తే రాలనంత జనసందోహం కనిపిస్తుంది.

లోకకల్యాణం కోసం వైకుంఠవాసుడు తిరుమలలో అవతరించాడు. క్షీరసాగరానుబంధమైన క్రీడా సరోవరమే స్వామి పుష్కరిణి. బ్రహ్మదేవుడు ఈ అవతార తిథిని పురస్కరించుకొని ఉత్సవాలను నిర్వహించాడు.

ప్రతిరోజు సాయంకాలం స్వామి "ఊంజల్ సేవ" వైభవోపేతంగా జరుగుతుంది.

నేను నాలుగుసార్లు ఈ బ్రహ్మోత్సవ వైభవంలో పాల్గొనడంచేత అది నా జీవితంలో మరపురాని మహోత్సవంగా ఎల్లప్పుడూ అనుభూతి పొందగలుగుచున్నాను. ఈ సంవత్సరము కూడా భక్తులు అశేషంగా ఈ తిరుమలేశుని



బ్రహ్మోత్సవాల్లో పాల్గొని వారి జీవితమును ధన్యము చేసుకొనెదరుగాక అని శ్రీవారిని ప్రార్థిస్తున్నాను.

కలియుగ దైవమగు శ్రీ వేంకటేశ్వర స్వామి మనల నందరను సన్మార్గవర్తనుల చేసి రక్షించుగాక. సమస్తలోకములకు కల్యాణ మొనగూర్చుగాక.



మంగళ దేవత నల
మేల్మంగమ నెదదాల్చి
సర్వమంగళముల లీ
లం గూర్చి వేంకటేశుడు
మంగళ మొనరించు
గాత మన కందఱకున్!

"మంగళం వేంకటేశాయ
కామితార్థ ప్రదాయినే,
వేంకటాద్రి నివాసాయ
శ్రీనివాసాయ మంగళమ్.

శ్రియః కాన్తాయ కల్యాణ
నిధయే నిధయేఽర్థినామ్,
శ్రీవేఙ్కటనివాసాయ
శ్రీనివాసాయ మఙ్గళమ్."

— శ్రీ మాచవరం నరసింహారావు



(శీవ పేజీ తరువాయి)

తనవల్లనే గదా నేర్చుకొనినది. [దాసస్య] శిష్యుడనై క్రయ, విక్రయార్హుడను కాక యుంటినా? అట్లగుటచే నే నపేక్షించినట్లు అయోధ్యకు తిరిగి వచ్చుటను మఱుగు పరచునా? ఇట్టిది కైంకర్యమున చాప ల్యము గల వారి స్థితి.

(వఙువిలా అడిమై) విచ్ఛేదములేని కైంకర్యము. పంచభక్ష్య పరమాన్నములతో భుజించినను, పెరుగు పోయనిచో తిననట్లే యుండునట్లు; ఒక కైంకర్యము కొఱత యున్నను, చేసినదంతయు చేయనియట్లే యుండునట్టి స్వభావమాళ్వార్లది. (శెయ్య) చేయగా. చేయవలయునను కోరిక మును పును కలదు గదా! వీరికి యనిన ఇప్పు డంత మాత్రమేగాక అనుష్ఠాన పర్యంత మును కావలయుననని. (అడిమై శెయ్య వేణ్డుమ్) కైంకర్యమొనర్పవలెనని కోరిక కల్గినది మొదలు ఉద్దేశ్యమై యున్నది. "క్షుద్రవిషయానుభవము చేయవలయు" నని మొదలిడిన సంభోగ సమయమువరకు లీలారసములు జూపి, నీ విచ్చిన ద్రవ్య మింతవరకే పరిపోయినదని బయటకు త్రోసివేతురు. ఇక స్వర్గానుభవము జేయ వలయునని మొదలిడిన "స్వర్గేఽపి పాత భీతస్య, క్షయిష్ణోర్నాస్తి నిర్వృతిః" యని నట్లు దగ్గరలో నరకానుభవమొనర్చు కొంద రను జూచుటచేత, తా ననుభవించు చున్న స్వర్గసుఖము లేనిదానితో సమమేయగును. ఆ పుణ్యమైనను చిల్లికుండలోని నీరు వలె క్షయించగనే "ధ్వంస" యని తల క్రిందుగ పడునట్లు త్రోసివేతురు. ఇట్లు భగవద్దాస్య రూపమునకు తగనిదై, అహం కార, మమకారములు కారణముగ వచ్చు నీ యనుభవముల వంటిదిగాక, స్వరూపము నకు తగినదై, కైంకర్యము నంగీకరించు సర్వేశ్వరుడు నిత్యుడై, కైంకర్యమొనర్చు జీవుడును నిత్యుడై, కాలమును నిత్యమై, దేశమును నిత్యమై, యెన్నటికిని తిరిగి రావలసినదిలేని (అపునరావృత్తి) లక్షణ మగు మోక్షమై క్షుద్ర విషయానుభవముల వలె దుఃఖమిశ్రితముగాక, నిరతిశయ సుఖమై యుండునది భగవత్కైంకర్యము. అట్టి కైంకర్యమే వీ రిప్పు డపేక్షించునది.

(నామ్) మనము అనుటలో తమ మన స్సును కలుపుకొని గాని, లేక తమ మన స్సున కనుకూలురను కలుపుకొనిగాని యన వచ్చును.

ఇది పాశురపు మొదటి సగము వివర ణము. ఇక రెండవ సగమున, కైంకర్యము చేయగోరు వీరి యత్నమేగాక, కైంక ర్యము నంగీకరించు సర్వేశ్వరుని యత్న మును తెలుపుచున్నారు.

(తెజి (డి) కురులరువి) గంభీరమగు ధ్వనిగల సెలయేళ్ళుగల వేంకటాచలము. ఆళ్వార్లు ఉన్నచోటనే యుండి యపేక్షించు చుండిరేగాని; సర్వేశ్వరుడో తన "కలఙ్గా పెరు నకర్" (కలతబడని గొప్పపట్టణము) అనబడు పరమపదమున విడిచి యీ లోక మునకు వచ్చి తిరుమలపై నిలచి, తన యనుష్ఠానముచే తన యత్నమును తెల్పు చున్నాడు. గంభీరమగు ధ్వనిగల సెల యేళ్ళును తిరుమలపై యుండుటచేత, వాని శబ్దమున్ను ఆశ్రయణీయమే. "కైంకర్య మొనర్ప రండొహో!" యన్న ట్లున్నది వీరికి శబ్దమున్ను. (తిరువేఙ్గడత్తు ఎ(డి)జిల్ కాళ్ శోతి) శ్రీ వేంకటాచలముపై మిక్కిలి ప్రకాశించు తేజస్సు. "కైంక ర్యము స్వీకరించుటకు తగిన చోటిదియే" యని సర్వేశ్వరుడు వచ్చి నిలిచిన చోటిది. అర్చిరాది మార్గమున నీ శరీరావసానమున, పరమపదమునకు పోయినచో నచ్చట నీ వొనర్పదగిన కైంకర్య మిచ్చుటనే స్వీక రించుటకుగా వచ్చి నిలచినచోటు. వాని శరీర సౌందర్యమును జూచినచో పైబడ దగిన యట్లున్నది. పరమపదమున సర్వే శ్వరుని కాంతి, పగటిదీపము, క్షీరాబ్ధియందు సముద్రము పాలు, వేంకటాచలమున గుహ లోని దీపమువలె మిక్కిలి కాంతివంతము. ఆ ప్రదేశమంతయు వీని సౌందర్యముచే కాంతివంతమైనది.

(ఎన్దై) మా స్వామి. అందగాడు కాకు న్నను స్వామిత్వ సంబంధముచే విడువ రాని విధము. సౌలభ్య, సౌందర్యాదులచే తనను లోబఱచుకొనిన స్థితి.

(తన్దై తన్దైక్కే) నా తండ్రికి, నా తాత కున్ను, స్వామి యనుటచే 'పరమశేషి' యని యర్థము.

ఇట్టి సర్వస్వామిత్వరునకు సేవయొనర్చుట కన్న మిన్నయగు భాగ్యమే మున్నదని నమ్మాళ్వార్లీ మొదటి పాశురమున లోకము నకు హితోపదేశము చేయుచున్నారు. •

శ్రీ పి.వి.జి.వి.ఎల్. నరసింహాచార్యులు



తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి దేవాలయ నూతన స్వర్ణగోపురము

## వార్తాలహరి



### మోటారు సైకిలు కానుక

తిరుమలలో ఆగష్టు 16వ తేదీన మద్రాసులోని ఇండో–సుజుకి కంపెనీ తయారుచేసిన మొట్టమొదటి మోటారు సైకిలును, ఆ సంస్థ మేనేజింగ్ డైరెక్టరు శ్రీక్రిష్ణన్ శ్రీ వేంకటేశ్వర స్వామికి కానుకగా సమర్పించారు. సుమారు 12 వేల రూపాయల విలువ గల ఈ కానుకను దేవస్థానం తరఫున సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జె. వేంకటేశ్వర్లు ఐ. ఏ. యస్. స్వీకరించారు.

### ఉత్సవ విగ్రహాల ప్రతిష్ఠ

ఆగష్టు 20 వ తేదీన శ్రీనివాసమంగాపురం శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయంలో శ్రీ వేణుగోపాలస్వామి, రుక్మిణీ సత్యభామల ఉత్సవ విగ్రహాలను ప్రతిష్ఠించారు. ఈ సందర్భంగా 20 వ తేదీ నుంచి మూడురోజులపాటు లఘు సంప్రోక్షణ నిర్వహించారు.

### గొడుగుల ఊరేగింపు

తిరుపతి గొడుగుల ఛారిటీస్, మద్రాసు వారి ఆధ్వర్యంలో ప్రతిఏటా బ్రహ్మోత్సవాల సమయంలో శ్రీవారికి కానుకగా సమర్పించడం జరుగుతుంది. ఈ సంవత్సరం 1–9–84 శనివారం సాయంత్రం మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తులు గౌ॥ శ్రీ కె. షణ్ముగం సమక్షంలో ఊరేగింపు ప్రారంభమై, 22–9–84 న తుదిపూజ జరిగి, అనంతరం సాయంత్రం 6 గం॥లకు ఊరేగింపు ప్రారంభమవుతుంది. 23 వ తేదీన మద్రాసును వదలి 30 వ తేదీకి తిరుమలకు చేరుకొని ఆ రోజు శ్రీవారికి జరిగే గరుడ సేవలో కానుకగా సమర్పిస్తారు.

### పవిత్రోత్సవం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో ఆగష్టు 7 నుంచి మూడు రోజుల పాటు జరిగిన ఈ ఉత్సవంలో సుమారు 50 వేల మంది భక్తులు పాల్గొన్నారు. యాగశాలలో ఉత్సవ మూర్తులను పవిత్రాలతో అలంకరించి, శాస్త్రోక్తంగా యజ్ఞం నిర్వహించారు. ఈ సందర్భంగా నారాయణగిరిలో శ్రీవారి పాదాలకు పూజలు కూడా జరిగినవి.

### గోపూజ

ఆగష్టు 20 వ తేదీన శ్రీకృష్ణాష్టమి సందర్భంగా శ్రీ వేంకటేశ్వర డైరీఫారంలో గోపూజ ఉత్సవాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా 19 వ తేదీ నుంచి 23 వరకు శారదా ప్రియానందగారు 'భాగవతం' పై ఉపన్యసించారు.

ఆగష్టు 21 వ తేదీన తిరుమలేశ్వరుని ఆలయంలో గోకులాష్టమి ఉత్సవం నిర్వహించారు. ఈ సందర్భంగా ఉట్ల ఉత్సవం జరిగింది.

తిరుపతి శ్రీ అన్నమాచార్య కళామందిరంలో కూడా గోకులాష్టమి సందర్భంగా స్పెషల్ ఆఫీసరుగా ఇటీవల పదవీ బాధ్యతలు స్వీకరించిన శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు రసమంచిత వ్యాఖ్యానంతో జరిగిన ఈ సంగీత కచ్చేరిలో శ్రీకృష్ణునిపై రచించిన అన్నమయ్య కీర్తనలను మధురంగా శ్రీ వాగేశ్వరనాయుడు, శ్రీ పి. యస్. రంగనాథ్ గానం చేశారు.





అదిలాబాద్ జిల్లాపరిషత్ అధ్యక్షులు శ్రీ టి. మధుసూదనరెడ్డిని పుష్పమాలతో అలంకరిస్తున్న దేవస్థాన ప్రజాసంబంధాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి.



భూమిపూజ

## నూతన కల్యాణ మండపము

అదిలాబాద్ జిల్లాలోని మంచిర్యాలలో నూతన కల్యాణమండపానికి ఆగష్టు 12 తేదీన భూమిపూజ గావిస్తూ, దేవస్థాన ధర్మకర్తలమండలి సభ్యులు శ్రీ పి. యాదగిరి, ఎం ఎల్ సి, సనాతన ధర్మరక్షణ, ప్రచారానికి దేవస్థానం వారి వివిధ ప్రణాళికలను సద్వినియోగం చేసుకోవలసిందిగా కోరారు. నూతన కల్యాణ మండపముల నిర్మాణానికి దేవస్థానం అత్యంత ప్రాధాన్యము ఇవ్వడం జరుగుతుందనీ గూడా తెలియజేశారు. దేవస్థాన ప్రజాసంబంధాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి ప్రసంగిస్తూ 1.9 కోట్ల రూపాయల ఖర్చుతో 13 కల్యాణ మండపాలు మరియు 18 సత్రాలు నిర్మించబడ్డాయని, 7.2 కోట్ల రూపాయల ఖర్చుతో 62 కల్యాణ మండపాల నిర్మాణము వివిధ దశలలో ఉన్నాయనీ తెలియజేశారు. ఇదియేగాక దేవస్థానం వారి వివిధ ప్రణాళికలను వివరించారు.



విచ్చేసిన ఆహూతులు

అదిలాబాద్ జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ టి. మధుసూదనరెడ్డి, మంచిర్యాల పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ ఎస్. ఎస్. సాంబయ్య తమ ప్రసంగాలలో సనాతన ధర్మ రక్షణ మరియు వ్యాప్తికి దేవస్థానం చేస్తున్న సేవలను ప్రశంసించారు.

*



ఈ నెల 2 వ. తేదీన ఆంధ్రప్రదేశ్ నూతన గవర్నర్ గౌ॥ డా॥ శంకర దయాళ్ శర్మ సతీసమేతంగా తిరుమలకు విచ్చేసి శ్రీ వెంకటేశ్వర స్వామిని భక్తి శ్రద్ధల తో సేవించారు. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి శేషవస్త్రము, ప్రసాదమును బహుకరించారు. తరువాత వారు తిరుమల లోని శిలాతోరణాన్ని, తిరుపతి లోని వివిధ మందిరాలను దర్శించారు!

## తిరుమల లో



## ఆంధ్రప్రదేశ్ గవర్నర్









# ధర్మరక్షణ కార్యక్రమాలు

## శ్రీకాకుళం

జూలై 8వ తేదీ నుండి 16వ తేదీ వరకు ప్రార్థన గాన సంఘ రామమందిరంలో 'గురుపూర్ణిమ' కార్యక్రమాలు అత్యంతోత్సాహముతో జరుపబడినవి. స్థానిక సుప్రసిద్ధసంస్కృత పండితులు బ్రహ్మశ్రీ సామవేదం సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీ శంకరవిజయము గురించి ఉపన్యసించారు. ఆదిశంకరులు బోధించిన భక్తి, జ్ఞాన, వైరాగ్యములను భక్తులకు సుబోధకము గావించారు. 11, 12 తేదీలలో శ్రీమాన్ కామసముద్రం నరసింహాచార్యులు భాగవతార్ 'మారుతిచిటికెలు', 'తులసీ జలంధర' హరికథలు జనరంజకముగా చెప్పారు.

13వ తేదీన పండిత శ్రీమాన్ అరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు గారిచే గురుపూజామహోత్సవము జనులలో గురుభక్తి పెంపొందే విధముగా జరుపబడింది. మందిర కమిటీవారు వీరిని శాలువతో సత్కరించి గౌరవించిరి. పూజానంతరము ఆచార్యులవారు వ్యాసులజననవిశేషము, పురాణవాఙ్మయ ప్రాశస్త్యము, పురాణ వాఙ్మయ విభజనలుగురించి మూడురోజులు, 16వ తేదీన కర్కాటక సంక్రమణపర్వదిన వైశిష్ట్యమునుగురించి భక్తులలోపురాణపఠన కౌతూహలం ఏర్పడునట్లు సవివరముగా వివరించారు.

## వరంగల్లు

జూలై మాసములో 5 ధార్మిక ఉపన్యాసములు, 4 భజనలు, 2 హరికథలు జరిగాయి. హిందూధర్మరక్షణ సంస్థ జిల్లా ఆర్గనైజరు, శ్రీ వై. సూర్యచంద్రారెడ్డి ఈ సంస్థ ఆశయాలు, సనాతనధర్మం పట్ల మనం ఈనాడు అనుసరించవలసిన రీతిని గూర్చి ప్రసంగించారు. ప్రతిరోజూ టి.టి.డి కల్యాణమండపమునందు సా. 6-30 గం. నుంచి పురాణప్రవచనము ఏర్పాటుచేయడం జరిగింది.

## ప్రొద్దుటూరు

కడపజిల్లా ప్రొద్దుటూరులో ఈ నెల 10వ తేదీన కొఱ్ఱిపాడు రోడ్డులోని హరిజనవాడలో 6 గం॥ నుండి 8 గం॥ వరకు వేమనసాహిత్యము, ఆధ్యాత్మికతత్వమునుగూర్చి ప్రజాహక్కుల సంరక్షణ సంఘం కార్యదర్శి శ్రీ నలమారు నడిపి సుబ్బయ్య వేమన పద్యములను ఉదాహరిస్తూ కడు రమ్యముగా ఉపన్యసించారు. హిందూధర్మరక్షణసంస్థ ఆర్గనైజరు శ్రీ కె. కృష్ణాజీ ఈ సభలో అధ్యక్షోపన్యాసము గావించారు. శ్రీ గాజు సుబ్బరాయుడు (ఉపాధ్యాయుడు) వీరిని సభకు పరిచయం చేశారు.

## నెల్లూరు

జూలై 11వ తేదీన "మానవులు-వారి కర్తవ్యములు" గూర్చి శ్రీ ఎ. యస్. విశ్వనాథ శ్రౌతి ధార్మికోపన్యాసం గావిస్తూ, మానవుడు జన్మదినం నుండి మరణాంతము వరకు ఆచరించదగిన విధులు మను ధర్మశాస్త్ర ఆధారముగా చక్కని సరళశైలిలో విపులముగా వివరించారు. శ్రీ వి.సుబ్బరామశర్మగారు నిశిత, తార్కికబుద్ధితో హిందూ ధర్మమును గురించి మరియు శ్రీ పి. వీరబ్రహ్మం (చాకలికొండ) గారు భాగవతము-భక్తితత్త్వమున 'నవవిధభక్తులు' సోదాహరణ పూర్వకముగా విశదీకరించారు. శ్రీమతి జి. త్రిపురసుందరమ్మ (సౌందర్యలహరి మండలి) గారిచే నామసంకీర్తనము, కుమారి టి. సి. తారాకుమారి భాగవతారిణి (విజయముద్రిక), శ్రీ చింతా ఈశ్వరశర్మ (భక్తమార్కండేయ) గార్ల హరికథలు బహు జనాకర్షణ పొందినవి.

## శ్రీ రమాసత్యనారాయణస్వామి దేవస్థానం, గుంటూరు

జూలై 15వ తేదీ నుండి ఆగష్టు 23 వరకు మండలం రోజులపాటు పై దేవస్థానం వారి ఆధ్వర్యంలో విష్ణుసహస్రనామపారాయణ భక్తిశ్రద్ధలతో గావించబడింది. ఈ సందర్భంగా 24-8-84 శుక్రవారంనాడు ధార్మిక సమ్మేళనమును దేవస్థాన అధ్యక్షులు శ్రీ సి. హెచ్. వి. గోపాలకృష్ణమూర్తి ప్రారంభించారు. తి. తి. దేవస్థాన వేద పండితులు వేదస్వస్తి; కుమారి శ్రీదేవి, గాయత్రి యొక్క అన్నమయ్య కీర్తనతో సభ ప్రారంభమైనది. శ్రీ చెరువు సూర్యనారాయణమూర్తి అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా ప్రముఖ సినీనటులు శ్రీ ధూళిపాళ "శ్రీ సత్యనారాయణ వ్రత మాహాత్మ్యం" అనే క్యాసెట్టును ఆవిష్కరించారు. వారు తమ ఉపన్యాసంలో సమాజంలో నేడు అన్ని నిత్యావసర వస్తువులతో పాటు మానవునికి భక్తికూడ తప్పనిసరిగా ఉండవలెననీ, తి. తి. దే. హిందూధర్మ రక్షణసంస్థకార్యక్రమాలనూ ప్రశంసించారు. ప్రముఖ వక్త డా॥ ప్రసాదరాయకులపతి తమ ఉపన్యాసంలో విష్ణుసహస్రనామ ప్రాశస్త్యాన్ని విపులంగా వివరించారు.




Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.

# సప్తగిరి

అక్టోబరు 1984

వెల : 1-00



తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక

JAGADISH




క్షీరాబ్ధి కన్యకకు శ్రీమహాలక్ష్మికిని
నీరజాలయకును నీరాజనం ॥

జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువుమాణిక్యముల నీరాజనం ॥

చరణకిసలయములకు సకియ రంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు నతివ నిజనాభికిని
నిరతి నానావర్ణ నీరాజనం ॥

పగటు శ్రీ వేంకటేశు పట్టపురాణియై
నెగడు సతికళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ చక్కఁదనముల కెల్ల
నిగుడు నిజశోభనపు నీరాజనం ॥




(దీపావళి- లక్ష్మీపూజ సందర్భంగా గేయ నీరాజనం
— అన్నమయ్య శృంగారకీర్తన )

# మీమాట

## ముఖచిత్రం

జూలై సంచికమీది సర్వదేవతా స్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు ముఖచిత్రం అట్లు చిత్రించుటకు ప్రేరేపణ ఎట్లు వచ్చినది? పూర్వముఖము మరియు ఊర్ధ్వముఖము మినహాయించితే, కొన్ని ఆయుధములను మినహాయించితే ఆ చిత్రము శ్రీ పంచముఖ వీరాంజనేయస్వామి స్వరూపమునకు కడు పోలికను పొడసూపుచున్నది. అది పూర్తిగా ఊహాచిత్రమేనా? లేక అట్టి రూపము ఎక్కడైనా ఉన్నదా?

డా॥ యం. శివకుమార్—కర్నూలు

అది పూర్తిగా చిత్రకారుని ఊహాచిత్రం

సం॥

## బాలప్రబోధం

'మేధావికథ' చాల బాగున్నది. వైరాగ్యము వచ్చునట్లు మనస్సుకు హత్తుకొనునట్లు వ్రాసినారు. రచయిత శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గార్కి నా నమస్కారాలు. ఇంకా ఇతర వ్యాసాలన్నీ చాల బాగున్నాయి. రచయిత లందరికీ ధన్యవాదాలు.

దిరిశాల సుబ్బారావు—విజయవాడ

యన్. దుర్గారెడ్డి—పొడిచనపల్లి

## సంపాదకీయం

ఆగష్టు సంచిక ముఖచిత్రం, మణిదీపం లాంటి సంపాదకీయం మనస్సుకు ప్రశాంతతను చేకూర్చాయి. రచనలన్నీ మనస్సును సంతోషతరంగాల్లో తేల్చినాయి.

శిష్ట్లా వసుంధరాదేవి — తెనాలి

## సర్వాంగసుందరంగా

ఆగష్టు సంచిక వినాయక చతుర్థి, కృష్ణ జన్మాష్టమిల ప్రత్యేక సంచికగా అందులోని వ్యాసాలు, గేయాలు, ముఖచిత్రం, సంపాదకీయం ఆ పత్రికను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాయి.

శ్రీవల్లి — గుంటూరు

## జూలై సంచిక

తత్త్వగేయాలు, దివ్యమంత్ర పంచకము, వ్యాసములు, వెలుగుబాట, మహాపురుషుల జీవితములు, ఉపమానములు, సంపాదకీయం, బహుప్రశంసనీయములు. రచయితలకు నా కృతజ్ఞతలు.

అనుముల సత్యనారాయణ — నిజామాబాదు

## మన దేవాలయాలు

జూలై సంచికలోని మన దేవాలయాలు క్రింద "గుడిమల్లం" అమూల్యమైన విషయాలను నిగూఢమైన అంశాలను తెలిపింది. సంతోషము.

ఎ. రామసుబ్బారెడ్డి — కాళ్ళప్రొద్దుటూరు

## శ్రీకృష్ణజయంతి

ఆగష్టు సంచికలో శ్రీకృష్ణ జయంతి సందర్భంగా ప్రచురించిన జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారి "శ్రీకృష్ణ జయంతి-అన్నమయ్య," కృష్ణచైతన్యగారి "శ్రీకృష్ణుని శిరోవేదన," ఫోటోలు, సంపాదకీయం మున్నగునవి చాల రమణీయంగా వున్నాయి. ఇలాగా ఆధ్యాత్మిక భావాన్ని పెంపొందిస్తున్న దేవస్థానం వారికి నా ధన్యవాదాలు.

డా॥ ఎస్. సుబ్బారెడ్డి — కర్నూలు

ఓబులేశు — ఆళ్ళగడ్డ

## సంపాదకీయం

దైవ, ధర్మ, వేదాంత స్పందనలతో మీ సంపాదకీయం సహనాన్ని, తత్త్వాలోచనను పెంపొందించుచూ మనస్సుకు ఊరట కలిగిస్తుంది.

ఎ. మహేష్ — విజయవాడ

## నవరత్నమాలికాస్తుతి

పండిత శ్రీ అగ్రజ సత్యనారాయణశాస్త్రి గారి "శ్రీ వేంకటేశ్వర నవరత్నమాలికాస్తుతి" సులభశైలిలో భక్తిస్ఫోరకంగా ఉన్నది. రచయితకు నా ధన్యవాదాలు.

డా॥ కైలాసనాథ్ — హైదరాబాద్

*




గౌరవసంపాదకులు.

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి,
ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :

శాస్త్రిపాటి సుబ్బారావు,
ఎమ్. ఎ.

*

ముద్రాపకుడు :

ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00

సం॥ చందా - రు. 12-00

ప్రతులకు :

వెల్ ఫేర్ ఆఫీసర్,

టి. టి. డి., తిరుపతి.

# ఈ సంచికలో....

అక్టోబర్ 1984
సంపుటి 15 సంచిక 5



ముఖచిత్రం: మహిషాసురమర్దిని, చిత్రకారుడు: కె. జగదీశ్. 4వ కవరుపేజి: తిరుచానూరు శ్రీపద్మావతీఅమ్మవారి నూతనస్వర్ణగోపురం
2వ కవరుపేజి: శ్రీవారి ఊంజలసేవ. 3వ కవరుపేజి: చక్రస్నాన మహోత్సవం.

# సంపాదకీయం

'పాడిందే పాడరా' అని ఒకాయన విసుక్కున్నాడు. దానికి సమాధానంగా నేమో

ఈ ప్రపంచకమెల్ల నెల్లవేళల
తినుచున్న అన్నమే తినుచున్న దిన్నాళ్ళు
తన రుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనది గాన — అని ఒక మహాకవి

చక్కగా చిక్కగా టక్కున సమాధానం ఇచ్చాడు. పాడవలసినప్పుడు పాడినపాటే ఐనా మళ్ళీ పాడుకోవటంలో తప్పులేదన్నమాట.

ఈ మీమాంస ఈనాటిది కాదు. పాతలో కొత్తను చూచే వాళ్ళు కొంతమంది ఉంటే, పాతను పాతరవేసి కొత్తకు కొలువు చెయ్యమనే వాళ్ళు చాలమంది. కాని నిజానికి అనాదిగా వస్తున్న జీవన విధానాలు చూస్తూంటే పాత పునాదులు లేకుండా కొత్తకోటలు లేవటం లేదనిపిస్తుంది.

ఆదిమ మహర్షులు, ద్రష్టలు అంతర్మథనతో భావితరాలకు అందించిన అమృతకలశా లవే ఈనాటి నవభావ సాహిత్య శకలాలు. మహాత్ములు సూత్రప్రాయంగానో, సంక్షిప్తంగానో చెప్పినదాన్ని మన మానసిక బౌద్ధికశక్తుల కనుగుణంగా వ్యాఖ్యానించుకొని ఆ పాతబాటల పొడుగునా నవనందనాలు వెలయించాం. మన జాతి నైతిక, రాజకీయ, ఆధ్యాత్మిక భావనలకు శిఖరాయమానమైన రామాయణ, భారత, భాగవతాల కెన్నెన్ని వ్యాఖ్యానాలు, ఎన్నెన్ని భాషలలో వెలసింది అందరికీ తెలిసిన విషయమే. ఇక 'అథాతో బ్రహ్మ జిజ్ఞాస' తో ప్రారంభమైన బాదరాయణ సూత్రాలు, మహామనీషుల దివ్య భావనాబలంవల్ల అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సంప్రదాయాలకు మూలకందా లయ్యాయి.

భాస, భవభూతి, భారవి, మాఘ, కాళిదాసాది మహాకవుల రచనల ఇతివృత్తాలన్నీ మన మహా కావ్యాలనుంచి వచ్చినవే. అన్ని శాస్త్రాల విషయంలోనూ అన్ని దేశాలలోనూ అంతే. 'మాఘే మేఘే గతం వయః' అని మల్లినాథు డనుకొన్నాడని ఎవరన్నా మానుకొన్నారా? భరతశాస్త్రం ఆధారంగా జాయపసేనాని నృత్తరత్నాకరం వ్రాశాడు. కాళిదాస నాటకాలకు కాటయ వేమన వ్యాఖ్యలు వ్రాశాడు. చివరకు బైబిలుకు భగవద్గీతకు కూడా ఈ నియమం తప్పలేదు. కారణం ఒకటే. నిన్న లేని, నేడు కాని, రేపు లేదు. ఒకదాని కొకటి అంటుకొని కాలచక్రంలో తిరుగుతుండవలసిందే. మనీషులైన మొన్నటివాళ్ళు రేపటి జీవుల కందించవలసిన సందేశాలను సమాధానాలను మొన్ననే భద్రపరచారు. నిజానికి మహాభారతంలో 'ఇక్కడ ఉన్నదే ఎక్కడైనా వుంది. ఇక్కడ లేనిది ఎక్కడా లేదు' అని స్పష్టం చేశారంటే ఆ పుణ్యపురుషులు పదిల పరచి పెట్టినవి సార్వకాలిక జీవజ్ఞాన సర్వస్వా లన్నమాట. అనర్ఘ రత్న నిక్షేపకాలైన ఆ అనంత విజ్ఞాన సాగరాలను మనమేధో మందరాలతో రత్నాలు దొరికాయని రక్తితో యథాశక్తి మథిస్తున్నాం. రప్పలు దొరికితే అబ్బే అని ఉప్పునీళ్ళంటున్నాము. అది వాటి తప్పుకాదు. మన యోగ్యత అంతే.

ఇక భాగవతం గూర్చి చెప్పనే అక్కరలేదు. మధురభక్తి సిద్ధాంతం ఆ కల్పతరువునుంచి వచ్చిందే. ఒక్కొక్క కథా ఒక కొత్త అర్థాన్ని సంతరించింది. కొత్త మాటలకు బాట లేర్పరచింది.

అందులోదే దీపావళి సందర్భంగా చెప్పుకొనే నరకవ్యథా కథ. ఒక రకంగా జీవ సంసార బంధచ్ఛేదానికి దేవుని ప్రయత్నాన్నీ, ఇంకొక ప్రక్క నరబల గర్వితుడైన నరుడుడు సమాజానికి నరకప్రాయుడై ఎలా నశించి పోయేదీ, వివరిస్తోంది. కథా కాలం చెల్లిపోయినా, తరతరాలుగా వింటున్నా ఈ నరుని కథ, అతనిలోని నరకుని కథ మారనంత కాలం మనిషి కీ మథనం తప్పదు. పాతంతా ఒక రోత అనుకొనే వాళ్ళకు చెప్పగలిగిం దేమీ లేదు.

లో జ్యోతి వెలగనిదే, ఆ జ్యోతి కన్పించదు
ఓనమాలు లేకుండా ఓంకారం అందదు. అంతే —

"దీపం జ్యోతిః పరబ్రహ్మ
దీపం సర్వతమోపహమ్
దీపేన సాధ్యతే సర్వం
సంధ్యాదీప నమోఽస్తుతే!"

మానవుని జ్యోతిర్మయ జీవనానికి సంకేతం దీపావళి. అమావాస్యరాత్రి అంధకారంలో వేలకువేల దీపాలతో వినువీధి తారాగణాన్ని వెక్కిరించే దివ్వెలపర్వం దీపావళి. దేశమంతటా అందరి ఆశలను వెలిగించే ఈ దీపమాల అఖిలభారత జాతీయతా చిహ్నమైన జయమాల. మానవునకు జ్యోతి ఐహికాముష్మికప్రదాయిని. వేదములు, ఉపనిషత్తులుకూడ 'తమసో మా జ్యోతిర్గమయ" అని ఘోషిస్తున్నవి. జ్యోతి సాక్షాత్కారమునకు, తద్వారా ఐహికాముష్మిక సుఖములను బడయుటకై మానవాళి జరుపుకొనే పర్వదినమే దీపావళి!

'నరకచతుర్థశి' అనే పదంలోని 'నరక' శబ్దానికి 'యమలోకం' అని అర్థం. యమలోకమయిన 'నరకం' నుంచి విముక్తి పొందుటకు యమధర్మరాజును పూజించాలని 'వ్రతచూడామణి' ఇలా చెప్పియున్నది:

'యమాయ ధర్మరాజాయ
మృత్యవే చాంతకాయ చ'

అలాగే 'నరకాయదదంతి చ' అనే దానికి ఎవరు యమరాజును (నరకాధిపతి) దీపములు పెట్టి పూజింతురో వారి పితరులు నరకము నుండి విముక్తులై స్వర్గాన్ని పొందుతారని అర్థము.

దీపావళికి, దీపాలకూగల సాన్నిహిత్యాన్ని 'ధర్మసింధు' ఇలా నుడివియున్నది:

'తులాసంస్థే సహస్రాంశే
ప్రదోషే భూతదర్శయోః,
ఉల్కా హస్తా నరాః కుర్యుః
పితౄణాం మార్గదర్శనం'

అశ్వయుజ బహుళ అమావాస్యనాడు పితరులు భూలోకమునకు వత్తురనీ, వారికి




మార్గదర్శనం చేయుటకై అమావాస్య చీకటిలో ప్రజలు దివిటీలతో తిరగటం ఆచారమైనదనీ, ఈ శ్లోకానికి అర్థం. ఆ దివిటీలే క్రమేణా దివ్వెలుగా అటుతర్వాత చిచ్చుబుడ్లు, మతాబులుగా రూపొందినవని కూడ భావించబడుచున్నది.

### పురాణగాథల పరమార్థం

దీపావళి పర్వానికి మూలమనదగిన పురాణగాథలు లెక్కకుమిక్కుటముగానున్నా, ఆయా గాథల వెనుక అంతర్గతంగాగల దివ్యప్రబోధములను గ్రహించి పండుగ జరుపుకొనినపుడే పర్వాచరణకు సార్థకత.

నరకాసురుని సత్యాసమేతుడై కృష్ణుడు వధించెననే పురాణగాథ అధికంగా జనశ్రుతమైన గాథ, ఈ గాథవెనుకగల దివ్యసందేశం గమనార్హం. అన్యసంపదల నాశించి, దౌర్జన్యాలకు, దుష్టత్వానికి ఉపక్రమించే ధూర్తులను జయించుటకు, విశ్వశాంతికి భంగకరమైన దుష్టులను జయించుట కవసరమైన శక్తిని సముపార్జించుమని దీపావళి ఈ గాథద్వారా హెచ్చరిస్తుంది. ఈ నరకుని గాథ ఆంతర్యాన్నే భగవాన్ రమణమహర్షి బహిర్గతపరుస్తూ పల్కిన పలుకులు చిరస్మరణీయాలు.

"నరగుడల్ నానారగులగు అళుం
నగనెం గెనుచా విజ్ఞానత్తి గిరియాల్
నరగ నైక్కొనవన్ నారణననే
నరగ చతుర్దశి నట్టనమామే"

'నరకతుల్య శరీరం తాననుకొన్నవాడే నరకుడు.' నరకుడెవడో తెలుసుకొని విజ్ఞానదృష్టితో ఆ నరకుని అంతమొందించినవాడే నారాయణుడు. అదే నరకచతుర్దశీపర్వం. శరీరం, నరకంలాంటి ఇల్లు. ఈ శరీరం నేననుకొనే భ్రమయే నరకుడు. ఆ మాయనే నాశనం చేసి తన్ను తాను ప్రకాశింపచేస్తే అదే 'దీపావళి' కాగలదు అని భావం.

రావణుని వధించి అయోధ్య కేగెనని పట్టాభిషిక్తుడయ్యెనని, ఆ ఆనందానికి పంకే

తంగా నిఖిలప్రజావళి మితిమీరిన మోదముతో దీపోత్సవం జరిపిరని పురాణవిదితం. నాటినుండి నేటివరకు కులమత భేదాలను మరచి ప్రజలంతా ఆడంబరంగా దీపావళి జరుపుకుంటున్నారు. నాటి రామరాజ్యాన్ని మరపించే ప్రజా శ్రేయోరాజ్యానికి పునాదులు వేయుమని దీపావళి ప్రబోధిస్తుంది.

ఆర్యసమాజ స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి వైదికధర్మాన్ని ప్రచారం చేయుటలో అనన్యసామాన్య కృషిచేసి భారతీయజీవనమునందు నవచైతన్యాన్ని ప్రసాదించిన దివ్యపురుషుడు. అట్టి విశాల హృదయుడు దీపావళి పర్వదినముననే దివంగతుడయ్యెను.

జైనమతప్రవక్త వర్ధమానమహావీరుడు ఈ దీపావళి అమావాస్యనాడే నిర్యాణం చెందెనని జైన హరివంశమున చెప్పబడినది. భారతీయ ఐతిహాసిక ప్రవక్తగా ప్రణుతి చెందిన స్వామి రామతీర్థులు దీపావళినాడే జన్మించెనని, వారి మరణదినం కూడ అదే నని అనేక ఆధారాలవల్ల తెలియుచున్నది. ఆ మహనీయులపావన స్మృతి చిహ్నంగా జ్యోతులను వెలిగించి వారికి శ్రద్ధాంజలి ఘటించుట మన కర్తవ్యమని ప్రబోధిస్తూ వారి దివ్యవాణిని, వారి సత్సందేశాలను ప్రజాబాహుళ్యానికి పునస్స్మరణ గావిస్తుం దీ దీపోత్సవం!

## దీపోత్సవ సందేశం

ఆధ్యాత్మికపరంగా పరికిస్తే దివ్వెల సందేశ మిలా గోచరిస్తుంది.

'వైరాగ్య తైలసంపూర్ణే
భక్తివర్తి సమన్వితే,
ప్రబోధపూర్ణ పాత్రేతు
జ్ఞప్తిదీపం విలోకయేత్'

ప్రబోధమనెడి పాత్రలో వైరాగ్యమనెడి నూనె పోయబడియున్నది. అందులో 'భక్తి' అనే వత్తి వెలుగుచూ, జ్ఞానజ్యోతి ప్రకాశించుచున్నది. కనుక ప్రబోధంవలన వైరాగ్యం, భగవద్భక్తీ పెంపొందించుకొని తద్ద్వారా ఆత్మజ్ఞానాన్ని సముపార్జించుమని ఆధ్యాత్మికపరంగా దీపావళి సందేశాన్నిస్తుంది.

అంధకారం ఆశారాహిత్యానికీ, అజ్ఞానానికీ, కాంతి ఉద్వేగోత్సాహాలకు, ఆనందానికి ప్రతీకలు. అజ్ఞానాంధకారం నుండి బయటపడి విజ్ఞానపు వెలుగులోకి పయనించి నైరాశ్యంవదలి జీవితాలను ఆనందతేజోమయం చేసుకొనమని సూచించుటయే దీపావళి ధ్యేయం!

## ఆరోగ్యచర్య

దీపావళినాడు అరుణోదయానికి పూర్వమే అభ్యంగన స్నానమాచరించాలని వ్రత గ్రంథాలు ఆదేశించుచున్నవి.

'అభ్యంగం కారయేన్నిత్యం
సర్వేష్వంగేషు పుష్టిదం....'

అభ్యంగన స్నానంవలన సకలావయవ పుష్టి చేకూరుతుంది. ఈ ఆరోగ్యసూత్రమును దీపావళి కార్యక్రమములో ఆచారముగా పొందుపరచుటకు ఒక ఆధ్యాత్మిక నెపం కూడ చెబుతారు. నరకచతుర్దశినాడు తైలంలో లక్ష్మి, నీటిలో గంగ నివసింతురనీ, నూనెతో తలంటుకొని అభ్యంగన స్నానముచేసిన శుభప్రదమూ, ఐశ్వర్యప్రదమూనని సంప్రదాయంపేరిట ఈ ఆచారాన్ని పూర్వులు పొందుపరచారు. అంతేగాక ఆనాడు పంచత్వక్కులను (మర్రి, మామిడి, అత్తి, జువ్వి, నేరేడుపట్టలు) నీటిలో నానబెట్టి ఆ నీటితో స్నానంచేసిన శుభప్రదమనీ మరొక ఆచారమున్నది. ఇందులో మరింత ముఖ్య ఆరోగ్యసూత్రమిమిడియున్నది. ఇవి కరగిన నీట స్నానం చేయుటవలన చర్మవ్యాధులు నివారణ కాగలవనీ, కండ్లకు చలువ నిచ్చుననీ ఆరోగ్యోక్తి. అంతేగాదు బాణ సంచా కాల్చుటచేత ఆ ఘాటుకు రోగకారులైన క్రిమికీటాదులు నిర్మూలనం గావడంకూడ దీపావళి ఆచారాల వెనుకనున్న ఆరోగ్యచర్యయే!

దివ్య సందేశప్రదాయిని, ఆనందసంధాయిని అయిన "దీపయామిని" ని శ్రీ వేదుల లక్ష్మీగణపతిశాస్త్రిగారితో బాటు ...........

"రమ్ము దీపాంజలి నవార్ద్రితలశోభ
దయను కరుణించి జ్ఞానపంథాలుచూపి
ఆత్మమండిత జ్యోతివై అమ్మ! మాకు
తెమ్ము ఆశాంత విశ్రాంత తేజమిలకు."

— అంటూ ప్రార్థిద్దాం, తథాస్తు.

— శ్రీ గునుపాటి భోగీశ్వరం

# శ్రీ కామాక్షీ మల్లేశ్వరాలయం



## పినాకిని (పెన్న) పుట్టుక

భారతదేశమునఁ గల పుణ్యక్షేత్రములలో నెల్లూరునకు సమీపమున పడమటనున్న వేదగిరియు ఒకటి. ఒకప్పుడు పినాకిని ప్రవాహము ఎక్కువై ఆ కొండను చుట్టి ప్రవహింపసాగినది. దాని కారణమును గూర్చి శౌనకాది మహర్షులు, రోమహర్షణ మహాముని కుమారుఁడైన సూతమునిని అడిగిరి. అతడు ఆ మహర్షులకు తత్కారణమును, పినాకినీ జన్మకారణమును ఇట్లు చెప్పెను.

"మునుపు రాక్షసులు 'మాయాసురుడు' అను రాక్షసుని సహాయమున మూడు పట్టణములను నిర్మించుకొని వానిని మాయచే దాచి అన్నిలోకములను బాధింప సాగిరి. వారి బాధలకు సహింపలేని బ్రహ్మేంద్రాది దేవతలు శంకరుని దర్శింపఁ గైలాసమునకేగిరి. వారు తమ బాధలను, శివునితో మొఱపెట్టుకొనగా శివుడు త్వరలో వారి బాధలు పోగొట్టునట్లు అభయమిచ్చి కొంతకాలము ఓపికపట్టు డని వారిని సాగ నంపెను.

పిమ్మట పరమేశ్వరుడు భూమిని రథముగా, సూర్యచంద్రులను రథచక్రములుగా వేదములను గుఱ్ఱములుగా చేసి అందుఁ దానెక్కి మేరుపర్వతమును విల్లుగను (దీనికి పినాకమని పేరు), విష్ణువును బాణముగను, వాసుకిని అల్లెత్రాడుగను సముద్రములను అమ్ములపొదిగను అమర్చుకొని త్రిపుర రూపమునమున్న ఆ రాక్షసులఁ జంపెను.

తరువాత పరమశివుఁడు తన చేతిలోని ధనుస్సును నేలపై విసిరికొట్టెను. ఆ వింటి యొక్క కొమ్ము (కొన) భూమిని చీల్చుకొని పాతాళమున కేగెను. వెంటనే పాతాళగంగ అదే ద్వారమున భూమిపైకి వచ్చెను. శివుని పినాకమువలన పుట్టినది కాఁబట్టి ఈ నదికి "పినాకిని" అని పేరు వచ్చినది. ఆ ప్రవాహవేగమునకు ఈ వేదగిరి అడ్డముగ నిల్చినదని దానిని చుట్టుముట్టి పాఱినది. ఆ కొండపై నున్న మునులు శివుని, పినాకినిని స్తోత్రముఁ జేసిరి, పిమ్మట ఆ నది వారిని దయఁజూచి, కొండను అనుకొని ఉత్తరభాగమున ప్రవహింపసాగినది.

## వృద్ధపినాకిని

ఇట్లు పాఱుచున్న పెన్న జొన్నవాడ, నెల్లూరు రంగనాయకస్వామి దేవాలయముల నడుమ తూర్పుగ కొంతదూరము పోయిన పిమ్మట రెండు పాయలైనది.

వానిలో నొకటి ఊటుకూరు దగ్గఱ సముద్రములోఁ గలియుచున్నది-రెండవ పాయ దక్షిణముగ ఇందుకూరుపేటకు ప్రక్కగా పాఱుచు గంగపట్టణము మీదుగపోయి ఊటుకూరు ప్రాంతమున మొదటి పాయలోఁగలియుచుండినది. కాని ప్రకృతి పరిణామముచేఁ జాలకాలము క్రిందట



శ్రీ కామాక్షి, మల్లేశ్వర, విఘ్నేశ్వరుల ఉత్సవమూర్తులు


ఆలయ ప్రాంగణ దృశ్యం

రెండవపాయ మిట్టబాటీ "వృద్ధపినాకినిని" అను పేరుతో మాత్రము నిలిచియున్నది.

ఇందుకూరు పెట 'వృద్ధపినాకిని' దక్షిణపు గట్టున నున్నది. ఈ ప్రాంతమున మునుపు పెక్కు శివక్షేత్రము లుండినట్లు చరిత్రవలనను ఆ యా ప్రాంతములలో దొఱకిన విగ్రహాదులవలనను దెలియుచున్నది.

ఇట్లు ఇందుకూరుపేట పురాణ శివక్షేత్రముగ విరాజిల్లుచున్నది. ప్రస్తుతము ఈ యూరికి తూర్పుననున్న వీథిలో శివాలయము గలదు. ఇది నారదమహాముని ప్రతిష్ఠితమని పెద్దలు పరంపరగా అనుకొనుచున్నారు. ఊరికి ఉత్తరభాగమున రాజవీధి నానుకొని జనమేజయ ప్రతిష్ఠితమై, శ్రీ లక్ష్మీనృసింహాలయమును, దక్షిణభాగమున శ్రీ భద్రకాళీ సహిత వీరభద్రాలయముఁ గలదు.

ఈ గ్రామము ఒకప్పుడు శ్రీమంతులకు శుద్ధాంతమై, పండితులకు మండనమై, విద్వత్పురోహిత బృందమునకు మూలకందమై, కవివతంసుల కవతంసమై, శిల్పివరేణ్యులచే నగణ్యమై, గానవిద్యా విశారదులకుసారదమై, మల్లవిద్యా విశారదులకుఁ గాణాచియై, ఆంతరంగిక భక్తులకు ముక్తిదమై, వైదిక కర్మనిష్ఠులచే భూయిష్ఠమై పేరుపొందినది.

ఇన్నిటఁ బ్రసిద్ధికెక్కిన యీ గ్రామము సుమారు 80 సంవత్సరములనాఁడు, లక్ష్మీ సరస్వతుల ప్రసాదమునకు ప్రాసాదమై ప్రపంచ ఖ్యాతినందినది. అట్టి ప్రఖ్యాతికి కారకులు ఇద్దరు మహాపురుషులు. వారిలో లక్ష్మీకటాక్షమునకు పూర్ణపాత్రుఁడై సుఖానుభోగమున దేవేంద్ర కోటీశ్వరుఁడయ్యు దానవిషయమున వానికి వైరి (కర్ణుడు)అని పేరు పొందినవారు కీ॥శే॥ అనుచూరు సుబ్బానాయుడు అనువారు. వీరు అభ్రక వ్యాపారముచే కోటికి పడగలెత్తి విదేశములలో 'మైకా కింగ్' అను కీర్తిని సంపాదించి యీ గ్రామమునకు వన్నె తెచ్చిరి. వీరు వీరభద్రుని నిత్యము గొలుతురు. వీరభద్రుడు వీరి యిలువేలుపు.

రెండవవారు సరస్వతీ కటాక్షామృతధారా సహితులై వీరభద్ర విజయమను వీథినాటకమును ఇచ్చటి శ్రీ కామాక్షీ సన్నిధానముననే ఆశుధారచే రచించి త్వరకవి అను బిరుదువే ఇంటిపేరుగా గలిగి కవితానిర్మిత తెనాలి రామకృష్ణ కవి యని ఖ్యాతినందిన త్వరకవి రామకృష్ణకవి.

అట్టి యీ గ్రామమున ప్రభావమున కంచికామాక్షిని, దయాభావమున కాశీ విశాలాక్షిని, భక్తుల కోర్కెల దీర్చు చల్లని చూపుల మధురమీనాక్షిని, ఆపన్నివారణమున జొన్నవాడ కామాక్షిని, దలపించు లలితా పరమేశ్వరి మల్లేశ్వరుని సేవాపరాయణయై "కామాక్షి" అను పేరుతో విలసిల్లుచున్నది.

ఈ అర్చామూర్తి సౌందర్యప్రభావములు భక్తులు అనుభవముచే గ్రహింపఁదగినవి.

పరమేశ్వరుఁడును కామాక్షీసహితుడై "మల్లేశ్వరుడు" అను పేరుతో నిచట భక్తులకు కొంగు బంగారమై వెలయుచున్నాఁడు.

నారదముని ప్రతిష్ఠితమని పరంపరా ప్రసిద్ధి.

నిస్స్వార్థముగ ఏ ద్రవ్యదాత ఈ ప్రతిష్ఠ చేసి ముక్తిపొందెనో వారి పేరు మున్నగునవి యూహించుటకు కనీసము ఒక శాసనమైనను ఈ దేవాలయమున కన్పట్టుటలేదు.

దేవాలయ ప్రాంగణమున, సుమారు ఎనిమిది సంవత్సరములనుండి పురాణకాలక్షేప మూలమున, భక్తి, ఆస్తికత, హిందూమత ప్రచారమును నిస్స్వార్థముగ, ప్రఖ్యాత పండితులు శ్రీ వట్టిపల్లి మల్లినాథ శర్మగారు చేయుచున్నారు.

పై దేవాలయమునకు మెట్ట మాగాణి సుమారు (80) ఎనుబది యెకరములు గలదు. కాని ప్రస్తుత కాలమాన పరిస్థితులలో రాదగినంత ఆదాయము వచ్చుటలేదు.

వచ్చు ఆదాయము, నిత్యనైవేద్యములు, సిబ్బందికి, ఉత్సవకార్యములకు సరిపోవుచున్నది.

ఈ దశాబ్దమునుండి యేర్పడిన ధర్మకర్తలమండలి భక్తులు, దాతలు అగు ఆస్తికుల ద్రవ్యసాయముతో, నవగ్రహాలయ నిర్మాణము, ప్రతిష్ఠ, రాజద్వారపునర్నిర్మాణము, మంటపములో చలువరాళ్ళు పరచుట మొదలగు కార్యములను నిర్మించుటయేగాక శ్రీ స్వామివారి ఆలయశిఖర నిర్మాణముచేపట్టి పనిచేయుచున్నది.

—శ్రీ పూతలగుంట పుల్లవనాయుడు

# మహాశక్తీ మళ్ళీ అవతరించు

బ్రాహ్మీముహూర్తపువేళ. యామినీ కాంత మౌనంగా నిశ్చలమైన ధ్యానంలో మునిగిఉంది. నిశి ఒడిలో నిదురించిన జగతికూడ నిశ్శబ్దంగాఉంది.

క్రమంగా చీకటి తెరలు విచ్చుకుంటు న్నాయి. యజ్ఞవిధ్వంసకుడై, ఋషులను, మునులను పీడిస్తూ లోకకంటకుడైన మహిషాసురుని, సర్వదేవతాశక్తి ప్రతీకవై అవతరించి, వధించి, దైవశక్తిని రక్షించి అలసి విశ్రమించిన విజయరూపిణీ! విశ్వ జననీ! మాకు సత్వరం మేలు కలగజేయ టానికి మేలుకో! జగజ్జననీ! నీ రాక తెలిసి కాబోలు ప్రమోదానంద భరితయై ప్రకృతి కాంత, తుషారబిందువుల ముత్యాలను నీ గళసీమలో అలంకరించేందుకు మాలగా కూరుస్తోంది.

ప్రాగ్దిశాకాంత పులకించి మనోహర మైన నృత్యం చేస్తోంది. పవనుడు లయగా తాళంవేస్తున్నాడు. ఉద్భవిస్తూన్న ఉద యార్కుడు తన లేత కిరణాలతో నీ పాద ద్వయానికి పాదాభివందనం కావిస్తున్నాడు. అరుణకిరణ స్పర్శలో, జపాకుసుమ కాంతి మిళితమైన నీ పాదపద్మాలు ఎంత అందంగా ఉన్నాయి!! సున్నితంగా కదిలే నీ చరణ మంజీరనాదం గగన విపంచిపై మధురంగా ధ్వనిస్తూ, జగతిలోని ప్రతి అణువునూ స్పందింపజేసి చైతన్య శక్తిని కలిగిస్తోంది. నీ చరణమంజీరపు మువ్వలలోని ఏ ఒక్క చిరుమువ్వగానైనా నేను కాగలిగితే ఎంత భాగ్యం!!

అకలుషాత్మక హృద్వాసినీ! కమలనివా సినీ! స్మరణమాత్రంచేతనే హృదయ తాపం నశింపచేసే నీ మృదుపాదయుగళిని నా హృదయాంభోరుహాన సదా నిలుపు దేవీ!

సింధూర తిలక శోభితమైన నీ ఫాలఫల కం క్రిందుగా, శతకోటి సూర్యుల అఖండ కాంతి పుంజాలతో సమంగా వికసించిన నీ నేత్ర ద్వయాన్ని గని అరుణసరోరుహద్వ యంగా భావించిన తుమ్మెదలగుంపు, ఆ కాంతిచ్ఛటలకు మైమరచి, దగ్గరకు రా వెరచి, అపూర్వానందంలో మైమరచి ఝుంకారగీతాగానం చేస్తున్నాయి.



జలజ సుందరనయనా! కరుణామృత రసకవితా! తామస మను పెనుచీకటి నిండిన నా మనస్సుపై నీ కరుణారసదృష్టిని అన వరతంప్రసరింపజేయి జననీ!

యుగయుగాల నుంచీ, దైవీశక్తిని అణగద్రొక్కి రాక్షసశక్తి విజృంభించి నప్పుడు దుర్గామూర్తివై అపరచండివై అవతరించి అసురశక్తిని రూపుమాపుతూనే ఉన్నావు.

దైత్యసంహారిణీ! జగదాధారిణీ!! స్వార్థం, దౌర్బల్యం మానవుల మనస్సు లను ఆక్రమించుకుని ప్రచండ అసుర శక్తిలామారి తాండవిస్తున్న ఈ తరుణంలో,

మౌనంగా తిలకించకు తల్లీ! చిరునవ్వు చిందించకు.

నీ చిరునవ్వులోని అర్థం గ్రహించలేని అజ్ఞాన పూరితులమైన మాలో జ్ఞాన జ్యోత్స్నలు ప్రభవింపజేయి.

ప్రేమమయీ! అహంకారవిధ్వంసినీ!
శక్తిదాయినీ!

ప్రేమ, జాలి, స్నేహసౌహార్ద్రము మాలో నిలుపుకోగల శక్తిని ప్రసాదించు, సృష్టి కారిణీ!

కరుణార్ద్రహృదయినీ!

నిరవధిక లావణ్యనిధివైన నిన్ను సేవించగలగడం నిస్సంశయంగా బహు జన్మార్జితపుణ్యఫలం.

దేవీ కరుణామయీ!
కమలలోచనీ। కంజభవుని రాణి ॥దేవీ॥

చ॥ పాపవిమోచని। పరమపావనీ।
పాలింపగదే। ధర్మస్వరూపిణి
నిరతము నీ పదసంస్మరణమే మా జీవన
మీయవె। వరశుభదాయిని ॥దేవీ॥

జ్ఞానప్రదాయిని నగకులపావని
నానాభరణాలంకృత, శోభినీ నిండు
మనసుతో
నిను కొలిచెదమే। నీడగ నిలిచీ మము
పాలింపవే ॥దేవీ॥

శ్రీహరి సోదరి దేవి దాక్షాయణి
కల్మషమానస హృదయ సంహారిణి
దయగనవే మము దానవనాశిని
అభయమిచ్చి మము ఆదరింపవే ॥దేవీ॥

— శ్రీమతి శిష్ట్లా వసుంధరాదేవి

## యువ వాణి

# మార్పు

నరసింహం ఎమ్. ఎస్. సి. చదివాడు. చదువుకున్న వాళ్ళందరూ నాస్తికులవ్వాలనే ఒక నమ్మకం గలవాడు. కాబట్టి అతడూ నాస్తికు డయ్యాడు. నరసింహానికి భార్య, ఇద్దరు పెళ్ళి కెదిగిన చెల్లెళ్ళు వున్నారు. తల్లి బ్రతికే వుంది. తండ్రి మాత్రం కాల ధర్మం చేశాడు. తల్లి ఎప్పుడూ ఏవో పూజలూ, పునస్కారాలు చేస్తూ వుంటుంది. ఏ భగవద్గీతనో, ఉపనిషత్తులనో చదువుతూ వుంటుంది. ఇవన్నీ నరసింహానికి గిట్టవు. అతడు తనేదో హేతువాది ననుకుంటాడు. తల్లి సహవాసంవల్ల నరసింహం భార్య 'కామాక్షి' కి కూడా కాస్త భక్తి శ్రద్ధలు ఒంటబట్టాయి. ఆమెకూడా అత్తగారి వెంబడి పురాణశ్రవణాలకు, సత్సంగాలకు వెళుతుంటుంది. నరసింహం భార్య కెంతగానో నచ్చచెప్ప జూశాడు. కానీ ఊహుం ఆమెను ఇసుమంత కూడా తన పంథాలోకి మార్చలేకపోయాడు.

నరసింహం నోరు తెరిస్తే "సైన్స్" "సైన్స్" అంటాడు. జీవోత్పత్తిని గురించిన విషయం వస్తే డార్విన్ పరిణామ వాదాన్ని చెప్తాడు. భగవంతుని గురించి ఆయన ఎదుట ఎవరన్నా మాట్లాడితే 'బూర్జువా సిద్ధాంత'మని కొట్టి పారేస్తాడు. 'దేముడు గనక వుంటే ఎందుకు కనబడ' డని సవాలు చేస్తాడు. నరసింహం నాస్తిక సంఘాని కొక దానికి కార్యదర్శిగా ఈ మధ్యనే ఎన్నికయ్యాడు కూడా! నరసింహం ఎన్ని వేదిక లెక్కి ఎన్ని ఉపన్యాసాలు దంచినా పావం? భార్యను మాత్రం నాస్తికురాలిగా చేయలేక పోయాడు.

ఆ రోజు ఆదివారం. ఆఫీసుకు సెలవురోజు. నరసింహం ఉదయాన్నే లేచి నిత్యకృత్యాలన్నీ తీర్చేసుకున్నాడు. ఆ రోజు కార్యక్రమాన్ని నాస్తిక సంఘం అంతక్రితం రోజే నిర్ణయించేసింది. ప్రక్కఊర్లో, ఆ రోజు జరుగుతున్న "గీతాజయంతి" కార్యక్రమానికి ఆ వూళ్ళోవాళ్ళు ఒక స్వామీజీ నాహ్వానించారు. ఇకనేం, నాస్తిక సంఘానికి చేతి నిండా పని దొరికింది. ఆ ఊరికి వెళ్ళి ఆ స్వామీజీని ప్రశ్నించడం నాటి వా కార్యక్రమం. ఎక్కడ ఏ స్వామీజీ నా అక్కడి కెళ్ళి ఆ స్వామిని తిక్క తో తికమక పెట్టడమే వారి పని. ఆ ూడా అదే పని తగిలింది. మన నరసింహం కార్యదర్శి కదా! అందులో – ఆ నాస్తిక సంఘం వాళ్ళందరిలో నరసింహమే కాస్త తెలివైనవాడు. ఎప్పుడే స్వామీజీ వచ్చినా నరసింహమే ప్రశ్నలడిగి వారిని చికాకు పెట్టేవాడు. అలవాటు ప్రకారం ప్రక్కఊర్లో బసజేసిన స్వామిదగ్గరి కెళదామని అందరూ కలిసి నిశ్చయించుకుని బయలుదేరారు.

'నరసింహం ఎండ్ పార్టీ' ఆ వూరు చేరేటప్పటికి సాయంత్రం నాల్గు గంటలు దాటింది. ఆ సమయంలో సభ జరుగుతోంది. సభలో స్వామి నిర్వికారంగా, నిశ్చలంగా ఉపన్యసిస్తున్నాడు. ఉపన్యాసం గంగా ప్రవాహంలా సాగుతోంది. నాస్తిక సంఘ సభ్యులు తమ ప్రశ్న లడగడానికి సిద్ధమయ్యారు. నరసింహం లేచి స్వామి ఉపన్యాసాన్ని అడ్డుకున్నాడు. గంభీరమైన కంఠంతో నిండు సభలో–'స్వామీజీ! దేముడు వున్నాడా?' అని నరసింహం అడిగాడు. 'తప్పక వున్నాడు నాయనా!' స్వామీజీ సమాధానం 'ఎక్కడ వున్నాడు స్వామీజీ? ఉంటే, ఎందుకు కనిపించడు?' ప్రతి నాస్తికుడు అడిగే మొదటి ప్రశ్నే అడిగాడు నరసింహం. స్వామి చిఱునవ్వు చిందించాడు. మలయమారుతంలా శీత



లంగా వుందా చిరునవ్వు. 'ఆహా! ఆ ముఖంలో ఎంతటి ప్రశాంతత! ఎంతటి నిశ్చలత!' అనుకోకుండా వుండలేక పోయాడు నరసింహం. మొదలు పెట్టాడు స్వామి- 'నాయనా! నీ మొదటి ప్రశ్నకు సమాధాన మిస్తాను విను' అని స్వామి తన ప్రక్కనున్న పాలగిన్నె నందుకొని నరసింహానికందించాడు. నరసింహానికిదంతా ఏమీ అర్థం కాలేదు. మళ్ళీ స్వామి అందుకున్నాడు. 'ఈ పాలలో వెన్న ఎక్కడుందో చెప్పు నాయనా!' అన్నాడు స్వామిజీ. నరసింహానికిదంతా అయోమయంగా వుంది. 'ఈ స్వామి కేమన్నా పిచ్చి వుందా. దేముడిని గురించి ప్రశ్న అడిగితే పాలలో వెన్నెక్కడుందో చెప్పమంటా డేమిటి?' అనుకుని 'పాల్లో వెన్న అంతటా వ్యాపించి వుంటుంది కదా! ఎక్కడుంటుందని అడగడం వట్టి పిచ్చి ప్రశ్న' అని బయటికనేసాడు. స్వామీజీ తిరిగి నవ్వి 'ఆ వెన్న ఎలా బయటి కొస్తుంది?' అని అడిగాడు. నరసింహం విసుక్కుని 'పాలను మజ్జిగ క్రిందమార్చి దాన్ని చిలికితే వెన్న వస్తుంది' అన్నాడు.

స్వామీజీ మందహాసం చేసి 'నీవు చెప్పిన రీతిగానే భగవంతుడు పాల్లో 'వెన్న' వలె అంతటా వ్యాపించి వున్నాడు. అందుకే 'ఈశోపనిషత్తు'లో 'ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్' అని వర్ణించబడింది. ఇకపోతే ఈశ్వరుడు మన కవగతం కావాలంటే 'మజ్జిగ'ను చిలికినట్టుగా మన హృదయాన్ని – ఆత్మను – "ఓమ్" – అనే కవ్వంతో చిలకాలి. అప్పుడే ఆ "పరమాత్మ" వెన్నలాగా ప్రకటనమౌతాడు' అని చెప్పి సభవైపు చూచాడు స్వామీజీ. తిరిగి చిరునవ్వు నవ్వి నరసింహాని కేసి తిరిగాడు. అప[illegible] నరసింహం పరిస్థితి మరో[illegible]ని కేమీ తోచడం లేదు. [illegible]ో తెలీడం లేదు. బుర్రంతా [illegible] ఎదురు ప్రశ్న లేమీ వేయలేక [illegible] చెప్పిందే వింటున్నాడు నరసింహం. తిరిగి ప్రారంభించాడు స్వామీజీ, 'నాయనా! దేముడు ఎందుకు కనిపించడని కదూ! నీ రెండవ ప్రశ్న విను. ఈశ్వరుడు ఈ భౌతిక కన్నులకు కనబడే తత్త్వం కాదు. ఈశ్వరుడు కండ్లకు వస్తువు – 'విషయం' కాడు. ఈ విషయాన్నే "కేనోపనిషత్తు" ఎంతో చక్కగా వర్ణిస్తుంది చూడు!

"యచ్చక్షుషా న పశ్యతి
యేన చక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం యదిద ముపాసతే."

— కేనోపనిషత్ 1–6

'ఏది కండ్లకు కనపడదో, దేనిచేత ఈ కండ్లు చూడగల్గుతున్నాయో అది బ్రహ్మము. అదే బ్రహ్మమని నివు తెలిసికొనుము. కండ్లకు కనబడునది బ్రహ్మముకాదు.' దీనిని బట్టి ఈశ్వరుడు కండ్లకు విషయం కాడని తెలుస్తోంది. అయినా కండ్లకు కనపడనంత మాత్రాన "వస్తువు" లేదనడం మూర్ఖత్వమనిపించు కుంటుంది. రుచి, వాసన, స్పర్శ, అనుభూతి, శబ్దం. ఇవన్నీ కండ్లకు కనబడనివే. అయినా ఇవన్నీ వున్నాయని మనం ఒప్పుకుంటున్నాం. వీటిని వాస్తవంగా అనుభవిస్తున్నాం. అలాగే ఈశ్వరుడు ఆత్మకు విషయంగాని కండ్లకు కాదని తెలిసికో. మూర్ఖపువాదన చేస్తే నష్టపొయ్యేది నీవే నని గుర్తించు! కాలదోషం పట్టిన "డార్విన్ థియరీ"ని పట్టుకుని వాదించడం సబబు కాదు. డార్విన్ వాదం ఇంతవరకూ ఋజువే కాలేదన్న సత్యాన్ని తెలుసుకో' అంటూ స్వామి ఆగాడు. తిరిగి చిరునవ్వు నవ్వి తన ప్రక్కనున్న గ్లాసులోని నీళ్ళు త్రాగి మళ్ళీ మొదలు పెట్టాడు. 'సోదరా! మీ అందరికీ తెలియని విషయం ఒకటుంది. నా పూర్వాశ్రమంలో నేను ఒక సైంటిస్టును. అద్భుతమైన ప్రయోగాలెన్నో చేశాను. వాటన్నిటి ఫలితమే నా ఈ ఆస్తికత్వము. ప్రయోగాలెన్నో చేసింతర్వాత ఈ సమస్త చరాచర జడ జగత్తును నడిపి.. వడానికి ఒక చేతన శక్తి అవసరం అనీ, అది వుందనే నిర్ణయాని కొచ్చాను. మీరు విశ్వసించే నాస్తికత్వం శాస్త్రీయమా? నాస్తిక్యాన్ని మీరు నిరూపించగలరా? మీ సిద్ధాంతానికి 'బేస్' గా తీసుకునే 'పరిణామ సిద్ధాంత' కర్త 'డార్విన్' ఆస్తికుడే. అదే వాదాన్ని సమకాలంలో ప్రతిపాదించిన "ఆల్ఫ్రెడ్ రసెల్ వాలెస్" ఆస్తికుడే కదా! ఎంతో గొప్ప శాస్త్రజ్ఞులని ప్రఖ్యాతిగాంచిన న్యూటన్, కోపర్నికస్, మెండల్, ప్లేటో మొదలైన వారు ఆస్తికులే. ప్రపంచంలోని శాస్త్రజ్ఞులలో 90% మంది ఆస్తికత్వాన్ని అంగీకరించిన వారేకదా! నాస్తికత్వాన్ని ఒక ఫ్యాషన్ అనుకొనియే మీరు నాస్తికులుగా తయారయ్యారు తప్ప, మీ దగ్గర నాస్తికత్వ నిరూపణకు శాస్త్రీయమైన ఆధారాలేవి? కాబట్టి నాస్తిక సంఘ సభ్యులారా! ఒక్కమారు ఆలోచించండి. మీ వాదం ఎంత లోపభూయిష్ఠమైనదో తెలుస్తుంది. అంటూ స్వామి తన తర్కాన్ని ఆపి సభలో ఇవ్వాల్సిన ఉపన్యాసాన్ని తిరిగి ప్రారంభించాడు. స్వామి తర్కానికి సభంతా కరతాళ ధ్వనులతో, హర్షధ్వానాలతో నిండి పోయింది.

ఇదంతా విన్న తర్వాత నరసింహం తల తిరిగిపోయింది. స్వామీజీ చెప్పిందంతా నిజమే. మరి తా నింతకాలం నాస్తికత్వం ఊబిలో కెందుకు కూరుకుపోయాడు? స్వామి చెప్పినట్లు 'నాస్తిక్యాన్ని ఒక ఫ్యాషన్ లాగే భావించి తీసుకున్నా' డని అనిపించింది. నరసింహం ఆలోచిస్తున్నాడు. అతనికి నోటివెంట మాట రావడంలేదు. నాస్తిక సంఘపు మెంబర్ల పరిస్థితీ సరిగ్గా ఇదే.

నరసింహం కాళ్ళీడ్చుకుంటూ ఎలాగో ఇల్లు జేరాడు. దేవుడున్నాడనుకుంటే ఒక రకమైన ప్రశాంతత వున్నదని భావించాడు నరసింహం. అత డానాటి నుంచి మళ్ళీ నాస్తికసంఘం పేరెత్తలేదు. సరికదా, 'గీతాప్రచార సంఘం'లో చేరి ఆస్తికత్వాన్ని, హిందూధర్మ వైశిష్ట్యాన్ని ప్రచారం చేస్తున్నాడు? నాస్తికత్వం శాస్త్రీయం కాదని ఘంటాపథంగా చాటుతున్నాడు.

— వై. శ్రీనివాసరావు

## బాలాజీ అర్చన

భక్తులు శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించేందుకు తిరుపతి దేవస్థానం వారు నూతనంగా 'బాలాజీ' అర్చన పథకాన్ని ప్రవేశ పెట్టారు.

మీరు చేయవలసిందల్లా ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు ద్వారా దేవస్థానానికి రూ. 5,000లు చెల్లించడం. ఇందుకు ప్రతిఫలంగా పది సంవత్సరాలపాటు ప్రతిసంవత్సరం మీరు కోరుకున్న రోజున శ్రీ వేంకటేశ్వరునకు అర్చనసేవ చేసుకొనే మహద్భాగ్యానికి పాత్రు అవుతారు.

మీరు చెల్లించిన డబ్బు పది సంవత్సరాలకు వడ్డీతో కలిపి రూ॥లు 15,000 అవుతుంది. దేవుడికి పదిహేనువేలు సమర్పించుకొన్న సంతృప్తి మీకు దక్కుతుంది.

సౌకర్యాలు :

అర్చన రోజున విరాళం ఇచ్చిన వ్యక్తికి వసతి సౌకర్యం కల్పిస్తారు. దంపతులిరువురూ అర్చన సేవలో పాల్గొన వచ్చును. కుటుంబం లోని ముగ్గురు వ్యక్తులకు సుప్రభాత దర్శనం, ప్రత్యేకదర్శనం లభిస్తుంది. ఇవిగాక అంగవస్త్రం లేక రవికగుడ్డ, ప్రసాదం లభిస్తాయి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

## శీలము ప్రాధాన్యత

ఇటీవల పత్రికలలో మహిళలు "శీలాన్ని" కోల్పోయామంటూ మానభంగాలు వార్తలు చదివి చదివి అదేదో ఆడవాళ్ళకి మాత్రమే వుంటుంది అనే భావం సమాజంలో ప్రబలినట్టుంది. ఎంతో ఉన్నత విద్య నభ్యసించి కూడ లంచాలు తింటున్న అధికార్లు, నైతిక విలువల్ని కూడ మరుస్తున్న రాజకీయనాయకులు కూడ నిజానికి శీలాన్ని కోల్పోతున్న వారి క్రిందే లెఖ్ఖ, ఎందుకంటే అసలు శీలం అంటే స్వభావము. మంచి నడత, నీతి అని అర్థము. ఇవి స్త్రీలకెంత ముఖ్యమో పురుషులకు అంతే ముఖ్యం. సరియైన ప్రవర్తన లేకపోతే ఎవరూ ఎవరినీ మెచ్చుకోరు. విద్యతోబాటు సద్వర్తన కూడా కలిగివుంటే బంగారానికి తావి అబ్బినట్టవుతుంది. శీలంలేని రోజున ఎంతటి విద్యావంతుడయినా సువాసనలేని పూవులాంటి వాడవుతాడు. ప్రాతఃకాలంలో రోజూ కోటిలింగాలకు నిత్యాభిషేకం చేస్తుండేవాడట రావణుడు. వేదాలకు స్వరాన్ని కల్పించిన వ్యక్తి. శ్రీరాముడి కంటె ఎన్నో రెట్లు శక్తి సంపన్నుడు. అయినా స్త్రీ వాంఛ అనే చెడుకోరికతో చెడిపోయినాడు. అందుకనే అసలు చదువు కంటె కూడా మంచి నడవడిక కల్గివుండటం అవసరం. అలా వున్నప్పుడు విద్య దానంతట అదే వస్తుంది. అందుకే సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు సంపదకోల్పోతే పెద్దగా పోగొట్టుకొనే దేమీ లేదు. ఆరోగ్యం పోతే కొంత బాధపడాలి. కాని మనిషి శీలాన్ని కోల్పోతే అంతా పోయినట్టే అన్నారు. సర్వగుణములకు అలంకార ప్రాయమైనది శీలము అంటూ భర్తృహరి సుశీలునకు సముద్రము పిల్లకాలువగను, పాము పూలమాలగను, సింహం లేడిపిల్ల వలెను, విషం అమృతమువలె మారునని చెప్పియున్నాడు.

శ్రీ మల్లంపల్లి ధూర్జటి




## పదిహేడవ అధ్యాయం

## శ్రద్ధాత్రయ విభాగయోగం

**అర్జున ఉవాచ:**

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః॥

అర్జునుడు: కృష్ణా! శాస్త్రవిధులను విడిచిపెట్టినప్పటికీ శ్రద్ధతో పూజాదులు చేసేవాళ్ళ ప్రవృత్తి ఎలాంటిది? సాత్త్వికమా? రాజసమా? తామసమా?

**శ్రీ భగవానువాచ:**

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥

శ్రీ భగవానుడు: ప్రాణుల సహజసిద్ధమైన శ్రద్ధ సాత్త్వికమనీ, రాజసమనీ, తామసమనీ మూడు విధాలు. దాన్ని వివరిస్తాను విను.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః॥

అర్జునా! మానవులందరికీ వారి వారి స్వభావాన్ని బట్టి శ్రద్ధ కలుగుతుంది. శ్రద్ధ లేనివాడంటూ లేడు. ఎవడికి ఎలాంటి శ్రద్ధ వుంటుందో వాడు అలాంటివాడే అవుతాడు.

యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః॥
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః॥

సాత్త్వికులు దేవతలనూ, రాజసులు యక్షరాక్షసులనూ, తామసులు భూతప్రేతాలనూ పూజిస్తారు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః॥
కర్షయన్తశ్శరీరస్థం భూతగ్రామ మచేతసః।
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్॥

శాస్త్రవిరుద్ధంగా ఘోరతపస్సులు చేస్తూ అవివేకంతో తమ శరీరంలోని పంచభూతాలనే కాకుండా, అంతరాత్మగా వున్న నన్ను కూడా పీడించే ఆడంబరులూ, అహంకారులూ, కామబలగర్వితులూ. అసురస్వభావం కలిగిన వాళ్ళని తెలుసుకో.

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు॥

అందరికీ ఇష్టమైన ఆహారం మూడు విధాలు. అలాగే యజ్ఞం, తపస్సు, జ్ఞానం కూడా: వాటి తేడాలను తెలియజేస్తాను విను.

ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యాః ఆహారా స్సాత్త్వికప్రియాః॥

సాత్త్వికులకు ప్రీతికలిగించే ఆహారపదార్థాలు ఇవి: ఆయుర్దాయం, బుద్ధిబలం, శరీరబలం, ఆరోగ్యం, సుఖం, సంతోషం- వీటిని వృద్ధిచేస్తూ రసమూ, చమురూ కలిగి, చాలాకాలం ఆకలిని అణచిపెట్టి, మనసుకు ఆహ్లాదం కలగజేసేవి.

కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారా రాజస స్యేష్టాః దుఃఖశోకామయప్రదాః॥

కాగా చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారం కలిగి, చమురు లేకుండా వెర్రిదాహం పుట్టించే ఆహారపదార్థాలంటే రాజసులకు ఇష్టం. ఇవి శరీరానికి బాధ, మనసుకు వ్యాకులత, వ్యాధులు కలగజేస్తాయి.

యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥

తామసులకు చల్లబడిపోయింది, సారంలేనిది, వాసన కొడుతున్నది, చలిది, ఎంగిలిది, అపవిత్రమైనది అయిన ఆహారమంటే ఇష్టం.

అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః॥

తమ కర్తవ్యంగా విశ్వసించి, ఫలాపేక్ష లేకుండా శాస్త్ర సమ్మతంగా చేసే యజ్ఞాన్ని సాత్త్వికయజ్ఞ మంటారు.

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్॥

అర్జునా! ఫలాన్ని ఆశించికాని, ఆడంబరంకోసంకాని చేసే యజ్ఞం రాజసయజ్ఞ మని గ్రహించు.

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥

అశాస్త్రీయంగా అన్నదానం, మంత్రాలు, దక్షిణ లేకుండా అశ్రద్ధతో ఆచరించే యజ్ఞాన్ని తామసయజ్ఞ మని చెబుతారు.

దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం, పవిత్రంగా వుండడం, కల్లాకపటం లేకుండా ప్రవర్తించడం, బ్రహ్మచర్య దీక్షనూ, అహింసావ్రతాన్ని అవలంబించడం- వీటిని శరీరంతో చేసే తపస్సని చెబుతారు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥

ఇతరులకు బాధ కలిగించకుండా సత్యం, ప్రియమూ, హితమూ అయిన సంభాషణ సాగించడం, వేదాధ్యయనం చేయడం వాక్కుకు సంబంధించిన తపస్సు అంటారు.

మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేతత్ తపో మానస ముచ్యతే॥

మనసును నిర్మలంగా వుంచుకోవడం, మౌనం వహించడం, శాంత స్వభావమూ, ఆత్మనిగ్రహమూ, అంతఃకరణశుద్ధీ కలిగియుండడం మనస్సుతో చేసే తపస్సు అవుతుంది.

శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥

నిర్మలమైన మనసు కలిగినవాళ్ళు పరమశ్రద్ధతో ఫలాపేక్ష లేకుండా మూడు విధాలైన ఈ తపస్సు చేస్తే అది సాత్త్వికమని చెబుతారు.

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్॥

సత్కారం, సన్మానం, పూజలు, పొందడంకోసం ఆడంబరంగా ఆచరించే తపస్సు అస్థిరం, అనిశ్చితం. అలాంటిది రాజస మంటారు.

మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్॥

మొండిపట్టుదలతో తన శరీరానికి బాధ కలిగేటట్లుకాని, ఇతరులకు హాని తలపెట్టికాని చేసే తపస్సు తామస మవుతుంది.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥

దానం చేయడం కర్తవ్యంగా భావించి, పుణ్యక్షేత్రాలలో పర్వదినాలలో యోగ్యతను గమనించి, ప్రత్యుపకారం చేయలేనివాళ్ళకు చేసేదానం సాత్త్వికం.

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥

ప్రత్యుపకారం పొందాలనే వుద్దేశంతో కాని, ప్రతిఫలాన్ని ఆశించి కాని, మనసులో బాధపడుతూ కాని చేసే దానం రాజసం.

అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్॥

అనువుకానిచోట అకాలంలో అపాత్రుడికి అగౌరవంగా, అవమానకరంగా యిచ్చే దానం తామసం.

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥

పరబ్రహ్మకు ఓమ్ తత్ సత్ అనే మూడు పేర్లు చెప్పారు. పూర్వం దానివల్లనే బ్రాహ్మణులు, వేదాలు, యజ్ఞాలు సృష్టించబడ్డాయి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥

అందువల్లనే వేదవేత్తలు శాస్త్రోక్తంగాచేసే యజ్ఞాలు, దానాలు, తపస్సులను ఎప్పుడూ "ఓమ్" అని చెప్పిన తరువాతే ఆరంభిస్తారు.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ దాన తపః క్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః॥

మోక్షాన్ని కోరేవాళ్ళు ఫలాపేక్ష లేకుండా పలువిధాలైన యజ్ఞాలు, దానాలు, తపస్సులవంటి పుణ్యకార్యాలు తత్ అనే శబ్దాన్ని ఉచ్చరించిన అనంతరమే ఆచరిస్తారు.

సద్భావే సాధుభావే చ సదిత్యేత త్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే॥

పార్థా! ఉనికి, ఉత్తమం- ఈ రెండు అర్థాలలో సత్ అనే పదాన్ని వాడతారు. అలాగే శుభకార్యాలలో కూడా సత్ శబ్దాన్ని ఉపయోగిస్తారు.

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే॥

యజ్ఞం, తపస్సు, దానాలలోని నిష్ఠకు కూడా సత్ శబ్దం సంకేతం. ఈశ్వరుడి ప్రీతికిచేసే కర్మలన్నిటినీ సత్ అనే చెబుతారు.

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ॥

పార్థా! హోమం, దానం, తపస్సు, ఇతర కర్మలు— వీటిని అశ్రద్ధగా ఆచరిస్తే అసత్ అంటారు. వాటివల్ల ఇహలోకంలో కాని, పరలోకంలో కాని ఫలిత మేమీ వుండదు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని

"శ్రద్ధాత్రయ విభాగయోగం"

అనే పదిహేడవ అధ్యాయం సమాప్తం.

# ఇందరు దేవుళ్ళు ఎందుకు??

శ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

ఇందరు దేవుళ్ళు ఎందుకు అని విచారించటానికి ముందు దేవుడంటే ఎవరు? ఆయన నెందుకు పూజించాలి అనే విషయం విచారించాలి.

మనము దేవుడని ఎవరిని భావిస్తామో ఆయన మనకంటె గొప్పవాడని, సద్గుణములు కలవాడని భావిస్తాము. ఆయన అనుగ్రహం కలగటానికి ఆయన కిష్టమైన గుణాలు మనకు కావాలి అనుకుంటాము. దేవునిదాకా ఎందుకు? మనము ఏ గొప్పవాని దయకోసము నిత్యజీవితంలో ప్రాకులాడుతుంటామో వారి మాటలకే విలువయిచ్చి వారిలాగే ఉండటానికి ప్రయత్నిస్తాము. అప్పుడే వారి దయ మనకు కలుగుతుంది. ఆ విధముగ మనము మనకు గౌరవనీయులైన వారిని ఎల్లప్పుడూ తలుస్తూఉంటే కొన్నాళ్ళకు మనము గూడ వారి వంటి వాళ్ళ మవుతాము. దీనికో తెలుగు సామెత. ఆరునెలలు సావాసముచేస్తే వీడు వాడివంటి వాడవుతాడు. అనగా మనము ఎవరిని మననము చేస్తుంటామో వారి మనస్తత్త్వము మనకు గూడ అలవాటై మనము వారివలె మనకు తెలియకుండానే మారిపోతాము. ఇది మనస్సునకు గల స్వభావము. దీనిని కాదనటము ఎవరిచేత గాదు. ఇక్కడ మనము మారటానికి మన స్వభావమే కారణము గాని వేరొకటి కాదని గట్టిగా గుర్తు పెట్టుకోవాలి.

దేవుని ఆరాధించేవాళ్ళు గూడ ఆ దేవుని ఎల్లప్పుడు మననము చేస్తూ ఉండటం వలన వారి మనస్సు గూడ మారి వారు పూజించుచున్న దేవునియందు గల గుణములు వీరికి గూడ స్వభావ సిద్ధంగానే వస్తాయి. ఈ గుణాలు రావటానికి దేవుడే అక్కరలేదు. ఏ వృత్తిని గురించి ఆలోచించినా అవే గుణాలు వస్తాయి.

మన పెద్దలు మానవుల మనస్తత్త్వాన్ని బట్టి దేవుళ్ళను తయారు చేసారు. అంటే సహజంగా మానవుల స్వభావము మూడు విధాలుగ ఉంటుంది. ఒకటి కోపతాపములు లేక శమదమాదులు కలిగిఉండటము. దానికి సాత్త్వికగుణమని పేరు పెట్టారు. అలాగే క్రోధము ప్రధానంగా ఉండటానికి రజోగుణమని, ఎల్లప్పుడు సోమరితనము గలిగి మంచిచెడ్డల గుర్తింపులేక ప్రవర్తించటానికి తామసమని పేరుపెట్టారు. సామాన్య జనమంతా ఈ మూడుస్వభావాలు కలిగి యుంటారు. అందుకే మనకు ముఖ్యమైన దేవతలుముగ్గురు. వారు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. విష్ణువు సాత్త్వికగుణానికి, ఈశ్వరుడు తమోగుణానికి, బ్రహ్మ రాజసగుణానికి హేతుభూతులు. అనగా సాత్త్విక స్వభావులు విష్ణువును, రాజస స్వభావులు బ్రహ్మను, తామసులు ఈశ్వరుని సేవిస్తారు. సాత్త్వికగుణములు గల దేవతలు విష్ణువును సేవిస్తే, రాజస తామస గుణములుగల రాక్షసులు బ్రహ్మను శివుని పూజించారు.

అలాగే ఇతర దేవతలు ఏర్పడ్డారు. లక్ష్మి సరస్వతి మొదలగువారు. అంటే సంపద కోరినవాడు లక్ష్మిని పూజించాలి. అనగా ధనముపై గౌరవ ముంచి ప్రవర్తించాలి. ధనముపై గౌరవము గలవానికి ధనము రాక ఏం చేస్తుంది? అలాగే విద్య కావలసిన వాడు సరస్వతిని గౌరవించాలి. అనగా విద్యను గౌరవించాలి. అట్టివానికి విద్య ఎందుకు రాదు? వస్తుంది. అంటే వాడి మనస్సు విద్యపై నిలవటానికి సరస్వతి అవలంబనము. అంటే వాడి శ్రమే వాడికి ఆధారమైన సరస్వతి. ఆమె అవలంబనం కావటం చేత సరస్వతివలన విద్య వస్తుంది అని వాడు తలుస్తాడు. లోకం గూడ భావిస్తుంది. యథార్థానికి ఆ భావన ఒక అవలంబనము. ముసలివాడు కఱ్ఱపై ఆధారపడి నడుస్తాడు. వాడికి కఱ్ఱ ఆధారం. యథార్థానికి కఱ్ఱను గూడ వాడే మొయ్యాలి. కాని అది వానికి గట్టి అవలంబనం. అదిలేక పోతే వాడు నడువలేడు. అలాగే దేవతలు గూడ మనకు అవలంబనం మాత్రమే. ఆ యవలంబనం మనకు ఆధారం.

ఈ విధంగా చూస్తే మానవ మనస్తత్త్వాలు ఎన్ని యున్నవో, వారి కోరికలు ఎన్ని యున్నవో అందరు దేవుళ్ళు కావాలి. అప్పుడే వారు కృతార్థు లవుతారు. అందుకే మనవాళ్ళు ముప్పది మూడుకోట్ల దేవత లున్నారని చెప్పారు. అంటే అన్ని మనస్తత్త్వా లున్నవన్న మాట! ఇది తెలియని వారు ఎందుకు ఇందరు దేవుళ్ళు అంటారు. దీనికి ఉదాహరణగా ఎన్నో విషయా లున్నాయి. ఏకలవ్యుడు మట్టిబొమ్మను ఆధారం చేసుకొని గురువును మించిన శిష్యుడైనాడు. మనము కూడ ఒక నటకుడు గాదలచుకొంటే ఒక ప్రసిద్ధ నటకుని మనస్సులో పెట్టుకొని వానివలె మాటాడటం, నడవటం నేర్చుకోవాలి. అలా ఎల్లప్పుడు చేయటంచేత వీడుగూడా వాడంతటి వాడవుతాడు. అప్పుడు తనకు గౌరవనీయుడైన ఆ ప్రసిద్ధ నటుని దేవుడని నమ్ముతాడు. యథార్థానికి ఆ ప్రసిద్ధనటకునికి ఈ శిష్యుని పేరు గూడ తెలియదు కదా! అలాగే మన మనస్సునకు ఒక అవలంబనం కావాలి. ఆ అవలంబనమే దేవుడు. ఆ అవలంబనం లేకపోతే మనుష్యుడు గొప్పవాడు కాలేడు. అందుచేత మీరు వీరులు కాదలచుకున్నారో, కవులు కాదలచుకున్నారో, ధనవంతులు కాదలచుకున్నారో ముందుగా నిర్ణయించుకొని ఆ యా దేవతలను సేవించాలి. అప్పుడు ఫలితాన్ని పొందుతారు. •




ఓ ప్రదర్శన గదిలో ఓ పెట్టెలో
ఓ కీలుబొమ్మ పడి ఉంది-
మరో బొమ్మ మరో పెట్టెలోనుంది.
ఓ దినం ప్రదర్శన జరిగింది
యజమాని మొదటి బొమ్మను తీశాడు
ఖుషుగ్గా బట్టలు తొడిగాడు;
రవ్వల రాళ్ళ ఆభరణాలు పొదిగాడు
"రాకుమారి" వేషం కట్టించాడు
రంగస్థలాన్కి దించాడు
బొమ్మ ఆడింది, గెంతింది:
సలాం చేసింది, చిరునవ్వు నవ్వింది.
ప్రేక్షకుల మన్నల్ని దండిగా పొందింది

ఆట అయిపోయింది. బొమ్మ వెనక్కెళ్లింది.
పొడుగైన కలనూ, చక్కనినటననూ
పలువుర ప్రశంసల్నీ నెమరు
వేసు కొనేందుక్కు- మెలకువగా ఉంది.

మర్నాడు మరో ప్రదర్శన
యజమాని ఆ రెండో బొమ్మను తీశాడు
రాణీ వేషం వేశాడు సురుచిరంగా
పంపాడు రంగస్థలంపైకి
అద్భుతంగా నటించింది గంభీరంగా
ఆనందపు టంచులు చూశారు ప్రేక్షకులు
మాటల కందని రీతిని పొగిడారు
పిడుగుల వానలా చప్పట్లు కొట్టారు.

ఈ ఆట సమయాన తొలిబొమ్మ
పెట్టెలో భోరుమని ఏడ్చింది
క్రూరంగ తన నచట విడిచిపెట్టెరని
గిలగిల లాడింది, బిగిసి పోయింది
చప్పట్లు వినగానె రెచ్చిపోయింది
మరు బొమ్మ వచ్చింది
పొంగిన హృదయాన
తొలి బొమ్మ తనను సం
బాళించు కోలేక
తన్నుకో సాగింది
"యజమానికే మెచ్చెనో గాని
నా కేమి అర్థం కాలేదు
నీ వెల్లా కన్ను గప్పావో
కాలుక్రింద కన్నం వేశావో!
యజమాని నేనెంత నిన్న నటించినా
అప్పుడే మరచాడు; నీ మాయం
బడ్డాడు- సోమరీ మూర్ఖుడూ
నీకు లొంగాడు."

మత్తెక్కిపోయింది మరుబొమ్మ లేచింది
కస్సు బుస్సూమంటు కసురుకొని అంది
"చూడలేదా నీవు- కళ్లైన లేవా?
యజమాని నిన్నేమొ వాడుకొన్నాడు
పనికి మాలిన యట్టు విడిచివేశాడు
అందుకే నేడు నే పోవలసివచ్చింది
వినలేద కనలేద నన్నెంత మెచ్చారో?"

యజమాని విన్నాడు
రాత్రికి చేరుతూ
పొంచి యుండే తను
వాటి కయ్యాన్ని:
ఫక్కున నవ్వాడు
భుజా లెగరేశాడు:
ఏ మాత్రమూ చలన
మే లేదు వాటిలో
సరికదా కయ్యమ్ము
కొమ్మెక్కి కూర్చుంది
చూశాడు తిరిగాడు
రెంటినీ తిట్టాడు.

"చింతన సేశార
ఓ బొమ్మలార!
మీకు మీరే గొప్పగా
తలంచారు
మీ రందకత్తెలని
మీదే విశేషమని
ఇంతకన్న మూర్ఖ
మిం కేమి గలదు?
ఆ నాటకం కొద్ది
ముస్తాబు చేశాను
నాకేల దారాల తోడ
ఆడించాను
ఒకరన్న కోపమా?
ఒకరన్న ముద్దా?
నా ఆట అవసరం
కొలది మిము వాడాను.
ఏ పక్ష పాతమూ
లేకుండనే మిమ్ము
ముక్కల్ని చేస్తాను
అవసరం తీరాక
మిమ్మిరువురనూ
ప్రక్కకు నెట్తాను"

బొమ్మ లేమో అట్లు
గుడ్లు మిటకరించి
అవాక్కై అయినాయి;
దేనికదె అనుకొంది
కుమిలిపోయింది-
అయ్యో! నా యజమాని
న న్నేల తిట్టె నని
అన్యాయ మనవసర
మనుకొంటు ఉస్సురని!



శ్రీ పి. మోహన్

# సుగాత్రి

కాశ్మీరభూమి నడిబొడ్డునగల శారదా పీఠం పూజారి కుమార్తె సుగాత్రి. ఆమె భర్త శాలీనుడు. ఇల్లరికపు టల్లుడు.

మొదటి రేయి చెలికత్తెలు సుగాత్రిని ఆపాదమస్తకం అలంకరించి పతి చెంతకు పంపినారు. ఆమె అలంకారాలు అతనికి నచ్చలేదు. అతడా అన్నులమిన్నను కన్నెత్తి కూడా చూడలేదు. ఆమె అక్కడ అలాగే ఉదయం వరకూ వేచివుండి వెళ్ళిపోయింది.

ఈ వార్త చెలికత్తెలు కనిపెట్టి ఆమె తల్లిచెవిలో వేసినారు. మొదటిరోజు కదా అని అంతగా పట్టించుకోలేదు తల్లి. అలాగే రెండు మూణ్ణాళ్ళు బాగా అలంకరించి ఆమెను అతని పడకగదికి పంపారు. ముందెలా ముభావంగా ప్రవర్తించాడో అట్లే ప్రవర్తించ సాగా డతడు. ఆమె వట్టి రాకపోకలు జరిపింది.

ఆమె చెలికత్తెలు తల్లి అనుమతితో "సఖీ! మీరిద్దరూ భార్యాభర్తల్లా ప్రవర్తించటం లేదు. భర్త చొరవగలవాడైతే భార్య సిగ్గుపట్టం న్యాయమే. భర్తా సిగ్గరియై భార్యా సిగ్గరి ఐతే కాపురం నడచేదెలా? ఇన్నేళ్లు వచ్చాయి కదా! నీవేమన్నా చిన్నదానివా? చితకదానివా? నీవైనీవే నీ భర్తకు సేవచేసి అతనిని నీ కభిముఖుణ్ణి చేసుకోవాలి. ఆ మాత్రం నీకు తెలియదా? అయన కేమి మగమహారాజు. ఎలాగున్నా సరిపోతుంది. నీ కంత పట్టింపు పనికిరాదు. నీ వాయన పరిచర్యలకు పూనుకొంటే అయన మనసు కరుగకపోదు. మక్కువతో ప్రక్కకు పిలవడని మరలి వచ్చుట మేలా? కమ్మని వలపు నింపిన కర్పూర తాంబూల మీరాదా? పిచ్చిదానివలె నున్నావే? సుఖపడవలసిన వయసు నిలా వృథాచేయుట యుక్తమా?" అని ఆమెను మందలించారు.

ఈ మాటలకు సుగాత్రి పైకి కోపించినట్లు నటించింది కానీ ఆ రాత్రి వాళ్లు చెప్పినట్లు చేసి చూసింది. ఫలితం శూన్యం. నా భర్త నా దగ్గర ఇలా ఉంటే చాలు. అదే పదివే లనుకొంది. ఆయన కాయురభివృద్ధికరము లని చెప్పి అనేకములయిన ఆభరణాలను అలంకరించుకొనేది పాపమా అమాయకురాలు అలంకారాలే భర్తృప్రేమకు ఆటంకాలని తెలుసుకోలేకపోయింది. అంతేకాక తన తల్లి అతనిని పల్లెత్తుమాటయినా పలకకుండా జాగ్రత్తపడేది.

ఆమెకూడా కొన్నాళ్లు కూతురు ముఖం చూసి శాలీనుని నడతను సహించింది. కాని అల్లుడు మారలేదు. అత డింట్లోవుంటే తన కూతురుకూ, తనకూ ఊరక బాధపట్టం తప్ప ఏ ప్రయోజనమూ ఉండదని అతనికి తోట పని వప్పగించింది.

సరస్వతీదేవి అర్చనకు ఉపయోగించేవి ఆ తోట పూలే కనుక అతడు తన నైపుణ్యమంతా ప్రదర్శించి ఆ తోటను చక్కగా పెంచ మొదలెట్టాడు. పాదులుచేయడం, మొక్కలు నాటడం, కాలువ లమర్చడం, నీళ్ళు పెట్టడం, ఎరువులు వేయడం - మొదలైన పనులన్నీ అత్యంతాసక్తితో చేసి ఆరామాన్ని అభివృద్ధిచేశాడు. చేమంతులు, చెంగలువలు, సంపెంగలు, సన్నజాజులు, మల్లెలు మొదలైన పూలమొక్కలతో ఆ పూలతోట నందన వనంలా వుండేది.

తన భర్త కష్టించి తోటపని చెయ్యడం, తాను మహారాణిలా హాయిగా తింటూ కూర్చోడం ఆ పతివ్రతకు నచ్చలేదు. కనుక తోటకు వెళ్ళి భర్తకుచేదోడు వాదోడుగా ఉండాలనుకొంది. కాని లజ్జాభరంవల్ల ఆ పని చేయలేకపోయింది.

ఒకనాడు శాలీనుడు తోటలో ఉండగా భయంకరంగా వర్షం వచ్చింది. తన భర్త వానలో ఎక్కడ తడిసి ముద్దవుతాడో అని సుగాత్రి తల్లడిల్లసాగింది. "స్వామీ! మీరా కుంభవృష్టిలో ఏమి అగచాట్లు పడుతున్నారో




కదా! తోటమాలిపని చేయవలసిన ఖర్మ మీకెలా పట్టిందో కదా!" అని ఏడుస్తూ నింగి వంక తొంగి తొంగి చూస్తూ "అమ్మా! శారదాంబా! దయామయీ! నీవే నా భర్తకు దిక్కు. నా భర్తను కంటికి ఱెప్పలా కాపాడు తల్లీ!" అని ప్రార్థించింది. "ఈ జన్మలోనే కాక ముందుజన్మలలో నేను చేసుకొన్న పుణ్యఫలంవల్ల నా భర్తకు వర్షబాధ కలుగకుండుగాక" అని తన మదిలో ఇలువేల్పయిన సరస్వతికి మ్రొక్కుకుంది.

ఐనా ఇంటిలో కాలు నిలువక వానను లెక్కసేయక తల్లికి తెలుపకుండా తోటకు వెళ్లింది. ఆమె పాతివ్రత్య మహిమ వల్ల ఉవ్వెత్తుగ పారే నీళ్ళు పాయలుగా చీలి ఆమెకు త్రోవ యిచ్చింది. ఆమె సునాయాసంగా తోట దరికి వెళ్ళింది. సరస్వతీ కరుణా కటాక్షం వల్ల ఆ తోట చెక్కు చెదరకుండా ఉండుట చూచింది. కుశలంగా కులాసాగా

(29 వ పేజీలో)

# దుర్గా మాత దయ

అతని పేరు 'హరిచరణుడు' అయినా అందరూ అతణ్ణి "దుర్గాదాసు" అని పిలుస్తూంటారు. అవశ్యం అందు కేదో కారణం ఉండాలి కదా! గురుదేవుల సన్నిధానంలో, అతడు ఉపదేశం పొందే సమయంలో ఆ మహాత్ముడు-నాయనా! సర్వకాల సర్వావస్థల్లోనూ "దుర్గా దుర్గా" అని జపించాలి-అన్నాడు.

దుర్గా దుర్గేతి దుర్గేతి
దుర్గానామ పరం మనుః,
యో జపేత్ సతతం చండి
జీవన్ముక్తః స మానవః.

"అమ్మా! చండీ! 'దుర్గా! దుర్గా! దుర్గా!' అన్న నామమే పరమమంత్రము. ఈ నామాన్ని నిరంతరం జపించే మానవుడు జీవన్ముక్తుడవుతాడు" అని గురుదేవుడు పలికిన వచనాలు విన్న క్షణం నుంచీ హరిచరణుడు "దుర్గా! దుర్గా! అమ్మా దుర్గా!" అని అనడ మారంభించాడు. ఉదయాన "దుర్గా! దుర్గా" అంటూ లేస్తాడు. నిర్విరామంగా "దుర్గా! దుర్గా" అంటూ స్నానం చేస్తాడు. పూజాంతంలో దుర్గా నామాన్ని జపిస్తూ గాజుల మూటను బుజానవేసుకుని బయటకు వెడతాడు.

హరిచరణుడు గాజుల వ్యాపారి. అది వినా వాని జీవనానికి మరో ఆధారం లేదు. అహోరాత్రి భేదం లేకుండా విసుగూ విరామం లేకుండా అతడు "దుర్గా! దుర్గా!" అని అంటూండడంవల్ల ప్రజ లతనిని ఎదురుగా "దుర్గాదాసు" అనీ, వెనకాల దుర్గా పిచ్చివాడనీ పిలవసాగారు. ఎవరి మాటలూ హేళనలూ లెక్కచేయకుండ అతడు తన్మయత్వంతో దుర్గా నామాన్ని స్మరించుకుంటూ పోతున్నాడు. పగలల్లా అతడు భగవతి నామాన్ని జపిస్తూ గాజులమ్ముకుంటూంటాడు. రాత్రి ఆ జనని నామాన్నే స్మరించుకుంటూ నిద్రపోతాడు. నిద్రలోకూడ అతని జిహ్వ దుర్గా నామాన్నే జపిస్తూంటుంది.

కామినీ కాంచనాలకు దాసులై విషయ వాసనా లోలురైన యిరుగు పొరుగు వారందరూ - అతనికి పిచ్చెక్కిన దనుకున్నారు. లేకపోతే రాత్రనక పగలనక అతడు దుర్గా నామాన్నెందుకు జపిస్తాడన్నారు. సుఖంలో, దుఃఖంలో, రోగంలో, శోకంలో- అన్ని వేళల్లోనూ అతడు తన్మయత్వంతో అమ్మనామం స్మరించుకుంటూ పోతున్నాడు. పిచ్చివాడు కాక మరేమవుతాడు-అన్నారు మరి కొందరు. వయస్సులో ఉన్నవారు 'దుర్గాదాసుడు' అంటూ హేళన చేసేవారు. అల్లరి పిల్లలమూక- "ఓ పిచ్చివాడు 'దుర్గా!' అనుకుంటూ గాజులమ్ముతాడు. దుర్గ వాని వెనక్కాలే తిరుగుతూంటూంది" అంటూ గేలిచెయ్యసాగారు.

ఆ మాటలు విన్నప్పుడల్లా హరిచరణుని శరీరం రోమాంచిత మవుతూంటుంది. అతడు దుర్గ వస్తూన్నదో లేదో అని వెనక్కి తిరిగి చూస్తూంటాడుకూడ. దానితో అల్లరి పిల్లలంతా చప్పట్లు కొడుతూ కేరింతాలాడుతూ అతనిపై దుమ్ము చల్లుతూ నవ్వుతూ పోతూంటారు. అంత జరుగుతున్నా సహిస్తూ అతడు అమ్మ నామాన్ని ఆనందంగా స్మరించుకుంటూ ముందుకు సాగిపోతుంటాడు. విరామం లేకుండా అమ్మ నామాన్ని స్మరించుకుంటూండడం వల్ల తల్లి దండ్రు లతనికి పెట్టిన హరిచరణుడన్న పేరు పోయి దుర్గాదాసనామం సార్థకమై పోయింది. అందుకుకూడ అత డేమీ బాధపడలేదు.

అది వైశాఖమాసం. అది రెండు జాములవేళ, ఎండ మండిపోతూంది. గాజులమూట బుజాన వేసుకుని దుర్గాదాసు 'దుర్గా! దుర్గా!' అనుకుంటూ తారిజీపుర సీమదాటి మైదానం చేరాడు.

కొంత ముందుకు సాగేసరికి మైదాన మధ్యభాగంలో ఓ చిన్న చెరువు వచ్చింది. అతడు దానిని కూడ దాటి ముందుకు అడుగు వేయబోతూండగా 'ఓ గాజు అబ్బీ! ఆగు! నాకు గాజులు కావాలి' అని ఎవరో పిలుస్తూన్నట్లు వినిపించింది. అలాంటి మధుర కంఠాన్ని అంతవరకూ అతడు వినలేదు. వెనుదిరిగి చూశాడు. చెరువులోని నీళ్ళల్లోంచి ఓ స్త్రీ మూర్తి ముందుకువస్తూ పిలుస్తూన్నది. ఆ దివ్యమంగళ సుందర తేజోమయమూర్తిని చూసి అతడు క్షణకాలం స్తంభించి పోయాడు. మరల మాయ ఆవహించింది. ప్రకృతిలో పడిపోయాడు. అనేకమంది జమీందార్ల, లక్షాధికార్ల యిళ్ళలో ఆడవారి కెందరికో అతడు గాజులు వేశాడు. కాని ఎన్నడూ అతడ లాంటి స్త్రీమూర్తిని చూడలేదు. "రండమ్మా!" రండి! మీకు నచ్చిన గాజులు వేస్తాను?" అంటూ అతడు ఓ పెద్ద చెట్టు నీడలో కూర్చున్నాడు.

ఆ స్త్రీమూర్తి నెమ్మదిగా అతని దగ్గరకు వచ్చి కూర్చుంది. ఆమె మహనీయ రూపాన్ని చూసి అతడు మనసా - 'దుర్గ నీ వెనకాలే తిరుగుతూంది' అని అల్లరి పిల్లలు అన్నమాటలు నిజమే కాబోలు అనుకున్నాడు. ఆమె మందహాసం చేస్తూ- 'గాజులబ్బీ! నాకు మంచి గాజు లెయ్యి' అంది.

దుర్గాదాసు మూటలోంచి మంచి మంచి గాజులు తీసి ఆమె చేతులకు వెయ్యసాగాడు ఆమె స్పర్శమాత్రంచే అతని శరీరమంతా రోమాంచితమై పోయింది, గుండె దడ దడలాడసాగింది. గాజులు తొడుగుతూకూడ అతడు "దుర్గా! దుర్గా!" అని అంటూనే ఉన్నాడు. "అబ్బీ! ఇందాకటి నుంచి చూస్తున్నాను. 'దుర్గా! దుర్గా!' అంటున్నా

వేమిటి? దీనివల్ల నీకు కలిగే లాభం ఏమిటి?" అని ఆమె ప్రశ్నించింది.

దుర్గాదాసుకు నోట మాట రావడం లేదు. కొన్ని క్షణాలు గడిచాయి. "అమ్మా! మా గురువుగారు "దుర్గా! దుర్గా!" అని సర్వదా అనమన్నా రమ్మా! అందుకే అంటున్నాను. ఈ జపంవల్ల, స్మరణవల్ల అమ్మ తప్పక దయ చూపుతుందని వారు చెప్పారు తల్లీ-" అన్నాడు.

"నువ్వెప్పుడైనా అమ్మను చూశావా?"

"లేదు తల్లీ! అమ్మను చూసేటంతటి పుణ్యకార్యం నే నేమి చేయగలిగా నమ్మా?"

"దుర్గా! దుర్గా! అని జపించడంకంటె పుణ్యకార్యం ఏముందయ్యా? అయినా అమ్మను చూడలేని దానికి ఊరికే జపించడం మాత్రం దేనికి?"



"అమ్మా! నేను మూఢుణ్ణి. సరిగా నా కేమీ తెలియదు. నామాన్ని జపించినంత మాత్రానికే దర్శనభాగ్యం కలిగేటట్లయితే అవశ్యం యింకా జపిస్తాను."

గాజులు తొడగడం అయిపోయింది. అప్పుడామె నవ్వుతూ- "అబ్బీ! చెప్పడం మరిచాను. అసలు నాదగ్గర డబ్బులు లేవు రా! నీ గాజులు నువ్వు తీసేసుకో."

ఎందుకో తెలియదు. దుర్గాదాసు ఉదాసీనుడై పోయాడు. "అమ్మా! తియ్యకమ్మా! తియ్యకు. స్త్రీజాతి అంతా సాక్షాత్తు భగవతి స్వరూపమే. మీ చేతులనుండి నేను గాజులు తిరిగి తియ్యలేను. నాకు వీటి ధర యివ్వనక్కరలేదు" అంటూ అతడు మూటను సర్దుకో సాగాడు.

"అబ్బీ! నీకు డబ్బు లివ్వకుండ గాజులు వేయించు కోను. సరేలే! పోనీ ఓ పని చెయ్యి. మానాన్నగారి పేరు ఉమాపద భట్టాచార్యగారు. వారి నడిగి డబ్బులు తీసుకో. మీ అమ్మాయిగారు గాజులు వేయించుకున్నారు. డబ్బులివ్వమన్నారని చెప్పు. వారు-నా కసలు ఆడపిల్లలు లేరంటారు. కానీ నువ్వు వారి మాటలు నమ్మకు. ఇప్పుడే గాజులు వేసివస్తే అసలు అమ్మాయి లేదంటా రేమిటను. అంతతో ఊరుకోకు. దుర్గామాతా విగ్రహం కింద ఉన్న కుంకుమ బరిణెలో ఒకే ఒక అర్ధరూపాయి వుంది. తీసి యిమ్మన్నారని చెప్పు, వెళ్ళు" అంది.

"ఇప్పుడే వెడతానమ్మా!" అంటూ దుర్గాదాసు వెళ్ళిపోయాడు. ఆ స్త్రీ మూర్తి మరల ఆ చెరువులోని నీళ్ళలోకి దిగిపోయింది.

ఉమాపద భట్టాచార్యులవారికి అప్పు యిస్తే తిరిగిరాదని తెలిసికూడ ప్రజ లాయనకు అప్పులిస్తూంటారు. మొదటినుండీ ఆయన పరిస్థితి యిలాంటిది కాదు. సిరిసంపదలతో తులతూగే ఆయన వక్రించిన కాలప్రవాహంలోపడి ఆర్థికంగా దిగజారిపోయాడు. కాని ఆయన చిత్తవృత్తులు మాత్రం పూర్తిగా అమ్మవైపు సంలగ్నం కాసాగాయి. స్వగృహంలో ఆయన దుర్గామాత విగ్రహాన్ని ప్రతిష్ఠించుకున్నాడు. పూజలో, ఆత్మచింతనలో, సద్గ్రంథావలోకనంలోనే ఆయన సమయం అధికంగా గడిచిపోయేది. ఆయన భార్య అన్నపూర్ణ, సహధర్మచారిణిగా పేరు తెచ్చుకున్నది. అయిదారేళ్ళ వయస్సుకల శివరామ కుమారుడు 'దుర్గా! దుర్గా!' అంటూ భజన చేస్తూ నాట్యమాడుతూంటే చూసి తల్లిదండ్రులు ఆనందాశ్రువులను తుడుచుకుంటూ ఆనందపరవశులవుతూండే వారు. క్రమక్రమంగా వారి భోగవాసనలు క్షీణించసాగాయి.

ఉమాపద భట్టాచార్యులవారు నిత్యం బ్రహ్మ ముహూర్తానికి ముందుగానే లేచి "దుర్గా దుర్గా" అనుకుంటూ స్నానంచేసి ప్రాతః సంధ్యాదులు పూర్తిచేసుకుని భగవద్గీత, చండీ స్తోత్రాదులను పారాయణ

చేసుకుంటారు. పూజ, హవనాదులయిన తరువాత అమ్మవారికి నైవేద్యం పెట్టి బలి, వైశ్వదేవ, గోగ్రాసాదు లర్పించి అతిథు లెవరైనా వస్తారేమో నని నిరీక్షిస్తుంటారు. అతిథిసేవానంతరం భాగవత పురాణ, దేవీ భాగవత, దేవీపురాణ, దేవ్యుపనిష దాదులను యథాశక్తి పఠిస్తూనే అవరాహ్ణాన్ని గడిపేస్తారు. సాయం సంధ్యానంతరం శ్రీదేవికి ఆరతు లర్పించి దీప ప్రకాశంలో కూర్చుని చాలాసేపు జపం చేసుకుంటూ అమ్మ లీలలను గురించి చింతిస్తూంటారు. సాయంకాలం అతిథి సేవానంతరం కొంచెం ప్రసాదాన్ని స్వీకరించి అర్ధరాత్రివేళ జగత్తు అంతా నిస్తబ్ధంగా ఉన్నవేళ ఆయన తన హృదయకమలంలో జనని ఆగమనానికై నిరీక్షిస్తూంటారు. ఈ విధంగా ఆయన కాలం గడుస్తూంటూంది.

అన్నపూర్ణ సాక్షాత్తూ అన్నపూర్ణయే. "దుర్గా! దుర్గా!" అంటూ ఆమె గృహ కృత్యాలన్నీ చేసుకుంటూంటుంది. దేవ, పతి, అతిథి సేవలలో ఆమె సదా సంలగ్న అయిఉంటుంది. "దుర్గా" నామజప రహితంగా ఆమె జిహ్వ, క్షణం కూడా ఉండదు.

భట్టాచార్యులవారు ధనాన్ని సంపాదించాలన్న ప్రయత్నాన్ని యెన్నడూ చెయ్యలేదు. దానితో దారిద్ర్యం పెరిగిపోసాగింది. తీవ్ర దారిద్ర్యస్థితి మనస్సులో ఎన్నడైనా • మెదలితే ఆయన మనస్సులోనే గుసగుసలాడుతూ - భవానీ చరణ కమలాలను స్మరించే నీకు సిరిసంపద లెలా లభిస్తాయి? ఆ పాదరాజీవాలు సంపదలను నాశనం చేసేవి కాకపోతే శివదేవుడు శ్మశాన వాసి యెందు కవుతాడు?" అని తన్మయత్వం చెందే ఆయనకు దారిద్ర్య విషయం స్మృతిలో ఉండేదే కాదు. ఉండుండి ఆయన కో సందేహం కలుగుతూండేది. ఇష్టదేవతా దర్శనం భావరూపంలోనే అవుతుందా? అన్న దాని కెన్నడూ ఆయనకు సమాధానం దొరకలేదు.

దారిద్ర్యం కారణంగా అప్పులు బాగా పెరిగిపోవడంతో - "ఇక అప్పులు చెయ్యను. ఎవరినీ యాచించను కూడ. అమ్మ అన్నం పెడితే తింటాము. లేకుంటే పస్తుంటాము. అప్పులుచేసి యితరుల్ని యెందుకు బాధపెట్టాలి? అమ్మ యేమి చేస్తుందో చూస్తాను. ప్రాణాలు పోయినా సరే అమ్మను తప్ప యెవరినీయాచించను" అని నిశ్చయించుకున్నారు భట్టాచార్యగారు.

సంధ్యా పూజాదికాలు నెరవేర్చుకొని ఆయన అన్నపూర్ణను "అమ్మవారికి నైవేద్యం తెమ్మ"న్నాడు. కాని నాడు నైవేద్యానికి ఇంట్లో యేమీ లేదు. రెండు జాములు గడచిపోయాయి. ఆయన ధ్యానమగ్నుడైపోయాడు. శివరాముడు ఆకలితో గిలగిల్లాడిపోతున్నాడు. "దుర్గా! మాతా! దుర్గా" అంటూ అన్నపూర్ణ అమ్మ నామాన్ని జపిస్తూంది.



అదే సమయంలో బయటనుండి యెవరో వచ్చి - "శివరామ్! ఓ సారి బయటకు రా బాబు!" అన్నారు. కళ్ళు తుడుచుకుంటూ శివరాముడు బయటకు వెళ్ళాడు. కొన్ని క్షణాలలో మామిడిపళ్ళ బుట్టతో లోపలికి వచ్చాడు. బుట్టను తల్లి కిచ్చి అతడు - అమ్మా! పేరు చెప్పలేదు. ఆయ నెవరో యీ బుట్ట నిచ్చి వెళ్ళిపోయా రమ్మా! అన్నాడు. ఆ విషయం తెలిసికోవడానికి అన్నపూర్ణకు అట్టి సమయం పట్టలేదు. నీళ్ళు నిండిన కళ్ళతో ఆ బుట్టను ఆమే అమ్మవారి దగ్గర నైవేద్యం కోసం పెట్టింది. కొంతసేపటికి ఉమాపదుని ధ్యానం భగ్నమైంది. చూసే సరికి అమ్మ సమక్షంలో నైవేద్యం పెట్టబడి ఉంది. "ఇదంతా ఎక్కడ నుండి వచ్చింది?" అని అతడు భార్య నడిగాడు. "ఎవరో శివరాముడి కిచ్చి వెళ్ళిపోయారు" అంది అన్నపూర్ణ. ఉమాపదుడు 'అమ్మ పురుష రూపంలో కూడ వస్తుందా?' అనుకున్నాడు. ఆయన కనులు చెమ్మగిల్లాయి.

ఆయన దుర్గాదేవికి మహానందంగా నైవేద్యం సమర్పించాడు. "అన్నపూర్ణా! అమ్మ శివరాముడికి మాత్రమే ఆహారం వంపింది. మనం ఉపవాసం చేద్దాము" - అన్నాడు. నాడలాగే గడచిపోయింది. మరునాడు మధ్యాహ్నవేళ కెవరో వచ్చి శివరామునికి ఓ చెంబుడు పాలిచ్చి వెళ్ళిపోయారు. ఆ క్షీరాలే అమ్మకు నైవేద్యంగా సమర్పించబడగా వాటితో శివరాముడి ప్రాణాలు రక్షించబడ్డాయి. ఆ భక్త దంపతులు నాడు కూడా ఉపవసించవలసి వచ్చింది. మూడవరోజు పూజ అయింది. రెండు జాములు గడిచాయి. ఆకలితో శివరాముడు గిలగిలలాడుతూ యేడవసాగాడు. ఎన్ని చెప్పినా వాడు ఊరుకునేలా లేదు.

ఉమాపదుడు అమ్మ విగ్రహం చూస్తూ "జననీ! అసలు నువ్వున్నావా!" అని ప్రశ్నించాడు. దుర్గామాత అధరంపై ఒక క్షీణ హాసరేఖను చూస్తున్నట్లనిపించింది. అదే సమయంలో బయటనుంచి ఎవరో - "భట్టాచార్యుల వారున్నారా!" అని పిలిచినట్లయింది. ఉమాపదుడు బయటకు చూశాడు. భిక్షార్థులైన సన్యాసులు ముగ్గురు నిలబడి ఉన్నారు. ఆయన పరుగెత్తుకొని బయటకు వచ్చి ఆ ముగ్గురినీ లోపలికి తీసుకెళ్ళి వారి పాదాలు కడిగి సుఖాసీనుల్ని చేసి వినయకర్రతో వీచసాగాడు. అంతలో వారిలో ఒక రందుకుని "ఆర్యా! నిన్నటి నుండి మాకు ఆహారం లేదు. చాల ఆకలితో వచ్చాము. మాకు భిక్ష నీయగలిగితే మీకు శుభం కలుగుతుంది" అన్నాడు.

ఉమాపదుని నెత్తిమీద ఆకాశం విరిగి పడ్డట్లయింది. ఇప్పు డేం చేయుదును? అతిథుల్ని సేవించే దెలాగ? ఇంట్లో ఏమీ లేవే. ఎలాగో, ఏమిటో, ఏం జరుగుతుందో

[31వ పేజీలో]

# భక్తవత్సలుడు

ఈ సంఘటన జరిగి దాదాపు ఇరువది వత్సరాలయినా నిన్న, మొన్న జరిగినట్లు ఉంటుంది. మా రెండో వాడికోసారి వాంతులు, విరేచనాలు, జ్వరం. వారం రోజు లయింది. డాక్టరు రకరకాల మందులేస్తున్నారు. కాని ప్రయోజనం లేకపోయింది. అప్పుడు మావారి స్నేహితుడు, బాబును చూడటానికి వచ్చారు. ఆయనకు ఏడు కొండలవానిపై భక్తి విశ్వాసాలు ఎక్కువ. బాబును చూడగానే "కళ్ళు మూసుకొని" ఏడుకొండలవాడా! వేంకటేశ్వరా! బాబుకు తగ్గితే, నీ కొండకు వచ్చి తలనీలా లిస్తానని దణ్ణం పెడుతూ, గట్టిగానే అన్నారు. ఎందు కన్నగారూ వారికి నమ్మకం లేనప్పుడు ఇలా చేశారు అన్నాను. "ఏ దేవునికి మొక్కినా జరిగేది జరుగక మానదనే" ఆయన సిద్ధాంతం. మీకూ తెలుసుకదా! అలా ఎందుకు మొక్కారు అన్నాను. "ఆ వడ్డి కాసులవాడే దృష్టాంతం చూపించి తీసుకెళ్తాడు. 'నేనున్నాగా' అన్నారాయన.

మరురోజుకే అన్నీ తగ్గుముఖం పట్టాయి. బాబు తేరుకున్నాడు, శ్రీనివాసుని దయ వలన. కాని మొక్కెలా! అని మనస్సులో ఆందోళన. ఉన్నట్టుండి కార్తీక మాసంలో టిక్కెట్లు తెచ్చాను, అందరూ బయల్దేరండిరా! అన్నారు అన్నగారు మా వారితో. 'ఎందుకురా! అనవసరం ఖర్చు; వాడికి తగ్గాల్సి తగ్గింది' అన్నారు మా వారు. ఊరుకోవోయ్ నేను మొక్కుకున్నాను. నేనే తీరుస్తాను. ఈ ఒక్కసారీ కాదనకు అన్నారాయన. అందరం బయల్దేరాం. తిరుపతిలో దిగాం. బెడ్డింగ్, పెద్ద జిప్‌బ్యాగ్‌లో ఉన్న నగలు, దైవసన్నిధానం కాబట్టి పట్టుచీరెలు, చలికి శాలువలు, ఉన్నికోట్లు, డబ్బు అన్నీ తీసుకెళ్ళాం. కొండపైకి బస్సులో వెళ్ళాం. పాపం ఆయన కాటేజీ కూడ చూశారు. అందరం స్నానాలు చేసి టిఫిన్లు అవి అయినాక సాయంత్రం "ధర్మదర్శనం" అన్నారు. దైవదర్శనం చేసుకున్నాం. చలికాలం కదా! ఎక్కువ జనం లేరు అప్పుడు.

మరురోజు 'తలనీలాలు' ఇచ్చి వచ్చాం. హుండీలో డబ్బు వేయించి, వేంకటేశ్వరుని చూసి వస్తుంటే, మా వారిని ఆయన స్నేహితుడ్ని హుండీలో డబ్బు లెక్క పెట్టేటప్పుడు సాక్షులుగా కూడా పిల్చారు. మేం కటకటాల ఈవల ఉన్నాం. అందరం కలిసి వస్తుంటే ఇదంతా కలా! అనిపించింది. వేంకటేశ్వరుడు కదా! మరి మా వారిని మార్చాడు.

ఆ మరురోజు 3 గంటలకు మధ్యాహ్నం బస్సుకి తిరుగు ప్రయాణమయ్యాము. టిక్కెట్లు తీసుకుని బస్సు ఎక్కాం. మావారు బ్యాగ్ లోపల పెట్టి ఇప్పుడే వస్తాం చూస్తుండ మన్నారు. జనం ఒక్కసారి ఎక్కటంలో సంచి గమనించలేదు. బాబు ఒకటే ఏడుపు. ఇంతలో అందరూ ఎక్కారు. బస్సు బయల్దేరింది. కొండ సగం దిగింది కూడాను. 'బ్యాగ్ అక్కడుందా' అన్నారు మా వారు. టిక్కెట్లు డబ్బుతో సహా అన్నీ అందులోనే ఉన్నాయ్.

మలుపులు తిరిగేటప్పుడు ప్రక్కలకు జరిగి ఉంటుంది, గాబరాపడకండి అన్నారు కొందరు ప్రయాణీకులు. కొండ క్రిందకు వచ్చేశాం. బ్యాగ్‌లేదు. బస్సులో అందరి దగ్గర చూశారు. ఎంత చూసినా బ్యాగ్ దొరకలేదు. ఇంక మా వారు "పద్దంటే వినలేదు దేవు డన్నారు; మొక్కులన్నారు; ఆ తిరుపతి దేవుడు తిరుక్షవరం చేశాడు. తిరిప మెత్తుకోమన్నాడు. తలొక జోలెకట్టండి" అని గందరగోళం చేశారు. పాపం! టిక్కెట్లు తెచ్చి ఇంతకష్టపడి నాయన, స్నేహితుడు 'స్వామి కపచారం జరిగిందేమో! లేక ఇదంతా పరీక్షా! ఏదైందీ అర్థంగాక అవాక్కయి పోయాడు మానవుడు. ఆయనేం చేస్తారు? తిరిగి పైకి వెళ్దామన్నా డబ్బుల్లేవు అన్నారాయన. అంతా చూస్తుండగానే బస్సులో పెట్టాను కదా! అక్కడెందుకుంటుంది అన్నారు మావారు. ఆఖరి ప్రయత్నంగా మావారి స్నేహితుడు బస్‌స్టాండ్‌లోని హోటల్ నుండి, కొండపై దేవస్థానం వారికి ఫోన్ చేశారు. వెంటనే బస్‌స్టాండ్‌లో జిప్‌బ్యాగు దొరికింది. దాని రంగు దానిలో ఉన్న వస్తువుల వివరాలు చెప్తే పంపిస్తా మన్నారు. మా వారిని తీసుకెళ్ళి ఫోన్‌లోచెప్పమన్నారు. అన్నింటి వివరాలు చెప్పారు. టిక్కెట్ల నంబర్లు, 2 వందలు 5 రూ. నోట్లు కట్టలున్నాయ్. వాటి సిరిస్ నంబర్లు కూడా చెప్పమన్నారట! అదృష్టం కొద్దీ ఆ కాగితం జేబులో దొరికింది. అదికూడ చెప్పినాక 'బ్యాగ్' పంపుతున్నా నన్నారు ఫోన్‌లో. బ్యాగ్ రాలేదు. ఇంతలో




రైలు వెళ్ళిం దన్నారు. ఆఖరి బస్సు వెళ్ళిపోయింది. "ఇస్తామన్నారు కాని మన సొమ్మొద్దూ!" అన్నారు మా వారు. అలా అనకోయ్. నీ వింకా ఆ భక్తజన వత్సలుణ్ణి పూర్తిగా నమ్మలేదు. నీకు నమ్మకం కలిగించటానికే ఆయన సత్యం నిరూపించటానికే వస్తాడయ్యా! ని సొమ్ము పూచికపుల్ల పోదు. కుబేరుడికిచ్చి పంపిస్తాడన్నారాయన. 10-30 గం॥లకు ఒకాయన బస్సులో వచ్చి మా బ్యాగ్ మా కిచ్చారు. ఆ బ్యాగ్ బస్‌స్టాండులో ఉందిట. ఎవరో నామాలాయున తెచ్చి దేవస్థానం వారి కిచ్చారట. ఇన్ని కట్టుబట్టలు బంగారం, డబ్బు. ఒకరిని నమ్మి పంపించలేక ఛీఫ్ క్యాషియర్ చేతికిచ్చి పంపారట. స్పెషల్ బస్సులో ఆయన ఛీఫ్ క్యాషియర్ అని తెలిసి మా వారు ఒక వంద ఇవ్వబోయారు, మా సంతోషం కోసం అంటూ!! వద్దండీ! ఇది మా దేవస్థాన కర్తవ్యం. మా కనీసధర్మం కూడాను అని, ఆయన వెళ్ళిపోయారు. తర్వాత ప్రతి సంవత్సరం దైవదర్శనం చేసుకుంటున్నాం. మా ఇలువేల్పు శ్రీనివాసుడే.

— శ్రీమతి నళిని జగదీష్



★ ★

# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు
సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు
(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)
నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు
(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)
శుద్ధి, మొదటి గంట — ఉ. 6-00 గం॥ నుండి 6-30 గం॥ వరకు
సర్వదర్శనం — ఉ. 6-30 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు
శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు
సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు
శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు
సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-45 గం॥ వరకు
శుద్ధి — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు
ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు
సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు
(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)
నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు
శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15గం॥ నుండి 5-45 గం॥ వరకు
సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు
సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు
మూలవర్లుకు అభిషేకం—ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు
(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)
అలంకారము, రెండవగంట — ఉ. 10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు
సర్వదర్శనం — ఉ. 11-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు
ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు
(అద్దాలమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)
రాత్రిగంట — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు
ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00
సహస్రనామార్చన : రూ 6-50
నిత్యఅర్చన: రూ. 150-00 (ఏడాదికి)
అర్చన: రూ. 1-00
హారతి . రూ 0-50

పూరాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00
ఊంజల్ సేవ (శుక్రవారాలలో) రూ. 150-00
తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00
గజవాహనం: రూ 37-00.

# కొన్ని శక్తిపీఠాలు వాటి పూర్వగాథలు

భారతదేశమందలి శక్తిపీఠాలలో అస్సామ్ రాష్ట్రమందలి కామాఖ్య మరియు శ్రీహట్ట, మహారాష్ట్రమందలి కొల్హాపురం (మహాలక్ష్మి), తులజాపూర్ (భవాని), మాహుర్ (రేణుక మరియు సప్తశృంగి) కర్ణాటకమందలి కొల్లూరు (మూకాంబిక), శృంగేరి (శారద), తమిళనాడులోని కాంచీపురం (కామాక్షి) మధుర (మీనాక్షి), కేరళరాష్ట్రమందలి క్రాంగనూరు (కురుంబ భగవతి), మన్నడి (కాళీ) సుప్రసిద్ధమైనవి.

పై పేర్కొన్నవాటిలో కామాఖ్య పురాణ ప్రసిద్ధమైనదే కాక అత్యంత ప్రాచీనమైన క్షేత్రం. అస్సాం రాష్ట్రంలో గౌహతికి అయిదు కిలోమీటర్ల దూరంలోనున్న యీ క్షేత్రం నీలాచల మను కొండపై వున్నది. ఈ కొండను పరమ శివుని శరీరంగా భావిస్తారు. కామాఖ్య పదం సంస్కృతజన్యం కాదు. కామాఖ్య అంటే దయ్యం, ప్రేతం అన్న అర్థాలు వుండేవి. కామాఖ్య క్షేత్రాన్ని శ్మశానమని యీ నాటికీ వ్యవహరిస్తారు. దేవాలయమందలి గర్భగుడిలో దేవతామూర్తి లేదు. ఒక గుహ వుంది, ఆ గుహలోని ఒక మూలనున్న నల్లని బండరాయిపై యోని సంకేతం వున్నది. ఆ స్థలం ఎల్లప్పుడూ తడిగా వుండటం విశేషం. ప్రతినెలా యిచటనున్న దేవి రజస్వల అవుతుందని ప్రతీతి. ఆషాఢమాస ప్రారంభంలో "అంబువాచి" (ఆమేటి) సందర్భాన్ని ఆలయాన్ని మూడు రోజుల పాటు మూసి వేస్తారు. దేవి యోని రక్త స్రావ మన్న గుర్తుకు సంకేతంగా రక్తపు మరకలతోనున్న వస్త్రాలను భక్తులకు యిస్తారు. దేవీ భాగవతంలో:

"భూమండలే క్షేత్రరత్నం
మహామాయాధివాసితమ్,
నాతః పరతరం స్థానం
క్వచిదస్తి ధరాతలే.
ప్రతిమాసం భవేద్దేవీ
యత్ర సాక్షాద్రజస్వలా.
యోనిపీఠం కామగిరౌ
కామాఖ్యా తత్ర దేవతా,
యత్రాస్తే త్రిగుణాతీతా
రక్తపాషాణ రూపిణీ.



ఇది అతి ప్రాచీన తాంత్రికపీఠం అనుటలో ఏ మాత్రం సందేహం లేదు. ఆలయం శ్రీచక్రాకారంలో వున్నది. త్రికోణాకారమగు యోనికే పూజ జరుగును. దేవీ నామ మాల చెప్పునపుడు ప్రతి పేరు చివర 'నమః' అనుటకు బదులుగ 'వౌషట్' అని చెప్పటం అక్కడి సంప్రదాయం. అచట యజుర్వేదీయ కాణ్వశాఖకు చెందిన వేదశాస్త్రీయులు తమను 'కామాఖ్యులు'గా పేర్కొంటారు.

మహారాష్ట్రమందలి కొల్లాపురం (కరవీర) మహాలక్ష్మిస్థానంగా విఖ్యాతమైనది. ఈ లక్ష్మి శాక్తలక్ష్మి. బ్రహ్మ మానసపుత్రులైన గయు, లవణ, కొల్ల అను వారలు శివుని మెప్పించి అతని అనుగ్రహంవల్ల అపార శక్తులను సంపాదించి లోకకంటకులైనారు. విష్ణువు గయుణ్ణీ, లవణున్ని హతమార్చినాడు. సోదరుల వధకు కనలిపోయిన కొల్లుడు కొల్హాపురమునకు వచ్చి బ్రహ్మను గురించి తీవ్రతప మొనర్చి తత్ఫలితంగా లోకాధిపత్యం సంపాదించాడు. కొల్లుడు రాజ్యభారాన్ని కుమారుడైన కరవీరునకు అప్పగించి తపస్సుకు వెళ్ళాడు. కరవీరుడు దేవతలను హింసింపసాగినాడు. ఈశ్వరుడు

(27 వ పేజీలో)




## దేవీతత్త్వము

మన చర్మచక్షువులకు గోచరించు చరాచర జగత్తంతయు, పరబ్రహ్మము నుండి యావిర్భవించినదని వేదాంతుల యభిభాషణము. ఈ సర్వజగత్తు కార్యకారణ భావముచే నొప్పియున్నది. అన్ని పదార్థముల యావిర్భావమునకు కారణములు కలవు. కాని పరబ్రహ్మమునకు కారణములేదు. కారణము కార్యము పరబ్రహ్మమే యగుచున్నది. అయినచో నీ జగత్తంతయు శక్తిమయ మనియు, శక్తినుండియే యీ చరాచర జగత్తంతయు నావిర్భవించె నని శాక్తేయుల కథనము. "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అని వేదాంతుల విశ్వాసము. ఈ రెండు విషయములు స్థూల దృష్టికి ద్వివిధముగా కన్పడుటచే పరబ్రహ్మమొక్కటే యను నద్వైత భావమునకు విరోధ మేర్పడుచున్నది.

స్థూలదృష్టికి శక్తి, బ్రహ్మము, అని రెండు విధములుగా గోచరించినను, పరమార్థావస్థయందు ఈ రెండును నొకటియే యనియు, అది అద్వితీయ పరబ్రహ్మమే యనియు, వివరించి తద్విరోధమును వేదాంతులు లేక అద్వైతవాదులు పరిహరించిరి. దీపము ఉపాధిభేదముచే ద్వైవిధ్యమెట్లు పొందుచున్నదో, ఆదర్శమున (అనగా దర్పణమున) ప్రతిబింబ మెట్లు భాసించుచున్నదో అట్లే వ్యవహారకాలమున పరబ్రహ్మమునకు, శక్తికిని, ద్వైవిధ్యము కల్పింపబడెను. ఇంతేకాక పరబ్రహ్మమునకు "శక్తి" యను పేరుతో స్త్రీరూపము సృష్టికాలమున కల్పింపబడినది. ...్పాంతమున "స్త్రీ పుం నపుంసక" భేదవ లేక పరబ్రహ్మము తత్, అను పేరుతో వ్యవహరింపబడును.

## దేవీరూపకల్పన

బుద్ధి, శ్రీ, ధృతి, కీర్తి స్మృతి, శ్రద్ధా, మేధా, దయా, లజ్జా, క్షుధా, తృష్ణా, కాంతి, శాంతి, పిపాస, నిద్రా, తంద్రా, జరా, విద్యా, అవిద్యా, స్పృహా, వాంఛా,

శక్తి, అశక్తి, వస, మజ్జ, త్వక్, ఋతము, అనృతము, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ, ఈ నాలుగు (వాగ్భేదములు), వివిధములగు నాడులు, ఇవన్నియు శక్తి యొక్క రూపములే కాని తద్భిన్నములు కావు. ఈ ప్రపంచమున శక్తికంటే భిన్నమైన పదార్థము వేరొక్కటి కానరాదు. గౌరీ, బ్రాహ్మీ, వారాహీ, రౌద్రీ, వైష్ణవీ, శివా, వామనీ, కౌబేరీ, నారసింహీ, వాసవీ, మున్నగాగల అనేక రూపములతో పరాశక్తి పరాక్రమించుచు సమస్త కార్యములను నెరవేర్చుచున్నది.

జలములందలి శైత్యము, వహ్నియందలి వేడి, సూర్యునందలి తేజము, చందురునందలి హిమము శక్తియొక్క యావిర్భావములే. శక్తివినా యే పదార్థము కొంచెముగా చలించుటకు సైతము సమర్థము కాదు. త్రిమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సైతము శక్తి కలితులై తమ తమ కార్యముల నిర్వర్తించుచున్నారు. ఈ భూమి, ఆదిశేషుడు, ఆదికూర్మము, అష్టదిగ్గజములు, శక్తి కలుగుటనుపట్టి యే భారవాహకము లగుచున్నవి.

సమస్త పదార్థముల యావిర్భావమునకు కారణభూతమగు శక్తి నుండి సత్త్వ, రజ, స్తమో గుణాత్మకమగు పరాహంత, దానివలన మహత్తత్వము, (అనగా శాశ్వతము, క్షణికము, శూన్యము, నిత్యానిత్యము, సకర్తృకము, అహంకారము, (మహత్తు॥ ఇవి మహత్తత్త్వ సంజ్ఞకములు) దీనినుండి అహంకారము, దానినుండి పంచతన్మాత్రలు, వానినుండి పంచభూతములు యథాక్రమముగ నుద్భవించెను. భూతపంచకము, జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, మనస్సు ఈ పదియారును కార్యకారణభావముతో నొప్పియుండును. ఇట్టి ప్రకృతిగలది దేవీతత్త్వమని పౌరాణిక కథనము.

## నవరాత్రి పూజావిధానము

ఈ పూజా కార్యక్రమము చైత్రమాసమందైనను, అనగా వసంతఋతువునందు కాని, శరదృతువు అనగా ఆశ్వయుజ మాసమునందు కాని చేయవచ్చును. ఏ మాసమున చేసినను శుక్లపక్షమున ప్రతిపత్తిథి మొదలుకొని నవరాత్రములు దేవి నారాధింపవలయును. అంతకు ముందు రోజు అమావాస్య తిథినాడు పూజాద్రవ్యములను సమకూర్చుకొని యా దినమున హవిష్యమును మాత్రమే భుజించి (దీనినే పురోడాశ మందురు. పురోడాశమన, వరిపిండిని నేతిలో వేయించి దానిని వర్తులాకారమగు నుండలుచేసి వానిని పిడకల దాలిలో కాల్చినపిమ్మట హోమము చేయవలయును. మిగిలిన శేషము హవిష్యము. దీనిలో వరిపిండి నేయి రెండు పదార్థములు తేజోభాగ మెక్కువగా నుండును. ఈ రెండు పదార్థములు సాత్త్వికాహారమనియు, ఆయుర్దాయమును పెంపొందింపజేయునని వైదిక కర్మానుష్ఠాతల సిద్ధాంతము.) ఏకభుక్తము చేసి, సమతల ప్రదేశమందు పదారు చేతులు ప్రమాణముగల నేలను సమచతురస్రాకారముగా ఎన్నికచేసికొని, స్తంభధ్వజములతో నొక మంటపమేర్పరుపవలయును. తెల్లమట్టితో పేడతో నా ప్రదేశము నలికి ముగ్గుపెట్టి (వరిపిండితో మాత్రమే) మంటప మధ్యమున నాలుగు హస్తముల వైశాల్యము, ఒక హస్తము ఎత్తుకలుగునట్లుగా నొక వేదిక నిర్మించి దానిని తోరణాదులతో నలంకరింపవలయును.

అమవసనాటి రాత్రి మంత్రశాస్త్రవేత్తలను వేదవేత్తలను సన్మానముతో, మహానియమనిష్ఠాపరులగు బ్రాహ్మణులను దేవీ నవరాత్రి కార్యక్రమ నిర్వహణమునకై పిలువవలయును.

ప్రతిపత్తిథినాడు అరుణోదయ కాలమున నదీ, నద, వాపీ, కూప, తటాకాదులందు గాని గృహమునందుగాని స్నానమాచరించి నిత్యకర్మలగు సంధ్యావందనాద్యనుష్ఠానములను నెరవేర్చిన పిమ్మట అంతకు ముందు ఆమంత్రణము చేసిన బ్రాహ్మణులను శక్త్యనుసారముగా వస్త్రాలంకారాదులతో నర్చించి సంతృప్తి నొందింపవలయును.

బ్రాహ్మణులు తొమ్మండ్రుకాని, ఏవురుకాని, న సురుకాని, చివరకు ఒక్కనినైనను పూజాకాలమున అంబికామూలమంత్ర జపము చేయుటకై నిమంత్రింపవలయును.

దేవీభాగవత పారాయణము చేయుటకు శాంతమూర్తిని, మహితుని, నొక్క ద్విజుని వరియింపవలయును. పిమ్మట స్వస్తి వాచన పురస్సరముగా శక్తిపూజ ప్రారంభింపవలయును.

పైన చెప్పిన మంటప మధ్యపీఠమునందు పట్టువస్త్రము (తెల్లనిది) పఱిచి దానిపై దేవి సుఖాసీన యగుటకై సింహాసనమును స్థాపించి యందు నాలుగు హస్తములు కలది రత్నాలంకారములతో భాసిల్లునది ముక్తాహారములతో నొప్పారునది, దివ్యవస్త్రావృతయైనది, సౌమ్యమూర్తి కలది, సర్వలక్షణములతో లక్షింపబడినది, శంఖ, చక్ర గదా పద్మములతో కూడినది, సింహ వాహనము కలదియగు దేవిని ఆగమ శాస్త్ర ప్రకారముగా ప్రాణప్రతిష్ఠ చేయవలయును. (కొందఱాగమశాస్త్రవేత్తలు పదునెనిమిది భుజములు గల జగదంబికను ప్రతిష్ఠింపవలెనని చెప్పుదురు.)

ఏతల్లక్షణ లక్షితయగు విగ్రహము దొరకనిచో, నవాక్షర మంత్ర సంయుతమగు యంత్రమును పీఠపూజకై స్థాపించి దాని పార్శ్వమున పంచ పల్లవములతో కూడినది. (మేడి మఱ్ఱి రావి జువ్వి మామిడి అనునవి పంచపల్లవములు) వేద మంత్రములచే సంస్కృతంబైనట్టిది, పుణ్యతీర్థ జలములతో నిండిన కలశమును స్థాపించి యంత్రములతో పాటు పూజింపవలయును.

మంగళ వాద్యములతో సంగీత గాన నాట్య సమారంభముతో వేదప్రవచనముతో ప్రొద్దు గడపవలయును.

హస్తా నక్షత్రముతో కూడిన ప్రతిపత్తిథి యందు పూజారంభము చేయుట మిగుల శ్రేయస్కరము.



### ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ప్రతి శాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దివ తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల రూ. 650/- అవుతుందికనుక టి. టి. డి. కార్య నిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

ఈ విధముగా పూజచేయు యాజకుడు అంబావ్రతము లుండిగాని (అనగా పగలు భోజనము మాని రాత్రి పూజానంతరము భుజించుట), ఏకాన్నముచే గాని (ఏక భుక్తముచేయుట), దీక్షతో చేయు నీ పూజా దినములందు పూర్తిగా నుపవాసవ్రతము చేసి గాని, (ఈ దినములలో ద్రవము మాత్రమే అశనముగా స్వీకరించుట శాస్త్ర సమ్మతము) యీ దేవీ నవరాత్రవ్రతము చేయుదు నని ప్రారంభముననే దీక్ష పూన వలయును.

మందార, మాలతి, చంపక, పారిజాతాది పుష్పములతో నారికేళ,కదళీ,నారంగ, దాడి మాది ఫలములతో, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పానీయాదులగు పంచ విధాన ములతో ధూప,దీపనీరాజన మంత్రపుష్పాదు లతో నతులతో నుతులతో మహాస్తుతులతో దేవి నర్చించిన సకల బాధ లుపశమనము పొంది, ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక తాపత్రయము నశించి సర్వ సౌఖ్యము ననుభవింతురు.

నవరాత్రి పూజానంతరము యథాశక్తి నన్నదానము చేయవలయును. ఎంత నియమ నిష్ఠలతో పూజాదికము సల్పినను, అన్నదానము చేయనిచో నా వ్రతము నిష్ఫలమగును.

మాంసాహారులు దేవీ పూజ చేసినచో బలిదానము చేయవలయును. ఈ బలిదాన మునకు "అజము" (మేక), వరాహము (పంది), మహిషము (దున్నపోతు) అత్యంత ముఖ్యములని మునుల మతము. దేవి యెదుట పశుహింస సాధ్యము కాదు. సాధారణముగా హింస నింద్యమైనను యజ్ఞాదికముల, దేవ్యర్చనాదులందు నింద్యము కాదు. బలి యిచ్చిన పశువులకు స్వర్లోక ప్రాప్తి కలుగును.

ఇంతియకాక,త్రికోణాకారముగా కుండము నేర్పఱచి యందు హోమము చేయవల యును. త్రికాలములయందు నృత్య గీత వాద్య వినోదాలతో మనోహరముగ పూజా ద్రవ్యములచే నర్చన చేయవలయును. నవరాత్రి దీక్షితుడు దీక్షాకాలమున భూమిపై శయనింపవలయును. వస్త్రాద్యలంకార దానముచే తృప్తిని పొందించుచు కుమారికల నేకైకవృద్ధి క్రమముతో కాని, అంతకు రెండురెట్లు గాని మూడు రెట్లుగాని ఆమంత్రణము చేసి నిత్యము నారాధింప వలయును.

### కుమారీ లక్షణములు

రెండు వత్సరముల నుండి పది వత్సర ముల వయస్సు కలిగిన కుమారికలను మాత్రమే శుభలక్షణములు కలిగిన వారల నెన్నుకొనవలయును. ఈ ఎన్నికలో క్రింద వివరింపబడిన వారలు పూజకనర్హులు 1. హీనాంగి 2. దుర్గంధబంధుర 3. కుష్ఠ యుక్త 4. వ్రణాంకిత 5. దుష్కులభవ 6. జాత్యంధ 7. కేకర (మెల్లకన్నుగలది) 8. గౌణి (ఏకాక్షి) 9. కురూప 10. బహు రోమశ 11. రజశ్చిహ్నాద్యంకిత (ఎఱ్ఱని పుట్టుమచ్చలు గలది) 12. క్షామ 13. గర్భ సముద్భూత (ఒక వత్సరము దాటని వయస్సు గలది)13. గోళక (ఒక తండ్రికి జన్మించనిది) 15. కన్యకోద్భూత (అవివా హితస్త్రీకి జన్మించినది) - మున్నగు కన్య కల వర్జింపవలయును. 1 అరోగిణి 2 సురూ పాంగి 3 సుందరి 4 వ్రణవర్జిత 5 ఏకవంశ సముద్భూత (ఒక్క తండ్రికి జన్మించినది) అగు కన్యక నర్చింపవలయును. సర్వకార్య సిద్ధికి బ్రాహ్మణి కన్యకను, జయము కొఱకు క్షత్రియకులసంజాతను, లాభము కొఱకు వైశ్యకుల సంజాతను కాని, శూద్ర, వంశ సంభవను కాని అర్చింపవలయును.

### కుమారికా నామములు

రెండు వత్సరముల వయస్సు గల కుమారిక (మొదటిరోజున సమర్పించునది) కుమారి యనబడు. రెండవ రోజున అర్చ నీయ మూడు వత్సరముల వయస్సుగలది త్రిమూర్తి యనబడు. మూడవరోజున పూజ నీయ నాలుగు వర్షముల వయస్సు గలది కల్యాణి. నాల్గవరోజున పూజించునది, ఐదు

వర్షముల వయస్సు గలది రోహిణి. ఆఱు వర్షముల వయస్సు గలది ఐదవ రోజున అర్చించునది కాళిక. ఏడువర్షముల వయస్సు గలది ఆఱవరోజున అర్చనీయ చండిక. ఎనిమిది వర్షములు గలది ఏడవ రోజున పూజనీయ శాంభవి. తొమ్మిది వర్షముల వయస్సు గలది ఎనిమిదవ రోజున పూజనీయ దుర్గ. పదిసంవత్సరముల వయస్సు గలది తొమ్మిదవ రోజున ఆరాధనీయ సుభద్ర యను నామములతో వ్యవహరింవ బడుదురు.

పది సంవత్సరముల కంటె ఎక్కుడు వయస్సు గల కన్యకను పూజకు వరించినచో దేవికి ప్రీతి కలుగదు. పూజా సమయమున పైన చెప్పిన నామములతో నాయా కన్యకల నర్చించినచో దేవి మిక్కిలిగా ప్రీతి చెందును. ఏవంవిధార్చన సమస్త శుభములకు మూలమని దేవ్యుపాసనాపరుల విశ్వాసము. ఏతద్వ్రతమునందు వామాచారపద్ధతి యొక్కటి కలదు. ఈ పద్ధతిలో చేయు పూజాదికములు, ఉత్తరభారతము నందు వ్యవహారమున నున్నదని జనశ్రుతి.

ఏది యేమైనను హింసాదికము లేని వామాచార పద్ధతి నవలంబింపని సాత్త్విక పూజావిధానము జనులకు సర్వశుభముల నొసగునని పరమ మహర్షుల సిద్ధాంతము. రజస్తమోగుణాత్మకమగు అర్చనాదులను పరిహరించుట సర్వదా మానవాళికి శ్రేయస్కరము.

ఇట్టి తత్త్వము పూజావిధానము కలిగిన దేవినర్చించి సమస్త జనులు సర్వశుభములను పొందుదురుగాక.

సర్వే జనా స్సుఖినో భవన్తు.
తేజస్వినాఽ వధీతమస్తు.

— శ్రీ రాణి హయగ్రీవశర్మ



---

(23 వ పేజి తరువాయి)

కరవీరుని సంహరించినాడు. కరవీరుని తుది కోరికమేరకు అతడి రాజధానికి కరవీరపురమని పేరుపెట్టబడింది. తపస్సుముగించి తిరిగివచ్చిన కొల్లడు మహాలక్ష్మిని గురించి ఘోరతపస్సుచేసినాడు. ఆమె ప్రత్యక్షము కాగా, వంద సంవత్సరముల పర్యంతము దేవి కొల్లాపురమును వదలి పోవునట్లు ప్రార్థించినాడు.

దేవి కొల్లాపురములో వున్నంతకాలము తాను దేవతలను జయించలేనని విశ్వసించినాడు. దేవి భక్తుని కోరికను తిరస్కరించలేక కొల్లాపురం వదలి హిమాళయాలకు వెళ్ళిపోయింది. కొల్లడు యిష్టమొచ్చినట్లు వ్యవహరిస్తూ దేవతలను బాధింప సాగినాడు. కాని నూరేళ్లు దాటిన వెంటనే దేవి ఘోరరూపముదాల్చి కంకభైరవ, సిద్ధబటుకేశ్వర, కాళభేతాళ మరియు ఆమె సోదరి చాముండ అన్న శక్తుల సహాయంతో కొల్లణ్ణి హతమార్చింది.

ఒకప్పుడు శాక్త సంప్రదాయకేంద్రమైన యీ క్షేత్రమందలి మంటపం గోడలపై శ్రీచక్రం, లక్ష్మీదేవి మూర్తి శిల్పాలు కనిపిస్తాయి. ఆలయంలో లక్ష్మీదేవి నల్లనిరాతి విగ్రహం మూడు అడుగుల ఎత్తున్నది. నాల్గుచేతులలో మాతులుంగ ఫలం, నేలను తాకుతున్న పెద్దగద, డాలు పానపాత్ర కనిపిస్తాయి. పానపాత్ర శాక్త సంప్రదాయ లాంఛనం. విశ్వకర్మశాస్త్రమున కానవచ్చు ఈ విగ్రహ లక్షణాలు హేమాద్రి చతుర్వర్గచింతామణి నుండి పేర్కొన బడినవి.

దక్షిణాధః కరే పాత్రా
మూర్ధ్వే కౌమోదకీం తథా,
వామోర్ధ్వే ఖేటకం ధత్తే
శ్రీఫలం తదధః కరే.
బిభ్రతీ మస్తకే లింగం
పూజనీయా విభూతయే.

మార్కండేయపురాణమందలి దేవీమాహాత్మ్యములో

మాతులింగం గదా ఖేటం
పానపాత్రం చ బిభ్రతీ,
నాగం లింగం చ యోనిం చ
బిభ్రతీ నృపమూర్ధని.

ఈ లక్ష్మీ విగ్రహం శిరస్సుపై నాగలింగం, యోని సంకేతాలు చెక్కబడినవి. వేంకటేశ్వర మాహాత్మ్యంలో లక్ష్మీ కొల్లాపురంలో నిలిచిపోయినట్లు, విష్ణువు వేంకటాచలమునకు తరలి వచ్చినట్లు, వారిరువురూ మరల వేంకటాచల పరిసరాల్లో కలుసుకొన్నట్లు గాథ లున్నాయి. తిరుమలేశ్వరునికి కొల్లాపురమందలి లక్ష్మీదేవికి ప్రాచీన సంబంధ ముండినట్లు ఊహింపబడుచున్నది. తిరుమలకూడా ఒకప్పుడు శాక్త పీఠంగా ఉన్నదన్న విషయం నిర్వివాదం. శక్తియే కాలక్రమంలో విష్ణువుగా మారినట్లుప్రతీతి. తిరుచానూరులో వెంచేసిన పద్మావతీ దేవికిగల సంబంధం అతి ప్రాచీనమైనది కాదనుటకు ఈ దేవాలయాల సంప్రదాయాలనుబట్టి ఊహింపవచ్చును. ఇదొక వాదం. కొల్లాపురమందలి లక్ష్మీదేవియొక్క పార్శ్వదేవతలలో దక్షిణమున మహాసరస్వతి, కొల్లాసురుడు, పడమర కంకభైరవుడు, ఉత్తరమున మహాకాళి, ముందుమైపున గణపతి వున్నారు. ఆమె వాహనం సింహం. గర్భగృహముపై భాగమున శివలింగ మున్నది. చుట్టూ వున్న గూళ్ళలో ఉత్తరాభిముఖుడైన వేంకటేశ్వరుడు, తూర్పున కాత్యాయని, దక్షిణమున గౌరీశంకర మూర్తులున్నాయి.

— శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి



# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్నివర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

(17వ పేజీ తరువాయి)
ఉన్న తన భర్తను కనుగొన్నది. మరల మనసులో మాణిక్యవీణా పాణియైన వాణికి నమస్కారా లర్పించింది. ఇంటికి మరలి వచ్చింది. ఆ పెద్దవానకు తోట ఏమాత్రం నాశనం కాకుండా వుండడం చూచి జను లాశ్చర్యపడినారు.

కొన్నాళ్లకు ఆమెకు సిగ్గు సన్నగిల్లి పతిభక్తి ఉప్పొంగింది. తల్లిమాట చెవిని పెట్టక యథాప్రకారం అలంకారాలు ధరించి భర్తవుండే తోటకు వెళ్లింది. సొమ్ములన్నీ గట్టున మూటకట్టిపెట్టి చీరకొంగు అడ్డ చుట్టగా నడుముకు చుట్టుకొని భర్త వద్దన్నా వినకుండా తోటపనుల్లో సాయపడసాగింది. తోటలో పనిచేసి ఆ సుమసుకుమారి అలసి పోయింది. శరీరం చిరుచెమటతో మెరిసి పోసాగింది. ఈ విధమైన ఆమె సహజ సౌందర్యాన్ని వీక్షించి శాలీనుడుచలించాడు. "వెర్రిదానా! ఎంత వద్దన్నా వినకుండా శ్రమపడుతున్నావు. నీ వంటి కుసుమకోమలి ఎక్కడ? ఈ తోట పను లెక్కడ?" అని ఉత్తరీయంతో ఆమె చెక్కిళ్ళపైని చెమట బిందువులను తుడిచి కౌగిలిలో బంధించాడు. చెంతనున్న పొదరింటికి చేర్చినాడు. ఆమె నగలు ధరించి ఇంటికి వెళ్ళింది.

ఆనాడు ఆమె ముఖం ఆనందంతో కళ కళ లాడింది. చెలులు మునుపటికంటె ముచ్చటగా ముస్తాబుచేసి ఆమెను ఆనాటి రాత్రి భర్త దగ్గరకు పంపారు. మరల అత డామె వంక చూడలేదు. తన తప్పేమిటో? తెలియక విషాదమొందింది సుగాత్రి. వెనుదిరిగి వెళ్ళవలెనని అనుకొంది. "వెళ్లి చేసేదేమున్నది? ఇక్కడే వుంటే నేను డెలా పెడితే అలా అవుతుం"దని వాకిలిదగ్గరే నిలుచుకొంది. అలాగే చూచి చూచి తుదకు సాహసించి 'తోటపనిచేసి అలసి పోయినారు కాబోలు, నేను వెళ్ళిరానా? మీరు నిద్ర పోదురేమో!" అని పలికింది. అతడు పరాకుగా ఏ కోరికతోవచ్చినా విక్కడకు?' అని ఆమెను అడిగినాడు ఆమె లోకంలో స్త్రీలంతా తమ పతుల దగ్గర కెందుకు వస్తారో నేనూఅందులకేవచ్చాను, అన్నది." మరలఓపిక తెచ్చుకొని, "స్వామీ! నామదిలో కోరి కేమిటో చెప్పమన్నారు. నా కంతేచాలు. మిమ్మల్ని ఏమని అనగలను? వేగుజామవు తున్నది గదా? పాదాలు పట్టమనిగాని, దగ్గరకువచ్చి కూర్చొనమనిగాని, కనులు విచ్చి ప్రేమతో చూట్టంగానీ, ఇలాటి ఒక ముచ్చటకూడా లేదా? నేడు తోటవద్ద




నా భాగ్య మేమో మీరు దయదలచి ఏలు కొన్నారు. ఆ చనువుతో ఇలా అంటినిగాని పుణ్యవతికి భర్తను ఇలా అనడం ధర్మం గాదని నాకు తెలుసు. రాయికూడా కరుగు నేమోగాని మీ గుండె రాతిబండ కంటె చాలా కఠినం కరగకుండా వుంది" అని వాని కాళ్ళు

పట్టింది.పాన్పుమీద కూచొని తొడలపై వాని పాదాలు పెట్టుకొని కన్నులకు వాని నద్దుకొని ఇలా పలికింది. "మీ రేల నన్ను సరిగా చూచుటలేదు? మీమనసులో మరో మగువకు స్థాన ముందా? ఆమెయందు లగ్నమైన హృదయాన్ని నాపైపుకు మళ్ళింపలేక సతమత మవుతున్నారా? నాతో చెప్పండి. చేతనయితే నేను ఆమెను ఇక్కడకు తీసుకొనివచ్చి మీకువలె ఆమెకు కూడా సేవలు చేస్తాను. దేవునిపై ఒట్టు. మీకు చింతేల? మీ కోరిక తీరితేచాలు. నన్నమ్ముకో దలిస్తే అమ్ముకోండి. మీ మనసులోని మాట చెప్పండి," అని అలాగే కాళ్ళు పిసుకుతూ కూచుంది. కాని ఆమె మాట అతనికి వినబడలేదు. తోటలో పనిచేస్తూ సహజ సౌందర్య మాధుర్యాన్ని చవిచూపిన సుగాత్రిని తలచుకుంటూ అతడు విరహ మనుభవిస్తున్నాడు. పతిభక్తితో అలాగే ప్రభాతం వరకు అతని పాద సంవాహనం చేస్తూ ఉండి పోయింది సుగాత్రి.

మరునాటి ప్రొద్దునకూడా తోటకు వెళ్ళి పనులుచేసి పతిమన్నన పడసింది సుగాత్రి. ఆనాడే ఆమె తనభర్తకు ఒంటి సొంపులు తప్పసొమ్ములు ఇషం కావని తెలుసుకొన్నది. దినమూ అలా వెళ్ళి ఆ తోటలో సాయపడి భర్తతో సుఖపడసాగింది. ఆ విషయం ఆమె తల్లికి తెలిసింది. ఒకనాడామె "తల్లీ! సరస్వతీదేవి ప్రసాదం వల్ల నీవు మాకు కలిగావు. నీ వల్ల ఉభయవంశాలు ఉద్ధరింపబడుతాయని ఆమె చెప్పింది. నీకున్న భర్తృప్రేమ బహు దొడ్డది. అతనిని రవంత తిట్టినా నొప్పిపడతావు. కొంచెం పొగడినా కొండంత సంబరపడతావు. ఏ దేవుడు కనబడినా అతని మేలుకై ప్రార్థిస్తావు. పతివ్రతవు కనుకనే సరస్వతీదేవి అహర్నిశలూ ఆరాధించే భక్తులను విడిచి నీతో సంభాషించేది. కానీ నా మదిలో ఒక సందేహముంది. నీవు నీ భర్తను తోటలో కలుసుకుంటున్నావని తెలిసింది. అకాలగమనంవల్ల అవగుణాల కుప్పయైన సంతానం కలుగుతుందట. కనుక నీవు తోటకు పోవలసిన పనిలేదు. నీ భర్త నీకు దగ్గరైనాడు కాబట్టి అతనినే ఇంటికి రప్పిస్తాను," అని సుగాత్రితో చెప్పింది.

ఆ మాటలకు మందహాసం చేస్తూ సుగాత్రి తల్లితో ఇలా అంది. "అమ్మా! నా భర్తకేది ప్రియమో అదేనాకూ ప్రియము. నా భర్త కేది అనిష్టమో నాకూ అదే కూడదు. నా కిది సహజగుణం. నాకు గురువు, దైవము సర్వము నా భర్తయే. నే నాతని ఆజ్ఞ శిరసావహిస్తాను. నా కింక వేరే విధి నిషేధాలు లేవు.'

ఈ విధంగా సుగాత్రి తల్లితో పలుకగా ఆమె పతి భక్తికి మెచ్చి సరస్వతి సాక్షాత్కరించింది. ఆమె సుగాత్రి తల్లిని చూచి 'ఈ సాధ్వి ప్రవర్తనకు మెరుగులు దిద్దడానికి ప్రయత్నించకు. స్థిరమైన పతిభక్తి చేతన పాపములనే కాక పుట్టినింటివారి మెట్టినింటివారి పాపములనుకూడా భస్మీపటలము చేయగల దీమె. నాకు ప్రీతి పాత్రయైన ఈ సుగాత్రి శుభచరిత్రను నేనే భూమిపై వెల యిస్తాను', అని పలికి అదృశ్యురా లయింది.

[ మూలం:- పింగళి సూరనామాత్యుని కళాపూర్ణోదయం ]

— శ్రీ శంకరగంటి రమాకాంత్



[ 20వ పేజీ తరువాయి ]

కదా!" అనుకుంటూన్న ఆయన కన్నుల నుండి అశ్రువులు ధారలై ప్రవహించ సాగాయి. తలుపుచాటున నిలబడి ఉన్న అన్నపూర్ణ "దుర్గా!" అంటూ ఏడవసాగింది. పిచ్చాడిలా ఉమాపదుడు అమ్మ విగ్రహం దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళాడు. వెక్కి వెక్కి యేడుస్తూ-అమ్మా! అతిథులు నిరాశగా వెళ్ళిపోవలసిందేనా? విపత్తారిణీ! మాతా! మహాభయ వినాశినీ! దుర్గా! దుర్గా! రక్షించు తల్లీ! రక్షించు....

'దుర్గా! దుర్గా! దుర్గా! అమ్మా! నన్నీ ఆపద నుండి రక్షించు' అని ప్రార్థించ సాగాడు.

బయటనుండి సన్యాసులైన అతిథులు– "మహాశయా! మమ్మల్ని ఉండమన్నారా! వెళ్ళమన్నారా?" అని ప్రశ్నించసాగారు.

ఉమాపదుడు పిచ్చివాడై పోతున్నాడు. ఇంటినుండి అతిథులు వెళ్ళిపోతున్నారు. ఏం చేయుదును? ఎవరిని ప్రార్థింతును? ఎవరినీ యాచించను – అని అమ్మ పాదాల దగ్గర శపథం చేశాను! బయటనుండి అతిథులు మరల పిలుస్తూ – ఏమయ్యా! చాల దాహంతో ఉన్నాము. కనీసం మంచి నీళ్ళైనా యియ్యి" అన్నారు.

అక్కడ అన్నపూర్ణ కూడ అమ్మ పాదాల దగ్గర పడి ఏడుస్తూంది.

"అన్నపూర్ణా – ఇల్లంతా వెతికి ఏ కొంచెమున్నా తీసుకురా. నేను మంచినీళ్ళు తీసుకువెడతాను" అంటూ ఉమాపదుడు నీళ్ళకుండ కేసి వెళ్ళే లోగానే ఓ పిల్లి ఆ కుండ మీదపడి దాన్ని బ్రద్దలు కొట్టేసింది. ఆహా! ఎలాంటి పరీక్ష! ఇంట్లో యింక చుక్క నీళ్ళుకూడా లేవే! 'ఛీ! ఛీ!' యిలాంటి బ్రతుకు బ్రతకడం కంటే అమ్మ సన్నిధిలో ఆత్మహత్య చేసుకోవడం మంచిది. ఇలాంటి మహాత్ములైన అతిథులు నిరాశగా వెళ్ళిపోవడం నేను చూడలేను! అనుకుంటూ– ఉమాపదుడు పూజామందిరంలో అమ్మ చేతిలోని పాశం తీసుకొని ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యసాగాడు.

సరిగా అదే సమయంలో దుర్గాదాసు వచ్చి "భట్టాచార్యగారూ! ఏంచేస్తున్నారు? ఓ సారి బయటకు వస్తారా" అని గట్టిగా పిలవసాగాడు. దానితో ఆయన పాశం విసిరేసి – 'పిలిచేదెవరో చూసివస్తాను. అమ్మా దుర్గా!' అనుకుంటూ బయటకు వచ్చాడు. ఆలస్యం కావడంతో అతిథుల సహనశక్తి నశించసాగింది. "బాబూ, విషయమేమిటో చెప్పండి" అన్నారు. ఉమాపదుడు చేతులు కట్టుకొని – "మహాత్ములారా! దయచేసి మరికొంచెం సేపు నిరీక్షించండి" అంటూనే బయటకు వెళ్ళాడు.

"అయ్యా! మీ అమ్మాయిగారు గాజులు వేయించుకున్నారు. అర్ధరూపాయి మిమ్మల్ని అడిగితీసుకోమన్నారు. బాబూ! ఇస్తారా?"

ఉమాపదు డాశ్చర్యపోతూ – "ఏమిటయ్యా! నాకసలు ఆడపిల్లలే లేరు" అన్నాడు.

"తమరిలా అంటారని ఆ తల్లి ముందే చెప్పింది. మీ మాటలు వినిపించుకోవద్దని కూడా చెప్పారు."

'అసలా అమ్మాయిని ఎక్కడ చూశావు?'

"మైదానంలో చెరువు దగ్గర"

"చిత్రంగా వుందే! మా అమ్మాయా? సరే చూడడానికి ఆమె ఎలా వుంది?"

"సాక్షాత్తు దుర్గాదేవిలా ఉంది బాబూ! అలాంటి రూపాన్ని నేనింతవరకూ ఎప్పుడూ ఎక్కడా చూడలేదండి. ఆఁ! చెప్పడం మరిచాను. మీరు పూజచేసుకునే దుర్గాదేవి విగ్రహం క్రింద ఉన్న కుంకుమ బరిణలో అర్ధరూపాయి మాత్రమే ఉందని చెప్పి తీసుకోమన్నారు బాబూ –"

ఉమాపదుడు వెంటనే పూజామందిరం దగ్గరకువెళ్ళి కుంకుమబరిణె తెరిచి చూశాడు. నిజంగా ఓ అర్ధరూపాయి అందులో తళతళలాడి పోతూ కనిపించింది. దాన్ని తీసి మూత పెడదామని చూస్తే అందులో మరో అర్ధరూపాయి ఉంది. దానిని తీసేసరికి మరోటి ఉంది. అది తీస్తే యింకోటి ఉంది. ఏమిటీ వింత? ఈ చిన్న బరిణెలో యిన్ని అర్ధరూపాయలెలా అక్షయంగా వస్తున్నాయి! మహేంద్రజాలంగా ఉందే!" అమ్మ విగ్రహం కేసి చూస్తూ – "అమ్మా! ఏమిటీ మాయ?"

అదే సమయంలో బయటనుండి ఎవరో వచ్చి "భట్టాచార్యులవారున్నారా!" అని ప్రశ్నించగా, లోపలనుండే "ఆఁ! వస్తున్నానండి!" అంటూ ఉమాపదులవారు బయటకు వచ్చి చూసేసరికి – ఓ పెద్ద పాత్రలో పదిమందికి సరిపడే భోజన సామాగ్రితో ఓ అపరిచిత వ్యక్తి వచ్చి -అయ్యా! జమీన్‌దార్‌గారు అమ్మ నైవేద్యానికు యీ స్వయంపాకం ఇచ్చి రమ్మన్నారండి' అని వెళ్ళిపోయారు. అందులో ఉప్పు పప్పు బియ్యం పళ్ళు కూరలు మధుర పదార్థాలూ నూనె నెయ్యీ అన్నీ ఉన్నాయి. అవి చూసేసరికి ఉమాపదుని నోట మాట రావడం లేదు. క్రమంగా కంఠం గద్గదం కాగా– "అమ్మా! దుర్గాభవానీ! కరుణామయీ తల్లీ!" అంటూ వెక్కి వెక్కి ఏడవసాగాడు. వెంటనే ధైర్యం తెచ్చుకొని అక్కడ నుండే అతిథుల్ని పిలుస్తూ – "మహాత్ములారా! మీకిప్పుడే క్షణాలమీద భోజనానికి ఏర్పాటు చేస్తాను", అంటూ లోపలికి వచ్చి చూసేసరికి అక్కడ ఎవరూలేరు. అతిథులు విముఖులై వెళ్ళిపోయారు కాబోలు ననుకుంట సింహద్వారం దగ్గర నిలబడ్డ దుర్గాదాసు దగ్గరకు వచ్చి – "బాబూ! యిలా సన్యాసులు వెళ్ళారా?" అని ప్రశ్నించాడు. "అయ్యా! ఈ యింట్లోంచి ఎవరూ బయటకు వెళ్ళలేదు." అన్నాడు దుర్గాదాసు. "అయితే నా దృష్టి భ్రమించలేదు కదా! జాగ్రదవస్థలో నేను స్వప్నం కనడం లేదు కదా! అమ్మా! దుర్గా! ఏమిటీ లీల? తల్లీ! దుర్గా! దుర్గా! దుర్గా! ఈ పరీక్ష, యీ అనుగ్రహం ఏమిటమ్మా!" అంటూ ఆయన చంటిపిల్లాడిలా ఏడవసాగాడు.

కొన్నిక్షణాలు గడిచాయి. ఉమాపదుడు లేచి పళ్ళు, మిఠాయీలూ అమ్మకు నైవేద్యం పెట్టి దుర్గాదాసుకూ, శివరామునికి ప్రసాదం యిచ్చాడు. తను మాత్రం చరణామృతాన్ని పానం చేశాడు. దుర్గాదాసు భోజనం చేసిన తరువాత అతని చేతిలో అర్ధ

రూపాయి పెట్టి – రా బాబూ! నువ్వే మా అమ్మాయిని చూసిన చోటికి వెంటనే నన్ను తీసుకెళ్ళు" అన్నాడు. దుర్గాదాసు ఆశ్చర్యానికి హద్దుల్లేవు. అతిథులుగా వచ్చిన సన్యాసులు ముగ్గురు ఇంట్లో ఉండడం అతడు చూశాడు. కానీ వారెక్కడికి వెళ్ళింది అతడు నిశ్చయం చేసుకోలేక పోతున్నాడు. ఇద్దరూ మైదానంలోని చెరువుకేసి వెళ్ళారు.

"ఎక్కడ చూశావయ్యా!"

"ఇక్కడే బాబూ! ఈ గట్టుమీదే."

కాని ఆ గట్టుమీద ఎవరూలేరు. "అమ్మా! అవిశ్వాసియొక్క అవిశ్వాసాన్ని చూర్ణం చేసి ఎక్కడ దాక్కున్నావమ్మా! ఒక్కసారి ఒకే ఒక్కసారి దర్శన మియ్యి" అంటూ ఉమాపదుడు వ్యాకులుడై "అమ్మా! అమ్మా!" అని పిలవసాగాడు.

తాను గాజులు వేసిన దెవరికో దుర్గాదాసు కిప్పు డర్థమయింది. అతడు కూడ ఏడవ సాగాడు. "అరే! అమ్మను చూసి మాట్లాడిన నేను గుర్తించలేక పోయానే! అమ్మా! నువ్వు స్వయంగా గాజులు వేయించుకున్నావు కదా! ఒకే ఒక్కసారి మాట్లాడవమ్మా!" అంటూ అతడు పిచ్చివానిలా యిటూ అటూ పరుగెత్తసాగాడు.

నెమ్మది నెమ్మదిగా చెరువులోని నల్లటి నీళ్ళలోంచి రెండు ఎర్రటి చేతులు పైకి వచ్చాయి. 'అదే అమ్మ! అదే అమ్మ!' అంటూ వారిద్దరూ మూర్ఛపోయారు.

[కల్యాణ్ – హిందీపత్రిక ఆధారంగా]

— పురాణపండ రాధాకృష్ణమూర్తి

---







అనంతగిరులను 'రాజధర్మం' అనే మర్కటం పాలిస్తుండేది. రాజధర్ముడు, పేరుకు తగినట్లు ధర్మంతప్పని మహారాజుగా కీర్తి కెక్కాడు. తన పాలనలోఉన్న మర్కటాలను కన్నబిడ్డలుగా చూసుకోవడం జరిగేది. అన్యాయం, అక్రమం, ఎవరు ఎక్కడ చేసినా, వారిని కఠినంగా శిక్షించడం జరిగేది. మర్కటములు కూడా రాజధర్ముని వట్ల భయభక్తులతో మెలిగేవి. రాజధర్మునికి ఎన్నాళ్ళకు సంతానం కలుగలేదు. పూర్వజన్మసుకృతం వలన ఒక మగబిడ్డ కలిగింది. 'సర్పకేతుడు' అనే నామకరణం జరిగింది. సర్పకేతుడికి యుక్తవయసు వచ్చింది. రాజ్యపట్టాభిషేకం చేయాలని రాజధర్ముడు అనుకోవడం జరిగింది.

ఒకసారి కందకగిరినుండికొన్ని కోతులు వచ్చాయి. అవి రాజధర్ముని చేరి, "రాజా! మీ పాలనలో ఇంతవరకు మాకు సుఖశాంతులకు లోటు లేదు. కాని ఇప్పుడిప్పుడే అనుకోని కష్టాలు ఎదురయ్యాయి" అంటూ తలలు దించాయి. రాజధర్ముడు రాజదండము ధరించి, "ఓ నా ప్రియతమ బిడ్డలారా! మీకు కలిగిన కష్టమేమిటి? మీకు కష్టాలు కలిగిస్తున్నది ఎవరైనా క్షమించేది లేదు. వారిని శిక్షించక తప్పదు. నా బొందెలో ప్రాణం ఉండగా మీకు అన్యాయం జరగడానికి వీల్లేదు. ఇదే నా ప్రతిజ్ఞ" అంటూ హుంకరించాడు. ఆ మాటలు మర్కటాలన్నిటికి ఎంతో సంతోషం కలిగించాయి. "రాజా! మా కందకగిరి లోయల్లోనికి ప్రతిరోజు సాయంత్రం ఒక మర్కటం వస్తుంది. అది గొప్ప వంశానికి చెందినదిలా కనిపిస్తుంది. మమ్మల్ని హింసలు పెడుతుంది. ఆడకోతులను అవమాన పరుస్తుంది. దానిని ఎదిరించడం మావల్లకాదు" అని చెప్పాయి.

"మీరు ఇక మీ కందకగిరిని చేరండి. వెంటనే శాంతి భద్రతలకు తగు ఏర్పాట్లు చేస్తున్నాను" అంటూ రాజధర్ముడు మర్కటాలన్నిటినీ పంపించి వేయడం జరిగింది.

వెంటనే ఇరువురు గూఢచారులను పిలిచి "కందకగిరుల లోయల్లో జరిగే అశాంతికి కారణం తెలుసుకొని సత్వరమే రండు" అని రాజధర్ముడు ఆజ్ఞాపించడం జరిగింది. గూఢచారులు ఇద్దరు కందకగిరి లోయలు చేరారు. అశాంతికి కారణం గ్రహించి రాజధర్ముడికి తెలిపారు. ఆ విషయం విన్నంతనే రాజధర్ముడి కళ్ళు చెమ్మగిల్లాయి. గూఢచారులను పంపి, బలవంతులైన వీర మర్కటములను రెండింటిని పిలిపించాడు. "మీరు ఈ రోజు సాయంత్రం కందకగిరిని చేరండి. అక్కడ అశాంతిని కలిగించే మర్కటాన్ని వధించండి. కాని ఆ మర్కటం ముఖం చూడకూడదు. వెనుక నుండే ఈ బాణాలతో వధించండి ఇదే నా ఆజ్ఞ" అంటూ హూంకరించి బాణాలను అందించాడు.

బాణములు, శరీరములలో బలముగల ఆ రెండు మర్కటాలు చీకటిపడే వేళకు కందక




శ్రీ బెహరా ఉమామహేశ్వరరావు

గిరిని చేరాయి. అక్కడ చెట్టుచాటున చేరాయి. అశాంతిని సృష్టించే మర్కటం వీపుపై రెండు శరములు విడిచాయి. మర్కటం నేలకు ఒరిగింది. రక్తపు మడుగుల్లో మర్కటాన్ని చూసిన వెంటనే వాటికి కళ్ళు తిరిగాయి. ధైర్యం చేసుకొని ఆ మర్కటాన్ని మోసుకొంటూ రాజధర్ముని వద్దకు చేరాయి. "మహారాజా! మమ్మల్ని క్షమించు. కంచకగిరి చేరి శిక్షించింది సర్పకేతుడిని. ఇది మేము తెలియక చేశాము. మాకు తగిన శిక్ష విధించు" అంటూ మర్కటాలు రెండు మోకాళ్లపై నిలబడ్డాయి.

రాజధర్ముడు వారిని లేవనెత్తి, "బిడ్డలారా! నా రాజ్యంలో తప్పు చేసినది ఎవరైనా శిక్ష అనుభవించక తప్పదు. కంచకగిరిపై అశాంతి రేపింది సర్పకేతుడని నేను ముందే తెలుసుకున్నాను. అన్యాయము, అక్రమము, అశాంతికి మూలకారణం యువరాజని గూఢచారులు తెలిపారు. నేరం చేసిన తరువాత ఎవరైనా శిక్ష అనుభవింపక తప్పదు. అందులో స్త్రీలను అవమానిస్తూ, ధనమానహాని చేసినది యువరాజైనా తగిన శిక్ష అనుభవించ వలసిందే. నా బిడ్డని కంటే నా ప్రజల శ్రేయస్సే ముఖ్యం. ఇదే రాజధర్మం" అని గద్గద కంఠంతో పలికాడు.

అపుడు అమరవాణి, "రాజధర్మా! నీవు ధర్మం తప్పని చక్రవర్తివి. అందుకే ఈ పరీక్ష. యువరాజు సర్పకేతు నిజంగా మరణించలేదు. పశ్చాత్తాపంతో స్పృహతప్పి ఉన్నాడు. వెంటనే చికిత్స చేయించి పట్టాభిషిక్తుని చేయి. నీవలె సర్పకేతుడు రాజధర్మం వెలయించగలడు" అని పలికింది. అమరవాణి విని రాజధర్మునితో పాటు మంత్రులు సామంతులు అంతా సంతోషించారు. సర్పకేతుడికి చికిత్స చేయించాడు. అతడు కూడా తండ్రివలె ధర్మం తప్పని పాలకుడుగా కీర్తికెక్కాడు.





## శ్రీ రుద్రాక్ష మాహాత్మ్యము

"శ్రీ రుద్రాక్ష మాహాత్మ్యము" అను నాటకమును రచించిన కవివరేణ్యులు, శ్రీ మత్త్రిలోక శ్రీగురు చెన్న మల్లికార్జున పండితారాధ్యుల కోటిలింగమూర్తి గారు. ఇంతకుమున్ను వీరు "బసవేశ్వర మాహాత్మ్యము" మున్నగు గ్రంథములనుగూడ రచించినట్లు తెలియుచున్నది. శైవ మత గ్రంథజాతిలో చేరిన ఈ రుద్రాక్షమాహాత్మ్యమును చదివి, అలరి, నాయభిప్రాయము ను ఈ గ్రంథముపై నివేదించుటకు బూనుకొంటిని. ఇది చక్కని చిన్ని నాటకము. పౌరాణికమైన ఇందలి ఇతివృత్తము బ్రహ్మోత్తర పురాణఖండము నుండియో, స్కంద పురాణము నుండియో గ్రహింప బడి యుండనోపును.

వేదములు, శాస్త్రములు, పురాణములు, కావ్యములు, శతకములు, నవలలుమున్నగు రీతిని వాఙ్మయమున బహు భేదములు గలవు. వానిలో వేదములు ప్రభుసమ్మిత ములై "శ్రీరామవ ద్వర్తితవ్యమ్, న తు రావణవత్" అని శాసించుచు మానవుల లౌకికాలౌకిక జీవిత విధానములను తీర్చి దిద్దును. శాస్త్రములును శాసన ప్రధాన ములే. పురాణములు మిత్రసమ్మితములై సోదాహరణముగా, దేవరాక్షసులకు, సూర్య చంద్ర వంశపు రాజులకు చెందిన చిత్ర విచిత్ర కథల మూలమున మానవ జీవిత విధానములను తీర్చిదిద్దును. కావ్యములు కాంతాసమ్మితములై వ్యంగ్య మర్యాదతో జీవిత విధానములను మానవులకు ఆనంద కరముగా బోధించును. కాళిదాసాది కవులు రచించిన రఘువంశము, అభిజ్ఞాన శాకుంతలము మున్నగు కావ్యములు ఎంతటి ఆహ్లాద కరములో అంద తెలిసినదే. అవియే కావ్య వాఙ్మయమున కుదాహరణములు.

రంగస్థలమున నటీనటులు నవరస భరిత ముగా కరచరణాద్యవయవములను గద ల్చుచు సీతారామాదులను, హరిశ్చంద్రాదు లను అనుకరించి అభినయించుచు, ప్రేక్షకు లకు పౌరాణికాది కథా విషయములను ప్రబోధించెదరు. అట్టి ప్రబోధమే నటనము. ఆ నటనమును ప్రేక్షకులు దృక్కులతో (నేత్ర ములతో) జూచుచు, విషయములను గ్రహించుచు, ఆనందించెదరు. కావుననే నాటక మను నామము దానికి సార్థకము.

ప్రకృతమగు ఈ "రుద్రాక్షమాహాత్మ్య" నాటకములో సౌమ్యవంతుడను రాజు, ప్రధాన నాయకుడు. పుష్కర దేశాధిపతి. ఈతడు ధీరశాంతుడు. శివభక్తుడు. రుద్రాక్ష మంత్రోపదేశమంది, రుద్రాక్ష ధారణచే మహిమనందిన ఘనుడు. శాంతరస భేదము లతో జేరిన భక్తిరసము ఇందలి ప్రధాన రసము. అది ఆ యా కథా పన్నివేశము లతో చక్కగా పోషింపబడినది. పరమపావ




భూయిష్ఠమైన ఈ రోజులలో జనుల మన స్తత్త్వములు అనుకరణాత్మకములై, దిన దినము మార్పుచెందుచు నాస్తికతా ప్రవాహమున మునుగుచున్నవి. మన భారతీయ నాగరికత, విజ్ఞానము ఎట్టిదో తెలిసికొనలేని స్థితిలోపడి కొందరు, తెలిసికొన ప్రయత్నింపకయే కొందరు, అయోమయస్థితిలో నున్నారు. మన నాగరికతను వీడి, విదేశీయ నాగరికతను అందలేక "ఇతోభ్రష్టః తతో భ్రష్టః చుంబనాస్మైథునాదపి" అను దానికి ఉదాహరణమగు బుజ్జివాని కాపుర ములో పడినారు. అట్టివారికీ నాటకము కనువిప్పు కల్గించును. మన హైందవ జీవితము దిక్కునకు ప్రజలదృష్టిని మరల్చు టకు ఎక్కువగా దోహదకారియగును.

రుద్రుడువలె రుద్రాక్షయును తేజశ్శాలి. ఆనందదాయకము. సంసార దుఃఖ వినాశకము. రుద్రాక్షకుజెందిన వైజ్ఞానిక విషయములు, ఈ నాటకము వలన సర్వులకును తేటతెల్లములగును. నాటకలక్షణానుకూల ముగ ధీరశాంతనాయకుడు సౌమ్యవంతుడు చక్కగా చిత్రింపబడినాడు. భక్తిరసము నాటకమునగల ఏడు అంకము లందును కథాపన్నివేశములకు అనుకూలముగ పోషింపబడినది. మొదటి అంకమున "మంగళం పరాత్పరా" అను పాటలో ద్వాదశపదములు గలదిగా నాంది గ్రథింప బడినది. "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వా" అను నియమము ననుసరించి, నారదస్తుతుడగు పరమేశ్వరుని యాకారము కన్నులకు గట్టినట్లు చక్కగా ప్రదర్శింప బడెను. వృత్త వర్తిష్యమాణ కథా సూచ కముగా విష్కంభము ప్రదర్శింపబడెను. నాటకాంతమున భక్తిరస ఫలమగు పర మేశ్వరుని సాన్నిధ్యము కల్గునని పద్య గద్యరూపమగు భరతవాక్యమున చక్కగా జెప్పబడెను. కావున నాటక లక్షణములు ఈ నాటకమున గలవనుట నిజము. "ప్రకృత మనుసరామః పాయసం భక్ష యామః" ప్రకృతమగు ఈ రుద్రాక్ష మాహాత్మ్యనాటకము ననుసరించి, ఇందలి భక్తిరస పాయసమును ఇంచుకంత ఆర గ్రోలుదము గాక. ఈ నాటక నామము రుద్రాక్షమాహాత్మ్యము ఆదినుండి అంతము వరకును ఈ నాటకమున రుద్రాక్ష ధారణ మహిమ చక్కగాఁ బ్రకటింపబడినది. పుష్కరదేశాధిపతియైన సౌమ్యవంతుడు, వ్యసనాసక్తుడై, లోకోద్ధారకుడైన నారద మహర్షిచే హితోపదేశముపొంది, రుద్రాక్షను జూచిన మాత్రాన, తాకిన మాత్రాన, దాల్చిన మాత్రాన, మహిమ నంది జ్ఞానియై తన ఉంపుడు కత్తెయైన కళావతిని దూర ముగా నుంచి, పతివ్రతా తిలకమైన భార్య వసుమతిని జేరదీసి,సన్మార్గగామియై,మరల రాజ్యము నంది, ప్రజారంజకుడై, మహా దేవభక్తుడై కైలాసముచేరి శివసాన్నిధ్య ముక్తిని బొందెను. రుద్రాక్షను హేయ ముగా జూచిన సౌమ్యుని పెద్దయల్లుడు కమలాక్షిగా మార్పుచెందెను. అపుడు వాని భార్య, అనగా సౌమ్యవంతుని ప్రథమ పుత్రిక సర్వకళ పతివియోగమునకు వ్యథ

జెందెను. కొంతకాలమునకు, రుద్రాక్ష మహిమ నెఱింగి, ఆమె దానిని బూజించెను. కమలాక్షుడును రుద్రాక్షను దాల్చి, నిజ రూపమును బొందెను. ఇట్లు భార్యాభర్తలు సర్వకళా కమలాక్షులు రుద్రాక్షప్రభావము చేతనే నిజరూపముల నంది, సుఖముగా నుండిరి.

శివభక్తుడు, రుద్రాక్షధారియు నగు సుప్రతీపుడు తనగృహమునగల మార్జాలము మెడలో రుద్రాక్ష కట్టుటచే, అది స్వర్గము నుండియు కల్పవృక్ష కుసుమమును దేగ ల్గెను. శచీపురందరులచే స్వాగతమర్యాద బొందియు, దేవలోక విమానమును అధి ష్ఠించెను. ఆ విషయమెఱింగి, శివభక్తుడు కాని యతీంద్రుడు సిగ్గుపడెను. రుద్రాక్ష ధారణచేతనే జామిత్రుడను పాపాత్ముడు కూడ కైలాసము చేరెను. ఇట్లు రుద్రాక్ష ప్రభావము నెఱింగించు విషయ లెన్నియో యీ నాటకమున గ్రథింపబడినవి.

ఇంతేకాదు. ఈ నాటకమున, రుద్రాక్ష ప్రాదుర్భావము, దాని భేదములు చదువరు లకు జక్కగా దెలియునట్లు వివరించి చెప్ప బడినవి. కాలాగ్ని రుద్రుడైన మహాశివుని చెంత జేరుటకు, భస్మధారణము ప్రధాన సాధనమని తెల్పబడినది. రుద్రాక్షలలో, ఏక ముఖములు, ద్విముఖములు, త్రిముఖ ములు, చతుర్ముఖములు, పంచముఖములు, గౌడ రుద్రాక్షలు మున్నగు భేదము లెన్నియో కలవు. వీనిలో ఉసిరికాయింతటి రుద్రాక్షలు ఉత్తమములు. రేగుపండంతటివి మధ్యమములు. శనగగింజ లంతటివి అధమ ములు. వీటిలో సహజముగా రంధ్రము గలవి ఉత్తమములు. కృత్రిమ రంధ్రములు మధ్యమములు. ఇవన్నియు దాల్చిన వారికి ముక్తి నొసంగునవియే. ఏకముఖ రుద్రాక్ష పరతత్త్వరూపము కావున జితేంద్రి యత్వమును ఒసంగును. ద్విముఖ రుద్రాక్ష అర్ధనారీశ్వరాత్మకమై ఎల్ల వరముల నొసం గును. త్రిముఖ రుద్రాక్ష అగ్నిరూపమై, అగ్నిదేవునిచే ఆయుర్దాయాదుల నిప్పిం చును. చతుర్ముఖ రుద్రాక్ష అఖండరూపము, పంచముఖ రుద్రాక్ష సంపూర్ణ స్వరూపము కావున కోరినవాటి నన్నిటిని ఒసంగును. రుద్రాక్ష పాపపరిహారము, మోక్షదాయ కము, దీని మహిమను విన్నను, చదివినను, వ్రాసినను పునర్జన్మరహితులై శాశ్వతత్వము నందుదు రనుట అతిశయోక్తి కాజాలదు. ఈ విధముగా యీ నాటకకథలో ఎన్నియో వింతలు వ్రాక్రుచ్చబడినవి.

— తెలికిచర్ల రాజేశ్వరశర్మ

## అన్నమయ్య హనుమత్సంకీర్తనలు

[ రచన: డా॥ కె. సర్వోత్తమన్, డెమ్మీ 76 పుటలు. వెల: రూ. 10_00, ప్రతులకు: శ్రీ కె. వెంకటరావు, 6_7_554, శ్రీపురంకాలనీ, తిరుపతి_ 517 501.]

భక్తకవీ, వాగ్గేయకారుడూ అయిన అన్నమయ్య వేలకొద్ది కీర్తనలు వెలయిం చిన విషయం విద్వల్లోకానికి తెలిసిందే. తాను చూచిన దివ్యదేశాలను కీర్తించాడు; తాను దర్శించిన వేల్పుల్ని సంస్తుతించాడు ఆ పదకవితా పితామహుడు. అందువల్ల స్థూలదృష్టికి సైతం ఆయన సంకీర్తనలలో వైవిధ్యం కనిపిస్తుంది.

అన్నమయ్య సభక్తికంగా స్తుతించిన వేలుపులలో హనుమంతుడుకూడా ఉన్నాడు. నమ్మిన బంటుగా మన మనస్సులలో నిలిచి పోయిన ఆ పవనతనయుణ్ణి గురించి వివిధ భాషలలోనూ రుచికరములైన కథ లున్నాయి. అన్నమయ్య వంటి భక్తకవి హనుమంతుణ్ణి దర్శించిన పైనాన్ని ఈ పుస్తకం ద్వారా తెలుసుకుని మనం ఆనం దించవచ్చు.

మిత్రులు డాక్టర్ సర్వోత్తమన్‌గారు సంతరించిన యీ పుస్తకంలో మూడు భాగాలున్నాయి. సంస్కృతాంధ్రాది భాష లలో గల హనుమత్ ప్రశంస మొదటి భాగంలోని విషయం. రెండవ భాగంలో అన్నమయ్య హనుమత్ సంకీర్తనలలోని వైశిష్ట్యం వివరించబడగా, చివరి భాగంలో ఆ వాగ్గేయకారుని హనుమత్ సంకీర్తనలు అందాలు దిద్దుకున్నాయి. అన్నమయ్య సంస్తుతించిన హనుమంతుణ్ణి గురించి తెలుసుకోడానికి ఈ పుస్తకం ఎంతగానో ఉపకరిస్తుందనడం చర్విత చర్వణం. అలాగే, అన్నమయ్య నారసింహ సంకీర్త నలు, వితల సంకీర్తనలు.... మొదలైనవి ప్రచురించే ప్రయత్నం సాగుతున్నట్టు రచయిత తెలిపారు. ఈ ప్రయత్నం ప్రశంసార్హం.

అన్నమయ్య సంకీర్తనల్ని ఆధారంగా చేసుకుని, ఆయన దృష్టిలో హనుమంతుడు భవిష్యద్బ్రహ్మ అనీ, సర్వదేవతా స్వరూపు డనీ, భటుడనీ రచయిత వివరించిన తీరు అందరూ పరిశీలించదగింది. అలాగే ఉదా హరించిన మరికొన్ని సంకీర్తనలలోని భావాన్ని వివరించివుంటే చాలా బాగుండేది.

అలాంటి వివరణ సామాన్య పాఠకుడికి ఎంతైనా అవసరం. అప్పుడే అతడు అన్న మయ్య సంకీర్తనల వైశిష్ట్యాన్ని స్పష్టంగా గ్రహించగలుగుతాడు. హనుమద్భక్తులే కాక సాహిత్యాభిమానులు కూడా ఈ పుస్త కాన్ని ఆదరిస్తారని ఆశించవచ్చు.

తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయంతో ప్రచురించబడిన యీ పుస్తకం వెల కొంచెం ఎక్కువనే అనిపిస్తున్నది.

— చల్లా రాధాకృష్ణశర్మ

## బమ్మెరపోతనకు గేయనీరాజనము

భక్తకవిరాజు బమ్మెర పోతరాజు: రచయిత: డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం: శ్రీ గిరిజా ప్రచురణలు, బి_31 విద్యాలంకార్ శ్రీనివాసనగర్: గుంటూరు_6, 60 పుటలు, వెల: నాలుగు రూపాయలు.

బమ్మెరపోతన కిది గేయనీరాజనము. ఆంధ్రమహాభాగవతము శ్రీహరిపట్ల పోతన భక్తిని చాటితే, ఈ పుస్తకం పోతనపట్ల రచయిత భక్తిని చాటుతుంది. "పోతన్న

పంచశతతమ జయస్త్యుత్సాహమతితో" రచింపబడినట్టిది. పోతన "పూతచరిత రేఖాచిత్ర మాత్రమిది."

లోకంలో కవులు చాలా మంది ఉండవచ్చు. కాని సాక్షాత్తు శ్రీరామభద్రునిచే ఘంటం పట్టింపబడిన మహాకవి పోతనామాత్యుడు. కవి ఉత్తముడు కానిదే కావ్యానికి ఉత్తమత్వం సిద్ధించదు. పోతన అట్టి ఉత్తముడు.

"నీ ధర్మతత్పరత
నీ కళానిస్తులత
నీ ఋజుప్రవర్తనము
ప్రజలమన్ననబడసె"

అంటారు రచయిత. కవులు కాగోరే వారందరూ ఆత్మవిమర్శనం చేసుకొనడానికి ఇది గీటురాయి అనాలి.

పోతన భక్తకవిగా ప్రసిద్ధుడు. అయితే ఎవరికి భక్తుడాయన?

"శైవ పంచాక్షరీ
జప తత్తజీవితా!
రామ సాక్షాత్కార
ప్రముదితాజ్ఞావర్తి!!"
"శాక్తేయ మాంతరము
శైవమ్ము బాహిరము
ప్రజలందు వైష్ణవము
ఆజ్ఞ పాటించితివి"
"శివకేశవాభేద
భక్తినిర్భరమతీ"

అని ప్రస్తుతించారు రచయిత. ఉన్నదొక్కటే బ్రహ్మం. మిగిలినవన్ని ఆయన మూర్తిరూపాలని గుర్తించిన జ్ఞానికి భక్తి ఎవరిపట్ల అనగలం?

తన చింత బాపుకొనడానికి వ్యాసుడు నారదుని సూచనపై భాగవతం వ్రాశాడంటారు. పోతన లోకపు చింతను బాపడానికి పరంధాముని ఆదేశంపై భాగవతం వ్రాశాడనాలి. అట్టి-

"…. భాగవత
శ్రవణ మాత్రముచేత
అపరోక్షదివ్యాను
భూతి ప్రజలకు కల్గు"

అని రచయిత అనడంలో అతిశయోక్తి ఉందనలేం. "నరుల మెప్పునుగోరి కవిత లల్లెడి" వారి లోకంలో "కైవల్యమును గోరి కవిత జెప్పితి వీవె" అని అనడమూ అతిశయోక్తి అనలేం.

కవులను గూర్చి, కావ్యాలను గూర్చి వ్రాసే టప్పుడు పలువురు కవి హృదయం జోలికి, కావ్యపరమార్థం జోలికి పోకుండా విమర్శనలు చేయడం కద్దు. కాని ఈ పుస్తకంలో రచయిత కవిహృదయాన్ని, కావ్యపరమార్థాన్ని యథాశక్తి స్పృశించడానికి ప్రయత్నించడం కనిపిస్తుంది. అంతే కాదు కవి కాలము, స్థలము మున్నగు వానిపై చర్చలను అప్రధానమని రచయిత భావించడం కనిపిస్తుంది.

"నీ కాలమును గూర్చి
నీ కవిత్వమును గూర్చి
అనువాద పైఖరుల
ఆలోచనలె మెండు"
"నీ భక్తి తత్త్వమ్ము
నున్మీలనము సేయ
ఉద్యమింపరు మనీ
షోత్తములు చిత్రమ్ము"

అంటారు రచయిత.

పోతనను గురించి, భాగవతమును గురించి సంభావించుటలో రచయిత తమ పైన భావనలు అనేకం ఇందులో వ్యక్తం చేశారు.

ఉదాహరణకు—

"అరవింద యోగీంద్రు
నతి మానసిక కవిత
నీ భాగవతమందె
సంభావితమ్మగును"

ఇట్టివే మరి అనేకం కనిపిస్తాయి. ఇట్టివానిని తమ భావనలుగా విశేష ఉపోద్ఘాతాన్ని అందిస్తే పఠితలు ఆలోచించుకొనడానికి ఉపయోగించేది.

పోతనపట్ల భక్తిభావపరవశత్వంలో రచయిత కైవల్యాన్ని పొందిన పోతన్నను "తిరిగి జన్మించ" మంటాడు. అందులోనూ "తెలుగుదేశం" లోనే జన్మించమంటాడు. ఎందుకట? ఆకలికవులను ఆర్తభక్తులు చేసేందుకు, "అభ్యుదయ కవులమని ఆర్భాట" పడేవారికి "నిశ్శ్రేయసానందం" గల్గించేందుకు, "మాధవుని జాడ లే విధమొ" తెలియకుండానే "మానవసేవే మాధవసేవ" అనే వారికి తగిన జ్ఞానం కలుగజేసేందుకు—ఇంకా ఇంకా చాలా పనులకోసం "తిరిగి జన్మింపు" మని కోరుతారు రచయిత. వర్తమాన కవితారీతులపట్ల రచయిత వేదన కిది పరోక్ష వ్యక్తీకరణ.

ఈ గేయనీరాజనము పఠితలలో భాగవత పఠనాసక్తిని, పోతనపట్ల శ్రద్ధాభక్తులను పెంపొందిస్తే ఎంతో ఆనందించదగి ఉంది.

— లక్ష్మీనారాయణ

## శ్రీ రాఘవశతకం

[రచయిత: శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి గారు; 1/8 క్రౌన్ సైజు; 28 పుటలు; మూల్యం రూ 1-50 ప్రతులకు; శ్రీ జోస్యుల సూర్యనారాయణ మూర్తి గారు; భారతీసదనం; అవనిగడ్డ; కృష్ణాజిల్లా.]

ఆంధ్ర వాఙ్మయంలో విలక్షణమైన శాఖ శతకశాఖ. సహజంగా ఆత్మానుభవం శతకం ద్వారానే తెలుస్తూ ఉంటుంది. అంచేతనే అది హృదయానికి అత్యంత సన్నిహితంగా ఉంటూ ఆంతరంగిక స్వానుభూతిని కలిగిస్తుంటుంది. అలా ఉండడంవల్లనే లోకం దానిని ఆదరిస్తూ వుంది. శతకంలో ముఖ్యంగా సంఖ్యానియమం మకుటనియమం, భాషానియమం పాటింపబడుతూ 100 పద్యాలకు పైగా 108 పద్యాలకు

లోపుగా ఉంటుంది. మకుటం సంబోధ నాంతంగాఉంటూ నామోచ్చారణ ప్రధానంగా పర్యాయ పదరహితంగాఉంటుంది. అన్ని పద్యాల్లోనూ ఒకే రసం ఉంటుంది. వైవిధ్యం ఉండదు. విశేషించి భక్తి రస ప్రధానమైన శతకాలలో ఇతరరసప్రసక్తే ఉండకూడదు. ఇలా ఇన్ని నియమాలతో నాటినుండి నేటివరకూ వేలసంఖ్యలో ఉన్నాయి శతకాలు. ఇలా నియమ బద్ధంగా ఉన్న శతకాలలో భక్తిరసప్రధానంగా వెలసిన రాఘవశతకం ఒకటి. చిరుపొత్తమే ఐనా గుణసంపన్నమైన శతకం ఇది. రచయిత ఉభయ భాషల్లోనూ చక్కని పరిచయం గల వ్యక్తిగా భాషను బట్టి తెలుస్తూ ఉంది. అలాగే కవితారంగంలో మెళకువలు ఎరిగిన కవిగా ధారాశుద్ధిని బట్టి ప్రయోగ దక్షతను బట్టి తెలుస్తూ ఉంది. పైపెచ్చు దైవభావం మూర్తీభవించిన పరిశుద్ధ మనస్కులుగా 91-92-96-97 పద్యాలద్వారా తెలుస్తూఉంది. "బాల్యము నందె తారకము భక్తి నొసంగెను తండ్రి నాకు," "సర్వము రాము డే య ను విశాల విశిష్ట వినీత భావముల్ పర్విన నాకు" "నీ వన్నం జిన్నతనంపు మిత్రుడను నూహల్ గల్గెడిన్" "ఈ వున్న లోకంబునే యేనుం జేరగ లాడ నంచు మదిలో నూహింతు" అనే వాక్యాలు ఇందుకు ఉపోద్బలకాలుగా కనబడుతున్నాయి. వీరు రామోపాసకులుగా రామమంత్రంతో నిత్యసంబంధం ఉన్న అనుష్ఠానపరులుగా 10; 16; 17; 22; 26; 28 ఆదగాగల పద్యాలద్వారా తెలుస్తూ ఉంది. తనలోని లోపాలను కూడా యథాతథంగా తెలియజేసుకునే ఆత్మస్థైర్యం వీరికి పుష్కలంగా ఉన్నట్లు 20 - 31 పద్యాలద్వారా తెలుస్తూ ఉంది.

మచ్చుకు

"ఏ దోషంబులు చూచి లోకమును నే
నెల్లప్పుడూహింతునో
ఆ దోషంబులె నాదు చిత్తమున కభ్యస్తం
బులై యున్కి"

"నిర్మల మానసంబునను నిన్ భజియింప
వలెన్ గదోయి! నా
కర్మమదే మొ నిర్మలము గాదు మనంబు"

ఇలాంటి ధైర్యం లోకంలో ఎందరికుంటుంది?

వీరి శ్రీరామావతార భావనకూ కవితా ధారకూ ఈ క్రింది పద్య మొక్కటే చాలు.

"సాకేతాధిపతిత్వ భూషితము విశ్వ
వ్యాప్తి దివ్యంబులో
కైకారాధ్య మహస్సు లక్ష్మణ విశేషా
రాధనానందితం
బాకల్పాంత జనానురంజక
కథావ్యక్తంబు శ్రీరామ చం
ద్రాకారంబును లోఁ దలంచి యనిశం
బర్చింతునో రాఘవా!"

రామ భక్తులందరూ చదవదగ్గ శతకం.

— పూడి వేంకటరామయ్య

## శ్రీనివాస శతకము

రచయిత: శ్రీ కొంగే సుధాకరరావు, బి. ఏ. వెల: రు. 2-00. ప్రతులకు: శ్రీమతి కె. సుశీలాబాయి, 3/351 సదాశివపేట, ఆదోని, కర్నూలు జిల్లా-513 301.

ఈ శతకంలో "శ్రీనివాస! సకలాశ్రితజనేశ!" అనే మకుటంతో సాగిన 100 ఆటవెలది పద్యాలున్నాయి. అంతేకాక అప్పుడప్పుడూ కవి రచించిన ఇతర పద్యాలు కొన్నీ శ్లోకాలు కొన్నీ ఇందులో చేర్చబడినాయి. ఐనా ఇవన్నీ కూడ భక్తిమార్గానికి సంబంధించినవే.

శ్రీ కొంగే సుధాకరరావు గారి పద్యాల్లో సరళమైన శైలి కనిపిస్తున్నది. భావవ్యక్తీకరణలో ఏలాంటి నత్తిగానీ క్లిష్టతగానీ లేకపోవడం హర్షించదగిన విషయం. గుండె శిఖరాలలో పుట్టినవారి భక్తిభావం పద్యాల్లో వరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తున్నది. కవి ఒక్కొక్కచోట ఇట్లా అతిరమ్యంగా ఊహిస్తాడు—

"కోటిసూర్య ప్రభలు కొలువైన యట్టుల
మెరపు దీవలెన్నొ మెరసినటుల
నీదు రూపదీప్తి నిర్మలమైనది
శ్రీనివాస! సకలాశ్రితజనేశ!"

ఇక్కడ కోటిసూర్యుల ప్రభలు ఒకచోట కొలువు తీర్చడమన్న భావం లోకోత్తరంగా ఉన్నది. భక్తి భావానికి మకుటాయమానంగా భాసిస్తున్నది. మరొకచోట ఇట్లా అంటాడు —

"గొల్లవాడి వీవు! గోపాలకుండవు!
నరపశువుల రక్షణమ్ము సేయు!
మాదు మద మణంచి మంగళమిమ్మయా
శ్రీనివాస! సకలాశ్రిత జనేశ!"

ఇది నేటి మానవ ప్రవృత్తిపై మంచి కొరడా దెబ్బవలె ఉన్నది. మనిషి పశుతుల్యుడుగా మారినా డన్న వ్యంగ్యం ఇందులో ధ్వనిస్తున్నది. అంతేకాక నరనారాయణుల బాంధవ్యం ఉపలక్షిత మవుతున్నది.

దీనిలో చివర చేర్చిన సంస్కృత శ్లోకాలకు రచయితే తాత్పర్యం వ్రాసి ప్రచురించవలసిన అవసరం లేదేమో! ఇది సుధాకర రావు గారి రచన కనుక భక్తి పారవశ్యము ఉన్నంతగా అనుభూతి సాంద్రత లేకపోవడం సహజమే. సాహిత్య వ్యాసంగంలో అది క్రమంగా అబ్బవలసిన లక్షణం. సుధాకరరావుగారు అట్లాంటి ఉత్తమ కావ్యాలు రచించి సాహితీప్రియులకు విందుచేకూర్చాలని ఆశిద్దాం.

— పేర్వారం జగన్నాథం



# శ్రీవేంకటేశ్వర విభో తవ సుప్రభాతం

శ్రీవేంకటాద్రిలహరీ కమలాయమానం
సప్తాచలోత్పల పుటీ మధుపాయమానమ్,
శ్రీశైలపూర్ణశశిలక్ష్మ యదంఘ్రియుగ్మం
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

శ్రీ వేంకటాద్రితరంగముగా, కలువ రేకుగా, పూర్ణచంద్రునిగా, అందు వరుసగా ఎవని పదములు పద్మములుగా, భ్రమరములుగా, అంకముగా నున్నవో అట్టి శ్రీ వేంకటేశ్వరవిభూ, నీకు సుప్రభాతము (ప్రతి పద్యమున 15 వరకు. మకుటము) (చివరి చరణమునకు ఇదే అర్థము.)

వేంకార ఆదిరుచిత స్తవ నామ్ని యద్వ
దోంకార ఉల్లసతి వేదచతుష్టయాదౌ,
వేమూరి వంశభవ సన్నుత పుణ్య కీర్తే
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

నాల్గు వేదముల ఆరంభమున నున్న ఓంకారము మంగళకరమైనట్లే వేంకటేశ్వర నామమున వేంకారమును (దేవతావాచకము లన్నియు శుభములే). ఆ నామము వేద తుల్యము. వేమూరి వంశభవుడు ఆంజనేయ శర్మ స్తుతికర్త. ఈ స్తుతియు వంశము వేణువు వలె మధురము అని భావము.

కష్టార్తి నాశన, సదాత్మ పదాశ్రితానాం
కారుణ్యసాగర, భవానలపీడితానామ్,
కాదంబినీనిచయ, యోగికలాపినాం చ
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

ఆత్మ శబ్దమునకు నిజపాదమని ఆత్మయే స్థానమని యర్థము. బ్రహ్మమే తానైన పాదము, అట్టి నీ పాదముల నాశ్రయించిన వారికష్టములను ఆర్తులను పోగొట్టువాడవు, సంసారాగ్ని పీడితులకు దయాసాగరుడవు. యోగిమయూరములకు మేఘమాలాసమూహమవు. (యోగశాస్త్రమున ధర్మ మేఘమను సమాధియు జెప్పబడినది. 4-28)

టంకార ఏవ ధనుష స్తవనామ పాప్మ
సంఘాత దుష్టమృగసంభవలాయనాయ,
పాపం భవాన్ కటతి సార్థక నామధేయ
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

వింటి శబ్దమునకు క్రూరమృగములు పారిపోవునట్లు, నీ నామకీర్తనముచే కామ క్రోధాది పాపములు మాయమగును. కటీ తతౌ అను ధాతువు వలన వేంకటశబ్దము పాపనివారణార్థకము (కామ ఏష క్రోధ ఏష, గీత. ౩. 37.)

ప్రణవో ధను శ్శరోహ్యాత్మా
– ముండకోపనిషత్తు

టంకార స్తవ ధనుషో దళయతిహృదయం
ద్విషాం. శంకరవర్ణమాలాస్తుతి.

ఈశోఽఖిలస్య జగతో హృదయస్య జంతో
స్త్వం ప్రచోదయసి యంత్రవదేవ దేవ,
బ్రహ్మాస్మి తత్త్వమసి వాక్యగతైకభావ
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

జగములకు ప్రాణి హృదయములకు నీ వీశ్వరుడవు. వానిని యంత్రమువలె నడుపుచుందువు. అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి అను బృహదారణ్యక ఛాందోగ్య వేదాంత వాక్యబోధితమైన ఐక్యమే, నీ స్వరూపము.

శ్వస్థ్సాయినో జగతి శబ్దరసాదిమాత్రా
స్పర్శాః సుఖాసుఖమయీః పరచిద్వివర్తాః,
అభ్రాంత శుద్ధచితిరూప, విరూప నిత్య
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్,



శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, ఈ ఇంద్రియార్థములు, వాని యనుభవములు సుఖదుఃఖ జనకములై పరమాత్మ చైతన్యమున (బుడగవలె) [illegible] ములై యున్నవి. అనగా మిథ్యలు. [illegible] నిత్యుడవు. నానా రూపుడవు. భ్రాంతి రహితమైన శుద్ధ చైతన్య స్వరూపుడవు. (ఇంద్రియజ్ఞానములు భ్రాంతి రూపములైనను తదధిష్ఠాన చైతన్యము పరమార్థమని అద్వైతవేదాంత సంప్రదాయము.)

రజ్జూరగ ప్రతినిభే సకలే ప్రపంచే
మోహాది బాలిశధియా మవకల్పమానే,
జ్ఞానాంశుభిర్మనసి, జాగృహి భగ్నమాయే
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

రజ్జువును జూచి సర్పమని భ్రమించినట్లే ఈ ప్రపంచము సర్వము మిథ్య అనగా పరమార్థ సత్యముగాదు. కాని ఇది ప్రాకృత బుద్ధులకు మోహజనకమై యున్నది. జ్ఞాన కిరణములతో ఈ మాయా మోహమును బోగొట్టి మా మనస్సులలో మేల్కొనుము. (ఇదియే సుప్రభాత స్తోత్రముల కన్నిటికి తాత్పర్యము.)

విశ్వంభరా హృదయసమ్మిత భారతేఽస్మిన్
ఆంధ్రోర్వరా సుకృతరాశితయా సిరావేః,
తత్కీర్తి సౌరభతతిం ప్రథయన్ జగత్సు
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

భారతవర్షము భూమిపైగల ఆధ్యాత్మిక సాధన కేంద్రము. అందు ఆంధ్రదేశ పుణ్యరాశిగా నీవు వెలసినావు. (నిన్ను దర్శింపవచ్చు వారిద్వారా) ఈ దేశకీర్తిని పరిమళమువలె లోకమంతా వ్యాపింప జేసెదవు. ఉర్వర యన సస్యసంపన్న ప్రదేశము. అందు నోముల పంట నీవు, (భాగవతము పంచమస్కంధము. భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు నీ భారత వర్షమందు హరిపల్కులు పుట్టుచు జీవకోటికిం, ధీరతతోడ తత్త్వముపదేశము చేయుచుం జెల్మిసేయుచున్, అరయ బాంధవాకృతి గృతార్థుల జేయుచునుందువెంతయున్.)

భోగం చ యోగ మిహ పాదమాశ్రితేభ్యో
యచ్ఛన్ క్రమేణ దయసే పరమం పుమర్థమ్,
సంతార్య సంసృతి నదీమివ జానుదఘ్నీం
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

నీ పాదముల నాశ్రయించిన వారికి జన్మలో భుక్తిని, భక్తి మొదలగు సాధనముల ననుగ్రహించెదవు. మోకాటిలోతుగా సంసారనదిని దాటింతువు. క్రమముగా పరమ పురుషార్థమైన మోక్షమును కరుణించెదవు.

తత్త్వం విదుర్న విబుధా అపి తత్త్వతస్తే
త్వం బ్రహ్మణోగుణలవస్య పరా ప్రతిష్ఠా,
నేతీతి వాక్యవిదితోఽపి చ సర్వగంధః
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

దేవతలు గూడ నీ స్వరూపము నున్నదున్నట్లు తెలియలేరు. నీవునిర్గుణబ్రహ్మమునకు ప్రతిష్ఠవు, ప్రతిమవు. అనగా తదభిన్నముగా తెలియబడు ప్రత్యగాత్మవు, (గీత. 14. 27, శంకరభాష్యము, శ్రీధర) స ఏష నేతినేత్యాత్మా, సర్వగంధః, సర్వరసః అను శ్రుతివాక్యములలో నీవు సర్వరూపుడవు, కేవలుడవు అని తెలియుచున్నది. అందువలన తత్త్వజ్ఞానము దుష్కరమనుట.

వర్ణప్రకర్ష పరిధాన సువర్ణహార
కోటీర చారుసుమనోగణ మాలికాభిః,
వ్యక్తీకరోషి జగతాం నిజసంశ్రితత్వం
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

నీవు ధరించిన ప్రశస్తమైన రంగులుగల పీతాంబర, కాంచన, మణిహార, కిరీట, పుష్పమాలికలతో జగములకన్నిటికి (భూత తన్మాత్రలకు) నీవే ఆధారమని తెలుపుచున్నావు. (విష్ణు సహస్రనామ శాంకర భాష్యం. 36 సగ్వీ)

సుస్వాదు తీర్థ విమలః పరిముండితోఽపి
భక్తో భవంత మభివీక్ష్య జహాతి ఖేదమ్,
జ్ఞానోదయేన ఖలు క్షమో ఇతి ప్రదేష్టా
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

జుట్టు తీయించుకొని మంచినీట కోనేటిలో స్నానము చేసియు భక్తుడు నీ దర్శనానంతరము కేశములు వీడుచున్నాడు. దీనిద్వారా జ్ఞానోదయానంతరమే (కర్మలుచేసియు) మోక్షమని తెలియజెప్పుచున్నాడు.

ప్రస్థాన సంపదుపమర్ద దివాతి పాత
క్లేశాన్ బహూన్ విషహతే తవ దర్శనార్థీ,
జీవో యథా భవసహస్రగణాన్ ముముక్షుః
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

ప్రయాణశ్రమ జనసంమర్దము రోజుల కొలది గడుపుట (వేచియుండుట) వంటి అనేక క్లేశములను నీ దర్శనము కోరిభరించుచున్నారు జనులు. మోక్షముగోరు జీవులును ఇట్లే జననమరణ సహస్రములు భరించుచున్నారు.

భావే స్మరన్ సపది కృచ్ఛ్రగతో నరస్త్వాం
రూప్యం కిమప్యుపనిధీయతి వస్త్ర ఖండే,
తన్మూన మాత్మవిని వేదనమగ్రతస్తే
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

కష్టములు గలిగినపుడు నరుడు వెంటనే నిన్ను తలచుకొని రూప్యములనుకొన్ని వస్త్ర ఖండములతో ముడుపు గట్టుచున్నాడు. ఇది నిజముగా నీ యెదుటచేయు ఆత్మార్పణమే.

తంత్రాగమోక్త సముపాసన నైష్ఠికాత్మా
రమ్యాణి నిర్ఝర వనాన్యవలోకతో వా,
త్వామాస్తికో భజతి నిష్ఠుర నాస్తి కశ్చ
శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్.

శాస్త్ర ప్రకారము నిన్ను ఆరాధించునట్టి ఆస్తికులు, ప్రకృతి సౌందర్యము మాత్రమే తిలకింపవచ్చు నట్టి నాస్తికులు రెండు తెగలవారు నిన్ను భజించుచున్నారు. ఇదియే నీ ఆకర్షణ శక్తి.

శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాత
మిత్యక్షర క్రమ సమాదర బద్ధభావాః,
అద్వైత తత్త్వకలనే చ కృతప్రయత్నా
సర్వేశ్వరస్తుతిరియం ఫలదా సదా స్యాత్.

ఈ స్తోత్రమున భావ రచన శ్రీ వేంకటేశ్వర విభో తవ సుప్రభాతమ్, అను వాక్యమందలి అక్షరక్రమము ననుసరించి చేయబడినది. అద్వైతమత విషయము అచ్చటచ్చట చెప్పబడినది. దేవదేవుని స్తుతి భక్తులకు ఎల్లప్పుడు అభీష్టములనొసగు గాక!

— డా॥ వేమూరి ఆంజనేయశర్మ



# తమసోమా జ్యోతిర్గమయ

పండుగలు ప్రతిమతంలోనూ ఉన్నాయి కాని మన హిందూమతంలో వున్నన్ని పండుగలు ఏ ఇతర మతములలో లేవనుటలో ఎట్టి సందేహం లేదు. ఇవి చాల పాతకాలం నుండి జరుపబడుతున్నట్లు వీనికి అనేక కారణము లున్నట్లు తెలుస్తోంది. చిన్న పెద్ద మొదలైన అనేక పండుగలకు మన భారతీయ సంప్రదాయం పుట్టినిల్లు.

ఈ పండుగలు జరుపడానికి ఇతర కారణాలు ఎన్నో వున్నప్పటికీ ప్రధానోద్దేశం మానవులు ఆ యా సందర్భములలో తమ కష్టములను మరచి తమ బంధుమిత్రులతో కుటుంబ పభ్యులతో ఆనందోత్సాహాలతో గడుపుట, మరియు దేవతారాధన జరిపి, శారీరకానందమునకై అలంకరణచేసికొని, పవిత్ర ఆత్మను రుచికరమైన విందుతో సంతృప్తి పరచుట కొరకని చెప్పవచ్చును.

ఆశ్వయుజ బహుళ త్రయోదశి నుండి కార్తీక శుద్ధ ద్వితీయ వరకు ఐదుదినములు దీపావళి పండుగ జరుపబడును. ఆశ్వయుజ మాసమున వచ్చు దీపావళి పుణ్యప్రదమైన పండుగ. నరకచతుర్దశి తరువాత దినమే దీపావళి. దీపావళీ అమావాస్యనాడు అంతటయు చీకటి వుండుట వలన ఎల్లెడల దీప పంక్తులుంచు అవసర మేర్పడినది. ప్రకృతి యావత్తు అంధకారమైన కారణమున హైందవులు "దీపావళి" యని; దీపోత్సవాన్ని జరుపుతారు. ఈ పండుగను "దీపాల పండుగ" "దివ్వెల పండుగ" "దివిటీ పండుగ" అని తెలుగుదేశంలో అంటారు.

దీపావళి ఆబాలగోపాలమునకు అన్ని మతములకు అన్ని దేశములకు అతి ప్రధానమైన పండుగ యనుటలో నెట్టి సందేహము లేదు.

ఉత్తర భారతదేశంలో ఈ పండుగ ఐదు రోజులు జరుపబడును. 1.ఆశ్వయుజ బహుళ త్రయోదశి, "ధన్" త్రయోదశి 2. నరక చతుర్దశి 3. ఆశ్వయుజ బహుళ అమావాస్య దీపావళి 4. బలి పాడ్యమి 5. భ్రాతృ ద్వితీయ లేక యమ ద్వితీయ. కాని దక్షిణ భారత దేశంలో దీపావళి మూడునాళ్ళ ముచ్చటయినపండుగ.

**1. నరక చతుర్దశి 2. దీపావళి అమావాస్య 3. బలిపాడ్యమి**

ఈ మహాపర్వదినం వెనుక అనేక పురాణ గాథలు ప్రచారంలో కలవు. ఈనాడే బలిచక్రవర్తిని బంధించి పాతాళమునకు వామనుడు పంపెనట. నరకాసురుడిని, సత్యభామ, కృష్ణుని వెంట వెళ్ళి వధించి ద్వారకా నగరమునకు వెళ్ళినది నేడే. ద్వారకలో గోపికలు దీపాలు వెలిగించి కృష్ణునికి హారతులిస్తూ, స్వాగతం పలికారట కనుక మనము కూడా ఈ ఆచారమునే పాటిస్తున్నాము. వ్రత గ్రంథములయందును, పురాణములయందు ఈ పండుగ జరుపుకునే పద్ధతులు ఇట్లు వివరింపబడియున్నది.

ఉత్తర భారత దేశమువారు మొదటి రోజు అనగా ఆశ్వయుజ బహుళ త్రయోదశినాటి రాత్రి అపమృత్యు నివారణార్థము మరియు యముని కృపను సంపాదించడానికి ఇంటి వెలుపలకై లదీపములు పెట్టడం, బాణాసంచా కాల్చడం కలదు. దీన్ని "నిధన్" లేక యమ దీపం అని కూడా అంటారు. ఈ రోజు తర్పణాలు విడవడం కూడా ఓ ఆచారంగా ఉంది. రెండవరోజున నరకభయ నివారణార్థం తెల్లవారుజాముననే అభ్యంగన మంగళ స్నానము చేసి యమునికి తర్పణం చేసి నాలుగువత్తుల దీపం వెలిగిస్తారు. నరక చతుర్దశినాటి నూనెయందు "లక్ష్మి" నీటియందు "గంగ" ఆవేశించి యుందురని పద్మపురాణం చెప్పుచున్నది. మూడవరోజు అమావాస్య. దీపావళి తెల్లవారు జాముననే మంగళస్నానం చేసి, దరిద్ర దేవతా నివారణార్థం లక్ష్మి పూజ కావించి, దేవ పితృ పూజలు కూడ యొనరింపవలెను. "అలక్ష్మి" పరిహారార్థము చీకట్లను తరిమివేయుటకు ఎచ్చట చూచినను దీపములు బారులు తీర్చియుండును. రంగు రంగు దీప పంక్తులతో మేడలమీద, అరుగులమీద కళాకాంతులుట్టిపడుచుండును. ఈనాడు దీపదానములు చేయువారికి దారిద్ర్యబాధలు తొలగి సిరి సంపత్తి కలుగుతుంది. వెండి దీపములు గాని, లోహములలో ఏ లోహమునైనను దీపదానమునకు పూనుకొనుటవలన తిండికి బట్టకు కొదువలేక పోవుటేకాక అభీష్టఫలము



లును సిద్ధించును. ఈనాడు ప్రజలు శ్రద్ధ సోపేత భోజనములతో నూతన వస్త్రాభరణములతో పరస్పర తాంబూల ప్రదానములతో సంతోషముగా నుందురు. సాయంత్రము దీపాలు పెట్టుదురు. రకరకాల టపాకాయలు కాలుస్తూ అర్ధరాత్రివేళ స్త్రీలు చాటలు, తప్పెటలూ వాయిస్తూ సంబరములతో "జ్యేష్ఠాదేవి - పెద్దక్క" (అలక్ష్మి)ని దారిద్ర్యాన్ని ఇంటి ముంగిళ్ళనుండి తరిమివేయుదురు.

నాల్గవరోజు "బలి పాడ్యమి" బలి చక్రవర్తి పూజ చేయవలెను. ఈనాడు జూదమున గెల్చినవారు ఆ సంవత్సరమంతయు విజయమును పొందుచుందురని ప్రజలయందొక నమ్మకము గలదు. నేపాలు దేశమున ఈ రోజు జూదములు మిక్కుటము. చదరంగమునం దీ దినము పార్వతి శివుని జయించినదట. ఈ రోజు ఉదయమున బలి పూజనము, మరియు అన్నముతోగాని, పేడతోగాని గోవర్ధనగిరిని నిర్మించి శ్రీకృష్ణ ప్రీత్యర్థము పూజచేయవలెను. ఐదవరోజు ద్వితీయనాడు యమునిని, చిత్రగుప్తుని పూజించాలి. అలాగే "భగినీ" హస్త భోజనము ధర్మశాస్త్రములు చెప్పిన విధంగా చెల్లెలు చేతి కూడు తినుట వలన కుటుంబమంతయు పరంపరాభివృద్ధి కలిగియుండు నంటారు. ఈనాడే యమునాదేవి తన సోదరుడగు యమునికి విందు చేసినదట దీనినే "భ్రాతృద్వితీయ" అని భగినీ హస్తభోజనం అని ఉత్తర భారతదేశంలో "భయ్యాదూజ్" అని పిలుస్తారు. కొన్ని ప్రాంతములలో ఈ రోజు స్త్రీలు "తిలక" ఉత్సవాన్ని జరుపుతారు. ఈ రోజున సోదరునకు తిలకం దిద్దితే యముడు ఆ సోదరునికి దూరంగా తొలగి పోతాడని, అతని ఆయువు పెరుగుతుందనీ మన వారి విశ్వాసం.

ఇక మన తెలుగువారికి నరక చతుర్దశి, దీపావళి అమావాస్య రెండు ముఖ్యమైన రోజులు. అందులో దీపావళి మరీ ముఖ్యం. ఈ రెండు దినములందును విశేషముగా పండుగలు చేసికొనుచుందురు.

దీపావళినాడు "లక్ష్మీ" పూజ చేసి, సాయంత్రము కొత్తబట్టలు కట్టుకుని, తులసి ముందు దీపాలుంచి తరువాత ఇల్లంతా దీపాలు పెడతారు. దీప తోరణాలతో గృహాలను అలంకరిస్తారు. పిల్లలు పెద్దలు టపాకాయలు, బాణసంచాలు వేడుకగాకాలుస్తారు. దీపములు వెలిగించుట, కూతుండ్రను, అల్లుండ్రను పిలచి నూతన వస్త్రాదులు బహూకరించుట మున్నగు ఆచారములు వాడుకలోనున్నవి.

దీపావళి వర్తకులకు గొప్ప పండుగ. వ్యాపార లెక్కలన్నీ చూచుకొని లాభనష్టాలను తేల్చుకుంటారు. ఈ రోజు బంగారు వెండి నాణెములు రూపాయలు కుప్పగా పోసి, లక్ష్మీపూజ చేస్తారు. క్రొత్త ఖాతా పుస్తకములను కూడ ప్రారంభింతురు.

దీపావళి ఉత్సవాలను 'కౌముదీ' ఉత్సవాలని కూడ అంటారు. సమస్త భారతీయులు దీపాన్ని చైతన్యానికి ప్రతిరూపంగా భావిస్తారు. ఈనాటి దీపప్రకాశం సహస్ర సూర్యుల కాంతిని మించినదని కీర్తించారు.

బెంగాలులో ఈ దినము కాళీమాత పూజ జరుపబడును. ఈ రోజుననే ఆమె లక్ష్మీ, సరస్వతీ స్వరూపిణీ యని వారి విశ్వాసం.

గుజరాతీయులకు మరియు మార్వాడీలకు ఈ రోజు అతి ప్రధానమైనది. జమా ఖర్చులు తేల్చి క్రొత్త ఖాతా పుస్తకములను ఈ దినమే ప్రారంభించుదురు. వారికిది ఆర్థిక సంవత్సరము. ఉత్తరప్రదేశ్ బీహారు రాష్ట్రములలోని మారుమూల గ్రామములలో నేడు గోవర్ధనగిరిని నిర్మించి పూజించుట కలదు. ఉత్తరప్రదేశ్‌లో శ్రీరాముడు రావణుని జయించి తిరిగి అయోధ్యకు విచ్చేసిన సందర్భమునకు సూచకముగ 'భరత్ మిలాప్' అను పండుగ జరుపబడుచుండును. పంజాబీలో సిక్కులకిది మిక్కిలి ఆనందము నొసంగు పర్వదినము. దీపావళినాడు అమృతసర్‌లోని స్వర్ణమందిర నిర్మాణమునకు శంకుస్థాపన మొనరించినారట. ఆ సందర్భమున వారు దీపావళిని వైభవంగా జరుపుకొందురు. పంజాబీలకు లక్ష్మీ పూజముఖ్యమైన దీపావళి లక్ష్మీదేవిని రాత్రి పూజింతురు. రాజస్థాన్‌లో ఈ పండుగ వర్ధమాన మహావీరుడి నిర్యాణ దినమును జరుపుకొందురు. తమిళనాడులో నరకాసురవధగా కొందరు, వామన విజయముగా మరి కొందరు ఈ పండుగను జరుపుకొందురు. ఇచ్చట చాలమంది పాడ్యమి నాడు కేదార గౌరీవ్రతము చేయుదురు.

ఈజిప్టు, గ్రీస్, ఇటలీ, జపాన్, మలేషియా, బర్మా, చైనా, ఇండోనేషియా, అమెరికా మున్నగు విదేశములందు కూడ దీపావళి పండుగ వివిధ పద్ధతులలో జరుపుకొనబడుచున్నది.

ఇట్లు జాతిమత ప్రాంత విభేదములు లేక సమస్త ప్రజావళిచే మహోత్సవముగ చేసికొనబడుచున్న ఈ దీపావళి భారతీయుల సంస్కృతీ సంప్రదాయాలకు చిహ్నము.

ఈ దీపావళి జాతీయ మహోత్సవములలో అగ్రశ్రేణికి చెందిన పెద్దపండుగ. అందుచే మన దేశమందలి ప్రతివారికి ఆనందమును జయమును ప్రసాదించుచున్నది. ఇది అలంకరణకు ఆనందానికే కాకుండా చైతన్యానికి ప్రతిరూపంగా భావించబడును.

ప్రతిసంవత్సరము సంబరముగా జరుపుతున్న దీపావళిని గురించి మన రాష్ట్ర ఆస్థానకవి శ్రీమాన్ దాశరథిగారు ఇలా వ్రాశారు.

"కోటి కోటి దీపాలను
బాటలలో కోటలలో
నాటండి ప్రజల్లారా
వేటాడండి తమస్సును
భూపావళి బుగ్గి చేసి
కోపావళి నగ్గి ద్రోసి
దీపావళి జరపండో
దేశదేశ జనులారా!"
తమసో మా జ్యోతిర్గమయ

—శ్రీ జి. ఆర్. వరపయ్య

సర్వధర్మములకు ఆకరమైన కర్మక్షేత్రము భరతభూమి. "వేదోఽఖిలో ధర్మమూలమ్" అను సూక్తివలన ఇది ధర్మక్షేత్రమగు వేద భూమిగూడ. వేదములలో ఉల్లేఖింపబడిన సర్వములలో అగ్నిపూజకు అత్యధిక ప్రాధాన్య మీయబడినది. అగ్నికి యజ్ఞేశ్వరుడని, హవ్యవాహనుడని, హుతవహుడని, హోత యని, పురోహితుడని, రత్నధాత యని పర్యాయ పదములు. ఋగ్వేద ప్రథమ సూక్తములోగల తొమ్మిది ఋక్కులు అగ్నిప్రాశస్త్యమును వివరించుచున్నవి. వీనిలోని ప్రథమ ఋక్కు అత్యంత విశిష్టమైనది. భారత, భాగవత, రామాయణ గాథలు రేఖామాత్రముగ ఇందు సూచితములు.

భక్తవత్సలుడగు నృసింహస్వామి హిరణ్యకశిపుని వధానంతరము పరమ భాగవతోత్తముడగు ప్రహ్లాదునితో, "ఓ భక్తా! నా కొరకై యెన్ని యిడుములు గుడిచితివి" యని అనునయించగా ప్రహ్లాదుడు

జలే విష్ణుః స్థలే విష్ణుః
విష్ణుః పర్వతమస్తకే,
జ్వాలామాలాకులే విష్ణుః
సర్వం విష్ణుమయం జగత్.

"ఓ సర్వాంతర్యామీ! నీవు నీటియందును, భూమియందును, పర్వతాగ్రముల యందును, అగ్నియందును, జగత్తునందెల్లెడలను గలవు. నీకు తెలియని దేమున్నది" యనెను.

రగిలి, యాతని జంపి, అతని నోటినుండియే వెలికివచ్చి గోపకులను, నందుని సంభ్రమాశ్చర్య చకితుల గావించెను.

ఈ కథలను వేదఋక్కుతో సమన్వయించినట్లైతే, అగ్నియొక్క సర్వవ్యాపకత్వము, భగవంతునిలో అంతర్భూతమైన తేజస్సు భక్తుల కోర్కెలను తీర్చునను విషయము, దుష్టులను, వారి యహంకారమును సమయించునను విషయము, విదితమగుచున్నది. భగవంతునివలెనే ఆయన అంశమగు అగ్నియు భక్తుల కోర్కెలను తీర్చునని భావము. భక్తుడగు ప్రహ్లాదుని, ఆర్తులగు గోపకులను రక్షించుటకు హిరణ్యకశిపుని, కంసుని పనుపున వచ్చిన రక్కసులను తుదకు కంసుని సంహరించుటయే కథలలోని ఇతివృత్తము.




అగ్ని మీళే పురోహితమ్
యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారమ్ రత్నధాతమమ్

- ఋ. వే. 1-1-1.

పురోహితునివలె యజ్ఞమును నడిపించువాడును, హవిర్భాగస్వీకరణకై దేవతలను పిలుచుకొని వచ్చువాడును, ఋత్విజుడై రత్నములను అనగా యజ్ఞ ఫలములను ధరించువాడును అగు అగ్నిని స్తుతించుచున్నానని సూక్ష్మముగ మంత్రార్థము.

రాజుయొక్క కోర్కెలను పురోహితుడెట్లు యజ్ఞఫలము నిచ్చుటద్వారా తీర్చుచున్నాడో, అట్లే దేవతలకు యజ్ఞ హవిస్సు నిచ్చి వారి కోర్కెలను పురోహితునివలె తీర్చుచున్నాడని అన్వయము.

అగ్ని వర్ధాహకం స్తౌతి
కృష్ణమగ్ని మితిశ్రుతయః
హినస్తి దాంభినం దేవ
స్తస్మై దంభో న రోచతే.

శ్రీకృష్ణుడు అహంకారమును సహించడు. ఎక్కడైతే యెవరు ప్రగల్భములు పలుకుదురో, అచ్చట కృష్ణభగవానుడు అగ్నివలె ప్రజ్వరిల్లి యహంకారమును, ప్రగల్భములను అంతమొందించునని యర్థము.

ప్రగల్భాహంకారముల ప్రోదిచేసికొన్న కంసుని పనుపున వచ్చిన వత్సాసురుని వధించెను. విషస్తన్యము నిచ్చి తనను జంపవచ్చిన పూతనను పుడమార్చెను. కృష్ణుని మ్రింగవచ్చిన కాకాసురుని సున్నిత శరీర భాగమున ప్రవేశించి, అగ్నివలె

అగ్నిం వై పూజయేద్ భక్త్యా
నరో రత్నాభిలాషుకః,
ఛందోముఖే మధుచ్ఛందా
అథస్తే రత్నధామమ్.

రత్నములు మున్నగు విలువగల సంపదల నాశించు మానవుడు తప్పక అగ్నిని పూర్ణ భక్తితో పూజించవలెను. ఈ కారణముచేతనే వేదములు ఆదియందే మధుచ్ఛందసుడు అగ్నిహోత్రుని పొగడెను.

శ్వేతకి యను రాజర్షి ఆజ్యాది హోమద్రవ్యములచే అవిచ్ఛిన్నముగ పెక్కేండ్లు యాగముచేయ, అగ్నికి అజీర్ణవ్యాధి సంభవించెను. వ్యాధి నివారణార్థము ఇంద్ర రక్షితమగు ఖాండవ వనమును దహించుటలో తనకు సహాయపడుమని కృష్ణు నర్థించెను. ఆయన యాదేశము

మేరకు అగ్ని అర్జునునకు దేవరథము, గాండీవము, తూణీరము సమర్పించెను. కృష్ణార్జునుల సహాయమున అగ్ని ఖాండవ మును దహించి తన వ్యాధి నివారణ గావించుకొనెను.

రత్నములాదిగాగల అమూల్యసంపదను పొందుటకు శ్వేతకి అగ్నిని పూర్ణ భక్తితో యజ్ఞముద్వారా పూజించెనని తెలుపు ఈ భారతకథ వేదబుక్కులో అంతర్గర్భితముగ నున్నదని చెప్పబడినది.

శివమ్ సత్ అనుతాం రామో
యస్య దూతం మహాబలమ్,
స్తౌతి వాయుసుతం విర
మగ్నిమీళ ఇతి శ్రుతః.

పర్వులను ఆశీర్వదించువాడు రాముడు. ఆయన దూత హనుమంతుడు. ఈయన అత్యంత శక్తి సమన్వితుడేగాక, ధైర్య సాహసములలో మణిప్రాయుడు. అట్టి హనుమంతుని స్తుతింతును అని యర్థము. ఈ శ్లోకము లోని విశేషమేమనగా రాముడు సూటిగా హనుమంతుని పొగడక 'అగ్నిమీళే' యని అగ్నిని పొగడినట్లు భావించి హనుమంతుని పొగడుట.

"మొట్ట మొదట చెలిమికై శ్రీరాముని యొద్దకు సుగ్రీవునిచే పంపబడిన పదా విజయుడు. లంకలో ప్రవేశించి, రాక్షసుల భయభ్రాంతుల గావించి, యుద్ధమునకై సవాలుజేసి, తన గుర్తింపు కొరకు అంగుళీ యకమును సీతకు జూపి, పిదప దాని నామె కిచ్చిన వాయుపుత్రుడగు హనుమంతుని నేను పొగడుచున్నాను" అని వేదములో చెప్పబడినది. ఇదియునుగాక అగ్ని వాయుపుత్రుడని స్మృతులు చెప్పుచున్నవి. వీనిని బట్టి హనుమంతుడే అగ్నియని విశద మగుచున్నది. ఆపదలోనున్న రాముడు తన స్నేహము నర్థించగా అగ్నియే సీత యొక్క క్షేమ వృత్తాంతమును రామునకు తెలిపెనని అన్వయము.

అగ్ని తన్నాశ్రయించిన వారిని యాదు కొని, ఊరట కలిగించివను భావ గర్భిత మైన రామకథ ప్రథమ బుక్కులో నున్నట్లు అవగతమగు చున్నది.

నీరు, అగ్ని, హృదయము, సూర్యుడు, యజ్ఞస్థలము, ప్రతిమలలో భగవంతు డున్నట్లు వేదములలో నిర్ధారణ చేయబడి నది. వివిధ భక్తులకు వివిధ స్థానములలో భగవంతుడు గలడని క్రింది శ్లోకము తెలుపు చున్నది.

అగ్నౌ క్రియావతాం దేవో
దివి దేవో మనీషిణాం,
ప్రతిమాస్వల్పబుద్ధీనాం
యోగినాం హృదయే హరిః.

వేదవిదులకు అగ్నిలోను, చదువుకొన్న వారికి సూర్యునిలోను, అల్పబుద్ధి గల వారికి ప్రతిమలలోను, సర్వసంగ పరిత్యా గులకు హృదయములోను హరి గలడు.

సృష్ట్యాది నుండియు వర్ణాశ్రమాచార ములు ఆచరణలో నున్నంతదనుక భావార్థ ముల తెలిసికొని అగ్ని పూజాదులు చేయు చుండిరి. కాలానుగుణముగ వచ్చిన మార్పుల ననుసరించి, క్రమబద్ధముగా తెలిసి పూజల జేయనప్పటికిని నామ మాత్రపు దీపారాధనలు నేటికిని జరుగు చునే యున్నవి. ఇదియు అగ్నిపూజయే. సనాతనాచారపరులగు నైష్ఠికులు నిత్యకర్మ పేర అగ్నికార్యము లేక అగ్ని పూజ చేయుట గమనించవచ్చును. సూర్య నమ స్కారముల పేర సూర్యు నారాధించుటయు జరుగుచున్నది. శుభాశుభ కార్యముల నుప క్రమించుటకు ముందు దీపారాధన పేర అగ్నిని పూజించుట క్రొత్తగాదు. వేదోక్త మంత్రపఠనము జరుగుచుండ నూతన వధూవరులు అగ్నికుండమునకు ప్రదక్షి ణము చేయు ఆచారము సంప్రదాయ సిద్ధమైనదే. యజ్ఞ యాగాది క్రతువులు జేయు కాలమున అగ్నిని పూజింతురను విషయమును గురించి చెప్పనక్కరలేదు. విదేశీయులు గూడ అగ్ని నే విధముగ ఆరాధించు చున్నారను విషయము నిందు పొందుపరచలేదు.

భౌతికవాదపు దృక్కోణములో చూచి నపుడు చేతన ప్రపంచమునకు అగ్ని యెట్లు పయోగపడు చున్నదో పరికింతము. జలము వలన యేర్పడిన అగ్నియే విద్యు త్తుగా మారి మానవ జీవితావసరముల కెట్లు పయోగపడుచున్నదో తెలియనివారు లేరు. అగ్ని అనగా వేడి శరీరాంతర్గత మగుట వల్లనే మనము జీవించుచున్నాము. వేడి కోల్పోయిన శరీరము శవమే గదా? ఇట్టి స్థితియే పశు పక్ష్యాదులకు, వృక్షములకు వర్తించును. కృత్రిమ వేడివలన జీవమును కొంతవరకు మాత్రమే నిలుపవచ్చును. కాని శాశ్వతముగ మాత్రము కాదనుట ఆధునిక శాస్త్ర పరిజ్ఞానము నెరిగినవారు గూడ అంగీకరింతురు. వేడి వలననే నీరు ఆవిరిగ మారి, చల్లబడి, వర్షించి జీవనా ధారమగు ధాన్యాదుల నిచ్చుచున్నది. సమస్త ప్రాణికోటియొక్క ఉత్పత్తికి, మనుగడకు హేతుభూతమైన వేడి సూర్యుని వలనను, చల్లదనము సూర్యుని వలన చంద్రుని ద్వారాను కలుగుటను కాదన గలమా? అత్యాధునిక రాకెట్ల నడుపునది, అణువిచ్ఛేదము చేయునది అగ్నికి ప్రతి రూపమగు వేడియే గదా? హవిర్భోక్తలు యజ్ఞఫలముగ ఇచ్చిన పాయసమును అగ్ని దశరథున కర్పించినట్లు తెలియ జేయు ఘట్టములను విశ్వసించనివారు కొందరుండవచ్చును. కాని వారు గూడ పైనుదాహరించిన వానిని మాత్రము కాదనలేరు. ఇతరులు ఏ కొద్దిపాటి సహా యమో చేసినపుడు వారికి మనము కృతజ్ఞత తెలుపుదుము సభ్యప్రపంచములో. అగ్ని వలననే మన పుట్టుక, మనుగడ జరుగు చున్నపుడు కృతజ్ఞతా సూచకముగ అగ్నిని పూజించుట కనీసధర్మం కాదా? అగ్ని హోత్రుడు దైవమని చాటువేద వాఙ్మయము భారతీయ సంస్కృతి అజరామరము.

— శ్రీ వి. సుబ్బరాయుడు



## మహాసంప్రోక్షణ

తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి
ర్భాలయ విమానానికి, బలిపీఠానికి
ంగారుతొడుగు ఏర్పరచిన సందర్భంగా
. తి. దేవస్థానంవారు, సెప్టెంబరు 5నుండి
వరకు మూడురోజులపాటు మహాసంప్రో
ణను అత్యంతవైభవంగా నిర్వహించారు.
మొదటిరోజు హోమం, రెండవరోజు అంకు
ర్పణ, మూడవరోజు మహాసంప్రోక్షణ
ార్యక్రమాలు వేదఘోషలమధ్య శాస్త్రో
ంగా జరుపబడ్డాయి. చివరగా వేదపండి
ులు పవిత్రజలంతో ఆలయవిమానాన్ని,
లిపీఠాన్ని అభిషేకించారు. బంగారు
ొడుగుకు దాదాపు 65 లక్షలరూపాయల
ిలువగల 35 కిలోల మేలిమి బంగారం 15
ుందలకిలోలరాగి ఉపయోగింపబడింది. ఈ
ుత్సవానికి రాష్ట్ర రెవిన్యూశాఖ ప్రధాన
ార్యదర్శి శ్రీ బి. ఎస్. జయసింహ హాజ
య్యారు. వేలాదిభక్తులు ఈ ప్రత్యేకోత్స
ాన్ని తిలకించారు.



## శ్రీ చైతన్య జయంతి

ఈ సెప్టెంబరు 22 నుండి 24 వరకు— మూడురోజులపాటు తి. తి. దే. హిందూ ధర్మరక్షణసంస్థ ఆధ్వర్యాన, తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో శ్రీ చైతన్య మహాప్రభు పంచశతజయంత్యుత్సవాలు నిర్వహింపబడ్డాయి. ఈ సందర్భంగా అఖిల భారతగౌడీయ మఠ ప్రధాన కార్యదర్శి, శ్రీమద్ భక్తి ప్రజ్ఞానయతి మహరాజ్



# వార్తాలహరి

శ్రీత్రిదండిస్వామిగారు ఆంగ్లంలో ప్రసంగించారు. వారి ఉపన్యాసాన్ని ధర్మరక్షణ సంస్థకార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు తెలుగులోనికి అనువదించారు. ఈ కార్యక్రమాల్లో తి. తి. దేవస్థాన పౌర సంబంధ శాఖాధికారి శ్రీరావుల సూర్యనారాయణమూర్తిగారు, శ్రీమల్లాది చంద్రశేఖర శాస్త్రిగారు, శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు తదితరులు ప్రసంగించారు.

## ప్రముఖుల సందర్శన

ఈ సెప్టెంబరు 16 వ తేదీన రాజస్థాన్ ముఖ్యమంత్రి శ్రీ శివచరణ్ మాథుర్ సతీ సమేతంగా తిరుమల శ్రీవారిని దర్శించారు. దేవస్థాన సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జి. వెంకటేశ్వర్లు ఆలయ మర్యాదలతో వారికి స్వాగత మిచ్చారు.

రాజస్థాన్ రాజధాని జయపూర్‌లో టి. టి. డి. ఒక కల్యాణమండపాన్ని నిర్మించాలని, దీనికై జయపూర్‌లో స్థలాన్ని ఏర్పాటుచేయిస్తానని, ఈ విషయంపై మళ్లీ టి. టి. డి. కి వ్రాయగలనని ముఖ్యమంత్రి తెలిపారు. తిరుమల ఆలయ పరిశుభ్రతపట్ల శ్రీమాథుర్ తమ హర్షాన్ని వెలిబుస్తూ తిరుమలయాత్ర తమకు ఎంతో ఆనందాన్నిచ్చిందని అన్నారు.

* * * *

సెప్టెంబరు 22 వ తేదీన రాజస్థాన్ గవర్నరు శ్రీ ఓ. పి. మెహ్రా సతీ సమేతంగా తిరుమలేశునిదర్శనంచేసుకొన్నారు. తి. తి. దేవస్థానకార్యనిర్వహణాధికారి శ్రీ జి.కుమారస్వామిరెడ్డి వారికి స్వాగత మిచ్చారు. అదే రోజు మన రాష్ట్ర గృహ, చలనచిత్ర శాఖా మాత్యులు శ్రీ చేగొండి వెంకట హరిరామ జోగయ్యగారు తిరుమల వేంకటేశ్వర స్వామిని దర్శించి పూజించారు. వారికి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఆలయ మర్యాదలతో స్వాగత మిచ్చారు.

## తిరుమల బ్రహ్మోత్సవాలు



ప్రతి సంవత్సరం మాదిరిగానే ఈ సెప్టెంబరు 26 న తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామికి పదిరోజులపాటు జరిగే బ్రహ్మోత్సవం అతివైభవంగా ప్రారంభమైంది. అంతకు ముందురోజు (సెప్టెంబరు 25) మంగళవారంనాడు శ్రీవారి ఆలయాన్ని "నామం, కుంకుమ, గంధం, కర్పూరం మున్నగు సుగంధ ద్రవ్యాలతో శుద్ధి చేశారు. ఈ కార్యక్రమాన్ని కోయిల్ ఆళ్వారు తిరుమంజనం" అంటారు.

సెప్టెంబరు 26 న సాయంత్రం 5-14 కుంభలగ్నంలో ధ్వజారోహణ కార్యక్రమంతో బ్రహ్మోత్సవాలు ప్రారంభింపబడినాయి. ఈ వేడుక దినాల్లో శ్రీవారి వైభవం వర్ణనాతీతం. ఈ పది దినాలు శ్రీవారి ఉత్సవమూర్తికి ప్రతిరోజు ఉదయం సాయంత్రం వేళల్లో ఒక్కొక్కరోజు ఒక్కొక్క వాహనంమీద పురవీథుల్లో ఊరేగింపులు కన్నులపండుగగా జరిగాయి.

ఈసారి రాష్ట్రగవర్నర్ డా॥ శంకరదయాళ్‌శర్మ విచ్చేయడంతో ఈ బ్రహ్మోత్సవాలు మరింత విశిష్టతను సంతరించుకున్నాయి. నాల్గవ నాటి రాత్రి శ్రీవారి 'సర్వభూపాలవాహనం' ఉత్సవంలో గవర్నరు గారు సతీ సమేతంగా పాల్గొన్నారు.

ఐదవనాడు (సెప్టెంబరు 30) తిరుమల బ్రహ్మోత్సవాల్లో అత్యంత విశిష్టమైన దినం. తిరుమలేశుడు ఏటా ఈ ఒక్కరోజే మోహినీ రూపం ధరిస్తాడు. కుడిచేతిలో కమలంపై బంగారు చిలుకను ధరించి, ఉదయం 9 నుండి 11 వరకు ఆలయంచుట్టూ నాలుగు పురవీథుల్లో వేలాదిభక్తుల ఆనందోత్సాహాల మధ్య శ్రీస్వామివారు ఊరేగినారు. ఆ సాయంత్రం 5½ గంటలకు రాష్ట్రప్రభుత్వం తరపున తిరుమల శ్రీవారికి రాష్ట్రగవర్నర్ డా॥ శంకరదయాళ్‌శర్మ పట్టువస్త్రాలను సమర్పించారు. ఆలయ సంప్రదాయ ప్రకారం రాష్ట్రగవర్నర్ పట్టువస్త్రాలను తలపై పెట్టుకొని ఆలయానికి వచ్చి స్వామి వారికి వస్త్రబహుమానం చేశారు. రాష్ట్ర గవర్నర్ సతీసమేతంగా శ్రీవారి డోలోత్సవంలో పాల్గొన్నారు. నాటి రాత్రి 9 గంటలకు శ్రీనివాసుడు గరుడవాహనాన్ని అధిరోహించి, మూలవిరాట్టుకు ధరింపజేసే మకరకంఠి, సహస్రనామహారం ధరించి వేలాదిభక్తుల కోలాహలం మధ్య, అత్యంత వైభవంగా పురవీథులలో ఊరేగినారు. గవర్నర్ డా॥ శంకరదయాళ్‌శర్మ శ్రీవారి గరుడవాహనాన్ని స్వయంగా భక్తియుక్తులతో మోశారు. గవర్నర్ సెప్టెంబరు 29 నుండి అక్టోబరు 2 వరకు నాలుగురోజుల పాటు బ్రహ్మోత్సవాల్లో పాల్గొన్నారు.





శ్రీవారి బ్రహ్మోత్సవాలలో తొమ్మిదవ నాటి ఉదయం (అక్టోబరు 3 న) జరిగిన ఉత్సవమే రథోత్సవం. ఇది శ్రీవారికి జరిగే ఉత్సవాల్లో అన్నిటికంటె వైభవో

పేతంగా, కన్నులపండువుగా, ఆనంద దాయకంగా జరిగింది. ఉభయదేవేరులతో ఉదయం 5–30 నుండి 8–30 గంటలవరకు శ్రీవారి దివ్యరథయాత్ర భక్తుల గోవింద నామ సంకీర్తన ఘోషలమధ్య తిరుమల పవిత్రపురవీథుల్లో సాగింది. అదేనాటి రాత్రి తిరుమల శ్రీవారు అశ్వవాహనంపై ఊరేగినారు.

అక్టోబరు 4 వ తేదీన విజయదశమిరోజు ఉదయం 6–00 నుండి 8–30 గంటల వరకు తిరుమల వరాహస్వామి పుష్కరిణిలో శ్రీవారి చక్రస్నాన మహోత్సవం దివ్యంగా జరిగింది. అదేనాటి రాత్రి 9–10 గంటల మధ్య జరిగిన ధ్వజావరోహణ కార్యక్రమంతో బ్రహ్మోత్సవాలు ఘనంగా ముగిశాయి.

ఈ బ్రహ్మోత్సవాలకు తిరుమల అంతటా విద్యుద్దీపాలంకరణ కన్నులపండువుగా తీర్చిదిద్దబడింది. ప్రత్యేకంగా శ్రీవారి ఆలయం, డోలోత్సవ మండపం, ఆలయం ఎదురుగా మెట్లపైగల నాలుగుకాళ్లమండపానికి అమర్చిన "ధర్మాన్ని కాపాడండి అది మిమ్మల్ని రక్షిస్తుంది" అన్న సందేశంగల గుండ్రటి ఫలకం, మున్నగునవి మరింత శోభను కలిగించాయి. తి.తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, స్వయంగా ఈ ఉత్సవాలను పర్యవేక్షించారు.

ఈ బ్రహ్మోత్సవాలలో శ్రీవారికిసుమారు 67 లక్షల రూపాయల ఆదాయం వచ్చింది. ఇందులో సుమారు 40 లక్షల రూపాయలు భక్తులు హుండీలో కానుకలుగా సమర్పించారు.

హిందూధర్మ రక్షణసంస్థ ఆధ్వర్యంలో ఈ బ్రహ్మోత్సవాల్లో ఆర్షసదస్సులో భగవద్గీతా పారాయణం, ప్రముఖులచేత ధార్మిక ఉపన్యాసాలు, సంగీత కార్యక్రమాలు, పురాణప్రవచనాలు జరుపబడ్డాయి.

ఇదే సమయంలో పదిరోజుల పాటు తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారికి నవరాత్రి బ్రహ్మోత్సవాలు అత్యంత వైభవంగా నిర్వహించారు. శ్రీ కృష్ణస్వామి మండపంలో అమ్మవారికి ఊంజల్‌సేవ; సంగీత కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి.



## అన్నమాచార్య ప్రాజెక్టు ప్రత్యేక సమర్పణ

శ్రీవారి బ్రహ్మోత్సవాల సందర్భంగా, తి. తి. దే అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారుల బృందం తిరుమల ఆర్ష సదస్సు సభామండపంలో ఇరవై రెండు ప్రత్యేక భక్తి సంగీత కార్యక్రమాలను సమర్పించింది.

సెప్టెంబరు 28 (తొలిరోజు) కుమారి జంధ్యాల కృష్ణకుమారి "అన్నమయ్యకథ" హరికథాగానం: సెప్టెంబరు 30 న (ఐదవనాడు) శ్రీవారి గరుడోత్సవ సందర్భంగా కళాకారులందరూ శ్రీనివాసుని గరుడసేవ "కార్యక్రమం", అక్టోబరు 1 న శ్రీ పి. ఎస్. రంగనాథ్ బృందం వారిచే "అన్నమయ్యనానాక్షేత్ర సందర్శనం" సమర్పణం మరియు శ్రీ ఆనందభట్టరుచే "అన్నమయ్య భజన" కార్యక్రమం, 2 వ తేదీన శ్రీ జి. నాగేశ్వరనాయుడు బృందంచే "అన్నమయ్య దేశికవితాగానం" ఆలాపన, శ్రీమతి జానకిరమణగారి సంగీతం, 4 వ తేదీన శ్రీ

బాలకృష్ణ ప్రసాద్ బృందంచే "అన్నమాచార్య సంకీర్తనలు" సమర్పణ కార్యక్రమాలు నిర్వహించారు.

ఇవేగాక బ్రహ్మోత్సవాల్లో ప్రతిరోజు ఊంజల్ సేవలో అన్నమాచార్య సంకీర్తన పుష్పార్చన చేశారు. శ్రీవారి ఊరేగింపులో వేదపారాయణం, భజబృందంతో పాటు కళాకారుల అన్నమయ్య "నగర సంకీర్తన" ఈసారి ప్రత్యేకంగా చోటు చేసుకుంది.

ఈ బ్రహ్మోత్సవాల్లో అన్నమాచార్య ప్రాజెక్టు తిరుమలలోనే కాక తిరుపతి అన్నమాచార్య కళామండపంలో కూడ కొన్ని కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది.

ఐదువందల ఏండ్లనాడు, సంకీర్తనాచార్యుడు తిరుమల వీథులలో శ్రీనివాసుని వైభవాన్ని ప్రచారం చేస్తే ఇప్పుడు తిరుమల క్షేత్రంలో ప్రత్యేకంగా బ్రహ్మోత్సవాల సందర్భంగా ఆ మహాభక్తుని సంకీర్తనలను గానంచేసి అటు వేంకటపతికి ఇటు అన్నమయ్యకు అన్నమాచార్య ప్రాజెక్టు కళాకారుల బృందం తమ భక్తి నమస్సుమాంజలు లర్పించుకొన్నది. వీరి కార్యక్రమాలన్నీ తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలకు వచ్చిన అశేష భక్తజనాన్ని విశేషంగా ఆకర్షించాయి.



---

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## గణపతి నవరాత్రులు

### వరంగల్

హిందూధర్మ రక్షణసంస్థ వరంగల్‌శాఖ వారి ఆధ్వర్యంలో ఆగష్టు 30వ తేది వినాయకచవితి సందర్భంగా స్థానిక తి. తి. దే. కల్యాణమండపంలో గణపతి పూజాదికములు జరిగాయి. తరువాత శ్రీ రవికుమార్ శర్మగారిచే "శమంతకమణి ఉపాఖ్యానం" పురాణప్రవచనం చేయబడింది. అదిమొదలు తొమ్మిదిరోజులు భజనలు, ధార్మికకార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. అత్యంతవైభవంగా జరిగిన తొమ్మిదవరోజు గణపతి నిమజ్జనోత్సవంలో చాలామంది భక్తులు పాల్గొన్నారు.

### గుంటూరు

ధర్మరక్షణసంస్థవారి ఆధ్వర్యాన స్థానిక కల్యాణమండపంలో వినాయక చవితి రోజున శ్రీ టి. బి. దక్షిణామూర్తి గారిచే "వినాయక పండుగ విశిష్టత" ధార్మికోపన్యాసం, శ్రీ వి. నరసింహారావుగారి బృందంచే 'సంకీర్తన' కావింపబడింది. సంజీవయ్యనగర్, మంగళదాస్‌నగర్, వెంగళ్రావునగర్, కోబాలపేట మొదలగు స్థానిక హరిజనవాడలలో వినాయక పండుగ ప్రాశస్త్యాన్ని తెలిపే కరపత్రాలు ఇంటింటికి పంచడం జరిగింది.

### మెదక్

ధర్మరక్షణసంస్థ మెదక్‌శాఖ ఆధ్వర్యంలో సంగారెడ్డి పట్టణంలో వివిధ దేవాలయాలు, ఆయా వాడలు మున్నగు 16 స్థలాల్లో వివిధ పరిమాణాల్లోగల శ్రీ గణపతి విగ్రహాలు ప్రతిష్ఠించబడ్డాయి. వినాయక చవితి మొదలు తొమ్మిది దినములు ఉదయం, సాయంత్రం భజనలు, ఉపన్యాసాలు వైభవంగా జరిగాయి.




### ప్రకాశం

హిందూధర్మరక్షణసంస్థ ప్రకాశంజిల్లాశాఖ ఆధ్వర్యంలో ఒంగోలుతాలుకా దేవరంపాడు గ్రామంలో ఆగష్టు 30న వినాయకచవితి నాడు సామూహిక గణేశపూజలు నిర్వహింపబడ్డాయి. 60 మంది హరిజన మహిళలు ఈ పూజల్లో పాల్గొన్నారు. స్థానిక శ్రీ వేంకటేశ్వర భక్తసంఘం, శ్రీ సాయిసేవాసమితి వారిచే ధార్మిక కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరిగింది.



### సుందరకాండ

హిందూధర్మరక్షణసంస్థ సహకారంతో గుంటూరు శ్రీ పద్మావతీ శ్రీనివాసభక్త సమాజంవారు స్థానిక శ్రీనివాసనగర్ కాలనీలో ఆగష్టు 1 నుండి 13వ తేదీ వరకు బ్రహ్మశ్రీ సోమంచి బాలగంగాధర శర్మ గారిచే సుందరకాండ పురాణ ప్రవచనం చేయించారు. 14వ తేది శ్రీ యాళ్ళబండి తాతారావుగారిచే "సీతారామకల్యాణం" హరికథాకాలక్షేపం నిర్వహింపబడింది.



---

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.




# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక

వంబరు 1984

వెల: 1-00

చెరగని స్మృతులు- 2,3 కవరు పేజీలలో



జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామ వీరలక్ష్మి
ప్రియురాలవై హరికి బెరసితివమ్మా.

పాలజలనిధిలోని పసనైన మీఁగడ
మేలిమి తామరలోని మించువాసన
నీలవర్ణు నురముపై నిండిన నిధానమవై
యేలేవు లోకములు మమ్మేలవమ్మా.

చందురుతోడఁ బుట్టిన సంపదల మెరుగవో
కందువ బ్రహ్మల కాచేకల్పవల్లి
అందిన గోవిందునికి అండనే తోడునీడవై
వుందానవు మా ఇంటనే వుండవమ్మా.

తదియారు వన్నెలతో బంగారు ప్రతిమ
చెదరని వేదముల చిగురుఁబోడి
యెదుట శ్రీ వేంకటేశు నిల్లాలవై
నిదుల నిలిచేతల్లి నీవారమమ్మా.

— అన్నమాచార్య సంకీర్తన.

(నవంబరు 18 నుండి 27 వరకు తిరుచానూరు
బ్రహ్మోత్సవ సందర్భంగా)

# మీ మాట

## మనోజ్ఞంగా

సెప్టెంబరు నెల సంచికలోని సంపాద కీయం "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అనే గీతావాక్యార్థంస్ఫురించేలా అవతారాల విశ్లేషణను, అవతారదశకాన్ని మనోజ్ఞంగా వ్రాశారు. ముఖచిత్రం రమణీయంగా వుంది. మా ధన్యవాదాలు.

| | | |
|---|---|---|
| జ్వాలా గోపీనాథ్ | — | కడప |
| కోట ఉదయకుమార్ | — | పొన్నూరు |
| హిమశైలి | — | ప్రొద్దటూరు. |

## ఆణిముత్యం

సెప్టెంబరు సంచికలోని 'ఆచార సంప్రదాయములు' అన్న వ్యాసం, సంప్రదాయాల్ని మూఢాచారాలుగా భావించి తీసి వడేసే వారికి, ఫాషన్ అంటూ విచ్చలవిడిగా తిరిగే వారికి కనువిప్పుగా వుంది. మా అభిమాన పత్రిక 'సప్తగిరి' లోని ప్రతి అక్షరం ఒక ఆణిముత్యం. మీకు మా కృతజ్ఞతలు.

| | | |
|---|---|---|
| రమాదేవి | — | వలమనేరు |
| హేమలత | — | వలమనేరు |
| కె. ముకుందరావు | — | విశాఖపట్నం |
| వి. కుటుంబరావు | — | వేమవరం |



## పసుపు పూసుకొన్న ముత్తైదువ

సెప్టెంబరు సంచిక పసుపు పూసుకొన్న ముత్తైదువ వలె దసరా పేరంటమునకు పిలిస్తే ఆలస్యంగావచ్చిన పేరంటాలువలె నున్నది. కాలవిలంబన మేలకో?

| | | |
|---|---|---|
| తేల్కర్ శంకర్‌రావ్ | — | పామిడి |
| శివప్రసాదరావు | — | పామిడి |

## బాలప్రబోధం

సెప్టెంబరు సంచికలోని శ్రీ వేంకటేశ్వర మ్యూజియం చిత్రాలు, బాలప్రబోధం బ్రహ్మోత్సవ వైభవం గురించిన వ్యాసాలు చాలా బాగున్నాయి.

| | | |
|---|---|---|
| ఆదినారాయణ | — | నందిగామ |
| వాసుదేవమూర్తి | — | నందిగామ |
| కృష్ణమోహన్ | — | వాటేల |
| ఎ. ఆదినారాయణ | — | ప్రొద్దటూరు |

## అమూల్య విషయాలు

ఆగష్టు "సప్తగిరి" ముఖచిత్రం ఎంతో ఆకర్షణీయంగా వుంది. 2, 3, 4, కవరు చిత్రాలు ఎంతో శోభను చేకూర్చాయి. ఇందులో ప్రచురితమైన 'లీలాగోపాలం' వేంకటేశ్వరలీలలు, ఇంకా యితరరచనలు అమూల్యమైన విషయాలను తెలియజేశాయి. రచయితలకు ధన్యవాదాలు.

| | | |
|---|---|---|
| కూనాపు వెంకటేశ్వర్లు | — | సత్తెనపల్లి. |

## సులభ శైలిలో

సప్తగిరిలో ప్రచురితమగుచున్న ఆధ్యాత్మిక విషయాలను గూర్చి వివరిస్తున్న వివరణలు, సామాన్యులకు సులభ శైలిలో తెలియ జేస్తున్నాయి. సెప్టెంబరు సంచికలోని "ఆకాశతీర్థావతరణము" "శ్రీవారి అర్చనలు సేవలు", అను వ్యాసాలు ఎన్నో తెలియని విషయాలను విశదపర్చాయి. రచయితలకు అభినందనలు.

| | | |
|---|---|---|
| మల్లాది సుమిత్రాకృష్ణ | — | విజయవాడ |

## బాగాలేదు

సెప్టెంబరు ముఖచిత్రం ముద్రించిన కాగితము చిత్రము రంగు ఏమీ బాగలేదని మిమ్ములను ప్రార్థించున్నాను. మొదటి, కడ పేజీల పేపరు, ప్రతినెలా కదురమ్యముగా వుండులాగున ముద్రింపగలరని ప్రార్థన.

| | | |
|---|---|---|
| బి. నారాయణరెడ్డి | — | బాబాసాహెబ్‌పల్లి |

## మేధావికథ

'బాలప్రబోధం' అను శీర్షిక క్రింద ప్రచురింపబడ్డ 'మేధావికథ' అను వ్యాసంలో "మంచిపనులు చెయ్యనివాడిని మృత్యువు కబళిస్తుంది" అని ఒకచోట ఇచ్చారు. కాని పెద్దలనానుడి ప్రకారం "పాపీ చిరాయువు" కదా. ఈరెండు వాక్యాలకు పోలిక ఎక్కడ? తెలియటం లేదు.

| | | |
|---|---|---|
| మల్లిబాబు | — | హైదరాబాదు |

[మహాత్ములు నుడివిన అట్టి వాక్యాలను ఆయా సందర్భాలకు అనుగుణంగా సమన్వయించుకోవాలేగాని ఆ రెంటిని పోల్చడం తగదు. "నిదానమే ప్రధానము", "ఆలస్యం అమృతం విషం" అనువాక్యాలుకూడా ఇలాంటివే.] సం॥

## ఆకాశవాణి కేంద్రాలు

తిరుమల తిరుపతి దేవస్థానం స్వర్ణోత్సవాల సమయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి కోసం తిరుపతిలో ఆకాశవాణి కేంద్రం ఏర్పాటుచేయాలన్న సూచన వినవచ్చింది. అదే జరిగినచో అందరికీ ఆనందము కలిగేది నిజమే. ఆ "వెంకన్న" యే యిందుకు పూనుకోవాలి.

| | | |
|---|---|---|
| జె. అనంత పద్మనాభ. | — | కాకినాడ |

## రైళ్ళు! రైళ్ళు! రైళ్ళు!

మద్రాసు సెంట్రల్‌నుండి తిరువళ్ళూరు వరకు నాల్గుబాటలుగా రైలు పట్టాలు వేసే కార్యక్రమం ప్రారంభమైందట. అంటే ఒకే తడవ అటునుంచీ ఇటునుంచీ రైలుబళ్ళు మధ్యలో ఎటువంటి ఇబ్బంది లేకుండా ప్రయాణించేస్తాయి. బహుశా వీటిలో రెండు గూడ్సు బళ్ళకే కేటాయింపు జరిగితే, వేటికవి తమ తమ స్థానాలకు త్వరగా చేరుకొనేందుకు వీలౌతుంది. మద్రాసు స్టేషన్‌లో 25 ప్రత్యేక బుక్కింగ్ ఆఫీసులుకూడా

[48 వ పేజీలో]





గౌరవసంపాదకులు :

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు :

గొట్టిపాటి సుబ్బారావు, ఎమ్. ఏ.

*

ముద్రాపకుడు :

ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00

సం॥ చందా - రు. 12-00

*

ప్రతులకు :

వెల్ ఫేర్ ఆఫీసర్,

టి. టి. డి., తిరుపతి.


# ఈ సంచికలో....

నవంబర్ 1984

సంపుటి 15 సంచిక 6



ముఖచిత్రం: స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధి.

2వ, 3వ కవరుపేజీలు: 1. గుడిలో శ్రీమతి గాంధి. 2. శ్రీస్వామి ఆభరణాల పరిశీలనలో (1972). 3. శ్రీ వైష్ణవప్రముఖులతో ఆరాధనకు. 4. ఆలయ అధికార వర్గంతో (1978). 5. అభిషేకపాత్రతో ఆరాధనకు (1980). 6. దేవస్థాన ఫలపుష్ప ప్రదర్శనలో (1980). 7. ఆలయ విశేషాలపై అతిశ్రద్ధ (1980). 8. కారుణ్యమూర్తి దర్శనానికి కడసారిరాక (1982). 9. చరిత్ర పుటలలో. 4వ కవరుపేజి: తిరుచానూరులో శ్రీ పద్మావతీదేవి పంచమీతీర్థం.

# సంపాదకీయం

మనిషిలోని మృగం మళ్ళీ కదిలింది. కాలమనే కోరలతో మానవతను కసితీర కరకర నమిలివేసింది. రాజరికపు జాడమే ప్రధానమైన దేశాలలో ఇది కొత్తకాదు కాని, జీవకారుణ్య సమతా సదనగాహన సిద్ధాంతాలకు అంకితమైన మన కిలాంటివి అప రూపాలేకాదు. అశనిపాతాలు కూడా.

పరిమిత ఆలోచనాపరిధి బృహదాలోచనను, వైయక్తిక ప్రయోజనాలు వ్యవస్థా ప్రయోజనాలను, సామాజిక ప్రయోజనాలను లొంగిపోయి వ్యక్తి చిత్తైనప్పుడు విరాశానిస్పృహలు ఆవరించి, ఆవేశ కావేశాలు అందుబాటులోకి వచ్చి పగ సెగలు రేపుతుంది. మతి మందగిస్తుంది. మనస్సు మలినమౌతుంది. మనిషిలోని మహామృగం మహోగ్రంగా తన పంజా విసురుతుంది. ఫలిత మేమైనా, తన కేమైనాసరే, పంతం చెల్లాల్సిందే.

సరిగా ఇటువంటి మౌఢ్యమే ఈ దేశంలో ఇద్దరు గాంధీలను— 1948 జనవరిలో మహాత్మాగాంధీ, అక్టోబరు 1984 లో ఇందిరాగాంధీ— బలితీసుకుంది.

మతసహనం బోధించి మహాత్ముడు బలైతే, కొందరు రాతతాయిల అగడాలను మితంగా సహించిన కారణంగా, వేసుకున్న కంచె కాట్లకు గురై మరొక గాంధి, మన ప్రధాని, దారుణంగా మరణించింది. మానుతున్న గాయంపై విధి మళ్ళీ మరింత కారంచల్లి కలియబెట్టి వెళ్ళింది.

మన ప్రధానిగా మరణించిన శ్రీమతి ఇందిర నిజంగా ప్రియదర్శిని, అకుంఠిత రాజనీతిజ్ఞకాక, అసమాన మానవతావాది కూడా. 1971 లో జరిగిన పొరుగువారి తోటి పోరులో సమయోచితమైన ఏకపక్ష యుద్ధవిరమణద్వారా రాజకీయ ప్రయోజనమైన బాంగ్లాదేశ్‌ను సాధించటమేగాక, సుమారు 1 లక్ష మంది పాకిస్థానీ సైనికులకు ప్రాణం పోసినట్లే ఐంది. యుద్ధమే కొనసాగివుంటే ఇంత కిబ్బడిగా ప్రాణనష్టం జరిగి వుండేది.

హంతకులు చరిత్రలో తమ కాపేరు స్థిరపరచుకోవటమే తప్ప, సాధించిందేమీ లేదు. కంటిమీది కోపం చేతితో పొడుచు కోవటం మాత్రమే జరిగింది. తమ ఆవేశంలో తాము నమ్మిన ఆశయాల కోసమే జీవించి మరణించిన మహనీయుల పుణ్యభూమి ఈ భారతంలో సమరసభావనతోతప్ప బావులతో సమస్యలు పరిష్కారం కావనే సంగతే మరచి, ధర్మచ్యుతితో, అయినవారిలో కూడా ఆరాటం కల్గించారు.

ఇందిరాగాంధీగా, భౌతికంగా మనకు దూరమయ్యారు. కాని ఆ ఆత్మస్థైర్యం, దృఢదీక్ష, ఆ మానవతావాదం, నిశిత రాజకీయ పరిజ్ఞానం చిరస్మరణీయాలు. ఆమె మరణించినా, నూతన ప్రధాని చెప్పినట్లు 'భారతజాతి శాశ్వతమైనది, భారతీయ ఆత్మ కూడా నిత్యం.' ఆమె జీవితంలో ఆనగింజసాలు మనం ఆదర్శంగా తీసుకోగలిగినా ఆమె ఆత్మకు అక్షయ తృప్తి కల్గుతుంది.

నైనం ఛిందంతి శస్త్రాణి
నైనం దహతి పావకః,
న చైనం క్లేదయం త్యాపో
న శోషయతి మారుతః. (భగవద్గీత)

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

వేదముతో సమానమైనశాస్త్రము, గంగతో సమమైన తీర్థము, ధర్మముతో సమమైన మిత్రము, కార్తీకంతో సమానమైన మాసము, విష్ణుతుల్యదైవము, భాస్కర సదృశ తేజశ్శాలి లేరు. కనుక కార్తీకమాసములో చేసిన స్నాన ధర్మ కర్మలు నూరు యజ్ఞాల ఫలం యిస్తాయి.

పిండారబోసినట్లుండే కార్తీక పున్నమి వేళలే కవుల కలాలను కదం తొక్కిస్తాయి.

వ్యావహారికంలో కార్తీకమును కార్తీకము అని, ఆశ్వయుజమును ఆశ్వీజ మని చెప్పడం పరిపాటి.

కార్తీకమాసంలో కర్మసాక్షి తులారాశిలో వుండగా చిత్తశుద్ధితో చేసిన స్నానము, దానము, పితృశ్రాద్ధము, దేవతార్చనము అనంతపుణ్యఫలప్రదములు.

శ్రావణ శనివారా లెంత శ్రేష్ఠమైనవో, కార్తీక సోమవారము అంతే! కార్తీక మాసంలో సోమవారవ్రతం చేసినవారు కైలాసవాసులౌతారు. ఆనాడు చేసే స్నాన, ధ్యాన, దానాదులవల్ల వేలకొలది అశ్వమేధ యాగములు చేసిన ఫలం వస్తుంది. ఉపవాసం, ఏకభుక్తం (ఒకపూటమాత్రమే తినుట) నక్తం (రాత్రిమాత్రమే తినుట) అయాచితవ్రతం (తాను కోరక వరులు పెట్టినది తినుట) స్నానం, తిలాదానం అని యీనెలలో చేసే వ్రతాదులు ఆరు విధములు. సమర్థులు ఉపవసించవచ్చు. అశక్తులు రాత్రి భుజించవచ్చు. దానికి చాలనివారు ప్రొద్దుపోయే సమయంలో భుజించవచ్చు. వీటిలో యే ఒక్కటి చెయ్యనివారు ఎనిమిది యుగాల కుంభీపాక నరకబాధలు అనుభవిస్తారు.

సోమవారంనాడు ఉపవాసం చేసి శివార్చన చేసే వితంతువు మోక్షం పొందుతుంది. ఆనాడు ఉపవసించి రాత్రి నక్షత్రాలను చూసి భుజించే స్త్రీ పురుషుల పాపాలు అగ్నివల్ల దూదిరాసిలాగు భస్మమౌతాయి. రుద్రాభిషేకం, శివపూజచేసి రాత్రి మాత్రమే భుజించేవారు శివసాయుజ్యము పొందుతారు. కార్తీక పూర్ణిమ నాడైనా స్నానదానాదులు, కార్తీక వ్రతం చెయ్యని వారు పెక్కు జన్మలు చండాలురై పుట్టి పిదప బ్రహ్మరాక్షసు లౌతారు. తెలిసికాని తెలియకకాని యీ మాసములో కావేరి స్నానం చేసిన వారికి పదివేల అశ్వమేధ యాగాలు చేసిన పుణ్యఫలం వస్తుంది. అలా చెయ్యనివారు వేమరు నీచజన్మ లెత్తి, పందులై ఆపైన బ్రహ్మరాక్షసు లౌతారు. కనుక స్త్రీ పురుషులు కార్తీకములో కావేరి మున్నగు పుణ్యనదులలో తప్పక స్నానం చెయ్యాలి.




ఈ మాసములో సాయం సమయమందు శివాలయంలో భక్తితో గోపురంద్వారంవద్ద శిఖరంమీద, శివలింగం ముందు నేతితో కాని, మంచినూనెతోకాని, ఇప్పనూనెతోకాని, నారింజ నూనెతోకాని, దీపారాధన చేసిన వారు ధన్యాత్ము లౌతారు. నేయి, నూనె దొరకనపుడు ఆముదపు దీపమైనా చిత్తశుద్ధితో, భక్తితో శివాలయంలో దీపారాధన చేసినవారు పుణ్యాత్ము లౌతారు.

మోహంచేతకాని, కామంచేతకాని పూర్ణిమ నాడు శివాలయంలో దీపారాధనచేసినా పుణ్యాత్ము లౌతారు. చేయనివారు ఎంత సదాచారపరాయణులైనా ముక్తులు కారు. శివాలయమునకాని, విష్ణ్వాలయమునకాని అనుదినము భక్తిశ్రద్ధలతో దీపారాధన చేసినవారు పునర్జన్మ లేక మోక్షం పొందుతారు.

స్త్రీ పురుషులు తమ పాపాలు పోగొట్టుకొనుటకు కార్తీకమే శరణ్యం. ఈ మాసంలో వెన్నుని సన్నిధిని భగవద్గీత లేదా అందులోనివిభూతియోగ, విశ్వరూపయోగ, భక్తియోగములను భక్తిశ్రద్ధలతో పారాయణ చేసినవారి పాపాలు పటాపంచలౌతాయి. విష్ణుసాయుజ్యము పొందుతారు. 'మహావిష్ణువును తులసీదళములతో, గన్నేరు పూలతో అలంకరించిన వారి పాపాలు పోయి వైకుంఠప్రాప్తి కల్గును. అలాగే కమలాపతి యెదుట కార్తీకపురాణంలోని ఒక శ్లోకంకాని శ్లోకపాదంకాని భక్తితో పఠించినవారికి సర్వపాప విమోచన మౌతుంది.

ఈ మాస శుక్లపక్షమున వనభోజనం చేసిన వారు పాపవిముక్తులై వైకుంఠవాసు లౌతారు. పలుజాతుల చెట్లతోనున్న తోటలో ఆమలక (ఉసిరిక) వృక్షం క్రింద సాలగ్రామం వుంచి, హరిచందనఫల పుష్పాదులతో పూజచేసి, భూసురులతో సహా ఆ తోటలో భుజించినచో పూజాసమయమున కాని, జపహోమ కాలాలలోకాని, భోజన సమయమునకాని, చండాలాదుల సంభాషణ విన్నందున వచ్చిన దోషం పోవును

వత్తిని చక్కగా తీసి, వరిపిండితోకాని గోధుమపిండితోకాని ప్రమిదచేసి, నెయ్యి పోసి అందులో వత్తిని తడిపి దీపం వెల్గించి సద్బ్రాహ్మణునకు దానం చేసి, భోజనం పెట్టాలి. ఆ దీపం దానమిచ్చునపుడు—

"సర్వ జ్ఞానప్రదం దీపం
సర్వ సంపత్సుఖావహమ్,
దీపదానం ప్రదాస్యామి
శాంతి రస్తు సదా మమ."

అనే మంత్రం చదవాలి. ఇట్లు స్త్రీ పురుషులలో దీపారాధన చేసినవారు విద్యను, దీర్ఘాయువును, స్వర్గమును పొందుతారు.

వారికి అక్షయపుణ్యఫలం కల్గుతుంది. సర్వ పాప వినాశమునకు సాధనం దీపదానం.

ఈ మాసములో కమలనాభుని కమల ములతో పూజించువాని యింట కమల వాసియైన కమల (లక్ష్మి) స్థిరంగావుంటుంది. దామోదరుని తులసీ దళాలతో, జాజిపూలతో పూజించినవానికి పునర్జన్మ వుండదు. మారేడు పత్రితో మాధవుని పూజించినవాడు మరి పుట్టడు. ఫలదానం చేసినవారిపాపాలు నశిస్తాయి. భక్తితో పద్మనాభునికి మామిడి చివుళ్ల తోరణం కట్టినవాడు పరమపదమును మహావిష్ణువు మంటపాన్ని రంభా (అరటి) స్తంభాలతోకాని, పూలతోకాని అలంకరించి సాలగ్రామ పూజచేసినవాడు సద్గతీ, పొందు తారు. కార్తికమాసం చలికాలం కనుక స్నానంచేసి, వస్త్రదానం చేసినవాడు అనేక అశ్వమేధయాగాలు చేసిన ఫలం పొందు తాడు. నారాయణుని తెల్లని లేక నల్లని అవిసె పూలతో పూజిస్తే, పదివేల యజ్ఞాలు చేసిన ఫలం వస్తుంది. తులసికోట ముందు గోమయముతో అలికి శంఖము, పద్మము, స్వస్తికము మున్నగు రంగవల్లికలు రచిం చిన స్త్రీ విష్ణుప్రియ అవుతుంది. చతుర్దశి నాడు అచ్యుతునిముందు దీపం పెడితే వచ్చే ఫలం నలువయైన పలుకలేడు.

పూర్ణిమనాడు శివుని అర్క (జిల్లేడు) పుష్పములతో పూజించేవాడు చాలాకాలం జీవించి అంత్యమున శివసాయుజ్యము పొందును. అన్నదానము చేసినవారు పుణ్యాత్ములౌతారు. నదీస్నానం, తిలా దానం, అన్నదానం చాల ముఖ్యములు. నలువతంద్రిని కలువలతో పూజించేవాడు సూర్యమండలాన్ని ఛేదించుకొని స్వర్గానికి వెళ్ళును. మొగలిరేకులతో పూజించేవాడు ఏడు జన్మలలో వేదవేదాంగవేత్త అయిన విప్రుడై జన్మిస్తాడు. తామరపూలతో పూజించేవాడు బహుకాలం భానుమండలంలో వుంటాడు. అవిసె పూలమాలధరించి విశ్వ నాథుని అవిసె పూలతో అర్చించేవాడు స్వర్గాధిపతి అవుతాడు. తులసీదళాలతో పూలమాలలతో వనమాలిని పూజించే వనితలు పుణ్యవతులై వైకుంఠానికి వెడతారు.

ఆదివారంనాడుకాని, శుద్ధపాడ్యమి, పూర్ణిమ, అమావాస్య తిథులలో కాని ఉదయం స్నానం చేస్తేచాలు నెలంతా చెయ్యలేని అశక్తులకు పూర్ణఫలం వస్తుంది. అలాకూడా చేయ లేనివాడు నెలంతా భక్తిగా కార్తిక మాహాత్మ్యం వింటే స్నానం చేసిన ఫలం వస్తుంది. సాయంకాలం ఆలయాన స్తోత్రపారాయణ చేసేవారు కొంతకాలం దివిలోను, తర్వాత ధ్రువమండలానికి వెళ్ళి సుఖంగా వుంటారు. చిరుదీపంవల్ల చీకట్లు తొలగినట్లు హరినామ సంకీర్తనంవల్ల చేసిన పాప మెంతైనా పటాపంచలై అనంతమైన ఉత్తమపదం పొందగలరు.

సోమవారం గొప్పమహిమ కలది. దాని కన్న శనిత్రయోదశి (శనివారంతో కూడిన త్రయోదశి) నూరింతల హెచ్చుఫల మిస్తుంది. ఆ త్రయోదశికన్నా, పూర్ణిమ కన్న శుక్లపాడ్యమి లక్షగుణితం. ఆ పాడ్యమికన్న శుద్ధ ఏకాదశి కోటి రెట్లు, ఆ ఏకాదశికన్న ద్వాదశి అనంత పుణ్యఫల మిస్తుంది. అజ్ఞానముచేతనైనా శుద్ధ ఏకాదశినాడు ఉపవసించి మంగళవాద్యా లతో పురాణ కాలక్షేపముతో, హరినామ సంకీర్తనముతో రాత్రంతా జాగరణచేసిన వారు సమస్తపాపాలనుండి విముక్తిపొంది సుఖిస్తారు. ఏకాదశినాడు ఉపవసించి, బ్రాహ్మణులతో పారణచేసినవారికి విష్ణు సాయుజ్య సౌఖ్యం కల్గును. ద్వాదశినాడు అన్నదానం చేసినవాని యింట ఐశ్వర్యం పాలసంద్రమువలె పొంగును. ఆనాడు ఒక బ్రాహ్మణునకు అన్నమిడితే సూర్యగ్ర హణకాలమందు గంగాతటిని కోటి భూసురు లకు విందుచేసిన పుణ్యం వస్తుంది. వెయ్యి గ్రహణాలు, పదివేల వ్యతీపాతములు, లక్ష అమావాస్యలు ద్వాదశియొక్క పదు నారవ భాగానికి సాటికావు. అధిక పుణ్య ఫలమిచ్చే తిథు లెన్ని వున్నా విష్ణుప్రియ మైన ద్వాదశి అతిథులకన్న యెన్నో రెట్లు ఎక్కువ ఫల మిస్తుంది. శుద్ధద్వాదశినాడు

జగన్నాథుడు యోగనిద్రనుండి లేస్తాడు. కనుక ఆనాడు ఒక్క ద్విజునికైనా భోజనం పెడితే దేహాంతమందు విష్ణులోకమునకు వెళ్లి సకల సౌఖ్యాలు అనుభవిస్తారు. ద్వాదశినాడు దధ్యోదనము దానమిచ్చే వాడు సర్వధర్మఫలాన్ని మించిన ఫలం పొందును. ద్వాదశి, పూర్ణిమ, పాడ్యమి ఏ ఒక్క తిథినైనా కాంస్యపాత్రలో, ఆవు నేతితో దీపంపెట్టి దానంచేసేవారు కోటి జన్మలలో చేసిన పాపాలు పోయి పుణ్యాత్ములౌతారు. ద్వాదశినాడు మంచి పండు, జందెము, తాంబూలము యథాశక్తిగ దక్షిణపెట్టి దానమిచ్చేవారు యీ లోకంలో సకల సుఖాలనుభవించి అనంతరం విష్ణు ధామంచేరి అనంతుని చెంత అనంతకాలం సుఖ శాంతులతో వుంటాడు.

ఈ మాసంలో కన్యాదానం, తులాస్నానం, శిష్టపుత్రునికి ఉపనయనం చేయించడం అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం చెయ్యవలసిన ఉత్తమధర్మాలు. ఒక బీదవిప్ర కుమారునికి సొంత సొమ్ముతో ఉపనయనం చేయిస్తే, ఆ వటువుచేసే గాయత్రి జపంవల్లవచ్చే పుణ్యఫలం చేయించిన వానికిన్నీ వస్తుంది. అంతేకాక వేలకొద్ది చెరువులు తవ్వించడం, నూతులు తీయించడం, నూరురావిచెట్లు నాటించడం వల్ల వచ్చేఫలం, ఉపనయనం చేయించడం వల్ల వచ్చేఫలములో పదారవవంతుకు కూడ సరికాదు. బడుగుబ్రాహ్మణ బాలలకు ఉపనయనం చేయిస్తానని కార్తికమాసంలో సంకల్పించి వైశాఖమాసంలో కాని మాఘ మాసంలో కాని చేయించాలి. అలాకాక కన్యాదానం కార్తికంలో చేసినవాడు ముక్తి పొందుతాడు. వాని పితృదేవతలు బ్రహ్మ లోకానికి వెడతారు.

పూర్ణిమనాడు వృషోత్సర్జనం (ఎద్దును వదలుట) చేయకపోతే పితృదేవతాతృప్తి కాదు. వృషోత్సర్జనం చేయనివానికి నరకం తప్పదు. అదే రోజు శివలింగదానం చేసిన వాడు ఈ జన్మలో సకల సుఖాలనుభవించి మరుజన్మలో సార్వభౌము డవుతాడు. యథాశక్తిగ దక్షిణపెట్టి ఉసిరికపండ్లు దానమిచ్చినవాడు రాజవుతాడు. దీపదానం చేస్తే పాపాలన్నీ పోయి మోక్షం వస్తుంది. అన్నిటికన్న శివలింగదానం చాల గొప్పది. అది చేయక యింకే దానం చేసినా నిరర్థకమే. సర్వపాపహరమైన లింగదానం తప్పక చెయ్యాలి.

ఈ మాసంలో నిషిద్ధమైనవి. పరుల యింట శ్రాద్ధభోజనం పనికిరాదు. శాస్త్రం నిషేధించిన పదార్థాలు తినరాదు. పూర్ణిమ, అమావాస్య తిథులనాడు, పితృతిథినాడు, గ్రహణ కాలమందు, ఆదివారంనాడు రాత్రి భోజనం చేయరాదు. నెలంతా నక్తవ్రతం చేసేవారు, ఏకాదశికి ముందు వెనుకటి దినాలలో, దశమి, ద్వాదశి దినాలలో రాత్రి భుజించకూడదు. సూర్యాస్తమయానికి ముందు భోజనం చేయవచ్చు- అని మహర్షుల ఉవాచ. కార్తికవ్రతం కలవారు అభ్యంగ స్నానం చేయరాదు. కంచు పాత్రలో భుజించరాదు. వేదాలను శాస్త్రిలను నిందించకూడదు. నిషిద్ధదినాలలో నిశివేళ భుజించరాదు.పవలు పవళించరాదు. దృఢగాత్రులు వేడినీళ్లతో స్నానమాడరాదు. సూర్యుడు తులారాశిలోవున్నపుడు తప్పక నదిస్నానం చేయాలి. కూపోదకంకాని, చెరువులలో, కాల్వలలో స్నానం చెయ్యాలి. పైచెప్పిన జలాలలో గంగవున్నట్లు భావించాలి. గంగ, గౌతమి వంటి పుణ్యనదీ స్నానం ఉత్తమోత్తమమైన ఫలాన్నిస్తుంది. ఆ నదులులేనిచోట వాపీకూపతటాక జలాలే గంగాది పుణ్యనదీజలాలుగా తలంచి స్నానం చెయ్యాలి. అట్లు స్నానం చేసినపుడు-

"గంగే చ యమునే చైవ
గోదావరి ! సరస్వతి !
నర్మదే ! సింధు ! కావేరి !
జలేఽస్మిన్ సన్నిధిం కురు !"

అనడం సంప్రదాయం.

శుద్ధచతుర్దశినాడు పితృదేవతల నుద్దేశించి ఒక్క బ్రాహ్మణునకైన భోజనమిడితే పితృదేవతలు తృప్తులౌతారు.కన్నకొడుకు భక్తితో పితరుల నుద్దేశించి తిలతర్పణం విడిస్తే పితృలోకంలోని పితరు లందరు తృప్తులౌతారు. ఆనాడు ఫలదానం చేసిన వారి సంతతికి వినాశం రాదు. ఉపవాసం చేసి, శివపూజచేసి తిలదానం చేసేవారు కైలాసవాసు లౌతారు. మహాపుణ్యఫల మిచ్చే కార్తికవ్రతం భక్తిశ్రద్ధలతో చేసేవారు ధన్యులై శివసాయుజ్యం పొందుతారు. ద్వాదశినాడు స్నానం, దానం, తర్పణం, దీపతోరణం పెట్టేవారు సకల పాపవిముక్తులై వైకుంఠవాసు లౌతారు.

ఈ మాసంలో విష్ణువుముందు నాట్యం చేసేవారికి, ద్వాదశినాడు ముకుందుని ముందు దీపమాలిక వెలిగిస్తే వైకుంఠవాస సౌఖ్యం వస్తుంది. సాయం సమయమందు భూజానిపూజ చేస్తే స్వర్గాధిపత్యం వస్తుంది. నెలంతా తప్పక విష్ణ్వాలయానికి వెళ్లి దర్శనం చేసినవానికి ఒక్కొక్క అడుగుకు ఒక్కొక్క అశ్వమేధయాగఫలం వస్తుంది. ద్వాదశినాడు విష్ణువు మేల్కొంటాడు కనుక ఆ ద్వాదశికి "హరిబోధిని" అని పేరు. అది పరమపావనమైన దినం. ఆనాడు కేశవాలయమునకాని, శివాలయమునకాని లక్ష వత్తుల దీపాలు వెలిగించేవాడు జన్మాంతమందు దేవతలు పొగడుతూ రాగా విమానారూఢుడై వైకుంఠానికి వెళ్లి దివ్యసుఖం పొందుతాడు. హరిబోధినినాడు భూసురులతోకూడి సుగంధపుష్పాక్షతలతో నేతితో చేసిన భక్ష్యభోజ్యాలతో, ధూపదీపాలతో పురాణపురుషుని పూజించేవాడు అక్షయ పుణ్యఫలం పొందుతాడు.

కార్తికమాసం నెలరోజులు దీపం పెట్ట లేని అశక్తులు శుద్ధ ద్వాదశి, చతుర్దశి, పౌర్ణమాసి దినాలలో అయినా పెట్టాలి. త్రివిక్రముని యెదుట యింకొకరు పెట్టిన దీపం ఆరిపోక కాపాడేవారు, దీపం కొడి కడుతుంటే తిరిగి ప్రజ్వలింప జేసేవారు

బ్రహ్మహత్యాది పాపాల నుండి విముక్తులౌతారు.

నెలంతా తాంబూలదానం చేసినవారు చక్రవర్తులౌతారు. శుద్ధపాడ్యమి మొదలు చివరిదాక ఒక్కొక్క దీపం హెచ్చిస్తూ మురారి ముందు దీపారాధన చేస్తే పాప విముక్తులై విష్ణులోకం చేరెదరు. ఆది వారాలు ఆదిత్యునుద్దేశించి స్నానం చేసినవారి కోరికలు తప్పక నెరవేరును. సంతాన కాంక్షతో స్నానదానాలు చేసిన వారికి సత్సంతతి కల్గును. హృషీకేశుని ముందు దక్షిణ తాంబూలాలతో నారికేళ ఫలాలు దానంచేస్తే సంతాన నాశనం వుండదు. ఎలాటి రుగ్మతలురావు. దుర్బుద్ధులు పుట్టవు.

పౌర్ణమినాడు విష్ణ్వాలయాన స్తంభ దీపం పెట్టిన వానికి వచ్చే పుణ్యం చెప్ప నలవికానిది. స్తంభదీపం చూచినవారి పాపాలు సూర్యోదయంవల్ల చీకట్లవలె పంచబంగాళమౌతాయి. ఒక పాత్రలో శాలిధాన్యం నువ్వులు కలిపిపోసి దానిపై నేతిపాత్రనుంచి దీపం వెలిగించి దేవాల యంలో ఒక రాతి స్తంభముకాని, కఱ్ఱతో చేసిన స్తంభముకాని గోవిందుని కెదురుగా నాటి దానిపై ఆ దీపం పెట్టడం స్తంభదీప మంటారు. ఆ దీపాన్ని కార్తికములో పెట్టని వారి పితృదేవతలకు నరక విముక్తి కలుగదు. స్తంభదీపం పెట్టినవారు ఇందిరా రమణునికి యిష్టులౌతారు.

సూర్యుడు తులారాశిలో వుండగా కార్తిక మాసంలోను, మకరరాశిలోవుండగా మాఘ మాసంలోను, మేషరాశిలోవుండగా వైశాఖ మాసంలోను ప్రాతస్స్నానం చేస్తే అనంతమైన పుణ్యం వస్తుంది.

సూర్యుడు తులారాశిలో వుండగా కార్తిక మాసంలోను, మకరరాశిలోవుండగా మాఘ మాసంలోను, మేషరాశిలో ఉండగా వైశాఖ మాసంలోను ప్రాతస్స్నానం చేస్తే అనంతమైన పుణ్యం వస్తుంది.

మధుసూదనుడు మహాలక్ష్మితో పాల సంద్రమందు ఆషాఢ శుద్ధ ద్వాదశి నాడు యోగనిద్ర ఆరంభించి కార్తిక శుద్ధద్వాదశి నాడు మేల్కొంటాడు. ఈ మధ్య నాలుగు మాసాలకు చాతుర్మాస్యమని పేరు ఈ కాలం పుండరీకాక్షునకు సుఖ ప్రదమైనది. కనుక చాతుర్మాస్య వ్రతం చేసేవారికి నూరు యజ్ఞాల ఫలం వస్తుంది. ఇహమందు సుఖ జీవనం పరమందు విష్ణులోక ప్రాప్తి కల్గుతుంది.

సుస్థిరమైన భక్తితో కార్తిక వ్రతం చేసే శూద్రుడైనా వైష్ణవ శ్రేష్ఠుడవుతాడు. ఎన్ని వేదాలు వల్లించినా, ఎన్ని శాస్త్రాలు చదివినా విష్ణుభక్తిలేని బ్రాహ్మణుడైనా శూద్ర తుల్యుడని పెద్దలంటారు. స్థావర జంగమాత్మక ప్రకృతి కంతకు విష్ణువే దిక్కు. అన్ని జీవులకు ఆత్మ అనంతశయనుడే. విష్ణువు సర్వాంతర్యామి. కామితార్థముల నిచ్చే వ్రతము కార్తిక వ్రతమొక్కటే. వేద ప్రశంస పొందిన వ్రతమిది. కనుక అందరు భక్తి శ్రద్ధలతో కార్తిక వ్రతం చేసి విష్ణుభక్తులై హరికరుణను పొంది తరించాలి. సర్వపాపహరము, సకల సుఖ కరము అయిన కార్తికవ్రత మాచరించని వారు కష్టాలు, నరకబాధలు అనుభవిస్తారు.

ద్వాదశినాడు అంబరీష మహారాజు పారణచేసి హరిభక్తులలో మిన్న అనిపించుకున్నాడు. ఆనాడు దుర్వాసుడు అంబ

(42 వ పేజీలో)

# శ్రీమద్భగవద్గీత

(సీరియల్)

వ్యాఖ్యాత:
శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి



## పద్దెనిమిదవ అధ్యాయం

### మోక్షసన్న్యాసయోగం

అర్జున ఉవాచ:

సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశినిషూదన॥

అర్జునుడు: కృష్ణా! సన్న్యాసం, త్యాగం – వీటి స్వరూపాలను విడివిడిగా తెలుసుకో దలచాను.

శ్రీ భగవానువాచ:

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః।
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥

శ్రీ భగవానుడు: ఫలాన్ని ఆశించి చేసే కర్మలను విడిచి పెట్టడమే సన్న్యాసమని కొంతమంది పండితులు చెబుతారు. సమస్త కర్మల ఫలితాలనూ వదిలి పెట్టడమే త్యాగమని కొందరి అభిప్రాయం.

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః।
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్య మితి చాపరే॥

దోషంలేని కర్మ అంటూ ఏదీ వుండదు. కనుక కర్మలను విడిచిపెట్టాలని కొందరు బుద్ధిమంతులు చెబుతారు. మరి కొంతమంది యజ్ఞం, దానం, తపస్సు అనే కర్మలను పరిత్యజించకూడదని పలుకుతారు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః॥

అర్జునా! కర్మత్యాగ విషయంలో నా నిర్ణయం విను. త్యాగం మూడు విధాలు.

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥

యజ్ఞం, దానం, తపస్సు అనే కర్మలు బుద్ధిమంతులకు చిత్తశుద్ధిని చేకూరుస్తాయి. అందువల్ల వాటిని విడిచిపెట్ట కూడదు: తప్పకుండా చేయాలి.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్॥

పార్థా! అయితే యజ్ఞం, దానం, తపస్సు అనే ఈ కర్మలను కూడా ఆసక్తినీ, ఫలాన్నీ విడిచిపెట్టి ఆచరించాలని నిశ్చితమూ, ఉత్తమమూ అయిన నా అభిప్రాయం.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః॥

స్వధర్మానుసారంగా నిత్యం ఆచరించవలసిన కర్మలను విడిచిపెట్టడం మంచిది కాదు. అవివేకంతో చేసే అలాంటి త్యాగాన్ని తామసత్యాగ మంటారు.

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥

దుఃఖం కలగజేస్తాయనే భావనతో కాని, శరీరానికి శ్రమ కలుగుతుందనే భయంతో కాని నిత్యకర్మలను విడిచి పెడితే అది రాజసత్యాగం అవుతుంది. అలాంటి త్యాగం చేసినవాడు త్యాగఫలం పొందలేడు.

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః॥

అర్జునా! వేదశాస్త్రాదులు విధించిన కర్మలను కర్తవ్య బుద్ధితో ఆసక్తినీ, ఫలాన్నీ విడిచిపెట్టి ఆచరించడమే సాత్త్విక త్యాగం.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥

సత్త్వగుణ సంపన్నుడు, బుద్ధిమంతుడు, సంశయరహితుడు అయిన త్యాగశీలి కామ్యాలు, కష్టప్రదాలైన కర్మలను

ద్వేషించడు: శుభప్రదాలు, సులభసాధ్యాలు అయిన కర్మలను అభిమానిస్తాడు.

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే॥

కర్మలను పూర్తిగా వదలిపెట్టడం శరీరాన్ని ధరించిన వాడికి శక్యం కాదు. కనుక కర్మఫలాలను విడిచిపెట్టిన వాడే త్యాగి.

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్॥

కర్మఫలాలను త్యాగం చేయని వాళ్ళకు మరణానంతరం తాము ఆచరించిన కర్మల ధర్మాధర్మాలను బట్టి దుఃఖకరం, సుఖప్రదం, మిశ్రమం అనే మూడు విధాలైన ఫలాలు కలుగుతాయి. అయితే కర్మఫలాలను విడిచి పెట్టిన సన్న్యాసులకు అవి అంటవు.

పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥

అర్జునా! సర్వకర్మలూ ఫలించడానికి సాంఖ్యశాస్త్రం ఐదు కారణాలు చెప్పింది. వాటిని వివరిస్తాను విను.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥

కర్మలన్నిటికీ శరీరం, జీవాత్మ, ఇంద్రియాలు, వాటి వేర్వేరు వ్యాపారాలు, దైవం అనేవి ఐదూ కారణాలు.

శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః॥

మానవుడు శరీరం, వాక్కు, మనసులతో మంచిపని కాని, చెడ్డపనికాని ఆరంభించడానికి కారణాలు ఈ ఐదే.

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః॥

కర్మలకు సంబంధించిన కారణాలు ఇలా వుండగా, బుద్ధి, సంస్కారం లేనివాడు తానే కర్తనని తలుస్తాడు. అలాంటి అవివేకి కర్మస్వరూపాన్ని కాని, ఆత్మస్వరూపాన్ని కాని సరిగా తెలుసుకోలేడు.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాఽపి స ఇమాన్ లోకాన్ న హన్తి న నిబధ్యతే॥

కర్మల విషయంలో అహంకార మమకారాలు లేనివాడు ఈ ప్రాణులన్నిటినీ చంపినా హంతకుడు కాడు; కర్మలు అతనిని బంధించవు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥

తెలివి, తెలుసుకోదగ్గది, తెలుసుకునేవాడు — ఈ మూడూ కర్మలకు కారణాలు. అలాగే కర్మకు ఆధారం-సాధనం, చేసేపని, చేసేవాడు అని మూడు విధాలు.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥

గుణాల భేదాన్ని బట్టి జ్ఞానం, కర్మ, కర్త అనే వాటిని సాంఖ్యశాస్త్రం మూడేసి విధాలుగా విభజించింది. వాటిని గురించి చెబుతాను విను.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥

విడివిడి విభాగాలుగా వుండే ప్రాణు లన్నిటిలోనూ అఖండమూ, అవినాశమూ, అవిభక్తమూ, అయిన ఆత్మ వస్తువును చూసేవాడి జ్ఞానం సాత్త్విక జ్ఞానమని తెలుసుకో.

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥

వేర్వేరుగా కనుపించే సర్వభూతాలలోని ఆత్మలు అనేక విధాలుగా వున్నాయని భావించేవాడి జ్ఞానం రాజస జ్ఞానం.

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పం చ తత్తామస ముదాహృతమ్॥

తత్త్వాన్ని తెలుసుకోకుండా, తగిన కారణం లేకుండా సమస్తమూ అదే అనే సంకుచిత దృష్టితో ఏదో ఒకే పని మీద ఆసక్తి కలిగివుండేవాడి జ్ఞానం తామస జ్ఞానం.

నియతం సంగరహితం అరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే॥

ఆసక్తి, అభిమానం, అనురాగం, ద్వేషం, ఫలాపేక్ష లేకుండా శాస్త్రసమ్మతంగా చేసే కర్మను సాత్త్వికకర్మ అంటారు.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్॥

ఫలాభిలాషతో, అహంకారముతో, అధిక ప్రయాసతో ఆచరించే కర్మను రాజసకర్మ అని చెబుతారు.

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే॥

సాధకబాధకాలనూ, తన సామర్థ్యాన్ని ఆలోచించకుండా ఆరంభించే కర్మ తామసకర్మ అవుతుంది.

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥

ఫలాపేక్ష అహంభావం విడిచిపెట్టి ధైర్యోత్సాహాలతో జయాపజయాలను లెక్క చేయకుండా కర్మలు చేసేవాణ్ణి సాత్త్వికకర్త అంటారు.

రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥

అనురాగం, కర్మఫలాసక్తి, దురాశ, పరపీడన పరాయణత్వాలతో శుచీ, శుభ్రమూ లేకుండా సుఖదుఃఖాలకు లొంగిపోతూ కర్మలు ఆచరించేవాడు రాజసకర్త అవుతాడు.

అయు క్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥

మనోనిగ్రహం, వివేకం, వినయం లేకుండా ద్రోహ బుద్ధితో, దుష్టస్వభావంతో, నిరుత్సాహంతో, నిరంతర విచార ముతో, కాలయాపనతో కర్మలు చేసేవాణ్ణి తామస కర్త అని చెబుతారు.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ పృథ క్త్వేన ధనంజయ ॥

ధనంజయా! గుణభేదాలను బట్టి బుద్ధి, ధైర్యమూ మూడేసివిధాలు. వాటిని గురించి పూర్తిగా విడివిడిగా వివరిస్తాను విను.

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ ॥

పార్థా! కర్మమార్గాన్నీ, సన్న్యాసమార్గాన్నీ, కర్తవ్యా కర్తవ్యాలనూ, భయాభయాలనూ, బంధాన్నీ, మోక్షాన్నీ గ్రహించే బుద్ధి సాత్త్వికబుద్ధి.

యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ ॥

పార్థా! ధర్మాధర్మాలనూ, కార్యాకార్యాలనూ, సరిగా తెలుసుకోలేని బుద్ధి రాజసబుద్ధి.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ ॥

పార్థా! అజ్ఞానాంధకారం వల్ల అధర్మాన్ని ధర్మంగా, ప్రతివిషయాన్నీ విరుద్ధంగా, విపరీతంగా భావించే బుద్ధి తామస బుద్ధి.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ ॥

పార్థా! మనసు, ప్రాణం, ఇంద్రియాలు – వీటి వ్యాపారాలను యోగసాధనతో నిలబెట్టగలిగే నిశ్చలధైర్యం సాత్త్విక ధైర్యం.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయ తేఽర్జున ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ ॥

పార్థా! ధర్మార్థకామాలపట్ల అభిలాష, అభిమానం, ఫలాభిలాష కలిగివుండే ధైర్యం రాజసధైర్యం.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ ॥

పార్థా! బుద్ధిలేనివాడు నిద్ర, భయం, దుఃఖం, విషాదం, మదం – వీటిని విడిచిపెట్టకుండా చేసే ధైర్యం తామస ధైర్యం.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్ ॥

భరతశ్రేష్ఠా! మానవుడికి అభ్యసించే కొద్ది ఆనందం, దుఃఖవినాశం కలగజేసే సుఖం మూడు విధాలు. దాన్ని గురించి తెలియజేస్తాను విను. ఆరంభంలో విషంలా వున్నా అంతంలో అమృతసమానమయ్యే సుఖాన్ని సాత్త్విక సుఖ మని చెబుతారు. అది నిర్మలమైన బుద్ధివల్ల కలుగుతుంది.

విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥

మొదట అమృతతుల్యంగా వుండి చివరకు విషంగా మారే సుఖం — విషయాలు, ఇంద్రియాల కలయికవల్ల కలిగేది — రాజససుఖం అవుతుంది.

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్ ॥

నిద్ర, బద్ధకం, ప్రమాదాలవల్ల జనించి, ఆదిలోనూ, అంతంలోనూ మోహం కలగజేసే సుఖాన్ని తామససుఖం అంటారు.

న తద స్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః ॥

ప్రకృతివల్ల కలిగిన ఈ మూడు గుణాలతో ముడిపడని వస్తు వేదీ భూలోకంలో కాని, స్వర్గలోకంలో కాని, దేవతలలో కాని లేదు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప ।
కర్మాణి ప్రవిభ క్తాని స్వభావ ప్రభవై ర్గుణైః ॥

పరంతపా! బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రు లకు వారి వారి స్వభావంవల్ల కలిగిన గుణాలను బట్టి కర్మలు విభజించబడ్డాయి.

శమో దమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమా స్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥

బ్రాహ్మణులకు స్వభావసిద్ధమైన కర్మలు ఇవి: మనోనిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం, తపస్సు, శుచిత్వం, ఓర్పు, సత్ప్రవర్తన, శాస్త్రజ్ఞానం, అనుభవజ్ఞానం, దేవుడి మీద నమ్మకం.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్య పలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥

పరాక్రమం, పౌరుషం, ధైర్యం, దక్షత, యుద్ధంలో పారిపోక పోవడం, దానం, పరిపాలనా సామర్థ్యం — ఇవి క్షత్రియుల కర్మలు.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

వైశ్యులకు స్వభావంవల్ల కలిగిన కర్మలు— వ్యవసాయం, పశుపోషణ, వ్యాపారం ఇక శూద్రకర్మ సేవచేయడం.

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥

తాను ఆచరించే కర్మలపట్ల శ్రద్ధ కలిగినవాడు సిద్ధి పొందుతాడు. స్వభావసిద్ధమైన తన కర్మ మీద అస క్తి వున్న వాడు ఎలా సిద్ధి పొందుతాడో చెబుతాను విను.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥

సమస్త ప్రాణుల పుట్టుకకూ పోషణకూ కారణుడై విశ్వ మంతటా వ్యాపించివున్న పరమాత్మను తనకు విధించబడ్డ కర్మలను ఆచరించడం ద్వారా అర్చించి మానవుడు పరమగతి పొందుతాడు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

బాగా ఆచరించబడ్డ ఇతరుల ధర్మంకంటె గుణం లేని దిగా కనుపించినా తన ధర్మమే మంచిది. తన ధర్మాన్ని తాను నిర్వర్తించేవాడికి పాపం అంటదు.

సహజం కర్మ కౌంతేయ ! సదోషమపి న త్యజేత్ ।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥

కౌంతేయా ! నిప్పును కప్పుకున్న పొగలాగా కర్మలన్ని టినీ దోషం ఆవరించి వుంటుంది. అందువల్ల ఏదైనా దోష మున్నా స్వభావసిద్ధమైన కర్మను విడిచిపెట్టకూడదు.

అస క్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥

అన్ని విషయాలపట్ల ఆసక్తి విడిచిపెట్టి, ఆత్మ నిగ్ర హంతో, ఆశలులేకుండా, ఫలత్యాగ బుద్ధితో కర్మలు ఆచరించే వాడు పరమోత్తమమైన కర్మాతీతస్థితి పొందుతాడు.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।
సమాసేనైవ కౌంతేయ। నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥

కౌంతేయా। నిష్కామ కర్మ సిద్ధి పొందినవాడు పర మాత్మను ఎలా పొందుతాడో, జ్ఞాననిష్ఠ అంటే ఏమిటో సంగ్ర హంగా చెబుతాను. సావధానంగా విను.

బుద్ధ్యా విశుద్ధయాయుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥

వివి క్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥

పరిశుద్ధమైన బుద్ధి కలిగి ధైర్యముతో మనసును వశ పరచుకొని, శబ్దాది విషయాలనూ రాగద్వేషాలనూ విడిచిపెట్టి ఏకాంతవాసం చేస్తూ, మితంగా తింటూ, మాటలు, శరీరం, మనసులను అదుపులో పెట్టుకుని, నిరంతరం ధ్యానయోగంలో వుంటూ, వైరాగ్యాన్ని ఆశ్రయించి అహంకారం, బలం, గర్వం,కామం,క్రోధం, వస్తుసేకరణలను వదలిపెట్టి, మమకారం లేకుండా శాంతస్వభావం కలిగినవాడు బ్రహ్మస్వరూపం పొంద డానికి అర్హుడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥

అలా బ్రహ్మస్వరూపం పొందినవాడు ప్రశాంతమైన మనసుతో దేనినీ ఆశించడు; దేనికీ దుఃఖించడు. సమస్త భూతాలనూ సమభావంతో చూస్తూ నా పట్ల పరమభక్తి కలిగి వుంటాడు.

భక్త్యా మామభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥

భక్తివల్ల అతను నేను ఎంతటివాడినో, ఎలాంటివాడినో యథార్థంగా తెలుసుకుంటాడు. నా స్వరూప స్వభావాలను గ్రహించిన అనంతరం నాలో ప్రవేశిస్తాడు.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥

కర్మ లన్నిటినీ ఎప్పుడూ ఆచరిస్తున్నప్పటికీ నన్ను ఆశ్రయించేవాడు నా అనుగ్రహం వల్ల శాశ్వతమూ, నాశరహి తమూ, అయిన మోక్షం పొందుతాడు.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ ॥

హృదయపూర్వకంగా అన్ని కర్మలూ నాకే అర్పించి, నన్నే పరమగతిగా భావించి ధ్యానయోగాన్ని అవలంబించి, నీ మనసు నిరంతరం నా మీదే వుంచు.

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథ చేత్త్వమహంకారాత్ న శ్రోష్యసి వినజ్క్ష్యసి ॥

నా మీద మనసు నిలిపితే నా అనుగ్రహంవల్ల సంసార సంబంధమైన ప్రతి ఒక్క ప్రతిబంధకాన్నీ అతిక్రమిస్తావు. అలా కాకుండా అహంకారముతో నా ఉపదేశాన్ని పెడచెవిని పెడితే చెడిపోతావు.

యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥

అహంకారంవల్ల యుద్ధం చేయకూడదని నీవు భావిం చినా ఆ ప్రయత్నం ఫలించదు. ఎందువల్లనంటే నీ స్వభా వమే నీ చేత యుద్ధం చేయించి తీరుతుంది.

స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥

కౌంతేయా ! అవివేకంవల్ల నీవు ఇష్టపడక పోయినా, స్వభావసిద్ధమైన స్వధర్మసిద్ధమైన స్వధర్మకర్మకు కట్టుబడి పరాధీనుడవై ఆ పని తప్పకుండా చేస్తావు.

(41వ పేజీలో)

# వెల్లటూరులోని శివకేశవాలయాలు



వెల్లటూరు చాల ప్రసిద్ధమైన పురాతన గ్రామము. దానికే శ్వేతపురి అను నామాంతరము గూడా కలదు. ఇచ్చటి దేవాలయములలో నున్న క్రీ. శ. 1419 వ సంవత్సరము నాటి శాసనములో ఈ ఊరు "వెలంటూరు" యని పేర్కొనబడినది. ప్రాచీనమైన యీ వూరు ప్రస్తుత కాలములోను ప్రసిద్ధి చెందియున్నది. 1970 నుండి యిక్కడి జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో అఖిల భారత చిత్ర కళా ప్రదర్శనమును నవరంగ్ చిత్రకళానికేతన్ యను సంఘము వారు జయప్రదముగా ప్రతివర్షము నిర్వహించుచున్నారు.

వెల్లటూరు గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో నున్నది. రైలు మార్గమున భట్టిప్రోలునకు రెండు మైళ్ళలోను, బస్సు మార్గమునకు సమీపముగా కలదు. 'కృష్ణా మాహాత్మ్యము' అను గ్రంథము ద్వారా యీ ఊరుయొక్క అసలు పేరు తెల్లటూరు యని తెలియుచున్నది. ఈ పేరెటుల వచ్చినది యీ క్రింది కథ తెల్పును.

పూర్వము వెలనాడు ప్రాంతము నేలిన ఒక రాజునకు ఒక కుమారుడు కుమార్తె కలరు. అతను పెక్కు కష్టములు పడి దీనావస్థలో గతించెను. అప్పుడతని బంధువులు రాకుమార్తె రాకుమారులను చిఱుత ప్రాయమునుండి పెంచిరి. అందుచే వారిరువురు తమ జన్మవృత్తాంతమును విస్మరించిరి. విధివిలాసముచే వారిద్దరకు వివాహము జరిగినది. కొంతకాలము తర్వాత వారికి తమ జన్మ వృత్తాంతము తెలియగా జరిగిన పాపమునకు పరితపించిరి. ఈ పాపపరిహారమునకు గాను వారు నల్లబట్టలను ధరించి కృష్ణానదీ తీరమునందలి పుణ్య క్షేత్రములను దర్శించిరి. అట్టితఱి వీరు వెల్లటూరులోని అగస్త్యేశ్వరుని దర్శించగా వారి దురితము అదృశ్యమయ్యెను. వారు ధరించిన నల్లనిపలువలు శ్వేతవస్త్రములుగా మారెను.



శ్రీ శారదాదేవి

అందుచే ఈ వూరునకు శ్వేతపురి లేక 'తెల్లటూరు' యను సార్థకనామము వచ్చినది. కాలక్రమమున నీ పేరు ఇప్పటి వెల్లటూరుగా మారినది. కొండవీటిరెడ్డిరాజుల కాలములో నీ యూరు వారి సైన్యమునకు స్థావరముగా నుండెననియు పూర్వము వారి రాతికోట యిక్కడ ఉండెననియు డాక్టరు యశోదాదేవిగారి అభిప్రాయము. ప్రస్తుతము వెల్లటూరులో మూడు ముఖ్యమైన దేవళములు గలవు. అవి ఈ క్రింద వ్రాయబడినవి.



౧. అగస్త్యేశ్వరాలయము
౨. సిద్ధి వినాయకుడిగుడి
౩. చెన్నకేశవాలయము

అగస్త్యేశ్వరాలయములోని శివలింగము పూర్వము అగస్త్య మహర్షి ప్రతిష్ఠించెనని యిచటి స్థలపురాణము తెల్పుచున్నది. స్థలపురాణము ప్రకారము జరిగిన కథ యిటులున్నది. అగస్త్యమహర్షి కృష్ణానదీ తీరమున ప్రతిదినము ప్రాతఃకాలమున సంధ్యావందన మాచరించెడివాడు. ఒకనాడు నిష్ఠలో సూర్యోదయ కాలమును గమనింపలేదు. మరియు రుద్రాభిషేక సమయము గూడా దాటిపోవు చుండెను. అట్టితఱి బాహ్యస్మృతి కలుగగా కండ్లు తెరచి శీఘ్రముగా స్వహస్తముతో కృష్ణలోని సైకతముచే శివలింగమును ప్రతిష్ఠించి అభిషేక మాచరించెను. తత్కారణమున నీ దేవునకు అగస్త్యేశ్వరుడు యను సార్థక నామధేయము కల్గెను. ఈ సైకతలింగమున కడుగున పానవట్టము కలదు. గర్భగుడి పైన గల గోపురము పూర్వమే నిర్మింపబడినది. గర్భగుడికి ముఖమంటపమునకు మధ్య అంతరాళము గలదు. ముఖ మంట

వము పైన గల విమానమును 19 వ శతాబ్దములో నొక శివభక్తుడు నిర్మించెను. దీని వంటుకొని నుత్తరముగా బాలా త్రిపుర సుందరి అమ్మవారి గుడికలదు. అగస్త్యేశ్వరుని ప్రక్కన కుడివైపున వినాయకుడు, ఎడమవైపున సుబ్రహ్మణ్యస్వామి విగ్రహములు గలవు. ముఖమంటపము మధ్యలో శివలింగమున కెదురుగా నందీశ్వరుడు కలదు. ఆలయము వెలుపల వేరొక నందీశ్వరుడు, వెనుకన ధ్వజస్తంభము కలవు. వీని ప్రక్కనే ఎత్తైన కల్యాణమండపము ఉన్నది.

ఈ దేవాలయములో విశిష్టమైన కాంస్య విగ్రహము కలదు. ఇది చక్రాకారములో మన్నది. ఈ చక్రములో ఓం అక్షరాకారము ఊర్ధ్వముఖముగా నున్నది. ఈ అక్షరములోనున్న మూడు వ్రేళ్ళపైన బ్రహ్మ, పంచముఖ రుద్ర, భృంగిల కాంస్య విగ్రహములు కలవు. చక్రముపైన కీర్తిముఖము, అడుగున మహిషాసురమర్దని, ఇరుప్రక్కల వినాయక, కార్తికేయ, వీరభద్ర, లక్ష్మీ సరస్వతుల చిన్న ప్రతిమలు కలవు. ఈ విగ్రహము యొక్క నిర్మాణ కౌశలము మధ్య యుగపు ఆంధ్రదేశములోని పాంచాలుర శిల్పకళా నైపుణ్యమును చాటుతున్నది. ఈ దేవాలయ ప్రాంగణములో చిన్న నంది గల శిలాఫలకము కలదు. నంది క్రింద తెలుగులిపిలో నున్న రాతి శాసనమున్నది. ఈ శాసనములో శక సంవత్సరము 1340 (క్రీ. శ. 1419) విలంబినామసంవత్సర, కార్తికశుద్ధఏకాదశిశనివారము అని వున్నది. కొండవీటి రెడ్డిరాజయిన పెదకోమటి వేమారెడ్డి (క్రీ. శ. 1402-20) యొక్క ఎక్కట్లు (యుద్ధసైనికబృందము) అగస్త్యేశ్వర దేవాలయమునకు గృహారామ క్షేత్రములను పైన పేర్కొనిన కాలములో దానము చేసినట్లిది తెల్పుచున్నది.

ఈ దేవాలయమున కెదురుగా అనేక దైవమందిరములు కలవు. వీటిని యీ గ్రామపు పెద్దభూస్వామి తాడికొండశేషయ్య



చక్రాకార కాంస్య విగ్రహం

గారు 19 శతాబ్దములో కట్టించిరి. సిద్ధి వినాయకుని గుడిలో వినాయకుని విగ్రహము ప్రక్కనే భార్యలైన సిద్ధి, బుద్ధులు, క్రింద మూషికవాహనము కలవు. ప్రతి ఏటా మాఘ శుద్ధ చవితినాడు గణపతికి సిద్ధి బుద్ధి దేవీలతో వివాహమహోత్సవము దివ్యముగా జరుగును. అపుడే ఇక్కడ ఉత్సవములు జరుపుదురు. ఈ గుడి ప్రక్కనే కామేశ్వరి, భీమేశ్వరుడు, రాజేశ్వరుల దేవాలయములు గలవు. వీనికి ప్రక్కనే ఉత్తరమున శంకరమఠము కలదు. ఈ మఠములో ఆదిశంకరాచార్య, శారదాదేవీల విగ్రహములను శృంగేరీ మఠ పీఠాధిపతులైన శ్రీ అభినవవిద్యానందస్వాములవారు 1970 వ సంవత్సరమున ప్రతిష్ఠించిరి.

ఇక మూడవది అయిన చెన్నకేశవాలయము గూర్చి వర్ణించవలసి యున్నది. ఈ ఆలయము గ్రామము మధ్యలో నున్నది. దీని గర్భగుడిలో చెన్నకేశవస్వామి, యిరుపంకల శ్రీ లక్ష్మి, భూలక్ష్మి దేవేరులు గలరు. చెన్నకేశవునిపై కుడి చేతిలో శంఖము ఎడమచేతిలో చక్రము, క్రింది కుడిచేయి అభయముద్రలోను, ఎడమచేతిలో గద కలవు. గర్భగుడి ముఖమంటపముల మధ్య అంతరాళము కలదు. గుడిపైన శిఖరము కలదు. ఎదురుగా ఆంజనేయస్వామి గుడి వున్నది. ఆలయప్రాంగణములో గరుత్మంతుని విగ్రహము క్రింద తెలుగు శాసనముగల రాతిస్తంభము కానవగును. ఈ శాసనముపై నుల్లేఖించబడిన రాతిశాసనకాలము నాటిదే. పెదకోమటి వేమారెడ్డి (క్రీ. శ. 1402-20) యొక్క ఎక్కట్లు (యుద్ధసైనిక బృందము) చెన్నకేశవాలయమునకు గృహ రామ క్షేత్రములను దానముచేసిన ట్లిది నుడువు చున్నది. ఊరిమధ్యలో వేపచెట్టు క్రింద పోతరాజు విగ్రహము కలదు. రాతిపై వీరపురుషుడు అతని చేతిలో కరవాలమున్న ప్రతిమ కలదు. మధ్యయుగపు ఆంధ్రదేశములో నీ వీరకల్లుల పూజ ప్రతిపల్లెలోని, పట్టణములోని ప్రజలు బాగా చేయుచుండిరి. అందుచే ఇది 'వీరకల్లు' అయి వుండును. వీరచారమను మతసంప్రదాయము ఆంధ్ర సంఘములో వ్యాప్తిలోనికి వచ్చెను. వెల్లటూరునకు పడమటి దిక్కున గ్రామ దేవతయైన కట్టమ్మ గుడి కలదు.

— డా॥ కె. రాధాకృష్ణమూర్తి





# ఫలశ్రుతులు

—శ్రీ పాలకోడేటి జగన్నాథరావు



సంస్కృతసాహిత్యంలో భగవంతుని స్తుతించే స్తోత్రాలు, సుప్రభాతాలు, అష్టకాలు, మంగళాశాసనాలు, హృదయాలు (ఆదిత్య హృదయాదులు), కవచాలు (హనుమత్కవ చాదులు) ఇలా ఎన్నో ఉన్నాయి. ఈ స్తోత్ర సాహిత్యాన్ని చతుర్విధపురుషార్థసాధకా లుగా, ఇష్టకామ్యార్థసిద్ధిప్రదాలుగా, ఇహపర సౌఖ్యసంధాయికలుగా భావించి భక్తులు నిత్యంపఠిస్తూ ఉంటారు. భక్తితోవీనిని చది వితే పైవన్నీ సిద్ధిస్తాయని తత్కర్తలయిన వ్యాసాదిమహర్షులు, శంకరాచార్యాది ప్రవక్తలు వాని చివర ఫలశ్రుతుల రూపంలో హామీ లిచ్చారు. కాని ప్రత్యక్షజ్ఞానప్రమాణ పరులైన వైజ్ఞానికులు, పురుషశక్తి ప్రధాన వాదులైన హేతువాదులు ఫలశ్రుతుల ఫల ప్రాప్తి ప్రామాణ్యాన్ని గూర్చి వింత ప్రశ్నలతో హేళన చేస్తుంటారు.

తత్ర తత్రార్థలాభశ్చ
విజయః సార్వకామికః,
యం యం చింతయతే కామం
తం తం ప్రాప్నోతి నిశ్చితమ్.

వరాహపురాణము- శ్రీదుర్గాకవచము.

అని చెప్పిన శ్రీదుర్గాకవచాన్ని చదివి ఏ కృషి చేయకపోయినా తలచిన వనులన్నీ జరిగిపోతాయా??

ఏకకాలే పఠేన్నిత్యం మహాపాపవినాశనమ్ అని చెప్పిన లక్ష్మ్యష్టకాన్ని ఒక్కసారి చదివితే చేసిన పాపాలన్నీ పోతాయా?? సెంటు పొలం లేనివాడు కూడ.

ద్వికాలే పఠేన్నిత్యం ధనధాన్యసమన్వి తమ్.

అని చెప్పిన ప్రకారం ధనధాన్య సమన్వితు డౌతాడా? త్రికాలే పఠేన్నిత్యం మహాశత్రు వినాశనమ్ అని లక్ష్మ్యష్టకం చెప్పింది కదా యని యుద్ధభూమిలో నిలబడి దాన్ని మూడుసార్లు చదివితే శత్రువులంతా చచ్చి పోతారా?

వైజ్ఞానికులు- హేతువాదులు ఫలశ్రుతు లను సూటిగా ప్రశ్నించే ప్రశ్నల్లో యివి కొన్నిమాత్రమే. ఈలాంటి ప్రశ్నలు వేసే వారినినాస్తికులనిపాషండులని నిందించటం కంటే ఫలశ్రుతుల అంతర్యాన్ని సోపపత్తి కంగా వివరించటం ఆస్తికులైనవారు తమనైతిక బాధ్యతగా గ్రహించాలి.

చతుర్విధ పురుషార్థసాధనమే జీవితపర మార్థమని హిందూగ్రంథాలన్నీ చెపు తున్నాయి. కాని రెండవ పురుషార్థమైన కామాన్ని (కోరికను) సాధించుకొనే ప్రయ త్నంలో మానవసమాజ మెప్పుడూ అప మార్గాన్నే అనుసరిస్తోంది. ఈ కామానికి లక్ష్య మర్థం కావటంచేత జీవనపోరాటంలో ఈ రెండే ప్రధానపాత్రలు వహిస్తున్నాయి. లౌకికజీవిత సౌఖ్యాన్నిచ్చేది అర్థం (సంప దలు). అయితే దాని సంపాదన కంతః ప్రేరణ నిచ్చేది "కామం" (కోరిక) కావటం చేత మానవాళిపురోగతి కిది యెంత ప్రేరణ కల్గిస్తోందో అధోగతికికూడ అంతకంటే అధిక దోహదం చేస్తోంది. అడవుల్లోఉండే జంతు వులతోబాటుగా ఒక జంతువుగా అనాగరక జీవితాన్ని గడిపిన మానవుణ్ణి నేటి విజ్ఞాన మయ నాగరకతాశిఖరాల నధిష్ఠింపచేసిన అతనిలోని "కామన" యే తన పరిధులను దాటి ఆ నాగరక మానవ సమాజాన్ని తిరిగి జంతుదశకు మళ్లిస్తున్న కఠిన సత్యం మానవత్వాన్ని కాలరాచి దానవత్వంతో ప్రవర్తిస్తున్న సమాజంలో మనుషుల్ని చూస్తున్నప్పుడు మనకు బోధపడుతుంది. సమాజాన్ని దానవత్వానికి మళ్ళించి పాప కర్మలను చేయించే బలవత్తరమైన శక్తి ఏది?

అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ
బలాదివ నియోజితః.

(గీత. కర్మ. 36)

అని యడిగిన అర్జునుని ప్రశ్నకు కృష్ణుడు-

కామ ఏష క్రోధ ఏష
రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేన మిహ వైరిణమ్.

(గీత. కర్మ. . 37)

కామమే అని మొదట పేర్కొన్నాడు.

ఈ కామానికి బీజం భౌతికవిషయాల మీద మానవున కుండే ఆసక్తి. దీనియందు మానవుని మనసులగ్నమయిందాక్రమంగా కామం; క్రోధం; మోహం; స్మృతివినాశనం బుద్ధివినాశనం: కల్గి చివరికి మనిషి సర్వ నాశనం పొందుతాడంటూ-

ధ్యాయతో విషయాన్ పుంసః
సంగ స్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోఽభిజాయతే

క్రోధా ద్భవతి సమ్మోహః
సమ్మోహాత్ స్మృతి విభ్రమః,

స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో
బుద్ధినాశాత్ప్రణశ్యతి.
(గీత. సాంఖ్య యోగము)

అని భగవద్గీత హెచ్చరించింది. చెలియలికట్ట దాటివచ్చి సముద్రం చేసే బహిః ప్రళయంకన్నా మానవాళిలో అంతరంగా ఉండే "కామం" చేసే అంతరప్రళయాన్ని గుర్తించి, పాపకారియైన యీ కామం ఎంతటి జ్ఞానినైనా పట్టుకుంటుందని

ఆవృతం జానమేతేన
జానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ
దుష్పూరే ణానలేన చ.
(గీత. కర్మ. 39)

కామాని కుండే ప్రబలశక్తిని నిరూపించి

తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం
జ్ఞానవిజ్ఞాన నాశనమ్.
(కర్మ. యో. 41)

పాపకారి- నిత్యవైరియైన కామాన్ని విడువమని గీత ఆదేశిస్తోంది.

వేదతుల్యమైన భగవద్గీత ప్రభుసమ్మితంగా చెప్పిన ఈ ఆదేశాన్నే మానవ సమాజం మీద సహజదయాళువులైన ఋషులు- మతప్రవక్తలు స్తోత్రసాహిత్యం ద్వారా కాంతాసమ్మితంగా ప్రబోధించారు.

ఈ పద్ధతిలో స్త్రీ తన భర్తను తన కనుకూలునిగా చేసికొనడానికి తనయందాతనికుండే అనురాగాన్నే ఆలంబనంగా తీసికొనునట్లు ఋష్యాదులు మానవునిలో సహజంగా ఉండే "కామభావన"నే ఆలంబనంగాచేసికొని వారిని తమవైపు త్రిప్పుకొన్నారు. స్వోన్ముఖంగా తిరిగిన భర్తలోని అనురాగాన్ని భార్య తన హావభావ విలాసచేష్టలద్వారా ప్రబోధనం చేసియున్నట్లు ఋష్యాదులు స్వోన్ముఖమైన మానవసమాజంలోని కామభావనకు ప్రబోధనం కల్గించటంకోసమే చెప్పినవి ఫలశ్రుతులు. అనురక్తుడై స్వోన్ముఖుడైన భర్తను భార్య సన్మార్గానికి త్రిప్పునట్లుగా అనురక్తులై స్వోన్ముఖులైన మానవాళిని సన్మార్గానికి త్రిప్పటమే యీ ఫలశ్రుతులు చెప్పటంలోని ఋష్యాదుల ఆంతర్యం. అంతేకాని ఫలశ్రుతులద్వారా మావవ సమాజంలో నిర్హేతుక మూఢభావాలను ప్రచారంచేయాలని కాదు.

తన మనసులోని కోర్కెలను కష్టపడి సాధించుకోవాలనే ప్రకృతికంటే సులభోపాయంతో సాధించుకోవాలనే ప్రవృత్తే మానవునిలో అధికం. మిడతలు అగ్నిని చూచి ఎగబడి నాశనమౌతున్నట్లుగా సులభంగా లక్షలు- కోట్లు సంపాదింపవచ్చుననే పేరాశతో లాటరీలకు మట్కాజూదానికి; గుఱ్ఱపుపందాలకు ఎగబడి నష్టపడుతున్న వ్యక్తులను చూచినపుడు మానవుని ప్రకృతి మన కర్థమౌతుంది. అంతేకాక మానవుడాశాజీవి. ఏ పని చేసినా ఏదో ఆశతోనే చేస్తాడు. మనస్తత్త్వవేత్తలైన ఋషులు మానవునిలోని యీ బలహీనతను గుర్తించి, ఆతనిలోని కామనభావాన్ని ఫలశ్రుతులద్వారా తృప్తిపరచి మానవసమాజాన్ని తమ కభిముఖంగా త్రిప్పుకొన్నారు. బలవంతంగా గాక మృదువుగా సమాజాన్ని ఋషులమార్గానికి మరలించడానికి ఫలశ్రుతు లెంతో మార్దవమార్గాన్ననుసరించాయి. కోరికల వెల్లువలో కొట్టుకుపోతూ భగవన్మార్గానికి దూరమైపోతున్న మూర్ఖజనావళిని

"మూర్ఖం ఛందానురోధేన గృహ్ణీయాత్" అను సూక్త్యను సారం అనుసరించి ప్రవర్తించటంలో ఫల శ్రుతులు సఫలీకృతమై క్రమంగా వశపరచు కోగలిగాయి.

నిజానికి ఫలశ్రుతులన్నీ చేదుమందు మీద పూసిన పంచదారపూతవంటివి మాత్రమే. రోగిచేత చేదుమందు తిన్పించి ఆరోగ్యవంతుని చేయుట వైద్యుని లక్ష్యమై పంచదారపూత తిన్పించటం ముఖ్యోద్దేశం కానట్లు, మానవహృదయాలను కశ్మలంచేసే కామక్రోధాదిదుర్గుణాలను సంహరింపజేసే స్తోత్ర- అష్టకాది సాహిత్యరూపంలో ఉన్న చేదుమందును మానవసమాజంచేత తిన్పించటమే ఋషుల మతప్రవక్తల లక్ష్యంగాని పంచదారపూతవంటి ఫలశ్రుతులను తిన్పించటం మాత్రం కాదు.

పంచదారపూతలు చేదుమందును రుచులను గ్రహించే జిహ్వేంద్రియాన్ని దాటించేవరకే పరిమితం. ఆ తరువాత మందు తన పనిని నిర్వహిస్తుంది. అలాగే మానవాళిని భగవదున్ముఖం చేసేవరకే ఫలశ్రుతుల ప్రయోజనం. ఆ తరువాత స్తోత్ర అష్టకాది

33.వ పేజీలో

## కళావని

"ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పర పీడన పరాయణత్వం" – శ్రీ శ్రీ

అన్నట్లుగా భారతదేశ చరిత్ర పుటల్లోను పరపీడనం స్థానం చేసికొంది. ఏ దేశ చరిత్రగాని, ఏ రాజు చరిత్రగాని చరిత్ర పుటల్లో సువర్ణాక్షరాలతో లిఖింపబడాలంటే నాటి సంస్కృతీ వైభవానికి ప్రతీకలైన **లలితకళలు** (కవిత్వం, సంగీతం, శిల్పం, చిత్రలేఖనం, నాట్యాలు) సమున్నతంగా పోషింపబడాలి.

దాయాలకు ఆకర్షింపబడని విదేశం లేదు. అందువలననే విదేశాలు మన సంస్కృతి సంప్రదాయాలకు ప్రతీకలైన లలితకళలకు పెద్ద పెద్ద పీటలు వేసి పోషించి ప్రచారం చేస్తున్నారు. ఇట్టి సమయంలో మన ప్రజానీకం ప్రభుత్వం మన సంస్కృతిని సంప్రదాయాలను సమాదరించని యెడల మన విజ్ఞానవేత్తలు, మేధావులు, విదేశములకు వలసబోయి నట్లుగనే మన కవులు, సంగీత విద్వాంసులు, శిల్పులు, చిత్రలేఖకులు, నాట్యాచార్యులును విదేశములకు వలసబోవు ప్రమాద మున్నది. ఇట్టి తరి వీరికి సముచిత స్థానమిచ్చి పోషించుకొనుట ప్రజాప్రభుత్వ కర్తవ్యం.

కర్తవ్య మెఱింగిన ప్రజాప్రభుత్వములు రెండును లలితకళల నాదరించు టారం ప్రచారంలో ఉన్నట్లు హాలుని "గాథా సప్తశతి" తెలుపుతోంది.

భారతీయులకు తొలి లక్షణ గ్రంథమైన భరతుని నాట్యశాస్త్రంలో ఆంధ్రులు నృత్త గీత వాద్య ప్రియులని ప్రశంసించబడ్డారు. కూచిపూడి నాట్యానికి తొలి లక్షణ గ్రంథం భరతుని నాట్యశాస్త్రం, పిమ్మట నందికేశ్వరుని అభినయ దర్పణం. ఈ అభినయదర్పణ ప్రతులు తొలుత తెలుగు లిపిలో లభించుట ఒక విశేషం. దీనిని బట్టి నందికేశ్వరుడు ఆంధ్రుడని విశ్వసించబడుతున్నాడు.

క్రీ. శ. 13 వ శతాబ్దంలో రచింపబడిన జాయపసేనాని 'నృత్తరత్నావళి' ఆంధ్రుల నృత్య కళౌన్నత్యానికి నికషోపలం. అంతే కాదు. ఎందరో రాజులు ఎన్నో సంగీత నృత్య లక్షణ గ్రంథాలను వెలయించారు.



# కూచిపూడి నాట్యశైలూషి

— డా॥ చింతా రామనాథం

**భారతదేశంలో** కూచిపూడి నాట్యం, **భరతనాట్యం, కథాకళి, ఒడిస్సీ, మణిపురి, కథక్** యిత్యాది శాస్త్రీయ నాట్య సంప్రదాయా లన్నింటిలో కూచిపూడి నాట్యకళ పురాతనమైనదని తెలుపుట కీ వ్యాసం లక్ష్యం కాగలదు.

**భారతదేశానికి** స్వాతంత్ర్యం వచ్చి మూడున్నర దశాబ్దాలైతే గాని లలితకళల పునరుద్ధరణకు తద్వారా మన సంస్కృతి పునరుజ్జీవనానికి అవకాశం రాలేదు. ఇప్పుడిప్పుడే ప్రభుత్వం లలితకళల ప్రాశస్త్యాన్ని ప్రయోజనాన్ని గుర్తించి ప్రోత్సహిస్తోంది. దానికి కారణం లేకపోలేదు. నేడు భారత దేశమును విదేశాల ప్రగతితో పోల్చిచూచిన అన్ని రంగాలలోను అడుగునే ఉన్నది. విదేశీయు లన్నింట అధికులే. కాని విదేశీయులు సాధించలేని సంస్కృతి, ఆధ్యాత్మికౌన్నత్య విషయాలలో భారతదేశం బహు దొడ్డది. నేడు భారతీయ సంస్కృతి సంప్రభించినవి. ఇట్టి ఆదరణ పొందుచున్న వాటిలో కూచిపూడి నాట్యకళ ఒకటి. పైన తెల్పినట్లుగనే నేడు విదేశాలలో కూచిపూడి ఆర్టు అకాడమీలు స్థాపించబడ్డాయి. నేడు కూచిపూడి కుగ్రామం భారతదేశ పటంలోనే గాక ప్రపంచపటంలో సుస్థిరమైన స్థానమాక్రమించుకొంది. ఇట్టి కూచిపూడి నాట్యానికి చరిత్ర పుటల్లోని స్థానాన్నీ పురాతనత్వాన్నీ తెలుపుటే ఈనా వ్యాసోద్దేశం.

పైన పేర్కొనిన భారతదేశంలోని నాట్య సంప్రదాయా లన్నింటిలోకి మిన్నయైంది. పురాతనమైంది కూచిపూడి నాట్యం. ఇది ఆంధ్రదేశానికి నడిబొడ్డు అయిన కృష్ణాజిల్లా మొవ్వ తాలూకాలోని కూచిపూడిలో తిష్ఠవేసి ఆంధ్రుల జాతీయ నాట్యకళ – కూచిపూడి నాట్యకళగా భాసించుట ఆరుకోట్ల ఆంధ్రులు గర్వించతగిన విషయం. అసలు ఆంధ్రదేశంలో క్రీస్తు పూర్వమే నాట్యకళ ఈ విధంగా ఆంధ్రదేశం నాట్యానికి అధిదేవతయైన నటరాజును అర్చించే ఆది పీఠమై అలరారుతోంది.

### శివకేశవులు — కూచిపూడి నాట్యం

శివకవులలో ప్రముఖుడైన పాల్కురికి సోమనాథుడు 'పండితారాధ్య చరిత్ర' 'బసవ పురాణం' అనే గ్రంథాలు రచించాడు. అందు శ్రీశైలంలో శివరాత్రి నాటి రాత్రి జరుగు జాగరణలోని విశేషాలు వర్ణించాడు. వాటిలో మార్గీయ దేశీయ నృత్యాలు ప్రజలకు వినోదాన్ని, ఆనందాన్ని అందిస్తున్నాయని తెలిపాడు. 'శివలీలలు' శివరాత్రి నాటి రాత్రి ప్రదర్శించుట పరిపాటి. ఈ శివలీల ప్రదర్శనలు కూచిపూడి వారివే నను ఆచార్య శ్రీవిస్సా అప్పారావుగారి యభిప్రాయమే నిజమైతే కూచిపూడి నాట్యకళ క్రీ. శ. 12, 13 శతాబ్దాలకే ఉత్కృష్టమైన దశలో ఉందని ఊహించవచ్చు.

## విజయనగర రాజులు
## కూచిపూడి నాట్యం

కూచిపూడి భాగవతుల ప్రసక్తి ప్రథమంగా మాచుపల్లి కైఫీయత్తులో పేర్కొనబడింది. ఇదియే చరిత్ర పుటల్లో కూచిపూడి నాట్యానికి లభించిన ప్రథమస్థానము. కూచిపూడి నాట్య తొలి చారిత్ర కాధారమును కనుగొనిన మహనీయుడు డా॥ నేలటూరు వేంకట రమణయ్యగారు.

క్రీ. శ. 1505 – 1509 లో వీర నరసింహ రాయలు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. వీరనరసింహరాయల సమక్షంలో కూచిపూడి భాగవతులు ఒక కేళిక ప్రదర్శించినట్లు స్పష్టమౌతోంది. సంబెట గురవరాజు సిద్ధవటం సీమకు వీరనరసింహ రాయలు ప్రతినిధిగా పరిపాలన సాగింది.



## మాచుపల్లి కైఫీయత్తు: కూచిపూడి నాట్యం

"సంబెట గురవరాజు చాలా ధినములు జీవించి ప్రభుత్వము చేసినందున ఆయనను తాత గురవరాజు అని చెప్పుకునేవారు. ఆ గురవరాజు ప్రభుత్వంలో ప్రజలకు అతి దారుణంగ శిక్ష వేయిస్తూ వుండేవారు. ప్రజలు త్వరగా సొమ్ము యివ్వకపోతే స్త్రీలను తీసుకువచ్చి స్తనాలకు చిరుతలు పట్టించేవారు. అలాంటి దినములలో వినుకొండ తట్టున కూచిపూడి అనే గ్రామం నుంచి బ్రాహ్మణ భాగవతులనే వేషధారులు కీర్తన నిమిత్తమై ఈ స్థలమునకు (మాచుపల్లి) వచ్చి వుండి సంబెట గురవరాజుగారి యొక్క దారుణ ప్రభుత్వం చూసి యిక్కడ నుండి లేచిపోయి విద్యానగరమునకు పోయి అక్కడ వీర నరసింహరాయలు రాజ్యపాలనము చేస్తూవుండగా భాగవతులు దర్శనం అయి, కేళిక (ఆట) అడుగగా శలవు యిచ్చినాడు. కూచిపూడి మేళంవారు చాలా విద్యావంతులని ప్రసిద్ధిగా వినికిడి ఉన్నందున రాయలవారు స్త్రీలు సహా చూడవలెనని నగర్లవద్ద దివాణములో కీర్తనకు శలవు యిచ్చినారు. అక్కడ కీర్తన వినికి చేసేటప్పుడు సంబెట గురవరాజు వేషం వేసికొని ఒకడు, యిద్దరు బంట్రోతుల వేషాలు వేసుకొని, సంబెట గురవరాజు వలెనే ఆ వేషగాడు కూర్చుండి రాయల సమక్షమందు ఒక స్త్రీ యొక్క స్తనాలకు చిరుతలు పట్టించి సొమ్ము యివ్వమని తహశీలు చేసినట్లు వినికి చేసినారు.

అప్పుడు రాయలవారు చూసి అది యేమి యని యడుగ ముఖస్తులయిన వారు భాగవతుల ముఖతా ఆవర్తమానము తెలిసి సిద్ధవటం సీమలో సంబెట గురవరాజు అనే ఆయన ప్రజలవద్ద నుంచి ద్రవ్యాకర్షణ చేసే యెడల స్త్రీలను తీసుకుపోయి యీ ప్రకారముగనే తహశీలు చేస్తున్నారు. కనుక యేలిన వారికి తేట పడేందుకై ఈ ప్రకారం వేషములు కట్టి వినికి చేసినారని విన్నపం శాయగా, చాలా తీక్షణం చేసి మరునాడు ఉదయమందు ఆ సంగతి తిరుగా జ్ఞాపకం సేయమని ముఖస్తులైనవారికి ఆజ్ఞ యిచ్చినారు. ఆ రాత్రి కీర్తన సొంతమైన వెనుక తెల్లవారిన పిమ్మట రాయలవారు కాలోచిత కృత్యములు తీర్చికొని ఆస్థానమునకు వచ్చి పేరోలగమున నుండి తనవద్ద కార్యభారకులు వచ్చి సంబెట గురవరాజుగారి వర్తమానం జ్ఞాపకం సేయగా విని ప్రధానులను, సేనా నాయకులను పిలిపించి ముహిమం (ఒక ముఖ్య కార్యం) కు సైన్యం సిద్ధం చేయించవలసినదని శలవు యివ్వగా, ఆస్థాన పంజరములో చిలుక జయం జయం జయం అని మూడు

సార్లు పలికినది. ఆ పలుకులు మహారాజు విని యిదే మనకు శుభశకునము అని అప్పుడే పేషుఖానే బయట వేయించి సిబ్బంది బట్ట వాడాలుగ చేయించి సైన్యం యావత్తుకు ఖర్చు వెచ్చములు యిప్పించి ఆముహిమకు రాయల కుమారుడనిపించు కొని వున్న యిసుమాలు ఖానుడనే తురక సర్దారుడుగా మొకర్రరు (నిర్ణయము) చేసి, అతనిని పిలిపించి, సమక్షమందు వలసిన బుద్ధిమంతులు శలవు యిచ్చి తాంబూలం యివ్వగా, ఆ సరదారుడు తాంబూలం అందుకొని సంబెట గురవరాజు తలతెస్తున్నానని ప్రతిజ్ఞ పలికి సైన్యమును వెంటబెట్టుకవచ్చి గురవరాజుగారు వున్న కోటకు పశ్చిమపైపునవున్న బండ్లకనమ మీద లడాయిచేసి, కనుమపైవున్న చౌకి విరగబొడిచి, కనుమ పారు అయివచ్చి కోటకు పశ్చిమభాగమందు దిగివుండి, ఆ దినం రాత్రి కోటకు పశ్చిమపైపునవున్న గుండ్లకట్ట అనే సన్నకొండమీదను దమదమాలు యెత్తి మొహర్జాలు [ఫిరంగిపెట్టి దిబ్బ] గాయంచేసి కోటమీద లడాయి సురువు చేసినంతట శక్తివున్నంత మట్టుకు కోటలోనుంచిన్నీ, వేటువారు జవాబు యిచ్చినారు. అంతట కోటలో నిభావు చెయ్యలేక కౌలుమీద (అభయం పొంది) కోట యివ్వగా అప్పుడా గురవరాజును పట్టుకొని తలతీసికొని పోయినారు. కోటలో స్త్రీలు బాలురు అందరు దేహత్యాగము చేసినారు...."

ఈ కైఫియత్తును పరిశీలింపగా క్రీ. శ. 1505 నకు పూర్వమే కూచిపూడి భాగవతులు భరత విద్యావేత్తలుగ ప్రసిద్ధి పొందినట్లు తెలుస్తుంది. కూచిపూడి భాగవతులు తమ నాట్యకళను సాధనంగా చేసికొని ఒక సాంఘిక ప్రయోజనాన్ని సాధించుట గమనార్హం. 'కళ కళ కొరకే' కాక ప్రజల కోసం అనే విషయం సార్థకత చెందింది.

(సశేషము)



# శ్రీ పద్మావతీ అమ్మవారి బ్రహ్మోత్సవములు, తిరుచానూరు

## (18-11-84 నుండి 27-11-84 వరకు)

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 18-11-84 | ఆది | — | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 19-11-84 | సోమ | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | చిన్న శేషవాహనం |
| 20-11-84 | మంగళ | టాంజాన్ ఉత్సవం | హంసవాహనం |
| 21-11-84 | బుధ | ముత్యపుపందిరివాహనం | సింహవాహనం |
| 22-11-84 | గురు | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 23-11-84 | శుక్ర | పల్లకీఉత్సవం | గజవాహనం |
| 24-11-84 | శని | హనుమద్వాహనం సాయం॥ వసంతోత్సవం | గరుడోత్సవం |
| 25-11-84 | ఆది | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 26-11-84 | సోమ | రథోత్సవం | అశ్వవాహనం |
| 27-11-84 | మంగళ | పల్లకీఉత్సవం, తిరుచ్చిఉత్సవం, చక్రస్నానం, తీర్థవారి అవభృథోత్సవం | ధ్వజావరోహణం |

# దేవుడూరకుంటాడా!

—బ్రహ్మీభూత శ్రీ కేశవతీర్థస్వామి వారు

ఇళ్ళల్లో మాదిరే, అప్పుడప్పుడు గుళ్ళల్లో గూడా దొంగలుపడి, సొమ్ములు దోచుకొని పోవడం, తరుచు వాళ్ళ కేమీ జరిగినట్లు కన బడకపోవడం మనం వింటున్నాం. "దేవుడి గుళ్ళో దొంగలు పడితే దేవు డూరకున్నా డెందుకో? ఆ పాపాత్ములకు ఏదైనా శాస్తి చేయకూడదా?" అని ప్రజాసామాన్యం అనుకుంటుంది. ఈ సంఘటనలు ఆస్తికులన బడేవారి విశ్వాసంమీద దెబ్బకొట్టి, వాండ్లకు ఆందోళన కలిగిస్తున్నవి. నాస్తికు లనబడే వాళ్ళకు, ఆస్తికులైనా గుడి గోపురాలపై నమ్మకంలేని ఆ యా సంప్రదాయాలకు చెందినవారికీ చాలామందికి వారి వాదనకు బలాన్నిగూర్చి ఆనందాన్ని కల్గిస్తున్నవి. ఉభయులకు దేవునిగూర్చిన పరిజ్ఞానం సరిగా లేకపోవడమే దీనికి కారణం. సహజంగా మానవులు తమ తమ సహజ స్వభావాన్ని అనుసరించి దేవునిగూర్చి సంభావించడం జరుగుచున్నది. సర్వాతీతమైన పరమేశ్వరతత్త్వమును గూర్చి మహామహా మేధావులు సైతం, తమ తమ మనఃపరిధులను దాటి సంభావించలేదు. శ్రీ వివేకానంద స్వామి యన్నట్లు ఎద్దులన్నీ కలిసి సమావేశమై దేవునిగూర్చి విచారణ చేయడానికి తలపడితే, దేవుడంటే తమకంటె అన్ని విషయాలల్లో ఎక్కువైన, శక్తివంతమైన, అన్నిటిని పొడిచి గెలవగల పెద్ద ఆంబోతుగా నిర్ణయిస్తాయి. అట్లే ఆ యా జంతువులు దేవునిగూర్చి విచారణచేయడానికి తలపడితే దేవుడు తమ కంటె ఎక్కువ శక్తిమంతమైన జంతువుగా సంభావించగలుగుతాయి. అవి తమ మనోవలయాలను అతిక్రమించ లేవు. అట్లే మానవులు దేవునిగూర్చి ఆలోచించవలసివచ్చినపుడు దేవుడు తమకంటె అన్ని విషయములలో అధికుడైన ఒకానొక మానవుని రూపంలోనే సంభావించడం సహజం! గ్రద్దలు తాము ఎగిరే మేర నతిక్రమించి పైకెగురలేవు. మానవమనోవిహంగం పరమాత్మ తత్త్వాన్ని సంపూర్ణంగా గ్రహించడానికి తగినంత ఎత్తుకు ఎగురలేదు. సూర్యమండలానికి ఎగిరిన సంపాతి పక్షివలెవెనుకకు మరలుటతప్పదు. పట్టుకారు అన్నివస్తువులను పట్టుకుంటుంది. కానీ వెనుకకు తిరిగి తనను పట్టుకొన్న చేతి వ్రేళ్ళను పట్టుకోలేదు. అట్లే మనస్సు, అన్ని వస్తువులను గ్రహించగలుగుతుంది. కాని, తనకు మూలమయిన పరమాత్మను గ్రహించలేదు. గోడకు కొట్టబడిన బంతివలె మనస్సు, పరమాత్మకుడ్యమును భేదించలేక వెనుకకు మరలుతుంది. ఉప్పుతో చేయబడిన కొలతబద్ద సముద్రమును కొలవబోయి సముద్రంలో లీనమవుతుంది. అట్లే మనస్సు మాధవునిగూర్చి వివరించలేక వివశమై విలీనమవుతుంది. విజ్ఞాననిధులైన వేదములు సైతం పరమాత్మనుగూర్చి సంపూర్ణంగా వివరణంచేయలేక, "నేతి–నేతి" వాక్యాలతో మౌనం వహించాయి. "నేతి" యంటే న+ఇతి ఇది. కాదని అంటే భగవానుడు ఇట్టివాడని మనం అనుకున్నప్పుడు అంతే కాదు, ఇంకాచెప్పుటకు మిగిలిఉన్న వాడని అర్థము. మన అనుభూతులు సత్యంలోని అంశాలుమాత్రమే! కాని, పూర్ణసత్యం మాత్రం కాదు. మనం, భూమిపైనుంచి సూర్యమండలాన్ని దర్శించినపుడు, సూర్యుడు ఒక చిన్న అగ్నిగోళంగా కన్పడుతాడు. మరికొంత పైకిపోయి చూచినపుడు మరికొంత విశాలమైన అధిక తేజోమయమైన గోళంగా కనబడతాడు. అట్లే పైపైకి పోయినప్పుడు ఆ సూర్యుడే ఇంకా ఇంకా పెద్దగా కనబడుతాడు. తుదకు ఆయన్ని సమీపించగల్గినప్పుడు ఆ అనుభవం వీటి అన్నిటికి అతీతమైనదిగా ఉంటుంది. అట్లే పరమ సత్యం ఆ యా అంతస్థులనుండి, ఆ యారూపాల్లోఅనుభూతమైనా, చిట్టచివరి అనుభవం, సంపూర్ణమయినది. ఈ అనుభవాలన్నీ, అంతిమమైన సంపూర్ణమైన అనుభవానికి దారితీస్తాయి. ఆ పూర్ణానుభవం, అవాఙ్మానసగోచరమైంది. దేవునిగూర్చిన భావనలన్నీ మనమనోవికాసాన్నిబట్టి ఉంటాయి.

మన సనాతనమహర్షులు, మానవ మనస్తత్త్వమునుబట్టి, ఆ యా దశలనుబట్టి, తగిన సాధనలు వివరించినా, అన్ని సాధనల ద్వారా అసలుభగవతత్త్వగ్రహణానికే దారితీశారు. అదే వారి వివిధ సాధన విధానవ్యాహరచనాకౌశలం! ఎవరు, ఏ స్థితిలో ఏ సాధనను ఆశ్రయించినా నేర్చుకొనదగిన అసలు తత్త్వం మాత్రం తగురీతి బోధించడమే వారి మహాశయం. ప్రతి అణువును, ప్రతిక్షణమును ప్రతి అనుభవమును ఈశ్వరారాధనకు సోపానంగాచేశారు. ఈశ్వరతత్త్వగ్రహణానికి సోపానంగా చేశారు. శిలలలో సైతం, శివహృదయ స్పందనమును వినగల్గిన నేర్పును సూచించారు.

ప్రస్తుతవిషయానికి వద్దాం! దేవుడు సర్వవ్యాపకుడు. సర్వాంతర్యామి. గుళ్ళలో ఇళ్ళలో,సర్వత్రాయున్నాడు. ఆలయాలు, సర్వత్ర ఉన్న పరమేశ్వరుని గూర్చిన

విజ్ఞానము నార్జించడానికి, విజ్ఞానము నభ్యసించడానికి, గురుకులముల వంటివి. అవి నక్షత్రదర్శనశాలలవంటివి. ఐతే సర్వసాధారణంగా నేటి ఆలయాలు, పరమార్థ ప్రధానములుగాక, అర్థప్రధానములై యుండటం శోచనీయం. మహాక్షేత్రములయందలి ఆలయములు సైతం, నివురుగప్పిన నిప్పువలె కలిప్రభావాచ్ఛాదితము లైయున్నవి. ఏదేట్లున్నా, సర్వవ్యాపియైన పరమేశ్వరుడు, బహుజనపుణ్యభావ సమ్మేళన కేంద్రములైన దేవాలయాలలో ఉన్నాడనడంలో సందేహపడవలసిన పనిలేదు. ఆ దేవునిగూర్చి సరియైన పరిజ్ఞానం మన కంతగా లేదు. మన భావములు, మన శక్తి, అతిహీనావస్థలో ఉన్నవి. దేవు డున్నాడనుకున్నా, లేదనుకున్నా, మన భావంలో జీవం లేదు. సరే దేవాలయంలో దొంగలు పడ్డప్పుడు దేవు డెందు కూరకున్నాడు? అనిప్రశ్న: పూర్ణ జ్ఞానులైన బ్రహ్మవేత్తల దృష్ట్యా సర్వమూ పరమాత్మే. ఆలయం, ఆలయమందలి విగ్రహము, అర్చకుడు, భక్తులూ, దొంగలు, దొరలు, అంతాపరమాత్మయే! ఇవన్నీ పరమాత్మ అనే సముద్రముయొక్క ఉపరిభాగమున కనబడే జలవిలాసవిన్యాసములైన పెద్ద తరంగములు, చిన్నతరంగములు, బుడగలు, సుడులు మాత్రమే! ఈ విశ్వమంతా పరమేశ్వరలీలాఖేలనమే! అట్టి మహాదృక్పథంతో, మనం ఈ విషయమును వేరొక దృక్పథంలో దర్శిద్దాం; భగవంతుడు సర్వశక్తిమయుడు. సర్వజ్ఞుడు. సర్వోన్నతుడు కదా! మరి, ఆలయంలో దొంగలు పడితే దొంగలను ఏమైనా చేయవద్దా? తన సొమ్మును కాపాడుకొనవద్దా? ఆ మాత్రం శక్తి లేదా? ఆ మాత్రం శక్తిలేని దేవుడు మనల నేమి కాపాడుతాడు అని సంశయం!

ఒకనాడు కలకత్తాలోని కాళికాలయావరణమందలి రాధాకాంతాలయంలో, దొంగలు నగల నపహరిస్తే, ధర్మకర్త మథురనాథుడు "భగవాన్! నీ నగలు కాపాడుకొనే శక్తి కూడా నీకు లేదే!" అని నిర్వేదించినపుడు శ్రీరామకృష్ణపరమహంసవారు "సకల భాగ్యాధిదేవతయైన శ్రీమహాలక్ష్మినే పాద దాసిగాగల ఆ భగవంతుడు, మీరు నగలనుకొనే మట్టి ముద్దలను, తృణంగా చూస్తాడు" అని మందలించారట!

ఈ భావ మెంత సమున్నతమైంది! సత్యమునకు ఎంతెంత సన్నిహితమవుతుందో ఆ భావన అంతంత రమ్యంగా ఉంటుంది. భగవంతునకు నగలు కావాలనే కోరిక ఉంటే, ఆ నగలుపోయినవే అని బాధ ఉంటుంది. వాటిని కాపాడుకోవలె అనే ఆకాంక్ష ఉంటుంది. నిజానికి మానవులు తమకున్న కోరికలు, తమకున్న బాధలు, తమకున్న క్రోధావేశాలు, భగవంతున కాపాదిస్తారు. శిశువుల అభిమతముల ననుసరించి, భగవంతుడు ప్రవర్తించినట్లు కనబడుతాడు. మన భక్తిమయ భావననుసరించే, అతడు ఆభరణములపై అభిలాష చూపిస్తాడు. అట్లే మన భక్తిననుసరించే ఒక్కొక్కప్పుడు, అతడు పోయిన ఆభరణాలను విచిత్రంగా రాబట్టుకుంటాడు. ఒక్కొక్కప్పుడు మన హృదయాలను సంస్కరించడానికై అనేక విచిత్ర విలాస వినోదములను ప్రకటిస్తాడు. తీవ్రభక్తి భావ ఝంఝానిలసంచలితమైన పరమేశ్వరసాగరంపైన, అనేక లీలా దృశ్యాలు గోచరిస్తాయి. నీవు దేవుని అనేకా మూల్యాభరణాలతో అలంకరించినప్పు డెట్టి స్థితిలో నుంటాడో, వానిని తీసివేసినపుడు గూడ అదే స్థితిలో నిర్వికారుడై ఉంటాడు. ఆతని లీలలు, దురూహ్యాలు. అతడు నిరామయుడు, నిరంజనుడు. నిష్కాముడు. సర్వసంపూర్ణుడు.

తరచు పుణ్యఫలం అప్పటికప్పుడే ఎట్లా కనబడదో, పాపఫలంకూడా అప్పటికప్పుడే కనబడదు. తుమ్మమొక్కైనా, తులసిమొక్కైనా విత్తనం నాటిననాడే కనబడదు. దానికి సముచిత కాలం పడుతుంది.

మీరు ఆభరణములు అలంకరించినప్పుడు భగవంతుని అనుగ్రహం, అప్పు డప్పుడే ద్యోతకం ఎట్లు కాదో అట్లే కొందరు భూషణములను అపహరించినప్పుడు, భగవంతుని ఆగ్రహంకూడా అప్పుడప్పుడే ద్యోతకం కాదు. భూషణములు సమర్పించినవారికి పుణ్యం ఎట్లు వస్తుందో భూషణములు అపహరించినవారికి పాపంకూడా అట్లే వస్తుందని మనం గ్రహించవచ్చు. దైవధర్మమునకు విధేయుడై వర్తించిన సజ్జనుడు సముచిత రీతి ఆనందమననుభవించినట్లు దైవధర్మ



## శ్రీరాజరాజేశ్వరీ

శ్రీరాజరాజేశ్వరీ
శ్రీదివ్యమహేశ్వరీ ॥

జయ జయ దుర్గాంబిక
విజయసింహ వాహనాంబిక
వందనం వందనం
కైవల్యప్రదాయినీ
కరుణరూప కాత్యాయినీ ॥

అనంతకోటి అమృతస్వరూపిణీ
అఖిలాండదివ్య అన్నపూర్ణేశ్వరీ ॥

సకలలోకైక జననీ
కాశీ సౌభాగ్యప్రదాయినీ ॥

అంబికా శక్తిరూపిణీ
సుందరవదన సౌందర్యలహరీ ॥

మధుర దరహాస వదనీ
మహిషాసుర మర్దనీ ॥

నమస్తే నమస్తే నమః
శ్రీరాజరాజేశ్వరీ
శ్రీదివ్యమహేశ్వరీ ॥

— ఎల్. ప్రఫుల్లచంద్ర

మును వ్యతిరేకించిన దుర్జనుడు, సముచిత రీతి దుఃఖము ననుభవించి తీరుతాడు. గుళ్ళల్లో దొంగతనములూ, ఇళ్ళల్లో దొంగతనములూ, భగవద్దృష్టిలో ఒకటే! ఆచౌర్యంవల్ల వచ్చే దుష్ఫలితం, అప్పుడప్పుడే కన్పడవచ్చు లేక, కొంతకాలానికి కన్పడవచ్చుకాని, ఏ చెడుపనికైనా, మంచి పనికైనా, ఫలితం ఇప్పుడో, ఇంకొకప్పుడో, అనుభవించక తప్పదు. పరమేశ్వరుని పరిపాలనలో, శిక్షణ, రక్షణబాధ్యతలన్నీ ప్రకృతిశక్తులు నిర్వహిస్తాయి.

భగవంతు డనుగ్రహిస్తాడన్న భావముతో ఒకడు ఆలయంలోని దేవతారూపములకు భూషణములు సమర్పిస్తాడు. భూషణముల అవసరము లేకపోయినా, అంతర్యామియైన ఆ భగవంతుడు ఆ సమర్పణములకు ప్రసన్నుడై, తగిన విధానంలో తన అనుగ్రహశ్రీని వ్యక్తంగానో, అవ్యక్తంగానో వానికి ప్రసాదిస్తాడు. అట్లే నిర్లక్ష్యభావముతో చౌర్యాది అపచారములకు పాల్పడినవానిని, వ్యక్తంగానో అవ్యక్తంగానో శిక్షిస్తాడు. భగవంతుని రక్షణ, శిక్షణవిధానాలు, దుర్గ్రాహ్యములైనవి. తరచు, మనశైశవభావాలకు,దైవధర్మనియమాలు అర్థంకాక తికమకపడుతుంటాము. దొంగ గుళ్ళోనుంచి పారిపోయినాడని మనం అనుకుంటాం. వాడెక్కడికి పారిపోగలడు? అఖిలవిశ్వము, ఆయన ఆలయమే! అందువల్ల ఆయన బాహుపంజరంనుండి ఎవడు తప్పించుకొని పోగలడు? హిరణ్యకశిపుడు, నారాయణునికై, ప్రపంచమంతా వెదకినాడట. కానీ నారాయణుడు తన ఉచ్ఛ్వాస, నిశ్వాసాలలోనే తనలోనే ఉన్నాడని పాప మాతనికి తెలియదు. శ్రీరామచంద్రుడు, వాలిని చెట్టుచాటునుండి బాణం వేసి వధించాడని రామాయణం చెబుతున్నది. అవును! భగవంతుడు, జగద్వృక్షము వెనుక అదృశ్యరూపుడై ఉంటాడు. అహంకారపూరితులు అతనిని లక్షింపక, విఱ్ఱవీగి, ధర్మాపచారములకు పాల్పడతారు. ఒకటి రెండుసార్లు ఆ విఱ్ఱవీగుడు వినోదంగా చూడబడుతుంది. తరువాత ప్రచండమైన ధర్మదేవతా శరాఘాతంతో వాని గుండె వ్రయ్యలవుతుంది. అప్పుడు పళ్ళుకొరుక్కుంటాడు. పలవరిస్తాడు. కాబట్టి, ధర్మాపచార క్రియలచే తటస్థించే విజయాభాసములకు ఎవ్వరూ విభ్రాంతులు కారాదు.

దేవతావిగ్రహాలను విరగ గొడితే, ఆలయాలను పడగొడితే, ఆలయాలను దోచుకుంటే దేవుడు ఏమీ చేయలేదు గనుక విగ్రహాలను, ఆలయాలను, సాకారుడైన దేవుని కొందరు నిరసిస్తారు. అయితే గుడిగోపురములను, విగ్రహాలను, సాకార దేవుని మాట అట్లుంచి విగ్రహశూన్యములైన ప్రార్థనామందిరాలను, నిరాకారభగవానుని తత్సంబంధిత మతగ్రంథములను, ఎవరైనా నిందించి నిరసించినప్పుడుకూడా; ఆ పాపాత్ముడు అప్పుడప్పుడే విరుచుకొబడిచావటం లేదే? కాబట్టి సాకారుడైనా, నిరాకారుడైనా, ఆలయాంతర్గతుడయినా, అఖిలాంతర్గతుడైనా పరమేశ్వరుడు ఒక్కడే; అతనిని ఏదో ఒక విధంగా ఆరాధించిన వివేకి ఆనందమును పొందుతాడు. అతనిని ఏదో ఒక విధంగా నిర్లక్షించిన అవివేకి, దుఃఖాన్ని పొందుతాడు. ఈ నిత్య సత్యమైన దైవధర్మసూత్రమును గ్రహించడం పరమశుభదాయకం!

సేకరణ : శ్రీమాన్ "దిట్టకవి"

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం. అభిషేకం, నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12-00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.







భారతీయుల దినజీవితంలో అలంకారం గూడా ఒక భాగం. వారి సౌందర్యారాధన, వస్త్రాలు, భూషణాలు, అనుపానాలు, మాల్యాలు అని నాలుగు విధాలు. వీనిలో ఒక్కొక్కదానికి ఒక శాస్త్రంగూడ రూపొందింది. ఆ శాస్త్రంవెనుక వారి సౌందర్య దృష్టితోపాటు ఆధ్యాత్మికచింతనగూడ ఎంతో కనిపిస్తుంది కనుక ఈ వ్యాసంలో హిందూ స్త్రీలయొక్క అంగరాగాలను గురించి చెబుతాను.

మనవారు సుమంగళిని ముత్తయిదవ, అయిదవ, అయిదువరాలు అని అంటారు. అయిదవవదానికి శబ్దరత్నాకరం అయిదు వన్నెలుగలది అని అర్థాన్నిచ్చి వానికి మంగళసూత్రం, వసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకులు అనే వివరంయిచ్చింది. అయితే వీనిలో పసుపు కుంకుమలు తప్ప తక్కినవి వన్నెలుగా చలామణి కాజాలవు కాబట్టి వానిజతకు సుహాసినీ లాంఛనాలైన గంధం, కాటుక, సిందూరం చేర్చుకోవలసి ఉంది. ఇక ఈ అయిదువన్నెల గుణాలు విశేషాలుచూడండి.

స్త్రీల అంగరాగాలలో పసుపు ప్రధాన ద్రవ్యం. అది అన్నిటికంటేముఖ్యమయింది గూడాను. దాన్ని ఆరోగ్యభూషణం అని గూడా అనవచ్చు. ఆముక్తమాల్యదలో రాయలు ద్రావిడ స్త్రీలయొక్క పసుపాటను చెబిక తెనాలి యేమో శివునికి ఉమాదేవి పసుపుకొడిపియొత్తుకొనిన వస్త్రాన్నే కట్ట బెట్టినాడు. హిందూమతంలో వధూవరులకు వివాహసందర్భంలో పసుపు బట్టలేకట్టిస్తారు ఇక స్త్రీలకు ఏ చిన్న పేరంటానికి వెళ్ళినా కాళ్ళకు పసుపు పూయడం తప్పదు.

పసుపు క్రిమిసంహారద్రవ్యం. దానికి గాయాలను మాన్పే గుణంగూడా ఉంది. ఇంటిలోపనిచేసే స్త్రీలు తఱుచుగా నూతి దగ్గర, మరియు తేమప్రదేశాలలో తిరుగుతూ ఉంటారు. కనుక వాళ్ళ కాళ్ళకు పసుపు పూసుకున్నపుడు ఆ తేమలోని క్రిములనుండి రక్షణకలుగుతుంది.

పసుపులో రక్తప్రశాంతిని, ఉత్సాహాన్ని కలిగించే గుణంగూడా ఉంది. అందుచేత దీక్షాకంకణధారులైనపుడు పసుపువస్త్రాలు, పసుపుదారాలతో కంకణాలు కట్టుకున్నట్లయితే ఆసందర్భంలోని జనసమ్మర్ధం వల్ల కలిగే సాంక్రామికరోగాలు నిరోధింపబడే అవకాశంవారికి ఉంటుంది.

హరిద్రాచూర్ణం ముఖానికి పూసుకుని స్నానంచేస్తే స్త్రీలకు ముఖవ్యాధులనుండి, నేత్రవ్యాధులనుండి రక్షణకలుగుతుంది. అంతేగాక తేజోమయాత్మకమైన వారి ముఖచర్మం రక్తోద్రేకాలవల్ల బిరుసెక్కకుండా కోమలంగాను స్నిగ్ధంగాను ఉంచి నిగనిగలాడిస్తుంది.

ఋతుస్నానసమయంలో స్త్రీలు మూడు పుడిసిళ్ళ పసుపునీరు త్రాగుతారు లేదా చిన్నవాటిగచ్చకాయలంత ఉండలు మూడు పసుపుతోచేసికొని మ్రింగుతారు. దానివల్ల ప్రాచీనావర్తం నశించి వారిలో నూతనావర్తానికి మరల దోహదం కలుగుతుంది. ఈ విధంగా స్త్రీలకు ఆరోగ్యవిషయకంగా పసుపు ఎంతో లాభకారిగా ఉంది.

మన ముఖానికి అమరి ఉండే జ్ఞానేంద్రియాలకు నుదురు, చెక్కులు మొదలైన యితర భాగాలకుగూడా అధిదేవతలున్నారు పసుపు సర్వదేవతాద్రి కరమైనదిగాబట్టి దాన్ని ముఖానికి పెట్టుకోటానికి విధించటంలో తాత్త్వికమైన ఔచిత్యంగూడా ఉంది. కొన్నివర్ణాలవారు వివాహసమయంలో వరునికిగూడ ముఖానికి పసుపు నూనెకలిపి పూస్తారు. అయితే పసుపు రోమవిక్రియకు దోహదంచేసేది కనుక అదివిశేషించి స్త్రీలకే నిత్యంగా విధించటంజరిగింది.

పేరంటాలలో పాదాలకు పసుపుపూయటంతోపాటు పుస్తెలకుగూడా పసుపు పంచుతారు. హిందూ స్త్రీలును పుస్తెను మాంగల్యమంటారు. పసుపు మంగళద్రవ్యం. మాంగల్యం గౌరీదేవికి ప్రతిరూపంగూడ కనుక వానికి పసుపుపంచటంలో మాంగల్యరూపంలో ఉండే గౌరీ ఆరాధన ఉన్నదన వలె. ఇక పాదాలకు వివాహసందర్భాలలో పసుపుపూసిన తరువాత అంచులవెంట లత్తుక రంగు దిద్దుతారు.

కాళిదాసుగారు మంచి నర్మహాస్య ప్రియుడు. ఆయన పార్వతీదేవి పాదాలకు లత్తుకపూయిస్తు సఖితో తెల్లవారేవరకి లత్తుకముద్ర మీ ఆయనగారి తలపై ఉండే చంద్రునిపై కనిపించవలె అనిపిస్తాడు.

ఆయుర్వేదంలో పగుళ్ళు నరుకులవంటి గాయాలకు లాక్షారసానికి మించినమందు మరొకటిలేదు, స్త్రీలు తరుచుగా తేమలో తిరుగుతూ ఉంటారు కనుక వారికి మడిమలు పగలటం, వ్రేళ్ళనడుమ చర్మం చెడిపోవటం వంటిది తరుచుగా జరుగుతుంది కాబట్టి సౌందర్యారాధన క్రింద వారు పాదాలకు పూసుకునే లత్తుక అందాన్నీయటమేగాక ఆరోగ్యాన్నిగూడ ప్రసాదిస్తుంది.

అయితే యింత అలంకారం ఒక్క పాదాలకే ఎందుకు చేసికోవలె అనే సందేహం ఎవరికైనా రావచ్చు. మన శరీరంలో పాదాలు విష్ణుతత్త్వం, వాటికి అధిదేవత విష్ణువు. విష్ణువు దేవతలలో అలంకార ప్రియుడు. అందుచేత ఇంటిలో ఏ చిన్న పేరంటం జరిగినా ముత్తయిదువులకు పాదాల నలంకరించుకునే ఆచారం ఏర్పడింది. ఇక వివాహసందర్భంలో హిందువులు వధూవరులకలంకరించిన పాదశోభ చూచి తీరవలసిందేగాని వర్ణించలేం.

కరపాదతలాలు ఎఱుపుగా ఉండటం సౌభాగ్యలక్షణంగూడ. అందుచేత లత్తుక రంగు అరికాళ్లతోపాటు కొందరు అరచేతులకుగూడ పూసుకొంటారు.

మనశరీరంలో కొస్తచలివివరగానే పెదవులు పగలటంపరిపాటి, స్త్రీల పెదవులు ఇంకా కోమలం కాబట్టివారికి పాదాలతో పాటు లత్తుకపూసుకునే ఆచారం పెదవులకుగూడా ఏర్పరచినారు.

హిందూ స్త్రీలు ముఖానికి చేసుకొనే అలంకారాలు ఇంకా చాలాఉన్నవి. వానిలో బొట్టుముఖ్యమయింది. అది వారి ఐదవతనానికి చిహ్నం.

ఈ తిలకానికి ఎఱుపురంగునే వాడవలెగాని ఈనాడు మ్యాచింగుమోజులోపడి రకరకాల రంగులువాడుతున్నారు. అయితే ఎన్నిరంగులువాడినా అవి అరుణరాగమంత శోభ నీయలేవు. ముఖానికి వసుపు రాచికొని స్నానంచేసి దానిపై ఎఱుపుగల కుంకుమ గుండ్రంగా తిలకం దిద్దుకున్నపుడు నల్లనిముబ్బులక్రింద బంగారు మేఘాలపై ఉదయించిన బాలభానునివలె ఆ శోభ ఎంతో మనోహరంగా ఉంటుంది.

పూర్వం మంచి పసుపుకొమ్ము లేరుకొని సళ్ళించి నిమ్మపులుసులో నాన్చి ఎండించి దానిలో కొంతవెలిగారంవేసి నూరి కుంకుమంసిద్ధంచేసికొనేవారు. ఆ విధంగా చేసిన కుంకుమ ఔషధోపయోగంగాగూడా ఉంటుంది.

బొట్టుతరువాత చెప్పదగింది కాటుక. బొట్టుకాటుక తెలుగువారికి జంటపదాలుగూడ. కాటుకకు నల్లనిరంగునే ఉపయోగించవలె. ఈనాడు బొట్టురంగు మారింది. కనుక మునుముందు కాటుకగూడ మారుతుందేమో చెప్పలేం.



## శ్రీ పద్మావతీ సంకీర్తనం

అమ్మా ! అలమేలు మంగమ్మా !
ఆలింపవే మొరల - తేలింపవే సిరుల
పాలింపవే మమ్ము - పద్మావతమ్మా ॥అమ్మా॥

శ్రీలు విరాజిల్లు - పాలవెల్లివి నీవు
కలుములు వెదజల్లు - కల్పవల్లివి నీవు
కలువలరాజు గా, రాబు చెల్లివి నీవు
భక్తులపాలి బం, గారు తల్లివి నీవు ॥అమ్మా॥

వేదాలు నీ దివ్య - పాదమంజీరాలు
నక్షత్రములు నీకు - నవరత్నహారాలు
మందహాసము చిందు - సౌందర్యలహరీ !
అందుకో మా పూజ - ఆనందలహరీ ! ॥అమ్మా॥

సంపదలిచ్చేటి - సౌభాగ్యలక్ష్మి
సేవలకు మెచ్చేటి - శ్రీ విజయలక్ష్మి
శ్రీలక్ష్మి వరలక్ష్మి - శ్రీ మన్మహాలక్ష్మి
అల శ్రీనివాసుని - అర్ధాంగలక్ష్మి ॥అమ్మా॥

జనని ! నీ అర్చనలు - సర్వోదయశ్రీలు
తల్లి ! నీ దీవనలు - ధర్మవిజయశ్రీలు
మాత ! నీ నయనాలు - మధురకరుణశ్రీలు
జగమంత నీ స్వామి - స్వర్ణోత్సవశ్రీలు. ॥అమ్మా॥

— డా॥ కరుణశ్రీ

మన దేహంలో కన్నులు అగ్నితత్త్వం. అగ్నిదేవునికి కృష్ణవర్త్మ అనగా నల్లని మార్గంకలవాడు అనే పర్యాయంగూడ ఉంది కాబట్టి అతని తత్త్వమైన కంటిక్రింద నల్లని కాటుక రేఖతీర్చటానికి తత్త్వపరంగా సార్థకతగూడా ఉంది. అంతేగాక తెల్లని కనుగ్రుడ్డుక్రింద తీర్చిన నల్లనికాటుక కంటియొక్క శోభను ఇనుమడింపజేసి కన్నులను విశాలంగా కనిపించేలాగా చేస్తుంది.

పూర్వం ఆముదం దీపం ముట్టించి దానిపై రాగివళ్ళెం బోర్లించి మసిని పట్టించి కాటుక సిద్ధం చేసికొనేవారు. అంతేగాక కొడవలిపై వెల్లిపాయ రాచి దానికి ఆముదం దీపపుమసి పట్టించిగూడ కాటుక సిద్ధం చేసికొనేవారు. ఈ కొడవటికాటుక బాలింతలకు ఎంతో హితకరమయిందట. ఈ విధంగా దీనిలోగూడ ఔషధగుణముంది.

ఈనాడు నశించిందిగాని, పూర్వం చెక్కులపై కుంకుమతో మకరికాపత్రాలు వ్రాసికొనేవారు. ఇపుడుగూడ ఫేస్‌పౌడరు అద్దుకున్న పిమ్మట కొందరు చెక్కిలిపై ఎఱుపు, లేతగులాబీరంగులను అద్దుకోవటం కద్దు.

మన హనువులకు లోపలిభాగానికి తాలువులని, పై భాగానికి చెక్కులని పేరు. తాలువులకు అధిదైవం వరుణుడు. అతడు మకరవాహనుడు మకరధ్వజుడు గూడ. కనుక మనవారు చెక్కిలిపై వ్రాసికొనే మకరికలుగూడ తత్త్వరీతిగ సార్థకమే. మొగాన కుంకుమతో పాటు హిందూవనితలు పాపెటలో సిందూరం గూడ ధరిస్తారు. పాపెటకుసీమంతమనిపేరు. సీమ అంటే సహస్రారస్థానం. ముక్కుకు సూటిగా తలపైనుండి సాగినపాపెట సహస్రారంవరకు సాగి ఆగి పోతుంది. అవతల ఇక దానికి స్థానం లేదు.

యోగసాధన చేతమూలాధారంలోని కుండలినిని మేలుకొలుపితే అది షట్చక్రాలను భేదించుకుంటూ క్రమంగా సహస్రారం చేరుకుంటుంది. అది అక్కడ చేరినపుడు యోగికి ముక్తి. ఇక సంసారంలో ఉండే జీవుడుగూడ అంతే బ్రహ్మలోకం చేరిన పిమ్మట అవతల అతనికి యిక వెళ్ళవలసిన స్థానం లేదు. అయితే సంసారి ఆలోకానికి తాను కర్మమార్గంచేత వెళ్ళవలసిఉంది. అది అంతా రాజసగుణభూయిష్ఠం. కనుక పురుషుడు సౌందర్యదేవతగా ఆరాధించే స్త్రీ యొక్క పాపెటలోని సిందూరం ఈ రహస్యాన్ని సూచిస్తుంది.




మన స్త్రీలకు పేరంటానికి వెళ్ళినపుడు పసుపుతోపాటు గంధాన్ని పూయటంగూడ ఆచారంగా ఉంది. ఈ నాడు ఇన్ని అనాగరిక చేష్టలుగా కనిపిస్తవి. గంధాన్ని మెడకు పూస్తారు. మన శరీరం చంకలు మరియు మెడక్రింది భాగం తఱుచుగా చెమటపట్టేభాగాలు అంతేగాక స్త్రీలకు మెడ చుట్టు వివిధమైన ఆభరణాలుగూడఉండి వాని వొరిపిడి కొంత ఉంటుంది. అందుచేత పేరంటాలలో చెమటచేత ఆభరణాల వొరిపిడిచేత కలుషితమయ్యే కంఠభాగాన్ని రక్షించటానికి చందనచర్చ ఎంతో లాభకారిగా ఉంటుంది.

ఈ గంధాన్ని వారు పేరంటాల చేతులకు గూడ పూస్తారు. పూర్వం పేరంటాల చేతులకు గంధం పూసి గీరటం ఒక కళగాగూడ ఉండేది. ఈ గంధాన్ని గీరటానికి కొందరు గోర్లువయోగిస్తే మరికొందరు వెండితో ప్రత్యేకంగా పుల్లలే చేయించుకొనేవారు. మోచేయిమొదలుకొని ముంజేతులవరకు గంధంపూసి గీరిన పుండారినపిమ్మకు ఆ చేతులు ఐరావతం దంతాలవలె ఎంతో అందంగా కనిపిస్తవి. గంధం చర్మరోగాలకెన్నిటికో ఔషధంగాపనిచేసి దాన్నిమృదువుగా ఉంచుతుంది.

పేరంటాలకు గంధం చేతులకు పూసిన పిమ్మట కొంతవారికి యిస్తారు. అంటె వలుచగా కలిపిన ఆ కలవంలో పేరంటాలందరూ తమ కుడిచేతి వ్రేళ్ళద్దుకొని తమ వక్షోభాగానికి అద్దుకుంటారు.

పూర్వం స్త్రీలు తమ వక్షాలకు గంధంతో పాటు కుంకుమద్రవం, కస్తూరిగూడ అలదుకొనేవారు. తిరుమలలో వెలసిన వేంకటేశ్వరుడుగాని పెద్దనగారి విష్ణువుగాని శ్రీదేవియొక్క వక్షోజకురంగనాభం తమ ఎద కంటించుకున్నవారే. శ్రీనాథుడు దమయంతీదేవి స్తనద్వయానికి కురంగమద కుంకుమచర్చలు చెప్పివానిని నీలలోహిత మూర్తులుగా తీర్చితే రాయలుపాండ్య వధువులు పగడపుచాయ చెంది రమలదుకోనేవారని అరుణప్రియులనుచేసినాడు.

ఇక వీరందరికి ఆద్యుడైన భవభూతి పురుషపక్షపాతివలె కనిపిస్తాడు. ఆయన భవునిబూదినే పార్వతీదేవికి అంటించినాడు.

ఇప్పుడేమో ఇక ఈ సంప్రదాయాలలో ఏదీ మిగిలినట్లు లేదుగాని వారు తమ వక్షాలకు అలదుకునే గంధం, కుంకుమ, కస్తూరి ద్రవ్యాలను పరీక్షిస్తే ఒకటి తెలుపు, ఒకటి ఎఱుపు, ఒకటి నలుపు. కనుక ఈ మూడు సత్త్వరాజసతామసాలనే మూడు గుణాలకు ప్రతీకలై వారివారి హృదయాన్ని వ్యంజిస్తవని అనుకోవలె. ఈ విధంగా మన అలంకారాల వెనుక అందం ఆరోగ్య లక్షణమేగాక తత్త్వవిషయంగూడ ఎంతో కనిపిస్తుంది.

— శ్రీ కపిలవాయి లింగమూర్తి

*

## మయూరశతకము

### ఆంధ్రానువాదము

[కర్త: శ్రీ కొంగే సుధాకరరావు ప్రతులకు:] శ్రీ కె. సుదాకరరావు 8/351, సదాశివపేట — ఆదవాని 518301 వెల: రు 5/—

సంస్కృత శతక కర్తలలో మయూరకవి సుప్రసిద్ధుడు. కాశ్మీర దేశీయుడైన యీ కవి శేఖరుడు క్రీ. శ. 600-630 నాటివాడు. బాణునితో పాటు హర్షచక్రవర్తి ఆస్థానమును అలంకరించినవాడు.

మయూరకవి కృతమైన సూర్యశతకము అతిప్రౌఢము. అర్థగాంభీర్యముతో, అనల్ప కల్పనా వైశిష్ట్యంతో ప్రతిపద రసాత్మకంగా సాగిన కృతి. దీనిలో, ప్రభా వర్ణనము, అశ్వవర్ణనము, అనూరువర్ణనము, రథ వర్ణనము, మండలవర్ణనము, రవివర్ణనము అను ఆరు ఖండము లున్నవి. ఇందలి ప్రతి పద్యము జగద్గేయుడైన సూర్యభగవానుని తేజోవిభవాన్ని, శక్తి సంపదలను, మహిమను వెల్లడించుచున్నది.

మయూరకవి కృతిలోని కొన్ని పద్యములను శ్రీనాథ మహాకవి తన కాశీ ఖండమున తెనిగించినాడు.

శ్రీయుతులు ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు, యామిజాల పద్మనాభస్వామి గారు యీ శతకమును ఆంధ్రీకరించినారు. 'శ్రీ సూర్యనారాయణ శతకము' అను స్వతంత్ర కృతి యొకటి వరాహ వేంకట నృసింహకవిచే రచింపబడినది.

అనువాద మొక కళ, మూల కర్తతో తాదాత్మ్యము, ఉభయభాషలలో పాండిత్యము అవసరము.

ప్రస్తుతానువాదకర్త శ్రీ కొంగే సుధాకరరావుగారు మూలమందలి భావములను చక్కగా ఆకళించుకొని సరళమూ, హృద్యమూ అయిన శైలిలో తెనిగించుట అభినందనీయము. విద్యార్థిదశలోనే కవితా రహస్యములను అవగత మొనర్చుకొనుట సంతోషం. వీరి అనువాదమున కొక ఉదాహరణము.

స్ర॥ యః ప్రష్టాపాం పురస్తాదచలవర
సమభ్యున్న తేర్షేతు రేకో
లోకానాం యత్ర్రయాణాం స్థిత
ఉపరిపదం దుర్విలంఘ్యేనధామ్నా,
సద్యస్సిద్ధ్యై ప్రసన్నద్యుతి శుభచతు
రాశాముఖః స్త్వాద్విభక్తో
ద్వేధావేధా ఇవావిష్కృత కమలరుచి
స్సోర్చిషామాకరో వః.

మ॥ అమృతస్రష్ట పురోచలప్రవర
న్నిత్త్యున్నత్య హేతుండు దు
ర్గమ ధామాఖిల విష్టపోపరితలా
గ్రస్థాయి యా విష్కృతా
సమపద్మచ్ఛవి స్వచ్ఛదీప్తి చతురా
శావక్త్రుడన్యాదృశుం
డమర జ్యేష్ఠుడు నాగ వెల్గు భగవా
నందించు నిష్టార్థముల్,

సూర్యారాధకులేకాక సాహిత్యపిపాసు లందరూ చదవదగిన కృతి యిది.

— శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# గ్రంథసమీక్ష

## తత్త్వబోధ

[మూలము: శ్రీమదాది శంకరులు. తెలుగు వ్యాఖ్యానము, అనువాదము: శ్రీ ప్రసన్న చైతన్య వెల 5/— ప్రతులకు శ్రీ కె. ఎన్. నారాయణమూర్తి, ఎఫ్ 40, బాలకృష్ణ ఎపార్ట్స్, తిలక్ రోడ్ — శాంతాక్రజ్ వెస్ట్. బొంబాయి — 400054

శ్రీ శంకర భగవత్పాదులు హిందూమత పునరుద్ధరణకు అనేక గ్రంథములను వెలయించిరి. అన్ని గ్రంథములలోను వేదాంతమో, భక్తియో గోచరించును. ఈ తత్త్వబోధ అను గ్రంథము కొంచెము సాధనచేసి వేదాంత జ్ఞానము ఒకింత గలిగియున్నవారికి బాగుగా ఉపయోగపడు గ్రంథము. మొత్తము వేదాంతమును సూక్ష్మముగ అందజేయునది ఈ గ్రంథము. ఇందు వివరింపబడిన అనేక విషయములు సాధకుల కెంతయు లాభదాయకములు.

సాధన చతుష్టయము, నిత్యానిత్య వస్తు వివేకము, విరాగము, శమాది సాధన సంపత్తి, తత్త్వవివేకము, ఆత్మయొక్క లక్షణము, స్థూల సూక్ష్మశరీరములు, కారణ శరీరం, జాగ్రద్, స్వప్న, సుషుప్త్యవస్థలు, సత్, చిత్, ఆనంద లక్షణములు, వీటన్నిటిని గురించి వివరముగా చెప్పబడినది. పిమ్మట జ్ఞానోత్పత్తి, ప్రారబ్దము, ఆగామి మొదలగునవి కూలంకషముగ విపులీకరించబడినవి. ఈ విధముగ శంకర భగవత్పాదులచే విరచింపబడిన తత్త్వబోధ యను ఈ గ్రంథమునకు ఇది తెలుగు వ్యాఖ్యానము. అయినను దీని రచయిత లేదా వ్యాఖ్యాత ఎవరు? అనునది కొంచెము సందిగ్ధముగ గోచరించును. తొలిపలుకు వ్రాసినవారు, ప్రతులు విక్రయము చేయువారు దీని ముద్రాపకులు శ్రీ కాశీపట్నపు సత్య నారాయణ మూర్తిగారు. వీరి తొలిపలుకులోనే పూజ్య బ్రహ్మచారి శ్రీ ప్రసన్న చైతన్య గారు తెలుగులో వారికి చెప్పిన వాక్యములను, ప్రసంగ, వ్యాఖ్యానములను ఈ పుస్తకమున సంతరించినట్టు పేర్కొనినారు. కనుక ఇది శ్రీ ప్రసన్న చైతన్యగారి రచన అని నిర్ణయించవలసి వచ్చును. వ్యాఖ్యానము చాల సులభశైలిలో సామాన్యులకు అర్థము కావలయునను సదుద్దేశముతో వ్రాయబడినట్లు కనుపించును. కాని ఆ యుద్దేశమెంత వరకు నెరవేరును అని నా కనుమానము. కొన్నిచోట్ల వ్యాఖ్యానము జటిలముగ నున్నది అనిపించును. ఉదాహరణకు జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలను వ్యాఖ్యానించుచు, పుట. 31 లో చేసిన వ్యాఖ్యానము పండిత ఉండాలము లకు సైతము కొరుకుడు పడని వాక్య నిర్మాణముతో అస్తవ్యస్తముగ నున్నది. సుదీర్ఘమైన వాక్యరచన వ్యాఖ్యాత కుండకూడని లక్షణములలో ఒకటి.

అయిననేమి? ఒకటి మాత్రము నిజము. ఈ గ్రంథము సాధకులకు పరమ ప్రామాదికముగా కాకపోయినను మార్గదర్శకముగా నుపయోగపడుననుటలో సందియము లేదు.

సంస్కృత పునరుద్ధరణ కిట్టి యుత్తమ గ్రంథములు వెలుగులోనికి రావలసిన అవసర మెంతైనా యున్నది.

— డా॥ వప్పా వేణుగోపాలరావు

## తులసీదళము

[రచయిత : శ్రీ గురుచరణ్ [శ్రీ దూతలూరి జగన్నాథం] 88 పుటలు— వెల: అమూల్యము. ప్రాప్తిస్థానము: శ్రీ దూతలూరి జగన్నాథము, హిందూ ఏజెంటు, ఊతుకోట–602026, చెంగల్పట్టు జిల్లా.

ఆధ్యాత్మిక సంపన్నులును, భక్తితత్పరులును అయిన శ్రీ దూతలూరి జగన్నాథముగారు రచించిన ఈ తులసీదళము అను గ్రంథము ఆద్యంతము రసవంతముగా నున్నది.

శ్రీ కంచికామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వాములవారికి గ్రంథకర్త ఈ కృతిని అంకితము చేసిరి. సరసులు, సాత్త్వికులు, సాధుమూర్తులు అయిన శ్రీ జగన్నాథముగారు చేసిన సాహిత్యకృషి ప్రశంసార్హమై యున్నది. గురుభక్తి లోపించుచున్న ఈనాటి సమాజమునకు చక్కని ఆదర్శమును చూపిన ఈ రచయిత జన్మము చరితార్థమైనది. వారు తమ రచనమును గురు సమర్పణము గావించుచు, "భక్తితో ప్రణమిల్లి అర్పణ మొనర్తు, మోదమతి నాచు నీ తులసీదళమ్ము" అని పలుకుట, కవిగా, భక్తవర మాణువుగా, రచయితయొక్క నైర్మల్యతకును, సాత్త్వికప్రవృత్తికిని చక్కని నిదర్శనము.

'తులసీగళము' లోని వస్తువు అట్టిదే. జ్ఞాననేత్రమును ప్రసాదించు గురుదేవుని యొక్క దృక్పథమును వివరించుచున్న చిఱుత గ్రంథములో గురుపథము, దైవపథము, దృక్పథము అను మూడు భాగములు కలవు. మొదటి భాగములో 108, రెండవ భాగములో 109, మూడవ భాగములో 112 గీతపద్యములు కలవు. ఈ కావ్యము ముక్తకము. ఇందులోగల పద్యములు, ఏ పద్యమున కా పద్యమే, స్వతంత్రమై, సమగ్రభావ సమన్వితమై, సన్మార్గ ప్రబోధకమై యుండుట విశేషము.

పద్యరచన సాఫీగా సాగిపోయినది. సులభమై, సుబోధకమై, సుందరమైన కవిత యిందు జాలువారినది. కొన్ని పద్యములు కవి రచనా చమత్కృతికిని, భావస్ఫూర్తికిని పసిడి తునుకలుగా నున్నవి. ఉదాహరణమునకు దైవపథములో (పేజి 37) సృష్టికర్తయైన భగవంతు నుద్దేశించి పలికిన పలుకులు భావగర్భితములై యున్నవి చూడుడు.

"తులసి వత్రంబుతో తులతూగినావు
వ్యక్తపరుపంగ భక్తిలో శక్తి మాకు."

భగవద్దర్శన భాగ్యమును బడయుటకు భక్తిలోగల శక్తిని, కవి నిరూపించెను. అట్లే (48వ పేజి) 58వ పద్యములో, కవి, మానవునికి గల జ్ఞానమును ఇట్లు వివరించెను.

"మంచిచెడ్డల తారతమ్యముల నెంచ
నరుని జ్ఞానంబు చాలదు పరమపురుష!"

ఇది ముమ్మాటికిని నిజము.

ఈనాటి సమాజమును పట్టి పీడించుచున్న మతవిభేదములను దృష్టిలో నిడుకొని కాబోలు, ఈ సుకవి, మతసామరస్యమును గూర్చి, సౌమనస్యమును గూర్చి, వెల్లడించిన భావములు విశ్వశ్రేయస్సును గూర్చుచున్నవి. ఉదా:

"పేరు విన్నావొ లేక కబీరుదాసు
రామభక్తుడు మత భేద మేమి చేసె?
మతము లెన్నైన నీ యున్కి మాత్ర
మొకటె
మంత్రములె వేరు, సద్భక్తి సూత్ర
మొకటె."

కావ్యమంతయు చక్కని సూక్తులతో నిండి, కవికిగల సమాజ అవగాహన శక్తిని వెల్లడించుచున్నది. పద్యములు వాని భావములు సులభగ్రాహ్యములై యున్నవి. దృక్పథము అను శీర్షికలో (11, 14 పద్యములు) వర్తమాన సమాజములోని స్థితిగతులను కవి ఎత్తి చూపెను. వారు చెప్పినట్లుగనే

"దోచుకొనువాడు మాత్రమె దొంగకాడు
దాచుకొనువాడు మూలము దానికెల్ల"

ఇది నిజమే!

గ్రంథము చివర సురుటపల్లి గ్రామములోని శ్రీవల్లి కొండేశ్వరాలయము నుద్ధరించు నెపముతో భక్తుల నుండివిరాళములు కోరుచున్న విన్నపము ఉన్నది. ఇచటి దైవము దాంపత్య దక్షిణామూర్తి అపూర్వ శిల్పముతో కూడియున్నట్లు చిత్రముద్వారా తెలియుచున్నది.

ఇది కవులు, భక్తులు, జిజ్ఞాసువులు, సాధకులు- ఎల్లరును భక్తితో చదువతగిన చక్కని చిన్న కావ్యము. దీనిని వెలుగులోనికి తెచ్చి అందరికిని అందచేసిన ఉదారులు ప్రకాశకులు సర్వశ్రీ సుందరరామ రెడ్డి, అణ్ణామలై, జయరాం ప్రభృతులు అభినందనీయులు.

— శ్రీ వసంతరావు రామకృష్ణరావు

## అద్భుతోత్తర రామాయణము

[రచయిత : కావ్యపురాణతీర్థ, శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ; ప్రకాశకులు : శ్రీ పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠి, వల్లూరు, కడపజిల్లా; పుటలు 1/8 డెమ్మీ వెల 3–50.]

ప్రసిద్ధ వాల్మీకి రామాయణం కన్న భిన్నంగా ఎన్నో రామాయణా లున్నాయి. అన్నింటికీ కర్త వాల్మీకిగా ప్రసిద్ధం. అన్నీ ఒకే వ్యక్తి వ్రాస్తే కథల్లో తేడా యేమి టని శంక, ఎందుకు వ్రాయా అని సందేహం. ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్క రీతిలో రామకథ ఉంటుందని సంప్రదాయవాదుల వాదం. ప్రసిద్ధ రామాయణంలో ఉన్న శైలి, జిగిబిగి మిగిలిన రామాయణాల్లో లేవు. కాబట్టి ఎవరో వ్రాసి వాల్మీకి పేరు పెట్టారని ఆధునికుల వాదన. అయినా ఈ

(44వ పేజీలో)



ఒకప్పుడు పార్వతీపురాన్ని విక్రమకేతుడు పాలించేవాడు. చాలా మూర్ఖుడు. తను జారీ చేసే శాసనాన్ని ప్రజలు వెంటనే అమలుచేయాలి. తను జారీ చేసే శాసనానికి ఎవరైన ఎదురు చెపితే వారిని వెంటనే ఉరితీయించేవాడు.

ప్రజలకు విక్రమకేతుని పాలనపై విరక్తి కలిగింది. విక్రమకేతునికి సరైన బుద్ధి చెప్పాలని అనుకొనేవారు. కాని సమయము దొరకక నిరీక్షించారు.

ఒకసారి విక్రమకేతుడు భటులను పిలిపించాడు. "భటులారా! నేటినుండి రాజ్యంలో ఏ దైవాన్ని కొలవరాదు. దేవుని కన్నా నేనేం తక్కువ. కాబట్టి రాజ్యంలో నేటినుండి నన్నే దైవంగా పూజించాలని దండోరా వేయించండి" అన్నాడు విక్రమకేతుడు.

"ప్రజలకు విజ్ఞప్తి-నేటి నుండి రాజ్యంలో ఏ దైవాన్ని కొలవరాదు. ఇది రాజశాసనం. ఈ శాసనాన్ని ఎవరైన ధిక్కరించి దేవుడిని కొలచిన ఎడల వారికి ఉరిశిక్ష వేయబడును. ఇది రాజాజ్ఞ" అని దండోరా వేయించారు భటులు.

ప్రజలు విక్రమకేతుని శాసనాన్ని విని చాల విచారించారు. ఆఖరికి దేవుడిని కొలిచే హక్కు కూడ లేకపోయింది అని దుఃఖించారు.

ఆ రాజ్యంలో విజయుడు అనే వ్యక్తి వుండేవాడు. చాల మంచివాడు. సహనశీలుడు. రాజ్యంలో రాజుగారి శాసనాన్ని విని విచారించాడు. రాజుకి సరైన బుద్ధి చెప్పాలని మనసులో అనుకొన్నాడు.

మర్నాడు రాజదర్శనం గురించి దర్బారుకు వెళ్లాడు. అక్కడవుండే భటులతో చాలా చిక్కులు పడ్డాడు. చివరకు రాజుగారి దర్శనం లభించింది విజయుడికి.

"ప్రభూ! మీరు దైవాన్ని కొలవవద్దు అని శాసనాన్ని జారీ చేసారు. ప్రజలంతా మీ శాసనాన్ని పాటిస్తున్నారు. నాకు చాల ఆనందంగా వుంది" అన్నాడు విజయుడు.

"నా శాసనాన్ని పాటించకపోతే నేనేం చేస్తానో ప్రజలకు తెలుసు. అందుగురించి




భయంతో నా శాసనాన్ని పాటిస్తున్నారు" నవ్వుతూ అన్నాడు విక్రమకేతుడు.

"ప్రభూ! మీరంటే ప్రజలకు నిజంగానే భయం. ఆ భయంతోనే మిమ్మల్ని దైవంగా కొలుస్తున్నారు. భక్తి అనేది భయంతో రాకూడదు. స్వతః రావాలి. మీ మీద ప్రజలకు భక్తి కలిగేటట్టు నేను చేస్తాను. అప్పుడు రాజ్యంలో ప్రజలంతా మిమ్మల్ని మనసారా దైవంగా కొలుస్తారు" అన్నాడు విజయుడు.

"నువ్వు చెప్పింది నిజమే. ప్రజలకు నా మీద స్వతః భక్తి కలగాలి. ప్రజలకు నా మీద భక్తి కలిగేటట్టు చేస్తానన్నావు. అలా చెయ్యకపోతే నీకు ఉరిశిక్ష పడుతుంది జాగ్రత్త!" అన్నాడు విక్రమకేతుడు.

"ప్రభూ! ప్రజలకు మీ మీద స్వతః భక్తి కలిగేటట్టు చేస్తాను. అందుకు మీరు సంశయించకండి. నిజంగా దేవుడు మీలో వుంటాడు, నాలో వుంటాడు, ప్రతి మనిషిలో వుంటాడు. చివరకు ప్రతి జీవిలో కూడ వుంటాడు. అలాగే నీటిలో వుంటాడు, అగ్గిలో వుంటాడు, గాలిలో వుంటాడు, మట్టిలోకూడ వుంటాడు. మీరు నిజంగా దేవుడు కావాలంటే గాలిలో ఎగరాలి, నీటిలో మునగాలి, అగ్నిలో దూకాలి. ఈ పరీక్షల్లో మీరు ఏ ఒక్క పరీక్షయైనా నెగ్గారంటే ప్రజలు నిజంగా మీరు దేవుడని నమ్ముతారు. అప్పటి నుండి మిమ్మల్నే మనసారా దైవంగా కొలుస్తారు" అన్నాడు విజయుడు.

"ఈ పరీక్షలలో ఏ ఒక్కటైనా ప్రజల ముందు చేస్తాను. ప్రజలు అప్పుడు నన్ను నమ్ముతారు. దైవంగా కొలుస్తారు" అని మనసులో అనుకొని ఆనందించాడు విక్రమకేతుడు.

కాని అగ్నిలో దూకితే కాలి చస్తానేమో, గాలిలో ఎగిరితే కాలు, చేతులు విరిగి, తల పగిలి చస్తానేమో, నీటిలో మునిగితే ఊపిరాడక చస్తానేమో అని మనసులో అనుకొని కలవరపడ్డాడు విక్రమకేతుడు.

"అగ్నిలో, నీటిలో, గాలిలో దేవుడుంటాడు అన్నావు. అగ్నిలో దూకితే కాలిపోయి చస్తాను. నీటిలో మునిగితే ఊపిరాడక చస్తాను. గాలిలో ఎగిరితే తల పగిలి చస్తాను. నువ్వు నన్ను చంపడానికి ఈ పథకాలు వేశావు. నిన్ను ఇప్పుడే ఉరితీయించేస్తాను"-కోపంగా అన్నాడు విక్రమకేతుడు.

"అగ్నిలో, గాలిలో దేవుడు వుండేటట్టు పొరపాటున చెప్పాను. అగ్నిలో, గాలిలో ఏ దేవుడు లేడు. క్షమించండి. మిమ్మల్ని చంపడానికి ఏ పథకము వెయ్యలేదు. పురాణాల్లో దేవుడు ఎక్కువుగా నీటిలో వుండేటట్టు రాసివున్నాయి. మత్స్యావతారము, కూర్మావతారము - ఇవి అన్నీ నీటిలో జరిగినవే. కనుక దేవుడు ఎక్కువగా నీటిలో వుండినట్లు తెలుస్తుంది. అందుగురించి మీరు నీటిలో దూకండి. మీరు నీటిలో

దూకిన వెంటనే చచ్చిపోరు. దానికి ఒక మంత్రం వుంది. ఆ మంత్రం చదువుకుంటూ నీటిలో దూకితే ఏ ప్రమాదము జరుగదు. మీకు నాపై నమ్మకం లేకపోతే ఒకసారి చేసి చూపిస్తాను" అన్నాడు విజయుడు.

విజయుడు మాటలకు శాంతించాడు విక్రమకేతుడు. "ఇప్పుడే బయలుదేరి నదిలో వుండే నీటిలో నువ్వు దూకాలి. నువ్వు చచ్చిపోకుండా బ్రతికి వస్తే నేను కూడ మంత్రం చదువుకుంటూ నీటిలో దూకుతాను" అన్నాడు విక్రమకేతుడు.

'సరే' అని విక్రమకేతునితో నదికి బయలుదేరాడు విజయుడు. నదిలో నీరు బాగానే వుంది. "ఈ నదిలో వెళ్లి దూకు" అన్నాడు విక్రమకేతుడు.

ఏదో మంత్రం చదువుకుంటూ పరుగెత్తుకొని వెళ్లి నదిలో దూకాడు విజయుడు. ఆ నీటితో సహా నది మధ్యకు వెళ్లిపోయాడు. నదిలో అగుపిస్తున్న విజయుడు కొన్ని క్షణాలపాటు మాయమయ్యాడు. విజయుడు నదిలో కనిపించక పోవడంతో చచ్చిపోయాడు అనుకొన్నాడు విక్రమకేతుడు.

కొన్ని క్షణాలకు నీటిపైకి వచ్చాడు విజయుడు. విజయుడు బ్రతికి రావడం చూసి చాల ఆనందించాడు విక్రమకేతుడు. "రేపు ఈ నదిలోనే ప్రజల సమక్షాన దూకుతాను. నా ప్రాణాలకు ఏమి హాని వుండదుగా" అని అడిగాడు విక్రమకేతుడు.

"నేను ఇప్పుడు నీటిలో దూకి ప్రాణాలతో వచ్చాను. మీకు ఇంకా నాపై నా మంత్రంపై నమ్మకం కుదరలేదా?" అని అడిగాడు విజయుడు.

"నీపై నాకు నమ్మకం కుదిరిందిలే" అంటూ తన నివాసానికి విజయుడుతో సహా వెళ్లిపోయాడు విక్రమకేతుడు.

భటులను పిలిచి రేపు తను చేయబోయే కార్యక్రమాన్ని వివరించి దండోరా వేయమని చెప్పాడు విక్రమకేతుడు. భటులు రాజు చెప్పి విధంగా రాజ్యం అంతా దండోరా వేశారు.

మర్నాడు రాజ్యంలో వుండే ప్రజలంతా నది దగ్గరకు చేరుకున్నారు. విజయుడు, విక్రమకేతుడు నది దగ్గరకు చేరుకున్నారు. విక్రమకేతుడు ప్రజలను ఉద్దేశిస్తూ మాట్లాడుతూ, "ఓ ప్రజలారా! దైవం ఎక్కువగా నీటిలో వుండేటట్టు పురాణాలు చెపుతున్నాయి. మత్స్యావతారం, కూర్మావతారం ఇవన్నీ నీటిలో జరిగినవే. నేను కూడ ఒక దేవుడని ఋజువు చేసుకొనేందుకు నీటిలో దూకి కొన్ని క్షణములపాటు మాయమై మరలా మీ దగ్గరకు ప్రాణములతో వస్తాను" అని విజయుడు చెప్పి మంత్రం చదువుకుంటూ నీటిలో దూకాడు విక్రమకేతుడు. నది నీటితో సహా మధ్యకు చేరుకున్నాడు విక్రమకేతుడు. విక్రమకేతుడికి ఈతరాక నీటిలో మునిగి చచ్చిపోయాడు.

విజయుడ్ని ప్రజలంతా మెచ్చుకున్నారు. విజయుడిని రాజుగా వుండమని చెప్పి రాజ్యానికి రాజుగా పట్టాభిషేకం చేశారు. విజయుడు ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకుంటూ రాజ్యాన్ని పాలించాడు.

— శ్రీ బి. వి. పట్నాయక్






సిద్ధయ్యకు దేవుడిమీద నమ్మకం లేదు. అతడు దేవుడు లేడని ప్రచారం చెయ్యడానికి నిశ్చయించుకొన్నాడు.

ఒక రోజు సిద్ధయ్యఉన్న ఊళ్ళో ఒక దేవాలయంలో హరికథా కాలక్షేపం జరుగుతున్నది. సిద్ధయ్య అక్కడికి వెళ్ళి ఆ హరికథ చెప్పే హరిదాసుతో "దేవుడు లేడు, కావాలంటే ఇప్పుడు ఋజువు చేస్తాను ...." అని అన్నాడు. హరిదాసు ఆశ్చర్యపోయి, "ఏది చెయ్యండి మేము కూడా చూస్తాము" అని అన్నాడు.

"దేవుడా నీవే గనుక ఉంటే, నిన్ను నేను ద్వేషిస్తున్నాను. ఎందుకు బీద గొప్ప సృష్టిస్తున్నావు? రోగాలు ఎందుకు సృష్టించావు? నీవే శక్తిమంతుడవైతే నన్ను చంపు, పది నిముషాల కాలం మాత్రం ఇస్తున్నాను నీకు" అని బిగ్గరగా ఆకాశానికేసి చూస్తూ అరిచాడు.

హరికథ వినడానికి వచ్చిన వారందరూ ఆశ్చర్యపోయి చూస్తున్నారు. పది నిముషాలు అయినా సిద్ధయ్యకు ఏమీ కాలేదు. సిద్ధయ్య వారందరివైపు తిరిగి "చూశారా. మీభగవంతుడు నన్ను చంపలేక పొయ్యాడు. అసలు ఉంటే కదా నన్ను చంపడానికి?" అని నవ్వుతూ అన్నాడు.

హరిదాసు వెంటనే ఈ విధంగా చెప్పాడు- "చూడండి సిద్ధయ్యగారు! మీకు నా అనుభవం ఒకటి చెబుతాను. మీరే నిర్ణయించండి. భగవంతుడు ఉన్నాడో లేడో. నేను హరికథ చెప్పడానికి వస్తున్నప్పుడు ఒకడు ప్రక్క వీధిలో మురికిగుడ్డలతో శుష్కించి ఉన్నాడు వాడిని చూస్తే నాకు జాలి వేసింది. రా నాయనా నీకు అన్నం పెట్టిస్తాను. నావద్ద శుభ్రమైన గుడ్డలు ఉన్నాయి. స్నానంచేసి ధరించు నీకు ఏదో ఒక పని ఇప్పిస్తాను" అని అన్నాను. వాడు నేను చూపిన కరుణ అర్థం చేసుకోకపోగా నన్ను "పోరా హరిదాసూ, పిచ్చికబుర్లు చెబుతూ రోజూ పొట్ట పోసుకొనే వాడివి" అంటూ నానా దుర్భాషలు ఆడి, "మనిద్దరం కొట్టుకొందాం, నన్ను ఓడించు. అప్పుడు నీవు చెప్పిన పనులన్నీ చేస్తాను" అని చెప్పాడు. "నిజంగా నేను అతడిని ఒక్క దెబ్బతో పడగొట్టి ఉండేవాడిని, కాని అతడిని ఆ విధంగా చేయక, నా పనిమనిషిచేత తిండి పంపి వస్తున్నాను. అదే విధంగా భగవంతుడు కరుణామయుడు. ఈ సిద్ధయ్యగారు ఏదో అజ్ఞానంలో భగవంతునితో పేచీకి తలపడ్డాడు. నిజంగా భగవంతుడు అనుకొంటే ఇందాకనే చంపివేసి ఉండేవాడు. కాని ఇతనియందు కరుణ కలిగి వదలివేశాడు" అని చెప్పాడు.

అక్కడి వారందరూ హరిదాసు చెప్పిన కథను జయజయ ధ్వానాలతో పొగిడారు. సిద్ధయ్య ముఖం చిన్నది చేసుకొని వేదిక దిగి వెళ్ళిపోయాడు.

— శ్రీ తంచవపల్లి వేంకట కృష్ణారావు



# శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, తిరుచానూరు

## నిత్యపూజా నివేదనలు

సుప్రభాతం — ఉ. 5-00 గం॥ నుండి 5-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 5-30 గం॥ నుండి 6-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు.)

నిత్యఅర్చన — ఉ. 6-00 గంటలకు

(ఏడాదికి రు 150/- లు చెల్లించిన గృహస్థులకు మాత్రమే.)

శుద్ధి, మొదటి గంట — ఉ. 6-00 గం॥ నుండి 6-30 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 6-30 గం॥ నుండి మధ్యాహ్నం 1-00 గం॥ వరకు

శుద్ధి, రెండవగంట — మ. 1-00 గం॥ నుండి 1-30 గం॥ వరకు

సర్వదర్శనం — మ. 1-30 గం॥ నుండి రాత్రి 7-00 గం॥ వరకు

శుద్ధి, రాత్రికైంకర్యము — రా. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

సర్వదర్శనం — రా. 7-30 గం॥ నుండి 8-45 గం॥ వరకు

శుద్ధి — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## శుక్రవారాలలో....

సుప్రభాతం — ఉ. 4-00 గం॥ నుండి 4-30 గం॥ వరకు

సహస్రనామార్చన — ఉ. 4-30 గం॥ నుండి 5-00 గం॥ వరకు

(రు. 6-50 టిక్కెట్‌తో నలుగురు వ్యక్తుల్ని అనుమతిస్తారు)

నిత్యఅర్చన — ఉ. 5-00 గం॥ నుండి 5-15 గం॥ వరకు

శుద్ధి, మొదటిగంట — ఉ. 5-15గం॥ నుండి 5-45 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 5-45 గం॥ నుండి 7-00 గం॥ వరకు

సళ్ళింపు — ఉ. 7-00 గం॥ నుండి 7-30 గం॥ వరకు

మూలవర్లకు అభిషేకం—ఉ. 9-00 గం॥ నుండి 10-00 గం॥ వరకు

(100 రూ. టిక్కెట్‌తో ఇద్దరు వ్యక్తులకు మాత్రమే.)

అలంకారము, రెండవగంట — ఉ 10-00 గం॥ నుండి 11-00 గం॥ వరకు

సర్వదర్శనం — ఉ. 11-00గం॥ నుండి రాత్రి 8-00గం॥ వరకు

ఊంజల్ సేవ — రా. 7-00 గం॥ నుండి 8-00 గం॥ వరకు

(అద్దాంమండపంలో రు. 150 టిక్కెట్‌తో జరుపుకొనవచ్చును. గృహస్థుకు 5 గ్రాముల వెండి డాలర్ బహూకరిస్తారు.)

రాత్రిగంట — రా. 8-45 గం॥ నుండి 9-00 గం॥ వరకు

ఏకాంతసేవ — రా. 9-00 గం॥ నుండి 9-15 గం॥ వరకు

## ఆర్జితం వివరాలు :

ప్రత్యేక దర్శనం: రూ. 2-00

సహస్రనామార్చన: రూ. 6-50

నిత్యఅర్చన: రూ. 150-00 (ఏడాదికి)

అర్చన: రూ. 1-00

హారతి: రూ. 0-50

పూవాభిషేకం (శుక్రవారాలలో) రూ. 100-00

ఊంజల్‌సేవ (శుక్రవారాలలో) రూ. 150-00

తిరుచ్చి ఉత్సవం: రూ. 63-00

గజవాహనం: రూ. 32-00.

16.వ.పేజీ తరువాయి

సాహిత్యంలో ఉండే సారభూతమైన 'భగవత్తత్త్వం' మానవాళి హృదయాల నంటియుండే కామక్రోధాది కశ్మలాన్ని ప్రక్షాళితం చేస్తుంది.

"ఎలా?" అని అడుగుతున్నారా? వినండి.

మానవుడు తన కోరికలను సాధించుకోవడంద్వారా పురోగతిని గాంచగల డని భౌతికశాస్త్రాలు చెపుతుంటే ఆ కోరికలను చంపటంద్వారానే అభ్యుదయాన్ని సాధించగల డని వ్యతిరేకపద్ధతిలో వేదాంతశాస్త్రం చెపుతోంది. అయితే ఆ కోరికలను చంపుకోవడ మెట్లా? అను శంక కలుగ వచ్చును. భగవద్భక్తియొక్కటియే దాని కుపాయము దీనికి ప్రమాణంగా భాగవతంలోని యొక విషయాన్ని ప్రమాణంగా చూపుతున్నాను.

మాతృమరణానంతరం నారదుడు విష్ణువునుగూర్చి తపస్సుచేస్తాడు. విష్ణువు నారదునకు సాక్షాత్కరించగా వారిమధ్య జరిగిన సంభాషణలో

సకృత్ యద్దర్శితం రూప
మేతత్ కామయతేఽనఘ,
మత్కామః శనకై స్సాధు
స్సర్వా న్ముఞ్చతే హృచ్ఛయాన్.

అని విష్ణువు చెపుతాడు (నాయందు భక్తి గలవాని మనస్సులోని అన్ని కోరికలు తొలగిపోవును అని స్థూలార్థం)

"ప్రజహి కామం" (కామాన్ని విడువుము) అని చెప్పిన గీతోపదేశానికి సాధన భూతమైన భాగవత భగవద్భక్తిని మానవ సమాజంలో కల్గించటం కోసం ఋషులు–ప్రవక్తలు స్తోత్రసాహిత్యాన్ని సృజించారు. ఈ సాహిత్యానికి సహజంగా దూరంగా ఉండే ప్రకృతిగల మానవాళిని ఆకర్షించటానికి ఋషులు ఫలశ్రుతు లనే ఆకర్షణలను కల్పించారు.

భగవద్భక్తివలన సర్వకర్మలకు అంతః ప్రేరణను కల్గించే "కామమే" తొలగిపోతే మానవులలో అకర్మణ్యత ఏర్పడదా?? అని యనుమానింపవచ్చును. నిజమే తప్పక అకర్మణ్యత ఏర్పడుతుంది. కాని ఆ యకర్మణ్యత ఏ పనిచేయని సోమరి లక్షణం కల్గినది కాదు. కామభావనకు బీజము ఆసక్తి అని వెనుకచెపితిని కదా. కర్మఫలంమీద ఆసక్తితో కర్మలను చేసే కర్మణ్యత పోయి కర్మఫలంమీద ఆసక్తిలేక కర్మల నాచరించే నిష్కామకర్మణ్యత ఏర్పడుతుంది. "తస్మా దసక్తస్సతతం కార్యం కర్మ సమాచర" (గీ. కర్మ. 19) అని భగవద్గీత కూడ కర్మఫలంమీద ఆసక్తిలేని కర్మలనే ఆచరింపుమని ప్రబోధిస్తోంది. ఈ నిష్కామ కర్మ నాచరించేవాడు విద్వాంసు డని జ్ఞాని యని భంగ్యంతరంగా చెప్పి అట్టివాడు చేసే ప్రతిపని లోకశ్రేయస్సునకే అవుతుం దని

కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్" (క. యో. 25).

భాగవతభక్తివల్ల కలిగే నిష్కామ కర్మణ్యతా ప్రయోజనాన్ని గీత సమర్థించింది.

ఇట్టి నిష్కామ కర్మణ్యతను మానవునిలో ప్రచోదనచేసే భాగవత భగవద్భక్తిని ప్రతి వ్యక్తిలో కల్గించాలనే సద్భావంతో ఋషులు స్తోత్రసాహిత్యాన్ని విస్తారంగా సృజించారు. ఈ నిష్కామకర్మణ్యత మటోక్కమని యౌవనంలాగ మనసులో ఒక్కసారిగా ఏర్పడదు. అది క్రమంగా ఏర్పడవలసిందే. అందుచేతనే స్తోత్రాల చివర ఫలశ్రుతులలో ఏకవారం, ద్వివారం, త్రివారం, శతవారం, సహస్రవారం, లక్షవారం ఇలాచదవం డని మహర్షులు చెప్పడం పై అభిప్రాయంతోనే.




పై సంఖ్యామాన ప్రకారం స్తోత్రాలను చదివితే ఆ యా పుణ్యవిశేషాలు లభిస్తాయని ఆశపెట్టడంద్వారా ఆ యా వ్యక్తులయొక్క వ్యక్తిగత పూర్వజన్మ సంస్కారాలను ప్రబుద్ధం చేయటమే స్తోత్రకర్తల ప్రధానాశయం.

ఫలశ్రుతుల వాగ్దానాలనువిని సులభంగా తమ కోర్కెలను సఫలీకృతంచేసికోవాలను కొని పేరాశతో స్తోత్రపఠనం ప్రారంభించిన వారిచేతనే 'నా కేమీ వద్దు భగవాన్ నీ దర్శనం తప్ప"–

న వై ప్రార్థ్యం రాజ్యం న చ
కనకతాం భోగవిభవం
న యాచేఽహం రమ్యాం
నిఖిలజనకామ్యాం వరవధూమ్,
సదా కాలే కాలే ప్రమథ
పతినా గీతచరితో
జగన్నాథస్వామీ నయన
పథగామీ భవతు మే.

(జగన్నాథాష్టకం. శంకరాచార్యులు)

అని ఎలాప్రార్థన చేయిస్తున్నారో చూడండి. ఇలా ప్రార్థన చేయగా ఆ వ్యక్తి కోరుకొనేది క్షణభంగురాలైన భౌతికసుఖాలు కాదు, వానియందు వైరాగ్యం, జగత్సృష్టికి మూలమైన బ్రహ్మజ్ఞానమున్నూ.

అన్నపూర్ణే సదా పూర్ణే
శంకరప్రాణవల్లభే,
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం
భిక్షాం దేహి చ పార్వతి.

(అన్నపూర్ణాష్టకమ్)

మానవుని యిట్టి నిష్కామ్య కర్మణ్యదశకు తీసికొనిపోవుటే స్తోత్రకర్తల ముఖ్యలక్ష్యం.

ఇట్టి మహోన్నత జ్ఞానవైరాగ్యదశకు తీసికొనిపోయే భాగవత భక్తి భగవంతుని మీద అనన్యభక్తి కల్గినప్పుడు మాత్రమే మానవునికి సిద్ధిస్తుం దని భగవంతుని కృప కల్గినవాడుమాత్రమే పరమాత్మను దర్శించ గలడు.

నాయమాత్మా ప్రవచనేన లభ్యః
న మేధయా న చ బహునా శ్రుతేన

యం వైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వామ్.
(కఠోపనిషత్తు)

అని చెప్పుచున్న కఠోపనిషత్తు ప్రబోధాన్నే ఋషులు ప్రవక్తలు స్తోత్రాలద్వారా మన కెలా అందించారో చూడండి.

భజామి త్వదంఘ్రిం న యాచేఽన్యదేవం,
సదా దేవదయా కృపాళో భవంతం
ప్రభో! దీనబంధో! విభో లోకరక్షన్,
శరణ్యం త్వమేవాస్య నాథ.
సత్యనారాయణ సుప్రభాతమ్.

శరణం తరుణేందుశేఖర
శ్శరణం మే గిరిరాజకన్యకా,
శరణం పునరేవ తావుభౌ
శరణం నాన్యదుపైమి దైవతమ్.
మల్లికార్జునప్రపత్తి.

త్వత్పాదపంకజద్వంద్వం
వినా నాన్యం భజామ్యహమ్,
న్యూనాతిరిక్తం యత్కించిత్
తత్సర్వం క్షంతుమర్హసి.
హనుమత్కవచమ్.

అందుచేతనే ప్రతిస్తోత్రంలో ఇట్టి అనన్యభక్తి నిమాత్రమే ప్రసాదింపు మని "భక్తిం తవ పదపంకజ యుగళే భక్తజనావన దేహి" ఇత్యాది వాక్యాలెన్నో మనకు కనబడుతాయి.

అయితే ప్రతిదేవుని స్తోత్రంలోని నీవే తప్ప వేరు శరణ్యం లేదంటూ చెప్పే శ్లోకా లున్నాయి కదా. ఇలాస్తుతించే టప్పుడు నిజమైన అనన్యభక్తి ఔతుందా? అనే ప్రశ్న కొందరువేస్తుంటారు. వేరు వేరు స్తోత్రాలలో వర్ణింపబడే దేవత లందరు వేరు వేరని వీరి భావన. అది సరి కాదు. స్తోత్రాలు వేరయినా దేవతల పేర్లు వేరు వేరయినా వర్ణింపఁ బడేది ఒకే భగవత్తత్త్వం. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అని ఉపనిషత్తులు చెప్పేది యిదే. భిన్నభిన్న మనస్తత్త్వాలుగల మానవుల నా యా రూపాల్లో అనుగ్రహించటానికే ఒకే భగవంతుడు భిన్నభిన్నరూపాలను నామాలను ధరించాడు.

యే యథా మాం ప్రపద్యంతే
తాం త థైవ భజామ్యహమ్

అని గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన వాక్యాని కిదే యర్థం. భగవంతుడొక్కడే యని ఉపనిషత్ భగవద్గీతల మహాప్రబోధాన్ని విస్మరించి దేవుని భిన్నభిన్ననామ రూపాలను జూచి భిన్న దేవతలుగా భ్రమించి మానవసంఘ మంతా మతకలహాల కార్చిచ్చులో, నేటి యీ హేతువాద వైజ్ఞానిక కాలంలో కూడ దహించుకొని పోతూంది. దూరదృష్టిగల మహర్షులు – మతప్రవక్తలు స్తోత్ర సాహిత్యం ద్వారా భగవంతుడొక్కడే అని యిచ్చే యీ ప్రబోధమీ వైజ్ఞానికయుగంలో కూడ ఎంత ఆచరణీయమైనదో పరిశీలించండి.

సర్వత్ర మాం రక్షతు విశ్వమూర్తి
ర్జ్యోతిర్మయానన్దఘన శ్చిదాత్మా,
అణోరణీయానురు శక్తిరేక
స్స ఈశ్వరః పాతు భయాదశేషాత్.
శివకవచ స్తోత్రం,
స్కాందపు. బ్రహ్మోత్తర ఖండము

ఏక స్స ఏవ జగతి స్థిరసంస్థిత స్తే
యః పాదయో స్తవ సకృత్ప్రణతిం
కరోతి.
— లలితా పంచదశీస్తోత్రమ్

ఏక స్త్వ మేవ బహుధా భవ భాసి లోకే
నిశ్శంకధీ ర్వృషభకేతన మల్లినాథ,
శ్రీభ్రామరీప్రియ సుఖాశ్రయ లోకనాథ
శ్రీశైలశేఖర విభోతవ సుప్రభాతమ్
— మల్లికార్జున సుప్రభాతమ్

యత్తేజః పరమాణు రేత దఖిలం
నానాస్ఫురన్నామభిః
భూతం భావి భవచ్చ రాచర
జగద్ధత్తే బహిశ్చాంతరే.
శ్రీమల్లికార్జున ప్రపత్తి

ఏ రూపంలో ఉన్నా ఏ నామంతో ఉన్నా భగవంతు డొక్కడే అని గ్రహించ గల్గిన నాడు మానవాళి యంతా భగవంతుని బిడ్డలే. భూఖండమంతా ఒకే కుటుంబం అనే విశ్వైక కుటుంబ భావన మానవ సమాజంలో యాదృచ్ఛికంగానే కలుగుతుంది. ప్రాంతీయ-దేశీయ-జాతీయ-మతాదిదురభిమానాల కతీతమైన యీ విశ్వకుటుంబ భావనను ఋష్యాదులు స్తోత్రాల ద్వారా నిత్యం మానవాళిచేత మనన మెలా చేయిస్తున్నారో చూడండి.

మాతా చ పార్వతీదేవీ
పితా దేవో మహేశ్వరః,
బాంధవా శ్శివభక్తా శ్చ
స్వదేశో భువనత్రయమ్.
— అన్నపూర్ణాష్టకము

ఈ విశ్వైక కుటుంబ భావనకు ప్రాతిపదిక తాను భగవంతుని బిడ్డడ నని, భగవంతుడే తనకు తల్లి-తండ్రి అనే భావన మనిషిలో బలపడిననాడు తోటిమానవులంతా తనతోబాటే దేవుని బిడ్డలనే భావనగల్గి విశ్వైక కుటుంబభావన ఏర్పడుతుంది. అందుచేత స్తోత్రకర్తలంతా స్తోత్రపాఠకుల చేత ప్రతినిత్యం-

జగజ్జనన్యై జగదేకపిత్రే
నమశ్శివాయై చ నమశ్శివాయ.
— అర్ధనారీశ్వరస్తోత్రం

శీతలే త్వం జగన్మాతా
శీతలే త్వం జగత్పితా,
శీతలే త్వం జగద్ధాత్రీ
శీతలాయై నమో నమః.
— శీతలాష్టకమ్

అని భగవంతుడే నాకు తల్లి దండ్రులనే భావాన్ని మననం చేయిస్తున్నారు. కాని ఏం ప్రయోజనం? తల్లి- తండ్రి- భ్రాత: మిత్రుడు - భార్య - బిడ్డలు జ్ఞాపకం రాగానే ఎంతటి మానవుడుకూడ మాయలోపడి స్వార్థాన్ని పెంచుకుంటాడు. మానవుని యీ బలహీనతను గుర్తించే స్తోత్రకర్తలు-

సత్యం మాతా పితా జ్ఞానం
ధర్మో భ్రాతా దయా సఖా,
శాంతిః పత్నీ క్షమా పుత్రః
షడేతే మమ బాంధవాః.
— శైవషడక్షరీస్తుతిః

అనే యీ భావానికి ప్రాధాన్య మిచ్చి నిత్యస్తోత్రపఠనరూపంగా మనశ్శిక్షణ నిచ్చారు.

ఇట్టి మనశిక్షణ పొందిన వ్యక్తి క్షణికములైన ఫలశ్రుతులు చూపే ప్రతిఫలాలకోసం

భగవంతుని ప్రార్థింపడు. విశ్వైకకుటుంబ భావన కడ్డుపడే దుర్గుణాలను తొలగించి సర్వజీవులయందు తనకు దయగల్గునట్లు చేయుము.

అవినయ మపనయ విష్ణో దమయ మనః
శమయ విషయమృగతృష్ణామ్,
భూతదయాం విస్తారయ
తారయ సంసారసాగరతః.

—షట్పదీస్తోత్రం. శంకరాచార్యులు

అని మాత్రమే ప్రార్థిస్తాడు. సహజమానవ బలహీనతవల్ల ఏనాడూ కూడ

పౌరోహిత్యం రజనిచరితం
గ్రామణీత్వం నియోగో
మాఠాపత్యం హ్యనృతవచనం
సాక్షివాదం పరాన్నమ్,
బ్రహ్మద్వేషః ఖలజనరతిః
ప్రాణినాం నిర్దయత్వం
మా భూదేవో మమ పశుపతే
జన్మజన్మాంతరేషు.
శివాపరాధక్షమాపణస్తోత్రం

— అప్పయ్య దీక్షితులు.

ఇలాంటి నీచపు పనులు జరుగకుండ చూచి రక్షింపు మని వేడుకొంటాడు.

ఇలా యీ స్తోత్రసాహిత్య మంతా ఒక పెద్ద గుణరత్నాకరం. దిగి తెచ్చుకుంటే సద్గుణరత్నా లెన్నో లభిస్తాయి. గతానుగతికంగా కోరికల వెల్లువలో కొట్టుకొనిపోయే దీనజనులను ఫలశ్రుతులద్వారా యీ స్తోత్ర గుణరత్నాకరాలపై పునకు మరలించి ఉన్నతులుగా తీర్చిదిద్దటమే మన ఋషుల ప్రవక్తల ప్రధాన లక్ష్యం.

ఇట్టి లక్ష్యశుద్ధితో ఋష్యాదులు స్తోత్రాలు వ్రాసి నా స్తోత్రాలను చదివినవారందరికి నిట్టి సద్గుణా లలవడుతున్నాయా? అనే సందేహం కలుగవచ్చు. నిజమే విషం శరీరంలో కలిసి పనిచేయడానికి ఏ నియమాలు లేక పోయినా ఔషధం మాత్రం పనిచేయాలంటే దానికి కొన్ని ఆహార విహార నియమాలుంటాయి. ఆ నియమాలు పాటించకుండ రోగం తగ్గలేదని వైద్యుణ్ణి ఔషధాన్ని నిందిస్తే ప్రయోజన మేమిః ఇప్పుడు మానవసమాజం చేస్తున్న పని యిదే. స్తోత్రాలలో ఫలశ్రుతులతోబాటు వానిని చదివే పఠితకు—

గంగాష్టకమిదం పుణ్యం
యః పఠేత్ భక్తిపూర్వకమ్,
సర్వపాపవినిర్ముక్తో
విష్ణులోకం స గచ్ఛతి.

— గంగాష్టకము. శంకరాచార్యులు

శ్రోతవ్యం పఠితవ్యం చ
శ్రద్ధాభక్తిసమన్వితైః
ఉపసర్గవినాశాయ
స్వస్త్యయనం మహత్

—శీతలాష్టకమ్. స్కాందపురాణం

వనే రణే శత్రుజలాగ్నిమధ్యే
యదృచ్ఛయాపత్సు మహాభయేషు,
ఇదం పఠన్ స్తోత్ర మనాకులాత్మా
సుఖీ భవేత్ తత్కృతసర్వరక్షః.

— పంచాయుధస్తోత్రమ్

శతావర్తం ప్రవర్తవ్యం
సంకటే కష్టనాశనమ్,
శుచి ర్భూత్వా పఠేత్ స్తోత్రం
సర్వసిద్ధిప్రదాయకమ్.
పూజ యస్వైన మేకాగ్రో
దేవ దేవం జగత్పతిమ్.

— ఆదిత్యహృదయం

భక్తిపూర్వకః; శ్రద్ధాభక్తిసమన్వితః; అనాకులాత్మా; శుచిర్భూతః; ఏకాగ్రః - అనే లక్షణాలు కల్గియుండా లని ఋషులు పేర్కొన్నారు. చిత్తం శివునిమీద; భక్తి చెప్పులమీద అన్నట్టు మన భక్తి అంతా ఫలశ్రుతులు వర్ణించే ప్రతిఫలాలమీదే గాని వానిలో అంతర్భాగంగా చెప్పిన నియమాల మీద మనకు దృష్టి ఏదిః అందుచేతనే అహర్నిశలు స్తోత్రపాఠాలు చేసినా గంధపు చెక్కలు మోసే దానికి మంచి గంధ మంటని విధంగా ఫలశ్రుతుల ప్రయోజనం మన కేమీ అంటటం లేదు. ఈ దోషం మన దగ్గర ఉంచుకొని చిత్తశుద్ధితో మహర్షులు వ్రాసిన స్తోత్రసాహిత్యప్రయోజనాన్ని శంకిస్తున్నాము. అంతే కాదు. మహర్షుల పరమ కారుణిక బుద్ధినికూడ విమర్శిస్తున్నాము. ఇకనైనా మన తప్పిదాన్ని క్షమించ మని ఆ ఋషులను భగవంతుని ప్రార్థిద్దాము.

యోషి న్మూఢా హమజ్ఞా తే
తత్త్వం జానే కథం విభో
తస్మాత్ తే శతశో రామ
నమస్కుర్యా మనన్యధీః.

—అహల్యాస్తవమ్

★




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

**పథకంలోని ముఖ్యాంశాలు :**

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.

* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)

* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు

* ఆ దినాన జరిగే ఆర్జిత సేవలన్నింటిని కైంకర్యదాత తన వారితో సహా తిలకించవచ్చును.

* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.

* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.

* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆ యా దాతలకు తెలియచేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.




గాయత్రి పరబ్రహ్మము. గాయత్రి కధీశ్వరుడు కమలాప్తుడు. గాయత్రీమంత్రమునకు సాటివచ్చు మంత్రములే లేవు. అక్షరములలో ప్రణవము ఎట్లు శ్రేష్ఠమో, ఎట్లు బ్రహ్మమో, ఎట్లు వశిష్ఠమో, పరిశిష్టమో, మంత్రములలో గాయత్రి అట్లు శ్రేష్ఠము. అట్లు బ్రహ్మము, అట్లు వశిష్ఠము, పరిశిష్టమును. అందువలననే గాయత్రిని వేదమాత యనువారు ఋషులు. సర్వవేదములును గాయత్రి యందున్నవి: ఏ విధముగ నున్నవియనగా: మేలైన రెండు తొమ్మిదుల విద్యలలోనను మీమాంసయను నది మననీయ మగుచు వెలయుచున్నది. మీమాంసకంటెను శుభోదర్కమైన గరిమతో తర్కశాస్త్రము ప్రాభవము మిగులుచున్నది. మరి వేదరాశి, తర్కశాస్త్రము కంటెను తాను సమభ్యధికమై పెనుపొందుచున్నది. ఆమ్నాయములకన్నను అభ్యర్హితము లున్నవా? లేవా? అన్నచో ఉపనిషత్తు లున్నవి. కాని అవి వేదములయొక్క తుదలు. అందువలన వేదములకన్నను అభ్యర్హితములు. మరి వీనికన్నను గాయత్రి యూర్ధ్వపదవిని వహించుచున్నదనగా, గాయత్రియనెడి మంత్రము కామధేనువు వంటిది. దానికి ప్రణవము క్రేపు. ఆ క్రేపుతో గూడ గాయత్రియను సురభి అవనిజనులకు సచ్చిదానంద పరబ్రహ్మమును సాక్షాత్కరింప చేయుచున్నది.

ప్రణవమునకును, గాయత్రికినివున్న సామానాధికరణ్యము విచిత్రమైనది. గాయత్రికి నాలుగు పాదములున్నట్లే ప్రణవమునకును నాలుగు పాదములున్నవి. గాయత్రి బ్రహ్మమును చెప్పుచున్నట్లే, ప్రణవమును బ్రహ్మమును చెప్పుచున్నది. తురీయమగు స్థితిలోనే రెండును ఒక్కటియే.

"గాతారం త్రాయతే నాగ కలిగిన తెలివిన్
గల్గె గాయత్రి కర్థాన్వితంబై
నామధేయంబు
ఇతర మనువులం దీ ప్రభావంబు లేదు
ఈ ప్రాతర్మధ్యాహ్న సాయోపగమముల
పరబ్రహ్మ విద్వాంసు లార్యుల్
జ్యోతిర్మూర్తిన్ భజింతు ర్పరగుణ వినుతున్
సూర్యునిన్ సిద్ధ విద్యన్."

ఇటువంటిది గాయత్రి. ప్రణవమును అటువంటిదే. వేదము ఈ ప్రణవమును ఎట్లు వ్యాఖ్యానించుచున్నదో చూడుడు.

"ఓమ్ ఇత్యేతదక్షర మిదగ్ం సర్వం తస్యోప వ్యాఖ్యానం. భూతం భవత్ భవిష్యత్ ఇతి సర్వం ఓమ్కార ఏవ, యచ్చాన్య త్రికాలాతీతం తదప్యోంకార ఏవ."

ఈ సర్వమును ఓంకార స్వరూపము, భూతభవద్భవిష్యత్కాలముల యందున్నది. సర్వమును ఓమ్ కారమ్. అది త్రికాలాతీతము. ఇతరమైనది ఏది కలదో, అదికూడ ఓమ్ కారమ్. మరి సర్వము ననగా ఏమనగా: - జగత్తంతయు నని అర్థము. అంతే గాక అన్ని జగత్తులు నని అర్థము. మరి అది యేమి? అదియంతయు బ్రహ్మాత్మకము, బ్రహ్మము, ఆత్మయు బ్రహ్మయే.

"సర్వం ఏతత్ బ్రహ్మ
అయం ఆత్మా బ్రహ్మ."

ఆ బ్రహ్మము నాలుగు పాదములు గలది.

"సః అయం ఆత్మా చతుష్పాత్" కదా.

ఈ నాలుగుపాదములును ఓమ్కారము, లేక ప్రణవమున నున్నవి. ఈ ప్రణవము అకార ఉకార మకార అధిమాత్రలనుగా ఋషులు పేర్కొనుచున్నారు. ఈ నాలుగు పాదములకును విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయము లను, సంజ్ఞలను ఏర్పరచినారు. ప్రణవముయొక్క మొదటిపాదమును అకారముచే నిర్దేశించినారు. ఆ పాదమును వైశ్వానరస్వరూపముగ నిర్ణయించినారు. అది జాగరితస్థానమునకు సంకేతము. ఆ స్థానమునందలి పురుషుడు ఆస్థానమును నిర్వహించువాడు. బహిష్ప్రజ్ఞుడు, సప్తాంగములుగలవాడు. ఏకోనవింశతి ముఖములు కలవాడు, స్థూలభుక్కు, వైశ్వానరుడు.

"జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః స్థూలభుక్ వైశ్వానరః ప్రథమః పాదః."

ఈ వైశ్వానరపురుషుడు జాగ్రదవస్థా నిర్వాహకుడు. బాహ్యవస్తు జ్ఞాన మొసగు



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏశైకాతం సర్పిడితో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహణా మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత నగం వెల రూ. 650/- అవుతుందికనుక టి. టి. డి. కార్య నిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

వాడు. ఏడు అంగములకు కర్త. ఈ ఏడు అంగము లేవియో వేదం తనంతకు తాను తెలియ చేయుచున్నది. "ద్యు సూర్య వా య్వా కాశ వారి పృథివీ జీవు" లనుగా వేదము చెప్పుచున్నది. మరియు ఈ పురుషుడు ఏకోనవింశతి ముఖముల కధికారికదా! ఆ ఏకోనవింశతి ముఖములు ఏవి? జ్ఞానేంద్రియములును, కర్మేంద్రియములును, ప్రాణములును, మనోహంకార చిత్తములును, బుద్ధియు. ఇతడు స్థూల పదార్థములను అనుభవింప చేయువాడు. సమస్తజనులను ఆ యా మార్గములను పొందించువాడగుట వలన ఓంకారము నందలి ప్రథమాక్షరము చేత నిర్దేశింపబడు ఈ పురుషుడు వైశ్వానరుడైనాడు. ఇతడు పరమాత్మయొక్క లేక బ్రహ్మ పదార్థముయొక్క ఒక్క స్వరూపముల జాగ్రదవస్థయందు బ్రహ్మము యొక్క ప్రతిభాసము.

స్వప్నావస్థయందు ఈ పురుషుడే తైజసు డగుచున్నాడు. ఇతడు ప్రణవము నందలి రెండవ పాదమగు ఉకారముచేత నిర్దేశింపబడుచు, బ్రహ్మము యొక్క ద్వితీయరూపమై ప్రతిభాసించుచున్నాడు. ఇతనిని గూర్చి వేదము ఈ విధముగ తెలియజేయు చున్నది.

"స్వప్నస్థానోఽంతఃప్రజ్ఞః సప్తాంగః ఏకోనవింశతిముఖః ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయపాదః"

స్వప్నావస్థ నిర్వాహకుడు, బాహ్యార్థ జ్ఞాన జన్యవాసనా ప్రయుక్తార్థముల జ్ఞానమును కలుగజేయువాడు. స్వప్న సంబంధమైన ఏడు అంగములు కలవాడు. బాహ్య పదార్థేతరములయిన స్వాప్నిక పదార్థములను అనుభవింప జేయువాడు, తేజస్స్వరూపుడు. ఇతనిని ఋషులు తైజసుడని వ్యవహరించి నారు.

మరియు నితడే సుషుప్త్యవస్థయందు మరియొక్క విధముగా అభిభాసించు చున్నాడు. ఇతనిని ఋషులు ప్రాజ్ఞ పురుషునిగ నిర్దేశించిరి. ఇతడు చేతోముఖుడు. సుషుప్తిస్థానమేతానుగనున్నవాడు. ప్రజ్ఞానఘనుడు. ఆనందమయుడు. ఆనందభుక్కు. ఇతడు ప్రాజ్ఞుడు. బ్రహ్మముయొక్క మూడవ రూపము. సుషుప్తి యనగా నేమియో తెలిసినగదా ఇది యంతయు తెలియునది. అందువలన వేదమే ఆ సుషుప్తి యనగా నేమియో ఈ క్రింది విధముగ తెలుపు చున్నది.

"యత్ర సుప్తః న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం."

ఏ నిద్రావస్థయందు జీవుడున్నపుడు ఏ కామమునుగాని లేక యుండునో, ఏ కోరికను కోరకయుండునో, ఏ స్వప్నమును గాని పొందకయుండునో, అది సుషుప్తి. సుషుప్తిలో బాహ్యప్రపంచజ్ఞానము వుండదు బాహ్యప్రపంచమే యుండదు. జీవుడు బ్రహ్మమే యగుచున్నాడు. ఆ స్థితి జాగరిత స్థితి కాదు. అది స్వప్నమును కాదు. అచ్చమైన ఎరుక. అందుచేతనే జీవు డచ్చట బ్రహ్మమై ప్రజ్ఞానఘను డగుచున్నాడు. ఆనందమయుడు, ఆనందభుక్కు, శుద్ధమైన మనస్సుచేతనే గ్రహింపబడువాడు, ప్రాజ్ఞుడు, సర్వజ్ఞుడు అగుచున్నాడు. అందుచేతనే వేదములు అతనిని సుషుప్తి స్థాన ఏకీభూతునిగా నిర్దేశించినవి. ఇతనినే పరమాత్మ యనినవి. అంతర్యామి అనినవి. సర్వస్వయోని యనినవి. సర్వభూతముల ఉత్పత్తిలయములకు కారణముగా పేర్కొనినవి.

"ఏష సర్వేశ్వరః ఏష సర్వజ్ఞః ఏష అంతర్యామీ ఏష యోనిః సర్వస్య ప్రభవాప్యయే హి భూతానాం."

మరి తురీయ మనగా నేమి? అది పరమాత్మయొక్క నాల్గవరూపము. దీనిని గూర్చి వేద మీ రీతిగ చెప్పుచున్నది. ఈ తురీయరూపము జ్ఞానేంద్రియగోచరమగు నది కాదు. అది అదృష్టము. వ్యవహారములకు అతీతమైనది. అది అవ్యవహారము. కర్మేంద్రియములచేత తెలియబడునది కాదు.

అది అగ్రాహ్యము. శబ్దములచేత నిర్దేశించ తగినది కాదు. అది అవ్యపదేశ్యము. ఆలోచనముచేత అందుకో తగినది కాదు. అది అచింత్యము. జాగ్రత్ స్వప్న సుషుప్తి స్థానములయందలి బ్రహ్మమునకు సారమైనది. అది ఏకాత్మప్రత్యయసారము. ప్రపంచమునకు లయస్థానమును; కారణ స్థానమును, అది ప్రపంచోపశమము. అది శాంతము. అది శివము, అది అద్వైతము. ఇట్లు చెప్పబడినదే ఆత్మ. అదియే తెలియ తగినది.

"స ఆత్మా; స విజ్ఞేయః"

ఈ ఆత్ముడు, ఈ విజ్ఞేయుడు ఎట్టివాడు? అతడు అంతఃప్రజ్ఞ కలవాడు కాడు. బహిప్రజ్ఞుడు కాడు. అనగా తైజసుడు కాడు. వైశ్వానరుడును కాడు. ఈ విశ్వతైజసుల సంఘాతమును కాడు, ప్రజ్ఞానఘనుడు కాడు; ప్రజ్ఞారహితుడును కాడు. మరి యెవ్వడు? అందుకు వేద మీరీతిగ తెలియచేయు చున్నది. ఆ తురీయరూపమును గురించి.

"అంతఃప్రజ్ఞం న బహిప్రజ్ఞం న ఉభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం"- మరి యేమి? "అదృష్టం అవ్యవహార్యం అగ్రాహ్యం అలక్షణం అచింత్యం అవ్యపదేశ్యం ఏకాత్మప్రత్యయ సారం ప్రపంచోపశమం శాంతం శివం అద్వైతం స ఆత్మా స విజ్ఞేయః."

మాత్రా పరిమాణ నిర్ణయములు లేని ప్రణవము యొక్క తురీయ పాదము బ్రహ్మము. దీనిని అవ్యవహార్యముగా, ప్రపంచోపశమముగా, శివమునుగా, అద్వైతమునుగా తెలిసినవాడు బ్రహ్మమే యగుచున్నాడు. ప్రణవము చెప్పిన ఈ బ్రహ్మమునే గాయత్రియు చెప్పుచున్నది. గాయత్రిచెప్పుచున్న సూర్యమండలాంతర్గత పురుషుడును, దక్షిణనేత్రాంతరస్థ పురుషుడును, హృదయమునందలి గుహ యందు నెలకొనియున్న పురుషుడును ఒక్కరే. గాయత్రిలోని ఈ మహత్త్వపూర్ణమైన అర్థమునే ప్రణవము వ్యక్తపరచు చున్నది. అందువలననే ఋషులు గాయత్రిని కామధేను వనినారు. ప్రణవము క్షేపు అనినారు.

ఇంతకును గాయత్రి చెప్పు నదేమి? దాని అర్థ మేమిటి? గాయత్రి చెప్పునది ఇది, దాని యర్థమును ఇది. పరమాత్మ లింగధర్మ రహితుడు. సత్యజ్ఞానాది లక్షణములు కలవాడు. ఆ పరమాత్మను మనుష్యులము, అయిన మేము, తెలిసికొనలేక పోవుచున్నాము. కారణము? చిరకాలాభ్యస్తములైన భిన్నభేదములు, భేదభావములు, మా యందున్నవి. అయినను మా అంతఃకరణ ప్రవృత్తులను పరమాత్మయే ప్రేరేపించుచున్నాడు. ఆ పరమాత్మ సకలజగదుత్పత్తిస్థితి సంహార కారకుడు, అంతర్యామి, స్వయంప్రకాశుడు, వరేణ్యుడు. సకలజగత్తునకును అధిష్ఠానమును, ఉపాదానకారణమును, ఆధారమును, ఆశ్రయమును ఆతడు. అతడే పరమ సుఖము. ఆధ్యాదిదోషములను నిర్జయించువాడు. సాక్షాత్కారముచేత అవిద్యను, దాని కారణమయిన ఆవరణమును దహించువాడు.

వాక్కునకు మనస్సుకు అగోచరుడు. సూర్యమండలమందును హృదయమండల మందును వేదములయందును సకల లోకముల యందును బ్రహ్మస్వరూపుడై యున్నవాడు. ఆబ్రహ్మమును మనుష్యుడు ధ్యానించుచున్నాడు. తానుకూడ ఆ బ్రహ్మమేనని తెలుసుకొనుచున్నాడు. ఆ బ్రహ్మముతో అభేదమును కోరి ధ్యానము చేయుచున్నాడు. మూలప్రకృతికన్న పరమై, వేరై ఉన్న బ్రహ్మమును సకల శ్రుతుల చేత ప్రతిపాదింపబడిన బ్రహ్మమును తనకు సాయిజ్యమును కల్పన చెయవలయునని ధ్యానించుచున్నాడు. తన్ను రక్షించవలయుననియు ధ్యానించు చున్నాడు. అవిద్యా నివృత్తి పూర్వక స్వస్వరూప జ్ఞానమును కలుగజేయు గాత యని ధ్యానించుచున్నాడు.

గాయత్రి ఏ బ్రహ్మమును గూర్చి చెప్పుచున్నదో, ఆ పురుషుని వేదము లిట్లు వర్ణించినవి:

"స యశ్చాయం పురుషే
య శ్చాసావాదిత్యే స ఏకః"

బ్రహ్మమును, సూర్యమండలాంతర్గత పురుషుడును ఒక్కరే. హృదయ గుహ యందలి పురుషుడును అతడే. అతనిని వేదమిట్లు కీర్తించినది.

"బ్రహ్మ విదాప్నోతి పరమ్
తదేషాఽభ్యుక్తా
సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ
యో వేద నిహితం గుహాయాం
పరమే వ్యోమన్ సమానాయ
సోఽశ్నుతే సర్వాన్కామావ్యతే
బ్రహ్మణా విపశ్చితేతి"

అట్టి పరమపురుషుని గూర్చి చెప్పుచున్న గాయత్రిని గురించి వేదమిట్టుల నమస్కరించుచున్నది.

"తస్యా ఉపస్థానం. గాయత్ర్య స్యేకపదీ
ద్విపదీ త్రిపదీ చతుష్పదీ
అపదసి
న హి పద్యసే
నమస్తే తురీయాయ దర్శతాయ
పదాయ
పరో రజసేఽసావదోమ్"

గాయత్రీ! నీవు మూడు లోకములు ప్రథమ పాదముగా గల దానవు. ఋగ్యజుస్సామములే ద్వితీయ పాదముగా గల దానవు. ప్రాణాపానాదికమే తృతీయ పాదముగా గలదానవు. నాల్గవదియగు తురీయ పాదముచే నాలుగు పాదములు గలదాని వగుచున్నావు. ఏ కారణమువలన నీ నాల్గవ పాదము తెలియబడదో ఆ కారణమున నిరుపాధికమగు స్వస్వరూపముతో పాదము లేని దానివే యగుచున్నావు. అటువంటి పరోరజసి యగు నీ యొక్క పాదమునకు నమస్కారము.



# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత, పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలలో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు, స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళే దోవపొడుగునా రాత్రింబవళ్ళు పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

(12వ పేజీ తరువాయి)

ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున ! తిష్ఠతి ।
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

అర్జునా ! సర్వేశ్వరుడు సమస్తప్రాణుల హృదయాల లోనూ విలసిల్లుతూ, తన మాయతో సర్వభూతాలలోనూ కీలు బొమ్మలలాగా ఆడిస్తున్నాడు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

అర్జునా ! అన్నివిధాల ఆ ఈశ్వరుడినే శరణు వేడు. ఆయన దయవల్ల పరమశాంతినీ, శాశ్వతమైన మోక్షాన్నీ పొందుతావు.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥

పరమ రహస్యమైన జ్ఞానాన్ని చెప్పాను. బాగా ఆలోచించి నీకెలా తోస్తే అలా చెయ్యి.

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥

నీ వంటే నా కెంతో ఇష్టం. అందువల్ల నీ మేలు కోరి పరమ రహస్యమూ, సర్వోత్కృష్టమూ అయిన మరో మాట చెబుతాను విను.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥

నా మీదే మనసు వుంచి, నాపట్ల భక్తితో నన్ను పూజించు, నాకు నమస్కరించు. నాకు ఇష్టుడవు కనుక ఇది నిజమని శపథం చేసి మరీ చెబుతున్నాను. నీ వలా చేస్తే తప్పకుండా నన్ను చేరుతావు.

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

సర్వధర్మాలనూ విడిచిపెట్టి నన్నే ఆశ్రయించు. పాపాలన్నిటినుంచీ నీకు విముక్తి కలగజేస్తాను. విచారించకు.

ఇదం తే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన ।
న చాఽశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥

నీకు ఉపదేశించిన ఈ గీతాశాస్త్రాన్ని తపస్సు చేయని వాడికీ, భక్తి లేనివాడికీ, వినడానికి ఇష్టంలేని వాడికీ, నన్ను దూషించేవాడికి ఎప్పుడూ చెప్పకూడదు.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥

పరమరహస్యమైన ఈ గీతాశాస్త్రాన్ని నా భక్తులకు బోధించేవాడు నామీద పరమభక్తితో నన్ను చేరుతాడనడంలో సందేహం లేదు.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి ॥

అలాంటివాడికంటే నాకు బాగా ప్రీతి కలుగ జేసేవాడు మనుష్యులలో మరొకడు లేడు. అతనికంటే నాకు ఎక్కువ మక్కువ కలిగినవాడు ఈ లోకంలో ఇక ఉండబోడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహం ఇష్టస్స్యామితి మే మతిః ॥

మన వుభయులకీ మధ్య జరిగిన ఈ ధర్మసంవాదాన్ని చదివినవాడు జ్ఞానయజ్ఞంతో నన్ను ఆరాధిస్తున్నాడని నా వుద్దేశం.

శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపిముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥

ఈ గీతాశాస్త్రాన్ని శ్రద్ధతో అసూయ లేకుండా ఆలకించేవాడు పాపాల నుంచి విముక్తిపొంది, పుణ్యాత్ములుండే శుభలోకాలను చేరుతాడు.

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ ! త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥

పార్థా ! నిశ్చలమైన మనసుతో నీవు ఈ గీతాశాస్త్రాన్ని విన్నావుకదా ! ధనంజయా ! అవివేకంవల్ల కలిగిన నీ భ్రాంతి అంతా అంతరించిందా లేదా ?

అర్జున ఉవాచ :

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥

అర్జునుడు: కృష్ణా! నీ దయవల్ల నా వ్యామోహం తొలగి పోయింది. జ్ఞానం కలిగింది. నా సందేహాలన్నీ తీరిపోయాయి. నీ ఆదేశాన్ని శిరసావహించడానికి సిద్ధంగా వున్నాను.

సంజయ ఉవాచ:

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్॥

సంజయుడు: శ్రీకృష్ణ భగవానుడికీ మహాత్ముడైన అర్జునుడికీ మధ్య ఇలా ఆశ్చర్యకరంగా, ఒళ్ళు పులకరించే టట్లుగా సాగిన సంవాదాన్ని విన్నాను.

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవాన్ ఏత ద్గుహ్యతమం పరమ్।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్ సాక్షాత్కథయతస్స్వయమ్॥

యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు స్వయంగా అరునుడికి అతిరహస్యమూ, సర్వోత్కృష్టమూ అయిన ఈ యోగశాస్త్రాన్ని చెబుతుండగా శ్రీ వేదవ్యాస మహర్షి కృప వల్ల నేను విన్నాను.

రాజన్! సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥

ధృతరాష్ట్ర మహారాజా! అద్భుతమూ, పుణ్యప్రదమూ అయిన కృష్ణార్జునుల ఈ సంవాదాన్ని పదే పదే స్మరించు కుంటూ సంతోషిస్తున్నాను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః॥

ధృతరాష్ట్ర మహారాజా! అత్యద్భుతమైన శ్రీకృష్ణ భగవానుడి విశ్వరూపాన్ని మళ్ళీ మళ్ళీ తలచుకుంటూ మహాశ్చ ర్యం పొంది ఎంతో సంతోషిస్తున్నాను.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతిర్మమ॥

యోగేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుడూ, ధనుస్సు ధరించిన అర్జునుడూ వుండేచోట సంపద, విజయం, ఐశ్వ ర్యం నీతి నిలకడగా వుంటాయని నా విశ్వాసం.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలలోని "మోక్ష సన్న్యాసయోగం" అనే పద్దెనిమిదవ అధ్యాయం సమాప్తం.

*

---

( 8వ పేజీ తరువాయి )

రీషుని అతిథి అయి, స్నానానికి వెళ్ళి ఎంత సేపటికీ తిరిగిరాకపోగా ద్వాదశి ఘడియలు ముగుస్తాయని విష్ణుభక్తికి అపచారం చేసే కన్నా విప్రశాపానికి లక్ష్యమవడమే మేలను కొని ఆతిథ్యానికి భంగం కలుగకుండా జల పారణ చేశాడు అంబరీషుడు. అంతలోనే దూర్వాసుడు వచ్చి నోటికి వచ్చినట్లు తిట్టి, పది జన్మలెత్తుమని శపించాడు. అది విన్న పీతాంబరుడు దూర్వాసుని బారి నుండి అంబరీషుని కాపాడి తనే ఆ పది జన్మలను పది అవతారములుగా యెత్తి పది వేసముల దిట్ట అయినాడు. అంబరీషుని పారణ కారణంగా శేషశాయి దశావతారము లెత్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేశాడు.

వేదసమ్మతమైన కార్తికవ్రతం చెయ్యని స్త్రీ పురుషులు "అంధతమసం" అనే నరకంలో నానా బాధలు అనుభవిస్తారు. కార్తిక మాసంలో కార్తిక మాహాత్మ్యమును చదివిన వారు, విన్నవారు పాప విముక్తు లౌతారు. సకల సంపదలతో సుఖంగా జీవి స్తారు. అంత్యమున విష్ణుపదమును పొందె దరు.

తెలుగువారికి చైత్రం (ఉగాది) యెట్లో మార్వాడీలకు కార్తిక మట్లు. కార్తిక శుద్ధ పాడ్యమి నుండి వ్యాపారులు కొత్తలెక్కలు ఆరంభిస్తారు.

కార్తిక శుద్ధ పాడ్యమి నాడు గోవర్ధన పూజ, విదియ నాడు భగినీ హస్త భోజనం, ద్వాదశి నాడు యమప్రీతి దీపదానం- ఇవి కార్తిక మాసములోని ముఖ్యమైన దిన ములు. (కార్తిక పురాణము నుండి)

— శ్రీ తేల్కార్ శంకర్‌రావ్



# శ్రీనివాసుని మహిమ




శ్రీ వేంకటేశ్వరస్వామివారు నాకు యిష్ట దైవం. ఆ దేవునికోసం ఒక హుండీని పెట్టుకొని చిల్లర ఉన్నప్పుడు లేదా ఏదైన ఆపద కలిగినప్పుడు లేదా ఏదైనా అపరాధం చేసినప్పుడు తోచినంత ఆ హుండీలో వేసుకొని హుండీ నిండిన తరువాత తిరుపతి వెళ్ళినప్పుడు దీనిని శ్రీవారి హుండీలో వేయడం అలవాటు. అలాగే సంవత్సరం క్రితం ఓ ఆపిల్‌పండు ఆకారంలో ఉండే హుండీని కొనుక్కున్నాను. అది మార్చి నెలకి నిండిపోయింది. తిరుపతి వెళదాం కదా అప్పుడు వేద్దాం అనుకున్నాను. మే నెల వరకు తిరుపతి రావడం కుదరలేదు. రోజూ హుండీని చూస్తూనే తిరుపతిని గుర్తు చేసుకునేదాన్ని. ఎందుకో ఓ రోజు హుండీ కనిపించకపోయినా దాని సంగతే గుర్తు రాలేదు. మనసులో ఆందోళనగా ఉంటోంది కానీ కారణం అంతుపట్టలేదు. హుండీ సంగతే గుర్తురాలేదు. కనీసం అది కనబడలేదేఅన్న ధ్యాసకూడ నాలో కలగలేదు. మూడవరోజు పక్కింటి పిల్లవాడు దేనికో వచ్చి ఎవరిదో హుండీ కోతి రెండురోజుల క్రిందట గోడమీద పెట్టి వెళ్ళింది అని అంటుంటే విని ఊరుకున్నాను కానీ అప్పటికీ అది నాదే అని నాకు తట్టలేదు. కాస్సేపటికి ఎందుకో నా అర దగ్గరికి వెళ్ళగానే ఎవరో తట్టి గుర్తు చేసినట్టనిపించి హుండీ కోసం చూశాను. కనబడలేదు. వెంటనే హుండీ కోసం అడిగివంపిస్తే వాళ్ళూ పాపం ఇది దేవుడి హుండీలాగ ఉంది అని జాగ్రత్తగా తీసి ఉంచారట. ఇచ్చిపంపారు. కోతి పండు అనుకొని తీసికెళ్ళింది. అది పండుకాదని తెలియగానే పారేయకుండా గోడమీద పెట్టివెళ్ళింది. అందరికీ కనబడేలా ఒంటిరాయి గోడమీద ఆ హుండీ 12 గంటలు అలాగే ఉందంటే అది ఆ శ్రీనివాసుని లీల గాక మరేమవుతుంది? ఏది దొరికినా పాడుచేసి పారేసే కోతి దాన్ని పగలకొట్టక క్రిందపడేయక అంత జాగ్రత్తగా పెట్టి వెళ్ళిందంటే అది ఆ స్వామి లీలే కదా. అందులో షుమారు 75 రూపాయల వరకు చిల్లర ఉంది. ఏ పిల్లలకో దొరికి వాళ్ళు జల్సాగా ఖర్చుపెట్టక పెద్దలకంటికే కనబడి వాళ్ళు దాన్ని భద్రపరచి ఇచ్చి పంపారంటే నిజంగా ఆ ఏడుకొండలవాడే దాన్ని కాపాడి తన మహిమని ఈ విధంగా చూపించాడేమో అనిపించింది. వెంటనే ఆ హుండీకి జాగ్రత్తచేసి అపరాధ కానుక వేసి మరునటి వారమే తిరుపతికి వెళ్ళి ఆ స్వామి వారి హుండీలో వేసివచ్చినాము.



శ్రీ స్వామివారి లీలలు తెలిపే మరొక సంఘటన. ఇది జరిగి సుమారు నాలుగేండ్లు జరిగింది. నాకు వేంకటేశ్వరస్వామి ఇష్టదైవం. ఆయనకి తలనీలాలు అంటే చాలా ప్రీతికదా అని తిరుపతి వెళ్ళినప్పుడల్లా మూడు కత్తెరలు యిచ్చిరావడం నాకు అలవాటు. ఓ సారి ఇలాగే మా పిన్నితో తిరుపతి వెళ్ళడం జరిగింది. అలవాటు ప్రకారం నేను మూడు కత్తెరలిచ్చి స్నానంచేసి దేవుడి దర్శనం చేసుకొని వచ్చేశాను. మేము తిరుపతి నుండి తిరిగివస్తుండే మా పిన్ని అన్నారుకదా మన మధ్యలలో ఆడవారు జుట్టు ఇచ్చే పద్ధతిలేదు. ఆడవాళ్ళ తలలో కత్తెర పెట్టడం మంచి శకునం కాదు. కాబట్టి ఈసారి నుండి జుట్టు యివ్వక దాని బదులు మరేదైనా కానుక యిచ్చుకో అన్నారు. నా నమ్మకం నాది. కానీ ఎదురుచెప్పడం దేనికి అని సరేలే పిన్నీ అని చెప్పాను. వెంటనే పదిరోజులకల్లా ఆవిడకి తల వెనుక వైపు చామంతిబిళ్ళ పెట్టినట్టు అరచేతి వెడల్పున జుట్టు రాలిపోయి బట్టతల ఏర్పడింది. రోజూ తలదువ్వుతున్నా ఆవిడ గమనించలేదు. ఓ రోజు మా చిన్నాన్న చూసి ఇదేమిటి నెలలో బట్టతల వచ్చేసింది అనే సరికి ఆవిడ మనోవేదనపడి ఎన్నెన్నో మందులు వాడి ఎందరో డాక్టర్లకి చూపించి ఏమేమో చేశారు. ఏమీ మార్పులేదు. చివరికి ఎందుకో ఓ రోజు తను అన్నమాటలు గుర్తొచ్చి ఓహో నేను తనని జుట్టు యివ్వవద్దన్నాను కాబట్టి నాకిలా జరిగిందేమో అనుకొని వెంటనే స్వామికి ముడుపుకట్టి నాకు జుట్టు మొలిస్తే నేనే నీకు మూడు కత్తెరలిస్తానని అనుకున్నదట. అది అనుకున్న మరునటిరోజు నుంచే జుట్టు పెరగడం ఆరంభించి పదిరోజుల లోపే మామూలుగా జుట్టు పెరిగి జడలో కలిసిపోయింది. వెంటనే వాళ్ళు తిరుపతి వెళ్ళి మొక్కు తీర్చుకుని వచ్చారు. ఆవిడ నాకు ఇది చెప్పి నీవు తప్పక జుట్టు యిస్తుండు మానకు అని చెప్పింది. ఇలా చెప్పుకుంటూ పోతే ఆ దేవుడి లీలలు ఎన్నో ఉంటాయి. ఎందరో భక్తులకు నిత్యజీవితంలో ఇలా ఎన్నో ప్రత్యక్ష సంఘటనలు జరిగి తద్వారా ఆ శ్రీనివాసుని మహిమలు బయట పడుతూనే ఉన్నాయి.

— కుమారి బి. సరళ

(28వ పేజీ తరువాయి)

ఈ అనంతమైన కాలంలో ఎందరు వాల్మీకులు పుట్టారో, ఎందరు రాములు పుట్టారో ఎవరి కెరుక?

వాల్మీకి రామాయణాన్ని అర్థం చేసుకోవాలన్నా భిన్న భిన్న రామాయణాలను తప్పక పఠించాలి, పేరుకు తగ్గట్టుగా ఇందులో ఎన్నో చిత్రవిచిత్రమైన కథ లున్నాయి.

రాముడు అవతరించడానికి ముందుగా పర్వత నారదుల శాపాలు కారణంగా ఉన్న కథ, లక్ష్మి తనను గౌరవించనందుకు రాక్షసవంశంలో (సీతగా) పుడుతుందని నారదుడు శపించటం, మునులరక్తాన్ని ఒక్క కలశంలో రావణు డుంచగా దానిని మండోదరి త్రాగడంవల్ల సీత పుట్టిందని, ఆమెను కురుక్షేత్రంలో నేలలో పాతిపెట్టిందనే కథలు అద్భుతకరంగా ఉన్నాయి.

సముద్ర తరణసందర్భంలో లక్ష్మణుడు సముద్రంలోకి దూకి నీటిని ఎండింపచేయటం, అందున్న జలజంతువులు హాహాకారాలుచేయగా సీతావియోగంచే పుట్టిన కన్నీటిచే మరల సముద్రాన్ని రాముడు పూరించటం మరొక అద్భుతం.

కైకసికి దశకంఠరావణునితో పాటు సహస్రకంఠరావణుడనే కొడుకున్నా డని సీత చెప్పటం, అతణ్ణి చంపుటకు సీతా సహితుడై రాముడు బయలుదేరుట రాముని మూర్ఛ, సీత, సహస్రకంఠరావణుణ్ణి సంహరించుట, రాముడు సహస్రనామాలతో సీతను (పరాశక్తిని) స్తోత్రం చేయడం మరొక అద్భుతం.

సీతావియోగంవల్ల రాముడు అశ్రువులను విపరీతంగా విడిచిపెట్టడంవల్ల వైతరణి యనే నది ఏర్పడిందని వ్యుత్పత్తి చెప్పడం ఆశ్చర్యకరం.

ఈర్ష్యాద్వేషాలు అంతరిస్తేనేగాని సంగీతంలో సిద్ధిలేదని నారదతుంబురుల కథ వివరిస్తోంది. రాముడు, హనుమకు చేసినతత్త్వోపదేశం సర్వవేదాంత గ్రంథాలలో ఉన్నదే. బహుగ్రంథకర్తలైన శ్రీ శర్మగారి గ్రంథాన్ని అందించినందులకు వంద్యులు.

—శ్రీ దేవరకొండ శేషగిరిరావు.

## శ్రీ వేంకటేశ్వర భక్తిగీతాలు

[రచయిత: శ్రీ పి. వి. రామనరసయ్య: పుటలు: 20; సైజు: 1క్రౌన్; వెల: రెండురూపాయలు: ప్రతులకు: లక్ష్మీనివాసము, 1-8-700/43, నల్లకుంట, హైదరాబాదు—500 044.]

నవవిధ భక్తిమార్గములలో కీర్తనం ఒకటి. మిగిలిన భక్తిమార్గములకంటే కూడ ఈ కలియుగంలో సంకీర్తనమునకు అనంత ఫలమున్నది. పదకవితాపితామహుడు తాళ్లపాక అన్నమాచార్యులువారి పుత్రులు, పౌత్రులు, క్షేత్రయ్య, నాదయోగి త్యాగయ్య ఇలాగ ఎందరెందరో మహానుభావులు సంకీర్తనద్వారా తాముతరించినారు, లోకులను తరింపజేసినారు, తరింపజేయుచున్నారు.

"వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి"

అట్టి తిరుమలేశుని గూర్చి కీర్తించుట, ఆ కీర్తనలన్నీ ఆ వేంకటేశునికే అంకితమిచ్చుట అనునది ఒక్క అన్నమయ్యతోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. తదుపరి ఆ మార్గంలో ఎందరో మహానుభావులు పయనించి ధన్యులైనారు.

"శ్రీ వేంకటేశ్వర భక్తిగీతాలు" చిన్న గేయసంపుటి. రచయిత శ్రీ పి. వి. రామనరసయ్య తన ఆవేదనంతయు భక్తికీర్తనల ద్వారా శ్రీ స్వామికి విన్నవించుకున్నారు. విన్నవించుకొనడమే కాదు. ఆ భక్తిగీతాసుమాలను శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మాలకు సమర్పించుకొన్నారు.

ఇందులో 18 గేయాలున్నాయి. మొదటి గేయాన్ని తిరుమలేశునికి వందనంతో ప్రారంభం చేశారు రచయిత. రెండవ కీర్తనలో "వెతలన్నీ బాపుటకు వేడుకొంటి నిరా" అని స్వామిని శరణు పొందారు. మూడవగేయంలో తిరుమలేశుడు 'పిలిచిన పలికెడి దైవ' మని ఎలుగెత్తిచాటినారు. బ్రతుకే క్షణభంగుర' మని తెల్పుతూ, సత్యము నిత్యమూ అయిన దైవకృప పొందండి అని నాల్గవకీర్తనలో మానవబోధ చేశారు. ఏడవకీర్తన 'అవిగో తిరుమల శిఖరాలు' అన్న గేయం.

'అదివో అల్లదివో హరివాసము
పదివేల శేషుల పడగలమయము"

అను తాళ్లపాక అన్నమాచార్యుల ప్రసిద్ధ కీర్తనను అనుకరించి రచించిన గేయ మగపిస్తున్నది.

'విన్నావా' అన్నకీర్తనలో
"నీ పూజా కుసుమము నైతే చాలు
నీ గుడిగంటగ మ్రోగిన చాలు"
నీ వాకిట నే నుండిన చాలు
నీ కడ బ్రతుకే పండిన చాలు"

అని రచయిత తన కోరికను మనసారా స్వామికి విన్నవించుకొన్నారు. "హేప్రభో!" అన్న కీర్తన రచయితకు హిందీభాషా పరిచయం వున్నట్లు వెల్లడిస్తున్నది.

చివరగా మంగళస్వరూపుడైన శ్రీ వేంకటేశునకు మంగళహారతు లిచ్చారు.

ఇందులోని కీర్తనలు భక్తితో పాడుకోతగ్గవి. భజనమందిరాల్లో భజనకీర్తనలుగా కూడ పాడుకోవచ్చు. రచయిత యొక్క ఆర్తి, భక్తి ఇందులోని ప్రత్యక్షరంలోను స్పష్టమౌతుంది.

ఈ గేయసంపుటి శ్రీ వేంకటేశునికి అంకితమిచ్చుట మరింత ప్రత్యేకత సంతరించుకున్నది.

కాని ఈ గ్రంథానికి ఒకే ఒక లోటు ఏర్పడింది. అది పుస్తకం అట్టమీది ముఖచిత్రం. శ్రీ వేంకటేశ్వరస్వామివారి చిత్రం కుడి ఎడమగా, శంఖచక్రములు తారుమారై, వరదహస్తము ఎడమచేయిగా ముద్రింపబడింది. పుస్తకం లోపలకూడా అంతే. ఈ పొరపాటును రచయిత గమనించి యున్నారో లేదో? తొందరలో ఈ పొరపాటును సవరిస్తే బాగుంటుంది.

—శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

★

# వార్తాలహరి

## ధనుర్మాసం

1984 డిశంబరు 16 నుండి, 85 జనవరి 13 వరకు గల ధనుర్మాస సందర్భంగా తిరుమలలో శ్రీ వేంకటేశ్వర స్వామికి ప్రతిరోజు తెల్లవారు ఝామున సుప్రభాతానికి బదులు "తిరుప్పావై" జరుపబడుతుంది. కనుక సుప్రభాత టిక్కెట్లు అమ్మబడవు. ధనుర్మాస సర్వదర్శనము ప్రతిరోజు ఉదయం 6 గంటలకు ప్రారంభమౌతుంది.

## త్యాగరాజ ఆరాధనోత్సవాలు

తిరుపతి త్యాగరాజ మండపంలో అక్టోబరు 28 న తి. తి. దేవస్థానం వారి సహకారంతో త్యాగరాజ ఉత్సవ కమిటీ వారు త్యాగరాజ ఆరాధనోత్సవాలను ప్రారంభించారు. మొదటిరోజు అక్టోబరు 28 న నాటి సాయంత్రం 6-30 గంటలకు ప్రముఖ న్యాయవాదులు శ్రీ విజయరాఘవన్ అధ్యక్షత వహించగా, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఆచార్య జి. యన్. రెడ్డి ప్రధాన అతిథిగా విచ్చేశారు. వేద పండితుల వేద పారాయణంతో సభ ప్రారంభం కాగా శ్రీ ఎమ్. శ్రీనివాసాచారి స్వాగతం పలికారు.

తిరుపతి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఆచార్య జి. యన్. రెడ్డి గారు తమ ప్రారంభోపన్యాసంలో త్యాగరాజస్వామి జీవితాన్ని క్లుప్తంగా వివరిస్తూ ఇతర వాగ్గేయకారులకంటే త్యాగరాజ స్వామిలో నాలుగు ప్రత్యేక కారణాలు చోటు చేసుకున్నాయని, అందువల్లే నాదబ్రహ్మ త్యాగరాజ స్వామికి ఒక ప్రత్యేక స్థాన మబ్బిందని వక్కాణించారు. నైష్ఠిక జీవితం, ఉపాసనా బలం, శ్రీరామ సాక్షాత్కారం, సంగీతానికి కారణ జన్మత్వం, అను ఈ నాలుగు కారణాలు త్యాగరాజ స్వామి జీవితానికి వర



## సంతాప తీర్మానం

శ్రీమతి ఇందిరాగాంధి దుర్మరణం పాలైన సందర్భంగా తి. తి. దేవస్థాన ఉద్యోగులు, దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి అధ్యక్షతన నవంబరు 5 వ తేదీన సంతాపసభ ఏర్పాటు చేశారు. దేశనాయకురాలి మృతికి సంతాప సూచకంగా రెండు నిమిషాలు మౌనం పాటించారు. తరువాత దేవస్థాన కార్యనిర్వహణాధికారి ప్రసంగించారు "భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి మరణం అత్యంత విషాదంగా ముగియడం అందరికి దిగ్భ్రాంతి, మరియు తీవ్ర విచారాన్ని కలిగించింది. తి. తి. దేవస్థాన ఉద్యోగులంతా ఈ పాశవిక చర్యను తీవ్రంగా ఖండించాలి. ఈ సమయంలో శ్రీమతి గాంధి దేశానికి చేసిన సేవలను స్మరించుకోవాలి.

శ్రీమతి ఇందిరాగాంధి ఆత్మకు శాంతి కలిగించాలని, వారి కుటుంబానికి ధైర్యాన్ని, చేయూత నివ్వాలని మనమంతా శ్రీ వేంకటేశ్వర స్వామి వారిని ప్రార్థించుదాం.

మనదేశం ఒక అత్యుత్తమ ప్రధానిని పోగొట్టుకుంది. ఈ దుఃఖసమయంలో ప్రజలంతా శాంతి సంయమనం కలిగి పరస్పర ప్రేమాభిమానాలతో మెలగాలని ఆకాంక్షిద్దాం" అని సంతాప తీర్మానాన్ని చదివారు.

ఆ సాయంత్రం 5 గంటలకు తి. తి. దేవస్థాన ఉద్యోగస్థులంతా నల్ల బ్యాడ్జీలు ధరించి శ్రీమతి ఇందిరాగాంధిగారి నిలువెత్తు చిత్ర పటంతో తిరుపతి పట్టణంలో మౌనంగా ఊరేగింపు జరిపారు.





మోన్నతమైన స్థానం చేకూర్చాయని, ఇతర వాగ్గేయకారులలో కనపడని శిష్య పరంపర త్యాగరాజు కుండడం మరొక విశేష మని సెలవిచ్చారు. అలాగే నాదయోగి త్యాగరాజు యొక్క భాషా విశేషాలను సోదాహరణంగా వివరించారు. చివరగా ఈ త్యాగరాజు కీర్తనలపై అభిరుచి పెంచ డానికి, ఈ సంప్రదాయం తెగి పోకుండా ఉండడానికి బాలబాలికలకు ఉచిత శిక్షణా తరగతులను నిర్వహించడం, పోటీలు పెట్టడం, క్యాసెట్లను విడుదల చెయ్యడం వంటి కార్యక్రమాలను చేపట్ట వలసిందిగా త్యాగరాజు ఉత్సవ కమిటీ వారికి, అభి మానులకు సలహా ఇచ్చారు. తదుపరి శ్రీ పి. మునిరెడ్డి గారు వందన సమర్పణ చేశారు.

ఈ కార్యక్రమాలు, అక్టోబరు 28 నుండి నవంబరు 4 వరకు జరుగవలసి వుండగా భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నిర్యాణం వల్ల అక్టోబరు 30 వరకు మూడు రోజులే జరిగాయి.

### వేదాల కాసెట్లు

గత అక్టోబరు 18 న తిరుపతి దేవస్థానం వారి రికార్డింగు స్టుడియోలో "సైన్ ఛానల్ మిక్సర్ యూనిట్" కు దేవస్థానం కార్య నిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ, వారు, ప్రజలకు వేదాల కాసెట్లను అందించేందుకై తి. తి. దేవస్థానం చర్యలు తీసుకుంటున్నట్లు, ఇప్పటి వరకు ప్రఖ్యాత వేదపండితులచే 1200 టేపులపై 600 గంటల కార్యక్రమం రికార్డు చేయబడిందని, వీటిని వ్యాపారస్థాయిలో కాసెట్ల ప్రతులు తయారు చేసేందుకు స్టుడియోలో అధునాతన పరికరాలు ఏర్పాటు చేయబడత వని తెలియ జేశారు.

ఆకాశవాణి ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఎం. ఇ. సూర్యనారాయణ, మాజీ ఛీఫ్ ఇంజనీరు శ్రీ పి. ఆర్. నరసింహం, శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు శ్రీ బి. రంగయ్య నాయుడు మరియు తదితర అధికారులు స్టూడియోను దర్శించి తగు సూచన లిచ్చారు.

దేవస్థాన విద్యాశాఖాధికారి శ్రీ పి. చంద్ర శేఖర నాయుడు అధునాతన పరికరముల ఏర్పాటు గురించి ప్రసంగించారు.

## నిర్వాహక మండలి నిర్ణయాలు

తి. తి. దేవస్థాన కార్యనిర్వాహక మండలి అక్టోబరు 27 న జరిగిన సమావేశంలో ఈ క్రింది నిర్ణయాలను గైకొన్నది.

1. తిరుమలలో నూతన క్యూకాంప్లెక్సులో రూ. 14,61,000/- ల ఖర్చుతో ఫైబర్ గ్లాసు బెంచీలను ఏర్పాటు.
2. పనిలో మెరుగుదలకై తిరుమల మహాద్వారం సెల్‌వద్ద ఇప్పుడున్న పేష్కారు కాక అదనంగా మరొక పేష్కారును, అట్లే తిరుచానూరు కేంద్రంగా స్థానిక ఆలయాలకు ఒక పేష్కారును నియామకం.
3. దేవస్థానం బోర్డు వ్యవహారాలను చక్కగా నిర్వర్తించుటకు ప్రత్యేకంగా ఒక పేష్కారు, అదనంగా అప్పర్ డివిజనల్ గుమాస్తా, ఒక అటెండరు ఉద్యోగములతో ఒకశాఖ కల్పించుట.
4. డెప్యుటేషన్‌మీద తి.తి.దే. డిపో మేనేజరుగా పనిచేస్తూ, ఏ. పి. యస్. ఆర్.టి.సి. లో డివిజనల్ మేనేజరుగా ప్రమోషన్ పొందిన శ్రీ యస్. వి. సుబ్బారావును, మరల దేవస్థాన రవాణా డిపో జనరల్ మేనేజరుగా కొనసాగించాలని నిర్ణయించింది.
5. సికింద్రాబాదు వాస్తవ్యురాలైన శ్రీమతి డి. విజయలక్ష్మిచే దానం ఇవ్వబడిన మెదక్ జిల్లా సంగారెడ్డి తాలూకా కల్వకుంట గ్రామంలోని ఒక ఎకరం పొలాన్ని వేలం వేయుట, వేలంమీద వచ్చిన మొత్తమును ఫిక్సడ్ డిపాజిట్టుగా వుంచాలని తీర్మానించింది.
6. దేవస్థాన ఆస్థాన పంచాంగకర్త శ్రీ తంగిరాల చిన హనుమత్సిద్ధాంతి గారికి ప్రస్తుత మిస్తున్న రూ. 2116/- పారితోషికాన్ని రూ. 3000/- లకు పెంచుతూ తీర్మానించారు.

7. యస్.వి.బాలమందిర్‌లో చేరుటకు ఈ క్రింది నియమములు ముఖ్యమైనవి.

అ) విద్యార్థుల సంఖ్య 200 లకు మించ కుండుట.

ఆ) 5 నుండి 7 సంవత్సరాల వయస్సు లోపు హిందూమతం పిల్లలకే ప్రవేశం.

ఇ) తల్లిదండ్రులులేని, లేదా తండ్రి మరణించి, తల్లి పోషణ చేయలేని పిల్లలకు ప్రవేశం.

ఈ) పిల్లలకు దర్జీపని, నూలువడుకుట, నగిషీకుట్టుపని, వాహనములు నడుపుట, ముద్రణ మున్నగు వృత్తి విద్యల్లో శిక్షణ ఇవ్వబడుతుంది.

ఉ) 18 సంవత్సరాలు నిండిన విద్యార్థులను ఈ సంస్థ నుండి బయటకు పంపటం జరుగుతుంది.

ఊ) బాలబాలికలు మధ్యలో పరీక్షలలో తప్పినగాని, లేదా పరీక్షను వ్రాయకున్నా ఇంటికి పంపటం జరుగుతుంది.

8. తి. తి. దే. ఉద్యోగుల సహకార బ్యాంకుకు ప్రస్తుతమున్న రూ. 2½ లక్షల డిపాజిట్టును రూ 10 లక్షలకు పెంచుటకై ప్రభుత్వమువారి నియమాలను సవరించుటకై అభ్యర్థించుట.

9. గుంటూరు జిల్లా పులగంబాడు సీతానగరంలో శ్రీ రామానుజ జీయరు స్వామి ఆశీర్వాదంతో నడుపబడుతున్న వేదకళాశాలలో అధ్యాపకులకు రూ. 500/లను, విద్యార్థులకు 200/ వేతనంగా ఇవ్వాలని నిర్ణయించడం జరుగుతుంది.

---

దేవస్థానంలో నియతవేతనంలో పని చేయుచున్న ఉద్యోగస్థులకు ఇప్పుడిచ్చుచున్న మొత్తమునకు 25 శాతం జీతము పెంచటం జరిగింది.

దేవస్థాన సీనియర్ వైద్యాధికారికి, వైద్యాధికారికి మధ్యలో డిప్యూటీ సివిల్ సర్జన్ ఉద్యోగాన్ని కల్పించుటమైనది.

*

---

# ధర్మరక్షణ కార్యక్రమాలు

## ప్రొద్దుటూరు

హిందూధర్మరక్షణ సంస్థ ఆధ్వర్యంలో ప్రొద్దుటూరులో అక్టోబరు నెలలో నాలుగు భజనలు, మూడు హరికథాకాలక్షేపములు, ఐదు ఉపన్యాసకార్యక్రమములు నిర్వహింపబడ్డాయి. అంతేగాక అక్టోబరు 12వ తేదీన స్థానిక 'రామేశ్వరం హరిజనవాడ'లో శ్రీ యం. మునిరామరాజుగారు, 26వ తేదీన "రంగయ్యసత్రం హరిజనవాడ"లో శ్రీ జె. చిన్ననాగరాజుగారు ధార్మికప్రవసంగాలు జనరంజకంగా చేశారు.

## అనంతపురం

ధర్మరక్షణసంస్థ ఆధ్వర్యంలో స్థానిక అంబేద్కర్ నగర్ హరిజనవాడయందు విజయదశమీ పర్వదినాన ఉదయం నగర సంకీర్తనము, భజన, కార్యక్రమాలు ధార్మికప్రసంగాలు నిర్వహింపబడ్డాయి. ఆ సాయంత్రం శ్రీ రాఘవేంద్రస్వామి మఠంలోను, శ్రీ కాశీవిశ్వేశ్వరాలయంలోను, శ్రీ ప్రసన్నపార్వతీ జగదీశ్వరాలయంలోను ధార్మికోపన్యాసాలు పలువురు ప్రముఖులచే ఇవ్వబడ్డాయి.

## వరంగల్

ధర్మరక్షణసంస్థవారిచే, స్థానిక శ్రీ వేంకటేశ్వర కల్యాణమండపములో సెప్టెంబరు 26 నుండి అక్టోబరు 4 వరకు శ్రీదేవిభాగవతముపై పురాణ ప్రవచనం చేయబడింది. ఇవేగాక అక్టోబరునెలలో 3 హరికథలు, 5 ధార్మికోపన్యాసాలు, 2 భజనకార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి.

## గుంటూరు

పిడుగురాళ్ళ శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయంలో దసరా నవరాత్రి ఉత్సవాల సందర్భంగా స్థానిక శ్రీ వేంకటేశ్వర భక్తసంఘం ఆధ్వర్యంలో శ్రీమాన్ దిట్టకవి వేంకటరామానుజాచార్యులు "దేవీభాగవతము" పురాణకాలక్షేపం జనరంజకంగా నిర్వహించారు. పై ఆలయ నిర్వాహకులు శ్రీ ఆచార్యులవారిని ఘనముగా సత్కరించారు.

## సంగారెడ్డి

హిందూధర్మరక్షణసంస్థ ఆధ్వర్యంలో సంగారెడ్డిలో 4 భజనలు 4 ఉపన్యాసములు 2 హరికథలు 2 చక్రభజనలు నిర్వహించడం జరిగింది. అంతేగాక శ్రీ దేవీనవరాత్రుల సందర్భంగా స్థానిక ధార్మికసంస్థల సహాయంతో అనేక ఉత్సవాలు కార్యక్రమాలు ఏర్పాటుచేయడం జరిగింది. శ్రీ వేంకటనరసింహాచార్యులచే 'ఉత్తర గోగ్రహణము" పై ఉపన్యాసకార్యక్రమం జరిగింది. విజయదశమి సాయంత్రం స్థానిక భవానీ మందిరంలో స్త్రీలకై ఏర్పాటుచేయబడిన సమావేశంలో తులసీ, శమీ పూజల ప్రాముఖ్యాన్ని గూర్చి శ్రీమాన్ కందాళై శ్రీనివాసాచార్యులుగారు చక్కగా వివరించారు. ఆరాత్రి శ్రీ లక్ష్మణదాస్ భాగవతార్‌గారిచే విరాటపర్వము హరికథా కాలక్షేపం నిర్వహించడం జరిగింది.

## పుస్తకావిష్కరణ

గత సెప్టెంబరు 29 మహబూబ్‌నగరంలోని పురమందిరంలో అభయ వీరహనుమాన్ ఆధ్యాత్మిక వికాస నిర్మాణసంఘం, మరియు, పాలమూరు సాహితీ సమితి సంయుక్తనిర్వహణలో తి. తి. దేవస్థానముల ఆర్థిక సహాయంపొందిన "కాలజ్ఞాన సంగ్రహకాలము" అనే గ్రంథం ఆవిష్కరింపబడింది. గ్రంథకర్త శ్రీ గాధిరాజు పాల్మూరు. ఆ సభకు శ్రీ జి. మహానంది యాదవ్ అధ్యక్షతవహించగా తెలుగు పండితులు శ్రీ చౌదూరు గోపాలరావు, బహుగ్రంథ పరిశోధకులు శ్రీ నాగలింగ శివయోగి, పాలమూరు సాహితీసమితి అధ్యక్షులు శ్రీ తోటపల్లి కృష్ణమూర్తి గ్రంథ విశిష్టతలను కొనియాడారు. చివరలో గ్రంథకర్త శ్రీ గాధిరాజు మాట్లాడుతూ ఈ గ్రంథానికి తి. తి. దేవస్థానములవారు ఆర్థికసహాయంచేయడం తన మహద్భాగ్యమని, వారికి సర్వదా కృతజ్ఞుడనని తన భక్త్యంజలి సమర్పించారు.

[ 2వ పేజీ తరువాయి ]

ప్రారంభిస్తున్నారట. నిజానికిది ఆ ప్రాంతం అభివృద్ధికి నిదర్శనం.

మరి అన్ని ప్రాంతాలలోను ఇంతటి అభివృద్ధి కన్పిస్తున్నదా అంటేఅనుమానమే. మద్రాస్‌కు హైద్రాబాదుకు దూరంతగ్గించే బీబీనగర్ నడికూడి గుంటూరు రైలుమార్గం నత్తనడకలోవుంది. శేషగిరి వెంకన్న సింహాద్రి అప్పన్నలువెలసిన దివ్యదేశాల నడిమిప్రదేశంలో ఎంతో ఆలోచనమీదగాని పిసరంతప్రగతి కన్పించటంలేదు.

నిజానికి వ్యాపారకేంద్రాలెంత ముఖ్యమో ఆధ్యాత్మిక కేంద్రాలుకూడా అంతటి ప్రాముఖ్యం కలవే. జాతిప్రగతిని ఎత్తిచూపే దొకటైతే జాతిమనుగడకే వెన్నుగడ ఇంకొకటి. కనుక ఆధ్యాత్మిక కేంద్రాల అభివృద్ధి విషయంలో జరగవలసిన సౌకర్యాలు ఎన్నో వున్నై.

I. ప్రతిచోట ఎదురుబండి రాకపోకల కోసం కాచుకోకుండా ప్రయాణం జరగాలంటే జంటమార్గాలు తప్పనిసరి. ముఖ్యంగా తిరుపతి గూడూరు మధ్య జంట రైలు మార్గం తప్పనిసరి.

II. ఇక రైలు బళ్ళను ఏర్పాటు చేయటంలో కేవలం వ్యవహారకేంద్రాలతోనేగాక ఆధ్యాత్మిక కేంద్రాలను కలుపుతూ వేయాలి. ఈ దృష్టితోచూస్తే వాల్తేరు గుంటూరు మధ్య నడిచే సింహాద్రి ఎక్స్‌ప్రెస్‌ను తిరుపతివరకు పొడిగిస్తే, రెండు విష్ణుక్షేత్రాలకు సాన్నిహిత్యం ఏర్పడుతుంది. తిరుపతి విజయవాడలమధ్య నడిచే తిరుమల ఎక్స్‌ప్రెస్‌ను గోల్కొండతో కలిపి హైద్రాబాద్ వరకు నడపటంవల్ల రాయలసీమ సర్కార్, తెలంగాణాల మీదుగా రాష్ట్రరాజధానికి సరాసరి సౌకర్యం ఏర్పడుతుంది. కలకత్తానుండి సరాసరి మద్రాసుకు సౌకర్యం ఎక్కువగానే ఉన్నది. తిరుపతినుండి ఒకటి రెండు పెట్టెలు 45, 46 హౌరా హైద్రాబాద్, 5, 6 కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లకు విజయవాడలో మార్పిడి జరిగేలా ఏర్పాటుచేస్తే చాలా ఉపయోగంగా ఉంటుంది. అదేవిధంగా జయంతి జనతా ద్వారా నడిచే నిజాముద్దీన్ రేణిగుంటపెట్టెను, రేణిగుంట రిషికేశ్ దాకా ఏర్పాటుచేస్తే హిమాచలక్షేత్రంలో కలిపే అవకాశం ఉంటుంది.

వారణాసి ఎక్స్‌ప్రెస్‌కు గంగాకావేరీ ఎక్స్‌ప్రెస్ అని పేరుపెట్టారు. నిజానికది తిరుపతి లాంటి దివ్యక్షేత్రం మీదుగానడిస్తే పేరుసార్థకమౌతుంది. కనుక దానిని తిరుపతికి మళ్ళించి, తిరుపతినుంచి బయల్దేరే మధురై ఎక్స్‌ప్రెస్‌ను రామేశ్వరందాకా పొడిగిస్తే వారణాసి నుండి వచ్చేవారు తిరుమలేశుని దర్శనం చేసుకొని, రామేశ్వరం వెళ్ళేందుకు వీలౌతుంది.

బెంగుళూరునుంచి తిరుపతికి బస్సు సౌకర్యం తప్ప వేరే లేదు. కాని బస్సు ప్రయాణం ఖరీదైన దన్న విషయం అందరికీ తెలిసిందే. కనుక అర్కోణంమీదుగా బెంగుళూరుకు రేణిగుంట, తిరుత్తణి, అర్కోణం, షోలింగర్, కాట్పాడిలలో ఆగేటట్లు 7 గంll కాలంగల ఎక్స్‌ప్రెస్ అవసరం. తిరుపతి కాట్పాడిమార్గం బ్రాడ్‌గేజి ఐనప్పుడు ఆ మార్గాన మళ్ళించవచ్చు. వేరే మార్గం వేసేకన్న మిక్సెడ్‌గేజిగా రూపొందిస్తే కాలం ఖర్చు కలిసివస్తాయి.

తిరుపతి సికిందరాబాద్‌ల మధ్యనడిచే కృష్ణాఎక్స్‌ప్రెస్ వేళలో మరికొంత మార్పు అవసరమనిపిస్తున్నది. తిరుపతిలో 5-30 కు బయల్దేరి విజయవాడ 12-30 ప్రాంతంలో చేరి సికిందరాబాద్ 8-30 లోగా చేరేట్లు, విజయవాడలో 13-15 కు బయల్దేరి తిరుపతి కనీసం 9-00 లోపల చేరేటట్లు మార్చి, వీటి కనుకూలంగా తెనాలి గుంటూరు మార్గం బళ్ళ కాలాన్ని సవరిస్తే గుంటూరువైపు వెళ్ళే యాత్రికులు తెనాలిలో పడిగాపులుకాసే స్థితి తప్పుతుంది.

III. ఇవన్నీ కలవారు, కాస్తసిరిగలవారు ప్రయాణంచేసే దూరభారపు బండ్లు. రోజు రోజుకు పెరిగే ధరలతో బ్రతుకే భారమౌతున్న ఈ రోజులలో భగవంతుని సేవకు వీలైనంత చవుక (వాసిలోమాత్రంకాదు) ప్రయాణసౌకర్యాలు ఉండాలి. అందువల్ల ఈ క్రింది ప్యాసింజరు బళ్ళ స్థితి మెరుగుపర్చాలి.

1. తిరుపతి-కాకినాడ ప్యాసింజరు బండి ఇప్పటి ప్రయాణకాలంలోని జాగును తగ్గించి మధ్యాహ్నం 12 గం. లోపల విజయవాడ చేరేటట్లు మార్చాలి. వీలైతే ఈ బండ్లకు అటు మచిలీపట్నంనుంచి, ఇటు గుంటూరు వైపుకు ఒకటి రెండు పెట్టెలు తగిలించవచ్చును.

2. గూడూరుమీదుగా విజయవాడ నుండి మద్రాసు వెళ్ళే ప్యాసింజరు బండి చాలా దారుణంగా వుంది. విజయవాడ తిరుపతుల మధ్య ప్రయాణకాలం 13 గం. లోపలవుంటే అంతకన్న కొద్ది దూరంగల మద్రాసుకు 17 గం. పైనపడితే ప్రయాణికుల అవస్థ ఆ పరమాత్మకేఎరుక. కనుక 5 గంటల కాల వ్యయాన్ని నివారించి, 78 ప్యాసింజరు 13-20 కి విజయవాడలో బయల్దేరి ఇప్పటి వేళలో మద్రాసు చేరేటట్లు, 77 ప్యాసింజరు మధ్యాహ్నం 2-30 కి విజయవాడ చేరేటట్లు మార్చాలి.

3. తిరుపతి-ఒంగోలు, ఒంగోలు-విజయవాడల మధ్య ప్యాసింజరు అంచలంచలుగా విభజించి నడుపుతున్నారు. దీనివల్ల భక్తులకు సరాసరి బండి సౌకర్యం తప్పిపోతున్నది. అందువల్ల ఒంగోలు దగ్గర ఏర్పడే కాలవ్యయాన్ని నివారించి, విజయవాడ తిరుపతి ప్యాసింజరుగా నడిపితే ప్రయాణీకులకు అదనంగా ఒక సరాసరి ప్యాసింజరు ఏర్పాటౌతుంది.

4. బిట్రగుంట విజయవాడల మధ్య నడిచే ప్యాసింజరువల్ల పరిమితప్రయోజనమే కలుగుతుంది. కనుక దీన్ని విజయవాడ గూడూరు ప్యాసింజరుగా పొడిగిస్తే బాగుంటుంది. ఈ పద్ధతులన్నింటివల్ల స్థానికమైన ప్యాసింజర్ల స్థితి మెరుగై, ఎక్స్‌ప్రెస్‌లలో అనవసరమైన రద్దీ తగ్గి దూరప్రాంత ప్రయాణాలు సుఖకరము శుభకరమూ ఔతాయి. నిర్జీవ పదార్థాల కోసం, సూపర్‌ఫాస్టు గూడ్సుబండ్లను నడిపే మనం, భక్తులకు ఈ మాత్రం సౌకర్యాలు కల్గించలేకపోతే, వాళ్లను మనం అంతకన్న చిన్నచూపుచూస్తున్నట్లు, దేవునికి దూరంగా మనం ఉంటున్నట్లు, ఉంచుతున్నట్లూ- అంతే.

నాగరాజ్ — తిరుపతి.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press, by M. Vijayakumar Reddy, L.P.T., Manager, T.T.D. Press, Tirupati.



# సప్తగిరి

డిశంబరు 1984 వెల: 1-00

తిరుమల తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక




నిత్యాభూషా నిగమశిరసాం
నిస్సమోత్తుంగ వార్తా
కాంతో యస్యాః కచవిలులితైః
కాముకో మాల్యరత్నైః
సూక్త్యా యస్యాః శ్రుతిసుభగయా
సుప్రభాతా ధరిత్రీ
సైషా దేవీ సకలజననీ
సించతాం మామపాంగైః.

— శ్రీ గోదా చతుశ్శ్లోకి.



ఇంతవరకూ తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగ వున్న శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్. గారు నవంబరులో పదవీ బాధ్యతలు వదలి వెళ్ళారు. దైవభక్తులు పరిపాలనా నిపుణులు అయిన వీరి సారథ్యంలో దేవస్థానం ఎంతో ప్రగతి సాధించింది. దేవస్థానం యొక్క స్వర్ణోత్సవాలు వీరి నేతృత్వంలోనే జరిగాయి. తిరుమల యాత్రికులకు అనేక సౌకర్యాలను కల్పించటానికి, తిరుమలను అందంగా తీర్చిదిద్దటానికి వీరు ఎంతో కృషి చేశారు. వీరి గౌరవ సంపాదకత్వంలో "సప్తగిరి" ఎంతో ప్రగతి సాధించింది.

తిరుమల శ్రీ వేంకటేశ్వరుని కరుణా కటాక్ష వీక్షణాలు వీరిపై ఎప్పుడూ ప్రసరించాలని, ఆయురారోగ్య సుఖసంతోషాలతో వీరి జీవితం సాగిపోవాలని "సప్తగిరి" ఆశిస్తున్నది.

## నూతన కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ. ఏ. ఎస్., నవంబరు '84 లో పదవీ బాధ్యత స్వీకరించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిపాలనా విభాగంలో నిపుణులైన వీరు దేవాదాయశాఖ కమీషనర్‌గా వున్నారు. అప్పటినుంచి కూడ వీరికి దేవస్థానకార్యకలాపాలతో సంబంధం ఉంది. శ్రీ వేంకటేశ్వరుని భక్తులు, విజ్ఞాన సంపన్నులు, కార్యనిర్వహణాదక్షులు అయిన వీరి నేతృత్వంలో దేవస్థానం మరింత ప్రగతి సాధిస్తుందని, హిందూధర్మ ప్రచారం మరింత వేగంగా సాగుతుందని ఆశిద్దాం.

దేవస్థానం కార్యనిర్వహణాధికారిగ ఉంటున్న వీరు, అయిదు భాషలలో వెలువడుతున్న "సప్తగిరి" మాస పత్రికకు గౌరవ సంపాదకులుకూడ. "సప్తగిరి" వీరికి హృదయపూర్వక స్వాగతం చెబుతోంది.

# మీ మాట

### అభినందనలు

గుంటూరు ప్రాంతంవారి సౌకర్యార్థం 'నాగరాజ్' గారు తెలిపిన అభిప్రాయాలను ప్రచురించినందుకు అభినందనలు.

తూర్పుగోదావరి జిల్లా కేంద్రమైన కాకినాడ బ్రాంచి లైనులోవుంది. హౌరా, మద్రాసు వైపు వెళ్ళే ఏ ఎక్స్‌ప్రెస్ ఎక్కాలన్నా సామర్లకోట రావాలి. అందుచేత సామర్లకోట-కాకినాడల మధ్య ఇప్పుడున్న బ్రాడ్‌గేజి-సింగిల్‌లైను మార్గాన్ని డబుల్ లైన్‌గా మార్చి, కాకినాడ-పిఠాపురం మధ్య ఇటువంటిదే మరో డబుల్‌లైను మార్గము వేసినట్లయితే కాకినాడ మైన్‌లైను లోకి చేరుతుంది. దీనివల్ల ప్రయాణీకులకు ఎంతో సౌకర్యం కలుగుతుంది.

అట్లే కాకినాడ-రాజోలు లను కలుపుతూ ముమ్మిడివరం, అమలాపురం మీదుగా ఒక రైలుమార్గాన్ని, కాకినాడ - రామచంద్రపురం-కొత్తపేట రైలుమార్గాన్ని ఏర్పాటు చేస్తే ప్రయాణీకులకు ఎంతో సౌకర్యం కలుగుతుంది. కోటిపల్లి - కాకినాడ మార్గం కూడ పునరుద్ధరించాలి.

జె. అనంత పద్మనాభ — కాకినాడ

### లడ్డూ నాణ్యత

ఇదివరలో ఎన్ని రోజులైనా నిలువ వుండే తిరుమల శ్రీ వారి ప్రసాదమైన లడ్డూ ఈ మధ్య నిలువ ఉండటం లేదు. దేవస్థానం వారు వ్యాపార దృష్టితో కాకుండా భక్తుల పట్ల సేవాదృష్టితో ఈ లడ్డూలను తయారు చేయించాలి. అట్లే రద్దీగా వున్న రోజులలో దేవస్థానం వారే తిరుమలకు టాక్సీలు నడిపితే భక్తులను ఎంతైన ఆదుకొన్న వారవుతారు.

"అంగీరస"




గౌరవసంపాదకులు:
శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ,
ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

*

ప్రచురణకర్త - సంపాదకుడు:
కాట్రపాటి సుబ్బారావు,
ఎమ్. ఏ.

*

ముద్రాపకుడు:
ఎమ్. విజయకుమార్ రెడ్డి

*

విడిప్రతి - రు. 1-00
సం॥ చందా - రు. 12-00

ప్రతులకు:
వెల్ఫేర్ ఆఫీసర్,
టి. టి. డి., తిరుపతి.

## ఈ సంచికలో....

డిసెంబర్ 1984
సంపుటి 15 సంచిక 7



ముఖచిత్రం: గోదాదేవి (ఆండాళ్), చిత్రం: జగదీష్. 4వ కవరుపేజి: శ్రీవిల్లిపుత్తూరు (గోదాదేవి గుడి).
2వ కవరుపేజి: తిరుమలలో ప్రధాని రాజీవ్‌గాంధి. 3వ కవరుపేజి: తిరుమలలో ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు.

# సంపాదకీయం

మహాత్ముల భాష, భావం, బాధ మన కర్థం కావు. మన భాషా, బాధా వేరు. మనకు వాళ్లంతా పిచ్చివాళ్లు, పిల్లవాళ్లతో సమానం. అందుకే వాళ్ల మాటన్నా, బాటన్నా పక్కన నవ్వి పక్కకు తప్పుకొంటాం. నిజానికి వాళ్ల మాటలపైన ఏ కొంచం మన మంచి చూడగల్గినా, అమృతోపమానమైన శాశ్వత సత్యాలెన్నో మనకు గోచరించేవి.

మనలాగే పుట్టి, మనను దాటిన వేమన

‘నిన్ను జూచె నేని తన్ను తా మరచు
తన్ను జూచె నేని నిన్ను మరచు
నే విధముగ జనుడు నెరుగును నిన్ను దన్ను’

అని ఆరాటపడ్డాడు. నిజానికిదేదో జీవబ్రహ్మైక్యవాద మనుకొని పుస్తకం మస్తకం పట్టుకోవటం మన కలవాటు. దేవుడు సర్వాంతర్యామి అని మనకు తెలుసు. అయినా చూడవలసినచోట చూడక దేవులాడుతుంటాం. అదే వేమన వేదన. దాన్ని సరిగా అర్థంచేసుకోగలిగితే వ్యష్టి సమష్టి జీవితాలకు దైవదర్శనం కలిగించే చక్కని సందేశం లభిస్తుంది. ‘నిన్ను’ ‘తనను’ అనే అల్పపదాలలోనే అనంత జీవచరిత్ర గోచరిస్తుంది. దేవుడు జీవుడైన విధాన్ని పురుషసూక్తం వివరిస్తుంటే, జీవుడు దేవుడెలా కాగలడో మంత్రపుష్పం మలచి చెప్తోంది.

సహస్రశీర్షుడు, సహస్రబాహుడైన ఆ పరంజ్యోతి ఆదిలో ఎలా ఉన్నాడు! చరాచర విశ్వాన్నంతటినీ ఆవరించి దశాంగుళ ప్రమాణంలో ఉన్నాడు. ఇదంతా ఆ పరమాత్మకు ఒక భాగమై మిగిలిన భాగాలు దేవలోకాలదాకా విస్తరించివున్నై. సూర్య, చంద్ర, ప్రకాశ కాలగమనాల కతీతుడైన ఆ పరమాత్మలోని ఈ పాతికపాలు మాయావృతమై విరాడ్రూప మహాపురుషావిర్భావానికి కారణమైంది. అప్పుడు భూమిపుట్టింది.

ఆదిచైతన్యానికి మూర్తిరూపమైన ఈ విరాడ్రూపం ఆలంబనగా, వసంతమే ఆజ్యంగా, గ్రీష్మమే సమిధలుగా, శరత్తు హవిస్సుగా, ఆదిఛందస్సులు ఏడు ఎల్లలుగా ఇరువదియొక్క సమిధలతో ప్రజాయజ్ఞం జరిగింది. అన్నిటికీ ఆతడే ఆద్యుడు కావటం వల్ల ఆ పారమేశ్వరశక్తిని, రూపాన్నే భావిస్తూ పౌరుషహవిస్సు అర్పిస్తూ, యజనం చేయగా పక్షులు పశువులు గ్రామ్యజీవాలైన గవాది జీవరాశి వివిధ భాషాస్వరూపాలూ, వేదాలూ ఆవిర్భవించాయి.

అవాఙ్మనస గోచరుడై విశ్వసమాజరూపాన్ని పొందిన ఆ విరాట్ ఆకృతి ఎలాటిది? సమాజపు ఇహపరహితం ఆలోచించి ముందుకు నడిపే వ్యవస్థ ముఖం. అత్యాచారాల నుండి రక్షించే వ్యవస్థ బాహువులు. ఆర్థికసుస్థిరతను కల్పించే వ్యవస్థ ఊరువులు. సమాజానికి తుష్టిని పుష్టిని కలిగించేది పాదరూపంగా పరిణమించింది.

సూర్యుడు నేత్రాలు, చంద్రుడు హృదయం, ఇంద్రాగ్నులు ముఖం, వాయువు ప్రాణం, అంతరిక్షం నాభి, శిరస్సు, దేవలోకాలు, భూమి పాదం ఇలా సమస్తలోకాల సృష్టి జరిగింది.

సమాజవిరాట్స్వరూపానికి రాత్రి పగలు రెండుప్రక్కలు, సంపదా, గోపన శీలంగల సామాజికశక్తి, విరాట్పురుషుని దేవీస్వరూపాలు. విశ్వసృజన యజ్ఞంలో ఆచరించిన విధానాలు ఆద్యాలూ, అతిప్రధానాలూ అయ్యాయి. జనన మరణాలు లేని దేవుడు జనన మరణాత్మక శరీరి, జీవుడయ్యాడు. నారాయణుడు నరుడైన విధం ఎరిగిన మానవుడు సమాజరూప అఖండచైతన్యంలో తాను భాగమని గుర్తించి జనరూప జనార్దనసేవలో మనసుంచి తరించాలనేది ఇందులోని తెలివన్నమాట.

[45 వ పేజీలో]

# ధనుర్మాస పూజా విధానం

మార్గశిర మాసంలో ధనుర్మాసం వస్తుంది. దీనిని వైష్ణవులు "మార్గళి" అంటారు. ఈ ధనుర్మాసంలో జరిగే పూజావిధానమును శాస్త్ర ప్రకారముగా పరిశీలిద్దాం.

యది చాపగతేసూర్యే
స్తోత్రై స్సంబోధ్య కేశవమ్,
ఉషః కాలే సమభ్యర్చ్య
ముద్గాన్నం చ నివేదయేత్.

ద్వాదశాబ్దార్చన ఫలం
దినేనైకేన లభ్యతే,
మార్గశీర్షాఖ్యమాసే తు
పూజయేచ్చ విశేషతః.

ఉషఃకాలే తు సంప్రాప్తే
కవాటోద్ఘాటనం చరేత్,
దీపానుద్దీప్య శిష్యైశ్చ
దేవదేవం సమర్చయేత్.

ముద్గాన్నం చ నివేద్యైవ
ముఖవాసం నివేదయేత్,
కవాటం సుస్థిరం బధ్వా
సన్ధ్యోపాసన - మాచరేత్.

అనెడి ఆనందసంహితోక్త ప్రకారముగా సూర్యుడు చాపగతుడయినపుడు (మార్గశిరం) ఆ మాసము నందు ప్రతిదినము ఉషః కాలమున బ్రహ్మ ముహూర్తమున మేలుకొని స్తోత్రధ్యానాదులచే శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీ మహావిష్ణువు (కేశవుని) ను మేలుకొలిపి యథావిధిగా అ స్వామిని పూజించి పొంగలిని ఆరగింప చేయవలయును. ఆ విధముగ ఒక దినము చేసెడి భగవదారాధన వలన భాగవతునికి పన్నెండు సంవత్సరముల ఆరాధన ఫలము లభించును. అట్లు కాక మార్గశిర మాసము నందు ప్రతి దినము పూజించెనేని అనంతమైన ఫలితము లభించును.

మార్గశిర మాసమున ప్రాతఃకాల సమయమున ఆచార్యుడు శిష్యులతో కూడి భగవంతుని మందిరము (కోవెలను) చేరి ఆ ద్వారములను తెరచి దీపము (తిరువళిక) వెలిగించి ఆ బ్రహ్మాండ నాయకుని అర్చింపవలయును. పూజానంతరము పొంగలిని నివేదన (ఆరగింపు) చేసి లవంగ కర్పూరములతో కూడినటువంటి పరిమళ ద్రవ్య అనంతరము తాంబూలాది ద్రవ్య సమర్పణము చేయవలయును.అనంతరము సుస్థిరముగా ద్వారములను మూసి సంధ్యోపాసనాది ఆజ్ఞలను భగవంతుని నుండి పొంద వలయును. ఈ విధముగా మార్గశిర మాసమంతయు చేసిన యెడల ఒక సంవత్సరమంతయు భగవంతుని ఆరాధించిన ఫలితము కలుగును.

ఉత్తరాయణ దక్షిణాయనములు రెండును దేవతలకు అహోరాత్రములు. అట్టి అహోరాత్రములు ముప్పది జరిగిన పిదప దేవతా సంబంధమగు ఆ దేవతా దినమున ఉషఃకాలమును "ధనుర్మాస"మని వక్కాణించిరి. కావున అట్టి చాపమాసము నందు అనేక ప్రయత్నములైనను చేసి ఉషఃకాలమున (ప్రాతఃకాలమున) పూర్వోక్తముగా భగవదారాధనను సమర్పించి తమ పాపములన్నియు పరిహారము చేసుకొనవలయును.

ఆషాఢాది చ మాసేషు
శయనం కార్తికా వధి,
చాపం గతే దివానాథ
ఉత్థాప్య శయనాద్ధరిమ్.

స విష్ణులక్షణై స్తోత్రై
ర్బహుభిః పరిగీయచ,
ఉషఃకాలే తు సంప్రాప్తే
త్వర్చయిత్వా జనార్దనమ్.

ఉపచారై షోడశభి
ర్ముద్గాన్నం చ నివేదయేత్.

అని బ్రహ్మాండ వచన క్రమముగా ఆషాఢ శుద్ధ ఏకాదశి మొదలుగా కార్తీక శుద్ధ ఏకాదశి వరకు పాలవెల్లి యందు శేష తల్పముపై యోగనిద్రలో ఉండేటువంటి శ్రీమన్నారాయణుని మేలుకొలిపి ధనుర్మాసము సంప్రాప్తమైనందున ప్రాతఃకాల సమయమున శయనంబు వలన భగవంతుని ప్రార్థించి అనేక విధములైన స్తోత్రములను చేసి పూర్వ ప్రకారముగా షోడశోపచార పూజలచే పూజించి పొంగలి నివేదన చేయవలయును.

చాపం గతే తత స్సూర్యే
ప్రత్యూషస్నాన మాచరేత్,
అర్చయేచ్చ జగన్నాథం
యావత్సూర్యో దయాత్పురా.

తతః ప్రభాతసమయే
చార్ఘ్యం ప్రక్షిప్య వైష్ణవః,
గాయత్రీం చ తతో జప్త్వా
ఉపతిష్ఠేత భాస్కరమ్.



ప్రకటన

## గొడుగుల పంపిణీ

మైకుసెట్లవలెనే ఏకైశాతం సబ్సిడీతో గొడుగుల జతను కూడా ఆలయాలకు విరాళంగా ఇవ్వాలని తే 6-8-82 దిన తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహక మండలిలో తీర్మానించటం జరిగింది కనుక గొడుగులు అవసరమైన ఆలయాల అధికారులు తమ అభ్యర్థనలు పంపుకొనవలసిందిగా కోరటమైనది. గొడుగుల జత సగం వెల రూ. 650/- అవుతుందికనుక టి. టి. డి. కార్య నిర్వహణాధికారి పేరిట ఆ మొత్తానికి డిమాండ్ డ్రాఫ్టు తీసుకొని ఆయా జిల్లాల అసిస్టెంట్ దేవాదాయ కమీషనర్ల ద్వారా తమ దరఖాస్తులను పంపిన పక్షంలో, అలాంటి వారికి గొడుగులు మంజూరు చేయబడుతవి.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

అనెడి ఆదిత్యపురాణోక్త ప్రకారముగ వైష్ణవుడు ధనుర్మాస సమయమున ప్రాతఃకాలమున మేల్కాంచి శుద్ధిగా స్నానాదులాచరించి సూర్యోదయమునకు పూర్వము యథోక్త ప్రకారముగా శ్రీహరి నారాధించి అనంతరము ప్రభాతకాలము నందు అర్ఘ్య ప్రదానములాచరించి తాను యథాశక్తి గాయత్రీ మంత్ర జపము చేసు కొనవలయును.

కోదండస్థే సవితరి
ప్రత్యుషః పూజయే ద్ధరిమ్,
సహస్రాబ్దార్చనఫలం
దినేనైకేన సిద్ధ్యతి.

అనెడి భాగవత పురాణోక్త ప్రకారముగా ధనుర్మాసము నందు ప్రాతఃకాలమున భక్తుడు శ్రీవిష్ణువును ఆరాధించెనేని ఒకరోజు ఆరాధన ఫలితముగా వేయివత్సరములు ఆ లక్ష్మీ పతిని ఆరాధించిన ఫలితము కలుగును.

బ్రాహ్మే ముహూర్తే సంప్రాప్తే
రవౌధనుషి సంస్థితే,
స్నానం కృత్వా స్వసూక్తేన
షోడశై రు పచారకైః.

అను వైఖానస ఆగమోక్త ప్రకారముగా ధనుర్మాసమున బ్రహ్మముహూర్తమునందు శుద్ధిగా స్నానము జేసినవాడైన భక్తుడు నగర గ్రామ రక్షణార్థం పురుష సూక్తముచే షోడశోపచార పూజలచే ఆ శ్రీయఃపతిని ఆరాధించిన ఎడల వేయి సంవత్సరముల హరి పూజా ఫలితము లభించును. గృహస్థుడు ధనుర్మాసమునందు ప్రాతఃకాలమున శుచిగా స్నానాది కార్యక్రమములను తీర్చుకొని పరిశుద్ధమైన ఆత్మతో యథాప్రకారముగా శ్రీహరిని ఆరాధించవలయును.

ఏకాదశ్యాం సితే పక్షే
చాపే తిష్ఠతి భాస్కరే,
ఉత్సవం కారయే ద్ధిమా
న్వేదపారాయణై స్సహ.

అను జ్యోతిశ్శాస్త్ర ప్రకారముగా మరియు ప్రసిద్ధ భాస్కరీయ పారమేష్ఠ్య మను గ్రంథము ననుసరించి మార్గశిరమాసమున శుక్ల పక్ష ఏకాదశి యందు మేధావి యగువాడు వేదపారాయణ పూర్వకముగా శ్రీహరికి ఉత్సవము పూజలు జరిపింప వలెను.

చాపే స్థిత ఉషఃకాలే
రవౌ ప్రతిదినం హరిమ్.

అను వచన ప్రమాణముగా ధనుర్మాస మందు ఉషఃకాలమున పూర్వక్రమముగా శ్రీ స్వామి వారికి సమారాధన చేయవలెను.

కోదండస్థే రవౌ విప్ర
స్స్నాత్వా ప్రత్యుషసి స్వయమ్,
రమానాథం జగన్నాథం
నిత్యం భక్తి సమన్వితః.

అను శ్రీమన్నారాయణ సంహిత ప్రకారముగా ధనుర్మాసమున విప్రుడు ప్రాతఃకాలమున పరిశుద్ధముగ స్నాన మాచరించి శ్రీనాథుడును మరియు జగన్నాథుడు నగు నన్ను భక్తియుక్తముగా పూర్వోక్త క్రమముగా ఆదరించి ఆదరణ పూర్వకముగా పరమ విశిష్టమైన ముద్గాన్నమును నాకు సమర్పించ వలయును. త్రింశత్ గాథాత్మకమగు నట్టి ద్రావిడ కృతులను నాకు అతిగా ప్రియమగు సంస్తుతిని మరియు గాథాత్మ ఏకైకగాథా పూర్వోత్తరార్థము లను మున్నడి పిన్నడిగా నాకు మిక్కిలి ప్రీతిపాత్రులగు వైష్ణవులు నిత్యము అనుసంధించవలయును. అట్లు అనుసంధించుచు క్రమముగా నా ముప్పది పాటలు (తిరుప్పావై - ద్రావిడంలో 30 పాశురములు) ఒక్కొక్కటిగా నా ఎదుట సాయించి, అనుసంధించి సంధ్యోపాసనాది నా యాజ్ఞలను గైకొని యా ప్రసాదమును స్వీకరించి భుజియించి కృతకృత్యులగుదురు గాక యని శ్రీదేవి నుద్దేశించి శ్రీ మన్నారాయణమూర్తి సాయించినారు.

– శ్రీ ఎం. వి. ఎస్. రంగాచార్యులు

# —మాల దాసరి కథ—

ఒకప్పుడు కురుగుడి అనే గ్రామం ఉండేది. దానినే తిరుక్కురుంగుడి అని కూడ పిలచేవారు. ఆ గ్రామంలో ఒక దాసరి ఉండేవాడు. అతడు మలిన శరీరముతోనే విష్ణువును ప్రార్థించేవాడు. అతడు వేకువనే లేచి మంగళకైశికి రాగంతో శ్రీహరిని కీర్తించేవాడు. తనజాతి ఆచారమును పాటిస్తూ పరిశుద్ధ హృదయం కలిగి ఉండేవాడు.

ఆ పల్లెకు సమీపంలో విష్ణువు ఆలయం ఉండేది. అక్కడ నిత్యం విష్ణుమూర్తికి అర్చనలు జరిగేవి. దాసరి వేకువనే ఆలయానికి పోయేవాడు. చమురు మరకల తోలుచొక్కా, శంఖుచక్రములు చెవిపోగులు, మొగలి ఆకుల గొడుగు ధరించేవాడు. మెడలో తులసిపూసలు, చిటివీణతోపాటు చిరుతాళములతో ఆలయానికి చేరేవాడు. భక్తితో దేవుని భజించేవాడు. రాళ్లుకూడ కరుగునట్లు కీర్తనలు పాడేవాడు. మిట్ట మధ్యాహ్నం వరకు మైమరచి తాండవం చేసేవాడు. సాష్టాంగపడి తరువాత కలక నీరు బయటి తొట్టెనుండి తీర్థంగా గ్రహించేవాడు. ఎవరైనా ప్రసాదం ఇచ్చిన స్వీకరించి, ఇంటికి తీసుకుపోయేవాడు.

ఒకనాడు అర్ధరాత్రి సమయాన అతని గుడిసెలో పిల్లి దూరింది. భయపడి కోడి పుంజులు కూసాయి. వేకువ సమయం అని తలచి దాసరి లేచాడు. ఆలయానికి బయలు దేరాడు. చీకటిలో దారితప్పి అడవికి చేరాడు. ఆ ప్రాంతం పాడుబడిన గ్రామం. అక్కడ పల్లేరుకాయలు ఉత్తరేణి ముండ్లు దాసరి కాళ్ళకు గుచ్చుకున్నవి. వాటిని తొలగిస్తూ దగ్గరలోగల మర్రిచెట్టును చేరాడు. కటికచీకటిలో ఆ చెట్టు భయంకరంగా ఉంది. కాళ్ళకు పుర్రెలు, మనుషుల ఎముకలు తగిలాయి. ఈగలు ముసర సాగాయి. అది చూసిన దాసరి “ఇది ఏమిటి? త్రోవతప్పి భయంకరమైన చోటుకు చేరుకున్నాను” అని విచారించసాగాడు.

ఇంతలో ఒక భయంకరాకారుడైన రాక్షసుడు ఎదురయ్యాడు. దాసరి తనవద్దగల బాణంతో రెండు శరాలు విడిచాడు. కాని ఆ బ్రహ్మరాక్షసుడు తప్పించుకున్నాడు. దాసరి ధైర్యంతో ఆ బ్రహ్మరాక్షసుడితో మల్లయుద్ధానికి తలపడ్డాడు. కాని ప్రయోజన శూన్యమైంది. వెంటనే వాడిని ప్రక్కకు నెట్టి కాలికి బుద్ధిచెప్పాడు. రాక్షసుడు, “ఓరీ టక్కరి! నీవు నా దగ్గర నుండి తప్పించుకోలేవు” అంటూ కేకలువేస్తూ తన పరివారాన్ని పిలువ సాగాడు.

దాసరికి ధైర్యం సన్నగిల్లింది. పరుగెత్తినా ప్రయోజనం లేదని, “ఓ రాక్షస రాజా! నిన్ను దేవతలు కూడా జయించలేరు. ప్రాణరక్షణ మానిన పాపమని నీతో పోరాడాను. ఇవుడు నీకు ఆహారం అయ్యాను. భయిముచే మాటాడితి నని అనుకొనకుము. ప్రాణభయముచే ఈ విధంగా చెప్పలేదు. ఎంతటివారికైనను చావు తప్పదు. జంతువులకంటే మనుషులకు జ్ఞానం ఎక్కువ. నాకంటే పెద్దతల, శరీరము కలిగిన నీకు చెప్పే శక్తి నాకు లేదు. ఏది తినతగినది, ఏది తినరానిది అని ఆలోచన చేయక పోవుట తగదు. హిరణ్యకశిప, హిరణ్యాక్షులకే చావు తప్ప లేదు. ఎంతటి వారికైనను చావు తప్పదు. ఇక్కడ బలవంతులు యముని ముందు బల హీనులే కదా! స్థాన భేదముచేత తారతమ్యములు వస్తున్నాయి. చావు మాకు తప్పనట్లే నీకును కదా, నీ ఇష్టము వచ్చినట్లు నడుచుకో” అన్నాడు దాసరి.

ఆ మాటలు విన్న రాక్షసుడు ఫకాలున నవ్వి, “ఓరీ వెర్రివాడా! తాతకు దగ్గులు నేర్పెదవా, పాపపుణ్యాలతో నాకు పని లేదు. అగ్నిదేవుడు సర్వభక్షకుడైనా పవిత్రుడే కదా! మరి పాములను భక్షించు గరుడుడు విష్ణుమూర్తి మన్ననలు అందుకోలేదా? పుట్టుకతో వచ్చిన అలవాట్లు అమృతము కంటే గొప్పవి. ఎన్ని యుక్తులు పన్నినా విడువను” అని చెప్పాడు.

అపుడు దాసరి, “మహాత్మా! నీవు సర్వజ్ఞుడవు. నేను శాస్త్రాలు చదువలేదు. నీకు జవాబు చెప్పేశక్తి చాలదు. కాని నా మాట వినుము. నాకు ఒక వ్రతము ఉన్నది. ఇపుడు విష్ణుమూర్తిని భజించువేళ అయి



నది. నా చివరికోరిక తీర్చుము. నేను విష్ణువును కొలిచి నీకు ఆహారముగా వచ్చెదను" అని దీనంగా అడిగాడు.

దాసరి మాటలకు రాక్షసుడు నవ్వి, "ఓరీ! భలే బొంకులు నేర్చావు. త్రోవలు కొట్టి శరీరము పెంచావు. నిన్న మొన్ననే దాసరివి అయ్యావు. నిన్ను విడచుట కల్ల. నేను విడచానా నీవు వచ్చుట కల్ల. నీ కపటపు మాటలు చాలించు. నీ రంతులు, గంతులు చాలించు" అన్నాడు. దాసరి చివరిమాటగా విష్ణువుపై ప్రమాణం చేశాడు. రాక్షసుడి హృదయం కరిగి అనుమతిని ఇచ్చాడు. దాసరి తిరుక్కురుంగుడి చేరాడు. స్వామిని తనివితీరా స్తుతించాడు. భక్తి పారవశ్యంతో పాడాడు. ఆలస్యం చేసిన అసత్యదోషం అంటునని పరుగెత్తుచు దాసరి రాక్షసుని చేరాడు. "అయ్యా, నీ అనుగ్రహమువల్ల విష్ణువుని మనసుదీరా స్తుతించాను. నీవు పంపినపుడు ఉన్న అవయవములు అన్నియు ఉన్నవి కదా! చూసుకో నన్ను తిని నీ ఆకలి తీర్చుకో" అన్నాడు.

బ్రహ్మరాక్షసుడు ఆశ్చర్యపడుతూ, "మనుషులలో నీవంటి సత్యవంతుడు మరి లేడు. ఎందరో చక్రవర్తులు, ఆడినమాట తప్పలేదు. కాని వారిలో ప్రాణాన్ని లెక్క చేయనివాడు లేడు. అందుకు నా వయసే సాక్ష్యము'' అనుకొని ఆనందభాష్పాలు రాల్చాడు. అంతేకాదు దాసరిని సమీపించి ప్రదక్షిణ చేసాడు. ప్రస్తుతించాడు. దాసరి రాక్షసునితో, "అయ్యా! నీవు గొప్పదయ గలవాడవు కనుకనే నన్ను విడిచిపెట్టావు. ఆలస్యం చేయక నన్ను ఆహారముగా స్వీకరింపుము" అని హెచ్చరించాడు.

ఆ మాటలు విని రాక్షసుడు బాధపడుచు, "అయ్యా, నీవు ఎంతటి గొప్పవాడవు నాపై కూడ దయచూపిస్తున్నావు. ఇన్నాళ్లు పాపపు కూటితో శరీరము పెంచుకున్నాను. ఏ మహాత్ముడైనా తరింపజేయడా అని నేను ఎదురుచూచుచున్నాను. మీవంటి పుణ్యాత్ములు మావంటి వారిని తరింపజేయకున్న మాగతి ఏమిటి? హోమ సమిధలను తెంచు గొడ్డలిని, కసాయి కత్తిని కూడ వరసవేది బంగారముగా మార్చివేయ గలదు కదా! మీరు అంత గొప్పవారే కదా" అని బ్రతిమాల సాగాడు.

దాసరి, "అన్నా, నాశరీరమును తినక పోవుటకుగల కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు. అపుడు బ్రహ్మరాక్షసుడు, "అయ్యా, నీశరీరము ఇచ్చునంతమాత్రమే చాలునా! నా ఆత్మమాలిన్యమును తొలగించుట నీకు పుణ్యము అగును. మునులను హింసించిన ఘంటాకర్ణుని కంటె నేను పాపిని కాదు. అట్టివానినే ఆ దేవదేవుడు అనుగ్రహించెను కదా! భక్తా! నేను బ్రహ్మ రాక్షసుడను. నా పేరు కుంభజానువు. నేను పూర్వజన్మ పాపఫలముతో రాక్షసుడ నయ్యాను. నీవు విష్ణువుని కీర్తించు పుణ్య ఫలము నాకు ధారపోసి నన్ను తరింప చేయి" అంటూ ప్రాధేయపడ్డాడు.

దాసరి, "అయ్యా నీకు నా శరీరమును ఇస్తానని మాట ఇచ్చాను కాని విష్ణుకీర్తనా ఫలముకాదు. ఊరక నన్ను విసిగించక నా శరీరమును స్వీకరించుము" అంటూ కసిరాడు. రాక్షసుడు పాదాలపై పడి, "అయ్యా దాసరీ విష్ణుభక్తులు గొప్ప దయార్ద్ర హృదయులంటారు కదా! మరి నీవు నాపై దయ చూపించుటలేదు. కనీసం ఈ రోజు కీర్తించిన తుది కీర్తనా ఫలమును ధారపోయుము" అంటూ దీనంగా బ్రతిమాలాడు.

దాసరి హృదయం కరిగింది, "అయ్యా, నీ మాటలు విన గొప్పదైవజ్ఞుడిలా కనిపిస్తున్నావు. నీకు ఈ రాక్షస రూపం కలుగుటకు కారణం ఏమిటి?'' అంటూ పాదాలపై పడిన రాక్షసుని లేవనెత్తాడు.

బ్రహ్మరాక్షసుడు, "అయ్యా! నావృత్తాంతమును వినుము! నాది చోళమండలము. పెద్దలందరిని పరిహసించే వాడిని, సజ్జనులతో పందెములువేసేవాడను ఓడిపోయినను గెలిచితినని అబద్ధములు చెప్పేవాడను. సభామర్యాదలు పాటించుట నాకు అలవాటు లేదు. నీచదానములు పుచ్చుకొనుటకు ఏనాడు సందేహపడలేదు. పర్వదినాలలో పూటకూళ్ళ ఇంట తినేవాడిని. అప్పులు ఇచ్చి అధిక వడ్డీలు గుంజేవాడిని. ఆ డబ్బుకు భార్య కోసం చీరలు కొనేవాడిని. ఒకసారి వడ్డీ డబ్బులతో భార్యకు చీరలు కొన బయలు దేరాను. నాతో కొందరు సత్రములో కలిసారు. మమ్మలిని ఒకడు త్రోవకాని త్రోవకు తీసుకొని పోయాడు. అది తగిన బాటకాదు. ఇంతలో వాడు ఈలవేశాడు, దొంగలు చుట్టూచేరారు. వారంతా మమ్మలిని చావబాదారు. నేను తప్పించుకొని పరుగెత్తాను. నా వెంట ఒకడు పరుగెత్తాడు. నన్ను పట్టుకుని చావబాదాడు. ఆ దొంగనుగూర్చి గ్రామాధికారితో చెబుతానని భయపడి, కత్తితో చావు దెబ్బలు కొట్టాడు. ఇంతలో నా భార్య తోబుట్టువు అటుగా వచ్చాడు. నన్ను గుర్తించాడు. కావడిలో వేసుకుని మోయసాగాడు. ఢాడుదప్పికతో నన్ను మర్రిచెట్టుక్రింద ఉంచాడు. నీటి కోసం వెళ్ళాడు. వాడు వచ్చులోపల నాకు రాక్షస రూపం వచ్చింది. ఓ కరుణానిధీ, నీ కైశికి గాన ఫలదానంతో ఈ వికారరూపం నుండి ముక్తి కలిగించు'' అని ప్రార్ధించాడు,

దాసరి "అయ్యా కైశికీ గానము ఎటువంటిదో నాకు తెలియదు. అయినను దేవుని కీర్తించుటకు ఏ రాగము అయితే ఏం. దేవునియొక్క సేవకు కొలత ఉందా! ఈ ఫలము తీసుకో అని నేను శంకించ వచ్చును. నిన్ను దేవుడు రక్షించును." అని చెప్పాడు. అతడే సోమశర్మ. దాసరిని పూజించి, తన జన్మను తరింపజేసికొనుటకు తీర్థయాత్రలకు బయలుదేరాడు,

విన్నారా! సత్యము నాచరించువారు ఎంత గొప్పవారో, పెద్దల దూషణ ఎంతో పాపము నిచ్చును. అంతేకాదు సజ్జన సాంగత్యం ఎంతటి పాపములనైనా తొలగించును కదా! ఇదే మానవుడు నేర్చుకోదగిన నిత్య జీవితసత్యం.

— శ్రీ బెహరా ఉమామహేశ్వరరావు

## శ్రీ గీతామాహాత్మ్యం

ధరోవాచ :

భగవన్పరమేశాన భక్తిరవ్యభిచారిణీ ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో ॥

భూదేవి: భగవంతుడా! పరమేశ్వరా! ప్రభూ! ప్రారబ్ధం అనుభవించే వాడికి అచంచలమైన భక్తి ఎలా కలుగుతుంది?

విష్ణురువాచ :

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥

శ్రీమహావిష్ణువు: భూదేవీ! ప్రారబ్ధం అనుభవిస్తున్నా నిరంతరం గీతను అభ్యసించేవాడు లోకంలో ముక్తి పొంది సుఖపడతాడు; కర్మలకు బద్ధుడు కాడు.

సర్వదేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।
గోపాల గోపికా వాపి నారదోద్ధవపార్షదైః ॥
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే ।

గీతా పారాయణం జరిగేచోటకు సర్వదేవతలు, ఋషులు, యోగులు, నాగులు, గోపాలురు, గోపికలు, విష్ణుభక్తులైన నారదుడు, ఉద్ధవుడు మొదలైన వారు వచ్చి తోడ్పడతారు.

యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి! నివసామి సదైవ హి ॥

భూదేవీ! గీతను చర్చించడం, చదవడం, బోధించడం వినడం జరిగే ప్రదేశంలో నేను నిరంతరం నివసిస్తుంటాను.

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయా మ్యహమ్ ॥




(సీరియల్)

వ్యాఖ్యాత:
శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి



మహాపాపాది (తి?) పాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళ మంభసా ॥

తామరాకును నీరు అంటనట్లే గీతాపారాయణం చేసే వాడిని మహా పాపాలు కూడా ఏ మాత్రమూ అంటవు.

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥

గీతా గ్రంథం వున్నచోట, గీతాపఠనం జరిగే చోట ప్రయాగలాంటి తీర్థాలన్నీ వుంటాయి.

నాకు ఆశ్రయమూ, ఉత్తమ నివాస మందిరమూ గీతాశాస్త్రమే గీతాజ్ఞానాన్నిబట్టి నేను మూడు లోకాలనూ పరిపాలిస్తున్నాను.

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా ॥

నా పరమ విద్య అయిన గీత నాశరహితం, శాశ్వతం, వర్ణనాతీతం. అది బ్రహ్మ స్వరూపం, అర్ధమాత్రా స్వరూపం అనడంలో అనుమానం లేదు.

(12 వ పేజీలో)

# శ్రీ రంగనాథస్వామి ఆలయము

శ్రీదేవికి నిలయమై, భూదేవికి అల వాలమై, ప్రజారంగమునకు ధాముడై శ్రీరంగపురమునందు వెలసిన రంగనాథ స్వామి ఆలయము ఆబాల గోపాలమును ఆనందసాగరమున అలరారించుచున్నది. ఆంధ్రప్రదేశమునందలి మహబూబ్‌నగర్ (పాలమూరు) మండలమునగల వనపర్తి తాలూకాకు సుమారు 25 కి. మీ దూరమున వెలసిన సుప్రసిద్ధ క్షేత్రరాజమైన శ్రీరంగా పుర గ్రామమునందలి శ్రీరంగనాథస్వామి వారి ఆలయము- హైద్రాబాదు నుండి కర్నూలు వెళ్ళు 7 వ జాతీయరహదారి (ఎన్. హెచ్.) లోగల పెబ్బేరునకు 8 కి. మీ. దూరమున కలదు.

## స్థలచరిత్ర

క్రీ. శ. 1650-78 అమధ్య ప్రాంతంలో ఆలయనిర్మాణము జరిగినది. మోటునాటి రెడ్లు, పెనుబాల గోత్రికులు, జనుంపల్లి వంశీయులు, ఇతరులు పరిపాలనలో ఈ ఆలయము మూడు పూవులు ఆరుకాయలై దినదినాభివృద్ధి జరిగినది.

కొరివిపాడు, దసరాపురం, గుంపనపల్లి గ్రామాలకు దగ్గరలోగల ఒక చిన్న గుట్టను "వలుగురాళ్ళతిప్ప" అని పిలుస్తారు. దీనిపై కస్తూరి రంగనాయకుల ఆలయము కట్టబడినది. మహమ్మదీయుల దండయాత్ర వలన ఈ ఆలయంపై దాడి జరిగి మూల విగ్రహాల మూడింటిలో స్వామివారుమాత్రం శిథిలముకాగా, ఉత్సవ విగ్రహాలు దొంగిలింపబడి ఒక్క దేవేరి (అమ్మవారి) విగ్రహం లభించినది. ఆతర్వాత కొద్దికాలానికి తిరిగి విగ్రహాలు ప్రతిష్ఠింపబడి పూజలు జరుగుచుండెడివి. "కొరివిపాడు" గ్రామాన్నే రంగడు వెలసినందువలన స్వామిపేర "శ్రీరంగపురము" అను నామ మేర్పడినది.

వనపర్తి, సూగూరు, శ్రీరంగపురం సంస్థానాధిపతులైన రాజవంశీయులు ఈ



ఆలయ నిర్మాణానికి ఇతోధికంగా కృషి చేశారు. విజయనగర రాజులకాలంలో వీర కృష్ణారెడ్డి ఈ ప్రాంతాన్ని అభివృద్ధి చేశారు. జనుంపల్లి వంశీయులలో గోపాలరావు క్రీ. శ. 1676 నాటికి గొప్ప పండితుడు, "అష్టభాషల గోపాలరావని" పేరుపొంది, "బహిరీ" అనే బిరుదును గోలకొండ నవాబులనుండి పొందారు. రామచంద్రోదయము, శృంగారమంజరి అను కావ్యాలను వీరు వ్రాశారు. వీరి తర్వాత సవై వెంకటరెడ్డి సుమారు 50 సం॥లు ఈ దేవాలయాభివృద్ధికి దోహదం చేశారు. వెంకటరెడ్డి ప్రజలకొరకు నీటి యిబ్బందిని తొలగించుటకై ఒక పెద్దబావిని త్రవ్వించారు. నేటికిని 'వెంకటరెడ్డి బావి' అని పిలుస్తూ ప్రజలు అతనిని నిత్యం స్మరించుకొంటూ నీరుత్రాగుట కుపయోగించుకొనుచున్నారు. వారి తర్వాత 14 వ రాజైన రాజా రామేశ్వరరావు, వారి భార్య రాణీ శంకరమ్మ గారలు ఒక పెద్దచెరువును త్రవ్వించి, ఆలయ గోపురము, ముఖద్వార గాలిగోపురము, ఆండాళ్ దేవాలయము కోనేరు మొదలగు సౌకర్యములు కల్పించిరి. వారి తర్వాతి వారైన రెండవ రామేశ్వరరావు చతుర్భుజ తాయారు (లక్ష్మి) గుడిని నిర్మించారు. ఇప్పటికికూడా ఈ వంశీయుల అధ్వర్యం



లోనే నిత్యపూజలు, ఉత్సవాదులు జరుగుచున్నవి.

ఈ దేవాలయము వెలయుట కొక ఐతిహ్యము ప్రచారంలో ఉన్నది. శ్రీరంగమునకు యాత్ర వెళ్ళినపుడు రాజుగారికి ఆ ప్రాంతము, ఆ స్వామి యగు రంగనాథుడు చుట్టు వున్న కావేరి నది ఇతర పరిసరాలు ఆకర్షించుటచే తమవద్ద ఇలాంటి గుడి లేక పోయెనె అని ఆలోచించుకొనెను. ఆ రోజు రాత్రి స్వప్నంలో స్వామి సాక్షాత్కరించి నీ దగ్గరనే (నీ ప్రాంతంలోనే) నేనున్నాను. రేపు నా వాహనమైన గరుడుడు నీకు సహాయం చేస్తూ దారి చూపిస్తాడు వెళ్ళమని సెలవిచ్చిరి. అటుపిమ్మట మరు రోజు గరుడుని (గ్రద్ద) సహాయంతో బయలు దేరగా యీ ప్రాంతమునకు దగ్గరలోగల కానాయపల్లె, కొత్తకోట, సంకిరెడ్డి పల్లెల మధ్యభాగమైన రంగంపేట అనే చోట ఒక పెద్ద పుట్టపై గరుడుడు వ్రాలెను. ఆ పుట్టను మెల్లగా త్రవ్వించగా అందులోనుండి సుమారు 5, 6 అడుగుల పొడవుగల నల్లరాతితో తయారుచేసిన అతి సుందరమైన శ్రీ, భూదేవీ సమేత రంగనాథస్వామి శేషశయనుడై పవళించియున్న ఏక శిలా నిర్మిత విగ్రహం దర్శనమిచ్చినది. దానికి రాజు సంతోషించి ఆ విగ్రహాన్ని బండ్ల కెత్తించి గరుడుడు చూపినట్లు తీసుకవచ్చి కొరివిపాడు గ్రామమునకు దగ్గరగాగల కస్తూరిరంగని ఆలయంగల "పలుగురాళ్ళ తిప్ప" వద్ద దానిని ప్రతిష్ఠించిరి.

## దర్శనీయ స్థలములు

రత్నపుష్కరిణి, రంగసముద్రము, గరుడాద్రి, స్వామివారి గర్భగుడి, చతుర్భుజ తాయారుగుడి, హోమశాల, వాహనశాల, పాకశాల, నేలబొయారము, పన్నిద్దరాళ్వారులగుడి, రామానుజ, మణవాళ మహాముని గుడులు, అధ్యయనోత్సవ మంటపము (కొఠాయి) చిన్న, పెద్ద గాలి గోపురములు. పారువేట మంటపము, నౌబత్ఖానా, ఆండాళ్‌సన్నిధి, కోనేరు మొదలగునవి.



శ్రీ రంగనాథస్వామివారు

## రత్నపుష్కరిణి

ఇది దిగుడు మెట్లబావి. దేవాలయమునకు స్వామి అర్చనకు "బిందెసేవ" అనుపేరుతో వెండిబిందే, తిరుక్కావేరి అను చెంబుతో తీర్థమును తీసుకొని మామిడాకులు, టెంకాయలతో దానిని అలంకరించి మేళతాళములతో స్వామి సన్నిధికి తీసికొని వస్తారు. రత్నపుష్కరిణి దగ్గరలో సూర్య, చంద్ర పుష్కరిణులుకూడా కలవు. ఇవి శిథిలావస్థలోవున్నవి.

## రంగసముద్రము

ఇది పెద్ద చెఱువు. ఈ ఆలయపు గుట్ట చుట్టు దగ్గర దగ్గర నున్న గుట్టలను కలుపుకొని విశాలంగా సుమారు 3, 4 మైళ్ళ పొడవు 1 మైలు వెడల్పుతో నిర్మించబడిన చెఱువు. దీనికే రంగ సముద్రమని పేరు ఈ చెఱువు రంగనాయకస్వామి గుడి చుట్టూ చుట్టబడి, శ్రీరంగంలోని రంగనాథాలయమును చుట్టుముట్టిన కావేరి నదిని జ్ఞప్తికి తెచ్చును. పలుగురాళ్ళతో ఈ ప్రాంతము నిండియుండుట వలన ఈ నీరు మురికి లేకుండా స్వచ్ఛముగా రుచిగా వుంటాయి. వానకాలంలో రత్నపుష్కరిణి, ఇతర పుష్కరిణులు, ఇతర బావులు దీనిలో మునిగి పోతాయి. అపుడు స్వామికి రంగసముద్రం నీరు వాడుతారు. ఈ చెఱువువల్ల గ్రామంలో త్రాగుటకు నీరు సమృద్ధిగా లభిస్తున్నది. జాతర సమయంలో పశువుల కువయోగవడుతుంది. దీని క్రింద సుమారు 5, 6 వందల ఎకరాల భూమిలో వరి సాగుచేయబడుతున్నది.

## గరుడాద్రి

గరుడుడు ఈ గుట్టపై వ్రాలుటచే ఈ గుట్టకు గరుడాద్రి అని పేరు వచ్చినది. దూరమునుండి యీ గుట్టనుచూచిన పడగ ఎత్తిన పాముపలె కన్పించును. శేషశయనుడగు రంగని కిది తగిన స్థలము కాబోలు నన్నట్లున్నది.

## స్వామివారి గర్భగుడి

శుకనాసికము, మంటపము దాటి గర్భగుడికి వెళ్ళాలి. గర్భగుడి షడ్భుజాకారంలో నిర్మింపబడినది. స్వామి అందమైన చిఱునగవు మోముకలవారు. శాంతాకారుడు. భుజగశయనుడు. పద్మనాభుడు, మేఘవర్ణుడు, శుభాంగుడు, లక్ష్మి, భూదేవేరులతో కూడినవాడు, శంఖ, చక్రములు ధరించిన వాడు, నాభినుండి వెడలిన పద్మంలో

[ 37 వ పేజిలో ]

(9వ పేజీ తరువాయి)

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానందా తత్త్వార్థజ్ఞాన మంజసా ॥

చిదానందరూపం కలిగిన శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుడికి స్వయంగా చెప్పిన ఈ గీత మూడువేదాలసారం; పరమానంద స్వరూపం. తనను ఆశ్రయించిన వాళ్ళ కిది తత్త్వజ్ఞానాన్ని తొందరగా కలగజేస్తుంది.

యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్ ॥

నిర్మలమైన మనసుతో నిత్యం గీత పద్దెనిమిది అధ్యాయాలనూ పారాయణం చేసేవాడు జ్ఞానసిద్ధి, దానిమూలంగా పరమ పదమూ పొందుతాడు.

పాఠేఽసమర్థ స్సంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥

గీతను పూర్తిగా చదవలేని వాళ్ళు దానిలో సగమైనా చదివితే గోదానం వల్ల కలిగే పుణ్యఫలం తప్పకుండా దక్కుతుంది.

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ ॥

గీతలో మూడవభాగం-ఆరు అధ్యాయాలు పారాయణం చేసే వాళ్ళకు గంగాస్నానం వల్ల కలిగే ఫలమూ, ఆరవ భాగం-మూడు అధ్యాయాలు పఠించే వాళ్ళకు సోమయాగం చేయడం ద్వారా లభించే ఫలమూ ప్రాప్తిస్తాయి.

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తి సంయుతః ।
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్ ॥

భక్తితో నిత్యమూ ఒక అధ్యాయాన్ని చదివేవాడు రుద్రలోకం చేరి, అక్కడ ప్రమథగణాలలో ఒకడుగా చిర కాలం జీవిస్తాడు.

అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః ।
స యాతి నరతాం యావత్ మనుకాలం వసుంధరే ॥

భూదేవీ ! ఒక అధ్యాయంలోని నాలుగో భాగమైనా ప్రతి రోజూ పారాయణం చేసేవాడు ఒక మన్వంతరకాలం మానవ జన్మ పొందుతాడు.

గీతాయాః శ్లోకదశకం సప్తపంచచతుష్టయమ్ ।
ద్విత్రిరేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః ॥
చంద్రలోకమవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్ ।
గీతాపాఠ సమాయుక్తో మృతోఽమానుషతాం వ్రజేత్ ॥

గీతలలోని శ్లోకాలు-పది, ఏడు, ఐదు, నాలుగు, మూడు, రెండు, ఒకటి కాని, ఆఖరుకి అర్ధశ్లోకం కాని అనుదినం పఠించేవాడు పదివేల సంవత్సరాలు చంద్రలోకంలో సుఖజీవనం సాగిస్తాడనడంలో సందేహం లేదు. గీతా పారాయణం చేస్తూ మరణించేవాడికి దేవత్వం కలుగుతుంది.

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్ ।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ ॥

గీతాధ్యయనం మళ్లీ మళ్లీ చేసే మానవుడు ఉత్తమమైన పరమపదం పొందుతాడు. గీతను స్మరిస్తూ ప్రాణాలు విడిచి పెట్టేవాడికి ఉత్తమగతి లభిస్తుంది.

గీతార్థశ్రవణాఽఽసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥

గీతార్థాన్ని వినడంలో ఆసక్తి కలిగినవాడు-ఎలాంటి మహాపాపి అయినప్పటికీ, వైకుంఠానికి వెళ్లి అక్కడ విష్ణువుతో పాటు ఆనందం అనుభవిస్తాడు.

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్ ॥

నిత్యమూ అనేక కర్మలు ఆచరిస్తున్నా, గీతార్థాన్ని ధ్యానించేవాడు జీవన్ముక్తుడై మరణానంతరం మోక్షం పొందుతాడు.

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః ।
నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్ ॥

గీతా శాస్త్రాన్ని ఆశ్రయించే ఈ లోకంలో జనకుడు లాంటి రాజర్షులు ఎంతోమంది పాపవిముక్తి పొంది, పరమ పదం చేరుకోగలిగారు.

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః ॥

గీతాపఠనం చేశాక మాహాత్మ్యం చదవనివాడి పారాయణం వృథాప్రయాస మాత్రమే.

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః ।
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్ ॥

మాహాత్మ్యంతో సహా గీతాపారాయణం చేసేవాడికి పైన చెప్పిన ఫలంతోపాటు ఉత్తమగతి కూడా లభిస్తుంది.

సూత ఉవాచ :

మాహాత్మ్యమేతద్గీతాయా: మయా ప్రోక్తం సనాతనమ్ ।
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ॥

సూతుడు : శౌనకాది మహర్షులారా ! సనాతనమైన గీతా మాహాత్మ్యాన్ని ఇలా మీకు తెలియజేశాను. గీతాపారాయణం చేశాక దీన్ని చదివినవాడికి పైన చెప్పిన ఫలం దక్కుతుంది.

ఇలా శ్రీ వరాహపురాణంలోని "శ్రీ గీతామాహాత్మ్యం" సమాప్తం.

(గత సంచిక తరువాయి)

**శ్రీకృష్ణదేవరాయలు–**

**కూచిపూడి నాట్యం**

వీరనరసింహరాయల తరువాత సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవ రాయలు క్రీ. శ. 1509 ఉత్తరార్ధంలో విజయనగర సామ్రాజ్యాధిపత్యాన్ని చేపట్టాడు.

"క్రీ. శ. 15, 16 శతాబ్దాలలో శ్రీకృష్ణ దేవరాయలవారు తాను శ్రీకాకుళము (కృష్ణాజిల్లా) వచ్చినపుడు ఈ కూచిపూడి వారి నాట్యకళ కచ్చేరువంది తనతో కొంత మంది విద్వాంసులను తీసికొనివెళ్లి హంపీలో నొక రంగస్థలమును నిర్మాణము చేయించి నాటకము లాడించుచుండెడి వారని హంపీ చరిత్రయందు పేర్కొనబడి యున్నది."

నందు వినా వేరెక్కడ కన్పించదు, విన్పించదు. కావున శ్రీకృష్ణదేవరాయలచే పేర్కొన బడిన భ్రుకుంసులు కూచిపూడి భాగవతు లనుట స్పష్టం.

శ్రీకృష్ణదేవరాయలను రసమయ జగమునకు గొనిపోయిన కొద్దిమంది కళాకారులలో కేశవభట్టు ఒకరు. అంతేకాక ఆయన రాయలుచే ముంగొండ అగ్రహారంలో ఘనంగా సన్మానించ బడ్డాడు.

**పండిత జగన్నాథ రాయలు**

**కూచిపూడి నాట్యం :–**

కేశవ భట్టు-మహాలక్ష్మల కొడుకు పేరు భట్టు. పేరుభట్టు- శ్రీలక్ష్మల పుత్రుడు పండిత జగన్నాథరాయలు. పండిత జగన్నాథరాయలు కూచిపూడిలోని వేదాంతం

# కళావని

**చరిత్ర పుటల్లో కూచిపూడి నాట్యం**

**వలస :–**

క్రీ. శ. 1565లో తళ్ళి కోట యుద్ధానంతరం విజయనగర సామ్రాజం పతనమైంది. తంజావూరులో నాయకరాజుల పాలన ఆరంభమైంది. క్రమంగా విజయనగర వైభవం తమిళనాడులోని తంజావూరుకు వలసపోయింది. నాయక రాజుల ఆస్థానాలు లలిత కళలకు నివాస స్థానాలైనాయి.

**అచ్యుతప్పనాయకుడు కూచిపూడి**

**నాట్యం:–**

అచ్యుతప్ప నాయకుని కాలంలో కూచిపూడి నుండి కొంతమంది నాట్యవేత్తలు



# కూచిపూడి నాట్యశైలూషి

— డా॥ చింతా రామనాథం

"విజయనగర సామ్రాజ్యమున శ్రీకృష్ణ దేవరాయల కాలమున కూచిపూడి భాగవతులక్కడకుపోయి ఆ రాజుచే సత్కరింప బడినట్లు 'తాయికొండ' నాటక ప్రదర్శనము వకై చేయబడిన దాన శాసనము కూడ తెలుపుచున్నది."

వీనిని జూడ శ్రీ కృష్ణదేవరాయలు కూచిపూడివారి నాట్య కళా కౌశలమును 15, 16 శతాబ్దములలో తిలకించి పులకించె ననుట నిర్వివాదాంశము. అందువలననే కాబోలు ఈ రాయలవారు తమ ఆముక్త మాల్యదలో "ఉలుపాల్పటిన ................" పద్యము నందు "భ్రుకుంసులు" అను పదమును ప్రయోగించినాడు. భ్రుకుంసులు = స్త్రీ వేషములువేసి ఆడెడు పురుషులు (శబ్ద రత్నాకరం) పురుషులు స్త్రీ వేషము ధరించు సంప్రదాయము కూచిపూడి నాట్యమేళము

వారి ఆడపడుచును వివాహమాడెనని ఆమె (కామేశ్వరి) యే లవంగి యనియు 'వీర కంకణం' శ్రీ బులుసు వేంకటరమణయ్య గారి నవలా ఉదంతం.

**రాజ కళింగ గంగు కూచిపూడి**

**నాట్యం :–**

"వేముల వాడ భీమకవి శాపముచే రాజ కళింగ గంగు రాజ్య భ్రష్టుడై తిరుగాడుచు తిరిగి శాపవిముక్తి నిబొందిన తరువాత పర రాజులను జయించుటకై కూచిపూడి భాగవతులతో కలిసి "కళింగ గంగు రాజ్యచ్యుతి" యను నాటకము నాడి తిరిగి వేషధారణలోనున్న కళింగ గంగే శత్రు రాజును సంహరించి రాజ్యముచేసి కొనినట్లు" చరిత్ర పుటలు చెప్పుచున్నవి.

రాజాశ్రయం కోసం వలసపోయారు. ఈ వలస పోయిన కళాకారులందరు మేలట్టూరు (మేళాలవూరు)న స్థిర నివాసమేర్పరచుకొని అచ్యుతప్ప నాయకుని తమ నాట్య కళతో మెప్పించి మేలట్టూరును అగ్రహారంగ పొందారు. "వచ్చి అచ్యుతపురములో బహు ముచ్చటై నవమండపంబున నిండుకొలువున నుండెను" అనునది కూచిపూడి వారి ప్రహ్లాద పట్టాభిషేకప్పత్తనృత్యాంశ శబ్దంలోని ఉద్ధరణము. ఆ మేలట్టూరులో కూచిపూడిలోని కళాకారుల వంశ నామముల వారు నేటికిని కలరు. మేలట్టూరులోని కళాకారులు "మా పూర్వీకులు కూచిపూడి నుండి ఇక్కడకు వలస వచ్చిరని" చెప్పుచున్నారు. ఈ విధంగా కూచిపూడి నాట్యకళ తంజావూరుకు వలస పోయింది. ఆంధ్రదేశం నుండి తమిళ

వాడుకు కళావేత్తలు వలస పోవుట సంప్రదాయమైంది. త్యాగయ్య, క్షేత్రయ్య, నారాయణతీర్థులు నుండి శ్రీ మంగళంపల్లి బాలమురళి, డా॥ వెంపటి చిన్నసత్యం లాంటి ఎందరో మహానుభావులకు ప్రధాన కర్మక్షేత్రం తమిళనాడగుటకు ప్రధాన కారణం ఆంధ్రుల అనాదరణయే.

అంతేకాదు. "ఆంధ్రదేశము నుండియే యక్షగాన మటు తంజావురాది దక్షిణ ప్రాంతములకును నిటు తెలంగాణము లకును విస్తరిల్లినది." "తంజావూరు రాజ్యమున నా కాలమున వలసపోయిన యాంధ్రులలో కూచిపూడి వంశమునకు చెందిన మేలత్తూరు వేంకటరామశాస్త్రి యొక దక్కడ స్థిరనివాస మేర్పరచుకొని యా మండలమందలి దేవాలయములో ప్రదర్శించుటకు క్రీ.శ. 1750–1755 ప్రాంతమున తెలుగులో ప్రహ్లాద, రుక్మాంగద, మార్కండేయ చరిత్ర, ఉషాపరిణయాది యక్షగానములను రచించెను." సుమారుగ ఇదే కాలమున ప్రసిద్ధ పదకర్త క్షేత్రయ్యయు కూచిపూడికి పరిసర కళాక్షేత్రమైన మొవ్వనుండి దక్షిణదేశమునకు రాజాశ్రయార్థము వలస పోవుట చరిత్ర చెప్పెడి సత్యము.

### అబుల్ హసన్ తానీషా–
### కూచిపూడి నాట్యం

క్రీ.శ. 1672–1687 లో ఆంధ్రదేశంలోని కృష్ణామండలం గోల్కొండ నవాబైన అబుల్ హసన్ తానీషా పాలన క్రిందకు వచ్చింది. 1685 సంవత్సరంలో అబుల్ హసన్ తానీషా మచలీపట్టణమునకు ప్రయాణం చేస్తూ కూచిపూడిలో ఒక మజిలీ చేశాడు. తానీషా కళాపోషకుడుగ పేరు పొందాడు. కూచిపూడి భాగవతులీ విషయాన్ని తెలిసికొని తానీషాను దర్శించి అతని సమక్షంలో సమాహార కళాఖండమైన శ్రీ సిద్ధేంద్ర యోగి కృత భామా కలాపాన్ని ప్రదర్శించారు. వీరి ప్రదర్శనకు ముగ్ధుడైన తానీషా సుమారారువందల ఎకరముల కూచిపూడి మాగాణిని కూచిపూడి భాగవతులకు దాన, విక్రయ, హక్కు, భుక్తములతో వంశపారంపరగా అనుభవించునట్లు అగ్రహారంగా 'ఫర్మానా' ఇచ్చినాడు. ఈ ఫర్మానా భాగవతుల యజ్ఞన్న నరసన్న, సూరన్నల పేరుతో వుంది. తానీషా సమక్షంలో భామాకలాపాన్ని ప్రదర్శించినది వీరే. అందుచే అగ్రహారం ఫర్మానా వారి పేర ఈయబడింది. ఇది కూచిపూడి అగ్రహారోత్పత్తి యుదంతం ఈ విషయమున విద్యాధికులు, విమర్శకులు, చాలమంది పొరపడినారు. సిద్ధేంద్రయోగియే తానీషా ఎదుట ప్రదర్శనిచ్చి అగ్రహారం సంపాదించినట్లు భావించారు. ప్రమాదో ధీమతామపి ప్రమాదవశాత్తు జరిగిన భావనగ మనం గ్రహించాలి.



కూచిపూడి భాగవతులు తమ కళను సాధనగ జేసికొని సాంఘికపరమైన ప్రయోజనం సాధించుటి నిది రెండవసారి.

### బనగానపల్లి నవాబు–
### కూచిపూడి నాట్యం

"భాగవత కళను రాయలసీమలో విరివిగా ప్రచారం చేయించవలెనన్న తలంపుతో క్రీ.శ. 1700 – 1750 ప్రాంతంలో బనగానిపల్లి నవాబుగారు కూచిపూడినుండి కొందరు కళావేత్తల కుటుంబాలను ఆహ్వానించి కోటకొండ, కపట్రాలవద్ద వారికి భూములూ, పుట్రా యిచ్చి వారిచేత కర్నూలు జిల్లాలో భాగవత కళాప్రచారాన్ని ప్రోత్సహించారు. అప్పటిలో కూచిపూడి నుండి తరలి వెళ్లిన కుటుంబాలలో చల్లా వారొకరు. వీరు వెలనాటి బ్రాహ్మణ కుటుంబమునకు చెందిన వారు."

ఈ విధంగా కూచిపూడి నుండి నాట్యాచార్యులు తంజావూరు, కర్నూలు మండలాలకు వలస పోయారు.

(సశేషము)

# ప్రేమకు హేతువులు

విజీతాన్ని యావత్తూ పొట్టు తీసి జల్లించి కాచి వడపోస్తే ఆఖరుకు కనిపించే అమృత బిందువు ప్రేమ. అందుకే కబీరు అంటాడు "ప్రేమలేని శరీరం శ్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేకపోయినా శ్వాసతీసుకుంటూనే వుంటుంది గదా" అని.

ప్రేయసీ ప్రియుల నడుమ, భార్యా భర్తల నడుమ వుండే అనురాగం, పెన వేసుకొని వుండే లక్షణాన్ని ప్రేమ అని అంటూ వుంటాం. ఐతే ఇది మాత్రమే ప్రేమ గాదు. ఆత్మీయత అనెడి సప్తవర్ణముల హరివిల్లులో ఇది ఒక రంగు మాత్రమే. దీని కంటె కళ్ళు జిగేలు మనిపించే ఎన్నో రంగులు ప్రేమలో చోటుచేసికొని వున్నాయి ఒక రంగును మాత్రమే తిలకించి జనం వళ్ళు మరచి పోతున్నారు. ప్రేమ విర జిమ్మే అన్ని వర్ణములనూ అర్థం చేసుకొని ఆస్వాదిస్తే ఆనందానికి అవధు లుండవు.

మానవుడు కోరికల పుట్ట. బావిలో నుండి నీరుతోడి వేస్తున్నప్పటికీ క్రొత్తనీరు ఊరి నట్లుగా అతనిలో ఒక వాంఛ తీరి తీరక మునుపే మరొకటి మొలకెత్తుతూవుంటుంది. భూమిమీద పడగానే పాలకోసం గుక్క పడతాడు. అది మొదలు అతని ఏడుపులకు అవసరాలకు అంతుండదు. గుడ్డలు, మందులు మాకులు, తిండీ తిప్పలు, కీర్తి ప్రతిష్ఠలు, పదవులు, పూల దండలు, ఇలా ఆకాశానికి నిచ్చెనలు వేస్తూనే వుంటాడు.

ఇవన్నీ లభించినా అతనికి తృప్తి లేదు. అతనిలో రహస్యంగా మరొక కోరిక గూడా చోటు చేసుకొని దాగుడు మూతలాడుతూ వుంటుంది. "ఇతరులు నన్ను ప్రేమించాలి, ఇతరులు నన్ను మెచ్చుకోవాలి" అనే కోరిక క్షణక్షణం బుర్రను తొలుస్తూ వుంటుంది: ఇలాంటి కోరిక ఉన్నట్లు అందరికీ అని పించదు. కాని వున్నమాట నిజం.

తల్లి తన కంచంలో ఇంత కూడు పడేస్తే కడుపు నిండదు. ఆమె నాలుగు మంచి మాటలతో ఆప్యాయంగా భోజనం పెట్టాలి. కాఫీ హోటలు సర్వరు గూడ చీదరించుకో కుండా చిరునవ్వుతో ప్లేటు అందివ్వాలి. అపుడే సంతృప్తి సంతోషమూను.

ఇతరులు తనను అభిమానించాలి అనే వాంఛ చాల బలీయమైనది. అందుకై ప్రతి వ్యక్తీ అర్రులు చాస్తూ వుంటాడు. అందంగా కనిపించాలని తంటాలు పడుతుంటాడు. డబ్బు ఖర్చుపెట్టి మిత్రులను చేరదీస్తుం టాడు. ఏదైనా పదవి చేజిక్కించు కొని ఇతరుల అభిమానం చూరగొనాలని ప్రయ త్నిస్తాడు.

## యువ వాణి

ఆ యా సందర్భాలలో అతన్ని పరులు అభిమానించినట్లు కనిపించినా, నిజానికి వాళ్లు అతని ధనాన్ని అధికారాన్ని ప్రేమిస్తూ ఉండవచ్చు. అవి అతనికి దూరమైననాడు వాళ్లు గూడ అతనికి దూరం గావచ్చు. అందాన్ని చూచి దరిచేరిన ప్రియురాలు యౌవనం అంతంకాగానే అతనికి దూరం గావచ్చు. సంపద వలన చుట్టూ మూగిన వారు పేదరికంలోకనిపించరు. 'దారిద్ర్యం గుమ్మం గుండా ప్రవేశిస్తే ప్రేమ కిటికీ గుండా పారిపోతుం" దని ఒక ఆంగ్ల సామెత. అలాంటపుడు బాహ్య ఉపకర ణాలతో నిమిత్తం లేకుండా కేవలం వ్యక్తి యొక్క ఆంతరంగిక మైన ఏ గుణం వలన ఇతరు లతన్ని ప్రేమించగలరు?

ఒకడికి ఉద్యోగం కోసం ఇంటర్వ్యూ కార్డు వస్తే మదరాసు వెళ్ళాలని బయలు దేరాడు. తీరా గ్రాండ్ ట్రంక్ నాలుగు గంటలు ఆలస్యమని తెలిసింది. అతడు ఎంతో బాధ పడ్డాడు. ఆలస్యంగా వడు స్తున్న రైలును, రైల్వే డిపార్టుమెంటునూ, నానా మాటలు అన్నాడు. అలాగాక, అదే రైలు సమయానికి వస్తే బెర్తు రిజర్వు చేయించుకొని సుఖంగా ప్రయాణం చేసి రైలు కనిపెట్టిన వాడినీ, డ్రైవరునూ, గార్డును గూడ లోలోపల అభినందిస్తాడు.

ప్రాణం లేని రైలును సహితం దాని పని అది చేసినందుకు మెచ్చుకుంటాము. అదే బండి అడ్డమైన చోట్ల ఆగుతూ గంటలకొద్దీ ఆలస్యమైతే అసహ్యాహించు కుంటాము.

కుమారుడు పరీక్ష తప్పితే కన్న తల్లి గూడ పెదవి విరుస్తుంది. అతడు ప్యాసైతే అతనిలో అన్నీ సద్గుణాలే కనిపిస్తాయి. అందరూ అతనిమీద ప్రేమ వర్షం కురిపి స్తారు.

తన విధి తాను నిర్వర్తించిన నాడు అందరి ప్రేమలను చూరగొంటాడు. అందుకే "నీ పంతువని నీవు చెయ్యి" అందులోనే యావత్తు గౌరవం ఇమిడి యున్నది" అని ఒక ఆంగ్లకవి వ్రాశాడు. అందుచేత విధి నిర్వహణ ప్రేమకు హేతువు అని తోస్తుంది.

"త్యాగము ప్రేమకు ఆలంబనం" అని మరియొక అభిప్రాయంగూడా ఉన్నది. ఒక వ్యక్తి బాధలో వున్నప్పుడు మరొకరు వచ్చి ఆదుకొన్నా, అండగా నిలచినా, అతని మీద మొదటి వ్యక్తికి కృతజ్ఞత ఏర్పడుతుంది. ఈ కృతజ్ఞతయే ప్రేమగా రూపొందడం జరుగుతుంది. ప్రియుడు ప్రేయసి కొరకు ఏదైన త్యాగం చేయడం ఆ త్యాగం ద్వారా ప్రేమ జనించడం సినిమా కథలలో చూస్తూ వుంటాము. ఇది లోకంలో జరిగే విషయం గూడాను. ఐతే ఈ ప్రేమకు

## వినతి

ఓపిక చాలలేదు ఎటకో బడి పోవుదమన్న తీవ్ర సం
తాపము నిండె నీ బ్రతుకు దారుల, తీపి నశించెపోయె నీ
పాప విదూరమైన తిరుపాద సరోరుహ సన్నిధిన్ సదా
కాపుర ముండగా శరణు కావలె నీ విక వేంకటేశ్వరా!

తిరిగితి లోకమంత పలుతీరుల లోకుల వేషధారులన్
తరచితి భేషజ ప్రళయ తాండవశాల లోక మం
చెరిగితి, రంగులన్ దుడిచి యెవ్వరు కన్గొన కుండగా నొకే
వరుగున వచ్చి నీ విమల పాదము లంటితి వేంకటేశ్వరా!

మార్గము చిమ్మ చీకటుల మాసి యథోన్నతమై మనోజ్ఞ నై
సర్గిక రూపు రేఖలు నశించె మరెవ్వరు తోడు లేరు నే
స్వర్గ నికుంజ మంజరుల శయ్యలకో? నరకమ్ములోనికో
నిర్గమ మౌట? నీవె కరుణించి భరింపుము వేంకటేశ్వరా:

పెంచిన పాదులందు కనిపించవు నూతన జీవరాగముల్
సంచిత పూర్వపుణ్యములు చాలక పోయె సుఖాల బాటలో
వంచితమాయె, జీవితము స్వప్న గతమ్మయె భోగభాగ్యముల్
కంచెయె చేనుమేసినను కాచుట కెవ్వరు వేంకటేశ్వరా!

పాపము లెన్నొ చేసితిని, పాపము లేవియు సేయకున్నచో
దీవపు సెమ్మె చేరునెటు దివ్యభవత్కరు ణామృతమ్మునే
పాపము పుణ్యమంచనెడి వాదము నావల తోసి తెప్ప ఈ
ఆపదలేని జీవితము హాయిగ గూర్పుము వేంకటేశ్వరా!

శ్రీ జె. వి. రామమూర్తి

త్యాగం ఒకటే కారణం కాక పోవచ్చు. దాని వెనుక లీలగా కామం గూడ ఉండవచ్చు.

లోకంలో తల్లీ బిడ్డల నడుమ ప్రేమ ఆశ్చర్యకరమైనది. దానికి అదే సాటి. తల్లి బిడ్డను ప్రేమిస్తుంది. భర్తమీద కంటెగూడ బిడ్డమీదనే ప్రేమ అధిక మేమో గూడాను. బిడ్డ గూడ తల్లిని ప్రేమిస్తుంది. ఈ ప్రేమకు హేతువు కామం కాదు. అందం కాదు, విధి నిర్వహణ కాదు. ఇంకా ఏదో అయి ఉండాలి.

బిడ్డ మాతృ గర్భంలో పెరిగే టపుడు గాలితోను, నీటితోను పెరగడం లేదు. కేవలం తల్లి యొక్క రక్తాన్ని బొడ్డు ద్వారా గ్రహించి గర్భస్థ శిశువు పెరుగుతుంది. ఇలా తల్లి శరీరం నుండి బలమును గ్రహించిన బిడ్డకు తల్లిమీద అనిర్వచనీయమైన ప్రేమ, ఆ బిడ్డమీద తల్లికి అవధులు లేని అనురాగం ఏర్పడుతున్నాయి. వీటికి హేతువేమిటి?

ఈ ప్రశ్నకు స్వామి అభేదానంద చెప్పిన నిర్వచనంలో లభిస్తుంది. ఏకత్వము యొక్క వెల్లడింపే ప్రేమ అని వారన్నారు. ఈ నిర్వచనం ప్రకారం ఆలోచిస్తే తల్లీ బిడ్డల నడుమ గల ప్రేమకు ఒక హేతువు కానవస్తుంది. ఇరువురూ ఒకప్పుడు ఒకేశరీరంలో వున్నారు, ఒకే రక్తంతో జీవించారు, ఒకరుగానే వున్నారు, రెండు శరీరాలు విడిపోయినపిదప గూడ వారిలో ప్రేమ ద్వారా "ఏకత్వము' కొన సాగుతున్నది. ఆ "ఏకత్వము' యొక్క వెల్లడింపే ప్రేమ.

నిజమైన స్నేహితులు గూడ అలాగే వుంటారు. "స్నేహితుడు అనగా మరియొక నేను" అని ఒక రచయిత వర్ణించాడు. నేనే అతడు, అతడే నేను అనే భావన కలిగిన వారే స్నేహితులు. స్నేహమునకు ఆలంబనం గూడ ప్రేమే.

వారు తల్లీ బిడ్డలు కానివ్వండి, ప్రేయసీ ప్రియులు కానివ్వండి, గాఢ స్నేహితులు కానివ్వండి, వారి నడుమ ఉండే ప్రేమకు అభేదానందస్వామి చెప్పిన నిర్వచనం వర్తిస్తుంది. ఎదుటి వాడూ తనూ ఒకటే ననే భావనయే ప్రేమకు మూలం. అయితే, అలాంటి భావన ఎందుకు కలుగుతుంది అనేది మౌలికమైన ప్రశ్న. ఇరువురిలోనూ ఒకే "పదార్థం" ఉండటమే ఇందుకు కారణం. తల్లీ బిడ్డల విషయంలో ఈ సంగతి తేటతెల్లమవుతూనే వున్నది. మిగతా వారి విషయంలో అంత స్పష్టంగా తెలియదు. ముఖ్యంగా ఒక మానవుడు ఇతర మానవులను ప్రేమించినపుడు పై హేతువులన్నీ చెప్పుకోవచ్చు. కాని ఒక మానవుడు కుక్కను గాని, గేదెనుగాని జింకనుగాని, చెట్టునుగాని ప్రాణ ప్రదంగా చూచుకుంటాడు. అలాంటి ప్రశ్నకు మూలం ఏమిటి అని ప్రశ్న వచ్చినపుడు ఇరువురిలోను వున్న సమానధర్మమేమిటో గ్రహించ వలసి వుంటుంది.

రెండు ప్రాణులలో వున్న సమాన ధర్మం "ఆత్మ', ఆ ఆత్మ వలననే ప్రేమ ఉదయిస్తున్నది. అందుకే ప్రేమకు ఆత్మీయత అనే పేరు వచ్చి వుండవచ్చు. ఈ సత్యాన్ని ఆత్మజ్ఞానుల జీవితంలో చూడగలం. భగవాన్ రమణ మహర్షి వేరు శనగపప్పులను చేతిలో వుంచుకొని ఒకటి కోతికి, మరొకటి ఉడుతకు, ఇంకొకటి మేకకూ అందిస్తూ ఆనందించేవాడు. ఆ జీవులపై ఆయనకు గల కారణం సర్వత్రా వ్యాపించి యున్న ఆత్మ పదార్థమే.

"ఏకత్వము యొక్క వెల్లడింపే ప్రేమ" అనే నిర్వచనం ప్రకారం ఆలోచించినపుడు అన్ని ప్రశ్నలకు సమాధానం లభిస్తుంది. జన్మించగానే తాను ఏ శరీరంలో నుండి వీడి వడ్డాడో ఆ తల్లిని ప్రేమిస్తున్నాడు. పిదప తన కొరకు త్యాగం చేసిన వారిని ప్రేమిస్తున్నాడు. తన ప్రేమను కుటుంబం వరకు, బంధువుల వరకు, మిత్రుల వరకు విస్తరింప చేస్తున్నాడు. ఆఖరుకు పశు పక్ష్యాదులకు, చెట్టు చేమలకు గూడ తన ప్రేమను విస్తరింప చేస్తున్నాడు. ఆ విధంగా సృష్టియావత్తూ వ్యాపించివున్న ఆత్మతో తాను తాదాత్మ్యం చెందుతున్నాడు. ప్రేమతత్త్వమే ఆత్మతత్వం!

— శ్రీ మన్నవ గిరిధరరావు

# గీతాచార్యుని సలహాలు

గీతాచార్యు డనగా శ్రీకృష్ణపరమాత్మ. దశావతారాల్లో కృష్ణావతారం ప్రత్యేకమైనది, విశిష్టమైనది కూడా. ఆయన వీరుడైన అర్జునుడికి ఉపదేశించిందే గీత. దాని పూర్తి పేరు శ్రీమద్భగవద్గీత. ఇది మహర్షి వేదవ్యాసుడు వ్రాసిన భారతంలో ఉంది. సాక్షాత్తు భగవానుడే దీన్ని ఉపదేశించాడు గదా అందువల్లే ఇది భగవద్గీత అయింది.

సాధారణంగా 'గీత' చాలా క్లిష్టమైన వేదాంత గ్రంథమని ఇది కేవలం యోగులకు, భక్తులకు, వేదాంతులకే నని కొందరనుకుంటారు. కాని ఇది సరి కాదు. ఎందుకంటే గీత సమాజంలోని ప్రతివర్ణంవారికి, అన్నివయసులవారికి ఏది, ఎలా, ఎందుకు ఎప్పుడు చెయ్యాలో చెప్తుంది. ఇప్పుడు గీత- అంటే గీతాచార్యుడైన శ్రీ కృష్ణుడు బాలలకు ఏం చెప్పాడో చూద్దాం.

1. అధైర్యం, నిరుత్సాహం, పిరికితనం విడిచి పెట్టాలి. తన కర్తవ్యం ఏమిటో తెలుసుకోవాలి. పిల్లల కర్తవ్యం బాగా చదువుకోవడమే కదా. చదువు బాగా రావాలంటే శ్రద్ధ, పట్టుదల, ఓపిక గురువుల మీద గౌరవం చాలా చాలా అవసరం.

2. పిల్లలకే కాదు పెద్దలకు కూడా బద్ధకం, నిర్లక్ష్యం, దురభిమానం, గర్వం - కీడు చేసే శత్రువులు, వాటిని ఎప్పుడూ దూరంగా ఉంచాలి. వీటికి లొంగితే ఎన్నో కష్టాలు కలుగుతాయి.

3. ఎల్లప్పుడు భయపడడం, అనుమానపడడం మంచిది కాదు. ధైర్యే సాహసే లక్ష్మీః అనే విషయం మీకు తెలిసిందే కదా.

4. తల్లి దండ్రుల తర్వాత అంత గొప్ప స్థానం, జ్ఞానాన్ని ప్రసాదించే గురువుదే. మంచి గురువు దొరకడం ఓ అదృష్టమనే చెప్పాలి.

5. దేన్ని గురించి దుఃఖపడాలో, దాన్ని గురించే దుఃఖపడాలి. నశించిపోయే వాటిని గురించి, జరిగిపోయిన వాటిని గురించి బాధపడడం వృథా.

6. సుఖం, దుఃఖం - అందరికీ కలుగుతూ ఉంటాయి. దుఃఖం ఎప్పుడూ ఉండిపోదు. సుఖాన్ని చూసి మురిసిపోకూడదు. రెంటినీ సమానంగా చూడాలి.

7. మోక్షం అంటే తిరిగి జన్మ లేకపోవడం. మోక్షం కలిగితే తిరిగి ఈ ప్రపంచంలోకి రానక్కరలేదు. దీన్ని పొందడానికి కులం, జాతి, మతం అడ్డురావు.

8. సోమరితనం అజ్ఞానానికి మొదటి మెట్టు. సమాజానికి సోమరివాళ్ళు (బద్ధకస్తులు) పెద్ద బరువుల్లాంటి వాళ్ళు.

9. దేవుడు అంతటా ఉన్నాడు. మనకి ఏదైతే బాధ కలిగిస్తుందో, అదే ఇతరులకూ బాధ కలిగిస్తుంది. అందుకే మనం ఇతరుల్లో కూడా దేవుడున్నాడని భావించాలి. అలా భావిస్తే, ఇతరులను మనం బాధ పెట్టము.

10. ప్రతివాడు తన పనుల్ని మనస్ఫూర్తిగా చివరి వరకూ ఉత్సాహంగా చేయాలి.

11. కర్తవ్య నిర్వహణలో బంధుప్రీతి ఉండరాదు. శ్రీకృష్ణుడు అర్జునుని మనస్సులో కలిగిన ఇలాంటి మోహాన్ని తొలగించి అతన్ని ఉత్సాహ పరచడానికే గీత ఉపదేశించాడు.

12. స్వార్థము అనేది అనర్థాలకు మూలం. స్వార్థపరుడు ఎంతకైనా తెగిస్తాడు. తన వాళ్ళకైనా సరే, హాని చెయ్యడానికి తయారవుతాడు. అందుకే స్వార్థం వదిలెయ్యాలి. ఇతరులకు మేలు చేస్తేనే మనం మనుష్యుల మనిపించు కుంటాం.

13. మంచి పనులు చేస్తే మంచి ఫలితాలూ, చెడు పనులు చేస్తే చెడు ఫలితాలు కలుగుతాయి.

14. గీతాచార్యుని అతి ముఖ్యమైన సలహా ఇది; ఏపని చేసినా ఫలాపేక్ష రహితంగా. అంటే దాని ఫలితాన్ని కేవలం అనుకూలంగా ఊహించుకొని చేయరాదు. ఇది నా కర్తవ్యం. మనస్ఫూర్తిగా చెయ్యాలి అని అనుకుని, చేస్తే సత్ఫలితం తప్పక కలుగుతుంది.

15. తపస్సు ఏ అడివికో పోయి ఒంటరిగా కూర్చొనే చెయ్యక్కర్లేదు. ఇంట్లో ఉండే, ప్రపంచముతో సంబంధం ఉంచుకొనే, తామరాకు మీద నీటి బొట్టులా, ఉంటే చాలు.

16. చదువువల్ల విచక్షణాజ్ఞానం కలగాలి. వినయ విధేయతలు పెరగాలి. ఏది, ఎప్పుడు, ఎలా, చెయ్యాలో తెలియాలి. ఇవి కలగని పక్షంలో ఆ చదువులు వ్యర్థం అనర్థం కూడా.

17. ఎంత తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవాలనే కోరిక ఇంకా ఇంకా పెరుగుతూ ఉండాలి. జ్ఞానానికి అంతు లేదు కదా. అన్నీ తెలుసునని భావించేవాడు, అంతా వచ్చని మిడిసి పడేవాడు మూర్ఖుడని అంటారు. ఎన్ని నేర్చుకున్నా నిండు కుండలాగా తొణకకుండా ఉండాలి.

18. తృప్తి కలవాడే నిజంగా సుఖపడతాడు. కోరికల్ని అదుపులో ఉంచుకోవాలి. ఆశకు అంతు ఉండదు కదా!

19. తన కోపమే తన శత్రువు. కోపం వల్ల మోహం, మోహం వల్ల భ్రమ, భ్రమ వల్ల సర్వనాశనం కలుగుతాయి. కాని

అన్యాయం, అక్రమాలమీద, దుర్మార్గుల మీద కోపం చూపించడం తప్పు కాదు.

20. భగవంతుని ధ్యానం అనేది అన్ని వయస్సుల్లోనూ చెయ్యాలి. అంతే కాని 'ముసలితనంలోనే భక్తి' అని అనుకోవడం చాలా తప్పు. ప్రహ్లాదుడు, ధ్రువుడు, బాల్యంలోనే భక్తిని పెంపొందించుకొని ధన్యజీవులైనారు కదా.

21. ప్రతి మనిషికీ త్యాగబుద్ధి, సేవానిరతి చాలా అవసరం.

22. "హింస" ఎప్పుడూ చేయకూడని పని. మనుష్యుల్నే కాదు ఏ ప్రాణినీ హింసించరాదు. కష్టపెట్టరాదు. అహింసా పరమో ధర్మః –

23. ఒకరికి పెట్టడంలో ఉన్న ఆనందం, దేనిలోనూ ఉండదు.

24. అసూయ అనేది ఒక పెద్ద జబ్బు. భారత యుద్ధానికి ఈ అసూయే నాంది.

25. మంచి ఎవరు చెప్పినా, ఎక్కడ ఉన్నా సహృదయంతో మనం తీసుకోవాలి.

26. అందరూ ఆ పరమాత్ముని బిడ్డలే. ఆయనకు ఏ ఒక్కరియందూ ప్రత్యేకమైన ప్రేమగానీ, ద్వేషముగానీ లేదు.

27. సాత్త్వికాహారము మనలో సత్త్వగుణాల్ని పెంపొందిస్తుంది.

28. జ్ఞానికి అందరూ మిత్రులే. వీరిలో సమభావం ఉంటుంది.

29. అభ్యాసమువలన మనసును వశపరచుకోవచ్చు.(సాధనమున పనులు సమకూరు ధరలోన అని వేమన చెప్పాడు గదా.)

30. తప్పు చేయడం సహజం, కాని ఆ తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడి తిరిగి చెయ్యకపోవటమే నిజమైన మనిషి లక్షణం.

31. తన్ను తాను పొగడుకొనుట, మాటలతో చేతలతో ఇతరులను బాధపెట్టుట, ఓర్పు లేకుండుట, నిగ్రహం కోల్పోవుట అజ్ఞానుల లక్షణాలు.

32. చావుకు భయపడరాదు. అది ఒక తప్పని సరి అయిన మార్పు. సహజమైనది అది. దీర్ఘమైన నిద్రలాంటిది మరణం.

ఇలా రాస్తున్న కొద్దీ ఉంటాయి గీతాచార్యుని అమూల్యమైన సలహాలు. సముద్రంలో ఎంతలోతుకు దిగితే అన్ని అమూల్యమైన రత్నాలు దొరుకుతాయంటారు. అలాగే ఈ "గీత"లో గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు ఎన్నో, ఎన్నెన్నో గొప్పవైన విషయాలు చెప్పాడు. శ్రద్ధతో, నమ్మకంతో చదివేవారికే అవి గోచరిస్తాయి. తరచి చూసిన కొద్దీ అవి మనకు లభిస్తాయి. ఎందరెందరో మహానుభావులు శ్రీమద్భగవద్గీతకు వ్యాఖ్యానాలు ఎన్నెన్నో భాషల్లో వ్రాసారు.

పైన తెలియజేసిన వాటిలో ఏ కొన్నిటినైనా, కనీసం ఏ ఒకటో రెండో అయినా జీవితంలో అమలుపరిస్తే నేటి బాలురే రేపటి గొప్పవారుగా మారుతారు.

బాలలకు పై విషయాల్ని అర్థమయ్యేలా చెప్పటం, ఆచరించి చూపడం పెద్దల కర్తవ్యంకూడా.

— శ్రీమతి ఎం. పద్మశ్రీ

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం, శ్రీనివాసమంగాపురం.

శ్రీనివాసమంగాపురంలోని శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయంలో జరుగు నిత్య కల్యాణోత్సవం. అభిషేకం. నిత్యఅర్చన వివరాలను యాత్రికుల సౌకర్యార్థం ప్రచురిస్తున్నాము.

**నిత్యకల్యాణోత్సవం :**

నిత్యకల్యాణోత్సవసేవ ప్రతిరోజూ ఉదయం 10-30 నుంచి 12.00 గంటలవరకూ జరుగుతుంది. ఈ సేవకు 150 రూ॥లు చెల్లించాలి. పదిమంది వ్యక్తులను ఈ సేవలో పాల్గొంటానికి అనుమతిస్తారు. గృహస్థుకు వస్త్రబహుమానం వుంటుంది.

**అభిషేకం :**

ప్రతి శుక్రవారం అభిషేకసేవ జరుగుతుంది. (ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు) అభిషేకం చేయించేవారు 100 రూ॥లు చెల్లించాలి. ఇద్దరు వ్యక్తుల్ని ఈ సేవలో పాల్గొనటానికి అనుమతిస్తారు.

**నిత్యఅర్చన :**

నిత్యఅర్చనసేవ సంవత్సరకాలమూ ప్రతిరోజూ వుంటుంది. ఈ సేవ చేయించదలచినవారు 42రూ॥లు చెల్లించాలి.

# శ్రీకృష్ణ జననము - యోగ రహస్యము

భగవాన్ శ్రీకృష్ణ జననమునకు ముందు దేవకి గర్భమున జన్మించిన సప్త సంతానములను వధించటం జరుగుతుంది. కానీ అష్టమ గర్భమున జన్మించిన కృష్ణుడు మాత్రం కంసుని చేతికి చిక్కకుండా పోతాడు. అష్టాదశ పురాణ నిర్మాతయైన వేదవ్యాసుడు, ఇటువంటి మనోహరమైన ఇతివృత్తాన్ని అత్యంత ఆకర్షణీయంగా తీర్చి దిద్దటం జరిగింది. వ్యాస భాగవతాను సారం శ్రీకృష్ణ జననమునకు పూర్వం కృష్ణ సోదరిని కంసుడు హత్య చెయ్యటం జరుగుతుంది. శ్రీకృష్ణ జననమునకు ముందు సోదరి - సోదరు లెవ్వరు నిజానికి? అనే సంశయం మనకు కలుగుతుంది? నిజానికి వారెవ్వరు? బాగా యోచిస్తే మనకు దొరికే జవాబు ఇది-"యమం,నియమం, ఆసనం, ప్రాణాయామం,ప్రత్యాహారము,ధ్యానము, ధారణము, సమాధి" అను ఈ ఎనిమది దేవకీ వసుదేవుల అష్టమ సంతానములు. ఈ రీతిన మనం బాగా యోచిస్తే ఈ అంతిమ సంతానం శ్రీ కృష్ణుడు ఎవ్వరు?—యోగ శ్రేష్ఠుడు. ఎప్పుడూ సమాధి అవస్థయందుం టాడు. సంస్కృతములో సమాధి శబ్దములో "పుం లింగము" యోగ శాస్త్రానుసారం సాధకుని యొక్క అష్టమ అవస్థ "సమాధి" యే, యోగేశ్వరుడైన పరమాత్మ శ్రీకృష్ణ డని చెప్పక తప్పదు. సమాధి అవస్థకి ముందు "ధారణ" వస్తుంది. ఈ 'ధారణ' స్త్రీ లింగ శబ్దము. ధారణ స్త్రీ లింగ శబ్దమై నందున శ్రీకృష్ణునికి ముందు, ధారణ రూపిణీయైన కృష్ణ సోదరిని కంసుడు హత్య చెయ్యటం జరుగుతుంది, ఈ "ధారణావస్థ" సమాప్తం కానిదే సమాధి రూపియైన కృష్ణుడు ఎట్లా అవతరిస్తాడు? వ్యాసమహర్షి ప్రతిపాదించిన గోపాలకృష్ణుడు ఎనిమిదవ వాడే ఎందుకుండాలి? ఈ రహస్యాన్ని అర్థం చేసుకుంటే, మనకు ఆశ్చర్యం కలుగదు.

సమాధి అవస్థ యందు లీనమైన యోగి యొక్క చిత్తము, విశ్వమంతా వ్యాప్తి చెంది యుండుటచే జగత్తు నందలి ప్రతి అణువులోని అతీంద్రియ శక్తులను ఆకర్షించుతూ ఉండటం జరుగుతుంది. అసలు కృష్ణ శబ్దానికి అర్థం సంస్కృతభాషలో ఇట్లా



నిర్వచిస్తారు-"కర్షతి ఇతి కృష్ణః" అనగా (దివ్యశక్తులను) నిరంతరం ఆకర్షించు వాడు కృష్ణుడు. శ్రీ కృష్ణుని తల్లిదండ్రులు దేవకీ వసుదేవులు. యోగ మార్గం కొఱకు, యోగ పిండం మరియు జీవాత్మ నిరంతరం దైవత్వంలో లీనమైనపుడు, సాధకుని యొక్క తండ్రి వసుదేవుడు కాక, మరెవ్వ రౌతారు?

జన్మించిన తరువాత అర్ధరాత్రి శ్రీకృష్ణుని ఒక బుట్టలో నుంచి నల్లని యమునను దాటి నందుని ఇంటికి ఎందుకు తీసుకు వెళ్లినట్లు?—గోకులంలో (రేపల్లె) యశోదా నందులు శ్రీకృష్ణునియొక్క నూతన తల్లిదండ్రుల వర్ణన జరుగుతుంది. ఇక్కడ 'నంద' శబ్దానికి 'ఆ' విశేషణాన్ని జోడిస్తే 'ఆనంద' శబ్దం అవతరిస్తుంది. 'ఆనంద' శబ్దము యొక్క పూర్వ స్థానమైన 'నంద' శబ్దములో కలిసి పోవటం జరుగుతుంది. ఆనందం కొఱకు మానవునకు బాహ్యావస్థలు అవసర మౌతాయి. దీనిపై "నంద" అవస్థ సాధకుని యొక్క మనస్సులో స్వతహాగా ఉత్పన్న మౌతుంది. ఈ "నంద" అవస్థ కారణం చేత యోగి తన యొక్క జీవితంలో ఆధ్యాత్మిక ఫలితాన్ని పొందటం జరుగుతుంది. శ్రీకృష్ణ యోగ మార్గంలో ప్రవేశం పొందటం చేత సాధకునియొక్క తల్లి దండ్రులు యశోదానందులు కాక మరెవ్వ రౌతారు? స్వతహాగా ఆనందం పొందిన "నందుడు" యశస్సును పొందిన సాధన అవస్థయే "యశోద."

మనం దీర్ఘంగా యోచిస్తే ఇది విచిత్ర మౌతుంది. "భగవాన్ శ్రీకృష్ణుని" అర్ధ రాత్రిపూట 'యమున' ను దాటించడం జరుగుతుంది కదా? ఇందులో ఏమైనా యోగ రహస్యం ఇమిడి ఉన్నదా? వ్యాస భగవానుడు శ్రీకృష్ణ భగవానుని జీవన చరిత్రలోని ఘట్టములను రాజయోగిగా మలచి మన ముందు సాక్షాత్కరింప చేస్తాడు. అసలు శ్రీకృష్ణ జన్మ అర్ధరాత్రియే ఎందుకు జరగాలి? ఈ ప్రశ్నకు సమాధానం ఇట్లా చెప్పుకోవచ్చు. "విశ్వమంతా ఆదమరచి హాయిగా నిదురించే వేళలో యోగి మాత్రం జాగ్రదవస్థలో ఉంటాడు. భగవద్గీతలో స్పష్టంగా ఈ విషయం చెప్పబడింది- "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగ్రతి సంయమీ" — నిసి రాత్రివేళ ప్రశాంత వేళలో యోగి తన

చిత్తాన్ని ఏకాగ్రత చేసి విశ్వ మందలి శక్తులన్నిటిని స్వతహాగా ఆకర్షించటం జరుగుతుంది. "కర్షతి-ఇతి కృష్ణః" ఈ రహస్యం మనకు స్పష్టమౌతుంది. వ్యాసుల వారు, యోగి యొక్క మహాకర్ష ణావస్థను కృష్ణుడన్నారు. యోగి యొక్క చిత్తంలో ఈ కృష్ణావస్థ అర్ధరాత్రి జన్మిం చడం జరుగుతుంది. కావుననే శ్రీకృష్ణ జన్మ అర్ధరాత్రి జరిగిందని భాగవతంలో చెప్ప బడినది.

"యమున" అనగా ఇక్కడ మనకు "సుషుమ్నానాడి" అని అర్థం ధ్వనించు తుంది. ఈ యమున అనెడి "సుషుమ్న"ను దాటకుండా "మధురా" వాసి ఐన కృష్ణావస్థ నందుని ఇల్లు చేరలేదు. "సుషుమ్న" నాడిని దాటిన యోగి ఏ విధంగా నైతే వర్ణింప నలవి కాని స్వానం దాను భూతిలో పొందే లాభాన్ని, వ్యాస మహర్షి, కృష్ణుని తండ్రి నందుడని నిర్వ హించడం జరిగింది. అంతేకాదు కృష్ణుని గోపాలకృష్ణుడని గూడా పలకడం జరి గింది. "గో" అనగా గోవు పొదుగు (స్తనము) నుండి అమృతమయమైన క్షీరాన్ని గ్రోలే వానిని గోపాలురని అంటారు. తమ తమ పంచేంద్రియాలను అదుపులో నుంచుకొని అనుభవ రూపం లోని స్తనం (పొదుగు) నుండి దివ్యామృత రసాన్ని గ్రోలే యోగి శ్రేష్ఠుడు గోపాలుడు కాక మరెవ్వరౌతారు! చాలామంది తర్కించు కొంటూ ఉంటారు—గోపాలకృష్ణుడు ఏ జాతివాడు? గోపాలుడా? లేక పరమ యోగియా? జీవితాన్ని యోగమార్గంలో మథించనిది, యోగి జీవితంలో ఉన్నత స్థానం ఎట్లా ప్రాప్తిస్తుంది. ఈ ప్రకారంగా యోగమార్గంలో మథించిన స్థానం 'మధుర' యే నందుని నగరం మధురా నగర మన బడుతుంది. ఇక్కడ మనం యోచించ వలసిన విషయం ఒకటుంది—యమునకి ఉపద్రవం ఎందు కొస్తుంది? నిశిరాత్రియే వర్షం ఎందుకు రావాలి? "సుషుమ్న"ను దాటే యోగికి ఈ అనుభవాలు వ్యక్త మౌతాయి. సుషుమ్నావస్థను దాటేటపుడు సాంసారిక శక్తులన్నీ తీవ్ర రూపం దాల్చి, ఎదురు తిరగటం జరుగుతుంది. ఈ ప్రకారం విశ్వ మందలి దివ్యశక్తులు ఎదురు తిరిగి "యమున" అనెడి "సుషుమ్న"ను దాటే సమయంలో, ఉత్పన్నమయ్యే జలవృష్టి మరియు వాయువే నిశిరాత్రి వర్షించే గాలి వాన యని చెప్పుకోవాలి.

దీర్ఘంగా యోచిస్తే మనకు ఈ యోచన వస్తుంది. మామ యైన కంసుడు కృష్ణుని చంప పూనటం, వారి అనుంగు బంధువు లను చంపటం ఎందులకు? అని. సంస్కృ తంలో కంస శబ్దమునకు అర్థం నరకుట (వధించుట) యని. వ్యాసమహర్షి "స" శబ్దమునకు ముందువచ్చే అను స్వారమునకు "క" నుచేర్చి "కంస" శబ్దమును సృష్టిం చడం జరిగింది. ఈరీతిన మనం ఇతర శబ్దములను గూడా గమనింపవచ్చు. "హింస" శబ్దమునుండి "సింహ", "రవి" శబ్దమునుండి "వీర" ఇత్యాదివన్ని ఇట్లా సృష్టించడం జరిగింది. ఈ 'కంస' శబ్దము నుండియే, "కసాయి" శబ్దము ఉత్పత్తి జరిగింది. "కసాయి" పని ఏమిటి? అస్తి త్వాన్ని (శరీరాన్ని) నరకడం లేక చంపడం. తదనంతరం సాధకుని యొక్క చిత్తమునందు ఉత్తమ ప్రవృత్తులు ఉత్పన్నమవుతాయి. ఇవే సాధకులలో అన్య ప్రవృత్తుల ద్వారా ఎదురింపబడుతాయి. ఆ తరువాత నరకబడుతాయి. ప్రతిసాధకుని అంతఃకరణ మందునూ ఈలాంటి కంసుడు నివాసం ఏర్పరచుకొని యుంటాడు. దైవ త్వాన్ని చంపేదానికి ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. ఇటువంటి చెడుగుణాలను, మనం "కంసమామ" రూపంలో చూస్తాము. శ్రేష్ఠుడైన సాధకుడు కృష్ణుడనిపించుకుం టాడు. ఈ అవగుణాలకు సమూలంగా నాశ నం చేస్తాడు. శ్రీకృష్ణుని లాంటి సాధకులు హృదయ మనెడి సింహాసనంపై వర్ధిల్లే "కంసమామ"ను క్రిందికి త్రోసి వధించ డం జరుగు తుంది. ఇదియే శ్రీకృష్ణుని యొక్క జనన రహస్యం.

— శ్రీ ఎ. రామసుబ్బారెడ్డి

మాతృదేవో భవ  పితృదేవో భవ
ఆచార్యదేవో భవ  అతిథిదేవో భవ.

అను నాలుగు సూక్తులు భారతజాతికి మూలభూతములు. అందు దేవతామూర్తులలో మాతృమూర్తియే ప్రథమమున ఉపాసింపబడి యున్నది. అట్టి మాతృమూర్తికి ఉపరూపమే గోమాతరూపము. ఇట్టి గోమాతయే భారతీయతకు ప్రధాన చిహ్నము. హిందూధర్మమునకు ప్రతిరూపము. భారతదేశముయొక్క ఆర్థిక సౌష్ఠవమునకు మూలభూతమనియు, భారతీయ ధర్మములకు ఆదర్శమనియు వేదములు, ఇతిహాసాది పురాణములు వేనోళ్ల పొగడినవి. వేద యుగములో గోవుల యెడల సమాజము ప్రకటించిన భక్తిప్రపత్తులు నేటికినీ "గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తాః సుఖినో భవంతు" అని దైనందిన ప్రార్థన రూపమున ప్రతి హిందువుని ఉత్తేజితుని జేసి మేల్కొలుపుచున్నది. ఇట్లు ప్రత్యేకముగా గోబ్రాహ్మణుల క్షేమమును గూర్చి ప్రార్థించుటలో అంతర్యమేమి? సమాజ సంక్షేమమునకు, అభ్యుదయమునకు, సంస్కృతికి, గోవు, బ్రాహ్మణులు చిహ్నములు. వీరిరువురి క్షేమమును బట్టి సమాజము యొక్క జీవన స్థాయి ఆధారపడి యున్నది. వీరిరువురు ఏ తృణమో పణమో లభించిన దానితో ఉదరపోషణ చేసుకుంటూ సమాజము కొరకు జీవించి కష్టించి తమ సర్వశక్తులను సమాజార్పణము చేసి గతించుచున్నారు.

శ్రుతులు గోవును కామధేనువుతో సమానముగా వర్ణించియున్నవి. ఇట్టి ధేనువుకు ఋగ్వేదము అపరభాగమని, యజుర్వేదము మధ్యభాగమని, సామ వేదము పూర్వభాగమని వర్ణించి యుండుటచే వేదత్రయ స్వరూపిణి అయినది. అంతేగాక దీనికి నిష్ఠాపూర్తమే కొమ్ములుగా, సాధుసూక్తములే రోమములుగా, శాంతి పుష్టి అనునవి మల మూత్రములుగా, ఈ గోవు యొక్క నాలుగు స్తనములు స్వాహా, స్వధా, వషట్, హుంకారములనియు, వాని ద్వారా దేవ, పితృకార్యములకు మునులు, మనుజులకు నాప్యాయనము జేయుచుండుననియు, అట్లు చేయుటకు మూలభూతమైన గోవును పూజించి, సేవించని గృహస్థుడు అంధతామిస్ర నరకమును పొందునని తెలిపి యున్నారు.

సృష్టికర్తయగు బ్రహ్మ భగవానుడే మూపురమనియు రక్షణ శాఖాధిపతి యగు విష్ణువు కంఠభాగమనియు, సంహారమూర్తి యగు శివుడు ముఖభాగమనియు, ఇతర దేవతలు కళేబరముగాను, మహాపురుషులు రోమములుగను, మహానాగులే తోకలనియు, కుల పర్వతములే డెక్కలుగను, గంగాది సర్వతీర్థములు మూత్రముగను, సూర్య చంద్రులు నేత్రములుగను, ఇంద్రయము లిరువురు రొమ్ము భాగముగను, మహాలక్ష్మియే గోమయమనియు, స్కందుడు




ముక్కుదండి అనియు, అశ్వినీకుమారులు ముక్కు రంధ్రములుగను తీర్థరాజు లలాటముగను, సరస్వతి మెడగను, సనక, సనందన, సనత్కుమారులు కడుపుభాగముగను, పాలయందు సరస్వతి, పెరుగునందు నర్మద, నేతియందు అగ్ని మున్నగు దేవతలు కలరనియు, దేవగణము నంతను పూజించవలెనన్న గోమాతను పూజించిన చాలునని తెలుపబడినది. గోప్రదక్షిణ మాచరించినచో భూలోకాదు లన్నియు ప్రదక్షిణ మాచరించినట్లును, గోదాన మొనర్చినచో స్వర్గసౌఖ్యములు పొందగలరనియు, మహాభారతకర్త వ్యాసభగవానుడే తెలిపెను. పవిత్రపుణ్యనదీ స్నానఫలము కొరకై గోమయోదకముతో స్నానము చేయుట ఉత్తమము. మోక్షప్రాప్తికొరకై ఆచరించు భగవదారాధనకై పంచామృతము లావశ్యకములని మహాభారత అనుశాసనిక పర్వము నందు తెలుపబడియున్నది. శరీర శుద్ధికి పాప పంకిలమునకు పంచగవ్యము లను త్రాగవలెను.

**ఆవుపాలు**

"గవ్యం తు జీవనీయం రసాయనం, క్షతక్షీణహితం మేధ్యం, బల్యం, స్తన్యకరం పరం, భ్రమ శ్రమ, మదాఽలక్ష్మీశ్వాస కాసాది తృట్ క్షుధా జీర్ణజ్వరం మూత్ర కృచ్ఛ్రం, రక్తపిత్తం చ నాశయేత్" అని చెప్పుటచేత దెబ్బలు తిన్నవారికి, మేధాశక్తి కొరవడినవారికి, బలహీనులకు, చనుబాలు తగ్గినవారికి జీర్ణజ్వర మూత్ర కృచ్ఛ్ర రక్తపిత్త రోగులకున్నూ ఎంతేని పహకరించును. సాధారణముగా సజీవమగు ఆహారపదార్థములుగల, ఆకులు, పచ్చిక, తౌడు, మొదలగువాని భక్షణద్వారా సూర్యకిరణ ప్రసారముచే సూర్యాంశలు వాటి యందు ఉండుటచే ఎ, బి, సి, డి, ఇ అను విటమినులు కాచని పాల యందు ఉండునని ఆంగ్లేయ సిద్ధాంతము- ఈ విషయమును ప్రాచీన కాలమందే నిర్ణయించిరి. అపుడే పితుకబడి వేడి చల్లారకముందే పాలను ఉష్ణధారలతో త్రాగినచో రోగవిముక్తి ఆరోగ్యరక్షణ చేకూరును. పై జీవకృతులు పాలయందు అధికముగా కావలెనన్నచో ఆవులు బాగా ఎండలోను, గాలిలోను, స్వేచ్ఛగానూ సంచరించవలెను. ఇరుకు ప్రదేశములందు బంధించరాదు. అందుకే మన పూర్వులు ఆలమందలకై పచ్చికబయళ్ళను విస్తారముగా నేర్పరచి, స్వేచ్ఛగా వాటిని వదలిపెట్టెడి వారు. విశాలములగు గోశాలలను గూడ ఏర్పరచిరి. అంతియేగాక మంచి వృషభ సంతతిని గల్గించి దేశమునుండి దరిద్రదేవతను పారద్రోలుటచే "అలక్ష్మీం నాశయేత్" దరిద్రమును నశింపజేయును అని పెద్దలు వక్కాణించి యున్నారు.

ప్రాతర్దర్శి చ వృషభం
కళ్యాణం చ ఫలప్రదమ్,
ఐశ్వర్యం లభతే నిత్యం
శంకరస్యానువాహనమ్.

ప్రాతఃకాలమున వృషభ దర్శనము చేసి నచో కళ్యాణ దాయకము శుభవలప్రదమగు ననియు, అట్టివారు ఐశ్వర్యవంతులగుదు రని ఈశ్వర వాహన మగుటచేత శంకరుని అనుగ్రహమునకు పాత్రులగుదురని తెలిపి యున్నారు.

గోవులయొక్క వర్ణమును బట్టి గూడ క్షీర గుణమును నిర్ణయించవచ్చును. తెల్ల ఆవు పాలు వాతమును, నల్ల ఆవు పాలు పిత్త మును, ఎఱ్ఱ ఆవు పాలు కఫమును పోగొ ట్టును. చారలు గలది, వీర్యవృద్ధి కలి గించును. ఉదరరోగులకు మంచి హితకారి. కపిల వర్ణము గల గోవుపాలు వీర్యపుష్టి దోషత్రయనాశకము- నేత్రములకు హిత కారియైయుండును. నిడుపగు కొమ్ములు గల్గిన ఆవు పాలు ముసలివారికి, గుండె జబ్బుగల వారికి మంచిది. బోడి తల గల్గి పొట్టిగానున్న ఆవు పాలు వాత పిత్తము లను పోగొట్టి వీర్యవృద్ధి కల్గించును. ఇది గాక గోవులకు మనము వేసెడి ఆహారపదార్థ ములను బట్టి కూడ పాలయొక్క గుణమును నిర్ణయింపవచ్చును. తెలగపిండి, కుడితి, ఎండుగడ్డి తిను ఆవు పాలు కఫమును పెంచును, శూలను కల్గించును. ప్రత్తిగింజలు తిను ఆవుపాలు వాతమును పెంచును, పథ్యమునకు పనికిరాదు. ఎండుగడ్డి, పచ్చ గడ్డి, జనుము, తౌడు తిను ఆవుపాలు ఏ దోషములేక పుష్టిని గల్గించును. శ్రేష్ఠమై నది. కుడితి, నీరు, అధికముగా త్రాగునట్టి ఆవుపాలు పడిశెము గల్గించును. అజీర్తిని పెంచును.

మొదటి ఈత ఆవు పాలు బలము, తేజస్సు, వీర్యవృద్ధి, కల్గించును. రెండవ ఈత ఆవు పాలు వాతమును హరించును. బలవర్ధకము. మూడవ ఈత ఆవు పాలు శ్లేష్మవాతములను పోగొట్టి, శరీరమునకు రంగు కల్గించును. నాల్గవ ఈత ఆవు పాలు వాత పిత్త శ్లేష్మములను హరించును. అంత కంటె ఎక్కువ ఈతలుగల ఆవు పాలు దోష ప్రదములు. లేగటి ఆవు పాలు వాతము, తరిపి ఆవు పాలు వేడిని కల్గించును. "క్షీరం సద్యః ప్రసూతాయాః పీయూషమితికథ్యతే" అని చెప్పబడియుండుటచే అమృతముతో సమానమైన గుణముగలవి అపుడే ఈనిన ఆవు పాలు, కాని ఆహర విహారాదు లనుబట్టి, వయస్సును బట్టి, ఈతలను బట్టి, ఆవు పాల యొక్క గుణములను నిర్ణయించిరి. ఆవు ఈనిన 40 దినములు తర్వాతనే పాలు శ్రేష్ఠమైనవిగా పెద్దలు వక్కాణించిరి. వేడి ప్రకృతి గలవారికి ఆవు పాలు మంచివికావు. అట్టివారు సేవించినచో శరీరమంతయు గడ్డలు, గజ్జి మొ॥ చర్మరోగములుకల్గును. పైత్యము ప్రకోపించును.

అతిసారే జ్వరే దాహే
శ్వయథౌచ విధీయతే,
యోనిశుక్రప్రదోషేషు
మూత్రేషు ప్రదరేషు చ,
నశ్యతేవ అవగాహేషు
వమనాస్థాపనేషు చ,
విరేచనే స్నేహనే చ
పయః సర్వత్ర యుజ్యతే.

అని చెప్పబడి యుండుటచేత యోని శుక్ర రోగముల యందే కాకుండా నస్యకర్మ, వస్తి కర్మ, రేచన, స్నేహన, కర్మలయందును అనేక విధములుగా ఉపయోగపడుచున్నది. ఈ పాలనుగూర్చి వేదములలోను, దైవాభి షేక సమయమునందును, "అప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమవృష్ణియం, భవా వాజస్య సంగథే '' అని పొగడియున్నారు.

## పెరుగు

దీనినిగూర్చి ఆయుర్వేద ధన్వంతరి.

"దధిస్యాత్ శీతలంచోష్ణం
శమనం రక్తపిత్తజిత్,
వపుర్వృద్ధికరం వృష్యం
ప్రమేహం కామలాం జయేత్."

పెరుగు మధురమైన రుచితో పిత్తమును, తాపమును పోగొట్టి కొద్దిగా వేడిని కల్గించి శరీరమునకు బల పుష్టికాంతులను ప్రసాదించి జఠరాగ్నిని పెంచుచు కఫమునుకల్గించును. ప్రమేహ, కామలా నాశకమును అయి ఉన్నది అని పేర్కొనెను. అట్లే ప్రాచీన వైద్యుడు వాగ్భటాచార్యులుకూడ.

"మేదశుక్రబల శ్లేష్మ
పిత్తరక్తాగ్నిశోషకృత్,
రోచిష్ణు శస్తమరుచే
శీతకే విషమజ్వరే,
పీనసే మూత్రకృచ్ఛ్రే చ
రూక్షంత గ్రహణీ గదే.

మూత్రకృచ్ఛ్రాది రోగములు, గ్రహణీ మున్నగు వానిని నశింపజేసి విషమ జ్వరా దులలో ప్రత్యేకగుణదాయిని అని చెప్పి యున్నారు. పెరుగు భగవంతుని అభి షేకమునకు ఉపయోగించు సందర్భమున "దధిక్రావణ్ణో అకారిషం, జిష్ణోరశ్వస్యవాజి నః సురభినోముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్ '' అని కొనియాడబడినది. దీని వెన్నను గూర్చి ప్రాచీన ఆయుర్వేదా చార్యులు.

"నవనీతం నవం వృష్యం
శీతం వర్ణబలాగ్ని కృత్‌గ్రాహి
వాతపిత్తాసృక్, క్షయార్శార్దిత
కాసజిత్ శీతం స్వాదు
కషాయామ్లం నవనీతం
నవోద్ధృతం చక్షుష్యం
బాలవృద్ధానాం ప్రశస్తం
సౌకుమార్యకం।

వెన్న తెల్లగా కొద్దిగా పసుపుదనముకల్గి ఆయువును, వీర్యమును, ధాతువులను, పుష్టిని, చల్లదనమును కల్గించి, వాతపిత్త నేత్రరోగములను పోగొట్టును. బాలురకు వృద్ధులకు అనుకూలము. క్షయ, గ్రహణీ, తాపము, వేడి వలన గలుగు కాస రోగములను పోగొట్టి అగ్ని దీప్తిని కలిగించి కాంతి దాయకమై యుండును, అని తెలిపిరి. దీనిని శరీరముపై మర్దనచేయుట, లోపలికి భక్షించుటవల్లను, బాలలకు కలి గెడి అస్థిమార్దవరోగము దూరమగును.

## ఘృతము

(నెయ్యి) దీనిని గూర్చి ప్రాచీనాయు ర్వేదాచార్యులు "ఘృతం పిత్తానిలహరం రసశుక్రౌజసాం హితం నిర్వాపణం మృదు కరం స్వరవర్ణప్రసాదకం శస్తం ధీస్మృతి

మేధాగ్నిబలాయుశ్శుక్ర చక్షుషాం బాల వృద్ధ ప్రజా కాంతిసౌకుమార్యస్వరార్థినాం। క్షతక్షీణ పరిసర్పశస్త్రాగ్నిగ్లపితాత్మనాం వాతపిత్త విషోన్మాద శోషాలక్ష్మి జ్వరావ హం స్నేహానాం ఉత్తమం శీతం వయసః స్థాపనం ఘృతం సహస్ర వీర్యం ప్రతం కర్మసహస్రకృత్."

అని బోధించి యుండుటచే బుద్ధిస్మృతి మేధా జఠరాగ్నులను కల్గించి శుక్ర బల ఆయుర్వర్చస్సులకు, నేత్రములకు మిక్కిలి ప్రశస్తమై యున్నది. బాలవృద్ధులకు హిత మైనది. సంతానమును కల్గించును. విష మును హరించును. ఉన్మాదాది రోగముల యందు ఈ ఘృతముయొక్క నస్యమర్ద నాదులద్వారా మిక్కిలి ఫలము గల్గును. శారీరక, మానసిక పాటవము కోల్పోయిన వారికి అన్ని విధముల ఉపయోగించును. వయస్సు స్థిరముగానుండునట్లు చేయుటలో ఘృతము మొదటిది. ఇవి అవి అననేల క్రియా విషయములను బాగుగాతెలుసుకొని ద్రవ్య సంయోగ మొనరించి సేవించినచో వేయిరెట్లు గుణవంతమై వేలకొలది వ్యాధు లను పోగొట్టును. సహస్రాయువు అగునట్లు చేయగలదు. వేదముల యందును భగవం తుని అభిషేక సమయమునందు "శుక్ర మసి జ్యోతిరసి తేజోఽసిదేవో వస్సవితోత్పు నాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య ర శ్మిభిః। అని అనేక విధముల కొనియాడ బడినది.

## గోమూత్రం

ఇది గుణవంతము, క్రిమినాశకము. సేవించుటవల్ల అన్తర్బహిర్మలినములను పోగొట్టును. గృహ, పారిశుద్ధ్యముకొరకై గోమూత్రమును గృహములలో ప్రోక్షించు చునుటకలదు. ఇట్టి ప్రోక్షణ వలన గృహము లలో తేళ్ళు, పాములు, మొదలగువాటి బాధ తగ్గును. అట్లే సూతికాది గృహముల యొక్క, మరణించినవారి గృహముల యొక్క పరిశుద్ధికొరకు గోమూత్రము నుపయోగింతురు. సూతికాది గృహములలో బాలునికి గాని, బాలింతరాలికి గాని, గ్రహ సంబంధదోషములు కలుగకుండుటకై గోమూత్రసేచనము జరుపబడును. అట్లే మరణ గృహములలో ఆశౌచకర్మముల యందు పితృగ్రహాదులు గృహావరణను వీడి పోవుటకై చేయు శుద్ధి విధానము నకు గోమూత్రం ఎంతేని ఉపకరించును. ఇట్లు మానవుని జాతకర్మ మొదలు మరణకర్మపూర్తి అయ్యేవరకు గోమూత్రము ఉపయో గించును. ఈ గోమూత్రమును గూర్చి వేద ములయందు "కాండాత్కాండాత్ప్రరో హంతి పరుషః పరుషః పరి యేవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేన చ।" అని పొగడి యున్నారు.

## గోమయము

ఇదికూడ పంచగవ్యములో చేరి యున్నది. పంచగవ్యములనగా

"గోమూత్రం, గోమయం
క్షీరం దధి సర్పిస్తథైవ చ,
సమం యోజిత మేకత్ర
పంచగవ్య మితిస్మృతమ్.
తద్గుణస్సర్వపాపఘ్నం
గుల్మ విద్రధి నాశనమ్"

అని చెప్పుటచేత గుల్మాది రోగ నాశకమై సమస్తపాపములను పోదోలును. అందు చేతనే మానవుడు జీవయాత్ర ముగించుకొని పోవుటకు ముందు జీవునికి సంభవమైన పాపముల ప్రాయశ్చిత్తమునకై జీవ ప్రాయశ్చిత్తమని పంచగవ్యముల నిప్పిం చుట భారతీయ సంప్రదాయమై యున్నది. గోమయం క్రిమినాశకమై అంతర్బహిశ్శ రీర శుద్ధిని కల్గించి, సర్వవిషములను నిర్మూలించును. సర్వభూత గ్రహాది నాశన మునకుకూడ ఈ ఆవుపేడ నుపయోగింతురు. క్రిమి నాశకమగుటచే ఆవుపేడతో గృహ ములను శుద్ధిచేయుట ముంగిలి ప్రదేశము గోమయోదకముచే తడుపుట ఆచారము. శరత్కాలమున గోమయముచే పిడకలుచేసి పసుపు, కుంకుమ పుష్పాదులచే పూజించి, ప్రాంగణ ద్వారమున చిత్రరంగవల్లుల మధ్య అలంకరించి గొబ్బిదేవతను పూజిం చుట గోమాతను పూజించుటయే యని మరువరాదు. అట్టి గోమయమును పిడక లుగాచేసి వాటిని రథసప్తమి దినమున నిప్పులయందుపేసి క్షీరముల పొంగించి సూర్యదేవతను సంతోషపెట్టుట ఆచారమై యున్నది. ఈ గోమయ భస్మమును జాగ్రత్త చేసి వైదికులు ప్రతి దినముకూడ మేధస్సు బ్రహ్మవర్చస్సు, ఆయుష్షు అన్నము, యశస్సు, మున్నగు సర్వకోరికల సమృద్ధి కొరకు శిరోలలాట వక్ష స్కంధములయందు ధరించుట ఆచారముగా మారినది. పంటలకు మంచి ఎరువుగా కూడ ఉపయోగించును. ఈ పేడనుగూర్చి వేదములలో సైతము "గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరిషిణీం।" అని పొగడియున్నారు.

ఆవు యొక్కతోక కుచ్చునందలి వెంట్రు కలను అగ్నియందు ధూపము వేసినచో ఉన్మాద, అపస్మార, యక్ష, రాక్షస, పిశా చాది బాధలు తొలగును. గోవుతోకయందలి వెంట్రుకలను దారముగా పేని శుష్కించి పోవు బాలలకు కట్టిన గుణవంత మగును. అట్లే గిట్టలు భస్మము గావించి కుష్ఠు మొద లగు చర్మరోగములయందు అపక్వవ్రణ ములయందు ఉపయోగించవచ్చును. కొమ్ములను అరగదీసి గంధమును వ్రణము లకు లేపనము చేసిన ఎంతటి తీవ్రమైన వ్రణమైనను తగ్గును. ఈ విధముగా గోవు తన జీవితమును, శరీర మంతయు దేశ ప్రజా క్షేమమునకు వినియోగించు చున్నది. అట్టి గోమాతను ప్రతినిత్యము పూజించుట, అనాథ, వృద్ధ గోవులకు చేతనైనంతగా ఆహార విహారాదులయందు సహాయమొన రించుట, మనందరి కర్తవ్యమునై యున్నది. ప్రతి రోజూ ఉదయం లేవగనే గోవుయొక్క పృష్ఠభాగమును దర్శించుట, తోకను స్పృశించి, నమస్కరించుట చేయ వలెను. ఇట్లు చేయుటవలన సర్వ శుభములు కల్గును.

యథాసర్వమిదం వ్యాప్తం
జగత్ స్థావరజంగమమ్,
తాం ధేనుం శిరసా వందే
భూతభవ్యస్య మాతరమ్.

— శ్రీ నడాదూరు శేషాచార్యులు

# శ్రీనాథుని విష్ణుస్తుతి

శ్రీనాథుడు బ్రాహ్మీదత్తవరప్రసాదుడు. బ్రహ్మాండాదిమహాపురాణములను క్షుణ్ణముగ చదివిన వాడు, బ్రహ్మజ్ఞానఖని. అధ్వర్యువేద శాఖాధ్యేత. మీదు మిక్కిలి ఈశ్వరార్చన కళాశీలుడు. అటులని శ్రీనాథుడు హరినామ స్మరణ చేయ నుంకింపని కఠోర శైవ నియమములు కలవాడు కాదు.

శ్రీనాథుని భక్తి ప్రకరణములలో ఈశ్వరార్చన కళాశీలత్వము ముఖ్యమైన యంశము. శ్రీనాథుడు రచించిన గ్రంథములలో హరవిలాసము, భీమ, కాశీఖండములనునవి శివ భక్తి ప్రబోధకములు. శివ మాహాత్మ్య కథా సంవిధాన సంభరితములు.

"శివుడే దాత శివుండె భోక్త శివుడు
చేయున్ మఖాదిక్రియల్
శివుడే విశ్వము నే శివుండ ననుచున్...."







అని శైవాగమములు ప్రస్తుతించును. శ్రీనాథుని దృష్టిలో శివ పార్వతులు దేవతలు గారు, తల్లి దండ్రులు. అందును పార్వతి ఒక వృద్ధభామిని వలెనే పొడగట్టును. గౌరిని చూచినపుడు 'అంచితమహాకారుణ్యసంపత్తి' నే భావించు కొనును. ఆమె చల్లని సౌమ్య దృష్టి ప్రసారము, మాధురీవివేకము వెల్లదనంబు నిర్మలినత్వము గలది. శ్రీనాథుని శివభక్తి ఎల్లెడల వెధజల్లబడి యుండును.

శ్రీనాథుని శివభక్తి ఎల్లెడల గోచరించును. భీమఖండములో చంద్రుని వర్ణించు సమయమున

కాదు కా దుదయాద్రి కనకకూటం బిది
డంబైన పానవట్టంబు గాని
కాదు కా దిది సుధాకర పూర్ణ బింబంబు
కాశ్మీరు శంభు లింగంబు గాని

అని చంద్రునిలో శివ మూర్తిని ప్రతిష్ఠించినాడు. ఇట్లు శ్రీనాథుడు, ఈశ్వరార్చన కళను శీలముగా బెంపొందించు కొన్నవాడైనను అతని హృదయములోని శివభక్తి స్రోతస్సునకు విష్ణుభక్తియు నొక యంతః ప్రవాహమే. ఇతడు పాల్కురికి సోమనాథుని వలె శివమెత్తి చరించువాడు కాడు.

సోమనాథుడు అఘోర వీర మహేశ్వరాచార ధిరేయుడు. శివేతర దైవములను పూజించు వారియెడ తీవ్రవైముఖ్యమును ప్రదర్శించెను. శివభక్తుడు భవిజనుల సంసర్గము వలన తన జ్ఞాన ధ్యాన పూజా తపః ఫలమును నిష్ఫలము గావించు కొనునను ప్రగాఢ విశ్వాసము గలవాడు. బసవ పురాణములో

వీరమాహేశ్వరాచార వ్రతుడ
సంభావితుడ భవిజన సమాదరణ
సంభాషణాది సంసర్గదూరగుడ

నని వ్రాసి కొనెను. భవుల హస్తగతమైన ఫలములను పత్రములను శాకములను స్పృశింపడు. భవుల గృహములను క్షేత్రములను వారు కాలిడిన పథములకు గూడ స్పృశింపనని చెప్పెను. జీవితాంతము వరకు ఈ కఠోర నియమములను అక్షరశః పాటించిన వాడు. ఆవగింజంత భూతి మైనలది కొన్న వెలది గుమ్మడి కాయంత వెత్తి పుట్టు" నంతటివాడు శ్రీనాథుడు కాడేమో-

శ్రీనాథకృత గ్రంథములలోగూడ మనకు లభ్యమైన వాటిలో మొదటిది శృంగార నైషధము. నిండు జవ్వనమందు శ్రీనాథుడు సంతరించిన కావ్యమిది. శృంగార నైషధమును మామిడి సింగన మంత్రి కంకిత మిచ్చెను. ఈ కావ్యావతారికలో దేవతాస్తుతి చేయు సందర్భమున

"శ్రీరామాకుచ మండలీ మృగమద శ్రీ
గంధ సంవాసిత
స్ఫారోదార భుజాంతరుండు ధరణీ
సంశ్లేష సంభావనా పారీణుండు"

నగు పద్మాక్షుని చేత నైషధ కృతి భర్తను కృతార్థుని చేయించినాడు. ఇది కావ్యారంభము నందలి ప్రథమ పద్యము.

ఆ విష్ణువు "కరుణా పాథోధి' యట. ఆ కావ్యమందే నలుడు పసిడిరథము నెక్కిన సందర్భమున వాతాహారవిరోధి నెక్కి చను విష్వక్సేనుని బోలె నలుడున్నాడని చెప్పెను.

ఇందే నలదమయంతుల స్వరూపమును మూలకముగా నిట్లు వర్ణించును.

పురుషోత్తమ లాలితయు
త్తరుణీ మణి మిగుల నొప్పె ద్రత్య
మయమునన్
సురసింధు హేమకమలము
కరకమలంబున ధరించి

ఇక కావ్యాంతము నందలి చంద్ర వర్ణనలు చంద్రుడు కైటభారాతి డాకన్ను దమ్మి' యనియు 'శ్రీ మహాలక్ష్మి సైదోడు" అనియు వర్ణింపబడెను. అట్లే 'హర విలాస' కృత్యాదిని కృతిభర్త అవచి దేవ తిప్పయ్య సెట్టికి —

శ్రీమహిళా పయోధరహరిన్మణి హార మైన కంచి వరదునిచే దీవెన లిప్పించి నాడు.

ఇందే షష్ఠాశ్వాసము నందలి అమృత మథన కథలో విష్ణుమూర్తిని పాంచజన్య ధరుడు తోయజాక్షుడు లోకైక దుర్ధరుడు కైటభారాతి యని వర్ణించినాడు. అతడు శృంగార కందుకంబు నెత్తినట్లుగ మందర క్ష్మాధరము నెత్తిన వర్ణన.

అంగదాభరణంబు లందు గీలించిన
వజ్రాల కీలన కదలకుండ
వక్షస్థలంబున పైచిన నవకంపు
దులసి దండకు వాడు దోపకుండ
గడు నొప్ప దీర్చిన కస్తూరి తిలకంబు
చెమట బిందుల చేత జెవరకుండ
నెట్టెంబు సుట్టిన నెమ్మి పింఛము దండ
కొనలేక యొక్కింత గుదియ కుండ
శ్రవణ కల్హార ముకుళంబు జాఱకుండ
విరుల కీల్కొప్పు వదలి కై పెక్కకుండ
నెత్తె శృంగార కందుకం బెత్తినట్లు
కైటభారాతి మందర క్ష్మాధరంబు.

ఇక భీమేశ్వర పురాణమునందు కృత్యవ తారికలో మధురమోహనమైన ధూర్తగోపా లుని మూర్తిని వర్ణించి యట్టి గోపాలు డన్నగు మంత్రిని "కృపామతి గావుత" యని దీవించినాడు.

ద్వితీయా శ్వాసము నందలి చంద్రోదయ వర్ణనలో "శశలాంఛనుడు" మహాంధకార సంఘాతమును మీటిన విధము "శ్వేత వరాహ మూర్తి' యగు వెన్నుడు ప్రన్నని యొంటికోర ధాత్రీతలము ధరించిన విజృం భణముతో బోల్పబడినది.

పాల సముద్రంపై పవ్వళించే యున్న విష్ణువు మేల్కాంచిన విధమును శ్రీనాథుడు చతుర్థాశ్వాసమున క్షీరసాగర మథన కథలో నిట్లు వర్ణించెను.

దివ్యాయుధము లైదు ధృత చేతనంబులై
శత్రు సంహారంబు సంస్తుతింప
వలుగుజేడు కరాబ్జములు రెండు మొగిడించి
భ్రూలతా దేశంబు కొలుపు నరయ
సౌఖశాయనికులైన సనకాది యోగీంద్రు
లనురాగ వీక్షణంబభిలషింప
నూరు రంభాస్తంభ యుగళంబుపై నుంచి
లక్ష్మి శ్రీ పాదపల్లవము లొత్త
పన్నగాధీశ భోగతల్పంబు మీద
తత్ఫణా రత్నదీప్తి మై తళుకు జూప
పాలమున్నీటిలో నిద్రమేలుకొన్న
హరికి ........
త్రిపురాసుర సంహారమున శివుడు ........

'ఆదినారాయణుని పురాణ పురుషుని పురుషోత్తము ననాది నిధనుని బాణంబు జేసి' సంధింప త్రిపురాసురుడు దహింప బడెనట.

ప్రాయ మింతకు మిగుల కై వ్రాలకుండ
శ్రీనాథుడు
తెనుగు చేసిన కాశీఖండమున త్రద చనకు
వేదాద్రి నరసింహ విపుల వక్షస్థలీ కల్హార
మాలికా
గంధ లహరి కూడ కారణము నుద్బోదక
మయ్యెనట.
శివశర్మ అంత్యకాలమున
కొలువంగలేనైతి గోపాల కృష్ణుని యని బాధ పడెనట.

చనిపోయిన శివశర్మను గొని పోవచ్చిన విష్ణుదూతలు విష్ణుని యాకారములనే దాల్చి యుండిరట.

వెలిదామరల బోలు వెడదగన్నుల తోడ
గౌస్తుభ గ్రైవేయకంబుతోడ

విష్ణువు పట్టాభిషేక పు టుత్సవములో విఘ్నేశ్వరుడు వెల్లగొడుగు పట్టినట్లును పార్వతి బహు విధముల గైసేసి నట్లును వర్ణించినాడు.

పరమశివుడు "గంభీరముగ నెఱుగున" బ్రహ్మాది దేవతలలో విష్ణుండనేననియు

నేనే విష్ణుండనియు. నారాయణుండు జగద్రక్షాపరాయణుం డనియు చెప్పినట్లు మూలభావమును ప్రపంచీకరించి చెప్పెను,

శివరాత్రి మాహాత్మ్య కృతిభర్త

శాంతయ్యను శ్రీ "రామారమణుండు" న శేష జగతీ క్షేమంకర ప్రక్రియాధారాయత్త మనస్కుడు నైన' విష్ణువు రక్షింప వలెనని శ్రీనాథుని మంగళాశాసనము.

కల్పాదియందు 'అంబురుహ లోచనుండు సప్తపాతాళము క్రింద జాఱిపడిన యవని నెత్తుటను మనోహరముగా వర్ణించెను.

యముడు కైలాసమునకు వచ్చినపు డాతనికి శివుని యుత్తర దిక్కునందున్న విష్ణువుచే గూడ దర్శన మిప్పించినాడు శ్రీనాథుడు.

అప్పుడు విష్ణువునకు శంఖచక్రధరుడు కౌస్తుభోద్భాసిత వక్షస్థ్సలుడు మొదలగు విశేషణములను వాడినాడు.

పల్నాటి వీరచరిత్రలో ప్రారంభముననే
శ్రీ రఘునాయకు జిత్తమందెంచి
ప్రాకటంబుగ విష్ణు ప్రార్థన చేసి
విష్ణు భక్తులనెల్ల వినతుల జేసి
కథ నారంభించినాడు

గ్రంథములో గూడ బ్రహ్మయను చెన్న కేశవున పరావతారముగ వర్ణించెను. పెక్కు చోట్ల విష్ణు ప్రశంస జేసినాడు.

ఇట్లు శ్రీనాథుడు తాను రచించిన గ్రంథము లన్నింట విష్ణుస్తుతి జేసినాడు. శివ కవులలో గల కఠోర నియమము శ్రీ నాథుని యెడ లేవనియే చెప్పఁకొనవచ్చును. శివు నెంతగ కీర్తించినాడో విష్ణువు నంతగ స్తుతించినాడు.

— సుపాణి

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

| | |
|---|---|
| 1. స్పెషల్ దర్శనము | రు. 25 |

ఈ టిక్కెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రా బ్యాంకువారి వివిధశాఖలలోను లభించును.

### సేవలు

| | |
|---|---|
| 1. ఆమంత్రణోత్సవము | రు. 400 |
| 2. అభిషేకము (పులికాపు సేవ) | రు. 500 |
| 3. పునుగుగిన్నె | రు. 200 |
| 4 జాఫ్రాగిన్నె | రు. 100 |
| 5. కస్తూరిగిన్నె | రు. 100 |
| 6. సహస్రకలశాభిషేకము | రు. 3500 |
| 7. తిరుప్పావడ * | రు. 5000 |
| 8. కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 3000 |
| 9. ఐనా మహల్లో డోలోత్సవం * | రు. 1500 |
| 10. సహస్ర దీపాలంకార సేవ | రు. 2000 |
| 11. పవిత్రోత్సవం | రు. 5000 |
| 12. ఊంజల్ సేవ | రు. 1500 |
| 13 నూతన ఊంజల్ సేవ | రు. 3000 |

### తిరుమల, తిరుపతిలో వసతి సౌకర్య వివరాలు

తిరుమలలో

| | |
|---|---|
| (1) ప్రత్యేకపు కాటేజీలు | రు. 75 |
| (2) టి. బి. లోపల కాటేజీలు | రు. 50 |
| (3) యస్. వి. గెస్టుహౌస్ పెద్దగదులు | రు. 50 |
| మూలగదులు | రు. 40 |
| ఒక్కగదివి | రు. 35 |
| (4) హెచ్. ఆర్. జి. కాటేజీలు కల్యాణమంటపాలు | రు. 150 |
| రూయాకాటేజి, గోగినేని కాటేజి | రు. 80 |
| సి. సి. కాటేజీలు | రు. 100 |
| శంకుమిట్ట తూర్పు నెం॥ 9 | రు. 50 |
| ఆళ్వారుల టాంక్ కాటేజి నెం॥ 39 | రు. 80 |

తిరుపతిలో

శ్రీనివాస చౌల్ట్రి: 15, 12, 10. రూ.

పద్మావతి గెస్టుహౌస్ (ఏ సి) రెండుపడకలవి: 40 రూ.

ఒక్కపడకవి: 30 రూ.

శ్రీవేంకటేశ్వర గెస్టుహౌస్: రెండుపడకలవి: 16 రూ.

### ఉత్సవములు

| | |
|---|---|
| 1. వసంతోత్సవము | రు. 3000 |
| * 2. తెప్ప ఉత్సవం | రు. 2500 |
| 3. కల్యాణోత్సవము | రు. 2000 |
| 4. బ్రహ్మోత్సవము | రు. 1000 |
| 5. పుష్పయాగం | రు. 3500 |

### వాహనములు

| | |
|---|---|
| 1 బంగారుగరుడ కల్పవృక్ష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి | రు. 125 |
| 2. వెండిగరుడ, చిన్నశేష, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి | రు. 100 |

షరా:- సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును.

1. ఆమంత్రణోత్సవమునకు ఇద్దరికి మాత్రమే అనుమతి. 2,3,4, 5,6, సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 7-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

* ఈ ఉత్సవముల వారికి 5 గ్రా. బంగారు పతకం బహూకరింతురు.

### * నిబంధనలు *

కాటేజీలు కావలసినవారు ఆ ప్రాంతపు రిసెప్షన్ ఆఫీసర్ పేరిట కనీసం పదిరోజులు ముందుగా డిమాండ్ డ్రాఫ్టు మూలకంగా డబ్బుపంపాలి. ఒక కాటేజీ కొరకు పంపి వేరొక వసతి ఏర్పాటైతే జమచేయగా మిగిలిన డబ్బు వాపసు ఇవ్వబడుతుంది. ఉదయం 8 గంటలనుండి మరునాడు ఉదయం 8 గంటలవరకు ఒకరోజుగా లెక్కించబడుతుంది. డబ్బు కట్టినవారు మొదటి రోజున రానిపక్షంలో అంతకు ముందు చెల్లించిన డబ్బు తిరిగి ఇవ్వబడదు. తరువాత చార్జీలకు లెక్క కట్టబడదు.

ఈ రిజర్వేషను 2 రోజులకు మాత్రమే; పరిస్థితులను బట్టి పొడిగింపు వుంటుంది. ఏ వసతి దొరకని పక్షంలో డబ్బు తిరిగి ఇవ్వబడును.

డబ్బు కట్టినవారు తమకు ముందుగా పంపబడిన రిజర్వేషను కార్డును లేదా మనియార్డరు రశీదును లేదా నగదు రశీదును ఆయా రిజర్వేషన్ కేంద్రాలలో చూపవలసి వుంటుంది. లేనిచో రిజర్వేషన్ రద్దుకాగలదు.

తిరుమల తిరుపతి దేవస్థానం

# * ధర్మక్షేత్రం కురుక్షేత్రం *

ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ
కిమకుర్వత సంజయ.

అను ఈ శ్లోకము భగవద్గీత ప్రథమాధ్యాయములోని మొదటి శ్లోకము. ఈ శ్లోకము ద్వారా ధృతరాష్ట్రుడు సంజయుని, ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున ప్రవేశించి యుద్ధము చేయదలచిన మావారును పాండవులును ఏమి చేసిరని ప్రశ్నించెను. ఇది సామాన్యమైన శ్లోక తాత్పర్యము.

ఇది భగవద్గీతయందలి ప్రథమ శ్లోకమగుటయే గాక ప్రధాన శ్లోకముగూడ అయి యున్నది. అందుచేతనే భగవద్గీతయందు ముందు రాబోవు విషయమునంతయు వ్యాసమహర్షి ఈ శ్లోకమునందు నిక్షిప్తము చేసియున్నాడు. అనగా ఈ శ్లోకము భగవద్గీతకు బీజము వంటిది. ఈ శ్లోకము భగవద్గీత బయలు దేరుటకు ఎంత ముఖ్యమైనదో ఆ శ్లోకమునగల ధర్మక్షేత్ర కురుక్షేత్ర అన్న పదములు అంత ముఖ్యమైనవి.

ఇచ్చట ధర్మక్షేత్రమను పదము సామాన్యార్థములో కురుక్షేత్ర పదమునకు విశేషణముగ వాడబడినది. అనగా కురుక్షేత్ర మను ప్రదేశము ధర్మభూమి యని తెలియును. ఈ విశేషణము ద్వారా వ్యాస మహర్షి తాను వివరించబోవు భగవద్గీతకు ఎంతటి దృఢమైన పునాది వేసినాడో తెలిసికొనిన కొలది ఆశ్చర్యము పెరుగుచుండును.

అర్జునుడు యుద్ధము చేయవలయునని దృఢదీక్షతో యుద్ధభూమికి వచ్చినాడు. కాని తనవారందరిని అచట చూచి ధార్మిక బుద్ధి గలవాడై ధర్మాధర్మ విచారణకు పూనుకొనినాడు. ఇంతకు పూర్వము అర్జునుడు ఎన్నియో యుద్ధములు చేసియుండెను. కాని అచ్చట ధర్మాధర్మ విచారణ కలుగలేదు. ఉత్తర గోగ్రహణమునందు తనపై యుద్ధమునకు వచ్చిన భీష్మాదులతో భయంకర యుద్ధము చేసెను. కాని ధర్మాధర్మ విచారణ కలుగలేదు. కురుక్షేత్రమున కల్గినది. దానికి కారణము కురుక్షేత్రము ధర్మక్షేత్రము. ఎప్పుడూ కలుగని విచారము కలుగుటకు కారణమేమని మనకు కలుగబోవు సందేహమును ఊహించియే వ్యాసుడు మొదటి శ్లోకము నందలి మొదటి పాదములో మొదటి పదముతోనే మన సందేహమునకు సమాధానముగ ధర్మక్షేత్ర పదము వాడి అర్జునుని విషాదయోగమునకు కారణము తెలిపి సందేహనివృత్తి చేసెను. దీనివలన ఈ ప్రదేశమున కెంతటి ధార్మిక శక్తిగలదో తెలియుచున్నది. ఈ విధముగ అర్జునుని విషాద యోగమునకు, దానికి సమాధానముగ చెప్పబడిన భగవద్గీతకు ధర్మక్షేత్రమే కారణమను విషయమును వ్యాసమహర్షి స్పష్టపరచినాడు. ఆ పదమే లేనిచో అర్జునునికి విషాదము కలుగుటకు కారణము తెలిసెడిదికాదు. అది ధర్మక్షేత్రమే కానిచో అర్జునునకు విషాదము కలిగెడిది కాదు.

ఈ శ్లోక తాత్పర్య మంతటితో పరిసమాప్తము కాలేదు. ఇంతకంటెను మించిన భావము ఇందు ఇమిడియున్నది. అది జన సామాన్యమునకు సందేశరూపమైనది.

క్షేత్ర మనగా స్థానమనియర్థము. ధర్మక్షేత్రమనగా ధర్మమునకు స్థానమైన ఉపాధి యని యర్థము. ఇచ్చట అర్జునునకు విషాదము కలిగినది. అర్జునుని యుపాధి ధర్మక్షేత్రమైనది. అందులకే ధర్మాధర్మ విచారణ అర్జునుని యుపాధియందు కల్గినది. అది ధర్మక్షేత్రమగుటచేతనే శ్రీ కృష్ణభగవానుడు ఎవరికినీ చెప్పని గీతా రహస్యము లను అర్జునునకు మాత్రమే చెప్పినాడు.

ఇంత మాత్రమే కాదు. ఈ పదముయొక్క అర్థమును ఇంకను వివరించి తెలిసికొనవలసి యున్నది. అర్జునుని శరీరము



# నేటి – తిరుమల

విలసద్వర్ణసువర్ణహర్మ్యములు - పృ
థ్వీరాజశ్శృంగాటవుల్
జలపూరంబులు దివ్యపద్మచయముల్
శృంగార కాసారముల్
లలితాకార లతావితాన యటవీ
లావణ్యక్ష్మా శృంగముల్
మిళితంబై యలరారు వీథులును సు
శ్రీమించి శ్రీ వేంకటా
చల మీ క్ష్మాతలి శ్రీనివాసపురమై
శృంగారమై యొప్పెడిన్.

శృంగార సంయుక్త - గాంగేయ హర్మ్యాం గ
ణంబులు దివ్య యుద్యానతతియు
దివ్యాంబు పూరితోద్దీపిత స్ఫుటపాటి
కావర్ణిత సరః ప్రకరముల రయ
వివిధ శృంగాటక - వేదైవ శృంగార
విపుల వణిజుల - వీథు లెలయ
భ్రమర రించోళికా - భ్రమితసుమావళీ
హవణితవనములు నద్రి వెలయ

లలిత ధాతు విచిత్ర శిలావిశేష
శేషగిరి శృంగ శృంగారచిత నిశాంత
బహుళ మణి రాజ రాజిత భద్రపీఠి
సరసగతి నొప్పు వేంకటాచలము వెలయు.

నుతి

శ్రీమద్వేంకట రమణా
క్షేమంకర సకలలోక - జీవనదాతా।
శ్రీ మహిళానయనోత్పల
సోమా! సోమకవిదారి - సోమాదినుతా.

— శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

ధర్మక్షేత్రమగుటచేతనేగదా శ్రీకృష్ణుడు భగవద్గీత నుపదేశించెను. కావున ఎవరి శరీరములు ధర్మక్షేత్రములో వారికి మాత్రమే గీత నుపదేశింపవలయునని వారికిమాత్రమే యుపయోగించు నను సూచన గూడ ఇందు గలదు.

అంతియేగాక మరియుక విశేషము గూడ గలదు. అర్జునుని శరీరము ధర్మక్షేత్రమని చెప్పుటవలన, ఎవరి శరీరము ధర్మక్షేత్రమో వారికి మాత్రమే ధర్మాధర్మ విచారణ ఉండుననియు ధార్మిక బుద్ధిలేని జనులకు ధర్మాధర్మ విచారమే యుండదనియు స్పష్టమగు చున్నది. మన యనుభవములోగూడ ధార్మిక బుద్ధిగలవారు మాత్రమే ధర్మాధర్మ విచారణచేయు చుందురు. అది లేనివారికి ఈ విషయము చెప్పినను చెవి కెక్కదు. క్షేత్రమును బట్టియే ధర్మాధర్మ విచారముండుననియు, ఈ క్షేత్రమును, అనగా శరీరమును ధర్మ కార్యములకు వినియోగించుట ద్వారా ధర్మ క్షేత్రమును చేయవలయు నను వ్యాస మహర్షి గంభీర భావమును అర్థముచేసికొని చెప్పుట నా వంటి సామాన్యునకు సాధ్యమగునా? వ్యాసుని దయను ఎవరు లెక్కించి చెప్పగలరు. ఇది నాకు తోచిన భావము. ఇంకను విశేషార్థములు ఎన్నియో గలవు.

మరియొక మాట. మనకు పుణ్యసంపాదనార్థమై క్షేత్రసంచారము చేయుట ఆచారమై యున్నది. ఈ విషయమును గూడ వ్యాస మహర్షి సూచన చేసెను. ఇచట అర్జునుని మనస్సు మారుటకు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రభూమియే కారణము. కాన మనమును తిరుపతి వంటి పుణ్యక్షేత్రముల సంచారము చేసిన మన శరీరములు ధర్మక్షేత్రములై ధర్మాధర్మ విచారము కలిగి భగవదనుగ్రహమునకు పాత్రుల మగుదుము.

– శ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి



# గ్రంథ సమీక్ష

## శ్రీ వేంకటేశ్వర సంకీర్తనలు

[కవయిత్రి: శ్రీమతి మల్లాది పద్మావతి, ప్రాప్తి స్థానము: శ్రీమతి మ. రమాదేవి, ఇంటినెంబరు: 27-9, లాల్‌బహదూర్‌నగర్, నరెడ్‌మిట్ట, రామకృష్ణాపురం పోస్టు, హైదరాబాదు – 500 556. వెల: 3-00, పేజీలు: 54]

సద్గురు శ్రీ త్యాగరాజస్వామి, తాళ్ళపాక అన్నమాచార్యులు మున్నగు సంగీత వాగ్గేయ కారుల సంకీర్తనలను ఆదర్శంగా తీసుకొని, శ్రీమతి పద్మావతిగారు 'శ్రీ వేంకటేశ్వర సంకీర్తనలు' రచించారు.

శ్రీమతి పద్మావతిగారు రచించిన కొన్ని రచనల ద్వారా భక్తికి సంబంధించిన రచనలు చేయుటలో వారు సిద్ధహస్తులని తెలుస్తోంది. అందుకే ఆ శేషాద్రిశిఖర నివాసుని మీద ఏదో ఒక చిన్న పద్యం చెప్పి వూరుకోక, అష్టోత్తర శతసంకీర్తనలు చెప్పి తమ భక్తిని ప్రకటించుకొన్నారు.

'శ్రీ వేంకటేశ్వర సంకీర్తనల' లో ముఖ్యంగా చెప్పుకొనవలసిన విషయము 'భాష'. భక్త్యావేశములో రచించిన ఈ సంకీర్తనలు సులభమైన శైలిలో వుండి, పాడుకోవడానికి వీలుగా వున్నాయి. అంతే గాదు. కర్ణాటక సంగీతమునకు ముఖ్యమైన "రాగమును" ఎన్నుకోవటంలో కవయిత్రి మంచి ప్రజ్ఞ చూపించారు.

'పలుమారు వేడిన – పాలింపవేమయ్య
పాపమేమి జేసితి – ఓ వేంకటేశ'
(పుట-4—సంకీర్తన-7)

అనే ఈ కీర్తనలోని సాహిత్యానికి అమర్చిన శహనరాగం బాగా అమరింది.

కృతులలోని సంగీత రసము చాల వరకు సంగీత శిల్పము మీద, కొంతవరకు సాహిత్యం మీద ఆధారపడి ఉంటుంది. 'శ్రీ వేంకటేశ్వర సంకీర్తనల' లోని భాష ప్రజ్ఞను చాటుతుంటే, రాగము రసోత్పత్తిని కలుగజేస్తోంది.

'కలౌ సంకీర్తనా న్ముక్తిః' అను సూక్తి ననుసరించి, కలియుగంలో పండిత పామరులకు, ముఖ్యంగా పామరజనానికి, మోక్ష సాధనకు సులభతరమైన మార్గము భగవన్నామ సంకీర్తన చెయ్యడమే! శ్రీ వేంకటేశ్వర సంకీర్తనలు ఏ నిఘంటువు సహాయం లేకుండానే సులభంగా అర్థం చేసుకొని, పాడుకోవడానికి వీలుగా ఉన్నాయి. ఈ సంకీర్తనలన్నీ శ్రీమతి పద్మావతిగారి జీవిత సాగరంలో నుంచి పెల్లుబికి వచ్చిన అనుభవ తరంగాలు.

"వేంకటనాథా గోవిందా
వేల్పుల స్వామి గోవిందా"
(ఝుంఝూటి రాగం - ఆదితాళం)

"శరణు వేడెదం — శ్రీనివాసుని
శరణు వేడెదం — సామవేదుని"
(కురంజి — ఏకతాళం)

సహజమైన భక్తి భావావేశంలో, తన్మయత్వంలో వెలువడిన ఈ సంకీర్తనలను కోటిగొంతులు కలసి పాడితే, ఎలాంటి నాస్తికుడైన ఆకర్షింప బడకపోడు.

సంకీర్తనలకు మంచి సంగీతాన్ని సమకూర్చిన సంగీత విద్వాంసులు శ్రీ సుబ్బరామన్‌గారు, శ్రీమతి లలితమ్మగారలు అభినందనీయులు. కొన్ని కీర్తనలకు తాళము తెలుపబడలేదు. బహుశా, ఇది అచ్చు పొరపాటు కాబోలు!

ఇంకా మేలుకొలుపు పాటలు, ఆరగింపు పాటలు, లాలిపాటలు, మంగళ హారతి పాటలు ఇందులో ఉన్నాయి.

'భక్తి కొలది వాడే పరమాత్ముడు' అని తాళ్ళపాక అన్నమాచార్యులు అన్నట్లు, భక్తితో భగవంతుని నోరారా కీర్తించుటే భక్తుని పని. సంగీత సాహిత్యాలను రెండింటిని మేళవించి భక్తిని ప్రబోధించిన కవయిత్రి ఈ సంకీర్తనలను పుస్తకరూపంలో తీసుకొని రావడం, ఈ సత్కార్యానికి తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆర్థిక సహాయం చెయ్యడం మిక్కిలి హర్షదాయకం.

— భ్రమరాంబ

## తెలుగులో పదకవిత

[రచన- డా॥ ఎస్. గంగప్ప, ఎం. ఏ. పి. హెచ్. డి. వెల. రూ 30/- ప్రతులకు శ్రీమతి ఎస్. పార్వతమ్మ, శశి ప్రచురణలు, ఏ. 78, శ్రీనివాస నగర్, గుంటూరు- 522006.]

తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న పదకవితను గూర్చి సాకల్యంగా చర్చించిన గ్రంథ మిది.

ఇందులో సప్త ప్రకరణాలున్నాయి. పదకవిత ఆవిర్భావ వికాసాలు, పదకవుల చరిత్ర, పదకవితావైభవం, భాషావిశేషాలు, శృంగారం నీతి భక్తి వైరాగ్యాలు, సంగీతం, అభినయం, మొదలైనవి. విషయ విశ్లేషణ, ప్రముఖుల రచనలలోని ఉదాహరణలు స్వీకరించి చక్కగా ప్రదర్శించడం, ఈ రచనలో కానవచ్చే ప్రత్యేకతలు.

తెలుగు పదకవితనే కాక, సంస్కృతం, హిందీ, మరాఠీ, తమిళ, కన్నడభాషలోని పదకవితల విశేషాలను ఇందు వివరించడం జరిగింది.

అన్నమాచార్య పూర్వయుగంతో ప్రారంభించి ఆధునిక యుగం వరకూ గల తెలుగు పదసాహిత్యాన్ని పురస్కరించుకొని అన్నమాచార్య పూర్వయుగం, అన్నమాచార్యయుగం, క్షేత్రయ్యయుగం, త్యాగయ్యయుగం, ఆధునికయుగం అని యుగవిభజన చేయడం సముచితంగా ఉంది. ఈ విభజనవల్ల కేవలం పదకవులను గూర్చి మాత్రమే కాక, యక్షగానకర్తలు, కాలజ్ఞానతత్త్వకర్తలు, హరికథా వాగ్గేయకారులను గూర్చికూడ ప్రస్తావించడానికి వీలయింది. ఈ విధంగా విషయాన్ని చక్కగా విశ్లేషించడం శ్లాఘనీయం.

పామరులను కూడ రంజింపజేసే పదముల లోని కవితా మాధుర్యాన్ని సోదాహరణంగా వివరించారు. 'పదకవితావైభవం' అన్న అధ్యాయంలో, భాషావిశేషాలను అంటే, క్రియాపదాలు, పలుకుబళ్ళు, సామెతలు, సంధి కార్యాలు, సమాసాలు, విభక్తులు, పదబంధాలు, క్రియాపదాలు, వింతప్రయో

గాలు, అన్యదేశ్యాలు - ఈ విధంగా ప్రతి అంశాన్నీ సమగ్రంగా, సోదాహరణంగా చర్చించారు 'భాషావిశేషాలు' అనే అధ్యాయంలో. అంతేగాక రసనిర్వహణ, నీతి, వైరాగ్య బోధనలు గూర్చి వివరించారు. ఈ విధంగా ప్రతి అంశాన్నీ సోదాహరణంగా చర్చిస్తూ ఎంతో నిర్దుష్టంగా తీర్చి దిద్దారు ఈ గ్రంథాన్ని.

కానీ, ఆంగ్లంలో ఇచ్చిన ఉదాహరణ వాక్యాలకు తెలుగు అనువాదంకూడ ఇచ్చి వుంటే బాగుండేది.

పదకవితకు సంబంధించిన ప్రతిఅంశాన్నీ ప్రత్యేక సంపుటాలుగా వెలువరించ వలసిన అవసరం ఎంతైనా ఉంది. అటువంటి పరిశోధకులకు ఈ పుస్తకం ఎంతో సహాయకారి కాగలదు.

ఈ రచనవలన పదకవితా విమర్శకులుగా శ్రీ గంగప్పగారికి అగ్రస్థానం లభించింది. ఈ గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు (1980-81) లభించింది. అందుకు రచయిత అభినందనీయులు.

సంగీత, సాహిత్య విద్యార్థులందరూ తప్పక పఠించవలసిన పుస్తక మిది.

— స్వర్ణ

## శ్రీ నన్నయ భట్టారకుల భారత సూక్తి కథ

"సంకలన కర్త"

[గ్రంథ ప్రాప్తి స్థానం : శ్రీనివాస నిలయం, 14/139, గాంధీపురం-2, రాజమండ్రి, వెల రు. 10/-]

నన్నయగారి సంవత్సరాన్ని పురస్కరించుకొని రాజమహేంద్రవరంలో జరిగిన ఉత్సవాల సందర్భంగా వెలువడిన గ్రంథం ఇది.

కూర్చిన వారు శ్రీ దర్భా సూర్యనారాయణ గారు, వారు అణ్ణామలై విశ్వ విద్యాలయంలో ఇంజనీరింగులో ఆచార్యులుగా విశ్రాంతి నందినవారు. ఐనా భారత సూక్తి మధను కూర్చటం వారి సాహితీ పారంగతత్వాన్ని, అందులో వారికున్న ఆసక్తినీ చెబుతున్నవి.

భారతం అమృత మన్న మాట కవిత్రయం వారిదే. అంటే అనాది భారతీయ హృదయ స్పందనమే. అదే కవి వాక్కుగా వెలువడుతుంది. ఎప్పుడైనా ఇదే సత్యం. "సూక్తి" శబ్దం నన్నయ గారిదే. రెంటినీ కలిపి కూర్చటమే ఇక్కడ చేసిన పని. అంటే గ్రంథంలో నన్నయగారి భారతం నుండి - ఆదినుండి అరణ్య చతుర్థాశ్వాస పర్యంతం సాగిన ఆదికవి వాక్కులే ఇక్కడ అనేక శీర్షికల క్రింద సంగ్రహింప బడ్డాయి. మొత్తం కూర్చబడిన పద్యాలు-531.

గ్రంథ ప్రారంభం నన్నయ గారి మంగళ శ్లోకంతోను వారి వ్యాస భారత స్తుతులతో, వారినినాటి నుండి నేటిదాకా కవులు చేసిన స్తుతులతో జరిగింది. మొదటి స్తుతి కవిబ్రహ్మది. చివరిది శ్రీ మల్లంపల్లి శరభేశ్వర శర్మ గారిది.

వేఁగినాటి తెనుఁగు వేలకు వేలేండ్లు
మూఁగి నీదు నోట సాగినంత
వేఁగియున్న మాకు వేఁగె జీకటి రేయి
వీఁగె జడిమ, కవుల వేవెలుంగ.

నన్నయ గారు ఆంధ్ర సాహిత్య ప్రపంచ సూర్యోదయుడు. అంతకు పూర్వం వేలేండ్ల చీకటిలో గాసటబీసట చదువుకున్నది తెనుగునాడు. ఆ చీకటినుండి భారత సూర్యోదయం జరిగింది. ఈ భావం నన్నయ గారే సూచించారు.

భారత భారతీ శుభ గభస్తి
చయంబులఁ జేసి ఘోర సం
సార వికార సంతమస జాల
విజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జ బోధన రతుండగు
దివ్య పరాశరాత్మజాం
భోరుహ మిత్త్రుఁగొల్చి....

అని నన్నయ్యగారు వ్యాస స్తుతి చేశారు. తాను ఆంధ్ర సాహితీ ప్రపంచాని కింతేనన్న సత్యం అందులో వ్యక్తమౌతున్నది. మరి గ్రంథాంతం భారత సావిత్రీస్తోత్రంతో జరగడం-రెండు ఒడ్లూ కడనొక్కుకున్నట్లున్నది. మొదటా చివరా భారత భారతీ స్తోత్రమే కవచ కూర్పు అందంగా వుంది.

మధ్యలో అనేక శీర్షికల క్రింద నన్నయ గారి 531 పద్యాలు విభజింప బడ్డవి. నన్నయ గారి అవతారికా భాగం నుండి రాజరాజ నరేంద్ర ప్రశంస, కవిబ్రహ్మ ప్రశంస-ఇత్యాదులు-ఇవి

1) అవతారిక-భారతకథా ప్రస్తావన అన్న శీర్షిక క్రిందివి. పద్య సంఖ్య 103.

2) నన్నయ కవితా సౌందర్యం- ఇందులో ఉదంక-సౌపర్ణోపాఖ్యానాల్లో కొన్నిపద్యాలు, పరీక్షిత్తు శాపం-ఇత్యాదులు ఆదిపర్వం నుండి మయసభ రాజసూయ యాగాదులు సభాపర్వం నుండి, అరణ్య పర్వం లోని నలోపాఖ్యానం, గంగావతరణం నుండి - అనేక పద్యాలు సంకలితములైనాయి.

3) ధర్మ నీతిజ్ఞత-ఇందులో చతుర్విధాశ్రమ సంబంధి ధర్మాలను చెప్పిన వివిధ ఘట్టాల్లోని పద్యాలు-తృష్ణ, హింస, గర్వ, మద్యపానాది విషయక పద్యాలు-తీర్థాటనం ధర్మప్రశంసాదులకు సంబంధించిన పద్యాలు. దీనితో గ్రంథం ముగుస్తున్నది.

ఈ త్రివిధ విభాగ తాత్పర్యం పైరీతిగా స్పష్ట పడుతున్న విషయమే. మొదటి భాగం కావ్యమూ-తత్కర్తా-తత్ప్రేరకుడు - కవికి సాయపడిన మిత్ర ప్రశంస-ఈ అవతారికా విషయం.

ద్వితీయ విభాగంలో నన్నయ కవితా సౌందర్యానికి సంబంధించిన పద్యాలు. ఇది చాలా ప్రధాన భాగం-కవితాదృష్ట్యా నన్నయ గారి అక్షర రమ్యమైన రచన ఇందులో ప్రస్తావితం. 270-104=166. ఈ రమ్య పద్య గుంఫనం ఉదంక స్తుతిలోని "బహువన పాదపాబ్ధి" నుండి బయలుదేరి నన్నయగారి బహు రమ్యమైన చివరి పద్యం- "శారదరాత్రు" లతో ముగియటం చాలా రమణీయంగా వుంది.

తృతీయ భాగంలో నన్నయ్య గారి సూక్తి నిధులైన పద్యాలు రాజ ధర్మాదులకు సంబంధించిన పద్యాలు 531-271-260.

ఈ విభాగం సత్య ప్రశంసతో ప్రారంభం కావటం చాలా అర్థవంతంగా వుంది.

తన యెఱిగిన యర్థంబు-అన్న ఆదిపర్వ ప్రథమాశ్వాసంలోని 136వ పద్యంతో మొదలు కావడం చాలా సమీచీనం. ఎందు కంటే ఇది సత్య ప్రశంస. నన్నయగారు 'నిత్య సత్యవ్రతుడు'. కనుక ముగింపు రాజు న్యాయ పరిపాలనా విషయంతో కావటం కూడా.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్ ।
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః॥

అన్న మంగళవాక్యంతో పాటుదే, ప్రాచీన కాలంలో కావ్యం శ్రవ్యమైన కాలంలో నిత్యమూ గోష్ఠి-పురాణశ్రవణమూ, ఈ వాక్యంతో ముగించేవారు. ఆ నాటి మానవ సంక్షేమాకాంక్ష ఆ శ్లోక రూపం ధరించింది. ఒక పవిత్రమైన ముగింపది.

ఈ విధంగా ఈ గ్రంథం కూర్పులో ఒక చక్కదన ముంది. కూర్పరి వాస్తు శాస్త్రవేత్త కావటం వల్ల ఈ 531 అంతస్తుల భవన నిర్మాణంలో ఒక సూత్రం, ఒక పద్ధతి ఉంది.

ప్రాంగణభిత్తిక-ప్రధాన ప్రవేశద్వారం-ఇంటి ముంగిలి ఆకర్షణీయంగా నిర్మించటంతో పాటు ఇంటి పెరడు కూడా అందంగానే నిర్మితం కావాలి. అప్పుడా గృహ నిర్మాణ పథకం వేసినవాడు వాస్తు శాస్త్రజ్ఞుడు. ఈ నన్నయ సౌధం ఆయన ఇచ్చిన ఇటుకలనే తీసుకొని ఆ సూత్రం చెడిపోకుండా ఈ ఈ వాస్తు శాస్త్రవేత్త నిర్మించడం సర్వథా ప్రశంసనీయం.

### ప్రయోజనం

ఈ గ్రంథం నన్నయ కవితాసారం కనక అదంతా ఒక మీగడ తెట్టు కనక రసజ్ఞుల కందుబాటులోకి తేవటమే.

— శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావు

### నామ మహిమార్ణవము :

[రచయిత:— శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య, నామప్రయాగ, బద్దాం, గుంటూరు జిల్లా. 1/8 క్రౌన్ పుటలు 414. వెల రు 15/-]

రాముడేలే రాజ్యంలో కాముడు లేడు. కాముడేలే రాజ్యంలో రాముడు లేడని ఒక మహాత్ముని పసిడి పలుకు. రామరాజ్యం కావాలనుకుంటే రామనామ రూపాలను పట్టుకోవాలి. పరమేశ్వర భావనలో జగద్భావన అంతరిస్తుంది.

'ఓ రామా! నీ కన్న నీ నామం గొప్ప దయ్యా! నువ్వు అయోధ్యనే తరింప చేశావు. నీ నామమో మూడు భువనాలను తరింప చేస్తోందయ్యా" అని భక్తితో పొంగి పలికే హనుమమాటలు ప్రసిద్ధం. నిజమే! రాముడు నిర్మించ లేని సేతువును రామ నామం! నిర్మించింది కదా!

పరమేశ్వరుని పట్ల అపరాధం చేసినా ఆయన నామాన్ని పలకడంతో అపరాధాలన్నీ పోగొట్టుకొని భక్తుడు ఆనందాన్ని అనుభవిస్తున్నాడు కదా! కాబట్టి భగవానుని కంటే భగవన్నామం శక్తి కలదే కదా అందుకే యజ్ఞాలలో జపయజ్ఞాన్ని నేనే అని గీతాచార్యుడన్నాడు.

నామికి నామానికి భేదం లేదని, నామి నామాన్ని కోరుకుంటాడని, అనుగమిస్తాడని భక్తుల విశ్వాసం. పొలంలో బద్ద బీజాలు తల క్రిందులుగా, వంకర టింకరగా పడినా మొలకెత్తుతున్నట్లే నామాన్ని ఎట్లా చేసినా, ఏ భావనతో చేసినా ఫలం ఇస్తుందని తులసీదాసుగారి స్వానుభవ వచనం.

రత్నం యొక్క విలువ తెలిస్తే దానినెట్లా కాపాడుకుంటామో భగవన్నామం యొక్క విలువను గుర్తించి వాడుకోవాలని "నామ నిరూపణ మోల రతన తే" అనే మాటలలో వారే అందించారు.

సగుణారాధకుడు నిర్గుణ పరబ్రహ్మను భావాన్ని పొందాలన్నా, నిర్గుణోపాసకుడు సగుణ దర్శనానందం పొందాలన్నా ఈ నామం దుబాసి (ద్విభాషి) లా ఉంటుందని శ్రీవారే సెలవిచ్చారు. నామామృతాన్ని కడుపార త్రాగి నామ నౌకచే భవ సాగరాన్ని దాటి తాము తరించడమే కాకుండా ఎందరినో తరింప చేసిన భక్తులు యోగులు ఈ గడ్డలో పుట్టారు. భక్తుల కథలు ఆస్తికులకు సుపరిచితాలు.

కర్మ, జ్ఞాన, భక్తి మార్గాలకు ఆలంబనమైన నామ మహిమను, నామ పారాయణ ఆవశ్యకతను, శ్రుతి, స్మృతి పురాణ, ఇతిహాస, కావ్య, నాటకాది గ్రంథాల నుండి అనేక ప్రమాణ పంక్తులను పేర్కొంటూ ఆస్తికలోకానికి అమూల్యమైన సేవను చేస్తున్న శ్రీ కుందుర్తివారు పరమ పూజ్యులనడంలో సందేహం లేదు. నామమే ఊపిరిగా బ్రతుకు శ్రీ కుందుర్తివారే ఇది వ్రాయడానికి అర్హులు. నామ మహిమ మన హృదయాల్లో బాగా నాటాలని చెప్పిన విషయాన్నే మరల మరల చెప్పారు. పునరుక్తి దోషం ఉన్నా పునరుక్తి దోషం లేదు. చదవ దగ్గ గ్రంథం అని వ్రాయడం కన్న ఆచరణలో పెట్ట తగ్గ గ్రంథం అని వ్రాయడం ఉచితం.

— దేవరకొండ శేషగిరిరావు

### శివానందలహరి

[రచయిత: శ్రీ కలువకొలను సదానంద, ప్రతులకు: శ్రీ కలువకొలను సదానంద, పాకాల-517117, చిత్తూరుజిల్లా. క్రౌన్ 1/8 పుటలు: 200. వెల: 12-00.]

"శివానందలహరి" శ్రీ కలువకొలను సదానంద గారు సరళ సుకుమార సుందర శైలిలో వ్రాసిన వచన కృతి.

ఈ గ్రంథం స్వయం సంపూర్ణములు అని చెప్పదగిన ముప్పైఒక్క కథానికల సమాహారం. అయితే అంతర్లీనంగా మణిహారంలో సువర్ణ సూత్రంవలె ఈ కథానికలు అన్నింటికీ ఐకమత్యం చేకూర్చే అంశం శివపారమ్యం. అందుచే "శివానందలహరి" అనే పేరు ఈ గ్రంథానికి సార్థకం అని చెప్పవచ్చు.

అచ్చు ముచ్చటగా ఉంది.

శ్రీ బాపుగారి చిత్రలేఖనం-ముఖచిత్రం-మలి అట్టపైని అర్ధనారీశ్వర చిత్రం హృదయంగమంగా ఉన్నాయి. ఆ చిత్రాల అందచందాలు చర్మచక్షువులకు మాత్రమే గాక మనోనేత్రాలకు గూడా సద్యఃపర నిర్వృతి సమకూర్చేటట్లు ఉన్నాయి.

శ్రీ కలువకొలను సదానందం గారి వచన శైలి, భాషలో బాలసాహిత్యం, భావాలలో

ప్రౌఢ వాఙ్మయంగా భాసిస్తుంది. ఈ గ్రంథంలోని కథానికలు మహిషాసురుడు-త్రిపురసంహారం-క్షీరసాగరమథనం - గంగావతరణం-భక్తరావణ-రామాయణం కాలభైరవుడు మొదలైనవి వివిధస్థాయీ భావాలతో

"అనంతా వై రసాః"

అని నిరూపిస్తున్నాయి.

సంగీతానికి అంతరాత్మగా చెప్పబడిన ఆపాతమాధుర్యం - సయితం ఆలోచనామృతమైన సాహిత్యానికి జోడించే ప్రజ్ఞ ఈ రచయిత శ్రీ కలువకొలను సదానంద గారిలో కన్పిస్తోంది.

"శివానందలహరి" సంగ్రహ శివపురాణ సర్వస్వం అని చెప్పవచ్చు. ఈ గ్రంథం శివపురాణ గాథలకోసం మాత్రమేగాక తెలుగు నుడికారపు వంపు సొంపులకోసం కూడా చదివి ఆనందింపవచ్చు.

— వండూరి రామకృష్ణమాచార్య

## ధర్మనిర్ణయచంద్రిక భాగం-1

[ప్రాప్తిస్థానము : ఆర్షగ్రంథమండలి, వెంకట్రామనికాయ్యము, ఆదిలక్ష్మి విలాసము, మైలవరము, కృష్ణాజిల్లా, క్రౌనుసైజు 1/8. 174 పుటలు. వెల : 6-00.]

దీనిని సంగ్రథనము చేసినవారు సూరివరపు వెంకట శివసోమయాజులుగారు.

ఇందు మొదటిభాగమందు అందరకు పనికివచ్చు వివాహము, యాత్ర, ప్రశ్న, శాంతి మొదలగు విషయములు, రెండవ భాగమున ఆశౌచాది విషయములు వివరించబడినవి.

సాధారణముగా పూర్వులు వ్రాసిన మను, ఆపస్తంబ, గౌతమఋషుల ధర్మశాస్త్రములలో వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు భక్ష్యాభక్ష్యాది విషయములు చెప్పఁబడినవి. వివాహముల రకములు, ధర్మ్యములేవి, ఏవి అధర్మ్యములు మొదలగు విషయములు చెప్పబడినవి. వీనివల్ల మానవుల ప్రవర్తన యెట్లుండవలెను, ఎట్లు ఆచరింపవలెను, ఎట్లు ఆచరింపరాదు అనునవి నిర్మాణాత్మకముగఁ దెలియును. వానిని సరిగా ఆచరించి లక్ష్యము పొందవలసిన స్థితులు వివరింపఁబడినవి.

ఇందు సామాన్యధర్మములు గాక విశేష ధర్మములు ఆశౌచాదికమును వివరింపబడినవి. కాలామృతము, ముహూర్తదర్పణము, అభినవషడశీతి ధర్మసింధువు మొదలగు గ్రంథములనుండి ఆయా ప్రమాణ శ్లోకములు చూపఁబడినవి. ఇంకను అనేక గ్రంథములు ఇందు ఉదాహరింపబడినవి-

వివాహయోగ్యుల సంబంధము, వివాహమునకు యోగ్యులుకాని వారి సంగతి, తారాబలములు, వివాహ వర్జ్య నక్షత్రములు, మౌఢ్యవర్జ్యములు, శాంతులు, ప్రదక్షిణ విధులు, సువాసినీ ధర్మములు, జాతాశౌచములు, మృతాశౌచములు ప్రేతపిండ విధి, శ్రాద్ధయోగ్యములు ఇత్యాది వివిధ విషయములు కూడ చూపబడినవి. ఆ యా శ్లోకములు చాలవాటికి అర్థవివరణము కూడ తెలుపబడినది.

అరోగిణీం భ్రాతృమతీం
అసమానార్ష గోత్రజామ్,
పంచమాత్సప్తమా దూర్ధ్వం
మాతృతః పితృత స్తథా.

రోగములేని, సోదరులుగల అన్యగోత్రమున పుట్టిన స్త్రీని వివాహమాడవలెను. తల్లి గోత్రములో కూటస్థపురుషుని నుండి అయిదవతరము తర్వాత స్త్రీని, తండ్రి గోత్రములో కూటస్థ పురుషునినుండి ఏడవ తరము తర్వాత పురుషుడు వివాహ మాడవచ్చును.

ఏకనక్షత్ర జాతులయినవారికి వివాహము కూడదు. నక్షత్ర పాదములు వేరైనచో దోషము లేదు. శుభము. ఏకపాదులైనచో ఏడాది చివర మరణము ధ్రువము దానికి ప్రమాణము-

దంపత్యో రేకనక్షత్రే
భిన్నపాదే శుభావహః,
దంపత్యో రేకపాదే హ
వర్షాంతే మరణం ధ్రువమ్.

కాలనిర్ణయము-

కృత్తికా భరణీ జ్యేష్ఠా
పుష్యాశ్లేషా పునర్వసూ,
ఆర్ద్రా త్రిపూర్వా చిత్తా చ
వైధవ్యం మరణం ధ్రువమ్.

కృత్తిక భరణి జ్యేష్ఠ పుష్యమి ఆశ్లేష పునర్వసు ఆర్ద్ర త్రిపూర్వ చిత్తజ్ఞవివాహమునకు యోగ్యమైన నక్షత్రములు కావు. వీనిలో వివాహము చేసిన మరణము తప్పదు.

ఏకగర్భ జాతులగు కన్యల కిర్వురికీ వేరుగ్రామ మందుగాని వేరుమండపమందు ఏకలగ్నమందైనను భిన్నాంశమందు వివాహముచేయవచ్చునని వసిష్ఠ అత్రి పరాశరులు వచించిరట. (చూ. 8 పుట)

చత్వారి ఖలు కర్మాణి
సంధ్యాకాలేషు వర్జయేత్,
ఆహారం మైథునం నిద్రాం
స్వాధ్యాయం చ తథైవ చ.

సంధ్యాకాలమున ఆహారము, సంగమము. నిద్ర, స్వాధ్యాయమును విడువవలెను.

ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే
యశస్వీ దక్షిణాముఖః,
శ్రీకామః పశ్చిమో భుంక్తే
న కదాచిదుదఙ్ముఖః.

తూర్పుముఖముగ భుజించినచో, ఆయువును దక్షిణ దిక్కుగ భుజించినచో యశస్సును, పడమరగా భుజించినచో లక్ష్మిని పొందును, ఉత్తరముగ ఎపుడును భుజింపరాదు (62 పుట).

స్వగృహే ప్రాక్శిరాః కుర్యాత్
శ్వాశురే దక్షిణా శిరాః,
ప్రత్యక్శిరాః ప్రవాసేషు
న కదాచి దుదక్శిరాః.

స్వగృహమందు తూర్పుగాను, శ్వశుర గృహమందు దక్షిణముగాను, ప్రవాసములందు పడమరగాను శిరస్సునుంచి పరుండవలెను.

ఇట్లే ఈ ధర్మ నిర్ణయచంద్రికయందు అనేక విషయములు చెప్పఁబడినవి.

ఇట్టివి ఇంకను తెలిసికొనుటకు ఈ గ్రంథము ఉపయోగించును. దీనిని చదువరు లుపయోగించుకొందురుగాక.

— చర్ల గణపతిశాస్త్రి

# కలియుగదైవము

కలియుగములో ఆపదమొక్కుల వాడు, వడ్డికాసుల వాడు, దీనజనవత్సలుడు, కరుణా సాగరుడు అయిన శ్రీ వేంకటరమణస్వామి భక్తుల పాలిట కల్పతరువు. ఆపదలలో ఆదుకొను దేవుడు, కరుణామయుడు. అట్టి మహిమాన్వితుని, దేవదేవుని లీలలను వర్ణించు అవకాశము లభించుట ఎంతటి అదృష్టకరము?!

అసంఖ్యాకములు, అనంతములు అయిన ఆ శ్రీనివాసుని లీలలలో మరొక్కటి–

మా పెళ్ళప్పటికి మా ఆయన కింకా ఉద్యోగము లేదు. మా మామగారు వాళ్ళు బాగా ఉన్నవాళ్ళే! అందుకే మొదట మా వారికి ఉద్యోగము చేసే అభిప్రాయము లేదు. కాని మా మామగారికి కొడుకు ఉద్యోగము చేయటం ఇష్టము! ఆయన కోరిక కాదనలేక; పెరుగుతున్న సంసారము దృష్ట్యా మావారు ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టారు. కాని ఒక్క ప్రయత్నమూ ఫలించలేదు. "ఊరికి వెళ్ళి ఆర్డర్స్ పంపిస్తాము" అని ఎందరో తెలిసిన వాళ్ళు మాట యివ్వటం, చివరికి మామూలు నిరాశే!! ఉద్యోగ వయో పరిమితి అయిపోయే ముందు ఒకే ఒక్క అవకాశము– ఆఖరుసారిగా సర్వీస్ కమీషన్ పరీక్ష రాశారు ఆయన! పరీక్ష బాగానే రాశానన్నారు. కాని వస్తుందో? రాదో? నిరాశ, ఓటములవల్ల లోపించిన ఆత్మవిశ్వాసం ఆయనలో!

మా ఇంటి దేవుడు వేంకటరమణుడు కాడు. తిరుపతికి వెళ్ళి మొక్కులు తీర్చుకొనే అలవాటు - ఆచారం మా ఇంట అప్పుడు లేవు. కాని అందుకు విరుద్ధంగా మా అత్తగారు తన కొడుకు ఉద్యోగస్థుడైతే తిరుపతికి వచ్చి, నీ హుండీలో ౨౫ రూ. వేస్తావని శ్రీ వేంకటాచలపతికి మొక్కుకుంది. "డివైన్ సపోర్ట్ ఈజ్ నీడెడ్ ఫర్ సక్సెస్" అన్నవిధముగా మానవయత్నానికి దైవబలం తోడైంది. అప్పుడు వచ్చిందో ఉత్తరం. "మీరు సర్వీస్ కమీషన్ పరీక్షలో నెగ్గారు. త్వరలోనే మీకు ఉద్యోగం వస్తుంది" ఎవరో అపరిచితవ్యక్తి వ్యక్తిగతంగా పరిచయమున్నవాడిలా రాసిన ఉత్తరం. వానకు బాగా తడిసిపోయిన ఆ కార్డులో స్పష్టంగా కన్పిస్తున్న పై అక్షరాలు. త్వరలోనే మా వారికి ఉద్యోగము రావటం, ఇద్దరమ్మా




యిల తర్వాత అబ్బాయి (పేరు ఆ శ్రీనివాసుడిదే!) పుట్టడం అప్పుడు మా ఇంట జరిగిన శుభములు. అప్పటినుండి మా ఇలవేల్పు శ్రీ వేంకటరమణుడే! మేము దాదాపు ప్రతి సంవత్సరము తిరుపతి వచ్చి ఆ స్వామిపట్ల మా భక్తిని, కృతజ్ఞతను యథాశక్తి ప్రకటించుకొంటుంటాము.

మొన్నటికి మొన్న మా మూడవ అమ్మాయికి బాగా జబ్బు చేసింది. చక్కగా ఆరోగ్యంగా తిరుగుతున్న ఆ అమ్మాయికి హఠాత్తుగా జబ్బుచేసి కాళ్ళు చచ్చుబడి నడవలేని స్థితి వచ్చింది. మందు, ఆహారము ఏమీ ఇమడక అన్నీ బయటికి వచ్చేవి. అప్పుడు మేము ఆ అలివేలుమంగాపతి శరణు జొచ్చాము. "మా అమ్మాయికి బాగైతే మేమంతా సకుటుంబముగా నీ కొండకు వస్తాము. అమ్మాయి తలనీలాలు సమర్పిస్తాము" అని మొక్కుకున్నాము. ఆ తిరుమలేశుని అమృతమయమైన వీక్షణము మాపై ప్రసరించింది. మరుసటి క్షణం నుంచి అమ్మాయి ఆరోగ్యస్థితిలో మార్పు, నెల లోపల లేచి చక్కగా తిరగగల్గింది. అనుకున్న ప్రకారము ఆ ఏడుకొండలవాడి మొక్కు తీర్చాము!

ఆపద్బాంధవుడు, దయామయుడు, భక్తుల ప్రియాతిప్రియమైన దేవుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి మహిమలను నిరూపించుటకు ఇంతకంటే ప్రత్యక్ష నిదర్శనలు ఇంకేమి కావాలి?!

నిండు మనస్సుతో కొలిచేవారికి ఆ సప్తగిరీశుని అనుగ్రహం తప్పక ఉంటుంది.

—శ్రీమతి బి. ఎస్. లక్ష్మి

## మని(షి)

ఆపద్బాంధవా!
ఆపదలందు,
ఆలోచనలు
హఠమేసుకొన్నప్పుడు,
నిస్సహాయుడై
నిలిచినప్పుడు
నీవే దిక్కని
నీ మ్రోల పడి మ్రొక్కు.
ఆపద తొలగిన
సంపద కలిగిన
నిన్ను మరచు - దుష్టత
వెన్ను చరచు
తెలివి తేటలందు
కలిమి బలములందు
కలడా నా సరి
ఇలలో సంచు - వీడి
కళ్ళు మీది కెక్కు
అదే మని(షి) లోని పెద్ద చిక్కు.

— శ్రీ కె. వరసింహారెడ్డి.

# సుకన్య




వైవస్వతుడికి పదిమంది కుమారులు. వారిలో పృషద్ధ్రుడు అనే ఒకడికి అతడు చేసిన పొరపాటువల్ల రాజ్యం ఏలే అవకాశం లేకుండా పోయింది. కొందరు పరాత్పరుని ఆరాధిస్తూ వనవాసానికి వెళ్ళిపోయారు. మిగిలిన కొందరు క్షత్రియ వంశకర్త లయ్యారు. వారిలో శర్యాతి మహారాజు ఒకడు.

శర్యాతి మహారాజు చాల మంచివాడు. ప్రజామోదం పొందేలా రాజ్య పాలన చేసే వాడు. అతడికి ఒక కుమార్తె కలదు. ఆమె పేరు సుకన్య. ఆమె అప్పుడప్పుడే యౌవనంలోకి ప్రవేశించింది. అందానికే అందం వచ్చేలాంటి అందంతో, మంచి సొగసైన శరీరంతో చూసేవారిని క్షణకాలం విభ్రాంతుల్ని చేసేది.

ఒకరోజు ఆమె వన విహారానికి చెలికత్తెలు తోడురాగా బయలుదేరింది. వారు చ్యవన మహర్షి ఆశ్రమము ఉన్న వనానికి వెళ్ళారు. అక్కడ ఉన్న ప్రకృతిని తిల కిస్తూ, పువ్వులు కోస్తూ, ప్రక్కనే ఉన్న సరస్సులో చాలాసేపు క్రీడించి ఆనందం పొందింది సుకన్య. ఆమెకు అక్కడకు దగ్గరలోనే ఒక పుట్ట కన్పించింది. ఆ పుట్టలో వెలుగుతున్న రెండు జ్యోతులు కన్పిం చాయి. అవి పరిమాణంలో చాలా చిన్న విగా ఉండడం వలన వాటిని మిణుగురు పురుగులుగా ఆమె భావించింది. కుతూహలం, ఏదో చిలిపితనం ఆమెను తొందరచేయగా ఆమె ఒక ముల్లుతో ఆ రెండు జ్యోతులను పొడిచింది.

అంతే! అదే సమయానికి రాజుగారి సేవలకు మలమూత్ర బంధం జరిగి పోయింది. వారు రాజుకు పరుగున వెళ్ళి ఈ వార్త చెప్పారు. శర్యాతి మహారాజు క్షణకాలం గాభరా చెందాడు. తమవల్ల ఎవ రికో కీడు జరిగిందని తలచి చ్యవనముని ఆశ్రమానికి బయలుదేరాడు.

అక్కడకు వెళ్ళేసరికి గాభరాగా వస్తున్న తండ్రిని చూసిన సుకన్య తను చేసిన పని వివరించింది. దానికి శర్యాతి మహారాజు ఎంతో బాధపడి "అవి జ్యోతుల్లా కాంతివంతంగా వెలుగుతున్న చ్యవనమహర్షి కళ్ళు. ఆయన తపస్సు చేసుకుంటుంటే చుట్టూ పుట్టలు లేచాయి. అంతేకాని మిణు గురు పురుగులు కావు" అని చెప్పి కుమా ర్తెతో, సహా పుట్టవద్దకు వెళ్ళాడు.

తపస్సమాధిలో ఉన్న చ్యవనమునిని చూచి విచారంతో చేతులు జోడించాడు శర్యాతి. 'తన కుమార్తె తెలియక చేసిన పాపాన్ని క్షమించమని' వేడుకున్నాడు. చ్యవనమహర్షి ఆమెను క్షమించి, అతని సేవలకు ప్రాణరక్షణ చేసాడు.

తన కుమార్తె చేసిన పాపానికి పరిహా రంగా సుకన్యను చ్యవనమహామునికిచ్చి వివాహం జరిపించాడు శర్యాతి! ఆమె తన భర్తయందు అమితమైన ప్రేమ కల్గివుండి, అతడిని సేవిస్తూ పతివ్రతా ధర్మాన్ని పాటిస్తూ రోజులు గడుపుతున్నది సుకన్య!

ఒకరోజు అశ్వినీకుమారులు ఇద్దరూ చ్యవనముని ఆశ్రమానికి వచ్చారు. వారి ద్దరూ దేవవైద్యులు. సుకన్యచే వారికి అతిథిమర్యాదలు జరిపించాడు చ్యవనుడు.

అశ్విని కుమారులిద్దరూ చ్యవనుడి అతిథి మర్యాదలకు సంతోషించి ఏదైనా తమ వలన జరిగే పమంటే చెప్ప మని అడిగారు. చ్యవనుడు వారితో "నా వార్ధక్యం పరిహ రించి, నా కళ్ళు యథావిధిగా ఉండేటట్లు చేయండి! ఇందుకు ఫలితంగా నేను మీకు




వస్త్రగిరి

యజ్ఞంలో సోమపానార్హత కలిగేలా చేస్తాను" అన్నాడు.

దానికి అశ్వినీ కుమారులిద్దరూ ఎంతో సంతోషం పొందారు. వారు దేవవైద్యులు కావడం వలన వారి మహిమతో మరుక్షణం నుండే చ్యవనుడికళ్ళు పని చేయ నారంభించాయి. వారు చ్యవనుడిని తమతోపాటు ఒక కొలనువద్దకు తీసుకువెళ్ళారు. అందులో ముగ్గురూ మునిగి లేచారు.

అంతే! ముగ్గురూ దివ్యసుందర రూపాల్తో ఆశ్చర్యం కల్గించేలా మారిపోయారు.

వారిని చూసిన సుకన్య ఆశ్చర్యం అంతులేనిదైంది. ఆమె ముగ్గురికి నమస్కరించింది. "మీలో నా ప్రాణనాథుడు ఎవరో తెలియజేసి నా మనస్సుకు సంతోషం కలుగజేయండి!" అంది.

అశ్వినీ కుమారు లిద్దరూ చ్యవనుని ఆమెకు అప్పగించి అదృశ్య మయ్యారు.

నవయౌవన సుందరాకారుడయిన చ్యవనుడితో కాపురం చేసింది సుకన్య!

చూశారా! సుకన్య తను చేసిన తప్పుకు ఆయనను వివాహమాడి, ముసలివాడన్న అసహ్యం పొందక, ఎంతో ప్రేమతో కాపురం చేసింది. ఆమె చేసిన పొరపాటుకు వివాహమే తప్పనిసరి శిక్ష కాదు. అయినా తండ్రిమాట దాటడం ఇష్టంలేక ఆ వివాహం చేసుకుంది. అయినా భర్తకు సహాయ పడుతూ కాపురం సాగించింది. వారి అదృష్టంగా చ్యవనుడు తిరిగి యౌవనరూపాన్ని పొందాడు.

## తల్లి, దండ్రి, గురువు దైవసమములు




### తల్లి

నవమాసములు మోసి నముగన్నతల్లి
నను పాలనిచ్చి నను సాకిన తల్లి
స్నానపానంబుల శ్రమ దీర్చు తల్లి
కఠిన పథ్యములుండి కాపాడు తల్లి
ప్రేమతో నను చాల పెంచిన తల్లి
తల్లికి మించిన దైవంబు గలదే?
తల్లి పూజ్యురాలు ధరణి నెల్లరకు!

### తండ్రి

చెమటోడ్చి కష్టించి మా క్షేమమునకు
ధనము సంపాదించి ఘనముగా మాకు
పప్పులు బెల్లము పండ్లు ఫలహారంబు
మంచి దుస్తులు దెచ్చి మా కిచ్చు తండ్రి
అల్లారు ముద్దుగా సల్లాపముగను
ఆదరించెడి తండ్రి అధికుడు మాకు
తండ్రి పూజార్హుడు ధరణి నెల్లరకు.

### గురువు

మాటలు రానట్టి మా మీద దయతో
అక్షరంబులు జెప్పి అతిసాహసమున
మాటలు నేర్పించి పాట పాడించి
పద్యముల్ చక్కగా పఠన జేయించి
మా మూర్ఖతను దొలచి మాకు వెలుగిచ్చి
గురుపాఠమును నేర్పు గురువు మా కెంతొ
పూజనీయుండగును భువిలోన నెపుడు.

— శ్రీ బుర్రి చెంగారెడ్డి

కాని ఈనాడో? చాలా మంది యువతులు తమ తల్లిదండ్రులు చే(చూ)సిన వివాహములు చేసుకోరు. నచ్చలేదంటారు. కుర్రవాడు ఆఫీసరు కాదు అంటారు. లక్షాధికారి కాదు అంటారు. కాని తాము కాపురం చేస్తున్నది, చేయవలసింది ఆ వ్యక్తితో అనీ, ధనం హోదా శాశ్వతం కాదని తెలుసుకోరు.

మరెందరో యువతులు ఉన్నత భావాలంటూ గొప్పగా చెప్పుకునేందుకు ప్రేమ మోజులో పడి అభాసుపాలై తల్లిదండ్రుల పరువుప్రతిష్ఠ పోవడమే కాక వారి మనస్తాపానికు గురి అవుతున్నారు. ఎందుకిలా జరుగుతుంది? అని ఆలోచిస్తే వారికి హిందూ ధర్మం గురించి, అందున్న విశిష్ట సాంప్రదాయాలు, ఆచారాలు గురించి తెలియక పప్పులో కాలేస్తున్నారని అర్థమవుతుంది.

"గృహలక్ష్మి" అన్న చక్కని పేరు పొంద గలిగే అవకాశం విడుచుకుంటున్నారు.

కొందరైనా ఈ నీతి చదివి మారితే, అది నా వలన జరిగిందనుకోను, భగవంతుడి కృప అనుకుంటాను.

శ్రీ వారంశెట్టి ఉమామహేశ్వరరావు

★




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉదయాస్తమాన సర్వసేవాపథకం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సంపూర్ణంగా అర్చించడానికి భక్తులకొక సదవకాశం!

తలుపులు తెరచినప్పటి నుండి తిరిగి తలుపులు మూసేవరకు ఒక దినంలో తిరుమల శ్రీవారి ఆలయంలో జరిగే సమస్త పూజావిధులను అనగా సుప్రభాతం, తోమాల, అర్చన (మూడు పర్యాయాలు) నైవేద్యం ఇంకా ఇతర ప్రత్యేక సేవలను ఉదయాస్తమాన సర్వసేవానిధి పథకం క్రింద భక్తులు తమ పేరిట స్వంత ఖర్చులతో స్వామివారికి జరిపించవచ్చును.

**పథకంలోని ముఖ్యాంశాలు :**

* కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం పేరిట ఒక లక్షరూపాయల విరాళాన్ని క్రాస్ చేసిన డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలి. శుక్రవారం సేవలకు మాత్రం మూడులక్షల విరాళం (అభిషేక నిమిత్తం) ఇవ్వవలసి వుంటుంది.

* భక్తులు తమ కైంకర్యములు జరిపే రోజున ఆరుమంది సభ్యులకు శ్రీవారి దర్శనం వుంటుంది. అనివార్య కారణాలవల్ల కొన్ని సేవలు రద్దుకాని పక్షంలో సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, ఏకాంతసేవల వంటి అన్ని పూజావేళలలో శ్రీవారిని దర్శించవచ్చును. (శుక్రవారం తప్పించి)

* కైంకర్యదినాన ఆలయంలోపల దాత పేరు ప్రదర్శింపబడుతుంది. గోత్రాదులతో సహా దాత పేరును శ్రీవారి కొలువులో ప్రకటిస్తారు

* ఆ దినాన జరిగే ఆర్జితసేవలన్నింటిని కైంకర్యదాత తన వారితోసహా తిలకించవచ్చును.

* కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవమూర్తులకు సమర్పించే శేషవస్త్రాలు మూడింటిలో ఒకదానిని గృహస్థుకు బహూకరిస్తారు. ఉచితప్రసాదంగా 25 లడ్డులను, 5 వడలను ఇస్తారు.

* వస్తువుల ధరలు గణనీయంగా పెరిగిపోయిన పక్షంలో పూజాకార్యక్రమాల అదనపు వ్యయాన్ని దాతలే భరించవలసి వుంటుంది. అందుకు సిద్ధంకానపుడు ఆనాటి అదనపు వ్యయం భర్తీ చేసేందుకు దేవస్థానం మరొకరి విరాళాన్ని స్వీకరించవలసి వస్తుంది. అటువంటి సందర్భాలలో ఒకరు లేదా అంతకు మించిన దాతల పేర్లతో ఆనాటి పూజలు జరుపబడుతవి.

* కైంకర్యములు జరిగే తేదిని గురించిన వివరాలను దేవస్థానం ఆ యా దాతలకు తెలియజేయగలదు.

ఈ పథకం గురించిన ఇతర వివరాలకు - వివరణలకు కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అనే చిరునామాకు వ్రాయండి.

( 11వ పేజీ తరువాయి )
చతుర్ముఖుడైన బ్రహ్మకలవాడు. ఆజాను బాహుడైన రంగ దున్నాడు. ఉత్సవ విగ్రహములు మూడు శ్రీరంగం నుండి తెప్పించినారు కాని దొంగతనం జరిగి స్వామి విగ్రహం పోవుటచే తిరిగి దానిని ప్రతిష్ఠించారు. ఆ విగ్రహాలు చూచుటకు మనోజ్ఞముగా నున్నవి.

## చతుర్భుజతాయారుగుడి

ఇది స్వామివారి ఆలయమునకు ప్రక్కనే కలదు. ఇందు నాలుగు చేతులు కల్గిన లక్ష్మీదేవి మూల, ఉత్సవ విగ్రహములు కలవు. రాతి పనితనము. శిల్పచాతుర్యమునకు మణిపూసగా చెప్పుకొనునట్లు ఈ గుడి నిర్మింపబడినది. రామప్ప, వరంగల్లు లోని వేయి స్తంభములగుడిలోని శిల్పి శిల్పకళ ఇందు కాననగును. ఈ ఆలయమునకు ముందు రెండు నల్లరాతి స్తంభములు కలవు. వీటి నునుపుదనములో మన ముఖము ప్రతిబింబించును. దాని ముందరనే కల్యాణ మంటపము కలదు. మంటపమునం దిరువైపులగల స్తంభములపై రాతిపని అద్భుతమైనది. లతలు, పండ్లు, చిత్రములు, ముగ్గులు, వివిధ కళాప్రదర్శన కలదు. దీనికెదురుగాగల ద్వారమును పూర్తిగా పూడ్చివేసి గోడను నిర్మించినారు. దసరా ఉత్సవ మిందు జరుగును.

## హోమశాల

జాతర సమయములలోను, నిత్య పూజల సమయములలోను హోమము చేయుటకు నాలుగు హోమ కుండములు కలవు. మధ్యభాగమున చక్రపెరుమాళ్ళు వేంచేయుటకు తగిన ఉన్నతాసనము కలదు. హోమమైన తర్వాత బలిని (పొంగలి) మంత్రోక్తముగా బాజా భజంత్రీలతో ద్వారపాలకులకు, అష్టదిక్పాలురకును, విష్వక్సేన, గరుడులకును నివేదన చేయుదురు. తర్వాత ధ్వజస్తంభమువద్ద పొంగలిని పూర్తిగా ఆరగింపుచేసి కార్యక్రమమును ముగింతురు.

## వాహనశాల

ఇందు వెండితో చేయబడిన గజ, గరుడ హనుమంత, శేష, చంద్ర అశ్వ వాహనములును, బంగారు పూతతో సూర్యవాహనము కలవు. వీటిని శ్రీరంగమునుండి తెప్పించినారు. ప్రతివాహనము రెండు, మూడు అడుగుల ఎత్తుండును. వాహనము మోయుటకు 16 గురు కావలయును,

## పాకశాల

ఇది వంటశాల. స్వామికి ప్రతి నిత్యము. కావలసిన ప్రసాదము ఇందు పాకము చేయుదురు. చెఱువునుండి ఇందులోనికి నీరు తెచ్చుటకు మెట్లు వేరుగా కలవు. సుమారు 5, 6 వందల మందికి సరిపోవు వంట యిందు చేయుటకు తగిన వసతి, వస్తుసామాగ్రి కలవు.

## నేలబొయారము

నేలలో డండు ఒక పెద్దహాలు. దీనిలోనికి వెళ్ళుటకు వలయాకారముగా మెట్లు గలవు. ఇక్కడచల్లగాను, నిశ్శబ్దముగాను ఉండును. మఠాచార్యుల కిది ఒకప్పుడు విడిదిగా యుండెడిది. ఇందుగల కిటికీలనుండి దూరపు కొండలు, చెరువు సౌందర్యముచూడ ముచ్చట గొల్పును. దేవాలయముచుట్టు ప్రహరీగోడ కలదు.

## పన్నిద్దరాళ్వారుల గుడి

పన్నెండుగురు ఆళ్వారులు కలరు. వైష్ణవ మతమున సిద్ధినందిన ప్రపన్న భక్తులను ఆళ్వారు లందురు. ఇందుగల ఆత్మవంటివాడగు నమ్మాళ్వారు నాలాయిర ప్రబంధమున మూడవ భాగమగు తిరువాయ్‌మొజియు, నాల్గవ భాగమున కొంతయు వ్రాసిరి. పన్నెండుగురును భగవంతుని గూర్చి రచించి పొగడి కీర్తించి శ్రీకైవల్యము నొందినవారు. ప్రజలకు పరమాత్మని గూర్చి తెల్పిరి. ఆ పన్నెండు గురు పొయిగై, పూదత్త, పేయు, నమ్మ, మధురకవి, తిరుప్పాణి, తిరుమళిశై, కులశేఖర, తొండరడిప్పొడి, తిరుమంగై, పెరియ, గోదాదేవి, రామానుజ, మణవాళ మహాముని గురులు :- విశిష్టాద్వైత మత ప్రవక్త భగవద్రామానుజులు. మణవాళ మహాముని గుడులయందు తీర్థపరిగ్రహణము జరుగును. వారి అనుమతితోనే ఇతర కార్యక్రమములు జరుగును.

## అధ్యయనోత్సవ మంటపము

దీనిని 'కొతాయి' అందురు. ఆలయానికి తూర్పువైపు కలదు. ఇక్కడనున్న ఈ ద్వారాన్ని వైకుంఠద్వారమని పిలుస్తారు. వైకుంఠ ఏకాదశికి స్వామి యీ ద్వారానికి వస్తారు. అప్పుడు ప్రజలు ద్వార దర్శనము తరువాత స్వామి దర్శనం చేసుకొని తరిస్తారు. ఇక్కడ విశాలమైన మంటపము నందలి స్తంభములపై నాగబంధము, కుండలినీ స్వరూపమును తెల్పు శిల్పకళ కలదు. పుష్యమాసమున పది రోజులు ఇందు నాలాయిర ప్రబంధమును పఠింతురు. ఈ ఉత్సవమున 'వయ్యారిసేవ'


అధ్యయనోత్సవ మండపము

ప్రత్యేకమైన ఆకర్షణ. చివరి ఉత్సవము "పరమపదోత్సవము." నమ్మాళ్వారు పరమ పదమునందుట ఇందు ప్రధానమైనది. చిత్రమున ఆ మంటపమును చూడవచ్చును.

## చిన్న, పెద్ద గాలిగోపురములు

చిన్నది స్వామికి ఎదురుగా గల ధ్వజ స్తంభ మునకు ముందున్నది. మూడు అంతస్థులు కలిగి వివిధ బొమ్మలతోనున్నది. దీనిపై కలశములుకలవు.

పెద్ద గాలిగోపురము చిత్రమున చూడ వచ్చును. దీనికి ఐదు అంతస్థులు కలవు. క్రింది భాగము చాల ఎత్తున్నది. సుమారు 20 అడుగుల ఎత్తుగల ద్వారములు కలవు. ఇందు స్వామివారి స్వరూపమును చిత్రించు నమూనా శిల్పము కలదు. చిత్రమున దానిని శేషశయనుడైన రంగనాథస్వామిని చూడవచ్చును. ఈ శిల్పమున నాభియందు బ్రహ్మదేవుని చూపలేదు. ఈ శిల్పము చివర అంజలి చేసుకొని నిలుచున్న విభీషణుడు కలడు. దీని విషయ మేమన రామావతార మున విభీషణుడు కోరగా తన విష్ణుపదస్వరూ పమును రాముడు విభీషణున కనుగ్రహిం చెను. ఆ స్వరూపమే ఇది దానికి కొంచెము ముందుగా సీతా రామాదుల విగ్రహములు మనోహరముగా నున్నవి. దాని కెదురుగా గోపుర నిర్మాతల శిల్పములు కలవు. వాటికి కొంత ముందునకు మతాచార్యుల శిల్పము శాసనము కలదు. దేవాలయమున ఆళ్వా రుల గుడిప్రక్కన రెండు శాసన ఫలకములు నల్లరాతిపై అందముగా చెక్కబడి యున్నవి. ఇందలి భాష సంస్కృతము. శాసనముల పోలిక యిందెక్కువగా నున్నది. ఇవన్నియును గోడలకు శిలలపై నిర్మించ బడినవి. క్రిందగల పెద్ద కడవ దగ్గరలో ఒక భక్తుడు సాష్టాంగ నమస్కారము చేయు శిల్ప మున్నది. గోపుర నిర్మాతలలో వీరొ కరు కావచ్చు.

గోపురపై భాగమునగల శిల్పములు గచ్చుచే తయారుచేయబడినవి. అందు కృష్ణుని చిలిపిచేష్టలు, అమృతంకోసం సాగర మథనం చేస్తున్న సురాసురులు, ప్రణయ సన్నివేశములు, రంగని స్వరూ పము, నరసింహుని వీర స్వరూపము, సింహతలాటములు అటుపైన బంగారు పూత పూసిన కలశములు, క్రింద రామా యణ కథా సన్నివేశములు, ముందు భాగమున సుందర స్త్రీ మూర్తులు, లోపల దశావతారమును తెల్పు శిల్పకళ ఇతర అనేక విషయములు చూడ ముచ్చట గొల్పు నట్లు చిత్రించినారు. చూడవలసినదే కాని, వ్రాయుటచే అంత ఆనందమును పొంద లేము. దీనిముందు రాతి ధ్వజ స్తంభము కలదు.

## పారువేట మంటపము

ఇందు స్వామి దసరా రోజున అశ్వారూ ఢుడై వేంచేయును. ఆయుధపూజ, శమీ పూజ ముందు జరిగి మంత్రపూర్వకముగా అన్నివైపులకు అస్త్రములు వదులుదురు. అక్షతలు జమ్మి కలిపి ఒకరి కొకరు యిచ్చు కొందురు.

## నౌబత్ఖానా

ఇది ఒక చిన్నమంటపము. పూర్వము ఇందు అనేకరకములైన వాద్యము లను వాయించెడివారు. కాని నేడు శిథిల ముగా యున్నది.

### నా స్వామి

ఎంత సుదినమొ స్వామి మోమెంత సొగసొ
కనుల కరవు తీర మనసు గాంచ గలిగె
చూడ చూడ తిరుత్తణి మేడమీది
చిన్నవాడు తిరుమలేశు చిహ్నమాయె.

చేత దండము నీకు నా చేత దండ
మోము చిరునవ్వు నీకు నా మోవి చివురు
కరము కటిచూపు నీకు నే శరణ మంటి
భవ। శరవణభవా। నా కథయ మొసగవె.

పాప పుణ్యాల జోలేల? పాపి నేను
ఖండితముగ ఖండించవే కల్మషాల
వేలుతోడ నీ పాదాల వ్రేలువాడ
స్వామి। తణికాచలస్వామి। స్వామి గురుడ.

అమ్మ చూస్తిని తణికాచలమ్మ చూస్తి
తెరతీయగ మనసులో తెరలు లేచె
తెలిసొగసుల మా తల్లి నా తెరయిటాడె
తనయ భయమేల నేను నీ తల్లి నెఱుగు.

ఉండలే నిక స్వామి నీ కొండ చేర
రాక, వద్దు రావద్దన్న రాక మాన
మరచి నాడవె మననామ మరయనొకటె
శ్రీనివాసుడ దాసుడ శ్రీనివాస.

—శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు



### ఆండాళ్ సన్నిధి

ఈ ఆలయమునకు అర్ధ కి. మీ. దూరములో అమ్మవారి గుడి కలదు. ఈ ఆలయములోని దేవిని చూడికొడుత్తనాచ్చియార్, గోదాదేవి, ఆండాళ్, ఆముక్తమాల్యద అని పిలుతురు. సుందరమైన విగ్రహము. ఉత్సవ, మూలవిగ్రహములు చాల సునిశితముగానున్నవి 'పెరియాళ్వారు' నకు ఈమె తులసి వనంలో లభించినది. రంగని సేవలో తన్మయురాలై అతనినే వివాహము చేసుకొన్నది. 'తిరుప్పావై' అను గ్రంథము మునీమె రచించినది. ఈ ఆలయంలో పెరియాళ్వార్, వానమామల రామానుజస్వామి గుడులును కలవు. ఈమె ఉత్సవములు ఆషాఢ మాసములో జరుగును.

### కోనేరు

ఈ ఆలయమునకు ముందు భాగమున ప్రక్కకు "కోనేరు" అను దిగుడుమెట్లు బావి కలదు. మూడు వైపుల మెట్లు (మెలికలు తిరుగుతూ) ఇందులోనికి వెళ్ళుటకు నిర్మింపబడినవి. ఇంకొకవైపు తోటలోనికి నీరు తోడుకొనుటకు మోట కలదు. దీనిలో అన్ని నదులు, సముద్రముల నీరు కలిసి యుండుటచే దీనిలో స్నానము చేయుట మంచి దని ప్రతీతి.

దీనికి దగ్గరలో స్వామివారి తోట యున్నది. అందుండి స్వామివారికి పూజకు తులసీదళములు, పూవులు తీసుకొని వత్తురు. పూర్వము ఇందు వసంతోత్సవము జరిగెడిది. అమ్మవారి నీరాటోత్సవముకూడా జరిగెడిది. ఇందొక మంచి నీటి బావి కలదు.

స్వామివారికి ఆశ్వయుజంలో నవరాత్రి ఉత్సవాలు. పుష్యమాసంలో ముక్కోటి ఏకాదశి, అధ్యయనోత్సవములు, ఫాల్గుణ మాసంలో పౌర్ణమి కలుపుకొని 15 రోజులు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. బ్రహ్మోత్సవ సమయంలో అన్ని వాహనాల ఊరేగింపు జరుగును. ప్రత్యేకంగా రథోత్సవము జరుగును. జాతర సమయంలో ఈ పెద్ద రథముపై స్వామిని వేంచేపుచేసి జనులు లాగుదురు. మధ్యన హనుమదాలయము కలదు. ఇక్కడ రథోత్సవము ఉదయము కొంతదూరమువరకు అనగా ఆండాళ్ గుడి వరకు వెళ్ళి తిరిగి హనుమదాలయము వరకు తెచ్చి ఆపుదురు. రాత్రి హనుమదాలయమునుండి స్వామివారి పెద్ద గాలిగోపురము వరకు లాగుకొని వత్తురు. అమ్మవారికి కూడా చిన్న రథము కలదు.

చెఱువు మధ్యభాగమున 'కృష్ణవిలాస్' అను సుందర భవనము విశ్రాంతి గృహముగా నుండెడిది. ప్రస్తుతమది శిథిలమైనది పెద్ద గాలిగోపురమునకు ప్రక్కగా నూతన పద్ధతిలో ఒక విశ్రాంతి మందిరము నిర్మింపబడినది.

పూర్వము అంగరంగ వైభోగంగా జరిగిన యీ దేవాలయము నేడు కుంటుబడుచున్నది. దీనిని ఇంకను అభివృద్ధిచేసిన వేదపాఠశాల, గురుకుల పాఠశాలలను నిర్మించుకొనుటకు అనువుగా నున్నది. కళలను, ప్రాచీన నాగరికతను, ఆలయాల ఔన్నత్యాన్ని యింకా అభివృద్ధి చేసిన మన సంస్కృతి యింకను రాణించును. ఇక్కడికి వనపర్తి, కర్నూలునుండి బస్సు సౌకర్యము కలదు. ఈవిధముగా "రంగనాథాలయము" ప్రకాశించుచున్నది.

– శ్రీ వేదాంతం నరసింహాచార్యులు

★




చ్యవనుని పుత్రుడు దధీచి యొక ముని. మహాతపశ్శాలి. ఇతని భార్య లోపాముద్ర. (సువర్చ). దేవతలు దధీచిని సమీపించి యతని యెముకల నడిగినప్పుడు దధీచి తన భార్యను లోపలికి బొమ్మని తాను ప్రాణము విడిచి తన యస్థులను దేవతల కిచ్చెను. కొద్దిసేపటికి లోపాముద్ర తన భర్త సన్నిధికి వచ్చి చూడగా నాతడు మరణించి యుండెను. శోక తప్తయై దేవతలపై కినుక వహించి "మీరు పశువులు కం" డని దూషించి యామె తన భర్తతో సహగమనము జేయనెంచి చితినెక్కబోయెను. అపుడశరీరవాణి యామెను వారింపబోయి 'నీ గర్భమందు బాలు డున్నా" డని చెప్పెను. కాని యామె వినక చితి నెక్కగా గర్భము నుండి బాలుడు జారిపడెను. అతడే పిప్పలాదుడు.

తల్లి వీనిని పిప్పల వృక్షము క్రింద నుంచి అగ్నిలోబడి భర్తను గలిసి కొనెను. పిప్పల వృక్షములే యీ శిశువుపై జాలిగొని చంద్రు నడిగి యమృతము దెచ్చి వానికి బెట్టి పెంచినవి. కావున వీనికి పిప్పలాదుడని పేరు వచ్చెను.

క్రమ క్రమముగా పిప్పలాదుడు పెరిగి పెద్దవాడయ్యెను. గొప్ప ఋషి అయ్యెను. తన తండ్రిమరణమునకు దేవతలే కారణమని తెలిసికొని వారిని చంప నిశ్చయించి చంద్రునితో నాలోచించెను. గోదావరి తీరమున కేగి శివస్తోత్రము జేయుమని చంద్రుడు పిప్పలాదుని కాదేశించెను. అత డట్లేపోయి శివుని గురించి స్తోత్రము చేయుగా శివుడు ప్రత్యక్షమై పిప్పలాదుని కోరికమేరకు కృత్యను పంపెను. దేవతల నందరిని సంహారము చేయుమని పిప్పలాదుడు కృత్య నాజ్ఞాపించెను. ఇది విని దేవత లందరు గజగజ వణకుచు శివుని కడకు బోయి ప్రార్థించిరి. శివుడు దేవతల కభయ మిచ్చి కృత్యను "బడబ" రూపమున గంగలో నుండు మని ఆదేశించెను. పిప్పలాదుని కడకు వచ్చి "నీ వేల దేవతలను చంపెదవు! వారు మరణించినను నీ తండ్రి మరలిరాడు గదా! నీ ప్రయత్నము విరమింపుము" అని చెప్పెను. ఇప్పుడు కృత్య నాపుట నావలనకాదు. నా ప్రయత్నము మానెదను. నా తల్లిని తండ్రిని పితృలోకమున జూడ గల్గునట్లు నాకు వర మిమ్ము" అని పిప్పలాదుడు శివుని ప్రార్థించెను. దేవతలందరు కృత్యనే ప్రార్థించిరి. ఆమె 'నేను బడబ రూపమున గంగలో నుందు" ననెను.

అప్పుడు దేవతలందరు కృత్యను స్వర్ణ కలశములో నుంచి గంగ కడకు తీసుకొని వెళ్ళిరి. గంగ యొక్కతియే భరింప జాలనందున యమునా, సరస్వతి నదులందు గూడ యుంచి యామెను సముద్రమునకు తీసికొని పోయిరి.




ఒకనాడు పిప్పలాదుని ఆశ్రమమునకు అనరణ్యుని కూతురు "పద్మ" యను కన్య రాగా నామెను చూచి వలచి పిప్పలాదుడు యామెను వివాహము చేసి కొనెను.

పిప్పలాదుని కడకు సుకేశుడు, సత్యకాముడు, గార్గ్యుడు, కౌశల్యుడు, వైదర్భియు, కబంధియును బ్రహ్మజ్ఞానము నేర్చుకొనుటకు శిష్యులై సమిధలతో వెళ్ళిరి. పిప్పలుడు వారు వచ్చిన కార్యమును విచారించి మీరొక సంవత్సరము పుణ్యవ్రతము చేయుచు, బ్రహ్మచర్య వ్రత మందుండి మా యాశ్రమమందే ఉండు" డని చెప్పెను. వారును అట్లే సంవత్సర ముండి తమ కోర్కెలను నెరవేర్చుకొని వెళ్ళిపోయిరి.

పిప్పలాదుడు మహాజ్ఞాని. తత్త్వ సంపన్నుడు. ఆతని విచక్షణాజ్ఞానము చేతనే దేవతలందరు బ్రదుక గలిగిరి. ఇతడొక దైవాంశ సంభూతుడు.

— శ్రీ యస్. కె. బాజీరావు

# వందే శ్రీరంగనాయకీమ్

"కర్కటే పూర్వఫల్గున్యాం
తులసీ కాననోద్భవామ్,
పాండ్యే విశ్వంభరాం గోదాం
వందే శ్రీ రంగనాయకీమ్."

కలియుగ ప్రారంభంలో 98 వ సంవత్సరమైన నలనామ సంవత్సర ఆషాఢ (కర్కాటక) శుద్ధ చతుర్థీ మంగళవారం పూర్వఫల్గునీ నక్షత్ర తులాలగ్నమునందు భూదేవి అయోనిజగా ఆవిర్భవించి శ్రీ విలుపుత్తూరులో విష్ణుచిత్తులకు (పెరియాళ్వార్లు- భట్టనాథులు) తులసీవనం త్రవ్వుతూండగా, తులసీ మూలమున సాక్షాత్కరించింది. గరుడాంశసంభూతులైన విష్ణుచిత్తులు, విలుబుత్తూరు వటపెరుంగోయిల్‌లో వేంచేసియున్న వటపత్రశాయి స్వామికి, నిరంతరం తులసీ పుష్ప కైంకర్యంచేస్తూండేవారు. అలా దివ్యతేజంతో సాక్షాత్కరించిన, ఆ బిడ్డకు, "గోదా" అని నామకరణం జేసి, అల్లారుముద్దుగా పెంచుకోసాగారు విష్ణుచిత్తులు. గో=సర్వసంపదలు; వాక్; జ్ఞానము దా=ఇచ్చినది (తిరుప్పావురూపమున) లేక యిచ్చునది(ఆరాధిస్తే) అలా భక్తుల ననుగ్రహించేది గనుక "ఆండాళ్" అని యామెకు మరో పేరు.

నిరంతర గోవిందనామ సుధారసాస్వాదనాధురీణులై, ముకుంద పాదారవింద కైంకర్యాయత్త చిత్తులైన విష్ణుచిత్తుల పెంపకంలో వర్ధిల్లుతున్న ఆండాళ్, తండ్రిగారు అనవరతమూ వటపత్రశాయి పెరుమాళ్ళకు జేసే పుష్పకైంకర్యంలో పాలుపంచుకుంటూ, వారివల్ల భాగవత కాలక్షేపమును గ్రహిస్తూ, దినదిన ప్రవర్ధమానయై, యౌవనారంభ దశలో ప్రవేశించింది. తండ్రిగారి వలెనే తాను గూడా ఎల్లప్పుడూ విష్ణువునందే చిత్తమును లగ్నం చేయడం నేర్చిన ఆండాళ్ స్వామికి సమర్పించే పుష్పమాలికల సొగసు యెంతటిదో తాను స్వయంగా ముందు ధరించిచూచి, ఆనందించి మనస్సుకు నచ్చినవే ఎన్ని తండ్రిగారి పూసజ్జలో వుంచేది.

ఒకనాడది గమనించిన విష్ణుచిత్తులు, ఖిన్నులై "అయ్యో! ఈమె స్వామికి నిర్మాల్యములు సమర్పిస్తున్నదే" యని పరితాపం జెందుతూ, కుమార్తెను లాలనగా మందలించి, "స్వామీ! నాబిడ్డ తెలియక జేస్తున్న ఈ అపచారమును మన్నించరాదా?" యని పెరుమాళ్ళను పదేపదే ప్రార్థిస్తూ, వేరే మాలలు కట్టించి, సన్నిధికి జేరి, స్వామికి సమర్పింపబోగా పెరుమాళ్ళు వాటి నంగీకరించక గోదాదేవి సిగ తురిమి తీసిన సుమమాలలే తెమ్మన్నారు. అలాగల్గిన శ్రీయఃపతి కటాక్షమున కాశ్చర్యచకితులై, పరమానంద భరితులైన విష్ణుచిత్తులు, స్వామి కత్యంత ప్రీతి పాత్రురాలైన, బిడ్డను ముద్దాడి, ఆమె సాక్షాత్ మహాలక్ష్మీరూపమే నని నిర్ణయించుకున్నారు. నిత్యమూ అలా గోదా నిర్మాల్యములనే విష్ణుచిత్తులు సమర్పిస్తూంటే వటపత్రశాయి అత్యంత ప్రీతితో స్వీకరించి, అనుగ్రహించేవారు.

ఇలా వుండగా యుక్తవయస్సు వచ్చిన గోదాదేవికి వివాహం చెయ్యాలన్న ఆలోచనతో వున్న విష్ణుచిత్తులు, ఒకనాడు కుమార్తెను చేరబిలచి "అమ్మా! నీకు వివాహమునకు తగిన ప్రాయం వచ్చింది. వరుని విషయంలో నీ అభిప్రాయం ఏమిటి?" అంటూ ప్రశ్నించారు. తండ్రిగారి మాటలు విన్న ఆండాళ్ సిగ్గుతో శిరస్సువంచి, "తండ్రీ! పురుషోఽహ వై నారాయణః" అన్నట్లు, సర్వచేతనులకూ శ్రీమన్నారాయణు డొక్కడే పురుషుడై యుండగా, ఆ పురుషోత్తముని దక్క యన్యు నెవ్వని నేను వరించగలను?" అంటూ సమాధానం చెప్పింది. ఆ సమాధానమున కబ్బురపడ్డ విష్ణుచిత్తులు "శ్రీమన్నారాయణుడు రామకృష్ణాది విభవావతారములలో నున్నపుడైతే ఒకవేళ యిలాటిది కుదురుతుందేమో గాని, అర్చామూర్తిగా నున్న స్వామితో ఈమె వివాహ మెలా సాధ్యము?" అని చింతిస్తూ "అమ్మా! ఇప్పుడు స్వామి, శ్రీమన్నారాయణుడు అనేక దివ్యదేశములలో అర్చామూర్తులుగా వేంచేసి యున్నారు గదా! ఇందులో నీవు ఏమూర్తిని వరిస్తావు?" అంటూ మళ్ళీ ప్రశ్నించారు. అనేక దివ్యదేశములలో అనేక మూర్తులుగా నున్నా సర్వమూ శ్రీమన్నారాయణుని లీలా విభూతియే నని తెలిసిన ఆండాళ్, ఆ యా భగవత్ స్వరూపములనూ, కళ్యాణ గుణములనూ శ్రోత్రపేయంగా తండ్రిగారి వల్ల వినగోరినదై, వరుని నిర్ణయించుకొనడానికి వీలుగా సకల దివ్యదేశములలోనూ వెలసియున్న మూర్తులను వివరించ వలసిందిగా కోరింది.

ఆనందాతిరేకంతో విష్ణుచిత్తులు వివిధ అర్చావతారములనూ వర్ణిస్తూంటే ఏకాగ్రచిత్తంతో విన్న ఆండాళ్ 'తండ్రీ! ఆయా మూర్తులను నేను స్వయంగాచూచే అవకాశం కలిగిస్తే ధన్యురాలను" అని ప్రార్థించింది. ఆమె కోరిన కోరికకు పరమాశ్చర్యము పొందిన విష్ణుచిత్తులు, దేశమంతటా గల నూట ఎనిమిది దివ్య దేశములనూ ఆమెకు చూపిస్తూ బోవటం సాధ్యమా? అని ఆలో

చించి, పరమాత్మయెడ నిత్య, నిరవద్య నిరతిశ యోజ్వల భక్తి ప్రపత్తులు గల మహనీయులు గనుక, ఒక్కసారి శ్రీమన్నా రాయణాష్టక్షరీ మహామంత్ర రాజమును జపించి, హృదయమున వైకుంఠుని దివ్య మంగళ స్వరూపాన్ని సంధించి, ఆ యా దివ్యదేశము లందలి అర్చామూర్తులనే తమ వద్దకు వచ్చి సేవ అనుగ్రహించ వలసిందిగా ప్రార్థించారు.

విష్ణుచిత్తులు ఒక్కొక్కమూర్తినీ మన స్సులో స్మరించి, మంగళాశాసనం చేస్తూ వుంటే......స్వామి........ ఆ యా మూర్తుల రూపంలో ఆ తండ్రీ కుమార్తెల కెదురుగా వచ్చి దర్శన మనుగ్రహించ సాగారు. అలా వస్తున్న క్రమంలో విష్ణుచిత్తులు అతి ప్రేమగా "వటపెరుంగోయిల్ కొండానే" అంటూ మంగళాశాసనం చెయ్యగానే, శ్రీవిల్లి పుత్తూరులోనే వేంచేసియున్న వట పత్రశాయి వచ్చి సేవ యనుగ్రహించగా స్వామి యెడ చిన్ననాటి నుండీ ఎరిగిన చనువు చూపిందిట ఆండాళ్........ముక్కు పచ్చ లారని మృదుమధుర స్వరూపంతో సంపత్పుత్రుడు యదుగిరి నాథుడు ప్రత్యక్షం కాగానే స్వామి సుకుమార ముగ్ధ సుందర వదనార విందాన్ని ముద్దుముద్దుగా చూచిందట........ ... అత్యుగ్రతేజోమూర్తి యైన అహోబిలనారసింహుని చూడగానే అంజలి ఘటించి స్వామిని స్తవం చేసిందిట నిరంతర శ్రీస్తనకస్తూరీ వాసనావాసిత రసి కుడైన శ్రీహస్తిగిరి నాథుడు వరదరాజ ప్రభువు పుణ్యకోటి విమానము నుండి కదలి వచ్చి, వరదాభయహస్తములతో దర్శన మిస్తూంటే, స్వామి సౌందర్య సౌలభ్యాలను తనవి తీరా దర్శించిన ఆండాళ్ వందనం సమర్పించిందట...........అనంతరం పెరి యాళ్వారులు ఎలుగెత్తి "సిన్దామణిగళ్ వగరల్లై, పగల్సేయుమ్ తిరువేజ్గడత్తానే!" అంటూ శ్రీవేంకటాద్రి శిఖరాలయ కాలమే ఘనమైన తిరువేంకటపతికి మంగళాశాసనం చెయ్యగానే సర్వచేతనులనూ సమ్మోహ బరచే సర్వావయవ దివ్య సౌందర్య శోభి తుడై, దివారాత్రముల నొక్కటిగా వెలి గించే చింతామణుల కాంతులతో కొనగోటి నుండీ మకుటాగ్రం వరకూ వెలలేని ముక్తా భరణములను ధరించి, నిత్య శ్రీకాంతా కళ్యాణ నిధి గనుక పారాణి యారని పాద ముల గండ పెండెరపు "ఘణాం ఘణ" ధ్వనులతో మరకత మణిస్తంభ గంభీర బాహువుల, సింహతలాటపు మువ్వల సవ్వడు లతో ముఖమున పచ్చ కప్పురపు తిరు నామము మెరయ దైవరాయ సార్వ భౌముడై, ఛత్ర చామరాది రాజలాంఛన ములతో వేయి ఏనుగులు పరివేష్టించిరాగా పూర్ణకుంభములతో మంగళవాద్యములతో ఆనంద నిలయ విమానచ్ఛాయల నుండీ కదలివచ్చి శ్రీనివాసుడు దర్శన మనుగ్ర హిస్తూవుంటే కన్నుల నీరు నిండగా, కడలి వలె ఉప్పొంగిన ఆండాళ్ స్వామికి కైమోడ్పు చేసిందట..........

చిట్టచివరకు పెరియాళ్వార్లు "ఆద్యం స్వయం వ్యక్తం" అన్నట్లు స్వయం వ్యక్త అర్చామూర్తులలో ఆద్యుడైన శ్రీరంగమంగళమణి, కరుణా సింధువు, శ్రీరంగధాముని దలంచి "కణ్ణలమ్బగలమ్" అంటూ గద్గదస్వరంతో స్తవంజేసి

"లక్ష్మీచరణ లాక్షాంక
సాక్షాత్ శ్రీవత్సవక్షసే,
క్షేమంకరాయ సర్వేషాం
శ్రీరంగేశాయ మజ్గళమ్."

అని మంగళాశాసనం చెయ్యగానే ఉభయ కావేరి మధ్యదేశ శ్రీరంగ నగర సప్తప్రాకా రాంతర ప్రణవాకార విమానమునుండి కదలిన శ్రీరంగేశ్వరుడు శ్రీవత్సకౌస్తుభ ప్రభలతోగూడిన తిరుమేన, మకర కుండల హారకేయూరాది సర్వాభరణ భూషితుడై ముక్తాకిరీటోజ్వలుడై, కస్తూరీకలితోర్ధ్వ పుండ్ర తిలకాంకిత లలాట ఫలకుడై, సవి భ్రమ భ్రూలతలతో కర్ణాంతలోలేక్షణుడై, ముగ్ధ స్మేరమనోహరాధర దళంబుల, మంద హాసంబుజింద తక్షణోన్మీలిత సరసి జ సదృశ నయన యుగళమునుండి, కరుణాసుధా రసం వెల్లివిరియగా, కలభసుందరగ మనుడై, వచ్చి దర్శనమనుగ్రహిస్తూ ఉంటే ఆరంగధాముని కటాక్షామృత ధారలతో కరిగి ఆ దివ్య విభూతిలో ఓలలాడిన ఆండాళ్ తన్మయత్వంతో స్వామి శ్రీ చరణ మంజ రుల పై బడి స్మృతికోల్పోయిందట........ అది గమనించిన విష్ణుచిత్తులు శ్రీరంగపతి తేజోమయ స్వరూపమే ఆమె చిత్తమున హత్తుకొన్నదని గ్రహించారు.

అలా రంగధాముని పాదాంబుజ ద్వయ మునే తన హృదయ పీఠముపై పాదు కొల్పిన ఆండాళ్ పూర్వం వ్రజకులమున శ్రీకృష్ణ పరమాత్మతో విశ్లేషమును ఒక్క గడియ యైనా భరించలేని గోపికలు, స్వామిని బొందటాని కొనర్చిన "కాత్యాయి నీ' వ్రతమును, అనుసరించి, ధనుర్మాస వ్రతము అనే కల్పము నొకదానిని ఏర్ప రచు కొని "మార్గళి" (ధనుర్మాసం) నెల రోజులూ వ్రత కాలంగా ఎన్నుకొని శ్రీవిల్లి పుత్తూరు వ్రేపల్లె గానూ, అక్కడ వున్న "తిరుముక్కోళం" అన్న సరస్సు యమునా నదిగానూ, స్వామి వటపత్రశాయి శ్రీకృష్ణ పరమాత్మగానూ, తానొక గోపికగానూ, తోడి కన్నియలందరూ, తక్కిన గోపికలు గానూ, భావన జేసి, ప్రతి రోజూ నియ మంతో తెల్లవారు జామున ధనుర్లగ్నంలో సరస్సుకు వెళ్ళి స్నానం జేసి, స్వామిని దర్శించి వచ్చి, రోజూ ఒకటి చొప్పున ముప్పది రోజులూ ముప్పది పాశురములు, ద్రావిడంలో "తిరుప్పావై" యనే పేరుతో అనుగ్రహించింది. ఈ తిరుప్పావై అజ రమూ-అమరమూ. బ్రహ్మవాక్యైన వేదం ఋషుల ముఖతః లోకమునకు వచ్చినట్లు పీతత్వమానమైన తిరుప్పావు ఈమె ముఖతఃసర్వ ఆస్తిక ప్రపంచానికి అందింది. ద్రవిడ ప్రబంధములకు తలమానికమైన ఈ తిరుప్పావును శ్రీవైష్ణవులు ఆలయ ములలోనూ, గృహములలోను నిత్యం రెండు పూటలా అనుసంధిస్తారు. శ్రీ భాష్య కారులైన భగవద్రామానుజులు ఈ తిరు ప్పావును, నిరంతరం అనుష్ఠించి, "తిరు ప్పావై జీయర్" అన్న సార్థక నామంతో ప్రఖ్యాతు లయ్యారు. అలా తన్మయులై

గానం చేసుకుంటూ-ఒక్కొక్కసారి తాదాత్మ్యం చెంది స్మృతికోల్పోయెడి వారట గూడ. ఈ తిరుప్పావుకు ఈ రాయిరప్పడి, మూవాయిరప్పడి, నాలాయిరప్పడి, అని అనేక విశేష వ్యాఖ్యలున్నాయి. ధనుర్మాసం పేరిట అంతటి తిరుప్పావునను గ్రహించింది ఆండాళ్ తల్లి.

అలా ముప్పది రోజులూ వ్రతమును పూర్తిజేసి, అవభృథ స్నాన మొనర్చి, ఆండాళ్ నిత్యమూ శ్రీరంగనాథుని సమాగమం కొరకై నిరీక్షించేది. శ్రియఃపతినే చిత్తమున నిల్పిన ఆండాళ్ తానొక మాధవీ లతయై, మాధవుడనే పందిరి కెగబ్రాకి, భక్తి వల్లరులనే బాహువుల పెనవేసుకొని, స్వామి కటాక్షమనే నిరుపమాన దివ్య జ్యోత్స్నకై నిరంతరం చకోరమువలె ఎదురు చూచేది. పరమాత్మను అనుభవిస్తూ స్వామి కళ్యాణ గుణములను గానం చేసిన ఆళ్వారాచార్యుల దివ్య సూక్తులను కోయిల కూతలవలె ఆలకించేది. తనకూ పరమాత్మకూ మధ్య అడ్డంగా ఉన్న "మణికవాటపు గడెల" ను తీయవలసిందంటూ స్వాచార్యులను(తండ్రిగారిని) వేడుకునేది. సదా స్వామి దివ్య సుందర రూపమును కలలు గంటూ మరో నూట నల్వదిమూడు పాశురములను "నాచ్చియార్ తిరుమొళి" అన్న పేర అనుగ్రహించింది. శ్రీయః పతి కరుణాకటాక్ష సుధా బిందువుల కొరకై అనుక్షణమూ చాతకము వలె కాచుకొని ఉన్న ఆండాళ్, నిరవధిక, నిరతిశయ భక్తి ప్రపత్తులతో స్వామికి తప్ప తాను అన్యులకు అర్హురాలను కాననేది. ఆశ్రీయః పతికే తన్ను నైవేద్యం చేయ వలసిందిగా కాముని ప్రార్థించేది. అచేతనులను గూడా తన పరితాపమును రంగపతికి నివేదించ వలసిందిగా అర్థించేది. రోజు రోజుకూ వెలవెలబారిపోతూ పిచ్చిదాని వలె భగవత్ప్రాప్తికై తపించి పోతున్న ఆండాళ్ అవస్థను చూడలేని విష్ణుచిత్తులు వటపత్రశాయిని ప్రార్థించగా, ఆమెను శ్రీరంగమునకు జేర్చి రంగనాథుని కర్పించ వలసిందిగా ఆజ్ఞాపించారు స్వామి. ఒక నాడు రంగనాథుని ప్రార్థించి పవళించిన విష్ణుచిత్తులకు శ్రీరంగ విభుడు స్వప్నమునందు సాక్షాత్కరించి, తాను బంపే పల్లకిలో ఆండాళ్‌ను శ్రీరంగమునకు తెమ్మని ఆదేశించి—అక్కడ శ్రీరంగములో—"నా ముత్యాల పల్లకిని తక్షణమే శ్రీ విల్లిపుత్తూరు పంపి, విష్ణుచిత్తులవారి బిడ్డయైన ఆండాళ్‌ను సగౌరవంగా సపరివారంగా తీసుకొనివచ్చి, నాకు శంతన మండపంలో వివాహం చెయ్యండి" అని ధర్మకర్తలను అర్చకముఖంగా ఆదేశించారు.

అనుకున్న ప్రకారం మరునాటి కల్లా సర్వ లాంఛనములతో శ్రీరంగంనుండి రానే వచ్చింది పల్లకి. శ్రీ విల్లిపుత్తూరు ఊరు ఊరూ సర్వచేతనాచేతనములతో సహా వివాహానికి తరలింది. కుమార్తెను పల్లకిలో ఎక్కించి ప్రయాణమౌతున్న విష్ణుచిత్తులను వారి శిష్యుడూ శరణాగతుడు అయిన పాండ్యవల్లభరాయుడు, ఛత్ర చామరములతోనూ మదకరులతోనూ అనుగమించి కదలగా-మహావైభవంతో నడచి-కావేరీ తీరమునుచేరి కావేరిని గడచి - శ్రీరంగ నగరమున ప్రవేశించి, రంగనాథుల దివ్య ధామమును సమీపిస్తూ వుండగా-స్వామి ప్రణవాకార విమానం కన్నులబడగానే - ఆండాళ్ పల్లకి దిగి-కాలి నడకన తండ్రిగారి చేతులను ఊతగొని-తొట్రుపడ నడుస్తూ సప్త ప్రాకార శోభితమైన దివ్య ప్రాంగణాన్ని ప్రవేశించి-శంతన మండపాన్ని జేరి-సర్వ శోభాలంకృతమైన-వివాహవేదిక నెక్కి స్వామిని వివాహమాడింది.

విష్ణుచిత్తుల కోరికపై వివాహ సమయంలో మంత్రానుసరణంగా సర్వక్రియలూ చేస్తూ-మానవ రూపంలోనే-శ్రీరంగనాథుడు సదస్సు లందరికీ దర్శన మిచ్చారు. అలా వివాహం పూర్తికాగానే-స్వామి సన్నిధికి ప్రదక్షిణం చేసి వచ్చిన ఆండాళ్-సర్వులూ ఆశ్చర్యచకితులై చూస్తూ ఉండగా గర్భాలయమున ప్రవేశించి శేషపర్యంకము నెక్కి-స్వామి పాదము లొత్తుతున్న భూదేవి విగ్రహంలో సశరీరంగా ఐక్యమై పోయింది. స్వామిలో కలసి పోతున్న ఆండాళ్‌ను "అమ్మా! అమ్మా!" అంటూ అనుగమిస్తున్న విష్ణుచిత్తులను - శ్రీరంగనాథుడు "స్వామీ మీరు కూడా యిలా పరితాపం చెందడం భావ్యమా? మీరు మనస్సులో స్మరించి నప్పుడల్లా - మీ కుమార్తెతో సహా - మీ ఇంటి అల్లునిగా నేను దర్శన మిస్తాను. ఆళ్వార్లందరిలోనూ, మిమ్ము పెద్దలుగానూ విశేషించి నాకు మామగారు గానూ ఈ లోకం యావత్తూ ఆరాధిస్తుంది," అంటూ అనుగ్రహించారు.

శ్రీ విష్ణుచిత్తులకు తులసీ వనంలో లభించి "గోదా" అన్న సార్థక నామాన్ని ధరించి, స్వామికి ఆముక్తమాల్యముల నర్పించి ఆముక్తమాల్యదయై, జ్ఞానఖనియైన తిరుప్పావు ననుగ్రహించి - శ్రీ రంగధాముని చెట్టబట్టి శ్రీ రంగనాయకియై, భక్తులపాలిటి కల్పవల్లియైన, ఆ తల్లి ఆండాళ్ దివ్య గాథను స్మరిస్తూ, ఆమె అనుగ్రహించిన బ్రహ్మ వాక్కును గానం చేసుకుంటూ—

"స్వోచ్ఛిష్ట మాలికాబంధ
గంధ బంధుర జిష్ణవే,
విష్ణుచిత్త తనూజాయై
గోదాయై నిత్య మఙ్గలమ్."

అని మంగళాశాసనం చేస్తున్నది భాగవత లోకం.

— శ్రీ గొట్టుముక్కల
ఆంజనేయచార్యులు



# కాటేజీల నిర్మాణానికి విరాళాల స్వీకరణ

కాటేజీల నిర్మాణానికి విరాళాల స్వీకరణ-
భక్తుల దాతల సహకారంతో తిరుమలకు వచ్చే వేలాది యాత్రికులకు మరింత వసతి సౌకర్యం కల్పించటం కోసం దేవస్థాన కాటేజీల నిర్మాణానికి విరాళాల స్వీకరణ పథకాన్ని చేపట్టింది

## వివిధ పథకాల వివరాలు-

గరుడాద్రి నగర్ కాటేజీల పథకం-
ఈ పథకం క్రింద 16 కాటేజీల నిర్మాణం జరుగుతుంది. ఒక్కొక్క కాటేజీ లోను క్రింది భాగంలో 4 సూట్లు, మొదటి అంతస్తులో 4 సూట్లు నిర్మిస్తారు. స్నానాల గది కామన్ వరండాలతో కలిపి సూట్ వైశాల్యం 10'x12' వుంటుంది. 320 చ.అ. వైశాల్యం వున్న ఈ సూట్ కు విరాళం రు. 30,000/- మొత్తం 128 సూట్ల లో 66 సూట్ల నిర్మాణానికి దాతలు అప్పుడే విరాళాలు ఇచ్చారు. మీరు 8 సూట్లు కలిగిన కాటేజీ నిర్మాణానికి రు. 2.4 లక్షలు గాని, 4 సూట్ల నిర్మాణానికి రు. 1.2 లక్షలు గాని, 2 సూట్ల నిర్మాణానికి రు. 60,000/- కాని ఇవ్వవచ్చు.

## రాం బగీచ అతిథి గృహ పథకం-

శ్రీవారి ఆలయానికి ఈశాన్యంగా రాం బగీచ లో మూడు అతిథి గృహాల నిర్మాణం. ప్రతి అతిథి గృహంలోను 50 సూట్లు కలిగిన మూడు అంతస్తులు. ప్రతి సూటు స్నానాల గదితో కలిపి 14'x16' వైశాల్యం వుంటుంది. కామన్ వరండాతో కలిపి భవన నిర్మాణ స్థల వైశాల్యం 600 చ.అ. ఒక్కొక్క సూట్ కు విరాళం రు. 60,000/-. మొత్తం 450 సూట్లలో అప్పుడే 37 సూట్లకు దాతలు విరాళం ఇచ్చారు.

## దాతలకు సౌకర్యాలు-

① భవంతి ముందు భాగంలో దాతల పేరు కలిగిన శిలా ఫలకం ఏర్పాటు చేస్తారు.
② ప్రతిసారి 10 రోజులకు మించకుండా, సంవత్సరములో 60 రోజుల పాటు ఉచితంగా బస చేసేందుకు దాతలకు వీలు కల్పిస్తారు.
③ కాటేజీలు ఇవ్వటంలో దాతల బంధువులకు ప్రాధాన్యం ఇస్తారు.
④ దాతలు కోరినప్పుడు వారి భవంతిలో వసతి లేక పోతే ఇతర కాటేజీలలో నైనా బస ఏర్పాటు చేస్తారు.




కార్యనిర్వహణాధికారి
*తిరుమల తిరుపతి దేవస్థానములు*
తిరుపతి

CHANDRASEKHAR

( 4వ పేజి తరువాయి )

కాని దేహి అనంత కాలం జీవిక ఆద్యంతభ్రమణం తప్పదు. అందుకే జీవునిలోవుండి అతనిచే ఆడించే దేవుణ్ణి మరో మంత్రం ద్వారా జ్ఞాపకం చేశారు. త్రికాలరూపం, జడచేతనాత్మకం అయిన ఆ నారాయణశక్తి దేహ దేవాలయంలో నాభికి పైన హృదయానికి దిగువ, క్రిందికీ పైకీ ప్రసరిస్తూ చైతన్యాన్ని ప్రసారించే కాంతి పుంజం నడుమ, నీలతోయద మధ్యంలో నవవిద్యుల్లేఖలా, వరిముల్లు పరిమాణంలో అణురూపాన అలరారుతున్నదనీ, అదే బ్రహ్మ, శివుడు, విష్ణువు, పరమస్వరాట్ అనీ మంత్రపుష్పం వివరిస్తోంది.

అంటే ఈ రెండింటి సారం ఒకటే. మనిషిగా పుట్టినందుకు మంచి పనులతో జీవ జనార్దన సేవచేస్తూ, మరొకప్రక్క అంతర్ముఖుడై సాధనచేసి, అనంత చైతన్య దర్శనంతో, తిరిగిరానిచోట స్థిరంగా ఉండాలని. దేశభాషా కాలాతీతంగా అసలు సంగతి ఇలావుంటే పిడివాదాలతో, పెడవాదాలతో, వాదప్రతివాదాలకు దిగటం అనర్థము, వితర్కమూ కాదూ. వేమన చెప్పిన 'నిన్ను' 'తనను' లలో ఇంత వ్యాఖ్య ఉంది.

బ్రహ్మ చెప్పినదీ, శక్రుడు ప్రచారం చేసిందీ అయిన ఈ సత్యాన్నెరిగినవాడు, ఇహంలోనే అమృతత్వాన్ని పొందుతాడనీ, మోక్షానికింతకన్న వేరే మార్గం లేదనీ రెంటికీ ఫలశ్రుతిగా ఆ మంత్రాలలోనే చెప్పారు. మనమూ అనుకొందాం. మన మంచికోసం.

"ఇష్టం మనిషాణ. అముం మనిషాణ. సర్వం మనిషాణ."

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



# వార్తాలహరి

## ఉచిత నేత్ర చికిత్సా శిబిరం

తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహకారంతో పద్మభూషణ్ డాక్టరు పి. శివారెడ్డి గారి ఆధ్వర్యంలో జనవరి 5 నుండి 11 వరకు ఉచిత నేత్ర చికిత్సా శిబిరం జరుగుతుంది. తిరుపతి లోని దేవస్థానం వారి 3 వ సత్రంలో ఈ శిబిరం నిర్వహించ బడుతుంది. ఈ శిబిరంలో స్థానిక ప్రభుత్వ ఆస్పత్రిలోని వైద్యులు, దేవస్థానం వైద్య బృందం కూడ పాల్గొంటుంది.

జనవరి 5, 6 తారీఖులలో రోగులను పరీక్షిస్తారు. అవసరమైన రోగులకు 7 వ తేదీ నుంచి శస్త్రచికిత్సలు చేస్తారు.

రోగికి, సహాయంగా వున్న మరొకరికి దేవస్థానం వారు ఉచిత భోజన వసతి సౌకర్యాలు ఏర్పాటు చేస్తారు. శస్త్ర చికిత్సలు చేయించుకున్న రోగులకు మందులు కళ్ళ జోళ్ళు కూడ ఉచితంగా ఇస్తారు.

## నాట్యశాస్త్రంపై గోష్ఠి

భరతుని నాట్యశాస్త్రము నాట్యకళకే విజ్ఞానకోశము అని ప్రొఫెసర్ ఎమ్. వి. రామశర్మ తెలిపారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ సంస్కృత విభాగం రజతోత్సవ సందర్భంగా ఏర్పాటుచేసిన భరతుని నాట్యశాస్త్రం గోష్ఠిలో వారీ విషయం తెలిపారు. నవంబరు 16, 17 తేదీలలో విశ్వవిద్యాలయ సెనేటు హాలులో, యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్ వారి సహకారంతో ఈ గోష్ఠి ఏర్పాటు చేయబడింది. ఎందరో ప్రముఖ పండితులు ఇందులో పాల్గొన్నారు.

ప్రారంభోపన్యాసం ఇచ్చిన విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డి భరతుని నాట్యశాస్త్రపు గొప్పదనాన్ని తెల్పుతూ, ఇంకా దీనిపై సమగ్రమైన అధ్యయనం చేయవలసిన అవసరం ఉందని అన్నారు.

రెండవరోజు జరిగిన గోష్ఠికి యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషను డైరక్టర్ ఇ. పాండురంగారావుగారు అధ్యక్షత వహించారు. ప్రాచీన ఋషులు చెప్పిన జ్ఞానాన్ని ప్రాంతీయ భాషలోకి అనువదించి అందరికీ అందించాల్సిన అవసరం వుందని ఆయన అన్నారు.

గోష్ఠిముగింపు సమావేశాన్ని విశ్వవిద్యాలయ ఆర్ట్స్ కళాశాల ప్రిన్సిపాల్ ప్రొఫెసర్ కె. సీతారాం నిర్వహించారు. డాక్టర్ డి. అర్కసోమయాజి అధ్యక్షోపన్యాసం చేశారు.

ఈ సందర్భంగా ఏర్పాటయిన సాంస్కృతిక కార్యక్రమాన్ని దేవస్థానం పౌర సంబంధ శాఖాధికారి డాక్టర్ రావుల సూర్యనారాయణ మూర్తి ప్రారంభించారు. డాక్టర్ వి. ఆంజనేయ శర్మ తెలుగులో రచించిన "శబరి సపర్య" నాటకాన్ని శ్రీ వేంకటేశ్వర ఉన్నత పాఠశాల విద్యార్థులు ప్రదర్శించారు.



(తిరుమలలో గవర్నర్ దంపతులు మరియు కార్యనిర్వహణాధికారి)

## దేవస్థానం ఉద్యోగులకు సందేశం

మనుష్యులు సేవను ప్రధానంగా తీసుకోవాలని, ఇతర మానవుల పట్ల సుహృద్భావంతో ప్రవర్తించాలని హైదరాబాదు రామకృష్ణమఠం అధిపతి శ్రీ రంగనాథానందస్వామి అన్నారు. నవంబరు 29 సాయంత్రం 5 గంటలకు దేవస్థానం కార్యనిర్వాహక భవనంలో ఉద్యోగులను గూర్చి ప్రసంగిస్తూ ఆయన ఈ విధంగా అన్నారు. ముఖ్యంగా దేవస్థానం ఉద్యోగులు యాత్రికులపట్ల మైత్రి, సేవ ప్రకటించాలని, ఇదే భావన గీతలోను భాగవతంలోను చెప్పబడిందని ఆయన అన్నారు. సభను దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఎస్. లక్ష్మి నారాయణ ప్రారంభించారు.

సభను నిర్వహించిన శ్రీ బి. పి. ఆర్. విఠల్ ఐ.ఏ.ఎస్., మాట్లాడుతూ ఉద్యోగుల దృష్టి నాలుగు గోడల మధ్య నుంచి వెలుపలికి రావాలని, ఇతర మానవుల కష్టసుఖాల్ని అర్థంచేసుకోవాలని అన్నారు. దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయులు వందన సమర్పణ చేశారు.

ఈ కార్యక్రమానికి ముందు శ్రీ రంగనాథానందస్వామి దేవస్థానం కృత్రిమావయవ కేంద్రాన్ని దర్శించి వారి సేవను ప్రశంశించారు. ఈ సందర్భంగా వికలాంగులకు కృత్రిమావయవాల్ని పంపిణీ చేశారు.



## కొత్తగా 50 కల్యాణ మంటపాలు

కొత్తగా 50 కల్యాణ మంటపాలను నిర్మించటానికి తిరుమల తిరుపతి దేవస్థానం నిర్ణయించిందని దేవస్థానం ఛైర్మన్ శ్రీ వి. కె. డి. వి. సత్యనారాయణ రాజు తెలిపారు. నవంబరు 29 న కోదాడ లోని కల్యాణ మంటపానికి శంకుస్థాపన చేస్తూ వారీ విషయం తెలిపారు. 60 కల్యాణ మంటపాలు నిర్మాణంలో వున్నాయని వారు అన్నారు. దేవస్థానం మేనేజిమెంటు కమిటీ సభ్యులు శ్రీ ఎల్. నరసింగనాయక్ కార్యక్రమాన్ని నిర్వహించారు. హిందూ ధర్మ రక్షణ సంస్థ దత్తత చేసుకొన్న మూడు పంచాయితి సమితులలో కోదాడ ఒకటని దేవస్థానం పౌరసంబంధ శాఖాధికారి డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తి తెలిపారు.

దేవస్థానం బోర్డు మెంబరు శ్రీ వెంకటేశ్వర్లు, కోదాడ పంచాయితి సమితి అధ్యక్షుడు శ్రీ కె. జితేంద్రరెడ్డి, సర్పంచ్ వి. చంద్రరావులు కూడ ప్రసంగించారు.

## మట్టపల్లిలో కల్యాణ మంటపం

దాని తరువాత నల్లగొండ జిల్లాలోని మట్టపల్లె లోని కళ్యాణ మంటపానికి దేవస్థానం కార్యనిర్వాహకమండలి సభ్యులు శ్రీ ఎల్. నరసింగ నాయక్ శంకుస్థాపన చేశారు. హుజూరు నగర్ పంచాయితి సమితి అధ్యక్షులు శ్రీ శివారెడ్డి కార్యక్రమం నిర్వహించారు.





నవంబరులో వైభవంగా జరిగిన తిరుచానూరు బ్రహ్మోత్సవాలలో తిరుమల నుంచి పసుపు కుంకుమలు తీసుకొని వస్తున్న దృశ్యం. ఫోటోలో దేవస్థానం ఇ. ఓ. శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, బోర్డు మెంబరు శ్రీ పి. వెంకటేశ్వర్లు, ఫైనాన్సియల్ అడ్వైజరు శ్రీ టి. ఎన్. కృష్ణసామి, డిప్యూటీ ఇ. ఓ. శ్రీ ఎన్. వాసుదేవనాయుడు, జాయింట్ ఇ. ఓ. శ్రీ డి. సుబ్బరాయలు, ఛీఫ్ ఇంజనీర్ శ్రీ ఆర్. రంగరాజు వున్నారు.



## గీతాజయంతి

నవంబరు 30 నుండి డిసెంబరు 4 వరకు తిరుపతి అన్నమాచార్య కళామంటపంలో హిందూధర్మ రక్షణసంస్థ వారి ఆధ్వర్యంలో గీతాజయంతి జరిగింది. హిందూధర్మ రక్షణసంస్థ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు స్వాగతం చెబుతూ సభకు ఆహూతులను పరిచయం చేశారు. శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారు మాట్లాడుతూ "సంసార సర్పదష్టులైన వారికి అమృతం పోయటానికి పరమాత్మ గీత ప్రబోధించా" డని అన్నారు. అయిదురోజులపాటు గీతా పఠనం చేసిన శ్రీ దయానందస్వామి మాట్లాడుతూ "భగవంతుని గురించి చింతించే దినాలే మానవునికి సుదినాలని, సర్వవేదమయి, సర్వశాస్త్రమయి గీత" అని తెలిపారు.

## దేవస్థానం పి. ఆర్. ఓ. గారికి డాక్టరేట్

దేవస్థానంలో పౌరసంబంధ శాఖాధిపతిగా పనిచేస్తున్న శ్రీ రావుల సూర్యనారాయణ మూర్తిగారికి అమెరికాలోని టస్కన్ వరల్డ్ యూనివర్శిటీ డాక్టరేట్ పట్టా ప్రదానం చేసింది. వీరి పరిశోధనా వ్యాసమైన "రూరల్ రిసర్జన్స్" కు ఈ డాక్టరేట్ డిగ్రీ ఇచ్చారు.

వీరు తెలుగులోను, ఆంగ్లములోను అనేక గ్రంథాలు వ్రాశారు. దేవస్థానం వారు ప్రచురించిన శ్రీమద్భగవద్గీతకు వ్యాఖ్యానం వ్రాశారు.

## ధర్మ రక్షణ కార్యక్రమాలు

### శ్రీ గంగా భ్రమరాంబా సమేత శ్రీ చంద్రశేఖర స్వామి వారి 42 వ వార్షిక ఆర్ద్రా మహోత్సవాలు

గుంటూరు తాలూకా తక్కెళ్ళపాడు గ్రామంలో శ్రీ గంగా భ్రమరాంబా సమేత శ్రీ చంద్రశేఖరస్వామి వారి 42 వ వార్షిక ఆర్ద్రా మహోత్సవాలు జరుపుతున్నట్లు నిర్వాహక సంఘం వారు తెలిపారు. ఈ మహోత్సవం జనవరి 6 నుండి 10 వరకు జరుపబడుతుంది. ఈ అయిదు రోజుల పాటు జరిగే వివిధ రకాల ధర్మరక్షణ కార్యక్రమాలలో రవి పద్మ ఆర్టు థియేటర్సు వారిచే "కురుక్షేత్రం" నాటకం ప్రదర్శింప బడుతుంది. శ్రీ ఉషశ్రీ గారి పురాణ కాలక్షేపము, 8 వ తేదీ సాయంత్రం 6 గంటలకు కూచిపూడి శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం వారిచే "ఉషా పరిణయము" ప్రదర్శింప బడతాయి. 9 వ తేది సాయంత్రం డాక్టర్ ఆరిపిరాల విశ్వంగారి ఉపన్యాసం విశేష కార్యక్రమాలు.

Edited and Published on behalf of the T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T.T.D. Press.
by M. Vijayakumar Reddy, L.P.T. Manager, T.T.D. Press, Tirupati.

